

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ చిన్న జీయర్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) చిన్న జీయర్ వెబ్ సైట్: http://www.chinnajeeyar.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో చిన్న జీయర్ వెబ్ సైట్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# చిన్న జీయర్ వారి వెబ్ సైట్

**http://www.chinnajeeyar.org**



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

## ఈ సంచికలో........



**ముఖచిత్ర పరిచయం :**

1. సుదర్శన పెరుమాళ్ళతో కలిసిన శ్రీరంగనాథుడు
2. శ్రీమణవాళమామునుల తిరువరశు సమీపంలో శ్రీవారితో మన గోష్ఠి
3. గోపాలోపాయన పురస్కార సమర్పణం

## పంచాంగ వివరాలు

### జనవరి 2002

9 సర్వేషామేకాదశి
11 ఉషాకార్తె ఉ.8-58
మాసశివరాత్రి
తొండరడిప్పొడి యాళ్వార్,
పెరియనంబి తిరునక్షత్రము
13 సర్వేషాం అమావాస్య, భోగి
14 మకర సంక్రమణం ప. 3-37
ఉత్తరాయణ పుణ్యకాలం
సంక్రాంతి పండుగ
15 కనుమ
24 శ్రవణకార్తె ఉ. 10-31
25 సర్వేషామేకాదశి
26 భారతదేశ గణతంత్ర దినోత్సవం
26 శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెరియ జీయరుస్వామి వారి పరమ పదోత్సవం
30 తిరుముడిశయాళ్వార్ తిరునక్షత్రం

### ఫిబ్రవరి 2002

2 శ్రీత్యాగరాజస్వామి ఆరాధన
కూరత్తాళ్వార్ తిరునక్షత్రం
శ్రీవైష్ణవ గృహములలో ద్రావిడ వేదాధ్యయన ప్రారంభము
3 తిథిద్వయం
4 అష్టమి తిథి
6 ధనిష్ట కార్తె ప. 12-42
7 సర్వేషామేకాదశి
9 శనిత్రయోదశి
12 కుంభ సంక్రమణం రా. 2-21


మీసేవలో :
**భక్తినివేదన**, సీతానగరం-522 501, గుంటూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 72929
**చందా : సంవత్సర చందా రూ. 50/-, జీవిత చందా రూ. 500/-, విదేశాలకు సంవత్సర చందా $ 25**
***E-mail :*** jetsitanagaram@yahoo.com ***Internet :*** www.chinnajeeyar.org
***DTP & Design by :*** పరిశోధనాలయమ్ ***JET - Sitanagaram-522 501***
ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం, గుంటూరుజిల్లా.


*1/Bn/BnJan02.p65*

శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక


సంపుటి 54 సంచిక 10

**2002 జనవరి**

వృష నామ సంవత్సరము పుష్య మాసము

సంపాదకులు : శ్రీ ఉ.వే. శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు


*Founder:*

***HIS HOLINESS SRI SRI SRI***

***TRIDANDI SRIMANNARAYANA RAMANUJA JEEYAR SWAMI VARU***

## శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి

# ఆంగ్ల నూతన సంవత్సర మంగళాశాసనములు

**ప్రియభగవద్బంధువుల్లారా!**
**శ్రీమతే నారాయణాయ నమః**
**అనేక మంగళాశాసనములు!**

జై శ్రీమన్నారాయణ!

ఆంగ్లకాలమానం ప్రకారం నూతనసంవత్సరం 2002 లోనికి అడుగుపెట్టే ఈ తరుణంలో మీ కందరకూ శ్రియఃపతి - ధార్మికశక్తిని, దేశభక్తిని, త్యాగనిరతిని, సజ్జన సేవాసక్తిని, భగవద్గుణానుభవరక్తిని, వీటినన్నింటిని ఉదారముగ అలవరచుకొనడానికి తగిన ధన సమృద్ధిని, మనశ్శాంతిని ప్రసాదించుగాక!

లోకక్షేమాన్ని, వ్యక్తిగత సౌఖ్యాన్ని, ప్రపంచశాంతిని కాంక్షిస్తూ మనమంతా సాగించిన 'గీతామృత దీక్ష' శ్రీభగవానుడు శ్రీకృష్ణుని పదసేవగ అర్పిద్దాం. తీవ్రవాదాలు, ఉగ్రకార్యకలాపాలు ఉపశమించాలని, ఎలాంటి పరిస్థితినైనా ఎదుర్కొని, సానుకూలపరచుకుంటూ ముందుకు సాగగలిగే ధైర్యం మనందరిలో ఈ దీక్షాపారాయణ కలిగిస్తుందని, అందరమూ సమరసతతో కలిసిమెలిసి ఉండాలని మనం కోరుకుంటున్నాం.

అమెరికాలో, ఆస్ట్రేలియాలో మరికొన్ని ఇతరదేశాలలోగూడ మనతోకలిసి మన భగవద్బంధువులెందరో అన్ని రాష్ట్రాలనుండీ ఈ దీక్షలో పాల్గొన్నారు. వారూ శ్రద్ధతో భక్తివిశ్వాసాలతో శ్లోకాలను పారాయణ చేసారు. ఇక మన దేశంలో ఇతరరాష్ట్రాలలో ఉండే మన వారంతా పారాయణచేసారు. ఇక ఆంధ్రరాష్ట్రంలోనైతే ప్రతిజిల్లాలో గ్రామాలదాక ఉండే, మన పరిచితులూ, కానివారుగూడ ఇది సులభమైనదీ, సమర్థవంతమైనదీ అనే అభిమానముతో, ఆదరముతో ఈ పారాయణ చేసారు.

వికాసతరంగిణులు ఎన్నో, తమ ప్రాంతాలలో అనుకున్నదానికి మించిన స్పందన భక్తులలో కనిపించిందని, ఒకటనుకుంటే 2,3 ఆవృత్తులు గూడ గీతాశ్లోకాలను పంచవలసివచ్చేట్లు భక్తులు ఉత్సాహంచూపి ఈ పారాయణలో పాల్గొన్నారని మాకు వ్రాసారు. వికాసతరంగిణి కార్యకర్తలెందరో స్వయంగా విడివిడి శ్లోకాలతో కరపత్రాలు ముద్రించుకొని, కార్డులుగ ముద్రించుకొని, కొందరైతే, దావణగేరె వంటి చోట్ల, ఏకంగ 40 దినాలుకూ తిథివారనక్షత్రాలతో పాటు విడివిడిగ పత్రాలు ముద్రించి భక్తులకు, సంకల్పాలు చెప్పుకోడానికి సౌకర్యం కల్గిస్తూ ముద్రించి పంచి, పారాయణ చేయించారు.

చాల వికాసతరంగిణుల నుండి కార్యక్రమం జరగుతున్న వివరాలతో, పాల్గొనే భక్తుల సంఖ్యలతో, అక్కడక్కడ జరిగే ప్రవచనాదుల వివరాలతో గూడ మాకు లేఖలందాయి. సులభమైన ఓ సత్కార్యం చేయడమంటే జనులలో ఉండే ఉత్సాహ మెంతటిదో దీనివల్ల మాకు తెలిసింది. ముఖ్యంగ అక్కడక్కడి వికాసతరంగిణి కార్యకర్తలకూ తెలిసింది.





'మా ఊళ్ళోఎవ్వరూ కలవడం లేదండీ, ఇక్కడెవరికీ ఉత్సాహంలేదండీ, అలాంటివి ఇక్కడెవ్వరూ పట్టించుకోవడంలేదు' అంటూ గతంలో నిరాశ చెందిన కార్యకర్తలుగూడ, ఈ దీక్షలో ఎందరో ఉత్సాహంతో పాల్గొనడం గమనించారు.

అసలీ పారాయణకు డబ్బుతో సంబంధంలేకుండా, పెద్దగ ఖర్చు అవసరంరాకుండా, ఎవరి మానాన వారు తమ తమ ఇండ్లలోనే కూర్చొని చేసుకొనేలా ఉండాలని అనుకొన్నా, ఎన్నోచోట్ల ఇదొక ఉద్యమంలా భక్తులంతా జరిపారు. ప్రాంతీయమైన వనరులతోనే ప్రచార, ముద్రణాది వ్యయాన్ని చేసుకొంటూ ప్రతివారూ తమవంతు కృషిని సమర్థవంతంగ నిర్వహించారు. ఇది మాకెంతో సంతోషాన్నిస్తోంది. మేము అలాంటి వికాసతరంగిణులకు, భక్త కార్యకర్తలకు, శ్రద్ధాళువులై ప్రోత్సహించిన ఉదారులకూ అందరకూ మంగళాశాసనములు చేస్తున్నాము.

అవకాశం లేనివారు స్నానం చేయకపోయినా ఫర్వాలేదు ఉదయం గం॥ 6-30 ని॥లకు మాత్రం సమయపాలనచేస్తూ పారాయణ చేయాలనే వెసులుబాటు యిచ్చినా, చాలవరకూ మాకు సమాచారమందినంత వరకూ, స్నానం చేసి శుచిగనే మన భగవద్బంధువులంతా ఈ పారాయణ చేసారని తెలిసింది. అంతేగాదు, ఎందరో మహిళలనుండి అందిన విశేషమేమిటంటే 'ఇదివరకు మా ఇండ్లలో మధ్యాహ్నం 12 గంటలైనా పనులు తెమిలేవికావు. గీతామృత దీక్ష ధర్మమా అని 6-30కి పారాయణ స్నానం చేసిచేయాలి గనుక, అలా చేయడంవల్ల ఇంటిపనులన్నీ 8,9 గంటలకే పూర్తి అయిపోతున్నాయి. మాకు విశ్రాంతి సమయమిపుడు చేతినిండా లభిస్తోంది. ఇంకొన్ని మంచి పనులు చేస్కోడానికీ, కాస్త చదువు కోడానికీ వీలవుతోంది. మనస్సుకి చాలహాయిగ ఉంది. అంటూ సంతృప్తిని ప్రకటించారు. 26వ తేదీ తర్వాత మరి మేం ఏం చేయాలో ఏమిటో అంటూ క్రొత్తకార్యక్రమాలకు నాందిపలికారు.

కొందరు కార్యకర్తలు రోజుకొకరిఇంట్లో, కొందరు వారానికొకరిఇంట్లో, కొందరైతే పరిసర దేవాలయాల్లోనూ ఇలా ప్రవచనాల నేర్పాటు చేసుకుని ఆనందించారు. కొందరు దీక్షాశ్లోకాలు మరీ జాగ్రత్తగ 5 నిముషాలలోపే ముగిసిపోతున్నాయని, భగవద్గీతలో అధ్యాయములను పారాయణచేసారు.

చాలమంది కార్యకర్తలు తమ ప్రాంతాలలోని స్కూళ్ళలో విద్యార్థులకు గీతాపోటీలు ఏర్పాటుచేస్తూ విద్యార్థులలో శ్రద్ధను ప్రోత్సహించారు. ఖైదీలకు జైళ్ళలో గీతాశ్లోకాలనిచ్చి వారిచేత గూడ పారాయణ చేయించారు కొందరు వికాసతరంగిణులవారు. వారందరికీ మా మంగళాశాసనములు.

26వ తేదీ వైకుంఠైకాదశినాడు దీక్షాముగింపుగూడ, మొత్తానికి అన్ని చోట్లనుండీ, చాల వైభవంగా భక్తిశ్రద్ధలతో జరిగినట్లు తెలిసింది. ఒక్కొక్క అధ్యాయం పారాయణ

చేయగానే ఒక్కొక్క ప్రసాద నైవేద్యం, పెడుతూ 19 రకాల ప్రసాదాలను సమర్పించడం, అక్కడక్కడ ఉండే పెద్దలను, ప్రవక్తలను ఆహ్వానించి ప్రవచనాలు చెప్పించడం వంటివాటి వలన పెద్దల ఆశీస్సులూ ఈ కార్యక్రమానికి అంది, శుభప్రదమైన ముగింపు జరిగింది.

చెన్నైలో మేమున్న చోటగూడ 3 విద్యాలయాలకు చెందిన విద్యార్థులు, భక్తులు విశేషంగ పాల్గొని 18 అధ్యాయాల పారాయణను పూర్తిచేసారు. శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్ర ఏకాహపారాయణగూడ అందరూ కలిసి విశేషవైభవంతో చేసారు.

మన వేద, ఆగమ, ప్రబంధ, తత్త్వ అధ్యాపకులు, విద్యార్థులూ అందరూ పూర్తిశ్రద్ధతో ఈ పారాయణచేసారు. మీ అందరితో కలసి మేముగూడ ప్రతిరోజూ శ్రద్ధతో అదే సమయంలో పారాయణచేసాం. మనందరినీ ఇలా చైతన్యవంతులుగా ఆధ్యాత్మిక సంబంధముతో, దేశభక్తితో పూర్ణులుగా తీర్చిదిద్దమని, తన సేవలో వినియోగించుకొమ్మని శ్రియఃపతి శ్రీరామచంద్ర ప్రభువును ప్రార్థించుకున్నాం.

చాలచోట్ల నుండి, ఇది అయిపోయాక మేమేమి చేయాలీ అని ఏదైనా చేయడానికి ఉత్సాహాన్ని ప్రకటిస్తూ మాకు లేఖలు వ్రాసారు, ఫోనులో మాట్లాడారుగూడ. అవును. ఏం చేయాలీ?

దేశక్షేమానికీ, ధర్మనిరతికీ, సుభిక్షతకూ, ఈతి బాధలనివారణకూ భగవంతుని ప్రార్థించడమైతే మానడానికి వీల్లేదు. అలానే, ఒక్కరు ప్రార్థించడం కంటే సమూహములుగా ప్రార్థించడం అత్యంత ప్రభావవంతమనడంలో సందేహంలేదు. అదీగూడ ఒక నియతసమయంలో అందరూ చేయగలగడమే, సత్ఫలదాయినీ శీఘ్రఫలదాయినీ అనిగూడ మనం గుర్తించాము.

ఇపుడు భగవంతుని దివ్యసూక్తి సుధాసాగరమైన శ్రీమద్భగవద్గీతను ఎలానూ ప్రారంభించాం. అయితే, దానిలో దేశం కోసం ఒక్క శ్లోకాన్నైనా కనీసం పారాయణ చేయగలమా, కొన్ని రోజులు? అనేది ప్రయత్నించిచూసాం. బాగాచేయగలమని మీరంతా నిరూపించారు. అందుకే ప్రారంభించిన దీనినే ఎందుకు పూర్తిచేయకూడదు?

**ఓ పనిచేద్దాము! మీరీ పత్రిక చూచినప్పటినుండీ భగవద్గీతలోంచి ప్రతిరోజూ 8 శ్లోకాలు, వీలైతే తాత్పర్యముతో చదివే ప్రయత్నంచేయండి. యిప్పుడెలాగూ 5+1 = 6 శ్లోకాలూ చదువుతున్నాంగద! మరో రెండుశ్లోకాలు కలపండి. తేడా ఏమిటంటే, ఇపుడు రోజూ అవే శ్లోకాలు మళ్ళీమళ్ళీ చదివారు. యిప్పుడలాకాకుండా మొదటినుండి ప్రారంభించి వరుసగా చదువుకుంటూ వెడతాం. అలా 'ఉగాది' వచ్చేనాటికి భగవద్గీతా గ్రంథాన్ని ఒకసారి పూర్తిగ అధ్యయనం చేస్తామన్నమాట.**

8 అనే సంఖ్య అష్టాక్షరీమహామంత్రానికి ప్రతీక గదా! అందుకే 8 శ్లోకాలని అనుకుందాం! ప్రస్తుతం ఉదయం సమయం పారాయణ బాగుంది కనుక, ఆ సమయానికే





చేస్తేబాగుంటుందనేది మా భావన. అయితే దానిలో నిర్బంధం వద్దు. ఒకసారి కొంత కాలానికి, నియమమనిఅనుకున్నాం. అది చక్కగా పూర్తిచేసాం. మళ్ళీ అలా నియమం పెట్టుకున్నపుడు, నియమంగ చేద్దాం ఇప్పుడు ఉగాదిదాక చేసే గీతాపారాయణ విషయంలో సమయమేమిటీ అనేది మీకే వదిలేస్తున్నాం. ఏమైనా ఒకసారి గ్రంథాన్ని పూర్తిగ పారాయణ చేయాలి, రోజూ 8 శ్లోకాలు చొప్పున అనేదే నియమం. దీన్ని ప్రారంభిద్దాం. అందరూ ఈ అభిప్రాయంతో ఏకీభవిస్తారని ఆశిస్తాం.

క్రొత్త సంవత్సరం, ఆంగ్ల కాలమానంలో అప్పుడేవచ్చేసింది. క్రిందటిసారి ఆనందంగ ఆరంభమైన కొత్త ఏడాది సంబరాలు మొదటి నెలతిరుగ కుండానే గుజరాత్ భూకంపంతో విషాదంలోకి త్రోసివేసాయి. కాలస్వరూపుడైన భగవానుణ్ణి తన సంతానంగ మన నను‌గ్రహించమని ప్రార్థించుకుందాం!

డిశెంబరు 16 నుండి ప్రారంభమైన ధనుర్మాసమహోత్సవాలను మన బంధువులు చాలమంది ప్రారంభించారు. వికాసతరంగిణులు చేసేకొన్ని ఉత్సవాలలో మన తత్త్వశాస్త్రాధ్యాపకులుకూడ పాల్గొంటూ తిరుప్పావై ప్రవచనాలు చేస్తున్నారు. గీతామృతదీక్ష ఉదయం, సాయంకాలము తిరుప్పావై ప్రవచనాలు శ్రద్ధతో శ్రవణ మననాలు సాగుతున్నట్లు సమాచారాలందించారు. వారందరికీ గోదారంగనాథుల దివ్యానుగ్రహం సదా ఉండాలని ప్రార్థన చేస్తున్నాము.

గత ఏడాది, గుజరాత్ సేవకై మనం ప్రారంభించిన నిర్మాణాదుల గురించి గతనెలలో ఇచ్చిన సమాచారాన్ని తెలుసుకొని మన బంధువు లెందరో స్పందిస్తూ, మన వద్ద ఉన్న దానితోటే అక్కడొక సత్రం వంటిది, ద్వారక వంటి క్షేత్రంలో ఏర్పాటు చేస్తే వివిధ ప్రాంతాలనుండి అక్కడికి వెళ్ళేవారికి వసతి, ఆహార ఏర్పాట్ల వంటికి బాగుంటుంది కదా! అంటూ వ్రాసారు. అయితే ఆ ప్రాంతీయులలో దీనులకు, గృహములు లేనివారికోసం అది వినియోగించాలనేదే మన మొదటి అభిప్రాయం కనుక దానికే కట్టుబడి ఉందాం. అక్కడివారికి ఎంత పుష్కలంగ ఆర్థిక వనరులు చేకూరినా, వారి ప్రవృత్తులు మన విషయంలో, ఎలా ఉన్నా, మనం చేద్దామనుకునే సేవ విషయంలో మనం వెనుకాడవలసిన పనిలేదు. భగవానుడే మనకు తోడుంటాడు. అందరం కలసి ముందుకు నడుద్దాం.

గోదాకళ్యాణ శుభ సందర్భంగాను, సంక్రాంతి పండుగ శుభ తరుణంలోను ఉత్తమ శ్రేయస్సులు శ్రియఃపతి అందరియందూ అనుగ్రహించుగాక!

జై శ్రీమన్నారాయణ!

శ్రీవారి సంతకం

# శ్రీవారి భగవద్గీత - 9

(1వ అధ్యాయము)

రాజసూయ యాగ పరిసమాప్తి తర్వాత శ్రీకృష్ణుని సంప్రదించకుండానే జూదమాడడానికి సిద్ధమయ్యారు పాండవులు. మర్యాదకోసమైనా ఒక ఆహ్వానం పంపించనే పంపించలేదన్నమాట. పంపించనపుడు వెళ్ళడమెందుకులే అనుకున్నాడు శ్రీకృష్ణుడు. ఆ రకంగా తనుకూడ ఉపదేశానికి ఒక మార్గాన్ని వెతుక్కుంటున్నాడన్న మాట.

రాజ్యమంతా పోయేస్థితి ఏర్పడింది. పోయిందికూడాను. ధర్మరాజు కీర్తంతా అవమానం పాలైంది. భార్యని నలుగురిలో అవమానపరిచే సన్నివేశం ఏర్పడింది. ద్రౌపది కుండే బుద్ధివిశేషంచేత శ్రీకృష్ణుని పిలిచింది, ప్రార్థన చేసింది తన మానాన్ని సంరక్షించుకుంది. భర్తల్ని తీసుకుని మళ్ళీ వెనక్కివచ్చింది. ఆ తర్వాత శ్రీకృష్ణుడు జరిగిన విషయాన్ని తెలుసుకున్నాడు. అప్పుడైనా, "కృష్ణా! మా వాళ్ళకు ఇట్లా బుద్ధి గడ్డితిందే, నాలుగు మంచి మాటలు చెప్పవయ్యా" అని ద్రౌపది అడుగుతుందేమో అని ఎదురుచూశాడు శ్రీకృష్ణపరమాత్మ. కానీ, భర్తలు దక్కారుకదా అదే పదివేలు అనుకుంది ద్రౌపది. తనయొక్క పాతివ్రత్య ప్రభావం లోకానికంతటికి తెలిసిందికదా! చాలునూ అని అనుకుని ఉంటుంది. అడగడం మానివేసింది కృష్ణుణ్ణి. ఏంచేయాలి? అని ఆలోచించాడు కృష్ణుడు.

చేతిలో ధనం ఉండగా మంచిని తెలుసుకుందాం అని కోరిక కలగటం చాల కష్టం. ఎందుకంటే ధనానికి, మంచికి పొంతన కుదరదన్నమాట. అలా ఎవరి దగ్గరైనా ఒకరి దగ్గర కుదిరింది అంటే వాడు నిజంగా అదృష్టవంతుడు. సామాన్యంగ అట్లాంటిది జరగడం లోకంలో అరుదన్నమాట. వీరికి రాజ్యం లేకుండా చేస్తే మారతారేమో! బాగుపడతారేమో అని ఆలోచించాడు కృష్ణుడు. అనుకున్నట్లే జూదం వల్ల రాజ్యం కాస్తా తొలగిపోయింది. 12 ఏళ్ళు అరణ్యవాసం చేయాల్సి వచ్చింది. పోనీ, అరణ్యవాసం చేసే రోజుల్లోనైనా తన మంచిమాటలు వినటానికి సిద్ధపడతారా అని ఎదురు చూశాడు. అప్పుడుకూడా తనమాట వినేటంతగా వారు సుముఖంగా లేరు. దుర్యోధనుడికి ప్రేరణ కలిగించి ఒకనాడు దుర్వాసమహామునిని 10వేల మంది శిష్యులతో కలిసి వీరి భోజనాలు పూర్తయ్యే సమయానికి అక్కడకి చేరేటట్టుగా చేసాడు.

లోపల పదార్థం ఉందో లేదో చూడకుండానే ధర్మరాజు ఆ వచ్చినవాళ్ళని స్నానానికి వెళ్ళిరండి భోజనానికి సిద్ధం చేస్తాం అన్నాడు. కానీ, అప్పటికే ద్రౌపది కూడా ప్రసాదం స్వీకరించడం పూర్తి అయిపోయింది. వారి దగ్గరుండే ఒక అక్షయపాత్రకి, ద్రౌపది భోజనం చేయడం చివరి హద్దన్నమాట. మరి ఆ రోజుకి అంతే, అది ఆహారపదార్థాలు ఇవ్వదు.





మళ్ళా, సూర్యోదయానికి అందులో ఆహారపదార్థాలు తయారవటం ప్రారంభిస్తాయి. ఆ పాత్ర సూర్యవరప్రసాదం వల్ల లభించింది కనుక. ద్రౌపది ఆ వేళ ప్రసాదం తీసేసుకుంది. ఇక దాంట్లో మరేంలేదు. ఈ విషయం తెలియకుండా, ఇంట్లో అడుగకుండా ధర్మజుడు చెప్పాడు, పాపం, భోజనానికి రమ్మని.

కష్టం దాపురించిందే! మళ్ళీ ఏం చేయాలని ద్రౌపది శ్రీకృష్ణుణ్ణే ప్రార్థన చేసింది. ఎదురుగుండా ప్రత్యక్షమయ్యాడు శ్రీకృష్ణుడు. 'ఆకలి వేస్తోంది ఆహారం తెమ్మన్నాడు. తనకు వచ్చిన కష్టమే అది కనుక దానిని ఇవ్వడానికి అవకాశం లేదు, ఇప్పుడు "ఈ కష్టంనుండి ముందు నన్ను రక్షించు" అని ద్రౌపది ప్రార్థన చేసింది. ఆవిడయొక్క ప్రార్థనకి కరుణించి స్వామి పాత్ర తెమ్మన్నాడు. అందులో ఏదైనా ఉంటుంది చూడు! అన్నాడు. ఏమీ ఉండదు. శుభ్రంగా కడిగేసాను అంటుంది ద్రౌపది. అయినా చూడమన్నాడు. దాంట్లో ఓ మూల ఓ ఆకు ఖండము అంటిఉంది "హమ్మయ్యా"! అంటూ దాన్ని తీసి తన నోట ధరించాడు. "లోకమంత ప్రీతి చెందుగాక" అని సంకల్పం చేసాడు. అంతే మరి! దుర్వాస మహాముని కడుపు నిండినట్లయి స్నానం చేసి ఇక ఇటు తిరిగి రానేలేదు. అటే వెళ్ళిపోయాడు. వీళ్ళకి గౌరవం, ప్రాణాలు దక్కాయి. "కృష్ణా! ఇకనైనా చెప్పవయ్యా మావాళ్ళకి ఎపుడూ ఇలాంటి వాగ్దానాలు చెయ్యొద్దు అని. ఇలాంటి ఆహ్వానాలు పలకవద్దు అని" అంటూ ద్రౌపది తనను అడుగుతుందనుకున్నాడు. కానీ, కష్టం తొలగింది కదా అనుకున్నారు మళ్ళీ కృష్ణుని మర్చిపోయారు. ఎవరైనా అంతేకదా లోకంలో, కష్టకాలంలో దేవుడు జ్ఞాపకం వస్తాడు తప్ప సుఖాల రోజుల్లో దేవుడు జ్ఞాపకం రావడం చాల కష్టం. అయిపోయిది ఆ కష్టంకూడాను. అజ్ఞాతవాసం ఏర్పడ్డది. అప్పుడు కంటికి రెప్పలా కాపాడాడు పాండవులందరిని.

ఇకనైనా వీళ్ళకి చెప్పే సన్నివేశం ఏర్పడుతుందా? అనుకునేటంతలో. పాండవులూ, కౌరవులూకూడ రాయబారం కోసం సిద్ధపడ్డారు. అటునుండి సంజయుని రాయబారం పూర్తయిపోయింది. ఇక, ఇటు నుండి శ్రీకృష్ణరాయబారానికి రంగం సిద్ధమైంది. కృష్ణుడు బయలుదేరి వెళ్ళాడు. రాయబారం చేయడం కోసం వెళ్ళాడా? రాయబారం పాడుచేయడం కోసం వెళ్ళాడా? అనేది ఒక పెద్ద ప్రశ్న.

నిజానికి శ్రీకృష్ణుడు తలుచుకుంటే కానిదంటూ ఏమీ లేదు. కౌరవుల్ని ఎలాగైనా మార్చగలిగి ఉండేవాడు. అయిదు ఊళ్ళు సంపాదించుకొని వచ్చి ఉండేవాడు. కానీ, శ్రీకృష్ణుడుకి సంధి కుదురుద్దామని లేదు. ఎందుకో తెలుసా? దాన్ని కృష్ణుడియొక్క మాటల్లోనే మనం గమనించవచ్చు. శ్రీకృష్ణుడు బయలుదేరి వెళ్ళబోతూ అందరిని అడిగాడు నీ సందేశమేమి? నీ సందేశమేమి? అని. ఐదుగురు శాంతి! శాంతి!! అనే సందేశాన్ని పంపించాలనుకున్నారు. ద్రౌపది దగ్గరకు వచ్చి అడిగాడు 'అమ్మా! నీ సందేశమేమి?' అని. తన కురులను చూపించి 'కృష్ణా! వీటికి ముడిపడే యోగ్యత ఉందా? లేదా?' అని

అడిగింది ద్రౌపది. 'అందుకే నేనే వెడుతున్నా'నన్నాడు కృష్ణుడు. ఇది ముడిపడాలంటే రెండు జరగాలి. ఒకటి, దుర్యోధనుడి యొక్క తొడ విరగాలి. రెండు, దుశ్శాసనుడి వక్షం చీల్చబడాలి. అంటే, యుద్ధం సిద్ధమౌవ్వాలి. యుద్ధం జరగాలి అది జరిగితే అప్పుడు కురులు ముడివడతాయి. "అన్నా! ఇవి ముడివడతాయా? ముడివడవా? నువ్వేళుతున్నావు ఘటనాఘటన సమర్థుడువి" అని ద్రౌపది అడిగితే దానికి సమాధానం చెబుతూ శ్రీకృష్ణుడు.

**ద్యౌఃపతేత్ పృథివీ శీర్యేత్ హిమవాన్ వా శకలీ భవేత్।**

**శుష్యేత్ తోయనిధిః కృష్ణే! న మే మోఘం వచో భవేత్॥** అని అంటాడు.

"మిన్ను విరిగినా సరే, భూమి కృంగినాసరే, హిమవంతుడు వ్రక్కలైనాసరే, సముద్రమే ఎండిపోతేపోగాక నీ కురులు ముడివేస్తాను అన్న ప్రతిజ్ఞను ఎప్పుడూ కూడా నేను జవదాటనే దాటను. ఒక స్త్రీకి కలిగిన అవమానాన్ని సహించేవాణ్ణి కానే కాను ద్రౌపదీ! అందుకే నేను వెడుతున్నాను. నిర్భయంగా ఉండు". అని ధైర్యం చెప్పిబయలుదేరాడు శ్రీకృష్ణపరమాత్మ.

కనుకనే శ్రీకృష్ణునియొక్క ప్రయాణం, రాయబారం సవ్యంగా సాగించటంకోసం కాదన్నమాట. పాడుచేయటం కోసమే తను వెళ్ళాడు. ఆ రకంగా పాడుచేస్తే యుద్ధరంగానికి సిద్ధం చేస్తే సైన్య సమీకరణ జరగాలి. ఆ సైన్య సమీకరణలో అపుడు వీళ్ళకి తను చెప్పవలసింది, చేయవలసింది ఏదో చెయ్యాలి అనేది శ్రీకృష్ణుని సంకల్పం. కనుక శ్రీకృష్ణుడే ఈ లోకంకోసం చేయదల్చుకున్న ఉపదేశం కోసమనే, ఒక అద్భుతమైన రంగాన్ని తనే రచించుకున్నాడు. ఆ రకంగా రచించుకొని అర్జునుణ్ణి ఒకణ్ణి తయారు చేసుకొని, అప్పుడు ఆతనికి చేయదలచిన ఉపదేశాన్ని కూడచేయాలి. అతనిద్వారా లోకానికీ చేయాలి. ఆ ఉపదేశమే క్షేమాన్ని కలిగించాలి. అదే భగవద్గీతగ రూపుదిద్దుకోవాలి.

జై శ్రీమన్నారాయణ!

(శ్రీవారి ప్రవచనం నుండి)







సంపాదకీయం

# చేని కాపలా

పశువుకు తను తినటమే కాని మరోదానికి పెట్టడం తెలియదు. మనిషి తాను తింటాడు ఒరులకు పెడతాడు. ఇదే మనిషికీ పశువుకూ తేడా.

అయితే చాలామందికి తాము తినడమే కాని, ఒరులకు పెట్టడం తెలియదు. ఎంతమందిలో ఉండనీ తానొక్కడూ తినేస్తాడు. తనదగ్గిర లేదా అంటే లేక కాదు. పెడలుపెడలుగా అరటిపళ్ళుంటాయి. ఎదుటివాడికీ పక్కవాడికీ చేత ఓ పండు పెట్టినందువల్ల వీడి సంపద ఏమీ తరిగిపోదు. ఆ పళ్ళు ఎన్ని తింటాడు తను? తిని తిని అవి కుళ్ళిపోతే పెంటమీద పారేయాలి. అట్లా పారవేయటానికైనా సిద్ధపడతాడు కానీ, ఒకరికివ్వటానికి సిద్ధపడడు. మామిడి పళ్ళు ఆరముగ్గినవి డజన్లకొద్దీ ఉంటాయి. ముగ్గురు నలుగురు భోజనానికి కూచుంటారు. ఒక్కపండు కడిగి తెచ్చుకుని తన విస్తట్లో వేసుకుంటాడు. పంక్తిలో కూచున్న కడమవారి విస్తళ్ళలోనూ మూడో నాలుగో పళ్ళు వేసినందువల్ల వీడికేమీ తరిగిపోదు. ఆ పళ్ళన్నీ ఒక్కరోజులో వీడు తినలేడు. రెండు రోజులు గడిచినై. రెండు తిన్నాడు, నాలుగు తిన్నాడు, మూడోరోజు వచ్చింది. పళ్ళు డాగులు పడిపోయినై, మాగిపోయినై, కుళ్ళిపోయినై, నిన్న మొన్న నీ తోటిపాటు కూచున్నవారికి ఆ పళ్ళు విస్తట్లో వేస్తే నీతోపాటు వారూ తిందురు, తృప్తీ పడుదురు, ఇవ్వేళ నువ్వు వాటిని పారవెయ్యనక్కరా లేదు, వారి తృప్తితోపాటు కృతజ్ఞతా నీకు దక్కును. ఆ తృప్తికి వెలకట్టగలమా?

కానీ, పెంటమీద పారేయటానికేనా సిద్ధపడతాడు కాని, చేజేతులా చూస్తూ చూస్తూ ఒకరికివ్వడమంటే ఎందుకో మనిషికీ వెనుకాట.

పశువుకూ ఇవ్వాలనుంటుందేమో, ఉంటుందేమో ఏమిటి? కనపడ్డం లేదూ పాలివ్వటం. చెట్టుకూ ఇవ్వాలనుంటుందేమో, ఇవ్వటంలేదూ ఫలాలు. నదికీ ఇవ్వాలనుంటుందేమో ఇవ్వటం లేదూ మధుర జలాలు. ఆశ్చర్యమేమిటంటే అవి తామనుభవించకుండా తమకోసం దాచుకోకుండా ఇస్తున్నై, మనిషి అనుభవించీ ఉన్నవాటినైనా పాడుచెయ్యడానికైనా ఒప్పుకుంటాడు కానీ, ఒకరికివ్వటానికి సుతరామూ ఇష్టపడడు. ఏమిటో ఈ మనిషి స్వభావం.

మళ్ళీ పశువులకంటె, చెట్లకంటె, నదులకంటే వీడికి జ్ఞానమొకటి! దానికితోడు చదువు వెలగబెడతాడు. ప్రాణుల్లో తానుత్తముణ్ణని ఓ గర్వం! ఎందులో ఈ ఉత్తమత్వం?

ఇంకా బుద్ధిమంతులుంటారు మనుషుల్లో. వీరు మరీ గొప్పవాళ్ళు. వీరు తాము తినరు, ఒరులకెల్లాగూ ఇవ్వరు. వీళ్ళను గురించి చెపుతున్నాడు నీతివేత్త.

**యో నదదాతి న భుంక్తే**

**విభవే సతి నైవ తస్య తద్ద్రవ్యం।**

తృణకృత కృత్రిమ పురుషః
రక్షతి సస్యం పరస్యార్థే॥

డబ్బున్నా తాను తినకా ఒరులకివ్వకా దాన్ని చూసుకుంటూ బతికేవాడుంటాడు. ఆ డబ్బు వాడిది కాదన్నమాట. చేలల్లో గడ్డితో మనిషి ఆకారంతో చేసిపెట్టిన దిష్టిబొమ్మ తాను ఆ పంటకు కావలి కాస్తుంది తప్ప ఆ పంట దానిదా? తాను తింటుందా?

ఐశ్వర్యం అనుభవించడం కూడా ఒక అదృష్టమే. ఎందరు కూటికి లేక మాడిపోతున్నారు? పైసా సంపాదించడానికి ఎన్ని అగచాట్లు పడుతున్నారు? మీ పెద్దల ధర్మమా అని నువ్వు తిని పదిమందికి పెట్టదగిన ఐశ్వర్యం నీకు లభించింది. అనుభవించు, పదిమందికి పెట్టు అప్పుడే ఆ ఐశ్వర్యం సార్థకం.

ఐశ్వర్యముందని పాడుచేయమనడంలేదు. నువ్వనుభవించు అంటున్నాం. ఇవ్వేళ నువ్వనుభవించకపోతే రేపెవడో అనుభవిస్తాడు. ఒక్కరోజులో అంతా ఊదేస్తాడు. వెనకటివారినుంచి నీకు లభించినట్లే నువ్వూ భావితరాలవారికి ఈ సంపదలనందిస్తానంటావూ, అందించు. భేషుగ్గా ఉంటుంది. అట్లా అందించాలి కూడాను, అప్పుడే నీకు లభింపచేసిన వారిపట్ల నువ్వు కృతజ్ఞత చూపినట్టు కూడాను.

అయితే ముందు నువ్వనుభవించు. నీతోపాటు మరికొందరినాదరించు. నీ ఐశ్వర్యాన్ని మూడుభాగాలు చెయ్యి. నీ అనుభవానికి ఒకపాలు, త్యాగాలకొకపాలు. భవిష్యత్తులో నీవారికొకపాలు. అల్లా కాకుండా కడుపుకట్టుకొని, నువ్వు తినక, ఒకడికి పెట్టక ఆ డబ్బును అట్లా చూస్తూ కాలం గడిపేస్తానంటావూ, ఎవడో గద్దలా వచ్చి తన్నుకుపోతాడు. అయోగ్యుల అనుభవానికి అవుతుంది తప్ప, నీ ఐశ్వర్యం సద్వినియోగం కాదు. ఏమో, నీ పరోక్షంలో ఏమౌతుందో నీకేం తెలుస్తుంది? నువ్వనుభవించేవూ, అనుభవించేనన్న తృప్తిఉంది. ఒకడికి పెట్టేవూ, వాడి అనుభవంతోపాటు, వాడి తృప్తితోపాటు నీకూ ఒకడికిచ్చేనన్న తృప్తీ ఉంటుంది, వాడి కృతజ్ఞతా నీ కుంటుంది.

అల్లా కాకుండా నువ్వు తినకా ఒకడికి పెట్టకా చూస్తూ గడిపేస్తావూ చేలల్లో పెట్టిన గడ్డిబొమ్మ ఎంతో నువ్వూ అంతే! ఆ బొమ్మకు ఎట్లా అనుభవం లేదో నీకూ అట్లాగే అనుభవం లేదు. అది చైతన్యం లేక ఒరులకెల్లా ఇవ్వలేదో, జ్ఞానం లేక నువ్వూ అట్లాగే ఇవ్వటంలేదు. ఆ చేను దానిది కానట్లే ఈ ధనమూ నీది కాదు. నువ్వు వట్టి కుక్కకాపలావాడివన్నమాట. ఎవరికోసమో చచ్చి చెడుతున్నావు.

తరవాత అనుభవించేవారైనా నిన్ను కృతజ్ఞతతో అయ్యోపాపం కడుపుకు తినకుండా కూడా కూడబెట్టి మనకు ఇచ్చేడు అని స్మరిస్తారా? స్మరించరు సరికదా నీ పిసినారితనాన్ని ఎగతాళి చేస్తారు కూడాను. ఏం చేసినా ఏమన్నా నీకు తెలిసేనా, పెట్టేనా? అంచేత నువ్వు అనుభవించు, ఒరులకు తృప్తిగా మనసుమేరకు పెట్టు. భోగం త్యాగం ఇవి రెండూ ఉంటేనే ఐశ్వర్యానికి రాణింపు.

-శ్రీరామచంద్రాచార్య





## శ్రీ చిన్న జీయరుస్వామివారి భవిష్య కార్యక్రమ వివరాలు

| | | |
|---|---|---|
| జనవరి | 13వతేదీ | చెన్నైలో ఉదయం గోదాకళ్యాణంతో ధనుర్మాస వ్రత సమాప్తి జరుగును |
| | 31 వతేదీ | హైదరాబాదు చేరుతారు. |
| ఫిబ్రవరి | 1 వతేదీ | ఉదయం గం॥ 10-30 ని॥లకు సికింద్రాబాద్‌లోని శాంతినికేతన్ విద్యాలయ సందర్శన<br>సాయంకాలం 4గం॥లకు నవీనా ఎడ్యుకేషనల్ సొసైటీ వార్షికోత్సవంలో పాల్గొంటారు. |
| | 2 వతేదీ | ఖమ్మంజిల్లా, సత్తుపల్లి, చేరుతారు |
| | 3 వతేదీ | లయన్స్‌క్లబ్ ప్రాంతీయ సదస్సులో పాల్గొంటారు. |
| | 13,14,15 | పశ్చిమగోదావరి జిల్లా, నర్సాపురం, ఎంబెరుమానార్ కోవెల సందర్శన, పరిసర ప్రాంతాల పర్యటన |
| | 16 నుండి 23 వరకు | రాజమహేంద్రిలో మకాం. భీష్మైకాదశీ ప్రయుక్త ప్రవచనములు, సామూహిక **విశ్వశాంతి విరాట్ పారాయణ** జరుపుతారు. |
| | 22వ తేదీ | రాజమహేంద్రి, రామదాస్ పేటలో, శ్రీ వరాహలక్ష్మీ నరసింహస్వామి ఆలయ ప్రతిష్ఠ జరిపిస్తారు. |
| | 24వ తేదీ | సికింద్రాబాద్ చేరుతారు. |
| | 25వ తేదీ | బోయినపల్లిలో శ్రీబాలాజీ మందిర్ ప్రతిష్ఠ. |
| | 26వ తేదీ | రాత్రికి అదిలాబాద్ జిల్లా, దిలావర్‌పూర్ చేరుతారు. |
| | 28వ తేదీ | వరకు శ్రీహనుమదాలయ ప్రతిష్ఠ జరుపుతారు. |
| మార్చి | 1వ తేదీ | నిజామాబాద్, ఖిలా శ్రీరామమందిర్, ఆలయ ప్రతిష్ఠా మహోత్సవంలో పాల్గొంటారు.<br>రాత్రికి, మైలారం చేరుతారు. |
| | 2వ తేదీ | శ్రీవేంకటేశ్వరస్వామి వారి ఆలయ ప్రతిష్ఠ, మైలారంలో రాత్రికి, కరీంనగర్‌జిల్లా, గోపాలరావుపేటలో మకాం. |
| | 3వ తేదీ | గోపాలరావుపేటలో, శ్రీసీతారామచంద్రస్వామి ఆలయ ప్రతిష్ఠ. |
| | 7నుండి 11వరకు | వరంగల్ జిల్లా జనగాం లో శ్రీసుదర్శన యజ్ఞంలో పాల్గొంటారు. |

జై శ్రీమన్నారాయణ!

## ※ పాఠక మహాశయులకు విజ్ఞప్తి ※

భక్తినివేదన పాఠకులకు నమస్సుమాంజలులు. 2002 నూతన సంవత్సర శుభాకాంక్షలు. 'భక్తినివేదన ఆధ్యాత్మిక మాసపత్రిక'ను మీరు శ్రద్ధగా చదివి ఆనందించుచున్నందుకు శ్రీశ్రీశ్రీ స్వామివారి అనేకానేక మంగళాశాసనములు మీకు తెలియచేయుచున్నాము. ఈ అభిరుచిని ప్రోత్సహించాలని మా ఆకాంక్ష.

ఈ మధ్య కాలంలో పోస్టల్ ఛార్జీలు ఎంతగా పెరిగాయో మనందరికీ తెలుసు. అయినా పెద్దల సూక్తిసుధలు మీకు అందాలన్న మా అభిమత సాఫల్యానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నాము.

ఇప్పటిదాక వార్షిక చందాదారులకు తమ సభ్యత్వము ముగియడానికి రెండు నెలలముందుగా ఒక Letter, తర్వాత M.O., ఫారమ్ పంపించడం జరుగుతుంది. తరువాత ఒక కార్డు ద్వారా చందా ముగియడాన్ని గుర్తుచేస్తున్నాము. సుమారు 10 రూపాయలు దీనికే వ్యయము అవుతుంది.

అయితే చాలామంది విషయం చదవాలన్న ఆసక్తేగాని, M.O., ఫారమ్ తిరిగి పంపించడం మరచిపోతున్నారు. అలాంటివారికి విధిలేని పరిస్థితిలో పత్రికను పంపలేకపోవడం మాకెంతో బాధనిస్తోంది. ఈ బాధ మీరే తొలగించగలరు. మీరు మీ సభ్యత్వాన్ని పునరుద్ధరించుకొని, మాకు సహకరించి, ప్రోత్సహించవలసినదిగా కోరుచున్నాం.

మా సేవలను త్వరితగతిన మీకు అందించుటకు మాతో జరుపు ఉత్తరప్రత్యుత్తరములలో మీ సభ్యత్వ సంఖ్యను, ప్రస్తుత చిరునామాను, పిన్‌కోడ్ నెంబరుతో ఉదహరించండి. మీ విలువైన అభిప్రాయాలను కూడ నాలుగైదు వాక్యాలకు మించకుండా తెలియ జేయగలరు. మీ ఈ విషయజిజ్ఞాస, సంప్రదాయాభిలాష సదా పెంపొందాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాము.

జై శ్రీమన్నారాయణ!

శ్రీకార్యం,
భక్తినివేదన



7/Bn/BnJan02.p65



### భక్తులకు విజ్ఞప్తి

మీరు శ్రద్ధతో సమర్పించు కైంకర్యములు (బదరీ అన్నదానము, జెట్, వికాస తరంగిణి, భక్తినివేదన) ఏ బ్యాంకునుండైనా విజయవాడ పేరుమీద బ్యాంకు డ్రాఫ్టులు తీసి పంపగలరు.

- శ్రీకార్యం, జెట్, సీతానగరం

# తేనెవాక (మాధ్వీకఝురి)

## శ్రీతిరుమళ్ళిశైయాళ్వార్ - భక్తిసారులు

"మధురవాక్ శిఖామణి", "భాగవతామృతవర్షి"
- శ్రీమాన్ ఉ.వే. **సాతులూరి గోపాలకృష్ణమాచార్యస్వామి,** సింహాచలము.

'నాన్ముకన్ తిరువన్దాతి' అను ఈ ప్రబన్ధప్రారంభమునందే శ్రీభక్తిసారులు శ్రీమన్నారాయణుని జగత్కారణత్వమును తెలుపుటకు కారణములు ఏమన, లోకులు ఇతరదేవతలను పరదైవము లనుకొని శ్రమపడి ఆశ్రయించి, ఆయాదేవతలు తమకు శాశ్వతానందమును ప్రసాదించుటకు సమర్థులు కారని చివరకు తెలుసుకొని భంగపడకుండవలెననియే. ఏ దేవతను ఆశ్రయించినా శ్రమయనునది సామాన్యమే. కానీ, ఫలమును పొందుటలోనే తారతమ్యము కలదు.

శ్రీమద్భగవద్గీతలో భగవానుడు ఈ విషయమునే '**అవన్తత్తు ఫలం తేషాం తద్భవ త్యల్పమేధసామ్**' అనిఅనుగ్రహించెను. తెలివి తక్కువవారైన ఇతర దేవతలను కొలచినవారికి అన్తము కలిగిన ఫలముమాత్రమే లభించును. అనునది పై భగవద్గీతా వచనపు భావము. ఇచ్చట శంకరభగవత్పాదుల గీతాభాష్యసూక్తులు స్మరణీయ ములు. 'ఏవం సమానే **అప్యాయాసే, మామేవ న ప్రపద్యన్తే అనన్తఫలాయ। అహో! కష్టతరం వర్తతే, ఇత్యనుక్రోశం దర్శయతి భగవాన్**' అనునవే ఆ సూక్తులు.

పై సూక్తుల భావమేమనగా 'ఇతర దేవతలను కొలచినా, నన్ను కొలచినా వీరికి శ్రమ సమానమే. అయితే, ఇతర దేవతలను కొలచినఎడల ఆయా దేవతలు పరిమిత శక్తిమాత్రమే గలవారు కనుక పరిమితములైన ఫలము మాత్రమే ఒసగుదురు. అదే శ్రమను అనగా ప్రదక్షిణ నమస్కారాదులను నా విషయములో చేసినయెడల నేను అపరిమిత శక్తిగలవాడను, సర్వస్వతంత్రుడను గనుక అనంతఫలములను ఇత్తును. కాని మందబుద్ధులగు మానవులు అట్లు నన్నాశ్రయించి సులభముగ అనంత ఫలమును పొందజాలియున్నా, అట్లు చేయక ఇతరదేవతలనాశ్రయించి పరిమిత ఫలమును మాత్రమే పొందుచున్నారే! ఏమి వీరి దౌర్భాగ్యము' అని క్రుంగుచూ శ్రీ శంకర భగవత్పాదుల మనోవీధిలో సాక్షాత్కరించినాడట శ్రీకృష్ణభగవానుడు. అందుచేత '**కారణన్తు ధ్యేయః**' అను చొప్పున ధ్యానించునది జగత్కారణమగు తత్త్వమునే కావలెను. లోకులకు ఈ విషయమును ముఖ్యముగ తెలియజేయదలంచియే తమ ప్రబన్ధ ప్రారంభము నందే పరమాత్మ జగత్కారణత్వమును తెలుపుచున్నారు.

**నాన్ముకనై నారాయణన్ పడైత్తాన్** :- '**నాల్గు ముఖములు కల బ్రహ్మదేవుని నారాయణుడు సృజించెను.**' అను వాక్యముద్వారా బ్రహ్మసృష్టించినది శ్రీమన్నారాయణుడే అని తెలియజేయు చున్నారు. బ్రహ్మను సృష్టించుట మాత్రమే కాక చేతనాచేతనాత్మకము అగు జగత్తంతటికీ భగవానుడే సృష్టికర్త యనుట ఇందలి భావము '**ఏ కోహవై నారాయణ**





**ఆసీత్ న బ్రహ్మ నేశానః**' అను ఉపనిషత్ వాక్యానుసారము ఈనాడు కార్యరూపముగ తెలియబడుచున్న సమస్త పదార్థములు నామరూపవిభాగానర్హముగ భగవానుని యందే ఉంది. తానేకాకిగా ఉన్న భగవానుడు '**స ఏకాకీ న రమేత**' అనినట్లుగ ఆనందము నొందక '**బహుస్యాం ప్రజాయేయేతి**' అనునటుల బహు భవన సంకల్పమును చేసెను. మహత్తు మొదలుకొని బ్రహ్మాండము వరకు సృజించి ఆ బ్రహ్మాండ మందు బ్రహ్మను సృజించెను. ఇంతవరకూ భగవానుడు చేసిన ఈ సృష్టికి '**సమష్టిసృష్టి**' అని పేరు. ఈ సృష్టిని గూర్చి సమగ్రముగ ఈ ఆళ్వార్లే అనుగ్రహించిన వేరొకపాశురార్థమునందు అనుభవిద్దాం. ఈ సృష్టిని గూర్చియే శ్వేతాశ్వతరోపనిషత్తు "**యో బ్రహ్మాణం విదధాతి పూర్వం**" అని సూచించినది. ఇటనుండి బ్రహ్మదేవుడు చేసిన సృష్టికి '**వ్యష్టి సృష్టి**' అని పేరు. పరమాత్మచే సృజింపబడి ఆయనచే వేదోపదేశమును పొంది ఆ వేద విజ్ఞానము నాధారముగ జేసుకొని మిగతా సృష్టినంతటినీ బ్రహ్మదేవుడు చేసెనని '**వేదశబ్దేభ్య ఏవాదౌ దేవాదీనాం చకార సః**' అను వేదవాక్యము ద్వారా తెలియుచున్నది.

# మహర్షుల చరిత్ర - గౌతమ మహర్షి

తమిళమూలం : **వై. వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామిగారు**
తెలుగు సేత : **శ్రీ ఉ. వే. శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి,** విజయవాడ

ఏకతన్, ద్వితన్, త్రితన్ : ఇవి గౌతముని యొక్క ముగ్గురి కుమారుల పేర్లు ఈ ముగ్గురును తండ్రివలె మహామేధావులు. వేదములను నిర్దోషముగ అభ్యసించినవారు. గౌతమునకు వీరంటే చాల అభిమానము. ఇటువంటి తేజస్సంపన్నులైన కుమారులను కనినందుకు గౌతముడు చాల సంతోషించుచుండెడివాడు. ఈ విధముగ చాలాకాలము సుఖజీవనమును గడిపి గౌతముడు దేవలోకమునకు వెళ్ళినాడు. అతడిని పురోహితునిగా కల రాజులందరును ఈ ముగ్గురు పిల్లలను తండ్రివలెనే గౌరవించుచు వచ్చిరి. ఈ ముగ్గురిలో త్రితన్ అనువాడు మిగిలిన ఇద్దరి కంటే అన్నివిధముల గొప్పవాడుగా ప్రకాశించినాడు. అందుచే అందరును అతనిని అధికముగ పూజించసాగిరి. మిగిలిన ఇద్దరి యెడల అంత గౌరవభావము చూపరైరి. వీరికి సోమయాగము చేయవలయునని ఆశకల్గినది. దానికి కావలసిన ధనము, పశువులు, మిగిలిన సంభారములు అన్నియు కావలెను గదా! వాటిని సంపాదించుట ఎట్లు? అందుచే మిగిలిన యిరువురును త్రితన్ అను చిన్న వానిని ముఖ్యునిగా ఉంచుకొని ధనము, పశువులు మొదలగు వానిని సేకరించుకొనిరి. త్రితన్ యెడల ఉన్న గౌరవముతో సంపన్నులు రాజులు ధారాళముగ విరాళములనిచ్చిరి. ఆ ధనమును, వస్తువులను, పశువులను గ్రహించి సోమయాగముచేయుటకై తూర్పుదిక్కున నున్న సరస్వతీనదీ తీరమునకు పోయిరి.

త్రితన్ ముందుపోవుచుండెను. ఏకతనుడు, ద్వితనుడు పశువులను తోలుకొని వెనుక పోవుచుండిరి. ఈ ఇద్దరి యందు త్రితన్ యెడల అసూయాభావము పొడసూప సాగినది. వారుద్రోహబుద్ధితో ఆలోచింపసాగిరి. త్రితనుని వంచించి ఈ పశువులను తామే వశపరచుకొని అతనిని ఒంటరిగా విడిచి పోవలెనని నిశ్చయించుకొనిరి. ఈ విధముగ చేయుటకు తగిన కాలము కూడా వారికి సమకూరినది.

వారు సరస్వతీ నదీతీరమునకు చేరిరి. అది అర్ధరాత్రి సమయము అచట ఒక పాడుపడిన బావి ఉన్నది. ఆ బావి గట్టుమీద ఒక భయఙ్కరమైన తోడేలు ఉన్నది. దానిని చూచి త్రితనుడు వణకిపోయినాడు. తడబడి పాడుబావిలో పడినాడు. పాపము! బావిలోనుండి తన సోదరులను పిలుచుచు మొరపెట్టసాగినాడు. నీచులైన అన్నలిద్దరు ఇదే మంచి సమయమని పశువులను, ధనములను అపహరించుకొని మాయమయిరి. త్రితనుడు బావిలోపడి చస్తే చావనీ లేదా బ్రతికి తిరిగి వచ్చినచో పశువులను, ధనములను తిరిగి తనకు కావలసినంత సంపాదించుకోగలడు అని వీరు తలచిరి.

బావిలో చిక్కుకున్న త్రితనుడు చాలసేపు గొంతెత్తి రక్షించవలసినదిగా మొరపెట్టుకొన్నాడు. అతడి మొరను ఎవరును వినలేదు. భయఙ్కరమైన పాడుబావి,





అర్ధరాత్రి, బావిగట్టుపైన భయఙ్కరమైన తోడేలు ఏవిధముగ చూచినను చావవలసినదే అని అతనికి తోచినది. కానీ, అందుకు అతడేమి భయపడలేదు. అతని బాధ వేరొక విషయమును గూర్చి. సోమయాగమునకై అన్ని ఏర్పాట్లను చేసితివే. చివరి నిముషములో ఇట్టి విపరీతపరిస్థితులు ఏర్పడినవే. సోమరసపానము చేయకనే చనిపోవుస్థితి ఏర్పడినదే అని అతడికి పెద్ద దిగులు ఏర్పడినది. గౌతముని కుమారుడు గదా!

చలించిన మనస్సుతో దేవతలను మొరపెట్టి ప్రార్థింపసాగినాడు. దిక్కులేనివారికి దేవుడే దిక్కు అను నానుడి వ్యర్థమగునా! నాలుగు వంకల చూచిన అతనికి ఒక మూల ఒక తీగె కనిపించినది. అది సోమలత అగుటచే దానిని వెంటనే చేతిలో గ్రహించినాడు. దానిని గ్రహించగనే మనసులోని భీతి తొలగిపోయినది. అచ్చటనే సోమయాగము చేయవలెనని సంకల్పించినాడు. రాళ్ళతో ఆ తీగను నూరి రసమును పిండినాడు. ఆ పాడు బావిలో కొంచెము నీరుకూడ ఉండుటచే ఆ నీటిని ఉపయోగించుకొనినాడు. త్రేతాగ్నులను, యాగ వేదికను మనసు నందే సృష్టించుకొనినాడు. అనేకమంది ఋత్విక్కులు పెద్ద గొంతుకతో మంత్రములను ఘోషించినట్లు తానొక్కడే పెద్ద గొంతుతో మంత్రములను చదువనారంభించినాడు. అతనికి మంత్రములన్నియు కంఠస్థమే అతని ధ్వని దేవలోకము వరకు వ్యాపించినది. ఇంద్రుడు మొదలగు దేవతలందరు పరుగు పరుగున అతని వద్దకు వచ్చిరి. గౌతముని ఉత్తమ కుమారుడు యాగము చేయుచున్నాడు దీనికి వెళ్ళలేనిచో ఏమి విపరీతము ఏర్పడునో అని ఆ దేవతలు భయపడిరి. సోమరసమును యధాక్రమముగ వారందరికి పంచిఇచ్చినాడు త్రితనుడు. తానుకూడ దానిని సేవించినాడు. అతని కోరిక నెరవేరింది.

దేవతలు సంతోషించి అతనికి ఒక వరము నొసగినారు. "ఈ పాడుబావి నుండి నన్నుద్ధరింపుడు" అని అతడు వరమడిగినాడు. వారు సరియేననిరి. ఆ బావికి దిగువన భూమిలో చాల లోతున సరస్వతీ నది ప్రవహించుచున్నది. ఇప్పుడా నది ఈ బావి మీదుగ పొంగి ప్రవహింపసాగినది. ఆ నదీ ప్రవాహములోపడి సులభముగ గట్టు చేరినాడు త్రితనుడు. అతడు దేవతలను ఇంకొక వరమునను గ్రహించవలసినదిగా ప్రార్థించినాడు. ఇకపై ఎవరు ఈ బావిలోని నీటిలో స్నానము చేసెదరో వారికి సోమరసపానము చేసిన ఫలము లభించవలయు ననునదియే ఆ వరము. దేవతలు సంతోషముతో అతనికి ఈ వరమును కూడా ఇచ్చిరి.

విజయోత్సాహముతో ఇంటికి చేరిన త్రితనుడు అచ్చట తనకు ద్రోహము చేసిన అన్నలనుచూచి మండిపడ్డాడు. మీరు చేసినది మిక్కిలి పాపపుపని. దానికి ఫలముగ మీరు ఈ క్షణము నందే నల్ల ఎలుగుబంట్లుగా అగుదురుగాక అని శపించెను. వెంటనేవారు ఎలుగుబంట్లుఅయిరి.



# భగవద్రామానుజ చరిత్ర

శ్రీమతి T.K. చూడామణి, విజయవాడ.

రామానుజులు శెల్వపిళ్ళతో తిరునారాయణపురం చేరారు. భక్తులు అమందానందంతో స్వాగతం పలికారు. సంపత్కుమారులట, శెల్వపిళ్ళ అని ద్రావిడనామమట- యతిరాజపుత్రన్ అని ఆనందంగా పిలుచుకొంటున్నారట. ఆ స్వామిని సేవించాలని ఒకటే ఆరాటం. ఈనాటికి వచ్చాడు స్వామి. రామానుజులు తీసుకొనివచ్చారు. యతిరాజులు శాస్త్రోక్తవిధిగా సంప్రోక్షణాదులు జరిపి శుభముహూర్తంలో శెల్వపిళ్ళను ప్రతిష్ఠింపచేశారు. వారికి వైరముడి ఉత్సవం, రాజముడి ఉత్సవం మొదలైన అనేక ఉత్సవాలు ఏర్పాటు చేశారు. కొంతకాలం అక్కడే ఉండి ఆరాధనాపద్ధతిని క్రమబద్ధం చేశారు. శెల్వపిళ్ళకు చిట్టిగారెలు, చిఱుదోసెలు ప్రత్యేక ప్రసాదంగా ఏర్పాటు చేశారు. ఈ శెల్వపిళ్ళను తీసికొని వచ్చేటప్పుడు రాజభటులవలన ఎంత ప్రమాదం ఎదురైందోకదా! అపుడు పంచములు ఎంత సహాయం చేసారు. ఆ మేలు ఎలా మరిచిపోగలం..... ఎన్నటికి మరువలేం. అందుకే తిరునారాయణపురం శెల్వపిళ్ళను దర్శించడానికి వారికి ప్రత్యేక అనుమతి నిచ్చారు. ముఖ్యంగా ఉత్సవదినములలో, ఎవరైనా సరే భక్తిముఖ్యం. శెల్వపిళ్ళను నమ్మిన భక్తులు బలిపీఠము వరకు పోవచ్చునని క్రొత్త చట్టాన్ని ఒకదానిని తీసికొనివచ్చారు. హే రామానుజా! జాతి భేదాలు, కుల, మత భేదాలులేవని లోకానికి ఆనాడే చాటిచెప్పి భక్తి సిద్ధాంతాన్ని ప్రచారం చేసిన తండ్రీ! నీ ఋణం తీర్చుకొనడమెలా? అంటూ నాటికీ నేటికి భక్తకోటి స్వామికి నీరాజనాలు సమర్పిస్తోంది.

విష్ణువర్ధన మహారాజు భగవద్రామానుజుల భక్తుడైన తర్వాత 5 నారాయణ ఆలయాలని చాలా చక్కగా నిర్వహించాడు. అవి 1) కార్తి నారాయణ ఆలయం, 2) విజయనారాయణాలయం, 3) చెన్నగి నారాయణాలయం, 4) లక్ష్మీనారాయణాలయం, 5) మేల్కోట తిరునారాయణాలయం. మేల్కోట తిరునారాయణాలయం ఎంతో ప్రాచీనమైనదట. కృతయుగంలో సనత్కుమారులు వైకుంఠవాసియైన నారాయణుని ఇక్కడ స్థాపించి పూజించాడట. అందువలన ఆ యుగంలో తిరునారాయణ పురాన్ని నారాయణాద్రి అని పిలిచేవారట. త్రేతాయుగంలో దత్తాత్రేయులు నలుగురు వేద పురుషులను శిష్యుల్నిగా చేసికొని వేద పుష్కరిణీ తీరంలో వేదాధ్యయనం చేస్తూ వచ్చి ఈ స్వామిని పూజించాడట. అందుచేత త్రేతాయుగంలో వేదాద్రి అని పిలిచేవారట. ద్వాపరయుగంలో యదువంశంలో అవతరించిన శ్రీకృష్ణుడు ఈ స్వామిని పూజించడం చేత ఆ యుగంలో యాదవాద్రి - యదుగిరి అని పిలిచేవారట. కలియుగంలో యతిరాజులు స్వామిని గుర్తించి, ప్రతిష్ఠించి సర్వరక్షకంగా నిర్మించారు. కాబట్టి మేల్కోట అనిపేరు వచ్చిందట. ఏ కారణాలయితేనేం యుగయుగాలుగా ఆరాధనీయుడైన స్వామిని





రామానుజులు మళ్ళీ మనకి దర్శింపచేశారు. జీవులకి మహోపకారం చేశారు. జాతిని ఉద్ధరించారు భగవద్రామానుజులు.

శ్రీ కూరత్తాళ్వాన్ అత్తుళ్లాయమ్మ గారితో కలిసి శ్రీరంగానికి బయలుదేరారు. వారికి అడుగడుగునా పెరియనంబి గుర్తుకు వస్తున్నారు. పాపం! పెరియనంబి కన్నులను చోళరాజు పెకలించాడుకదా! ఆ బాధ తట్టుకొనలేక వారు పరమపదించారే. అయ్యో! నేనెంత దురదృష్టవంతుణ్ణి. ఇటు రామానుజులకు దూరం అయ్యాను. అటు పెరియనంబికి దూరమయ్యాను. రామానుజా! మీ ఎడబాటును భరించలేకపోతున్నాను తండ్రీ! ఒక్కసారి శ్రీరంగనాథుని సేవిస్తే పవిత్ర ఆలయంలో అడుగుపెడితే ఈ దుఃఖం కొంతైనా తగ్గుతుందేమో అనుకుంటూ తమ పుత్రులు శ్రీపరాశరభట్టరువారిని తోడుగా తీసికొని శ్రీరంగనాథుని వాకిలి చేరారు.

అక్కడ ద్వారపాలకులు అయ్యా మీరెవరి సంబంధీకులు అని ప్రశ్నించారు. ఎందుకు అన్నారు కూరేశులు. ఏం లేదు. మీరు రామానుజ సంబంధీకులైతే ఆలయంలో అడుగుపెట్టనివ్వరు. ఇది రాజాజ్ఞ అన్నారు వారు. కూరేశులు ఒక్కక్షణం నిలిచారు. వారి మనసులో ఆలోచనలు. ఈ శ్రీరంగనాధుడు చేయగల ఏ పనినైనా రామానుజులు అవలీలగా చెయ్యగలరు. కాని రామానుజులు చేసేపనులు శ్రీరంగనాధుడు చేయగలడా! ఉభయవిభూతి నాయకత్వాన్ని ఆ శ్రీరంగడే స్వయంగా రామానుజులకిచ్చాడే. ఎంత గొప్ప. అందువల్ల భగవంతుడైన శ్రీరంగనాధులకంటె భాగవతోత్తముడైన యతిరాజుల సంబంధమే నాకు గొప్ప. అనుకున్నారు.

ఏమిటీ ఆలోచన. ఏదో చెప్పండి అంటున్నారు ద్వారపాలకులు. కూరేశులువారితో 'అహంతు లక్ష్మణాచార్య సంబంధీనాత్ర సంశయః' అంటూ గట్టిగా చెప్పారు. నేను రామానుజులకు చెందిన వాడను. ఈమాట ఆనందంగా చెప్తున్నానయ్యా! అన్నారు. ఆ.... ఆ రామానుజుల సంబంధీకులా అయితే ఆలయంలోనికి పోవడానికి వీలులేదన్నారువారు. రామానుజ సంబంధం నా ప్రాణం. అది లేకుండా ఆలయంలోకి పోయే వీలున్నా నా కక్కరలేదు అన్నారు కూరేశులు. నేను రామానుజ సంబంధీకుడనని అందరూ అనుకుంటే చాలు అనుకున్నారు.

సుందర భుజ పెరుమాళ్ వేంచేసియున్న వృషభాచలానికి బయలుదేరారు కూరేశులు. తిరుమాలిరుంశోలై సుందర బాహు పెరుమాళ్ సన్నిధి. అక్కడే కూరేశులు శ్రీస్తవం, సుందర బాహుస్తవం, శ్రీవరదరాజస్తవం, అతిమానుషస్తవం, శ్రీవైకుంఠస్తవం అనే పంచస్తవాలు రచించారు. మనస్సులో ఆ శ్రీరంగనాధుని ప్రార్థిస్తూనే ఉన్నారు. తమ ఆచార్యులైన రామానుజులను చల్లగా చూడమని.

**గమనిక:'శ్రీవిష్ణుమహాపురాణము'**, అనివార్యకారణాలవల్ల ప్రచురించలేకపోవుచున్నాము. పైనెలలో ప్రచురించగలము.
-ఎడిటర్



# రామాయణంలో రమ్యగాథలు

-శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి, విజయవాడ

కదలుచున్న పామునాలుకలవంటి బాణపు కొనలతో, పడగలాంటి ధనువుతో, విషాగ్ని లాంటి క్రోధాగ్ని తేజస్సుతో పంచముఖ పన్నగంలా, ప్రళయ కాలాగ్నిలా, కోపంతో రెచ్చిపోయిన గజరాజులా వున్న లక్ష్మణుని చూచి అంగదుడు భీతిల్లి వ్యాకులుడైనాడు. భీతితో దీనుడై నిలచిన అంగదుని అనునయంగా చేరబిలచి "నాయనా అంగదా! నీవు వెళ్ళి నేను వచ్చినానని నీ పినతండ్రి సుగ్రీవునకు చెప్పుము" అని పంపినాడు. లక్ష్మణుని చూచిన వానరులు ఒక్కసారి సింహనాదము చేసినారు. అశనిపాతంలా, వజ్రాయుధంలా వున్న ఆ ధ్వనికి సుగ్రీవుడు వ్యాకులపడి స్పృహలోకి వచ్చినాడు. అంగదుడు రామానుజుని ఆగమనమును, అతని ఉగ్రతేజమును పినతండ్రికి వివరించినాడు. అది విన్న సుగ్రీవుడిలా చింతించాడు.

అయ్యో! నేను ఎటువంటి చెడ్డపనినీ చేయలేదే. రాముని విషయమున ఎటువంటి దుర్నీతినిగాని, దుర్వాక్యమునుగాని నేను పలుకలేదే. లక్ష్మణునకు కోపమేల వచ్చినది? నామీద కోపముతో శత్రువులు లేనిపోని దోషములు కల్పించి దాశరధులకు చెప్పలేదుకదా! రామలక్ష్మణుల వలన నాకెట్టి భయములేదు. మంచిమిత్రుడు కారణము తెలియక నామీద కోపించినాడే! అని వ్యాకుల పడుచున్నాను. అనగా, కాల ప్రబోధము కలిగిన హనుమంతుడు ఇలా చెప్పినాడు.

"సుగ్రీవా! వర్షకాలము గడచినది. నీవు కాలమును ఏమరి శరత్కాల ఆగమమును గ్రహించకున్నావు. నీకు ప్రియము కూర్చుటకే రాముడు వాలిని చంపి నీకు రాజ్యలక్ష్మిని ప్రాప్తింపచేసినాడు. భార్యను పోగొట్టుకొని కష్టములలో వున్న రామునికి సహకరించ వలసిన కాలమును విస్మరించినావు. రాముడు కోపించి ధనువు సారించెనేని ఎదిరించగలవారు ఈ సృష్టిలోనేలేరు. కనుక నీవు వెంటనే రాముడు నీకు చేసిన ఉపకారమును స్మరించి, మంత్రులతోనూ, సుహృజ్జనపరిషత్తుతోనూ, స్నేహితులతోనూ వెళ్ళి, దివ్యాస్త్రసంపన్నుడు అయిన ఆ రామునికి శిరసా నమస్కరించి స్నేహపూర్వకముగా అతనికి వశవర్తివై చరించుమని హితవు పలికినాడు.

వెనువెంటనే అంగదాదులు, బలశాలురైన వానరులు అందరూ చేతులు జోడించి లక్ష్మణుని లోనికి ఆహ్వానించినారు. ఏడు వాకిళ్ళుదాటి, శ్రేష్ఠమైన తివాసీలు, బంగారు, వెండి ఆసనములు, వజ్రవైడూర్య ఖచితమైన వస్తు సముదాయము గల అంతఃపురమునకు తోడ్కొని వెళ్ళినారు. అక్కడ శ్రేష్ఠమైన వస్త్రములు, ఉత్తమ మణిహారములు ధరించని స్త్రీలుగాని, అనుచరులుగాని లేరు.





నూపురముల, వడ్డాణముల ధ్వనులు వినిపించుటచేత లక్ష్మణుడు ముందుకు వెళ్ళుటకు సందేహించినాడు. ఆభరణధ్వని వినగానే లక్ష్మణుడు కోపావిష్టుడై దిక్కులు పిక్కటిల్లునట్లు ధనుష్టంకారము చేసినాడు. సచ్చరిత్రుడు, సీతా వియోగశోక కర్శితుడైన రాముని వ్యధకు వ్యాకులుడైన వాడూ అయిన రామానుజుడు దూరముగా స్త్రీలు లేనిచోటునకు వెళ్ళి నిలచినాడు. వానర రాజైన సుగ్రీవుడు ఆధనుష్టంకారమునకు వెఱగంది రాజాసనము నుండి దిగ్గున లేచినాడు. వెంటనే తారను పిలచి, "తారా! లక్ష్మణుని నీవే స్వయముగా అనుగ్రహింప చేయుము. మహాత్ములు స్త్రీల విషయమున కఠినముగా ప్రవర్తించరుకదా! ఆతడు ప్రసన్నుడు అయిన తరువాత నేను వచ్చెదనని చెప్పి తారను పంపినాడు. ఆమాటలు విన్నతార తొట్రుపాటుతో అస్తవ్యస్త ఆభరణాలతో లక్ష్మణుని వద్దకు వెళ్ళినది. మహాత్ముడైన లక్ష్మణుడు అటువంటి తారను చూచి, ఉదాసీనుడై, స్త్రీల సమక్షమున కోపము తగదని తలవంచు కొని నిలబడినాడు. లక్ష్మణుని ప్రసన్న దృష్టిని గమనించిన తార స్నేహపురస్సరంగా

**"కిం కోపమూలం మను జేంద్రపుత్ర! కస్తేవ సన్తిష్ఠతి వాజ్ని దేశే,**
**కః శుష్కవృక్షం వనమాపత్తన్తం దవాగ్ని మాసీదతి నిర్విశజ్కః"**

"రాజపుత్రా! నీ కోపకారణం ఏమిటి? ఎండిపోయిన అడివిని కాల్చే కార్చిచ్చు లాంటి నీ కోపాన్ని నిశ్శంకగా సమీపించి, నీ ఆజ్ఞను పాటించని వాడెవరు?" అని తార స్నేహానునయాలు పొందుపరచి పలికిన మాటలకు లక్ష్మణుడు....

"తారా! భర్తహితాన్ని కోరి వచ్చిన నీవు ముందుగా నీ భర్త గురించి తెలిసికొనుట మంచిది. నీ భర్త ధర్మాధర్మములను వర్జించి, కేవలము కామ ప్రవృత్తితో చరించుదోషి. నీ భర్త భోగలాలసుడై రాచకార్యములను గానీ, శోక తప్తులమైన మా స్నేహ ఒడంబడికను గాని కొంచెమైన చింతించుటలేదు. నాలుగు మాసములు వ్యవధి నీయగా మద్యమదమత్తుడై ఆవిషయమును మరచినాడు.

తారా! ఉపకారము పొంది ప్రత్యుపకారము చేయక బుద్ధిశాలి, మహాత్ముడు గుణవంతుడు అయిన మిత్రుని పోగొట్టు కున్నవాడు అనర్ధముల పాలుగాక తప్పదు. సత్య ధర్మములను విడచి విషయలోలుడైన నీ భర్త ధర్మవ్యవస్థను కాపాడలేడు. మిత్రుని వలన అర్థసంపత్తిని కూడ పొందలేడు. కార్యతత్త్వజ్ఞురాలవైన తారా! నీ భర్త మా కార్యసాధనకు సహకరించు విధమిట్లున్నది. మేమేమి చేయవలెనో నీవే చెప్పుము" అని పలుకగా. కార్యసాధనలో దృఢనిశ్చయ బుద్ధిగల తార లక్ష్మణునితో మహావీరుడవైన రాకుమారా! నీ కింతటి కోపము వచ్చుటకు తగిన సమయము కాదు. కార్యసాధనమే లక్ష్యముగా కలనీవు ఇప్పుడు సుగ్రీవుని పొరపాటును సహించి తీరవలె. రామకార్యమునకు కొంచెము కాలాతిక్రమము జరిగినది యదార్ధమే. అమోఘమైన రాముని క్రోధమూ నాకు తెలుసు. మీపట్ల మేము చేసిన తప్పిదము తెలుసు ఇప్పుడు ఏమి చేయవలెనో కూడ నాకు తెలుసు. స్వజనమును కోపముతో తెగడు కొనుట తగదు.

# శ్రీవచన భూషణము

–శ్రీ ఉ.వే.శ్రీమాన్ **శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి,** విశాఖ

## 93వ సూత్రము

**సాధ్య సమానమ్, విళంబాసహమ్ ఎన్గిఱతే సాధనత్తుక్కు ఏత్తమ్. సాధ్య ప్రావణ్యా మడియాగవే సాధనత్తిల్ ఇఴిగిఱదు.**

వెనుక మడలెత్తుట మొదలగునవి సర్వేశ్వరుడే ఉపాయమని స్వీకరించిన వారికి ప్రతిబంధకములు కాదని చెప్పినారు. అంతేకాదు. అని సిద్ధోపాయముతో సమానములే అని చెప్పుచున్నారు.

మన ప్రయత్నముచే పొందవలెనని ఆచరించెడి కర్మ జ్ఞాన భక్తులు కంటె సర్వేశ్వరుడే ఉపాయమని స్వీకరించినవారికి తాము దేనిని పొందవలెనని కోరినారో దానికి అదే ఉపాయము కనుక ఉపాయము కూడా ఉపేయముతో సమానమయినదే. ఇతర సాధనములు, ఫలమును ఒసంగుటలో కొంత ఆలస్యమగునుగాని సర్వేశ్వరుడే ఉపాయమని స్వీకరించిననాడు ఆలస్యముకాదు అనెడి ధైర్యముతో ఉండెడి భక్తుడు ఆలస్యమైనచో సహింపలేడు. అందుచే సిద్ధోపాయము సాధ్య సమానము.

విలంబాసహము. ఇతరోపాయములు సాధనములగుటచే వానిచే సాధింపవలసినది సిద్ధించువరకు కర్మ జ్ఞానము భక్తి మొదలగు ఉపాయములను ఆర్జించినను కొంత విలంబమగుట తప్పదని ఓర్చి ఉందురు. సర్వేశ్వరుడే ఉపాయమైననాడు సాధ్యమే కదా తనకు సాధనముయ! అది సర్వశక్తిమంతము కదా! ఇంక ఆలస్యముండదు. తప్పక ఫలించునని ప్రపన్నులు నిశ్చయముతో ఉందురు. అట్లు సర్వేశ్వరుడే ఉపాయమని స్వీకరించి కొద్దిగ ఆలస్యమైనచో తాను పొందవలసిన ఫలమునందు ఆసక్తి ఎక్కువ అయి, ఆయన అనుగ్రహించి లభించునంత వరకు కూడ ఓర్వలేక, పోనీ! మరొక సాధనము చేసి అయినను సర్వేశ్వరుని కైంకర్యమును పొందవలెనని ప్రయత్నించును.

అట్లు ప్రయత్నించుట పొందవలసిన సర్వేశ్వరుని కైంకర్యము నందలి అత్యధికమగు ఆసక్తియే కారణము కావున ఇట్టి ప్రయత్నము చేయుటకు సర్వేశ్వరుడే కారణమగును. అందుచే వేరొక ప్రయత్నము చేయుట దోషముకాదు. ఇతర ఉపాయములను వదలి సర్వేశ్వరుడే ఉపాయమని స్వీకరించుటకు కారణము ఇతరోపాయములు ఆచరించుట, ఫలము. ఆలస్యము అగుననే కదా! ఆలస్యము ఓర్వలేకపోవుట చేతనేకదా! తాను చేయకూడదని తెలిసినను చేయుట ఆలస్యమును ఓర్వలేక చేయునదే కాని అవి ఉపాయములను బుద్ధిచే కాదు.

మడలెత్తుట, కామదేవార్చనము మున్నగునవి ప్రేమాతిశయముచే చేయుట సర్వేశ్వరునకు ప్రీతిని కలిగించును. 'ఈ తనికి నాపై ఎంతటి ప్రేమ! చేయకూడని పనులను





కూడ నా కొరకు చేయుచున్నాడే' అవి సర్వేశ్వరుని మనస్సు ఉప్పొంగును సర్వేశ్వరుని మనసునకు సంతోషము కలిగించునవే కైంకర్యము. కనుక 'మడలెత్తుట' నోము నోచుట మొదలగునవి ప్రశంసింపదగునవే అగును. ప్రేమాధిక్యముచే తనకు తగని పనులను చేయుటకు సిద్ధపడగనే అత్యంత ప్రియుడగు సర్వేశ్వరుడు తొందర తొందరగ వచ్చి, ప్రేమ పరవశులకు నమస్కరించి, 'తప్పు తప్పు చేయవద్దు. ఇదిగో వచ్చితిని' అని అనును. సిద్ధసాధనము 'అనగా సర్వేశ్వరుడే ఉపాయమని స్వీకరించుట' ఇతరోపాయములచే ఫలమునకు ఆలస్యమగునని ఓర్వలేకనేకదా! ఇట్టి వ్యాపారములు చేయుటకు కూడ కారణము సర్వేశ్వరుని కైంకర్యము ఆలస్యమగుట ఓర్వలేక చేయునదే కనుక ఇట్టి వ్యాపారములు త్యాజ్యములు కావు. విడువదగినవి కావు. ప్రతి బంధకములు కావు.

పిత్తరోగము ఉండువారు పాలు తప్ప వేరొక ఆహారము ఏదియు తీసికొనలేక, పైత్యరసము ఎక్కువ అగుటచే బాధపడుచుండగ, ఒక వైద్యుడు, 'ఏమియు అక్కరలేదు. కడుపులో నొప్పి రాగానే వేడిపాలు త్రాగినచో అదితగ్గును' అని చెప్పినచో ఆ రోగి ఎంత ఆనందించును!. త్రాగవలెననెడి పాలే మందు అయినదికదా! అట్లే సర్వేశ్వరుడే ఉపాయముగ స్వీకరించువారు సర్వేశ్వరుని పొందవలెనని వానినే ఆశ్రయించినప్పుడు రోగనివారణకు ఉపాయమయిన పాలు రుచిఅయి భోగ్యమైనవిగ ఎట్లుండునో అట్లే సర్వేశ్వరుడే సాధనము అయిననాడు సాధ్యము అయిన అతనిని అనుభవించుటకు ఆతడే ఉపాయమని స్వీకరించుట అట్టిదే.

పొందవలసిన ఆనందము ఉపాయముగ ఉన్నప్పుడే కలిగినది. ఉపాయము ఆచరించునప్పుడే ఫలము తనకు సిద్ధించినది. జ్ఞానము భక్తి మున్నగు సాధ్యోపాయములు నిష్పన్నమయిన తరువాత కొంతకాలమునకు భగవదనుగ్రహముచే ఆనందము ఫలించును. ఆతడే ఉపాయమని స్వీకరించు వారికి తాము పొందగోరిన భగవానుడే ఉపాయము అయినచో భగవదనుభవము వెంటనే లభించును. ఇది సిద్ధిసాధనమునకు ఉన్న అతిశయము. ఈ రెండు ఉన్నవాడు ఇతర ఉపాయములయందు ప్రవర్తించుట కూడ ప్రశంసింపదగినదే. సాధ్య ప్రావణ్యము, విలంబాసహనము అనునవి రెండే సిద్ధసాధనమును స్వీకరించుటకు కారణములు. అవే మడలెత్తుట, అన్యదేవతార్చనము చేయుట మొదలగు సాధనములను ఆచరింపజేసినవి కనుక ఇవి వేగముగ భగవత్కైంకర్యము లభించుటకు ఉపకరించునవే గాని ప్రతిబంధకములు కావు.

# సందేహాలు - సమాధానాలు

శ్రీ యమ్. కిష్టయ్య, మొగిలిగిద్ద.

ప్ర. : అంగదుడు రావణుని కుమారుడని కొందరు వాదిస్తున్నారు. సరియా?

జ. : అంగదుడు వాలికి తారకు పుట్టిన పిల్లవాడు. వాల్మీకిరామాయణం ప్రకారము ఇంతే.

ప్ర. : భక్తిమార్గంలోకి రమ్మంటే నిలకడగా ఎవరూ రావటంలేదు. ఎలా?

జ. : నిజమే. భక్తి అంటే నిస్స్వార్థమైన ప్రేమకదా! ఈ రోజుల్లో తల్లిని పిల్లలు ప్రేమించడంగూడ వ్యాపారధోరణిలోనే సాగుతోంది. శారీరక ప్రేమలే ఇంత దారుణంగా ఉంటే ఇక కన్పించని, కనిపించే ఆలయాల్లోగూడ కదలక మెదలకుండా ఉండే భగవంతుణ్ణి ప్రేమించడం ఇంకెంత కష్టమోగద! ఏవైనా వెంటవెంటనే కోరికలు తీరుతూ ఉంటేనే భక్తి కొనసాగుతుంది. భక్తికోసమే భక్తి వర్ధిల్లాలనే భావన చాల కష్టం. మీలో అది ఉంది. కనుక మీరు, అందరినీ మీలా మంచిగా చూడాలనే కాంక్షిస్తారు. మీలా మిగిలినవారు గూడ సత్ప్రేరణపొంది మరో కొందరికి కల్గించగలిగేట్టు తయారగుగాక! మంచిమెల్లగా ప్రాకుగాక! కానీ నిలకడగా ఉండుగాక! విసుగు చెందకుండా మనం ముందుకు కదలుదాం! ఫలితం వాడిఇష్టం.

శ్రీ కె. యన్. పార్థసారథి రుక్మిణీ, మద్రాసు.

ప్ర. : భగవంతుని షడ్గుణాలలోనే మిగిలిన గుణాలన్ని చేరతాయని తెలిసింది. స్వామిత్వ, సౌలభ్య, సౌశీల్య వాత్సల్యాలెందులో చేరతాయి.

జ. : వాత్సల్యం జ్ఞానములో చేరుతుంది. మిగిలిన మూడు గుణాలు ఐశ్వర్యంలో చేరతాయి.

ప్ర. : భగవంతునికి నైవేద్యం పెట్టేటపుడు 'యాప్రీతిర్విదురార్పితే మురరిపో! కుంత్యర్పితే యాదృశీ' అని కుంతి, శ్రీ కృష్ణునికి భోజనం పెట్టినట్టుంది. ఎక్కడ?

జ. : శ్రీమద్భాగవతంలో, ప్రభాసతీర్థంలో ఉన్నపుడు కుంతి శ్రీకృష్ణునికి ప్రసాదాలను తిన్పించింది.

ప్ర : సమాశ్రితులు ఉదయంపూట చరమశ్లోకం చదువుకొనేటపుడు "9వ అధ్యాయంలో ఉండే **నమే భక్తః ప్రణశ్యతి**" అనేదిగూడ చదువుకోవచ్చా?





జ. : ఏ శ్లోకాలు చదువుతున్నారనేది ప్రధానం కాదు. ఏ అర్థాన్ని భావిస్తున్నారనేదే ముఖ్యం. ఆ భావన కలుగడానికి ఏమేమి ఉన్నాయో అన్నీ చదువుకోవచ్చు. అందుకే అర్థముగూడ తెలుసుకొని అనుసంధించు కొమ్మని పెద్దలు చెప్పారు. 'అహం మోక్షయిష్యామి' అనే పదంలోనే పై 9వ అధ్యాయశ్లోక 'న ప్రణశ్యతి' అనేది పూర్తిగ ఇమిడి ఉంది. ఇది తెలిస్తే ఇక వేరే ఏమి కావాలి?

ప్ర. : పూజలో ఆయనకే చెందిన తులసిని, ఆయననే పాడి పుష్పార్పణం చేయాలన్న ఆండాళ్‌ని, తాను తిని శ్రీరామునికి పెట్టిన శబరిని తలచి ఆమెకు పెట్టి ఆమెద్వారా దేవునికి పెట్టిస్తున్నట్టు భావిస్తే మంచిదా?

జ. : చాలబావుంది. అయితే శ్రీరామాయణంలో పండ్లను శబరి పెట్టిందో లేదో స్పష్టంగా ఉట్టకించలేదు. తులసీదాస్‌వల్ల వ్యవహారంలోకి వచ్చింది అంతే. వాళ్ళు పెడుతున్నట్లు అవసరంలేదుకానీ, వాళ్ళ ప్రీతి మనలో కల్గి, మనమే పెడుతున్నట్లుంటే స్వామికి అదీ ఆనందం. మన మెప్పుడు బాగుపడి ప్రేమ పూర్ణులమవుతామో అని కదా ఆయన ఎదురు చూసేది! అలా మనమూ అవుతున్నామని పైవాళ్ళని స్మరించి, మన ఆచార్యుల ద్వారా సమర్పించడం బాగుంటుంది.

శ్రీ కె. సురేష్ కుమార్, వరంగల్.

ప్ర : ప్రతిఫలమాసించక, నిరాకారంగ తనను పూజించమని గీతలో చెప్పాడు భగవంతుడు. మొక్కుబడులిస్తామని దేముని లంచగొండిగ మార్చడం సబబా? వీరి మ్రొక్కుబడులు తీరుతున్నాయా? దేవుడు పక్షపాతియా?

జ. : 1)దేవునికి పక్షపాతమేమీ ఉండదు. మ్రొక్కుబడులు కోరిన వారికి తీరుతూనే ఉంటాయి కనుకనే మొక్కేవారు పెరుగుతున్నారు. కోరినవారికి తప్పక యిస్తాడు, ఆ యిచ్చేది, కోరిన దానికి తగినంతే యిస్తాడు. ఏమీ కోరకపోతే అన్నీయిచ్చి, తననీ కూడ ఇచ్చివేసుకుంటాడు. ఈ విషయం మీద నమ్మకం చాలమందికి కలగదు. అందుకే నిజమైన భక్తుడు ఆయనతో బేరం చేయడు.

2) ప్రతిఫలమాశించవద్దన్నాడు కానీ తనను నిరాకారంగ పూజించమని ఎక్కడా చెప్పలేదు భగవద్గీతలో. మనతోపాటు శరీరంలో పనులన్ని జరుపడానికి మరోనలుగురున్నారు కారణంగా, అందరివల్ల ఒక పని జరిగేటపుడు నేనే చేసాననడం, నా ఒక్కడిదే ఫలమనడం దొంగతనంగద! అందుకే వద్దన్నాడు.

ప్ర : విజ్ఞాన శాస్త్రం ద్వారా గ్రహాంతరయానం చేస్తున్నారు. పురాణాల్లో గ్రహాలు, భూమి దేవతలుగా చెప్తారు. వారిని పూజిస్తారు. ఏది సరి?

జ. : గ్రహాన్తరయానం చేస్తున్నారు నిజమే. కానీ అవేమిటో తెలియవుగదా! మనం భూమిమీదే ఉన్నా భూమి మొక్కలని ఎలా పుట్టిస్తోందో మనకి తెలీదుకదా! ఆ లోపలి శక్తివిశేషాన్ని అధిష్ఠాన దేవత అంటారు. అది కన్పడదు కానీ ఎన్నెన్నో పనులు చేస్తోంది. అగ్ని, వాయు, వరుణ ఇవన్నీఅలాంటివే. పురాణాల్లో ఆ లోపలి శక్తివిశేషాన్ని ఆరాధించమంటారు. వైజ్ఞానికులు పై ద్రవ్యాన్ని మాత్రం చూస్తారు. గింజపైకి కన్పించినా, అందులోని జీవశక్తి మనకి కన్పడదు గదా! అదే దేవత అంటే. విజ్ఞాననేత్రానికి అది కన్పడదు సుమా! శాస్త్రము మీది విశ్వాసముతో కలిగే జ్ఞాననేత్రానికే అది తెలుస్తుంది.

శ్రీ యమ్. జనార్దన్, భువనగిరి.

ప్ర. : చైతన్యం నుండి పదార్థం వచ్చిందని ఆస్తికులు, పదార్థంలోంచి చైతన్యం ఆవిర్భవించిందని నాస్తికులూ అంటున్నారు. ఏది సత్యం?

జ. : పదార్థమూ, చైతన్యమూ రెండు వేరువేరు ద్రవ్యాలు. పదార్థమనేది పంచభూతాత్మకంగా ఉండే ప్రకృతిని గదా! ప్రకృతి, చైతన్యం కల శక్తివిశేషమైన జీవులూ, వారిని శాసించే పరమాత్మ అనే మూడు ఎప్పుడూ కలిసే ఉంటాయి. ఒక్కొక్కసారి ఆ చైతన్యం నిద్రాణమై ఉంటుంది. అపుడు పదార్థమూ నిలకడగా ఉంటుంది. ఆ చైతన్యం స్పందించితే ప్రకృతి పదార్థాలలో కదలిక ఏర్పడుతుంది. ఆవిర్భావం, పెరుగుదల గోచరిస్తాయి. గింజలో చైతన్యం ఉంది. నిద్రాణదశలో ఉంది. అపుడు గింజ కదలదు. అలానే ఉంటుంది. చైతన్యం కల ఒకడు దానిని నేలలో నాటడం వంటివి చేసి, తడపడం మొదలైన చేతన కార్యాలవల్ల, దానిలో దాగి ఉన్న చేతనశక్తి కదలడం ప్రారంభమై క్రమంగా గింజనూ ఉబ్బిస్తుంది. మొలక ఆవిర్భవిస్తుంది. అంటే చైతన్యమే పదార్థావిర్భావానికి కారణం అనడం సబబు. దానివల్లనే వైజ్ఞానికులు దర్శించే పదార్థంలోని చైతన్య శక్తి క్రమంగా పైకి వస్తుంది. ఏదో ఒక బాహ్య చైతన్యపు సహకారం లేనిదే పదార్థం తనలోని చైతన్య శక్తిని బయటకు తేలేదు.

ప్ర. : సభ్యత, సంస్కారంకల కుంటుంబంలోంచి వచ్చిన ఒక స్త్రీని భర్త, ప్రతిక్షణమూ చెడు పలుకుతూ, చెడు చూపిస్తూ హింసిస్తే ఏంచేయాలి?

జ. : హింసలేనంతవరకూ, ఆ పలికేవాటిని వినకుంటే చాలు, పక్షులరుస్తూంటే పట్టించుకోం కదా! చూపేవాటిని చూచినా మనస్సుకి తాకకుండా ఉంచుకుంటే ఫర్వాలేదు. ఇక హింసించడం జరిగితే ఆత్మరక్షణ తప్పనిసరి. అవసరమైతే ఆతణ్ణి తనహద్దుదాటకుండా ఉండేట్టు శిక్షింపచేయడం మంచిపని. తగినపని.

14/Bn/BnJan02.p65

# శ్రీరామ మంగళాశాసనము

**- శ్రీ ఉ.వే శ్రీమాన్ ఈ.వే. శింగరాచార్యస్వామి, తిరుపతి**

(పుంసాంమోహనరూపాయ) ఈ మంగళాశాసనస్తోత్రమునకే ఈ విశేషణము ప్రాణమువంటిది. భగవన్మంగళాశాసనమును భక్తుడు చేయుటకు ఆ భగవానుని సౌందర్యసౌకుమార్యములకు ఎట్టి ఆపద కల్గునో అను ప్రేమాంధతకారణమని ఆచార్యుల సిద్ధాంతము. అట్టి అస్థానే భయశంకను కల్గించు స్వామి అపూర్వసౌందర్య సౌకుమార్యము లీవిశేషణమువలన తెలుపబడినవి. లోకమున స్త్రీ సౌందర్యమును చూచి పురుషుడు, పురుషుని సౌందర్యమును చూచిన స్త్రీయు సమ్మోహితులగుట సహజము. అనుభవములోనున్న విషయము. కాని స్త్రీ సౌందర్యమును దర్శించిన వేరొక స్త్రీ, పురుషుని అందముపట్ల వేరొక పురుషుడును ఆకర్షింపబడుట విశేషము. ద్రౌపది అందమును చూచిన స్త్రీలందరు

**"పాంచాల్యాః పద్మపత్రాక్ష్యాః స్నాయంత్యాః జఘనం ఘనమ్।**
**యాఃస్త్రియా దృష్టవత్య స్తాః పుంభావం మనసా యయుః॥"**

అనునట్లు పురుషులు పొందు భావమును పొందిరట. కేవలము లౌకికమైన అందమునకే అట్టి శక్తియున్నచో, ఇక భగవానుని దివ్యరూపమును చూచినవారు విస్మితులగుట, మోహమును పొందుటలో ఆశ్చర్యమేమి? మన్మథుని దగ్ధముచేసిన హరుడే మోహినీ అవతారమెత్తిన భగవానుని అందమునకు వశుడయ్యెను కదా!

**'రూపసంహననం లక్ష్మీం సౌకుమార్యం సువేషతామ్।**
**దదృశుః విస్మితాకారాః రామస్య వనవాసినః॥'**

అనుచు వాల్మీకి భగవానుడు, శ్రీరాముని లోకోత్తరరూపమును దర్శించిన మునులు సైతము విస్మయము పొందిరనెను.

ఈ సందర్భమున తిరువాయ్ మొழி ఈడు వ్యాఖ్యలో (1-4) దశక ప్రవేశమున నమ్బిళ్ళై

**'ఎతిర్‌తలైయిల్ పుంస్త్వత్తై యழிత్తుప్పెణ్ణుడై ఉడుత్తుమ్బుడియితే అవనుడైయ పురుషోత్తమత్వ మిరుప్పదు"** అని వివరించుట, దీనిపై అరుంబదకారులు - **"ద్రౌపదియి నుడైయ ప్రాకృత శరీర మవస్థాంతరత్తై యుణ్డాక్కినాల్- పుంసాం దృష్టి చిత్తాపహారియా యప్రాకృతమానడివழிకు పణ్ణ శొల్లవేణ్డావితే"** అని వివరణమునిచ్చుట ఇచట గుర్తింపతగినది. భగవానుని ఇట్టి సౌందర్యమునకు వశులైన పరమభక్త శిఖామణులగు ఆళ్వార్లు, అన్నమయ్య, క్షేత్రయ్య వంటి వాగ్గేయకారులును స్త్రీ భావమును పొంది, తమ భావనాప్రకర్షను తెలుపుచు రచించిన వాఙ్మయము సుప్రసిద్ధముకదా! శమదమాన్వితులైన దండకారణ్యములోని మహర్షులు భగవానుని సౌందర్య, లావణ్యములకు జితులై, మరుజన్మలో భగవానుడు శ్రీకృష్ణుడుగా అవతరించినపుడు రేపల్లెలో గోపికలుగా జన్మించిరను ప్రసిద్ధియు కలదుకదా!





కావున శ్రీరామాయణములో శ్రీరామచంద్రుని రూపవైభవమును స్తుతించు **'రూపౌదార్యగుణైః పుంసాం దృష్టి చిత్తాపహారిణమ్'** అను సూక్తిని అనుసరించుచు ప్రస్తుత విశేషణము ప్రయోగింపబడినదనదగును. ఈ సూక్తిని నమ్బిళ్లై అను ఆచార్యులు ఈడు వ్యాఖ్యానమున (5-3-6) వివరించుచు **'ప్రకృతి పురుషర్ కళ్ ఎన్దాప్పోలే యాయ్, అచిద్విలక్షణ రెల్లారైయుమ్ ఈడు పడువత్తదె న్నవుమామ్"** అని పల్కుట, ఈ సూక్తిని అనువదించుచు గోవింద రాజీయకారులు, **"యద్వా, పుంశబ్దేన స్త్రీ పుంససాధారణమాత్మ మాత్ర ముచ్యతే, 'పుమానేకో వ్యవస్థిత' ఇతి శ్రీవిష్ణుపురాణే ప్రయోగాత్, తేన సురనరతిర్యగాది భేదభిన్నానాం స్త్రీపుంనపుంసక భేద భిన్నానాం సర్వేషాం దృష్టిచిత్తాపహారక ఉక్తః వక్ష్యతి చ రామవిరహే స్థావరజంగమ వస్తు మాత్రం పరిమ్లానమితి"** అని వ్యాఖ్యానించుటయు ఇచట స్మరింపతగినవి కావున శ్రీరామచంద్రుని సౌందర్యమును చూచినవారు స్త్రీలైనను, పురుషులైనను సమ్మోహితులయ్యిరి. కావుననే శ్రీరాముని విరహమును సహింపలేని అయోధ్యా నగర ప్రాంతములోని జనులేకాక, స్థావర జంగమాదులును మ్లానమును (ఒడలిపోవుట) పొందెననుచు వాల్మీకి తెలిపెను. **'ఉపతప్తోదకా నద్యః పల్వలాని సరాంసిచ'**, అని **'అపి వృక్షాః పరిమ్లానాః సపుష్పాంకురకోరకాః'** అను మొదలగు సూక్తులిచట అనుసంధేయములు. ప్రకృత విశేషణమునను ఈ వివరణమును అన్వయింప నగును.

పైన ఉట్టంకింపబడిన శ్రీరామాయణ ప్రమాణమును నమ్బిళ్లై వ్యాఖ్యా నించుచు **'అబలైకళ్ పడుమత్తై వన్నెఇజ్జరైయుమ్ పడుత్తవత్తా యత్తు''** అని పల్కిరి కావున ప్రమాణములోని 'పుం' శబ్దమునకు కఠినమనస్కులని అర్థము. ఎట్టి కఠిన చిత్తులైనను భగవానుని సౌందర్యము వివశులను చేయునని తాత్పర్యము. శ్రీరాముడు యుద్ధమున విల్లుపట్టి నప్పటి సొగసును దర్శించిన రావణుడు సైతము 'ఛీ! రాముని ముందు నేను విల్లుపట్టి నిల్చుట ఎంత తగనిపని! అనుచు తననుకాని, చేతిలోని విల్లును దూరముగా పారవేసెనని **'శత్రోఃప్రఖ్యాత వీర్యస్య రంజనీయస్య విక్రమైః'** అను శ్రీరామాయణ సూక్తిని పెరియవాచ్చాన్ పిళ్లై పెరియ తిరుమొழி వ్యాఖ్యలో ఉట్టంకించి వివరించుట ఇచట అనుసంధేయము. ఇట్లు ఎంతటి కఠినాత్ములనైనను వశీకరింపచేసికొనగల్గినది శ్రీరామచంద్రుని రూపము.

## పరమపదవార్త



**శ్రీమతి మరింగంటి వెంకట రంగనాయకమ్మగారు**

తేది : 8-11-2001, గురువారము రాత్రి, 7 గం॥లకు ఆచార్య తిరువడి అలంకరించినారు. వీరు అనేక ఆధ్యాత్మిక కార్యక్రమములలో కైంకర్య భాగస్వామ్యాన్ని స్వీకరించారు.

వీరికి శ్రీమన్నారాయణుని శ్రీపాద కైంకర్యం నిత్యం కలగాలని ప్రార్థిస్తున్నాము.

-శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘము

# ఇతిహాసబోధ - VI

కర్మ సిద్ధాంతాన్ని విశ్వసించే జాతి మనది! మనం చేసే కర్మలకు తగ్గఫలాన్ని మనమే అనుభవిస్తాం. అది పుణ్యమైనా, పాపమైనా సరే- మన కర్మఫలమే. మనం చేసే మంచి పనుల వల్ల మంచి జన్మ లభిస్తుందని, ఆరోగ్యం, ఐశ్వర్యం, ఆనందం, ఇవన్నీ వాటి ఫలితాలేనని మనం నమ్ముతూంటాం. అందుకే పెద్దలు వివేకంతో మనం సదా సత్కర్మల నాచరించి సత్ఫలాలను పొందాలని బోధిస్తూంటారు. మన ప్రగతికీ, పతనానికీ కూడా మన కర్మలే కారణమని తెలిపేందుకు మహాభారతంలో **"నహుషుని పాత్ర"** చక్కని ఉదాహరణంగా నిలుస్తుంది.

చంద్ర వంశజుడైన పురూరవ చక్రవర్తికి, ఊర్వశికి పుట్టిన ఆయువు అనేవాని కుమారుడు నహుషుడు. ఈ నహూష చక్రవర్తియొక్క పుత్రుడే చరిత్ర ప్రసిద్ధిగాంచిన యయాతి చక్రవర్తి. నహుషుడు యావత్తు భూమండలాన్ని తన శౌర్యప్రతాపాలతో జయించి ప్రజానురంజకంగా పరిపాలించాడు. నూరు అశ్వమేధ యాగాలు నిర్విఘ్నంగా నిర్వహించాడు. సకల వేదాలను అభ్యసించిన జ్ఞాని కావడంచేత కొంచెమైనా రాజసికాహంకారం చూపకుండా సాత్విక నిష్ఠతో రాజ్యపాలన చేసాడు.

నహుషుడు ఎంతో శ్రద్ధతో పుష్పాలతో, ధూప దీప నైవేద్యాలతో దేవతలను, పితృ కోటిని, రాక్షస యక్ష భూతాది సకల జీవరాసులను వాటి అర్హతలకు అనుగుణంగా సంతృప్తి పరిచేవాడు. చక్రవర్తినన్న గర్వం లేకుండా సేవకునిలా ప్రజల అవసరాలను తీర్చేవాడు. అలా రాజ్యాన్ని పరిపాలిస్తున్న నహుషుడి దగ్గరకు ఓ రోజు చేపలు పట్టేవారు ఓ వింత సమస్యను తీసుకొని వచ్చారు.

వారు గంగా యమునా సంగమ ప్రాంతంలో వలలు వేసి చేపలు పడుతుంటే, చేపలతోపాటు నీటిలో తపస్సమాధిలో ఉన్న ఓ ఋషికూడా వలలో పడ్డాడు. 12 ఏళ్ళు ఆ జలాలలో సమాధి స్థితిలో చేపలతోపాటు సహజీవనం చేసిన ఆ మహానుభావుని పేరు చ్యవనుడు. భార్గవ వంశానికి చెందిన మహాతపశ్శాలి. తన తపోశ్శక్తిచేత ఇంద్రునిచే నిరాకరించబడ్డ అశ్వనీ దేవతలను సోమపానార్హతను కలిగించిన మహాతేజస్వి అతడు. చ్యవనుని వలలో బంధించినందుకు జాలరులు ఎంతో బాధపడ్డారు. తాము తప్పు చేసామని గ్రహించి క్షమించమని ఆయన పాదాలు పట్టుకొని ప్రార్థించారు. చ్యవనమహర్షి వారిపై కోపం చూపకుండా - 'దీర్ఘకాలం చేపలతో సహజీవనం గడిపాను కాబట్టివాటిని వదలి బ్రతుకబోనని, తనను కూడా ఆ చేపలతో పాటు తగిన వెలకు అమ్ముకోమని' ఆదేశించారు.

ఋషి ఆజ్ఞను అమలుపరచడమెట్లాగో తెలియక జాలరులు ఆ సమస్యను నహుషుని దృష్టికి తీసుకొని వచ్చారు. నహుషుడు విషయం తెలిసిన వెంటనే మంత్రి పురోహితాది పరివార సహితంగా చ్యవనమహర్షి వద్దకు వచ్చి సాష్టాంగ నమస్కారాలు చేసాడు.

16/Bn/BnJan02.p65



మత్స్యకారులు చేసిన తప్పిదాన్ని మన్నించి కాపాడవలసిందిగా వేడుకొన్నాడు. చ్యవనుడు నహుషునితో జాలరులకు చెప్పినమాటే చెప్పాడు. 'చేపలతో పాటు తగిన వెలను చెల్లించి తనను కొనుక్కోమని' చ్యవనుడు చెప్పిన మాటలను పురస్కరించుకొని నహుషుడు మత్స్యకారులకు వేయి మాడలు ఇవ్వజూసాడు. చ్యవనుడు 'ఓ రాజా! నా వెల వేయి మాడలా? సరియైన వెల నెఱిగి ఇవ్వవయ్యా!' అన్నాడు.

చక్రవర్తి లక్షమాడలన్నాడు. చ్యవనమహర్షి సంతృప్తి చెందలేదు. కోటి మాడలన్నాడు రాజు. ఋషికి అంగీకారం కాకపోవడంతో సగం రాజ్యమివ్వడానికి సిద్ధపడ్డాడు నహుషుడు. అదీ సరియైన వెల కాదన్నాడు ముని. మొత్తం రాజ్యాన్ని మునికోసం సమర్పించడానికి సిద్ధపడ్డాడు నహుషుడు. అప్పటికీ చ్యవనమహర్షికి వెల ఆమోదయోగ్యం కాకుండా పోయింది. నహుషుడికి ఏం చేయాలో తోచలేదు. చివరకు చ్యవన మహర్షి నహుషునితో 'రాజా! వెళ్ళి నీ మంత్రులతో సంప్రదించి తగిన మూల్యాన్ని నిర్ణయించు' అని ఆదేశించాడు.

సమస్త సంపదలతో కూడిన రాజ్యం కూడా చ్యవనమహర్షికి సరి తూగ గల మూల్యం కాకపోవడంతో ఏం చేయాలా అని బాధపడుతున్న నహుషుని వద్దకు గవిజాతుడనే ముని వచ్చి పరిష్కారం ఉపదేశించాడు. 'బ్రాహ్మణుని, గోవును- బ్రహ్మ, సమాన విలువ కలిగినవిగా సృష్టించాడు. బ్రాహ్మణుడు అఖిల మంత్రాలకు అధిష్టానమైతే గోవు హవిస్సుకు మూలం. కనుక చ్యవనునికి సాటి రాగలది గోవు తప్ప మరేదీలేదు. కనుక అతనికి ఆవు నిమ్మ'నమని మార్గం చెప్పాడు గవిజాతముని.

నహుషుడు చ్యవనమహర్షిని ఆశ్రయించి, 'మహాత్మా! తమ దేహానికి వెల కట్టగల శక్తి మాకెక్కడిది? నన్ను కనికరించి మీకు తగిన మూల్యంగా ఈ ఆవును అంగీకరించండి' అని ప్రార్థించాడు. చ్యవనమహర్షి నహుషుని భక్తిశ్రద్ధలకు, వినయ విధేయతలకు ఎంతో సంతోషించాడు. 'రాజా! ఆవు అగ్నిమయం. అమృత స్వరూపం. స్వర్గానికి సోపానం. దేవతలకైనా పూజ్యనీయమైనది. హోమ విధాన సంపద్వాహినియైన గోవు నాకు తగిన వెల'యని అంగీకరించి తన తపశ్శక్తితో తనతో సహవాసం చేసిన చేపలను, తనను పట్టిన మత్స్యకారులను స శరీరంగా స్వర్గానికి పంపాడు.

చ్యవన, గవిజాతు లిరువురూ నహుషుని వదాన్యతను ప్రశంసించి 'నీకు రెండు వరములిచ్చెదము. కోరుకోమని' అడిగారు. 'మీ ఆనందమే నాకు మహాభాగ్యం. నాకేల వరాలన్న' నహుషుని వినమ్రతకు ముగ్ధులైన ఋషులు నహుషునికి ధర్మ పరత్వము, ఇంద్రవైభవము కలుగునట్లుగా వరాలను అనుగ్రహించి అదృశ్యులయ్యారు.

నియమనిష్ఠలతో నహుషుడు కావించిన కర్మయోగం అన్ని వర్గాల ప్రజల, ఋషుల, దేవతల మెప్పుపొందింది. అదే సమయంలో దేవేంద్రుడు వృత్రాసురుడిని వధించి బ్రహ్మహత్యా పాతకానికి గురై పదవీ భ్రష్టుడయ్యాడు. రాజు లేక దేవలోకం అరాచకం పాలైంది. దేవలోకాన్ని పాలించగల యోగ్యత ఒక్క నహుషుడికే ఉందని తలచిన మునులు, దేవతలు నహుషుడిని ఇంద్ర పదవిని చేపట్టవలసిందిగా కోరారు.

అందుకు తాను తగిన వాడను కానని వినయంతో నహుషుడు త్రోసిపుచ్చాడు. అయినా మునులు, దేవతలు నహుషుడిని నిర్బంధించి తమ తమ శక్తుల ప్రభావాన్ని సంతోషంతో నహుషుడికి పంచి సాదరంగా అతడిని దేవలోక ప్రభువును కావించారు.

దేవేంద్రుడైన తర్వాతకూడా నహుషుడు తన పూజాకార్యక్రమాలను యథాప్రకారం నియమ నిష్ఠలతో కొనసాగించాడు. గరుడ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, సిద్ధ, విద్యాధరాది సకల దేవజాతులు తమ తేజో విశేషాదులలో నహుషుడికి భాగమిచ్చాయి. దానితో అమిత ప్రభావ పూరితుడై నహుషుడు ఇంద్రపదవిని మహా వైభవంగా నిర్వహించసాగాడు.

నహుషుడు భూమిమీద ఉన్నంత కాలం తన సమస్త జీవితాన్ని ఎటువంటి కోరిక లేకుండా సమర్పణ భావంతో జీవించాడు. సేవకుడికి ఉండాల్సిన లక్షణం సమర్పణే కదా. ఉత్తమ సేవకుడు ఎటువంటి షరతులు లేకుండా సర్వస్వాన్ని సమర్పించడానికి సిద్ధపడతాడు. చ్యవన మహర్షికోసం తన సర్వస్వాన్ని సమర్పించడానికి సిద్ధపడ్డ నహుషుని యోగ్యత కారణంగా అతని రాజ్యంలోని చేపలు, చేపలుపట్టేవారికి కూడా చ్యవన మహర్షిద్వారా స్వర్గప్రాప్తి లభించింది. నహుషుడికి కోరకుండానే 'దేవేంద్ర' పదవి లభించింది.

నహుషుడు తనకు లభించిన మానవజన్మను సద్వినియోగ పరచుకొన్నాడు. సకల భూమండలానికి అతడు చక్రవర్తి కాగలిగాడు. కలిగిన జ్ఞానం వలన ధర్మబద్ధంగా పరిపాలిస్తూ సదా భగవదారాధన, భగవద్భక్తుల సంసేవనం వంటి ఉత్తమ కార్యాలు నిర్వహించారు. సాధకునిగా తన సమయాన్ని సక్రమంగా ఉపయోగించుకోవడం వలన నహుషుని వికాసం నిర్నిరోధకంగా కొనసాగింది. అతనికి లభించిన ఉత్తమజ్ఞానం అతనిని ఉత్తమ సాధకునిగా మార్చింది. చక్రవర్తిత్వం వల్ల అధికారము, సంపద లభించినప్పటికీ అతడు అహంకరించలేదు. చేయదగిన సత్కర్మలన్నీ చేసాడు. ఆశ్రయించదగిన మహానుభావులను ఆశ్రయించాడు. వినయవిధేయతలతో వారిని సేవించి వారి మెప్పు పొందాడు. మునులను ప్రసన్నం చేసుకొని సశరీరంగా స్వర్గానికి వెళ్ళి దానికి అధిపతి కాగలిగాడు.

ఇంతవరకూ నహుషుని 'వికాస' సాధన సక్రమంగానే నడిచింది. ఇంద్రపదవిని చేపట్టాక నహుషుని సాధన మందగించింది. ఇంద్రపదవి శాశ్వతానందాన్ని ఇవ్వలేదని, పరమపదము వరకు తన సాధన కొనసాగాలన్న వాస్తవాన్ని అతడు విస్మరించాడు. వేదవేదాంగాలను అధ్యయనం చేసిన ఆ మహానుభావుడు **'బ్రహ్మ వర్మమమాంతరం'** అంటూ ఋగ్వేదం బోధించిన సాధన రహస్యాలను మరచిపోయినాడు. సాధకుడు 'సదా బ్రహ్మనిష్ఠ' అనే కవచాన్ని ధరించాలని అంటుంది 'వేదం'. 'సదా భగవద్భావన' అనే కవచాన్ని ధరించినంతకాలం అంతః శత్రువులు సాధకుని ఏమీ చేయలేవు. అవి సమయం కోసం పొంచి ఉంటాయి. అవకాశం దొరికినప్పుడు విజృభించి ఆదమరచిన సాధకుని అధోగతిపాలు చేస్తాయి.

రంభాది దేవకాంతలతో నిరంతరం సుఖభోగాలను అనుభవిస్తున్న నహుషుడు తాను అంతవాడు కావడానికి కారణమైన సాధనామార్గాన్ని విస్మరించాడు. పర్యవసానంగా తనను





తాను గౌరవించుకొనే అహంకారవలయంలో బంధీ అయ్యాడు. ఇంద్రపదవిని చేపట్టడానికి తను చేసిన కర్మలే కదా కారణం అనే గర్వం అతనిని ఆక్రమించింది. 'ఉత్తమ కర్మ చేసాను కనుక, ఉత్తమ ఫలాన్ని పొందాను' అనే భావన సాధకునిలో కర్తృత్వహంకారానికి కారణమౌతుంది. కర్తృత్వహంకారము భోక్తృత్వాహంకారానికి దారితీసి బుద్ధిని విషయ లాలసతల కూపంలోకి కూల్చివేస్తుంది. పర్యవసానంగా సుఖభోగాలకోసం పంచేంద్రియాలు విజృభించి మనసును పాలించనారంభిస్తాయి.

నహుషుని విషయంలో అదే జరిగింది. తనంతవాడు మరొకడు లేడనే తలపొగరు, తన పదవి శాశ్వతమైనదనీ, తన నెవరూ ఏమీ చేయలేరనే మిడిసిపాటుతనం అతని మనస్సును పూర్తిగా కలుషితం చేసాయి.

ఓ రోజు కాకతాళీయంగా పాత ఇంద్రుడి భార్య అయిన శచీదేవిని చూసి కామ పరవశుడయ్యాడు నహుషుడు. ఆమె సౌందర్యం అతని మతిపోగొట్టింది. బ్రహ్మ హత్యా పాతకానికి గురై దేవలోకం విడిచి వెళ్ళిన భర్తకోసం పరితపిస్తున్న పతివ్రత శచీదేవి. పరకాంత అన్న భయం లేకుండా నిర్లజ్జగా ఆమెను చెఱపట్టదలిచాడు నహుషుడు.

నహుషుడి ఇంగిత మెరిగిన శచీదేవి భయంతో బృహస్పతి పంచన చేరింది. దేవగురువు ఆమెకు ఆశ్రయమిచ్చినందుకు నహుషుడికి బాధ కల్గింది. వెంటనే అతడు దేవమునులను నిర్బంధించి శచీదేవిని తనకు అప్పగించ వలసిందిగా బృహస్పతి వద్దకు రాయబారం పంపాడు. బృహస్పతి సలహా మేరకు శచీదేవి నహుషుడి వద్దకు వెళ్ళి అతని కోరిక తీర్చడానికి కొంత వ్యవధి సంపాదించింది. పాత ఇంద్రుడు అశ్వమేధ యాగం నిర్వహించి బ్రహ్మహత్యా పాతకం పోగొట్టుకొని దేవలోకం వచ్చాడు. అయినా అతడు నహుషుని తేజో విశేషాన్ని గమనించి, తన శక్తిహీనతకు సిగ్గుపడి భయంతో పారిపోయాడు.

పారిపోయిన భర్తను వెతుక్కుంటూ వెళ్ళిన శచీదేవి తనకు తరణోపాయం తెల్పమని పాత ఇంద్రుడిని ప్రార్థించింది. దానికి అతడు, 'దేవీ! నహుషుడు ధార్మికనిరతి వల్ల లభించిన తేజో విలాసాలతో నాకు దుర్నిరీక్ష్యుడయ్యాడు. అతనిని జయించే శక్తినాకు లేదు. అతనిని మాయోపాయంతోనే నాశనం చేయాలి. నీవు నహుషుడి వద్దకు వెళ్ళి అతని అహంకారాన్ని రెచ్చగొట్టు. నన్ను పొందాలనుకొంటే లోకంలో ఎవరూ ఎక్కని వాహనాన్ని నీవు ఎక్కాలి. అప్పుడు నీ ఘనత లోకానికి తెలుస్తుంది. అని చెప్పి మునులతో అతని వాహనం మోయించేటట్టు చేయి' అని బోధించాడు.

భర్త బోధించిన ఉపాయాన్ని అర్థం చేసుకొన్న శచీదేవి నహుషుడిని మునివాహనుడిగా రమ్మనమని కోరింది. అహంభావియైన నహుషుడు మోహాంధకారంలో మునిగి ఆమె కోర్కెలోని మర్మాన్ని ఎఱుగలేకపోయాడు. మునులను సేవించడం వలననే తనంత వాడయ్యాడన్న సత్యాన్ని మరచి వేయిమంది బ్రాహ్మణోత్తములు తన రథంలాగుతూంటే గర్వంతో నహుషుడు అందులో విహరించసాగాడు. బ్రహ్మరథాన్ని ఎక్కగలిగే యోగ్యత తనకే ఉందని అహంకారంతో అతడు విఱ్ఱవీగసాగాడు. అంతటితో ఆగకుండా సప్త

ఋషులను బోయిలుగా మార్చి తాను పల్లకీ ఎక్కి శచీదేవి ఇంటికి ప్రయాణమయ్యాడు.

బృహస్పతి తన దివ్య శక్తితో నహుషుడి కామాన్ని మరింతగా ప్రకోపింపచేసాడు. కామాతురుడైన నహుషుడు తనను త్వరగా తీసుకొని వెళ్ళవలసిందిగా సప్తఋషులను హింసించసాగాడు. మోసి మోసి అలసిపోయిన మునులు 'నహుష చక్రవర్తీ! నీవు వైదికుడివే కదా? గోష్ఠి వినోదాల నుండి గోసంప్రోక్షణం వరకూ చెప్పబడ్డ బ్రాహ్మణములైన మంత్రాలు నీకు సుపరిచితాలే కదా. అవి నీకు ప్రమాణములు కావా?' అని ప్రశ్నించారు.

గర్వంతో కళ్ళు మూసుకొని పోయిన నహుషుడు 'వ్యర్థ ప్రసంగాలు మాని ముందు పల్లకీ మోయండి. మీరు చెప్పేవేవీ ప్రమాణాలు కావంటూ' మునులను తృణీకరించాడు. 'అదేమిటి నహుషా! ఋషులచే ప్రశంసించబడ్డ వేద మంత్రాలను తిరస్కరిస్తున్నావేమిటి? అది దోషంకాదా?' అని నహుషుడి మాటలను ఖండించాడు అగస్త్యమహర్షి.

అగస్త్యుడు తనను తప్పుపట్టి నందుకు నహుషుడికి విపరీతమైన కోపం వచ్చింది. ఆగ్రహంతో అతడు అగస్త్యుడి తలను తన్నాడు. ధర్మభ్రష్టుత్వం వల్ల నహుషుడు తేజో విహీనుడయ్యాడు. అగస్త్యుడు, 'ఓరీ! దురాత్మా! ఇన్నాళ్ళు నీ తప్పిదాలను మన్నించాము. ఇక నీ ఆగడాలను కట్టిపెట్టు. ఇంద్రపదవి నుండి భ్రష్టుడవై భూలోకంలో సర్పానివై బ్రతుకు' అంటూ శపించాడు.

చూశారా! కామం నహుష చక్రవర్తికి ఎంత భంగపాటు కలిగించిందో! కామం తనకు కల్గించిన చేటును నహుషుడు గుర్తించాడు. శాపోపహతుడైన అతడికి తన పరిమితి గ్రహింపుకు వచ్చింది. పశ్చాత్తాపంతో అగస్త్యుడి పాదాలు పట్టుకొని ప్రార్థించాడు. మునీంద్రా! నన్ను మన్నించు. తిరుగులేని నీ శాపజ్వాల నన్ను దహించి వేస్తున్నది. నీ దయా విశేషం మాత్రమే నన్ను రక్షించగలదు. భూలోకంలో నీచ సర్పమై జీవించడానికి నేను సిద్ధమే. అయితే నాకు పూర్వ స్మృతి పోకుండా ఉండేటట్లు వరమియ్యి. అంతే కాదు, నా స్పర్శతో ఎంతటి బలవంతుడైన జీవుడైనా బలహీనుడై లొంగిపోవాలి. ఈ వరాలతోపాటు నాకు శాపవిమోచనమయ్యే మార్గాన్ని కూడా అనుగ్రహించు- అని అగస్త్యుడిని వేడుకున్నాడు.

నహుషుడి పుణ్య కర్మలను తలచి అగస్తుడు కరుణతో నహుషుడు కోరిన వరాలనిచ్చాడు. 'పెక్కేండ్లు కొండచిలువవై భూలోకంలో జీవించి, నీ వంశస్తుడైన ధర్మరాజువల్ల విగత కల్మషుడవై పుణ్యలోకం పొందుతావని' శాపవిమోచన మార్గం తెలిపాడు.

అదే విధంగా నహుషుడు కొన్ని వేల సంవత్సరాలు హిమాలయ పర్వత ప్రాంతంలో కొండచిలువగా జీవితం గడిపాడు. ఒకనాడు భీముడు వేటకై వెళ్ళి కొండచిలువ రూపంలో ఉన్న నహుషుడికి బంధీ అయ్యాడు. పదివేల ఏనుగుల బలం గల భీమసేనుడు కూడా నహుషుడి శక్తిముందు ఎందుకూ పనికిరాకుండా పోయాడు. తమ్ముడిని వెతుక్కుతూ వచ్చిన ధర్మరాజు కొండచిలువ రూపంలో ఉన్న నహుషుడిని ప్రసన్నం చేసుకొని అతడు అడిగిన ప్రశ్నలకు చక్కని సమాధానాలిచ్చాడు. ధర్మరాజుయొక్క ప్రభావంచేత నహుషుడు శాపవిముక్తుడై దివ్య రూపం పొంది బ్రహ్మలోకం చేరాడు.





మహాభారతంలో చెప్పబడ్డ ఈ నహుషుని కథ వికాసతరంగిణి కార్యకర్తలకు సదా గుర్తుండాలి. నహుషుడి చరిత్ర మనకెన్నో విలువైన గుణ పాఠాలు నేర్పుతుంది. ఉదాహరణకి 'మన మనోమాలిన్యాలే మన మాటల్లోనూ, చేతల్లోనూ వ్యక్తమౌతాయని, అవే మన పతనానికి కారణాలనీ' నహుషుడు మనకు తెలియ జేస్తున్నాడు. ఇంకా 'నహుషుని కథ' ఎన్నెన్ని గుణపాఠాలను మనకు తెల్పుతున్నదో క్లుప్తంగా మీ అభిప్రాయాలను తెల్పుతూ ఉత్తరం వ్రాయండి. మన అంతః శత్రువైన 'కామాన్ని' గురించి జగదాచార్యుడు శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో ప్రస్తావించిన శ్లోకాలను వ్రాసి సకాలంలో మాకు పంపండి. యథా ప్రకారం ఈ **'ఇతిహాస బోధ'**కు కూడా తగిన పేరును సూచించి వెంటనే పంపిస్తారుగదూ!.

# స్పందన

భక్తినివేదన, డిశంబరు - 2001లో ప్రచురించబడిన 'ఇతిహాసబోధ - V (Page No. 51 to 56)చాలాచక్కగా వ్రాయబడినది. ఇది అనుసరణీయం.

Individual Counselling ఈ పీఠికద్వారా చేయడం జరిగినది. తత్ఫలితంగా Introspection చేసికోవడమైనది. ముఖ్యమైన అంశాలను మననము చేసినట్లనిపించినది. మనస్సు, బుద్ధి, చిత్తమునకు చికిత్స చేసినట్లనిపించినది.

వికాసతరంగిణి సభ్యులకు / పాఠకులకు ఈ పాఠ్యాంశము ఎంతో ఉపయోగకరము. ఇతిహాసబోధతోపాటు, ప్రవర్తననియమావళి, గురువుయొక్క వైభవము వివరించడమైనది.

అయితే Page No. 56 లో మొదటి వరుసలో 'నిజానికి వికాసతరంగిణి ద్వారా ఈ ప్రపంచాన్నేమి బాగుచేయ బోవడంలేదు' అని వ్రాసారు. ఈ వాక్యాన్ని "Delete" చేసి ఉంటే బాగుండేది.

గురువు అనుగ్రహం దైవకృపతో కార్యం మొదలిడితే అంతా దిగ్విజయమే. చేసే పని ప్రగాఢవిశ్వాసంతో చేయాలి. అకుంఠిత దీక్ష, శ్రద్ధ, పట్టుదలతో, కార్యనిర్వహణలు చేయాలి. అనుకొన్న లక్ష్యాలను సాధించవచ్చు. గురువు / భగవంతుడు సాధన, సాధ్యము నీవే యని వ్యక్తపరుస్తారు. రూఢిచేస్తారు.

ఒక వేళకార్యనిర్వహణలో లోపాలున్న, వాటినిIdentify చేసి Replan చేసికోవచ్చు వికాసతరంగిణి ద్వారా ప్రాణికోటికి ఎంతో మేలు జరుగుతున్నది. కృష్ణం వందే జగద్గురుమ్ కార్యక్రమం ద్వారా పశువుల శిబిరాలు నిర్వహించారు, చికిత్స చేయించారు. ఎంత భూతదయ.

ఇచ్చట ఒక ఉదాహరణ యివ్వబడినది. శ్రీశ్రీశ్రీస్వామీజీవారు భక్తియనే విత్తనములను, భక్తుల హృదయక్షేత్రములో విత్తి, భక్తిమొక్కలను, మహావృక్షాలుగా అభివృద్ధిచేయడానికి, పూలు, పండ్లను విరగగాచేటట్లు, ఎన్నో వివిధరకముల భక్తి కార్యక్రమమాలను చేపట్టుతున్నారు. అజ్ఞాన నిర్మూలన చేస్తున్నారు. వికాసతరంగిణి కార్యకర్తలు భక్తిమొక్కలకు

నీరుపోసి, ఎరువువేసి, తోటమాలులై, తోటను సంరక్షిస్తున్నారు. స్వతస్సిద్ధమైన జ్ఞానాన్ని వెల్లివిరయడానికి, సమాజానికి సహకరిస్తున్నారు.

పేజి నెం. 53- చివరి పంక్తిలో 'అయితే ఒకరిపట్ల మరొకరికి అసంతృప్తి, కలసి పనిచేయడం, కలుపుకొని పనిచేయడం చేతకాని దుస్థితి- అని వ్రాసారు. ఇది అక్షరాల నిజం. ఇది Burning Problem అన్ని మతాల సత్సంగాలలో ఈ జాడ్యం నెలకొనియున్నది. How to over come అనేది సభ్యుల ద్వారా రాబట్టాలి. అయినా కొన్ని విషయములను ఇందు పొందుపరచడమైనది.

1. స్వామిజి దర్శన భాగ్యం - భక్తులు, కార్యకర్తలు, ఈ 2 వర్గాలు దర్శన భాగ్యానికై పరితపిస్తారు. ఎవ్వరైనా అడ్డుతగిలితే కోపము, క్రోధము.

ఆరాధన తర్వాత శ్రీశ్రీశ్రీ స్వామివారు తీర్థ ప్రసాదాలు అందరికి యిస్తారు కాబట్టి, దర్శన భాగ్యము సులభముగ దొరకును. కొన్ని పరిస్థితులలో ఎప్పుడైనా దర్శనముదొరకకపోతే భక్తులు విచారించకూడదు. భగవంతుడు / గురువు సర్వవ్యాపి, ఆర్తితో సేవిస్తే, తోడు, నీడగ వుండేది ఆ పరంధాముడే అని భక్తులకు అవగాహనను వికాసతరంగిణి సభ్యులు పెంచాలి.

2. సంఘప్రెసిడెంట్ సెక్రటరీలు విశాల బుద్ధితో, స్వామివారి అనుమతితో సమయం దొరకినప్పుడు కార్యకర్తలకు కూడా దర్శనం లభించేటట్టు చూడాలి. అప్పుడు వారికి ఉపశమనం, ఊరట కల్గును. శాంతి లభించును.

3. Money, Material, Men సమృద్ధిగా ఉన్నవారు భక్తి కార్యక్రమ నిర్వహణలో ఎంతో తోడ్పడుతారు. అటువంటి వారితో మిగత కార్యకర్తలు పోటీ పడకూడదు. వారి మూలాన స్వామి దర్శన భాగ్యము లభించునని, భక్తి కార్యక్రమములో పాల్గొనవచ్చునని సంతోషముగ ఉందాం. గొప్పవారుగూడా మిగతా భక్తులపై సానుభూతి వర్షము కురిపించాలి.

4. ఎంత భక్తి ఉన్నప్పటికి, ఉత్తమలక్ష్యము కలిగి ఉన్నప్పటికి కొందరు Over look కాబడతారు. వీరి పాపకర్మలు, పాశములుగ వీరిని గట్టిగ బంధించి వుంటాయి. అయినను లెక్కపెట్టకూడదు. భక్తి కార్యక్రమ నిర్వహణలో సహకరించి జయప్రదం అయ్యేలా చూపాలి.

**- అనసూయ రామానుజ దాసి, అనంతపూర్.**

**గమనిక :- పాఠకుల అభిప్రాయాలు 'స్పందన' శీర్షికలో ప్రచురించబడును.**

### ఇతిహాస భోధ-Vకు శీర్షికకు పేర్లు

1. సత్సాంగత్యం మోక్షమార్గానికి మొదటి మెట్టు - **పి. రాజేష్ కుమార్, ఆత్మకూర్**
2. మాధవసేవగ మానవ సేవకు సోపానాలు - **ఆర్. చక్రపాణి, హనుమకొండ.**
3. యతి అంటే గతి, గతి అంటే జ్ఞానము - జ్ఞానము అంటే త్రిపుట, త్రిపుట అంటే మోక్షం - **యమ్. సూర్యనారాయణ, మెళియాపుట్టి.**

వీరందరికి శ్రీ చిన్నజీయరుస్వామివారికి మంగళాశాసనాలు అందజేస్తున్నాము.

**- వికాసతరంగిణి**





## పరమపదవార్త



**శ్రీమాన్ అనిరెడ్డి రాఘవరెడ్డిగారు,** తేది : 14-12-2001 సం॥ శుక్రవారము, ఆచార్యతిరువడిని అలంకరించారు. స్వాతంత్ర్య సమరయోధులు, శ్రీకోదండ రాముని సేవా కైంకర్యాన్ని పొందిన భాగ్యజీవులు.

వీరికి శ్రీమన్నారాయణుని శ్రీపాద కైంకర్యం నిత్యం కలగాలని ప్రార్థిస్తున్నాము.

- శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘం

## పరమపదవార్త



**శ్రీమాన్ గూడ తిరుమల నరసింహాచార్యులుగారు**

తేదీ 28-11-2001 బుధవారం, మధ్యాహ్నం 3-30 ని॥లకు స్వాచార్య తిరువడి అలంకరించినారు. వీరు అనేక ఆధ్యాత్మిక కార్యక్రమము లలో కైంకర్య భాగస్వా మ్యాన్ని స్వీకరించారు.

వీరికి శ్రీమన్నారాయణుని శ్రీపాద కైంకర్యం నిత్యం కలగాలని ప్రార్థిస్తున్నాము.

-శ్రీవిశిష్టాద్వైత ప్రచారకసంఘము

జై శ్రీమన్నారాయణ!

బదరీ నారాయణ పెరుమాళ్

## బదరీనాథ్‌లో అష్టాక్షరీ క్షేత్రంలో జరుగు అన్నదానమునకు, నిర్మాణమునకు

### వివిధ పోషకులుగా కైంకర్యములు సమర్పించిన భక్తుల వివరములు

**శ్రీమతి కమలా వెంకటరామిరెడ్డి (నల్గొండ)గారిద్వారా**

**పోషకులు :** శ్రీమతి కమలా వెంకటరామిరెడ్డి, నల్గొండ.

**జీవిత సభ్యులు :** శ్రీ వై. నారాయణ, శ్రీ యమ్. మేఘారెడ్డి, శ్రీ వై. కృష్ణమూర్తి, శ్రీ సి. రఘునందన రెడ్డి, శ్రీ డా॥ వి. పాండురంగయ్య, శ్రీ ఆర్. భద్రాద్రి రాములు, శ్రీ టి. సుధాకరరావు, శ్రీ కె. సదాశివరెడ్డి, శ్రీ యమ్. గోపాలరెడ్డి, శ్రీ సి. ప్రతాపరెడ్డి, శ్రీ కె. హరీష్ రెడ్డి, శ్రీ జి. రామకృష్ణారెడ్డి, శ్రీ యమ్.రాఘవరావు, శ్రీమతి వెదిరి అనంతమ్మ, శ్రీమతి ఎ. రాగసుధారెడ్డి, శ్రీమతి పి. లక్ష్మీ సీతారాంబాయమ్మ, శ్రీ పి. సుబ్రహ్మణ్యం, శ్రీ మిట్టా అనంత రామిరెడ్డి, శ్రీమతి లక్ష్మీజయప్రకాశరెడ్డి, శ్రీ బండా నరేంద్రరెడ్డి, శ్రీమతి కె. రాధాదేవి.

**అభిమానులు :** శ్రీ డి. ప్రభాకరరెడ్డి, శ్రీ యమ్. ఇంద్రసేనారెడ్డి, శ్రీ యన్. రంగయ్య, శ్రీ కర్నాటి రాములు, శ్రీ మెట్టు రామయ్య, శ్రీ గట్టు యాదగిరి, శ్రీ వి. ధర్మాచారి, నాగార్జున ఆగ్రోసర్వీస్, శ్రీ జి. లక్ష్మీనరసింహారెడ్డి, శ్రీ యమ్. మురళీధర్ రెడ్డి, శ్రీ జల్లా భిక్షం, శ్రీ యన్. నాగభూషణం, శ్రీ జె. ఇంద్రారెడ్డి, శ్రీ యన్. లక్ష్మీనారాయణ, శ్రీ పి. రవీంద్రరెడ్డి, శ్రీమతి డి. అలిమేలు, శ్రీమతి సి. భిక్షంనాగమణి, శ్రీమతి సరళా లపాసియా, శ్రీమతి ఎ. లచ్చమ్మ, శ్రీమతి వి. సూర్యకాంతమ్మ, శ్రీమతి బి. వీణ, శ్రీ పి. నరసింహారెడ్డి, శ్రీ యస్. వాసుదేవరావు, శ్రీ జి. జగన్నాథం, శ్రీమతి లక్ష్మీ, జి. కె. హాస్పిటల్స్, శ్రీమతి జె. కౌసల్యాదేవి, శ్రీ టి. సత్యనారాయణరెడ్డి, శ్రీ కె. రాజగోపాల్, శ్రీ బి. బదరీనాథ్.

**శ్రీమతి పి. రమణమ్మ (విజయనగరం)గారిద్వారా**

**జీవితసభ్యులు : విశాఖపట్టణం :** శ్రీ పి. అప్పలరాజు, శ్రీ పి. గోపాలరాజు, శ్రీ కె. సుబ్బరాజు. శ్రీమతి యస్. సీతయమ్మ (విజయనగరం).

**అభిమానులు :** విశాఖపట్టణం : శ్రీ డి. సన్నయ్య పంతులు, శ్రీ పి. కృష్ణారావు, శ్రీమతి  కె. సావిత్రమ్మ, శ్రీమతి కె. అన్నపూర్ణ, శ్రీ ఎ. సూర్యప్రకాశరావు, శ్రీ యన్. వెంకటపతిరాజు.

**విజయనగరం :** శ్రీమతి డి. అన్నపూర్ణ, శ్రీ కె. చెంగయ్య, శ్రీమతి ఎ. రాముడమ్మ, శ్రీ పి. వి. పి. అప్పారావు, శ్రీమతి టి. అరుణా శ్రీనివాస్, శ్రీమతి జి. కొండయమ్మ, శ్రీమతి యన్. రేణుకాదేవి, శ్రీ ఎ. గురునాథరావు (రాజమండ్రి).

**అభిమానులు : శ్రీకాకుళం :** శ్రీ పి. వెంకటరామకృష్ణారావు, శ్రీ సి. కృష్ణారావు, శ్రీ బి. సూర్యనారాయణ, శ్రీ బి. నీలకంఠస్వామి, శ్రీ యు. కిషోర్ కుమార్, శ్రీ యమ్. కూర్మినాయుడు, శ్రీమతి కె. రాజేశ్వరమ్మ.
శ్రీ కె. గణపతిరావు (రేగిడి), శ్రీమతి కె. లక్ష్మీకాంతం (చీపురుపల్లి), శ్రీ బి. రామకృష్ణారావు (బమ్మిడివానివేలు).

**శ్రీమాన్ యస్. రామానుజం (విశాఖ పట్టణం) గారిద్వారా**

**జీవితసభ్యులు : విశాఖపట్టణం :** శ్రీ యమ్. నిరంజన్ రావు, శ్రీ యమ్. అజయ్ కుమార్, సిహెచ్. లక్ష్మీకాంతం, శ్రీమతి కె.వి.యస్. మూర్తి కళావతి, శ్రీ యమ్. రామశర్మ, శ్రీ పి.యస్.యన్. రాజు, శ్రీ కె. రాజబాపయ్య, శ్రీ హెచ్.వి. రమణారావు, శ్రీమతి వి. జానకి, శ్రీ వై. కరుణాకరరావు, శ్రీ కె. అప్పలరాజు గోపీకృష్ణ, శ్రీ వి. సీతారామయ్య, రమాయతిరాజులు, శ్రీమతి వరహాలమ్మ, శ్రీ యమ్.యస్. రామారావు, శ్రీ పి. రామమోహనరావు, శ్రీ యమ్. తాండవ కృష్ణారావు, శ్రీ కె. అప్పల నరసింహం, శ్రీమతి కె. వెంకటనరసమ్మ, శ్రీ వి. పెద్దసోమేశం, శ్రీమతి వి. లక్ష్మీనరసమ్మ.
శ్రీ యస్.రాజారామ్ (రాజమండ్రి), భక్తులు  బొండపల్లి. శ్రీ చుండూరు అప్పారావు (అనంతపురం).





**అభిమానులు :** విశాఖపట్టణం : శ్రీమతి బి. మంగాయమ్మ, శ్రీ బి. నాగభూషణం, శ్రీ ఎ. అప్పలనాయుడు, శ్రీ కె. సుబ్బారావు, శ్రీమతి జె.రమామణి, శ్రీ యమ్.వి. సుబ్బయ్య, శ్రీ జి.యన్. అప్పారావు, శ్రీమతి బి.హెచ్. లక్ష్మీయశోద, శ్రీ కె.కె.శాస్త్రి, శ్రీ వి.వి. రమణమూర్తి, శ్రీ బి. సాంబమూర్తిరాజు, శ్రీ ఆర్.వెంకటరమణయ్య, శ్రీమతి డి. ఆండాళ్ళమ్మ, శ్రీమతి యస్. గుణ్ణమ్మ, శ్రీమతి కె. రాజేశ్వరి, శ్రీ ప్రేమ్ సాగర్, శ్రీ జి. వెంకటస్వామి, శ్రీ యన్.వి సూరిబాబు, శ్రీ యన్. వెంకట సుబ్బయ్య, శ్రీ యమ్. రఘునాథరావు, శ్రీ పి. యస్.యన్.రాజు, శ్రీమతి బి. నాగమణి, శ్రీ కె.వి రామమూర్తి, శ్రీమతి జి. సత్యవతి, శ్రీ పి. సోమశేఖరరావు, శ్రీమతి కె. విజయలక్ష్మీ, శ్రీ యన్. శ్రీరాములు, శ్రీ పి. వెంకటనారాయణ, శ్రీమతి జె. సూర్యప్రభ, శ్రీ పి. విజయరామరాజు, శ్రీమతి యమ్. వెంకటరమణమ్మ, శ్రీ పి. చంద్రరావు, శ్రీ యస్. సత్యనారాయణ, శ్రీ పి. తిరుపతయ్య, శ్రీమతి పి. వరలక్ష్మీ, శ్రీ జి. ఎ. రాజు, శ్రీ యమ్. రంగనాయకమ్మ, శ్రీ వి. వెంకటరావు, శ్రీ యన్.త్రివిక్రమరావు, శ్రీ యమ్. నాగరాజు, శ్రీ జె. ధర్మరాజు, శ్రీ ధర్మరాజు, శ్రీ యమ్. వెంకటసత్యనారాయణ, శ్రీ జి. అయ్యరాజు, శ్రీ యన్. రామకృష్ణారావు, శ్రీ యస్. దుర్గాప్రసాద్, శ్రీ యమ్.వి.ఎ. నాయుడు, శ్రీ జె. సత్యనారాయణరాజు, శ్రీ సి. యన్. రావు, శ్రీ యన్.త్రినాథరావు, శ్రీమతి వి. పద్మావతి, శ్రీ డి.వి. కృష్ణారావు, శ్రీ హెచ్. శ్రీనివాసరావు, శ్రీ వి. సోములు, శ్రీ వి.విష్ణుమూర్తి, శ్రీ సిహెచ్. సూర్యనారాయణమూర్తి, శ్రీ యన్. సీతారామ్, శ్రీమతి కె. సీతామహలక్ష్మీ, శ్రీ కె. వెంకట రమణమూర్తి, శ్రీ జి.ఎ.రాజు, శ్రీ పి. శేషాచార్యులు, శ్రీ కె. పట్టాభిరామయ్య, శ్రీమతి బి. వసుమిత్ర, శ్రీ వి. రాధాకృష్ణమూర్తి, శ్రీ ఎ. కృష్ణయ్య, శ్రీమతి బి. భువనేశ్వరి, శ్రీ డి. గోవిందరాజన్, శ్రీ వి. నాగేశ్వరరావు, శ్రీమతి కె. సీతాయమ్మ, శ్రీమతి కె. పద్మజ, శ్రీ పి. మోహనరావు, శ్రీమతి బి. శ్యామల, శ్రీ కె.వి. రామరాజు, శ్రీ డి. విజయకుమారరావు, శ్రీ యమ్. శ్రీరామమూర్తి, శ్రీ పి.యస్.యన్.మూర్తి, శ్రీ కె. ఉమామహేశ్వరరావు, శ్రీ పి. కృష్ణార్జునరావు, శ్రీ బి.వి. రమణమూర్తి, శ్రీ వై.వి. కృష్ణారావు, శ్రీ సి. నారాయణరావు, శ్రీ పి.యస్.యన్. రాజు, శ్రీ శేఖరరావు, శ్రీ మంగు రామదాసు,  శ్రీ కె. సుబ్బారావు, శ్రీమతి పి. సూర్యప్రసన్న కుమారి, శ్రీ కె. సీతారామప్రసాద్, శ్రీమతి జె. సూర్యప్రభ, శ్రీ టి.పి. మాధవాచార్యులు, శ్రీమతి టి.పి. సింహాద్రమ్మ.

శ్రీమతి పి. లక్ష్మీనరసమ్మ (రేలంగి), శ్రీమతి సి.హెచ్. వెంకట నిర్మలాకుమారి (చిత్రాడ), శ్రీ పి. పుల్లమరాజు (ర్యాలి), శ్రీ వి. రామారావు (విజయనగరం), శ్రీమతి డి. లలితమ్మ (సింహాచలం), శ్రీ పి. దేముళ్ళు (అనకాపల్లి), శ్రీ వి. కృష్ణమూర్తి (ఆముదాల వలస), శ్రీమతి బి. రామానుజమ్మ (ఆముదాల వలస) శ్రీ ఎ. సూర్యనారాయణ (పూసవరం), శ్రీ యమ్. సుబ్బారావు (ప్రహ్లాదపురం), శ్రీ వి. యస్. ఆర్. స్వామి (రాజమండ్రి), శ్రీ కె. సూర్యనారాయణ (గోపాలపట్నం), శ్రీ ఐ.వి. కామేశ్వరరావు, శ్రీ అశోక్ కుమార్ (విజయవాడ).

**శ్రీమాన్ చీలా లక్ష్మీపతి గుప్త (కామారెడ్డి)గారి ద్వారా**

**అభిమానులు : కామారెడ్డి :** శ్రీ జి. శ్రీనివాస వెంకటాచార్యులు, శ్రీ కె. లక్ష్మీపతి గుప్త, శ్రీమతి టి. విజయలక్ష్మి శ్రీమతి టి. సంగమ్మ, శ్రీమతి జి. భారతి, శ్రీమతి చీల సరోజ, శ్రీ బంధం అంజయ్యగుప్త, శ్రీమతి ఆమేటి కౌసల్య, శ్రీమతి పాత జయలక్ష్మి, శ్రీమతి టి. సరోజని, శ్రీమతి జి. విజయలక్ష్మి, శ్రీ టి. రమేష్ స్వామి, శ్రీమతి కె. భాగ్యలక్ష్మి, శ్రీ చెన్నా రమేష్ గుప్త, శ్రీ పందిరి రాధాకిషన్ గుప్త, శ్రీ కె. గంగాధర్ గుప్తా, శ్రీ వి. ఆర్. రావు, శ్రీ బి. దశరథము గుప్త, శ్రీ యస్. నరహరి గుప్త, శ్రీ లాబిశెట్టి నారాయణ గుప్త, శ్రీ చీలా చంద్రయ్య గుప్త.

**హైదరాబాద్ :** శ్రీ పురం విశ్వనాథం, శ్రీ పందిరి రమేష్ గుప్త, శ్రీ పబ్బ రాజమౌళి, శ్రీ అయితా చంద్రయ్య గుప్త, శ్రీ కె. బాలచంద్రం, శ్రీ యమ్. వెంకటేశన్ గుప్త, శ్రీ చీలా హరనాథగుప్త, శ్రీ డి. కృష్ణయ్యగుప్త, శ్రీ గుడుముల నరసయ్య, శ్రీ బి. రాజమౌళి (తాడవాయి), శ్రీమతి పబ్బ జ్యోతి (సికింద్రాబాద్), శ్రీమతి పి. భారతీ రాజేశ్వరరావు(కరీంనగర్).

# వికాస దర్శిని నివేదన

నవంబరు, 30వ తేదీన శ్రీ చిన్నజీయరుస్వామివారి చాతుర్మాస్యదీక్ష శాత్తుముఱై జరిగింది. దీక్షకాలం మూడునెలలూ శ్రద్ధగా సేవలుచేస్తూ శ్రీవారి ఉపదేశాలను శ్రవణం చేసి తరించిన వేద, ప్రబంధ, ఆగమ విద్యార్థులందరికీ రెండు వారాలపాటు సెలవలు ప్రకటించారు. తమ గృహాలకు వెళ్ళినా, అక్కడగూడ గీతాపారాయణ చేయిస్తామని విద్యార్థులు ఉత్సాహంతో శ్రీస్వామివారికి విన్నవించుకున్నారు. KCL కార్మికవర్గం, అధికారవర్గమూ శ్రీస్వామివారికి, ఈ చాతుర్మాస్యంలో చక్కటిసేవలందించి శ్రీవారి మంగళాశాసనాలు పొందారు. శ్రీమాన్ P. వెంకటేశ్వర్లుగారు, శ్రీమాన్ వీరయ్యగారలు, శ్రీవారికి వీడ్కోలు పలుకడానికి హైదరాబాదునుండి ప్రత్యేకించి వచ్చి శ్రీవారిని సేవించుకున్నారు. ఈ మూడునెలలలో జరిపిన ఉత్సవాలకు, తమకు అనుగ్రహించిన దీపావళివంటి ఉత్సవాల కైంకర్యానికి కృతజ్ఞతలు తెలిపారు. ఇపుడు ఇక్కడి వారందరిలో కలిగిన ఈ ఆధ్యాత్మిక చైతన్యాన్ని ప్రోత్సహించడానికి శ్రీస్వామివారు వీలయినంత త్వరగా, తరచుగ యిక్కడకు వస్తుండాలని, దానివల్ల విద్యార్థులలో క్రమశిక్షణగూడ మరింత పెరగడమేకాక శ్రీస్వామివారికి కాస్త విశ్రాంతిగూడ లభిస్తుందని ప్రార్థించారు.

శ్రీమాన్ వెంకటేశ్వర్లుగారి కుటుంబసభ్యులందరి శ్రద్ధాసక్తులను కొనియాడి, అందరికీ మంగళాశాసనాలుచేసి శ్రీస్వామివారు జగ్గయ్యపేటనుండి బయలుదేరి రాత్రికి మేళ్ళచెర్వు వద్దనున్న M/S. మహాసిమ్మెంట్సు ఫ్యాక్టరీకి చేరారు. శ్రీమాన్ శ్రీకుమారి రామేశ్వరరావు దంపతులు, అధికారిబృందంతో అక్కడి శ్రీవేంకటేశుని సన్నిధిలో పూర్ణకుంభంతో స్వాగతం పలికారు. సిమ్మెంటు ఫ్యాక్టరీలో క్రొత్తగ విస్తరణ పథకం ప్రారంభించి పూర్తయ్యేదశకు చేరుకుంది. ఇది పూర్తిఅయిన పిదప సిమ్మెంటు ఉత్పత్తిచేసే భారీ కర్మాగారాల్లో ఇది అత్యాధునిక వసతిగల మొదటి కర్మాగారం కాగలదని వివరించారు.

రాత్రి గం॥ 2-30 ని॥లకు నూతనంగ అమర్చిన స్టోన్ క్రషింగ్ మిషన్‌ను శ్రీవారు తమ శ్రీహస్తములతో ప్రారంభించడం పూర్తి అయింది.

డిసెంబరు 11వ తేదీ ఉదయం ఆరాధనాదులను ముగించుకొని శ్రీమాన్ J. రామేశ్వరరావు దంపతులను, వారి పరివారాన్నంతనూ మంగళాశాసనంచేసి, శ్రీవారు గుంటూరుజిల్లా కృష్ణానదీతీరానగల అమరావతి క్షేత్రం చేరారు. అక్కడి శివాలయాన్ని సందర్శించారు. గుంటూరు వాస్తవ్యులైన శ్రీమాన్ కడివెండి వెంకటేశ్వరరావుగారు, వారి మిత్రబృందము జరిపించే సుదర్శనయాగ పూర్ణాహుతి కార్యక్రమంలో పాల్గొని ఆపై అక్కడనే ఏర్పాటుచేసిన శ్రీలక్ష్మీనారాయణ సామూహిక పూజలను జరిపించారు.

కార్తీక పూర్ణిమ సందర్భంగా కోటివత్తుల దీపోత్సవమనే పేర ఒక బృహత్కార్యక్రమాన్ని అక్కడ ఏర్పాటుచేసారు శ్రీమాన్ K. వెంకటేశ్వరరావుగారు, వారి మిత్రులున్నూ. శ్రీస్వామివారా కార్యక్రమంలో పాల్గొని, అందులో పాల్గొనిన భక్తబృందాలకు మంగళాశాసనములు చేసారు. ఆ రాత్రికే సీతానగరం, వేద విశ్వ విద్యాలయానికి చేరారు.





సుమారు మూడు నెలలు తర్వాత ఇక్కడకు విచ్చేసిన శ్రీస్వామివారికి విద్యార్థి బృందం పూర్ణకుంభ స్వాగతం సమర్పించింది. 6వ తేదీవరకూ కార్యాలయ కార్యక్రమాలను గమనిస్తూ శ్రీవారిక్కడనే వేంచేసిఉన్నారు. 7వ తేదీ ఉదయం ఆరాధనాదులు పూర్తికాగానే తిరిగి విజయయాత్రకు శ్రీవారు పరివారంతో బయలుదేరారు. శ్రీమాన్ P. వెంకటేశ్వర్లుగారు వారి కుమారులు శ్రీమాన్ P. వీరయ్యగారు నిర్వహించే, ఖమ్మంజిల్లాలోని కల్లూరువద్ద కల కాకతీయ సుగర్స్ ఇండస్ట్రీస్‌ను శ్రీస్వామివారు సందర్శించారు. అక్కడ వారు నూతనంగ నిర్మించి త్వరలో ప్రారంభించబోయే 17 MW విద్యుదుత్పత్తి కేంద్రాన్ని సందర్శించారు. ఆపై శ్రీవేంటేశ్వరస్వామివారి ఆలయం సందర్శించి భక్తులకు మంగళాశాసనం చేసారు.

శ్రీమాన్ వెంకటేశ్వర్లుగారితో కలిసి హైదరాబాద్ బయలుదేరారు. రాత్రి 12 గం॥లకు L.B. నగర్‌వద్ద, మన జెట్‌లో ఉండే శ్రీమాన్ రాము, వారిసోదరుడు శ్రీమాన్ లక్ష్మణ్‌లు నిర్మించుకొనిన నూతన గృహముకు మంగళాశాసనం చేసారు. ఆపై వాసవీకాలనీలోని అష్టలక్ష్మీదేవాలయానికి సంబంధించిన, నూతన కళ్యాణ మండపనిర్మాణానికి శంకుస్థాపన, నూతన అర్చక నిలయము ప్రారంభంచేసి రాత్రి సుమారు గం॥ 2-30 ని॥లకు BHELకి చేరారు.

గతంలో అక్కడొక శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయాన్ని మన శ్రీ పెద్దజీయరుస్వామివారు వైఖానసాగమం ప్రకారం ప్రతిష్ఠింపచేసారు. కాని అందులోని తాయారు, ఆండాళ్‌సన్నిధులు శ్రీపాంచరాత్రాగమం ప్రకారం ప్రతిష్ఠించారు. అందులో యిపుడు ఆళ్వార్ల ప్రతిష్ఠ జరుపదలచి కమిటీ సభ్యులు ఏర్పాటుచేసిన కార్యక్రమానికి శ్రీస్వామివారు విచ్చేసారు.

8వ తేదీ ఉదయం ఆలయం సందర్శించి, అనంతరం అక్కడ కొందరు భక్తులకు పంచసంస్కారములను కృపచేసారు. ఆలయ కమిటీ సభ్యులైన శ్రీమాన్ T.V.S. రామానుజాచార్యులుగారు మొదలగు కొందరి గృహములను సందర్శించారు. సాయంకాలం పఠాన్ చెర్వులో శ్రీమాన్ J. రామేశ్వరరావు దంపతుల ఆహ్వానముపై వారు నిర్మించిన 5 MW విద్యుదుత్పత్తి కేంద్రాన్ని సందర్శించి, అక్కడి వారందరికీ మంగళాశాసనం చేసారు.

రాత్రి BHEL ఆలయంలో ఆళ్వార్ల వైభవమునుగూర్చి శ్రీవారి ప్రవచనం జరిగింది.

9వ తేదీ తీర్థగోష్ఠికాగానే ఉదయం గం॥ 10-30 ని॥లకు ఆళ్వార్ల ప్రతిష్ఠా మహోత్సవం జరిగింది. ప్రతిష్ఠాకమిటీ సభ్యులందరికీ మంగళాశాసనం చేసారు. ఆలయార్చకులు శ్రీమాన్ నరసింహాచార్యులు చేసిన కృషిని ప్రశంసించారు. సాయంకాలం శ్రీమాన్ మహేష్ అనే మన వికాసతరంగిణి కార్యకర్త ఆహ్వానంపై BDL ఫ్యాక్టరీని సందర్శించి భక్తులకు మంగళాశాసనం చేసారు. శ్రీమాన్ మహేష్ గారింట్లో పెరుమాళ్ళను మంగళాశాసనం చేసారు. కూకట్‌పల్లి వద్దనున్న CBCID కాలనీలో శ్రీమాన్ రాజుగారు దంపతులు నిర్మించి ఆరాధించే శ్రీకృష్ణ మందిరాన్ని సందర్శించి వారిని మంగళాశాసనం చేసారు.

KKP హౌసింగ్ కాలనీలో కనకమహాలక్ష్మి ఆలయంలో నిర్మించిన నూతన కళ్యాణమండపాన్ని ప్రారంభించారు. శ్రీమాన్ వడ్డేపల్లి నర్సింగరావుగారు దీని ప్రధాన నిర్మాత. వీరి ఔదార్యాన్ని కొనియాడారు శ్రీస్వామివారు. ఆ ప్రక్కనే ఉన్న శ్రీరామాలయంలో నూతనంగ 45 అడుగుల ఎత్తులో నిర్మించే హనుమ విగ్రహాన్ని దర్శించి తగుసూచనలిచ్చారు. త్వరలో ప్రతిష్ఠకు సమయమివ్వమని శ్రీవారిని కమిటీవారు ప్రార్థించారు.

రాత్రి సుమారు 10 గంటలకు శ్రీనగర్ కాలనీలో శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయమును సందర్శించి, భక్తకోటికి సందేశమును అనుగ్రహించారు. రాజగోపుర ప్రతిష్ఠాసందర్భంగ జరిగే హోమపూర్ణాహుతిలో పాల్గొన్నారు. ఆలయవ్యవస్థాపక సభ్యులలో ఒకరైన శ్రీమతి పద్మగారు, ఎన్నో ఒడిదుడుకులు తట్టుకొని ప్రధాన దాతగ తాముండి, దేవాదాయశాఖ ద్వారా కొంత ధనాన్ని సేకరించి, ఈ ఆలయానికి నూతన శోభను చేకూరుస్తూ 7 అంతస్థుల రాజగోపురమును నిర్మింపజేసారు. శంకుస్థాపనతో ప్రారంభించి, ఒక ఏడాది కూడ కాకుండానే, అనేక ప్రయాసలకోర్చి, అత్యల్ప సమయంలో చక్కగా నిర్మింపచేసిన ఘనత శ్రీమతి పద్మగారికి దక్కిందని శ్రీస్వామివారు మంగళాశాసనం చేసారు.

ఆలయం ప్రక్కనే ఉన్న శ్రీమాన్ సుధాకరరెడ్డి (పోలీసు డిపార్ట్‌మెంట్)గారి భవనంలో శ్రీవారికి మకాం ఏర్పాటైంది.

సుమారు గం॥ 11-30 ని॥లకు మకాం చేరగానే పూజ్య శ్రీస్వామి దయానంద సరస్వతి (హృషీకేశ్, కోయంబత్తూర్)గారు అక్కడికి విచ్చేసి శ్రీవారితో కలసి, వారు చేస్తున్న ఆధ్యాత్మిక ప్రచారంలో గ్రామీణాభివృద్ధి కార్యక్రమాల గురించి, ఢిల్లీలో జరిగిన అంతర్జాతీయ సదస్సు యొక్క వివరాల గురించి చర్చించారు. ఆపై గృహయజమానులైన శ్రీమాన్ రెడ్డిగారి దంపతులు శ్రీవారి పాదపూజ చేస్కొని తరించారు.

10వ తేదీనాడు తీర్థగోష్ఠికాగానే ఉదయం 10 గంటలకు ఆలయానికి విచ్చేసి పూర్ణాహుతిలో పాల్గొని, కాగానే రాజగోపుర కుంభాభిషేకం జరిపించారు. ఆ కాలనీవాసులంతా శ్రీమతి పద్మగారు చేసిన ఈ కృషికి కృతజ్ఞతగ, ఆమెను వస్త్రాదులతో, శ్రీస్వామివారి దివ్యహస్తములమీదుగ సత్కరించారు. "ఒక్క మహిళగ ఆమె నిలబడి, స్వామిసేవ ఏమైనా జరిగితీరాలనే పట్టుదలతో చేసిన ఈ నిర్మాణ కార్యక్రమం ఇక్కడి మహిళాలోకానికే గర్వకారణమని, సత్క్రియలు చేయాలని సంకల్పించి, దృఢదీక్షతో నిలిస్తే వసతులు అవే ఏర్పడతాయి. ఆటంకాలు తొలగుతాయి. ఉత్తమ ఫలితాలు దక్కుతాయనడానికి గోపురము ఉన్నతమైన సాక్షిగ నిలుస్తుందని, దీనిని సాధించిన శ్రీమతి పద్మగారికృషి మిగిలిన మహిళలలో ఇలాంటి కార్యక్రమాలపట్ల ఆసక్తిని, ప్రేరణను కలిగిస్తుందని శ్రీస్వామివారు మంగళాశాసనం చేసారు.

అపోలో హాస్పిటల్‌కి చెందిన శ్రీమతి P. సుచరితారెడ్డిగారి తల్లిగారైన శ్రీమతి శకుంతలమ్మగారిని వారి గృహంలో మంగళాశాసనంచేసి నేరుగా శ్రీమాన్ J. రామేశ్వరరావు దంపతులతో విమానమార్గంలో తిరుపతి చేరారు. నేరుగ అలివేలుమంగాపురంలో పద్మావతి అమ్మవారి ఆలయం, తిరుపతిలో శ్రీగోవిందరాజస్వామివారి సన్నిధిలో సంప్రదాయ క్రమపద్ధతి ప్రకారము సేవించుకున్నారు. అక్కడే ఉన్న శ్రీ పెద్దజీయంగారి మఠంలో స్వామివారిని సేవించి కొండపైకి బయలుదేరారు.

అలిపిరి దగ్గరకు చేరగానే నడచి మెట్లమార్గంగ పైకివెడితే బాగుండునని సంకల్పించి, గోష్ఠితో శ్రీవిష్ణుసహస్రనామపారాయణ చేసుకుంటూ పైకి యాత్ర సాగించారు. మధ్యలో మన ధర్మరథంలో అప్పటికే అక్కడికి చేరిఉన్న తత్త్వ ప్రచారకులంతా వచ్చికలిశారు. అందరూ నామస్మరణంతో రాత్రి తోమాలసేవ అయ్యే సమయానికి తిరుమల కొండపైకి చేరారు. పెరుమాళ్ళే పంపినట్లు, శ్రీమాన్ బాలాజీ అనే స్వామి తీర్థప్రసాదాలు తెచ్చి స్వామివారి





కందించగా వాటిని కూడ ఉన్న గోష్ఠికందరకూ స్వామివారు పంచారు. అందరూ ఆనందించారు.

శ్రీస్వామివారు నేరుగ శ్రీశ్రీనివాసుని దర్శనానికి లోపలికి వేంచేసారు. కూడ ఉన్న గోష్ఠికందరకూ టిక్కెట్లు తీస్కొనిలోపలికి శ్రీవారు చేరేసరికి, వీరందరిని అక్కడకు చేర్చేఏర్పాటు చేసారు. కొండమీది JEO శ్రీమాన్ బాలసుబ్రహ్మణ్యంగారు ఆలయంలో స్వామివారిని సేవించి, తాము దగ్గిరుండి పెరుమాళ్ళ సేవచేయించారు.

నడిచి కొండనెక్కివచ్చినందుకు పెరుమాళ్ళు, పరివారం అందరితోటి కలిపి సంతృప్తిగ సేవననుగ్రహించడం ఊహించనిది అయినా, ఎంత సంతృప్తిగాఉందో, తనకోసం శ్రమించేవారికోసం శ్రీనివాసుడు ఇంత దయచూపుతాడు. "నేనూ ఇదేమొదటిసారి నడిచి కొండ ఎక్కడం. అది స్వామివారితో పారాయణాలతో కావడం నా అదృష్టం. మామూలు దర్శనమైతే తీర్థ ప్రసాదాలుండవుగద! ఇపుడు లోపలే తీర్థప్రసాదాలందుకోగలిగాం" అంటూ శ్రీమాన్ రామేశ్వరరావుగారు ప్రభృతులు అన్నారు.

11వ తేదీ ఉదయం తిరుమల సన్నిధిలో శాత్తుముఱై సేవించుకొనివచ్చి, ఆరాధన, గోష్ఠి ముగించుకొని, మధ్యాహ్నం గం॥ 1-30 ని॥లకు శ్రీమాన్ రామేశ్వరరావుగారేర్పాటుచేసిన కార్లలో, ధర్మరథం అనుసరించగా శ్రీరంగయాత్రకై బయలుదేరారు.

సాయంకాలం గం॥ 4-00కు రాయవెల్లూరు సమీపంలోని కాట్‌పాడి వద్దనున్న మహాసిమ్మెంట్సు, ఏజెంటు శ్రీమాన్ ప్రసాద్ ప్రభృతులు ఏర్పాటుచేసిన పాదపూజలో పాల్గొని, మన ఆంధ్రనుంచి తయారై వచ్చే సిమ్మెంట్సును ఈ ప్రాంతంలో అందరికీ అందించి, మనకు కీర్తి ప్రతిష్ఠలు తెస్తున్నందుకు వీరందరినీ మంగళాశాసనాలు చేయాలని శ్రీమాన్ రామేశ్వరరావుగారు కోరగ, అక్కడి భక్తులనుద్దేశించి శ్రీస్వామివారు అనుగ్రహభాషణం చేసారు.

రాయవెల్లూరు నుండి బయలుదేరి సుమారు రాత్రి గం॥ 9-30 ని॥లకు శ్రీస్వామివారు, పరివారం తిరుక్కోవిలూర్‌లోని ఉలగళంద పెరుమాళ్ సన్నిధికి చేరారు. అప్పటికే అక్కడ ఆలయ అర్చకులు, జీయరులు, స్థానికులు శ్రీస్వామివారి రాకకై ఎదురు చూస్తూ ఉన్నారు. ఈ ఆలయం ప్రభుత్వం ఆధీనంలో కాకుండా స్వతంత్రంగా ఉంది. దీని నిర్వహణ బాధ్యతని తిరుక్కోవిలూర్ ఎంబెరుమానార్ పీఠం నిర్వహిస్తోంది. ఇక్కడి పీఠాధికారులు గృహస్థులుగా ఉంటూ ఆలయనిర్వహణ బాధ్యత నిర్వహించడం విశేషం. వీరిని జీయరులనే అంటారు. వీరు యువకులు. వీరికి ఆ చుట్టుప్రక్కల, దక్షిణ దేశాలలోను అనేకమంది శిష్యులు ఉన్నారు. వీరి శిష్యులలో హరిజనులుకూడా ఉండడం విశేషం. ఈ పీఠం బడుగు వర్గాలలోనికికూడా వెళ్ళి సంప్రదాయాన్ని ప్రవర్తింపచేసినట్లు ప్రసిద్ధిచెందింది.

ఈ ఆలయం అతివిశాలమైనది, ఎత్తయినదికూడా. ఈ ఆలయానికి తూర్పు, పశ్చిమాలలో ఎత్తయిన ప్రాకారాలున్నాయి. ఇది యుగాల చరిత్రగల ఆలయం. కలియుగానికి సుమారు 3వేల సం॥ల పూర్వంనుండి దీని చరిత్ర చెప్తోంది. ముదలాళ్వారులుగా మన గురుపరంపరలో చెప్పబడే ముగ్గురు ఆళ్వారులు వేరు వేరు ప్రాంతాలలో వేరు వేరు సమయాలలో అవతరించినవారయినా ఒక వర్షాకాలంలో తిరుక్కోవిలూరులోని ఒక గదిలో కలుసుకోవడం అక్కడవారు, జ్ఞాన, భక్తి అనే దివ్యజ్యోతితో పెరుమాళ్ళను సేవించడం, పెరుమాళ్ళ దర్శనం కల్గడం, వారు ఇయఱ్పా అనే ప్రబంధం

అనుగ్రహించడం పెద్దల ప్రవచనాలలో విన్నాం. ఆ ముగ్గురు ఆళ్వార్లు కలుసుకున్న స్థలం ఇది. ఇక్కడ పెరుమాళ్ళను ఉలగళంద పెరుమాళ్ (త్రివిక్రములు) అని అంటారు. ఆ పెరుమాళ్ళ సన్నిధి వెనకగల చిన్న గదిలోనే ముగ్గురు ఆళ్వార్లు కలుసుకున్నట్లు చెప్తారు. ఈ ఆలయం జీర్ణోద్ధరణకు కొంత సహకరించాల్సినదిగా అక్కడి జీయరుస్వామివారు మనస్వామివారిని కోరారు. ఆలయం రూఫ్ కారుతోందని దానిని జీర్ణోద్ధరణకు 5,6 లక్షలు అవుతుందని దానిని చేయించమని జీయర్‌స్వామివారిని వారు ప్రార్థనచేసారు. దానికి అవసరమయిన కొంత సిమ్మెంటు పంపిస్తామని శ్రీమాన్ రామేశ్వరరావుగారు అన్నారు. శ్రీస్వామివారు, రామేశ్వరరావుగారు, భక్తులు అందరూ పెరుమాళ్ళను సేవించుకున్నారు. ఆనాడు ఏకాదశి అయినా ఆలయంలో పెరుమాళ్ళ ప్రసాదమును అందరికి అందజేసారు శ్రీస్వామివారు. శ్రీస్వామివారు పెరుమాళ్ళను సేవించి చాలా సంతృప్తులైరి.

**సుమారు 1 1/2 గంటల సమయం అక్కడ గడిపిన పిదప, తిరిగి బయలుదేరారు. రాత్రి గం॥ 3-00కి పరమపవిత్ర శ్రీవైష్ణవ మూలక్షేత్రం సాక్షాత్తు భూలోకవైకుంఠమైన శ్రీరంగం దివ్యనగరికి చేరారు.**

శ్రీమాన్ శ్రీనివాసులురెడ్డిగారిని, శ్రీమాన్ సుందరరాజన్ (తిరుమలమఠం)ను తీస్కొని శ్రీమతి ఆనందకుమారిగారు అంతకు ముందే అక్కడకు చేరి శ్రీవీరరాఘవ రామానుజ కూటంలోనే శ్రీస్వామివారికి వసతి ఏర్పాట్లు చేసిఉంచారు.

అందరూ శ్రీస్వామివారికి స్వాగతం పలికి నూతన మఠ శిలాశాసనాన్ని ఉద్ఘాటన చేయించారు. అప్పుడు క్రింది గదులూ, మొదటి అంతస్థు గదులూ రెండవ అంతస్థు గదులూ, ఆ పైభాగం అంతా తీసుకువెళ్ళి నూతన నిర్మాణాన్నంతనూ చూపించారు. శ్రీవారు అంతా తిరిగిచూచి, నిర్మాణం బాగ ఉపయోగకరంగానూ, అందంగానూ దగ్గిరుండి చేయించి నందుకు శ్రీమాన్ శ్రీనివాసులురెడ్డిగారిని సంపూర్ణంగ మంగళాశాసనం చేసారు.

చెన్నైలో అనారోగ్యం ఉన్నాసరే తరచువచ్చి, చూచి, సలహాలిస్తూ నిర్వహణబాధ్యత నంతనూ వహించి, స్వంతపనికంటే బాగ చూస్కొంటున్న (జెట్ సభ్యురాలు) శ్రీమతి I.V. ఆనందకుమారిగారికి స్వామివారు మంగళాశాసనాలు చేసారు.

అపుడే కొన్ని సూచనలుగూడ చేసారు. దర్శనార్థ భక్తుల సౌకర్యంకోసం కొన్నిలాకర్లను ఏర్పాటుచేయమని, మెట్లవద్ద రక్షణకై ఒక ఫెన్సింగునూ నిర్మించవలెననీ, దాతలపేర్లను సూచించే ఒక శిలాశాసనాన్ని తయారుచేయించడం వంటివి అందులో కొన్ని. అప్పటికే సమయం గం॥ 4-30 ని॥ అయ్యింది. తెల్లవారుతూంది. శ్రీస్వామివారు భక్తులందరికీ విశ్రమించమని అనుజ్ఞనిచ్చారు.

1967లో వరంగల్లు జిల్లాలో కల్లెడదొరవారుగా ప్రసిద్ధులైన శ్రీమాన్ ఎఱ్ఱబలి వెంకటేశ్వరరావుగారు తమ తండ్రిగారైన శ్రీమాన్ వీరరాఘవరావుగారిపేర ఒక భవనాన్ని మన పెద్దజీయరుస్వామివారికి సమర్పించారు. అది రాజగోపురమునకు ప్రక్కనేఉన్న సతారావీధిలోఉంది. ఆ భవనం నెంబరు 213, 214. దానికి **'వీరరాఘవరామానుజ కూటంగ నామకరణం చేసారు శ్రీస్వామివారు.** అప్పటినుండి శ్రీరంగం దర్శించవచ్చే తెలుగువారికి వసతిసౌకర్యములు కల్పించడం కోసం దాన్ని వాడేవారు. భక్తులకై ఉపయోగపడుతూ ఉండే ఆ భవనంలో శ్రీపెద్దస్వామివారెప్పుడూ ఉండేవారు కాదు.





శ్రీరంగంలో శ్రీపెద్దస్వామివారుండే రోజులలో మదరాసు చారిటీలకు చెందిన "13 దక్షిణ ఉత్తర వీధిలోని" ఓ భవనంలో ఉండేవారు. 1980లో శ్రీస్వామివారి అనంతరం ఆ భవనాన్ని ఆ చారిటీవారు తీసేసుకున్నారు. శ్రీ చిన్నజీయరుస్వామివారెపుడు శ్రీరంగం వేంచేసినా, మణవాళమాముని సన్నిధిలో కానీ, ఇతర స్థలాల్లోగానీ ఉండేవారు. కారణం రామానుజకూటం భక్తులకోసం వాడుకలో ఉండేదని.

గత 5,6, సం॥లుగ ఆ భవనం బాగ శిథిలమై, వసతి యోగ్యం కాకుండా ఉండిపోయింది. 1993లో పుష్కరాల్లోను, 1995లో లక్ష్మీనారాయణ యాగంలోనూ ఆ భవనాన్ని పరిశీలించిన శ్రీస్వామివారు దానినెలా వినియోగించాలనే ఆలోచన ప్రారంభించారు. దానిని బాగుచేయడం పెద్ద ఖర్చుతోకూడుకొన్నదని, అమ్మివేద్దామని గూడ నిర్ణయించారు ఒకానొక సమయంలో. అయితే శ్రీమతి ఆనందకుమారిగారి సూచనమేరకు, హైదరాబాదులోని శ్రీమతి ఆండాళ్‌దేవిగారి (కల్లెడదొరవారి కుమార్తె) ప్రోత్సాహంతోను ఉన్న భవనాన్ని పూర్తిగ తొలగించి నూతన భవననిర్మాణం చేయాలని సంకల్పించారు.

శ్రీమతి ఆనందకుమారిగారి సలహాతో, శ్రీమాన్ శ్రీనివాసులురెడ్డిగారు ప్లానుతయారు చేసారు. రూ. 45 లక్షలుపైగ నిర్మాణవ్యయం అయినా సాహసంతో క్రిందటిఏడాది శంకుస్థాపన చేయించారు. జనవరి 26వ తేదీన ప్రారంభించిన పని నవంబరుకల్లా, రికార్డెడ్ సమయంలో 10 నెలలలో శ్రీమాన్ రెడ్డిగారు పూర్తిచేయించేసారు. ఉదారులైన భాగవతోత్తములెందరో ఈ నిర్మాణానికి చాలవరకు తమ చేయూత నిచ్చారు. ఇకపై శ్రీస్వామివారు ఎప్పుడు శ్రీరంగం వచ్చినా, ఇందులోనే ఉండాలి తప్ప బయట అవసరంలేనట్లు శ్రీ ఆనందకుమారిగారు ప్లానుచేయించారు. క్రింద, స్వామివారికి గది. వేరు తళియశాల, తదీయారాధనశాల, తీర్థగోష్ఠిహాలు, మొదటి అంతస్థులో 8 గదులు, రెండవ అంతస్థులో 8 గదులూ ఉండేట్లు అన్నివసతులూ, అందులో ఏర్పాటుచేసారు. ఆపైభాగంలో కొన్ని కామన్ స్నానాల గదులూ ఏర్పాటు చేసారు. భవన ముఖద్వారంవద్ద పైభాగంలో శ్రీసీతారామచంద్రుల విగ్రహాలను నిర్మించారు. రోడ్డువైపు ఉత్తరంగ రంగనాథుని ఆలయంచూస్తున్నట్లు 6 అడుగుల ఎత్తైన భగవద్రామానుజులవారి మూర్తిని మండపంలో నిర్మించారు. భవనంపై భాగంలో పంచవర్ణాలతో ఆ మూర్తులు ఆ ప్రాంతీయులందరికీ మంచి ఆకర్షణగ తయారైంది. నిర్మాణ ప్రమాణాలు (Quality of Construction)గూడ బాగున్నాయని శ్రీమాన్ రామేశ్వరరావుగారు ప్రశంసించారు.

నవంబరు 21వ తేదీ రాత్రి 2-54 గం॥కు గృహప్రవేశం వైదిక విధానంలో జరిపించమని శ్రీస్వామివారు ఆజ్ఞాపించారు. చాతుర్మాస్యం కనుక వేంచేసే అవకాశంలేక శ్రీమాన్ వేణుగోపాలాచార్యస్వామివారిని పంపారు. చెన్నైనుండి జెట్, వికాసతరంగిణి సభ్యులంతా దగ్గిరుండి ఆ శుభకార్యక్రమాన్ని విలక్షణంగ జరిపారు.

మిగిలిన చిల్లరపనులుగూడ పూర్తిచేసి, అందులో స్వామివారి రాకతో భవన ఉద్ఘాటన జరగాలని ఇప్పుడు ఈ కార్యక్రమం ఏర్పాటుచేసారు. అయితే అది ఒక సాంప్రదాయక కార్యక్రమమంతో ప్రారంభంకావడం శ్రేయస్కరమని **'గోపాలోపాయన పురస్కారం'** మొదటి కార్యక్రమంగ శ్రీస్వామివారు నిర్ణయించారు. దానికై శ్రీస్వామివారిప్పుడు శ్రీరంగం విచ్చేసారు.

భగవద్రామానుజుల అపరావతారమైన మన శ్రీపెద్దజీయరుస్వామివారి పేర **'జీయరు అవార్డు'**ను దీపావళికిస్తున్నట్లే, వారికీ ఆచార్యస్థానీయులైె శ్రీచిన్నజీయరుస్వామివారికి వేదాన్తాధ్యయనం చేయించి ఆచార్యులైన శ్రీ ఉ.వే.శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారిపేర సమర్పించే అవార్డే **'గోపాలోపాయనం'**అనేది మన పాఠకులందరికీ తెలుసును. గత అక్టోబరులో శ్రీమదుభయవేదాన్తాచార్యపీఠ సదస్సులోనే ఈ పురస్కారప్రదాన కార్యక్రమం శ్రీరంగంలో శ్రీ ఉ.వే. శ్రీమాన్ S. శ్రీవత్సాంకాచార్యస్వామివారికి జరపాలని నిర్ణయించడం జరిగింది. ఆచార్యపీఠ కార్యదర్శి శ్రీమాన్ S. రంగరామానుజాచార్యస్వామిగారు దానికి అవసరమైన పూర్వరంగ పరికల్పనమంతా చేసారు.

12వ తేదీ తెల్లవారేసరికి శ్రీ ఉ.వే శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యస్వామివారితో శ్రీమాన్ రంగరామానుజాచార్యస్వామివారుగూడ పురస్కార సమారోహానికి విచ్చేసారు.

అంతకుముందు 12వ తేదీన మఠంలో ఆరాధనగోష్ఠికాగానే పరివారమందరితో బయలుదేరి శ్రీరంగనాథుని ఆచార్యులైన శ్రీమణవాళమాముని సన్నిధిని సేవించుకున్నారు స్వామివారు. శ్రీరంగనాథుని ఆలయద్వారంవద్ద ఆలయ జాయింట్ కమీషనర్ శ్రీమాన్ రాజనాయకంగారు శ్రీవారికి స్వాగతం పలుకగ సన్నిధులన్నీ సేవించారు. తాయారు సన్నిధి పూర్తికాగానే, అటునుండే, అక్కడికి 1 కి.మీ. దూరంలో ఉన్న శ్రీమణవాళమామునుల తిరువరశు (బృందావనం) దర్శించడానికి వెళ్లారు.

క్రీ.శ. 1443 సం॥లో వారు తిరునాడలంకరించారని అందరికి తెలుసునుగానీ వారి చరమదేహాన్ని వేంచేపు చేసిన తిరువరశు ఎక్కడవుందో ఎవరికీ సరిగ్గా తెలియలేదు. చరిత్రలో ఎందుకనో అది తెరమరుగున పడిపోయింది. ఈ మధ్యకాలంలోని ఆచార్యులు ఆ విషయాన్ని ఎందుకు పట్టించుకోలేదో తెలియదు. వారి తిరువరశు 'పురుషోత్తమ చతుర్వేది మంగళం' అనే శ్రీరంగంలోని ఒక ప్రాంతంలో, శ్రీకేశవపెరుమాళ్ళ సన్నిధిలో ఈశాన్యం వైపు ఉన్నదని, **'యతీన్ద్రప్రవణ ప్రభావము'** మొదలైన గ్రంథాలలో ఉన్నది. అది ఎక్కడుందోమాత్రం ఎవరు శ్రద్ధవహించలేదు.

శ్రీరంగంలో ఈ మధ్య శ్రీ ఉన్నికృష్ణన్ అనే ఒక కేరళ ప్రశ్నకారుణ్ణి పిలిపించి ఆలయ సంబంధమైన ప్రశ్నలు అడిగారు పెద్దలు, అర్చకులూ కలిసి. ఆయన తన ప్రశ్నలలో తెలిపిన విషయాలు మహాశ్చర్యాన్ని కలిగించాయి. ఎన్నో లోపాలు బయటపడ్డాయి. ఆలయంలో జరుగుచున్న అనాచారాలు తెలిశాయి. ఆ తరువాతనే జీర్ణోద్ధరణ జరిగి గత మార్చి 15వ తేదీన మహా సంప్రోక్షణ జరిగింది. ఆయన చెప్పిన వివరాలలో కొన్ని ఇలా ఉన్నాయి.

1. పరమపదనాథుడే ఇక్కడ ఉన్నాడంటారు. కానీ, అది సరికాదు. ఇక్కడి స్వామియే పరమపదంలో ఉన్నాడు. ఇతడొక్కడే శాశ్వతమైన పెరుమాళ్ళు.
2. ఈ స్వామి ఒక రాక్షసరాజుని కరుణించి (విభీషణుని) ఆతనిద్వారా ఇక్కడకు వచ్చాడు.
3. ఈయనకు పాము అంశఅయిన ఒక మహానుభావుని (రామానుజులు) మరుజన్మఅయిన వారు గురువులు (మణవాళమామునులు).
4. ఆ గురువుల వద్ద ఒక ఏడాదిపాటు తన ఉత్సవాలన్ని నిలిపివేసుకొని అది





ఆగమవిరుద్ధమే అయినా సరే ఈ పెరుమాళ్ళు వేదం విన్నాడు. (మణవాళమ మామునుల వద్ద తిరువాయ్‌మొళి వ్యాఖ్యానమైన భగవద్విషయం విన్నాడు. ఉత్సవ మూర్తిగ (ద్రావిడ వేదమనిగదా దానిని అంటారు.)

5. వేదం విన్నాక ఆ గురువుకు ఈ పెరుమాళ్ళు ఒక శ్లోకాన్ని గురుదక్షిణగా సమర్పించాడు. ఆ శ్లోకాన్ని శ్రీవైకుంఠం మొదలు 108 దివ్యదేశాల్లో కూడా నిరంతరం చదువుతూ ఉంటారు. ("శ్రీశైలేశ దయాపాత్రం ........ రమ్యజామాతరం మునిమ్" అనే శ్లోకం చిన్నిబాలుని రూపంలో పెరుమాళ్ళే వచ్చి మణవాళమామునివద్ద కాలక్షేపం కాగానే గురుదక్షిణగ సమర్పించి ఆయలంలోనికి వెళ్ళి అంతర్థానం అయినట్లు చరిత్రలో ఉంది.)
6. శ్రీరంగనాథునికి శరీరబాధ, మనోవ్యాధి రెండింటితో బాధపడుతున్నాడు.
7. మనోబాధ ఏమిటంటే ఆ గురువును మరణానంతరం ఉంచిన స్థలానికి (అంటే వారి చరమ దేహం ఉంచిన బృందావనం 'తిరువరశు' అంటారు.) 108 దివ్యదేశాల పెరుమాళ్ళూ, దేవతలూ అందరూ రోజూ వచ్చి నమస్కరించి వెడుతూ ఉంటారు. కానీ, ఆ స్థలం ఇప్పుడు పాడుబడిపోయి తుప్పలు మొలిచి ఉంది. దీనిచుట్టు మురికి కాలువ ప్రవహిస్తుంది.

అదెక్కడుంది? ఎలా గుర్తించడం ఆ స్థలాన్ని? అని అడిగితే దానికాతడు "అక్కడికి వారానికి 3 రోజులు పెద్దసర్పం వచ్చిపోతూ ఉంటుంది. అక్కడొక బావి ఉంటుంది ఫలానా దూరంలో ఉంటుంది అని చెప్పాడట. అతడు చెప్పిన గుర్తులను బట్టి వెళ్ళిచూస్తే శ్రీ అణ్ణన్‌స్వామి అనే ఆలయ ఆచార్యపురుషులకే చెందిన స్థలమది. 1874 సం॥వరకు ఆ బృందావనంలో నిత్యదీపారాధన జరుగుతూ ఉండేది. ఆ తదుపరి స్థానికంగా ఏర్పడ్డ సంప్రదాయ వైరుధ్యాలవల్ల అక్కడ ఆరాధన ఆగిపోయి ఉండవచ్చు. అణ్ణన్ వంశంవారు ఆ స్థలాన్ని ఎవరికో లీజుకు ఇవ్వడంవల్ల క్రమంగా అక్కడ ఆరాధనలుకూడా లోపించిపోయాయి. క్రమేణా ఇప్పుడు అక్కడంతా తుప్పలున్నాయి. ఒక వైపు దాన్ని కొద్దిగా సాగుచేస్తున్నారు.

తిరువరశు ఉండే ప్రాంతంలో తులసితప్ప ఏ ఇతర మొలకలు మొలవవు అనిన్నీ, ఆలయం ఉండేదిగా చెప్పబడే ప్రాంతంలో మల్లె తప్ప ఇతరమైన ఏ మొక్కలు నిలవవు అనిన్ని అక్కడి రైతులు చెప్పారు. అక్కడొక నుయ్యి పాడుబడిఉంది. దానికి కాస్త దక్షిణంగా ఒక రాళ్ళకుప్పఉంది. అక్కడికి వారానికి రెండుమూడు సార్లు పెద్దపాములు వస్తున్నాయని ఆ రైతు చెప్పాడట. మరికాస్త దక్షిణాన పాడుబడ్డ దిబ్బ దాన్ని కాస్తతవ్వితే విరక్కొట్టిపారవేసిన పెరుమాళ్ళ విగ్రహాలు మండపాలకు వాడే శిలాతోరణాలు కొన్ని దొరికాయి (సంప్రదాయ వైరుధ్యాలవల్ల ఆలయం ధ్వంసమై ఉండవచ్చు).

అక్కడ ఒక కేశవ పెరుమాళ్ళ కోవెల ఉండేదని దానికి నాలుగువైపులా వీధులుండేవని **'పురుషోత్తమ చతుర్వేది మంగళం'** అనే శ్రీరంగంలోని ప్రాంతంలో,

గతంలో, స్వాములు మిగిలిన భక్తులు అంతా ఉండేవారని, శ్రీరంగంలో స్వామి ఉత్సవాలకి మండపాలు నిత్యార్చనసేవలో ఉండే అర్చకాది ఆంతరంగిక పరివారంతప్ప మిగిలిన వారంతా ఏడు ప్రాకారాల బయటనేతప్ప లోపల ఎవ్వరూ నివసించేవారు కాదని, (క్రమంగా ఆ పద్ధతిమారి అంతా ఆలయవీధులలోనికే మకాములు మార్చేశారు. సంప్రదాయవైరుధ్యాలవల్లనే బహుశ రక్షణకోసం ఈ మార్పిడి జరిగి ఉండవచ్చు.) తెలిసింది. శ్రీవరవరమునుల తిరువరశుని పెరుమాళ్ళ ఆజ్ఞమేరకు ఈశాన్యంవైపు ఏర్పాటుచేశారు. తరువాత ఏ తీవ్రవాదుల, నాస్తిక ముష్కరుల దౌర్జన్యమో తెలియదు. ఆలయం నామరూపాలు లేకుండా ధ్వంసమైతే ఈ ప్రాంతం ఖాళీచేసి జనులంతా అటువైపు వెళ్ళిపోగా ఇది పాడుపడిపోయింది. ఆ ప్రశ్నకారుడీ విషయం బయటపెట్టాడు.

8. ఆ తిరువరశును బాగుచేస్తేనే శ్రీరంగనాథుని మనస్తాపం తీరుతుంది. దానిని బాగుచేసిన వారికి శ్రేయస్సులెన్నో కలుగుతాయి. ఆయనే లోకాలన్నింటికి గురువు. అంటూ ఆ ప్రశ్నకారుడు చెప్పాడట.

ఈ విషయాలు ఆతడు చెప్తోంటే కొంతమంది స్థానికులుగ ఉంటున్న వడకలై వారు ఒప్పుకోలేదట. ఏదో కల్పించి, లేక, ఎవరో నేర్పించి ఈతనిచే యివన్ని చెప్పిస్తున్నారంటూ ఎదురుతిరిగారట ఆ సమయంలో. దానికా ప్రశ్నకారుడు 'నేను చెప్పేది తప్పంటే ఇప్పుడే మానివేసి వెళ్ళిపోతా, తప్పా, సరియా చెప్పండి' అని అడిగాడట. పైన చెప్పినవన్నీ ఒప్పేనని అంగీకరించవలసి వచ్చిందట, ఆ ఎదిరించినవారికిగూడ. ఇక శరీర బాధఏమిటి రంగనాథునికీ? అని అడిగితే:-

9. ఈయనికి చాలకాలంగ ఆహారం సరిగ్గాలేదు. (10 సం॥ క్రితం నూతినీరు, కావేరీ జలంతోనూ కాకుండా కొళాయినీటితో ప్రసాదాలు వండుతున్నారట. అది సంప్రదాయ విరుద్ధం. అప్పట్లో కొందరాచార్య పురుషులు ఎదిరించినా, వారిమాట సాగలేదు. వారే ఆలయానికివచ్చి ప్రసాదం తీస్కోవడం మానేసారట)

10. వంటవాళ్ళు మదిరాపానాదులు చేసి, శుచిలేని ఆ పాత్రలతో చేస్తున్నారు. ఇప్పుడే మీరు వెళ్ళిచూడచ్చు. అని చెప్పాడట. ఆశ్చర్యపోయిన ఆలయస్వాములు వంటశాల ('పోటు' అంటారు)కు వెళ్ళిచూస్తే అది నిజమని తేలింది. నమ్మకతప్పలేదు.

11. పెరుమాళ్ళ మూలస్థానంలో ఎంగిలితోలు ఇప్పుడు ఉంది చూడండి. అని చెప్పాడట. వెళ్ళిచూస్తే అర్చకస్వాముల సెల్ఫోను తోలు కవరులో పెరుమాళ్ళ పీఠం ప్రక్కన ఉంది.

12. పెరుమాళ్ళ మెడ వెనుక, మోకాళ్ళవద్ద పుండ్లు పడిబాధపడుతున్నాడు చూడండి అన్నాడట. వెళ్ళిచూస్తే - ఆ రెండు చోట్లా ఎలుకలు చేసిన చిన్న కన్నాలు బయటపడ్డాయిట. (జీర్ణోద్ధరణలో సరిచేసారు తర్వాత)

13. గతంలో ఎప్పుడో పెరుమాళ్ళకు అగ్ని స్పర్శఏర్పడింది. (1968-69లలో జరిగిందని చెప్పారట)

14. ముఖంలోగూడ స్వామికి పుండ్లుఏర్పడ్డాయి అన్నాడట. అక్కడి చందనాన్ని గీకి తమకు





కావలసినవారికి అర్చకులు కొందరు యివ్వడంతో ముఖంలో ఒక గొయ్యిలా ఏర్పడి ఉందిట. దీన్నీ అంగీకరించక తప్పలేదు.

15. రెండుచోట్ల ఈ ఆలయంలో నవగ్రహాలున్నాయి అన్నాడట. ఎవ్వరూ దానికి అంగీకరించలేదట. పరమ వైష్ణవ స్థానమైన ఇందులో నవగ్రహాలకు ప్రసక్తియే లేదని అంతా అన్నారట. ఏమో! నామాట తప్పుకాదు. ఫలానాచోట చూడండి అంటే వెళ్ళిచూసారట. అక్కడ ఆశ్చర్యకరంగ రెండు చోట్లా ఉన్నాయి. అందరూ అక్కడనుండే తిరుగుతున్నా ఎవరూ వాటిని ఇంతకాలం గమనించకపోవడం అందరినీ ఆశ్చర్యపరచిందిట.

హనుమంతుడు, బలిపీఠం, ధ్వజస్తంభం ఉండే మండపంలోనికి ప్రవేశించే ద్వారానికి క్రింది గుమ్మానికి, ధ్వజస్తంభందాటి శ్రీరంగని మొదటి ప్రాకారంలోనికి ప్రవేశించే గుమ్మానికి క్రిందిభాగంలోనూ, అంటే, ఆ మండపానికి రెండువైపులా ఉండే గుమ్మాల క్రింది భాగములో వరుసగ 'నవగ్రహాలు'న్నాయి. ఎందుకున్నాయక్కడ? అని ఆలయాధికారులడిగారట.

లోకులంతా పూజలుచేసి తమ పాపాలు ఈ గ్రహాలకిచ్చేస్తారు. మరి వీటికి పాపాలను ఎలా పోగొట్టుకోవాలో తెలియక భగవంతుని ప్రార్థిస్తే ఉత్తమ శ్రీవైష్ణవుల పాదధూళివల్లనే అవిపోతాయని చెప్పాడట. దానివల్ల శ్రీరంగని దర్శించవచ్చే శ్రీవైష్ణవుల పాదధూళి సోకాలని ఈ రెండు చోట్లా నవగ్రహాలున్నాయని ఆ ప్రశ్నకారుడు చెప్పాడట.

నవగ్రహాలుగూడ శ్రీవైష్ణవులను ప్రభువులుగ వారి పాదధూళి కోరుతాయంటే, శ్రీవైష్ణవులై పెరుమాళ్ళమీద విశ్వాసంతో ఉండటం ఎంత గొప్పదోకద! తెలియని మూఢులు పెరుమాళ్ళను మరచి, విశ్వాసంలోపించి, గ్రహాలచుట్టూ పరిక్రమిస్తూండటం పెరుమాళ్ళ ఆలయాలలోగూడ వాటికి ప్రాధాన్యాన్నివ్వడం ఆశ్చర్యంకదూ!

16. రోజూ శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రపారాయణం చేయండి అనిచెప్పెనట.

ఇన్ని చెప్పిన తర్వాత ఆయనమాటలమీద విశ్వాసం కలిగి జీర్ణోద్ధరణం చేసి మార్చిలో మహాసంప్రోక్షణ చేసారట. ఇదంతా రికార్డు చేసి ఉంచారు ఆలయాధికారులు. ఇంతకీ శ్రీమణవాళమామునులు శ్రీరంగనాథునికి ఆచార్యులు అంటే ఒప్పుకోని సంప్రదాయ కుదృష్టులకిది మ్రింగుడుపడని వాస్తవమే ఇప్పటికీ.

శ్రీమాన్ తిరుక్కోట్టియార్ మాధవన్, శ్రీవైష్ణవ శ్రీకృష్ణమాచార్యస్వామి మొదలైనవారితో ఆ తిరువరశును సేవించివచ్చారు మన స్వామివారు.

12వ తేదీ సాయంకాలం శ్రీరంగదేవాలయము ముందున్న రంగవిలాస మండపంలో దేవాలయ నేతృత్వంలో, శ్రీరంగనారాయణజీయరువారి సమక్షంలో, శ్రీపరాశర లక్ష్మీనరసింహ భట్టరుస్వామివారి (కోరుకొండ రంగరాజభట్టరువారి సోదరులు) నేతృత్వంలో సామూహిక శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రపారాయణ చేస్తున్నారని, దానికి మన స్వామివారినాహ్వానిస్తే, అలానే అని సాయంకాలం అమ్మామండపకావేరీలో స్నానాద్యనుష్ఠానాలు చేసుకొని, ఆ పారాయణను సాయంకాలం గం॥ 6-30ని॥లకు ప్రారంభించి జరిపి, చివర భక్తులందరికీ స్తోత్రప్రశస్తిని

ప్రవచించి, మంగళాశాసనం చేసారు. రాత్రి ఉళ్‌ఆండాళ్, వెళిఆండాళ్ సన్నిధులను సేవించి, వెళిఆండాళ్ సన్నిధిలో ఒక పారిజాత వృక్షాన్ని నాటారు. గోదాదేవి శ్రీవిల్లిపుత్తూర్ నుండి వస్తూ కావేరీనది దాటగానే మొదట వెళిఆండాళ్ సన్నిధిలోనే విడిది చేసిందట. ఆపై కళ్యాణానికి సిద్ధపడి ఆలయంలోకి వచ్చాక స్వామితోచేరేవరకు ఉన్న సన్నిధే ఉళ్‌ఆండాళ్ సన్నిధి అంటారు.

13వ తేదీ ఉదయం ఆరాధనాగోష్ఠులు ముగించగానే శ్రీస్వామివారు ఆలయంలో పెరుమాళ్ళను సేవించుకొని వచ్చాక **'గోపాలోపాయనం'** సదస్సు ఆరంభమైంది.

పరమహంస పరివ్రాజకులు శ్రీరంగం శ్రీరంగ నారాయణ జీయరుస్వాములు మంగళాశాసనాలు చేయవిచ్చేసారు. శ్రీ ఉ.వే. శ్రీమాన్ పరాశరసుదర్శన భట్టర్ స్వామివారు సభాధ్యక్షులై వేంచేసారు. శ్రీ గోపాలాచార్యస్వామివారి సహచరులుగ, పెద్దలుగ, అశక్తులుగ ఉన్నప్పటికీ, ఇది తమ కార్యమని ఓపిక చేసుకొనివిచ్చేసారు. పురస్కారగ్రహీత శ్రీ ఉ.వే.శ్రీమాన్ మహామహోపాధ్యాయ S. శ్రీవత్సాంకాచార్యస్వామి, మన ఆచార్యపీఠ శ్రీరంగ శాఖ కార్యదర్శి అయిన శ్రీమాన్ అనంత నరసింహాచార్యస్వామివారితో కలసి విచ్చేసారు. వినయ విధేయతలతో, ఉత్తమ పండిత్యానికిదీ లక్షణమన్నట్లు, వినీతులై శ్రీస్వామివారిని సేవించి కొంతసేపు కుశల ప్రశ్నమైనాక మేడపై ఏర్పరచిన సభాస్థలికి చేరారు.

మన పీఠంలో ఉభయవేదాన్త విద్వాంసులైన శ్రీరంగనివాసి అయిన శ్రీ ఉ.వే. శ్రీమాన్ నరసింహాచార్య స్వామివారూ, ఆండవన్ ఆశ్రమప్రతినిధిగ శ్రీమాన్ మాధవాచార్యస్వామివారు, శ్రీ భట్టరుస్వామివారి కుమారరత్నమైన శ్రీ ఉ.వే.శ్రీమాన్ లక్ష్మీనరసింహ భట్టర్‌స్వామి, మణవాళమాముని ప్రతినిధులుగా మన శ్రీశఠగోపాచార్యస్వామివారి సోదరులైన శ్రీ ఉ.వే.శ్రీమాన్ సంపత్కుమారాచార్యస్వామి, దేవాలయ E.O. మొదలైన ప్రముఖులంతా విచ్చేసారు. భక్తినివేదన పత్రికా సంపాదకులు శ్రీ ఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్య స్వామివారు, ఉభయవేదాన్తాచార్యపీఠ కార్యదర్శిఅయిన శ్రీ ఉ.వే.శ్రీమాన్ S. రంగరామానుజా చార్యస్వామివారు కార్యక్రమాన్ని రూపొందించగ గం॥ 9-55 ని॥లకు సభాకార్యక్రమం మంగళప్రదంగ ప్రారంభమైంది.

కుమారి శారద ముందుగ పెద్దలందరనూ వారిస్థానములకు ఆహ్వానించగ, వేదవిద్యార్థులు వారిని పుష్పగుచ్ఛములతో సంభావించారు. శ్రీ చిన్నజీయరుస్వామివారు దీపావిష్కారం, వేదఘోషతో చేయగానే, వేదవిద్యార్థులు వేద నాదాన్ని వినిపిస్తూ వాతావరణాన్ని వైదిక పరిమళాలతో నింపారు. శ్రీ ఉ.వే. శ్రీమాన్ రంగరామానుజాచార్యస్వామివారు కార్యక్రమాన్ని పరిచయం చేస్తూ కార్యదర్శి నివేదికా సమర్పణం చేసారు. సభాధ్యక్షులై వేంచేసి ఉన్న శ్రీ పరాశర సుదర్శన భట్టరుస్వామివారు తమ అధ్యక్షోపన్యాసం ప్రారంభించారు. '8మంది జీయరులను, శతాధిక ఉభయవేదాన్త పండితులను తయారుచేసి, ఉత్తర, దక్షిణ భారతప్రాంతాలలో సంప్రదాయ సంరక్షణ చేసినవారు శ్రీగోపాలాచార్యస్వామివారు. ఈనాడు అయోధ్య, బృందావనం, నేపాలువంటి చోట్ల ఉన్న వైష్ణవవిద్వాంసులంతా వారి శిష్యవర్గం. శ్రీపెద్దజీయరుస్వామివారికి సహచరులుగా వీరున్నా, వీరివద్ద భగవద్విషయం





సేవించి, వీరిని ఆచార్యులుగా వారు గౌరవించారు. శ్రీ చిన్నజీయరు వారికైతే అన్ని పాఠాలుచెప్పి దేశ, విదేశాల్లో ఘనకీర్తినార్జించి సంప్రదాయ పరిమళాలు వెదజల్లేట్లు చేసింది శ్రీగోపాలాచార్య స్వామివారే, నాకు కూడా గీతాభాష్యాది వేదాన్త గ్రంథాలు పాఠంచెప్పి, నాకూ గురువుగారైనారు. వారిపేర ఈనాడు ఈ పురస్కారం జరుగుతోంది.

ఇంతవరకు ఆరుగురికి ఈ పురస్కారాన్నందించారు. అందులో నేనుగూడ ఒకడిని కావడం నాకెంతో గర్వకారణం. గుంటూరు విష్ణుసహస్రనామ స్తోత్ర విరాట్‌పారాయణంలో లక్షలాది జనుల ముందర శ్రీస్వామివారు నాకీ పురస్కారాన్ని 1999లో యిచ్చి గౌరవించారు. తమ గురువుగారి విషయంలోని ప్రీతిని ఇలా ప్రకటించుకొనే విధానం నిజంగా చాలాగొప్పది. శ్రీ పెద్దజీయరుస్వామివారి పేర వేద పండితులకు, గోపాలాచార్యస్వామివారి పేర ఉభయవేదాన్త విద్వాంసులకు ప్రతిఏడాదీ ఇలా పురస్కారాలనివ్వడం అందరికీ ఆదర్శం. గొప్ప ఔదార్య కార్యం అంటూ తమ అనుభవాలను శ్రీవారితో, సభ్యులతో పంచుకున్నారు.

శ్రీగోపాలాచార్యస్వామివారితో కోరుకొండ మొదలైనచోట్ల తమకున్న పరిచయం, సంప్రదాయ సభారంభం, శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘ ప్రచారకార్యక్రమాల గురించి తమ జ్ఞాపకాలను సభ్యులకందిస్తూ, వారి సమకాలికులలో ఉన్నవాడిని ఒక్కడినే అయిన నన్ను ఇందులో అధ్యక్షునిగా పిలవడం ముదావహం. ఉచితంగూడను అంటూ ఈ కార్యక్రమానికి, కార్యకర్తలకి మంగళాశాసనాలు చేసి, శ్రీమాన్ శ్రీవత్సాంకాచార్యుల వారి యోగ్యతలను ప్రశంసించి మంగళాశాసనాలు చేశారు.

శ్రీగోపాలాచార్యస్వామివారు సంప్రదాయ గ్రంథరచన, ప్రచారాది కార్యక్రమములు జరిపించిన రీతిని ప్రశంసిస్తూ వక్తలందరూ ప్రవచించారు. దేవస్థానపు E.O. మాట్లాడుతూ "ఆలయంలోని ఆచారాలను సంస్కరించాలని సూచించారు స్వామివారు. ఏ మంచిపని చేయడానికైనా మేం సిద్ధమే. కాస్త 'మాన్ పవర్' తక్కువగాఉంది అనగానే 'మూన్‌కి వెళ్ళి జనాలు, హాయిగా వచ్చేస్తుంటే మాన్‌కి పవర్ తక్కువేముంది!' అనడం నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. మఠం నిర్మించి ఇంత మంచి సత్కారకార్యక్రమం ఏర్పాటు చేసినందుకు శ్రీవారికి సేవింపులను సమర్పించుకుంటున్నాను" అన్నారు.

ఆపై శ్రీమాన్ J. రామేశ్వరరావు దంపతులు పురస్కార ధనం రూ. 25,000/- శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీవత్సాంకాచార్యస్వామివారికి అందజేసారు. శ్రీమాన్ కాశీరాజుగారు శాలువా, వస్త్రాలను వారికి సమర్పించారు. వైదిక మంత్రధ్వానాల మధ్య శ్రీ చిన్నజీయరుస్వామివారు గోపాలోపాయన పురస్కారమును వారికి అందజేస్తుండగా శ్రీ ఉ.వే.శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యస్వామి దాన్ని పఠించి అందరకూ వినిపించారు.

తమకుటుంబం ఆంధ్రదేశంలో ఉండేదని తానూ తెలుగుకొద్దిగ, తిరుపతిలోధ్యయనం వల్ల తెలిసినవాడినేనని పురస్కారం స్వీకరించిన శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీవత్సాంకాచార్యస్వామివారు తెలుగులోనే ప్రవచిస్తూ 'శాస్త్రాధ్యయనం ఎంత శ్రమతో కూడుకున్నదో 'తెలిపారు. భగవత్కృప, ఆచార్యానుగ్రహంవల్లా తానేదో కొద్దిగ విద్యాభ్యాసం చేయగలిగానని, తనకీ సత్కారం జరగడం, మరిందరికి శాస్త్రపండితులవ్వాలనే ప్రోత్సాహం కలిగేందుకు ప్రేరణకావాలని,

గతంలో ఉద్యోగంలో ఉండే రోజులలో వివిధ విషయాలను నిర్ణయించే "నిర్ణయసాగరః" వంటి ఎన్నో గ్రంథాలు వ్రాసినా ముద్రించలేకపోయానని ఔద్యోగిక నిర్బంధాలవల్ల సంప్రదాయానికి చేయవలసినంత సేవ మనసువిప్పి చేయలేకపోయానని, రిటైరయ్యాక ఇక ఆర్థిక వసతులులేక చేయలేకపోతున్నానని ఆవేదన వ్యక్తంచేసారు.

భగవద్రామానుజ సిద్ధాంత ప్రచారానికి శ్రీస్వామివారు కలిగించే ఈ ప్రోత్సాహం చేయూతనిస్తోందని కృతజ్ఞతావిష్కారం చేసారు. అలానే శ్రీ చిన్నజీయరుస్వామివారు విదేశాలకు వెడుతున్నట్లు కొందరు దోషారోపణగా చెపుతున్నా శాస్త్రం దానినీ సమర్థించిందని, వైదేశికుడే అయినా జైమినిని చేరదీసి, శ్రీవేదవ్యాసుడు అతనికి ఒక వేదాన్ని అప్పచెప్పాడని, శాస్త్రప్రవర్తకుణ్ణి చేశాడని ఆరకంగా అది విశ్వవ్యాప్తం కావడానికి కారకుడైనాడని, శ్రీస్వామివారు చేస్తున్నట్లు మిగిలినపెద్దలందరూగూడ సంప్రదాయాన్ని లోకమంతా ప్రవర్తింప చేయవలసిన అవసరం ఉందని చెప్పారు. కార్యదర్శి శ్రీ ఉ.వే.శ్రీమాన్ S. రంగరామానుజాచార్యస్వామి పురస్కారగ్రహీతను పరిచయం చేస్తూ వీరిని సత్కరించడం మా పీఠానికి గౌరవంగా భావిస్తున్నామని ప్రకటించారు.

చివరగా శ్రీ చిన్నజీయరుస్వామివారు తమ మంగళాశాసనాలు కృపచేసారు. వినయ విధేయతలతో తమ పాండిత్యాన్ని ప్రకాశింపజేసుకుంటూ, ఉభయవేదాన్త సిద్ధాంత ప్రవర్తక సార్వభౌములుగా వెలుగొంది బహుగ్రంథ కర్తలైన శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఉత్తమూరు వీర రాఘవాచార్యస్వామివారికి ధీటైనశిష్యులుగ ఆచార్యులను ప్రకాశింపచేసే శిష్యులైనారన్నారు. "సహజపాండిత్యంతో స్వతంత్రంగా ఎన్నో గ్రంథాలు వ్రాసి, గురువుగారి గ్రంథరచనలో తోడ్పడి, మరెన్నో గ్రంథాలనువదించి, అంతయోగ్యత కలిగేటట్లు వందకుపైగా పండితులను తయారుచేసి, ఒక అపురూపమైన యోగ్యతను సంపాదించుకున్న ఈ మహామహోపాధ్యాయులను సమ్మానించడం పీఠానికెంతో గౌరవపదమైన విషయం" అన్నారు.

సంప్రదాయంతోపాటు వేదాధ్యయనంకూడ పూర్ణంగా చేసిన వీరు ఉత్తమాధికారని, ఇలాంటివారిని **'జీయర్ పురస్కారానికికూడా'** ఆహ్వానిస్తున్నామని భక్తుల హర్షధ్వానాలమధ్య ప్రకటించారు.

ఉద్యోగపు మొగమాటాలు లేని యిపుడు, తాము రచించిన గ్రంథాలను వెలువరించి సంప్రదాయ ప్రకాశానికి ఉద్యుక్తులు కావాలని దానికి తమ మంగళాశాసనములు సదా ఉంటాయని తెలిపారు. సంప్రదాయేతర శక్తులు తీవ్రంగా విజృంభించి విషప్రభావాలు జూపుతున్న ఈ తరుణంలో ఇలాంటి పండితులకు వాటిని అరికట్టవలసిన బాధ్యత అధికంగా ఉంటుందని హెచ్చరించారు.

వడకలై, తెంగలై అనే రెండు శాఖలుగా శ్రీ వైష్ణవ రామానుజ సంప్రదాయం వర్థిల్లిందని, సైద్ధాన్తికంగా ఉండే కొన్ని తేడాలవల్ల అవి ఏర్పడ్డా, ఇరువురి లక్ష్యమూ శ్రీమద్రామానుజులవారి సిద్ధాంతాన్ని రక్షించుకుంటూ, వైదిక ధర్మాన్ని వ్యాపింపచేయడమేనని "పరస్పర వైవిధ్యాలు" విజ్ఞానాన్ని పెంచడానికి పనికిరావాలే తప్ప "పరస్పర వైరుధ్యాలు"గ తమ ఉనికినే నాశనం చేసుకొనేవి కారాదన్నారు. కాని ఈ మధ్యకాలంలో, ప్రశాంతంగా సాగే సంప్రదాయ ప్రవాహంలో





పెద్దలమనుకొనే, మఠాధిపతులమనుకొనే కొందరు విషధారలను కలుపుతున్నారని, ఇది చాలా భయంకరమైనదీ, ప్రమాదకరమైనదీ గూడ, మిడిమిడిజ్ఞానంతో అలాంటి దౌర్జన్యాలు చేసే ఆభాస పండితులను, కళంకచరితులను, శ్రీ ఉ.వే.శ్రీమాన్ శ్రీవత్సాంకాచార్యస్వామి వంటి ప్రామాణికులు క్రమబద్ధులను చేసి మార్గంలో పెట్టాలని కోరారు.

ఈ మధ్య మార్చి 15న జరిగిన మహాసంప్రోక్షణలో గూడ అలాంటి అవకతవకలు చాలాచోటు చేస్కొన్నట్లు తమకు తెలిసిందని. నిస్సంశయంగా, నూరుశాతం తెంగలై తెన్నాచార్యసంప్రదాయ కోవెలగా ఉండే, మూలకేంద్రమైన శ్రీరంగంపై వివేకశూన్యులైన కొందరు దాడిచేసి పెరుమాళ్ళకే ఘోరాపచారం చేశారని, ఇది అరికట్టడం వైదికులందరి కర్తవ్యమని పిలుపునిచ్చారు.

తెంగలై, వడగలై వంటి వైవిధ్యం కలిగి అలరారే శ్రీవైష్ణవ, శైవ, స్మార్త మొదలైన సంప్రదాయాలు తమతమస్థానాలు క్రమపద్ధతిలో పదిలపరచుకుంటూ అందరూ వైదిక మతరక్షణకై నడుంకట్టడం తక్షణకర్తవ్యమైయుండగా, తమలో ఒకరు మరోదానిని మార్చేయాలనో, అణిచేయాలనో, తొలగించేయాలనో, ప్రయత్నించడం ఆత్మవినాశకరమని ఇది తప్పక అరికట్టాలని, అది పూర్తిగ తెలిసిన పండితులు చేయాల్సిన పని అని హెచ్చరించారు.

వైవిధ్యాలుఏర్పడ్డ ప్రయోజనం తెలియని అరకొరజ్ఞానంకల వీరభక్తులు కొందరు ఈ మధ్య తీవ్రవాదులుగా తయారుకావడం సహించరాదని, ఈ దౌర్జన్యాలను సంప్రదాయాభినివేశం కల అందరమూ కలసికట్టుగా ఎదుర్కోవడం అవసరం. దానివల్లనే మన భవిష్యత్తు ఉజ్వలం కాగలదని పిలుపునిచ్చారు. వైదిక ధర్మరక్షణలో మనవంతు బాధ్యత నిర్వహించే శక్తి మనకందరకూ శ్రీరంగనాథుడు ప్రసాదించాలని ప్రార్థించారు. తిరుమలలో మన మఠంలో జరుగుతున్నట్లే శ్రీరంగంలోగూడ నిత్యతదీయారాధన, ఇక్కడకు వచ్చే భక్తులకోసం చేస్తామన్నారు. అలానే త్వరలో ఇందులో వేదాధ్యయనాన్నిగూడ ఏర్పాటుచేస్తామని ప్రకటించారు. ఆపై పండితులనూ, ప్రవచనం చేసిన పెద్దలనూ శ్రీవారు శాలువలతో సత్కరించారు.

శ్రీ వీరరాఘవ రామానుజకూట పునర్నిర్మాణంలో బాధ్యులైన శ్రీమదుభయ వేదాన్తాచార్యపీఠ, సదస్యులందరికీ, విశేషించి కోశాధికారి శ్రీమాన్ నిరంజన్ గారికి మంగళాశాసనం చేసారు. నిర్మాణకార్యం చేయించిన శ్రీమాన్ శ్రీనివాసులురెడ్డిగారికీ, మేస్త్రీలు మొదలైన కార్మికవర్గానికీ మంగళాశాసనం చేసారు.

అలానే వివిధ పర్మిషన్లు యిచ్చి సహకరించిన ప్రభుత్వశాఖాధికారులకు, వారికి సమన్వయకర్తగా వ్యవహరించిన శ్రీమాన్ (తిరుమల) సుందరరాజన్‌కు ఆతని తల్లితండ్రులకూ మంగళాశాసనం చేసారు. తమ ద్రవ్యాన్ని వినియోగించి పునర్నిర్మాణానికి కారకులైన కల్లెడదొరవారి కుమార్తె శ్రీమతి ఆండాళ్ దేవిగారు శ్రీమాన్ G.P. రావు దంపతులు, వరంగల్ శ్రీమాన్ వసంతరావు దంపతులకు, వారి సహోదర బృందం, వారితో వచ్చిన ఇతర కుటుంబసభ్యులందరికీ శ్రీవారు ప్రత్యేక మంగళాశాసనాలు చేసారు.

ఇదిలా జరగడానికి మొదటి నుండి శ్రీమాన్ శ్రీనివాసులరెడ్డిగారితో ప్లాను తయారు చేయడం దగ్గరనుండి ప్రతీవిషయాన్ని శ్రద్ధగా గమనించి, మూలకారణభూతురాలైన మన జెట్ మదరాసు చైర్‌పర్సన్ శ్రీమతి I.V. ఆనందకుమారిగారికి శ్రీవారు అనేక మంగళాశాసనములను కృపచేసారు.

చివరన వేదమంత్ర స్వస్తి మన వేదవిద్యార్థులుచేశాక 'గోపాలోపాయన పురస్కార' ప్రదానోత్సవం, శ్రీ వీరరాఘవరామానుజకూట సముద్ఘాటన మహోత్సవము రెండుకూడా వైభవంగా సుసంపన్నమైనాయి. అందరకూ తదీయారాధన విశేషప్రసాదాలతో జరిగి ఆగంతుక భక్తులకానందాన్ని కలిగించింది. శ్రీమతి ఆనందకుమారి, శ్రీమాన్ శ్రీనివాసులరెడ్డి మొదలగువారితో కూర్చొని ఇకపైన ఎలా నిర్వహణ జరగాలనే దానిని చర్చించారు. గతంలో సీతానగరంలో ఉన్న శ్రీమాన్ N.V. తిరుమలాచార్యులుగారు ఇక్కడ నిర్వహణా బాధ్యతను చూస్తుంటారని చెప్పారు.

మఠాన్ని పవిత్రత, పారిశుద్ధ్యాదులతో ఉంచడానికి ఇందులో ఉండే భక్తులవద్ద నిర్వహఛార్జీ స్వీకరించవలసి ఉంటుందని, ఉండే సమయంలో వారు పాటించే నియమాలపట్టికగూడ ప్రతిచోట ఉంచవలసి ఉంటుందని అవి తయారుచేసారు. తిరుమల, హృషీకేశ్, బదరీ వంటి చోట్లగూడా ఈ పట్టికలు ఉంచాలని నిర్ణయించారు. అంతేకాక గది నిర్మాణం వంటివి చేయించిన దాతలకు, వారుమన మఠములలో, ఆశ్రమాదులలో ఎక్కడికోసం ధనసమర్పణం చేసినా వారు అన్నిచోట్ల ఉండే వసతులను ఉపయోగించు కొనేటట్లు కూపన్లు తయారుచేసి ఇవ్వాలని నిర్ణయించి, అలా కూపన్లు కలవారివద్ద నిర్వహణఛార్జి నామమాత్రంగా ఉంటే చాలుననిగూడ నిర్ణయించారు.

సాయంకాలం అనుష్ఠానం కాగానే శ్రీరంగనాయకీ తాయార్ల దర్శనం చేస్కొన్నారు. శ్రీమాన్ సుందరరాజన్ గృహాన్ని, పుష్పకైంకర్యం చేసే ఒక నందనవన భాగవతార్ గృహాన్ని సందర్శించి తిరువారి తిరునగరి దివ్యదేశయాత్రకు బయలుదేరారు.

**విశ్వశాంతి గీతామృత దీక్షలో**

**శ్రీస్వామివారిని గూర్చిసాహితీ సుమకైంకర్యము**

ప్రతి మనసు గుడిలో గీత శృతిగపలికె,
ప్రతిమగా స్వామి కనిపించి శృతిహితముగ,
ప్రతి మధుర భావనము పంచి భక్త తతికి,
ప్రతి నినాదమై నిండె ప్రపంచమెల్ల.

విశ్వశాంతిని కాంతిగా విస్తరింప
స్వామి విరచించె నద్భుత చక్రమొకటి,
చక్రనేమియౌ గీత, మా స్వామి చక్రి,
దుష్ఫలములను బాపు, చేదోడు గూర్చి,

అల్లదే వేణుగోపాల సల్లలితము
వంశి - దిశల మ్రోగెను స్వామి వచన మౌచు,
వంశియే స్వామి? - శాంతి సంపాదనమున
సర్వదేశమ్ములందున సంచరించు.

అది మధుర దరహాస దివ్యాననమ్ము
పలుకు గీతామృతము నింపు భాగ్యసీమ,
విశ్వశాంతికి 'ఓంకార' సుస్వరమ్ము
పలుకు పలుకుల ప్రతిగుండె పంచుకొనగ.

భగవదనుభవ కైంకర్య భద్రపీఠి
స్వామి చేతనము - కృపా సంభావనమ్ము
భక్తలోకమునకు కొంగు బంగరు ముడి,
విశ్వ శాంతికి సుమముల వెలుగుల జడి.

- రామానుజ దాసుడు,
**అంపోలు కృష్ణమాచార్యులు,**





## ఉచిత వైద్యశిబిరం

**చేబ్రోలు** : చేబ్రోలు వికాసతరంగిణి ఆధ్వర్యంలో 25వ తేదీనాడు 'తానా' వారి సహకారంతో హైపటైటిస్ - బి, వ్యాక్సిన్ వేయించడం జరిగింది. చేబ్రోలు వికాసతరంగిణి శాఖ అధ్యక్షులైన శ్రీ డా॥ సీతారామస్వామిగారు తమ అమూల్యమైన వైద్యసేవలను అందరికి అందజేస్తున్నారు.

**నిజామాబాద్** : నిజామాబాద్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో మారుమూల గ్రామీణ ప్రాంతాల ప్రజలకు ఉచిత ఆరోగ్యశిబిరం నిర్వహించ బడినది. ఈ కార్యక్రమములో 'IMA' కామారెడ్డి డాక్టర్లతో 40 శస్త్రచికిత్సలు నిర్వహించబడినవి. ఈ శిబిరమును 15 మంది డాక్టర్లు నిర్వహించిరి. ఈ శిబిరానికి వైద్య వృత్తిలో USAఉన్న డా॥ కవిత, కమలాకర్‌గార్లు ఆర్థిక సహాయం అందజేసినారు. ఈ కార్యక్రమంలో నిజామాబాద్ వికాసతరంగిణి అధ్యక్షులు టి. శ్రీనివాస్ మరియు లక్ష్మీరెడ్డి గార్లు పాల్గొన్నారు.

**సీతానగరం** : - సీతానగరం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో నిరుపేదరోగులకు కంటి ఆపరేషన్లు నిర్వహించినారు. ఈ కార్యక్రమంలో డా॥ ఎ. శ్రీనివాస్‌గారు **"Lions Club"** ద్వారా ఈ సేవలను అందజేయుచున్నారు.

## శ్రీవారి తిరునక్షత్రోత్సవము

**ఆర్తమూరు** : ఆర్తమూరు వికాసరతంగిణి శాఖ ఆధ్వర్యవంలో శ్రీవారి తిరునక్షత్రోత్సవము అత్యంత వైభవంగా 7రోజులపాటు జరుపుకున్నారు. శ్రీవారిపాదుకాపూజ, సాధుపుంగవులకు నిరుపేదలకు వస్త్రదానం, తదీయారాధన నిర్వహించారు. కార్యక్రమమంలో అన్వయించిన భక్తులను వస్త్రములతో సత్కరించి, శ్రీస్వామివారి చిత్రపటము, జ్ఞాపికగా అందజేసినారు.

**అనంతపూర్** : - అనంతపూర్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో శ్రీవారి తిరునక్షత్రోత్సవం వైభవంగా జరుపుకున్నారు. సాయంత్రం గం॥ 5-30 ని॥ల నుండి శ్రీనివాస పద్మావతి కళ్యాణ మండపము నందు. విష్ణుసహస్రపారాయణాది కార్యక్రమాలు భక్తజన రంజకంగా నిర్వహించారు.

## ఈ సంచికలో........



## పంచాంగ వివరాలు

### ఫిబ్రవరి 2002

12 కుంభ సం॥ రా. 2-21
13 విదియ తిథి
14 శూన్య తిథి
15 తదియ తిథి, శుక్రమౌఢ్య త్యాగం
19 రథసప్తమి
22 తిరుక్కచ్చినంబి తిరునక్షత్రం
23 సర్వేషాం భీష్మైకాదశి,
శ్రీవిష్ణు సహస్రనామ జయంతి
24 కులశేఖరాళ్వార్ తిరునక్షత్రం
తిరుమాలైయాండాన్ తిరునక్షత్రం
27 వ్యాసపూర్ణిమ, తిథి ద్వయం

### మార్చి 2002

9 సర్వేషామేకాదశి
12 మహాశివరాత్రి
శ్రీశైలాది శైవ క్షేత్రములలో అభిషేక కళ్యాణోత్సవములు
13 సర్వేషాం అమావాస్య
14 మీన సంక్రమణం రా॥ 10-3

## ముఖచిత్రపరిచయం

1. చెన్నై నగరంలో శ్రీమాన్ డా॥ పి.సి. రెడ్డిగారి ఆధ్యక్షతలో, శ్రీమతి ఆనందకుమారిగారి నేతృత్వంలో ఏర్పడ్డ ధనుర్మాస కమిటీ.
2. శ్రీస్వామివారి మంగళాశాసనములు అందుకుంటున్న శ్రీమాన్ సి.ఎస్. శ్యాంమోహన్‌గారు (భాగ్యనగర్ ధనుర్మాస కమిటీ అధ్యక్షులు)
3. గోదాకళ్యాణంలో శ్రీస్వామివారిని సంభావిస్తున్న భాగ్యనగర గోష్ఠి.
4. కూడారై ప్రసాదంతో చెన్నై భక్తగోష్ఠి
5. శ్రీవిల్లిపుత్తూర్ ఆండాళ్‌సన్నిధి చిలుక ప్రతిరోజూ మన ధనుర్మాస ఆండాళ్‌ను పలుకరించేది.
6. శ్రీమాన్ పరమేశ్వరదీక్షితార్‌గారు నటరాజ్ ఆలయంలో ఏర్పాటు చేసిన వార్షిక వేదసభలో పాల్గొనటానికి, శ్రీశ్రీశ్రీ జీయర్ స్వామివారు చిదంబరం వేంచేసారు.


మీసేవలో :-

**భక్తినివేదన**, సీతానగరం-522 501, గుంటూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 72929

**చందా : సంవత్సర చందా రూ. 50/-, జీవిత చందా రూ. 500/-, విదేశాలకు సంవత్సర చందా $ 25**

***E-mail :*** jetsitanagaram@yahoo.com ***Internet :*** www.chinnajeeyar.org

***DTP & Design by : పరిశోధనాలయమ్ JET - Sitanagaram-522 501***

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం, గుంటూరుజిల్లా.

*1/Bn/Bnfeb02.p65*


శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

## ఆధ్యాత్మిక మాసపత్రిక


సంపుటి 54 | 2002 ఫిబ్రవరి | సంచిక 11

వృష నామ సంవత్సరము | మాఘ మాసము

సంపాదకులు : శ్రీ ఉ.వే. శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు


*Founder:*

*HIS HOLINESS* ***SRI SRI SRI***

***TRIDANDI SRIMANNARAYANA RAMANUJA JEEYAR SWAMI VARU***

# శ్రీవారి భగవద్గీత - 10

(1వ అధ్యాయము)

ప్రియ భగవద్బంధువుల్లారా!

భగవద్గీత మనల్ని మంచి మార్గాన్ని అవలంబించేలా చేయగలిగిన ఒక మహోత్కృష్టమైన గ్రంథరాజం. ఆధ్యాత్మిక గ్రంథాలన్నింటిలో శిరోభూషణమైన గ్రంథం. శ్రీకృష్ణుడు దానిని అర్జునుని వ్యాజంగా పెట్టుకొని ఉపదేశం చేసాడు. అర్జునుని వినేవాడుగా తాను తయారుచేసుకున్నాడు. అర్జునుని మీద దయకాదు. మన మీద ఉండే కృపచేత. భారతయుద్ధం జరగటానికి ముందు చేశాడీ ఉపదేశాన్ని. భారతయుద్ధ రంగాన్ని తనే సమకూర్చుకున్నాడు. యుద్ధ రంగం సిద్ధమైంది. రాయబారం పాడైంది. పాడవడం శ్రీకృష్ణుని చేతకానితనం వల్లకాదు. శ్రీకృష్ణుని చేతనైనతనం వల్లనే పాడైపోయింది.

రాయబారం కోసం దుర్యోధనుడి దగ్గరికే వెళ్ళవలసిన శ్రీకృష్ణపరమాత్మ, దుర్యోధనుడు స్వాగతంపలుకుతూ కలశంపట్టుకుని గుమ్మంలో ఉంటే, అతన్ని దాటుకుంటూ ఎటో వెళ్ళిపోయాడు. ఒక వేళ రాజునైన నాయింట్లో తినడో ఏంటో! కానీ! బ్రాహ్మణుడైన ద్రోణుని ఇంట్లో తింటాడేమోనని అక్కడా వసతి ఏర్పాటు చేసాడు. ఆచారం కలిగిన వారిల్లు కావాలేమో నని భీష్ముని ఇంటా ఏర్పాటు చేసాడు. ఒకవేళ దాతగా ఉండేవారి ఇంట్లో తింటాడేమోనని కర్ణుని ఇంట్లోనూ ఏర్పాటు చేసాడు. ఇవన్నీ దాటుకుంటూ వెళ్ళిపోయాడు శ్రీకృష్ణుడు.

**"విదురాన్నాని బుభుజే శుచీని గుణవంతి చ"** అని మన పరాశర మహర్షి చెప్పారు. విదురుడు పెట్టిన అన్నం తిన్నాడు. అన్నమే పెట్టాడో, పండ్లేపెట్టాడో విదురుడు, మనకు తెలియదు. అసలు పండ్లేపెట్టాడో, తొక్కలే పెట్టాడో కూడా తెలియదు. కానీ, అవే తిని వచ్చాడట శ్రీకృష్ణుడు. అంతేకాదు తరువాత 'ఆహా! ఎంతరుచి, ఎంత శుచి' అని కీర్తించాడు.

దుర్యోధనుడు అడిగాడు ఈ మాటవిని. "కృష్ణా! నీవు విశాలనేత్రాలు కలవాడివని అంటారే! మేము ఇంతమందిమి నీకు స్వాగతం పలకటంకోసం నిలబడి ఉంటే, నీకు కనిపించలేదా? ఎందుకు మమ్మల్ని దాటుకుంటూ వెళ్ళిపోయావు? ఆ విదురుడి ఇంటికి వెళ్ళి ఎందుకు తిన్నావు?" అంటూ, "ఏం చేస్తాం. నీ పదార్థాలలో రుచీ, శుచీ ఉండవు కనుక మీ ఇంటిలో తినడానికి రాలే"దన్నాడాయన. "చూశావయ్యా! మా వంటింటిని ఎప్పుడైనా? ఎంత శుచిగా ఉంటుందో! ఎపుడైనా రుచి చూశావా ఆ వంటకాలు? ఎంత రుచిగా ఉంటాయో! మళ్ళీవదలబుద్ధవదు ఎవరికైనా సరే!" అన్నట్టు మాట్లాడాడు దుర్యోధనుడు.

శ్రీకృష్ణుడు నవ్వాడు. "నాక్కావల్సిన శుచి, నాక్కావలసిన రుచి రెండూ లేవు. శుచి అంటే మురికి లేకుండటం, రుచి అంటే మనస్సుకు నచ్చేట్టుండటం కదా! దుర్యోధనా! నీ వందించే వస్తువుల్లో "నేను చేస్తున్నాను" అనే ఒక స్వార్థం కలిసి ఉంది. ఇదే మాలిన్యం అంటేను. స్వార్థం అనేది ఎక్కడ చేరి ఉంటుందో, ఏ వస్తువుతో చేరి ఉంటుందో, అది మురికి వస్తువు అవుతుంది. నాకీ మురికి అక్కరలేదు. కనుక నీవర్పించే వస్తువుల్లో శుచిలేదు"అన్నాడు శ్రీకృష్ణుడు. 'మరి రుచో, నువ్వు చూశావా ఎప్పుడైనా?' అడిగాడు





దుర్యోధనుడు కోపంగా. 'ఆ! చూశాను. రుచి అంటే మనస్సుకి ఆనందాన్ని కలిగించేది. అదీ ప్రేమ. వస్తువెట్లా ఉంటుంది అనేది కాదు. ప్రేమకలసి ఉంటే అదే రుచి'.

అమ్మగంజి నీళ్ళుపోసినా ప్రేమతో పోస్తుంది కనుక పిల్లలు ఆనందంతో దాన్ని ఆస్వాదించగల్గుతారు. ఎవడో ఒకడు, సంబంధంలేనివాడో మరొకడో మంచి బ్రహ్మాండమైన ఖరీదైన వస్తువులు పట్టుకొచ్చి పెట్టినా, ప్రేమ కలిసి ఉండని వస్తువు అయితే అది తినబుద్ధికానేకాదన్నమాట.

"దుర్యోధనా! నీవు పెట్టే వస్తువుల్లో ప్రేమలేదు. కపటం కలిసి ఉంది కనుక అవి రుచి లేని వస్తువులు. నేను చేస్తున్నాను అనేస్వార్థం ఉంది కనుక శుచి లేనివస్తువులు. విదురుడి దగ్గర అవి రెండూ ఉన్నాయి కనుక నేను అక్కడికే వెళ్ళాను. అదీగాక నీకు ఒక నియమం తెలియదు కాబోలు. శత్రువు ఇంటికి వెళ్ళి భోజనం చేయకూడదు. శత్రువు ఇంటికి వస్తే భోజనం పెట్టకూడదు. తెలుసునా? దుర్యోధనా" అని అడిగాడు.

సంధి కుదర్చడానికి వచ్చినవాడి మాట లేనా ఇవి? "ఏదో నామిత్రుడున్నాడిక్కడ, చాలా కాలంగా పిలుస్తున్నాడు. ఇప్పటిదాక వెళ్ళే అవకాశం కలుగలేదు. ఎలాగూ వచ్చాను కదా రెండు పనులు చేసుకుపోదాం! అని అనుకుంటూ అక్కడికి వెళితే, అతనూ ఏదో నిర్బంధించాడు. తినేసి వచ్చానులేవయ్యా!" అని ఉంటే మరో రకంగా ఉండేదేమో సన్నివేశం. కానీ, కృష్ణుని యొక్క అభిప్రాయం సంధిని కుదర్చడంకాదుకదా, సంధిని పాడు చేయటం. యుద్ధానికి సిద్ధం చేయటం కదా! అందుకే నీయింటికి నేను భోజనానికి రాలేదు. ఒకవేళ నే వచ్చినా నువ్వు పెట్టకూడదయ్యా!" అని మొహం మీదే చెప్పాడు శ్రీకృష్ణుడు.

పాపం! బాధవేసింది దుర్యోధనుడికి. "నిజమే కృష్ణా! పాండవులూ మేమూ అన్నదమ్ములం. ఆస్తి పంపకాలలో శత్రుత్వం వస్తుంది. కొట్టుకుంటాం, తిట్టుకుంటాం, కలుస్తాం, ఏదో చేస్తాం. పాండవులతో నీకెట్లాంటి సంబంధమో, మాతోకూడ నీకు అట్లాంటి సంబంధమే కదా. ఇరువురికికూడ సమాన బాంధవ్యమే నీతో ఉందికదా! నీతో మాకుగాని, పాండవులకు గానీ ఎలాంటి తగాదాలు లేవుకదా! మరి మమ్మల్ని శత్రువని ఎందుకంటావయ్యా" అని అడిగాడాయన. దానికి కృష్ణుడు చెప్తాడు. "నువ్వు పాండవుల్ని ద్వేషిస్తున్నావా లేదా?" "చెప్పానుకదా!" అన్నాడు రాజు. దానికి కృష్ణుడు "అందుకే శత్రువయ్యావు నువ్వు" అని అన్నాడు.

అంతేకాదు. **"మమ ప్రాణా హి పాండవాః"**. పాండవులంటే నా ప్రాణాలు. 'నాకు మీ ప్రాణం అంటే ఇష్టంలేదండీ, మీరంటే మాత్రం భలే ఇష్టం. మీ ప్రాణం తీసేస్తానండి'. మిమ్మల్ని మాత్రం చాలబాగా ప్రేమిస్తున్నానండి" అని అంటే అదిఎంత హాస్యాస్పదమో, కృష్ణా! మేం పాండవులనే ద్వేషిస్తున్నాము. నిన్ను మేము ప్రేమిస్తున్నాం. నువ్వంటే మాకు గౌరవం ఆదరం భక్తి ఉందయ్యా!" అని అన్నా అంతే హాస్యాస్పదం కదా! అందుచేత, నువ్వు పాండవుల్ని ద్వేషిస్తున్నావంటే నన్ను ద్వేషిస్తున్నట్లే. నాకు కూడా నువ్వు శత్రువే అవుతావు కనుక నీయింటికి నేను భోజనానికిరాలేదు. విదురుడింటికి వెళ్ళాను అనిచెప్పాడు శ్రీకృష్ణుడు. ఇలా మాట్లాడిన తరువాత, ఇక రాయబారం ఏం కుదురుతుంది కనుక. తాను అనుకున్న విధంగానే రాయ బారాన్ని పాడుచేసాడు. తరువాత జరిగిన సంఘటనలను మరుసటి సంచికలో చూద్దాం.

(శ్రీవారి ప్రవచనం నుండి)

# సముద్రం దప్పిక తీర్చదు

### సంపాదకీయం

అప్పనంగా వచ్చింది కదా అని తింటే అది అరగదు. మనం అనుభవించేది అన్యాయార్జితం, అక్రమార్జితం కాకూడదు. మనం ఆర్జించలేదు, మనం అక్రమాలు, అన్యాయాలు చెయ్యలేదు. వారెవరో ఇచ్చేరు, అనుభవించేం అంటే కుదరదు. వారిచ్చినా తింటున్నది నువ్వు కనుక దాని ఫలితాన్ని నువ్వనుభవించాల్సిందే.

ఒకరి ఆతిథ్యం స్వీకరించాలన్నా ఆ ఆతిథేయుని ద్రవ్యశుద్ధి తెలిసికొని కానీ అంగీకరించేవారు కాదు, యోగ్యులైనవారు.

కేకయరాజు అశ్వపతి దగ్గరకు సందేహనివృత్తికోసం ప్రాచీన శాలాదులు ఆరుగురు బ్రహ్మజ్ఞానులు వస్తారు. అతడు వారిని తన ఆతిథ్యం స్వీకరించమంటూ తనది పాపపు డబ్బు కాదు కనక మీరు సందేహించనక్కరలేదు. నా ఆతిథ్యాన్ని అంగీకరించడానికి అంటాడు. విష్ణుచిత్తుల వారు న్యాయార్జితవిత్తంతో తదీయారాధన చేస్తున్నారంటారు రాయలవారు.

అందుకే దొరికింది కదా అని ఏది పడితే అది ఒడి పట్టకూడదు. అందునా సాధువులు అంటున్నాడు నీతికారుడు.

స్వల్పాపి సాధుసమ్పు-
ద్భోగ మహతాం న పృథ్వ్యపి ఖలశ్రీః
సారసమేవ పయస్తృష-
మపనయతి న యాదసాం పత్యుః

సుజన సంపద స్వల్పమే అయినా యోగ్యులకు భోగ్యమవుతుంది. నీచుల దగ్గర గొప్ప ఐశ్వర్యం ఉన్నా అది యోగ్యులకు ఉపకరించదు. చెరువులోని నీరు దప్పిక తీర్చినట్లు సముద్రపు నీరు తీర్చదుకదా!

సంపద ఎక్కువున్నా సంపదే. దొంగ చేత ఉన్నా దొరచేత ఉన్నా వంద రూపాయల నోటు విలువ వంద రూపాయలే. కనక సంపదలు ఎక్కడున్నా వాటిని వాడుకోవచ్చును అన్నది కొందరి మతం, కాని, దాన్ని నీతికారుడు ఒప్పు కోవడం లేదు. సంపద విలువ అది ఉన్న చోటునుపట్టి అది వచ్చిన తీరునుబట్టి ఉంటుంది. పాండవుల రాజసూయంలో ద్రవ్యశుద్ధి లేకపోవడమే తరువాతి అనర్థల కన్నిటికీ మూలమైనదని అభియుక్తుల అభిప్రాయం. అంచేత అనుభవించే ముందు ఆ ద్రవ్యం గుణదోషాలు విచారించి మరీ అనుభవించాలి.

సాధుజనులున్నారు. వారి దగ్గర తగుమాత్రం సంపదలున్నాయి. ఉన్నవి తక్కువే అయినా అవి న్యాయార్జితాలు. మంచివారికి అట్లాంటివే అనుభవ యోగ్యాలు. సంపద ఎంత అనికాక, ఎల్లాంటిది అన్నది చూడాల్సింది.

ఒక నీచుడి దగ్గిర అనంతైశ్వర్యం పోగులుపడి ఉండవచ్చు. అది వచ్చిన తీరూ





యోగ్యం కాదు, అది ఉన్న చోటూ యోగ్యం కాదు. అంచేత మహానుభావులైనవారు అనుభవించదగినది కాదు. ఎక్కువ తక్కువలు కాదు చూడాల్సింది, దాని యోగ్యత ఎల్లాటిది అన్నది చూడాలి.

సముద్రంలో అగాధంగా అపారంగా నీరుంది. కానీ, దాహం తీర్చుకుందుకు అది పనికొస్తుందా? చెరువులోని నీరు సముద్రంతో పోలిస్తే అత్యల్పం. అయితే ఏం? పుడిసెడు నీరు తాగితే దప్పిక తీరుతుంది.

నీ దప్పిక తీర్చేది కావాలి కాని, ఎంతుందనేది కాదు, సముద్రంలో నీరు ఎక్కువే ఉండవచ్చుగాక! చెరువులో నీరు తక్కువే గావచ్చుగాక! దప్పిక గొన్నవాడు చెరువు దగ్గరకు వెడితే దప్పిక తీరుతుంది కానీ, సముద్రం దగ్గరకు వెడితే దప్పిక తీరుతుందా?

అట్లాగే గొప్పవారు సాధుసంపదలు (అవి తక్కువే అయినా) అనుభవింపదగును గాని, నీచ సంపదలు అనుభవింపరాదు, అనుభవించలేరు.

- శ్రీరామచంద్రాచార్య.

# శ్రీ విష్ణు మహా పురాణము

## తృతీయాధ్యాయం

శ్రీ.ఉ.వే.శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, కొవ్వూరు

ప్రాకృతిక గుణాలు లేనివాడు, విశుద్ధుడు, నిర్మలుడు అయిన పరమాత్మకు సృష్ట్యాదికర్తృత్వం ఎలా కుదురుతుంది? అని మైత్రేయుడు ప్రశ్నించాడు. పరాశరమహర్షి చెబుతున్నాడు. ఆధునిక వైజ్ఞానికులు చెప్పే "The Theory of Conservation of energy" శక్తి స్థైర్య వాదానికి సంబంధించిన బీజాలు విష్ణు పురాణంలోనే ఉన్నాయని చెప్పడానికి పరాశరమహర్షి పేర్కొన్న ఈ వచనమే ప్రమాణం అవుతున్నది.

**"శక్తయః సర్వభావానా మచింత్యజ్ఞాన గోచరాః।**
**యతోఽతో బ్రహ్మణ స్తాస్తు మంతవ్యా భావశక్తయః॥"**
**(1-3-2)**

ఈ సృష్టిలో సర్వపదార్థాలకు చెందిన **'శక్తులు'** బుద్ధిగోచరాలు కావు. ఈ పదార్థ శక్తులన్నీ పరమాత్మకే చెంది ఉన్నాయి. అంటే అత్యుత్కృష్టమైన ఒక **'అద్భుతశక్తి'** అదే పారమాత్మిక శక్తి, ఈ శక్తియే జీవ-ప్రకృతి శక్తులుగాను, వాటికి మూలమైన వైష్ణవీశక్తి గాను ఉన్నదన్నమాట.

ఈ వైష్ణవీ శక్తియే సమస్త సృష్టికీ మూలమై ఉంది. ఇటువంటి **'శక్తి'** గురించి విష్ణుపురాణం పలుతావుల్లో ప్రస్తావించింది. పరమాత్మ అయిన మహావిష్ణువులో రెండు శక్తులున్నాయని. **1.** సిసృక్షాశక్తి, **2.** సృజ్యశక్తి అని కూడా విష్ణుపురాణం 5వ అధ్యాయం చివర చెప్పింది.

**కరో త్యేవంవిధాం సృష్టిం కల్పాదౌ స పునః పునః।**
**సిసృక్షా శక్తియుక్తోఽసౌ సృజ్యశక్తి ప్రచోదితః॥ (1-5-67)**

ఇలాంటి సృష్టిని కల్పాది యందు బ్రహ్మరూపి అయిన జనార్దనుడు చేస్తూ ఉంటాడు. ఇలా చేసేటప్పుడు 'సిసృక్షాశక్తి'తో కూడిన వాడై 'సృజ్యశక్తి'చే ప్రేరితుడై సృష్టిచేస్తాడన్నమాట. 'సిసృక్షాశక్తి' అంటే సృజించాలనే సంకల్పశక్తి, 'సృజ్యశక్తి' అంటే సృజింపబడే వస్తువులకు సంబంధించిన శక్తి. ఈ శక్తులతో సంకల్ప శక్తియే మూలవైష్ణవ శక్తి కాగా, సృజ్యశక్తియే జీవ- ప్రకృతి శక్తులుగా ఉన్నదని చెప్పాలి. ఎందువల్లనంటే, ఈ మూడు శక్తులగురించి విష్ణుపురాణం చాలా స్పష్టంగా ముందు అధ్యాయాల్లో పేర్కొన్నది. వాస్తవానికి ఆ విషయం అక్కడే ప్రస్తావించవలసి ఉన్నా, ప్రస్తుతంలో ఉపకరిస్తుంది కనుక ఇక్కడే దాన్ని ప్రస్తావించడం జరుగుతున్నది.

**విష్ణుశక్తిః పరాప్రోక్తా క్షేత్రజ్ఞాఖ్యా తథాపరా।**
**అవిద్యాకర్మ సంజ్ఞాన్యా తృతీయా శక్తి రిష్యతే॥**





విష్ణుశక్తి సర్వోత్కృష్టమైంది. రెండవది క్షేత్రజ్ఞశక్తి. అదే జీవరూపంగా ఉంటుంది. మూడవది కర్మశక్తి. ఇదే కర్మపరిణామ రూపమైన ప్రకృతిగా ఉంటుంది. ఇలాగే బ్రహ్మవిష్ణు శివాత్మకమైన త్రివిధశక్తులు సృష్టి స్థితి లయాలకు కారణాలని అవి మూడు వైష్ణవశక్తులని విష్ణుపురాణం పేర్కొన్నది.

**"సృష్టిస్థితివినాశానాం శక్తయః సర్వదేహిషు।**
**వైష్ణవ్యః పరివర్తంతే మైత్రేయా హర్నిశం సదా॥**

ఇలాగే ఈ వైష్ణవ శక్తియే ఆదిత్యాదుల్లో ఉంటుందని కూడా విష్ణుపురాణం పేర్కొన్నది.

**"విష్ణుశక్తి రవస్థానం సదాదిత్యే కరోతి సా।**
**ఏవం సా సాత్త్వికీశక్తిః వైష్ణవీ యా త్రయీమయీ॥"**

**"శక్తయో యస్య దేవస్య బ్రహ్మవిష్ణు శివాత్మికాః।**
**భవన్య భూత పూర్వస్య తద్విష్ణోః పరమం పదమ్॥"**

ఇలా ఈ సృష్టిఅంతా వైష్ణవ శక్తిమయ మని విష్ణుపురాణం ఉద్ఘోషిస్తున్నది. ఈ శక్తియే ఈ సృష్టిగా ఏర్పడుతున్నదన్నమాట. అంటే, ప్రతి వస్తువులోను అంతర్గతంగా ఆ 'శక్తి పరిణామ' వాదానికి సూచన మాత్రమే. అయితే వేదాన్తులు కొందరు ఈ శక్తి పరిణామ వాదాన్ని అంగీకరించారు. మధ్వ సంప్రదాయంఇదే. రామానుజ సంప్రదాయం దీన్ని వేరేవిధంగా నిర్వచించింది. ఆ దర్శన సిద్ధాన్తవిచారం ఇక్కడ ప్రస్తుతంకాదు.

ఇక ఈ మూడవ అధ్యాయంలో బ్రహ్మమానాన్ని అనుసరించి రెండు పరార్ధాలు బ్రహ్మాయుర్దాయం కాగా, ఒక్కొక్క పరార్ధం ఏభై సంవత్సరాలని, ఈ కాలమూ వైష్ణవ స్వరూపమేనని ఇది పరిణామ హేతువని కూడా పేర్కొనబడింది.

**"కాల స్వరూపం విష్ణోశ్చ....... పరిణామో పపాదనమ్॥**

15 నిమేషాలు ఒక కాష్ఠ, 30 కాష్ఠలు ఒక కల, 30 కలలు ఒక క్షణం, 12 క్షణాలు ఒక ముహూర్తమని, 30 ముహూర్తాలు ఒక దినము (రాత్రింబవళ్ళు) అని పద్మ-భవిష్యాది పురాణాలు చెబితే, విష్ణుపురాణం.

**కాష్ఠా పంచదశాఖ్యాతా నిమేషా మునిసత్తమ।**
**కాష్ఠాః త్రింశత్ కలా, తాస్తు త్రింశన్మౌ హూర్తి కోవిధిః॥**

నిమేషాలు 15 కాష్ఠ, 30 కాష్ఠలు కల, 30 కలలు ముహూర్తం అని విష్ణుపురాణం నిర్దేశించింది. మత్స్య పురాణం కూడా ఇలాగే చెప్పింది. 30 ముహూర్తాలు దినమని (అహోరాత్రమని) అంతటా సమానమే. పక్ష, మాస, ఆయన సంవత్సరాది, లౌకిక ప్రమాణాల్ని చెబుతూ- దక్షిణ-ఉత్తరాయణాలు దేవతలకు రాత్రింబవళ్లని అంటే మనకు ఒక సంవత్సరం దేవతలకు ఒక రోజని ఈ విధంగా 4,3,2,1 వేల సంవత్సరాలు దేవ ప్రమాణంలో కృత-త్రేతా, ద్వాపర - కలియుగాలని 400, 300, 200, 100 దివ్య వర్షాలుగా సంధికాలమని ఇలాంటి చతుర్యుగాలు వేయి (1000) బ్రహ్మకు ఒక పగలని కాలప్రమాణం చెప్పింది ప్రమాణం. బ్రహ్మకు సంబంధించిన ఒక పగటి భాగంలో 14 మంది మనువులు పరిపాలకులుగా ఉంటారని పేర్కొన్నది.

సప్తర్షులు, దేవతలు, ఇంద్రుడు, మనువు అంతా సృజింపబడేవారే.

**'సప్తర్షయః సురాః శక్రో మనుః తత్సూనవో నృపాః।**
**ఏకకాలే హి సృజ్యన్తే సంహ్రియన్తే చ పూర్వవత్॥**

వీరంతా ఏకకాలంలోనే సృజింపబడతారు. ఉపసంహరింపబడతారు. ఒక్కొక్క మనువు పరిపాలించే కాలం మన్వన్తరం అని అంటారు. ఇది 71 చతుర్యుగాలకాలం. దేవతలుకూడా ఇంతవరకే ఉంటారు. 8,52,000 సంవత్సరాలు దివ్యమానంలోను, 30,67,20,000 సంవత్సరాలు మానవ కాలపరిగణనంలోను ఒక్కొక్క మన్వంతర కాలం పరిగణింపబడుతుంది. ఇలాంటివి 14 జరిగితే, అంటే 14మన్వంతరాలు అయితే బ్రహ్మకు ఒక పగలు. ఇది పూర్తి అయిన తరువాత నైమిత్తిక ప్రలయం ఏర్పడుతుంది. అప్పుడు మూడు లోకాలు అన్ని దహింపబడతాయి. మహర్లోకంలో నివసించేవారంతా తాపార్తులై జనలోకంలో ప్రవేశిస్తారు.

**'ఏకార్ణవే తు త్రైలోక్యే బ్రహ్మ నారాయణాత్మకః।**
**భోగి శయ్యాగతః శేతే త్రైలోక్యగ్రాస బృంహితః॥"**

ముల్లోకాలు నైమిత్తిక ప్రలయ కారణంగా జలమయంకాగా చతుర్ముఖ రూపుడైన నారాయణుడు శేషశయ్యపై అధివసించి ముల్లోకాలను గ్రసించడంచేత సువిస్తృతదేహుడై ఉంటాడు. పగటి ప్రమాణం ఎంతటిదో అంతే రాత్రి ప్రమాణకాలం పూర్తి కాగానే జనలోకస్థులైన యోగులచే ధ్యాయమానుడైన నారాయణుడు సృష్టిచేస్తాడు.

**'శతం హి తస్య వర్షాణాం పరమాయుః మహాత్మనః।**
**ఏకమస్య వ్యతీతం తు పరార్ధం బ్రహ్మణో అనఘ॥"**

ఇలా రాత్రింబవళ్ళు దేవమానంలో 100 సంవత్సరాలు కాగానే బ్రహ్మయొక్క ఆయుః ప్రమాణం పూర్తిఅవుతుందని శ్రీవిష్ణుపురాణం తెలుపుతుంది.

## న్యాస తిలకమ్

సంస్కృతంలో శ్రీ వేదాంత దేశికులు న్యాసవిద్యను వివరిస్తూ చాలా గ్రంథాలు అనుగ్రహించేరు. వాటిలో 32 శ్లోకాల **'న్యాసతిలకమ్'** ప్రముఖం. దీనికి దేశికస్వాముల కుమారులు **వరదాచార్య స్వామివారు** ఒక వ్యాఖ్యానాన్ని ప్రసాదించేరు. ఇది సంగ్రహరూపం.

శ్రీభాష్యం శ్రీనివాసాచార్యులవారు ఒక విపులమైన సంస్కృత వ్యాఖ్యానాన్ని అనుగ్రహించేరు.

**ఉ.వే.ప్ర. శ్రీమాన్ కిడాంబి తిరువేంగళ రామానుజాచార్య స్వామివారు** (నెల్లూరు) శ్రీభాష్యం వారి వ్యాఖ్యానాన్ని ఆంధ్ర టీకా తాత్పర్య సహితంగా చేర్చి ఈ న్యాసతిలకాన్ని తెలుగువారి ఉపయోగం కోసం ప్రకటించేరు.

వరదాచార్య వ్యాఖ్యానాన్ని కూడా ఇందులో ముందు చేర్చేరు. సంప్రదాయపరులకు సర్వథా ఉపాదేయంగా ప్రామాణికంగా వెలువడిన

ఈ గ్రంథం వెల రూ. 20/-

ప్రతులకు

**1.ఉ.వే.ప్ర. శ్రీమాన్ కె.టి. రామానుజాచార్యులు,**
వానమామలై మఠం, మూలపేట.
నెల్లూరు - 524 003

**2. శ్రీరాయవరపు బదరీనారాయణ**
డో.నెం. 15/247, బృందావనం,
నెల్లూరు.





## శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో శ్రీ వాసుదాసాశ్రమములో వేంచేసియున్న శ్రీరాజ్యలక్ష్మి తాయార్లకు లక్షమల్లె పుష్పార్చన, శ్రీ లక్ష్మీనారాయణ యాగసహిత , శ్రీకోదండ రామచంద్రస్వామివారి

## బ్రహ్మోత్సవముల ఆహ్వానపత్రిక

**ప్రారంభం - 16-3-2002** **సమాప్తి - 29-3-2002**

### నడిగడ్డపాలెంలో ధ్వజస్తంభ, ఆంజనేయస్వామి కలశ ప్రతిష్ఠా మహోత్సవం

గతంలోవలెనె శేష, హంస, గజ, హనుమ, మోహినీ, గరుడ, అశ్వవాహన సేవలు, రధోత్సవం యిత్యాదులు విశేషంగా జరుగుతాయి. సమిష్టి పుష్ప, పూజా కార్యక్రమాలు జరుగనున్నాయి. అంతేకాకుండా ఫాల్గుణ పౌర్ణమి, ఉత్తరా నక్షత్రం లక్ష్మీతాయార్ల తిరునక్షత్రం. ఆ రోజున, శ్రీవారి శ్రీహస్తాలతో సహస్ర కలశాలతో క్షీరాభిషేకం వైభవంగా జరుగనున్నవి. అంతటి ఆనందదాయకమైన పవిత్ర కార్యక్రమంలో పాల్గొని తరించుదాం.

### విశేషకార్యక్రమములు

21-3-2002 ఉ॥ గం॥ 10-00లకు ఉత్సవారంభ అభిషేకం
సా॥ గం॥ 6-00లకు ఉత్సవ అనుజ్ఞ, విష్వక్సేనారాధన, పుణ్యాహవచనం, రక్షా బంధనం, మృత్ సంగ్రహణం, అంకురారోపణ, హవనం, వైనతేయ ప్రతిష్ఠ.
22-3-2002 ఉదయం ధ్వజారోహణం (సంతాన గరుడ ప్రసాదం), రాత్రి శేష వాహనం
23-3-2002 రాత్రి హంస వాహనం, 24-3-2002 రాత్రి గజవాహనం
25-3-2002 రాత్రి హనుమద్వాహనం
26-3-2002 ఉదయం మోహిని అలంకారం, రాత్రి గరుడ వాహనం ఎదురుకోలు
27-3-2002 ఉదయం సీతారామ కళ్యాణోత్సవం, లక్ష్మీనారాయణ కళ్యాణోత్సవం
రాత్రి అశ్వ వాహనం, దోపిడి ఉత్సవం
28-3-2002 ఉదయం ఉత్సవాన్త అభిషేకం, తాయార్లకు 1008 కలశములతో క్షీరాభిషేకం పూర్ణాహుతి, రధోత్సవం, ఆశీర్వచనం, యాగ ఉత్సవ పరిసమాప్తి.
మధ్యాహ్నం వసంతోత్సవం, చక్ర తీర్థం, అవబృధ స్నానం, రాత్రి శ్రీ పుష్పయాగం

### కైంకర్య వివరములు

ఒక రోజు పూర్తి యాజమాన్యం : 5,000/-, ఒక రోజు బ్రహ్మోత్సవ యాజమాన్యం : 3,000/ ఒక రోజు సహస్ర దీపారాధన, ఊయలసేవ : 1,500/-, ఒక రోజు అభిషేకోత్సవం : 200/- 7 రోజులు అభిషేకోత్సవం : 1,116/-, సమష్ఠిసహస్రనామ మల్లెపుష్ప పూజకు ఒకరికి : 75/ తదియారాధన (100 మందికి) : 1,500/-

ధన, వస్తు, ద్రవ్యములను, శ్రీకార్యం, శ్రీవాసుదాసాశ్రమము అనుపేర మనియార్డర్, బ్యాంక్ చెక్, డ్రాఫ్టుల ద్వారా (చుండూరు - ఆంధ్రా బ్యాంక్) పంపి రశీదు పొందగోరుచున్నాము.

శ్రీకార్యం, **శ్రీవాసుదాసాశ్రమమం,** నడిగడ్డపాలెం, పిన్ 522 318, గుంటూరుజిల్లా.
✆ : (08644) 76150, 76522,76260.

# తేనెవాక (మాధ్వీకఝరి)

## శ్రీతిరుమళిశైయాళ్వార్ - భక్తిసారులు

"మధురవాక్ శిఖామణి", "భాగవతామృతవర్షి"
- శ్రీమాన్ ఉ.వే. **సాతులూరి గోపాలకృష్ణమాచార్యస్వామి**, సింహాచలము.

అనాదినిధన అవిచ్ఛిన్న పాఠ సమ్ప్రదాయ అపౌరుషేయ ప్రమాణమగు వేదము చెప్పిన అర్థమునే తదుపబృంహణములగు ఇతిహాస పురాణాదులు కూడ తెలుపుచున్నవి. ఇతిహాసమున బ్రహ్మదేవుని వచనము

**"పద్మేదివ్యేఽర్కసంకాశే నాభ్యా ముత్పాద్య మామపి।
ప్రాజాపత్యం కర్మ సర్వం త్వయా మయి నివేశితమ్॥"**

"సూర్య ప్రభాభాసమానమగు నీ నాభీకమలమునందు నన్ను సృష్టించి ఈ జగత్తును సృష్టించుపని నీవు నాకొసగితివి" అనువచనము ఇచట స్మరింపబడతగినది. ఈ విషయమునే శ్రీభక్తిసారులు **'నాన్ముకనై నారాయణన్ పడైత్తాన్'** అని తెలిపినారు.

ఇక అటుపిమ్మట బ్రహ్మదేవుడు చేసిన సృష్టికి ఉపలక్షణముగ **నాన్ముకనుమ్ తాన్ ముకమాయ్ శఙ్కరనై త్తాన్ పడైత్తాన్** :- చతుర్ముఖుడును 'తాను ప్రధానుడుగ నుండి శంకరుని సృజించెను.' అని తెలుపుచున్నారు. **నాన్ముకనుమ్** - స్వరసాంకర్యము లేకుండ నాల్గువేదములను ఏకకాలమున ఉచ్చరించుటకు తగినట్లుగ నాల్గు ముఖములను కలిగిన బ్రహ్మదేవుడు, **తాన్ముగమాయ్**- తాను పొందిన వేద విజ్ఞానము నందు కాని, తాను చేయబోవు సృష్టి ప్రక్రియ యందుకాని ఎట్టి సందేహము కలుగుట కవకాశములేని ప్రధానుడైయుండి **'బ్రహ్మణశ్చాపి సంభూతః శివః'** అను రీతిని తానే ప్రధానుడైయుండి శఙ్కరుని సృజించెను.

**ఆర్ప్పొరుళై** - ఇతరులకు తెలియని రీతిగ వేదమను సముద్రమందు గంభీరముగ నున్న ఈ పరమార్థమును

**నాన్** - భగవదనుగ్రహమువలన అజ్ఞానమంతయూ నశించురీతిగ తత్త్వ జ్ఞానమును పొందిన నేను.

**ముఖమాయ్**- పరతత్త్వయాధాత్మ్యమును ప్రతిపాదించు వేదమునందుగల సారభూతమగు అర్థమును తెలుసుకొన్నవాడనై, ఇతరులచే అవిచాల్యమగు రీతిని.

**అందాది మేవిట్టు**- అందాదిరూపమగు ప్రబన్ధము నందు ఉంచి

**అఱివిత్తేన్** -మీ అనర్థమును చూడజాలక తెలియబఱచితిని.

**నీర్** - తెలుసుకొనుటకు యోగ్యతకల మానవ జన్మనందిన మీరు

**తేర్న్దు** - సంసారముయొక్క తక్కువదనమును, నేను చెప్పిన అర్థముయొక్క గొప్పదనమును యుక్తియుక్తముగ విచారించి.

**శిందామల్** - అనర్ఘమైన ఈ పరమార్థమును అశ్రద్ధతో జారిపోనీకుండా

**కొణ్మిన్** -మీ హృదయములోనికి హత్తుకొను రీతిగ స్వీకరింపుడు.

ఇట్లు శ్రీభక్తిసారులు తామ ఏ విధమైన సంకోచము లేకుండగ



భగవదనుభవము చేసుకొనువారై యుండియు, ఇట్లు పరులకుపదేశించుటకు కారణము లోకుల దుర్గతిని చూచి సహించజాలని వీరి అపారకరుణయే.

లోకములో తామే సర్వజ్ఞులనుకొని భ్రమించువారు వేదములో పేర్కొనబడు భగవానుని నామములు ఆపాతతః దేవతాన్తరముల నామములవలె తోచుటచే ఆ వాక్యములోని నామములకర్థము ఆయా దేవతలేయనిభ్రమించి, వారిని ఆశ్రయించుటద్వారా తమ జీవితమునంతనూ వ్యర్థపరచుకొని చివరికి సత్పురుషుల సదుపదేశము వలన పరతత్త్వయాధాత్మ్యమును తెలుసుకొని, తాము వ్యర్థముగ ఇంతకాలము గడిపి నందులకు వెత చెందుదురు.

కాని వారిచే ఆరాధింపబడిన ఆయా దేవతలను సృజించి, వారికి వాసస్థానములను కల్పించి, వారికి ఫలప్రదాన శక్తిని ఒసగినవాడు పరమకారుణికుడగు, సర్వేశ్వరుడగు శ్రీమన్నారాయణుడే అని తెలుసుకొనుటయేకదా తెలివియున్నందులకు ప్రయోజనము.

శ్రీ భక్తిసారులు తాము అనేక సంవత్సరములు అనేక మతములలోనికి ప్రవేశించి ఆయా దేవతలను ఆరాధించి ఆయా మత గ్రంథములను అధ్యయనముచేసి, ఆయా మతములయందు కొన్ని గ్రంథములను కూడ రచించునంతటి ప్రావణ్యముతో చాలాకాలము వ్యర్థపరచుకొనినారు.

చివరకు శ్రీపేయాళ్వార్లద్వారా పరమాత్మయగు శ్రీమన్నారాయణుని వైభవమును తెలుసుకొనినారు. పరమాత్మయందు అత్యంతప్రీతిని బొంది వేదవేదార్థసారము "ఈ పరమాత్మను ఆశ్రయించి శాశ్వతానందము నందుటయే" యని ఆయా మతములలోని దోషములను అన్నిటినీ బాగుగా తెలుసుకొని, నిర్దోషమైన, శాశ్వతానంద ప్రదమైన శ్రీమన్నారాయణ పరతత్వమును తెలుసుకొని, ఆయన చరణారవిందములను ఆశ్రయించి, ఆయన యొక్క గుణానుభవముతో పొద్దుపుచ్చుకొనుటయే అని నిష్కర్షించుకొనిన వారైనారు. కావున, తమవలెనే ఈ లోకులందరూ కూడా తమ సమయమును వ్యర్థపరచుకొనకుండగ ఆదియందే పరతత్త్వమును తెలుసుకొని ఆయన నాశ్రయించుటద్వారా శాశ్వతానందము నందవలెనను ఉదారాశయముతో తమ ప్రబన్ధమున శ్రీమన్నారాయణుని జగత్కారణత్వమును తెలుపుచూ ప్రారంభించినారు.

### శ్రీరంగనాథ దేవాలయ - జీర్ణోద్ధరణము

సికింద్రాబాద్ రాష్ట్రపతి రోడ్‌లోగల శ్రీరంగనాథస్వామివారి ఆలయము జీర్ణోద్ధరణ కార్యక్రమంలో 19-2-2002న ప్రారంభం అవుతుంది. **శ్రీశ్రీశ్రీ జీయరుస్వామివారు** 25-2-2002 సోమవారం ఉదయం వేంచేసి నూతనముగా ప్రతిష్ఠితులైన శ్రీరంగనాథస్వామివారికి ప్రథమ మంగళాశాసనమును చేయుటకును, ఆలయములో నూతనంగా నిర్మితమైన శయన మంటపమును (అద్దాల మంటపమును) తమ శ్రీహస్తములతో ఆవిష్కరిస్తారు.

- భక్తులందరికీ ఆహ్వానము.

6/Bn/Bnfeb02.p65

# మహర్షుల చరిత్ర - గౌతమ మహర్షి

తమిళమూలం : **వై. వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి**
తెలుగు సేత : **శ్రీ ఉ. వే. శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి,** విజయవాడ

**గౌతమి** ః- ఇది ఒక బ్రాహ్మణ స్త్రీ పేరు. ఈమె గౌతముని యొక్క భార్యగనో, కుమార్తెగనో, సోదరిగనో గౌతమ వంశమునందు జన్మించినదిగనో అయిఉండవలెను. ఈ వంశమునందు జన్మించిన వారి ఆచార ప్రకారవము కులమూలపురుషుడైన గౌతముని పేరుతోనే పిలువబడుచున్నది. గొప్ప ఉత్తమురాలు. మహత్త్వమే ఒక రూపుదాల్చినట్లు ఉన్నది. మహాభారతములో ఒక ముఖ్యమైన సంఘటన ఈమె చరిత్రయందు మనకు కనబడుచున్నది. ఆనుశాసనిక పర్వము ఈమె చరిత్రతోటే ఆరంభమగుచున్నది.

మహాభారత యుద్ధము ముగిసిన తర్వాత భీష్ముడు శరతల్పగతుడై తాను మరణించదలచిన ఏకాదశికై (భీష్మ ఏకాదశి) ఎదురుచూచుచుండెను. ఆ పుణ్య దినము ఇంకనూ రాలేదు. అంతవరకు ఇతడు మరణించ దలచలేదు. ఆ క్షణము సమీపించిన తరువాత జీవించుట అనునదియు లేదు. ఇది అంతయు అతడే నిశ్చయించు కొనిన విషయము. మరణ శయ్యపై నున్న అతనిని సమీపించి ధర్మరాజు ధర్మసూక్ష్మములను వినుచునే యుండెను. భీష్ముడు చెప్పుచునే యుండెను. శాంతి పర్వము అను పేరు పొందిన అద్భుతమైన ఈ ఉపదేశ పరంపర పూర్తి అయినది. కాని ధర్మరాజు మనసు శాంతించలేదు.

మహాభారత యుద్ధములో జరిగిన సంఘటనలన్నియు అతనికి జ్ఞాపకమున కొచ్చు చున్నవి. వారి సాహసకృత్యములును, ప్రతీకారమును తీర్చుకొన్న విధమును, చేసిన ద్రోహ కృత్యములును మనసునందు విజృంభించి క్షోభను కలిగించినవి.

అంతట భీష్ముని ధర్మరాజు ఈ విధముగ అడిగెను. ఇంత గొప్ప శాంతి పర్వమును విన్నను నా మనసునకు శాంతి లభించుటలేదే? ఏమి చేయుదును? అని ప్రార్థించెను. అంతట భీష్ముడు ధర్మరాజునకు గౌతమి కథను తెలియజేసెను. ఆ కథ వినిన పిమ్మట ధర్మరాజునకు మనసు శాంతించినది. ఆ గౌతమి కథ ఈ విధముగా నున్నది.

ఒక అడవిలో గౌతమి అను గ్రామీణ స్త్రీ ఉండేది. ఆమెకు ఒకే ఒక కుమారుడు. ఒక రోజు ఆ పిల్లవాడిని పాము కరచింది. వెంటనే ఆ బాలుడు చనిపోయాడు. అర్జునకుడు అను వేటగాడు ఈ ఘోరాన్ని చూచాడు. వెంటనే అతడు ఆ పామును వెతికి పట్టుకొని కట్టి తాళ్ళతో దానిని బంధించి తీసుకొని వచ్చి ఆ బ్రాహ్మణ స్త్రీ ముందుంచాడు. 'మీ కొడుకుని చంపిన

7/Bn/Bnfeb02.p65



పాము ఇదే. దీన్ని ఎలా చంపాలో చెప్పండి. నిప్పుల్లో పడేయమంటారా? ముక్కలు ముక్కలుగా నరికిపారేయమంటారా? లేదా ఇంకా ఏవిధంగా చెయ్యాలో తొందరగా చెప్పండి' అని అడిగాడు ఆ వేటగాడు.

గౌతమి ఇలా అంది 'ఓ మూర్ఖుడా! ఆ పాముని విడిచిపెట్టు. దానిని చంపవద్దు. దానిని చంపినంతమాత్రాన చనిపోయిన నా కుమారుడు తిరిగిరాడు. అంతేకాక ఆ కారణంగా నేను (మనము) నరకానికి పోవలసి వస్తుందని చెప్పింది. అని ఈ క్రింది శ్లోకం మనకు తెలియ చేస్తుంది.

**హత్వా చైనం నామృతః స్యాదయం మే**
**జీవ త్యస్మిన్ కోఽత్యయః స్యాదయం తే।**
**అస్యోత్సర్గే ప్రాణయుక్తస్య జన్తోః**
**మృత్యోర్లోకం కోను గచ్ఛే దనన్తమ్॥**
(మహాభారతం-13-1-23)

గౌతమికి తన కుమారుని చంపిన పాముని చంపి ప్రతీకారము తీర్చుకోవాలని అనే కోరికే లేదు. ధర్మసూక్ష్మ విషయాలలో గౌతమ వంశస్థులకు తెలియనిది లేదు కదా. పాపం వేటగానికి ఈ విషయం అర్థం కాలేదు.

అతడు ఆమెతో ఇలా అన్నాడు :- 'మంచి చెడ్డలు తెలిసిన ఓ అవ్వా! నువ్వు చెప్పిన ఈ ఉపదేశాలు సాధారణ స్థితులలో బాగానే ఉంటాయి. కాని ఇప్పుడు ఒక అసాధారణ స్థితిలో మనం ఉన్నాం. నీ కుమారుణ్ణి ఈ పాము అన్యాయంగా చంపేసింది. దానికి ప్రతీకారంగా ఈ పాము ప్రాణాలు తీసి దండించవలసి ఉంది. అందుచే ఈ సందర్భంలో నువ్వు సహనాన్ని చూపించడం తగినది కాదు. దీనిని చంపి తీరవలసిందే ' అన్నాడు.

గౌతమి ఇలా చెప్పింది : 'దీన్ని చంప కూడదు. నా కుమారుడి ఆయుష్షు తీరింది. వాడు చనిపోయాడు. దాన్ని గురించి నాకు కొంచెం కూడా బాధలేదు. అందుచే నాకు ఈ పాముమీద కొంచెం కూడా కోపంలేదు. దీన్ని విడిచిపెట్టు' అంది.

ఈ విధంగా ఇద్దరి మధ్యా వాగ్వివాదం చాలాసేపు జరిగింది. ఇంతలో వేటగాడిచే కట్టబడి ప్రాణ సంకటంలో ఉన్న ఆ పాము మనుషులు మాటాడినట్టు ఈ విధంగా చెప్పసాగాది.

**కోన్వర్జునక దోషోఽత్ర, విద్యతే మయి బాలిశ**
**అస్వతన్త్రం హి మామృత్యు ర్వివశం య దచూచుదత్।**
**తస్యాయం వచనా ద్దష్టో, నకోపేన న కామ్యయా**
**తస్య తత్కిల్బిషం లుబ్ధ, విద్యతే యది కిల్బిషమ్॥**

వీని భావమేమనగా :- 'ఓ వేటగాడా! ఈ విషయంలో నా దోషం కొంచెం కూడా లేదు. నేను పరాధీనుడనై ఈ పని చేశాను. యముడు నా చేత ఈ పనిని చేయించాడు. నాకు ఈ పిల్లవానిపై కోపమేమి లేదు. వీడిని చంపడం చేత నాకు ఒరిగేది ఏమీ లేదు. ఏదైనా దోషము ఉంటే అది ఆ యముడిదే' అని పలికింది ఆ పాము.

వేటగాడు, పాము వీరిద్దరి మధ్య చాలసేపు వాదన జరిగింది. అంతలో యముడే అక్కడ ప్రత్యక్షమయ్యాడు. తరువాత ఏం జరిగిందో తెలుసుకోవాలంటే మరుసటి సంచిక కోసం వేచిచూడాల్సిందే.



# భగవద్రామానుజ చరిత్ర

శ్రీమతి T.K. చూడామణి, విజయవాడ.

చోళరాజు రామానుజుల కోసం గాలిస్తూనే ఉన్నారు. అతని వీరశైవ చింతన ఎంత మంది ప్రాణాలో బలిగొంది. అయినా తన ప్రయత్నాలు మానలేదు. వైష్ణవ ఆలయాలు ధ్వంసంచేసి అందులోని విగ్రహాలను పగలగొట్టాలని కంకణం కట్టుకున్నాడు. వెంటనే చిదంబరంపై దండెత్తాడు చోళరాజు. చిదంబరంలో గోవిందరాజస్వామి సన్నిధి చాలా ప్రసిద్ధమైనది. ఆ స్వామి సన్నిధిలో నిత్యం నాట్యంచేస్తూ గానం వినిపిస్తూ అత్యంత భక్తితో కాలం గడుపుతోంది 'తిల్య' అనే నాట్యమయూరి. ఆమెకి రామానుజులంటే ఎనలేని గౌరవం. ఆయన కోసం ప్రాణాలను సైతం లక్ష్యం చెయ్యని కూరేశులన్నా, పెరియనంబిఅన్నా ఎంత గౌరవమో!

ఆమె కులోత్తుంగుడు ససైన్యంగా చిదంబరంపై దండెత్తి ఆలయధ్వంసానికి పూనుకుంటున్నాడని వింది. ఆ మాట వింటూనే తల్లడిల్లి పోయింది తిల్య. గబగబ గోవిందరాజస్వామి ఆలయం చేరి అక్కడ పూజారులను విగ్రహాలు పట్టుకొని పారిపొమ్మని కోరింది. అమ్మో! రాజు సైన్యంతో దగ్గరకు వచ్చేస్తున్నాడు. ఎలా.... అంటూ కంగారు పడుతున్నారు స్వాములు. మీ కెందుకు మీరు విగ్రహాలు పట్టుకొని వెనుకగా పారిపోండి. మిగిలిన దంతా నేను చూసుకుంటాగా అని అందామె. ఉత్సవ విగ్రహాలను పట్టుకొని పరుగులాంటి నడకతో బయటపడ్డారు అర్చకులు. వెనుక మార్గాలనుండి పరుగులు తీశారు.

తిల్య కాలికి గజ్జెలు కట్టుకుంది. అందమైన ఆమె రూపం చూసేవారిని సమ్మోహపరుస్తోంది. ఆమె మనస్సులో ఒకటే ఆలోచన. కులోత్తుంగుని ఎదిరించి అయినా సరే గోవిందరాజస్వామిని రక్షించుకోవాలి. ధైర్యంగా లేచింది తిల్య. ఒక్కసారి గోవిందరాజస్వామికి మనసారా నమస్కరించి. తండ్రీ! నిన్ను నేను కాపాడుకుంటా. నాకా శక్తి ఇయ్యి అంటూ ప్రార్థించింది. ఇంతలో చోళరాజు సైన్యం ఆలయంలో ప్రవేశించింది. ఆమె అవేవీ గుర్తించే స్థితిలో లేదు. అలా గోవిందరాజ స్వామిని చూస్తుంది. ఎంత అందంగా ఉన్నాడు స్వామి. ఆ ఆనందంతో ఆమె సన్నగా పాట ప్రారంభించింది. లయాను గుణంగా కాలు కదుపుతూ నృత్యం చెయ్యడం మొదలు పెట్టింది.

పాట నెమ్మదిగా ఊపందుకుంటోంది. కంఠం తారస్థాయికి చేరడం, శరీరం పువ్వులా శోభలు వెదజల్లుతూ నాట్య మయూరిలా కదులుతూంటే చూసేవారికి ఆమె మీదనుంచి కన్నులు అటు ఇటు కదలడం లేదు. ఎంతటి సౌందర్యమూర్తి తిల్య. అది గంధర్వగానమో, అది దేవ నాట్యమో, అహో! అద్భుతం పరమాద్భుతం. అలా... అలా.... అంతలో ఆమె పాట పూర్తి అయ్యింది.

నెమ్మదిగా ఈ లోకంలోకి అడుగుపెట్టింది. చుట్టూ చోళసైనికులు.





ఎదురుగా కులోత్తుంగ చోళుడు. విస్తుబోయింది. నీ పేరేమిటి అడిగాడు రాజు.... 'తిల్య' నెమ్మదిగా బదులు చెప్పింది. 'నువ్వేంపని చేస్తుంటావు?'. 'నేనా! నా స్వామి సన్నిధిలో నిత్యం నాట్యం చేస్తూంటాను. 'ఏడీ నీ స్వామి'?... 'అడుగో'! ... 'నాకు కనబడడే?' 'నీకు నమ్మకం లేదుగా' ఆమె సమాధానానికి ధైర్యానికి అందరూ ఆశ్చర్యపోతున్నారు.

ఓహో! ఏదీ ఒక్కపాట పాడు. ఆమెకి పాడాలని లేదు. కాని దూరంగా స్వామి విగ్రహాలను పట్టుకొని పరుగులు తీసే స్వాములు మనస్సులో మెదిలారు. అంతే వారెలాగైనా ఆ విగ్రహాలను తీసికొని దూరంగా పోయేదాక ఈ రాజును నిలపాలి. ఎలా? ఆలోచించింది ఒక్కక్షణం. ఏముంది? అడిగాడు. పాట పాడుమని. ఆలస్యం ఎందుకు? వెంటనే మొదలు పెట్టింది. పాట అందుకోగానే అందరిలో ఉత్కంఠ. ఏమిజరుగుతుందోనని, కులోత్తంగచోళుడు ఏం దుష్కార్యం చేస్తాడో? అర్చకస్వాములు ఎంతదూరం వెళ్ళారో? ఈమె నాట్యం ఎంతసేపో? వీటన్నిటికీ సమాధానం పై సంచికలో తెలుసుకుందాం.

## పరమపదవార్త

**బండి తులశమ్మగారు,** తేది : 25-11-2001న గుంటూరులో పరమపదించినారు. వీరు పెద్ద జీయరుస్వామివారివద్ద పంచసంస్కారములను పొందినారు. వీరు అనేక కైంకర్యములలో తమ సేవలను అందించారు. వీరికి ఆచార్యతిరువడి సాన్నిధ్యం లభించాలని ఆ శ్రియఃపతిని ప్రార్థిస్తున్నాము.

- శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘం

## పరమపదవార్త

**కీ.శే. పుట్టా రామన్నగారు** తేది : 5-12-2001న బుధవారం పరమపదించినారు. 15-12-2001న నడిగడ్డపాలెంలో వీరి పరమపదోత్సవం వైభవంగా జరిపినారు. శ్రీమన్నారాయణుని శ్రీపాద కైంకర్యం నిత్యం కలగాలని ప్రార్థిస్తున్నాం

- శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘం



# రామాయణంలో రమ్యగాథలు

-శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి, విజయవాడ

రఘూత్తమా! సుగ్రీవుడు భోగలాలసుడు అయిన కానిమ్ము. అతడు మీ కార్య సాధనకు తగిన ప్రయత్నము ప్రారంభించి చాలాకాలము అయినది. దానిననుసరించియే కదా కోట్లాది వానరులు కిష్కింధను చేరుటను నీవు చూచుచునే వున్నావు.

**"తదా గచ్ఛ మహాబాహో చారిత్రం రక్షితం త్వయా, అచ్చలం మిత్రభావేన సతాం దారావలోకనమ్"**

సచ్చరిత్రుడవైన మహాబాహూ! నీవు ఒక్కసారి అంతఃపురమునకు రమ్ము!. సత్పురుషులు మిత్రభావముతో స్నేహపురస్సరముగా మిత్రుల భార్యలను చూచుటలో ఎట్టి దోషమూ వుండదు. కనుక లక్ష్మణా! నామాటను మన్నించి అంతఃపురమునకు రమ్మని తోడ్కొని వెళ్ళినది. అంతఃపురమున స్త్రీజన పరివేష్ఠితుడైన సుగ్రీవుని చూడగానే లక్ష్మణునికి ఉవ్వెత్తున క్రోధమావేశించినది.

''సుగ్రీవా! గోహత్య చేసిన వానికి, సురాపనము చేసినవానికి, వ్రతనియమము పాటించనివానికి, సత్పురుషులు ప్రాయశ్చిత్తము చెప్పినారు గాని కృతఘ్నునికి మాత్రము ప్రాయశ్చిత్తము లేదు. వానరరాజా! నీ పనినీవు ముందుగా చేయించుకొని ప్రత్యుపకారంగా రామకార్యమును చేయకున్నావు. నీ కంటే అసత్యవాదీ, కృతఘ్నుడు మరొకరు లేనేలేరు. నీవు సీతాన్వేషణ ప్రయత్నము చేయవలెనని ఎఱుగవా? **"నత్వాం రామో విజానాతే సర్పం మణ్డూకరావిణమ్"** నీవు కప్పకూతలు కూయుచున్న సర్పానివని రాముడు తెలుసుకొనలేపోయినాడు. కరుణాశీలి, మహాత్ముడు అయిన రాముడు నీవు దుష్టాత్ముడవని తెలియక నిన్ను హరిరాజ్య (వానరరాజ్య) అభిషిక్తుని చేసినాడు.

ఓ కపివరా! మహాత్ముడైన రాముడు నీకు చేసిన మేలు తలచి నీకర్తవ్యమును సక్రమముగా నిర్వర్తించితివేని **"సద్యస్త్వం నిశితై ర్బాణై ర్హతో ద్రక్ష్యసి వాలినమ్"** రాముని వాడి అయిన బాణములచేత వధించబడి, నీ సోదరుడైన వాలిని చూడగలవు సుమా! వజ్రాయుధమువంటి రామబాణమును నీవెన్నడూ చూడలేదు గనుకనే రామకార్యమును తలచక భోగాసక్తుడవై మనగలుగు చున్నావు'' అని కోపంతో అగ్నిలా ప్రజ్వరిల్లుతున్న సుమిత్రానందనుని మాటలు విన్న తార యుక్తియుక్తంగా అనునయవాక్యాలు ఇలా పలికింది.

లక్ష్మణా! నీనోట సుగ్రీవుని గూర్చి యిటువంటి పరుషవాక్కులు వినతగనివి. సుగ్రీవుడు కృతఘ్నుడు, అసత్యవాదీ, శఠుడు, క్రూరుడు కానేకాదు. వేరెవరూ చేయలేని ఉపకారము రామచంద్రుడే చేసినాడని, రామానుగ్రహము చేతనే వానర రాజ్యమును, కీర్తిని, రుమను, నన్నుకూడ పొందగలుగుటను అసలు విస్మరించలేదు. ఎటువంటి సుఖమును ఎరుగక, కంటికి కునుకు కూడా లేకుండా, భీతితో చెట్టుపుట్టలు పట్టుకు సంచరించిన ఈ వానరునికి దేహధర్మముగా సుఖము లభించగనే కాలము తెలియ కుండగనే గడిచిపోయినది.

హే దాశరధీ! రామచంద్రునకు ప్రియము కూర్చుటకు రుమను, రాజ్యమును అంగదుని, నన్ను, ధనధాన్యములను, రత్నరాశులను కూడ త్యజించుటకు సుగ్రీవుడు వెనుకాడడని నాకుతెలుసు. పురుషశ్రేష్ఠుడవైన లక్ష్మణా! బుద్ధికుశలురైన నీవంటి వారు ముందు కోపావేశమును త్యజించుమని మనసా వేడుతున్నాను.

**"తత్సహాయనిమిత్తం హి ప్రేషితా హరిపుఙ్గవాః"** రామకార్య సహాయ నిమిత్తమే శ్రేష్ఠవానరులను తీసుకొని వచ్చుటకు అన్ని దిక్కులకూ వానరులు పంపబడినారు. అనేక మంది వచ్చివున్నారు. కోట్ల కొలది భల్లూకములు, కొండముచ్చులు నేడే నీవద్దకు రాగలరు. రాకుమారా! కోపము చేత ఎర్రవారిన నీ ముఖమును చూచి అంతఃపుర స్త్రీలందరూ భయముచేత వణికిపోతున్నారు. లక్ష్మణా! నిన్ను చూచి వాలి వధవంటి సన్నివేశము మరొకటి జరుగునేమో అని విలవిలాడిపోతున్నాము. లక్ష్మణా! సీతనపహరించిన ఆ రాక్షసాధముని చంపి, రోహిణీచంద్రులను కలిపినట్లు సుగ్రీవుడు ఆ సీతారామచంద్రులను కలుపగలడు యిది ముమ్మాటికీ నిక్కముగా జరుగును.''

అని తార సవినయంగా ధర్మసమ్మతంగా పలికిన మాటలకు లక్ష్మణుడు కూడా ఆమోదించి శాంతించాడు. లక్ష్మణుడు తారమాటలను అంగీకరించుట చూచిన సుగ్రీవుడు తేరుకొని, వినయ పూర్వకంగా లక్ష్మణుని సమీపించి ఏమని ప్రార్థించాడో తరువాయి సంచికలో సేవించుకుందాం.

# శ్రీరామ మంగళాశాసనము

- శ్రీ ఉ.వే శ్రీమాన్ ఈ.వే. శింగరాచార్యులుగారు, తిరుపతి

శ్రీవిష్ణు సహస్రనామములోని 'సుదర్శనః' అనునామమును భట్టరువారు శ్రీరామావతారపరముగా అన్వయించి 'గుణ ప్రభావానభిజ్ఞానా మపి దర్శనమాత్రమేవ అనన్యశోభనమితి సుదర్శనః' అని వ్యాఖ్యానించుచు **'సోమవత్ ప్రియదర్శనః'**, 'సదైకప్రియదర్శనః' అను శ్రీరామాయణ ప్రమాణములను ఉట్టంకించిరి. అట్లే, **'రామః'** అను నామమును **'రమ్యతేఽస్మిన్ సదా సర్వైః రూపగుణ వశీకృతైః ఇతిరామః'** అనుచు విశదీకరించుటయు ఇచట స్మరింపతగినది.

శ్రీరామచంద్రుని అవతార సందర్భమును కీర్తించిన పిమ్మట వాల్మీకి ఆ స్వామి రూపవైభవమును వర్ణించుచు **'రామస్యలోక రామస్య'** అని, "ఇష్టః సర్వస్యలోకస్య" అనిపల్కుటను **"పుంసాం మోహనరూపాయ"** అను విశేషణము సూచించుచున్నదన వచ్చును. **'రోపయతి విమోహయతి ఇతి రూపం, రూపం - విమోహనే'** అను వ్యుత్పత్తినికల రూప శబ్ద ప్రయోగమిచట మిగుల స్వరసము.

(పుణ్యశ్లోకాయ)- **'శ్లోక్యతే కీర్త్యతే ఇతి** శ్లోకః। **కీర్తిః'** అనువ్యుత్పత్తిని బట్టి పవిత్రమైన కీర్తిని కలవాడని అర్థము. లేక, **'పుణ్యైః మహాత్మభిః వశిష్ఠాదిభిః శ్లోక్యతే ఇతి పుణ్యశ్లోకః'** అను వ్యుత్పత్తియు ఇచట గ్రహింపతగినది. కథా గమనమును బట్టి విశ్వామిత్ర మహర్షి దశరథుని వద్దకు వచ్చినపుడు శ్రీరామచంద్రుని మహిమను గూర్చి **'అహం వేద్మి మహాత్మానం రామం సత్య పరాక్రమమ్'** అనిపల్కుట, ఆ మాటలను సమర్థించుచు వశిష్ఠ మహర్షి

శ్లో॥

'ఏష విగ్రహవాన్ ధర్మః ఏష వీర్యవతాంవరః<br>
ఏషబుద్ధ్యధికో। లోకే తపసశ్చ పరాయణమ్।<br>
ఏషోఽస్త్రాన్ వివిధాన్ వేత్తి త్రైలోక్యే సచరాచరే<br>
నైన మన్యః పుమాన్ వేత్తి నవేత్స్యంతి చ కేచన॥'

అని పలుకుటయు ఇచట అన్వయింపదగినవి.

శ్లో॥

**విశ్వామిత్రాంతరంగాయ మిథిలా నగరీ పతేః।<br>
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్॥**

విశ్వామిత్ర + అంతరంగాయ=విశ్వామిత్రమహర్షికి అంతరంగశిష్యుడు, మిథిలా నగరీ పతేః=మిథిలా నగరమునకు ప్రభువగు జనకుని యొక్క, భాగ్యానాం= పుణ్యముల, పరిపాకాయ=పండినపంట, భవ్యరూపాయ=దివ్యమైనరూపమును కలవాడును అగు శ్రీరామునకు, మంగళమ్= మంగళమగుగాక!

విశ్వామిత్రమహర్షికి అంతరంగ శిష్యుడు, మిథిలకు ప్రభువగు జనకుని పుణ్యముల పంట, దివ్యమైనరూపమును కలవాడును అగు శ్రీరామునకు మంగళమగు గాక!

(విశ్వామిత్రాంతరంగాయ) - అంతరంగ శబ్దమునకు మనస్సు అని, విశ్వసనీయుడైన వ్యక్తి రెండు విధములుగా వివరింపవచ్చును.

**"విశ్వామిత్రే అంతరంగం యస్యసః"** అను వ్యుత్పత్తి వలన విశ్వామిత్రునియందు మనస్సును కలవాడని, అనగా, ఆ మహర్షి





పట్ల మిక్కిలి వినయవిధేయతలతో ప్రవర్తించినవాడని భావము. శ్రీరామచంద్రుడు

**'ఇమౌస్మమునిశార్దూల కింకరౌ సముపస్థితౌ<br>
ఆజ్ఞాపయ యథేష్టం వై శాసనం కరవావకిమ్'**

అనుచు విశ్వామిత్రునితో పల్కిన సూక్తులిచ్చుట స్మరింపనగును. తాటకవధ, మారీచ సుబాహులవధ, యాగ సంరక్షణ సందర్భములలో శ్రీరామచంద్రుడు విశ్వామిత్ర మహర్షికి ఎట్లు విధేయుడో వ్యక్తమగును.

**విశ్వామిత్రస్య అంతరంగం యస్మిన్ సః** :- అనువేరొక వ్యుత్పత్తి వలన విశ్వామిత్రుని మనస్సు ఎవనియందు కలదో ఆ శ్రీరామచంద్రుడను అర్థము కల్గును. ఇందులకు అనుగుణముగా శ్రీరాముని శయనసౌందర్యమునకు పరవశుడైన ఆ మహర్షి **'కౌసల్యాసుప్రజాః రామ'** అనుచు పల్కిన సూక్తిలోని అర్థ గాంభీర్యమిచట ఉదాహరణీయము.

ఈ సూక్తిని వ్యాఖ్యానించుచు అగ్రికియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ తిరుప్పావై - అఱాయిరప్పడి వ్యాఖ్యలో- **"ఉణ్ణప్పుక్కు వాయ్యై మఱన్దారై ప్పోలే వన్దకారియత్తై మఱన్దాన్"** అని సాయించుట, దీనిని అనువదించుచు గోవిందరాజీయ వ్యాఖ్యానకారులు ఉభయ ప్రబోధనార్థముగ **'సోపి విశ్వామిత్రో రామస్య'** 'సమయాబోధిత **శ్రీమాన్, సుఖసుప్తః పరంతపః' ఇత్యుక్తరీత్యా నిద్రాకాలికశ్రియ మవలోక్య తదాసక్తస్సన్ స్వాగమన కార్యం విస్మృత్య ఇమం ప్రబోధవతీ కౌసల్యా కింవా తవ స్తుప్తవతీతి విస్మయతే' కౌసల్యాసుప్రజాః - భోజన కాలే విస్మృతముఖో ముని రాసీత్ రామే త్యనేన స్వాపకాలిక సౌందర్య ముచ్యతే** అని పల్కుటయు ఇచట ఉట్టంకింపనగును.

**'అహం వేద్మి మహాత్మానం'** అనుచు శ్రీరాముని మహిమను పొగడిన విశ్వామిత్రుని మనస్సు ఆ స్వామి యందు లగ్నమగుటలో ఆశ్చర్యమేమున్నది?

అంతరంగ శబ్దమునకు విశ్వసనీయుడను అర్థమును గ్రహించినచో విశ్వామిత్రునకు నమ్మదగినవాడని అర్థము. దశరథుని, అతని సైన్యమును కాదని, శ్రీరాముని యందు నమ్మకమును కల్గినవాడు కదా విశ్వామిత్ర మహర్షి!

**'ఇయ మక్షౌహిణీ పూర్ణా యస్యాహం పతి రీశ్వరః,<br>
అనయా సంవృతో గత్వా యోద్ధాహం తై ర్నిశాచరైః,<br>
అహమేవ ధనుష్పాణిః గోప్తా సమరమూర్ధని,<br>
యావత్ ప్రాణాన్ ధరిష్యామి తావత్ యోత్స్యే నిశాచరైః'**

అను ధశరథుని వచనములను కాదని శ్రీరామునియందే నమ్మకమును కల్గినవాడు ఆ మహర్షి. పైన ఉట్టంకించిన **'ఇమౌ స్మ మునిశార్దూల! కింకరౌ సముపస్థితౌ'** ఇత్యాది సూక్తుల భావమును ఇచ్చుట స్మరింపనగును.

బదరీ నారాయణ పెరుమాళ్

జై శ్రీమన్నారాయణ!

## బదరీనాథ్‌లో అష్టాక్షరీ క్షేత్రంలో జరుగు అన్నదానమునకు, నిర్మాణమునకు వివిధ పోషకులుగా కైంకర్యములు సమర్పించిన భక్తుల వివరములు

**శ్రీమతి పి. బంగారమ్మ (హైదరాబాద్)గారి ద్వారా**

**పోషకులు** : శ్రీమాన్ ఎ. కృష్ణం రాజు సరస్వతి (సికింద్రాబాద్)

**జీవిత సభ్యులు** : శ్రీమాన్ యమ్. శ్రీనివాస్ (విశాఖ పట్టణం)

**అభిమానులు : హైదరాబాద్** : శ్రీ ఆర్.పి.రాజు, శ్రీ పి. రామరాజు, శ్రీ డి.వి.యస్. రాజు, శ్రీమతి సి.కె. దుర్గ, శ్రీ కనుమూరి బాపిరాజు, శ్రీ జి. వెంకట సూర్యనారాయణ రాజు, శ్రీ పి. సత్యనారాయణ రాజు, శ్రీ యన్. వెంకటరాజు, శ్రీ బి. సూర్య ప్రభాకరరావు, శ్రీ ఎ. ఆర్. రామచంద్రారెడ్డి, శ్రీ పి. కృష్ణ గంగరాజు, శ్రీ ఐ.వి.యన్. యన్. రాజు, శ్రీమతి జానకమ్మ, శ్రీ టి.వి. రామకృష్ణారావు, శ్రీ యన్. రవికుమారరెడ్డి, శ్రీ యమ్. సదాశివకుమారరెడ్డి, శ్రీ ఎ. మోహన్ రెడ్డి, శ్రీ లక్ష్మీనారాయణ శాస్త్రి, శ్రీ బి.యన్. ప్రసాద్, శ్రీ యన్. కృష్ణమరాజు, శ్రీ జి.వి. రాజు, శ్రీ బి. శోభవామనరావు, శ్రీయమ్.వి. మహేశ్వరరావు, శ్రీ జె. వర ప్రసాద్ రాజ్యలక్ష్మి, శ్రీ కె. లక్ష్మణస్వామిరెడ్డి, శ్రీ కె. రమణారెడ్డి, శ్రీ పి. వేణుగోపాలరెడ్డి, శ్రీ యన్. సీతారామరాజు, శ్రీ జి.వి. రామరాజు, శ్రీ జి. విజయకుమారరాజు, శ్రీ యస్. జయరామిరెడ్డి, శ్రీ టి. నరసింహారావు, శ్రీ డి. రామ్‌రెడ్డి, లక్ష్మి, శ్రీ యస్. కృష్ణమూర్తి, శ్రీ జి. రంగరాజు, శ్రీ జె. వీరరాఘవులు, శ్రీ బి. సోమరాజు, శ్రీ బి. కాశీ.

**సికింద్రాబాద్** : శ్రీమతి పి. కృష్ణమ్మ, శ్రీ పి. సురేష్ రెడ్డి, శ్రీ వెంకటనరసింహరాజు.

శ్రీ కె.వి.యన్. ఆచార్యులు (విజయనగరం), శ్రీ పి.బంగారురాజు (కాకినాడ), శ్రీ జి. సోమరాజు, శ్రీ ఎ. సత్య సోమసుందరరాజు (భీమవరం), శ్రీ ఎ. గిరీష్ రెడ్డి (నెల్లూరు), శ్రీమతి యన్. సూర్య కాంతమ్మ (గుమ్మలూరు), శ్రీమతి ఆర్. అనసూయ (పోడూరు), శ్రీ డి. ధర్మరాజు (కోపల్లే), శ్రీ కె. లక్ష్మి గోపాలరాజు (భీమవరం), శ్రీ కోసూరు సోమరాజు (పోడూరు), శ్రీ బి. సుబ్బరాజు (బెంగులూరు), శ్రీ బి. విశ్వనాథరాజు (చామవరం),

**విజయవాడ వికాసతరంగిణి (శ్రీ కె.పి. సారథి, సూర్యారావుపేట)వారిద్వారా**

**అభిమానులు : విజయవాడ** : శ్రీమతి దామెర విజయకుమారి, శ్రీ దామెర రంగారావు, శ్రీ దామెర కాశీవిశ్వనాథరావు, శ్రీ కోటగిరి పార్థసారధి, శ్రీ పి. వెంకట రామారావు, శ్రీ ఐ. పార్థసారథిరావు, శ్రీ కె. జగన్నాథరావు, శ్రీ ఆర్.వి.అప్పారావు, శ్రీ జె. రామచంద్రరావు, శ్రీ దామెర హరీష్.

**ఈదర** : శ్రీ డి. కాశీవిశ్వనాథరావు, శ్రీ వాసుదేవ గీతానవమాజం, శ్రీ డి. వెంకటరామారావు, శ్రీ డి. నారాయణ రావు, శ్రీమతి డి. రాజాలమ్మ, శ్రీమతి డి. సత్యవతి.

**కాకినాడ** : శ్రీ ఆర్.వి. రాయణం, శ్రీ రేమెళ్ళ సతీష్‌బాబు, శ్రీమతి రేమళ్ళ సాత్వ్విక, శ్రీ తాంఁద్ర నారాయణరావు, శ్రీమతి రేమళ్ళ కస్తూరి.

**మానికొండ** : శ్రీ దామెర రంగారావు, శ్రీ కోటగిరి ప్రతాప్, శ్రీ డి. రామచంద్రయ్య. శ్రీ దామెర ఉదయకిరణ్, శ్రీ డి. మధుసూదనరావు (బొమ్మెనంపాడు), శ్రీమతి





దామెర కమలాయమ్మ, శ్రీ దామెర శ్రీనివాసరావు (ఆకివీడు), శ్రీజి. పార్థసారధిరావు (సూరంపల్లి), శ్రీ తాంఁద్ర వెంకటరావు (నూజువీడు), శ్రీ కె. త్రిలోకనాథరావు, శ్రీమతి కలకొండ శ్రీలక్ష్మి (పెదవెల్లమెల్లి), శ్రీ కందిమల్ల రంగారావు (తిరువూరు), శ్రీ ఐ. శ్రీనివాసరావు (చీమలపాడు).

**రామకృష్ణ మలానిజీ (వరంగల్)గారిద్వారా**

**పోషకులు** : శ్రీ హరినారాయణ మలానిజీ (వరంగల్), శ్రీ భంగాలాల్ జీ దాడియా, శ్రీ శంకర దాడియా (గోదావరి ఖని).

**జీవిత సభ్యులు** : శ్రీ భగీరదీ జీ రేన్‌వో (వరంగల్), శ్రీ యమ్. పుండరీకాక్షయ్య(హైదరాబాద్)

**డి. కృష్ణం రాజు (ఖాజీ పాలెం) గారిద్వారా**

**అభిమానులు** : బుద్ధాం : శ్రీమతి కె. వెంకట సుబ్బమ్మ, శ్రీ మంతెన నాగరాజు, శ్రీ యమ్. కదన్వ గంగరాజు, శ్రీ యమ్. కోదండరామరాజు, శ్రీమతి యమ్. నాగరాజు సత్యవతి, శ్రీ పి. లక్ష్మీనారాయణ శాస్త్రి, శ్రీ యమ్. రామరాజు, శ్రీ యమ్. లక్ష్మీనారాయణరాజు, శ్రీమతి యమ్. గీతామాధురి, శ్రీ యమ్. భరతకుమారరాజు.

**అలకాపురం** : శ్రీమతి పెన్మత్స కస్తూరి, శ్రీ పెన్మత్స పెద వెంకటరాజు, శ్రీ దండు వెంకటరాజు,

శ్రీమతి టి. శ్రావ్య (నగరం), శ్రీమతి సిహెచ్. విజయలక్ష్మి (తిరుపతి), శ్రీ డి. వెంకట సుబ్బరాజు (అల్లూరు), శ్రీమతి జి. రాజ్యలక్ష్మి (పిట్టలవానిపాలెం), శ్రీ జి. సీతారామరాజు, శ్రీ బి. వెంకటనర్సరాజు (జి.యన్.పాలెం).

**వికాసతరంగిణి (గుడివాడ) వారిద్వారా**

**జీవిత సభ్యులు : గుడివాడ** : శ్రీ డా॥ కె. శ్రీనివాసరావు, శ్రీమతి పి. బసవ చిట్టెమ్మ, శ్రీ డి. విష్ణువర్ధనరావు, శ్రీ పొట్లూరి కృష్ణ ప్రసాద్, శ్రీ వి. నాగతేజస్వి,శ్రీమతి కె. వాసవీ, శ్రీమతి వెంకట లక్ష్మీకృష్ణ.

అభిమానులు : గుడివాడ : శ్రీ యస్. వెంకట శ్రీనివాసరావు, శ్రీ యస్. రామ మోహన్, శ్రీమతి యస్. రంగనాయకమ్మ, శ్రీ కె. బాలకోటయ్య, శ్రీ కె. సీతారామయ్య, శ్రీమతి ఎ. కోటేశ్వరమ్మ.

శ్రీ ఎ. వెంకటరమణమూర్తి (మొగల్తూరు).

**యస్.వి. సుబ్బారావు(అద్దంకి)గారిద్వారా**

**అభిమానులు** : అద్దంకి : శ్రీ చుండి శ్రీరామమూర్తి, శ్రీ ఆండాళ్ గోష్ఠి, శ్రీ ఎ. హనుమంతరావు, శ్రీ చౌటా కోటేశ్వరరావు, శ్రీమతి కొత్తమాసు సుహాసిని.

శ్రీమతి జి. దుర్గయ్య (వేకనూరు), శ్రీ జె. నరసింహారెడ్డి (మల్కాపురం), శ్రీమతి జి. రాధమ్మ (గోదావరి ఖని), శ్రీమతి ఎ. వెంకటరత్నం, శ్రీ వై. పెద్దకోనయ్య (రామడుగు).

**జెట్ సీతానగరంద్వారా సమర్పించినవారు**

**జీవితసభ్యులు** : శ్రీ టి. శ్రీనివాస్ (హైదరాబాద్), శ్రీ పి. యస్. నాగరాజుగుప్తా (హోస్‌పేట), శ్రీ వి. తిరుపాల్ నాయుడు (హోస్‌పేట), శ్రీ బి.యన్. పృతురాజ్‌సింగ్ (హోస్‌పేట),

**విజయవాడ :- అభిమానులుగ చేరినవారు:-** శ్రీ యస్. నాగేశ్వరరావు, శ్రీమతి ఐ. సీతమ్మ, శ్రీ కె. నాగరాజు, శ్రీమతి ఎ. శ్రీరామతారకం, శ్రీమతి కె. జయలక్ష్మి, శ్రీ యమ్. కాశీవిశ్వనాథం, శ్రీమతి ఎ. హైమావతి, శ్రీ యస్. వెంకటేశ్వరరావు, శ్రీమతి/శ్రీ కె. వెంకట సుబ్బయ్య అనంతలక్ష్మి, శ్రీ పి. వెంకట నాంచారయ్య, శ్రీమతి ఎ. సరస్వతమ్మ, శ్రీమతి సి. కృష్ణకుమారి, శ్రీమతి సి. ఊర్మిళాదేవి, శ్రీమతి ఇందిరాదేవి, శ్రీ జి.వి. రామరాజు, శ్రీమతి పి. నరసమ్మ, శ్రీ వి. భాస్కరరావు, శ్రీమతి యన్. లక్ష్మీనరసమ్మ, శ్రీ యన్. అప్పారావు,

శ్రీ యస్.వి. హరిగోపాల్, శ్రీ సిహెచ్. కృష్ణారావు, శ్రీ సిహెచ్. వీరగంగారావు, శ్రీ జి. రామకృష్ణ, శ్రీమతి ఆర్. భాస్కరమ్మ, శ్రీ యమ్. సుబ్రహ్మణ్యేశ్వరరావు, శ్రీ డి. వెంకటసత్యనారాయణ, శ్రీ వి. చంద్రశేఖర్, శ్రీమతి వి. శ్యామల, శ్రీ ఎ. సుబ్బారావు, శ్రీ ఓ. శంకర కుమార్, శ్రీ యమ్. రాంప్రసాద్, శ్రీ పి. శ్రీధర్, శ్రీ బి. అచ్యుతరామయ్య, శ్రీ కె.వి. వెంకట కృష్ణారావు, శ్రీ బి. వెంకటసుబ్బారావు, శ్రీ టి. వెంకటేశ్వర్లు, శ్రీ జె.బి. చంద్రరావు, శ్రీ యమ్.వి.కె. మోహనరావు, శ్రీ పి. కృష్ణమూర్తి, శ్రీ టి. వెంకటరామరత్నం, శ్రీ కె.వి. సుబ్బారావు, శ్రీమతి కె. లక్ష్మి, శ్రీమతి జి. లక్ష్మికుమారి, శ్రీ ఇ. అనిల్ కుమార్, శ్రీమతి జి. సూర్యకుమారి, శ్రీ ఎ. రామగోపాల్, శ్రీమతి పి. దమయంతి, శ్రీ యన్. చైతన్య, శ్రీ వి. రామకృష్ణశర్మ, శ్రీ వి. భిక్షారావు, శ్రీ వజ్జ సుబ్బారావు, శ్రీమతి సిహెచ్. భాగ్యలక్ష్మి.

**హైదరాబాద్ :- అభిమానులుగా చేరినవారు:-** శ్రీ కె. రాజేంద్రరెడ్డి, శ్రీ పి.యస్. ఆర్.కె.వి. ప్రసాద్, శ్రీ యస్. స్యూర్యనారాయణరావు, శ్రీమతి సి.హెచ్. సూర్యాదేవి, శ్రీమతి వి. నాగమణి, శ్రీ యమ్. రంగారెడ్డి, శ్రీమతి కె. జానకీ రామనాథం, శ్రీ ఆర్. నారాయణ, శ్రీ టి. రత్నకరాచార్యులు, శ్రీ కె. వెంకటరావు, శ్రీ పి. రచనదీప్, శ్రీ యన్. విజయరావు, శ్రీ పి. జగదీష్మూర్తి గాయత్రీ, శ్రీమతి యమ్. రామసుబ్బమ్మ, శ్రీమతి యమ్. లక్ష్మిబాయి, శ్రీ సిహెచ్. హరీష్ కుమార్, శ్రీ ఎ. పాండురంగారావు, శ్రీమతి కె. సావిత్రీదేవి, శ్రీమతి ఎ. మహాలక్ష్మమ్మ, శ్రీ వి.వి. రావు, శ్రీమతి కె. హనుమాయమ్మ, శ్రీ బి. రమేష్బాబు, శ్రీ పి. సుబ్బారావు, శ్రీ నారాయణదాన్ అశ్వా, శ్రీమతి పి. సావిత్రమ్మ, శ్రీ జనార్దన్ దాస్ కాబ్రో, శ్రీ పి. జగన్మోహన్‌రెడ్డి, శ్రీమతి వై. సీతాంబరం, శ్రీ బి. శ్రీనివాసరెడ్డి, శ్రీమతి యమ్. రమ, శ్రీ కె. శ్రీనివాస్, శ్రీమతి కె. శిల్పారెడ్డి, శ్రీ బి.యన్. రెడ్డి, శ్రీ పి. వెంకటేశ్వరరావు, శ్రీ కె. శ్రీనివాసరాజు, శ్రీ పి. శ్రీనివాసరావు, శ్రీ వి. రాజేశ్వరరావు, శ్రీ యస్. గణేశ్ రెడ్డి, శ్రీ వి. కొండలరావు, శ్రీ కె. నాగేంద్రరెడ్డి, శ్రీ యమ్. వెంకటసుబ్బారావు,

**సికింద్రాబాద్ :- అభిమానులుగా చేరినవారు:-** కుమారి హర్షణ, కుమారి వర్ధన, శ్రీమతి కృష్ణవేణి, శ్రీ విష్ణువర్ధన్, శ్రీమతి వై. వసుంధర, శ్రీ కె. రాకేష్.

**బెంగుళూరు :- అభిమానులుగా చేరినవారు:-**

**అభిమానులుగా చేరినవారు:-** శ్రీ యన్. రఘుపతి, శ్రీ యన్. సుకుమార్, శ్రీ ఆర్. పరశురామ్, శ్రీ ఎ. లక్ష్మినారాయణ, శ్రీ యమ్. నరసింహులు, శ్రీ యమ్. జయ రామ్, శ్రీమతి శకుంతల శ్రీధర్, శ్రీమతి గీతా మురళీధర్, శ్రీమతి సుభద్ర, శ్రీమతి యన్.హెచ్. మొహన్ విజయలక్ష్మి.

**భీమవరం :- అభిమానులుగా చేరినవారు:-** శ్రీ జి. నాగేశ్వరరావు, శ్రీ జి. లక్ష్మి సూర్య నారాయణ మూర్తి, శ్రీ జి. రామలక్ష్మణ ప్రసాద్, శ్రీమతి యమ్. కోటమ్మ, శ్రీమతి కె.రాణమ్మ, శ్రీ కె. వెంకటరావు, శ్రీ యమ్.యస్. మూర్తి, శ్రీ కె. సత్యనారాయణ మూర్తి, శ్రీ సిహెచ్. సీతారామమూర్తి, శ్రీమతి కె. దేవీ సూర్యసత్య శ్రీవాణి, శ్రీ కె. వెంకటపతిరాజు, శ్రీమతి ఎ. సూర్య కాంతమ్మ,

**రాజాం :- అభిమానులుగా చేరినవారు:-** శ్రీ కె. అనంతరావు, శ్రీ యమ్. సదాశివరావు, శ్రీమతి పి. విజయలక్ష్మి.

**గుంటూరు :- అభిమానులుగా చేరినవారు:-** శ్రీమతి ఎ. లక్ష్మిసరోజని, శ్రీ యమ్.వి. పిచ్చయ్య, శ్రీ యల్. శంకర శరత్‌బాబు, శ్రీమతి జి. లలిత కుమారి, శ్రీమతి టి.





విమల, శ్రీ యమ్. కోటేశ్వరరావు, శ్రీమతి కె. శేషమ్మ, శ్రీ కె. మురళీకృష్ణమాచార్యులు, శ్రీ జె. సుబ్బారావు, శ్రీ జె. సారంగపాణి, శ్రీమతి జి. లక్ష్మీతాయారు, శ్రీ పి. రామారావు, శ్రీ జి. రాధాకృష్ణమూర్తి, శ్రీ పి. పురుషోత్తమ్, శ్రీమతి యన్. బాలకోటేశ్వరమ్మ, శ్రీ ఎ. సుబ్బారావు.

**విశాఖపట్టణం :- అభిమానులుగా చేరినవారు:-** శ్రీమతి డి. హిరణ్మయి, శ్రీ. కె.వి.నాంచారయ్య, శ్రీ జి. అప్పారావు, శ్రీమతి కె. సరోజనీ దేవి, శ్రీ వి.యస్.యన్. శర్మ.

శ్రీ బి. శ్రీహరిబాబు(మంచాల), శ్రీమతి బి. విజయ(ఎద్దుమైలారం), శ్రీమతి వెంకట రంగం శేషగిరిరావు (పెదనందిపాడు), శ్రీమతి సిహెచ్. మీనమ్మ (కామారెడ్డి), శ్రీమతి ఎ. జయప్రద (తెన్నేరు), శ్రీ డి. చిరంజీవిరావు (ముంబాయి), శ్రీమతి డి. నాగరత్నం (చీరాల), శ్రీ ఆర్. లక్ష్మణరావు (అదిలాబాద్), శ్రీమతి యస్. కమలా యమ్మ (ఈదర), శ్రీమతి కె. వెంకాయమ్మ (నూతక్కి), శ్రీ కె. సాంబశివరావు (పల్ల పాడు), శ్రీ సిహెచ్. ప్రసాద్ (చెలికాని వారి పోతేపల్లి), శ్రీమతి కె. అలివేలు మంగమ్మ (పెదగొన్నూరు), శ్రీ యమ్. మల్లయ్య, సత్తెమ్మ (మిర్యాలగూడ), శ్రీ టి. నాగరాజు (పాములవాక), శ్రీమతి గౌరమ్మ (బళ్ళారి), శ్రీమతి కె. శ్రీదేవమ్మ (గూడూరు), శ్రీమతి సిహెచ్. సుశీల రాజయ్య (కామారెడ్డి), శ్రీమతి సిహెచ్. స్వరూపరాణి రవీందర్ (కామారెడ్డి), శ్రీమతి బి. శిరీష (పాలకొల్లు). శ్రీ యమ్. సుబ్బారావు (ఏలూరు), శ్రీ జి. చంద్రశేఖర్ (మచిలీపట్నం), శ్రీ కె. సుబ్బారావు (వి.యమ్. బంజర్), శ్రీ పి. బుచ్చి వెంకటరాజేశ్వరగుప్త (కొత్తవలస), శ్రీమతి యస్. గంగావతి (కందుకూరు), శ్రీ వి. రామచంద్రరావు (మంచిర్యాల), శ్రీమతి వి. పాప (గుడివాడ), శ్రీమతి యస్. దుర్గ (సారపాక), శ్రీ కె. వెంకటేశ్వర్లు (పోరంకి), శ్రీమతి యన్. కామేశ్వరమ్మ (రాజమండ్రి), శ్రీమతి టి. సుదర్శనమ్మ (పెదపుట్టేడు), శ్రీ జి. గురవయ్య (ఇడుపులపాడు), శ్రీ యన్.వి.వి.యస్. చౌదరి (శలపాడు), శ్రీమతి పి. యశోదమ్మ (బిబిపేట), శ్రీమతి టి.వి. శ్రీదేవమ్మ (చెన్నై), శ్రీమతి పి.వి.యన్.ఎల్. అనూరాధ (పిఠాపురం), శ్రీ పి. బుచ్చయ్య (మహేశ్వరం), శ్రీమతి కాజా లక్ష్మిఈశ్వరమ్మ (అప్పికట్ల), శ్రీ జి. రంగారావు (జూలపల్లి), శ్రీమతి బొల్లు ఆదిశేషమ్మ (మూల్పూరు), శ్రీ కె. వెంకటసుబ్బారావు (ఖమ్మం), శ్రీ టి. చంద్రశేఖర్ రెడ్డి (నెల్లూరు), శ్రీ యన్. వెంకట హనుమంతరావు (ముంబాయి), శ్రీమతి యమ్. పూలమ్మ (పెదపల్లి), శ్రీ యమ్. రమణారెడ్డి (పెదపల్లి), శ్రీ యమ్. కనకభూషణం (నూజివీడు), శ్రీమతి అడపా లక్ష్మికాంతమ్మ (సీతానగరం), శ్రీమతి కె. పద్మావతి (బిబిపేట), శ్రీమతి కె. మాధవీలత (మచిలీపట్నం), శ్రీ పి. సమ్మయ్య (ఆత్మకూరు), శ్రీమతి బి. జయమ్మ (ఆత్మకూరు), శ్రీమతి ఆర్. ప్రమీళ (ఆత్మకూరు), శ్రీమతి సత్యవతి (లోగిస), శ్రీమతి ఎ. సత్యనారాయణమ్మ (అమలాపురం), శ్రీ బి. వెంకటేశ్వరరావు (ఎ.కొండూరు), శ్రీమతి బి. తాయారమ్మ (ఎ.కొండూరు), శ్రీమతి పద్మావతి (వార్ధా), శ్రీ యమ్. కృష్ణమూర్తి (ఇడుపులపాడు), శ్రీ పి. కృష్ణమరాజు (ఏలూరు), శ్రీ కె. కుటుంబరావు (ఈమని).

# స్పందన

1. వికాసతరంగిణి విభాగమువారు మహాభారతంలోని నహుష చక్రవర్తి కథను భక్తి నివేదన ఆధ్యాత్మిక మాసపత్రిక, జనవరి, 2002లో పాఠకులకు అందజేయడం జరిగింది.
   ఆధ్యాత్మిక సిరులను వెదజల్లిన అద్భుత కథయిది. ఈ కథలోని విశేషమేమిటంటే, నహుషచక్రవర్తి, జ్ఞానమార్గము ద్వారా పయినించి జ్ఞానియై తరువాత మరల నీచజన్మ లోనికి విసరివేయబడతాడు.
   ఇది సాధకులను వేధించే విషయం. ఇలా జరుగుతుందా ? ఏమరుపాటుతో ఉండే మాయా సుడిగుండములలో చిక్కుకుపోవలసిందేనా ? దీనికి గత్యంతరము ఏమిటి?
   ఈ సమస్య ఎలా పరిష్కరించాలో భక్తి నివేదన మాసపత్రిక, పేజీ నంబరు 33లో,5వ పంక్తిన, శ్రీశ్రీశ్రీ స్వామీజీవారు సూచనలను య్వివడం జరిగింది.
   ''సదా భగవద్భావన'' అనే కవచాన్ని ధరించినంతకాలం అంతఃశత్రువులు సాధకుని ఏమిచేయలేవు. పరమపదము వరకు వికాస సాధన కొనసాగాలని సాధకుడు గుర్తుంచుకోవాలని'' సుస్పష్టము చేయడం జరిగినది.
   -ఆర్ . అనసూయ, అనంతపూర్.
2. ''ఇతిహాసబోధ -VI'' లో వివరించిన నహూషుని చరిత్ర, మన వికాస తరంగిణి కార్య కర్తలకే గాక, భగవత్ సామ్రాజ్యంలో ప్రవేశింపదలంచిన వారందరికి భగవదనుభూతి, భగవత్ సాక్షాత్కారము పొందదలంచిన వారందరు కూడా - గమనించి, గుర్తుంచుకోవలసిన అమూల్య విషయము.-డిక్కల వల్లభనారాయణ, చిన్నబాడం.
3. ఇతిహాసబోధలోని నహూషుని కథా వృత్తాంతము కామము వలన నహూషుడు ఎలా పతనము చెందాడో తెలుపుతుంది. ఈ కామము మనకు నిత్య శత్రువు. ఈ కామము ముముక్షులను పడగొట్టుట కొరకై వేచియుండును. ఈ కామమును ''వరమపద సోపాన పటములోని పెద్దపాముతో పోల్చవచ్చును. నహూషుడు భక్తి, జ్ఞాన వైరాగ్యములతో పరమపద సోపానమునకు అన్ని మెట్లు ఎక్కినప్పటికిని ఆఖరు మెట్టు చేరుకునే లోపున పరమపద సోపానములోని పెద్దపాము (కామము) నహూషుని మింగివేసి తిరిగి యధాస్థానమునకు తీసుకొని వచ్చినది. ఈ కామము పైపైన తొలగినట్టు కన్పించినను వాసనా రూపకముగ హృదయములో మరికొంత కాలము తిష్ఠ వేసికొనియే ఉండును. నహూషుడికి కూడా హృదయములో తిష్ఠవేసి మూలన దాక్కుని ఉన్న కామము తిరిగి విజృంభించి అతనిని అథః పాతాళానికి అణగ ద్రొక్కినది. పై విషయం మన వికాస తరంగిణి కార్యకర్తలు ఎప్పుడు గుర్తుంచుకోవలసి ఉంటుంది.
   - యం. అశోక్‌రావు, కరీంనగర్.
4. ఇంద్రపదవులే శాశ్వతమని, భగవద్భావన అనే శాశ్వతమైనదానిని విస్మరించి దానికి మూలమైన నిత్య అనుష్టాదులను మరచి ప్రవర్తించినందువలన నహూషుడు అధోగతి పాలైనాడు.
   -వేములపల్లి సుజాత, సరూర్ నగర్.
5. పరోపకారమే తనకు శ్రేయస్సు. తనకు కావాలనుకొంటే అదే పతనానికి హేతువు.





   -దిక్కల గురునాథరావు, చిన్నబాడం.
6. ఎంత జాతకుడైనా, మునివాహనరీత్యా, అహంకారముతో కూడిన కామాంధుని జీవితం - పతనం తథ్యం .
   -దిట్టకవి. మధుబాల , పేరుపాలెం.
7. అరిషడ్వర్గాలను జయించనివాడు, అందునా కామాన్ని జయించనివాడు అధోగతి పాలవక తప్పదని మనకు నహూషుడి కథ తెలియ చేస్తుంది.
   - దాసరి రజనీకృష్ణ, విజయనగరం.

వీరందరికి శ్రీశ్రీశ్రీ జీయర్‌స్వామివారి మంగళాశాసనములు అందజేస్తున్నాము.

**- వికాసతరంగిణి.**

భగవద్గీతలో మన అంతః శత్రువైన కామాన్ని గురించిన శ్లోకాలు ఎన్ని ఉన్నాయో చాలామంది ఉత్తరాలద్వారా తెలియచేసారు. స్పందనశీర్షికకు ఊహించినదానికన్నా ఎక్కువ ఆదరణ పాఠకుల నుండి లభించినది. వారి అభిప్రాయాలన్నింటిని స్థలాభావంకారణంగా ప్రకటించలేకపోతున్నాం. **ఈ స్పందనలో మిగిలిన ప్రచురణల పై కూడా మీ అభిప్రాయాలను పంపవచ్చు.** - వికాసతరంగిణి

## పన్నిద్దరాళ్వారుల ప్రతిష్ఠామహోత్సవ శుభాహ్వానము

గుంటూరు జిల్లా పెదనందిపాడు మండలము **పాలపర్రు** గ్రామములో వేంచేసి ఉన్న **శ్రీ వేణుగోపాలస్వామి వారి దేవస్థానము** నందు **ది. 20-3-2002 మధ్యాహ్నం గం॥12-30** లకు పన్నిద్దరాళ్వారుల లోహమయ భక్త బింబ ప్రతిష్ఠ **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి** కరకమలముల మీదుగా జరుగును. భక్తులందరకూ ఇదే మా ఆహ్వానం.

**ఇట్లు :- పాలపర్రు, వికాసతరంగిణి - 21, గుంటూరుజిల్లా.**








# సందేహాలు - సమాధానాలు

శ్రీ పి.యస్. నారాయణ, హైదరాబాద్.

ప్ర. : మోక్షమంటే ఒకటే కాబోలని మేమనుకుంటున్నాము. నమ్మాళ్వార్ల తిరువాయ్ మొఴ్ఴి 4-1లో కైవల్యమొకటున్నదని, అదిబ్రహ్మానందం ముందు అణుమాత్రమని, దానినిదాటి భగవత్సాన్నిధ్యమును పొందుడని చెప్పినట్టున్నది. మోక్షంలో తేడాలున్నాయా తెలుపుడు.

జ. : మోక్షమంటే 'విడుదల' అని అర్థము. కర్మబంధమునుండి పూర్తిగ విడుదల పొందడాన్ని మోక్షమని రూఢిగ అంటారు. అలా కర్మబంధం తొలిగాక, రెండు స్థితులుంటాయి. జీవుడు అర్చిరాది మార్గంద్వారా విరజానదిని దాటడందాక అంతా సమానమే. విరజానది దాటాక కేవలం ఆత్మానుభవమే కోరి తృప్తి చెంది, అలా ఉపాసన చేసినవారు ఆ పరమపదంలోనే ఓ మూల నుండే చోటుకు చేరి కేవలునిగానే మిగిలిపోతాడు. దానిని 'కైవల్యం' అంటారు. అదీ మోక్షమే.

కర్మలన్నీ నశించాయి అర్చిరాది గుండా విరజానది దాటివచ్చాడు కనుక ఇక తిరిగి జనన మరణ చక్రంలో ప్రవేశించడు. భగవదనుభవాన్ని కోరలేదు కనుక దాన్ని పొందడు. తిరిగి వెళ్ళడు. స్వాత్మ సాక్షాత్కారం పొంది, ఆత్మానుభూతిలో తేలియాడుతూంటాడు. అది నిత్య స్థితి.

అదికాక, భగవత్సేవనే మోక్షమని ఉపాసించినవాడు, విరజా నది దాటగానే 'అమానవ' అనే స్పర్శతో పంచోపనిషణ్మయ దివ్య దేహం ఏర్పడుతుంది. అది చాల రకాలుగ అలంకృతమై, ప్రేమ పూర్ణమై భగవదనుభవార్ద్రమై గరుడుని తోడ్పాటుతో పరమాత్మ సన్నిధికి చేరి స్వామిసేవలో ఉంటాడు. వీటిల్లో ఆ లోకంలోకి, విరజానది దాటగానే, ప్రవేశిస్తాడే ఈ జీవుడు, ఆ స్థితిని సాలోక్యం- భగవంతునితో సమానంగా ఒకే లోకంలో ఉండటం. ఆ వెంటనే అమానవ కరస్పర్శ, దివ్యదేహ ప్రాప్తి, అలంకరణ జరగుతాయే ఇది సారూప్యం అవుతుంది.

క్రమంగా భగవన్మండపము ప్రవేశించి భగవంతుని దరికి చేరు సమయం-'సామీప్యం' అంటారు. అతడి అనుగ్రహాన్ని పొంది శ్రీమన్నారాయణదివ్య దంపతుల గోష్ఠిలోఉండి, ఆతడి గుణాలను పొంది నిత్యకైంకర్యాన్ని చేపట్టడము 'సాయుజ్యం' మంటారు.

ఇందులో 'ముక్తులు' అందరూను, గరుడాది పెద్ద లందరినీ నిత్యులని వ్యవహరిస్తూంటారు. ఈ వెళ్ళిన వీడు ముక్త గోష్ఠిలో చేరతాడు.

శ్రీ యస్. రామాచార్య, వావిలాల

ప్ర. : మీరు **V.P.P.** నం. 55, తేదీ : 11-1-2002 ద్వారా పంపించిన 2002 క్యాలెండరు అందినది కాని మీ యొక్క క్యాలెండరు చూచి, మీకు పంపించిన రూ. 34-00 గురించి మరల జ్ఞాపకము చేసుకోవలసి వచ్చినది.

పంచాంగము క్యాలెండరు ప్రత్యేకత ఏ మాత్రములేదు. రాశిఫలములు ఇవ్వలేదు. మీరు తప్పడు ప్రకటనలు చేసి పబ్లిక్‌ను మోసము చేయడమే అని అర్థమవుచున్నది.

కావున మీ సమాధానము వ్రాయగలరు మీరు పంపించిన క్యాలెండరు బజారులో రూ. 10-00లకే లభించగలదు.

జ. : మీరు రూ. **10-00**లకే ఇలాంటి క్యాలెండర్‌ను ఏర్పాటు చేయగలిగితే వచ్చే ఏడాది నుండీ మీ దగ్గరే వేయించుకుంటాం. అత్యవసరమైన సమాచారము, సంప్రదాయాభిరుచిగలిగినవారికి ఆళ్వారుల చరితను అందివ్వాలనే సంకల్పంతో ఈ రకమైన రూపాన్ని ఈ క్యాలెండర్‌కు ఇవ్వడం జరిగింది. మీరు తప్పుడు ప్రకటనలు, మోసం చెయ్యడం లాంటి మాటలు బహుశః మనసులో మీకుండే బాధవల్ల వాడినవి అని అనుకుంటున్నాం. మీరు పంపించిన డబ్బును గురించి ఆలోచించుకునే స్థితిలో ఉన్నారని మీరు తెలుపుతున్నారు కనుక మీ డబ్బును మీకు తిరిగి వాపసు పంపివేస్తున్నాము. మీ ధనాన్ని సద్వినియోగం చేసుకోండి.

శ్రీయస్ దత్తుగారు, తెనాలి.

ప్ర. : మేము ఇద్దరం అన్నదమ్ములం నేను ఒక్కడినే ఈ మధ్యన బదరీలో మా తల్లిదండ్రులకు పిండప్రదానం చేసాను. చాల మంది బ్రహ్మకపాలం దగ్గర పిండ ప్రదానం చేసిన తరువాత ఆబ్దికము పెట్టనవసరంలేదని, సంకల్పము స్వయంపాకము చాలని అంటున్నారు. నాకు ఏమీ చేయాలో తెలియడంలేదు? మా అన్నగారు మామూలు ప్రకారము, నేను సంకల్పము స్వయంపాకముల ప్రకారం వేరువేరుగా చేయవచ్చునా?

జ. : తిలతర్పణాదులు మీరు చేయనవసరంలేదు. అన్నగారు తిలతర్పణాలు, దర్భలతో పిండప్రదానం చేస్తారు. భక్తులను **3** స్థానాలలో కూర్చోబెట్టి చేసేది ఇద్దరూ కలిసే చేయవచ్చు. వీలుకానిచో పాతనియమం ప్రకారం అన్నగారు చేస్తారు. మీరు మాత్రం దర్భ, తిలలు అవసరం లేకుండా భోక్తలకు పాదప్రక్షాళనం చేసి ప్రసాద ఏర్పాట్లు మాత్రం చేస్తారు.





# ఇతిహాసబోధ - VII

ఈ భూమిమీద మెసిలే కాలపరిమితిని తెలియజేసే మృత్యువంటే మనకందరికీ ఎంతో భయం! దానిని గూర్చి మాట్లాడటానికి కూడా మనం ఇష్టపడం. మనం దానినుండి ఎంత దూరం పారిపోవాలని యత్నించినా ఏదో ఒకరోజు అది మనల్ని తన దగ్గరకు తీసుకొని తీరుతుంది. మృత్యువును సేవకునిలా తన స్వాధీనంలో ఉంచుకొన్న భీష్మాచార్యుడంతటివాడు కూడా కాలధర్మాన్ని గౌరవించక తప్పలేదు.

పుట్టిన ప్రతిప్రాణీ గిట్టక తప్పదన్న సత్యం మనకు తెలుసు. అయితే జనన, మరణాల మధ్యకాలాన్ని సద్వినియోగం చేసుకోవడమెలాగో మాత్రం మనకు తెలియదు. అందుచేతనే సరిగ్గా చదవని విద్యార్థికి పరీక్ష తేది ఖరారైతే ఎలా కంగారు పడతాడో అలా మృత్యువు మన ముందు కొస్తానంటే కంగారు పడుతుంటాం.

రాజ్యలోభంతో అయిన వారినందరినీ మృత్యువుకు అప్పగించానని బాధపడే ధర్మరాజులాంటి ఉత్తముడి మనోవేదన గూర్చయితే ఇంకా చెప్పేదేముంది? వేదవ్యాసాది మహానుభావులు ఆయన దుఃఖానికి అడ్డుకట్ట వేయలేకపోయారు. అప్పుడు శ్రీకృష్ణుడు- "రాజా! ఏమిటీ వెఱ్ఱి? నీలాంటి బుద్ధి మంతు డిలా వ్యర్థమైన ఆలోచనలతో బాధపడటం తగునా? జాగ్రత్తగా విను! ఈ ప్రపంచంలో "మమ" అనే రెండక్షరాలే నిజమైన మృత్యువు. 'న మమ' అనే మూడక్షరాలు బ్రహ్మస్వరూపం. ప్రతివాడిలోనూ ఈ రెండు ఎవరికంటికీ కనపడకుండా నిరంతరం పోరాడూతూనే ఉంటాయి.

ప్రస్తుతం నీలో సాగుతున్న ఈ అంతర్యుద్ధంలో బంధుమిత్రుల సహాయమేదీ నీకు లభించదు. ఎందుకంటే నీకు శత్రువు నీ మనస్సే కాబట్టి. బుద్ధిసాయంతో మనస్సును గెలిచినప్పుడే నీకు శాంతి.

మమకారాన్ని విడచి సమస్త భూమండలాన్ని పాలించు. నీకు ఎట్టి పాపమూ అంటదు. పదార్థాలపై మమత్వంతో, కందమూల ఫలాలతో, కారడవులలో తపమాచరించినా నీవు మృత్యుముఖంలో ఉన్నవాడవే. మోక్షాన్నిచ్చే అంతశ్శత్రు జయంకోసం శోకాన్ని విడచి కోరికలను మనస్సులోనికి రానీయక కర్తవ్యాన్ని నిర్వహించు". - అంటూ మృత్యు తత్త్వాన్ని ధర్మరాజుకు బోధించాడు.

ఈ పాఠం ధర్మరాజుకే కాదు మనకూ వర్తిస్తుంది. మనందరిలో దైవీసంపత్తి, ఆసురీ సంపత్తిగా పిలువబడే రెండు తత్త్వాలు సదా పోరాటం సాగిస్తూనే ఉన్నాయి.

భగవంతుని ఆధిపత్యాన్ని గుర్తించక, జీవిత సుఖాలపట్ల అంతులేని ఆపేక్షను పెంచుకొని, అహంకారాన్ని కేంద్రంగా చేసుకొని, ఆశాపాశబద్ధులై జీవించేవారంతా ఆసురీ ప్రవృత్తి కలవారే. చావు బ్రతుకుల చక్రభ్రమణ సంచారం తప్పనివారే. దంభం, దర్పం, దురభిమానం, క్రోధం, క్రూరత్వం, అజ్ఞానం వంటి ఆసురీ సంపత్తి యొక్క అవలక్షణాలు మరల మరల మృత్యుముఖంలోకి మనల్నీ త్రోసి వేస్తూనే ఉంటాయి.

"నేను, నా సుఖం, నా దుఃఖం, నా బంధువు, నా మిత్రువు, నా శత్రువు, నా

మంచి, నా చెడు, నా పాపం, నా పుణ్యం, నా గౌరవం, నా అవమానం" అంటూ మనం పెట్టే ఏడ్పులూ, పెడబొబ్బలూ మనలోని ఆసురీ ప్రవృత్తియొక్క ఆక్రందనలే.

ఇటువంటి రోదనలు మనకు అప్పుడప్పుడు చికాకు కల్గిస్తూంటాయి. దీనికి భిన్నమైన జీవితం గడపాలనే భావన కల్గుతూంటుంది. అలాంటప్పుడు ఆచార్యులనో, భగవంతుడినో ఆశ్రయిస్తుంటాం. అయితే మనం తరచూ విధేయతలను మార్చే చపలచిత్తులం. కాకి నోటిలోని రొట్టెముక్క కోసం నక్కబావ పాడే టక్కరి స్తోత్రాలను యధాతథంగా భగవంతునికీ వినిపించగల తెలివిగల వ్యాపారభక్తులం మనం. ఒక ప్రక్క అహంకారానికి ఊడిగం చేస్తూనే మరొక ప్రక్క 'అడియేన్ దాసోహం' అంటూ బూటకపు విధేయతలను వాగాడంబరంతో ఆర్భాటంగా ప్రకటిస్తుంటాం. ఇది తెలిసో, తెలియకో తరచూ మన బ్రతుకుల్లో సాగే ఊగిసలాట.

దీని నుండి తప్పుకొని మన చర్యల వెనుక మాధవుడే ప్రేరణగా నిలవాలనే తపన మనలో తీవ్రమైన నాడు 'సేవక' భావన సాధనకు వీలౌతుంది. మాధవుని దిశగా మన అడుగులు త్వరగా సాగాలంటే 'సేవక భావ' స్మరణే మనకు గతి. ఎందుకంటే సేవకునికి 'స్వంతం'అంటూ ఏమీ ఉండదు.

తనకు ప్రాప్తించిన భుజసంపద, సౌందర్య సంపద, బుద్ధి సంపద, సకలవస్తు వాహన వైభవ సంపద, బంధుమిత్రాది అనుబంధ సంపద, అధికార సంపద-సమస్తానికి యజమాని భగవంతుడే, 'ఆయన ప్రీతి కోసం, ఆయన సంపదలను భయభక్తులతో సద్వినియోగపరిచే సేవకుడౌతాను.' అనే భావనే మన జీవన వికాస మార్గం. ఈ బాటన నడిచిన **అక్రూరుడి** గాధే ఈసారి మన ఇతిహాసబోధ.

యాదవులలో 'కదిలే కల్పవృక్షం'గా పేర్గాంచిన శ్వఫల్గుడనే మహానుభావుడున్నాడు. ఆయన ఎక్కడ వుంటే అక్కడ కరువు కాటకాలు మాయమౌతాయి. అతివృష్టి, అనావృష్టి, అనారోగ్యం వంటి ఈతిబాధలు లేకుండా ఆయన ఉన్నచోట ప్రజలు సుఖశాంతులతో వర్ధిల్లుతారు. కాశీరాజు కూతురైన గాంధిని శ్వఫల్గుని భార్య. ఆమె తల్లిగర్భంలో ఉన్నప్పటినుండే ప్రతిరోజూ గోదానం చేసే వ్రతాన్ని చేపట్టి జీవితాంతం దానిని కొనసాగించిన దానశీలిని. అలాంటి పుణ్యదంపతులకు పుట్టిన 'బభ్రువు' తన సుగుణాల ప్రసిద్ధిచేత 'అక్రూరుడి'గా ఖ్యాతి గడించాడు.

వసుదేవునికి సోదరుడి వరుస అయిన అక్రూరుడు యాదవ ప్రముఖులందరికీ తలలోని నాలుకే. అందరికీ కావలసిన వాడే. అందరి పనులు చక్కపెట్టేవాడే. ఇతరులను తన ప్రవర్తనతో నొప్పించడానికి ఇష్టపడని సౌమ్యుడు సహజంగా అందరికీ ప్రేమాస్పదుడే కదా! అందుకోసమే కంసుడు తన కార్యాన్ని నేరవేర్చగల సమర్ధుడు అక్రూరుడేనని భావించాడు.

"మిత్రమా! అక్రూరా! నీవు మహాదాతవు! నాకెంతో కావలసినవాడవు. దేవముని నారదుడు నాకో సత్యాన్ని తెలియజేసాడు. ఆ మాయావి శ్రీహరి దేవకీ వసుదేవుల అష్టమ గర్భంగా జన్మించి బృందావనంలో పెరుగుతున్నాడట. దేవేంద్రాదులు నన్నెదిరించలేక ఆ నారాయణుడిని శరణువేడితే అతడు నన్ను అణచివేయడానికి ఈ అవతారమెత్తాడట. పశువులకాపరిగా ఉన్న ఈ పసిబాలుడు పెరిగి పెద్దై నాకు ప్రాణహాని తలపెట్టక ముందే నేనే అతనని నశింపచేయవలె. అందుకోసమే ధనుర్యాగం పేరుతో అతనిని మధురకు రప్పించి మనం మట్టుపెడదాం."





నీవు నా దూతగా బృందావనానికి వెళ్ళి నేర్పుగా మంచిమాటలతో బలరామకృష్ణులను మధురకు తీసుకురావాలి. సుమా!" ఇది కంసుని అభ్యర్థన మాటున ఉన్న ఆజ్ఞ అని అక్రూరునికి తెలును. కన్న తండ్రినే చెఱసాలపాలు చేసిన కఠినాత్ముడు కంసుడు. అతని హత్యా ప్రణాళికకు తాను సహకరించనంటే ఊరుకుంటాడా?

"రాజా! అద్భుతమైన ఎత్తుగడ వేసావు. నీ మాటలు నాకు ఎప్పుడూ శిరోధార్యమే. నీవు సంకల్పించిన విధంగానే బలరామకృష్ణులను మధురకు తీసుకొని వస్తాను. అయితే ఒక్క మాట. మనమెన్ని అనుకొన్నా భగవత్సంకల్పమే నెఱవేరుతుంది. ఫలితం ఏ రూపంలో వచ్చినా మనం స్వీకరించడానికి సిద్ధంగా ఉండాలి." అంటూ మెత్తగా హితబోధ చేసి బృందావనం బయలుదేరిన అక్రూరుని ఆలోచనల నిండా శ్రీకృష్ణుడే నిలిచాడు.

"కంసుని వంటి శ్రేయోభిలాషి నాకు వేరెవ్వరూ లేరు. శ్రీకృష్ణ సందర్శనంతో నా జన్మ ధన్యమయ్యే మార్గం చూపిన మహానుభావుడాయన. మహాతపశ్శక్తి సంపన్నులైన మహర్షులకు సైతం అంతుపట్టని కృష్ణతత్వాన్ని ఆస్వాదించే అదృష్టం నాలాంటి అజ్ఞానికి లభించింది. ఇది ఏ జన్మలో చేసుకొన్న సుకృతమో" అనుకుంటూ బృందావనంలో అడుగుపెట్టిన అక్రూరుడికి కృష్ణుని అడుగుజాడలు కన్పించాయి.

అంతే! అతని కన్నులు ఆనంద భాష్పాలతో నిండిపోయాయి. పరవశంతో రోమాంచిత శరీరుడై శ్రీకృష్ణుని పాదాలపై వాలిపోయాడు. అక్రూరుని ద్వారా మధురలోని పరిస్థితులను పూర్తిగా తెలుసుకొన్న బలరామకృష్ణులు మధురకు ప్రయాణమయ్యారు. 'ఈ అక్రూరుడు పరమ క్రూరుడ'ని నిందిస్తూ గోపికలు వియోగ భారంతో వేడినిట్టూర్పుల వీడుకోలు కృష్ణునికందించారు.

మధురకు వెళ్ళేదారిలో యమునా నదిలో స్నానమాడటానికి వెళ్ళిన అక్రూరునికి శ్రీకృష్ణ భగవానుడు తన దివ్యదర్శన భాగ్యాన్ని అనుగ్రహించి ధన్యుడిని చేసాడు. మహావిద్వాంసుడు, పుణ్యాత్ముడు అయిన అక్రూరుడు శ్రీకృష్ణునకు ప్రపన్నుడై ఆయన పరిపూర్ణ అనుగ్రహాన్ని పొందాడు.

ఇలాంటి అక్రూరునికి ఒక సమయంలో ఒక కఠిన పరీక్ష 'శ్యమంతక మణి' రూపంలో ఎదురైంది. అదెలాగంటే.

సూర్యోపాసన చేసి దినానికి ఎనిమిది బారువుల బంగారాన్ని ప్రసాదించే 'శ్యమంతక మణి'ని సంపాదించాడు సత్రాజిత్తు. అంతటి విలువైన వస్తువు ద్వారక ప్రజలందరికీ వినియోగపడేవిధంగా రాజ్యగతమైతే బాగుంటుందన్న కృష్ణుని అభిప్రాయాన్ని తిరస్కరించాడు సత్రాజిత్తు. ఆ మణిని అతని తమ్ముడు ప్రసేనజిత్తు తీసుకొని వేటకు వెళ్ళి మరణించాడు. ఆ నింద శ్రీకృష్ణుని మీద పడటంతో శ్రీకృష్ణుడు అడవికి వెళ్ళి మణిని సంపాదించి సత్రాజిత్తుకు ఇచ్చి, అపవాదును తొలగించుకొన్నాడు.

తన పొరపాటుకు పశ్చాత్తాపపడ్డ సత్రాజిత్తు తన ముగ్గురు కుమార్తెలను శ్రీకృష్ణునికిచ్చి వివాహం చేసాడు. కొందరు యాదవ ప్రముఖులకు ఇది నచ్చలేదు. వారెంతో కాలంగా సత్రాజిత్తు యొక్క కన్యామణులపైన, శ్యమంతక మణిపైన కన్ను వేసి ఉన్నారు. అక్రూరుని అనుంగ మిత్రుడైన శతధన్వుడు వీరిలో ప్రముఖుడు. తనకు ఆశాభంగం కల్గించిన సత్రాజిత్తుకు తగిన శాస్తి చేయాలనుకొన్నాడు శతధన్వుడు.

అదే సమయంలో పాండవులు కుంతీదేవితో సహా వారణావతంలో లక్కయింటిలో దగ్ధమయ్యారన్న వార్తను విన్న శ్రీకృష్ణుడు సాత్యకీ సమేతంగా వారణాసికి వెళ్ళాడు. దీనిని అవకాశంగా తీసుకొని శతధన్వుడు అర్ధరాత్రివేళ సత్రాజిత్తును సంహరించి శ్యమంతకాన్ని అపహరించాడు.

తండ్రి మరణానికి ఆగ్రహించిన సత్యభామ ఆ విషయాన్ని కాశీకి వెళ్ళి కృష్ణునకు తెలియజేసింది. కృష్ణుడు ద్వారక వచ్చి బలరాముడిని సంప్రదించాడు. శతధన్వుడిని వధిస్తే మణి మనదౌతుంద న్నాడు కృష్ణుడు. మహిమగల మణి మీద బలరాముడికి కూడా ఆశే.

అన్నాదమ్ములు తనను చంపడానికి రానున్నారని తెలిసి తన అన్న కృతవర్మను సాయమడిగాడు శతధన్వుడు. నా వల్లకాదు పొమ్మన్నాడు కృతవర్మ. "దేవతలకే జయించ సాధ్యంకాని బలరామకృష్ణులను ఎదురించి బ్రతుకగలవా? పారిపోయి ప్రాణాలు దక్కించుకో" అని మిత్రుడికి అక్రూరుడు సలహాఇచ్చాడు.

'అక్రూరా! నీవు చెప్పినట్లే చేస్తాను. ఓ చిన్న సాయంచేయి. ఈ శ్యమంతకమణిని నీ దగ్గర భద్రం చేయి. బ్రతికుంటే మళ్ళీ వచ్చి తీసుకొంటాను. లేకుంటే ఈ మణి నీదే. ఎట్టి పరిస్థితులలోనూ ఈ రహస్యాన్ని నేను ఎవరికీ చెప్పను, నీవూ చెప్పకు" అని బలవంతంగా మణిని అక్రూరుడికి అప్పగించి పారిపోయాడు శతధన్వుడు.

బలరామకృష్ణులు తరుముకుంటూ వెళ్ళారు. మిథిలా నగరపు సమీప అడవుల్లో శతధన్వుడి గుఱ్ఱం మరణించడంతో పాద చారియై అతడు పరుగెట్టాడు.

'అన్నా! ఈ అడవిలో రథంతో శతధన్వుని వెంట పడటం కష్టం. నీవు రథం వద్దే ఉండు. నేను పాదచారినై వెళ్ళి వాడిని హతమార్చి మణిని తెస్తానన్నాడు' శ్రీకృష్ణుడు. అడవిలోకి వెళ్ళి శతధన్వుని హతమార్చి, అన్న వద్దకు వచ్చి మణి దొరకలేదన్న సంగతి చెప్పాడు.

బలరాముడు తమ్ముడి మాటలు నమ్మలేదు. 'కృష్ణా! నీవింత మోసగాడివి అనుకోలేదు. మణిని నాకివ్వాల్సి వస్తుందనే భయంతో అబద్దాలాడతావా? నీ ఆత్మీయతా, విధేయతా అంతా ఉట్టి బూటకం. ఛీ! ఛీ! ఇక నీకూ నాకూ చెల్లు. హాయిగా మణితో వెళ్ళి ద్వారకలో భోగభాగ్యాలనుభవించు" అని తమ్ముడిని దూషించి మిథిలా నగరం చేరాడు బలరాముడు.

మిథిలాధిపతి సాదరంగా బలరామునికి ఆతిథ్యమిచ్చాడు. అక్కడ బలరాముడు మూడేళ్ళు తాత్త్విక చర్చలతో కాలం గడిపాడు. ఆ సమయంలోనే దుర్యోధనుడు బలరాముని కి శిష్యుడై గదా యుద్ధంలో ప్రావీణ్యాన్ని సంపాదించాడు.

మరల నీలాపనిందకు గురై విషాద వదనంతో ద్వారకకు చేరాడు శ్రీకృష్ణుడు. కక్కలేని, మ్రింగలేని పరిస్థితి అక్రూరుడిది. మణి ఇప్పటికే ప్రసేన జిత్తును, సత్రాజిత్తును, శతధన్వుడిని పొట్టనపెట్టు కొన్నది. బలరామకృష్ణులంతటి వారిని విడదీసింది. ఈ పరిస్థితుల్లో మణి తనవద్ద ఉన్నదని తెలిస్తే కృష్ణుడు తనను బ్రతకనిస్తాడా? సత్రాజిత్తు హత్యలో తననూ భాగస్వామిగా భావించడూ! పైగా అన్నగారి వియోగ దుఃఖంకూడా ఆగ్రహంగా మారి తనను హతమారిస్తే.

ఒక ప్రక్క కృష్ణభక్తి! మరొక ప్రక్క ప్రాణభయం. ఏంచేయాలో తోచని పరిస్థితిలో అక్రూరుడికి ఉపాయం తట్టింది. 'యజ్ఞదీక్షలో ఉన్నవారిని హతమార్చడం మహాపాపం కనుక





తాను నిరంతరం యజ్ఞాలు చేస్తుంటే కృష్ణుని వల్ల ప్రాణభయం ఉండదు." అని పించింది అతనికి. అంతే ఇక అప్పటినుండి యజ్ఞాలే! యజ్ఞాలు! బ్రహ్మచర్య వ్రతాన్ని చేపట్టి నియమనిష్టలతో అరవై ఏళ్ళు నిర్విరామంగా యజ్ఞాలు దాన ధర్మాలతో మహావైభవంగా నిర్వహించాడు అక్రూరుడు. 'అక్రూర యజ్ఞాలు'గా అవి ప్రసిద్ధి కెక్కాయి. యజ్ఞాల ప్రభావంవల్ల ఈతిబాధలు తొలగి ద్వారక సుభిక్షంగా వర్థిల్లింది.

ఈ లోపల మణి శ్రీకృష్ణునివద్ద లేదని బలరాముడికి నచ్చచెప్పి యాదవ ప్రముఖులు బలరాముడిని ద్వారకకు తెచ్చారు. అన్నదమ్ములు యధాప్రకారం సఖ్యతతో మెలిగారు. ఒకసారి అక్రూరుడి బంధువులు అన్యాయంగా శత్రుఘ్నుడనే యాదవవీరుడిని హత్యచేసారు. దాని పర్యవసానం తన నెత్తికెలా చుట్టుకొంటుందో ననే భయంతో అక్రూరుడు ద్వారకను వదలి కాశీకి వెళ్ళాడు.

అక్రూరుడు వెళ్ళాక ద్వారకకు అన్నీ కష్టాలే. కరువు కాటకాలతో, అనారోగ్యంతో ద్వారక అల్లల్లాడింది. దేవదేవుడైన కృష్ణుడిని తలుచుకోలేదు యాదవులు. 'అక్రూరా! అక్రూరా!' అని అక్రూరుడికోసం కలవరించారు. పెద్దలందరూ సమావేశమై బలరామకృష్ణులను కాశీకి పంపి అక్రూరుడికి ధైర్యంచెప్పి ద్వారకకు పిలిపించారు. అక్రూరుడు ద్వారకకు రాగానే ఆశ్చర్యకరంగా చక్కని వర్షాలు కురిసి పంటలుబాగా పండాయి. 'అక్రూరుని మహత్యమే మహత్యం' అనుకున్నారు ప్రజలు.

దీని వెనుక 'శ్యమంతక మణి' ఉండవచ్చేమోననే అనుమానం కృష్ణునికి కల్గింది. అనుమాన నివృత్తికోసం కృష్ణుడు తన ఇంట పెద్ద విందు ఏర్పరచి యాదవ ప్రముఖులందరినీ పిలిచాడు. ఆ విందులో సమయం కనిపెట్టి, "మహాదాతా! అక్రూరా! శ్యమంతక మణి మహత్తువల్ల నీవు ప్రజోపయోగకరమైన మంచి కార్యాలెన్నో చేసి ద్వారకను కాపాడావు. అది యోగ్యుడైన నీ వద్ద ఉన్న కారణంగా మన దేశానికి ఎంతో మేలు జరిగింది. అది నీ వంటి ఉత్తముడి వద్ద ఉండటమే మన జాతికి క్షేమం.

అయితే మా అన్న బలరాముడు, ఇతర యాదవ ప్రముఖులూ ఇప్పటికీ శ్యమంతకం నావద్దనే ఉందని అనుమానిస్తున్నారు. వీరందరి సమక్షంలో ఒక్కసారి ఆ మణిని చూపించి నాపై ఉన్న అపవాదును తొలగించి పుణ్యం కట్టుకో" అని ప్రేమతో శ్రీకృష్ణుడు ప్రార్థించాడు.

వెంటనే అక్రూరుడు శ్రీకృష్ణుని పాదాలమీద పడిపోయి 'మహాత్మా! సర్వజ్ఞుడవైన నీకు తెలియని రహస్యమెక్కడ ఉంది? ఇన్నాళ్ళు నీకు ప్రీతి కలిగే విధంగా పది మంది మేలు కోసం శ్యమంతకాన్ని భద్రపరిచాను. ఇది నీ సొత్తు, ఇన్నాళ్ళు దాచినందుకు నన్ను క్షమించి రక్షించు' అని, దుస్తులలో దాచుకొన్ని మణిని కృష్ణునికి అప్పగించి బరువు దించుకొన్నాడు అక్రూరుడు.

కళ్ళుమిరుమిట్లు కొలిపే ఆ మణినిచూచి యాదవ ప్రముఖులందరూ ఆశ్చర్యపోయారు. అయితే ఆ మణి తనకు మళ్ళీ ఇరకాటాన్ని కల్గించనున్నదని కృష్ణుడు గ్రహించాడు. కృష్ణుడు మణిని తనకే ఇస్తాడని బలరాముడు, సత్యభామ పువ్విళ్లూరు తున్నారు. వారిలో ఎవరికిచ్చినా తనకు తిప్పలు తప్పవు. అందుచేత పరిస్థితిని గమనించిన శ్రీకృష్ణుడు "అక్రూరా! ఈ మణి నీవద్ద ఉండటమే సముచితం. నీలా బ్రహ్మ చర్య వ్రతం చేపట్టి నిష్టగా మణిని ఆరాధించే శక్తి మాకులేదు.

పదహారువేల మంది భార్యలున్న నాకు గాని, నా విరహాన్ని భరించలేని సత్యభామకుకానీ ఈ నియమనిష్టలు సాధ్యంకావు. ఇక మా అన్న బలరాముడి సంగతి సరేసరి! మద్యపానంలేకుండా ఆయనకు క్షణం గడవదు. సుఖభోగాలను వదలి ఈ మణికోసం ఆయన మడికట్టుకోలేడు.

కనుక మేమంతా కలసి ఈ మణిని నీవద్దనే ఉండాలని ప్రార్థిస్తున్నాం. దీనిద్వారా యధాప్రకారం మనదేశానికి తగిన హితాన్ని నీవే చేయి''. అని అక్రూరుడికే ఆ మణిని కట్టబెట్టాడు. శ్రీకృష్ణుని ప్రసాదంగా దానిని స్వీకరించి గతంలోలాగే తనకు లభించిన సంపదలను సద్వినియోగపరచి అక్రూరుడు ధన్యచరితుడయ్యాడు. ధనసంపత్తితోపాటు భగవానుడు మెచ్చే దైవీసంపత్తి కలవాడు కనుకనే అక్రూరుడు మనకు ఆదర్శప్రాయుడయ్యాడు.''మమత్వపు'' మృత్యువును అధిగమించదలచిన ప్రతిఒక్కరూ అక్రూరుని మార్గాన్ని అనివార్యంగా అనుసరించక తప్పదు.

మంచి ధాన్యాన్ని తన క్షేత్రంలో పండించాలనుకొనే రైతు కలుపు మొక్కలను తొలగించే విషయంలో ఎలాంటి జాగ్రత్తలు చూపుతాడో అలాంటి జాగ్రత్తలనే అక్రూరుడు తన మానసక్షేత్రం విషయంలోనూ చూపాడు. ప్రకృతి సహజంగా మనం కోరకపోయినా మన మానసక్షేత్రంలో ఆసురీసంపత్తి కలుపుమొక్కల్లాగానేకాదు, మానుల్లాకూడా పెరుగు తుంటాయి. దైవీ సంపత్తితో మన హృదయక్షేత్రం పండాలంటే మనం ప్రయత్న పూర్వకంగా ఆసురీ సంపత్తిని తుడిచి పెట్టకతప్పదు. దైవం పట్ల మనకు గల ప్రీతికి, ఆర్తికి గీటురాయి ఇదే.

ఈ సందర్భంగా శ్రీకృష్ణ భగవానుడు 'గీత'లో దైవీ, ఆసురీ సంపత్తులను ఎన్ని శ్లోకాలలో వివరించాడో ఉత్తరం ద్వారా తెలియచేయండి. యధాప్రకారం 'ఇతిహాస బోధ'-**VII** కు కూడా తగిన పేరు, మీ 'స్పందన'తోపాటు తెలియచేసి, శ్రీస్వామివారి మంగళాశాసనాలను పొందుతారు కదూ!

జై శ్రీమన్నారాయణ!

## గ్రంథ పరిచయం

శ్రీమద్వేదాంతదేశికులు సంస్కృతంలో గరుడదండకాన్ని రచించేరు. దేశికుల ఇతర ప్రబంధాల వలె ఇదీ వ్యాఖ్యాసాపేక్షం. సంస్కృతంలో ఈ గరుడదండకానికి చాలా వ్యాఖ్యానాలు ఏర్పడినై. వాటిలో రాజగోపాలార్యకృత వ్యాఖ్య విపులం, విశేషార్థ సమంచితమూను.

తెలుగువారి ఉపయోగం కోసం **ఉ.వే.ప్ర. శ్రీమాన్ డా॥ ఈ. ఏ. సింగరాచార్యస్వామివారు** ఈ రాజగోపాల వ్యాఖ్యతో దేశికస్వాముల గరుడదండకాన్ని తెలుగులో ప్రకటించేరు. రాజగోపాల వ్యాఖ్యను ప్రామాణికంగా తెనుగు కావించడంతోపాటు మరో ఆరు సంస్కృతవ్యాఖ్యానాలను అనుబంధంలో చేర్చేరు. ఆస్తికులకు ఉపాదేయమైన ఈ గరుడదండకాన్ని సంస్కృతాంధ్ర వ్యాఖ్యలతో తెనాలి సాధన గ్రంథమండలివారు ప్రకటించేరు.

52 పుటల ఈ గరుడదండకం వెల రూ. 15/-లు

ప్రతులకు

1. **సాధన గ్రంథమండలి,**
తెనాలి - 522 201
గుంటూరు జిల్లా,

2. **జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్**
సీతానగరం - 522 501.
గుంటూరు జిల్లా.





## ఇతిహాస బోధ -VI సమాధానములు

1. **వినాశకాలే విపరీత బుద్ధిః**
- పి. రామసుబ్బారావుగారు, నెల్లూరు.
2. **కామా తురాణాం న భయం న లజ్జా**
- డి. రజనీకృష్ణగారు, విజయనగరం
3. **విధి వ్రాతను ఎవరు తప్పించజాలరు - తప్పించినను అదియును కూడ విధి లిఖితమే.**
- యమ్. విశ్వనాధంగారు, హన్మకొండ.
4. **అధికార మున్నదని మిడిసిపడరాదు**
- జి. రాధాకృష్ణమూర్తిగారు, గుంటూరు.
5. **కామక్రోధ,లోభం వీడినవాడే ఉత్తముడు**
- పి. వైదేహి, విజయవాడ.
6. **గర్వం సర్వం చెరుచున్**
- కె. రామశేషమ్మ, హిల్ కాలనీ.
7. **కామం, జ్ఞాన భక్తి వైరాగ్యములను దూరం చేస్తుంది**
- యమ్. అశోకరావు, కరీంనగర్.
8. **చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ** - యస్.వి. హనుమంతరావు, కందుకూరు.
9. **గమ్యాన్ని చేరేవరకు ప్రయాణాన్ని ఆపకు, భోగ భాగ్యాన్ని ఆశించకు**
- డి. తులసిలక్ష్మి.
10. **బూడిదలో పోసిన పన్నీరు**
- వి. సుజాత, హైదరాబాద్.
11. **అహంకారం - అరిష్టహేతువు**
- యమ్. జయప్రకాష్, హనుమకొండ.
12. **యోగ్యతలేనివాడు తనకున్న యోగ్యతలను ఆలోచించే వర్తించాలి గాని, గొప్పవారి నిర్బందానికి గురై వర్తించరాదు** - డి. శారదాంబ, చిన్నబాడారం.
13. **అతిగర్వము అధోగతికి ఆరంభం**
- లక్ష్మీ ధనుంజయశర్మ - ముబగాం
14. **మనోమాలిన్యాలే మానవ పతనానికి కారణం** - కె. రాజ్యలక్ష్మి, ఆకివీడు.
15. **ఎవరు చేసిన కర్మ వారు అనుభవించక ఎవరికైనా తప్పదన్న** - ఆర్. రాజ్యలక్ష్మి, ఆకివీడు.
16. **మంచిమార్గాన్ని అనుసరిద్దామా** - దాసరి రజనీ కృష్ణ, విజయనగరం
17. **దైవసంపద మోక్షానికి మూలం ఆసుర సంపద నరకానికి మూలం** - అనసూయ, అనంతపురం.
18. **ఎవరికైనా తత్త్వజ్ఞానము అవసరము** - ఎం. సూర్యనారాయణ, మెళియాపుట్టి
19. **విషయ భోగాలు వినాశనానికి దారితీస్తే, పశ్చాత్తాపము పాపాన్ని నాశనం చేస్తుంది**
- పొందుల అరుణకుమారి, విశాఖపట్నం.
20. **తన తప్పును తాను తెలుసుకొని తనను తాను సంస్కరించుకున్నవాడే ఉత్తముడు.** - డి. వల్లభ నారాయణ, చిన్నబాడాం.
21. **వినయం వలన సద్గతి, గర్వంచేత దుర్గతి**
- ఐ. లక్ష్మినరసింహారావు, మధిర.
22. **యోగ్యత లోనివాడు తనకున్న యోగ్యతలను ఆలోచించేవర్తించాలి గాని, గొప్పవారి నిర్బందానికి గురై వర్తించరాదు.**
- డి. శారదాంబ చిన్నబాడారం.

వీరందరికీ శ్రీశ్రీశ్రీ జీయర్‌స్వామివారి మంగళాశాసనములు అందజేస్తున్నాము.

**- వికాసతరంగిణి.**

# శ్రీవచన భూషణము

-శ్రీ ఉ.వే.శ్రీమాన్ **శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి**, విశాఖ

ఇంతవరకు 93వ సూత్రములో దేహత్యాగము చేయుటచే భగవత్ప్రాప్తి కలుగునని శాస్త్రము చెప్పినది అని గాక సర్వేశ్వరునిపొందవలెనను కోరికతో వానినే ఉపాయమని స్వీకరించిన ప్రపన్నుడుకూడ భగవద్విషయమునందు ఉండు ప్రేమాతిశయముచే తాను దేహమును వీడకుండా ఉండలేడు. ఇది ఉపాయమని ఆచరించినది కాకపోవుటచే ఉపాయముగ సంబంధింపదు.ప్రేమ పరవశుడు ఒకప్పుడు అజ్ఞానముచే ఇట్లు చేసినచో స్వామి తప్పక వచ్చునని చేసి నందున అది దోషముకాదు. అనన్యోపాయత్వమునకు భంగమును కలిగించు ఇతరోపాయములను స్వీకరించుట స్వస్వరూపజ్ఞానము కలిగిన మహాభక్తులు కూడ చేసినారు. వీరు అజ్ఞానము చేతనే చేసినను ఆ అజ్ఞానము ప్రేమాధిక్యముచే కలిగినది గాని కర్మనిమిత్తము కలిగినది కాదు కనుక ప్రశంసింపదగినదే. సిద్ధోపాయమునకు ఇది ప్రతిబంధకము కాదు. సిద్ధోపాయమునకు ఏ గొప్పదనమున్నదో ఆ గొప్పదనము ఇట్టి ఇతరోపాయానుష్ఠానము చేయుట యందు కూడ ఉన్నది కనుక శ్లాఘింపదగినదే.

## 94వ సూత్రము

**ఇవనుక్కు ప్పిఱక్కుమాత్మగుణంగళెల్లావత్తుక్కుమ్ ప్రధానహేతు యింద ప్రావణ్యమ్.**

సాధ్యమైన భగవత్ప్రాప్తియందు అధికమగు ఆసక్తి, ఆత్మగుణములన్నిటికి ప్రధానమైన కారణము. ఇది ప్రావణ్యము అనగా ఎక్కువ ఆసక్తియే. ఆసక్తి ఎక్కువగ ఉండుటచేత దానిని పొందుటకు అవసరమైన శమము, దమము మొదలగు ఆత్మగుణములు కలుగుచున్నవి.

భగవద్విషయము లోకములో మనకు కన్పించెడి విషయములకంటె విలక్షణము అగుటచే దానిని పొందవలెనని ఆసక్తి కలుగును. అంతేగాని, దానికి వేరొక కారణములేదు. శమదమ నియతాత్మా అని చెప్పబడిన మనో నిగ్రహము, ఇంద్రియ నిగ్రహము మొదలగు ఆత్మగుణములు భగవద్విషయమునందు ప్రవర్తించువారికి ఉండును.

అట్లే అమానిత్వము మొదలగు భగవద్గీతలో చెప్పబడిన అహంకార రహిత స్థితి మొదలగునవి కూడ మోక్షమును కోరువారికి ఉండును. కాని అవి అన్నియు ఉండుటకు భగవత్ప్రాప్తి యందు అధికమగు ఆసక్తి ఉండుటయే కారణము.

భగవద్భక్తులతో సహవాసము కలిగి ఉండుట, శాస్త్రములను అభ్యసించుట ఆచార్యోపదేశము మొదలగునవికూడ శమము, దమము మొదలగు ఆత్మగుణములు కలుగుటకు కారణములు కావచ్చును. వాటి అన్నిటి కంటె ముఖ్యమైన హేతువు భగవద్విషయమునందు జీవునకు కలుగు అత్యాసక్తియే.





## 95వ సూత్రము

**"మాఱ్పాల్ మనమ్శు ళ్షిప్ప", "పరమాత్మని యో రక్తః", కణ్డుకేట్టుత్తు మోన్దు"**

పరమాత్మయందు అత్యాసక్తి కలుగుటచే శమము, దమము, వైరాగ్యము మొదలగు ఆత్మగుణములన్నియు కలుగును. అనిచెప్పిన దానికి ప్రమాణము చూపుచున్నారు. సర్వేశ్వరుని విషయమున మనస్సులో ఆసక్తి కలుగగనే లోకములో సహజముగ అనుభవింపదగినవారని తోచెడి స్త్రీలయొక్క బాహువులను ఆలింగనము చేసుకొనుటలో కోరిక తగ్గినది. పరమాత్మయందు ఆసక్తి గలవాడు పరమాత్మ కంటె ఇతర విషయములలో విరక్తి గలవాడగును అని చెప్పినట్లు పరమాత్మయందు ఆసక్తి కలిగిననాడే ఇతర విషయములపై మనసు ప్రసరించుట తగ్గును.

అట్లే ఆళ్వారులు, సుందరమగు కంకణములు ధరించు శ్రీదేవితో సర్వేశ్వరుడు విహరించెడి సౌందర్యమును, దర్శించి లోకములోని విషయములను చూచి, విని, స్పృశించి, వాసన చూచి, తిని సంచరించెడి జీవితములో ఐదు ఇంద్రియములచే కలిగెడి ఆనందమును, ఇంత అని చెప్పవీలుగాని కేవలాత్మా నుభవముచే కలిగెడి ఆనందమును వదలివేసినాను అని పెరియపిరాట్టితో అనగా లక్ష్మీదేవితో, పెరుమాళ్ళు అనగా సర్వేశ్వరుడు ఆ శ్రీవైకుంఠపురములో వేంచేసిఉన్న ఆ సన్నివేశమును చూచి దానియందు ఆసక్తిగల వాడనైనాను, అని భగవానుని యందు అధికమగు ఆసక్తి కలిగినచో ఇతర విషయముల యందు విరక్తి కలుగునని చెప్పినారు. కావున ఇతర విషయముల యందు విరక్తి కలుగుటకు ప్రధానమైన కారణము భగవద్విషయము నందు ఆసక్తి అధికమగుటయే.



# దివ్యదేశ సందర్శన

అర్చావతారపు సహజ సౌందర్యాన్ని, సౌలభ్యాన్ని ఆస్వాదించాలంటే దక్షిణదేశయాత్ర చేయవలసిందే. సమున్నత ప్రాకారాలు, సుందర విమానాలు, పంటపొలాల పరిసరాలు, స్వచ్ఛజలాల సరోవరాలు, హరిత వనాల సౌందర్యాలు, గ్రామీణ వాతావరణపు నిరాడంబర ప్రవృత్తికల అమాయక ప్రజలు, నాగరికతా కాలుష్యానికి కాస్తంత దూరంగ ప్రకృతి సహజమైన వనరులతో విలసిల్లే దివ్యదేశాలను దర్శిస్తేచాలు జన్మ ధన్యమే.

ఆళ్వారుల ఆర్తంతా గానరూపమై అవతరించినదీ దివ్యదేశాలలో. ఆధ్యాత్మికశక్తి నార్జించుకోడాని కవి అపురూప కేంద్రాలుగా అలరారుతున్నాయి. ఆదరించి ఆర్థికంగా ఆదుకొనే ఔదార్యం భక్తులలో కరువైనా, అవసరాలు, ఆడంబరాలు అధికముకాగా ఆచార్య పురుషులంతా అందుబాటులో లేకుండా దూరతీరాలకు తరలిపోయినా, గడవడానికేపూటకాపూటే వెతుక్కోవలసిన కష్టస్థితి కాటేస్తున్నా, గడచిన కాలపు తీపి గుర్తులను నెమరు వేసుకొంటూ, నిత్యారాధన మాత్రం-నాలుగైదు ఆలయాలకు ఒక్కపూజారే చేయవలసివచ్చినా - నీరసంగానే నిరాటంకంగ చేసుకొంటూ "కైంకర్యమే పరమధర్మం- పరమపురుషార్థ"మని పొంగిపోతూఉండే కైంకర్య భట్టాచార్యుల త్యాగభావనతో మాత్రమే సంతృప్తి చెంది, "అర్చక పరాధీన నిఖిలాత్మ స్థితిః" అనుకొని, సర్వజగన్నాధుడు తన సౌలభ్యానికి చివరిహద్దేమిటో చూపిస్తూ వేంచేసి ఉన్నవే దక్షిణ దేశపు దివ్యస్థలాలు.

అసలు ఆలయాలంటేనే అంత. అయినా మిగిలిన చోట్ల కాస్తోకూస్తో మంత్ర, తంత్ర, వస్తు, ఆహార వసతులైనా ఉంటాయి. అవేవీ బొత్తిగ లభించని స్థితిలో ఉన్నవి చాలవరకు దక్షిణదేశపు దివ్యదేశాలన్ని.

గతంలో శ్రీమాన్ పెద్ద జీయరుస్వామివారి సమయంలో వాటిని జీర్ణోద్ధరణ చేయాలనీ, వసతులు వనరులు ఏర్పరచాలని ఆరంభమైన ఉద్యమం, యిప్పటికి మంచి ఊపునందుకొంది. వివిధ సంస్థలు, వ్యక్తులు ఆయా ఆలయాలలో, దివ్యదేశములలో చేయదగిన వివిధ కైంకర్యములకు మేమే నిర్వాహకుల మని, ప్రోత్సాహకులమని ప్రకటనలు గుప్పిస్తున్నా అవెంతవరకు వాస్తవమనే విషయం ప్రశ్నార్థకంగానే మిగిలిపోతూఉంది.

మరికొందరు 'పీఠాధిపతుల పేరుచెప్పి' శ్రీరంగం గోపురమంత ఘనకీర్తి తమకే ఉందంటూ 'శ్రీ పెరంబదూర్ ఆలయంలోని రామానుజులు వారికి త్రిదండము పాడైపోయింది కనుక (నిజానికి అలాంటిదేమీ లేనేలేదు) బంగారు రేకులతో చేయించి సమర్పిస్తామని, కోట్ల రూపాయలు బయటి దేశాలనుంచిగూడ సేకరించి, చివరికి వేలరూపాయలు కూడా విలువచేయని బంగారపు పూతగల రాగి త్రిదండాన్ని సమర్పించి చేతులు దులిపేసుకోవడం', ఆళ్వార్లకు ఉత్సవ ఆరాధనలు తమ వల్లే అందుతున్నాయంటూ, ఉత్సవాలకు ఉభయదార్లం తామేనంటూ లక్షలు వసూలు చేసుకొని, చివరకు ఏదో కంటితుడుపుగా కొంత చేసేసి కొందరు ఘనులు తమ <u>కైంకర్యనిష్ఠను</u> చాటుకొన్న సన్నివేశాలు ఈమధ్య ఎన్నెన్నో.

ఇదంతా ఒక ప్రక్కన పెట్టి పేరూ, ప్రచారం కావాలని ఆశించక నిజమైన కైంకర్య దీక్షయే జీవిత ధ్యేయముగ జీవించే ఉత్తమపురుషులు కొందరు. అలాంటివారి కోవకు చెందిన శ్రీమాన్ తిరుక్కోట్టియూర్ మాధవన్, చెన్నై పట్టణనివాసి, యం.జి. రామచంద్రన్ విశ్వవిద్యాలయంలో, అతిసామాన్య ఉద్యోగి. ఆ విశ్వ విద్యాలయ నిర్వాహకులైన శ్రీమాన్ వెంకట్, రాధా





దంపతులు గొప్ప ఉదారులు. దివ్యదేశములలో జరుగ వలసిన కైంకర్యములు జరుపడానికే శ్రీమాన్ మాధవన్ గారికి ఉద్యోగం.

ఏఏ సన్నిధులలో నిత్యారాధన నుండి ప్రారంభిస్తే జీర్ణోద్ధరణదాక ఏమేమి అవసరమో అవన్ని తమకు తెలపడం, అవసరమైన సామగ్రినంతనూ తీసుకోవడం, అగ్గిపెట్టె దగ్గరనుండి అముదుపడి (ఆరగింపు ప్రసాదం) వరకూ నెలనెలకూ, ఆలయానికి మూటలు కట్టించడం, అక్కడక్కడికి చేర్పించి, అవి అక్కడ వినియోగపడేట్టు చూడటం, అందుకు అవసరమైన వాహన వసతి తమ కాలేజీ తరపునే ఏర్పాటు చేయడం, విశేషోత్సవాలు ఆయా ఆలయాలలో జరిగేటప్పుడు అవసరమైనంతమంది అధ్యాపకులను తీసుకు వెళ్ళడం, పారాయణ సేవాకాలం వంటివి చేయించటం, వారికవసరమైన వస్త్ర సంభావనాదులు సమర్పించడం, ఆయా దివ్య దేశాలలో సింహాసనాలో, వాహనాలో ఏది అవసరమనుకుంటే అవి చేయించడం సమర్పించడం ఇలాంటి కార్యక్రమాలు ఎన్నైనా చేయించడానికే శ్రీమాన్ మాధవన్‌గారికి ఉద్యోగం.

ఆశ్చర్యమేమంటే, ఇన్ని చేస్తున్నా, దేనిమీద తమ పేరుగాని, తమవాళ్ళపేరుగాని, ఏమీ లేని నిరాడంబరమైన దాతలు ఆ దంపతులు. ఎన్నో జీర్ణమైన దివ్యదేశాలు వీరివల్ల పునరుద్ధరణ పొంది, నవ్య శోభతో కళకల్లాడు తున్నాయి. శ్రీమాన్ మాధవన్ ఎంతోకాలంగ కొన్ని దక్షిణ దివ్యదేశాలనైనా సేవించి మంగళాశాసనాలు చేయాలని శ్రీ చిన్నజీయరుస్వామిని కోరుకున్నారు. శ్రీరంగంలో కార్యక్రమాలన్నీ ముగించుకొని డిశెంబరు 13వ తేదీరాత్రి శ్రీరంగనాయకి సన్నిధిలో అమ్మవారిని సేవించి, చెన్నై చేరాలి, ధనుర్మాసోత్సవాన్ని ఆరంభించడానికి.

తిరుక్కార్తి సందర్భంగా తిరుమంగైయాళ్వార్లు పాడిన కొన్ని దివ్యదేశాలను సేవించుకుంటూ చెన్నై చేరాలని నిర్ణయించారు. శ్రీమాన్ మాధవన్‌గారికి రెండు రోజులు సమయమిచ్చారు, అక్కడక్కడ ఏర్పాట్లు చేయడానికి, శ్రీస్వామివారు. శ్రీమాన్ డా.జె. రామేశ్వర రావు, శ్రీకుమారి దంపతులతోపాటు, హైదరాబాదు, విశాఖ తదితర ప్రాంతాలనుండి వచ్చిన కొందరు భక్తులు గూడ శ్రీస్వామివారితో ఈ దివ్యదేశ సందర్శనం చేస్తామ న్నారు. ధర్మరథంలో తత్త్వ ప్రచారకులు, కొందరు ఆగమ విద్యార్థులు అనుసరించారు.

రాత్రి 11 గం॥ శ్రీస్వామివారు'తిరుక్కూడలూర్' అనే దివ్యదేశం సేవించారు. ఇక్కడి పెరుమాళ్ళుకు జగద్రక్షకుడని పేరు. పెరుమాళ్ళది విశాఖ నక్షత్రం కావడంవల్ల, ఆనక్షత్రంలో జన్మించిన వారికుండే సమస్యలు ఈ స్వామి సన్నిధి సేవిస్తే తొలగుతాయట. ఇక్కడనే 'మణ్ణియార్' అనే చిన్ననది పుట్టి, కావేరీనదికి ఉపనదిగ చేరుతుంది. తిరుమంగై యాళ్వారవతరించిన 'తిరుక్కొరైయలూర్'లో ఈ నది స్వచ్ఛజలముతో ప్రవహి స్తుంది. "మణ్ణియిల్ నీర్ తేంగుం కురైయలూర్, శీర్ కలియన్ తోన్రియ ఊర్" అంటూ ఈ నదీ సంబంధం తోనే తిరుమంగై ఆళ్వార్‌ని కీర్తిస్తారు.

ఇంతకీ 'తిరుక్కూడలూర్' ను అక్కడివారంతా 'ఆడుదురై పెరుమాళ్ కోవిల్ ' అంటేనే గుర్తిస్తారు. ఈ ఊరు త్యాగరాజస్వామి అవతరించిన తిరువైయార్ -కుంభకోణముల మధ్య ఉంది. శ్రీస్వామివారక్కడికి అర్ధరాత్రే వేంచేసినా కుంభకోణం ('తిరుక్కుడందై' అంటారు) శ్రీసారంగపాణి పెరుమాళ్ సన్నిధి నుండి పెరుమాళ్ మాల, అభయహస్తం. పరివట్ట ప్రసాదాన్ని అక్కడి అర్చక భట్టర్‌స్వామి తెచ్చి ప్రసాదించారు.

అక్కడికి చుట్టూ సుమారు 10 కి.మీ. దూరంలో ఉన్న తొండరడిప్పొడియాళ్వార్ల అవతారస్థలమైన తిరుమండంగుడి, కపిస్థలం, పుళ్ళంపూదంగుడి, తిరువాదనూర్ దేవస్థానాలనుండి గూడ శేషమాలలు, అభయహస్త ప్రసాదాలు తెచ్చి, శ్రీస్వామివారికి, అర్చక స్వాములు సమర్పించారు. రాత్రి సమయం దాటిపో వడంవల్ల ఆయా సన్నిధులను సేవించలేకపోయా మని శ్రీస్వామివారు అనగానే, "అందుకే పెరుమాళ్ళే మీవద్దకీ అనుగ్రహాన్ని పంపా"రని భట్టరుస్వాములు తెలిపారు. వారిని యథోచితంగ సత్కరించాక, శ్రీ జగద్రక్షక పెరుమాళ్ శ్రీ శఠారి మర్యాదతో ఆలయంలోనికి, శ్రీవారిని గోష్ఠిని తీసుకొని వెళ్ళారు.

అందరూ పెరుమాళ్ళను సేవించుకున్నాక తీర్థ ప్రసాదాలను అందుకొన్నారు. అక్కడి గ్రామస్థులను

పరామర్శించి ఆలయ జీర్ణోద్ధరణకు ప్రోత్సహించారు శ్రీస్వామివారు. ఇక్కడి పెరుమాళ్ళకు విడిపోయిన బంధువులను తిరిగి కలిపే అద్భుతమైన శక్తి ఉందని చరిత్ర.

పూర్వం చోళ ప్రభువుల పాలనలో ఈ ప్రాంతమంతా ఉండేది. ఒక రాజుగారి భార్య పరమ వైష్ణవ నిష్ఠకలిగి ఉండేది. రోజూ తెల్లవారకమునుపే లేచి, శుచిగ ఈ ఆలయానికి వచ్చి, ఆలయమంతా ముగ్గులతో అలంకరించి, సంతృప్తి చెందుతూ ఉండేది. రాజుగారికి రాణీగారికీ ఉండే అన్యోన్యతను ఓర్వలేని కొందరు రాజుగారిని చేరి, ఈమె రాత్రిళ్ళు ఎటో వెళ్ళిపోతోందనే అనుమానం కలిగేట్టుగ ఆమెపై కట్టుకథలల్లారు. మంచి కంటే చెడు త్వరగా బుర్రకెక్కుతుంది కదా!

రాణీగారి శీలాన్ని శంకిస్తూ రాజుగారామెను వదలి వేసారు. ఆమె దేముడే దిక్కని విశ్వసించి, శ్రీజగద్రక్షక స్వామిని చేరి, ఆలయంలో పెట్టే ప్రసాదం తింటూ, స్వామి సేవచేసుకొంటూ, గడిపేది. ఆమె క్రమంగ ముదుసలి అయింది. భక్తురాలైన ఆమేపై లేనినింద మోపినందున, భాగవతాపచారం చేసిన దోషం, వయసుపై బడ్డ ఆ రాజు నావరించి, విషజ్వరంగ ముదిరింది. ఏ వైద్యానికీ లొంగని ఉదరవ్యాధి తీవ్రమైన బాధను కలిగించింది. ఇంతలో, జాతకాలు చూడనేర్చిన పండితుడొకడు రాజును దర్శించి 'తిరుక్కూడలూరు'ను దర్శించుకొమ్మన్నాడు. రాజు, శ్రీజగద్రక్షక పెరుమాళ్‌ను సేవించుకొన్నాడు.

ఆ పెరుమాళ్ ఒకనాడు స్వప్నంలో రాజుకు కన్పించి, తన ఆలయంలోని వృద్ధ భక్తురాలిని సేవించుకొంటే వ్యాధికి పరిహారం ఏర్పడుతుందని ఆజ్ఞాపించాడు. రాజు తిరిగి ఆలయానికి ఆమెను వెతుక్కొంటూ వచ్చాడు. తనను రాజుగ పరిచయం చేస్కొని, తెలియక చేసిన అపచారములను క్షమించి, వ్యాధిని నివారింపచేయమని ఆ వృద్ధ భక్తురాలిని యాచించాడు. ఆతడు ముదుసలి అయిన ఆమెను గుర్తించలేదుకానీ, ఆమె మాత్రం తన భర్తయే అయిన రాజును గుర్తించి, తనను గూడ పరిచయం చేసుకొన్నది. రాజు, ఆమె విషయంలో గతంలో చేసిన అపరాధాన్ని క్షమించమని పశ్చాత్తాపంతో ప్రార్థించాడు.

క్రమంగా వ్యాధి నయమైంది. రాజు రాణి తిరిగి కలుసుకోగలిగారు. స్వామిని సేవించుకున్నారు. అపుడు పెరుమాళ్ళు వారికి ఏం వరమివ్వాలని అడిగితే 'నిన్ను సేవించుకున్న వారికి మనస్సులు బాగుపడి, పరస్పర కలహాలు తగ్గి, అనురాగం అన్యోన్యత పెరిగేట్టు వరమివ్వ'మని ప్రార్థించారట. స్వామి 'అలానే' అని అనుగ్రహించాడని క్షేత్రమహాత్మ్యాన్ని ఆలయ స్వాములు తెలియజేసారు.

శ్రీస్వామివారు భక్తగోష్ఠితో రాత్రి 1 గంటకు బయలుదేరి 7 కి.మీ. దూరంలో ఉన్న ఐయ్యంపేట్టై, పశుపతి కోవిల్ అనే చోట ఒకసారి ఆగారు. అక్కడే భగవద్రామానుజుల వారికి సమాశ్రయణం చేసిన ఆచార్యులు, శ్రీమహాపూర్ణులు అని ప్రసిద్ధిగాంచిన పెరియనంబిగారి "తిరువరశు" ఉంది. అంటే వారు దేహ యాత్ర చాలించినది ఇక్కడేనన్నమాట. దానికి గుర్తుగ నిర్మించినదే చిన్న తిరువరశు. దానిని సేవించుకొని ముందుకు సాగారు. అయితే దీనిని గురించి మనం కొద్దిగ తెలుసుకోవలసి ఉంది.

కేరళరాజు ఒకడు శ్రీవైష్ణవ మతవ్యాప్తిని సహించలేక, అది శ్రీరామానుజుల వల్ల జరుగుతోందని గుర్తించి వారికి ఆపద వాటిల్ల చేయాలని వారిని బంధించి తెమ్మనడం, వారిని రక్షించాలని వారిశిష్యులైన శ్రీకూరేశులు, రామానుజుల వేషం ధరించగా, ఆచార్యులూ వృద్ధులైన శ్రీ పెరియనంబిగారు తోడురాగ వారిద్దరూ వెళ్ళి, రాజసభలో వాదించడం, వాదనలకు ఇష్టపడని ఆ మూర్ఖరాజు వారిరువురి నేత్రాలను తీయించడం .... ఇది చరిత్రలో మనం ఎఱుగుదుము.

ఆరాజు నిజానికి ఇపుడు మనం చూచే కేరళరాజు కాదు. తంజావూరుకు దక్షిణాన ఉండే ప్రాంతాన్నంతటినీ "కేరళ సింగ వళనాడు" అనే వారు. అందులో ఒకరాజ్యం "గంగైక్కొండ చోళపురం" అనేది. ఇది కుంభకోణం నుండి చెన్నై వెళ్ళే మార్గంలో 50 కి.మీ దూరంలో ఉంది. దాన్ని శ్రీరామానుజులవారి కాలంలో 2వ కుళోత్తుంగ చోళుడు పాలించేవాడు. ఆతడు పరమశివభక్తుడు. కూరేశులూ,





పెరియనంబిగారు, వారమ్మాయి అత్తుళాయ్ ముగ్గురూ కలిసి వెళ్ళారట ఆ రాజువద్దకు.

వాదన చేతకాని, అంగీకరించని మూర్ఖుడు కావడంతో మొదట పెరియనంబిగారి నేత్రాలను పొడిపించే సాడు. కూరేశులు, ఆ దుష్టుని చేత తీయించుకోక, వాని చేతిలోని కాలే ఇనుప ఊసలను లాగుకొని తామే నేత్రములను కాల్చుకున్నారట.

అత్తుళాయమ్మ దారిచూపగ, ముగ్గురు తిరుగు ప్రయాణం చేస్తూ 'పశుపతి కోవిల్' చేరేటప్పటికి పెరియ నంబిగారు "నాకు దేవరాజ పెృరుమాళ్, భగవద్రామానుజులూ దర్శనమిస్తున్నారు. ఇక నా సమయమైపోయింది." అని తెలియచేసారట. 'చరమకైంకర్యం శ్రీరంగంలో చేయిస్తా'మని కుమార్తె అంటే, పెరియ నంబిగారు 'వద్దు!వద్దు! ఎక్కడ ప్రాణంపోతే అక్కడే చేయండి. నన్ను శ్రీరంగంచేర్చి అక్కడే సంస్కరించాలి అన్నానంటే, తర్వాతివారంతా దేహత్యాగానికి శ్రీరంగమే చేరాలి కాబోలు. అదే తగినదని అంతా శ్రీరంగం చేరితే, ఇక రంగని చుట్టూ స్మశానములే తయారవుతాయి. అలాంటి ఘోరం జరగరాదు. కనుక ఎక్కడ శ్రియఃపతి సంకల్పించి స్వీకరిస్తే అక్కడే సంస్కారం చేసేయండి' అన్నారట. వారి ఔదార్యం, దూరదృష్టి ఎంతగొప్పవోకద!

ప్రపంచమంతా భగవన్మయమైతే ఎక్కడున్నా ఆస్వామి తప్పక స్వీకరించుననే తెలుస్తోంది. శరీరమెక్కడ వదిలినా, అదే పవిత్రస్థలమౌతుంది. ఆతర్వాత ఈ పశువతి కోవెల్ వద్దనే వారి సంస్కారం జరిపి, దానికి గుర్తుగా వారి తిరువరశు నిర్మించారు. వారు చివరి సమయంలో దర్శించిన దేవరాజ పెరుమాళ్ళ ఆలయం దానికెదురుగ, ఆ తదుపరి నిర్మించారు. అక్కడ ఆగి, వారిని సేవించుకొన్నారు శ్రీ చిన్నజీయరుస్వామివారు. ఆపై కుంభకోణం, మాయవరం, శీర్‌కాళ్రి, పట్టణాల మీదుగ తిరుమంగైయాళ్వార్లు వేంచేసి ఉండే తిరువాలి-తిరునగరికి రాత్రి గం॥2.30కి చేరారు.

ఇది దొంగలసమయం. తిరుమంగైయాళ్వార్లు సరిగ్గా ఈ సమయానికే, గతంలో, తమ విజయ యాత్రకి ధనం సేకరించేందుకు దోపిడీచేయ నిర్ణయించిన స్థలానికి బయలుదేరేవారట. ఆరోజు అమావాస్య గూడ. అన్నీ కుదిరాయి. అక్కడ వచ్చిన వారందరికీ వివిధ ప్రసాదాలు అప్పటికే సిద్ధం చేయించి ఉంచారు స్వాములు. అవి స్వీకరించి అందరూ గం॥ 3.30 దాటింది విశ్రమించేసరికి.

14వ తేదీ ఉదయం శ్రీస్వామివారి ఆరాధన, తీర్థగోష్ఠి పూర్తయ్యేనరికి, గం. 9.30. తిరునగరి, శ్రీకళ్యాణరంగనాథస్వామివారి, తిరుమంగై ఆళ్వార్ల సన్నిధులనుండి అర్చకస్వాములు, కైంకర్యపరులు, ఆలయాధికారులు మొదలైన వారంతా శ్రీస్వామివారున్న మఠంవద్దకు పెరుమాళ్ మాల, అభయహస్తం తీస్కొని వచ్చారు. పెరుమాళ్ళ సన్నిధి నుండి పెరుమాళ్ళు తన పరివారాన్ని ఎవరైనా పెద్దలొస్తే, "వారిని తీస్కొనిరండి!" అని పంపడం ఆనవాయితీ. ఆ సంప్రదాయం ప్రకారం వచ్చిన ఆహ్వానాన్ని శిరసా అందుకొని క్రమంగా, ఎంబెరుమానార్ సన్నిధికి చేరారు శ్రీ చిన్న జీయరుస్వామివారు.

## పరమపదవార్త

శ్రీ ఉ.వే.శ్రీమాన్ **కళ్ళకుంట్ల సీతారామాచార్యులుగారు** తేది : 30-12-2001న ఆదివారం మహబూబాబాద్ లోని తమ స్వగృహమునందు ఆచార్యతిరువడిని అలంకరించారు. వీరికి శ్రీమన్నారాయణుని శ్రీపాద కైంకర్యం నిత్యం కలగాలని ప్రార్థిస్తున్నాం **వీరి వైభవాన్ని త్వరలో సేవించుకుందాం.**

- శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘం

తిరుమంగైయాళ్వార్ల తిరువడిని 'రామానుజం' అంటారు. పెరుమాళ్ళ శ్రీపాదాలను 'శ్రీ శఠారి' అంటారు గదా! అలానే. శ్రీస్వామివారికి తిరుప్పరియవట్టం, తిరుమాలై సమర్పించి, శ్రీరామానుజమును పంచముద్రలతో అనుగ్రహించగా ఆలయ ప్రవేశం చేసారు. (తిరుమంగేయాళ్వార్లు, కూడాఉండి లోనికి తీసుకువెడుతున్నారని సంప్రదాయం). అక్కడి పెరుమాళ్ రంగనాథస్వామి. క్షేత్రనాధుడు "ఏవరి వెంశిలైయాన్ ", శ్రీరాముడేననుకోండి. తాయార్‌కు పేరు 'తిరుమామగళ్'. ఆళ్వార్ గురించి మాణవాళమామునులు రచించిన అత్యంత సుందరమైన గద్యను అర్చకస్వామి పఠించి, స్వామిని, ఇతరసన్నిధులను సేవింపచేయడం అందరినీ సంతోషంపచేసింది.

తిరుమంగైయాళ్వార్లు తమ కేంద్రముగ చేసుకొన్న ఈ ప్రాంతాన్ని 'తిరువాలి - తిరునగరి' అని కీర్తిస్తారు. వారు తమ 30 పాటలలో 'తిరువాలి' అనే క్షేత్రాన్నే కీర్తించారు తప్ప 'తిరునగరి' అని అనలేదు. అయితే వారికిది రాజధానిగ ఉండేది కనుక 'తిరునగరి' అని పేరిడి. చివరికి రెంటినీ కలిపి తిరువాలి - తిరునగరి అన్నారు. దీనికే 'పంచ నార సింహక్షేత్రం' అనిగూడ పేరు.

**Iవ దివ్యదేశం:** ఆళ్వార్లవతరంచిన తిరుక్కురైయలూర్‌లో - 1) శ్రీ ఉగ్రనరసింహప్పెరుమాళ్, వీరు ఏడాదిపాటు తదీయారాధన చేసిన తిరుమంగై మాడంలో -2) శ్రీ వీర నరసింహ ప్పెరుమాళ్, తిరునగరి లోనే ఆళ్వార్ సన్నిధి గోపుర వెనుక భాగంలో- 3) శ్రీసంహార నరసింహ ప్పెరుమాళ్, తిరునగరిలోనే 2వ ఆవరణలో రంగనాథుని వెనక, తూర్పుచూస్తూ - 4) శ్రీయోగ నరసింహ ప్పెరుమాళ్, - తిరువాలి క్షేత్రంలో, కుడివైపు ఒడిలో అమ్మవారిని ఆలింగనం చేస్కొని - 5) శ్రీలక్ష్మీ నరసింహ ప్పెరుమాళ్.

I. ఈ 5 కలిపి 'తిరువాలి - తిరునగరి' అనే ఒకే దివ్యదేశంగ పరిగణిస్తారు. ఇలా 5 రూపాల్లో వేంచేయడానికి ఒక చరిత్ర ఉంది.

ప్రజలపాపం పాలకుణ్ణి, పాలకుడు చేసే పాపం, ఆతణ్ణి నడిపే పురోహితుని, భార్యపాపం భర్తను, శిష్యుని పాపం గురువుని పట్టి పీడిస్తుందట. హిరణ్యకశిపు వంటి అసురులెందరికో ఉదారంగ వరాలిచ్చాడు పరమశివుడు. ఆ వరబల గర్వంతో వాళ్ళు ఎన్నో పాపాలాచరించారు. వరదాత కనుక శివునికిగూడ 12 భాగాల్లో 2వ భాగం పాపమాతణ్ణి పట్టుకొంది. శిరస్సుపై ధరించిన గంగవల్ల కూడ అది తొలగలేదు. నృసింహోపాసనవల్ల అది తొలగుతుందని తెలుసుకొని 5 శిరస్సులతో తపమాచరిస్తే పై 5 రూపాల్లోనూ దర్శనమిచ్చి ఆతని దోషాలను దూరం చేసాడని ప్రసిద్ధి. అందుకే ఇవి 5 ఒకే దివ్యదేశం.

ఆళ్వార్ తవమ్ విజయుయాత్రలకోసం ఒక పంచకళ్యాణి గుఱ్ఱాన్ని వాడేవారు దానికి 'ఆడల్ మా' అనిపేరు. నృత్యం నేర్చిన గుఱ్ఱమని, అవలీలగా కార్యం నెరవేర్చే శక్తికలదని అర్థం. ఆలయంలో ఉత్సవమూర్తి వేంచేసే 'ఆడల్ మా'ను దర్శింపచేసారు అర్చక భట్టరులు.

'తిరుమంగైయాళ్వారికి జీర్ణోద్ధారణ అంటే భలేరుచి, అందునా ప్రాకారాలు నిర్మంచడం ఇష్టం. శ్రీరంగాది క్షేత్రాల ప్రాకారాలు వారు నిర్మించారు. వారి ఆలయ ప్రాకారానికి జీర్ణోద్ధరణ స్వామివారు చేయాలని' శ్రీ మాధవన్ కోరగా, 'తిరునగరి ప్రాకార జీర్ణోద్ధరణ'ను ప్రారంభించారు. దానికవసరమగు సిమ్మెంటు పంపిస్తామని శ్రీమాన్ రామేశ్వరరావు దంపతులు సిద్ధపడ్డారు.

ఆలయదర్శనానంతరం అందరితో మఠానికి శ్రీవారు వేంచేసాక స్వాములందరికీ చందన గోష్ఠి జరిగింది. శ్రీఎంబార్ శఠగోపాచార్యస్వామి, శ్రీ ఎంబార్ కృష్ణమాచార్య స్వామి, ఆళ్వార్ల వైభవాన్ని ప్రవచించగ, శ్రీస్వామివారు తెలుగులో మన గోష్ఠివారందరికీ అనువదించి తెలిపారు.

తదీయారాధన కాగానే స్థానికులందరికీ మంగళాశాసనంచేసి 4 కి.మీ దూరంలో ఉన్న తిరుమంగైయాళ్వార్ల అవతార స్థలం తిరుక్కురైయలూర్ చేరి, అమృతవల్లీ తాయార్‌తో చేరియున్న శ్రీ ఉగ్రనరసింహ స్వామిసన్నిధిని సేవించారు.

అక్కడికి 2 కి.మీ. దూరంలో ఉన్న 'తిరుమంగై మాడం'చేరి, 'తిరుమంగైవల్లి' అమ్మవారితో వేంచేసిఉన్న శ్రీ వీరనరసింహస్వామి సన్నిధి సేవించారు. ఈ తాయార్





పేరనే ఈ ఊరికి 'మంగైమాడం' అని పేరువచ్చింది. ఈ ఊరికే మొదట రాజుగ ఉన్నందున ఆళ్వారైన 'నీలుని'కి 'తిరుమంగై మన్నన్' అనిపేరు. పరాక్రమంతో అందరినీ, ఓడించి నందున 'పరకాలన్' అయ్యారు. ప్రతిరోజూ 1008 మంది భాగవతోత్తములైన శ్రీవైష్ణవులకు తదీయారాధన ఏడాదిపాటు చేసినది ఈ 'తిరుమంగై మాడం' లోనేనట. ఈ ఊరి తాయార్ అనుగ్రహ సంబంధంవల్లనే తర్వాత 'తిరుమంగైయాళ్వార్' అయ్యారు వీరు.

4 యుగాలలోనూ వీరి అవతారం ఇక్కడే జరిగిందట. కృతయుగంలో కర్దమప్రజాపతిగా వైదిక కులంలో పుట్టారట. త్రేతాయుగంలో 'ఉపరిచరవసువు'గ వీరే క్షత్రియ కులంలో ఘనకీర్తినార్జించారట. ద్వాపర యుగంలో వజ్రమేఘుడనే వ్యాపారిగ వైశ్యకులాన్ని పునీతం చేసారట. కలియుగంలో నీలునిగ శూద్రకులాన్ని తరింపచేసారట.

వజ్రమును తమిళంలో 'వైరం' అంటారు. వైరమేఘుడుకి ఈ నరసింహస్వామి ప్రత్యక్షమై ఆరాధనలందుకున్నాడు. అప్పటినుండి 'వైర నరసింహునిగ' ఉండే స్వామియే క్రమంగ వీరనరసింహుడై ఆరాధనలందుకుంటున్నాడిప్పుడు.

భగవద్రామానుజులువారు ఈ తిరుమంగైమాడం వేంచేసినపుడు 'మన తిరుమంగైయాళ్వార్ తదీయారాధన చేసిన పరమ పవిత్ర స్థలమిదికదా!' అని ఈ చోటంతా త్రిదండం ధరించి పొర్లాడినారట. ఆ తర్వాతి కాలంలో శ్రీమణవాళమహామునులు ఇక్కడికి విచ్చేసినపుడు ఈ స్థలంలో పాదంపెట్టి తొక్కడం ఇష్టంలేక 'మన ఎంబెరుమానార్ల దివ్యతిరుమేని స్పర్శకల్గిన స్థలమిది కదా' అని దూరం నుండే తాకి, సేవించి ఉండిపోయారట. ఆ ఆచార్యపుంగవులనిష్ట అమోఘంకద!

ఈ క్షేత్రానికి ఆళ్వార్ తదీయారాధన చేసిన ఘనతతోపాటు ఎంబెరుమానార్, తిరుమేని సంబంధఘనత గూడ ఉండటంవల్లనూ, ఈ తదీయారాధన వల్లనే మనకు తిరుమంగైయాళ్వార్లు లభించడం వల్లనూ 'ఇయల్ శాత్తు'లో ఈ ఆళ్వార్లను స్మరించే పాశురంలో వారి అవతార స్థలాన్ని ముందు చెప్పక, ఆళ్వారుగ వారిని మార్చిన ఈ క్షేత్రాన్నే స్మరించారు. 'మంగైనగర్ వాళ్రి, వణ్ కుఱైయలూర్ వాళ్రి' అంటారు.

**II.వ దివ్యదేశం :** అక్కడికి 1/2 కి.మీ దూరంలో 'తిరుక్కావళంబాడి' దివ్యదేశంలో 'శ్రీరాజగోపాలస్వామి పెరుమాళ్' వేంచేసి ఉన్నాడు. ఆయనే చిన్నారి కణ్ణన్. దేవతలు 'నీ బాలచేష్టలు చూడాలని ఉంది ప్రభూ!' అని ప్రార్థిస్తే, ఈ క్షేత్రంలో వారిని తపమాచరించమని, తత్ఫలితంగ వారికి దర్శనమిచ్చిన క్షేత్రమిది. పశువులను మేపే కొరడా కర్ర చేతబూని, కొమ్ముబూరా బొడ్డున దోపి నిలచి దర్శనమిచ్చాడు స్వామి. పారిజాత వృక్షం నాటినట్లు కన్పించినదిగూడ ఇక్కడే నట. ఆ సన్నిధిని సేవించుకొన్నారు శ్రీస్వామివారు, పరివారమంతటితో.

ఆళ్వార్లైనాక పెరియ తిరుమొళ్రిని ఆవిష్కరించిన పావనక్షేత్రం 'తిరువాలి'. అది 3 కి.మీ. దూరంలో ఉంది. ఆళ్వార్లు పెరుమాళ్ళను దోపిడీ చేసినదీయిక్కడే. లక్ష్మీదేవిని కుడి తొడపై కూర్చోబెట్టుకొని, ఆలింగితుడైన నృసింహస్వామి ఇక్కడ దర్శనమిస్తాడు. తన ఆలిని ఆలింగనం చేస్కొని ఉన్నందున ఈ క్షేత్రం 'తిరు ఆలి' అదే 'తిరువాలి'గ ప్రసిద్ధమైంది.

భాగవత తదీయారాధన ప్రారంభించి ఏడాది పూర్తికావస్తోంది. కానీ చేతిలో ధనమేమాత్రం మిగలలేదు. ఇంకా కొద్ది దినాలు మాత్రం జరగవలసిఉంది. వారంది నాలుగ ధనానికి కటకట. ఎక్కడా ఏమీ చిల్లుగవ్వ లభించలేదు ఆళ్వారికి. విచారంగ ఒక అడవిలో ఆళ్వారున్న సంగతి తెలిసి, పెరుమాళ్ళు వీరిని అనుగ్రహించాలని తదీయారాధన పూర్తిచేయించాలని సంకల్పించాడట. ఆయన తలిస్తే ఇక లోటేముంటుంది!

తిరువాలిలోనే కళ్యాణమహోత్సవం చేయించుకున్నాడు అర్చకులతో. అతివిలువైన అనేక ఆభరణాలన్నింటినీ భోషాణం పెట్టెలలోంచి తీయించి నిండుగ అలంకరించు కున్నారట దంపతులు. కళ్యాణానంతరం జరిగే విహారయాత్ర కోసమన్నట్లు అక్కడికి 1 1/2 కి.మీ దూరంలో ఉన్న 'తిరుమడం కొల్లై' అనే చోటుకి బయలుదేరారు పెరుమాళ్ళు అర్చకులతో. మధ్యేమార్గం పెద్ద అడవి ఉంది. అక్కడే మన ఆళ్వార్ తన పరివారంతో ధన సేకరణ మంత్రాంగంలో ఉన్నారు. పెరుమాళ్ళు

వస్తున్న విషయం తెలిసి, దారి కాచి దోచారు. పెరుమాళ్ళ పాదాని కుండే వ్రేలి ఆభరణంతో పాటు నిలువునా దోచారు. దీనినే 'వేడుపఱి' 'బందిపోట్ల దోపిడి' అంటారు. అపుడు పాదా భరణం తీస్కోడానికి రాకపోయేసరికి కొరికి తీసుకోబోయిన ఆళ్వార్లకు తదీయారాధన గడువు ముగిసి, భగవత్కృప నిండుగ లభించి, అమ్మ అనుగ్రహం కలిగి దివ్య ప్రబంధం ధారలై ప్రవహించింది, 'వాడినేన్ వాడి...' అంటూ. ఆ ధనంతో తదీయారాధన పూర్తిచేసి, మిగిలిన ధనంతోటే 'శ్రీరంగాదిక్షేత్రాలలో ప్రాకారాదికం నిర్మించారట.'

**IIIవ దివ్యదేశం :** ఆ ప్రక్కనే 1/2 కి.మీ. దూరంలో 'తిరుత్తేవనార్ తొకై' క్షేత్రం ఉంది. దీన్నే 'కీళ్ఛాలై' అంటారు. 33 కోట్ల దేవతలూ ఆచరించిన తపస్సుకి ప్రీతుడై దర్శనమిచ్చిన పెరుమాళ్ళు ఈయన. తిరు =గొప్ప, తేవనార్ = దేవతలయొక్క, తొకై = గుంపు, అని అర్థం. మా=గొప్ప, తపం = తపస్సుచేస్తే దర్శనమిచ్చిన స్వామి కనుక యిక్కడి స్వామి 'మా తవ పెరుమాళ్'. ఆయన్ని మాధవ పెరుమాళ్ అంటారుగూడ. అమ్మవారిని మాధవీనాయకి అనిన్ని, అక్కడి స్వామి ఆలయ విమానాన్ని 'మాధవ విమాన'మని అంటారు. మన తపస్సులు ఫలింప చేసి అనుగ్రహించే స్వామి అన్నమాట. ఆ సన్నిధిని సేవించారు శ్రీవారితో మన గోష్ఠి అందరూ.

**IVవ దివ్యదేశం:** అక్కడి నుండి 3. కి.మీ దూరంలోనే దేవతలకి అర్జునసారథిగ దర్శనమిచ్చిన 'పార్థన్ పళ్ళి' దివ్యదేశముంది. ఇక్కడొక్కచోటే అర్జునునికి గూడ ప్రత్యేక సన్నిధి ఉంది.

తిరుమంగై ఆళ్వార్ల మీది కృపతో అన్ని స్వయం వ్యక్తక్షేత్రాలలో ఉండే స్వామీ, వీరివద్దకు అర్చామూర్తిగ వచ్చి దర్శనమివ్వడం విశేషం. శ్రీ నమ్మాళ్వార్లకూ దర్శనమిచ్చినా, వారికి కేవలం మానస సాక్షాత్కారమే. కానీ తిరుమంగైయాళ్వార్లకి అర్చారూపంగ వెలసి దర్శనమిచ్చారు.

**Vవ దివ్యదేశం:** శ్రీ వరదరాజ పెరుమాళ్, పెరుమాళ్ కోవిల్ అని కీర్తించబడే స్వామి, కంచిలో ఉన్నట్లే, ఆళ్వార్ల కోసం వెలసినచోటు, 'తిరుమాణిక్కూడం' దివ్యదేశం. ఇది పార్థన్ పళ్ళికి 3 కి.మీ దూరంలో ఉంది. ఆ స్వామినీ శ్రీవారు దర్శించుకున్నారు. ఈ పెరుమాళ్ళనే 'మణిక్కూడనాయకన్‌స్వామి' అనీ పిలుస్తారు. అక్కడికి రెండేసి కి.మీ. దూరంలో 6 దివ్యక్షేత్రాలున్నాయి. వాటన్నింటినీ తిరునాంగూర్ దివ్యక్షేత్ర సముదాయముగ భావిస్తారు.

**VIవ దివ్యదేశం :** అందులో మొదటిది ఆళ్వారికి శ్రీరంగనాథునిగ దర్శనమిచ్చిన క్షేత్రాన్ని 'తిరునాంగూర్' అంటారు. శెలి పొన్నరంగర్‌స్వామి, అల్లి మామలరాళ్ అనే తిరు నామం కల అమ్మవారితో వేంచేసిఉంటాడు.

**VIIవ దివ్యదేశం :** 2. కుడమాడుక్కూత్తర్ సన్నిధి, ఇక్కడ ఘటనృత్యం చేస్తుండే స్వామిని దర్శించవచ్చు.

**VIIIవ దివ్యదేశం :** 3.మణిమాడ క్కోవిల్. ఇక్కడే బదరీలోని నరనారాయణులుగ స్వామి, ఆళ్వారికి సాక్షాత్కరించాడు. ఏడాదిలో సూర్యకిరణాలు 365 దినాలూ ఉత్తర, దక్షిణాయనములలో గూడ ఒకే రీతిలో విమానానికుండే ద్వారంలోంచి ప్రసరించి పెరుమాళ్ళను స్పృశించడం విశేషం. అంటే సూర్యభగవానుడు స్వయంగా స్వామిని దినదినమూ ఆరాధించే అపురూపదివ్య దేశమిది. ఈ సన్నిధిని తిరుమంగైయాళ్వార్లే స్వయాన, వారికాలంలోనే శిథిలమై ఉంటే, జీర్ణోద్ధరణ చేసారట.

మాఘమాసంలో చుట్టూ ఉండే, వీరు పాడిన 11 దివ్యదేశాల నుండీ పెరుమాళ్ళు గరుడాళ్వార్ల మీద ఇక్కడికే వేంచేస్తారు. అంతకు ముందు, ఆళ్వారే స్వయంగ పల్లకీలో ప్రతిసన్నిధికీ వేంచేసి, అక్కడి పెరుమాళ్ళనూ, అర్చక స్వాములనూ ప్రార్థించి ఆహ్వానించి వస్తారట. అప్పుడొచ్చిన 11 దివ్యదేశ పెరుమాళ్ళకూ, ఆళ్వారు మంగళాశాసనము చేయగా, వారంతా కలిసి ఆళ్వార్లను మంగళాశాసనం చేసి అనుగ్రహిస్తారు. ఇది ప్రతీ ఏడాదీ జరుగుతుంది. అలా, ఈ నారాయణ పెరుమాళ్ళ సన్నిధి ప్రసిద్ధమైంది. మొదట తిరుమంగై ఆళ్వార్లే నమ్మాళ్వార్లకి, ఆళ్వారు తిరునగరిలో నవ తిరుపతుల నుండి 19 గరుడుల ఉత్సవం ఏర్పాటు చేసారు. దానివలె, ఆ తర్వాత తిరుమంగై యాళ్వారికి 11 గరుడుల సేవ నేర్పాటు చేసారు. ఇక్కడే 'ఇంద్ర పుష్కరిణి' ఉంది. అందులో జలం వెతుక్కోవలసి ఉంటుందను కోండి.

**IXవ దివ్యదేశం :** 4. క్షీరాబ్ధినాథునిగ ఆళ్వార్లకు





దర్శనమిచ్చిన క్షేత్రం 'పళ్ళికొండరంగనాథుని' సన్నిధి.

**Xవ దివ్యదేశం :** 5. అక్కడే వణ్ పురుషోత్తమ, పురుషోత్తమనాయకీ దంపతులుగ స్వామి వెలసిన సన్నిధి 'వణ్ పురుషోత్తమమ్'. శ్రీమన పెద్దజీయరుస్వామివారు 1978లో ఇక్కడనే చాతుర్మాస్య దీక్షను చేసి, స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాలు చేసి, వేదస్థూపాలు నిర్మించిఉన్నారు. ఇక్కడి మణవాళమాముని సన్నిధిలో ఉండేవారట. ఈ దివ్యదేశాలలో నాటించిన కొబ్బరిచెట్లు ఇప్పటికీ పచ్చగా కాస్తున్నాయని, మోటారు బాగ పనిచేస్తోందని ఆలయ పరివారం ఆనందంతో పొంగిపోతూ చెప్పారు. ఇక్కడ కేంద్రంగా ఉంటూ, ప్రక్కనున్న దివ్యదేశాలలో వేదయజ్ఞాలు చేసి, వేద స్థూపాలు నిర్మింపచేసారు.

**XIవ దివ్యదేశం:** 6. వైగుందవిణ్ణకరం అనే క్షేత్రంలో స్వామి ఆశ్చర్యకరమైన సేవలో దర్శనమిస్తాడు. ఆదిశేషుణ్ణి ఎడమకాలిక్రింద కలిగి ఉండి శ్రీ భూనీళా దేవులతో, పరమపదనాథునిలా ఆళ్వార్లకై సేవ సాయించాడు. సర్పదోషమున్న వాళ్ళీ క్షేత్రం దర్శిస్తే అది తొలగిపోతుందనేది చాలామందికి అనుభవమట. ఈ ఊరిలో సర్పంకరిచి ప్రాణాలు పోవడమనేది ఎప్పుడూ, ఎవరికీ జరుగలేదట. ఇక్కడ కరువవట మరి. అంతేకాదు పుష్కరిణికి 'శేషపుష్కరిణి' అని పేరు. ఇందులోని తీర్థస్నానమాడినా, త్రాగినా సర్పదోషం తొలగిపోతుందట.

**XIIవ దివ్యదేశం :** ఇక్కడినుండి 2 కి.మీ. దూరంలో ఉండే 'అణ్ణన్ కోవిల్' అని పిలువబడే 'తిరువెళ్ళక్కుళం' దివ్యదేశం ఉంది ఈ యాత్రలో చివరదర్శించిన క్షేత్రం. ఇక్కడ ఆళ్వారికి 'శ్రీవేంకటేశునిగ' దర్శనమిచ్చాడు.

ఈ స్వామిని ఒక్కసారి సేవిస్తే తిరుమలై స్వామిని 3 సార్లు సేవించినంత ఫలం కల్గుతుందట. దీనినే శ్వేతవరాహక్షేత్రమంటారు. తన కష్టాలను తీర్చమని ఆళ్వార్లు స్వామిని ప్రార్థించినది ఇక్కడనే.

ఈ క్షేత్రానికి మరో గొప్పదనం తిరుమంగైయాళ్వార్లు వివాహమాడిన, వారు ఆళ్వార్‌గ మారడానికి కారణమైన, తదీయారాధన చేస్కోనే ఉత్తమ బోధ చేసిన 'కుముదవల్లి' అవతరించిన క్షేత్రం. ఆమే లేకపోతే మనకీ ఆళ్వార్ లభించి ఉండేవారు కానేకారు.

ఇక్కడే అందమైన పుష్కరిణి ఉంది. దానిని 'శ్వేత పుష్కరిణి' అంటారు. హిరణ్యాక్షుణ్ణి చంపడానికి శ్వేతవరాహమైనాడుస్వామి. వధ జరిగిన తదుపరి, ఆయన చాల ఉగ్రరూపుడై ఉన్నాడట. అమ్మ సంబంధం లేదుకదామరి! భూమి కోసం వెదికాడు. ఆతడిరూపం చూచి, ఎవరో తెలియక, భూదేవి చాల భయపడి పోయింది, ఎవరీ ఉగ్రరూపమని. స్వామి, అమ్మదరిచేరి కోరలపైకి ఆమెను ధరించగానే, తత్పర్శతో ఆయనలో ఒక చల్లదనం, చక్కదనం ఏర్పడ్డాయి. అప్పుడాయన 'కోల వరాహమొన్నాయ్' అన్నట్టు సుందర వరాహ మైనాడు.

'రక్షించవచ్చిన సులభుడైన స్వామిని చూచి ఇలా భయవడ్డానేమిటీ' అంటూ ఆనందభాష్పాలు అమ్మరాలిస్తే, అవి స్వామి తిరుమేనిపై పడి, ఆతని తేజస్సుతో కలిసి ఆయన కుడిపాదంపై పడ్డాయి. అక్కడి నుండి భూమిపై ప్రవహించాయి. అవే 'శ్వేతపుష్కరిణి'. ఆ పుష్కరిణితోనే ఈ ఊరికి 'తిరువెళ్ళక్కుళం' అని పేరువచ్చింది. ఈ నీరు త్రాగితే పాపాలన్నీ పోతాయి.

కొంతనీరు ఎడమకాలిపై పడి, ఆపాదం క్రిందనే ఉన్న (IXవ దివ్యదేశంలో అలా ఉన్నట్టు చూసాం కదా!) విస్ఫారిన పడగలు కల ఆదిశేషుణ్ణి అభిషేకిస్తూ భూమిపైపడి క్రిందటి దివ్యదేశంలో 'శేషపుష్కరిణి'గ మారిందిట. అందుకే వైగుందవిణ్ణగరంలో సర్పదోషాలు పోతాయి. యిక్కడి శ్వేతపుష్కరిణిలో సర్వదోషాలూ పోతాయంటారు.

ఇక్కడ దర్శనం పూర్తయ్యేసరికి రాత్రి 7 గం॥ దాటింది. ఈ క్షేత్రంలో మన స్వామి యాగం చేసినపుడు వేంచేసి ఉండే ఓ తిరుమాళిగ చిన్నజీయరుస్వామివారి వసతి కోసం సిద్ధం చేసి ఉంచారు. ఆలయంలో, వచ్చిన భక్తుల అందరికీ ప్రసాదాలుకూడ ప్రత్యేకంగా చేసి అందించారు.

శ్రీ చిన్నజీయరుస్వామివారు 'శ్వేతపుష్కరిణి'లో స్నానమాచరించి, అనుష్ఠానం ముగించారు. ఒక్క దినమే అయినా యాత్ర చాలా ఆశ్చర్యకరంగ ఆరంభమై, ఆశ్చర్య కరంగ ముగిసింది. తిరుమంగై ఆళ్వార్ల అవతారస్థలంలో ఆరంభమైంది. కుముదవల్లి తాయార్ అవతార స్థలంతో ముగిసింది. అమ్మ అనుగ్రహం.

'అలానే చాతుర్మాస్య దీక్ష ముగియగానే తిరుమల శ్రీనివాసుని దర్శనంతో యాత్రా రంభమైంది. శ్రీరంగం మీదుగ తిరుమంగైయాళ్వార్ల దివ్యదేశాలు సేవిస్తూ అణ్ణన్ కోవెలలోని శ్రీనివాసుని దర్శన ప్రసాదంతో యాత్ర ముగిసింది. ఆళ్వార్లు ఈ యిద్దరినీ 'అణ్ణన్' అని సంబోధించారు. అయితే ఇక్కడి శ్రీనివాసుని ప్రభావం అధికమని ఆళ్వార్లే తమ పాటలో చెప్పడంవల్ల, కాకతాళీయంగానే అయినా, ఈ యాత్ర ఆళ్వార్ల మనోభీష్టము ప్రకారమే జరిగిందనడానికీ పద్ధతియే నిదర్శనం.

"వారే కూడా ఉండి ఏర్పాటుచేసారు". అంటూ శ్రీమాన్ మాధవన్ స్వామి సంతృప్తి ప్రకటించారు. ఇంత త్వరగా, ఇన్ని దివ్యదేశాలు సేవించడం, అక్కడక్కడ భట్టరులు, చివరకు ప్రసాదాలూ ఇన్నీ సమర్ధవంతంగా ఏర్పాటు చేసిన శ్రీమాన్ మాధవన్ స్వామిని శ్రీస్వామివారు పూర్ణంగ మంగళాశాసనం చేసారు. శ్రీమాన్ రామేశ్వర రావుగారు గూడ వీరు చేసే దివ్యదేశ కైంకర్యానికి తమ మహాసిమ్మెంట్సు నుండి యధావకాశం తగు సిమ్మెంట్సు సమర్పిస్తూ ఉంటామని వాగ్దానం చేసారు.

శ్రీస్వామివారు అక్కడినుండి ఆ రాత్రే బయలుదేరి ధనుర్మాస కార్యక్రమానికి చెన్నై కుచలంబాళ్ కళ్యాణ మండపానికి బయలుదేరి రాత్రి 3 గం॥కు చేరారు, 15వ తేదీన, తత్త్వ ప్రచారకబృందం ధనుర్మాసాన్నారంభించడానికి ఆంధ్రప్రదేశ్‌కుబయలుదేరారు. భక్తులంతా తమ తమ తావులకు తీపిగురుతులను మూటలు కట్టుకు పయనించారు.

# వికాస దర్శిని నివేదన

## ధనుర్మాస మహోత్సవాలు, చెన్నై

ఈ సంవత్సరం ధనుర్మాస మహోత్సవానికి కుచళాంబాళ్ కళ్యాణమండపాన్ని నందవ్రజంగా తీర్చి దిద్ది, భక్తులంతా గోపబృందమై స్వామిరాకకై ఎదురు చూసారు. ఎంతో కాలంగా ఆర్తితో ఎదురుచూస్తున్న వారి హృదయాలలో సంతోషపు జల్లులను కురిపిస్తూ శ్రీస్వామి వారు వేంచేశారు. 15వ తేదీ సాయంత్రం 4 గం.లకు తెలుగు, ఆంగ్ల, తమిళ పత్రికల విలేఖరులతో గోష్ఠి జరిగింది.శ్రీశ్రీశ్రీ స్వామివారు ధనుర్మాసోత్సవ ప్రాముఖ్యాన్ని, ఇలాంటి ఉత్సవాలను అనేక చోట్ల నిర్వహిస్తున్న JET మరియు వికాసతరంగిణుల సేవా కార్యక్రమ వివరాలను విలేఖరులకు తెలిపి, మంగళా శాసనాలు కృపచేసారు.

15వతేదీ సా॥ గం॥6.00లకు శ్రీశ్రీశ్రీ స్వామివారి కరకమలములద్వారా దీపావిష్కరణ, అవతారికా ప్రవచనముతో ధనుర్మాసోత్సవము ఆరంభమైంది. ఉన్నత ప్రభుత్వాధికారి శ్రీమాన్ J.T. ఆచార్యులు,IAS., గారు ముఖ్య అతిథిగా విచ్చేసారు. 16వ తేదీనుంచి ప్రతి నిత్యము ఉదయపు కార్యక్రమాలు 6.30లకు గీతామృత దీక్షలో భాగంగా భగవద్గీతాశ్లోక పారాయణతో ప్రారంభమై, గోదాష్టోత్తర పూజా, సేవాకాలము అనంతరం తిరు మంత్రార్థ ప్రవచనం, తీర్థ ప్రసాద గోష్ఠితో నిర్వహించ బడ్డాయి. సాయంత్రం శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్ర పారాయణానంతరం శ్రీశ్రీశ్రీ స్వామివారు తిరుప్పావై ప్రవచనాన్ని అనుగ్రహించారు.

**చెన్నై వాసుల అదృష్టం :** తమిళ దేశమైన చెన్నై నగరానికి ఆండాళ్ తల్లి తమిళంలో పాడిన తిరుప్పావై కొత్తకాక పోయినా తేటతేట తెలుగులో తేనెలూరే ప్రవచనామృతం ఆస్వాదించే అదృష్టం లభించడం ఇదే మొదటిసారి. ఆచార్యుల అనుగ్రహభాషణానికి మేఘాలుకూడా కరిగాయా అన్నట్లు 10సం॥ తర్వాత ధనుర్మాసంలో మొదటి సారి 10 రోజులు నిరంతరాయంగా వర్షించి చెన్నైవాసుల నీటి ఎద్దడి తీర్చాయి. ఇదీ మహాత్ముల సన్నిధి ప్రభావం. అయితే





ఈ వానలు కానీ, బ్రహ్మాండ కోలాహలంగ ఆనవాయితీగ మదరాసులో సుమారు 30 చోట్ల ప్రతీ ఏడాదీ జరిగే సంగీత ఉత్సవాలుకానీ, స్వామివారి ప్రవచనామృతాన్ని సేవించవచ్చే జన ప్రవాహానికి ఏమాత్రం అవరోధం కాలేదు.

మన JET, వికాసతరంగిణులు చెన్నైలో గత ఏడు సంవత్సరాలుగా వివిధ కళాశాల విద్యార్థులకు శ్రీవిష్ణు సహస్రనామ, సంక్షేప రామాయణం, ముకుందమాలవంటి స్తోత్రాలలో పోటీలు నిర్వహిస్తున్నాయి. ఈ సంవత్సరం పోటీలలో గెలుపొందిన విద్యార్థులకు శ్రీశ్రీశ్రీ స్వామివారే స్వయంగా బహుమతులు, ప్రశంసా పత్రాలు అందించి, మంగళాశాసనములు చేసినారు.

డిశెంబరు 24వ తేదీ తిరువలిక్కేణి, శ్రీ పార్థసారధి పెరుమాళ్ళను శ్రీస్వామివారు గోష్ఠితో సేవించారు. ఆ స్వామికి తైలకాప్పు అయినతరువాత ప్రథమదర్శనం ప్రసాదించినది శ్రీస్వామివారికే.

**గీతామృత దీక్ష ముగింపు :** డిశెంబరు 26వ తేదీ వైకుంఠ ఏకాదశి మరియు గీతామృతదీక్షానమాపనోత్సవ సందర్భంగా ఉ.5గం॥లకు ఉత్తర ద్వారదర్శనంతో కార్యక్రమము ప్రారంభమైంది. సుమారు నాలుగున్నర గంటలపాటు శ్రీస్వామివారే స్వయంగా భక్తులతో కలసి 18 అధ్యాయాలు పారాయణ చేస్తూ, మధ్యమధ్యలో ఆరగింపులు చేస్తూ దీక్షా పరిసమాప్తి చేయించారు.

**చిదంబరంలో శ్రీవారు :** డిసెంబరు 29వ తేదీన చిదంబరంలో శ్రీనటరాజస్వామి బ్రహ్మోత్సవాలలో జరుగుతున్న వార్షిక వేదసభకు శ్రీశ్రీశ్రీ స్వామివారు వేంచేసారు. మన వేదవిశ్వవిద్యాలయ విద్యార్థులకు మైత్రాయణీశాఖను నేర్పిన వేద గురువులు, ఇక్కడి ప్రధానార్చకులు అయిన బ్రహ్మశ్రీ పరమేశ్వరదీక్షితులు ప్రతిసంవత్సరం ఈ వేదసభలో సుమారు 100 మంది వేద పండితులను సంభావిస్తారు. ఉపనిషత్తులు శరీరంలో ఆత్మ పరమాత్మల స్థానాలను ఏ విధంగా వివరించడం జరిగిందో ఆవిధంగానే ఇక్కడ ఆలయ నిర్మాణం జరిగింది. ఇదే అక్కడి చిదంబరరహస్యం.

శ్రీ పరమేశ్వర దీక్షితులు ఆహ్వానం మేరకు వేంచేసిన శ్రీశ్రీశ్రీ స్వామివారు తమిళంలో ప్రవచనాన్ని అను గ్రహించడమే కాకుండా, వారికి వేదరక్షణార్థమై రూ. 25 వేలు అనుగ్రహించారు. అక్కడికి విచ్చేసిన 100 మంది వేద పండితులను శాలువలతో సత్కరించి వారందరినీ ఆశ్చర్యానందములలో ఓలలాడించారు. స్థానికంగా ఉన్న గోవిందరాజ పెరుమాళ్ళ సన్నిధినిగూడా దర్శించారు శ్రీ స్వామివారు, దీనినే తిల్లై తిరుచ్చిత్తిరకూటం, అనే దివ్యదేశమని అంటారు.

నూతన ఆంగ్ల సంవత్సర సందర్భంగా సేవించ వచ్చిన భక్తులందరికీ శ్రీ స్వామివారు రాత్రి 12 గంటలకు మంగళాశాసనములను అనుగ్రహించారు.

జనవరి 4వ తేదీన మైలాపురంలోని శ్రీ కేశవ పెరుమాళ్ళను సేవించి నమ్మాళ్వార్ మోక్షోత్సవంలో పాల్గొన్నారు శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారు. 9వ తేదీన శ్రీపెరుంబూదూరు వేంచేసారు. అక్కడున్న రామానుజుల సన్నిధిని సేవించి, స్థానిక జీయరుస్వామి వారిని దర్శించి, కొత్తగా ఋక్ వేదాధ్యయన శాఖను ఏర్పాటు చేసుకున్న మన ఆశ్రమాన్ని సందర్శించి విద్యార్థులకు మంగళాశాసనములు కృపచేశారు. అదేరోజు శ్రీమాన్ వెంకట్ రాధా దంపతుల ఆహ్వానం మేరకు M.G. రామచంద్రా మెడికల్ కాలేజిని సందర్శించి అస్వస్థులుగ ఉన్న శ్రీమాన్ వెంకట్‌గారిని పరామర్శించారు. ఆసుపత్రి సిబ్బందికి సందేశాన్ని అనుగ్రహించారు.

వరుసగా అన్ని, కూడారై ఉత్సవాలను వైభవంగా నిర్వహించుకొని గోదా రంగనాథుల కళ్యాణానికి సిద్ధమయ్యారు చెన్నైవాసులు. ఆరోజు ఉదయం శ్రీశ్రీశ్రీ స్వామివారు రెండు పాశురాల

వైభవాన్ని అనుగ్రహించి, వేదమంత్రాల నడుమ మంగళవాయిద్యాలమధ్య, వేలాది భక్తుల జయజయ ధ్వానాలతో, వందలాది దంపతులచే గోదారంగనాథుల కళ్యాణాన్ని జరిపించారు.

చెన్నై ధనుర్మాసోత్సవము రెండు ప్రత్యేక కైంకర్యములతో ఒక విలక్షణ వైభవాన్ని సంతరించు కొంది. మొదటిది మన శ్రీస్వామివారికి వివిధ దివ్య దేశములనుండి మాలామర్యాదలను ఒక్కోరోజూ కొన్ని చొప్పున సమర్పించుకోవటం, దీనికి కారణభూతులు శ్రీమాన్ మాధవన్ స్వామి. ఎంతో ప్రశంశనీయులు. వీరికి శ్రీస్వామివారు ప్రత్యేకంగా మంగళా శాసనములు కావించినారు.

రెండవది శ్రీవిల్లి పుత్తూరు నుంచి ఆండాళ్ తల్లి అనుగ్రహప్రసాదంగా ప్రతిరోజూ తల్లి అలంకరించుకొని, పంపగా వచ్చిన ఆకు చిలకలు, దీనికి భాద్యులైన శ్రీమాన్ రంగస్వామి గారికి స్వామివారు మంగళా శాసనములను అనుగ్రహించిరి.

ఈ కార్యక్రమాలన్నీ ఇంత వైభవంగా జరగడానికి ఎందరో భక్తులు ఉదారంగా తమవంతు సహాయాన్ని అందించారు. ముఖ్యంగా ఆహ్వానసంఘ అధ్యక్షులు Dr. P.C. Reddy దంపతులు త్రివిధ (ద్రవ్య, పుష్ప, ఫల) కైంకర్యములను త్రికరణ శుద్ధిగా సమర్పించి శ్రీ స్వామివారి అనుగ్రహానికి పాత్రులయ్యారు. కళ్యాణ మహల్‌ను నెలరోజులు ఉచితంగా అందించిన ఊరా శ్రీదేవమ్మగారి కుటుంబానికి శ్రీ స్వామివారు అనేక మంగళాశాసనాలను అనుగ్రహించారు.

ఈ కల్యాణ మహల్‌ను సౌందర్యోపేతంగా తీర్చిదిద్దినవారు శ్రీమాన్ K. రాఘవేంద్ర, శ్రీమాన్ కె. కృష్ణ మోహన్ గార్లు. వీరికీ, వారి కళాదర్శకులు శ్రీ శర్మగారికీ శ్రీస్వామివారు మంగళాశాసనములు కృప చేసిరి.

కమిటీ ఉపాధ్యక్షులు శ్రీమాన్ రామ సుబ్రమణ్య రాజుగారు, ఈ కార్యక్రమానికి కన్వీనర్లుగా ఉన్న శ్రీమాన్ పాతాళం నిరంజన్, శ్రీమతి ఐ.వి. ఆనందకుమారి, శ్రీమతి ఉమ్మిడి లలితా సుధాకరు, కోశాధికారులు శ్రీమాన్ పాతాళం నిరంజన్, శ్రీమతి మీరాశేఖరు విశేష సేవలందించి శ్రీస్వామివారి మంగళా శాసనములకు పాత్రులయ్యారు.

వేదిక ఏర్వాట్లు, అలంకారం, పూజల ఏర్పాట్లు శ్రీమతి ప్రేమధాత్రిగారి ఆధ్వర్యంలో శ్రీమతి శాంతిరావు, శ్రీమతి అన్నపూర్ణ, శ్రీమతి ఇందిరా ఆనంద్, శ్రీమతి పవనారెడ్డి, శ్రీమతి ప్రతిమారెడ్డి, శ్రీమతి రాధాలక్ష్మి, శ్రీమతి ఆషా ఆళ్వారు గార్లు అద్భుతంగా నిర్వహించి శ్రీస్వామివారి ప్రశంసలకు పాత్రులైనారు.

శ్రీమాన్ గిరిధర్ గారు జెమినీ టీ.వి., శ్రీ స్వామివారి కార్యక్రమాన్ని ప్రతిరోజు ప్రసారం చేయడానికి శ్రీమతి ఇందిరాఆనంద్ గారికి ఎంతో సహకరించి శ్రీస్వామివారి మంగళాశాసనాలను అందుకున్నారు.

తదీయారాధనను సమర్థవంతంగా నిర్వహించిన శ్రీమతి ఉమ్మిడి లలితాసుధాకర్, శ్రీమతి మీరా శేఖర్, వీరికి సహకరించిన శ్రీమాన్ సాంబశివరావు, శ్రీమాన్ కృష్ణంరాజు దంపతులు స్వామివారి మంగళాశాసనాలను పొందారు. భక్తుల ఆరోగ్య పర్యవేక్షణ సేవలందించిన శ్రీమాన్ రవిరెడ్డి, రిసెప్షన్ కౌంటర్ బాధ్యత వహించిన శ్రీమాన్ నవనీతరావు శ్రీ స్వామివారి మంగళా శాసనములను అందుకున్నారు.

చెన్నై JET, వికాసతరంగిణుల కార్యకర్తలకు బహు సుందరమైన జ్ఞాపికలను అందించి, ప్రతిసంవత్సరం వేంచేస్తామని ప్రేమతో వాగ్దానం చేసి, ఆర్తితో స్వామిరాకకై ఎదురు చూస్తున్న హైదరాబాద్ భక్తులను అనుగ్రహించ డానికి శ్రీస్వామివారు వేంచేసారు.

**ధనుర్మాసం, హైదరాబాద్ గోదాకళ్యాణం :** శ్రీమతి శ్రీకుమారిగారు ఛైర్‌పర్సన్‌గా ఏర్పడ్డ కొత్త కమిటీ





సారధ్యంలో ఈ సంవత్సరం శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఎస్.ఎన్. సి.రఘునాథాచార్య స్వామివారి ద్వారా తిరుప్పావై అమృతాన్ని పానం చేసి, అతి వైభవంగా గీతామృత దీక్షాసమాపనను కావించుకున్నారు భాగ్యనగర భక్తులు. జనవరి 6న జరిగిన తిరుప్పావై సదస్సులో ఒకే వేదికపై 27 మంది పండితుల ప్రవచనాలను అనుభవించి ఆనందించారు.

అతి సుందరంగా అనేక మణిదీపపుకాంతుల మధ్య "అన్నివ్వళగం" కైంకర్యాన్ని, 11వ తేదీన కూడారై ఉత్సవాన్ని భక్తులు ఎంతో రమ్యంగా అనుభవించారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథులుగా శ్రీమాన్ శ్రీఎస్.ఎస్.శ్యాంమోహన్ దంపతులు, సి.ఎమ్. సెక్రటరీ శ్రీమాన్ యస్.వి. ప్రసాద్‌గారి సతీమణి శ్రీమతి లక్ష్మీగారు విచ్చేయగా, కుమారి శ్రీవిద్య తిరుప్పావై కూచిపూడి నృత్యరూపకం వైభవాన్ని జోడించింది.

13వ తేదీ సా॥. ఆహ్లాదకరమైన వాతావరణంలో, అశేష జనవాహిని ఆనందంతో పరవశించే వేళ, ఎదురుచూసే భక్తుల హృదయాలు పులకించేట్టు, హైదరాబాద్ - జెట్ కమిటీ విన్నపాన్ని మన్నించి వేంచేసిన శ్రీశ్రీశ్రీ జీయరు స్వామివారి పాదస్పర్శతో భాగ్యనగరం ఎ.వి.కాలేజి గ్రౌండ్ క్రొత్త శోభను సంతరించుకుంది.

హైదరాబాద్ జెట్ ఛైర్‌పర్సన్ శ్రీమతి శ్రీకుమారి స్వాగతోపన్యాసంతో ఆరంభమై, సెక్రటరీ శ్రీ పురుషోత్తమ రావు గారి సభానిర్వహణలో శ్రీమాన్ మధుస్వామి, శ్రీమాన్ రమాకాంతాచార్య స్వాముల యాజ్ఞీకంలో ఎంతో రమ్యంగా రాత్రి 1 గం. వరకు గోదారంగనాథుల కళ్యాణం జరిగింది. సమయాన్నికూడా మరచి ఎంతో ఆనందంగా భక్తులుదీన్ని అనుభవించారు. ఈ వైభవ కార్యక్రమానికి ముఖ్య అతిథులుగా శ్రీమాన్ దయాకర్‌రావుగారు (M.L.A.) ప్రభుత్వ చీఫ్ వీప్, శ్రీమాన్ ఆంజనేయులు గారుM.L.A., శ్రీమాన్ బాలసుబ్రమణ్యం గారు I.A.S., సెక్రటరీ ఎ.పి. ఇండస్ట్రీస్, శ్రీమాన్ ప్రకాశరావుగారు హైకోర్టు జస్టిస్, శ్రీమాన్ సీతారామారావు గారు I.P.S., ఐ.జీ.పి. శ్రీమాన్ డా. పావులూరి కృష్ణ చౌదరిగార్ల దంపతులు శ్రీమాన్ సి.యస్. శ్యాం మోహన్, ఇందిరగార్లు, శ్రీమాన్ కల్కి అవతారం, రాణిగార్లు విచ్చేసారు.

జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ కమిటీ నేతృత్వంలో మన సెంట్రల్ కమిటీ సభ్యులైన శ్రీమాన్ పి. వెంకటేశ్వర్లు, శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారు, శ్రీమతి జె. వసుమతి భాస్కరరావు, శ్రీమాన్ లక్ష్మీనారాయణ సంతువాల్ మొదలైన పెద్దలద్వారా శ్రీశ్రీశ్రీ జీయర్ స్వామివారి సమ్మాన కైంకర్యం అత్యంత వైభవంగా జరిగింది. కార్యనిర్వాహక బృందంవారిచే శ్రీమాన్ రఘునాథాచార్య స్వామివారి సమ్మాన కార్యక్రమం వైభవంగా జరిగింది.

శ్రీశ్రీశ్రీ జీయర్‌స్వామివారి మంగళాశాసనాలతో శ్రీ గోదారంగనాథుల కళ్యాణమహోత్సవం అతి సుందరంగా భక్తుల ఆనందోత్సాహాల మధ్య ముఖ్య అతిథులకు, కళ్యాణ దాతలకు, కమిటీ వారికి శ్రీవారిచే మంగళాశాసన కార్యక్రమంతో ఎంతో వైభవంగా జరిగింది.

14వ తేదీ ఉదయం శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారు మన రాష్ట్రముఖ్యమంత్రి అయిన శ్రీమాన్ చంద్రబాబునాయుడుగారితో సమావేశ మయ్యారు. తిరుమల తిరుపతి దేవస్థానపు సేవాకార్యక్రమాలు, ఎండోమెంట్స్ ఆలయాల నిర్వహణలో మార్పులకు సంబంధించి కొన్ని సూచనలు అందించారు. తిరుమల తిరుపతి వేంకటేశ్వరుని ఆరాధనలోని లోటుపాట్లనుకూడా C.M. గారి దృష్టికి తీసుకువచ్చారు. గుజిరాత్ రిలీఫ్ ఫండ్ విషయంలో చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకోలేక పోయినందుకు వారు చాలబాధపడ్డారు. పొరపాటైయిందని బాధవ్యక్తం చేసారు.

14వ తేది సాయంత్రానికి సీతానగరం వేంచేసి సిబార్ సంక్రాంతి సంబరాలలో పాల్గొన్నారు శ్రీ స్వామివారు.

గత తుఫాను సందర్భంగా నెల్లూరు జిల్లాలో దెబ్బతిన్న కొన్నింటిలో సోమశిలలో ఉన్న మన ఆశ్రమం కూడా ఒకటి. దాని పునర్నిర్మాణ కార్యక్రమాలను పర్యవేక్షించడానికి 17వ తేదీన వేంచేసారు. తరువాత నర్సింహుల కొండ ఆశ్రమాన్ని సందర్శించి విద్యార్థులకు మంగళాశాసనాలను కృపచేసి. 19వ తేదీ సాయంకాలానికి సీతానగరం వేంచేసారు. 25వ, తేదీ వరకు ఆశ్రమంలోనే ఉండి 26వ, తేదీ ఉదయం నడిగడ్డపాలెం చేరుకొని శ్రీశ్రీశ్రీ పెద్దజీయరు స్వామివారి పరమపదోత్సవంలో పాల్గొన్నారు. అనంతరం అక్కడి ఆశ్రమ పునరుద్ధరణ కార్యక్రమాలను సమీక్షించి సాయంకాలానికి సీతానగరం చేరుకున్నారు. ఇదే రాత్రి గం॥ 11.00 లకు వైజాగ్ బయల్దేరి వెళ్ళారు.

విశాఖపట్నంలో శ్రీమాన్ మంగళగిరి సుదర్శనం గారి తిరుమాళిగకు శ్రీశ్రీశ్రీ స్వామివారు వేంచేసి తీర్థప్రసాద గోష్ఠిని అనుగ్రహించారు. శ్రీమాన్ అచ్యుతరావుగారి ఆహ్వానం మేరకు వారి గృహాన్ని సందర్శించి మంగళాశాసనం కృపచేసారు. తర్వాత నేరుగా అక్కాయపాలెం శ్రీ వేణుగోపాలస్వామిని సేవించి, ఆలయ కళ్యాణమండపంలో జరుగుతున్న వికాసతరంగిణి సమావేశంలో పాల్గొన్నారు. విశాఖపట్టణం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలోని 22 శాఖలనుండి, సుమారు 287 మంది ప్రతినిధులు, కార్యకర్తలు ఈ సమావేశానికి వచ్చారు.

ఈ సభకి భక్తినివేదన సంపాదకులు శ్రీ ఉ.వే.శ్రీమాన్ రామచంద్రాచార్యస్వామివారు అధ్యక్షత వహించారు. ముఖ్యఅతిథిగా విచ్చేసిన విశాఖపట్నం జాయింట్ కలెక్టర్ శ్రీమ్మాన్ ఎమ్. తిరుమల కృష్ణబాబుగారు మాట్లాడుతూ మన నాగరికతను మనం పరిరక్షించుకోవడానికి తీసుకోవలసిన జాగ్రత్తలను తెలుపారు. మన సంస్కృతికున్న విలక్షణతను మన సమాజ వ్యవస్థలోనున్న భద్రతను తెలుపుతూ, ఆ భద్రత వలననే ప్రగతి ఏర్పడు తుందని వానిని విశ్లేషించారు.

శ్రీ స్వామివారు తమ అనుగ్రహ భాషణంలో ''కృష్ణం వందే జగద్గురుం'', "గీతామృతదీక్ష"లను ప్రారంభించడానికి గల ఆశయాలను వివరిస్తూ ఆధ్యాత్మిక భావనతో సమాజాన్ని ఏకోన్ముఖం చేయడంకోసం ఈ కార్యక్రమాలు ప్రారంభించడం జరిగిందన్నారు. ప్రక్కవారికి ఏమైనా కాస్తంతైనా పట్టించుకోని మన జనంలో సాటివారికోసం ఏమైనా చేయాలని. మనమంతా కలిసి ఉండాలి అనే భావనను పెంచి, తద్వారా సమాజంలో ఏకీకరణ సాధన ఒక భద్రతాభావన కల్పించడమే కార్యక్రమ లక్ష్యం అన్నారు. భద్రత ఏర్పడటం వలన ప్రగతికి ఎంత అవకాశం ఉందో, అలానే సోమరితనానికి కూడా అంత అవకాశం ఉంది. అది లేకుండా సమాజాన్ని చైతన్యవంతం చేయాలి. ఆ చైతన్యసందేశాన్ని పరమకారుణికుడైన పరమాత్మ శ్రీమద్భగవద్గీతలో మనకు అందించాడు. దానిని కులమతాలకు అతీతంగా సర్వమానవ శ్రేయస్సుకు అవసరమైంది కనుక, అందరికీ అందించాలనేదే మన ప్రయత్నం. అందులో భాగంగానే గతంలో "కృష్ణం వందే జగద్గురుమ్" అంటూ ఒక నెలరోజులు కలశాభిషేక కార్యక్రమం అనుకున్నాం. దానిని బాగా చేయగలిగాం. ఆ తర్వాత 40 రోజులు 'గీతామృతదీక్ష' కార్యక్రమం అనుకొని వైభవంగా జరుపుకోగలిగాం. ఇపుడు మన ఆత్మవిశ్వాసస్థాయి పెరిగింది కనుక ఒక సంవత్సరమైనా చేయగలం అని నిరూపించాలి. అంటూ కార్యకర్తలందర్నీ ప్రోత్సహించారు శ్రీస్వామివారు. వారి నుండి మంచి స్పందన లభించింది. ఏపనైనా సక్రమంగా చేయలేకపోవడానికి ప్రధానకారణం ఆత్మవిశ్వాసం లోపించడమే కదా! ఆత్మవిశ్వాసాన్ని ధృడపరుచుకుంటే సాధించలేనిది ఏముంటుంది కనుక. దానికోసమనే మనం వికాసతరంగిణిని వెన్నుదన్నుగా పెట్టుకొని ముందుకు సాగుతున్నాం అంటూ రాబోయే ఉగాది నుంచి ప్రారంభించబోయే కార్యక్రమం యొక్క





సంక్షిప్త రూపురేఖల పరిచయం గావించారు. జగదాచార్యులు శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామివారు. పూర్తి వివరాలను త్వరలో కరపత్రం ద్వారా అందిస్తామని తెలిపారు. వికాసతరంగిణి సమన్వయ కర్త శ్రీమాన్ భవాని ప్రసాద్ గారు కార్యక్రమానికి ముందుండి, అన్నిటిని సమన్వయపరచి, శ్రీ స్వామివారి మంగళాశాసనాలను పొందారు.

మూడు జిల్లాలలోనూ ఒక్కొక్క జిల్లాకు ఒక్కొక్క సమన్వయబృందాన్ని ఏర్పాటు చేసారు. ఇకపై ఆయా జిల్లాలలో జరిగే కార్యక్రమాలన్నీ ఆ బృందం ద్వారా నిర్వహిస్తామని తెలిపారు. సుమారు మధ్యాహ్నం 1గం॥ వరకు శ్రీశ్రీశ్రీ స్వామివారు అక్కడ వారందరికి కార్యక్రమవివరణ చేసి, మన రినిగి యొక్క పోషకులైన శ్రీమాన్ యు.ఏ.ఎన్. రాజుగారు చేయబోతున్నటువంటి ఒక నిర్మాణ కార్యక్రమానికి మంగళాశాసనం చేసారు.

తరువాత శ్రీమాన్ మంగళగిరి సుందర్శనం గారి అల్లుడైన శ్రీమాన్ ఎమ్. సత్యనారాయణ గారి గృహాన్ని సందర్శించి, తర్వాత వికాసతరంగిణి కార్యాలయాన్ని పావనం చేసారు. శ్రీమాన్ ఎస్. సత్యనారాయణ గారు స్నేహధారా అపార్టుమెంట్స్‌లో ఉంటూ తమ వాణిజ్య కార్యకలాపాలను కొనసాగిస్తుంటారు. వారు వికాసతరంగిణి కార్యకలాపాలలో కూడ భాగస్వాములై తమ కార్యాలయాన్ని వికాసతరంగిణికి పరిపూర్ణంగా కేటాయించి, అక్కడ ఒక చక్కటి కేంద్రంగా దానిని రూపొందించినారు.

ఇంతవరకూ వికాసతరంగిణికి సంబంధించిన విషయాలను అందరూ తెలుసు కోవడానికి, ఒకరినొకరు సంప్రదించుకోవ డానికి, ఆడియో, వీడియో, పుస్తకాలు ఎక్కడ దొరుకుతాయో అని సందిగ్ధంగా ఉండేది. ఆ లోటు తీర్చి వికాసతరంగిణి కార్యాలయాన్ని చక్కగా రూపుదిద్దిన శ్రీమాన్ సత్యనారాయణ గారిని శ్రీస్వామివారు ఎంతో ప్రశంసించి మంగళాశాసనాలను కృపచేసారు. అక్కడి కార్యకర్తనందరికీ కూడ మంగళాశాసనాలు చేసి, తిరిగి వికాసతరంగిణి కార్యకర్తల సమావేశానికి విచ్చేసారు శ్రీవారు. తరువాత జరుగబోయే "గీతాజ్యోతి" కార్యక్రమంలో రామక్రతు స్తంభ జీర్ణోద్ధరణ కూడ ఒక భాగంగా తీసుకోవాలని సూచించారు. బొబ్బిలి శ్రీమాన్ సి. హెచ్. కృష్ణారావుగారు రచించిన, చిత్రాలతో కూడుకున్న తిరుప్పావై పుస్తకాన్ని ఒక్లహోమ్, శ్రీమాన్ డా॥ మురళీకృష్ణగారు ముద్రించగా, శ్రీశ్రీశ్రీ స్వామివారు ఆవిష్కరించారు. శ్రీమాన్ డా॥ మురళీకృష్ణగారి సతీమణి శ్రీమతి శ్యామలగారు మొదట ప్రతిని అందుకున్నారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు అందరికీ మంగళాశాసనాలను అనుగ్రహించి రాత్రికి రాజమహేంద్రి వేంచేసారు.

రాజమహేంద్రి చేరగానే శ్రీమాన్ డా॥ నారాయణరావుగారు నిర్మాణం చేయించినటువంటి ఎలర్ట్ యమర్జన్సీ హాస్పిటల్ యొక్క నూతన భవనాన్ని ప్రారంభించారు. 12మంది వైద్య బృందంతో, 20 మంది షేర్ హోల్డర్స్‌తో, చిన్న భవనంలో ఏర్పాటు చేసిన ఎలర్ట్ యమర్జన్సీ హాస్పిటల్ ఆర్తుల అవసరాలను ఆదుకొంటూ నూతన భవనాన్ని కూడా సమకూర్చుకోవడం శ్రీమాన్ నారాయణరావుగారి కృషితో సాకారమైనదని వారికి అనేక మంగళాసాసనములు అనుగ్రహించి రాత్రికి తులసీ రామానుజ కూటానికి విచ్చేసారు.

28వ నాటి ఉదయం తీర్థగోష్ఠికాగానే పురప్రముఖులతో సమావేశమయ్యారు శ్రీశ్రీశ్రీ స్వామివారు. జీల్లా కలెక్టర్ శ్రీమాన్ సతీష్ చంద్రగారు I.A.S. ,మున్సిఫల్ కమీషనర్‌గారు, తదితర ప్రముఖులంతా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. రాబోయే భీష్మ ఏకాదశిన జరుగు విరాట్ శ్రీవిష్ణు సహస్రనామ పారాయణ కార్యక్రమ రూపురేఖలను వివరించి, ఆ కార్యక్రమం చేయడానికి సిద్ధపడిన కార్యకర్తలకు, సేవకులకు మంగళాశాసనాలు చేసారు. కార్యక్రమం జరిగే ఆనం కళ్యాణ

మండపాన్ని సుబ్రహ్మణ్య మైదానాన్ని సందర్శించి, తగు సూచనలు కార్యకర్తలకు అందించి అక్కడనుంచి బయలుదేరారు.

సాయంత్రం కొవ్వూరులో శ్రీమతి మలతీగారి ఆహ్వానంపై శ్రీమన్నారాయణ ఆశ్రమాన్ని పావనం చేసి, శ్రీమతి అల్లూరి విజయలక్ష్మిగారి గృహానికి వేంచేసి మంగళాశాసనాలు కృపచేశారు. గౌడీయ సంప్రదాయానికి చెందిన పూజ్యశ్రీ త్రిదండి భక్తప్రభావపురీగోస్వామివారి యొక్క 90వ జన్మదినోత్సవంలో పాల్గొని వైష్ణవ సంప్రదాయ వైశిష్ట్యాన్ని అక్కడ ఉన్న భక్తులకు అనుగ్రహించారు.

అక్కడనుండి బయలుదేరి, మార్గమధ్యంలో ఏలూరువద్ద డా॥ ముక్కాముల పార్థసారధిగారి బృందానికి మంగళాశాసనాలు చేసి, హనుమాన్ జంక్షన్ చేరారు. శ్రీమతి అనుమోలు రమాదేవిగారి ఆహ్వానంపై గత కొద్దికాలంగా నిర్వ్యాపారంగా ఉన్న శ్రీరాజరాజేశ్వరి పేపర్ మిల్స్‌ను సందర్శించారు. దాని వ్యవహారాలను చూస్తున్న శ్రీమాన్ చంద్రశేఖర జనార్ధనరావుగారికి మంగళాశాసనాలు కృపచేసి రాత్రికి సీతానగరం వేంచేశారు.

### ధనుర్మాస మహోత్సవములు

**నాగార్జునసాగర్ :** వికాసతరంగిణి ఆధ్వర్యవంలో శ్రీస్వామివారి మంగళాశాననములతో తత్త్వప్రచారకురాలు కుమారి నీలాగారి పర్యవేక్షణలో ధనుర్మాసోత్సవం వైభవంగా జరిగింది. ఈ ఉత్సవాలలో 'వందే శ్రీంగనాయు కీమ్' అనే విశేషకార్యక్రమములో పెరుమాళ్ళకు నివేదించే కూడారై ప్రసాదమునకు గోదాదేవి నామాంకితమైన బియ్యమును వెయ్యికిపైగా భక్తులు శ్రద్ధగా ఏరి సమర్పించిరి. 'Duty is God' అనే మరొక్క కార్యక్రమములో 'అక్షరవాచ్యమైన' దైవాన్ని వివిధ కళాశాలలు మరియు పాఠశాలల విద్యార్థినీ విద్యార్థులు శ్రద్ధాసక్తులతో ప్రార్థించారు. అలానే వికాసతరంగిణి 'మాధవసేవగ సకలప్రాణికోటి సేవ' అనే ఒక అంశంగా జరిగిన చిత్రలేఖనము మరియు వివిధ పోటీలలో మత బేధంలేక బాలబాలికలు ఎంతో ఉత్సాహంగా పాల్గొని బహుమతులు అందుకున్నారు. శ్రీమతి పూలమ్మ, శ్రీమతి కుమారి, ఇతర వికాసతరంగిణి సభ్యులు కలిసి మొత్తం కార్యక్రమము అమ్మ అనుగ్రహంతో కొన్ని చికాకులను అధికమించి వైభవంగా ముగిసింది.

**రామచంద్రాపురం :-** రామచంద్రాపురం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో 13-1-2002 గోదాదేవి కళ్యాణం వైభవంగా జరుపుకొన్నారు. తరువాత 250 మందితో తదీయారాధన కార్యక్రమం జరుగుతుంది.

**నిజామాబాద్ :-** నిజామాబాద్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో ధనుర్మాస ఉత్సవాలు అత్యంత వైభవంగా జరిగినాయి. శ్రీమాన్ జె.కె.వి. రాఘవన్‌గారు వేదములను జోడించి అద్భుతంగ ప్రవచనములు అందించినారు. 108 గంగాళములతో కూడారై ఉత్సవము అత్యంత వైభవంగ నిర్వహించబడినది. భక్తజనకోటి సమక్షములో శ్రీగోదారంగనాథుల కళ్యాణం జరిగినది. ఈ కార్యక్రమంలో పద్మజా శ్రీనివాస్, భూలక్ష్మి, లక్ష్మిరెడ్డిలు, ధర్మపాల్, విజయలక్ష్మి, సుఖీంద్రరెడ్డి మొదలైనవారు పాల్గొన్నారు.

**నల్గొండ :-** నల్గొండ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో ధనుర్మాస ఉత్సవాలు అత్యంత వైభవంగ జరుపుకొన్నారు. శ్రీమాన్ పీతాంబరం రఘునాథాచార్యస్వామివారిచే మంచిర్యాల, జన్మభూమి నగర్, వికాసతరంగిణివారు ధనుర్మాస వేడుకలని వైభవంగ నిర్వహించినారు. చెన్నూరులో తాయారమ్మ, రమేష్ గార్ల ఆధ్వర్యవంలో, నర్సపూర్‌కాలనీలో శ్రీమతి విజయలక్ష్మీగారి ఆధ్వర్యవంలో, జన్మభూమి నగర్ వేంకటేశ్వరరావు, ఉమగారి నేతృత్వంలో వైభవంగ జరిగాయి. మంచిర్యాల M.L.A., గారి దంపతులు





సేవాకాలంలో, భాగవతా ఉపన్యాసంలో అన్వయించడం విశేషం.

**కాకినాడ :-** కాకినాడ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గోదాకళ్యాణం స్థానిక గీతామందిరంలో వైభవంగ జరుపుకొన్నారు. శ్రీకృష్ణాష్టోత్తర, గోదాష్టోత్తరములతో సేవా కాలంతో ఉదయం 9-30 నుండి రాత్రి 10-30 వరకు సేవాకాలం జరిగినది.

**గోదావరి ఖని :** గోదావరి వికాసతరంగణి శాఖ ఆధ్వర్యంలో కుమారి సముద్రాల గీత గారిచే స్థానిక రాజస్థాన్ భవనములో ధనుర్మాస కార్యక్రమం వేడుకలు వైభవంగ జరుపుకొన్నారు. స్థానిక పాఠశాలలో హయగ్రీవస్తోత్రపారాయణం, అష్టోత్తర పూజలు చేయించి విద్యార్థులకు పోటీలు నిర్వహించినారు. కుడారై 108 గంగాళాలలో పాయసం స్వామికి అర్పించడం జరిగింది.

**వేకనూరు :** వేకనూరు వికాస తరంగణి వారు ధనుర్మాస కార్యక్రమాన్ని శ్రీవారి శిష్యులైన స్వర్ల సుబ్బారావు గారిద్వార తిరుప్పావై ప్రవచనమును చెప్పినారు. ఈ కార్యక్రమంలో శ్రీవక్కభట్ల వృషాద్రి పతిగారు, శ్రీమాన్ సుబ్బారావుగారు భగవద్గీత 18 అధ్యాయములు చదివినారు. నెలరోజులుగ తిరుప్పావై ప్రవచనమును ఎంతో చక్కగ వివరించినారు. ఈ కార్యక్రమంలో జి.వి.యస్. పెరుమాళ్, శ్రీనివాసాచార్యులు, నాగులు, ఆండాళమ్మ, అంకాలమ్మ పాల్గొన్నారు.

**కొండపల్లి :** కొండపల్లి వికాసతరంగణి శాఖ ఆధ్వర్యంలో ధనుర్మాస ఉత్సవ కార్యక్రమం వైభవంగ జరుపుకొన్నారు. గోదా అష్టోత్తర పూజలు కూడారై ఉత్సవము జరుపుకొన్నారు. ఈ కార్యక్రమంలో వికాసతరంగణి అధ్యక్షులు విజయలక్ష్మిగారు పాల్గొన్నారు.

**ఆలేరు :-** వరంగల్ జిల్లా ఆలేరు గ్రామమంలోని శ్రీ రుక్మిణీ సత్యభామ సమేత వేణుగోపాల స్వామి దేవాలయములో ధనుర్మాస మహోత్సవాన్ని తత్త్వప్రచారకులు శ్రీమాన్ గంగాధర్‌గారు శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్ స్వామివారు మంగళాశాసనములతో విజయవంతంగా నిర్వహించారు. ఆలయ కమిటీ ఏకాంబరంగారు, మాధవరెడ్డి గారు, నారాయణ రెడ్డిగారు మహాయ సహకారములతో వివిధ విశేష ఉత్సవాలను పూజలను వైభవంగా నిర్వహించారు.

**జూలపల్లి :-** జూలపల్లి గ్రామంలో వికాసతరంగిణి ఆధ్వర్యంలో, శ్రీమతి ఊర్మిలగారు శ్రీమాన్ శ్రీగుడుపాటి మధుసూదన్ రెడ్డిగారి సహకారంతో తత్త్వశాస్త్ర ప్రచారకురాలు కుమారి కల్పనగారు ధనుర్మాస మహోత్సవాన్ని వైభవోపేతంగా నిర్వహించారు. గీతామృత దీక్షా విరమణ కార్యక్రమంలో శ్రీమాన్ శ్రీ కన్నం సత్యనారాయణగారు మరియు 200 మంది భక్తులు పాల్గొన్నారు. పరిసరగ్రామాలలోనూ, పాఠశాలలలోనూ కూడా కుమారి కల్పనగారు తమ ప్రచారాన్ని కొనసాగించారు. 13వ తేదీన అర్చకస్వామి శ్రీమాన్ రంగనాథగారు, శ్రీమాన్ వెంకటస్వామిగారు, శ్రీమాన్ బి. రాంనాయకులుగారు, శ్రీమాన్ బి. ఎన్ మూర్తిగారు, శ్రీఆమాన్ బి. రామానుజలుగారు ఎంతో సహకరించి శ్రీస్వామివారి మంగళాశాసనాలకు పాత్రులయ్యారు.

**బోయినపల్లి :-** బోయినపల్లిలో శ్రీమతి రమాదేవి చరణ్ స్వప్న దంపతుల ఆధ్వర్యంలో తత్త్వ ప్రచారకరాలు కుమారి సూర్యకుమారి గారి ద్వారా చాలా వైభవంగా ధనుర్మాస వ్రతం జరిగింది. ఈ కార్యక్రమంలో భక్తులు ఎంతో ఉత్సాహంతో పాల్గొన్నారు 8వ తేదీన దీపోత్సవం వైభవంగా సాగింది. దీపోత్సవంకన్నా కూడారై, కూడారై కన్నా కళ్యాణోత్సవం మహావైభవంగా జరిపించారు.

**మహబూబాబాద్ :-** మహబూబాబాద్ వికానతరంగిణి ఆధ్వర్యంలో స్థానిక వేణుగోపాలస్వామి దేవాలయంలో తత్త్వశాస్త్ర

ప్రచారకురాలు కుమారి శారదా రామానుజదాసి గారిచే అత్యంత వైభవోపేతంగా నిర్వహించబడింది. ఉదయంపు సమయంలో ఆళ్వార్ల చరిత్ర, సాయంకాలము తిరుప్పావై ప్రవచనములను అందించి సంప్రదాయ సౌరభాలను భక్తులందరిచేతా ఆస్వాదింపచేసారు. శ్రీస్వామివారి దివ్య సందేశాన్ని ఇంటింటికి అందచేసి, వారిచేత భగవద్గీత పారాయణము మరియు ప్రవచనాన్ని అందించారు. శ్రీగోదా రంగనాథుల కళ్యాణమహోత్సవం శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో అంగరంగ వైభవంగా నిర్వహించుకున్నారు.

**విజయవాడ :-** శ్రీ రమాసమేత శ్రీ సత్యనారాయణ స్వామివారి కోవెలలో ధనుర్మాసాన్ని శ్రీవైద్యం విజయరాఘవన్ గారిచే వైభవోపేతంగా జరుపుకున్నారు. కొత్తపేట వికాసతరంగిణి వారు చిన్న పిల్లలచేత వేయించిన వేయించిన శ్రీకృష్ణ, ఆండాళ్, గోపిక వేష దారణలు గోష్ఠికి విశేషాకర్షణగా నిలిచాయి. శ్రీ గోదారంగనాథుల కళ్యాణం అంగరంగ వైభవంగా జరిగి భక్తులను ఎంతగానే ఆకట్టుకున్నది.

**హనుమాన్ పేట :-** మిర్యాలగూడ హనుమాన్‌పేట శ్రీ సీతారామాంజనేయస్వామి దేవాలయంలో శ్రీశ్రీశ్రీ చిన్నజీయర్ స్వామివారి మంగళాశాసనములతో అర్చకులు శ్రీమాన్ వేణుగోపాలాచార్యుల ఆధ్వర్యంలో ధనుర్మాస కార్యక్రమాలు తత్త్వశాస్త్ర ప్రచారకులు శ్రీమాన్ శాంతారామ్ గారిచే విజయవంతంగా నిర్వహించారు. ఆలయ కమిటీ అధ్యక్షులు గుంటూరు కనకయ్యగారు, ఉపాధ్యక్షులు నాగార్జున గుప్తగారు, ప్రధాన కార్యదర్శి శ్రీమాన్ కుప్పాల జగన్నాథంగారు కార్యదర్శి చంద్రయ్యగారి సహకారంతో వివిధ విశేష ఉత్సవాలను, పూజలను వైభవంగా నిర్వహించారు. నగరంలోని వివిధ







పాఠశాలలకు వెళ్ళి విద్యార్థులకు శ్రీ హయగ్రీవ స్తోత్రాన్ని బోధించారు.

**తిరుమల శ్రీవారి సేవకు వికాసతరంగిణి కార్యకర్తలు అందించిన సేవలు**

వైకుంఠ ఏకాదశి, నూతన సంవత్సర సందర్భముగ తిరుమల శ్రీవారి సేవకు ఈసారికూడ మన వికాసతరంగిణి సంస్థల నుండి శ్రీవారి సేవకులను పంపించమని T.T.D., J.E.O., శ్రీమాన్ P. బాలసుబ్రహ్మణ్యంగారు I.A.S., శ్రీవారిని కోరినారు. అందుకు స్పందించి శ్రీస్వామివారు తిరుపతి, వట్టిచెరుకూరు, విశాఖపట్టణం, విజయవాడ, గుడివాడ శాఖలనుండి 200 మందిని పంపడం జరిగింది.

25-12-2001 నుండి 2-01-2002 వరకు ఈ కార్యక్రమం నిర్వహించబడినది. రోజుకు 30,000 మందికి అన్నదాన సేవచేయడం జరిగింది. వికానతరంగిణి కార్యకర్తలు ఎంతో బాధ్యతాయుతమైన సేవలు అందించినారని శ్రీమాన్ బాలసుబ్రహ్మణ్యంగారు అభినందించినారు. మొత్తం 2 లక్షల మందికి అన్నదాన సేవచేసినారు. గీతామృత దీక్ష ముగింపు కార్యక్రమానికి వికాసతరంగిణి కార్యకర్తలకు ఎటువంటి భంగం కలుగకుండ తిరుమల ఆస్థానమండపంలో భగవద్గీత 18 అధ్యాయములు పారాయణం చేయడం జరిగింది. వీరందరికీ మన జీయర్ మఠం నుండి అన్న ప్రసాదములు ఏర్పాటు చేయడం జరిగింది. ఈ సేవా కార్యక్రమానికి తిరుపతి వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీ యన్. నాగేంద్రశాయిగారు నేతృత్వం వహించినారు. శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులుగారి ఆధ్వర్యవంలో గీతా పారాయణం జరిగినది. 200 మంది వికాసతరంగిణి కార్యకర్తలకు టిఫిన్, భోజనం, వసతి, దర్శనం, చలికి రగ్గులు, ఎటువంటి ఇబ్బందులు లేకుండ శ్రీమాన్ బాలసుబ్రహ్మణ్యంగారు I.A.S., J.E.O., ప్రత్యేక శ్రద్ధతో ఏర్పాటు చేసినారు. సకాలంలో స్పందించి సేవకులను పంపినందుకు శ్రీవారికి J.E.O., గారు ఒక లేఖలో తమ కృతజ్ఞతలు తెలిపినారు.

**ఉచిత వైద్యశిబిరం :-** సికింద్రాబాద్ వికాసతరంగిణి మెగా హెల్త్ క్యాంప్

సికింద్రాబాద్ వికానతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో నల్గొండ జిల్లా రాజాపేటలో ఉచిత వైద్యశిబిరం నిర్వహించబడినది. ఈ కార్యక్రమంలో 500 మంది రోగులను ఉచిత కంటి వైద్యపరీక్షలు నిర్వహించబడినవి. 500 మంది ఆపరేషన్ చేయడం జరిగింది. వారికి ఉచిత, భోజన సదుపాయాలు కూడా ఏర్పాటు చేయబడినవి. మన వికాసతరంగిణి కార్యకర్తల ఉచిత రక్తదాన శిబిరం కూడా నిర్వహించినారు. ఈ శిబిరంలో శ్రీమతి డా॥ శోభాజయంత్ గారు రోగులకు చర్మ, దంతపరీక్షలు నిర్వహించినారు. ఈ కార్యక్రమంలో శ్రీమతి లతా భూపాల్‌గారు తమ అమూల్యమైన సేవా కార్యక్రమాలు అందించినారు. ముఖ్యఅతిథులుగ కె.వి. ఆనంద్‌గారు, డా॥ రంగారెడ్డిగారు, యన్. సుహాసినీ రెడ్డిగారు, సికింద్రాబాద్ వికాసతరంగిణి అధ్యక్షురాలు శ్రీమతి వనజాభాస్కరరావుగారు పాల్గొన్నారు.

జై శ్రీమన్నారాయణ!

## గీతామృత దీక్ష

ఎన్నో, ఎన్నెన్నో ప్రాంతాలనండి మరియు మన వికాస తరంగిణి శాఖల నుండి 'గీతామృత దీక్ష' కార్యక్రమ వివరాలు వెల్లువలా భక్తినివేదనకు చేరాయి. వారందరికీ శ్రీవారి అనేకానేక మంగళాశాసనములు కృపచేసినారు. అయితే ఈ వివరాలన్నింటిని భక్తినివేదనలో కాకుండా మరొక ప్రత్యేక సంచికలో వెలువరించడం జరుగుతుందని గమనించగలరు.

ఈ సంచికలో........



## పంచాంగ వివరాలు

### మార్చి 2002

9 సర్వేషామేకాదశి
12 మహాశివరాత్రి,
శ్రీశైలాది శైవక్షేత్రములలో అభిషేక కళ్యాణోత్సవములు
13 సర్వేషాం అమావాస్య
14 మీన సంక్రమణం రా॥ 10-3
15. యాదగిరి శ్రీలక్ష్మీనరసింహ స్వామివారి బ్రహ్మోత్సవారంభం
20. నంబెరుమాళ్ తిరునక్షత్రం
21. తిథి ద్వయం
22. శ్రీ యాదగిరి లక్ష్మీ నరసింహ స్వామివారి కళ్యాణోత్సవం, నవమి తిథి
23. యాదగిరి రథోత్సవం
24. శెల్వపిళ్ళై తిరునక్షత్రం
మేల్కోట తిరునారాయణ పెరుమాళ్ వైరముడిశేవ
25. సర్వేషామేకాదశి
26. కామదహనం
28. శ్రీరంగనాచ్చియార్ తిరు॥, హోళి
29. తిరువరంగత్త ముదనార్ తిరు॥

### ఏప్రిల్ 2002

2. తిథి ద్వయం
3. సప్తమి తిథి
6. దశమి తిథి
7. శూన్యతిథి

### ● ముఖచిత్ర పరిచయం ●

1. సీతానగరం, ఆలోక్ స్టూడియోలో వేద ప్రాజెక్ట్‌ను ప్రారంభిస్తున్న శ్రీవారు.
2, రాజమహేంద్రి, 9వ విశ్వశాంతి విరాట్ శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ కార్యక్రమంలో అనుగ్రహభాషణాన్ని కృపచేస్తున్న శ్రీశ్రీశ్రీ స్వామివారు.
3. 'భగవదారాధనావిధిః' అనే గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న శ్రీవారు.
4. వేలసంఖ్యలో పాల్గొన్న భక్తబృందం.


మీసేవలో :-

**భక్తినివేదన**, సీతానగరం-522 501, గుంటూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 72929

**చందా : సంవత్సర చందా రూ. 50/-, జీవిత చందా రూ. 500/-, విదేశాలకు సంవత్సర చందా $ 25**

***E-mail :*** jetsitanagaram@yahoo.com ***Internet :*** www.chinnajeeyar.org

***DTP & Design by : పరిశోధనాలయమ్ JET - Sitanagaram-522 501***

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం, గుంటూరుజిల్లా.




భక్తినివేదన, మార్చి- 2002

శ్రీమతే రామానుజాయ నమః

# భక్తి నివేదన

## ఆధ్యాత్మిక మాసపత్రిక


సంపుటి 54 సంచిక 12

**2002 మార్చి**

వృష నామ సంవత్సరము ఫాల్గుణ మాసము

సంపాదకులు : శ్రీ ఉ.వే. శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు


Founder:

*HIS HOLINESS* ***SRI SRI SRI***

***TRIDANDI SRIMANNARAYANA RAMANUJA JEEYAR SWAMI VARU***



# భగవద్గీత - 11

(శ్రీవారి ప్రవచనం నుండి, 1వ అధ్యాయము)

మానవజాతి ఉజ్జీవింపబడటానికి కావలసిన ఉపదేశాన్ని అందివ్వడానికి పూర్వరంగాన్ని సిద్ధం చేసుకోదలిచాడు శ్రీకృష్ణుడు. దానికి అనుకూలంగానే  నా ఇంటికి ఎందుకు రాలేదు కృష్ణా! అని అడిగిన దుర్యోధనుడితో "నీవు నా శత్రువువి. అందుకే నీ ఇంటికి నేను రాలేదు" అని సమాధానమిచ్చాడు.  ఇకపైన సంధి ఎలా కుదురుతుంది కనుక?

దుర్యోధనుడికి ఉండే అహంకార ప్రభావంచేత శ్రీకృష్ణుడంతటివాడు తన దగ్గరికి వచ్చి 'దేహీ' అని అడిగితే ఐదు ఊళ్ళే కాదు. ఐదు రాజ్యాలైనా సరే ఇచ్చిఉండేవాడు. పాండవులంతటి గొప్ప వాళ్ళు తన దగ్గరికి వచ్చి ఐదుఊళ్ళు ఇమ్మని అడిగితే, అందులో కృష్ణుడిద్వారా అడిగిస్తే, బ్రహ్మాండంగా ఇచ్చి ఉండే వాడు దుర్యోధనుడు. అసలు పాండవులు అంత క్రిందకు దిగజారి పోయారంటే ఆశ్చర్యం వేస్తుంది మనకి. ఇన్ని రకాలైన దుష్టపనులు చేసే వ్యక్తులు అని తెలిసికూడ దుర్యోధనాదులను సహిస్తున్నారు. మాకు ఐదురాజ్యాలుకావాలి. ఇవ్వడూ. పోనీ! ఐదు చిన్ని చిన్ని గ్రామాలు. ఇవ్వడూ, పోనీ! ఐదు పేటలుండే చిన్నవూరు. ఇవ్వడూ, పోనీ! ఐదు వీధులుండే ఒక పేట. ఇవ్వడూ, పోనీ! ఐదు ఇళ్ళుఉండే ఒకవీధి. అదీ ఇవ్వడూ, పోనీ! ఐదు గదులుండే ఒక ఇల్లు. సొంతం క్రిందకు దిగజారిపోయారు పాండవులు.

సూది మొనమోపినంత కూడ ఇవ్వను పొమ్మన్నాడు దుర్యోధనుడు. కారణం? శ్రీకృష్ణుడు చేసిన పూర్వరంగం. 'నీవు శత్రువువీ అంటూ ప్రారంభించటంచేత చివరికి ఆ మాత్రం కూడ ఇవ్వబుద్ధి కాలేదన్నమాట. అసలు ఇవ్వకూడదు అనేదే శ్రీకృష్ణుడి అభిప్రాయం. ఆ రకంగా సంధిని చెడగొట్టాడు. తాను ద్వారక చేరాక ఇరువురినీ తనదగ్గరికి రప్పించుకున్నాడు, సైన్యం కోసం అని.

కథ మనకందరికీ తెలుసును. శ్రీకృష్ణుడు విశ్రమిస్తూండే సమయంలో దుర్యోధనుడు, అర్జునుడు ఇరువురూ ప్రవేశించారు అక్కడికి. అయితే అర్జునుడు తన స్వరూపానికి తగ్గట్టు, దాసునిగా పాదాల దగ్గర కూర్చు న్నాడు. దుర్యోధనుడు రారాజు ననుకున్నాడు తనను, కనుక, ఆయన తల వైపు కూర్చున్నాడు. సరే! కృష్ణుడికి మెళుకువ వచ్చి, మొట్టమొదట అర్జనుణ్ణి చూశాడు కనుక అర్జునుణ్ణే ఏమికావాలో ముందుగ కోరుకోమన్నాడు. దుర్యోధనా! నిన్ను తరువాత చూశాను కనుక నీవు తరువాత కోరుకుందువుకాని, కానీ కోరుకోవడానికి రెండు భాగాలు పెడుతు న్నాను. నేను ఒక ప్రక్కన, మా సైన్యం 10వేల మంది ఒక ప్రక్కన, అయితే, నేను ఎవరి ప్రక్కన ఉంటానో వాళ్ళ ప్రక్కన నేను సలహాలు ఇస్తాను తప్ప, యుద్ధం చేయను, ఆయుధం పట్టను, మరి రెండవ ప్రక్కన ఉండే 10 వేల మందో! బ్రహ్మాండమైన బలశాలురు, ఆయుధ ధారులుకూడ. ఎవరిని కావాలంటే వారిని కోరుకోవచ్చు" అన్నాడు శ్రీకృష్ణుడు. దుర్యోధనుడికి చెప్పలేనంత దుఃఖం! అర్జనుణ్ణి మొట్టమొదట కోరుకోమన్నాడే కృష్ణుడు, 10 వేల మందినీ ఎక్కడ అర్జునుడు కోరు కుంటాడో అని బెంగ.

ఎందుకని? ఉచిత సలహాలు ఇచ్చేవారు తన దగ్గర కావలసినంత మంది ఉన్నారు. వాళ్ళని పోషించడమే తనకి





బోలెడంత శ్రమ అయితే, మరొకాయన ఎందుకు కనుక? ఉచిత సలహాల కోసం కృష్ణుడు తనకు అక్కరలేదు. తనకు శ్రీకృష్ణుడు మీద కోరికలేదు. 10 వేలమందిని అర్జునుడు కోరుకుంటాడేమో అని దుర్యోధనుని భయం. అర్జునుడు **"కృష్ణా! నువ్వుచాలు"** అని అనగానే దుర్యోధనునికి ఎంత ఆనందమో! సైన్యాన్ని కోరుకొని ఇంటికి తిరిగివచ్చేసాక తానుచేసొచ్చిన ఘనకార్యాన్ని చాటుకొంటూ **"వెఱ్ఱివాడీ అర్జునుడు. 10 వేలమందిని కోరుకోవడం చేతకాక, ఒక్క కృష్ణుణ్ణి కోరుకున్నాడు ఉచిత సలహాలు ఇచ్చేవాడు ఎందుకు కనుక? అందుకేపాపం, పాండవులిలా వెఱ్ఱి వాళ్ళయి అడవులపడి పోయారు"** అని ఆనందంతో పొంగిపోతూ చెప్పాడు దుర్యోధనుడు తన తాతగారైన భీష్మ పితామహునికి.

గతంలో పాండవులకి కూడ రాజ్యం కావాలనో, ఆనందం ఆటలూ కావాలనో, ఏ జూదాలాడాలనో కోరిక ఉండేది. ఆ కోరిక తీరి, ఆ మనస్సుమారి ఈ వేళ, 'కృష్ణా! నువ్వు చాలు, అనే స్థితికి వచ్చారు. **"నేనేం యుద్ధం చేయనయ్యా!"**అన్నా **"ఫర్వాలేదు కృష్ణా! నువ్వు చాలు."** అన్నాడు అర్జునుడు. "కేవలం ఉచిత సలహాలు మాత్రం ఇస్తానయ్యా! **"చాలు కృష్ణా! నువ్వుంటేచాలు"**.

నువ్వు మాకు ఏ భౌతికమైన సుఖాన్ని ఇచ్చినా ఇవ్వకున్నాసరే, ఏ లౌకిక లాభాన్ని కలిగించినా కలిగించకున్నాసరే. **"భగవన్! నువ్వు ఒక్కడివి ఉంటే చాలు మాకు"** ఇలా ఎవడు అనుకోగలుగుతాడో వాడికి రెండు రకాల లాభాలు. 1) భౌతికమైన లాభాలన్ని కలుగుతాయి. 2)కావలసిన ఆత్యంతిక శ్రేయస్సుకూడ లభిస్తుందన్న మాట. ఈ రహస్యం తెలియదు మనకి. ఇది కోరకపోతే ఇది మనకు కలగదేమో అని మనం కోరదలుస్తాం. ఎక్కడిదాక కోరుతామో? అక్కడికే మనకొకహద్దు ఏర్పడిపోయి ఉంటుంది. అదైనా యోగ్యత ఉంటేనే  లభించవచ్చు. లేనిచో అదికూడ మనకి లభించకపోవచ్చు.

అర్జునుడికి ఇన్నాళ్ళకి ఆ యోగ్యత కలిగింది. తెలిసో తెలియకో 'కృష్ణా! మాకు నువ్వు ఒక్కడివి ఉంటేచాలు. మరింక ఏమీ అవసరంలేదు' అని అనగలిగాడు అర్జునుడు.

భగవంతునికి చాలా ఆనందం కలిగింది. ఎంత ఆనందం కలిగిందో తెలసునా? ఏం చెబితే అది చేసేట్టుగా భగవంతుడు సిద్ధపడ్డాడు. లేకపోతే, సర్వలోక నియంత అయిన, సర్వశక్తి కలిగిన తానెక్కడ, అత్యంత అల్పుడైన అర్జునుడెక్కడ! అట్లాంటి అర్జునుని దగ్గర తను సారథ్యం చేయడానికి సిద్ధపడ్డాడు.

మనం కనుక భగవంతుని దగ్గర కొంచెం శిరస్సు వంచగల్గితే, ఆయన సర్వాత్మనా మనకు దాసుడైపోయి మనం ఏం చెబితే అది చేస్తాడు అని అంటుంది వేదం. అది నిరూపించుకున్నాడు శ్రీకృష్ణుడు.

గతంలో ఎప్పుడో ఒకనాడు, ఒక విప్రుడు సంతానం కోల్పోతుంటే రక్షించడం కోసం రథంలో తీసు కువెళ్ళాడు అర్జునుణ్ణి, శ్రీకృష్ణుడు. ఆ వేళ శ్రీకృష్ణుని సారథ్యం యొక్క సామర్థ్యాన్ని చూశాడు. నాకు మంచి సారధికావాలి కనుక **"కృష్ణా! నాకు యుద్ధంలో సారథ్యం చేసిపెట్టు. అంతే ఇంకేమీ అక్కర లేదు"** అని అర్జునుడు ప్రార్థన చేసాడు. అతడి ప్రార్థనను అంగీక రించాడు శ్రీకృష్ణుడు.

ఎదురు చూచిన, యుద్ధం ఆరంభమైంది కనుక 10 వేలమందిని కౌరవులకిచ్చి తాను పాండవుల పక్షానచేరి అర్జున రథసారథిగా, యుద్ధరంగాన్ని అంతటిని కూడ సవరించే బాధ్యతని తనే చేపట్టాడు. ఆ యుద్ధరంగంలో అర్జునుడు విజయం సాధించడం కోసమని ఉపదేశంచేశాడు, ఆ యుద్ధరంగంలోనేకాదు. నిత్యజీవన సమరాంగణంలో విజయం సాధించ దలచిన మనలాంటి వారందరికి కూడ **'బాగుపడటం కోసం ఇదే అవసరం'** అన్నట్లు ఒక మహోపదేశాన్ని భగవద్గీతగా స్వామి ఉపదేశం చేసాడు. తత్సారాన్ని కొద్దికొద్దిగా తెలుసుకుందాము.

సంపాదకీయం

# నీచుల అధికారం

ఆదాన ప్రదానాలతో అన్యోన్య సహకారంతో ముడివడి ఉంటుంది సమాజం ఉనికి, మనుగడాను. నేలమీద నిమ్నోన్నతాలున్నట్లే సమాజంలో హెచ్చు తగ్గులూ ఉంటాయి. ఎత్తులనున్నవారు కిందివారికి చేయూతనివ్వాలి. రాసులు పోసుకున్నవారు కూటికి కరవైనవారిని కనికరించాలి. ఉపకృతి పొందినవారు తమనాదుకొన్నవారికి బానిసలు కానక్క రలేదు కాని కృతజ్ఞులు కావాలి.

అందరికీ అన్ని వేళలా అవకాశాలు రావు. నీకివ్వాలని మనసు ఉన్నా ఇచ్చేందుకు నీ చేత కాసు లేనప్పుడు ఏమిస్తావు? నీ ఇంట ధనరాసులు మూలుగుతున్నా నీలో ఈవి (ఇచ్చేగుణం) లేకపోతే పిల్లికి బిచ్చం పెట్టవు. ఎంగిలిచేత కాకిని విదల్చవు.

పోనీండి, లేనప్పుడు లేదు. దానిమాట ఇప్పుడెందుకు? ఈవేళ ఏదో కలిసి వచ్చింది. ఐశ్వర్యమో అధికారమో తోసుకు వచ్చినై. ఇప్పుడైనా పదిమందికీ ఉపకరించవచ్చు కదా! అనుకుంటాం, కాస్త ఏదో కలిసివచ్చినప్పుడు.

నిజమే, మంచిదే. అధికారమంటే వచ్చింది. ఐశ్వర్యమంటే చేరింది. కాని, వీడు తిన్ననివాడు కావద్దు ! వీడు తులువ. ఎన్ని వస్తే ఏం లాభం? వీడి స్వభావం అంటూ ఒకటుందిగా ! ఎన్ని వచ్చినా అది మారదు.

మారకపోవడమే కాదు. అంతకు ముందు వాడు వట్టి తులువ. కాని, ఏమీ చేయలేని అసమర్థుడు. ఇప్పుడట్లా కాదు. అధికారముంది, ఐశ్వర్యముంది. ఏమన్నా చేయగలడు. ఏం చేస్తాడు ? ఏం చేస్తాడో చెప్తున్నాడు నీతికారుడు.

**లబ్ధోదయః ఖలజనః**
**ప్రథమం స్వజనే కరోతి సంతాపం**
**ఉద్గచ్ఛన్నవ దహనో**
**జన్మభువం దారు నిర్దహతి**

ఐశ్వర్యం, అధికారం వచ్చిన తులువ ముందు తనవారిపై చూపిస్తాడు తన ప్రతాపాన్ని. కార్చిచ్చు తాను పుట్టిన కఱ్ఱనే ముందు కాల్చేస్తుంది.

ఐశ్వర్యం రావడం మంచిదే. అధికారం రావడమూ మంచిదే. రెండూ కోరదగినవే. కాని, ఆ రెండింటి మంచితనం అవి ఉంటున్న చోటును పట్టి ఉంటుంది. ఉపకరణం సమృద్ధం అయినంతమాత్రాన మంచే జరగాలని లేదు. దాన్ని ఉపయోగించేవారి మనస్తత్వాన్ని పట్టి దాని ఫలితాలుంటాయి.

సాధారణంగా ఐశ్వర్యం, అధికారం మనిషిలో అహంకారాన్ని పెంచే వీలున్నది. అవి కలవాడు సాధుస్వభావుడు, మంచి సంస్కారం కలవాడు, యుక్తాయుక్త వివేకం కలవాడు అయితే ఫరవాలేదు. అధికారం దుర్వినియోగం కాదు. ఐశ్వర్యం బుసలు కొట్టదు.

కాని అధికారులంతా సజ్జనులు





కావాలని లేదే! అలాగే, ఐశ్వర్యం సజ్జనుల కడనే ఉండాలనీ లేదు. కొందరు ఆగర్భ శ్రీమంతులుంటారు. ఆ ఐశ్వర్యాన్ని పట్టి అంతో ఇంతో అధికారమూ వారికి వశపడుతుంది. పుట్టిన, పెరిగిన పరిసరాలు మంచివైతే, వారి జన్మ సంస్కారం కూడా యోగ్యమైతే వారివల్ల పలువురకు ఉపకారం జరిగే వీలుండవచ్చు.

ఆగర్భ శ్రీమంతులైనంతమాత్రాన యోగ్యులు కావాలని లేదు. అందుకే చదువు, సంస్కారం దోషాలను పరిష్కరించి మనిషిని చక్కగా తీర్చిదిద్దితే, అధికారం, ఐశ్వర్యం తప్పక సదుపయోగపడతాయి. కాని, ఈ స్థితి అంతటా ఉండవద్దూ!

సహజంగా ఖలుడు వాడు. చదువూ పరిసరాలు వాడి ఖలబుద్ధి మరికాస్త పెరిగేందుకే తోడ్పడతాయి కాని, సుజనుడుగా వాడిని తీర్పలేవు. వాని జన్మ సంస్కారం అంత గట్టిది. కాని, ఏదో అదృష్ట విశేషం కూడా వాడికుంది. చటుక్కున ఐశ్వర్యం కలిసొచ్చింది. అధికారమూ చేకూరింది. ఇక చెప్పతరమా !

వాడి ఖలత్వమే ఎప్పుడూ ఎవరినో బాధించాలని చూస్తుంది. దానికి అధికారం, ఐశ్వర్యం తోడయ్యాయి. వాటిసాయంతో ఇంకా ఎక్కువ బాధించవచ్చు. తృప్తి తీరా ఇక్కట్టులు కలిగింపవచ్చు. అట్లా చేసి తన ఐశ్వర్యం, తన అధికారం ఏమిటీ, జన్మమే చరితార్థము అయిందనుకోవచ్చు.

వీడు ఖలుడు కదా! ఒరులమీద కంటె తనవారిమీద, ఎదిరించినవారి మీద కంటె లొంగినవారి మీదా పెత్తనం చెలాయించాలని చూస్తాడు. ఎవ్వరో ముక్కు మొగం ఎరగనివారికంటె చిరకాలంగా తనతోనే ఉంటూ తనకు పరిచితులైనవారు, సన్నిహితులైనవారు బాధపడుతూంటే చూడటం వీడికి సంతోషం. ఇది వాడి చిరకాల వాంఛ ఏమో కూడా ! ఎన్నాళ్ళనుంచో వాళ్ళని చూస్తూ, చూస్తున్నప్పుడల్లా వీళ్ళని ఎప్పుడు పీడిద్దామా, అలా పీడిస్తూంటే వాళ్ళు నలిగిపోతూంటే ఎంత ముచ్చటగా ఉంటుందో అనుకుంటూ మురిసిపోయేవాడేమో కూడాను.

అంచేత అధికారం రాగానే, ఐశ్వర్యం రాగానే ఖలుడు ముందు ప్రతాపం చూపేది తనవారిమీదనే. పై వాళ్ళైతే ఏదైనా ప్రతిక్రియ చేయవచ్చు. మళ్ళీ అదో తలనొప్పి. అదే తనవాళ్ళైతే ఓకలేక దగ్గలేక ఓర్చుకొని ఊరకుంటారు. అలా కానీ వాడి అహంకారం తృప్తిపడదు, ఖలత్వం తనివినొందదు.

మనవాడి కుద్యోగం వస్తే మన ఇల్లు గుఱ్ఱాలసాలే, అని మనకో నానుడి ఉంది. మిగిలిన ఐశ్వర్యం మాట ఏమో గాని, ఐశ్వర్య చిహ్నాలైన గుఱ్ఱాలు వాకిట చోటు చాలక ఇంటనే తిరుగాడుతాయి. అక్కడే లద్దెలు వేస్తాయి. ఇల్లంతా లద్దెల దొడ్డి. ఇదీ మనవాడి ఐశ్వర్య ఫలం, మనకు అబ్బింది.

కార్చిచ్చు కట్టెలలో పుడుతుంది. ఆ చిచ్చు ముందు కాల్చేది తాను పుట్టిన కఱ్ఱనే, తరవాత అడవులన్నీ చుట్టుముట్టవచ్చు. కాని, ప్రథమ ప్రతాపం జన్మస్థానం పైనే. అట్లాగే నీచుడి అధికార ప్రతాపం, ఐశ్వర్య ప్రతాపమూ కూడా ముందు తనవారిపైనే పడతాయి.

-శ్రీ రామచంద్రాచార్య

# గీతాజ్యోతి

**ప్రియ భగవద్బంధువులారా!**

జ్యోతి - అంధకారాన్ని పారద్రోలేది - అది బాహ్యమైనది కావచ్చు, అంతరమైనది కావచ్చు! బాహ్యాంధకారాన్ని తొలగించడానికి సాధనాలెన్నో ఉన్నాయి. లోపలి చీకట్లను తొలగించడం జ్ఞానం వల్లనే సాధ్యం! రెండూ తొలిగితే మనం జీవితాన్ని సుఖమయం చేసుకోవచ్చు!

చీకట్లు తొలగితే ఉన్న వస్తువులు మనకు కనిపిస్తాయి! వాటిని తగినట్లుగా వాడుకోవడానికి, ఆనందాన్ని అనుభవించడానికి పనికివస్తుంది! చీకట్లను తొలగించుకోవడానికి ఎన్నో సాధనాలు కనిపెడుతున్నాం! ఎన్నో సుఖాలు ఇస్తాయని వస్తువులను కనిపెడుతున్నాం! అలా చేసుకోవడం వల్ల అల్పశ్రమతో జీవితంలో అధికసుఖం లభిస్తుంది!

స్వల్ప సమయంలోనే క్లిష్టమైన పనులను చేసుకోగలుగుతున్నాం! దాని వల్ల జీవితంలో వేగం పెరిగింది. ఇది బాహ్య ప్రగతికి సూచన మాత్రమే! దీనితోపాటు మనిషిలో అసంతృప్తి, అసహనం, ఎప్పుడు చూసినా ఒత్తిడులు, ఉద్రిక్తతలు పెరుగుతున్నాయి.

మంచి శాతం కొంతయితే, చెడు శాతం దానికి పదింతలౌతుంది. దీనిని సరైన మార్గంలో నడిపించడానికి లోపల కాంతి అవసరం! అది మనోబలంవల్ల ఏర్పడాలి! బలం ఆత్మవిశ్వాసాన్నిబట్టి ఏర్పడు తుంది! అది సామాన్యుల నుండి లభించే భద్రతకంటే, తాత్కాలికమైన భద్రతలకంటే, - అది మారే వ్యక్తులనుబట్టి క్షణానికో రకంగా మారే భద్రతకంటే - శాశ్వతమైనదీ, నిత్య మైనదీ - స్వయంగా భగవానుడు అందించే భద్రత అయితేనే అది ఉపయోగం! ప్రయో జనకరం!

అలాంటి భద్రత-జ్ఞాన దీపాన్ని వెలిగించి, మనోనిగ్రహాన్ని పెంచి వస్తు స్వభావాలను, జీవన విలువలను తెలిపి సహనాన్ని పెంచుతుంది. హృదయాన్ని మెత్తబరుస్తుంది. తోటి వారికి ధీటుగా వ్యక్తిని వికసింపచేస్తుంది! పరస్పర అవగాహనతో జీవితాన్ని ప్రేమమయం చేస్తుంది. ఆత్మోన్నతిని, పరసహనాన్ని పెంపొందిస్తుంది.

జ్ఞాన సాధనాలుగా, మనోబలాన్ని పెంచేదిగా భగవంతుడే చేసిన ఉపదేశాలు ఎన్నో ఉన్నాయని శాస్త్రాలు చెబుతున్నాయి. అవన్నీ సమగ్రంగా ఒకచోట లభించడంలేదు. జీవితపు అంచులన్నింటినీ స్పృశించడంలేదు కూడా!

భగవదవతారాలలో కృష్ణావతారం పరిపూర్ణం! శ్రీకృష్ణుడు చేసిన ఉపదేశం పరిపూర్ణం! దానికే **'భగవద్గీత'** అని పేరు! అన్ని మతాలు, అన్ని జాతులు ఆచరించదగిన జీవన విధానం సులభంగా ఇందులో అందుతుందని, అన్ని దేశాలవారు దీనిని కీర్తిస్తారు! ఏ స్థాయివారికైనా ఉన్న స్థానంలోంచి ఉన్నత లక్ష్యాలను సాధించడానికి సులభసాధనాలను అందించడంలో భగవద్గీతకు ఉండే స్థానం తిరుగులేనిది! ఈ భగవద్గీతను తోడు చేసుకునే రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్య





శృంఖలాలనుండి భారత దేశానికి స్వాతంత్ర్యాన్ని సంపాదించి గాంధీజీ మహాత్ముడయ్యాడు!

విశ్వసించిన వాళ్ళను విశ్వానికే నేతలుగా తీర్చిదిద్దగలిగే విజయగీతిక **'భగవద్గీత'**! నాటి అర్జునుడినుండి నేటి గాంధీ మహాత్ముని దాకా యుగయుగాలుగా నిరూపితమైన వాస్తవం ఇది!

రూపాయికి ఒక వైపు ముఖం, మరొకవైపు మూల్యము ఉంటుంది! ముఖాలు మారవచ్చు, మూల్యం మారదు! మూల్యాలు మారనంతవరకూ ఎన్నిముఖాలు మారినా అది రూపాయి బిళ్ళకు అందాన్ని ఇస్తుంది. మూల్యం మారితే ఆ విలువ కోల్పోతుంది. మానవ జీవితానికి ప్రాపంచిక ప్రగతి, మార్పులు చెందే రూపాయి బిళ్ళపై ముఖం లాంటిది! దాని విలువను రక్షించాల్సింది, మానవ జీవన మూల్యాన్ని పెంచేదీ, శాశ్వతమైన జ్ఞానాన్ని సద్వినియోగ పరిచేదీ భగవానుడి ఉప దేశమైన **'భగవద్గీతే!'**

రెండు వైపులా కలసినప్పుడే ఒక రూపాయి విలువ చెల్లుబడైనట్లే గీతాజ్ఞానంతో పెనవేసుకొన్న బాహ్య ప్రగతికల జీవితమే అపేక్షితమూ, ఆదర్శమూ! జాతులు, మతాలు, కులాలు, అంతస్తులు, హోదాలు వేరైనా మనమంతా భగవంతుని సంతానం! మనం కలసి జీవించాలి! ప్రగతిని కలసి సాధించాలి!

బాహ్య ఆడంబరాలకోసం పరస్పరం కలహించుకోవడం, ఆక్రమించడం, అంతరాలను పెంచుకోవడం తగ్గాలని, క్రాంతి పథంలో సాగాలని కాంక్షిస్తూ **వికాస తరంగిణి అందిస్తున్న మనందరి కార్యక్రమం - "గీతా జ్యోతి"!**

700 శ్లోకాలున్న భగవద్గీతలో ప్రతి శ్లోకమూ అమృతోపమమే! స్ఫూర్తి దాయకమే! ఏ ఒక్కశ్లోకాన్ని గ్రహించినా, ఆచరణలోనికి తెచ్చుకొన్నా జీవితంలో అద్భుత విజయాలను సాధించవచ్చు! అయితే సాధన అనేది ఒక్క గంటలోనో, రోజులోనో క్షణికోద్రేకంతో కాకుండా, కొంతకాలం సాగినప్పుడే మధుర ఫలాలను ఇస్తుంది!

అందుకే - అలా కొన్నిదినాలు అభ్యసించడానికి, 'చేయగల'మనే ఆత్మ విశ్వాసం మనలో ఏర్పడాలి! గతంలో **'కృష్ణం వందే జగద్గురుమ్'** ద్వారా ''సత్కార్యానికి సమాజంలో అన్ని వర్గాలు సహకరిస్తాయి'' అనేది నిరూపితమైంది. **'గీతామృత దీక్ష'** ద్వారా సాధనం కాస్త సులభమైతే అది ఎన్ని దినాలైనా సాధించగలమనే ఆత్మవిశ్వాసం పెరిగింది. ఇప్పుడు ఆత్మవిశ్వాసాన్ని సమాజంలో అందరితో కలసి పంచుకొంటూ, పెంచు కోవడమే **'గీతాజ్యోతి'**లోని ప్రధానాంశం!

ఇది వరలో మన కార్యక్రమాలకు దూరంగా ఉండిపోయిన వారికి కూడా ఈ ఆత్మవిశ్వాసాన్ని, ఆనందాన్ని అందించాలనేది 'గీతాజ్యోతి'లోని ప్రధానాశయం! ఏడాది కాలమైనా దీనిని కొనసాగించాలనేది అందరి ఆకాంక్ష! దీనిని అవిచ్ఛిన్నంగా సాగించాలనేది అందరియొక్కఆరాటం!

ఈ ఉగాదినుండి పై ఉగాదిదాకా రాష్ట్రవ్యాప్తంగా సాగించే **'గీతాజ్యోతి'** **''చిత్రభాను'**. నామ సంవత్సరాన్ని సార్థక నామధేయం కలదిగా మార్చాలి! రండి! ఈ కార్యక్రమం యొక్క రూపురేఖ లేమిటో, దీన్ని ఎలా మనం నిజంచేయగలమో తెలుసుకుందాం!

1. అందరికీ అర్థమయ్యే - ఆచరణాత్మక

శ్లోకాలు అర్థంతోపాటు నెలకో నాలుగు నేర్చుకొందాం. శ్లోకం చదువుతూ ఒక బియ్యపు గింజనేరి ప్రక్కన పెట్టండి!

2. భగవద్గీతలోని 18 అధ్యాయాలకు ప్రతీకగా మీ ప్రాంతంలో 18 మందితో ఒక టీమ్‌ను ఏర్పాటు చేయండి! అందరూ కలసి ఈ శ్లోకాలను సమష్టిగా నేర్వండి! అందులో మనం ఆచరించ దగినవి అభ్యసించండి!
3. మీ ప్రాంతంలో వీలైనంత మందితో కలసి ఇంటింటికీ వెళ్ళి, ఈ శ్లోకాలను అందించండి! ఈ శ్లోకాలు ఎలా ఆచరణ యోగ్యాలో వారి సలహాలను అడగండి!
4. మీకో రెండు "అభ్యాసపట్టికలు" ఇస్తాం! దాంట్లో మీరు సాధించు ప్రగతిని నమోదు చేయండి!
5. ఏడాదిలో నెలకు నాలుగు చొప్పున మొత్తం 48 శ్లోకాల విజ్ఞానగని మీ సొంతం కాబోతోంది! ఈ శ్లోకాలను చిన్న పుస్తకంగా మీకు అందిస్తున్నాం! ఇంటింటా మనం ఈ పుస్తకాలు, 'అభ్యాస పట్టిక'లు అందచేద్దాం!
6. అవసరం అనుకొన్న వాళ్ళకు ఈ 48 శ్లోకాలను, క్యాసెట్ల రూపంలో అందిస్తాం! చదివి నేర్చుకోలేనివారు ఈ క్యాసెట్‌ను విని నేర్చుకోవచ్చు.
7. మన ఊరిలో గోష్ఠిగా ఏర్పడ్డ సభ్యులందరం వారానికి ఒకరింట్లో లేక మందిరంలో కలుద్దాం. 48 శ్లోకాలను పారాయణం చేయడం, కృష్ణాష్టకం చదవడం, కృష్ణపూజ చేయడం, కాసేపు "కృష్ణం వందే జగద్గురుమ్" భజనలు చేయడం - వారానికి ఒక శ్లోకాన్ని వివరించుకోవడం - ఇవి మన గోష్ఠిలో ప్రధాన కర్తవ్యాంశాలు.
8. విద్యార్థులకు ప్రత్యేకత - మన ప్రాంతాల్లో ఉండే చిన్న,పెద్ద విద్యాలయా లన్నింటినీ సందర్శించాలి! వారికి ఈ శ్లోకాలను, 'గీతాజ్యోతి' కార్యక్రమాన్ని పరిచయం చేయాలి! ఈ 48 శ్లోకాలను కంఠస్థపరిచే ప్రోత్సాహం చేయాలి! విద్యార్థులకు ఈ పుస్తకాలు, కృష్ణాష్టకం కార్డులు ఇచ్చి వారికి పోటీలను నిర్వహించాలి! చిత్రలేఖనానికి కూడా విద్యార్థులను ప్రోత్సహించాలి! శ్లోకాలను మరొక పుస్తకంగా ఇస్తాం! అవికూడా విద్యార్థులకు అందించి చిత్రలేఖన పోటీలకు వారిని ఆహ్వానించాలి! ఈ పోటీలన్నింటికీ కనీసం నెలరోజుల సమయం వారికివ్వాలి! 10 ఏళ్ళలోపు పిల్లలకు శ్లోకపఠనం, 15 ఏళ్ళలోపు వారికి శ్లోకము, సందేశము విడమరచి చెప్పడం, 15 దాటిన వారికి ఆ శ్లోకాల మీద ఐదునిమిషాలకు మించకుండా వక్తృత్వపు పోటీలను నిర్వహించడం, వ్యాసరచన పోటీలు నిర్వహించడం చేయాలి.
9. విద్యార్థులకు - చిన్నవయస్సువారికి, యువకులకు వీలైనన్ని ఆరోగ్య అవగాహన శిబిరాలను నిర్వహించాలి. అందులో భాగంగా దంత సంరక్షణ శిబిరాలు, దృష్టి పరీక్షా శిబిరాలు, పోషకాహార అవగాహన శిబిరాలు నిర్వహించాలి!
10. మహిళలకు ప్రత్యేకంగా వీలైనన్ని ఆరోగ్యావగాహనా శిబిరాలను నిర్వహించాలి!
11. వీలైనన్ని పశు ఆరోగ్య అవగాహనా శిబిరాలను నిర్వహించాలి!





12. మన ప్రాంతాల్లో ఉండే మందిరాల భజన, కోలాట బృందాల స్థితిగతులను గమనించడం కూడా మన కార్యక్రమంలో ఒక భాగం.
13. పూరిగుడిసె నుండి పెద్ద మేడదాక ప్రతి ఇంటా గీతా గ్రంథం, కృష్ణుని చిత్రం ఉండేట్లు ప్రయత్నించడం మన కర్తవ్యం!
14. "గీతాజ్యోతి" ఆచరించేవారందరూ ఏడాది పొడుగునా తమ ఇండ్లపై "హనుమధ్వజాలు" ఎగరవేసుకొంటారు!
15. "గీతాగోష్ఠి" కలిగిన 108 గ్రామాలను ఒక "ధర్మక్షేత్రం"గా నిర్ణయిస్తాం! కనీసం 108 "ధర్మక్షేత్రాలు" రాష్ట్రమంతటా ఏర్పడతాయి! "గీతాజ్యోతి" ని నిర్వహిస్తాయి!
16. ఒక ధర్మక్షేత్రంలోని 108 గ్రామాల్లో జరిగే కార్యక్రమాల వివరాలను తెలుసుకొని, బాగా సమర్థవంతంగా జరిగే ప్రతి క్షేత్రంలోని, ఒకప్రాంతానికి మేం స్వయంగా వస్తాం!
17. ఆ సందర్భంగా ఆ 108 గ్రామాలలోని గీతాగోష్ఠి సభ్యులు, భజన, కోలాట బృందాలు, ఇతర భక్తులు అందరూ అక్కడికి వస్తారు! అలా వచ్చేటప్పుడు తమతో స్వయంగా చేసిన నేతితో తడిపిన వత్తులను తీసుకొనివస్తారు. అందరమూ కలసి 48 శ్లోకాలు పారాయణం చేసి **"కృష్ణపూజ"** చేద్దాం. అనంతరం మనం తెచ్చిన నేతి దీపాలను వెలిగించి ఆ "ఘృతదీపాల" సాక్షిగా మనని, మన కుటుంబాన్ని, మన జిల్లాలను, మన రాష్ట్రాన్ని సస్యశ్యామలంగా ఉంచడంతోపాటు, సుఖసంతోషాల నిమ్మని, ఉద్రేకాలను తొలగించి, ఉత్తమ ప్రేమను ప్రసాదించమని, ఆత్మవిశ్వాసం, దేశ ప్రగతికై అచంచల సేవాభాగ్యం ప్రసాదించమని జగత్ప్రభువైన "దేవదేవుని" ప్రార్థన చేస్తాం.
18. ఈ విధంగా 108 "ధర్మక్షేత్రాలు" పూర్తయ్యాక, చివరగా 108 ధర్మక్షేత్రాల భగవద్బంధువులమందరమూ "తిరుమల"లో కలుస్తాం. కలియుగ నాయకుడు, ఆర్తజనరక్షకుడు, పాపరాశులను పారద్రోలే పరమపావనుడు అయిన శ్రీ వెంకటేశ్వరుని పదసన్నిధికి ఒక నేతి ఒత్తిని తీసుకొస్తాం. మన ధర్మక్షేత్రాల్లో చేసినట్లే 48 శ్లోకాల పారాయణ, కృష్ణపూజ, నామ సంకీర్తనలను చేసి **"గీతాజ్యోతుల"**ను వెలిగిస్తాము.

మన అభివృద్ధికి,దేశ క్షేమానికి, లోకశాంతికి పనికివచ్చే పరికరంగా మనకు శక్తి నిమ్మనమని, తన సంతానమైన మనందరిని సామరస్యంతో ముందుకు నడిపించమని శ్రీవేంకటేశ్వరుని ప్రార్థన చేద్దాం.

ఈ విధంగా ఈ సంవత్సరానికి ఉన్న **"చిత్రభాను"** అనే నామాన్ని సార్థకమైనదిగా తీర్చిదిద్దుదాం. ఇది అందరికీ ! ఇది అందరిదీ! అందుకొని ఆచరిద్దాం! రండి! అందరికీ అందిద్దాం! కదలండి! మీ సమీప "వికాస తరంగిణి" మీకు మరిన్ని వివరాలను అందించడానికి సిద్ధంగా ఉంటుంది. వారి సేవలను వినియోగించుకోండి.

జై శ్రీమన్నారాయణ!



# గీతాజ్యోతి - మన కర్తవ్యం

వ్యక్తులలో అంతర్లీనంగా ఉన్న చైతన్య శక్తులను జాగృతం చేసి కర్మాచరణకు స్ఫూర్తినిచ్చేవాడు - గురువు! వారిలోని చొఱవను, సృజనాత్మకతను వ్యక్తపరచడానికి తగిన మార్గం చూపేవాడు గురువు! దిక్కుతోచక, దిగులుతో బాధపడు తున్నప్పుడు ధైర్యం చెప్పి ముందుకు నడిపించేవాడు - గురువు! తమలోని దివ్యత్వాన్ని దర్శించి, ఆచరణలో ధార్మికతగా దానిని అమలు పరచగల ధీమంతులుగా వ్యక్తులను తీర్చిదిద్దే దార్శనికుడు - గురువు!

ఐదువేల ఏళ్ళక్రితం భగవానుడు శ్రీకృష్ణునిగా అవతరించి పాండవులకు అలాంటి గురువయ్యాడు! ధర్మానికి, విధేయతకు, నిజాయితీకి, శౌర్యానికి, సౌశీల్యానికి, త్యాగానికి ప్రతీకలు పాండవులు.

అధర్మం, దురహంకారం, కపటత్వం, వంచన, దురాశ, లోభం, అజ్ఞానం - వీటన్నింటికీ సజీవ ప్రతినిధులు కౌరవులు. నాటి నాగరిక ప్రపంచానికి రారాజులెవ్వరో తేల్చుకొనే విషమ పరిస్థితి వీరిరువురి మధ్యా ఏర్పడింది.

అయితే ఈ సంఘర్షణ- దుర్యోధనునికీ-ధర్మరాజుకీ మధ్య కాదు. ఆసురీ శక్తులకు - దైవీ శక్తులకు మధ్య మానవ జాతిపై ఎవరి ఆధిపత్యం ఉండాలో తేల్చుకునేందుకు రెండు శక్తులూ కౌరవ, పాండవులను తమ ప్రతినిధులుగా ఎంపిక చేసుకొని నిర్ణయాత్మక యుద్ధానికి సిద్ధమయ్యాయి. దైవీ శక్తికి విజయాన్ని సంప్రాప్తింప చేయడానికై తాను విజయు సారధిగా నిలిచాడు భగవానుడు. నిశ్చయా త్మక బుద్ధితో, క్రియా శీలుడై తన కర్తవ్యాన్ని నిర్వహించాల్సిన అర్జునునికి కార్పణ్యదోషమావరించింది. ఆందోళనతో తన బాధ్యత పట్ల ఉపేక్ష వహించాడు.

ఈ ఉదాసీనత మన్నించ రానిదన్నాడు భగవానుడు. సాత్వికుడనన్న భ్రమలోపడి, తామసిక ప్రవృత్తికిలోనై తన చుట్టూ ఉన్న సమాజాన్ని అజ్ఞానుల, మిడిమిడి జ్ఞానుల ఆధిపత్యానికి వదిలేసి, ఒంటరి బ్రతుకు బ్రతకాలనుకొనే కుహనాపండితుని మించిన పరమపాపి మరొకడుండబోడని మందలించాడు స్వామి.

ఉత్తమ జ్ఞానం ఏ కొద్దిమందికో పరిమితమై, జన బాహుళ్యం అజ్ఞానాంధకారంలో మునిగిపోయినప్పుడు నాగరికత మటు మాయమై ఆటవికత రాజ్యవేలుతుంది. భౌతిక బలసంపదలపై ఆధిపత్యం వహించి, స్వీయ భోగానికి జగత్తును విహార స్థలంగా మార్చుకొనే ఆసురీ శక్తుల విజృంభణకు అపుడు అడ్డు ఉండదు. శక్తి ఉండి కూడా, ఆత్మన్యూనతకు లోనై దీనిని అనుమతించడానికి మించిన దోషం మరొకటి ఉండదు.

కనుక అర్జునా! నీ ఉదాసీనత్వం ఎన్నో విపత్కర, విషాదకరపరిణామాలకు దారి తీస్తుంది. స్తబ్ధతను వదలి పురోగమించు. సమస్త భయాలను విడచి, నాపై విశ్వాస ముంచి, నీ కర్తవ్యాన్ని నిర్వహించు. అంటూ అర్జునుని కర్తవ్యోన్ముఖుడిని చేసాడు భగవానుడు. పర్యవసానంగా నాటి నాగరిక ప్రపంచానికి పాండవులే అధిపతులయ్యారు. వారికి





గురువైన శ్రీకృష్ణభగవానుడు జగత్తుకే గురువయ్యాడు.

ఆ మహానుభావుడు అర్జునుని సాకుగా చేసుకొని అందించిన గీతాజ్ఞాన సంపద మన జాతి సంపద. మానవ జాతి సంపద. ఆ సంపదకు తొలివారసులమై యుండికూడా మనం భగవంతుడి వాక్కులను, హితబోధను విస్మరించాం. ఆయన అడుగుజాడలను అనుసరిం చడంలో మన్నింపరాని నిర్లక్ష్యాన్ని ప్రదర్శించాము. తత్ఫలితాన్నీ అనుభవించాము. వేల సంవత్సరాలు పరాయి పాలనలో గ్రుమ్గి దుర్భర బానిసత్వాన్ని అనుభవించాము.

భగవద్గీతను చేతబూని, జాతిగుండెల్లో ఆత్మ - విశ్వాసాన్ని నింపి స్వాతంత్ర్యోద్యమాన్ని విజయవంతంగా నిర్వహించాడు మహాత్ముడు. గీతను జాతికి జీవన నాదంగా మార్చాడు. కాలం గడిచింది. మహాత్ముని, గీతను మరచిన జాతి లభించిన స్వేచ్ఛను నిదురపోవడానికి ఉపయోగించుకొంది. విలువలకు తిలోదకాలిచ్చి, అన్నిరంగాలలోనూ పతనమౌతూ పైకి వెళుతున్నామనుకొనే తరం తయారైంది.

నీతికీ, అవినీతికీ మధ్య అడ్డు తెరతొలగిపోయింది. 'దేశం ఎటుపోతే నాకేం? నేను బాగుంటే చాల'నుకొనే ఆత్మాశ్రయ వాదం (స్వలాభవాదం) తలకెక్కింది. ఎటుచూచినా 'నాకేం లాభం' 'నాకెంత లాభం?' అంటూ లెక్కలు కట్టేవాళ్ళే ఎక్కువయ్యారు. జాతిని చైతన్యవంతం చేయాల్సిన ఆధ్యాత్మిక రంగంలో కూడా ఇదే తిరోగమన స్థితి దాపురించింది.

భక్తిశ్రద్ధలకు నిలయాలు కావాల్సిన దేవాలయాలు లాభసాటి వ్యాపారకేంద్రాలయ్యాయి. భగవంతుని సందేశాన్ని విని బాగుపడ్డవారికంటే, ఆయన సందేశాన్ని ప్రచురించి, ఉపన్యసించి పేరు ప్రతిష్ఠలను, పరివారాన్ని, సంపదను పెంచుకొని బాగుపడ్డ వారే ఎక్కువయ్యారు. మన పూర్వీకులనుండి పరంపరగా వస్తున్న మహత్తర ఆధ్యాత్మిక వారసత్వ సంపదను జాతి హితం కోసం అట్టడుగు వర్గాలకు అందించాల్సిన ఆధ్యాత్మిక నేతలు కరువయ్యారు.

సందుగొందుల్లో, పల్లెల్లో, పట్టణాల్లో, అడవుల్లో ఎక్కడపడితే అక్కడ, ఎప్పుడు పడితే అప్పుడు కుహనా సందేశదుర్మతుల ఘోషణలు వినిపిస్తున్నాయి. కూటములు కనిపిస్తున్నాయి. పాపులను భారీఎత్తున ఉద్ధరిస్తామని 'పరిశుద్ధ' బహుళజాతి సంస్థల స్వదేశీ మార్కు కార్ఖానాలు తామర తంపరగా పెరిగిపోతున్నాయి. రాముడు రోతయ్యాడు, కృష్ణుడు బూతయ్యాడు. గీత పనికిరాని ఘోషయ్యింది.

జన సామాన్యంలో కనిపిస్తున్న ఈ అవాంఛనీయ పరిణామాలను చూసి, ఏమీ చేయలేని నిష్క్రియావస్థలో ఏదో చేయాలనే తపనతో తల్లడిల్లిపోతోంది జాతి హృదయం. ఎవరో ఏదో చేసేస్తున్నారనే ఆందోళన. తామేమీ చేయలేక పోతున్నామనే నిస్పృహ. ఎప్పటిదాకా ఈ దురవస్థ ?

గాఢ తమో నిద్రలో మునిగి చైతన్య రహితంగా సింహం ఉన్నప్పుడు చిట్టెలుకలు తామే లోకపాలకులమని, లోకోద్ధారకులమని చప్పుడు చేయడంలో ఆశ్చర్యమేముంది? ఈ చప్పుళ్ళన్నీ సింహం మత్తు వదుల్చుకొని, జూలు విదుల్చుకొని ప్రళయ గర్జన చేసే వరకే వినపడేది. సింహం తన రూపాన్ని ప్రదర్శిస్తే చాలు చిట్టెలుకలు కలుగుల్లోకే తమ బ్రతుకుల్ని పరిమితం చేసుకొంటాయి.

ఈ సత్యాన్ని చాటి, జాతి పరిస్థితిని మార్చేందుకు సిద్ధపడ్డారు మనస్వామి. జనం గుండెలలో 'జ్ఞానజ్యోతు'లు వెలిగి, అవి

సూర్యతేజమై వర్థిల్లి, జాత్యంధకారాన్ని రూపు మాపితే భరతసింహం మేల్కొంటుందని మనస్వామి ఆకాంక్ష! అందుకోసమే 'కృష్ణం వందే జగద్గురుమ్' అంటూ 2001లో ఆధ్యాత్మిక ప్రచారోద్యమానికి శ్రీకారం చుట్టారు.

తొలిఅడుగు 'శ్రీకృష్ణ సహస్ర కలశాభిషేకా' లైతే, మలి అడుగు 'గీతామృతదీక్ష' లయ్యాయి. మూడవ అడుగుగా రాబోయే చిత్రభాను సంవత్సరమంతా రాష్ట్రవ్యాప్తంగా 'గీతాజ్యోతు'లు ప్రకాశిం చాలని శ్రీస్వామి వారి సంకల్పం.

ఈ 'గీతాజ్యోతి'ద్వారా రెండుకోట్ల మంది భగవద్బంధువులకు భగవంతుని సందేశం చేర్చాలని శ్రీస్వామివారు మనకు లక్ష్యాన్ని నిర్దేశించారు. ఈ లక్ష్యాన్ని చేరుకోవడంలో భాగంగా మనం కొన్ని గీతా శ్లోకాల పారాయణం కలసి చేసుకోబోతున్నాం. భజనలతో, పూజలతో, ప్రవచనాలతో శ్రీకృష్ణభగవానుని వాడ, వాడల్లోనూ ఆరాధించబోతున్నాం. మన కర్తవ్యమైన మేరకు, మనకు చేతనైన మేరకు భగవంతుని సందేశాన్ని అందజేయడానికి మనం సిద్ధమౌ తున్నాం.

అయితే ఈ సందర్భంగా ముందుగా మనం గుర్తుంచు కోవాల్సిన విషయం ఒకటి ఉంది. ఈ 'గీతాజ్యోతి' కార్యక్రమం ఏదో ఒక 'విశ్వాసాన్ని' మాత్రమే ప్రచారం చేసే బృందంగా మనం వ్యవహరించ బోవడం లేదు. సమాజానికి వికాసాన్ని అందించేందుకు ఏ 'భగవద్భావనను' మనం ప్రచారం చేయాలనుకొంటున్నామో, ఆభావనతో ముందుగా మనం ఆంతరంగిక వికాసాన్ని పొందాలి. మన మనో బుద్ధి వికా సాలకోసం ముందుగా మన గుండెల్లో గీతాజ్ఞాన జ్యోతులను వెలిగించుకోవాలి.

అసలు, భగవత్తత్త్వం పట్ల మన అవగాహనను, రుచిని, బలోపేతం చేసుకోవడానికీ మనం 'గీతాజ్యోతి' ప్రచారోద్యమ కార్యక్రమంలో భాగస్వామ్యాన్ని స్వీకరించబోతున్నాం. మన ప్రచారం చేయకపోతే నిలువలేనంత దుర్బలుడు కాడు భగవంతుడు. సమాజం కూడా 'వచ్చి నన్నుద్ధరించవయ్యా' అని ఆక్రోశిస్తూ మన వెంట పడడంలేదు. మన ఆత్మోద్ధరణకే భగవంతుడూ సమాజమూను.

భగవంతుడు ఆధ్యాత్మికతవల్ల లభిస్తాడు. ఆధ్యాత్మికత అంటే అంతర్గత వికాసం కోసం సాగే నిరంతర సాధన. మానవులమనిపించు కొనే వారందరికీ ఇది ఎంతో అవసరం. ఇది అంతరంగాన్ని పరిశుద్ధం చేసే ప్రక్రియ. ఇందుకు ఉపయోగపడే ఉత్తమ స్థానమే సమాజం.

లక్ష్యమైన భగవంతుడిపట్ల అచంచల భక్తివిశ్వాసం, సమాజం పట్ల శ్రద్ధాగౌరవాలు, ఈ రెండింటినీ అనుసంధించే మార్గమైన ధార్మిక జీవనం పట్ల అనురక్తి పట్టుదల, ఇదే మన ఉద్ధరణకు ఉపయోగపడే పరమపద సోపానం. దీనినే 'ఆధ్యాత్మికతా పునాదుల ఆధారంగా ధార్మిక జీవనాన్ని సమాజంలో విస్తరింప చేయడ'మన్న మొదటి ఆశయంగా వికాసతరంగిణి మలచుకొన్నది.

'గీతాజ్యోతి' మన ఆశయాన్ని ఆచరణలో చూనుకొనేందుకు చేసే ఓ అరుదైన అందమైన ప్రయత్నం. సమష్టి వికాసం కోసం సాగే ఈ బృహత్తర కార్యక్రమంలో మనమంతా సమన్వయ పూరితంగా వ్యవహరించాల్సిఉంది. రాష్ట్రవ్యాప్తంగా వేలాది కార్యకర్తలు సమయమిచ్చి పనిచేయాలి. ఎక్కడికక్కడ సాధన సంపత్తిని సమకూర్చుకోవాలి. పరస్పరం సమాచారాన్ని ఇచ్చిపుచ్చుకోవాలి. సాధక బాధకాలను కలసి చర్చించుకోవాలి. పంచుకోవాలి. అరమరికల్లేకుండా, ఆభిజాత్యాలకు పోకుండా ఏకత్రాటిపై నడవాలి. నడిపించాలి. అప్పుడే మన అందరి





గుండెచప్పుడు 'గీత' అవుతుంది.

ఆనాడు అర్జునుని వెన్నంటి నిలిచి, నడిపించిన భగవానుడే నేడూ మనల్ని తన ఉపకరణాలుగా మార్చుకొని, కర్మవీరులుగా తీర్చిదిద్దుకొంటాడు. ఈ ప్రగాఢ విశ్వాసంతో, దీక్షతో మన మన ప్రాంతాలలో 'గీతాజ్యోతి' ప్రచార కార్యక్రమానికి ఉపక్రమిద్దాం.

మీ స్పందన కోసం ఎదురు చూసే

మీ
**వికాసతరంగిణి**
జైశ్రీమన్నారాయణ!

**సంప్రదించవలసిన చిరునామా**

**ప్రధాన కార్యాలయము :**
వికాసతరంగిణి,
జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్
సీతానగరం, గుంటూరుజిల్లా
ఫోన్ : (08645) 72929, 92353

**ఉపకార్యాలయము :**
వికాసతరంగిణి
జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్
1-2-412/1/2, గగన్ మహల్ కాలనీ,
దోమలగూడ, హైద్రాబాద్.
ఫోన్ : (040) 3224426

## పరమపదవార్త

.శ్రీమాన్ **మొగళ్ళపు విద్యాసుగుణ పూర్ణచంద్ర రావుగారు** తేది : 15-2-2002న సోమవారం విజయవాడ, కృష్ణనగర్ లోని తమ స్వగృహమునందు ఆచార్యతిరువడిని అలంకరించారు. వీరు మన సీతానగరం ఆశ్రమ నిర్వహణలో విశేష సేవలందించారు. వీరికి శ్రీమన్నారాయణుని శ్రీపాద కైంకర్యం నిత్యం కలగాలని ప్రార్థిస్తున్నాం.

- శ్రీ విశిష్టాద్వైత ప్రచారక సంఘం

కీ॥శే॥ మామిళ్ళపల్లి రాంబాబుగారి సంవత్సరీకం ఖమ్మంజిల్లా, సత్తుపల్లిమండలం, కిష్టారం గ్రామంలో 1-3-2002 న జరుపుకున్నారు. వీరి కైంకర్యాన్ని పరమపదనాథుడు భోగ్యంగా అనుభవిస్తూండాలని ప్రార్థిస్తున్నాం.

### పరమహంస పరివ్రాజకులు

## శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారి పర్యటనా వివరములు

మార్చి : 1 నిజామాబాద్ జిల్లా, ఖిలా రామమందిర ప్రతిష్ఠలో పాల్గొంటారు.

2. నిజామాబాద్ జిల్లా, సిరికొండ మండలం, మైలారంలో
శ్రీ వెంకటేశ్వరస్వామి ఆలయ ప్రతిష్ఠకు వేంచేస్తారు.

3 కరీంనగర్ జిల్లా, గుండుగోపాలరావు పేటలోని శ్రీ సీతారామ చంద్రస్వామి
ఆలయ ప్రతిష్ఠ.

4 కృష్ణాజిల్లా, జగ్గయ్యపేట కాకతీయ సిమెంట్సు, శ్రీనివాసనగర్‌లోని
శ్రీవెంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవాలు .

06-11వరకు వరంగల్ జిల్లా, జనగాం పట్టణంలో శ్రీసుదర్శన మహాయజ్ఞంలోపాల్గొంటారు

12-14వరకు వరంగల్ జిల్లా , తొర్రూర్ వేంచేసి ఉంటారు.
సాయంత్రం - వనపర్తి వేంచేస్తారు.

16 వనపర్తి శ్రీవెంకటేశ్వరాలయ ప్రతిష్ఠలో పాల్గొంటారు.సాయంత్రం హన్మకొండలోని-
ఏకశిలాపార్కు, బాలసముద్రంలో శ్రీ సీతారామ,ప్రసన్నాంజనేయ స్వామి ప్రతిష్ఠ,
మహాకుంభాభిషేక హోత్సవాలలో పాల్గొంటారు.
రాత్రి - శ్రీమాన్ మురళీకృష్ణ గారి చైత్రరథ గార్డెన్స్‌లో వేంచేసి ఉంటారు.

17 వరంగల్ జిల్లా, తొర్రూర్ శ్రీ వెంకటేశ్వరస్వామి ఆలయ ప్రతిష్ఠచేస్తారు.
సాయంత్రం - నెల్లికుదురు మండలం, మదనతుర్తి వేంచేస్తారు.

20 గుంటూరుజిల్లా, పాలపట్టు, ఆళ్వార్ ఆచార్య ఆలయ ప్రతిష్ఠలో పాల్గొంటారు.
పెదనందిపాడు వేంచేస్తారు.

21 గుంటూరుజిల్లా, నడిగడ్డపాలెం మన ఆశ్రమంలో ఆలయ నూతనధ్వజస్థంభ
ప్రతిష్ఠ జరిపిస్తారు.

22 గుంటూరుజిల్లా, వినుకొండ, జీయర్ నూతన భవనాన్ని ప్రారంభిస్తారు.

24 పశ్చిమగోదావరిజిల్లా, వడ్లపల్లి శ్రీ సీతారామచంద్రస్వామి ఆలయ
పునః ప్రతిష్ఠా కార్యక్రమంలో పాల్గొంటారు.

26 ఉదయం : నెల్లూరు జిల్లా, గాలిపాలెం వేంచేస్తారు

27 నెల్లూరు జిల్లా, సోమశిల శ్రీ లక్ష్మీనరసింహస్వామివారి బ్రహ్మోత్సవాలలో
పాల్గొంటారు.

28 గుంటూరుజిల్లా, నడిగడ్డపాలెం మన ఆశ్రమంలో క్షీరాభిషేకం.

29 హైదరాబాద్, ఏర్వేడు ఆశ్రమంవారు నిర్వహించే సనాతన వేదాన్త సభలో
పాల్గొంటారు.

31 పశ్చిమగోదావరిజిల్లా, పెనుగొండ అష్ఠలక్ష్మీదేవాలయ ప్రతిష్ఠ.

ఏప్రిల్ : 6-8 వరకు : ఖమ్మం జిల్లా, మేళ్ళచెరువులో మహాసిమెంట్స్ వెంకటేశ్వర స్వామివారి
బ్రహ్మోత్సవాలలో పాల్గొంటారు.

13-21 వరకు : కర్ణాటక, బళ్ళారిలో శ్రీరామనవమి ఉత్సవాల్లో పాల్గొంటారు.

జై శ్రీమన్నారాయణ !





**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి**
**ప్రత్యక్ష పర్యవేక్షణలో** శ్రీ వాసుదాసాశ్రమములో వేంచేసియున్న
**శ్రీరాజ్యలక్ష్మి తాయార్లకు లక్షమల్లె పుష్పార్చన,**
**శ్రీ లక్ష్మీనారాయణ యాగసహిత , శ్రీకోదండ రామచంద్రస్వామివారి**

### బ్రహ్మోత్సవముల ఆహ్వానపత్రిక

**ప్రారంభం - 16-3-2002** **సమాప్తి - 29-3-2002**

నడిగడ్డపాలెంలో ధ్వజస్తంభ, ఆంజనేయస్వామి కలశ ప్రతిష్ఠా మహోత్సవం

గతంలోవలెనె శేష, హంస, గజ, హనుమ, మోహినీ, గరుడ, అశ్వవాహన సేవలు, రధోత్సవం యిత్యాదులు విశేషంగా జరుగుతాయి. సమష్టి పూజా కార్యక్రమాలు జరుగనున్నాయి. ఫాల్గుణ పౌర్ణమి, ఉత్తరా నక్షత్రం లక్ష్మీతాయార్ల తిరునక్షత్రం. ఆ రోజున, శ్రీవారి శ్రీహస్తాలతో సహస్ర కలశాలతో క్షీరాభిషేకం వైభవంగా జరుగనున్నది. ఈ పవిత్ర కార్యక్రమంలో పాల్గొని తరించుదాం.

### విశేషకార్యక్రమములు

21-3-2002 ఉ॥ గం॥ 10-00లకు ఉత్సవారంభ అభిషేకం
సా॥ గం॥ 6-00లకు అంకురారోపణ,
22-3-2002 ఉ॥ ధ్వజారోహణం, వైనతేయేష్టి, రాత్రి శేష వాహనం
23-3-2002 ఉ॥ సుదర్శనేష్టి, రాత్రి హంస వాహనం
24-3-2002 ఉ॥ లక్ష్మీనారాయణ ఇష్టి, రాత్రి గజవాహనం
25-3-2002 ఉ॥ హయగ్రీవ ఇష్టి, రాత్రి హనుమద్వాహనం
26-3-2002 ఉ॥ విష్వక్సేన ఇష్టి, మోహిని అలంకారం, రాత్రి గరుడ వాహనం ఎదురుకోలు
27-3-2002 ఉ॥ సీతారామ కళ్యాణోత్సవం, లక్ష్మీనారాయణ కళ్యాణోత్సవం
రాత్రి అశ్వ వాహనం, దోపిడి ఉత్సవం
28-3-2002 ఉ॥ రధోత్సవం, లక్ష్మీతాయార్లకు సహస్ర క్షీర కలశాభిషేకం, మహాపూర్ణాహుతి
రాత్రి శ్రీ పుష్పయాగం, ద్వాదశారాధన.

### కైంకర్య వివరములు

ఒకరోజు ఇష్టికి : 5,000/-, ఒక రోజు పూర్తి యాజమాన్యం : 5,000/-
ఒక రోజు బ్రహ్మోత్సవ యాజమాన్యం : 3,000/-
ఒక రోజు సహస్ర దీపారాధన, ఊయలసేవ : 1,500/-, ఒక రోజు అభిషేకోత్సవం : 200/-
7 రోజులు అభిషేకోత్సవం : 1,116/-, సమష్ఠిసహస్రనామ మల్లెపుష్ప పూజకు ఒకరికి:75/-
తదియారాధన (100 మందికి) : 1,500/-

ధన, వస్తు, ద్రవ్యములను, శ్రీకార్యం, శ్రీవాసుదాసాశ్రమము అనుపేర మనియార్డర్, బ్యాంక్ చెక్, డ్రాఫ్టుల ద్వారా (చుండూరు-ఆంధ్రా బ్యాంక్) పంపి రశీదు పొందగోరు చున్నాము.

శ్రీకార్యం, **శ్రీవాసుదాసాశ్రమమం,** నడిగడ్డపాలెం, పిన్ 522 318, గుంటూరుజిల్లా.
✆ : (08644) 76150, 76522,76260.

# తేనెవాక (మాధ్వీకరుఝరి)

## శ్రీతిరుమழிశైయాళ్వార్ - నాన్ముకన్ తిరువన్దాతి

"మధురవాక్ శిఖామణి", "భాగవతామృతవర్షి"

- శ్రీ ఉ.వే. శ్రీమాన్ **సాతులూరి గోపాలకృష్ణమాచార్యస్వామి,** సింహాచలము.

శ్రీభక్తిసారులు అనుగ్రహించిన భగవద్వైభవాన్ని **"నానుముకనై"** అను పాశురార్థమున ఇప్పటివరకు అనుభవించాము. ఇకముందు అదే ప్రబంధములో శ్రీ తిరుమழிశై ఆళ్వార్లు అనుగ్రహించిన భాగవత వైభవాన్ని అనుభవిద్దాం.

మనకు శాశ్వతమైన ఆనందము ననుభవించుటకు నిరపాయకరమైన ఉపాయమేది? అను విషయములో బాగుగా శాస్త్రములనన్నిటినీ తరచి చూచిన పెద్దలు **'భాగవత సమాశ్రయణమే'** అట్టి ఉపాయమని నిష్కర్షించినారు. కారణమేమన, కర్మజ్ఞానాది అనేక ఉపాయములు శాస్త్రములలో తెలుపబడినప్పటికీ ఆ ఉపాయములన్నియు సాధ్యములు, సావధికములు, ప్రబలపాప విరుద్ధములు అయి గోచరించుచున్నవి.

ఇతర ఉపాయములు తమ స్వరూపసిద్ధికై చేతనుల నాశ్రయించి యుండును. ఒకవ్యక్తి చేయని ఎడల ఆ యజ్ఞమో యాగమో కలుగదు. కావున అవి తాము కలుగవలెనన్న చేతనుని ఆశ్రయించి యుండునవి. కనుక అట్టి ఉపాయములు ఒకనిచే సాధింపబడ వలసినవి. ఇక ఫలము నొసంగుటకై భగవానుని అపేక్షించి యుండునవి. ఏలనన కేవలము మనముచేసిన కర్మలు స్వతంత్రముగా తామే ఫలము నొసంగు టకు తాము అచేతన క్రియాకలాపములై యుండుటవలన సమర్థములు కావు. ఈ కర్మలను చూచి సంతసించిన భగవానుడు తానే ఫలముల నొసంగవలసి యున్నది. అందుచే మనము చేయు యజ్ఞయాగాది క్రియా రూపకమైన ఉపాయములు, ఫలము నొసంగు విషయములో భగవానునిపై ఆధారపడి యుండును. అంతమాత్రమే కాక ఆచరింపబడిన ఈ కర్మల ఫలములను సద్యః మనము అనుభవించుటకు వీలులేకుండా పూర్వజన్మములలో ఆచరింపబడిన దుష్కర్మలు అడ్డుపడిన ఎడల, ఫలమును సద్యః ఒసంగలేవు. అందుచేత స్వప్రయత్నసాధ్యములైన కర్మజ్ఞాన భక్త్యాది ఉపాయముల కంటె శ్రేష్ఠమైన ఉపాయము భగవచ్చరణారవిందములను ఆశ్రయించుటయే అని నిష్కర్షించినారు.

కాని ఇట్టి భగవదుపాయమందు కూడ ఒక అసౌకర్యము లోతుగ ఆలోచించిన పెద్దలకు గోచరించినది. ఉభయ విభూతి నాధుడగు భగవానుని ఆశ్రయించిన భక్తులకు చివరి వరకూ ఫలము లభించునా? లభించదా? అను సందియము కలుగుటకవకాశము కలదు. ఏలనన, సమస్త జగత్తుల యొక్క సృష్టి స్థితిలయములను నిర్వహించుటయే లీలగా కలవాడు భగవానుడు. సమస్త జీవరాసుల యొక్క పుణ్యపాపములను లెక్కించి, తదనుసారము పాపులను శిక్షించుట, సుకృతులకు ఉత్తమగతిని ఇచ్చుట ఆయనయొక్క నిత్యకృత్యము. ఇట్లు శిక్షించుట రక్షించుట, అను రెండిటినీ తన కృత్యములుగాకలిగినవాడు భగవానుడు.





ఆయనను ఈనాడాశ్ర యించిన మనలను మనదుష్కృత్యములను చూచి దండించునో? లేదా తన నాశ్రయించినామను ఒక్క గుణమును చూచి రక్షించునో? అను భయము ఫలసిద్ధి పర్యంతము అనువర్తించుచునే యుండును.

మనముచేసిన పుణ్యముల సంఖ్య కంటె పాపముల సంఖ్యయే అధికము కదా! అందుచేత అట్టి భయముకలుగుట సహజమే. పైగా భగవానుడు నిరంకుశ స్వాతన్త్ర్యముకలవాడు. అందుచే మన పాపములనే చూచి, అందుకనుగుణముగ మనలను దండించవలెననియే భగవా నుడు సంకల్పించెనా ఇక మనకు గతియేది? అని భయము అనువర్తించు చుండును.

అయితే ఎన్ని పాపములను చేసినా ఆయన చరణారవిందముల నాశ్రయించినాము కదా! అందుచే ఫలము తప్పక కలుగుననియే శాస్త్రములు చెప్పుచున్నవి గదా! అని ధైర్యము నొందుదమన్న మనము భగవానుని విషయములో చేసిన శరణాగతి శరణ్యహృదయానుసారి అయినప్పుడు మాత్రమే ఫలపర్యవసాయి అగును. మనము చేసిన శరణాగతి మనచే శరణువేడబడిన భగవానునికి ఇష్టమైనపుడు మాత్రమే ఆతడు ఫలమునొసంగును. ఆతడి అభిమతమునకు విరుద్ధమైనపుడు మనము ఎంత శాస్త్రీయముగ భగవానుని ఆశ్రయించిననూ అది సద్యః ఫలప్రదము కాకపోవచ్చును. అందుకు ఉదాహరణము **'భరతునియొక్క శరణాగతియే'**. కావున భగవానుని శరణువేడిన ఎడల ఆతడు తన కృపచే మనలను అనుగ్రహించనూ వచ్చును, లేదా మన పాపములనే చూచి శిక్షించిననూ శిక్షించ వచ్చును. కనుక భగవానుని శరణువేడిన వారికి ఫలసిద్ధియగునా కాదా? అను విషయములో సంశయము కలుగుటకవకాశము కలదు. మరి సంశయమునకవకాశము లేని యుపాయమేది? అను ప్రశ్నకు సమాధానమును శాస్త్రమే ఈ విధంగా చెప్పింది.

**సిద్ధి ర్భవతి వా నేతి సంశయోచ్యుత సేవినామ్ ।**
**న సంశయోస్తి తద్భక్త పరిచర్యా రతాత్మనామ్ ॥**

భగవద్భక్తులను ఆశ్రయించువారికి ఫలవిషయములో సంశయము కలుగనవసరములేదు అని నుడివినది. ఏలయన, రక్షించుట శిక్షించుట అను రెండు విభాగములను కలవాడు భగవానుడు కనుక ఆయన యొక్క రక్షణకు మనము విషయమగుదుమా? లేక శిక్షకు పాత్రమగుదుమా? అను సంశయము ఆయన నాశ్రయించిన వారికి కలుగవచ్చును. కాని భాగవతోత్తములకు శిక్షణ విభాగముతో సంబంధమే లేదు. లోకమంతయూ ఆనందముగ నుండవలెననియూ, అందరూ ఉజ్జీవించవలెననియూ తలంచుటయే వారి స్వభావము. కావుననే అట్టి భక్తులను గూర్చి **"తస్య యజ్ఞవరాహస్య ప్రణామం యేపి కుర్వన్తి తేషామపి నమోనమః"** అని భగవానునికి ఒకే నమస్కారం పెట్టినా, భాగవతోత్తములకు మాత్రము అనేక ప్రణామములనినారు.

అట్టి భాగవతోత్తములకు ఇతర దేవతలు కూడ ప్రణమిల్లుదురని **"ప్రణమన్తి దేవతాః"** అను మాంగళ్యస్తవ శ్లోకము తెలియజేస్తుంది. అట్టివారి విషయములో ఎట్లుండవలెనో యమధర్మరాజు తన భటులకు తెల్పురీతిని శ్రీ తిరుమழிశై ఆళ్వార్ ఒక అద్భుతమైన పాశురమునందు తెలుపుతున్నారు. ఆ పాశురమును అందుండి జాలువారు మాధ్వీకఝరిని తరువాయి సంచికలో ఆస్వాదిద్దాం.

# మహర్షుల చరిత్ర- గౌతమ మహర్షి

తమిళమూలం : **వై. వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి**
తెలుగు సేత : **శ్రీ ఉ. వే. శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి,** విజయవాడ

గౌతమి కుమారుడిని ఓ పాము కాటు వేయడం, ఆ పామును శిక్షిస్తాననడం, ఆ పాము అతని మరణానికి తాను కారణం కాదని, మృత్యు దేవత ఆదేశం మేరకు తాను అలా ప్రవర్తించానని చెప్పడం మనకు విదితమే. అంతలో అక్కడ ప్రత్యక్షమైన మృత్యుదేవత. పాముతో చెప్పిన శ్లోకమిది.

**ప్రచోదితోఽహం కాలేన పన్నగ త్వామచూచుదమ్ ।**
**వినాశహేతుర్నాస్య త్వం అహం న ప్రాణినశ్శిశోః ॥**

**యధా వాయు ర్జలధరాన్ వికర్షతి తత స్తతః ।**
**తద్వత్ జలదవత్ సర్ప కాలస్యాహం వశానుగః ॥**

ఓ సర్పమా! కాలపురుషుడు నన్ను ప్రేరేపించగా, నేను నిన్ను ప్రేరేపించాను. అంతేగాని ఈ కుర్రవాని చావుకు నీవు కారణము కాదు, నేను కారణం కాదు. కాలపురుషుడే కారణం. ఆకాశంలో నీటితో సంచరించే మేఘాల్ని, గాలి ఏవిధంగా తన ఇష్టంవచ్చినట్లు చెల్లాచెదరు చేసిపార వేస్తుందో అట్లే నేనుకూడ కాలపురుషునకు వశమైనాను" అని మృత్యు దేవత అన్నాడు.

పాముకు మృత్యువుకు వాగ్వివాదం చాల కాలం జరిగింది. అంతలో కాల పురుషుడే అక్కడ ప్రత్యక్షమై, ఈ విధంగా అన్నాడు.

**నహ్యహం, నాప్యయంమృత్యుః నాయం లుబ్ధక! పన్నగః**
**కిల్బిషీజన్తుమరణే న వయం హి ప్రయోజకాః ॥**

**అకరోద్యదయం కర్మ తనోఽర్జునక చోదకమ్ ।**
**వినాశహేతుర్నాన్యోఽస్య వధ్యతేఽయం స్వకర్మణా॥**

"ఓ వేటకాడా! ఈ పిల్లవాడు చనిపోవుటకు నేను కారణము కాదు, మృత్యువు కారణము కాదు, ఈ పామూ కారణముకాదు. మనమెవ్వరమూ ఈతని చావునకు కారణము కాదు. ఈ విధంగా మనలను ప్రేరేపించిన శక్తి వేరే ఉన్నది. అదే ఇతని ప్రాచీనకర్మ. అదితప్ప ఇతనిచావునకు వేరు కారణమేమీ లేదు. తన కర్మ కారణంగానే ఈతడు మరణించి నాడు''. అని అన్నాడు కాలపురుషుడు.

ఈ సందర్భంలో ప్రాచీన కర్మల ప్రభావాన్ని (శక్తిని) విశదంగా వర్ణించాడు కాలపురుషుడు. గౌతమి ఇదంతా వింటూనే ఉంది. తన మనోభావానికి తగినట్లుగానే ఉన్నది, కాలపురుషుడు చెప్పినది - ఆమె ఇట్లు పలికింది.

**నైవకాలోన భుజగో, న మృత్యురిహ కారణమ్ ।**
**స్వకర్మభిరయం బాలః కాలేన నిధనం గతః ॥**

**మయా చ తత్ కృతం కర్మ యేనాయం మేమృతస్సుతః ।**
**యాతుకాలస్తథా మృత్యుః ముంచర్జునక పన్నగమ్॥**

ఈ బాలుని మరణానికి కారణం కాలుడు కాదు, పాము కాదు, మృత్యువు కాదు. తన ప్రాచీన కర్మచేతనే ఈతడు మరణించాడు. ఇందులో క్రూరమైన నా పాపం కూడ కొంత ఉంది. అందుచేతనే నా పిల్లవాడు మరణించాడు. ఓ కాలపురుషా! నీవు నీస్వస్థానానికి వెళ్లు. ఓ మృత్యువా! నీవుకూడా నీ స్వస్థానానికి వెళ్లు. ఓ అర్జునకా! పామును విడిచిపెట్టు" అన్నది ఆమె.

తనకుమారుని హఠాన్మరణానికి కించిత్తు కూడ మనఃక్లేశాన్నిపొందని గౌతమి ఉదాహరణని భీష్ముడు ధర్మరాజుకు చూపించాడు "భారత యుద్ధంలో జరిగిన సంఘటనలన్నీ వారివారి కర్మానుగుణంగా జరిగినవే. ఇందులో ఇంకొకరి ప్రమేయంలేదు''. అని కాదనడానికి వీలుకాని యధార్థాన్ని తెలియజేసి, ధర్మరాజుకు మన శ్శాంతిని కలిగేటట్లు ఉపదేశించాడు, భీష్మపితా మహుడు.

**ఇత్యేతద్వచనం శ్రుత్వా బభూవ విగతజ్వరః ।**
**యుధిష్ఠిరో మహాతేజాః ప్రప్రచ్ఛేదం చ ధర్మవిత్ ॥**

మహాభారతం- 13.1.83

"గౌతమి యొక్క ఉదాహరణతో భీష్ముడు ఉపదేశించిన వార్తను విని, మహాతేజస్వి యైన ధర్మరాజు దుఃఖాన్ని పోగొట్టు కున్నాడు" అని.

గౌతమ వంశంలో పుట్టినవారు - మగవారైనా, ఆడవారైనా - గొప్పజ్ఞాన అనుష్ఠానాలతో ప్రకాశించినవారే. వీరి పుణ్యచరిత్రలు మహానుభావులచే





పురాణాలలో మాటిమాటికి ఉదాహరణలుగా చూపబడ్డాయి. గౌతముడు, గౌతమి అనే పేర్లు ఈ వంశంలో పుట్టినవారికి సామాన్యంగా పెట్టబడుతూ ఉండేవి. వారికి వేరే పేర్లుకూడ ఉండి ఉండవచ్చు. అయినా ఆ పేర్ల ఇతిహాసాలు, పురాణాలలో ప్రత్యేకించి చూపినట్లు లేదు. తమ కుల మూలపురుషుడైన గౌతముని సంబంధాన్ని తెలిపేటట్లు, ఆ పేరునే వీరంతా పెట్టుకున్నట్లు అనిపిస్తుంది.

**గౌతమబుద్ధుడు: -**

బౌద్ధమతాన్ని ప్రవర్తింపచేసిన మూలపురుషుణ్ణి బుద్ధుడు అని అంటారు. ఈతని మతమే బౌద్ధమతం అని బుద్ధమతం అని కూడ పిలువబడుతూ ఉంది. ఈ మతానికి చెందిన వారిని బౌద్ధులు అని పిలుస్తారు. ఇది అందరకూ తెలిసినదే. కాని ఇతడు గౌతమవంశంలో పుట్టినవాడు అను విషయము "గౌతముడు" అనే ఇతనికిగల ఇంకొక పేరుచేత మనకు తెలుస్తోంది. "గౌతమ శ్శార్కబన్ధుశ్చ మాయాదేవీ సుతశ్చ సః" అని అమరకోశం తెలియజేస్తోంది. (గౌతముడు, అర్కబన్ధు, మాయాదేవీ సుతుడు - అనునవి బుద్ధుని పేర్లు) దీనిని అనుసరించే ఈతనికి గౌతమ బుద్ధుడు అని కూడా పేరు ఏర్పడింది.

బుద్ధుడు పుట్టింది క్షత్రియ కులంలో. గౌతముడు బ్రాహ్మణ ఋషి. అయినా ఇతడు గౌతముడుగా పిలువబడు తున్నాడు. అంటే దీనికి ఒక కారణం ఉండి ఉండవచ్చు. బుద్ధుని వంశంలో 'గౌతముడు' పురోహితుడుగా ఉన్నట్లు మనం ఊహించవచ్చు. ఆనాడు క్షత్రియులు తమ పురోహితుని గోత్రాన్నే తమ గోత్రంగా చెప్పుకునేవారు. అదే రీతిలో ఈ బుద్ధునికి కూడ గౌతముడనే పేరు ఏర్పడి ఉండవచ్చు. కరుణామూర్తి అయిన బుద్ధుని ఉపదేశాలు లోకమంతా శీఘ్రంగా వ్యాపించి ఈనాటికీ అనుసరించబడుతూ ఉన్న విషయం అందరకూ తెలిసిందే. మేధావులైన ఇతర మతస్థులు ఈ బౌద్ధమతంపై ఎన్ని ఖండనలు చేసినా, వీటినన్నిటినీ ఖండిస్తూ బుద్ధుని శిష్యులు ఆయా సమయాల్లో అనేక గ్రంథాలను ప్రచురిస్తూనే ఉన్నారు. తర్క శాస్త్రంలో మంచి దిట్టలు బౌద్ధుని శిష్యులు. ఆ శాస్త్రంవారివల్లే బాగా ప్రసిద్ధి చెందింది.

మహావీరుడు కూడ "గౌతమ స్వామీ! "(గౌతమ శిష్యుడు) అనే పిలవబడ్డాడు."గౌతమేశ్వర తీర్థం " అనే పేరుతో ఒక పుణ్యక్షేత్రం కూడా ఉంది. ప్రసిద్ధి చెందిన గోదావరి నది గౌతమపుత్రి అట. "గౌతమసంభవా" అనే పేరు దీనినే తెలియజేస్తుంది. ఇతిహాస, పురాణాల్లో గౌతముని చరిత్ర విస్తారంగా ప్రస్తావించబడి ఉంది. ఈ 'గౌతము"లందరు మూలపురుషుడైన గౌతమునికి, లేదా ఈ వంశానికి చెందిన వారేనా అన్నది నిశ్చయంగా చెప్పడానికి వీలులేకుండా ఉంది.

పుణ్యమైన గౌతమ చరిత్ర ఇంతటితో ముగిసింది.



# భగవద్రామానుజ చరిత్ర

**శ్రీమతి T.K. చూడామణి, విజయవాడ.**

కులోత్తుంగచోళుని బారి నుండి అర్చామూర్తులను రక్షించడానికి నాట్యాన్ని తిలకిస్తున్నారు. తిల్య నాట్యం చేస్తూ అందరూ తమవైపే చూస్తోందనుకూంటున్నారు అక్కడున్న ప్రజలు. కాని ఆమె మనోనేత్రం గోవిందరాజస్వామినే దర్శిస్తోంది. ఓహో - నన్నెంత బాగా చూస్తోంది - ఆ - నన్నేరమ్మంటోందా.. ఓహో అంతలోనే అలుకా... అహా .....ఆ గాంధర్వనాట్యం ఎవరికి వారికే తమకోసమే ఆమె నాట్యం చేస్తున్న అనుభూతి. అది కోయిల కూజితం. మధురమంజులగానం. అది హంస నడకా! నెమలి నాట్యమా!. సౌందర్యం రూపుదాల్చి అటు ఇటు కదలుతూ ఈ ప్రాణాన్ని లాగుకొని పోతోందా... ఏమో... పాట అయిపోయిందా.. ఉహూ... మరొక పాట... దానికి నాట్యం... మరొక పాట...

అమృత ప్రవాహంలా సాగిపోయే ఆ గాననాట్య ప్రవాహంలో మునిగిపోయారు అక్కడివా రంతా. విశేషమేమిటంటే ఏ విష్ణువును కులోత్తుంగుడు ఇష్టపడడో ఆ స్వామి పాటలే పాడుతోంది, ఆ గోవింద నామాన్నే కీర్తిస్తోంది, ఆ గోపికాలోలుణ్ణే భజిస్తోంది... అయినా ఇదేమిటి ఇలా వింటున్నాం అనే భావం రాజుకి గాని ప్రజకిగాని, సైన్యానికిగాని తోచనేలేదు. అలా ఎంతసేపయిదో.. ఆ జగన్మోహన మూర్తి తిల్య... అలసిపోతున్నట్లు కనిపిస్తోంది. శరీరమంతా చెమట పట్టేసింది. అదొక వింత సౌందర్యంగా కనిపించింది చూపరులకి. అడుగులు తడబడ్డాయి. అదొక ప్రత్యేక భంగిమలా అనిపించింది వారికి. క్రమక్రమంగా పాట చిన్నగా సాగిపోయింది. అలా ముగించిదేమో అనుకుంటున్నారు వారు. చూస్తూండగా .. అలసిన తిల్య... స్వామీ ... గోవిందా... అంటూ స్పృహతప్పిపడిపోయింది. చూసేవారంతా స్పృహలోకి వచ్చారు. ఆ.. ఏమిటిది... ఏమైంది... గోవిందా అంటూ కేకవేసిందే! ఆ గోవిందుని కోసమేగా మనం ఇక్కడికి వచ్చాము అరే. వచ్చి ఎంతసేపయిందో తెలియనేలేదు.

కులోత్తుంగుడు ఒక్కసారి ప్రపంచంలోకి వచ్చాడు. ఆమె ముఖంపై నీరు చల్లండి. అంటూ ఆజ్ఞాపించాడు. ఎందుకు అలా నిలబడతారు? ఎందుకు వచ్చారిక్కడికి? వెళ్ళండి.ఆ పనిచూడండి. అంటూ కసురుకున్నాడు.

మళ్ళీ అంతా హడావిడి... భటులు గాబరాగా ఆలయంలోకి పరుగులు తీశారు. మూల విగ్రహం గోవిందరాజస్వామి నవ్వుతూ చూస్తున్నాడు.... ఈయనొకడు - ఈ నవ్వేమిటో!...ఆ విగ్రహాలేవీ!... ఉత్సవమూర్తులకోసం అటు ఇటూ హడావిడిగా చూశారు. ఎక్కడా లేవు.. పరుగులు పెడుతూ కులోత్తంగుని చేరి ఉత్సవమూర్తులు లేవని చెప్పారు. అదిరిపడ్డాడు కులోత్తుంగుడు.

ఊరిలో ప్రతి ఇంటినీ గాలించమన్నాడు. ప్రతి వ్యక్తిని బెదిరించి, భయపెట్టి





ఏంచేసినా... ఏమైందో ఎవరకీ తెలియలేదు. అప్పటికి అర్థం అయింది కులోత్తుంగునికి .. ఓహో తిల్యా! ఎంత సమర్థురాలివి. నీ హావభావ విలాసాలతో - దివ్య సౌందర్యంతో.. మధుర మంజుల గానంతో నన్ను, నా సైన్యాన్ని, మైమరపించి నీ స్వామిని రక్షించావా... నీ భక్తికి నిన్ను అభినందించవలసినదే.

కానీ నా కక్ష ఎలా తీరుతుంది? విగ్రహాలెక్కడికి పోయాయో కనిపెట్టందే ఊరుకుంటానా.. ఎంత నేర్పరివి తిల్యా... ఎంత తెలివైనదానివి.. ఎవరక్కడ! ఒక్క అరుపు అరిచాడు.. భటులు తలలు వంచి నిలిచారు. ఈమెను బంధించండి.. 'స్వామీ నన్ను బంధిస్తేనేం? నిన్ను విడిపించగలిగాను' అనుకుంటూ ఆనందంగా వారివెంట సాగింది తిల్య.

ఆలయమంతా నేలమట్టం చేస్తే గాని కక్ష తీరలేదు కులోత్తుంగునికి. తమ స్వామి ఆలయం ఛిన్నాభిన్న మౌతున్నందుకు మూగగా రోదించింది భక్త బృందం.. అసంతృప్తితో కాంచీనగరానికి చేరాడు కులోత్తుంగుడు. ఉత్సవవిగ్రహాలు దొరకలేదనే బాధ.. పోనీలే ఆలయంవరకు సాధించాననే ఊరట.

తరువాత ఏం జరిగిందో మరుసటి సంచికలో తెలుసుకుందాం.

## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషిచేస్తున్నవారిని ప్రతినెలా మీకు పరిచయం చేయాలనుకుంటున్నాము. హైదరాబాద్ నగరానికి చెందిన **శ్రీమతి అరుణా రాఘవరెడ్డిగారు** ప్రతినెలా ఎంతో మందిని కలుస్తూ, వారికి మన భక్తినివేదనను పరిచయం చేస్తూ, వారందరినీ మన కుటుంబంలో కలుపుతున్నారు. వీరి కృషి మరింత ఫలప్రదం కావాలని శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములు అందిస్తున్నాం.

జై శ్రీమన్నారాయణ!



# రామాయణంలో రమ్యగాథలు

-శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి, విజయవాడ

తారమాటలకు శాంతించిన లక్ష్మణునితో సుగ్రీవుడు వినయ పూరిత వచనాలతో "రాజపుత్రా! ఒకే ఒక బాణంచేత ఏడు గొప్ప గొప్ప సాలవృక్షాలను చీల్చుటకు నారి సారించగా పర్వతములతో సహా భూమి కంపించినది. అటువంటి రామునకు సహాయము చేయువారెవరు? రామానుజా! నేను రామానుగ్రహము చేతనే పోయిన ఐశ్వర్యమును, కీర్తినీ పొందినాను. అటువంటి ధర్మప్రభువుకు ప్రత్యుపకారము చేయగలవాడెవడు? అమోఘ పరాక్రమశాలి అయిన రామునకు కేవలము చెప్పుటకు మాత్రమే సహాయకారిని. లక్ష్మణా! ససైన్యంగా రావణవధకు రామచంద్రుడు సాగుచుండ నేను కేవలము అనుసరించు వాడనే. రాముడే తనతేజో వీర్యాల చేత రావణుని వధించి సీతను పొందగలడు.

**యది కించి దతిక్రాన్తం విశ్వాసా త్ప్రణయేన వా,**
**ప్రేష్యస్య క్షమితవ్యం మే నకశ్చిన్నాపరాధ్యతి**

లక్ష్మణా! ఈ లోకమున అపరాధము చేయని వారెవరూ వుండరుకదా! నామీది నమ్మకమును గాని, స్నేహమును గాని అతిక్రమించి నేనేదైనా అపరాధము చేసిన ఎడల ,భృత్యుడనైన నన్ను క్షమించుమని ప్రార్థిస్తున్నాను." అని పలికిన సుగ్రీవుని పట్ల ప్రసన్నుడైనాడు.

"సుగ్రీవా! సమస్త వానరలోక రక్షకుడవు. అంతియేగాదు. వినయశీలివి. అటువంటి నీ అండ పొందిన నా సోదరుడు యుద్ధ రంగమున శత్రునాశము చేసి సీతను శీఘ్రముగా పొందగలడు. సుగ్రీవా! ధర్మము తెలిసిన వాడవు, యుద్ధమున తిరిగి చూడని ప్రతాపముకల నీవు తగిన రీతిన, నీ తప్పిదము గ్రహించి, మాటలాడి మా అన్నగారికి తగిన వాడవగుచున్నావు. మిత్రుడా! మా అన్నగారి భార్యావియోగ దుఃఖము సహించలేక, నిన్ను పరుషమైన మాటలతో దూషించినాను. అందుకు నన్ను క్షమించుము.

ఓ వానర వీరుడా! నీవును వెంటనే నాతో వచ్చి భార్యాహరణ దుఃఖితు డైన నీ మిత్రుడు రామచంద్రునికి ఓదార్పు కలిగించుము. దేవతలు మామీద దయతలచి ఇంతకాలమునకు నీ సహాయమును మాకు అందించినారు. అని పలుకగా, ససైన్యముగా రాముని దర్శించెదను. అని పలికినాడు సుగ్రీవుడు. ఆ మాట విన్న హనుమ పరాక్రమ వంతులైన వానరులను మరల అన్ని దిక్కులకూ పంపినాడు.

ఆకాశ మార్గమున నక్షత్ర మండలము వరకు ఎగిరి గిరి, సాగర, వన తటాకాలలో వున్న సమస్త వానరులనూ రామ కార్యార్థమై ప్రేరేపించినారు. యముని ఆనతివంటి సుగ్రీవాజ్ఞకు భయపడి, అస్తాద్రినుండి పదికోట్ల వానరులు, కైలాస శిఖరములనుండి వెయ్యి కోట్ల వానరులు, హిమవత్పర్వతం నుండి ఫలమూలాలతో జీవించే వెయ్యి కోట్ల వానరులు, వేలకొలదీ వానరులు వింధ్యపర్వతమునుండి,





క్షీరసముద్రతీరవనవాసులైన వానరుల సంఖ్యకు లెక్కలేనేలేదు. ఈ వానర సేన అంతా గుహలనుండి, గిరి శిఖరాలనుండి ఎగిరి ఎగిరి వస్తూ వుండగా ఈ వానర సేన సూర్యుని మ్రింగివేస్తున్నదా! అన్నట్లుగా భాసించింది.

త్వరితగతిని ఈ వానరులను పిలుచుటకై ముందుగా వెళ్ళిన వానరులు '**హిమవచ్ఛైలం దదృశు స్తం మహాద్రుమమ్**'. హిమగిరి శిఖరాన ఒక వృక్షమును చూచినారు. పూర్వమొకపరి ఆ హిమవత్పర్వతం మీద దేవతలకు ఆనందం కలిగే ఒక మహా యజ్ఞం మహేశ్వర ప్రీత్యర్థం చేయబడినది. ఆ యజ్ఞవాటిక యందు యజ్ఞాన్నము నుండి చెదరిపడివున్న దుంపలను, అమృత స్వాదు ఫలాలను ఆ వానరులు భుజించినారు. ఆ యజ్ఞాన్న ఫలములను ఎవరు భుజింతురో వారికి ఒక మాసమువరకు మృష్టాన్న తృప్తి కలిగి ఆకలి బాధవుండదు. అంతియె కాక సుగ్రీవునకు ప్రీతి కలిగించుటకై ఆ యజ్ఞస్థానమునుండి అనేక ఫల మూలములను, పరిమళ భరిత పుష్పములను కూడ సేకరించి, అనేక ఓషధులను కూడ గ్రహించి, భూమి మీద వున్న వానరులనందరనూ సుగ్రీవాజ్ఞనుసారము ప్రేరేపించి, ఆ గుంపులు రాకముందే కిష్కింధకు చేరి ఆ దివ్య కానుకలు తమ రాజునకు సమర్పించి, రాజా! నీ ఆజ్ఞానుసారము భూమిమీది వానరులందరూ రామకార్యార్థము బయలుదేరినారు అని చెప్పగా సుగ్రీవుడు ఎంతగానో సంతోషించినాడు. ఆ వానర వీరులను సత్కరించి వెంటతీసుకొని లక్ష్మణ సమేతుడై, సువర్ణ ఖచితమైన పల్లకినెక్కి వందిమాగధులు స్తుతి చేయుచుండగా, తెల్ల వింజామరలు వీచుచుండ, తెల్లగొడుగులు కొందరు పట్టగా, భేరీ ఖాంకారములతో, శంఖ తూర్యనాదములతో, ఆయుధధారులైన వానర శూరులు వేలాది మంది వెంటనంటి రాగా సుగ్రీవుడు శ్రీరామ చంద్రుడు నివసించుచున్న ప్రస్రవణగిరిని చేరి దోసిలి కట్టి వినయవినమ్రంగా అభివాదనంచేసి శిరసువంచి దోసిలొగ్గి నిలచినారు.

రామపాదాలకు శిరసొగ్గి నమస్కరించిన వానరేంద్రుని రామ ప్రభువు ప్రేమతో, గౌరవంతో గాఢాలింగనం చేసుకున్నాడు. సుగ్రీవా! మనము సీతాన్వేషణ ప్రయత్నము ఆరంభించుసమయం వచ్చినది. నీ మంత్రులతో ఆలోచనచేయుము.మంచి మనస్సుతో ప్రియభాషణము చేయు మంచి మిత్రుడవైన నీ సహాయముతో, రావణుని నా వాడి బాణముల చేత సంహరించగలను. అని పలుకుచుండగానే మేఘ గంభీర ధ్వనులతో ఆకాశమును, దిక్కులనూ మూసివేయు పరాగముతో దిక్కులు వ్యాకులము అయినవి. మరుక్షణముననే పర్వతాకారులైన వానరులు వేలకోట్ల సంఖ్యలో వచ్చి చేరినారు.

శిరస్సు వంచి సుగ్రీవునకభివాదము చేసి నిలబడినారు. అప్పుడు సుగ్రీవుడు ఓ వానర నాయకులారా! మీమీ సైన్యాలతో పద్ధతి ప్రకారము శిఖరాగ్రాల మీద, సెలయేళ్ళ వద్ద, వనములలోనూ నిలచినచో రామునకు మీ బలసంపద తెలియచేయ గలము. అనగా సమస్త వానరులు సుగ్రీవాజ్ఞను శిరసావహించినారు. అంతట సుగ్రీవుడు "రామా! ఈ సేన అంతా నీవశము. నీ ఆజ్ఞకై వేచి వున్నాము. అనగా సుగ్రీవుని మరొకసారి గాఢాలింగనము చేసుకొన్నాడు దాశరథి. యుగ యుగాలకూ తరగని స్నేహ సౌరభంతో ప్రస్రవణగిరి పులకించి గుబాళించినది.

# శ్రీరామ మంగళాశాసనము

- శ్రీ ఉ.వే శ్రీమాన్ ఈ.వే. శింగరాచార్యులు, తిరుపతి

**విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః।**
**భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్॥**

విశ్వామిత్ర మహర్షికి అంతరంగిక శిష్యుడు, మిథిలకు ప్రభువగు జనకుని పుణ్యముల పంట, దివ్యమైన రూపమును కలవాడును అగు శ్రీరామునకు మంగళమగు గాక! 'విశ్వామిత్రాంతరంగాయ' విశేషాలను క్రిందటి సంచికలో అనుభవించాం కదా! మిగిలినవాటిని ఈ సంచికలో ఆస్వాదిద్దాం.

**మిథిలా నగరీపతేః భాగ్యానాం పరిపాకాయ**- జనకుడు విశ్వామిత్రునితో సీతాదేవి తనకు లభించిన ప్రకారమును తెలుపుచు, ఆమె యుక్తవయస్సు వచ్చినపిమ్మట పలువురు రాజులు ఆమెను వివాహమాడుటకై ముందుకువచ్చుట, ఆమె వీర్యశుల్కముగా నిర్ణయింపబడుట. శివధనుస్సును వారెవ్వరును కదుపలేక పోవుటచే సీతను వివాహమాడుటకు తగిన యోగ్యత వారికెవ్వరికిని లేదని తలచి, అట్టి శక్తిసామర్థ్యములను కల్గినవారికై ఎదురు చూచుటయును తెలిపెను.

**భూతలాదుత్థితా సాతు వ్యవర్ధత మమాత్మజా।**
**వీర్యశుల్కేతి మే కన్యా స్థాపితేయ మయోనిజా॥**

**తతస్సర్వే నృపతయః సమేత్య మునిపుంగవ।**
**మిథిలా మభ్యుపాగమ్య వీర్య జిజ్ఞాసవ స్తదా॥**

**తేషాం జిజ్ఞాస మానానాం వీర్యం ధను రుపాహృతం।**
**నశేకుః గ్రహణే తస్య ధనుషస్తోలనేపివా॥**

**తేషాం వీర్యవతాం వీర్య మల్పం జ్ఞాత్వా మహామునే।**
**ప్రత్యాఖ్యా తా నృపతయ స్తన్నిబోధ తపోధన॥**

అను మొదలగు శ్రీరామాయణ వచనములు ఇతట స్మరింపతగినవి. కావున శివధనుస్సును సంధించిన వారికి వీర్య శుల్కముగా సీతను ఇచ్చి, వివాహమును చేయుదునను తన ప్రతిజ్ఞ ఎపుడు ఫలించునో కదా! అని జనకుడు శంకాతంక మనస్కుడయ్యెను.

శ్రీరాముడు శివధనుస్సును భగ్నము చేయగానే అనుమానమంతయు భగ్నము అయ్యెను. కావుననే దేశికులు రఘువీర గద్యలో **"మోచిత జనహృదయ శంకాతంక"** అని పల్కిరి. శ్రీరాముడు శివుని విల్లుని విఱచుటను చూచిన జనకుని వాల్మీకి మహర్షి **"రాజా విగత సాధ్వసః"** అని తెలిపెను. **"విగతసాధ్వసః"** అను విశేషణమును గోవింద రాజీయ వ్యాఖ్యాత **"విగతసాధ్వస ఇత్యనేన రామజామాతృకతా ప్రాపకం ధనురారోపణ మపి నభవేదితి పూర్వం భీతో భూదితి గమ్యతే"** అని వివరించుటచే శ్రీరాముడు కూడ శివ ధనుస్సును ఆరోపింపగలడా? లేడా? అను భయము జనకునకు కలదని స్పష్టమగుచున్నది.

శివధనుర్భంగము కాగానే -**"భగవన్ దృష్టవీర్యో మే రామో దశరదాత్మజ, అత్యద్భుత మచింత్యంచ న తర్కిత మిదం మయా... మమసత్యా ప్రతిజ్ఞాస చ వీర్య శుల్కేతి కౌశిక"** అని సంతోషముతో అతడు పల్కెను. ఇట్లు జనకుని ప్రతిజ్ఞ సఫలమగుటకు అతడు చేసిన పుణ్యములు శ్రీరాముని రూపమున ఫలించుటయే కారణము.

**(భవ్యరూపాయ)** - భవ్యశబ్దము **"భవ్యం శుభేచ సత్యేచ యోగ్యే భావినిచ త్రిషు"** అను మూడర్థములను తెలుపును. కావున మంగళకరమైన, సత్యమైన, యోగ్యమైన (తగిన) అర్థములను ప్రసుత్తమున గ్రహింపవచ్చును. భగవానుడు దివ్యమంగళ విగ్రహుడనుట





శాస్త్రసిద్ధము, అనుభవ సిద్ధమునను. శ్రీరామచంద్రుని కల్యాణ గుణములను నారదమహర్షి శ్రీరామాయణ ప్రారంభమున పేర్కొనుచు **"విపులాంసః"** అనువిశేషణము నుండి **"శుభలక్షణః"** అను విశేషణమువరకు ఆస్వామియొక్క దివ్యమంగళ విగ్రహమును స్తుతించెనని వ్యాఖ్యాతలు తెలిపిరి. కావున భవ్యశబ్దమునకు శుభమను అర్థము శ్రీరాముని విషయమున పొసగును. లేక, సందర్భానుసారము సీతారామకల్యాణ సందర్భమున **"భాతృభిః సహితో రామఃకృత కౌతుకమంగళః"** అని స్తుతింపబడిన అప్పటి మంగళ రూపమును ఈ విశేషణము పరామర్శించు చున్నదన వచ్చును.

తగినదను అర్థమున - సీతకు తగిన దివ్యమైన రూపమును కలవాడని భావము. సీతారాముల రూపములు పరస్పర సదృశములనుటను జనకుడే తెలిపెను.

**"సదృశో ధర్మ సంబంధః సదృశో రూపసంపదా, రామలక్ష్మణయోః రాజన్ సీతాచోర్మిలయాసహ"**

అను జనకుని వాక్యము స్మరణీయము. ఇట్లు పరస్పరము తగిన రూపములను కల్గిన సీతారాముల కలయికను దర్శించిన జనకుడు ఆ అపూర్వమైన, రమణీయమైన కలయికకు ఏవిధమైన దృష్టి దోషము కలుగ రాదను భక్తి భావముతో ప్రపన్నానురూపమైన మంగళాశాసనమును **"భద్రంతే"** అనుచు చేసెను.

ఈ సూక్తిని వ్యాఖ్యానించుచు గోవింద రాజీయవ్యాఖ్యానకారులు **"అనురూప వధూవరయోః సంయోగే దృష్టి దోషో భవిష్యతీతి మంగళమాశాస్తే భద్రంతే ఇతి"** అనుట ఇచట స్మరించతగినది. **"తుల్యశీలవయో వృత్తాం తుల్యాభిజన లక్షితామ్, రాఘవోర్హతి వైదేహీమ్"** ఇత్యాది పలు సూక్తులును ఈ అంశమును దృఢీకరించుచున్నవి.

అట్లే, సత్యమను అర్థమున సత్యమైన రూపమునుకల్గినవాడని భావము. భగవానుని రూపము సత్పురుషులకు అనుకూలముగను, దుష్టులకు ప్రతికూలముగను తోచును. సత్పురుషులకు సాధువైన శ్రీరాముని (భవ్య) సత్యరూపుడనుట **"సత్సు సాధుః"** అను సత్యశబ్దవ్యుత్పత్తినిబట్టి మిక్కిలి తగినదికదా!

**"మిథిలా నగరీపతేః భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ"** అను పదముల సమభివ్యాహారమువలన జనకుని తపః ఫలమగు, శివధనుస్సును విఱిచిన వాడగు శ్రీరామచంద్రుని రూపము లోని భవ్యత ఇచట ధ్వనించు చున్నది. అనగా ఆ సందర్భములోని స్వామియొక్క రూపములోని భవ్యత ఇచట ధ్వనించు చున్నది. ఇందులకు **"మైదిలియై మణమ్ పుణర్వాన్ కారార్ తిణ్ శిలైయిఱుత్త తనిక్కాళై"** (మైథిలిని వివాహమాడుటకై గొప్పచేవనుకల, ఎవరి చేతను కదపుటకు వీలుకాని , వింటిని భగ్నము చేసిన అద్వితీయమైన వృషభము) అను మొదలగు ఆళ్వార్ల సూక్తులు అనుసంధే యములు (పాశురములోని **"కాళై"** అను పదమువలన ఆ సందర్భములోని స్వామి రూపముయొక్క భవ్యత స్ఫురించు చున్నది).

---

అనివార్య కారణాలవలన శ్రీవచనభూషణము, శ్రీ మహావిష్ణు పురాణము ఈ నెల ప్రచురించలేకపోవుచున్నాము.

**- ఎడిటర్**

జై శ్రీమన్నారాయణ!

బదరీ నారాయణ పెరుమాళ్

## బదరీనాథ్‌లో అష్టాక్షరీ క్షేత్రంలో జరుగు అన్నదానమునకు, నిర్మాణమునకు వివిధ పోషకులుగా కైంకర్యములు సమర్పించిన భక్తుల వివరములు

**శ్రీమాన్ డా॥ బచ్చు మురళీకృష్ణగారు, వరంగల్ ద్వారా...**

**పోషకులు :**

**వరంగల్ :**-శ్రీ కె. హరినాథ్, మెసర్స్ విశాల్ ఇండస్ట్రీస్, మెసర్స్ గుప్తా ఇండస్ట్రీస్

**జీవిత సభ్యులు :-**

**వరంగల్ :** - శ్రీ ఎం. హరిబాబు, శ్రీ ఎస్. రమణయ్య, శ్రీమతి ఎస్. కమల, శ్రీమతి పుష్ప, శ్రీ వి. శ్రీనివాసులు, శ్రీ ఆర్. నాగభూషణం, శ్రీ కె. కళావతి (హసనపర్తి), శ్రీమాన్ జి. వెంకటేశ్వరరావు (హైద్రాబాద్)

**అభిమానులు : -**

**వరంగల్ :** శ్రీ వై నాగేందర్,శ్రీపి. సమ్మారావు, శ్రీ జి. కృష్ణ, శ్రీమతి బి.ఉదయలక్ష్మి, శ్రీ ఎస్. సుందరరాజు, శ్రీ వి. వేణుగోపాల్, శ్రీ సి.ఎల్. నరసింగరావు, శ్రీ ఆర్. విశ్వనాధమ్, శ్రీమతి ఎన్. యశోదమ్మ, శ్రీఎం. శంకరం, డా॥ ఎన్. వీరభద్రరావు, శ్రీ వి. రాజామణి, శ్రీ జి. వెంకటేశ్వర్లు, శ్రీ జి. సాంబమూర్తి, శ్రీ ఆర్ పుల్లయ్య, శ్రీ బి. భద్రయ్య, శ్రీ జి. వెంకటయ్య, శ్రీ కె. సత్యనారాయణ, శ్రీ ఎన్. శంకర్, శ్రీ టి.వి. రమణమూర్తి, శ్రీ బి. అంజయ్య, శ్రీ సి.హచ్. శ్రీనాథ్, శ్రీ కేశవరావు.

**హనుమకొండ : -**

**జీవిత సభ్యులు :-** శ్రీ జె. పవన్‌కుమార్, శ్రీ జి. నాగేశ్వరరావు, శ్రీమతి వాలా రాజమ్మ, డా॥ పి. రమేష్, శ్రీ సాంబరాజు, శ్రీమతి వీరలక్ష్మి, శ్రీ గోపీనాద్.

**అభిమానులు :**శ్రీ ఐ. దీపి ప్రియదర్శిని, శ్రీ ఎం వసంతరామ్,శ్రీ కె. యాదగిరి, శ్రీ ఎల్. దయానంద రావు, శ్రీ వి. గోపాలరావు, శ్రీమతి ఎం శ్రీమతమ్మ, శ్రీ ఎం. శ్రీనివాసులు, శ్రీ జి. ముత్యాలు,శ్రీ రుక్మిణి, శ్రీమతి వై. సీతారామమణి, శ్రీ ఎన్. మధుసూదన్, శ్రీమతి విజయ, శ్రీ బి. రామకృష్ణారావు, శ్రీ జి. శ్యామసుందరరావు, శ్రీ కె. కృష్ణారావు, శ్రీ టి. వెంకటరమణ, శ్రీ భూలోకరావు,శ్రీ సరళ, శ్రీ వి. జనార్థన్, శ్రీ జి. లక్ష్మారెడ్డి, శ్రీమతి కృష్ణ, శ్రీమతి పి. అనసూర్య, శ్రీ టి. వెంకటేశం, శ్రీమతి ఎం. సృజన,శ్రీ కమలా జగన్నాధరావు, శ్రీ సి.ఎల్. నరసింగరావు, శ్రీ ఆర్. విశ్వనాధమ్,శ్రీ వై జనార్ధన్, శ్రీమతి ఎం. రంగనాయకమ్మ, శ్రీమతి సి.హెచ్. ఆండాళమ్మ,శ్రీ పి. వెంకటరావు, శ్రీమతి పి. కౌసల్య, శ్రీ ఎం ప్రదీప్ కుమార్ రెడ్డి, శ్రీ ఎం. సతీష్ కుమార్ రెడ్డి, శ్రీ ఎ. సత్యనారాయణ, శ్రీ ఎన్.వి. సుబ్బారావు, శ్రీ ఆర్ ప్రభాకరశర్మ, శ్రీ ఎం నరసింహారెడ్డి, శ్రీ ఎం. పుల్లారెడ్డి, శ్రీ ఆర్. వీరారెడ్డి, శ్రీ ఎ. దేవేంద్రరావు, శ్రీమతి జె. వసుందర, శ్రీ ఐ. దీప్తి ప్రియదర్శిని, శ్రీ ఎం. వసంతరాం, శ్రీ కె. యాదగిరి, శ్రీ ఎల్. దయానందరావు, శ్రీ వి. గోపాలరావు, శ్రీమతి ఎన్. శ్రీమతమ్మ, శ్రీ వి. శ్రీనివాసులు, శ్రీ ఎం. శ్రీనివాసులు, శ్రీ జె. నారాయణ. శ్రీమతి సి. దుర్గారెడ్డి, శ్రీ వీరభద్రయ్య, శ్రీ జి. వెంకటేశ్వరరావు,హైదరాబాద్, శ్రీమతి ఎన్. అరుణ,హైదరాబాద్ శ్రీమతి పి. సోమలక్ష్మి, మద్దిరాల, శ్రీ పి. వెంకటేశ్వరరావు,మద్దిరాల, శ్రీ ఎ. రమేష్, మునుగొండ, శ్రీ పి. రాజేష్ రెడ్డి,రాయపర్తి, శ్రీమతి జి. సుభద్ర, వడ్డేపల్లి, శ్రీ ఎం. రాజేశ్వర్, నిజామాబాద్, శ్రీ వై. నరసింహారావు, మహబూబాబాద్,

శ్రీ జి. బిక్యానాయక్, మల్లంపల్లి, శ్రీ ఎమ్. శ్రీనివాసరావు( రాయపర్తి), శ్రీ సి.హచ్.కృష్ణ (ఖమ్మం), శ్రీ పి. రాజేశ్వరరావు (మహబూబాబాద్), శ్రీ కె. గంగాధర్ (కరీంనగర్), శ్రీ ఎం కృష్ణమూర్తి (జనగాం), శ్రీ వి. వెంకట్రామ్ (విశాఖపట్నం), శ్రీ జె నారాయణ (జగిత్యాల), శ్రీ ఎం. మల్లయ్య (బొమ్మెర), శ్రీ పి. సమ్మయ్య, (స్టేషన్ ఘనాపూర్), శ్రీ జగన్మోహనరావు (భద్రాచలం) శ్రీ ఎం. రామకృష్ణారెడ్డి (అప్పరాజుపల్లి),

**శ్రీమతి పి రమణమ్మగారు (విజయనగరం), ద్వారా : -**

**జీవిత సభ్యులు :** ఎస్. వెంకట్రావు (విజయనగరం)

**అభిమానులు:** (విజయనగరం):శ్రీ ఎం. రామకృష్ణ, శ్రీ పి.వి. సూర్యనారాయణరాజు, శ్రీమతి ఐ. లక్ష్మి వెంకాయమ్మ,

**బొబ్బిలి : -** శ్రీమతి టి. సునీత, ఐ. లక్ష్మి వెంకయమ్మ, శ్రీ కె. పద్మ, సత్యనారాయణ, శ్రీ కె.వి.ఆర్. కొండలరావు, శ్రీ కె. సుబ్బారావు, శ్రీ డి.వి.ఎస్,





కృష్ణారావు (అన్నవరం), శ్రీ ఇ. సీతారత్నం, (రామభద్రాపురం)

**శ్రీ డా॥ టి. రామనాథంగారు (హైదరాబాద్) ద్వారా:**

**పోషకులు :** శ్రీ హనుమంత ప్రసాద్, (హైదరాబాద్) శ్రీ ఎన్. లక్ష్మీ కాంతారావు,(సికింద్రాబాద్ ),

**జీవిత సభ్యులు :** శ్రీ కె. విద్యాసాగరరావు (కరీం నగర్), శ్రీ పి. మధుసూదనరావు (హైదరాబాదు), శ్రీ పి. కమలాకరరావు (కరీంనగర్), శ్రీమతి కె. సుగుణాదేవి( దొంతాపూర్), శ్రీ వి. నిరంజనరావు (హైదరాబాదు), శ్రీ వి. రాజేశ్వరరావు (సికింద్రాబాద్) శ్రీమతి ఎస్. సూర్యకళ (హనుమకొండ) శ్రీ కె. మురళీధరరావు (హైదరాబాద్).

**జెట్, సీతానగరంనకు వచ్చినవి : -**

**పోషకులు :-** శ్రీ జి.వి.ఎ. మంగాచార్యులు (కొత్తవలస), శ్రీ పి. పోచయ్య, (రాజగోపాలపేట),

**జీవిత సభ్యులు :-** శ్రీ ఆర్. మాణిక్యాలరావు, పి. నారాయణ రెడ్డి ( ఏలూరు),

**అభిమానులు :**

శ్రీ పి. ఎస్.ఎస్. భాస్కరం (ఎ. అన్నవరం) శ్రీ కె. నరసింహారావు (అవనిగడ్డ), శ్రీ అంకమ్మ, సానక్క (రామచంద్రపురం), శ్రీ జి. వెంకటేశ్వర్లు (కొల్లూరు) శ్రీ జి. రత్నారెడ్డి (ఎల్లారెడ్డి), శ్రీ ఎం. రాములు (పెదపల్లి), శ్రీమతి కమలమ్మ (చినబాదం), శ్రీమతి ఎ వనజాక్షి (చినబాదం) శ్రీ డి సుబ్రహ్మణ్యం (డోన్), శ్రీమతి సి.హెచ్. అనసూయ (కాకినాడ), శ్రీమతి ఎ. వెంకటసుబ్బమ్మ (బిల్లనపల్లి), శ్రీ శ్రీరామప్రసాద్ (బానురు), శ్రీమతి ఎన్. పుష్పలత (నైదనూరు), శ్రీమతి వై. భారతి (చెర్లోపాలెం), శ్రీమతి జి. అనసూయమ్మ (ఇనమడుగు), శ్రీ ఎస్. నాగేశ్వరరావు (నారవ), కె. సత్యనారాయణ (తెల్లదేవరపల్లి), శ్రీ కె. హుస్సేన్ (చిననందిపాడు), శ్రీ పి. సుదర్శన భట్టర్ స్వామి (శ్రీరంగం), శ్రీ వి. వెంకటనరసింహులు (మెదక్) శ్రీ కె. నారాయణ (మంచిర్యాల), శ్రీమతి ఎన్. సరస్వతమ్మ (బొంతలకోడూరు), శ్రీ డి. పార్థసారధి ఆచార్యులు (మంటాడ), శ్రీ సి.హెచ్. లక్ష్మీపతిరావు (తూర్పు కమ్మపాలెం), శ్రీమతి ఎం. సీతారావమ్మ(చుండూరు) శ్రీ డి. నూకరాజు (పెద్దాపురం), శ్రీమతి డి. అన్నపూర్ణ (పెద్దాపురం), శ్రీ జె.కె. శ్రీనివాసులు (పుట్టపర్తి), శ్రీమతి ఎం. సింగారమ్మ (తెంపల్లి), శ్రీ ఎ. శ్రీరామాచార్యులు (తెంపల్లి), శ్రీ వై సూరపురాజు (యాగాం),

ఏలేశ్వరం : - శ్రీ కె. సూర్యనారాయణ, శ్రీ కె.సత్యనారాయణ, శ్రీ కొత్త సత్యనారాయణ, శ్రీ కె. మంగరాజు, శ్రీ సి.హెచ్. నారప్ప (కోనూరు), శ్రీమతి డి.వి. అచ్యుతమ్మ (మద్యవలస), శ్రీమతి ఎం.ఎస్. ఆనందమ్మ (మదనపల్లి), శ్రీ పి. రామారావు (జాంద్రపేట), శ్రీ ఎ. రాఘవరెడ్డి (తాడిపత్రి), శ్రీ రామశాస్త్రి, లక్ష్మీదైవి (అనంతపూర్), శ్రీమతి సి.హెచ్. సామ్రాజ్యం (ఉప్పుకొండూరు), శ్రీ ఎ.ల్.ఆర్. వేణునాధన్, (హిందూపూర్), శ్రీమతి ఎ. బుచ్చాయమ్మ (జి కోడెలు), శ్రీ ఎం. లక్ష్మణరావు (అనంతపూర్), శ్రీ కె.కె.తాయారమ్మ (శ్రీకాకుళం), శ్రీమతి పి. బంగారమ్మ(తగరంపూడి) శ్రీమతి లలితమ్మ (చెన్నై), శ్రీ కె. సత్యనారాయణ (గరికినాల), శ్రీ కె. నరసింహమూర్తి (మండవల్లి), శ్రీ కె. పుష్కరరావు (శృంగవృక్షం) శ్రీ బి. బాలగంగాధరరావు (శృంగవృక్షం) శ్రీమతి ఎ. అచ్చాయమ్మ (బొద్దాం) శ్రీ ఎం. రామానుజయ్య (కర్నూలు), శ్రీ ఎం. ద్వారకానాద్ (మైసూర్), శ్రీమతి ఎం. జానకీ దేవి (మైసూర్ ), శ్రీ వి. శోభనాద్రి (పుట్రేల), శ్రీ బి. ఉమామహేశ్వరరావు (మంగళగిరి), శ్రీ ఎం. చెంచురత్నం నాయుడు( తిరుపతి), శ్రీమతి టి. శ్రీదేవి (కాజులూరు), శ్రీ వై సత్యనారాయణ (జె. తిమ్మాపురం), శ్రీమతి కె. గోవిందమ్మ (త్రిపురాంతకం), శ్రీమతి వి. వెంకటరమణ (యలమంచలి), శ్రీమతి టి. జయప్రద (దోసపాడు) శ్రీమతి ఎం. వెంకటనరసమ్మ (ఆకివీడు), శ్రీమతి జి ధనమ్మ (పోరంకి), శ్రీమతి ఎ. శశిరేఖమ్మ (పోరంకి), శ్రీ వి. రామారావు (నూతక్కి), శ్రీమతి సి.హెచ్. అన్నపూర్ణమ్మ (తాడిగడప), శ్రీమతి ఎన్. లక్ష్మి (కృష్ణారం), శ్రీ ఎం సత్యనారాయణ( రామగుండం), శ్రీ శ్యామసుందర్ శరత్ (బొబ్బిలి), శ్రీమతి ఎం. పద్మావతి (చిత్తూరు), శ్రీమతి పి. మీనాకుమారి (చిత్తూరు), శ్రీ ఇ. శేషాచలం (నర్సరావుపేట), శ్రీ మురళీధరరావు (హనుమకొండ), శ్రీ కె. నరసింహస్వామి (వరంగల్), శ్రీమతి ఎం. వెంకటనరసమ్మ (కల్వచర్ల), శ్రీ ఎం.వి. ప్రభాకరశర్మ (కల్వచర్ల), శ్రీ జి. హనుమంతరావు (వడ్డేపల్లి), శ్రీమతి క్. సూర్యకాంతమ్మ (పెద్దపుల్లేడు), శ్రీమతి సి.హెచ్. రామతులశమ్మ (చుండూరు), శ్రీమతి కె. శ్రీదేవమ్మ (పోతునూరు), శ్రీ ఎం. చిరంజీవిరావు (రేపల్లె), శ్రీ

బి. గోపాలకృష్ణ(రేపల్లె) , శ్రీ కె. లక్ష్మీనారాయణ (ప్రత్తిపాడు) శ్రీమతి పి. సరస్వతమ్మ (డెంకాడ), శ్రీమతి పి. అనంతమ్మ (మండపేట), శ్రీ జి. వెంకటరత్నం ( మండపేట), శ్రీమతి ఆర్. వాణి (తుని) శ్రీమతి ఎల్. అనసూయమ్మ (రామన్నగూడెం), శ్రీమతి పి.శ్రీకృష్ణమ్మ(పొన్నూరు), శ్రీ ఎన్. జయరామిరెడ్డి (సుబ్బారాయుడుపాలెం), శ్రీ ఐ. మధుసూధనరావు (బోగోలు), శ్రీ ఆర్ కోటి శివశంకర్ (వినుకొండ) శ్రీ వై వెంకటరావు (వేములవాడ), శ్రీమతి కె. ధనలక్ష్మి (తూములూరు), శ్రీ బి. వెంకటేశ్వర్లు (టంగుటూరు), శ్రీ ఎం. సత్యనారాయణ స్వామి (హుజూరాబాద్), శ్రీ డి. రంగాచార్యులు (పెదపరిమి), శ్రీ వై నవీన్‌బాబు (జెమీ గొల్వేపల్లి), శ్రీమతి జి. నరసింహ (ఏటికొప్పాక), శ్రీ సి.హెచ్. కృష్ణబాబు (పిఠాపురం) శ్రీ కె. రామచంద్రరావు (తెర్లమద్ది),శ్రీమతి కె. అలివేలుమంగతాయారు (నర్సాపురం), శ్రీ టి. రామ్‌సింగ్ (సదాసివపేట), శ్రీ ఎస్. వెంకటేశ్వరరావు (కందుకూరు), శ్రీ కె. శ్రీనివాసాచార్యులు (సిరిగిరిపాడు), శ్రీ వి. వెంకటరామారావు (చల్లపల్లి), శ్రీమతి జి. బుల్లెమ్మాయి (గోకవరం), శ్రీమతి కె. శ్రీమతి కె. సూర్యాదేవి (గోకవరం), శ్రీమతి డి. సుందరమ్మ (చీపురుపల్లి), శ్రీ కె.ఎన్. రావు (అమీర్‌పేట), శ్రీడి. రామరాజు (రాజ వెంకటనగరం), శ్రీ ఎం. రామచంద్రారెడ్డి (బట్టుపల్లి) శ్రీమతి డి. అనసూయమ్మ (నందివెలుగు), శ్రీ ఎస్. వెంకట నరసింహారావు (తిరువూరు), శ్రీ జి. సత్యనారాయణ (గుంటుపల్లి), శ్రీమతి పి. అప్పలనర్సమ్మ (పేంపాడు), శ్రీ కె. నరసయ్య (జగిత్యాల), శ్రీమతి ఎన్. రత్నమాణిక్యం (హుస్సేన్ పాల్ం), శ్రీ పి.రమణయ్య (చిర్లవారి కండ్రిగ), శ్రీమతి వై సుబ్బాయమ్మ (కాజులూరు), శ్రీ పి. బంగారు రాజు (వేంపాడు) శ్రీ కె. మధుసూదనరావు (అప్పికట్ల), శ్రీ కె. సత్యనారాయణ (తిమ్మనపాలెం), శ్రీమతి కె. రాములమ్మ (తిమ్మనపాలెం), శ్రీ జె. పెదకోటేశ్వరరావు (వెల్దుర్తి), శ్రీ టి. కమల శాస్త్రి (న్యూఢిల్లీ), శ్రీ జి. సునీల్ రెడ్డి, (నిజామాబాద్), శ్రీమతి కె. అనసూయమ్మ (చినగంజాము), శ్రీ జి. శంకరరెడ్డి (గూడూరు), శ్రీ ఐ.చిరంజీవిరాజు ( పండిత వెల్లూరు), శ్రీమతి జయలక్ష్మి మాధవాచార్యులు (యు.ఎస్.ఎ.) శ్రీమతి బి. పద్మావతి, రామ్‌ప్రసాద్ (యు.ఎస్.ఎ.), శ్రీ ఎమ్. వీరవెంకట సత్యనారాయణ (వేపకాయలపాలెం), శ్రీ ఎ. కృష్ణారెడ్డి (నూతక్కి) శ్రీ ఎమ్. వెంకట శివప్రసాద్ (తాడేపల్లిగూడెం), శ్రీ ఎన్. సాంబయ్య (గుండవరం), శ్రీ సి.హెచ్. కోటేశ్వరరావు (వినుకొండ), శ్రీ వై. శివనారాయణ ( వినుకొండ), శ్రీడి. సాంబశివరావు (సత్తెనపల్లి) శ్రీమతి కె.వరలక్ష్మమ్మ (భట్రక గొల్లు), శ్రీమతి ఐ. ఆదిలక్ష్మమ్మ (విస్సన్నపేట), శ్రీ వి బ్రహ్మం (కేసరపల్లి), శ్రీమతి మైథిలి భక్తవత్సలం (తిరుపతి), శ్రీమతి సి.హె.చ్.వెంకట చెల్లాయమ్మ (ఆరుగొలను), శ్రీమతి సి.హెచ్. వెంకటసుబ్బాయమ్మ (ఆరుగొలను), శ్రీమతి సి.హెచ్ వెంకటసుబ్బమ్మ (మంచాల) శ్రీమతి ఎ. సీతామహాలక్ష్మి (చౌటపల్లి) శ్రీ డి. మురళీ మోహనరావు (బాపట్ల), శ్రీ డి. నరసింహారావు (బాపట్ల),శ్రీమతి పి. నాగలక్ష్మ (ఉప్పుగుండూరు), శ్రీమతి జి. సూర్య కుమారి (తురుమెళ్ళ) శ్రీమతి శివనారాయణ (చినగంజాం), శ్రీమతి ఎ. జానకి (సీతానగరం), శ్రీ ఆర్. వెంకట కృష్ణారావు (కాకినాడ), శ్రీమతి కె. సుభద్రాదేవి (మహబూబ్‌నగర్), శ్రీమతి బి. వెంకటలక్ష్మి కమలమ్మ (ఉయ్యూరు), శ్రీ వెంకటేశ్వర్లు (జనతావి), శ్రీ ఎస్. రామకృష్ణారెడ్డి (గొల్లల మామిడాల), శ్రీ ఎ. కేశవరావు (ఖమ్మం), శ్రీమతి ఎ. రాధమ్మ (ఖమ్మం), శ్రీమతి వి. రత్నాబాయి (చెన్నై), శ్రీ ఆర్. వెంకటేష్ (చెన్నై), శ్రీమతి కె. సుశీల (బైరాయత్ గూడెం), శ్రీమతి ఎ. సైదమ్మ (నెల్లబండి గూడెం), శ్రీమతి కె. రామతులశమ్మ (తిమ్మరాజు పాలెం), శ్రీమతి టి. చంద్రముఖీభాయి (నూజివీడు), శ్రీ సి.హెచ్. పార్థసారధిరావు (పెనుబల్లి), శ్రీ జి. పోతురాజు, (వేకనూరు), ఎం. వెంకటమ్మ (కరీంనగర్), ఎన్. లక్ష్మీనరసమ్మ (ఖమ్మం), శ్రీ పి. జానకిరామయ్య (గాడుగులపల్లి), శ్రీ ఎన్. లక్ష్మీనరసమ్మ (ఖమ్మం) ఎన్. హనుమంతరావు (గండిగుంట), శ్రీ వి. సుబ్బారావు (గండిగుంట), శ్రీమతి ఎస్. వరలక్ష్మి (గుండవరం), శ్రీమతి ఎం. హైమవతి (ఇడుపులపాడు), శ్రీ ఎం. వెంకటేశ్వరరావు (అంగలూరు), శ్రీ ఎన్. లక్ష్మీనరసింహారావు( అనుమనవూడి), శ్రీ కె. కోటేశ్వర సాయిప్రసాద్ (బాపట్ల), శ్రీ ఎస్. సాయినాధరెడ్డి (గొల్లల మామిడాడ), శ్రీ ఎస్. కృష్ణమూర్తి (సిద్ధిపేట), శ్రీమతి సి.హెచ్. దమయంతి (కుంచెనపల్లి), శ్రీమతి సి.హెచ్. పిచ్చమ్మ (చంద్రాల), శ్రీ జి. నాగేశ్వరరావు (గుండవరం).





“మధులుబ్ధో యథాభృంగః
పుష్పాత్ పుష్పాంతరం వ్రజేత్
జ్ఞానలుబ్ధో తథా శిష్యః
గురోః గుర్వంతరం వ్రజేత్”

*"Madhu lubdho: Yatha: Bhrungah*
*Pushpath pushpa:ntharamVraje:th,*
*Jna:na lubdho: thattha: sishyah*
*guro:r gurvantharam vraje:th"*

***A bee collects drops of honey from different flowers thus makes a hue.***

***Real student seeking knowledge approaches great people and learns from each event. Not only from just persons but also from The Mother Nature, he learns so many lessons at every moment and thus becomes a scholarly model to the world.***

# స్పందన

1. అక్రూరునితో శ్యమంతక మణి విషయం శ్రీకృష్ణుడు చమత్కరించి చెప్పకనే చెప్పించడం ఒక్క కృష్ణునికే చెల్లింది.
-శ్రీఎం. కె. చక్రవర్తి,బ్రదర్స్, ఉయ్యూరు.

2. ఆసురీ భావనకు చెందిన స్వార్థం ప్రాణహాని కల్గించును. నిస్వార్థ భావన దైవానుగ్రహం, కీర్తిని యిస్తుందని అక్రూరుని జీవితం తెలుపుతుంది.
-శ్రీ ఎం. విశ్వనాథం, విజయనగరం.

3. కంసుడు అసురీ ప్రవృత్తితో అక్రూరుని సాయంకోరెను. అక్రూరుడు తన మనస్సు అనే క్షేత్రంలో దైవీ సంపత్తి అనే బీజం నాటుకుని, శ్రీకృష్ణ సందర్శనంతో తన జన్మ ధన్యమయ్యే మార్గం చూపిన శ్రేయోభిలాషిగ కంసుని తలుచుకొని, వచ్చిన అవకాశాన్ని తన మనస్సుకు అనుగుణంగ మలచుకొని, అవకాశాన్ని సద్వినియోగ పరుచుకొన్న ధన్యజీవి అక్రూరుడు.
-శ్రీ వి. సుజాత హైదరాబాద్

4. జ్ఞానముతో సమానమైనది పవిత్రమైనది ఈ లోకంలో మరొకటిలేదు. అక్రూరునికి అయాచితంగ లభించిన సంపద దుర్వినియోగం చెయ్యకుండా, భోగ లాలసతో అనిత్యమైన భోగాలను అనుభవించకుండా, పుణ్య కార్యాలు నిర్వహించి, భగవదర్పణగా యజ్ఞ యాగాదులు, లోక శ్రేయస్సు కొరకు కావించి ధన్యచరితుడయ్యాడు.
-శ్రీ ఎస్. కోటేశ్వరి, విజయనగరం.

5. భగవంతుని కృప భక్తుడిని ఎంతో ఎదిగేలా చేయడమే కాక, భక్తుడు తన తప్పులను తానే తెలుసుకొనేలా చేస్తుందని అక్రూరుని చరిత్ర ద్వారా తెలుసుకున్నాము.
- శ్రీ జె. రమాదేవి, ఖమ్మం

6. దైవీసంపద మంచి గుణములు అలవర్చును. అసురగుణములు విడనాడవలెను. శీలం సర్వసంపదలకు కారణం.
-శ్రీ జి. రాధాకృష్ణమూర్తి, గుంటూరు.

7. అక్రూర చరిత్ర - ఇతిహాసం విచిత్రమైనది. సహవాసం, సంపర్గదోషం యెంతగా సామాన్య మానవులలో వాటి ప్రభావం చూపుతాయో, అలానే మహాత్ముల విషయంలోకూడా చూపుతాయన్నది ఈ ఇతిహాసం ద్వారా మనకు తెలుస్తోంది. అదీకాక శ్రీవైష్ణవ సంప్రదాయంలో ప్రతిపాదించిన "ప్రపత్తి" యొక్కమహిమను కూడా మనం దీనిలో చూడవచ్చు.
- శ్రీ ఎస్.కె. చిరంజీవి, రాజస్థాన్

శ్రీ బి. మురళి బొబ్బిలి, శ్రీ ఎం. అశోకరావు కరీంనగర్, శ్రీ కె. వరదాచార్యులు తోకలపూడి, శ్రీ డి. శారదాంబ చిన్నబాడారం, శ్రీ ఆర్ అనసూయ అనంత పురం, శ్రీ ఎస్. కోటేశ్వరి విజయనగరం, శ్రీ జి. రాధాకృష్ణమూర్తి గుంటూరు, శ్రీ జె. పేరయ్య భద్రిరాజపాలెం, శ్రీ ఎం. విశ్వనాథం విజయనగరం, శ్రీ ఎం. విశ్వనాథం హనుమకొండ, శ్రీ ఎస్. సుగుణవతి చిన్నబాడారం, ఇంకా అనేకమంది తమ స్పందనను తెలియజేసారు. స్థలాభావం వలన వారి పేర్లను ప్రచురించలేక పోవుచున్నాము.

*వీరందరికీ శ్రీశ్రీశ్రీ జీయర్ స్వామివారి మంగళాశాసనములు అందచేస్తున్నాము.*

**- వికాసతరంగిణి**





## ఇతిహాస బోధ -VII శీర్షికకు పేర్లు

**1.అన్నీ అశాశ్వతాలే - భక్తి ఒక్కటే శాశ్వతం**
-శ్రీఎం.కే. చక్రవర్తి & బ్రదర్స్, ఉయ్యూరు.

**2. తొణకని హృదయం - భక్తికి దర్పణం.**
-శ్రీ ఇ.ఎల్. నరసింహారావు, మధిర

**3. సత్పురుషులున్నచోట-సస్యశ్యామలంగా ఉంటుంది.**
-శ్రీ ఎం. జయప్రకాష్, హనుమకొండ.

**4. ధనబలం కన్న దైవబలం మిన్న - ఈ రెండు కల్గియున్న ఇంక కావల్సినదేమన్న**
-శ్రీ ఎం. విశ్వనాథం, హనుమకొండ.

**5. పరమభక్తుల చరిత్ర**
-శ్రీ ఎస్.లక్ష్మీనరసింహారావు, గుంటూరు.

**6. మనం ఎన్ని అనుకొన్నా భగవత్సంకల్పమే నెరవేరు తుంది.** - శ్రీ జె. అమరయ్య, దుర్గి.

**7. తానొకటి తలచిన దైవమొకటి తలచును.**
-శ్రీ యు. గోపాలాచార్యులు, కందుకూరు.

**8. స్వార్థం - ప్రాణహాని, నిస్వార్థం - దైవానుగ్రహమును అందిస్తుంది** -ఎం. విశ్వనాథం, విజయనగరం.

**10. దైవీ సంపత్తి, అసురీ సంపత్తుల ప్రభావం**
-శ్రీ కె. లలితకుమారి, బొబ్బిలి.

**11. బీజానికి తగిన ఫలం,** వి.సుజాత, హైదరాబాద్

**12. అక్రూర వరదుడు..... గోవిందుడు**
-శ్రీ ఎస్. వెంకట హనుమంతరావు, కందుకూరు.

**14. దురాశ దుఃఖానికి చేటు, ధనము పరులకు వినియోగపడిననాడే ఆనందం.**
-శ్రీ డి. పద్మావతి, తిన్నబాడారం

**16. పద్మపత్ర మివాంభస**
-శ్రీ ఎస్. కోటేశ్వరి, విజయనగరం.

**17. తనయుని పుట్టుక తల్లి కెరుక, భక్తుని హృదయం భగవంతునికెరుక.**
-శ్రీ జె. రమాదేవి, ఖమ్మం

**18. స్వార్థరహితమైన సేవ చేసేవారిపైపే భగవంతుడు నిలుస్తాడని నిరూపణ.**
-శ్రీ ఎం. అశోకరావు, కరీంనగర్

ఎస్. లక్ష్మి మబగాం, డి. విజయ ఆకివీడు, శ్రీ వల్లి ఆండాళ్ విజయవాడ, ఆర్ అనసూయ అనంతపురం, ఎం. సూర్యనారాయణ మెళియపుట్ట, కుముదవల్లీ తాయారు గుడివాడ, కె. ఇందిరాదేవి బొమ్మకల్లు, ఎస్. అనసూయమ్మ రాజపురం, శిరీష హైద్రాబాద్, డి. రాజమణి హైద్రాబాద్, ఎం. పద్మావతి వార్ధా, పి. వైదేహి విజయవాడ, అప్పలరాజు బొబ్బిలి. ఇంకా అనేకమంది ఇతిహాసబోధకు తమ పేర్లను సూచించారు. వీరందరికీ శ్రీస్వామివారి మంగళాశాసనములు అందజేస్తున్నాము.




VIJAY ADS - GNT



# సందేహాలు - సమాధానాలు

శ్రీ కె. సూర్యప్రకాశరావు, కంకిపాడు.

ప్ర: దైవాన్ని ప్రార్థించేటపుడు ఫలానా కోరికలు కోరితే తీర్చవలసిందిగా కోరుతూ ప్రార్థించవచ్చా?

జ: ప్రార్థించడంలో తప్పులేదు. కోరికలు కోరితే, అవి యివ్వవచ్చా తగదా ఆలోచించి, తగినంతగానే భగవంతుడు ఇస్తాడు. కోరికలు కోరకుండా ప్రార్థిస్తే తన తాహతకు తగినంతగా ఔదార్యానికీ తగినంతగా యిస్తాడు. కోరిన దేవతలకు రాక్షసపీడ తొలగించి ఊరుకున్నాడు. కోరికలు కోరని ధ్రువుడికి శాశ్వతస్థానాన్నే ఇచ్చాడు.

❊❊❊

మురళీధర్, హన్మకొండ

ప్ర: మా తల్లిగారు పరమపదించినారు. అయితే 1సం॥ వరకు దేవాలయములకు వెళ్ళకూడదు, ఇంట్లో దైవానికి దీపారాధన చెయ్యకూడదు అంటారు. ఇది నిజమేనా?

జ: ఇంట్లోచేసుకొనే నిత్యారాధన, ఆశౌచం తీరిన మరునాటినుండే చేస్కోవాలి. దీపారాధన దానిలో భాగమేకదా! దేవాలయానికి గూడ దర్శనార్థం వెళ్ళవచ్చు. ఉత్సవాలు చేస్కోడం, విలాసాలు జరపడం తగదు, అంతే తప్ప దైవప్రార్థనా, ఆరాధనాదులు మనిషికి ఓర్పు, శక్తిని ప్రసాదిస్తాయి అవిచేయాలి.

శ్రీ కె.వి.యమ్. శర్మ, కమలాపురం.

ప్ర: ఆలయాలలో గంట ఉపయోగం ఏమిటి? గంట ఎవరు ఎన్నిసార్లు కొట్టాలి?

జ: సుప్రభాతం, నీరు తేవడం, ఆరాధనారంభం, నైవేద్యాలలో బయటి గంట కొడతారు. జనాలకు ఆలయ విధులు తెలియడానికి. ఇక, అర్చకుల వారి వద్ద ఉన్న గంట, ప్రతీ ఉపచారానికీ సమర్పించుతారు. ఆలయార్చకులే లోపలి గంట వాయిస్తారు.

❊❊❊

ప్ర: ధ్వజ స్థంభం యొక్క ప్రాముఖ్యత ఏమిటి?

జ: ధ్వజస్తంభం గరుడునికీ, ఆతడు వేదానికి ప్రతీక. లోపల వేంచేసి ఉన్నది వేదము తెలిపే భగవానుడు అని తెలిపేదే అది.

❊❊❊

శ్రీదాసరి రజనీకృష్ణ, విజయనగరం.

ప్ర: పుష్పములోని పుప్పొడి తగిలితేనే లక్ష్మీదేవి పాదాలు కందిపోతాయి. అంత సుకుమారి అని చెప్తారు కదా! ఎంత విలువైనవి అయినప్పటికినీ బంగారు పుష్పాలు మోటుగా ఉంటాయి కదా! పూజకు తగునా?

జ: నిజానికి, మామూలు పుష్పాలకంటే బంగారు పుష్పాలు మరీ కఠినం. అంచేత వాడతగదు. అయితే, అన్ని కాలాలలోనూ పూలు లభించవు కదా! ఏవో ఒకటి అర్పించనిదే మనసు ఉండబట్టదు. అతి విలువైనదేదో అది అర్పించాలనిపిస్తుంది. అలా భావించి నపుడు బంగారుపూలు తగును. ఒకసారి వాడినా అవి నిర్మాల్యాలైపోవు, కడిగి మరల వాడవచ్చు. అయితే అర్పించేటపుడు జాగ్రత్తగాఅర్పిం

❊❊❊

చడం అలవరచు కోండి. బయట అవే అర్పించినా, అందులో మీ సున్నిత మైన మనసుంచి అర్పించండి మరి!

❀❀❀

శ్రీమతి పి.టి. అవనిజ, అనంతపురం.

ప్ర: తులసీదాసు విరచితమైన 'రామ చరితమానస'లో రాముల వారిని శబరి తనకు కైవల్యం ఇవ్వమని కోరుతూ "అధముల్లోనే అధములైన వారిలో స్త్రీజాతి మరింత అధమం" అని అభివర్ణించింది. స్త్రీజాతి ఇంత అధమం కావటానికి ఆమె యొక్క భావం ఏమిటి? ఈకాలంలో అధమం అనే పదానికి, ఆ కాలంలో అధమం అనే మాటకు ఏదైనా తేడా ఉందా? ఉంటే ఆ వ్యత్యాసం వివరించగలరు?

జ: శ్రీవాల్మీకి రచించిన శ్రీరామాయణంలో శబరి అలా అడగలేదు. తన ఆచార్యుల పాదసన్నిధిని చేరాలని మాత్రమే అడిగింది. తులసీదాసు కాలమైన 12వ శతాబ్దాన్ని బట్టి ఆయన అలా వ్రాసుకొని ఉండవచ్చు. శబరి కాలంలో స్త్రీలను చాల గౌరవంగా చూచారు, అధములుగా కాదు. ఒక స్త్రీ మాట కోసమే గద శ్రీరాముడెన్నో చేసాడు. రాజ్యం వదిలాడు, లేడి వెంట నడిచాడు. మోక్షాన్నిచ్చాడు, ఒకటే మిటి కనుక! తులసీదాస్ కాలానికి, అందునా ఉత్తర భారత దేశంలో స్త్రీలస్థితి శోచనీయంగ ఉంది. అదే ఆయన గ్రంథంలో కన్పించిందితప్ప అసలు శబరి స్థితి అదికాదు. ఆమె అలా అనలేదుగూడ. అందుకే రామాయణకాలంనాటి పరిస్థితులను, అసలు భారతీయ సంస్కృతినీ తెలుసుకోవాలంటే వాల్మీకి రామా యణం చదవండితప్ప, ఎవరో రాసుకొన్న స్వంత రాతలు చదవకండి మరి!

❀❀❀

శ్రీ ముండుంబై శ్రీనివాసాచారి, కొత్తగూడెం, ఖమ్మంజిల్లా.

ప్ర: ఈ మధ్య మేము ప్రయాగ, కాశి, గయ వెళ్ళటము జరిగింది. ప్రయాగ మహావిష్ణువు ముఖమనియు, కాశి నాభి అనియు మరియు పాదం గయ అనియు తెలిపారు. మరి ప్రయాగ, కాశి, గయ మొత్తము విష్ణుమూర్తి స్థానమైనప్పుడు,కాశిలో విశ్వేశ్వరుని ఆరాధించటములో అంతర్యమేమిటో తెలియపర్చగోరుచున్నాను?

జ : ఆయా స్థానము యొక్క వైభవాన్ని తెలుపడానికి అలా వివిధ అంగాలతో పోలుస్తారు. అసలు ఈ విశ్వమంతా విష్ణువుయొక్క దివ్యదేహమనేకదా వేదాలు చెప్తున్నాయి. వివిధ దేవతలూ, ఒక్కొక్కరు ఒక్కొక్క బాధ్యతను నిర్వహిస్తారు. ఆయా బాధ్యతనుబట్టి, ఆయా స్థానంలో వారు వారున్నట్లు భావించి, అక్కడ ఆలయాలు నిర్మించి ప్రతిష్ఠించి ఆరాధిస్తున్నారు. కాశీలోనూ అలానే కావచ్చు. విష్ణువు నాభినుండే గద బ్రహ్మ, శివుడూ గూడ వచ్చారు. మూలరూపుడు కనిపించడు. ఆతనినుండి వచ్చినవారు కనిపిస్తారు. వీరు ఆ మూలముయొక్క వివరణ మని, అంశలని గుర్తింప చేయడమే ఆంతర్యం.

❀❀❀

శ్రీ యస్. కె. చిరంజీవి, రాజస్థాన్, కోట.

ప్ర: మా తండ్రిగారు మరణించిన మొదటి సం॥లోనే గయాశ్రాద్ధం, బదరీ బ్రహ్మ కపాల పిండం చేయవచ్చునా? లేక, సంవత్సరీకములు తర్వాతనే చేయాలా?

జ: సంవత్సరీకాలైనాకనే గయలో విష్ణు పాదంవద్ద, ఆ తర్వాతనే బదరీ బ్రహ్మ కపాలం వద్ద పిండప్రదానం చేయాలి.

❀❀❀





# శ్రీరంగం, శ్రీవీరరాఘవ రామానుజకూట పునర్నిర్మాణమునకు కైంకర్యములు చేసిన భక్తుల వివరములు

JET U.S.A INC., - U.S.A

శ్రీమాన్ డా॥టి. శ్రీనివాసాచారి అండ్ ఫ్యామిలీ, U.S.A.
శ్రీమతి ఎ. లక్ష్మినరసమ్మగారు, హైద్రాబాద్
శ్రీమతి పి. ఆండాళ్‌దేవిగారు, హైద్రాబాద్
శ్రీమాన్ జి. పురుషోత్తమరావు గారు, హైద్రాబాద్
శ్రీమాన్ టి. విజయకుమార్ గారు, హైదరాబాద్
శ్రీమాన్ డా॥ బి. రాధాకృష్ణగారు, వరంగల్
శ్రీమాన్ జి. వెంకటశేషావతారంగారు, భీమవరం
శ్రీమతి జె. శ్రీకుమారి రామేశ్వరరావు గారు, హైద్రాబాద్
శ్రీమతి బొజ్జా అరుందతి కమలాకర్ రెడ్డిగారు, U.S.A.
శ్రీమతి & శ్రీ డి. కొండమ్మ చిరంజీవి రాజుగారు, విశాఖపట్నం
శ్రీమతి ఎస్. అనూరాధగారు, U.S.A.
శ్రీమతి వి. రూపాదేవిగారు, హైద్రాబాద్
శ్రీ డా॥లీలాజోస్యులుగారు, U.S.A.

**శ్రీమతి పి. ఆండాళ్‌దేవిగారి(హైద్రాబాద్) ద్వారా :**

శ్రీ భూదేవి రామానుజ దాసురాలు, శ్రీమతి & శ్రీ కె. రామనవనీత కృష్ణారావు, శ్రీమతి సంధ్య (వరంగల్), శ్రీమతి & శ్రీ కె. వసుమతి పురుషోత్తమ రెడ్డి, శ్రీమతి & శ్రీ పుష్పారంగారెడ్డి, శ్రీమతి & శ్రీ అనిత మురళీధరరావు , శ్రీమతి & శ్రీ అరుణా రాజేశ్వరరావుగారు, శ్రీమతి & శ్రీ ఉమా ప్రమోదరెడ్డి, శ్రీమతి కె. వసంత, శ్రీమతి & శ్రీ వి. ఫణికొండా రామారావు, శ్రీమతి ఎ. సుశీల, శ్రీమతి శ్రీకాంత్ బద్రుక, సికింద్రాబాద్ మోటార్స్, శ్రీమతి శకుంతలా దేవి, శ్రీమతి & శ్రీ ఎన్. శైలజా శ్రీనివాస్ రెడ్డి, శ్రీమతి & శ్రీ ఎన్. లక్ష్మీ శ్రీనివాస్‌రెడ్డి, శ్రీమతి & శ్రీ ఎన్. ఉషా అనీల్‌రెడ్డి, శ్రీమతి సి. రేణుకా రెడ్డి, శ్రీమతి & శ్రీ జి. మంగారవీంద్రరావు, శ్రీమతి & శ్రీ పి. సూర్యకుమారి నారాయణరావు (వరంగల్), శ్రీమతి & శ్రీ ప్రమీళా వేణుగోపాలరావు (వరంగల్), శ్రీమతి & శ్రీ ఎం. కృష్ణారవీంద్రరెడ్డి, శ్రీమతి కమలాదేవి, శ్రీమతి & శ్రీ అహల్యా రామకృష్ణారెడ్డి ,శ్రీమాన్ డా॥ E.V. Chery etc., శ్రీమతి & శ్రీ జి. వనజా భాస్కరరావు,శ్రీమతి & శ్రీ శ్యామలా రామారావు, శ్రీమతి & శ్రీ లలితా తిరుపతిరావు, శ్రీమతి & శ్రీ ఎన్. ప్రేమలతా దామోదరరావు, శ్రీమతి & శ్రీ సరళా రాజేశ్వరరావు, శ్రీమతి & శ్రీ డా॥పి.శ్రీష సుశీల్ రావు, శ్రీమతి & శ్రీ ఎన్. సురేంద్రరెడ్డి, శ్రీమతి విజయ, శ్రీమతి అనసూయ, శ్రీమతి గంగమ్మ,

శ్రీమతి & శ్రీజానకీ కన్నారెడ్డి, శ్రీమతి మాధవి, శ్రీమతి & శ్రీ పుష్పా రంగారెడ్డి, శ్రీమతి & శ్రీ పద్మిని ప్రభాకరరావు (వరంగల్), శ్రీమతి & శ్రీ కె. విమల రఘోత్తమ్ రెడ్డి, శ్రీమతి & శ్రీ నబితా వినోద్‌రావు(U.S.A.),శ్రీమతి & శ్రీ సరితా వినయ్ రావు (వరంగల్), శ్రీమతి & శ్రీ రవీనా రెడ్డి (వరంగల్), శ్రీమతి & శ్రీ కె. భారతి విద్యాసాగరరావు (వరంగల్), శ్రీమతి ఎన్. సరస్వతీదేవి (వరంగల్), శ్రీమతి & శ్రీ జయమాలా రమణారెడి, శ్రీమతి & శ్రీ అరుణా రాఘవరెడ్డి, శ్రీమతి & శ్రీ వి. నిర్మల కొండలరావు, శ్రీమతి అనూరాధ అమరావతి, గిరిజ, శ్రీమతి & శ్రీ లక్ష్మీనారాయణ సుంత్వాల్ , శ్రీమతి & శ్రీ సి.హెచ్. సువర్ణ నరసింగరావు, శ్రీమతి & శ్రీ పి. మోహనరావు (వరంగల్), శ్రీమతి & శ్రీ కె. వసంతరావు (వరంగల్), శ్రీ ఇ. శ్రీరంగారావు (వరంగల్), శ్రీమతి & శ్రీ ఇ. స్వరూప విజయ్‌రావు, శ్రీమతి కె. ఆండాళ్ దేవి, శ్రీమతి పి. రాధాదేవి (వరంగల్), శ్రీమతి & శ్రీ రమాప్రతాపరెడి, శ్రీమతి & శ్రీ శేషమ్మ సుబ్బారావు, శ్రీమతి & శ్రీ ప్రసూన సి.ఎస్. రెడ్డి, శ్రీమతి టి. ఆండాళ్ దేవి, శ్రీమతి & శ్రీ సునీత విజయన్, శ్రీమతి & శ్రీ సి.హెచ్. మాలతి సత్యనారాయణ రావు, శ్రీ కె. వెంకటయ్య (వరంగల్), శ్రీమతి & శ్రీ సరళా డా॥ ప్రభాకరరావు, శ్రీమతి & శ్రీ పద్మజ జితేంద్రరావు, శ్రీమతి & శ్రీ కె. ప్రవీణ అశోకకుమార్, శ్రీమతి & శ్రీ ఇ. ఆరతి ప్రహ్లాదరావు, శ్రీమతి & శ్రీ కె. సత్యప్రియ విద్యాసాగర్‌రావు, శ్రీమతి & శ్రీ జి.భాగ్యలక్ష్మి శ్యామసుందర్ రావు, శ్రీమతి & శ్రీ కె. లక్ష్మి సురేందర్‌రావు, శ్రీమతి & శ్రీ జి. రాజకుమారి రంగారావు, శ్రీమతి & శ్రీ బి. నిర్మల కృష్ణారావు, శ్రీమతి & శ్రీ రాజేశ్వరి గిరిధరరావు, శ్రీమతి & శ్రీ పి. శకుంతల రవీంద్రనాథ్ ఠాకూర్.

**శ్రీమాన్ జి. పురుషోత్తమరావు(హైద్రాబాద్) గారి ద్వారా**

శ్రీమాన్ ఎర్రబల్లి సునీల్ కుమార్ (U.S.A.), శ్రీమతి శ్రీలతా భూపాల్ రెడ్డి, శ్రీమాన్ ఎర్రబల్లి ఉదయకుమార్ (U.S.A.) శ్రీమతి & శ్రీ కె. సుహాసినీ మధుసూదన్‌రెడ్డి, శ్రీమతి & శ్రీ ఇందిరా సుధాకరరావు, శ్రీమతి & శ్రీ లీలాసాగరరావు, శ్రీమాన్ వి. రామకిషన్‌రావు, శ్రీమతి కె. వరమ్మ, శ్రీమాన్ ఇ. సంపత్ రావు, శ్రీమతి & శ్రీ రామ సహాయ మాధవీ జయంతి రెడ్డి.

# మధుర వాగ్వర్షి -మా యెలిజర్ల స్వామి!

-డా. తె.కం.వెం.అయ్యంగార్, వరంగల్.

ఉభయ వేదాంత ప్రవర్తకులు శ్రీమాన్ కండ్లకుంట సీతారామాచార్య స్వామివారు (యెలిజర్ల స్వామివారని వ్యవహారం) 30-12-2001 తేదీన ధనుర్మాసంలో ''ఎల్లేఇళఙ్కిళియే' పాశురం రోజున ఉదయం ఆచార్య తిరువడిఘళ్ చేరారనే వార్త మన శ్రీవైష్ణవలోకానికి, అశనిపాతమే! ఇక ఇక్కడవారు కనిపించరు, వారి శ్రీసూక్తి మనకు ఇక వినిపించదు కదా! వారు తమ ఆచార్యులతో కలసి, ముక్తులతోనూ, నిత్యులతోనూ కలసి-శ్రియః పతిని ''హా!ఊ!హా!ఊ!హా!'' అని అనుభవిస్తూ ఆనందమయునితో కలసి ఆనందాన్ని అనుభవిస్తూనే ఉంటారన్నది నిజమే అయినా, మనకు దూరం గనుక మనకి బాధే!

శ్రీమాన్ యెలిజర్ల స్వామివారు చాలామంది వైష్ణవ స్వాములకు భిన్నంగా ''ధర్మజ్ఞ సమయః ప్రమాణం'' అన్నట్లు తమపెద్దలు ధరించినట్లు ఊర్ధ్వపుండ్రంలో ఎర్రని శ్రీచూర్ణం బదులు పచ్చని శ్రీచూర్ణం ధరించి, అద్భుతమైన ఉపన్యాసకులు అయినా, అంతగా గాంభీర్యాన్ని ప్రకటించని సామాన్య వేషధారణతో ఉండేవారు. పలు ప్రాంతాలలో చిన్నలనుంచి పెద్దలవరకూ అందరినీ ఆకర్షించేలా తిరుమంత్రార్థము, శ్రీవచన భూషణము మొదలైన రహస్య గ్రంథాలూ, ఆళ్వారుల దివ్యప్రబంధాలు, ఈడు వ్యాఖ్యాన సహితంగా భగవద్విషయము, శ్రీమద్రామాయణాది ఇతిహాస పురాణాల విశేషాలు, స్తోత్రవాఙ్మయము, సంప్రదాయ విశేషాలు పలుమారులు పలువురు శిష్యులకు సదస్యంగానూ, రహస్యంగానూ అనుగ్రహించిన మహానుభావులు వారు. మధురమైన గాత్రమూ, అంతకన్న మధురమైన భాషా వైదుష్యమూ, అంతకన్నా ఇంకా మధురమైన విశేషాలూ, మధ్యమధ్యలో అక్కడక్కడ ''ఓహో'' అనిపించేలాంటి మాండలిక పదప్రయోగపు గుబాళింపులూ స్వామివారి ఉపన్యాసాలలోని కొన్ని ప్రత్యేకతలు! సంప్రదాయ గ్రంథాలనుంచీ భగవద్విషయాది గ్రంథాల నుంచీ తమ దైనభాషకాని తమిళవాక్యాలను, వాక్య ఖండాలను అలవోకగా ఉదహరించడం శ్రీస్వామివారి ప్రత్యేకత! పాత తరపు పెద్దల ప్రతినిధిగా మనకు ఉన్న తక్కువమంది ఆచార్యులలో ఒకరు శ్రీస్వామివారు. వారిని చూచి-మనమూ ఇలా చదువుకుని ఉంటే తమిళభాష మనకీ లొంగి ఉండును కదా! అని మా వంటివారు మళ్ళీమళ్ళీ అనుకునేలా సాగేది వారి ఉపన్యాసం. మధురమైన పదాలను సుందరమైన కూర్పుతో మేళవించి మకరందధారలా శ్రోతలపై ప్రసరింపజేయడమూ ప్రవహింపజేయడమూ శ్రీయెలిజర్ల స్వామివారి సహజధోరణి. సంప్రదాయజ్ఞులైన పెద్దలలో అంతటి మధురమైన తెలుగు మాట్లాడేవారు అరుదు! (ఇంచుమించుగా లేరేమో కూడా!) వారిని ఎరిగినవారు ఎవరైనా - ఇక అటువంటి పెద్దలు మరి మనకు లభించనే లభించరు అంటారు నిస్సందేహంగా!

ఈ మధ్య 1999-2001 ల మధ్య మా ఆచార్యులు శాస్త్రరత్నాకర, మహామహోపాధ్యాయ కవి శాబ్దికకేసరి శ్రీమాన్ ఉ.వే.న.చ. రఘునాథాచార్యస్వామివారు





వరంగల్‌లో నిర్వహించిన శ్రీ భాష్య శిక్షణా శిబిరాలలో మొదటి నాలుగు శిబిరాలలోనూ - వారి కుమారులు శ్రీమాన్ నరసింహాచార్యస్వామి వారితోపాటు అన్వయించారు శ్రీస్వామివారు. ఆ గోష్ఠిలో అన్వయించిన అస్మదాదులకు ఆదర్శంగా ఉండేవారు. జరిగిన పాఠం ఏరోజుకారోజు చింతన చేసస్తూంటే అందరికన్నా ముందుగా చింతనకు వచ్చి కూర్చునేవారు. ఖాళీ సమయాలలో సంప్రదాయ విశేషాలను ఎన్నింటినో మధురంగా అందరితోనూ పంచుకునేవారు. వారు పెద్దకాలక్షేప పరులై, పెద్ద పండితులై ఉండి, మావంటి చిన్నలతో చిన్నగా సమానంగా కలసి అందరినీ ప్రోత్సహించడం వారి నిష్కల్మష హృదయానికి దర్పణం. **"తస్మాత్ బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్'** అన్న ఉపనిషద్వాక్యానికి వారు ఉదాహరణం!

ఎంత సమయం ఇస్తే-అంతే సమయంలో సారతమమైన విషయాలను తెలియజేసి ఉపన్యాసం ముగించడం కూడావారి ప్రత్యేకత. సుమారు పది సంవత్సరాల క్రిందట ఒక చైత్రశుద్ధ దశమినాడు వారు, వారితండ్రిగారు (ఇద్దరూ మంచి యాజ్ఞీకులుకూడా!) మామిత్రులు శ్రీమాన్ ఉ.వే. సముద్రాల పురుషోత్తమాచార్యులుగారి ఇంటిలో శ్రీసీతారామ కళ్యాణం జరిపించారు. కార్యక్రమం పూర్తయేసరికి 3.00 గంటలు అయింది. సాయంత్రం. సాపాట్లకోసం, ప్రసాద స్వీకరణం కోసం ఎదురుచూచేసమయం. ''స్వామీ! ఒక్క అయిదు నిముషాలు ఏదయినా శ్రీసూక్తి ప్రసాదించండి'' అని కోరాడు దాసుడు. వారు -చాలా సంకోచిస్తూ అంగీకరించి, కాదనలేక అయిదేనిము షాలు మాట్లాడారు. "ఏకోరసః కరుణ ఏవ" అన్నాడు భవభూతి. రామాయణం కరుణరస ప్రధానమైన కావ్యం. వేదాంత దేశికులు **'కరుణా కాకుత్థ్స'** అంటారు! అంటూ- ఒక్క వ్యర్థపదం లేకుండా శ్రీసూక్తి ప్రసాదించిన తీరు దాసునికి కన్నీరు జలజలా ప్రవహించేలా చేసింది. ఈ సంఘటన దాసుడు ఎప్పటికీ మరువలేడు!

స్తోత్రరత్నం పై ఒక సారిప్రసంగిస్తూ యామునుల వైభవాన్ని చెప్తూ - **"విధిశివ సనకాద్యైః ధ్యాతుం అత్యంత దూరం తవ పరిజన భావం కామయే"** అని కోరారు యామునులు- **"కామవృత్తః"** కదానేను!" ఇది కోరదగినది, ఇది కోరదగనిది అని ఉండదుకదా నాకు!'' అని సాయించారు.

చెప్పుకోవాలంచే ఎన్నో జ్ఞాపకాలు. శ్రీయెలిజర్లవారు మనకి కనిపించరు! వారి గొంతు వినిపించదు! వారు ఎంతో మాధుర్యాన్ని మనస్సులోనూ, హృదయం లోనూ, భాషలోనూ నింపుకున్నారని శ్రియఃపతి ఇంకవారికి **"మాధుర్యం"** వద్దని, మధురం తినకుండా చేసి వారిని శ్రమపెట్టి తమ సన్నిధికి చేర్చుకున్నాడు. వారి ఆచార్యులు శ్రీ శఠగోపదేశికులవారు ''మా శిష్యుడు! ఎంత ప్రతిభ కలవాడో!1 ఈడు పంక్తులు చదివి భగవద్విషయం ప్రసాదిస్తాడు చూడండి'' అంటే- శ్రీ యెలిజర్లవారు భగవద్విషయం ప్రసాది స్తూంటే - పూర్వాచార్యులు- నంబిళ్ళగారితో సహా అందరూ ముగ్ధులై వింటూ ఉంటారు. అక్కడ!

***పరమపదవాసులు ఉ.వే. శ్రీమాన్ కండ్లకుంట సీతారామాచార్యస్వామి వారిని గురించి ఉ.వే. శ్రీమాన్ సముద్రాల శఠకోపాచార్యస్వామివారు కూడా ఒక వ్యాసాన్ని పంపినారు. స్థలాభావం వల్ల దాన్ని ప్రకటించలేకపోతున్నాం.***

-VIII



# ఇతిహాసబోధ - VIII

మనది ఋషి సంస్కృతి. జాతికి ఉత్తమ సంస్కారాలనందించి నాగరిక పథంలో నడిపించిన వారు మహర్షులే. అడవులలో తపోజ్ఞాన సంపన్నులై ఆశ్రమ జీవనం గడిపినా, అవసరమైనప్పుడు సమాజహితాన్ని కోరి ప్రజలను, పాలకులను సరిదిద్ద ప్రయత్నించే లోకహితైషులు వారు. ఆగ్రహానుగ్రహ సమర్థులైన ముని జనులను గౌరవించి శుభాలు పొందినవారు, నిర్లక్ష్యంచేసి నశించినవారు చరిత్రలో ఎందరో ఉన్నారు. అలాంటి వారిని కొందరిని గూర్చి ఈ 'ఇతిహాసబోధ'లో చర్చించు కొందాం.

మాయాజూదంలోఓడిన పాండవులు అన్నమాట ప్రకారం అడవులపాలయ్యారు, కామ్యకవనంలో ఉన్న పాండవులను కలుసుకొని, వేదవ్యాసుని ఆజ్ఞమేరకు ధర్మవేత్త అయిన మైత్రేయమహర్షి కౌరవులకు హితవుచెప్పడానికి హస్తినకు వెళ్లాడు. అక్కడ ధృతరాష్ట్ర దుర్యోధనాదు లను కూర్చుండ బెట్టుకొని కౌరవ పాండవుల సఖ్యత అవసరాన్ని గూర్చి ఎంతగానో బోధించాడు. దుర్యోధనునికి అతిలోభం కూడదన్నాడు. మైత్రేయుని మంచి మాటలు దుర్యోధనునికి రుచించలేదు.

మైత్రేయుడు మాట్లాడుతుంటే, అతని పట్ల నిరాదరంతో, నిర్లక్ష్యంగా కాలిబ్రొటన వ్రేలితో నేలపైవ్రాస్తూ, చేయెత్తి తొడలు చరుస్తూ పరిహాసంగా నవ్వసాగాడు దుర్యోధనుడు. ఆగ్రహం కల్గింది మైత్రేయునికి. 'దుర్యోధనా! అహంకారంతో, అవిధేయతతో నా పలుకులను లక్ష్యపెట్టనందుకు తగిన ఫలాన్ని అనుభవించెదవు గాక! భీకర యుద్ధం లో భీమగదాప్రహారానికి తొడలు విరిగి గర్వభంగం పొందక తప్పదు. గుర్తుంచుకో'. శపించాడు మైత్రేయుడు.

మన్నించమని మునిని ప్రార్థించాడు ధృతరాష్ట్రుడు. 'బుద్ధిహీనుడై దుర్యోధనుడిదేవిధంగా ప్రవర్తిస్తే తప్పక శాపఫలాన్ని అనుభవిస్తాడు. సమబుద్ధికలిగి, సఖ్యతతో వ్యవహరిస్తే శాపం ఫలించ'దని పలికి మైత్రేయుడు హస్తినను విడచి వెళ్ళాడు. మునివాక్కును నిర్లక్ష్యం చేసి దుర్యోధనుడు అతనితోపాటు కౌరవులూ సర్వనాశనమయ్యారు.

పాలకుడు కాకపోయినప్పటికీ, శ్రీకృష్ణుని ఘనత తెలిసిన నారదాది దేవమునులు, మహర్షులు, ద్వారకకువచ్చి కృష్ణుని దర్శించి వెళుతూండేవారు. ఒకసారి శ్రీకృష్ణుని దర్శనానికై శివాంశసంభూతుడూ, ముక్కోపీ అయిన దుర్వాసమహర్షి ద్వారకకు వచ్చాడు. శ్రీకృష్ణుడు ఎంతో ప్రీతితో అతనికి అతిథిసత్కారాలు చేసాడు. శ్రీకృష్ణ భవనంలో విడిది చేసిన దుర్వాసుడు వింతవింతగా ప్రవర్తించసాగాడు. ప్రేమతో వడ్డించిన భోజనాన్ని ఒక్కొక్కప్పుడు ఛీత్కరిస్తూ తిరస్కరించేవాడు. ఒక్కొక్కసారి అనేకమందికై వండిన భోజనాన్ని ఒక్కడే ఆరగించేవాడు. కొన్నాళ్ళు శయ్యపైన, కొన్నాళ్ళు నేలపైన పడుకొనేవాడు. ఆదరంగా పలకరించేవాడు, అంతలోనే అమితాగ్రహాన్ని ప్రదర్శించేవాడు. ఈ విపరీత చేష్టలన్నింటినీ కృష్ణుడు పరమా

20/Bn/Bnfeb02.p65



దరంతో, విధేయతతో మన్నిస్తూండేవాడు.

ఓ రోజు దుర్వాసుడు 'కృష్ణా! నాకీరోజు పాయసం తినాలని వేడుకగా ఉంది. వెంటనే పాయసం చేయించు'. అని ఆజ్ఞాపించాడు. ఆజ్ఞను శిరసావహించాడు కృష్ణుడు. తెచ్చిన పాయసాన్ని కొంత ఆరగించి, మిగతా పాయసాన్ని తన వొంటికి పూయవలసిందిగా కృష్ణుని కోరాడు దుర్వాసుడు. పూసాడు కృష్ణుడు. చెంతనే ఉండి వింతగా చూస్తున్న రుక్మిణిని గమనించి దుర్వాసుడు, తనకు పూయగా మిగిలిన పాయసాన్ని తీసుకొని ఆమె దేహానికి పూసాడు.

అంతటితో ఊరుకోక 'కృష్ణా! వెంటనే రథం తెప్పించు. అశ్వానికి బదులు రుక్మిణి రథం లాగుతుంటే రథమెక్కి ద్వారకలో విహరించాలనిఉంది'. అన్నాడు దుర్వాసుడు. మారుమాటాడక వాసుదేవుడు ముని వాక్కును అమలు పరిచాడు.

'నావెంట నడచిరా!' అని కృష్ణుని ఆజ్ఞాపించి రథమెక్కి రుక్మిణిని ములుకోలతో పొడుస్తూ, అదమాయిస్తూ వీధులలో విహరించసాగాడు దుర్వాసుడు. ఈ దృశ్యాన్ని చూచిన ద్వారక ప్రజలకు మతిపోయింది. భారంతో దుర్వాసుని రథం లాగుతున్న రుక్మిణిని, మౌనంగా రథాన్ని అనుసరిస్తున్న కృష్ణుని చూచి వారు గుసగుసలాడుకొంటూ, గుంపులుగా రథాన్ని అనుసరించారు. భయమూ, బాధ, ఆగ్రహమూ, ఆశ్చర్యమూ, అన్నీ మిళితమైన యాదవులా సన్నివేశాన్ని భరించలేక భోరుమని ఏడ్చారు. అయినా కృష్ణుడు చలించలేదు. ఈషణ్మాత్రపు వికారం అతని ముఖంలో వ్యక్తం కాలేదు.

కొంత సేపటికి రథాన్ని ఆపి, క్రిందికి దిగిన దుర్వాసుడు కోపంతో రుక్మిణి పై దుమ్ము చల్లి, దక్షిణ దిక్కుకు వేగంగా పరుగెట్టాడు. శ్రీకృష్ణుడు కూడ మునిని అనుసరించి, ''స్వామీ! మా అపరాధాలను మన్నించు, ఆగ్రహించి మమ్మల్ని విడనాడకు. వచ్చి ఆతిథ్యాన్ని స్వీకరించు''. అంటూ దుర్వాసుడిని పలువిధాలుగా వేడుకొన్నాడు.

కృష్ణుని మాటలకు కరిగిపోయాడు దుర్వాసుడు. 'కృష్ణా! నీవెంత గొప్ప వాడివయ్యా! ఎన్నెన్ని రకాలుగా కష్టపెట్టినా నా పై ప్రేమనే ప్రదర్శిస్తున్నావు. నీ మునిజన సేవానురక్తి అభినందనీయము. నీ సేవా తత్పరత అనన్యసామాన్యం. క్రోధం నీ వశవర్తి. అందరూ తమను తాము ఎంతగా ప్రేమిస్తారో అలా నిన్ను కూడా ప్రేమిస్తారు. లోకారాధ్యుడవై ఎదురు లేకుండా వర్థిల్లు.

నీవు నా శరీరమంతా పాయసం పూసి, అరికాళ్ళకు పూయడం మరిచావు. నీకు పరమపదప్రాప్తికి యోగ్యమయ్యే విధంగా మృత్యువు అరికాలి ద్వారా ప్రవేశిస్తాడు. మునిజనుల పట్ల ఇలాగే భక్తి ప్రపత్తులతో వర్థిల్లు! నీకు శుభం కలుగుతుంది'. అని ఆశీర్వదించాడు.

రుక్మిణిని చూచి 'అమ్మా! నీ భక్తికి ఎంతో సంతోషించాను. కృష్ణుని భార్యలందరిలోకీ, అధిక గౌరవమర్యాదలు నీకే లభించుగాక. సౌందర్య, సౌభాగ్యాదుల యందు సాటిలేని దానివై వర్థిల్లు!' అని వరమిచ్చి దుర్వాసుడు అంతర్ధానమయ్యాడు.

మరుక్షణంలో శ్రీకృష్ణుడు, రుక్మిణిల దేహాలు దివ్యతేజస్సులతో జాజ్వల్యమానంగా ప్రకాశించాయి. వారింటిలో అపరిమితమైన సంపదలు ప్రత్యక్షమయ్యాయి. ఈ అద్భుతాన్ని కృష్ణుడు తన కుమారుడైన ప్రద్యుమ్నునికి వివరించి, 'నాయనా! మహాతపఃశక్తి సంపన్నులైన మహర్షులపట్ల సదావిధేయతతో, సేవా వ్రతులమై ప్రవర్తించడం మనబోటి గృహస్థుల కర్తవ్యం. మరచిపోబోకు' అని హితబోధ చేసాడు.

దుర్వాసమహర్షి అనుభవంవంటిది కాక పోయినా, మరొక విచిత్ర అనుభవం శ్రీకృష్ణునికి, ఉదంక మహర్షికీ మధ్య ఏర్పడింది. అదెలాగంటే.

కురుక్షేత్ర యుద్ధంలో ధర్మరాజు విజయం సాధించి హస్తినకు చక్రవర్తి అయ్యాడు. ధర్మరాజు అనుమతితో శ్రీకృష్ణుడు సుభద్రాసమేతంగా ద్వారకకు ప్రయాణమయ్యాడు. దారిలో భృగువంశోత్తముడైన ఉదంక మహాముని ఆశ్రమాన్ని దర్శించాడు శ్రీకృష్ణుడు. భగవానుడిని ఎంతో సాదరంగా ఆహ్వానించి యధోచితంగా సత్కారాలు కావించాడు ఉదంక మహర్షి.

కుశల ప్రశ్నల అనంతరం ఉదంకుడు, 'శ్రీకృష్ణా! భరతవంశస్తులంతా నీ దయచేత క్షేమంగా ఉన్నారా? కౌరవ, పాండవుల మధ్య సంధిని కుదిర్చి సకల రాజలోకం యుద్ధం వల్ల నశించకుండా రక్షించావు కదా!' అంటూ వ్యంగ్యంగా ప్రశ్నించాడు ఉదంకుడు.

ఉదంకుని మనోగతాన్ని గ్రహించిన కృష్ణుడు ఏమీ తెలియనట్లుగానే, 'మహర్షీ! ఏమని చెప్పేది? పాండవుల పక్షాన రాయబారిగా వెళ్ళి సంధినిమిత్తంగా చేయవలసిన ప్రయత్నాలన్నీ చేసాను. నయాన చెప్పాను. భయాన చెప్పాను.

భీష్మద్రోణాది పెద్దలందరూ నాఅభిప్రాయాలను సమర్థించారు. కాని నా పలుకులను పెడచెవిన పెట్టి కౌరవులు సంధికి సమ్మతించక, యుద్ధానికి కారకులై సర్వనాశనమయ్యారు'. అంటూ జరిగిన విషయాన్ని క్లుప్తంగా వివరించాడు.

పట్టరాని ఆగ్రహంతో ఉదంకుడు, 'కృష్ణా! నీవెంతటి వంచకుడవు? సంధి కుదిర్చి జనక్షయాన్ని నివారించగల శక్తిసామర్థ్యాలు కల్గిఉండి కూడా, కపటివై ఘోర యుద్ధానికి కారకుడవయ్యావు. నీవు దృఢంగా సంకల్పిస్తే యుద్ధం ఆగకుండేదా? నీ వల్లనే కదా శ్రేష్ఠులైనరాజలోకం ససైన్యంగా కదనరంగానికి బలిఅయింది! ఇంతటి మారణకాండకు కారకుడైన నీ లాంటి పాపిని ఊరకనే వదలిపెట్టడీ ఉదంకుడు. ఇప్పుడే నిన్ను శపిస్తాను చూడు!' అంటూ కృష్ణుడిని నిందించాడు.

'మహామునీ! మీకింత కోపం తగునా? దయచేసి నేను చెప్పేది వినండి. జరిగిన సంఘటనకు నా బాధ్యత ఎంతో ఆలోచించండి. తొందరపడి నన్ను శపించి, ఎంతో కష్టపడి మీరు సంపాదించుకొన్న తపఃఫలాన్ని వృధాపరచుకోకండి'. అంటూ ప్రశాంత వదనంతో, చిరునవ్వులు చిందిస్తూ శాంతవచనాలు పలికాడు శ్రీకృష్ణుడు.

కొద్దిక్షణాలు ఆలోచించాడు ఉదంకుడు. 'సరే కృష్ణా! నీవు చెప్పదలచుకొన్నదేదో చెప్పు వింటాను. ఆ తర్వాతే నీకు శాపం ఇవ్వాలో, లేదో నిర్ణయించుకొంటాను' అన్నాడు కోపం తగ్గించుకొని.

"ఉదంకా! శ్రద్ధగా విను. త్రిగుణాత్మకమైన ఈ జగత్తు నా అధీనం. సమస్త దేవతలలోనూ నేనే ఉన్నాను. పర, అపర విద్యలూ నేనే. వేదాలు నన్నే తెలియజేస్తున్నాయి. ఆశ్రమ ధర్మాలు, స్వర్గమోక్షాలు సర్వం నన్నే ఆశ్రయించి ఉన్నాయి. ఎవరికి ఏ ఫలం కావలసి కోరినా, వారికా ఫలం అనుగ్రహించే వాడిని నేనే. పాపులు నన్ను తలచి పునీతులౌతారు.

సృష్టి స్థితిలయ కారకులైన త్రిమూర్తులూ నేనే. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసి ధర్మాన్ని స్థాపించి, లోకాన్ని ప్రేమతో లాలించేదీ నేనే. ఇంత సర్వశక్తి సంపన్నుడినై ఉండి కూడా, అధార్మికులైన కౌరవులను, ధార్మికులైన పాండవులతో కలిపి ఉంచడానికి చేయవలసిందంతా చేసాను. వేదవ్యాసాది మహా





మునులంతా నా ప్రయత్నాలకు సాక్షులుగా నిలిచారు. వారంతా నా కృషిని హర్షించారు. కాని కౌరవులకు నా హితవు తలకెక్కలేదు. పర్యవసానంగా ధర్మయుద్ధంలో పాండవుల చేతిలో నశించిపోయారు. నా మాటలలోని ధర్మసూక్ష్మాన్ని జాగ్రత్తగా గ్రహించు." అన్నాడు గంభీరంగా శ్రీకృష్ణ భగవానుడు.

కృష్ణుని చూపులలో చూపు నిలిపి ఉదంకుడు. 'పరంధామా! నీవిప్పుడు పలికిన పలుకులన్నీ అక్షరసత్యాలు. జగన్నాటక సూత్రధారివైన నీవే నా మనస్సును ఉద్రేకపరచి ఆగ్రహావేశాలతో ముంచెత్తావు. తీయని మాటలతో ఉపశమింప చేసినవాడవూ నీవే. అచ్యుతా! నీ మాటల మర్మాన్ని గ్రహించాను. అపారమైన నీ అనుగ్రహ ప్రవాహంలో నన్ను వోలలాడించడానికే నీవు నా ముందు నిలిచావు.

జగన్నాయకా! దయతలచి నీ దివ్యరూప దర్శనభాగ్యాన్ని నాకనుగ్రహించు!'అని వాసుదేవుడిని ప్రార్థించాడు.

శ్రీహరి కరుణించి ఉదంకునికి అలనాడు అర్జునునికి చూపిన విశ్వరూపాన్ని చూపాడు. అంతేకాక ఉదంకునిపై వాత్సల్యంతో వరాన్ని అనుగ్రహించాడు. అతడు నివసించే ఎడారి ప్రాంతంలో అతడు కోరినప్పుడు ఉదంక నామంతో మేఘాలు వచ్చి వర్షించేటట్లుగా వరమిచ్చి శ్రీకృష్ణభగవానుడు ద్వారకకు వెళ్ళాడు.

పై రెండు సంఘటనలలోనూ శ్రీకృష్ణుని ప్రవర్తన వేర్వేరుగా ఉంది. దేవాధి దేవుడైన తాను దుర్వాసునివద్ద సామాన్య గృహస్థుడిలా నిలబడి, మునిచే పరీక్షించబడి, అతని వల్ల వరాలు పొందాడు.

తనను శపిస్తానని నిలదీసిన ఉదంకునికి, తనఅవతార తత్త్వాన్ని గుర్తుచేసి, విశ్వరూపాన్నిచూపి వరమిచ్చి అనుగ్రహించాడు. స్వామియొక్క ఈ భిన్న ప్రవర్తనకు కారణమేమిటి?

భగవానుని అవతార తత్త్వాన్ని ఆయన కర్మల మర్మాన్ని మహర్షులు సైతం అవగాహన చేసుకోవడంలో పొరపడ్డారనడానికి ఉదంకోపాఖ్యానం ఓ చిన్న ఉదాహరణ మాత్రమే. ఇక సామాన్య మానవులం మనమెంత?

సర్వశక్తి వంతుడైన శ్రీమన్నారాయణుడు శ్రీకృష్ణునిగా మానవుడై అవతరించాడు. మానవులను తరింపచేయడమే ఆయన అవతార ప్రయోజనం. తన దివ్యత్వాన్ని ప్రకటించే ఎన్నో అద్భుతాలను, మహిమలను ఆయన చేసాడు. బాలునిగానే పూతనాది రాక్షస సంహారం అలవోకగా నిర్వర్తించాడు, గోవర్ధనగిరి పర్వతాన్నెత్తి దేవేంద్రునికి గర్వభంగం కల్గించాడు. ఇలా ఎన్నో సందర్భాలలో మానవాతీతశక్తులను ప్రదర్శించి తన 'దివ్యత్వ' ఉనికిని చాటి చెప్పాడు.

ఏదైనా చేయగల శక్తిమంతుడై ఉండి కూడా, ఏమీ చేయలేని వానివలె విధ్వంసపూరితమైన ఘోర యుద్ధాన్ని కృష్ణుడు ఎందుకు అనుమతించాడు? అనేది ఉదంకుని సందేహం. తాను వచ్చింది లోకకళ్యాణానికి. లోక నాశనకరమైన యుద్ధాన్ని, నివారించగలిగి కూడ ఎందుకు నివారించలేదు?. అని స్వామిపై ఆగ్రహం తెచ్చుకొన్నాడు మహర్షి. భగవానుడు సూక్ష్మంగా తన ధర్మనిరతిని ఉదంకునికి తెలియచెప్పాడు.

'తానేదైనా చేయగలడు. కానీ చేయ తగినదే చేస్తాడు. చేయతగనిది చేయడు. తాను ఎంతవరకూ చేయదగునో అంతవరకే

చేసాడు'. భగవానుని ఈ ప్రకటన మనకు కనువిప్పు కావాలి.

మానవులమైన మనకు భగవానుడు 'స్వతంత్రత'ను ఇచ్చాడు. చెడిపోవడానికి, బాగుపడడానికి కూడా దానిని మనం ఉపయోగించుకోవచ్చు. మనమూ చాలా పనులు చేయగలం. వీటిలో ఏవి మనం చేయదగునో, ఏవి చేయతగవో మన బుద్ధి విశేషంతో నిర్ణయించుకొని, మనస్సును నియంత్రించుకొని వ్యవహరిస్తే బాగుపడతాం. లేకుంటే చెడిపోతాం.

భగవంతుడు మానవునిగా అవతరించడం వల్ల ఆయనకు కలిగే లాభమేదీ లేదు. కలిగే లాభాలన్నీ మనకే. దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించడమే ఆయన అవతార ప్రయోజనంగా మనం భావిస్తుంటాం. మనలో పరివర్తన కోసం ఆయన అవతరించాడని మాత్రం ఆలోచించం.

మానవునిగా తానవతరించి చేసిన అద్భుత కృత్యాలను విని ఆనందిస్తాం. నీవింత వాడవు, అంతవాడవని స్తోత్రాలు చేస్తాం. మరల మరల మన కోసం అద్భుతాలు చేయమని ప్రార్థిస్తుంటాం. మన అవసరాలు తీర్చే యంత్రంగా భగవంతుడిని పరిమితం చేసి, గుళ్ళుకట్టి ఆరాధిస్తుంటాం! ఏ ఆదర్శాన్ని భగవానుడు మన ఆచరణలో చూడాలనుకొంటున్నాడో, దానిని గ్రహించ లేని బుద్ధిమాంద్యత మనకే సొంతం!

మానవుడై ఆయన ఒక సజీవ ఉదాహరణగా మన మధ్య సంచరించినా మనబలహీనతల బలంవల్ల ఆ అవతార మూర్తి తత్త్వాన్ని ఆకళింపు చేసుకోలేక పోతున్నాం. ఈ విషయాన్ని యాదవులు నిరూపించారు!

బాల్యం నుండీ దేవాధిదేవుడు ఒక ప్రక్క తన దివ్యత్వాన్ని ఎన్నో అద్భుతకృత్యాల ద్వారా ప్రదర్శిస్తూకూడా, మరొకప్రక్క తాను సదా 'సేవకు'నిగానే నిలిచాడు.

దుష్టుడైన కంసుడిని సంహరించి, ఉగ్రసేనుని రాజును చేసి, దేవలోకం నుండి సుధర్మసభను తెప్పించి, పెద్దల ఎడల తన విధేయతను చాటుకొన్నాడు కృష్ణుడు. పదవులను ఆశించక ప్రజలకోసం పనిచేసే మనిషిగా, ప్రజారక్షకుడుగా మధురను పలు దండయాత్రలనుండి రక్షించి, ద్వారకను నిర్మించి యాదవులకు శ్రేయస్సును కల్గించాడు.

సత్రాజిత్తు తన పై వేసిన అపవాదుకు ఆగ్రహించక, నీలాపనిందలను తొలగించు కొనేందుకు జవాబు దారీ మనస్తత్త్వంతో శ్యమంతకాన్ని వెతికి ఇచ్చాడు. మణి తనదైనప్పటికీ, యోగ్యుడైన అక్రూరునికే అప్పగించి, సంపదపట్ల తనకు లోభం లేదని నిరూపించుకొన్నాడు.

తపోజ్ఞాన సంపన్నులైన మునిజనుల పట్ల ఎంత విధేయులై జీవించాలో యాదవులకు తెలియ జెప్పడానికి ద్వారక వీధుల్లో దుర్వాసునికి అనితర సాధ్యమైన సేవలు చేసాడు.

భగవానునికి అతిసామీప్యాన్ని సాన్నిహిత్యాన్ని అనుభవిస్తూకూడా, ఆయన 'దివ్యత్వా'న్ని గూర్చి చింతించక, ఆయన బంధుత్వం చేత కల్గిన బలానికి గర్వించి, అహంకరించి, భోగలాలసులై మునులను అవహేళన చేసినందుకే 'ముసలం' పుట్టి యాదవ జాతి నశించిపోయింది.

ఆయన అద్భుతాలు, హితబోధలు, నడవడీ ఇవేవీ యాదవులలో పరివర్తన కల్గించలేకపోయాయి. ఉద్ధవుడి లాంటి వారు కొందరు ఇందుకు మినహాయింపు అనుకోండి.

22/Bn/Bnfeb02.p65



తమలో ఒకడిగా కలసిపోయి జీవించిన భగవానుని ఆదేశాలను సక్రమంగా స్వీకరించడం చేతగాని దుస్థితి యాదవులది! అందువల్లనే అంతటి వాడిని ఆసరాగా కలిగిఉండి కూడా అనర్థాలపాలయ్యారు! భగవంతుని నామాన్ని పలికితేనే తరిస్తామని అంటారే! అటువంటిది భగవానుడే తమలో ఒకడిగా అవతరించి, తమకు రక్షకుడై, పరిపాలకుడై ఉంటేకూడా, అతని రక్షణను పొందలేక, పైగా తమని, తమవంశాన్ని సర్వాన్ని కూడా నామరూపాలు లేకుండా చేసుకొన్న ఘనకీర్తులయ్యారు యాదవులు.

అలా వారవుతుంటే, తాను సమర్థుడై ఉండికూడా ఉపేక్షించడంలోని తాత్పర్య మేమిటి? మునిశాపాన్ని గౌరవిస్తూ తానూ, బాణానికి బలియై అవతారాన్ని చాలించవలసి రావడంకూడా వారు చేసిన ఉపకారమేకదా!

ఇది ముని శాపానికి గౌరవమా? వీరిక ఇంతే అనే ఉపేక్షా? ఎవడు చేసిన కర్మ వాడనుభవింపక తప్పదనే వైరాగ్యమా? సమర్థుడి సహకారాన్ని సద్వినియోగం చేసుకోక దుర్వినియోగపరిస్తే అలాంటి వారికి తన సహకారం ఉండదని చెప్పడమా? ఏం కారణమై ఉంటుంది! ఇందులో మనం నేర్వవలసింది ఏమిటి? - కాస్త ఆలోచిద్దాం!

మనిషి- తనను తెలుసుకొని, తనలోనూ, సమష్టిలోనూ కలిగి ఉన్న దివ్యత్వాన్ని ప్రకాశింప చేయాలనేది భగవంతుని అభిమతం. అదే మనిషి చేయదగినది. దీనిని గుర్తింపచేయడానికే, తన అడుగు జాడలలో తన వెంట తీసుకొని వెళ్ళడానికే భగవానుడు మానవ అవతారాన్ని ధరించాడు.

ఈ సత్యాన్ని దర్శించి, అనుభవించి, జాతికి అందించే జ్ఞాన సంపన్నులైన ఋషులు మన జీవనవికాస మార్గ నిర్దేశకులు. వారి ఉపదేశమే మనకు శిరోధార్యం.

యధాప్రకారం ఈ 'ఇతిహాసబోధ- **VIII**' శీర్షికకు కూడా తగిన పేర్లు సూచించి, ఈ వ్యాసం పై మీ 'స్పందన'ను తెలియజేయడంతోపాటు 'అవతార ప్రయోజనా'న్ని

ఆతడి క్రియల అంతరార్థాన్ని గూర్చి మీ అభిప్రాయాలను తెలియజేసి శ్రీస్వామివారి మంగళాశాసనాలను పొందుతారని ఆశిస్తున్నాము. మీ ఉత్తరాలపై "స్పందన" లేక "ఇతిహాసబోధ" అని వ్రాయడం మరచిపోవద్దు.

మీ
**వికాసతరంగిణి**

# వికాసదర్శిని నివేదన

శ్రీశ్రీశ్రీ జీయరు స్వామివారు జనవరి 30వ తేదీన శ్రీమాన్ దీకొండ సుగుణ శ్రీనివాసుగారి గృహానికి వేంచేసి, భక్తులకు తీర్థ ప్రసాద గోష్ఠి, మంగళాశాసనాలు అనుగ్రహించారు.

**జంటనగరాల వికాసతరంగిణి శాఖల సమావేశం**

31వతేదీ ఉదయం 9గం॥కు ఉస్మానియా విశ్వవిద్యాలయం, ఠాగూర్ ఆడిటోరియంలో జరుగుతున్న జంటనగరాల వికాసతరంగిణి కార్యకర్తల సమావేశానికి విచ్చేశారు శ్రీవారు. ఈ కార్యక్రమంలో జంటనగరాల 18 శాఖలతోపాటు మెదక్, మహబూబ్‌నగర్ జిల్లాల శాఖలనుండి సుమారు 750మంది సభ్యులు పాల్గొన్నారు. శ్రీమాన్ పురుషోత్తమ రావుగారు కార్యక్రమాన్ని పరిచయం చేయగా, వివిధ శాఖల సమగ్ర సమాచారాన్ని వికాసతరంగిణి కేంద్రీయ ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ భవాని ప్రసాద్ గారు సభకు నివేదించారు.

ఉ.10.00 గం॥లకు. శ్రీశ్రీశ్రీ జీయర్ స్వామివారి కరకమలములతో జ్యోతి ప్రజ్వలనగావించబడింది. ఈ కార్యక్రమానికి శ్రీమాన్ అజయ్‌కల్లాం, IAS., ఎండోమెంట్ కమిషనర్ ముఖ్య అతిధిగా, శ్రీమాన్ డి.వి. ఎల్.ఎన్. మూర్తిగారు IAS., శ్రీమాన్ పి. వెంకటేశ్వర్లు గారు (ఎమ్.డి. కాకతీయ సిమెంట్స్) శ్రీమాన్ జె. రామేశ్వరరావు గారు (ఎమ్.డి., మహాసిమెంట్స్), కేంద్రీయ వికాసతరంగిణి సభ్యులు శ్రీమాన్ పి. వీరయ్యగారు, శ్రీమాన్ డా.టి. రామనాథం గారు, శ్రీమాన్ భవాని ప్రసాద్ గారు, శ్రీమాన్ పెదబాబుగారు, శ్రీమతి శ్రీకుమారిగారు, శ్రీమతి వసుమతి భాస్కర్‌రావుగారు, శ్రీమతి వనజా భాస్కర్‌రావుగారు, శ్రీమతి డా.శోభా జయంత్‌గారు, శ్రీమతి డా.పి.జ్యోతిగారు వేదికను అలంకరించారు. శ్రీశ్రీశ్రీస్వామివారు వికాసతరంగిణి ప్రార్థన చేయించారు..

శ్రీమాన్ డి.వి.ఎల్.ఎన్.మూర్తిగారు మాట్లాడుతూ సమాజానికి సేవలందించుటలో స్వామివారు మమ్మల్ని ఉపకరణాలుగా ఎన్నుకోవడం మా భాగ్యమని చెప్పారు. శ్రీమాన్ డా. జే. రామేశ్వరరావుగారు అధ్యక్షోపన్యాసాన్నిస్తూ ''కార్యకర్తలకు క్రమశిక్షణ ఎంతో అవసరం, స్వామివారు ఆదేశించిన కార్యక్రమాన్ని క్రమశిక్షణతో సమన్వయం చేసుకుంటూ ముందుకు సాగుదా''మన్నారు. ''ధార్మిక, సంప్రదాయ కార్యక్రమాల ద్వారా సమాజ సేవకు తమ ఆదాయాల్లో కొంత భాగాన్ని అందించండ''ని అంటూ శ్రీమాన్ పి. వెంకటేశ్వర్లుగారు తమ సందేశంలో 'ఎదుటివారికి ఉపకారం చేయకపోయిన అపకారం చేయకండి, ఇదే నా ఉన్నతికి మూల సూత్రం' అని చెప్పారు. శ్రీమాన్ ఆజయ్‌కలామ్ గారు పర్యావరణం లో లోపిస్తున్న సమతౌల్యం, దానిని కాపాడటానికి శ్రీస్వామివారు వికాసతరంగిణి ద్వారా చేస్తున్న సేవకు స్పందించి, తమ బాధ్యతను కూడా నిర్వర్తిస్తామని మాటయిచ్చారు. శ్రీస్వామివారు తమ సందేశంలో గీతామృత దీక్ష ఎలాంటి సత్ఫలితాన్ని అందించిందో తెలిపారు. **"అలాగే 2002 ఉగాది నుండి 2003**



**ఉగాది వరకు సంవత్సర కాలం పాటు సాగే గీతాజ్యోతి కార్యక్రమాన్ని"** సభకు పరిచయం చేస్తూ గీతామృత దీక్ష వ్యక్తిగత వికాసానికి ఉపయోగ పడితే, గీతాజ్యోతి కార్యక్రమం సమాజ వికాసానికి ఉపయోగ పడుతుందని, దాని ద్వారా వికాస తరంగిణి ప్రధాన లక్ష్యం **(మాధవ సేవగ సర్వప్రాణి సేవ)** నెరవేరుతుందని చెప్పారు. అలాగే ఎండోమెంట్స్ రెవెన్యూ నుండి కనీసం 30 శాతం ధార్మిక కార్యక్రమాలకు వినియోగించమని కమీషనర్ గారికి సూచించారు.

12.30 గం॥లకు తదీయారాధన కార్యక్రమంతో ఉదయపు సభాకార్యక్రమం ముగిసింది. తిరిగి 1.30 ని.లకు ప్రారంభమ యిన సభకు శ్రీమాన్ పి.వి.ఆర్. కె. ప్రసాద్ IAS. గారు (డా॥ మర్రి చెన్నారెడ్డి మానవ వనరుల అభివృద్ధి సంస్థ నిర్వాహ కులు) విచ్చేసారు. శ్రీమాన్ డా॥ పురుషోత్తమ రావుగారు వారిని సభకు పరిచయం చేశారు. వారు తమ సందేశంలో **"మనధర్మం - గంగానీరు, పరధర్మం-ఎండమావి"**, మన ధర్మానికి, సమాజానికి స్వామి చేస్తున్న సేవలను తమ అనుభవాల ద్వారా వివరిస్తూ, దానికి తమ సహాయ సహకారాలను అందించడం తమ బాధ్యతగా స్పందించారు.

గీతామృతదీక్షా కార్యక్రమాల అనుభవాలను కొంతమంది కార్యకర్తల ద్వారా విని, శ్రీస్వామివారు, వికాసతరంగిణి సమాజ సేవలో మరింత సమర్ధవంతంగా పనిచేసేట్టుగా మంగళాశాసనం చేశారు. ఈ కార్యక్రమ నిర్వహణలో కో-ఆర్డినేటర్ శ్రీమతి వనజా చలపతిరావుగారి పాత్ర ఎంతో ప్రశంసనీయం. చివరగా శ్రీమాన్ భరత్ కుమారాచార్య కృతజ్ఞతావిష్కరణతో కార్యక్రమం విజయ వంతంగా ముగిసింది.

**వేదచర్చాగోష్ఠి-**

తరువాత జరిగిన ''వేద ప్రామాణ్యం, ప్రాముఖ్యము, నేటి పరిస్థితులు'' చర్చా కార్యక్రమాన్ని డా॥పురుషోత్తమరావుగారు నిర్వహించారు. 'మనకు మూలమైన వైదిక వాఙ్మయాన్ని గురించి చర్చించుకునే అవకాశాన్ని కల్పించిన వేదపురుషునికి నమోవాకములు' అంటూ శ్రీస్వామివారు చర్చాకార్యక్రమాన్ని ఆరంభించారు. శ్రీ స్వామి వారు వేదాలనుగురించి ప్రవచిస్తూ, వేదాలు అపౌరుషేయాలని, మంత్రానికి స్వరం ఎంతో అవసరమని స్వర ప్రాముఖ్యాన్ని వివరిస్తూ, వేదంలోని ఆ స్వరమే ఈ సృష్టికి కారణమని, ఏది కోరితే దాన్ని అందించగలదని తెలిపారు. వేద విజ్ఞానం మన జీవనానికి ప్రామాణికం కాబట్టి దాన్ని పరిరక్షించవలసిన బాధ్యత మనందరిపై ఉందని వివరించారు. చర్చలో పాల్గొన్న ప్రొఫెసర్స్ తమ అభిప్రాయాలను తెలిపి, తమ సందేహాలకు, సమాధానాలను శ్రీశ్రీశ్రీ స్వామివారిద్వారా తెల్సుకున్నారు. కార్యక్రమ కృతజ్ఞతా ఆవిష్కరణను శ్రీమాన్ ప్రొఫెసర్ వెంకటేశ్వర్లుగారు నిర్వహిస్తూ ఇలాంటి కార్యక్రమాలు విద్యార్థి లోకాన్ని మరింత ప్రభావితం చేస్తాయని అంటూ ఈ కార్యక్రమాన్ని అందించిన శ్రీశ్రీశ్రీ స్వామివారికి తమ హృదయపూర్వక కృతజ్ఞతలను ఆవిష్కరించారు.

చివరగా అతిథులైన శ్రీమాన్ అజయ్ కలామ్ గారికి, శ్రీమాన్ డి.పి.ఎల్.ఎన్.మూర్తి గారికి, శ్రీమాన్ డా॥ జే.రామేశ్వరరావుగారికి కార్యక్రమ నిర్వాహకులు డా॥పురుషోత్తమ రావుగారికి, భక్తులకు శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసనంచేశారు.

శివం రోడ్డులో, డి.డి. కాలనీలో మదర్ డిగ్రీకాలేజి ప్రథమ వార్షికోత్సవంలో శ్రీ స్వామి

వారు పాల్గొని మంగళాశాసనాలు అనుగ్రహించారు.

ఫిబ్రవరి 1న శ్రీమాన్ డా॥ శ్రీనివాసుగారి తిరుమాళిగలో తీర్థగోష్ఠిని అనుగ్రహించి, 10 గం.లకు శాంతినికేతన్ రెసిడెన్సియల్ స్కూల్ వార్షికోత్సవంలో పాల్గొని విద్యార్థులకు, ఉపాధ్యాయ బృందానికి అనుగ్రహ భాషణాన్ని కృపచేసారు. విద్యార్థుల స్కేటింగ్ విన్యాసాలను తిలకించి వారందరికి మంగళాశాసనాలు అందించారు. తరువాత కుకట్‌పల్లి లో నూతనంగా నిర్మితమైన రెమిడి మల్టీ స్పెషాలిటీ ఆసుపత్రిని ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో డా॥ కె. భాస్కరరెడ్డిగారు (ఎం.డి), డా॥ శ్రీధర్‌గారు, డా॥సుకుమార్‌గారు తదితరులు పాల్గొన్నారు. శ్రీ స్వామివారు ప్రవచిస్తూ "వైద్యానికి లక్ష్యం, వైద్యపు అవసరాలు రాకుండా సమాజాన్ని తీర్చి దిద్దడం అని, అలాంటి సేవలను ఈ సంస్థ ప్రజలకందించాలని, డాక్టర్ల బృందానికి, వైద్య సిబ్బందికి అనేకానేక మంగళాశాసనాలు కృపచేశారు. సాయంకాలం నవీన్ ఎడ్యుకేషనల్ సొసైటీ ప్రథమ వార్షికోత్సవంలో పాల్గొని శ్రీస్వామివారు మంగళాశాసనాలను అనుగ్రహించారు.

**ఖమ్మం వికాసతరంగిణి శాఖ సమావేశం :-**

ఖమ్మం జిల్లావాసుల భాగ్యవిశేషం, భాగ్యనగరం నుండి శ్రీశ్రీశ్రీ స్వామివారు ది.1.2.2002 రాత్రి 1.30 గం.లకు ఖమ్మం విచ్చేసినారు. వికాసతరంగిణి సభ్యులందరూ తమ హృదయలనిండా భక్తిని నింపుకొని శ్రీ స్వామివారికి పూర్ణకుంభ స్వాగతాన్ని పలికారు.

2వతేదీఉదయం తిరువారాధన అనంతరం ఖమ్మం మరియు ఇతర గ్రామాల నుండి వచ్చిన దాదాపు 1500 మంది భక్తులకు శ్రీ స్వామివారు తీర్థ, ప్రసాదాలను ప్రసాదించినారు. అనంతరం శ్రీ స్వామివారి ఆదేశానుసారం వివిధ గ్రామాలు వి.కిష్టాపురం, బాణాపురం, నేలకొండపల్లి, వి. వెంకటాయ పాలెం, సత్తుపల్లి, భద్రాచలం నుండి మొత్తం (18) వికాసతరంగిణిలు, నల్గొండ జిల్లా, సూర్యాపేట, వరంగల్ జిల్లా మానుకోట, కేసముద్రం నుండి వచ్చిన వికాస తరంగిణి కార్యకర్తల ప్రత్యేక సమావేశం స్వర్ణభారతి కళ్యాణ మండపం హాలులో ఏర్పాటు చేయటం జరిగింది.

శ్రీ యాదా కృష్ణమూర్తి, ఖమ్మం జిల్లా వికాస తరంగిణి శాఖ కో ఆర్డినేటర్ గారి స్వాగతోపన్యాసంతో సమావేశం ప్రారంభించ బడినది. ఈ సమావేశంలో వికాసతరంగిణి కేంద్రీయ ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీ భవాని ప్రసాద్ గారు, మరియు వికాస తరంగిణి రాష్ట్ర వైస్ ప్రెసిడెంటు శ్రీ వీరయ్యగారు కార్యకర్తలను ఉద్దేశించి ప్రసంగిస్తూ "క్రమశిక్షణ పాటించుట గురించి, వికాస తరంగిణి లక్ష్యం మరియు ఆశయాల సాధన" గురించి వివరించినారు.

అనంతరం శ్రీ స్వామివారు మన వికాస తరంగిణి ఆశయాలను వివరించి, ప్రతి కార్యకర్త వీటి సాధనకు కృషి చేయాలని, మన వికాస తరంగిణి మాధవ సేవగ సర్వ ప్రాణుల సేవ లక్ష్యానికి అంకితమై ఉండాలని కృపచేసారు. మనం రాబోయే ఉగాదినుండి జరుపుకోబోయే "గీతా జ్యోతి" కార్యక్రమం గురించి సూచనలు అందించారు. సమావేశమునకు విచ్చేసిన దాదాపు 800 మంది వికాస తరంగిణి కార్యకర్తలకు తదీయారాధనా కైంకర్యాన్ని వికాస తరంగిణి 10, ఖమ్మం శాఖవారు అత్యంత వైభవంగా నిర్వహించి శ్రీ స్వామివారి మంగళాశాసనాలకు పాత్రు లయ్యారు.

ది3.2.2002న తీర్థగోష్ఠి అనంతరం కొణిజర్ల మండలం 'తనికెళ్ళ' గ్రామంలో





వికాస తరంగిణి-10, ఖమ్మం వారితో ఏర్పాటు చేసినటువంటి పశువైద్య శిబిర ప్రారంభోత్సవమునకు వేంచేసారు శ్రీ స్వామివారు. ఈ శిబిరంలో 20మంది డాక్టర్లు, 10 మందికి పైగా సిబ్బంది పాల్గొని, సుమారు 2000 గొఱ్ఱెలు, 500 పశువులకు వైద్య సేవలందించారు. స్థానిక వెటర్నరీ డాక్టర్ శ్రీమతి రమణిగారు, జాయింట్ డైరెక్టర్ శ్రీమాన్ రామగోపాలరావుగారు, ఇద్దరు అడిషనల్ డైరెక్టర్స్ మరియు గోపాల మిత్ర సంఘాలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నాయి.

తదుపరి శ్రీ స్వామివారు సత్తుపల్లి లైన్స్‌క్లబ్ రీజియన్ మీట్ డిస్ట్రిక్ట్ 324-3 (రీజియన్-8) లో పాల్గొన్నారు. రీజియన్ ఛైర్మన్ శ్రీమాన్ బొట్టు లక్ష్మీనారాయణగారు అధ్యక్షులుగా, కార్యక్రమాన్ని నిర్వహించగా, మాజీ జిల్లా గవర్నర్ శ్రీమాన్ డా॥జయ చంద్రారెడ్డి, శ్రీమాన్ లక్ష్మీ నారాయణ, శ్రీమాన్ గోపాల్‌రెడ్డి, సహ రీజియన్ ఛైర్మన్ శ్రీమాన్ సి.ఎస్. రెడ్డి, శ్రీమాన్ మధుసూదన రావు ప్రభృతులు వేదికనలంకరించారు. మంత్రి శ్రీమాన్ నాగేశ్వరరావుగారు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు.

శ్రీశ్రీశ్రీ చిన్న జీయరు స్వామివారు సభ్యులకు మంగళాశాసనములను కృపచేస్తూ "కాలాన్ని దైవంగా గుర్తించి మనం సవ్యంగా ఉపయోగించు కోగలిగితే అది భగవంతుడిని ఆరాధించినట్లే. కాలం విలువ తెలుసుకొని జీవితాన్ని సక్రమంగా నడుపుకోవడమే మనిషి లక్ష్యం. ఈ స్పీడ్ ఏజ్‌లో వేగం తప్పనిసరి అయినప్పటికీ, అది అదుపులో ఉండటం ఎంతో అవసరం. అది జ్ఞానం వల్లనే సాధ్యమవుతుంది. జ్ఞానంలేని శరీరం శవంతో సమానం. మనసును అదుపులో ఉంచడానికి అవసరమైన అలాంటి జ్ఞానాన్ని మనకు శ్రీమద్భగవద్గీత అందిస్తుంది. ఆ ఉపదేశాన్ని మనం సక్రమంగా స్వీకరించడంతోపాటు ఇతరులకు కూడా అందచేయాల్సిన బాధ్యత ఉంది.

మనం సమాజానికి భౌతిక సేవలతో పాటు ఆధ్యాత్మిక సేవలనుకూడా అందించాల్సిఉంది. ఆధ్యాత్మికత, భౌతికత రెండు పరస్పర విరుద్ధం కాకుండా ఉండాలి. సమగ్రదృక్పథంతో సమాజ స్వరూపుడైన మాధవుణ్ణి సేవించాలని" శ్రీ సూక్తులను కృపచేసారు.

తరువాత శ్రీవారు శ్రీమాన్ అశోక్ గారి ఆహ్వానంమేరకు రాయుడుపాలెం వేంచేసి అక్కడ జరుగుతున్న శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయ నిర్మాణాన్ని పర్యవేక్షించారు. తదుపరి కిష్టారం గ్రామంలో వికాసతరంగిణి నూతనంగా ఏర్పరచుకున్న భవనాన్ని సందర్శించి భక్తులకు మంగళాశాసనములను అనుగ్రహించారు.

**కల్లూరు:-** అక్కడనుండి నేరుగా కల్లూరు సుగర్స్ ఫ్యాక్టరీకి వేంచేసి,అక్కడ వేదాధ్యయనము చేస్తున్న మన శ్రీపాంచరాత్రాగమ విద్యార్థు లకు మంగళా శాసనములు కృపచేసి, ఫ్యాక్టరీ ప్రాంగణంలో ఉన్న శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయాన్ని దర్శించుకున్నారు శ్రీస్వామి వారు. తరువాత సుగర్ ఫ్యాక్టరీకి అను బంధంగా నిర్మితమవుతున్న విద్యుత్ ఉత్పత్తి కేంద్రాన్ని దర్శించి, నిర్వాహకులైన శ్రీమాన్ వెంకటేశ్వర రావుగారికి, శ్రీమాన్ వీరయ్య గారికి మంగళాశాసనములు అనుగ్రహించి, ఆ రాత్రికి సీతానగరం వేంచేసారు.

**తిరుమల:-** ఫిబ్రవరి 7వ తేది కృష్ణా ఎక్స్‌ప్రెస్ లో బయలుదేరి శ్రీ స్వామివారు తిరుపతి చేరారు. రైల్వేస్టేషన్ వద్ద శ్రీమాన్ రామేశ్వర రావుగారు ప్రభృతులు శ్రీ స్వామివారికి స్వాగతం పలికారు. ఆరోజు రాత్రికి తిరుమ

లకు వేంచేసి మరుసటిరోజు ఉదయం 9.30 గం.లకు శ్రీ వేంకటేశ్వర స్వామివారి శాత్తు ముఱై సేవలో అన్వయించారు.

శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవాలయం లోని రంగనాయకుల మండపంలో జరిగిన ప్రత్యేక సమావేశంలో శ్రీ స్వామివారు పాల్గొన్నారు. టి.టి.డి. ఇ.ఒ. శ్రీమాన్ కృష్ణయ్య గారు, జె.ఇ.ఒ. శ్రీమాన్ బాలసుబ్రహ్మణ్యం గారు, తిరుమలకు చెందిన శ్రీశ్రీశ్రీ చిన్న జీయంగారు, ధర్మప్రచారపరిషత్ కార్యదర్శి శ్రీమాన్ బ్రహ్మానందంగారు, దేవస్థానపు ఆగమ పండితులు శ్రీమాన్ మాడంబాక శ్రీనివాస భట్టర్‌గారు, ఆలయ ప్రధానార్చ కులు శ్రీమాన్ వెంకటరమణ దీక్షితులుగారు, శ్రీమాన్ వెంకటకృష్ణ భట్టర్‌గారు తదితరులు పాల్గొన్న సమావేశములో ఆలయ నిర్వహణలో లోపాలను తెలిపి, వాటి సవర ణకు అవసరమైన సూచనలను అందిం చారు శ్రీవారు. పరిశీలించదగిన అంశాలను వారికి స్పష్టముగ తెలియచేసి, నెలరోజులలో వాటి విషయమై పునః సమావేశమై చర్చించ వలసి ఉంటుందని తెలిపారు. ఆరాధనా లోపాలు, పెరుమాళ్ళకు రాత్రి విశ్రాన్తికై ద్వారాలు బంధించకపోవడం, ప్రసాదాల కైంకర్యం, అర్చకులలో అనాచారం వంటి అనేక విషయాలు చర్చలో చోటుచేసు కొన్నాయి.

తరువాత స్థానిక అన్నమాచార్య కళా మందిరంలో తిరుపతి వికాసతరంగిణి ఆధ్వర్యవంలో ఏర్పాటు చేసిన గీతాంజలి కార్యక్రమంలో పాల్గొని, రాబోయే ఉగాది నుండి ప్రారంభించబడే గీతాజ్యోతికి తిరుపతి లో శ్రీకారం చుట్టనున్నట్లు మంగళా శాసనములు చేసారు శ్రీ స్వామివారు. రాష్ట్రవ్యాప్తంగా నిర్వహించే ఈ గీతాజ్యోతి ద్వారా భక్తులకు భగవద్గీతలోని సారాన్ని సమగ్రంగా అందించేందుకు ప్రయత్నం జరుగుతుందని తెలిపారు. రాష్ట్రంలోని 23 జిల్లాలలో 10వేల టీములు, ఒక్కోటీము క్రింద100మంది సభ్యులు ఈ కార్యక్రమంలో అన్వయిస్తారని తెలిపారు. ఈ సందర్భంగా భగవద్గీతలోని ప్రధానమైన 48 శ్లోకాలను అభ్యాసము చేయించనున్నట్లు తెలిపారు.

ఈ కార్యక్రమంలో తిరుపతి వికాస తరంగిణి శాఖ అధ్యక్షులు శ్రీ నాగేంద్రసాయి గారు మహిళాకో-ఆర్డినేటర్ హేమలత, T.T.D ధర్మప్రచారపరిషత్ కార్యదర్శి ఆచార్య బ్రహ్మానందం, వికాసతరంగిణి ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీ భవానీ ప్రసాద్,శ్రీమాన్ రామేశ్వర రావు గారు,శ్రీ రాధాకృష్ణలు పాల్గొన్నారు. భక్తు లందరికీ మంగళాశాసనాలు కృపచేసి సీతానగరంకు విచ్చేసారు.

10వ తేదీన సీతానగరం ఆశ్రమంలో సుమారు 300 మందికి పైగా భక్తులు శ్రీ స్వామివారిద్వారా సమాశ్రయణాలను పొంది ఆచార్య అనుగ్రహానికి పాత్రులయి, పునీతు లైనారు.

11వ తేదీన తెనాలిలోని వివేకానంద జూనియర్ కాలేజ వార్షికోత్సవంలో పాల్గొని ఉపాధ్యాయులకు, విద్యార్థి బృందానికి, భక్తులకు మంగళాశాసనాలు కృపచేసారు. వారు వార్షికంగా రూ. 10,000/- నడిగడ్డ పాలెం వేదపాఠశాలకు యిస్తామని ప్రకటిం చారు. మొదటి విడతగా 25వేల రూపాయ లను అందించారు.

ఫిబ్రవరి 12న పడమట వేంచేసి, మన సంస్థకు విశేషసేవందించిన శ్రీమాన్ పూర్ణ చంద్రారావు గారిని పరామర్శించారు.

**గుడివాడ-** 12వ తేదీ మధ్యాహ్నానికి గుడివాడ వేంచేసి శ్రీమాన్ సూర్యానారయణ గారి గృహాన్ని పావనం చేసారు. శ్యామలాంబా మోడరన్ రైస్‌మిల్ సందర్శించి భీమవరంకు





పయన మయ్యారు శ్రీ స్వామివారు.

**భీమవరం: -** సీతా అపార్ట్‌మెంట్స్ శ్రీమతి విజయగారి గృహానికి వేంచేసి, అక్కడున్న భక్తులకు గీతాజ్యోతి కార్యక్రమాన్ని పరిచయం చేసి, మంగళాశాసనాలు కృప చేసారు. శ్రీమాన్ గుండు శేషావతారం గారింటిని సందర్శించి, రాత్రికి పశ్చిమ గోదావరి జిల్లా, నర్సాపురం పరిసర ప్రాంతాల పర్యటనకై నర్సాపురం వేంచేశారు శ్రీస్వామి వారు.

**నర్సాపురం పరిసర ప్రాంతాల పర్యటన:-**

ఫిబ్రవరి 13న శ్రీమాన్ కోట్ల వెంకట రామకుమార్ గారి తిరుమాళిగలో తీర్థగోష్ఠి అనుగ్రహించారు. సుప్రసిద్ధ దివ్యక్షేత్రమైన ఎంబెరుమానార్ సన్నిధిని సేవించుకున్నారు. **కొరాలపర్రు** గ్రామంలోని శ్రీ కేశవస్వామి దేవస్థానాన్ని దర్శించి, భక్తులకు మంగళా శాసనం చేసి, నేరుగా **బల్లిపాడు** గ్రామంలోని శ్రీ మదనగోపాలస్వామిని సేవించి, అక్కడ చేరిన భక్తులందరికి ''గీతాజ్యోతి''ని పరిచయం చేసారు. తదుపరి **అగ్రహార గోకవర్ణం** దగ్గర ఉన్న శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయాన్ని సందర్శించి, భక్తులకు మంగళాశాసనాలు కృపచేశారు.

సాయంకాలం నర్సాపురంలో శ్రీ సామూ హిక శ్రీవిష్ణుసహస్రనామస్తోత్ర పారాయణను నిర్వహించి భక్తులకు ప్రవచనాన్ని అనుగ్ర హించారు. రాత్రి 8.50 గం॥లకు **పసలదీవి** గ్రామంలో రామమంది రాన్ని దర్శించారు. అక్కడ గ్రామీణ భక్తుల శ్రద్ధాసక్తులకు ఆనందించి శ్రీ స్వామివారు అనేకానేక మంగళాశాసనాలు కృపచేసారు.

14న ఉదయం తీర్థగోష్ఠి తరువాత U.S.A భక్తులకు టెలిబ్రిడ్జి కార్యక్రమాన్ని నిర్వహించారు. తదుపరి **పాలకొల్లు** వికాస తరంగిణి ద్వితీయ వార్షికోత్సవంలో పాల్గొని వారికి గీతాజ్యోతిని పరిచయం చేసారు. అటునుండి నేరుగా **అంతర్వేదిపాలెం** వేంచేసి శ్రీమాన్ శఠకోప రామానుజాచార్య స్వామివారి తిరుమాళిగను పావనం చేసారు. అనంతరం అంతర్వేది లక్ష్మీనరసింహస్వామి దేవాలయాన్ని సందర్శించారు.

తరువాత **రాజోలులో** జీర్ణోద్ధరణ కార్యక్రమాన్ని పూర్తిచేసుకోబోతున్న శ్రీ ఆంజనేయస్వామి దేవాలయాన్ని దర్శించి తగు సూచనలను అందించారు. తిరిగి రాత్రికి నర్సాపురం వేంచేసి ఆర్తితో ఎదురుచూస్తున్న భక్తులకు తమ దివ్యప్రవచనామృతాన్ని అందించి, వారిని ఆనంద పరవశులను చేసారు.

15వ తేదీ **పేడూరులో** శ్రీమాన్ సూర్య నారాయణగారు, శ్రీమాన్ సౌందర రాజన్‌గార్ల సారథ్యంలో జరుగుతున్న మహా సౌరపూర్వక శ్రీవిష్ణుయాగ కార్యక్రమానికి వేంచేసి భక్తులకు మంగళాశాసనములను కృపచే సారు. అక్కడ శ్రీమతి సూరయ్య అనే మహిళ ఎంతో భక్తి శ్రద్ధలతో నిర్వహిస్తున్న గీతా మందిరాన్ని దర్శించి శ్రీస్వామివారు మంగళాశాసనాలను కృపచేసారు. తరువాత **పండితవిల్లూరు** గ్రామంలో శ్రీమతి శకుంతల మ్మగారి గృహానికి వేంచేసి, భక్తులకు మంగళాశాసనాలను కృపచేసారు. నర్సాపు రంలోని స్వర్ణాంధ్ర ఇంజనీరింగ్& టెక్నాలజి కాలేజ కార్యదర్శి అయిన శ్రీమాన్ రమేష్ బాబుగారి ఆహ్వానం మేరకు కళాశాలకు విచ్చేసి, విద్యార్థులకు, అధ్యాపక బృందానికి మంగళాశాసనాలు కృపచేసారు. సుమారు 11 వందలమంది భక్తులతో సామూహిక లక్ష్మీ నారాయణ పూజలు నిర్వహింపచేసి ఆ రాత్రికి రాజమహేంద్రికి పయనమయ్యారు శ్రీవారు.

**రాజమహేంద్రిలో......**

రాజమహేంద్రి పురప్రజల పూర్వజన్మ సుకృతమువలన ఫిబ్రవరి 15వ తేదీ రాత్రికి వేంచేసారు శ్రీవారు. రాజమహేంద్రి, జెట్ వికాసతరంగిణివారు పూర్ణకుంభస్వాగతం పలికారు. సూర్యకళ్యాణ మండపంలో శ్రీస్వామివారికి బస ఏర్పాటు చేసారు. కార్యకర్తలతో కార్యక్రమ విశేషాలు చర్చించి, వారికి తగు సూచనలందించేసరికి ఆ రాత్రి గడిచి, తెల్లవారడానికి రెండు ఘడియల సమయం మాత్రమే ఉంది.

16వ తేదీ ఉదయం 9 గంటలకు శ్రీ స్వామివారు ఆరాధన, సేవాకాలం అనంతరం తీర్ధగోష్ఠి అనుగ్రహించారు. మధ్యాహ్నము 3గంటలకు స్థానిక సంస్కృత మహిళా కళాశాలను సందర్శించి అనుగ్రహ భాషణం దేవభాషలోనే కృపచేసారు. అందరూ అత్యంత ఆశ్చర్య చకితులై స్వామివారి సంస్కృత ప్రవచనాన్ని అమృతంలా పానం చేసారు. ఈ కార్యక్రమం డా॥ టి.వి. నారాయణరావుగారి ఆధ్వర్యవంలో జరిగింది. శ్రీస్వామివారు కళాశాల అధికారిక, అధ్యాపక, విధ్యార్థి బృందానికి మరియు అక్కడ చేరిన భగవద్బంధువులందరికీ మంగళాశాసనములు కృపచేసారు.

సాయంకాలం 5 గంటలకు సూర్యకళ్యాణమండపను నుండి ఆనం కళాకేంద్రమునకు శ్రీస్వామివారు శోభాయాత్రగా వెళ్ళారు. శ్రీమాన్ సీతారామాంజనేయుల దంపతులు పూర్ణకుంభస్వాగతం పలుకగా, వేదవిధ్యార్థులు వేదమంత్రాలను అనుసంధానము చేస్తుండగా, కోటిసూర్య సమప్రభా సమానులై, అజ్ఞానాంధకారాన్ని దూరం చేస్తూ, ఆర్తితో ఎదురుచూస్తున్న భక్తుల హృదయాలలో తమ అనుగ్రహభాషణంతో జ్ఞానజ్యోతులను వెలిగించటానికి వేదికను అలంకరించారు జగద్గురువులైన శ్రీశ్రీశ్రీ స్వామివారు.

5.30 గంటలకు సామూహిక శ్రీ విష్ణుసహస్రనామ పారాయణానంతరం జెట్ వికాసతరంగిణి, రాజమండ్రి తరపున డా॥ శ్రీమాన్ ఎన్. రాజారాం గారు శ్రీ స్వామివారిని, డిప్యూటీ కలెక్టర్ శ్రీమాన్ శేషాద్రిగారిని, వికాస తరంగిణి జిల్లా ప్రెసిడెంట్ శ్రీమాన్ కర్రిపాపారాయుడుగారిని, ప్రముఖ మానసిక తత్త్వవేత్త, జెట్ - వికాసతరంగిణి, రాజమహేంద్రి శాఖలో ముఖ్యులు డా॥ శ్రీమాన్ కర్రి రామారెడ్డి గారిని, ఉభయవేదాంత పీఠం కార్యదర్శి శ్రీ ఉ.వే. శ్రీమాన్ డా॥ సముద్రాల రంగ రామానుజాచార్యస్వామివారిని, సూర్య కళ్యాణమండపం అధినేత శ్రీమాన్ మంతెన రాజుగారిని వేదికపైకి ఆహ్వా నించారు. తర్వాత సభాకార్యక్రమాన్ని డా॥ శ్రీమాన్ టి.వి. నారాయణరావుగారు నిర్వహించారు.

డా॥శ్రీమాన్ కర్రి రామారెడ్డిగారు మొదటగా విరాట్ పారాయణ వైభవాన్ని, మాండూక్యోపనిషత్‌ను వైద్యశాస్త్రంతో ముడిపెడుతూ ప్రవచించి ఓ కొత్తదనాన్ని అందించారు. అనంతరం డిప్యూటీ కలెక్టర్ శ్రీమాన్ శేషాద్రిగారు ఆంగ్లంలో మాట్లాడుతూ ''ఉపనిషత్తులు మానవ మనుగడకు మార్గదర్శకములు - సమస్త విజ్ఞానము వేదంలోనే వివరించబడిందని, సమాజానికి ముఖ్యంగా కావలసింది ఆధ్యాత్మికతా పునాదిపై ధార్మిక జీవనాన్ని కొనసాగించటమే'' అని ముగించారు.

తర్వాత శ్రీ ఉ.వే.శ్రీమాన్ డా॥ఎన్. రంగరామానుజాచార్యస్వామివారు ప్రవచిస్తూ ''మన రాజమహేంద్రిలో పెద్ద జీయర్ స్వామివారు ఇన్నిస్ పేటలో నిర్మించిన శ్రీతులసీ రామానుజ కూటమును మైన్‌రోడ్





సమీపంలో గోదావరి గట్టు ప్రాంతంలో నిర్మింప తలపెట్టినాము. ఈ విరాట్ పారాయణ కార్యక్రమము రాజమహేంద్రిలో ఏర్పాటు చేసిన ముఖ్యఉద్దేశ్యములలో తులసీ రామానుజ కూటమి పునర్నిర్మాణము కూడా ఒకటి.'' అని తెలిపారు.

తరువాత శ్రీ స్వామివారు కార్యక్రమములో తమ ప్రథమ ప్రవచనాన్ని కృపచేసినారు. మన మనస్సు బుద్ధి ఎలా పనిచేస్తాయో విశదంగా వివరించారు. "**మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః**" అనే గీతాచార్యుల వచనాన్ని అనేక ఉపమానోపమేయాలతో అరటిపండు ఒలిచినట్లుగా అందించారు.

17వ తేదీ ఉదయం 6.30 గం.లకు తీర్థగోష్ఠి ముగించుకొని ఆలోక్ స్టూడియోలో వేదపారాయణ రికార్డింగ్ ప్రారంభోత్సవానికి సీతానగరం వేంచేసారు.

## వేద పరిరక్షణలో మన విద్యాలయం ముందడుగు

మద్రాసులో కోవేన్సిస్ అనే ఒక కంపెనీకి అధినేతలైన శ్రీమాన్ వి.వి. సుందరంగారు, శ్రీమాన్ బి.వి. రావుగారు ఈ ప్రాజెక్ట్‌కు అవసరమైన అత్యాధునికమైన ఆడియో రికార్డింగ్ ఎక్విప్‌మెంట్ సమకూర్చారు. చెన్నై ధనుర్మాస సందర్భంగా వీరు శ్రీ స్వామివారిని కలిసి, మనకు లభించిన వేదశాఖలను డిజిటల్‌గా రికార్డుచేసి భవిష్యత్‌లో పరిశోధనలకు వీలుగా చేయాలనే శ్రీ స్వామివారి సంకల్పానికి, స్పందించి సింగపూర్‌నుండి ప్రత్యేకించి తెప్పించిన డిజిటల్ ఎలక్ట్రానిక్ రికార్డింగ్ పరికరాలతో జనవరి 9వ తేదీన సీతానగరం వచ్చారు.

శ్రీ స్వామివారు జనవరి 17న సమయమివ్వగా ఆరోజుకు మరల సీతానగరం చేరారు. అపురూప శాఖగా మన విద్యార్థులు నేర్చుకున్న మైత్రాయణి శాఖను ముందుగా రికార్డు చేయడంతో మన ఆలోక్ స్టూడియోలో ఈ ప్రాజెక్టుకు శ్రీకారం చుట్టారు శ్రీశ్రీశ్రీ చిన్నజీయరు స్వామివారు.

మన పాఠశాలలోని వేదవిద్యను అభ్యసించిన ప్రథమ విద్యార్థి బృందంలో ఒకరైన శ్రీమాన్ మురళీ కృష్ణమాచార్య స్వామి గారి ఆధ్వర్యవంలో ఈ ప్రాజెక్ట్ నిర్వహించబడాలని, రికార్డింగ్ బాధ్యతను శ్రీమాన్ కృష్ణగారికి అప్పగిస్తూ శ్రీ స్వామివారు అనేక మంగళాశాసనాలు కృపచేసారు.

తదుపరి శ్రీమాన్ గోకరాజు గంగరాజు గారి ఆహ్వానం పై ఉండవల్లి, లైలానగర్‌లో నూతనంగా ప్రతిష్ఠించబడిన రాధాకృష్ణ మందిరానికి వేంచేసి మంగళా శాసనాలు కృపచేసి, తిరిగి శ్రీవారు సాయంకాలం 4.30 గంటలకు రాజమహేంద్రి చేరుకున్నారు. 5.30 గంకు. ఆనంకళా కేంద్రంలో సామూహిక శ్రీవిష్ణుసహస్రనామ పారాయణం అనంతరం శ్రీమాన్ కర్రి రామారెడ్డిగారు ప్రారంభ పలుకుల తర్వాత స్వామివారు మాండూక్యోపనిషత్ ప్రవచాన్ని శ్రోతలకు కృపచేసారు.

**గోకవరం** - 18వతేదీ మధ్యాహ్నం 1గంటకు శ్రీస్వామివారు తత్త్వప్రచారకులు శ్రీమాన్ కుమార రాజాగారు గోకవరంలో ఏర్పాటు

చేసిన కార్యక్రమంలో పాల్గొన్నారు. శ్రీమాన్ రాజాగారి గృహాన్ని పావనం చేసి, పాదపూజ స్వీకరించారు. తదుపరి వేదికనలంకరించి, అక్కడకు చేరిన భక్తగోష్ఠికి అనుగ్రహభాషణ మును, మంగళాశాసనములను కృపచే సారు. ఈ ఉగాది నుండి ప్రారంభించబోయే గీతాజ్యోతి కార్యక్రమాన్ని పరిచయం చేయగా భక్తులు, కార్యకర్తలు, గ్రామపెద్దలు, ప్రము ఖులంతా చాలా ఉత్సాహాన్ని ప్రదర్శించారు.

**గొల్లలమామిడాడ**- 19వతేదీ 11గంటలకు శ్రీమాన్ పెదబాబుగారి ఆహ్వానంపై గొల్లలమామిడాడ వేంచేసి, శ్రీ సూర్యనారా యణ స్వామివారి కళ్యాణ మహోత్సవాల్లో పాల్గొని, అనుగ్రహభాషణం కృపచేసారు.

**పెనుమకుదురు**- శ్రీమాన్ కృష్ణారెడ్డిగారి ప్రార్థనను అంగీకరించి, శ్రీరామలింగేశ్వర మాడరన్ రైస్‌మిల్‌ను సందర్శించి మంగళా శాసనం చేసారు.

**కాకినాడ** - పెనుమకుదురు నుండి శ్రీస్వామి వారు కాకినాడ విచ్చేసారు. తత్త్వ ప్రచార కురాలు శ్రీమతి అనంతలక్ష్మి దంపతులు ఏర్పరిచిన ఆర్షవాణి గోష్ఠిలో పాల్గొని, మంగళాశాసన ప్రవచనం చేసారు. కాకినాడ వికాసతరంగిణి వారు స్థానిక అయ్యప్పస్వామి దేవాలయంలో ఏర్పాటుచేసిన సదస్సుకు విచ్చేసిన భక్తులకు, కార్యకర్తలకు అనుగ్రహ భాషణాన్ని అందించి,

గీతాజ్యోతి కార్యక్రమాన్ని పరిచయం చేసారు.

**ఆత్రేయపురం**- 20వతేదీ ఉదయం ఆరాధన పిదప,ఈ వారంరోజులు కార్యక్రమానికి అవసపమైన కూరగాయల కైంకర్యాన్ని అందించిన ఆత్రేయపురం గ్రామ ప్రజలను అనుగ్రహించడానికి, సుమారు 11గంటలకు శ్రీమాన్ వేదవతిరాజుగారి దంపతుల ఆహ్వా నంపై ఆత్రేయపురం వేంచేసి, మంగాళా శాసన ప్రవచనాన్ని కృపచేసారు శ్రీవారు.

**రామచంద్రాపురం**:-మధ్యాహ్నం 2.30గం॥ లకు రామచంద్రా పురం మోడరన్ ట్యూటోరి యల్ కాలేజ్‌లో తమ అనుగ్రహభాషణాన్ని అందించారు. ఈ కార్యక్రమం శ్రీమతి సరోజినీ దేవిగారు, శ్రీమాన్ జి.వి. రావుగారి నేతృత్వంలో జరిగింది.

21వతేదీన సుమారు 300 మందికి సమాశ్రయణాలను అనుగ్రహించి, శ్రీ.ఉ.వే.శ్రీమాన్ డాక్టర్ సముద్రాల రంగరామానుజాచార్య స్వామివారి నూతన తిరుమాళిగను పావనం చేసారు.

**రామదాస్‌పేట**- 22వతేదీన శ్రీశ్రీశ్రీ స్వామి వారు శ్రీవరాహలక్ష్మీనృసింహస్వామివారి దేవాలయ ప్రతిష్ఠా కార్యక్రమంలో పాల్గొన్నారు. కీ.శే. శ్రీమాన్ అప్పారావుగారి సంకల్పాన్ని నెరవేరుస్తూ వారి సంతానం, తాము సంపాదించిన ద్రవ్యంతో కోరుకొండ రోడ్డులో క్వారీ దగ్గర ఉన్న స్థలానికి సింహాచలనగర్ అని పేరుపెట్టి తరువాత ఆలయాన్ని నిర్మించారు. సింహాచల నాథునికి ఏ విధమైన సేవలు జరుగుతాయో, ఆ సేవలన్ని ఈ ఆలయంలోని స్వామికి కూడా జరపడానికి అన్ని రకాల ఏర్పాట్లుచేసారు. శ్రీ స్వామివారు తమ మంగళాశాసనాలను అనుగ్రహిస్తూ, ఆలయ నిర్మాణం వ్యక్తిగతంగా కాకుండా భక్తులందరిని తోడు చేసుకొని ఉంటే బాగుంటుందని తెలియ జేసారు.

11గంటలకు జరిగిన సామూహిక లక్ష్మీనారయణ పూజా కార్యక్రమంలో అన్వయించిన సుమారు రెండువేల మంది భక్తులు శ్రీవారి కర కమలముల ద్వారా అమ్మవారి ప్రతిమను పొంది, ఆరాధనా క్రమాన్ని శ్రీ స్వామివారి ద్వారా తెలుసుకొని ఆనంద సాగరంలో ఓలలాడారు.

శ్రీస్వామి వారు తదీయారాధన శాలను





సందర్శించి, తగు సూచనలం దించారు.

సాయంకాలం మాండుక్యోపనిషత్ ప్రవచనామృతాన్ని భక్తులందరూ పానం చేసిన తరువాత కార్యకర్తలతో రాత్రి 10 గం॥కు ఇష్టాగోష్ఠి జరిపి, విరాట్ పారాయణ ఏర్పాట్లను సమీక్షించి, వారందరికీ తగు సూచనలందించారు.

ప్రతిరోజు ఉదయపువేళ శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రవైభవాన్ని, సాయం సమయంలో మాండూక్యోపనిషత్ మాధు ర్యాన్ని అనుభవించిన రాజమహేంద్రి వాసులు ఎంత ధన్యులో కదా!

### 9వ విరాట్ శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణం

అందరూ ఎప్పుడెప్పుడా అని ఎదురు చూస్తున్న భీష్మ ఏకాదశి రానేవచ్చింది. జనచైతన్య ఆధ్యాత్మిక కేంద్రం వారి సౌజన్యంతో అత్యంత సుందరంగా ముస్తాబైన సభామండపం శ్రీ స్వామి వారి పదస్పర్శకై ఆత్రుతగా ఎదురుచూస్తూ ఉంది.

ఉభయ వేదాంత పీఠం కార్యదర్శి శ్రీ.ఉ.వే.శ్రీమాన్ డా॥సముద్రాల రంగరామా నుజాచార్య స్వామివారు, భక్తినివేదన సంపాదకులు శ్రీ.ఉ.వే.శ్రీమాన్ రామచంద్రా చార్యస్వామి వారు వేదికనలంకరించగా, శ్రీశ్రీశ్రీ స్వామివారు శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రమును ఉపదేశాత్మకంగా అనుగ్రహించ డానికి, మధ్యాహ్నం 2 గం॥లకు పెరు మాళ్ళతో కలిసి విరాట్ పారాయణ ప్రాంగణమైన సుబ్రహ్మణ్య మైదానంలోనికి వేంచేసి, వేదికను అలంకరించారు. వేదనాదంతో కార్యక్రమం ప్రారంభమయింది. 3.30 గం॥ల వరకు వివిధ విభాగాల్లో బాధ్యత తీసికొని చక్కగా సేవలందించిన కార్యకర్తలకు మెమొంటోలు అందించారు. శ్రీశ్రీశ్రీ స్వామి వారు **"భగవదారాధనా విధిః"** అనే గ్రంథాన్ని ఆవిష్కరించారు. ఈ శుభసందర్భంలో ఆచార్యుల సందేశాలతో కూడిన సావనీర్‌ను కూడా శ్రీ స్వామివారు ఆవిష్కరించారు. డా॥శ్రీ.ఉ.వే. శ్రీమాన్ సముద్రాల రంగ రామానుజాచార్య స్వామి వారు దానికి 'కౌమోదకీ' అనే అందమైన నామకరణంచేసి, ఆచార్యసందేశ పుష్ప గుచ్ఛంగా మనకు అనుగ్రహించారు.

3.30గం॥లకు శ్రీ స్వామివారు విరాట్ పారాయణ ప్రశస్తిని వివరిస్తూ అనుగ్రహ భాషణం చేసారు. సరిగ్గా 4.00గం॥లకు శ్రీవిష్ణు సహస్రనామ ఉపదేశాన్ని ప్రారంభిం చారు. ప్రతి శతనామాలకు పెరుమాళ్ళకు ధూప, దీప నైవేద్యాది ఉపచారాలను సమర్పించారు. అనంతరం స్వామి వారు విరాట్ పారాయణంలో పాల్గొన్న వాలంటీర్స్‌కు, భక్తులకు, నిర్వాహకు లకు, దాతలకు మంగళాశాసనాలు చేసారు. దీనికి ముందు ''గీతాజ్యోతి'' కార్యక్రమాన్ని పరిచయంచేసారు.

అనేక ప్రాంతాలనుండి వచ్చిన భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొని ధన్యతచెందారు. ఎంతోమంది కార్యకర్తలు తమ సేవలను అందించి కార్యక్రమ వైభవానికి కారకు లయ్యారు. ముఖ్యంగా శ్రీమాన్ డా॥ రాజాంమ్‌గారు, శ్రీమాన్ డా॥ నారాయణ రావుగారు, శ్రీమాన్ డా॥ ప్రసాద్ చౌదరిగారు, డా॥ కర్రి రామారెడ్డిగారు, శ్రీమాన్ కర్రి పాపా రాయుడుగారు, శ్రీమాన్ ఎస్. కె. సీతా రామాంజనేయులుగారు, శ్రీమాన్ రంగ ప్రసాద్‌గారు,శ్రీమాన్ జి. రామలింగేశ్వర రావుగారు, శ్రీమాన్ జి. రామచంద్రరావుగారు ముందుండి కార్యక్రమాన్ని నడిపించారు. కోరుకొండ బట్టరు స్వామివారు, గీతాభవన్ కృష్ణగారు ఎంతో సేవలనందించారు. శ్రీమాన్ కణ్ణన్‌గారు, శ్రీమాన్ వర్మగారు ప్రచార

కార్యక్రమంలో తమవంతు సేవలనం దించారు. శ్రీమాన్ సీతారాంగారు తమ అనితర ప్రతిభ, సేవలతో కార్యక్రమానికి సుందరమైన రూపునిచ్చారు.

తత్వప్రచారకులు కుమారి ఉషశ్రీగారు, కుమారి శారదగారు, శ్రీమాన్ శాంతారాం గారు, ప్రచార కార్యక్రమంలో భాగస్వాము లయ్యారు. జనచైతన్య ఆధ్యాత్మిక కేంద్రం వారు ద్రవ్య, వ్బాహన సహాయాన్ని అందిం చారు.

వీరందరికి శ్రీశ్రీశ్రీ స్వామివారు అనేకానేక మంగళాశాసనములను కృపచేసారు.

ప్రసాద వితరణతో కార్యక్రమం చాలా ఆనంద సందోహంగా ముగిసింది. రాత్రికి శ్రీ స్వామివారు ఏలూరు వేంచేసారు.

### గుజరాత్-

**సేవాభారతి ద్వారా చేస్తున్నటువంటి నిర్మాణకార్యక్రమం మొదటి విడతగా 15 లక్షల వ్యయంతో ప్రారంభమైంది. అక్కడ ఇన్‌చార్జిగా శ్రీస్వామినాథన్‌గారు పనిచేస్తున్నారు.**

### నల్గొండ జిల్లా వికాసతరంగిణి శాఖల సమావేశం

సూర్యాపేటలోని శ్రీవేణుగోపాలస్వామి దేవాలయంలో ఫిబ్రవరి 10వతేదీ, ఉ॥ 11 గం॥లకు నల్గొండజిల్లా వికాసతరంగిణి శాఖల సమావేశం జరిగింది. నల్గొండజిల్లాకు చెందిన 9శాఖలు ఈ సమావేశంలో పాల్గొ న్నాయి. సూర్యాపేట శాఖ అధ్యక్షులు శ్రీ వేణు సమావేశానికి అధ్యక్షత వహించారు. ఆర్గనైజింగ్‌సెక్రటరీ శ్రీ భవానీ ప్రసాద్‌గారు ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. సూర్యాపేట శాఖ కార్యదర్శి శ్రీవెంకటరావు సభ్యులకు ఆహ్వానం పలికారు. నల్గొండ జిల్లాలో వికాస తరంగిణి కార్యక్రమాలను సమ న్వయం చేయుడానికి జిల్లా కమిటీ ఏర్పా టుకు సమావేశం నిర్ణయించింది. వికాస తరంగిణి నల్గొండ జిల్లా అధ్యక్షులుగా శ్రీసత్యనా రాయణగారిని, కార్యదర్శిగా శ్రీ కె.మధు సూదనరావుగారిని, కోశాధికారిగా టి. లక్షనం ˊసింహారావుగారిని, ఉపాధ్యక్షులుగా శ్రీమతి కె. భారతి, శ్రీ యమ్. సురేష్‌బాబు, శ్రీమతి యమ్. సంధ్యారెడ్డిగార్లను, సహకార్య దర్శిగా శ్రీమతి గుండు సుశీలగారిని ఏకగ్రీవంగా సమావేశం ఎన్ను కొన్నది. జిల్లా కమిటీకి సంబంధించిన ఇతర సభ్యులను ఈ కమిటీ తర్వాత నిర్ణయిస్తుంది.

రాబోయే ఉగాది నుండి శ్రీస్వామివారు నిర్వహించ సంకల్పించిన 'గీతాజ్యోతి' కార్య క్రమాన్ని నల్గొండ జిల్లాలో విజయవంతంగా నిర్వహించడానికి తగిన సన్నాహాలు చేయా లని సమావేశం తీర్మానించింది.

### జంటనగరాల వికాసతరంగిణి శాఖల సమన్వయ కమిటీ ఏర్పాటు

ఫిబ్రవరి 9వ తేదీన మధ్యాహ్నం 2 గం॥లకు జరిగింది. భాగ్యనగర్ మన జెట్ భవనంలో జరిగిన వికాసతరంగిణి ప్రత్యేక సమావేశంలో ఆర్గనైజింగ్ సెక్రటరీ కె. భవానీ ప్రసాద్‌గారు పాల్గొన్నారు. జంటనగరాలలో వికాసతరంగిణి శాఖ సమన్వయ కమిటీ ఏర్పాటుకు సమావేశం నిర్ణయించింది. ఈ సమన్వయ కమిటీకి శ్రీమాన్ కల్కి అవతారం గారు అధ్యక్షులుగా, శ్రీమాన్ పద్మనాభరావు గారు, శ్రీమతి వనజా చలపతి రావుగారు, కార్యదర్శులుగా వ్యవహరిస్తారని ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ కె. భవానీ ప్రసాద్‌గారు ప్రకటించారు.






# BHAKTHI NIVEDANA

**PHILOSOPHICAL MONTHLY**

**C/o. JET, Sitanagaram, Guntur Dt., Andhra Pradesh - 522 501.**

**Hon. Editor H.H. Sri Tridandi Chinna Srimannarayana Ramanuja Jeeyar Swamy**

## *FORM IV*

(See rule 8)

1. Place of publication : Vijayawada
2. Periodicity : Monthly
3. Printer's Name : Sriman Printers & Processers, Sitanagaram,
   Nationality : Indian
   Address : **JET**, Sitanagaram, Guntur Dt. Andhra Pradesh - 522 501
4. Publisher's Name : T.P. Sreeramachandracharyulu
   Nationality : Indian
   Address : S/o. Sitaramacharyulu, 7-48, Brindavani, Visakhapatnam-530 028.
5. Editor's Name : T.P. Sreeramachandracharyulu
   Nationality : Indian
   Address : S/o. Sitaramacharyulu, 7-48, Brindavani Visakhapatnam-530 028.
6. Name and address of individuals who own the news paper and partners or share holders holding more than one percent of the total Capital : **H.H. Sri Sri Sri Tridandi Srimannarayana Ramanuja Jeeyar Swamyji**
7. R.N.I.No. : 52762/91

I. T.P. Sreeramachandracharyulu, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/-

***T. P. SREERAMACHANDRACHARYULU***

ఈ సంచికలో మీ కోసం .....



ముఖచిత్ర పరిచయం

## గీతాజ్యోతి

**తేది : 12-4-2002న తిరుమల శ్రీవేంకటేశుని సన్నిధిలో ఆస్థాన మండపము దగ్గర ఉదయం 10-15 ని॥లకు గీతాజ్యోతి రథావిష్కరణము, 48 గీతా శ్లోకమాలికా పఠనము శ్రీవారిచే ప్రారంభించబడును.**

పంచాంగ వివరాలు

**ఏప్రిల్**

12 శ్రీరంగనాథుని తిరునక్షత్రం, గీతాజ్యోతి ప్రారంభం తిరుమలలో,

13 ఉగాది, చాంద్రవత్సరాది తైలాభ్యంగస్నానం, నింబకుసుమ భక్షణం పంచాంగ శ్రవణం, వసంత నవరాత్రారంభం

14 అశ్వని కార్తె ఉ. 6-29, మేషసంక్రమణం సౌరవత్సరాది

17 మత్స్యజయంతి

**18 ఎంబెరుమానార్ తిరునక్షత్రం**

19 ముదలియాండాన్ తిరునక్షత్రం

21 శ్రీరామనవమి, భద్రాచలం శ్రీ సీతారామ చంద్రస్వామివారి కళ్యాణోత్సవం

23 సర్వేషామేకాదశి

25 తిథి ద్వయం

26 పౌర్ణమి తిథి మధురకవియాళ్వార్ తిరునక్షత్రం

27 భరణి కార్తె రా. 10-48

**మే**

4 వాస్తు కర్తరీ ప్రారంభం

8 సర్వేషామేకాదశి

10 చతుర్దశి తిథి

11 కృత్తిక కార్తె ఉ. 6-14, శూన్యతిథి


మీ సేవలో....

**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 72929

చందా : సంవత్సర చందా రూ. 50/-, జీవిత చందా రూ. 500/-, విదేశాలకు సంవత్సర చందా $ 25

E-mail : bhakthinivedana@yahoo.co.in Internet : www.chinnajeeyar.org

D.T.P. & Design by : పరిశోధనాలయమ్, JET - Sitanagaram - 522 501.

ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం, గుంటూరు జిల్లా.




శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక




సంపుటి 55 2002 ఏప్రిల్ సంచిక 1

చిత్రభాను నామ సంవత్సరం చైత్రమాసము

సంపాదకులు : శ్రీ ఉ.వే. శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు


Founder

HIS HOLINESS

**SRI SRI SRI TRIDANDI SRIMANNARAYANA RAMANUJA JEEYAR SWAMI VARU**



# భగవద్గీత - 12

(శ్రీవారి ప్రవచనం నుండి - 1వ అధ్యాయం)



భగవద్గీత శ్రీకృష్ణుడు మనకు అందించిన అద్భుతమైన తాత్త్విక గ్రంథం. నిత్యజీవిత సమరంలో విజయం సాధించాలనుకునే ఒక వ్యక్తికి, విషాదాన్ని దూరం చేసుకోవాలి అని కోరుకునే ఒక జిజ్ఞాసువుకి కావలసిన కర్తవ్య నిష్ఠను ప్రబోధించగలిగింది, ఆచరణ పర్యంతమూ చెయ్యగలిగింది **భగవద్గీత**. అలాంటి **భగవద్గీత**ను శ్రీకృష్ణుడు అర్జునునికి యుద్ధ రంగంలో యుద్ధ ఆరంభంలో ఉపదేశం చేసాడు. శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి ఉత్తమశ్రోతగా తయారు చేసుకున్నాడు. ఉత్తమశ్రోతకు ఉండ వలసినది వినీతత్త్వం. అంటే ఎదుటి వాడు చెప్పేది వినాలి అనే ఒక నమ్రభావం కావాలి. ఈ నమ్రభావం కావాలంటే సత్త్వగుణం కొంచెం పెరిగి ఉండాలి.

మనిషిలో మూడు గుణాలు ఎపుడూ కూడా ప్రవర్తిస్తూ ఉంటాయి. 1. రజోగుణం, 2. తమోగుణం, 3. సత్త్వగుణం. ఇందులో ఒక గుణం పైకి ఉంటే మిగతా రెండు గుణాలు అణిగి ఉంటాయని మనకు గ్రంథాలు తెలియచేస్తున్నాయి. ఏం చేస్తాయి ఈ గుణాలు? అంటే అవి మనకు కనిపించవు కానీ అవి కలిగించే ఫలితాన్ని బట్టి వెనకాతల ఆయా ఆయా గుణాలు పనిచేస్తున్నాయని మాత్రం గుర్తించగలం.

ప్రశాంతతను, ప్రసన్నతను, ఆనందాన్ని, ఆరోగ్యాన్ని కల్గించే దానిని సత్త్వగుణమంటారు. అంటే ఇవి కలిగి ఉండేటపుడు వెనకాతల సత్త్వగుణం కలిగిఉన్నామని గుర్తించాలన్నమాట. కోరికలను, కోపాన్ని, స్వార్థాన్ని అహంకారాన్ని పెంచేదానిని రజోగుణం అంటారు. అవి కలిగిఉన్నపుడు వెనకాతల రజోగుణం పనిచేస్తున్నదని, అది పైకి వచ్చిఉందని గుర్తించాలి. నిద్రను బద్ధకాన్ని, అలసత్వాన్ని, నీరసాన్ని కలిగించేది తమోగుణము. అవి అవి కలిగిఉన్నపుడు తమోగుణం పని చేస్తున్నదని గుర్తించాలి.

మంచిని వినాలంటే సత్త్వగుణం పైకి వచ్చిఉండాలి. సహజంగా దానంతట అదే, ఏదో అదృష్ట విశేషం చేత సత్త్వగుణం పైకి రాగలిగితే మంచిదే! కానీ సామాన్యంగా లోకంలో ఉండే మనలాంటివారికిది కష్టం కనుక అది పైకి వచ్చే ప్రయత్నం ఏదోఒకటి చేయాలి. ఆ సత్త్వగుణాన్ని పైకి రప్పించి మంచిని తెలిపే ప్రయత్నం చేస్తారు మహానుభావులు. అర్జునుడిలో కూడ సత్త్వగుణం అధికంగా ఉండటం చేత రజస్తమస్సులను అణిచి, సత్త్వాన్ని పైకితెచ్చి, అతనికి ఉపదేశం చేయాలని శ్రీకృష్ణ పరమాత్మ ప్రయత్నం చేసాడు.

మంచి తెలిసిన ఒక వ్యక్తి ఎదుటి వారికి అది చెప్పాలి. వారిచే చేయించాలి. ఎదుటి వారు చేసేటంతవరకు కూడా చెపుతూ ఉండాలి. ఇది మంచిని కోరేవారు చెయ్యవలసిన పని! ఇది శ్రీకృష్ణుడు చేసాడు. దానికోసమే 700 శ్లోకాల గ్రంథాన్ని తాను నడిపించాల్సివచ్చింది. అంత విన్న తరువాత





గాని "చెయ్యి! చెయ్యి!! చెయ్యి!!!" అని చేసిన ఆ ప్రేరేపణ అర్జునునికి కాస్త ఉత్సాహాన్ని కలిగించలేదు. అపుడు అతనిలో ఉన్న సత్త్వ గుణం పైకి వచ్చి, **'కరిష్యే వచనం తవ' 'చేస్తాను! నీవు చెప్పిన పని.'** అని కర్తవ్య సుముఖుడిగా మారాడు అర్జునుడు.

లోకంలో ఆవేళ చాలమంది ఉన్నారు గానీ వారిలో సత్త్వాన్ని పైకితెస్తానన్నా అంగీకరించే వారు కాదు కనుక, మిగతా వాళ్ళకి చెప్పే ప్రయత్నం శ్రీకృష్ణపరమాత్మ చెయ్యలేదు. భగవద్గీతలో ఉండే శ్లోకాల క్రమాన్ని గమనించినట్లయితే ఈ విషయం మనకు బోధపడుతుంది.

ఆ శ్లోక క్రమాన్ని, వాటిలో పైకి కనిపించే అర్థాన్ని ముందు సామాన్యేన తెలుసుకోవాలి. ఆ తరువాత అది మనకు ఏవిధంగా జీవితంలో ఉపయోగపడు తుందో అవగతం చేసుకునే ప్రయత్నం చేయాలి. అపుడు అందులో ఉండే తాత్త్వికత ఏమిటో ఆలోచించే ప్రయత్నం చేయాలి.

భగవద్గీత మొదటి అధ్యాయంలో శ్లోక క్రమం ఏవిధంగా ఉంది అనే విషయాన్ని తెలుసుకుందాం. అసలు శ్లోక ఆరంభానికి ముందే **"ధృతరాష్ట్ర ఉవాచ"** అని ప్రారంభించారు.

ధృతరాష్ట్రుడు గుడ్డివాడు. పుట్టుగుడ్డి. జాత్యంధుడు. కొంతమందికి కన్నులు లేకపోవచ్చు. కానీ మనస్సుంటుంది. ఏది మంచి, ఏది చెడు తెలుస్తుంది. తెలిసి మంచిని ఆచరించే ప్రయత్నం చేస్తారు. చెడు వదిలిపెడతారు. కానీ దుర్యోధనుడిలో ఉండే రాజసగుణానికి, క్రోధగుణానికి ప్రధాన కారణం ఆయన తండ్రైన ధృతరాష్ట్రుడే.

కొడుకు చేస్తున్న పని తప్పు అని తెలిసినా ఇది తప్పు! చేయకూడదు! అని చెప్పలేక పోయాడు. కారణం అతనిలోని పుత్ర వ్యామోహం. మంచి చెప్పడానికి అది అడ్డు వచ్చింది. మంచి ఏమిటో ధృతరాష్ట్రునికి తెలియక కాదు. నిజానికి తెలియడమే కాదు. ఒకనాడు సభలో తాను ధర్మతత్త్వాన్ని చూసాడు కూడ.

శ్రీకృష్ణుడు రాయబారానికి వచ్చినపుడు దుష్టచతుష్టయము నలుగురూ కట్టబోతుంటే వాళ్ళకి అందకుండా ఆవేళ విశ్వరూపాన్ని చూపించాడు. వాళ్ళెవరూ దరికి చేరలేక పోయారు. ఒక్క ధృతరాష్ట్రుడు మాత్రం ఆ రూపాన్ని చూడగలిగేవిధంగా అతనికి కనులిచ్చాడు. కారణం మంచి అనేది అతనికి తెలిస్తే, తన కొడుకులకు చెప్పి తప్పుదారిలో వాళ్ళు వెళ్ళకుండా నడిపించగలడు అనే అభిప్రాయంతోటి. కాని ధృతరాష్ట్రుడికి పై కళ్ళే కాదు, మూసుకు పోయింది. అతనికి పుట్టుకతోనే లోపలి అంధత్వం కనుక, కృష్ణుడు గురించి అతనికి ఏమీ తెలియలేదు.

తప్పు చేస్తున్నా, తన కొడుకులను వెనుకకు రమ్మని తను చెప్పలేదు. వాళ్ళు చేసే చెడుని అలాగే ప్రోత్సహించాడు. ధుర్యోధనుడు దానిని ఆసరాగా తీసుకున్నాడు. కనుకనే తండ్రివద్ద మాటిమాటికి చనిపోతానని బెదిరిస్తూ, తన పంతాన్ని నెగ్గించుకొనేవాడు. నిజానికి ధృతరాష్ట్రుడు గట్టిగా మాట్లాడిఉండిఉంటే ధుర్యోధనుడు లొంగి ఉండేవాడు. అతనికి అంత శక్తి ఉందనే విషయం ధుర్యోధన మరణం తరువాత జరిగిన ఒక సంఘటన ద్వారా తెలుస్తుంది. అదేమిటో తరువాయి సంచికలో తెలుసుకుందాం...





JET, Hyderabad. ✆ 040-3229426
Email - acharya27@yahoo.com Internet : www.chinnajeeyar.org



సంపాదకీయం

# కోపం మీదే కోపం రావాలి

సాధారణంగా మనిషిలో ఎన్నో భావాలు కలుగుతూ ఉంటాయి, సమసిపోతూ ఉంటాయి. కొన్ని పర్యవసానం చూసేవరకు ఉంటాయి, కొన్ని మరొకదాని ఒత్తిడి తట్టుకో లేక మరలిపోతాయి. కొన్ని తమవంటి వాటిలో కలిసిపోతాయి. ఎక్కడోకాని, చివర వరకు మిగిలేవి కనపడవు.

అలా చివరివరకూ నిలిచి భయంకర పర్యవసానాలను కలిగించేది కోపం. ఇది చాలా చెడ్డది. ఎంత చదువరినైనా, ఎంత వివేకినైనా లొంగదీసుకునేది ఇది. దీని వికృత తాండవం ఇంతా అంతా కాదు.

ఎవరిమీదైనా అసలు కోపం ఎందుక్క లుగుతుంది? వాడు మనకేదో అపకారం చేసేడని. అయితే నీకు కోపం కలగాల్సింది వాడి మీద కాదు. మరి ఎవడిమీద కలగాలి? విను - చెబుతా! అంటున్నాడు నీతికారుడు.

**అకాపరిని కోపశ్చేత్**
**కోపే కోపః కథం న జాయేత**
**ధర్మార్థ కామ మోక్ష**
**ప్రాణ యశోహారిణి క్రూరే**

అపకారం చేసినవాడిమీద కోవ మంటూ వస్తే ముందు కోపం రావాల్సింది కోపం మీదే. ధర్మాన్ని, అర్థాన్ని, కామాన్ని, మోక్షాన్ని, ప్రాణాన్ని, కీర్తిని కాలరాసే క్రూరమైన కోపంకంటే నీకు అపకారులింకా ఎవరు?

ఎవడన్నా మనకు అపకారం చేస్తే ఆ చేసిన వాడిమీద కోపం వస్తుంది. ఈ కోపంలోనూ తారతమ్యాలుంటాయి. కొందరి కోపం తాటాకులమంట. మరికొందరి కోపం బూడిదచేసేవరకు చల్లారదు.

అపకారం చేసిన వాడిమీద పీకలు మొయ్యా కోపం వస్తుంది. ఆ అపకారి మసి అయిపోతే అప్పటికి వీడి కోపం చల్లారు తుంది. ఇది లోకంతీరు.

కోపం వచ్చినవాడు ఏం వాగుతాడో తెలియదు. చిన్నాపెద్దా చూడడు. మంచి, చెడ్డా గమనించడు. వావివరస లెక్కచేయడు. కోపంలో గురువులను సైతం తెగనరకడానికి వెనకాడడు. ఇంకా వీడికి మోక్షమేమిటి? ధర్మమేమిటి? తన అహం చెల్లుబాటు కాలేదన్న కోపంతో ధర్మమోక్షాలకే కాదు-- అర్థకామాలకూ దూరమైపోయినాడు రావణుడు. ప్రాణాలు పోగొట్టుకున్నాడు. కీర్తి మసకబారిపోయింది. ఇంతకూ కారణం రాముని మీద కోపం.

రాక్షసులపై కోపంతో లంకను దహిం చేడు హనుమ. అంతా అయ్యాక సీతమ్మ గుర్తొచ్చింది. నాలుగంగుళాల మేర కూడా కాలకుండా మిగలలేదు లంకలో. అయ్యో, సీతమ్మ! అనుకున్నాడు అప్పుడు. ఏమన్నా అయితే - ఛీ! ఏం పాడుపని చేసేను, ఎంత నీచంగా, క్రూరంగా ప్రవర్తించేను - (కుత్సా చాత్మన్యజాయత) అనుకుంటాడు. కోపంలో ఏం చెయ్యడు గనక! ఈ కోపం చాలా చెడ్డది. సత్పురుషులు పాము పొరనించి వెలికి వచ్చినట్లు దీన్లోంచి బయట పడాలి. అని పరిపరి విధాల వాపోతాడు.

అంచేత కోపం చాలా చెడ్డదే. అందులో జంకుగొంకులు లేవు. అసలు కోపం ఎందుకు వస్తుంది? అపకారం చేసేడని. అవునా! అలాగైతే కోపంకంటే నీకు అపకారులెవరు? లోకంలో అపకారి అని నువ్వనుకుంటున్న వాడు ఏదో ఒకటి నీకు కాకుండా చేసేడు. నీ నుండి దేన్నో లాక్కున్నాడు. అందుక్కదా వాడి మీద కోపం నీకు.

మరి కోపం నీకు ఎన్ని అపకారాలు చేస్తోందో ఎప్పుడైనా గమనించేవా? ధర్మమోక్షాలనే కాదు, అర్థకామాలనూ చెరు స్తుంది అది. కోపం వల్ల ఇహమూ పోతుంది, పరమూ పోతుంది. ప్రాణాలను పోగొడుతుందది, ఎవరిమీదో కోపం వచ్చి కత్తిపుచ్చుకు ఇవతలకి వచ్చేడు. అవతలివాడే ముందు వేసేసేడు, ప్రాణాలే పోయినై. ఇంకేం చేస్తాడు?

ఎంతకాలంగానో పదిలంగా కాపాడు కుంటూ వస్తున్న కీర్తి కాస్తా మరుగై పోతుంది. కోపహేతువుగా అపకారాన్ని పరిగణించి, అపకారం చేసిన వాడిమీద కోపం వస్తోందంటున్నాం. కనక దాని ప్రకారం మనిషికి కోపంకంటె క్రూరమైన అపకారి మరోటి లేదు. కనక ముందు కోపంమీదే కోపం రావాలి. రావాలి ఏమిటీ? తెచ్చు కోవాలి. తెచ్చుకున్న కోపంతో అపకారిని మట్టుపెట్టాలి.

ఏతావతా అన్నీ పోగొట్టేది కోపం కనక ఆ ఒక్క కోపాన్ని కనక మనం పోగొట్టు కున్నట్లైతే మిగిలిన వేటినీ కోల్పోనక్కరలేదు.

- శ్రీరామచంద్రాచార్య







# శ్రీవిష్ణు మహాపురాణం

## ప్రథమాంశం - చతుర్థోధ్యాయం

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, కొవ్వూరు.

నారాయణాత్మకుడైన చతుర్ముఖ బ్రహ్మ సృష్టిచేయాలని ఉద్యమించడానికి పూర్వ కల్పావసానంలో శయనం నుండి మేల్కొని సత్త్వోద్రిక్తుడై నలువైపులా దృష్టి సారించాడు. అంతా శూన్యమే. ఇక సృష్టి చేయాలి. ముందుముందు శ్రీవైష్ణవ మహాపురాణం వారాహకల్ప సంబద్ధాలైన గాథలనే వివరింపనున్నది కనుక పరాశరుడు వరాహావతార వైభవాన్ని ముందుగా ఈ అధ్యాయంలో ఆవిష్కరిస్తున్నాడు. స్వామికి నారాయణుడని పేరు. ఇక్కడ నారాయణ శబ్దనిర్వచనాన్ని విష్ణుపురాణం ఇలా నిర్దేశిస్తున్నది.

**ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపోవై నర సూనవః ।**
**అయనం తస్య వాః పూర్వం తేన నారాయణః స్మృతః ॥**

జలాలకు నారములనిపేరు. నరుడంటే నాశరహితుడైన పరమాత్మ. ఆయనచేత సర్వప్రథమంగా సృజింపబడ్డాయి కనుకనే జలాలకు నారములనే పేరుకల్గింది. అంతటావ్యాపించి ఉన్నాయి గనుక 'ఆపః' ఈ జలములే సర్వప్రథమంగా ఈయనచే సృజింపబడి ఆయనకు నివాసస్థానం అయినాయి కనుక, ఆపః = జలాలు, అయనం = నివాస స్థానంగా, అస్య = ఈ పరమాత్మకున్నాయి కనుక, ఆయన - నారాయణుడు అని నిర్వచనం. జలాల్లో శయనించివున్న స్వామి, జలాల లోపల, సమస్త భూమి అడుగున చేరిఉన్నదని గ్రహించాడు. ప్రలయంలో ఏకార్ణవీ భూతమైన విశ్వంలో జలాంతర్గత మైన భూమిని పైకి ఉద్ధరించదలచాడు.

**"అకరోత్ స్వతనూమన్యాం కల్పాదిషు యథాపురా॥**
**మత్స్య కూర్మాదికాం తద్వద్వారాహం వపురాస్థితః ॥**

ప్రతికల్పాదియందు స్వీకరించినట్లే మత్స్య కూర్మాది రూపాలవంటిదే అయిన వారాహ రూపాన్ని పరిగ్రహించాడు. స్వామి, వారాహమూర్తిని ధరింపగానే, జనలోక వాసులైన సిద్ధపురుషులంతా బిగ్గరగా స్తుతింపసాగారు. స్వామి, తనశరీరాన్ని జలాన్తర్భాగానికి మెల్లగా తీసికొని వెళ్ళాడు. పాతాలంలో మునిగి ఉన్న భూదేవి స్వామిని చూచి భక్తితోనమ్రయై స్తుతించడం ప్రారంభించింది.

### పృథివీకృత వారాహస్తుతి :

**నమస్తే పుండరీకాక్ష! శంఖచక్రగదాధర! ।**
**మాముద్ధరాస్మాదద్యత్వం త్వత్తోఽహం పూర్వముత్థితా॥**
**త్వయాహముద్ధృతాపూర్వం త్వన్మయాహం జనార్దన।**
**తథాన్యానిచ భూతాని గగనాదీన్య శేషతః ॥**

**నమస్తే పరమాత్మాత్మన్ పురుషాత్మన్ నమో స్తుతే।**
**ప్రధాన వ్యక్త భూతాయ కాలభూతాయ తే నమః॥**

**త్వం కర్తా సర్వభూతానాం త్వం పాతా త్వం వినాశకృత్।**
**సర్గాదిషు ప్రభో బ్రహ్మ విష్ణు రుద్రాత్మ రూపధృక్ ॥**

**సంభక్షయిత్వా సకలం జగత్యే కార్ణవీకృతే ।**
**శేషే త్వమేవ గోవింద చిన్త్యమానో మనీషిభిః ॥**

**భవతో యత్పరం తత్త్వం తన్నజానాతి కశ్చన।**
**అవతారేషు యద్రూపం తదర్చన్తి దివౌకసః ॥**

**త్వామారాధ్య పరంబ్రహ్మ యాతాముక్తిం మముక్షవః।**
**వాసుదేవ మనారాధ్య కో మోక్షం సమవాప్స్యతి ॥**

ఓ పుండరీకాక్షా! శంఖచక్రగదాధర! పూర్వకల్పాల్లో నీచే ఉద్ధరింపబడిన నన్ను ఈ పాతాలతలంనుండి పైకి ఉద్ధరించు స్వామీ! నేను నీకంటే వేరుకాను. ఈ సమస్త భూతాలు ఆకాశాదులూ అన్నీ నీవే. నీవు పరమాత్మస్వరూపుడవు. పురుషస్వరూపుడవు. అవ్యక్తమైన ప్రధానం (మూల ప్రకృతి), వ్యక్తమైన ఈ జగత్తు, కాలము అన్నీ నీవే. నీకు ప్రణతులు. సమస్త భూతాలను నువ్వే సృజిస్తావు. రక్షిస్తావు. చివరకు లయింప చేస్తావు. సృష్ట్యదుల్లో నీవే బ్రహ్మ-విష్ణు-రుద్రరూపాలు ధరిస్తావు. సమస్తాన్నీ మ్రింగి, విశ్వమంత జలమయంకాగా ఓ గోవిందా! నీవే తత్త్వజ్ఞులచే ధ్యానింపబడుతూ శయనిస్తావు. నీకంటే వేరైన ఏ తత్త్వాన్నీ ఎవ్వడూ గ్రహింపలేడు. అవతారాల్లో నీవు పరిగ్రహించిన రూపాన్నే దేవతలు అర్చిస్తారు. నిన్నేపరబ్రహ్మగా ఆరాధించి ముముక్షువులు ముక్తిని పొందారు. వాసుదేవుని ఆరాధించక ముక్తిని ఎవ్వడు పొందగలడు?

**యత్కించిన్మనసా గ్రాహ్యం యద్గ్రాహ్యం చక్షురాదిభిః।**
**బుద్ధ్యా చ యత్పరిచ్ఛేద్యం తద్రూపమఖిలం తవ॥**
**త్వన్మయాహం, త్వదాధారా, తత్సృష్టా, త్వత్సమాశ్రయా।**
**మాధవీతి చ లోకోయ మభిధత్తే తతో హి మామ్ ॥**
**జయాఖిల జ్ఞానమయ! జయ! స్థూలమయావ్యయ!**
**జయానన్త! జయావ్యక్త! జయవ్యక్తమయ ప్రభో ।**
**పరాపరాత్మన్ విశ్వాత్మన్ జయ! యజ్ఞపతేఽనఘ! ॥**
**త్వం యజ్ఞః త్వం వషట్కారః త్వమోంకారస్త్వ మగ్నయః॥**
**త్వంవేదాః త్వం తదంగాని, త్వం యజ్ఞపురుషో హరే ।**
**సూర్యాదయో గ్రహాస్తారా నక్షత్రాణ్యఖిలం జగత్ ॥**
**మూర్తామూర్త మదృశ్యం దృశ్యం చ పురుషోత్తమ ।**
**యచ్చోక్తం యచ్చనైవోక్తం మయాత్ర పరమేశ్వర ।**
**తత్సర్వం త్వం నమస్తుభ్యం భూయో భూయో నమోనమః॥**

ఈ సృష్టిలో మనస్సుతో గ్రహింపదగింది, కన్నులు మొదలైన ఇంద్రియాలచే తెలియదగింది. బుద్ధితో నిశ్చయింపదగింది అయిన సమస్త రూపమునీదే. నేను నీచే నిండిఉన్నాను. నిన్నే ఆధారంగా చేసికొని ఉన్నాను. నీచే సృజింపబడ్డాను. నిన్నాశ్రయించి ఉన్నాను, కనుకనే లోకం నన్ను 'మాధవి' అనిపిలుస్తున్నది. ఓ సమస్త జ్ఞానమయా! స్థూల వస్తుమయా! అనన్త రూపుడా! అవ్యక్తుడా! అవ్యక్త దేహుడా! ప్రభూ! జయించుము! జయించుము. పరాపర స్వరూపడా! విశ్వాత్మకుడా! ఓ యజ్ఞపతీ! అనఘా! జయింపుము. నీవు యజ్ఞానివి. నీవే వషట్కారం. నీవే ఓంకారం! అగ్నులునీవే. నీవే వేదాలు. వేదాంగాలు నీవే. నీవే యజ్ఞారాధ్యు డవైన పరమపురుషుడవు. ఓహరీ! సూర్యాది గ్రహములు, తారకలు, నక్షత్రాలు, ఈ సమస్త జగత్తు, ఆకృతి కలది, లేనిది, కనిపించేది, కనుపించనిది, ఓ పురుషోత్తమా! ఈ సమస్తమూ నీవే. నీకు పలుమారులు నమస్సులు. మరలమరల ప్రణతులు" అంటూ శ్రీమన్నారాయణుని సర్వాత్మకత్వాన్ని ఉపశ్లోక్యం చేసింది భూదేవి.

ఇలా భూమిచే స్తుతింపబడిన స్వామి, సామస్వరస్ఫూర్తికలిగేలా గట్టి ఘుర్ఘుర ధ్వనిచేశాడు. ఇక్కడ విష్ణుపురాణం వరాహమూర్తిని వర్ణించడంలో చక్కటి కవితా శైలిని ఆశ్రయించింది. చక్కటి వృత్తాలతో స్వామి భూమీ సముద్ధరణం చేసిన వైనాన్ని వర్ణించింది. సనక సనందనాదులొనర్చిన స్తుతినికూడా ఉపస్థాపనం చేసింది.





## శ్రీశ్రీశ్రీ జీయరుస్వామివారి పర్యటనా వివరములు

| | |
|---|---|
| ఏప్రిల్ 06-08వరకు | నల్గొండ, మేళ్ళచెరువులోని శ్రీవేంకటేశ్వరస్వామివారి బ్రహ్మోత్సవాల్లో వేంచేసి ఉంటారు. |
| 7 | కృష్ణాజిల్లా, విజయవాడలో జరుగు వికాసతరంగిణి వార్షిక సమావేశంలో పాల్గొంటారు. |
| 12 | తిరుపతి, వికాసతరంగిణి 'గీతాజ్యోతి' కార్యక్రమాన్ని లాంఛనంగా **తిరుచానూరు అమ్మవారివద్ద** పెరుమాళ్ళసన్నిధిలో ప్రారంభిస్తారు. ఆస్థాన మండపంలో ప్రధాన కార్యక్రమం జరుగుతుంది. |
| 13 | చిత్ర భాను నూతన సంవత్సరాది, బళ్ళారి వేంచేస్తారు. |
| 13-21 వరకు | కర్ణాటక, బళ్ళారిలో శ్రీరామనవమి ఉత్సవాల్లో పాల్గొంటారు. |
| 22-24 వరకు | రాయలసీమ పర్యటనలో ఉంటారు. |
| 24 | రాత్రికి దావణగేరే వేంచేస్తారు. వికాసతరంగిణివారి వేసవి మజ్జిగ ఉచిత వితరణ ప్రారంభం. |
| 25 | సాయంత్రం బెంగుళూరు వేంచేస్తారు. |
| 26-30 వరకు | బెంగుళూరులో వికాసతరంగిణి కార్యక్రమాలలో పాల్గొని ఉదయం, సాయంకాలము ప్రవచనములు ప్రసాదిస్తారు. ఉదయం శ్రీరామాయణం, సాయంకాలం శ్రీవిష్ణు సహస్రనామము గురించి. (రెండూ ఆంగ్లంలో) |
| మే 1 | మేల్కోట వేంచేసి తిరునారాయణ స్వామిని సేవిస్తారు. |
| 2 | మేల్కోట నుండి బెంగుళూరు వేంచేసి, చామరాజపేటలోని ఎతిరీ స్కూల్ భవన ప్రారంభోత్సవంలో పాల్గొంటారు. |

**జై శ్రీమన్నారాయణ!**

## హిమగిరిశిఖర వార్తలు

ప్రియ భగవద్బంధువులారా!

ఆరు నెలలనుండి దేవతలచే ఆరాధనలను అందుకొంటున్న బదరీనాథుడు ఈ సంవత్సరం మే 17వ తేదీన భక్తులను అనుగ్రహిస్తున్నాడు. మన స్వామి వారు బదరీ పెరుమాళ్ళను సేవించుకోవడానికి మే 17 బదరీ వేంచేస్తారు. మన అష్టాక్షరీ క్షేత్రం భక్తులకు తమ సేవలందించడానికి వీలుగా ఆ క్షేత్ర బాధ్యతను వహిస్తున్న కుమారి ఉషశ్రీగారు మే 15కు బదరీ చేరతారు. ఈ సంవత్సరం తదీయారాధన సామగ్రిని విజయనగరం వికాసతరంగిణి వారు సమర్పిస్తున్నారు. వికాసతరంగిణి కో-ఆర్డినేటర్ శ్రీమతి లక్ష్మిగారు, శ్రీమతి బేబిగారు, శ్రీమతి రమణమ్మగారు, శ్రీ కృష్ణాజీగారు తదితర వికాసతరంగిణి సభ్యులకు శ్రీస్వామివారు మంగళాశాసనములు చేసారు.

బదరీలో జరిగే వస్త్రదానానికి నూతన వస్త్రాలను, ఇతర వస్తువులను సమర్పించదలచిన వారు ఏప్రిల్ 20 తేదీలోగా సీతానగరం ఆశ్రమానికి పంపించవచ్చు.

**ఇతరవివరాలకు :**

**బదరీ అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదాన శాఖా సంఘం,**
**C/o.** జెట్, సీతానగరం, గుంటూరు జిల్లా. ✆ : (08645) 72929, 72353.
శ్రీమతి రమణమ్మగారు, విజయనగరం, ✆ (08922) 27190
శ్రీమతి బేబిగారు, విజయనగరం, ✆ (08922) 27238.

# తేనెవాక

## శ్రీ తిరుమழిశైయాళ్వార్ - నాన్ముకన్ తిరువన్దాది

'మధురవాక్ శిఖామణి', 'భాగవతామృతవర్షి'
ఉ.వే.శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్యస్వామి, సింహాచలం

పా॥

**తిఱమ్బేల్ మిన్ కణ్డీర్ తిరువడితన్నామమ్ మఱన్దుమ్ పుఱన్దొழாమాన్దర్ ఇఱైఞ్జియుమ్ శాతువరాయ్ పోతుమిన్గళెన్దాన్ - నమనున్దన్ తూతువరైక్కూవి చ్చెవిక్కు.**

యముడు కూడ తన దూతలను పిలచి వారిచెవిలో 'ఓ సేవకులారా! నేనిపుడు మీకు ఇచ్చు ఆజ్ఞను తప్పవలదు. సర్వేశ్వరుని యొక్క తిరునామమును ఒకవేళ మఱచి పోయినా కూడా దేవతాన్తర భజనము చేయని మానవులను చూచిన ఎడల నమస్కరించి మీ కౄరత్వమును ఒదులు కొని సాధువులై వర్తించుడు అని చెప్పినారు.

**నమనుమ్ తన్తూతువరైక్కూవిచ్చెవిక్కు** - సమస్త జీవకోటిని వారివారి కర్మల కనుగుణముగ తన లోకమునకు తీసుకొని వెళ్ళి ఆయా దుఃఖపరంపరలను అనుభవింపజేయుట యందు సమర్థుడైన యమధర్మరాజు తన దూతలను పిలచి వారి చెవిలో ఇట్లనెను. ఇచ్చట "**నమనుమ్**" అనుటచేత యముడంతటివాడు కూడ అని అర్థము. పాపులచే వారి పాపఫలమును అనుభవింపజేయు కఠినస్వభావము కలవాడగుట చేతనే కదా భగవానుడతనికి యమ ధర్మరాజు పదవి నొసంగినాడు. అందరికీ యముడంటే భయము. ఆయనకు పరమాత్మయనినా? ఆయన భక్తులనినా? భయము అనునది ఈ పాశురమునందు తెలుపబడుచున్నది.

**తన్తూతువరై** :- అనుటవలన చాల సమర్థులై తనకు ఆంతరంగికులైన వారిని

'**క్కూవిచెవిక్కు**':- తమ విధి నిర్వహణమునకై పోబోవుచున్న ఆ దూతలకు దూరము నుండియే ఆజ్ఞల నొసగుట కాక, వారిని దగ్గరగా పిలిచి వారి చెవిలో చెప్పుచున్నాడనుట వలన ఆ చెప్పబోవు విషయము 'అతి ముఖ్యమైనదని తెలియుచున్నది. ఏలనన తాను అతిముఖ్యులైన వ్యక్తుల విషయములో ఎట్లుండవలెనో తనభటులకు చెప్పబోవు చున్నాడు' కావున వారిచెవిలో ఈ విషయమును తెలుపుచున్నాడు. భగవానుని కత్యంత ప్రీతిపాత్రులైనవారి ప్రసంగము తన లోకములో తన నోట వెలికివచ్చినదను సంగతి ఏమాత్రము ఇతరులకు తెలియరాదనునది యముని అభిప్రాయమై యుండ నోపును. లేదా భగవానునికి అతిముఖ్యులైన భగవద్భక్తులయందు గల గౌరవాతిశయము చేతనైననూ కావచ్చును. ఇంతకూ యముడు తన కింకరుల కంతముఖ్యముగ చెప్పునది - ఏమిటంటే!

'**తిఱమ్బేల్ మిన్ కణ్డీర్**' :- నాయాజ్ఞను జవదాటకుడు సుమీ! యని ఇకపై తెలుపబోవు యమధర్మరాజు యొక్క ఆజ్ఞను ఒకవేళ భటులు మీరినారా అందు వలన కలుగుహాని యమభటులకు మాత్రమే పరిమితము కాక తన భటులను సరిగా నియంత్రించి నియమించలేదను కారణము చేత యమునికి కూడ చేటును తెచ్చును. అందుచే యముడు తనే జాగ్రత్తగ తన భటులను ఆదేశించు చున్నాడు.

**తిరువడి తన్నామమ్ మఱన్దుమ్ పుఱమ్ తొழாమాన్దర్** :- భగవానుని నామమును





ఒకవేళ మఱచిపోయినాకూడ ఇతరులను కొలువని మానవులు. అనగా భగవద్భక్తులగు మానవులు. వీరు ఎట్టి జాత్యాశ్రమాదులకు చెందిన వారైనా కానీ గౌరవ్యులే. వీరియందు గల భక్తియే వీరినాదరించుటకు హేతువు. అట్టి భగవద్భక్తులను గూర్చి తెలుపుచున్నాడు యముడు. ఆళ్వార్ల తెలిపిన ఈ వృత్తాంతము శ్రీవిష్ణుపురాణ మందు భీష్ముడు నకులునికి తెలిపిన వైవస్వత గీతలయందు పరాశర మహర్షిచే తెలుప బడినది. కాళింగనుడను బ్రాహ్మణుడు భీష్మునికి సఖుడు. ఆతడు తనకు తెలిపెనని నకులునికి భీష్ముడు "**యమకింకర సంవాదము**"ను తెలియచేస్తాడు. దానిని తరువాతి సంచికలో తెలుసుకుందాం.

# మహర్షుల చరిత్ర
# భరద్వాజ మహర్షి

తమిళమూలం : వై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి
తెలుగు సేత : శ్రీ.ఉ.వే. శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ

భరద్వాజ మహర్షి గొప్పతనాన్ని వేదం ఇలా తెలియజేస్తోంది.

**'భారద్వాజో హ త్రిభిరాయుభిర్బ్రహ్మచర్య మువాస! తం హ జీర్ణం స్థవిరం శయానమ్ ।**
**ఇన్ద్ర ఉపవ్రజ్యోవాచ। భరద్వాజ!**
**యత్ తే చతుర్థ మాయుర్దద్యామ్।**
**కిమనేన కుర్యా ఇతి । బ్రహ్మచర్యమేవైనేన చరేయ మితి హోవాచ।**

కాఠకమ్ - 1.11.3

భరద్వాజ మహర్షి మూడు ఆయుర్దాయ కాలాలు వరుసగా వేదాధ్యయనమే చేసి, వృద్ధాప్యంచే ఒడలు ముడతలుపడి కదలలేని స్థితియందుండగా, ఇంద్రుడాతని సమీపించి 'ఓ భరద్వాజ మహర్షీ!' నీకు ఇంకొక ఆయుర్దాయకాలం ఇవ్వాలనుకుంటున్నాను. ఆ కాలాన్ని నీవు ఎలా ఉపయోగించుకోవాలని అనుకుంటున్నావు అని అడుగగా 'ఈ ఆయుర్దాయకాలంలో కూడ వేదాధ్యయనమే చేయగలను' అని భరద్వాజుడు చెప్పినట్లుగా పై మంత్రమువలన తెలియుచున్నది.

ఇంద్రుడు భరద్వాజుని ఎదుట మూడు పర్వతాలను కన్పింపచేసి 'ఓ భరద్వాజా! ఈ మూడు పర్వతాలను చూడు. ఇవే మూడు వేదాలు అనంతాలు, హద్దు లేనివి. ' అని చెబుతూ మూడు పర్వతాల నుండి మూడు గుప్పెళ్ళమట్టి తీసి "నువ్వు ఈ వేదాలలో, నీ మూడు ఆయుర్దాయ కాలంలో, చదివినది ఒక్క గుప్పెడు మాత్రమే మిగిలినదంతా ఇకపైన అధ్యయనం చేయ వలసిన భాగమే. శ్రద్ధగావిను, అన్ని విద్యల సారమైన విషయాన్ని ఒక దానిని నీకు చెబుతున్నాను. దీనిని తెలుసుకో" అని చెబుతూ, అతడు భరద్వాజునికి 'సావిత్రాగ్నిని' ఉపదేశించాడు. దానిని చక్కగా గ్రహించిన భరద్వాజుడు అమరుడై స్వర్గలోకాన్ని పొందాడు, అని భరద్వాజుని కథ మనకు చెబుతోంది.

పైన చెప్పిన దానిని బట్టి భరద్వాజ మహర్షికి వేదాధ్యయనం అంటే ఎంత ప్రీతో మనకు తెలుస్తుంది.

ఈ కథలో ఇంకో విశేషం ఏమంటే మూడు ఆయుర్దాయ కాలాలు వేదాధ్యయనం చేసాడు, అని చెప్పిన దానిని బట్టి, ఒక్కొక్క వేదానికి నూరు సంవత్సర ములు చొప్పున 300 సంవత్సరాలలో ఋక్, సామ, యజుర్ - వేదాలు మూడు అధ్యయనం చేసినట్లు గ్రహించ వచ్చు.

**'ద్వాదశవర్షాణ్యేక వేదే బ్రహ్మచర్యం గ్రహణాన్తంవా'** అని గౌతమధర్మ సూత్రం ఒక్కొక్క వేదాధ్యయన కాలం 12 సంవత్స రాలు అని తెలియజేస్తోంది. 12 సంవత్స రాలలో అధ్య





యనం ముగియక పోతే, బాగా మనసులో హత్తుకొనే వరకు అధ్యయనం కొనసాగ వలసిందే కొంతమంది బుద్ధిమంతు లకు 12 సంవత్సరాలలోపే అధ్యయనం పూర్తి అవుతుంది. కొందరికి అధిక సమయం పట్టవచ్చు. మూడు వేదాలను పూర్తిగా అధ్యయనం చేయడం ఆ రోజులలో సర్వ సాధారణంగా (విధిగా) ఉండేది. అందుకే భరద్వాజుడు కూడ మూడు వేదాలను పూర్తిగా అధ్యయనం చేయాలని అనుకున్నాడు. తరువాత కాలంలో వేదవ్యాస మహర్షి వేదాలను విభజించి, శాఖాభేదం ఏర్పాటు చేసిన తరువాతనే వేదాధ్యయనంలో ఒక కట్టుబాటు ఏర్పడింది.

**'యోనధీత్య ద్విజో వేదాన్**
**అన్యత్ర కురుతే శ్రమమ్'** అనే

మను మహర్షి వాక్యంలో 'వేదాన్' అని బహువచనం ఉండుటచే ఈ నాటికిని భారద్వాజ గోత్రీకులు మూడువేదముల యందు మనకు కనబడుచున్నారు. తరువాతి కాలంలో వేదవ్యాసుడు వేదాలను విభజించి ఒక్కొక్కరికి ఒక్కొక్క వేదశాఖను ఏర్పాటు చేసినా, తమ మూలపురుషుడు - భరద్వాజుడు-మూడు వేదాలను అభ్యసించిన వాడు కావడంతో, తరువాతి కాలంలోని భరద్వాజ గోత్రీకులు మూడు వేదాలలోని ఒక్కొక్క శాఖలో తమ తమ స్థానాన్ని పదిల పరచుకుని ఉంటారు. అనే విషయాన్ని మనం గ్రహించవచ్చును.

రామాయణ ఆవిర్భావానికి కారణ భూతుడు అనే గొప్పతనం కూడా భరద్వాజ మహర్షికి ఉంది. అది ఏమిటో మరుసటి సంచికలో తెలుసుకుందాము.

⇨⇨⇨

**శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో....**

కర్ణాటక రాష్ట్రంలోని, మాండ్యాజిల్లా, మేల్కోటలో తిరునారాయణస్వామి సన్నిధిన జరిగే అన్నదాన కార్యక్రమానికి కావలసిన వస్తుసామగ్రిని పంపుతున్న డా॥ **శ్రీమాన్ బచ్చు రాధాకృష్ణగారి దంపతులు** పరివారమును శ్రీశ్రీశ్రీస్వామివారు అనేకానేక మంగళాశాసనములు కృపచేసారు.



# భగవద్రామానుజ చరిత్ర

శ్రీమతి T.K. చూడామణి, విజయవాడ.

చిదంబరంలో శ్రీ గోవిందరాజస్వామి ఆలయం ప్రాకారాలు అన్నీ సర్వనాశనం చేసి తృప్తితో, చెప్పలేని ఆనందంతో కంచికి బయలుదేరాడు కులోత్తుంగుడు. పూర్వం ఎన్నో విజయాలు పొందాడు కానీ, ఈ వాళ పొందిన ఆనందం ఇంతకు ముందెప్పుడూ లభించలేదు. లేకపోతే నాకెదురు తిరుగుతారా! వైష్ణవం వైష్ణవం అంటూ పరవశించి పోతారా! ఇప్పుడేమయింది. గోవిందరాజు ఆలయాన్ని నాశనం చేశేసాను. దీనితో చాలావరకు సుప్రసిద్ధ వైష్ణవాలయాలనన్నింటిని ఒక పట్టుపట్టినట్టే. అయితేనేం ఇంకొక్కటుంది. అది శ్రీరంగం...

శ్రీరంగమట. శ్రీరంగనాథుడట మంత్రులతో ఆలోచించాడు. కులోత్తుంగుని దృష్టి ఒక్కసారి అటువైపు మళ్ళింది వైష్ణవులు విలవిల్లాడారు. అమ్మో! శ్రీరంగనాథా..... తండ్రీ నువ్వేకాపాడాలి. భక్తుల ఆత్మవేదన - రోదన....అంతా ఇంతాకాదు.

ఆ రోజురాత్రి కులోత్తుంగుడు ఆనందంగా నిద్రించాడు. సగం నిద్రలో మెలకువ వచ్చింది. ఏదో చెప్పరాని భయం ఒక్కసారి మనసుని ఆవరించింది. ఆ భయం క్షణాల్లో విశ్వరూపం దాల్చింది. ఏదో తెలియని బాధ.... అబ్బా! భరించలేని బాధ... ఏమిటిది. ఉన్నట్టుండి గొంతులో... పోటు బయలుదేరిందేమిటి... ఇది నొప్పా! మంటా.... ఏమౌతోంది గొంతులో... అమ్మా.... ఒక్క అరుపు అరిచాడు రాజు.... ఒక్క పరుగులో వచ్చి వాలారు సేవకులు. రాజు ఏదో చెప్పలేని బాధని అనుభవిస్తున్నాడు. వెంటనే రాజవైద్యులకు వార్తపంపారు. క్షణాల్లో వచ్చారు భిషగ్వరులు. పరీక్షించారు రాజుని అతను చెప్పిన బాధని బట్టి...

అన్ని పరీక్షల అనంతరం తేల్చిచెప్పిన విషయం ఏమిటంటే... రాజుకి గొంతులో పుట్ట కురుపు..... వ్రణం లేచింది అని.... 'ఆ!!' ఆ మాట వింటూనే మూర్ఛిల్లాడు రాజు. శైత్యోపచారాలన్నీ జరిగాయి. ఏం పరవాలేదన్నారు వైద్యులు. ఎంతో ధైర్యం చెప్పారు. వైద్యం మొదలుపెట్టారు. రోజులు గడుస్తున్నాయి. మొదట్లో ఏదోఅప్పుడప్పుడు గొంతులో నొప్పిగా ఉంది అనుకునేవాడు రాజు ఏముంది. అదే తగ్గిపోతుందిలే అనే నిర్లక్ష్యం. చూస్తూండగా బాధ ఎక్కువై... ఈనాడు అది వ్రణంగా మారిందే. రాజవైద్యులు కూడా మందులిస్తున్నారే గాని, తగ్గుతుందని పైపైకి అంటున్నారే గాని తగ్గే రోగమేనా ఇది? ఇలా రోజురోజు బాధ పెరిగి గొంతునే కొరికేస్తోందా? అసలు మాట్లాడదామంటే మాటే రావడం లేదే.. ఏమిటిది? మాటరాకపోతే పరవాలేదు. లేచి నడుద్దామన్నా ఓపిక లేకుండా అయిపోతోందేమిటి? ఎందుకిలా అయిపోతోంది. బాధ ఇంత బాధగా ఉంటుందా?

ఒక్కసారి ఛెల్‌మని కొట్టినట్టు భావన... కులోత్తుంగుని కన్నుల ఎదుట మహాపూర్ణులు ఆనాడు మహాపూర్ణుల కళ్ళు బల్లెంతో లాగి వేయించానే! ఎంత బాధ. ఓహ్! ఇలాగేనా! ఇంతకంటే ఎక్కువ కదూ... కూరేశులు.... తమ గోళ్ళతో తామే తమ కళ్ళు లాగిగ్రుడ్లు విసిరిన భయంకర దృశ్యం అబ్బా.!... కూరేశా! మీరెవరు? ఎంత





దుస్సాహసం. గురుదేవుల రక్షణ కోసం మీరు చేసిన ఆ త్యాగం ఆహ్! ఎంత బాధని అణచుకొన్నారు ఆనాడు! దానంతట అది వచ్చిన బాధనే నేను భరించలేక పోతున్నానే... స్వయంగా తెచ్చి పెట్టుకొని ఎంతటి మరణబాధని అనుభవించారు. మీరు మనుష్యులా.... భాగవతోత్తములా? మిమ్మల్ని బాధించిన పాపానికి ప్రతిరూపం ఈ నా గొంతు బాధ? ఎందరు శ్రీవైష్ణవాగ్రేసరుల్ని చంపించాను. బాధించాను.... ఆ మహాపాపం రూపం దాల్చి నా గొంతులో వ్రణమై కూర్చుందా? అబ్బా భరించలేను.

ఎవరిదా ముఖమండలం.. విశాల నేత్రాలు? ఊర్ధ్వపుండ్రాలా.... మరణానికి భయపడని మేరునగధీరమూర్తి కూరేశులా... అలా మళ్ళీ మళ్ళీ ఆ ముఖం... రక్తం చిందిన నేత్రాలు... మాయని చిఱునవ్వు.... ఓ కూరేశా! ఎందుకు నన్నిలా పరీక్షిస్తున్నారు? మహనీయులు మీరు శపించరు. నా పాపమే నా పాలిట శాపంగా మారింది. వృద్ధులని జాలి, దయ, గౌరవం ఏమీ లేకుండా మహాపూర్ణుల నెంతబాధించాను.

కన్నుమిన్ను కానని అహంకారం... అంతా హాయిగా గడిచిపోతుంటే నా అంతటి వాడు లేడనే అహంకారం.... ఇవాళ.. ఈ బాధ అనుభవంలోనికి వచ్చాక చేసిన తప్పిదాలన్నీ కన్నుల ముందు కదలాడు తున్నాయే.... భాగవతోత్తముల ఎడల అపరాధం చేసినవారి బ్రతుకులింతేనా? నా పాపానికి ప్రాయశ్చిత్తమేమిటి?

అసలు ప్రాయశ్చిత్తానికి ఈ జీవితంలో అవకాశ ముందా? అబ్బా... భరింపలేక పోతున్నా... ఎవరూ? రాజవైద్యులా... .ఏమంటారు? పుండులోనుండి పురుగులు పడుతున్నాయా? ఓ ఎంత భయంకర వార్త.... కంఠంలో క్రిములా? అంటే నేను క్రిమి కంఠుణ్ణి అయ్యానా? నేనే వినలేకపోతున్నానే? చూచేవారికి ఎంతటి అసహ్యభావన కలుగుతుంది? విలవిలలాడి పోతున్నాడు 'క్రిమికంఠుడు' కులోత్తుంగుడు.

రాజవైద్యులు తమ ప్రయత్నాలు తాము చేస్తున్నారు... రాజు చెప్పలేని అధైర్యం నిస్సహాయత నిండుగా చోటుచేసికొంది. మంత్రిని పిలిపించాడు. శ్రీరంగంపై దండయాత్రని కూర్చిన ఆలోచన పక్కనపెట్టమన్నాడు. ఆవేమీ ఆలోచించకండి మహారాజా! మీకు ఆరోగ్యం చేకూరిన తర్వాతే ఆ ప్రయాణం అన్నారు మంత్రులు. వద్దు ఆ ప్రయాణం ఇంక జరగడానికి వీల్లేదు. ఆజ్ఞాపించాడు రాజు ఆశ్చర్య పోయారు మంత్రులు. రాజు కన్నులు దుఃఖాశ్రులతో నిండిపోయాయి హే రామానుజా! మిమ్మల్ని మీ పరివారాన్ని ఎన్ని కష్టాలపాలు చేశాను. నన్ను క్షమించండి. ప్రత్యక్షంగా మీ పాదాలపై వ్రాలే అవకాశం అంత సమయం ఈ జన్మకి నాకు లేదు. క్షమించండి. కన్నులు వాలుతున్నాయి. మధ్యలో తిల్య.. గోవిందరాజుని రక్షించే దీక్షతో ఆమె చేసిన నాట్యం.... పాడిన పాట.... ఒక్కసారి రాజు కన్నుల ముందు తిల్యరూపం నిలిచింది. సైగచేశాడు. భటులు దగ్గరగా వచ్చారు. తిల్యాని తీసికొని రమ్మన్నాడు. ఆ తర్వాత----------

# శ్రీవచన భూషణము

- శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి, విశాఖి

## 96వ సూత్రము

**ఆత్మగుణంగళిళ్ ప్రధానమ్ శమముమ్, దమముమ్.**

ఆత్మగుణములలో ప్రధానమైన గుణములు శమము, దమము. శమము అనగా మనసు లౌకిక విషయాలపై ప్రసరించకుండుట, అనునవియే.

ఇతర విషయముల యందు విరక్తి కలుగుటకు కారణము భగవద్విషయము నందు అధికమగు ఆసక్తి కలుగుటయే. అని చెప్పి అందు ప్రధానముగ శమము, దమమును చెప్పుచున్నారు. అట్లు చెప్పుటకు కారణము ఆత్మగుణములలో ఈ రెండును చాల ముఖ్యమైనవి. శమమును అనగా మనసు భగవంతుని విడచి లౌకిక విషయములపై ప్రసరింపకుండుట. దమము అనగా బాహ్యములగు ఇంద్రియములు కన్ను, ముక్కు, చెవి లౌకిక విషయానుభవములందు ప్రసరింపకుండుట. అంతఃకరణ నియమనము శమము. బాహ్యకరణ నియమనము దమము. 'శమశ్చిత్త ప్రశాంతిః స్యాత్ దమశ్చ ఇంద్రియ నిగ్రహః' శమమనగా చిత్త ప్రశాంతి, దమమనగా ఇంద్రియ నిగ్రహము'. 'క్షమాసత్యం దమశ్శమః' అను శ్లోకమునకు వివరణము చేయుచు భాష్యకారులు, దమమనగా బాహ్యేంద్రియములు అనర్థమును కలిగించు విషయమునందు ప్రవర్తించకుండుట. శమమనగా అంతఃకరణమైన మనస్సు అనర్థమును కలిగించు విషయముల యందు ప్రవర్తించకుండుట అని వివరించినారు. అట్లుగాక శమము బాహ్యేంద్రియ నిగ్రహమనియు, దమము అంతఃకరణ నిగ్రహమనియు చెప్పుటకూడ కలదు. శమము, దమము అనునవి కలిగినచో మిగిలిన ఆత్మగుణములు తమంత తామే కలుగును. అందుచే ప్రధానమైన శమదమములకు భగవత్ప్రావణ్యమే కారణమని చెప్పినారు. భగవంతుని కంటె ఇతరములైన విషయముల యందు విరక్తి కలుగుట సమస్త ఆత్మగుణములు కలుగుటకూ మూలము. అందుచే ప్రధానమైనవి శమము, దమము అనునవి రెండే అని చెప్పినారు.

## 97వ సూత్రము

**ఇవై ఇరండుముండానాల్ ఆచార్యన్ కైపుకుఋమ్. ఆచార్యన్ కైపుకుందవాతే తిరుమంత్రమ్ కైపుకుఋమ్ తిరుమంత్రమ్ కైపుకున్దవాతే ఈశ్వరన్ కైపుకుఋమ్. ఈశ్వరన్ కైపుకుందవాతే "వైకుంఠ మానగర్ మత్తదు కైయదువే" ఎన్గిఅపడియే ప్రాప్యభూమి కైపుగుఋమ్.**

శమము, దమములు రెండును ఉన్నచో ఆచార్యుడు లభించును. ఆచార్యుడు లభించగనే తిరుమంత్రము లభించును. తిరుమంత్రము లభించినచో సర్వేశ్వరుడు వశమగును. సర్వేశ్వరుడు వశముకాగానే వైకుంఠమనెడి మహానగరము హస్తగతమగును. అనినట్లుగ ప్రాప్య భూమి, అనగా, పొందవలసిన స్థానము లభించును.

ఆత్మగుణములన్నిటిలో శమ దమములనగా ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము ప్రధానమని వెనుక చెప్పినారు. ఆ శమదమములు కలిగినచో వానికి లభించు

ఫలము వరుసగ వివరించుచున్నారు. భగవానునియందు అధికమగు ఆసక్తి కలుగుటచే పరిపూర్ణ మయిన బాహ్యేంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము లభించును.

భగవానుని వదలి ఇంద్రియములు వేరొక విషయము వైపువెళ్ళవు.అప్పుడు ఆచార్యుడు మన యోగ్యతను చూచి అనగా భగదాభిముఖ్యము,ఇంద్రియ నిగ్రహము, ఇతర విషయములయందు వైరాగ్యము కలిగిన వానిని చూచి సంతసించి ఈ సంసారమును తొలగించు తిరుమంత్రమును ఉపదేశించుటయే ఆచార్యుడు వశమగుట

**తస్మై సవిద్వాన్ ఉపపన్నాయ సమ్యక్**
**ప్రశాంత చిత్తాయ శమాన్వితాయ**
**యే నాక్షరం పురుషం వేద సత్యమ్**
**ప్రోవాచ తామ్ తత్త్వతో బ్రహ్మవిద్యామ్** ॥ముండకే॥

ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము గలవాడై ఆచార్యుని వద్దకు చేరి వినయముతో ప్రణిపాతము అనగా నమస్కారము చేసి ప్రార్థించిన, ప్రశాంత మైన మనస్సు ఇతరవిషయముల వైపుపోని ఇంద్రియములు గల శిష్యునకు ఆచార్యుడు బ్రహ్మ విద్యను ఉన్నదానిని ఉన్నట్లుగా ఉపదేశింప వలెను. అని శ్రుతి చెప్పుచున్నది.

ఆచార్యుని చేరి నమస్కరించిఉపదేశము చేయవలెనని అర్థించుటకు ముందీ శిష్యునకు అనర్థములను కలిగించు విషయముల నుండి వెనుతిరిగిన మనస్సు గలవాడు బ్రహ్మవిద్యను ఎరుంగుటకు ఆచార్యుని చేరి నమస్కరించి అర్థించును. అట్టివానికి ఆచార్యుడు బ్రహ్మవిద్యను ఉన్నదానిని ఉన్నట్లుగా ఉపదేశింపవలెను. అని శ్రుతి చెప్పినది. ఆచార్యుని చేరి ప్రార్థించుటకు ముందు శమము దమము ఆవశ్యకములు. అనగా తాము పొందగోరెడి బ్రహ్మజ్ఞానము కంటె ఇతరములైన విషయముల నుండి మనస్సు, ఇంద్రియములు వెనుతిరగవలెను. అప్పుడే ఆతడు ఆచార్యుడు ఉపదేశించు విద్యను శ్రవణము చేయుటకు తగును. అవధానము కలవాడగును. అట్టి అవధానము కలవానికే ఆచార్యుడు ఉపదేశింపవలెను. అవధానమనగా పరాకు లేకుండుట. వినదగునవిగ నిశ్చయించుకొనిన విషయము కంటె ఇతర విషయములపై మనసు ప్రసరింపకుండుట బ్రహ్మవిద్యో పదేశమునకు ముఖ్యము. భగవదుపాసనమునకు ఇంద్రియములను పూర్తిగా జయింపవలెను గాని ఆచార్యుని నుండి శ్రవణము చేయుటకు వారు ఉపదేశించు నట్టి విషయమును వినుటకు విరుద్ధముగా ఇతర విషయముల వైపు మనసుగాని ఇంద్రియములు గాని ప్రసరింపకుండ ఉండెడి అవధానవే ప్రధానము.

ఇట్లు ఆచార్యుడు శిష్యుని అంగీకరించి ఉపదేశింప సిద్ధపడగానే వారి అనుగ్రహముచే శిష్యునకు సంసార బంధమునుండి విడువడుటకు ఆవశ్యకమైన తిరుమంత్రము లభించును. "**తన్మంత్రమ్ బ్రాహ్మణాధీనమ్**" అని తిరుమంత్రము ఆచార్యుని వశమై యుండును. ఆచార్యునకు శిష్యునియందు ప్రీతి కలిగి స్వీకరించి, తిరుమంత్రమును అర్థముతో కూడ ఉపదేశించిననాడు అతని హృదయమున స్వస్వరూపము స్థిరముగ నిలచును. మంత్రము బ్రాహ్మణాధీనము అనినారు. బ్రహ్మజ్ఞానము కలిగి సకల జగత్కారణ మగు పరతత్త్వము పరబ్రహ్మము అగు సర్వేశ్వరుని భక్తితో ఉపాసించువాడు బ్రాహ్మణుడు. అని పెద్దలు చెప్పుదురు. 'మంత్రము బ్రాహ్మణాధీనము'. అనగా ఆచార్యుని అధీనమై ఉండునని ఎరుంగ వలెను. ఆచార్యుడు బ్రహ్మజ్ఞానము కలిగి ఉపాసనము చేయువాడే అగును.





## అభినందనము

ఆంధ్రదేశంలో సుమారు మూడు దశాబ్దాలుగా, తిరుప్పావై ప్రవచనాల ద్వారా శ్రీరామాయణం, శ్రీమద్భాగవత మహోపన్యాసాలద్వారా, గ్రంథాలద్వారా సనాతన ధర్మప్రచారం కావిస్తూ ఆస్తిక్యసస్యాలను పండిస్తున్న ప్రవచన శిరోమణులు **ఉ. వే. ప్ర. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామివారికి** సంస్కృత వ్యాకరణ సనాతన ధర్మప్రచార రంగాలలో వారు కావించిన సేవలకు గుర్తింపుగా తిరుపతిలోని రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం (**A Deemed University**) వారు తమ అత్యున్నత పురస్కారమైన '**మహామహోపాధ్యాయ**' బిరుదాన్ని సమర్పించటానికి నిర్ణయించుకున్న శుభసందర్భంలో శ్రీమాన్ **అప్పలాచార్యస్వామివారికి** భక్తినివేదన హార్దమైన అభినందనను సమర్పించుకుంటోంది.

త్వరలో జరగబోయే స్నాతకోత్సవంలో **శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారికి** ఈ బిరుదం సమర్పింపబడుతుందని విద్యాపీఠం వారి వల్ల తెలిసినవార్త.

- భక్తినివేదన

## గ్రంథ పరిచయం

శ్రీశంకర భగవత్పాదులు ప్రస్థాన త్రయానికి భాష్యాలు ప్రసాదించటమేకాక స్తోత్ర ఉపాసనా గ్రంథములను కూడా ప్రకటించినట్లు పెద్దలు చెప్పతారు. ఆ పద్ధతిలోనే శ్రీ విద్యోపాసన గణుతికెక్కినది. అయితే కొంతకాలానికిందులో వామాచార పద్యములు ప్రవేశాలు పలువురిని పెడదోవపట్టించేయి.

అట్లాంటి వామాచార పద్యములను నిరసిస్తూ దక్షిణాచారమే గృహ్యమని నిరూపిస్తూ శ్రీయాగ పరిష్కరణం కానించేరు. శ్రీ శృంగేరీ విరూపాక్ష పీఠాధిపతులు శ్రీకళ్యాణానంద భారతీమాతాచార్యస్వాములు.

వారి పరిష్కరణాన్ననుసరించి విశాఖలో లలితా భట్టారికా పీఠనిర్వాహకులు శ్రీశ్రీ యద్ధనపూడి అమ్మన్న పంతులుగారు 'శ్రీయాగాను క్రమణిక' అను గ్రంథాన్ని ముద్రించి ప్రకటించినారు. శ్రీచక్రార్చకులకు ఉపాదేయమైన ఈ గ్రంథపుటలు 175. వెల రూ. 200/-.

**ప్రతులకు :**

1. **శ్రీయద్ధనపూడి అమ్మన్న పంతులు**
   శ్రీలలితా పరాభట్టారికా పీఠము
   డోర్ నె. 49-24-71,
   ద్వారకానగర్, విశాఖపట్టణం - 530 016
2. **శ్రీవడ్లమూడి వేంకటేశ్వరరావు**
   రిటైర్డ్ వైస్ ప్రిన్సిపాల్
   శ్రీకల, 6-3-81, 3/3 అరండల్ పేట,
   గుంటూరు - 522 0002.

"మధులుబ్ధో యథాభృంగః
పుష్పాత్ పుష్పాంతరం వ్రజత్
జ్ఞానలుబ్ధో తథా శిష్యః
గురోః గుర్వంతరం వ్రజేత్"

*"Madhu lubdho: Yatha: Bhrungah*
*Pushpath pushpa:ntharamVraje:th,*
*Jna:na lubdho: thattha: sishyah*
*guro:r gurvantharam vraje:th"*

***A bee collects drops of honey from different flowers thus makes a hue.***

***Real student seeking knowledge approaches great people and learns from each event. Not only from just persons but also from The Mother Nature, he learns so many lessons at every moment and thus becomes a scholarly model to the world.***







జై శ్రీమన్నారాయణ!

## బదరీనాథ్‌లో అష్టాక్షరీ క్షేత్రంలో జరుగు అన్నదానమునకు, నిర్మాణమునకు వివిధ పోషకులుగా కైంకర్యములు సమర్పించిన భక్తుల వివరములు

***జెట్. సీతానగరం ఆఫీసుద్వారా వచ్చినవి :-***

**మహారాజపోషకులు : -**

వికాసతరంగిణి (గుడివాడ)

**బొంబాయి** :- శ్రీ వి రాఘవాచార్యులు, శ్రీ కె. ప్రేమ్‌నారాయణ, శ్రీ కె. దిలీప్, శ్రీ కె. ప్రభా చంద్రకాంత్

**విజయవాడ** :- శ్రీమతి కె. వెంకటమహాలక్ష్మి, శ్రీమతి చిలకమ్మ, శ్రీ వి. సురేష్ కుమార్, శ్రీ పి. నరసింహారావు, శ్రీ ఎం. భక్తవత్సల చౌదరి, శ్రీ బి. వెంకట కృష్ణారావు, శ్రీమతి కె. విజయలక్ష్మి, శ్రీ ఎం. హరికృష్ణ, శ్రీమతి వి. సీతామహాలక్ష్మి, శ్రీ టి. అచ్యుతరావు, దిరే హెచ్ షా, శ్రీమతి కె. సూర్యకాంతం, శ్రీ టి.కె.ఎల్. నరసింహాచార్యులు, శ్రీ ఎస్. పాండురంగారావు, శ్రీ బి. వెంకట సుబ్బారావు, శ్రీ సి.హెచ్. శివరామ ప్రసాదరావు, శ్రీ యు. శివరామకృష్ణయ్య, శ్రీ టి. నరసయ్య.

**రాజమండ్రి** :- శ్రీమతి జి. విజయలక్ష్మి, శ్రీమతి కృష్ణవేణి, శ్రీమతి కె.కృష్ణవేణి, శ్రీ కె. రంగారావు, శ్రీ జి. తిరుమలరావు, శ్రీ ఎన్. ఆదినారాయణమూర్తి, శ్రీ కె. నాగాశ్వరరావు, శ్రీ సి.హెచ్. వెంకటేశ్వర్లు, శ్రీ రంగారువు.

**మచిలీపట్నం**:- శ్రీ మల్లిపోలు కాంతారత్నం, శ్రీ తిరుమంగయాళ్వార్లు, శ్రీమతి యస్. సౌభాగ్యం, శ్రీ ఆర్.టి.ఎల్. నరసింహమూర్తి,

**హైద్రాబాద్** :- శ్రీమతి డి. యశోదమ్మ, శ్రీమతి సృజన్, శ్రీమతి కె. స్వప్న, శ్రీమతి కె. అవర్ణ, శ్రీమతి పి. సావిత్రమ్మ, శ్రీ వి. కృష్ణారెడ్డి, కుముదిని, శ్రీ ఎన్. రామకృష్ణ, శ్రీమతి సునితా రెడ్డి, శ్రీమతి కె. లక్ష్మి కాంతం, శ్రీ జి. రవీంద్రరావు, శ్రీ ఎన్. రామకృష్ణ, శ్రీమతి బాలామణి, శ్రీమతి గోవిందమ్మ, శ్రీమతి జి.టి. కోమల, శ్రీ రాయల రామలింగయ్య, శ్రీమతి వై గజలక్ష్మి, శ్రీమతి జి. సుమంగళి, శ్రీ కె. గీతా కృష్ణమోహనరావు, శ్రీ కె. మురళీకృష్ణమూర్తి, శ్రీ కె. రామకృష్ణారెడ్డి, శ్రీ జి. కృష్ణారావు, శ్రీ దినేష్, శ్రీవాత్సవ, శ్రీమతి పి. ఆండాళమ్మ, శ్రీమతి కె. కాంతమ్మ, శ్రీమతి వి. లక్ష్మినరసమ్మ, శ్రీమతి ఎం. శ్రావమ్మ, శ్రీ ఇ. శ్రేయారెడ్డి, శ్రీమతి బి. అనసూయమ్మ

**సికింద్రాబాద్** :- శ్రీమతి సుభద్రమ్మ, శ్రీమతి డి. అప్పల నరసమ్మ, శ్రీమతి దేముడమ్మ, శ్రీ ఎన్. బ్రహ్మానందాచారి, శ్రీమతి డి. లక్ష్మి, శ్రీ వి. పాండురంగారావు, శ్రీమతి కె. రవిశంకర్, శారదాదేవి, శ్రీ వి.ఎ. గుప్త

**ఒంగోలు** :- శ్రీ ఎన్. చంద్రమోహనరెడ్డి, సి.ఆర్. బాల గురవయ్య, సుబ్బయ్య, శ్రీ పి. వెంకట రమణారావు, శ్రీ సి.హెచ్. రాఘవాచార్యులు, శ్రీ పి. రామకృష్ణ, శ్రీమతి కె. లక్ష్మిబృందావనమ్మ, శ్రీ కె. ఉదయసుందరరావు.

**గుంటూరు** :- శ్రీ టి. ఉమాకాంతారావు, శ్రీ కె. భవాని శంకర్, శ్రీ కె. సాంబశివరావు, శ్రీ పి. కృష్ణమోహన్,

**విశాఖపట్నం** :- శ్రీ బి.వి. సూర్యనారాయణ మూర్తి, శ్రీ వై అప్పారావు, శ్రీ జి. రంగవర్మ, శ్రీమతి డి. జమున, శ్రీ సి.హెచ్. లక్ష్మణరావు, శ్రీ పి. శ్రీనివాసరావు, శ్రీ ఎం.ఎ. ఆల్వార్, శ్రీమతి బి. అవిశెలమ్మ, శ్రీమతి జి. కనస్తూరి, శ్రీ పి. సూర్యనారాయణరావు శ్రీమతి & శ్రీ హేమ, సి.ఎన్.రావు, శ్రీ ఎం. వరాహలమ్మ, శ్రీ బి. వీరాస్వామి, శ్రీ బి. శ్రీనివాసన్, శ్రీమతి కె. సరోజినీ దేవి, శ్రీమతి ఎం. ఎస్. కమలాదేవి

**భీమవరం** :-

శ్రీమతి & శ్రీ ఎన్. సత్యనారాయణమూర్తి, ఐతాంబ, శ్రీ ఎం. ప్రభాకర్, శ్రీ ఎం.ఎన్.వి. దుర్గాప్రసాద్, శ్రీ ఎం.ఎస్. మూర్తి, శ్రీ ఆర్. శేషయ్య, శ్రీ ఎం. మల్లావధాన్లు, శ్రీ వి.వి. శాస్త్రి, శ్రీ పి. ఉమాపతి, శ్రీమతి బి. సూరమ్మ, శ్రీమతి ఎం. నరసమ్మ, శ్రీ ఇ. సత్యనారాయణ శర్మ, శ్రీ కె. సీతారామరాజు. శ్రీమతి జి. లక్ష్మీతాయారు, శ్రీ ఎన్. నరసమ్మ (డోర్నకల్లు), ఎస్. నిరంజన రెడ్డి (గొల్లల మామిడాడ), శ్రీ ఎస్. రామకృష్ణారావు (గడ్డిపాడు), శ్రీ వి. సత్యనారాయణరాజు (ధవళేశ్వరము), శ్రీ ఎ. సత్యనారాయణ (చినగంజాము), శ్రీమతి కె. ప్రమీళాదేవి (మంచీర్యాల), శ్రీమతి ఎ. లక్ష్మికాంతమ్మ (సీతానగరం), శ్రీ వై లక్ష్మి (మంచిర్యాల), శ్రీ జె. అమరయ్య (దుర్గి), శ్రీమతి కె. సుభద్రమ్మ (తరకటూరు), శ్రీమతి వై లక్ష్మికాంతరెడ్డి (కర్నూలు), శ్రీ వి. రామస్వామి (సిద్ధిపెట), శ్రీమతి టి. తిరుపతమ్మ (తెనాలి),

శ్రీమతి ఎస్. లక్ష్మమ్మ (కందుకూరు), శ్రీమతి కె. జానకి (పెదగొండూరు), శ్రీ ఎం. వెంకట సుబ్రహ్మమణ్యం (చినగంజాము), శ్రీ వెంకటనాగ గోపాలకృష్ణారావు (ఆత్కూరు), శ్రీ వై వెంకటరావు (వేములవాడ), శ్రీ డి. రామారావు (ఖమ్మం), శ్రీ డి. వెంకటేశ్వర్లు, (ఖమ్మం), శ్రీ వి. రాధాకృష్ణమూర్తి (కానూరు) శ్రీ పి. సత్యనారాయణ రావు (పూసపాటిరేగ) శ్రీమతి పి. నాగరత్నమ్మ (చాట్రాయి), శ్రీమతి ఎన్. సూర్యకాంతమ్మ, శ్రీమతి ఎ. రామసీత, శ్రీమతి పి. సుశీల, శ్రీమతి ఆర్. నిర్మల (గణపవరం) శ్రీ కృష్ణాజీ (విజయనగరం), శ్రీ పి. వి. సుబ్బరాజు (తణుకు) శ్రీ పి. శివరామ్, శ్రీ కె. సాయికుమార్, శ్రీ కె. సునీల్ కుమార్, శ్రీ బి. రమేష్ (విజయనగరం), శ్రీ ఎన్. భద్రావతి (తణుకు) శ్రీ పి. ఆర్.ఎన్. ఠాగూర్ (ఖమ్మం), శ్రీ కె. వెంకటేశ్వర్లు, కె కొండయ్య (తెనాలి), శ్రీ.కె మురళీ మోహనరావు (కానూరు), శ్రీమతి పి.నరసాయమ్మ, శ్రీమతి జి. కొండయ్యమ్మ, శ్రీమతి పి. ప్రేమలతా దేవి (పూసపాటిరేగ) శ్రీ పి. ఎన్. ఎన్ భాస్కరం (కొంతమూరి), శ్రీ జె. జగదీష్ (పమిడిపాడు), శ్రీ పి. రాజీవ్ (రిట్టాపాడు), శ్రీమతి ఎన్. సుశీలమ్మ (నాగుపల్లి), శ్రీ జి. సత్యం, శ్రీ పి కాంత ఉమామహేశ్వరరావు, శ్రీ కె. కృష్ణమూర్తి (ఖమ్మం), శ్రీ ఎస్. ఎన్.సి. శ్రీనివాస్ (తెనాలి), శ్రీ వి.ఎ.వి.ఎన్. వర్మ (శివదేవుని చిక్కాల), శ్రీ బి. వెంకటాచార్యులు (లింగాలవలస), శ్రీ ఎ. ఎస్. ఆదినారాయణ (సేలం), శ్రీమతి ఎస్. ఆండాళ్ (వడ్డేపల్లి), శ్రీ ఐ. విశ్వనాధం (వరంగల్) శ్రీ ఎల్. త్రినాధరావు (నడగాం) శ్రీ ఎం.వి.ఎన్. వేణుగోపాల్, శ్రీ ఎ. ఆంజనేయ ప్రసాద్, శ్రీ ఎ. సాంబశివరావు, శ్రీ ఎ. సుబ్బారాయుడు, టి. వీరకుమార్ (వలపర్ల ), శ్రీ కె. పెద అప్పలరాజు (గజపతి నగరం) శ్రీ కె. సుబ్బాయమ్మ, శ్రీ శ్రీనివాసరెడ్డి (బలభద్రపురం) శ్రీ ఎం. వెంకటేశ్వర్లు (పెరికలపూడి) శ్రీ వి. వెంకయ్య, శ్రీమతి టి. ఆండాళ్ళమ్మ, శ్రీవి. సురేషు, శ్రీమతి రమాదేవి (సూర్యాపేట), శ్రీమతి బి. భారతమ్మ (మిర్యాలగూడ), శ్రీమతి ఎన్. ఊర్మిల (ఉప్పలపహడ్), శ్రీమతి డి విజయలక్ష్మి (ఆకివీడు), శ్రీ వి. వెంకట ప్రసాదరెడ్డి (మార్టూరు), శ్రీమతి కె. విజయలక్ష్మి (జిన్నూరు), శ్రీ పి. చిన సత్యనారాయణ (గోపాలపురం) శ్రీ కె. శంకర్(తుంగతుర్తి), శ్రీ పి. సీతారావమ్మ (మునగాల), శ్రీమతి సి. హెచ్. లక్షీబాయమ్మ (తాళ్ళకంబంబాడు), శ్రీ పి. సుబ్బరాజు (చెరుకుమిల్లి), శ్రీ డి. వి. సాతారామస్వామి (పిఠాపురం), శ్రీ కె. బాలగోపాలరావు (కాకినాడ), శ్రీ పివి ఎస్. సూర్యనారాయణరాజు (పాలకొల్లు), శ్రీ డి. గంగాధరరెడ్డి (గొల్లల మామిడాడ), శ్రీ వి. బ్రహ్మం (కలవపాముల), ఎల్ లక్ష్మయ్య (ఖమ్మం), శ్రీ జి. వీరన్న (పెదనామిల), శ్రీ పి. రంగయ్య (పట్టికన్నంపహడ్), శ్రీమతి రత్నమాణిక్యం, మంజుల (జమ్మి గొల్వేపల్లి), ఎన్. రాజ్యలక్ష్మి (చీరాల), శ్రీ జి. అనంతయ్య (మిర్యాలగూడ), శ్రీ కె. సురేష్‌కుమార్ రెడ్డి, శ్రీ ఎం. వెంకటాలం (నెల్లూరు), శ్రీ ఎ. సూర్యనారాయణరాజు, శ్రీ కృష్ణమరాజు, అన్నపూర్ణ, శ్రీ సి.హెచ్. సూర్యనారాయణరావు (రాజోలు), శ్రీ సి.హెచ్. సుధాకరరావు, శ్రీమతి సి.హెచ్. గీతారాణి (శ్రీశైలం), శ్రీమతి పి. శకుంతలమ్మ (మహబూబ్ నగర్), శ్రీ ఎన్. వెంకటరావు (గంగవరం), శ్రీ వంగల కుటుంబరావు (మంగళగిరి), శ్రీ ఎ. వెంకట తిరుపతిరావు (తెనాలి), యార్లగడ్డ కాంతమ్మ (పెదపూడి), శ్రీ కె. శ్రీకృష్ణమూర్తి (నెల్లూరు)

**గుడివాడ** :- శ్రీ ఎన్. సీతారామ నాగభూషణం, శ్రీ వై. కోటేశ్వరరావు, శ్రీ జి. గాంధీ, శ్రీ వి. సుబ్రహ్మణ్యేశ్వరరావు, శ్రీమతి పి. చిట్టెమ్మ, శ్రీ లక్ష్మణరావు, శ్రీ షేక్ అగ్బర్, శ్రీ పి. తిరుపతయ్య, శ్రీ టి. రవికుమార్, శ్రీమతి జి. సుఖరాణి, శ్రీ బి. వెంకటరత్నం, శ్రీ జి. నాగేశ్వర సంపత్‌కుమార చౌదరి, శ్రీ పి. కృష్ణమూర్తి, శ్రీ జి. విష్ణుప్రభాకరరావు,

**పరవలి** :- శ్రీమతి జె. సూర్యపార్వతమ్మ, శ్రీమతి టి. దుర్గాంబ, శ్రీ టి. కోటేశ్వరరావు, శ్రీ ఎల్. పుర్ణచంద్రరావు, శ్రీమతి ఎ సీతమ్మ.

**మెరకనపల్లి** :- శ్రీమతి వై. రాజమ్మ, శ్రీమతి ఎం. కౌసల్య, శ్రీమతి ఎం. రాజ్యలక్ష్మి, శ్రీమతి ఎమ్. సీతమ్మ.

**ఏలూరు** :- శ్రీ పి. కృష్ణారావు, శ్రీమతి కే. సుజాత, శ్రీ జె. లక్ష్మి కోటేశ్వర తాతబ్బాయి, శ్రీమతి ఎన్. అనసూయమ్మ, శ్రీ కె. అమ్మేశ్వరరావు, శ్రీమతి ఆర్. నిర్మల.

**హనుమాన్ జంక్షన్** :- శ్రీ బి. సుబ్రహ్మణ్యం, శ్రీ టి. సత్యనారాయణ, శ్రీమతి సీతమ్మ, శ్రీ బి. రామకోటేశ్వరరావు, శ్రీ బి. వరప్రసాద్, శ్రీమతి కె. వెంకట విజయ భారతి, శ్రీ బి. రామమోహనరావు.

**శోభనాపురం** :- శ్రీ కె. నరసింహారావు, శ్రీ బి. బాబూరావు, శ్రీ సిహెచ్. నాగులు, శ్రీ ఆర్. శ్రీనివాసరావు, శ్రీ ఎన్. పూర్ణచంద్రరావు.





# శ్రీరామ మంగళాశాసనమ్

శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఈ.వే. శింగరాచార్యులు, తిరుపతి.

**పితృభక్తాయ సతతం భాతృభిః సహ సీతయా।**
**నందితాఖిలలోకాయ రామభద్రాయ మంగళమ్॥**

పితృభక్తాయ = తండ్రియగు దశరథుని యందు భక్తిని కలవాడు, సతతం = ఎల్లప్పుడు, భాతృభిః = సోదరులతో, సీతయా సహ = సీతాదేవితోపాటు, నందిత అఖిలలోకాయ = ఆనందింపచేయబడిన లోకమును కలవాడగు, రామభద్రాయ = శ్రీరామునకు,మంగళమ్= మంగళమగుగాక!

పితృభక్తిపరాయణుడు, సోదరులతో, సీతాదేవితో కూడినవాడై ప్రజల నందఱను సంతోషపరచినవాడునుఅగు రామభద్రునకు మంగళమగుగాక! (పితృభక్తాయ) - ఈ శ్లోకములోని విశేషణములు బాలకాండ చివరి సర్గలో, అయోధ్యాకాండలోని మొదటి సర్గలోగల శ్లోకముల భావమును స్పృశించుచున్నవి. బాలాకాండ చివరలో -

**'కృతదారాః కృతాస్త్రాశ్చ సధనాస్ససుహృజ్జనాః, శ్రుశ్రూషమాణాః పితరం వర్తయంతి నరర్షభాః కాలేకాలే తు నీతిజ్ఞాః తోషయంతో గురుం గుణైః "గతే తు భరతే రామో లక్ష్మణశ్చ మహాబలః। పితరం దేవసంకాశం పూజయామాసతుస్తదా॥"**

అనుమొదలగు సూక్తులు, అయోధ్యా కాండ మొదటి సర్గలోని **"తేషా మపి మహాతేజా రామోరతికరః పితుః"** ఇత్యాది శ్లోకములు దశరథుని శ్రీరాముడు ఎట్లు ఆనందపఱచెనో, తండ్రి పట్ల ఎంతటి గొప్ప భక్తిని కలవాడో తెలుపుచున్నవి. **"ఆహూతస్యాభిషేకాయ విసృష్టస్య వనాయ చ"** ఇత్యాదిగా పట్టాభిషేకమునకు పిలచినపుడు, వనమునకు పొమ్మన్నప్పుడును ఒకే విధమైన భావమును శ్రీరాముడు కల్గియుండెనను సూక్తులును శ్రీరాముని పితృభక్తిని గూర్చి తెలుపుచున్నవి. ఇట్టి భావమునకు అనుగుణముగా **"సతతం"** అనుపదమును కాకాక్షి న్యాయమున ముందు విశేషణమునకు అన్వయించి **'సతతం పితృభక్తాయ'** అని అర్థమును చెప్పనగును. **'సపితుర్వచనం శ్రీమాన్ అభిషేకాత్ పరంప్రియమ్'** అను వాల్మీకిసూక్తిని, **'పితృభక్తః'** అను శ్రీరామాష్టోత్తర శతనామ స్తోత్రములోని నామమును ఇచట స్మరింపనగును.

**సతతం భాతృభిః సహసీతయా నందితాఖిల లోకాయ**-శ్రీరాముని రూపమునకు గుణములకు, ప్రవర్తనకు జనులందరు ఎట్లు ఆకృష్టులయ్యిరో, ఆనందమును పొందిరో వాల్మీకి అయోధ్యాకాండ ప్రారంభమున విస్తరముగా నిరూపించెను. **'రామస్య శీలవృత్తేన సర్వేవిషయవాసినః, తేషామతియశా లోకే రామస్సత్య పరాక్రమః, స్వయంభూరివ భూతానాం బభూవ గుణ వత్తరః', తథా సర్వప్రజాకాంతైః ప్రీతి సంజననైః పితుః''** ఇత్యాది వాల్మీకి రామాయణ శ్లోకములు శ్రీరాముని గుణము వలన, ప్రవర్తనవలన సర్వప్రాణులును ఆనందము ను పొందిరని తెలుపుచున్నవి.

(రామభద్రాయ) -**'భందత ఇతి భద్రః,**

భధి-కల్యాణే' అను వ్యుత్పత్తిని కల భద్ర శబ్దము మంగళార్థకము. 'మంగళానాంచ మంగళమ్'అని స్తుతింపబడువాడు పరమాత్మ. కావున **'రామ ఏవ భద్రం, తస్మై'** అను వివరణము ద్వారా శ్రీరాముని కళ్యాణ రూపమునకు మంగళరూపమునకు స్తోత్రకర్త మంగళమును పాడినట్లయి నది. **'సమస్త కల్యాణగుణా త్మకోஉసౌ'** అను శ్రీవిష్ణు మహా పురాణములోని శ్లోకమును వివరించుచు శ్రుతప్రకాశికా చార్యులవారు **'దివ్యాత్మ స్వరూపస్య మంగళైకతానత్వ మాహ'** అని పల్కుట, అట్లే ఈ ప్రమాణము ఈడు అరుంబదమున **'కళ్యాణ శబ్దమ్ భావప్రధాన మాయ్, కళ్యాణ త్వత్తై గుణమాక స్వభావమాక వుడైయ దివ్యాత్మ స్వరూపమ్ యూవనొరు వనుక్కు అవన్ సమస్త కళ్యాణ గుణాత్మక నెన్నుతల్'** ఇత్యాదిగా వివరింప బడుట ఇచట స్మరణీయములు. భద్ర శబ్దమునకు వృషభమనియు అర్థముకలదు. అపుడు భద్రశబ్దమును శ్రేష్ఠవాచకముగా గ్రహింపనగును. అందులకు తగినట్లు 'తనిక్కాళై' ఇత్యాదిగా పూర్వము ఉదహరించిన తిరుమంగైమన్నన్ సూక్తిని ఇచట అనుసంధింపనగును. రామభద్ర శబ్దము ఈ శ్లోకముననే కాక,పట్టాభిషేక సందర్భమునుతెలుపు శ్లోకమునను ప్రయోగింపబడినది.శ్రీరామునకు పట్టాభిషేకమును చేయుట తమకును ఇష్టమేనని తెలుపుచు అయోధ్యా పౌరులు అందఱు **'స్త్రియో వృద్ధాస్తరుణ్యశ్చ సాయంప్రాతః సమాహితాః, సర్వాన్ దేవాన్ నమస్యంతి రామస్యార్థేయశస్వినః'** అనునట్లు రాముని పైగల ప్రేమ పారవశ్యముచే దేవతలనందఱను నిత్యము ఉదయము, సాయంసమయములందు నమస్కరించుచు, రామునకు మంగళమాశాసించిరి. అట్లే, కవియు ఆ సందర్భము ఇచట ప్రస్తుతమగుటచే తాము భక్తిపారవశ్యముచే అయోధ్యా పౌరులవలె మంగళమా శాసింపదలచి 'రామభద్రాయ' అను ప్రయోగమును చేసిరని చెప్పనగును.

## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషిచేస్తున్నవారిలో ఒకరిగా శ్రీమాన్ పి. రామ్‌మోహన్‌రావుగారు, చిత్తూరు జిల్లా ప్రధాన న్యాయస్థానంలో జిల్లా పరిపాలనా అధికారిగా ఉంటూ ప్రతినెలా ఎంతోమందిని కలుస్తూ, వారికిమన భక్తినివేదనను పరిచయం చేస్తూ, వారందరినీ మన కుటుంబంలో కలుపుతున్నారు. వీరి కృషి మరింత ఫలప్రదం కావాలని శ్రీశ్రీశ్రీస్వామివారి మంగళాశాసనములు అందిస్తున్నాం.

జై శ్రీమన్నారాయణ!





# సందేహాలు - సమాధానాలు

శ్రీ సి.హెచ్. రాంచందర్‌రావు, కరీంనగర్.

ప్ర. : ముక్తిపొందడమంటే ఏమిటి? ఉపాసకులంటే ఎవరు?

జ. : 'ముక్తి' అంటే కర్మ బంధమునుండి విడుదల పొందుట అని అర్థము. ఒక ఆచార్యుని ద్వారా అష్టాక్షరీ వంటి ఉత్తమమైన మన్త్రాన్ని పొంది, ఆ మంత్రార్థాన్ని మనసులో ప్రీతితో నిరంతరమూ ఎడతెగక తలచుకొంటూ ఉండటమే 'ఉపాసన' అంటారు. అది చేసే వ్యక్తిని 'ఉపాసకుడు' అంటారు.

శ్రీ కె.యన్. పార్థసారథి, మద్రాస్.

ప్ర. : శ్రీమూష్ణం, ఆళ్వార్లెవరూ మంగళాశాసనం చేయలేదే. 108 దివ్యదేశాల్లో ఒకటిగ ఎలా చేరింది?

జ. : శ్రీభూవరాహస్వామి సన్నిధి ఉండే శ్రీమూష్ణం 108 దివ్యదేశాలలో చేరలేదు. కాని అభిమాన క్షేత్రాలలో చేరింది. 8 స్వయంవ్యక్త దివ్యదేశాలలో చేరింది. ఆళ్వార్లకాలంలో ఆ ఆలయం లేదు. కనుక వారు అక్కడ స్వామిని పాడలేదు. కానీ 12వ శతాబ్దంలో మధ్వాచార్యుల వారికి దర్శనమైంది. అప్పటినుండి ఆ ఆలయం పునరుద్ధరణ జరిగింది. ఇప్పటికీ మధ్వులే అక్కడ అధికంగా ఉండి నిర్వహణ చేసన్తూంటారు. శ్రీమణవాళమాముని సమయంలో దానిని సంస్కరించి శ్రీపాంచరాత్రాగమారాధన జరిగేట్టు ఏర్పాటు చేసారు. అయితే అది ఆది అవతారం కనుక, స్వయంవ్యక్తంగూడ కనుక, 8 స్వయంవ్యక్త క్షేత్రాలలో చేరింది.

శ్రీ పి.యస్.యన్. ఆచార్యులు, వల్లిపాడు, చిలకలూరిపేట

ప్ర. : స్వామికి టెంకాయ కొట్టాక పీచు తీయాలా వద్దా?

జ. : పీచుతీయనవసరంలేదు. అలానే నివేదన చేయవచ్చు. లేదా ముందే కొట్టి లోపలి నివేదనార్థ పదార్థాన్నంతా కోరులా తీసి నివేదన చేయవచ్చు. నైవేద్యమపుడు కొట్టి, అక్కడే తీసిన పీచువల్ల స్థలమంతా పాడవుతుంది. పీచు అసహ్యంగా ఇటో అటో పారవేస్తే మరింత అపరిశుభ్రంగా ఆ పూజాస్థలం తయారౌతుంది. అంచేత తీయక్కర్లేదు.

ప్ర. : సాలగ్రామమూర్తులు పగిలితే పూజార్హములా?

జ. : పగిలిన మూర్తులు ఎక్కడైనా జలాశయంలో విసర్జించివేయడం మంచిది. అవి పూజకి తగవు.

శ్రీవనమాల ఈశ్వరయ్య, యస్.యన్. నగర్.

ప్ర. : బ్రహ్మచే సృష్టింపబడిన పదునాల్గు భువనాల వివరములు, వీటితో ఆత్మకు గల సంబంధము. మానవుడు సందర్శించగలవి ఏవి?

జ. : ఒక అండంలో ఉండేవి 14 లోకాలంటారు. భూమిని మధ్యగ పెట్టుకొని ఉంటాయి. ఇవి క్రింద 7 లోకాలను, పాపాలననుభవించేవారు చేరే పాతాళాది లోకాలంటారు. పైవి పుణ్యాలనుభవించేవారికోసం ఏర్పడ్డవి క్రిందిలోకాలు 1) అతల, 2) వితల, 3) సుతల, 4) రసాతల, 5) మహాతల, 6) తలాతల, 7) పాతాళ లోకాలంటారు.

వీటికి పైలోకాలు 1) భూలోకం, 2) భువర్లోకం, 3) సువర్లోకం, 4)

మహాలోకం, 5) జనోలోకం, 6) తపోలోకం, 7) సత్యలోకం

ఆత్మకు, కర్మను బట్టే ఆలోకాలతో సంబంధం తప్ప మరోరకంగ ఏమీ లేదు. పుణ్యాపాపాలవల్ల ఆయా చోట్లకి చేరి కర్మననుభవించును.

సామాన్యప్రాకృత మానవుడు భూలోకంలో కొంత తప్ప వీటిలో వేటినీ సందర్శించ లేడు. మానవ శరీరం వదిలాకనే అక్కడక్కడికి కర్మ వల్ల వెళ్ళునంతే. విలక్షణ తపస్సంపన్నులకు ఆ నియమముండదు.

---

శ్రీ హనుమత్ సీతాలక్ష్మణ కోదండరామాలయ సమాజం, ఉండ్రపూడి

ప్ర. : రుక్మిణీకృష్ణ అన్నాగాని, సత్యభామాకృష్ణ అన్నాగాని ఉండని ప్రత్యేక భావం 'రాధా కృష్ణ' అన్నమాటలో ఉంటుంది ఏమి అందరిలో రాధ ప్రత్యేకత వివరించండి? అసలు ఆమె ఏవిధంగా శ్రీకృష్ణుని వరించింది?

జ. : 'రాధ' అనేపాత్ర శ్రీమద్భాగవతంలో లేదు. అయినా ఆ పదం నిస్వార్థంగ సేవించే భక్తుని చెప్పేది. భక్తుల్ని చూస్తే భగవంతునికి కూడా విపరీతమైన ప్రేమ. 'రాధాకృష్ణ' అనేది భక్తుని, భగవంతుని మధ్య ఉండే అనురాగాన్ని తెలిపే పదం కనుక అంత తీయగా ఉంటుంది.

---

శ్రీ ఆదిత్య, తెనాలి.

ప్ర. : ఏకాదశి ఉపవాసం ఉండి ద్వాదశిరోజు ఉసిరికాయ వచ్చడి, అవిసికూర వేసుకుతినాలి అంటారు. వాటి ప్రత్యేకత ఏమిటో తెలుప ప్రార్థన?

జ. : వాటికుండే శాస్త్రీయతతోపాటు ఉసిరి జీర్ణశక్తిని పెంచేది. అవిసికూర బుద్ధిని చురుకుగా చేసేది. అందుకే ద్వాదశినాడు పారణచేసేటపుడు ముందుగా వాటిని స్వీకరిస్తారు ఆహారంలో.

---

శ్రీ కోడూరు రవి, జూలపల్లి.

ప్ర. : స్వామివారి దివ్యదర్శనం మాకు అమృతం తాగినంత మధురానుభూతిని కలిగి స్తుంది. కనుక ప్రతినెల దయచేసి భక్తిని వేదనలో శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామివారి కలర్‌ఫోటో వేయప్రార్థన.

జ. : మీ విషయం పరిశీలించగలము.

---

శ్రీ జి. కృష్ణయ్య, హైదరాబాద్.

ప్ర.: 1. తిరుచూరులో ఆదిశంకరాచార్య సమాధిని వడక్కనాథ దేవాలయ ప్రాంగణంలో చూశాము. ఇక్కడ చక్రము, శంఖము, తిరునామాలు శిలా ప్రతిమతో ఉన్నాయి దీనిని బట్టి శంకరాచార్యులు శ్రీవైష్ణవులా?

జ. : శంకరాచార్యులు సిద్ధాంతం అద్వైతము. అయినా తత్త్వనిర్ణయం స్పష్టంగా 'నారాయణుడు' అనే చేసారు. కనుక వారి వరకూ శ్రీవైష్ణవులే. ఎందుకంటే, వారి గ్రంథాలలో పరతత్త్వంగా ఏ యితర దేవతనూ చెప్పలేదు. పైగా ఖండించారు గూడ, బ్రహ్మసూత్రాలు 2వ అధ్యాయంలో. అయితే వారి అనుయాయులు ఎంతవరకు ఈ విషయాన్ని గుర్తించారో తెలియదు కానీ, పూర్తి ఆదిశంకరులకు అభిప్రాయానికి వ్యతిరేకంగానే ప్రవర్తిస్తున్నారు మరి. అందుకే మీరు చూచిన చోట శంఖ చక్రాదులు ఉండటం సబబే.

---

ప్ర.: 2. చంద్రుడు అత్రి అనసూయల పుత్రుడని సప్తగిరి పత్రికలో చదివాము. లక్ష్మీ సోదరుడని అంటారుకదా! వివరించ ప్రార్థన.

జ. : క్షీరసాగర మథన సమయంలో సముద్రంలో నుండి చంద్రుడు లక్ష్మీదేవితోపాటు ఆవిర్భవించాడు కనుక లక్ష్మీ సోదరుడనే అంటారు. అత్రి సంతానంగ ఎక్కడ ఉందో మరి!...

---

# ఇతిహాసబోధ - IX-1

శ్రీకృష్ణుని అనుగ్రహంతో కురుక్షేత్ర సంగ్రామంలో విజయం సాధించిన ధర్మరాజు చక్రవర్తి అయ్యాడు. కృష్ణార్జును లిద్దరూ ఇంద్రప్రస్థ పురంలో ఉండి పరిసరప్రాంతాలలో విహరించసాగారు. ఓ రోజు శ్రీకృష్ణుడు 'అర్జునా! నేను ద్వారకను విడచి చాలా కాలమైంది. నా తండ్రి వసుదేవుడు, తల్లి దేవకీ, అన్న బల రాముడు, ఇతర యాదవ ప్రముఖులు, ప్రజలూ - అందరినీ దర్శించాలని కోరికగా ఉంది.

ధర్మరాజు అనుమతిస్తే ద్వారకకు బయలు దేరుతాను. నీవు తగిన విధంగా మహారాజుకు ఈ విషయాన్ని విన్నవించు. ఆ మహానుభావుడు అనుమతిస్తేనే కదా నేను ద్వారకకు వెళ్ళేది! నేను, నా బంధు మిత్రులు, సర్వమూ - ఆయన సొత్తు! ఆయన ఆజ్ఞానుసారం ప్రవర్తించడమే నావిధి! కాబట్టి హస్తినకు వెళ్ళి ఈ విషయాన్ని ఆయనకు తెలియజేయి. ఆయన ఏవిధంగా ఆదేశిస్తే అలాచేద్దాం'. అన్నాడు.

అర్జునుడు, 'మహాత్మా! నీ ఆజ్ఞ నాకు శిరోధార్యం. అలాగే హస్తినకు వెళదాం. అయితే ఒక చిన్న మనవి. ఆనాడు యుద్ధం ప్రారంభించబోయేం ముందు వికల మనస్కుడనైన నాకు చక్కని తత్త్వబోధ చేసి స్వస్థుడిని చేసావు. అది మరొక్కసారి వినిపించు. వాటిని సరిగ్గా ధారణ చేయలేక పోయాను.' అన్నాడు.

కృష్ణుడు నవ్వి, 'అర్జునా! ఇంత మంద బుద్ధివి, శ్రద్ధారహితుడివి అయ్యా వేమిటి? బ్రహ్మపదాన్ని పొందేందుకు ఉపకరించే గొప్ప విషయాలను నాడు నీకు బోధించాను. అవి మనస్సున నిలుపుకోలేక పోతే ఎట్లా? అవి మళ్ళీ చెప్పటం సాధ్యమౌ తుందా!' అని మందలిస్తూనే అవసరమైన ఆధ్యాత్మ విద్యను అర్జునునికి బోధించాడు.

తదుపరి ఇద్దరూ హస్తినకు వెళ్ళడం, ధర్మజుని అనుమతితో శ్రీకృష్ణుడు ద్వారకకు వెళ్ళడం జరిగింది.

పై సన్నివేశంలో భగవానుని 'గీతా బోధ'ను మరచి పోయానని అర్జునుడంతటి వాడు పలకటం మన కెంతో ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది. జూదంలో రాజ్యాన్ని, సిరి సంపదలను, తమ్ములను చివరకు భార్యను కూడా పోగొట్టుకున్న వ్యసనపరుడుగా మచ్చతెచ్చుకొన్న ధర్మరాజు పట్ల భగవానుడు చూపిన సేవానిరతి, విధేయత, గౌరవ ప్రపత్తులు మనకు మరింత ఆశ్చర్యాన్ని కల్గిస్తాయి.

బహుశా ధర్మరాజు యొక్క అనితర సాధ్యమైన ధార్మిక నిష్ఠయే భగవానుని అనుగ్రహం అతని పట్ల ఇంత విశేషంగా ప్రసరించడానికి ప్రధాన కారణం కావచ్చు. ధార్మిక జీవనం పట్ల ధర్మరాజు యొక్క మక్కువ, అంకిత భావం దేవతలకీ ఆశ్చర్యాన్ని కల్గించింది. అదెలాగో ఈ మాసపు 'ఇతిహాసబోధ'లో తెలుసు కోవడానికి ప్రయత్నం చేద్దాం.

మాయాజూదంలో ఓడి సర్వస్వాన్ని కౌరవుల పరం చేసాక నియమం ప్రకారం





తమ్ములతో అడవులకు వెళ్ళాడు ధర్మరాజు. అక్కడ పన్నెండేళ్ళు అరణ్యవాసం పూర్తికావచ్చింది.

ద్వైతవనంలో వారు విడిది చేసి ఉన్న సమయంలో ధర్మరాజు దగ్గరకు ఉరుకులు పరుగులతో ఓ బ్రాహ్మణుడు వచ్చాడు. 'చక్రవర్తీ! రక్ష! రక్ష! నా నిత్యాగ్ని హోత్రానికి ఉపకరించే అరణిని చెట్టుకొమ్మకు తగిలిస్తే, అది ఓ మృగము కొమ్ములకు తగుల్కొంది. దానిని తీసుకొని మృగము అడవిలోకి పారిపోయింది. మీరా మృగాన్ని నిరోధించి నా అరణిని తెచ్చి నన్ను రక్షించండి!' అంటూదీనంగా అభ్యర్థించాడు.

వెంటనే పాండవులా మృగాన్ని పట్టి అరణిని బ్రాహ్మణునికి అప్పగించడానికి ఆయుధాలతో బయలుదేరారు. కనిపించి నట్లే కనిపించి మాయమౌతున్నదా జింక! పాండవుల బాణాలు దాని నేమీ చేయలేకపోయాయి. దానిని తరుముకుంటూ వెళ్ళారు పాండవులు. వారి ప్రయత్నాన్ని విఫలం చేస్తూ మృగం కారడవులలోకి వెళ్ళి కనుమరుగయింది.

శ్రమ వృధాఅయినందుకు చింతిస్తూ పెద్ద మఱ్ఱి చెట్టు నీడకు చేరారు అన్నదమ్ములందరూ, 'అన్నా! ఏమిటి మనకీ దురవస్థ? చివరకు ఒక బ్రాహ్మణుడు కోరిన చిన్న కోరికను కూడా నెరవేర్చలేని వారమయ్యాము. ధర్మాన్ని వీడని వారమూ, కుల శీల పరాక్రమ సంపన్నులమూ, ఇతరులపట్ల ద్వేష బుద్ధి లేక దయతో వ్యవహరించే వారమూ అయిన మనకి ఈ కష్టపరిస్థితి ప్రాప్తించడానికి మూలకారణం ఏమై ఉంటుంది?' అని నకులుడు ధర్మరాజును ప్రశ్నించారు.

'నాయనా! మనకు కలిగే సుఖదుఃఖాలు పూర్వ జన్మకర్మఫలాలని పెద్దలవాక్కు. దానిని ధైర్యముతో మనం స్వీకరించ వల సిందే! అన్నాడు ధర్మరాజు.

అన్నమాటలనువిని, కించిత్ ఆగ్రహంతో భీమసేనుడు నకులునితో 'తమ్ముడా! ఆనాడు నిండు సభలోనికి ద్రౌపదిని పిలవటానికి ప్రాతికామిని పంపినప్పుడే దుర్మార్గులైన కౌరవులను నేను హతమార్చి ఉండవలసింది. అది చేయక పోవడమే మన ఈ కష్టాల కంతటికి మూల కారణం' అన్నాడు.

అర్జునుడు నకులునితో. 'తమ్ముడా! కర్ణుని పరిహాస వచనాలను పట్టించుకోక పిరికివాని వలె ఆనాడు నేను అడవులకు రావడమే మనకీ కష్టములకు కారణమయ్యా!' అన్నాడు బాధతో.

సహదేవుడు, "కుటిలుడైన శకుని మాయా జూదానికి ప్రతీకారంగా అప్పుడే అతనిని హతమార్చకపోవడమే మన కష్టము లకు మూలకారణమ"న్నాడు.

ఇలా అన్నదమ్ములు తమ అరణ్య వాసక్లేశాలను తలచుకొని పలువిధాలుగా వాపోతుంటే, ధర్మరాజు, 'నాయనా! నకులా! మన వారంతా దాహార్తులై ఉన్నారు. నీవీ చెట్టెక్కి దగ్గరలో నీరెక్కడన్నా లభిస్తుందేమో చూడు.' అన్నాడు. నకులుడట్లే చేసి, సమీపమున సరస్సున్నదని తెలిపాడు.

'అయితే నీవెళ్ళి నీరు త్రాగి, మాకూ తీసుకురా'! అని ఆజ్ఞాపించాడు ధర్మరాజు.

నకులుడు వేగంగా ఆ సరస్సు వద్దకు వెళ్ళాడు. అందులోకి వెళ్ళి గబగబా నీరుత్రాగబోతుండగా 'నరుడా! ఆగు! ఈ సరస్సునాది, నా ప్రశ్నలకు బదులిచ్చి నా

అనుమతితోనే నీవు త్రాగాలి! హెచ్చరిక'! - అన్న అశరీరవాణి పలుకులు వినిపించాయి. దిక్కులు పరికించి, ఎవరూ కనబడక పోయేసరికి ఆ పలుకులను నిరాదరించిన నకులుడు నీరుత్రాగి ఆ కొలను ఒడ్డున కూలిపోయాడు.

ఎంత సేపటికి నకులుడు రాకపోయే సరికి ధర్మరాజు సహదేవుని పంపాడు. సహదేవుడూ నకులుని బాటలోనే అశరీర వాణి వాక్కులను పెడచెవినపెట్టి నీరుత్రాగి పడిపోయాడు. ధర్మరాజు ఈసారి అర్జునుని పంపాడు.

చెరువును చేరిన అర్జునుడు తమ్ముల పరిస్థితిని చూసి ఆశ్చర్యపోయాడు. యథాప్రకారం అశరీరవాణి హెచ్చరిక చేసింది అర్జునుడిని. ఆగ్రహంతో అర్జునుడు మాట వినిపించినవైపు శబ్దభేది బాణాలను వదిలాడు. అయినా ప్రయోజనం లేక పోయింది. దప్పికకు తాళలేక నీరుత్రాగి, తానూ తమ్ముల వలె స్పృహకోల్పోయాడు అర్జునుడు.

ధర్మరాజు తమ్ములు రాకపోవడానికి ఆశ్చర్యపడి భీమసేనుని పంపాడు. భీముడు కూడా అశరీరవాణి వాక్కులను నిర్లక్ష్యం చేసి నీరు త్రాగి నేలకూలాడు. ధర్మరాజు కాసేపు తమ్ములకోసం ఎదురుచూసి, తానే వారిని వెతుక బయలుదేరాడు. సరస్సు చేరి అక్కడ పడిఉన్న తమ్ములను చూచి చింతాక్రాంతు డయ్యాడు ధర్మరాజు.

'మహావీరులైన నా సోదరులకీ పరిస్థితి కల్పించినవారెవ్వరు? వీరుతప్ప మరెవ్వరూ ఇక్కడికి వచ్చిపోయిన జాడలు కన్పించటం లేదు. ఘర్షణ గుర్తులు లేవు. వీరి శరీరాల పైగాయాలు లేవు. ఇది కుత్సితులైన దుర్యోధన, శకుని పన్నిన కుట్ర కాదుకదా? వీరి దేహకాంతి వీడని కారణముగా ఈ నీరు విషప్రాయమని పించటంలేదు. ఇది ఏమి మాయో గ్రహించ లేకపోతున్నాను.

ఆహా! దైవమా! నిన్నేమనాలి? రాజ్యాన్ని, సమస్త సంపదలను శత్రువుల పాలుచేసి, వీరులైన నా సోదరులను ఇలా అడవుల పాలుచేసి అనాథలవలె నేలకూల్చావే? నేనే మికావాలి? నా తల్లికి, పెద్దలకు ఏమని సమాధానము చెప్పాలి?" అని పలువిధాలా వాపోయి, దాహార్తితో తానుకూడా నీరు త్రాగటానికి కొలనులోనికి దిగాడు.

యథాప్రకారం అశరీరవాణి, 'ఓ రాజా! హెచ్చరిక! నేనొక కొంగను! ఈ కొలనుకు అధిపతిని! నా మాటలను నిరాదరించి, నా అనుమతి లేకనే నీ తమ్ములు నీరుత్రాగి నేలకూలారు. గమనించితివికదా వారి గతిని! దుస్సాహసానికి సిద్ధపడక తెలివిగా నీవైనా మసలుకో!

'నేనడిగిన ప్రశ్నలకు బదులిచ్చి ఆ తర్వాతే నీరు త్రాగు',అని పలికింది.

ఆశ్చర్యపోయాడు ధర్మరాజు! నలు దిక్కులా పరికిస్తూ 'ఓ మహానుభావా! నీవు రుద్రుడవో, అగ్నివో, వాయుదేవుడవో, తప్ప సామాన్యమైన కొంగవుమాత్రం కావు. గంధర్వ గరుడ యక్ష కిన్నెర కింపురుషాది దేవగణానికి అజేయులైన నా తమ్ములను నేలకూల్చిన నీవు అగోచరముగానుండట మెందుకు? కంటికి కనిపించి నీ తలంపును వెల్లడించు' అనిప్రార్థించాడు

'రాజా! నీ ప్రార్థనకు సంతోషించాను! నిజమే! నేను కొంగనుకాను యక్షుడను! చూడు నన్ను!' అంటూ మహాకాయంతో, వికృతరూపుడై తాటిచెట్టంత పొడవుతో,

17/DTP/Desktop/DTPworks/bn/Magazine/bnapr02.p65



తీవ్రతేజుడై, కోరలతో వెలుగొందు వదనముతో భయంకరరూపంతో ప్రత్యక్షమ య్యాడు యక్షుడు.

'మహారాజా! బుద్ధిమంతుడవు కనుకనే నీ తమ్ములవలె సాహసము చేయకుంటివి! నా అనుమతి లేకుండా ఈ నీరు త్రాగిన వారికి మరణం తథ్యం! నేనడుగు ప్రశ్నలకు సమాధానాలిచ్చి నీరుత్రాగు!' అన్నాడు యక్షుడు.

నమ్మతించాడు ధర్మరాజు. యక్ష ప్రశ్నలకు ధర్మరాజు సమాధానాలిచ్చాడు. సంతోషించిన యక్షుడు 'ధర్మరాజా! నీ సమాధానాలు నన్ను తృప్తిపరిచాయి! నీ తమ్ములలో ఒక్కని కోరుకో! బ్రతికిస్తాను' అన్నాడు. ధర్మరాజు 'నకులుడిని బ్రతికించ' మన్నాడు.

ఈసారి ఆశ్చర్యపోవడం యక్షుడి వంతయింది. 'ధర్మరాజా! నీకేమన్నా మతిపోయిందా! మహాబలవంతులైన భీమార్జునులలో ఎవరో ఒకరిని కోరుకోవడం మాని నకులుడిని కోరుకున్నావేమటి? అని ప్రశ్నించాడు యక్షుడు. 'మహాశయా! నా తండ్రికి ఇద్దరు భార్యలు, పెద్దదైన కుంతీదేవి కొడుకులలో నేను బ్రతికి ఉన్నాను. రెండవభార్యఅయిన మాద్రి పుత్రులలో ఒక్కడైనా బ్రతికి ఉండటం ధర్మం. ఎట్టి పరిస్థితులలోనూ ధర్మాన్ని అతిక్రమించడీ ధర్మరాజు. అందుకే నకులుడిని కోరుకున్నా'నన్నాడు ధర్మరాజు.

'శహభాష్! ధర్మరాజా! నీ ధర్మజ్ఞతకు మెచ్చాను' అంటూ యక్షుడు ధర్మరాజు యొక్క నలుగురు సోదరులను బ్రతికించాడు.

'మహానుభావా! నీవు యక్షుడవుకావు. మమ్ము పరీక్షింపగవచ్చిన ఇంద్రుడవో, కుబేరుడవో, అగ్నివో, వాయువో, లేకున్నా నా తండ్రియగు యమధర్మరాజువో అయి ఉంటావు. దయచేసి నిజము తెల్పుమ'ని ప్రార్థించాడు ధర్మరాజు.

దానికా యక్షుడు నవ్వి 'నేను నీవు భావించినట్లుగా ధర్మదేవతను. సత్య, దాన, శౌచ, దమ, శమ, దాంతి, యశ, జ్ఞానములు నా అంశలు. నన్ను శరణు వేడినవానికి లేదు దుర్గతి. నీ ఉత్తమ ధార్మికతను చూచి ఎంతో సంతోషించాను, కోరుకో నీకేం వరంకావాలో ఇస్తాను' అన్నాడు.

ధర్మరాజు భక్తిశ్రద్ధలతో ధర్మదేవతకు నమస్కరించి, 'దేవా! బ్రాహ్మణుని అరణిని తీసుకొని హరిణము మాయమయింది. అతని వేదోక్తకర్మల కాటంకము కలుగకుండా ఆ అరణిని అనుగ్రహించు'మని కోరుకున్నాడు.

'ధర్మరాజా! నిన్ను పరీక్షించగోరి అరణిని అపహరించినది నేనే. ఇదుగో, దానిని స్వీకరించు, మరొక్కమాట, మీ అరణ్యవాసము పరిసమాప్తము కానున్నది. మీరు గడుపబోయే అజ్ఞాతవాసములో మిమ్మల్ని ఎవ్వరూ గుర్తించనట్లుగా, మీరే రూపము కోరుకొంటే ఆ రూపము వచ్చేటట్లుగా వరాన్ని అనుగ్రహిస్తున్నాను.

'ఇది కాక ఇంకేమన్నా వరమడుగు ఇస్తాను'! అన్నాడు ప్రీతితో యమధర్మరాజు.

'మహాత్మా! మీ అపార ఆదరా భిమానాలకు ధన్యుడనైనాను. నాకింకేమి కావాలి? క్రోధమోహాదులకు తావు లేకుండా ఎల్లప్పుడూ నా మనస్సు ధర్మమునందే ప్రవర్తించునట్లు అనుగ్రహించు'మని కోరాడు

ధర్మరాజు! 'అట్లే!' అని వరమిచ్చి మాయమయ్యాడు యముడు. ఆ తర్వాత పాండవులు అరణిని తీసుకొని బ్రాహ్మణుని కప్పగించి అతని ఆశీర్వాదము పొందారు.

ఇంతటి ధార్మిక నిష్ఠ కలిగినవాడు కావడంచేతనే అంతటి భగవానుడు కూడా ధర్మరాజు యొక్క ఆజ్ఞానువర్తినని ప్రకటించుకొన్నాడు.

ఆధ్యాత్మిక పునాదుల ఆధారంగా ధార్మిక జీవనాన్ని సమాజంలో విస్తరింపచేయడమనే ఆశయాన్ని అమలు పరిచేక్రమంలో వికాసతరంగిణి కార్యకర్తలకు ధర్మరాజుయొక్క నడవడి చక్కని స్ఫూర్తి నిస్తుందని భావిస్తున్నాము.

జీవితంలో ఎదురయ్యే ఒత్తిడులను తట్టుకొని ధార్మికంగా ఎలా జీవనం కొనసాగించాలో ధర్మరాజు పై సంఘటన ద్వారా మనకు తెలియపరిచాడు.

ఒత్తిడుల రూపంలో కాకుండా మరొక రకంగా కూడా ధార్మిక జీవనంలో పరీక్షలనెదుర్కోవలసి ఉంటుందని దేవతలు ధర్మరాజుకు పెట్టిన మరో పరీక్ష నిరూపించింది.

ధర్మరాజు ఎదుర్కొన్న రెండవ రకం పరీక్ష ఏమిటో పర్యవసాన మేమిటో వచ్చే ఇతిహాసబోధ-IX-2లో తెలుసుకొందాం.

**గమనిక**: యధాప్రకారం **'ఇతిహాసబోధ-IX-1'** పై తగిన పేరును చూచిస్తూ 'స్పందన' శీర్షికకు సకాలంలో ఉత్తరాలు వ్రాస్తారు కదూ! దానితోపాటు ధర్మరాజు దేవతల ద్వారా ఎదుర్కొన్న రెండవ పరీక్ష ఏమిటోకూడా తెలియజేయడానికి ప్రయత్నించి శ్రీవారి మంగళాశాసనాలను పొందుతారని ఆశిస్తున్నాము.

**- వికాసతరంగిణి**

## ఇతిహాసబోధ - VIII శీర్షికకు పేర్లు

జగన్నాటకంలో పరంధాముడూ ఒక పాత్రధారి - ఎమ్. చంద్రమౌళి,నాగర్ కర్నూల్, వినయం వివేకవంతుని లక్షణం - ఇ. లక్ష్మీనరసింహరావు, అహం పతనానికి ముఖద్వారం సహనం విజయానికి మూలం - ఎమ్. కళ్యాణ్ బ్రదర్స్, వుయ్యూరు, వినయవిధేయతలే - విజయానికి సోపానం - మంగనూరి జయప్రకాష్, హనుమకొండ, మహర్షుల పట్ల సదా విధేయత గృహస్థుల కర్తవ్యం - ఆర్.వి. సురేంద్ర కుమార్, పంచమవేదములో ధర్మ సూక్ష్మాలు - ఆర్.అనసూయ, అనంతపురము, మహర్షుల మాటలు - మంచిముత్యాల మూటలు - వి. కనకయ్య,పోత్కపల్లి, విచక్షణారహిత విజ్ఞానం--- వినాశానికి మూలకారణం - ఎస్. వెంకటహనుమంతరావు, కందుకూరు, ఋషి సంస్కృతి సర్వదా లోక హితం - కె. లలిత కుమారి బొబ్బిలి, దుర్వాస గర్వభంగం - ఉదంకునికి విశ్వరూప దర్శనం - కె. వెంకటాచార్యులు, నిట్టూరు, అహంకారం, అవిధేయత పతనానికి నాంది - యమ్. కమల, భిలాయి,

- ఎన్.వి. పాండురంగయ్య-విజయనగరం, - పి.వైదేహి-విజయవాడ, - డి.సుజాత-హైదరాబాద్, - కె. అప్పలరాజు, బొబ్బిలి, - జి. శ్రీనివాస్, కోదాడ. ఇంకా అనేక మంది ఇతిహాసబోధకు తమ పేర్లను సూచించారు. వీరందరికీ శ్రీస్వామివారి మంగళాశాసనములు అందజేస్తున్నాము

- వికాసతరంగిణి





శ్రీమతే రామానుజాయనమః

**నవమ నవాహ్నిక శ్రీరామాయణ మహాక్రతువు**

మరియు

**దశమ నవాహ్నిక శ్రీరామాయణ మహాక్రతువు**

## శుభ ఆహ్వాన పత్రిక

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరు స్వామివారి మంగళాశాసనములతో**
మరియు **ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి వారి దివ్యానుగ్రహముతో**
**అష్టోత్తర శత నవాహ్నిక శ్రీరామాయణ మహాక్రతువు నిర్వాహకులు**
**సాహిత్య శిరోమణి శ్రీమాన్ వడగర్రై రామకృష్ణ అయ్యంగార్ ఆధ్వర్యవములో**

**నవమ నవాహ్నిక శ్రీరామాయణ మహాక్రతువు**
**తేది 2-4-2002 నుండి 10-4-2002 వరకు నిర్వహింపబడును.**
**స్థలము :** శ్రీ సీతారామస్వామి దేవాలయము (కనకమహాలక్ష్మి ఆలయ సమీపము) విశాఖపట్నం.

**దశమ నవాహ్నిక శ్రీరామాయణ మహాక్రతువు**
**తేది 6-5-2002 నుండి 14-5-2002 వరకు నిర్వహింపబడును.**
స్థలము : శ్రీ సీతారామస్వామి దేవాలయము, సింహాచలంకొండ

# స్పందన

శ్రీకృష్ణభగవానుడు గృహస్థులు తమ కర్తవ్యంగా తపఃసంపన్నులు, మహర్షుల పట్ల విధేయతతో మెలగవలెనంటారు. దీనిద్వారా కలియుగ మానవులు నేర్చుకోవలసినది మహానుభావుల బోధలను ఆచరించడం, వారి పాదధూళి స్వీకరించడం, తద్వారా జన్మసఫలమౌతుంది.

**- మిడిదొడ్డి చంద్రమౌళి, నాగర్‌కర్నూల్**

సాక్షాత్తు శ్రీమన్నారాయుడే శ్రీకృష్ణా వతారుడై, సౌశీల్యంతో, ఎంతో సహనంతో ముని వరేణ్యునకు సేవలు చేసి అతని తప్పును అతనే తెలుసుకొనేలా చేసిన,ఆయన వినయ సౌశీల్య సద్గుణాలు మనకూ ఆదర్శాలు కావాలి. **- ఇరుకుళ్ళ లక్ష్మీ నరసింహారావు,**

భగవానుడు అవకాశం ఉన్నంతమేరకు మన ఉన్నతికి తగు అవకాశాలు కల్పిస్తాడు. వాటిని సద్వినియోగపరచుకోవటం మన కనీస బాధ్యత. దానిని విస్మరిస్తే నాశనం తప్పదని మనం తెలుసుకోవాలి.

**- శ్రీ వల్లీ అండాళ్, విజయవాడ.**

ఎంతటి మహర్షులయినా మాయకు లోబడ వలసిందే. దాని ఫలితంగానే ఉదంకునికి ఆగ్రహం వచ్చింది. కాని భగవత్కృప వలన ఉపశమనం కలిగింది. అనుగ్రహం వలన విశ్వరూపదర్శన భాగ్యం కలిగింది. దుర్వాస మహర్షికి సేవ చేసి మనసును గెలిచి మంచిగా మార్చాడు. ఉదంకుడిని ఆదేశం ద్వారా మంచిగా మార్చాడు శ్రీకృష్ణుడు. అంటే దుష్టశిక్షణ, శిష్టరక్షణ అన్నిటికీ ఆయనే మూలం.

**- మంటపాక కళ్యాణ్ & బ్రదర్స్, వుయ్యూరు.**

భక్తులకు చక్కని భక్తితో కూడిన, ఆలోచించ తగినవిషయము "ఇతిహాసబోధ". పురాణాల నుంచి మనం నేర్చుకోవలసినది ఎంతైనా ఉంది. ఆ అవకాశం ఇతిహాసబోధ మనకు కల్పిస్తుంది. ప్రతీ ఇంటిలోనూ **గీతాజ్యోతి** అనబడే జ్ఞానజ్యోతులను వెలిగించాలను కున్న శ్రీ స్వామివారి స్పందనతో స్పందించిన

**- ఓ స్పందన**

మునిపుంగవులు యెడల గౌరవం, సేవాతత్పరత ఉన్నవాళ్ళు సుఖాలు పొంది లోకారాధ్యులౌతారు. నిర్లక్ష్యం చేసినవారు నశిస్తారు. **- కె. అప్పలరాజు, బొబ్బిలి.**

సత్యనారాయణమూర్తి - చాట్రాయి, జక్కా పేరయ్య - భద్రిరాజుపాలెం,
కె. రామశేషమ్మ - నాగర్జునసాగర్‌హిల్‌కాలనీ, వె. కనకయ్య - పోత్కపల్లి,
ఆర్. అనసూయ - అనంతపురము,
కె.వి. సురేంద్ర కుమార్ - ఎ.ముప్పల,
యమ్. విశ్వనాథం - హన్మకొండ,
ఉ.గోపాలాచార్యులు - కందుకూరు,
ఎన్. లక్ష్మి - కరింనగర్,
యమ్. సూర్యనారాయణ, మెళియపుట్ట, కొండపాక వెంకటాచార్యులు, నిట్టూరు.

**వీరేకాక ఇంకా తమ స్పందనను పంపించిన వారందరికీ కూడా శ్రీస్వామివారి మంగళాశాసనములు అందజేస్తున్నాము.**








# వికాసదర్శిని నివేదన

**ఏలూరు** : ఫిబ్రవరి -23న శ్రీస్వామివారు విరాట్ పారాయణ కార్యక్రమం అనంతరం రాజమహేంద్రి నుండి బయల్దేరి ఏలూరు డా॥ పార్థసారథిగారి గృహానికి వేంచేసారు. వీరు తమ ఇంటి పైభాగాన్ని నూతనంగా నిర్మింప జేసి శ్రీస్వామివారితో ప్రారంభించా లనే సంకల్పం శ్రీవారి రాకతో నెరవేరింది. శ్రీమాన్ పార్ధసారథిగారు, శ్రీమాన్ కృష్ణారెడ్డిగారు, శ్రీమాన్ అశోక్ ప్రభృతులు పశ్చిమ గోదావరి జిల్లా గీతాజ్యోతి కార్యక్రమంలో తమవంతు సేవలు అందిస్తామని శ్రీ స్వామివారికి సవినయంగా నివేదించారు.

ఫిబ్రవరి -24న ఉ॥ తీర్థగోష్ఠి నిర్వహించిన తర్వాత శ్రీస్వామివారు పార్థసారథిగారి గృహానికి సమీపంలో ఉండే వేంకటేశ్వర స్వామి కోవెలను సందర్శించి మంగళా శాసనం చేసి హైదరాబాద్ బయల్దేరారు.

**కల్లూరులో :** మార్గమధ్యంలో మ॥ 3.00 గంటలకు కల్లూరు కాకతీయ షుగర్స్‌లో క్రొత్తగా నిర్మించిన పవర్ ప్రాజెక్ట్‌ను ప్రారంభించి శ్రీమాన్ వీరయ్యగారికి, శ్రీమాన్ వెంకటేశ్వర్లు గారికి మంగళాశాసనములు కృపచేసి సాయంకాలానికి హైదరాబాద్-జెట్‌కు చేరుకున్నారు.

**హైదరాబాద్‌లో :** రాత్రి 7.00 గంటలకు జంట నగరముల వికాస తరంగిణి కార్యకర్తల సమావేశం శ్రీస్వామివారు నిర్వహించారు. గీతాజ్యోతి కార్యక్రమానికి సంబంధించి జంట నగరాల్లోని కార్యకర్తలకు తగు సూచన లందించారు. ఈ సందర్భంగా **V.T.**-కేంద్ర కమిటి ప్రెసిడెంట్ శ్రీమాన్ **D.V.L.N.** మూర్తిగారు, జంటనగరాల **V.T.**-ప్రెసిడెంట్ శ్రీమాన్ కల్కి అవతారం గారు మాట్లాడారు. ఇంతవరకు తాము నిర్వహించిన సేవా కార్యక్రమాల గూర్చి స్వామివారికి నివేదించారు. రాత్రికి జెట్ నుండి బోయిన్ పల్లి చేరుకొని శ్రీమాన్ రాజిరెడ్డిగారి గృహంలో బస చేసారు.

ఫిబ్రవరి -25వ, తేదీన బోయిన్‌పల్లిలోని న్యూసిటీ కాలనీలో తక్కువ స్థలమైనా అందంగా నిర్మించిన శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయ ప్రతిష్ఠా కార్యక్రమాన్ని అత్యంత వైభవంగా నిర్వహించి అనుగ్రహ భాషణం చేసి మంగళా శాసనములు కృపచేసారు. అనంతరం సికింద్రాబాద్ వేంచేసారు. సుమారు 75 సం॥ చరిత్ర కలిగిన రంగనాథ స్వామి ఆలయం సమస్యల వలయంలో చిక్కి ఆరాధనకు నోచుకోక శిథిలావస్థలో ఉన్నదానిని పునరుద్ధరణకొరకు వానమామలై మఠానికి సమర్పించారు. మన చిన్నజీయర్ స్వామివారి సలహా తీసుకొని శ్రీమాన్ రామాచార్యులుగారు, ప్రాంతీయ భక్తుల సహకారంతో కోవెలను అందంగా విశాలంగా నిర్మించారు. పునః ప్రతిష్ఠామహోత్సవం నిన్నటిరోజున కలియన్ వానమామలై జీయర్ స్వామివారు, శ్రీ ఉ.వే. శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారి నేతృత్వంలో నిర్వహించారు. అక్కడి భక్తుల ప్రార్థనపై మన జీయర్ స్వామివారు మ॥ 12.00 గంటలకు

వేంచేసి ఆలయ కళ్యాణ మండపాన్ని ప్రారంభోత్సవం చేసారు. జెట్‌లో మ॥2.00 గంటలకు వికాస తరంగిణి వాలంటీర్స్ శిక్షణ నిమిత్తం శ్రీమాన్ జ్వాలా నర్సింహంగారితో చర్చించారు. సాయం కాలం మేడ్చల్‌లో హరితవనాన్ని ఏర్పాటు చేసి అందులో ఒక చక్కని ఫామ్ హౌస్ (**Form House**) ను ఏర్పాటుచేసిన శ్రీమాన్ కృష్ణంరాజు గారు చేసిన పాదపూజను స్వీకరించారు. వాణిజ్య రంగం తోపాటు వ్యవసాయ రంగంలో కూడా కృష్ణంరాజుగారి కుండే అభిమానాన్ని శ్రద్ధని కొనియాడి వారితో కలిసి వివిధ రకాల వృక్ష సముదాయాన్ని సందర్శించి రాత్రికి సుమారు 10.30కి ఆదిలాబాద్ జిల్లా ''నిర్మల్''కు చేరుకొని శ్రీమాన్ నర్సిరెడ్డి గారింట్లో బసచేసారు.

**నిర్మల్ :** శ్రీస్వామివారు 26వ, తేదీన ఉ॥ నిర్మల్ పట్టణంలోని సరస్వతి శిశుమందిర్ నూతన భవనంను ప్రారంభించారు. స్థానిక పార్లమెంట్ సభ్యులు శ్రీమాన్ వేణుగోపాలా చారిగారు, **M.L.A.** శ్రీమాన్ ఇంద్రకరణ్ రెడ్డిగారు, జిల్లా కలెక్టర్ శ్రీమాన్ రామకృష్ణారావుగారు, సరస్వతీ విద్యాపీఠం సంస్థాపకులు శ్రీమాన్ శఠకోప నర్సింహా చార్యులుగారు కూడా విచ్చేసి శ్రీ స్వామివారి మంగళాశాసనములు స్వీకరించారు. విద్యార్థులు అనేక సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించిన వెంటనే శ్రీవారు అందరికీ మంగళాశాసనములు కృపచేస్తూ అనుగ్రహ భాషణం చేసారు. అనంతరం నిర్మల్‌లోని ఇందిరానగర్‌లో **June 6** నుండి తీవ్ర అనారోగ్యంతో కదలలేని స్థితిలో ఉన్న వికాస తరంగిణికార్యకర్త శ్రీమాన్ సుదర్శన్ రెడ్డిగారిని పరామర్శించారు. తర్వాత అదే కాలనీలోని ఆంజనేయస్వామివారి కోవెలను సందర్శించి మంగళాశాసనం చేసారు. ఆ వెంటనే శ్రీరామనామ జప యజ్ఞంలో పాల్గొన్న భక్త గోష్ఠిని అనుగ్రహించారు. ఇదే జిల్లాలోని భైంసా పట్టణానికి బయల్దేరారు.

**భైంసా :** నిర్మల్ నుండి సాయంకాలానికి శ్రీ స్వామి వారు భైంసా పట్టణానికి విచ్చేసి ముందు రామనామ జపయజ్ఞ దీక్షాపరుల నుద్దేశించి అనుగ్రహభాషణం చేసారు. అనంతరం సరస్వతి శిశుమందిర్ భవన నిర్మాణమునకు శంకుస్థాపన కావించారు. నిర్మల్ కార్యక్రమ ములో పాల్గొన్న ముఖ్య అతిథులతోపాటు స్థానిక **M.L.A** శ్రీమాన్ గడ్డెన్నగారు, కాకతీయ యూనివర్సిటి **V.C.** కె. రామకృష్ణారావుగారు కూడా పాల్గొని స్వామివారిని సేవించారు. చిన్నారుల సాంస్కృతిక కార్యక్రమములు వీక్షించి అందరికీ మంగళాశాసనములు కృపచేసి సమీపంలోని దిలావర్ పూర్ గ్రామమునకు బయల్దేరారు.

**దిలావర్ పూర్ :** ఇది ఆదిలాబాద్ జిల్లాలోని ఒక మారుమూల గ్రామం, గిరిజన ప్రాంతం. ఎక్కువశాతం నిరక్షరాస్యులే అయినా నీతి, నిజాయితీ, భక్తి, శ్రద్ధలు కలిగి ఉండి సమాజానికి ఆదర్శంగా నిలచినటువంటి వారు ఈ గ్రామస్థులు. చాలాకాలం నుండి

పూజలు చేస్తున్న మహిళల్లో ఒక భాగం.

20/DTP/Desktop/DTPworks/bn/Magazine/bnapr02.p65



పూజలు చేస్తున్న పురుషులలో ఒక భాగం.

శ్రీవారి మంగళాశాసనాన్ని పొందుతున్న హాజీసోదరులు

అక్కడివారితో గల పరిచయాన్ని పురస్క రించు కొని ఒక హనుమదాలయాన్ని నిర్మింపజేసిన, జగిత్యాల శ్రీమాన్ నంబి వేణుగోపాలాచార్యులు, శ్రీవారిని ప్రతిష్ఠ నిమిత్తం ఆహ్వానించారు. శ్రీస్వామివారు 26వ, తేదీ సాయంకాలం 7.00 గంటలకు చేరినా వేలమంది భక్తులు పొంగిపొర్లిన ఉత్సాహంతో పలికిన స్వాగతం స్వామివారిని పరవశింప చేసింది.

27వ, తేది ఉదయం శ్రీవారు నిర్వహించిన లక్ష్మీనారాయణ పూజలో 3000 మంది పురుషులు, 3000 మంది మహిళలు పాల్గొనడం నిజంగా ఒక అపురూప సన్నివేశం. అంతేకాదు, పూజలో కూర్చు న్నప్పుడు చొక్కాలు తీసేసి, తిలకం ధరించాలి అని స్వామివారు అనగానే అందరు భక్తులు పాటించడం, ఆ ప్రజల యొక్క అంకిత భావాన్ని సూచిస్తోంది. వీరితో పాటు సుమారు 25000 మంది వివిధ గ్రామాల భక్తులు ఈ కార్యక్రమమును తిలకించి పులకించారు.

సాయంకాలం శ్రీస్వామివారు కోలాట బృందాలతో ఆ ప్రాంతానికే ప్రత్యేకమైన ''జడ కుచ్చు కోలాటం''లో కొంత సేపు పాల్గొని, వేదికపై సయ్యద్ హుసేన్ & పార్టీ నిర్వహించిన ''మ్యాజిక్ షో'' ను వీక్షించి వారందరికి మంగళాశాసనపూర్వక బహుమానాన్ని కూడా కృపచేసారు.

శ్రీస్వామివారు 28వ, తేదీన ఉ॥ 8.00 గంటలకు అమెరికావారితో **Tele Conference** అనంతరం దిలావర్‌పూర్‌లో గ్రామ నడి బొడ్డులో అందంగా నిర్మించిన ఆలయంలో శ్రీవీరాంజనేయ స్వామివారి ప్రతిష్ఠా మహోత్స వాన్ని నిర్వహించారు. దీనికి ముందు భక్త శిఖామణి ఏకనాథస్వామివారి ప్రతిష్ఠ కూడా చేసారు. ఈ కార్యక్రమములో శ్రీమాన్ దేవన్నగారు, శ్రీమాన్ రవీందర్ రెడ్డిగారు, శ్రీమాన్ **M.** రమణ మొ॥వారు విశిష్ట సేవలందించారు. అందరికీ శ్రీ స్వామివారు మంగళాశాసనములను గ్రహించి నిజామా బాద్‌కు బయల్దేరారు.

**నిజామాబాద్ :** 28న, మధ్యాహ్నం 3.00 గంటలకు నిజామాబాద్ చేరుకొని, **V.T.** సేవాకార్యక్ర మాల్లో భాగస్వాములుగా ఉంటుండే **S.M.A.G.** విద్యానికేతన్ నిర్వాహకుల ఆహ్వానాన్ని పురస్కరించుకొని పాఠశాలను సందర్శించి చిరంజీవులకు మంగళాశాసన పూర్వక అనుగ్రహభాషణం కృపచేసారు.

సా॥ 5.00 గంటలకు ఖిలా. రఘునాథ స్వామి ఆలయానికి చేరు కున్నారు. దీని పూర్వ వైభవం విశిష్టమైనది. ఛత్రపతి శివాజీ,

సమర్థరామదాసు గారు తమ ధ్యానం కోసం రామాలయం నిర్మించు కొని, నిత్య ఆరాధన నిర్వహింపచేసేవారు అని చరిత్ర. అయితే స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఆలయాన్ని మూసేసి జైలుగామార్చారు. ప్రతి శ్రీరామ నవమి రోజున మాత్రం మహారాష్ట్ర, మధ్య ప్రదేశ్ లాంటి దూరప్రాంతాలనుండి వేల సంఖ్యలో భక్తులు సేవించుకోవడానికి వస్తారట. స్థానికుల కృషి ఫలితంగా అధికారులు అనుగ్రహించి జైల్‌ను మరో చోటికి తరలించి ఖిలానంతనూ రామాలయ అవసరాలకే ఉపయోగించాలని తీర్మానించ డం చాలా సంతోషదాయకమైన విషయం. రెండేళ్ళక్రితం శ్రీరామనవమి సందర్భంగా శ్రీ చిన్న జీయర్ స్వామివారు ఆలయాన్ని సందర్శించి జరుగవలసిన కార్యక్రమాలను నిర్ణయం చేసారు. ఆలయ కమిటీ సభ్యులు ఆ నిర్ణయాన్ని పాటిస్తూ ఆళ్వారాచార్య ప్రతిష్ఠ, ధ్వజస్తంభ ప్రతిష్ఠ మొ॥ కార్యక్రమాలకు విస్తృతమైన ఏర్పాట్లు చేసారు.

మార్చి 1వ, తేదీన ఉదయం శ్రీస్వామివారి కరకమలములమీదుగా శ్రీ రఘునాథస్వామి, ఆళ్వారాచార్య, ధ్వజస్తంభ ప్రతిష్ఠా మహోత్సవం అత్యంత వైభవంగా జరిగింది. ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన సభలో ఆలయ నిర్వాహకులు మాట్లాడుతూ "ఆలయ అభివృద్ధి ఆరంభమైనప్పటినుండి నగర ఆర్థిక పరిస్థితి కూడా ఆలయంతోపాటే పెరుగుతోంది" అన్నారు. "ప్రాంత అభివృద్ధి ఆలయ అభివృద్ధిపైనే ఆధారపడి ఉంటుంది అనడానికిది ప్రత్యక్ష నిదర్శనం'', అని శ్రీస్వామివారు అనుగ్రహభాషణం చేసి మంగళాశాసనాలు కృపచేసారు. ఈ కార్యక్ర మంలో స్థానిక **M.P.** శ్రీమాన్ గంగారెడ్డిగారు, నగర మున్సిపల్ ఛైర్మన్ ముక్తా దేవేందర్ గారు, జైలు అధికారి శ్రీమాన్ నర్సింహారెడ్డి గారు శ్రీస్వామివారిని సేవించి మంగళా శాసనము లందుకున్నారు.

మధ్యాహ్నంవికాసతరంగిణి నిజామాబాద్ శాఖ శ్రీమాన్ డా॥ లక్ష్మారెడ్డిగారు, శ్రీమాన్ శ్రీనివాస్‌గార్ల నేతృత్వంలో నిర్వహించు పట్టణ ఆరోగ్య కేంద్రమును సందర్శించి, సేవచేసే వైద్య బృందమును మరియు ఇతర సిబ్బందిని మంగళాశాసనం చేసి స్థానిక **M.L.A.** శ్రీమాన్ డి. శ్రీనివాస్‌గారి అభ్యర్థన మేరకు శాంకరి **Junior College** ను సందర్శించి విద్యార్థులకు, అధ్యాపకులకు స్ఫూర్తిదాయకమైన అనుగ్రహభాషణం చేసారు.

**మైలారం** : సాయంకాలానికి ఇదే జిల్లాలోని మారుమూల గ్రామమైన మైలారమునకు విచ్చేసారు. శ్రీమాన్ రాజ్ బహద్దూర్ గారు తమ గృహమును స్వామివారి నిలయంగా ఏర్పాటు చేసి తరించారు.

మార్చి 2వ, తేది ఉదయం తీర్థగోష్ఠి అనంతరం భక్తులకు గీతాజ్యోతి కార్యక్రమ తీరుతెన్నులను వివరించారు. అనంతరం కళ్యాణ వేంకటేశ్వర స్వామివారి ప్రతిష్ఠా కార్యక్రమము శ్రీవారి కరకమలముల మీదుగా జరిగింది. శ్రీమాన్ భూమన్నగారు తమ ఆస్తినంతా ఈ ఆలయ నిర్మాణంలో ఖర్చుచేసి ''భూమా'' శబ్దవాచ్యుడైన పరమాత్మ అనుగ్రహాన్ని పొంది, శ్రీ స్వామి వారి దివ్యమంగళాశాసనములు పొందారు. శ్రీ పండిరిగారు మొ॥ ప్రభృతులు కూడా ఇందులో తమ వంతు సేవలందించి తరించారు. స్థానిక **M.L.A.** శ్రీమాన్ గోవర్ధన్ గారు పాల్గొని స్వామివారిని సేవించారు.

**21**/DTP/Desktop/
DTPworks/bn/
Magazine/bnapr02.p65



సామూహిక లక్ష్మీనారాయణ పూజ చేయించిన అనంతరం స్వామివారు కరీంనగర్ జిల్లాలోని గుండి గోపాల్ రావుపేటకు బయల్దేరారు.

**గుండి గోపాల్‌రావు పేట** : 2వతేది రాత్రి శ్రీమాన్ హన్మంతరెడ్డిగారి గృహములో బసచేసారు. ఇదే రాత్రి కరీంనగర్ వికాస తరంగిణి కార్యకర్తలతో సమావేశమై గీతాజ్యోతి కార్యక్రమానికి సంబంధించిన సూచనలిచ్చారు.

3వ, తేదీన ఉదయం శ్రీస్వామివారు శ్రీ సీతారామచంద్రస్వామివారి ప్రతిష్ఠా మహోత్సవం నిర్వహించారు. ఈ కార్యక్రమం శ్రీమాన్ ముడుంబై శ్రీమన్నారాయణా చార్యులుగారు యజ్ఞాచార్యులుగా ఉండి చక్కగా చేయించారు. శ్రీమాన్ హన్మంతరెడ్డి గారు ప్రధానంగా ఉండి అందరి సహ కారంతో అందంగా నిర్మించారు. ఈ కార్య క్రమంలో అసెంబ్లీ సభ్యులు శ్రీమాన్ కె. దేవేందర్ రావుగారు, శ్రీమాన్ రాంకిషన్‌రావు గారు, **Ex-MLA** శ్రీమాన్ జగపతిరావుగారు పాల్గొని శ్రీస్వామివారిని సేవించారు. ఉద్రిక్త వాతావరణం కల్గిన జిల్లాలుగా ప్రఖ్యాతి చెందినా ఇవి ఆధ్యాత్మిక పౌష్కల్యం కలవే స్వామివారి పర్యటన, సమాజంలో ఒక విధమైన మార్పు తీసుకు వచ్చి ఉద్రిక్త వాతావరణం తగ్గి ఈ ప్రాంతంలో ప్రశాంత వాతావరణం క్రమంగ నెలకొల్పుతుంది. అనడంలో ఎలాంటి సందేహం లేదు.

కరీంనగర్ వెడుతూ శ్రీస్వామివారు గుండి గ్రామంలోని వేణుగోపాలస్వామి ఆలయాన్ని సందర్శించి పునరుద్ధరణకు తగు సూచనలు చేసి కరీంనగర్ చేరుకున్నారు.**M.L.A.** శ్రీమాన్ కే. దేవేందర్‌రావుగారి గృహం ముందు విశాలమైన స్థలములో సామూహిక శ్రీలక్ష్మీనారాయణ పుజా కార్యక్రమాన్ని జరిపించి రాత్రికి జగ్గయ్యపేటకు చేరు కున్నారు.

**జగ్గయ్యపేట** : మార్చి 4న కాకతీయ సిమెంట్స్, జగ్గయ్యపేట, శ్రీ వేంకటేశ్వర స్వామి బ్రహ్మోత్సవాల్లో శ్రీ స్వామివారు పాల్గొన్నారు. ఒక సంస్థను స్థాపించి అంచె లంచెలుగా అభివృద్ధి చేస్తూ భగవదను గ్రహంతో విజయవంతంగా నడిపించడం గొప్పవిశేషం. కాకతీయ సిమెంట్స్ సంస్థ స్థాపించి 20సం॥లు పూర్తి అయింది. ఈ సందర్భంగా ఈ సంస్థ అధినేతలు శ్రీమాన్ పి. వేంకటేశ్వర్లుగారు, శ్రీమాన్ పి. వీరయ్యగారు **kcl** ప్రాంగణంలోని శ్రీవేంకటేశ్వర స్వామి ఆలయానికి నూతనత్వాన్ని కల్పించారు. దీనిని బట్టి భగవంతుడిపై వారికి గల అచంచల విశ్వాసం వ్యక్తమవుతోంది. కల్లూరు, కాకతీయ షుగర్స్ ఆలయంలో జరిగే ఉత్సవాలకు దీటుగా కాకతీయ సిమెంట్స్, వేంకటేశ్వ రాలయంలో కూడా జరగాలని సంకల్పించి 20వ, బ్రహ్మోత్సవాల శుభ సందర్భంగా ద్వారగోపురాన్ని పునరు ద్ధరించి కలశములు స్థాపన చేయించారు. ఆలయానికి ఉత్తరాన వైశాల్యాన్ని పెంచి ప్రాకారంతో పాటు చక్కటి ఉద్యానవనాన్ని బహుశోభాయమానంగా ఏర్పాటు చేసారు. బ్రహ్మోత్సవాల్లో భాగంగా చివరిరోజు స్వామి వారు వేంచేసి భక్తులందరికి కార్యక్రమ విశేషాల్ని, వైభవాన్ని వివరించారు. పెరుమాళ్ళ వాహనాన్ని స్వయంగా శ్రీమాన్ పి. వేంకటేశ్వర్లుగారు, శ్రీమాన్ పి.వీరయ్య గారు వహిస్తూ అమితమైన ఆనందాన్ని అనుభవించారు. భవిష్యత్తులో ఇంతకంటే

వైభవంగా నిర్వహించాలని శ్రీ స్వామివారు మంగళాశాసనం చేసారు.

**విజయవాడ :** మార్చి5న శ్రీ స్వామివారు జగ్గయ్య పేటలో ఆరాధన పూర్తిచేసికొని విజయవాడ చేరి పటమటలో ఉన్న శ్రీమతి సరోజిని పూర్ణ చంద్రరావు గారింటికి వేంచేసారు. శ్రీమాన్ పూర్ణచంద్రరావు గారు ఈ మధ్యే ఆచార్య తిరువడిని అలంక రించారు. దీనికి ఒకరోజు ముందరే శ్రీస్వామి వారు, వారిని కలిసి మంగళాశాసనం చేయడం జరిగింది. మరుసటిరోజే వారు ఆచార్య తిరువడి నలంకరించడంపై శ్రీస్వామి వారు తీవ్రదిగ్భ్రాంతి వ్యక్తం చేసారు. శ్రీమాన్ పూర్ణచంద్రరావు గారికి స్వామివారి ఉపదేశం పై అత్యంత విశ్వాసం. శ్రీ స్వామివారు ఆదేశించిన రీతిలో ఆహారవ్యవహారాల న్నింటిని మార్పు చేసుకోవడం విశేషం. సాధారణంగా ఎవరైన దేహయాత్ర చాలించిన తర్వాత జరిగే కార్యక్ర మాల్లో కొన్ని అనుచితమైన ఆచారాలు చోటు చేసు కుంటూ ఉంటాయి. కాని, తమయొక్క ఉత్తరక్రియలు నిరాడంబరంగా జరగాలని తమ డైరీలో శ్రీ పూర్ణచంద్రరావు గారు వ్రాసిన విషయాలు అందరినీ ఆశ్చర్యపర్చాయి. ఎప్పుడు వ్రాసారో తెలియదు. రాజస, తామస సాహారాలు వాడటం కాని చోటుచేసుకో కూడదని, శ్రీ స్వామివారు వాడే పదార్థాలే తయారుచేసి వినియోగించాలని సాత్త్విక శాసనాన్ని వ్రాసిపెట్టారు. ఇది గమనించిన వారి కుమారులు తండ్రిగారి అభీష్టం ప్రకారమే కార్యక్రమం జరిపించారు. వారి సంప్రదాయ నిష్ఠను చూసి శ్రీ స్వామివారు వారింటికి వేంచేసి అనేక మంగళా శాసనములు కృపచేసారు. ప్రపన్నురాలు అయిన శ్రీ పూర్ణచంద్ర రావు గారి పత్ని శ్రీమతి సరోజిని గారితో శ్రీ స్వామివారు "హఠాత్తుగా జరిగిన ఈ పరిణామానికి విచారించవలసిన పని లేదని, దిగులును మాని మనో నిబ్బరంతో భగవత్ప్రార్థన చేసుకోవాలని కృపచేసారు.

అనంతరం విజయవాడ వికాసతరంగిణి వారు ఏర్పాటుచేసిన ఉచితహోమియో మరియు ఆక్యుప్రెషర్ వైద్య శిబిరమును సందర్శించారు. అక్కడే ఉండే " శ్రీ రామాను జవాణి షోరూం"ను కూడా సందర్శించి మంగళాశాసనం చేసారు. అనంతరం శ్రీకృష్ణా కాఫీ హౌస్‌ను కూడా ప్రారంభించారు. దీని యజమానులు శ్రీ హన్మంతరావు గారు, వారి కుమారుడు ప్రభాకర్ రావు గారు స్వామివారి ఉపదేశాల ప్రభావం వల్ల, ఇంతకుముందు నాన్‌వెజ్ రెస్టారెంట్ ఉండగ "వెజిటేరియన్ ఫాస్ట్‌ఫుడ్ క్యాంటీన్" ప్రారంభించి స్వామివారి అనుగ్ర హమునకు పాత్రులయ్యారు. ఈ సందర్భంగా సేవలందించిన మల్లిఖార్జున రావుపేట వికాసతరంగిణి కార్యకర్తలకు, వైద్యులు శ్రీమాన్ డా॥ వెంకటప్పయ్య గార్కి, శ్రీమాన్ డా॥ ప్రసాద్ గారి బృందానికీ మంగళా శాసనములు కృపచేసారు.

సాయంకాలం క్రేన్ అధినేత శ్రీమాన్ గ్రంథి సుబ్బారావు గారు, బదరీ అష్టాక్షరీ క్షేత్ర సమన్వయకర్త శ్రీమాన్ (ఢిల్లీ) శ్రీనివాస్ గారు సీతానగరంలో శ్రీ స్వామివారిని సేవించి మంగళాశాసనములు పొందారు. శ్రీవారు రాత్రికి జగ్గయ్యపేట వేంచేసారు.

మార్చి6న పెరుమాళ్ళకు విశేష తిరుమంజన కార్యక్రమం జరిగింది. ఆలయ బ్రహ్మోత్సవాల్లో ఋత్విక్కులకు సమ్మానాలు చేసిన శ్రీమాన్ వెంకటేశ్వర్లు గారు,





వీరయ్యగార్లను మంగళాశాసనం చేసి రాత్రికి వరంగల్ జిల్లాలోని జనగామ పట్టణానికి శ్రీ సుదర్శన యాగము కొరకై విచ్చేసారు.

## శ్రీ సుదర్శన యజ్ఞము - జనగామ

వయస్సులో చిన్నవారైనా పంచాంగకర్తలుగా ఎదిగి, జనగామ పట్టణంలోని శ్రీ వేంకటేశ్వరాలయంలో ప్రధాన అర్చకులుగా ఉన్న శ్రీమాన్ T.N.CH.S. కృష్ణమా చార్యులు, జనగామ పట్టణంలోని ఆధ్యాత్మిక ప్రముఖులతో శ్రీ స్వామివారి అనుగ్రహ ముతో ఈ యాగ కార్యక్రమ మును ప్రారంభించారు. అంకురార్పణతో కార్యక్రమం ఆరంభమ యింది. 5రోజులు శ్రీస్వామివారికి నిలయంగా శ్రీమతి పద్మా వతి, శ్రీమాన్ వేంకటేశ్వర్లుగారు తమ గృహాన్ని ఏర్పాటు చేసి భక్తి ప్రపత్తులను ప్రకటించారు. శ్రీ స్వామివారికి పూర్ణకుంభ స్వాగతం పలికి శోభాయాత్రగా విశాలమైన మార్కెట్ యార్డులో ఏర్పాటుచేసిన వేదిక వద్దకు చేరుకొని ప్రారంభ విశేషాలు వివరిస్తూ అనుగ్రహ భాషణం చేసారు.

మార్చి7న అమెరికా భక్తులతో ప్రవచన గోష్ఠిజరిపిఅనంతరం యాగశాలకు వేంచే సారు. శ్రీ సుదర్శన యజ్ఞంలో భాగంగా అగ్ని మథన కార్యక్రమం శ్రీమాన్ ముడుంబై శ్రీమన్నారాయణా చార్యులు గారి నేతృ త్వంలో జరిగింది.

సాయంకాల ప్రవచన కార్యక్రమా నంతరం S.S చారిటబుల్ ట్రస్ట్ మరియు జనగామ వికాసతరంగిణి వారు బీదవారికి ఉచితంగా శ్రీ స్వామివారి కరకమలముల మీదుగా 13 కుట్టుమిషన్లు ఇప్పించారు. మార్కెట్ యార్డు అధ్యక్షురాలు శ్రీమతి ప్రేమలతారెడ్డి గారు వచ్చి స్వామివారి మంగళాశాసనములు పొందారు.

మార్చి 8న జనగామ- వికాస తరంగిణి వారు **S.B.I** మరియు ప్రాంతీయ లయన్స్ క్లబ్‌తోకలసి సూపర్ స్పెషాలిటీ ఉచితవైద్య శిబిరమును ఏర్పాటుచేసారు. హైదరాబాద్ మెడిసిటి హస్పిటల్, ఇండియన్ మెడికల్ అసోసియేషన్ నుండి వివిధ విభాగాలలో నిష్ణాతులైన వైద్యశేఖరుల బృందం, అనేకమంది దీనులకు, ఆర్తులకు ఉచిత వైద్యసేవలందించి స్వామివారి మంగళా శాసనములు పొందినారు.

అనంతరం శ్రీ స్వామివారు అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా ప్రేమకు ప్రతిరూపమైన "స్త్రీమూర్తి" యొక్క విశిష్టతను, దానిని నిలుపుకోవడానికి వర్తమాన మహిళల కర్తవ్యాన్ని ప్రవచించి మంగళాశాసనాలు కృప చేసి లక్ష్మీనారాయణ పూజా కార్యక్రమాన్ని చేయించారు.

సాయంకాలం చికాగో నుండి వచ్చిన **JET-USA** అధ్యక్షురాలైన శ్రీమతి మణిగారితో అక్కడి కార్యకలాపాల గూర్చిన విశేషాలు చర్చించి, తగు సూచనలందించి మంగళా శాసనములు కృపచేసారు. అనంతరం వేదకపైన డా. కె.నర్సింహమూర్తి గారు, వరంగల్ వికాసతరంగిణి అధ్యక్షురాలైన డా.పి.జ్యోతి గారి నేతృత్వంలో **Ph.D** కై వ్రాసిన "తెలుగు సాహిత్యంలో నృసింహ వృత్తాంతము" అనే గ్రంథమును ఆవిష్కరించారు.

మార్చి 9న, జనగామ - పశువైద్యశాలలో ఉచిత పశువైద్య శిబిరాన్ని ప్రారంభించారు. **J.D** శ్రీమాన్ **Dr. T.V.** రామారావు గారి నేతృత్వంలో జరుగుతున్న ఈ శిబిరంలో పశువులకు కావలసిన ఏర్పాట్లు అసంతృప్తిగా ఉన్నాయని వికాస తరంగిణికార్యకర్తలను శ్రీ

స్వామి వారు మందలించారు. వెంటనే వికాస తరంగిణి ప్రముఖులు శ్రీమాన్ బజ్జూరి గోపయ్య, శ్రీమాన్ జయహరి సోదరులు, శ్రీమాన్ గోపాల్ లోహియ,వికాస తరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ కాచం అంజయ్యగారు జరిగిన లోపానికి బాధపడి వైద్యశాల చుట్టూ ప్రాకారం నిర్మించి, శాశ్వత జలవసతి ఏర్పాటు చేస్తామని స్పందించారు. ఈ కార్యాన్ని 3 నెలల్లో పూర్తి చేయాలని శ్రీవారు ఆదేశించారు. ఒక కార్యక్రమంలో లోపం జరగడం కూడా ఒక శాశ్వత వసతికి కారణం అవుతుంది అనడానికిది ప్రత్యక్ష నిదర్శనం. ఈ శిబిరంలో సేవలందించిన వైద్యశేఖరులకు, కార్యకర్తలకు మంగళాశాసనములు కృపచేసినారు. తర్వాత 16వ తేదీన వనపర్తి నుండి తిరిగి వెడుతున్న శ్రీ స్వామివారిని వేంచేపు చేసుకొని ప్రాకార నిర్మాణానికి శిలాన్యాసం చేయించడం కార్యకర్తల దీక్షను ప్రకటించింది.

సాయంకాల ప్రవచన గోష్ఠిలో ప్రభుత్వ చీఫ్ విప్ శ్రీమాన్ ఇ. దయాకర్ రావు గారు స్వామివారిని సేవించి, విశేషాలు ముచ్చటించి, జనగామ-వికాసతరంగిణి ఇంత వైభవమైన కార్యక్రమము ఏర్పాటుచేసి ఈ ప్రాంత క్షేమానికి కృషి చేయడం చాలా ఆనందాన్నిస్తోంది అన్నారు. అనంతరం శ్రీమాన్ **T.N.CH.S** కృష్ణమాచార్య సిద్ధాంతి గారు రచించిన ''చిత్రభాను'' సంవత్సర పంచాంగమును శ్రీ స్వామివారు ఆవిష్కరించి, అనేక మంగళాశాసనములు కృపచేసారు. ఈ సందర్భంగా పట్టణపు పెద్దలు, ప్రముఖులు శ్రీ కృష్ణమాచార్య సిద్ధాంతిగారి సేవలను కొనియాడి, సన్మానం కావించడం విశేషం.

మార్చి 10న శ్రీ స్వామివారు జనగామ సమీపంలోని చంపక్ హిల్స్ లో "మాతృదర్శన్ ట్రస్ట్" వారు నిర్వహించు ఉచిత క్యాన్సర్ నిర్ధారణ శిబిరమును ప్రారంభించారు. "ఇండో అమెరికన్ క్యాన్సర్ ఇనిస్టిట్యూట్ **&** రిసెర్చ్ సెంటర్" సూపరెంటెండెంట్ శ్రీమతి డా.కల్పనా రఘునాథ్ గారు, వారి టీమ్ అందించే ఉచిత వైద్య సేవల్లో ఇదీ ఒకటి. శ్రీస్వామివారు వారందరికీ మంగళాశాసనములు చేసారు. ఈ కార్యక్రమాన్ని ట్రస్ట్ అధ్యక్షులు శ్రీమాన్ మాందాడి రాంచంద్రా రెడ్డి గారు నిర్వహించి స్వామివారి అనుగ్రహమునకు పాత్రులయ్యారు.

రాత్రి జరిగిన వికాస తరంగిణికార్యకర్తల సమావేశంలో అధ్యక్షులు శ్రీమాన్ కాచం అంజయ్యగారికి తగు సూచనలు, భవిష్యత్తులో జరుగవలసిన కార్యక్రమాలలో గమనించవలసిన అంశాలను శ్రీవారు కృపచేసారు.

మార్చి 11న శ్రీ సుదర్శనయాగ మహాపూర్ణాహుతి జరిగింది. ఈ కార్యక్రమములో అన్ని రకముల సేవలందించిన వారందరికి మంగళాశాసనములు కృపచేసి, హన్మకొండకు విచ్చేసి నూతనముగా నిర్మించిన వికాస తరంగిణి భవనమును ప్రారంభించారు. అనంతరం "నందిని గార్డెన్స్" లో ఏర్పాటు చేసిన వరంగల్ జిల్లా వికాసతరంగిణి కార్యకర్తల సమావేశంలో ఈ ఉగాది నుండి ప్రారంభించే గీతాజ్యోతి కార్యక్రమ తీరుతెన్నులను వివరించి, కార్యక్రమ నిర్వహణకు సమాయత్తం కావలసిందని సూచిస్తూ కార్యకర్తలందరికి మంగళాశాసనములు చేసి జీడికల్ గ్రామములోని రామాలయాన్ని సందర్శించారు. ఇది చాలా





ప్రసిద్ధమైనది, పురాతనము కూడా. ప్రభుత్వాధీనములోకి వెళ్తే అభివృద్ధి ఎలా కుంటుపడుతుందో అనడానికి ప్రత్యేక నిదర్శనమీ ఆలయం. పన్నిద్దరాళ్వార్లు ఉన్న సన్నిధి పై ఆచ్ఛాదనలేక జంతువులపాలై దీనావస్థలో ఉంది. పట్టించుకున్న నాథుడే లేడు. స్వామివారు గ్రామస్థులందరితో మాట్లాడి "ఆలయమును అభివృద్ధి చేసుకో వడం మీ కృషిపైనే ఆధారపడి ఉంది. ఆలయాన్ని బాగా ఉంచుకుంటే గ్రామం బాగుంటుంది" అని చెప్పగానే గ్రామస్థు లందరూ ఉత్సాహాన్ని ప్రదర్శించి తప్పకుండా బాగుచేసుకుంటాం అని మాటిచ్చారు. స్వామివారుకూడా రూ. 5,000/- ఆలయ అభివృద్ధికి ఇస్తామన్నారు. వారందరికీ మంగళాశాసనములు కృపచేసి రాత్రికి హైదరాబాద్ - జెట్‌కు వేంచేసారు.

మార్చి 12న శ్రీస్వామివారు ఉదయం ఆరాధన కాగానే ముఖ్యమంత్రి శ్రీమాన్ నారాచంద్రబాబునాయుడు గారితో సమావేశమై 'గీతాజ్యోతి' కార్యక్రమమును వివరించి, దానికి వారు టి.టి.డి. ద్వారా సేవచేయు విధానమును సూచించి వారికి మంగళాశాసనములు కృపచేసారు. అనంతరం హైదరాబాద్‌లోని Wishper Valleyలో B.J.P. Twin Cities President శ్రీమాన్ రామచంద్రా రెడ్డిగారి గృహాన్ని సందర్శించి పాదపూజ స్వీకరించారు.

**తొర్రూర్ :** రాత్రికి వరంగల్ జిల్లా తొర్రూర్ వెడుతూ శ్రీమాన్ కె. లక్ష్మీనర్సింహారావు గారి ఆహ్వానంపై బ్రాహ్మణ కొత్తపల్లిలోని సంతాన వేణుగోపాల స్వామి కోవెలను సందర్శించి, గ్రామస్థులందరికి మంగళాశాసనపూర్వక అనుగ్రహభాషణం చేసారు. తొర్రూరు చేరేసరికి రాత్రి 12 గం॥లు అయ్యింది. శ్రీమాన్ డా॥ రాజేందర్ రెడ్డిగారు, శ్రీమతి గీతగారు వికాసతరంగిణి సభ్యులతో శ్రీస్వామివారికి స్వాగతం పలికారు. వారి గృహంలోనే బస ఏర్పాటు చేసారు.

13న, ఉదయం సమాశ్రయణ కార్యక్రమం కాగానే శ్రీస్వామివారు తొర్రూరు సమీపంలోని సోమారం గ్రామానికి వేంచేసి వికాస తరంగిణివారు నిర్వహించు చలివేంద్రము, ఉచిత పశువైద్యశిబిరమును ప్రారంభించి గోపూజ నిర్వహించారు. పశువులకు సేవలందించడానికి వచ్చిన పశుసంవర్ధక శాఖ సిబ్బందికి మంగళాశాసనములు కృపచేసారు. ఈ గ్రామంలోని చదువుకున్న యువకులందరినీ రానివారికి చదువు నేర్పించాలని ఆదేశించగా, శిరసావహించిరి. శ్రీమతి గీతారాజేందర్‌రెడ్డి గారిని ఆ కార్యక్రమానికి ముందుండి నడపమని కోరారు. నిరక్షరాస్యులకు చదువు కొనుటకు కావలసిన వస్తుసామగ్రిని లయన్స్ క్లబ్‌వారు సమకూరుస్తామని వాగ్దానం చేసిరి. అనంతరం **అమ్మాపురం రామాలయాన్ని** సందర్శించి మంగళాశాసనం చేసి తొర్రూరుకు విచ్చేసారు.

సాయంకాలం **చెన్నూరు** గ్రామంలోని శ్రీమాన్ కె. రామకృష్ణారెడ్డిగారు, శ్రీమాన్ వసంతరావు గార్ల ఆహ్వానంపై ప్రసిద్ధమైన శ్రీవేంకటేశ్వర ఆలయాన్ని సందర్శించి మంగళాశాసనం చేసారు. అందమైన రాతి కట్టడం విశాలమైన మండపాలతో భక్తుల వసతికై నిర్మించిన ఆలయమిది. ఇక్కడ ఆళ్వారాదుల సన్నిధులు విడివిడిగ, అతి సుందరమూర్తులతో విరాజిల్లుతున్నాయి. ఇ. దయాకర్‌రావుగారి ప్రేరణతో ఎండోమెంట్స్ వారు ఈ మధ్యే జీర్ణోద్ధరణకు రూ. 10లక్షలు ఇచ్చారు కూడ.

మార్చి 14న ఉదయం డా॥ రాజేంద్రరెడ్డి గారి హాస్పిటల్‌లో 'ఆపరేషన్ థియేటర్'ను ప్రారంభించారు. అనంతరం వనపర్తి వికాస తరంగిణివారు వడ్డిచెర్ల గ్రామంలో నిర్వహించు ఉచిత పశువైద్యశిబిరాన్ని శ్రీస్వామివారు ప్రారంభించారు. శ్రీస్వామివారి తో నేపాల్ పర్యటన చేసిన పశువైద్యులు డా॥ కృష్ణమాచార్యులుగారు 'రిల్లా' అనే వ్యాధితో బాధపడుచున్న పశువుకు చేసిన కీలకమైన ఆపరేషన్‌ను తిలకించి వారి నైపుణ్యాన్ని శ్లాఘించారు. ఇలాంటివి 27 ఆపరేషన్స్ ఈ శిబిరంలో చేసారు. మొత్తం 900 పశువులకు చికిత్స చేసారు. ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన సభలో ప్రభుత్వ పశువైద్యులు డా॥ నర్సింహగారి అభ్యర్థనపై Vaxine Cilinders నిమిత్తం 50 వేల రూపాయలు వికాసతరంగిణి ఇస్తుంది అని శ్రీస్వామివారు ప్రకటించారు. ప్రభుత్వం ఈ విషయంలో విఫలత చూపింది. పశువైద్య శిబిరము ఎక్కడ జరిగినా ఉచితంగా వాక్సినేషన్ చేస్తామని డా॥ నర్సింహ అన్నారు. స్వామివారు దీనిద్వారా ఉచిత వాక్సినేషన్‌కు శ్రీకారం చుట్టినట్లైనది. వికాసతరంగిణి వెటర్నరీ క్యాంప్స్ కో-ఆర్డినేటర్ శ్రీమాన్ డా॥ వెంకటరమణారెడ్డి గారు, జిల్లా వెటర్నరీ డాక్టర్స్ సమన్వయకర్త డా॥ సురేష్‌కుమార్, జిల్లా డిప్యూటీ డైరెక్టర్ డా॥ సి.హెచ్. రామానుజా చార్యులు, పాడిపరి శ్రమాభివృద్ధి సమాఖ్య అధ్యక్షులు శ్రీమాన్ పాపిరెడ్డిగారు శిబిరమును విజయవంతముగా నిర్వహించి శ్రీస్వామివారి అనుగ్రహమునకు పాత్రుల య్యారు. సుమారు 8కంపెనీలవారు ఉచిత ముగా మందులను సరఫరా చేసారు. శ్రీ స్వామివారు వీరందరికీ మంగళాశాసనాలు కృపచేసి మధ్యాహ్నానికి వనపర్తి గ్రామానికి చేరుకున్నారు.

**వనపర్తి :** శ్రీస్వామివారు 1999లో ఈ గ్రామంలో వెటర్నరీ క్యాంప్ నిర్వహించిన సందర్భంగా వచ్చినపుడు శ్రీవేంకటేశ్వర ఆలయానికి శంకుస్థాపన చేసి సంవత్సరం లోగా పూర్తిచేయాలని చెప్పారు. అన్నమాట ప్రకారం అన్ని హంగులతో సంవత్సరానికల్లా నిర్మించి శ్రీస్వామివారి చేతనే ప్రతిష్ఠా కార్యక్రమాన్ని కూడా జరిపించాలనే కోరిక నేటికి నెరవేరింది.

15వ తేదీ సామూహిక లక్ష్మీనారాయణ పూజ, 16న ప్రతిష్ఠాకార్యక్రమం వైభవంగా నిర్వహించారు. శ్రీమాన్ పి. కుమారస్వామి గారు ముఖ్యంగా ముందుండి సుదర్శన్‌రెడ్డి, పాపిరెడ్డి మొదలగువారందరి సహకారంతో నిర్మించారు. వారందరికి స్వామివారు మంగళాశాసనములు కృపచేసిరి. వరంగల్ వెడుతూ జనగామ - మార్కెట్ యార్డ్ సమీపంలో పెద్దజీయరు స్వామివారు స్థాపించిన స్వాధ్యాయ జ్ఞానయజ్ఞ స్థూపానికి రంగులు వేసి పైన కలశాన్ని అలంకరించిన సందర్భంగా సందర్శించి మంగళాశాసనము చేసి వరంగల్ చేరిరి.

**వరంగల్ :** సాయంకాలం 5గం॥లకు **J.P.N.** రోడ్‌లోని **S.B.H. Zonal Office**ను శ్రీస్వామివారు సందర్శించి, వారు నిర్మించుకున్న లక్ష్మీ అమ్మవారి మందిరాన్ని మంగళాశాసనం చేసి స్టాఫ్ నుద్దేశించి అనుగ్రహభాషణం చేసారు. జోనల్ డిప్యూటీ డైరెక్టర్ శ్రీమాన్ యుగంధర్‌గారు, బాంక్ అసోసియేషన్ అధ్యక్షులు శ్రీమాన్ **T.S.** కుమార్‌గారు స్వామివారిని సేవించారు.

**24**/DTP/Desktop/
DTPworks/bn/
Magazine/bnapr02.p65



అనంతరం శ్రీస్వామివారు బాల సముద్రం - ఏకశిలా పార్క్‌లోని శ్రీ సీతారామ ప్రసన్నాంజనేయ స్వామివారి దేవాలయానికి వేంచేసి ఆళ్వారాచార్య ప్రతిష్ఠా కార్యక్రమం ప్రారంభించారు. శ్రీమాన్ **V.** రవికుమారా చార్యులుగారు కొంతమంది ప్రముఖుల సహకారంతో ఆలయాన్ని చాలా వైభవంగా తీర్చిదిద్దారు. అశేషభక్తజనంతోపాటు గవర్నమెంట్ చీఫ్ విప్ ఇ.దయాకర్‌రావు గారు, మేయర్ శ్రీమాన్ రాజేశ్వర రావుగారు, ఎడిషినల్ ఎస్.పి. విఠల్‌గారు, డిస్ట్రిక్ట్ బి.జె.పి. అధ్యక్షులు వేణుగోపాల్‌రెడ్డి గారు, ప్రభృతులు స్వామి వారిని సేవించి మంగళా శాసనము లందు కున్నారు. వీరంతా గీతాజ్యోతి కార్యక్రమంలో తమవంతు సేవలు తప్పకుండా చేస్తామని స్వామివారితో నివేదించారు. ఆలయాన్ని ఇంత వైభవంగా తీర్చిదిద్ది, కార్యక్రమాన్ని హుందాగా నడిపించిన శ్రీమాన్ రవికుమారా చార్యులు గారిని శ్రీస్వామివారు శ్రీ ఉ.వే.శ్రీమాన్ న.చ. రఘునాథాచార్య స్వామివారు మంగళా శాసనములు కృపచేసారు. అనంతరం శివనగర్‌లోని డా॥ మురళీకృష్ణగారి చైత్రరథ గార్డెన్స్‌కు చేరుకున్నారు.

స్వామివారిని ఎప్పటినుండో అడుగు తున్న వారి కోరిక స్వామివారి రాకతో పూర్తయి వారి హృదయాలు ఆనందంతో పులకరించి పోయాయి. ఈ సందర్భంగా ఏదైనా ఒక సాంస్కృతిక కార్యక్రమం ఏర్పాటు చేస్తామని వారు స్వామివారితో పూర్వమే నివేదించగా మన వేద, ఆగమ విద్యార్థులతో విష్ణుసహస్ర నామ అవధాన కార్యక్రమం పెడితే బాగుంటుంది అన్న స్వామివారి సూచన మేరకు అన్ని ఏర్పాట్లు సిద్ధమయ్యాయి.

## విష్ణుసహస్రనామ స్తోత్ర అవధానము

జగ్గయ్యపేట విద్యార్థులచే వైభవంగా జరిగిన
విష్ణుసహస్రనామ అవధాన కార్యక్రమం

**KCL** జగ్గయ్యపేట ఆశ్రమం నుండి 16 మంది చిరంజీవులు అవధానంలో పాల్గొన డానికి విచ్చేసారు. హరీష్, శశిధర్, లక్ష్మీ నరసింహ, ఉపేంద్ర, నరసింహ, సంతోష్, శ్రీకాంత్, శ్రీనివాస్, బాలాజీ, గోపీకృష్ణ, రామానుజం, కిరణ్, రాఘవ, రాంమనోహర్, సుదర్శన్, రవితేజ, మరింగంటి వారి మనవడు రోహిత్‌కూడా పాల్గొని తమ అవధానపటిమతో అందరినీ ఆశ్చర్యపరిచారు. వీరిని వరుసగా వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, సంకర్షణ అని గ్రూపులుగా చేయడం జరిగింది. ఈ అవధానంలో ప్రశ్నలడిగిన విధానం- 1) సంఖ్య అందిస్తే శ్లోకాన్ని చెప్పడం, 2) శ్లోకం అందిస్తే సంఖ్య చెప్పడం 3) శ్లోకంలోని ఏదో ఒక పదం అందిస్తే శ్లోకాన్ని పూరించడం 4) శ్లోకం చివరి పదం అందిస్తే శ్లోకాన్నిమొత్తం పూరించడం. 5) మొదటి పది శ్లోకాల్లో ఒకటి చెప్తే దానికి 10 కలుపుతూవచ్చే శ్లోకాలను చెప్పడం (ఉదా 2, 22, 32, 42,....... ) 6) ఒక్కొక్క అక్షరంపై ఎన్ని శ్లోకాలు ఉన్నాయి? ఎక్కడెక్కడ? సంఖ్య ఎంత?

ఈ విధంగా అడిగిన ప్రశ్నలకు ఏమాత్రం తడుముకోకుండా సమాధానాలు చెప్పారు.

అవధానం అనంతరం శ్రీ ఉ.వే. శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామివారు ముందు ముందు 1000 నామాల్లో ఏ నామం ఎన్నవది, దాని అర్థం ఏమిటి, 2 మార్లు, 3 మార్లు, 4 మార్లు వచ్చిన నామాలేమిటి ఏ సందర్భంలో ఏ అర్థాన్ని చెప్పుకోవాలి? తరహాలో ప్రిపేర్ కావాలి అని అన్నారు. శ్రీస్వామివారు ఈ కార్యక్రమంలో పాల్గొన్న వారందరికి మంగళాశాసన పూర్వక అనుగ్రహభాషణం కృపచేసారు. వరంగల్ వికాసతరంగిణి అధ్యక్షులు డా॥ పి. జ్యోతిగారు ఈ అవధాన ప్రక్రియను చక్కగా నిర్వహించారు. ఇందులో వాసుదేవ - ప్రథమ, ప్రద్యుమ్న, అనిరుద్ధ - ద్వితీయు, సంకర్షణ గ్రూపు - తృతీయు స్థానాల్లో నిలిచాయి. శ్రీమాన్ డా॥ బచ్చు మురళీకృష్ణ, రాధాకృష్ణ మరియు కుటుంబ సభ్యులు విద్యార్థులకు వస్త్రాలు సమర్పించు కున్నారు. రాత్రి శ్రీస్వామివారు చైత్ర రథగార్డెన్స్‌లోనే బస చేసారు.

17వ తేది ఉదయం తొర్రూర్ వెడుతూ వరంగల్‌లో - నాయుడు పంపు వద్ద 'వికలాంగుల ఆశ్రమ పాఠశాల విద్యార్థులను పరామర్శించి రూ. 5,000/- విరాళంగా అందించి, వరంగల్ వికాసతరంగిణి అధ్యక్షురాలు శ్రీమతి డా॥ పి. జ్యోతిగారితో ఈ పాఠశాల నిర్వహణకు కావల్సిన ఏర్పాట్లను వికాసతరంగిణి చేస్తే బాగుంటుందని సూచించి మధ్యాహ్నానికి తొర్రూరు వేంచేసారు.

తొర్రూరులో ప్రముఖ వైద్యులు శ్రీమాన్ కె.రాజేందర్ రెడ్డి గారు ప్రధానంగా ఉండి భక్తుల సహకారంతో నిర్మించిన శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ప్రతిష్ఠా మహోత్స వాన్ని స్వామివారు వైభవంగా జరిపించారు. ప్రతిష్ఠా కార్యక్రమానికి పూర్వ రంగమంతా యజ్ఞాచార్యులు శ్రీమాన్ కె.మధుసూదనా చార్యులు(పెద్ద మధు)గారు వారి బృందంతో విధి విధానంగా జరిపించారు. వికాస తరంగిణి వారు భక్తిశ్రద్ధలతో ప్రదర్శించిన కోలాటం, భరతనాట్యం వీక్షించి అందరికీ మంగళాశాసనాలందించి అనుగ్రహభాషణం చేసారు. ప్రతిష్ఠ సందర్భంగా శ్రీమతి గీతారాజేందర్ రెడ్డిగారు, శ్రీమతి అరుణ రాఘవరెడ్డి గారు వికాసతరంగిణి బృందంతో కలిసి అందించిన సేవలను శ్లాఘించారు. అనంతరం శ్రీమాన్ కేశిరాజు వెంకట్రా మారావు గారి ఆహ్వానాన్ని పురస్కరించుకొని మదనతుర్తి వేంచేసి ఆళ్వారాచార్యాదుల ప్రతిష్ఠాకార్యక్రమం అనంతరం జరిగే శాంతి కళ్యాణంలో అన్వయించారు. గ్రామస్థు లందరికి మంగళాశాసన పూర్వక అనుగ్రహ భాషణం చేసన్తూ గీతాజ్యోతి కార్యక్రమ ప్రాముఖ్యాన్ని వివరించారు. అనంతరం శ్రీమతి ఇందిరగారి గృహాన్ని పావనం చేసి, పాదపూజ స్వీకరించి ఖమ్మం చేరారు.

**ఖమ్మం :** 17 రాత్రి ఖమ్మం చేరుకొని స్తంభాద్రి బ్యాంక్ అధినేత శ్రీమాన్ ఇ. రామారావు గారి భవనం 7వ అంతస్థులో ఏర్పాటు చేసిన నిలయంలో శ్రీ స్వామివారు బస చేసారు. ఇదే రాత్రి ఖమ్మం వికాసతరంగిణి వారితో గీతాజ్యోతి కార్యక్రమాన్ని గూర్చి ముచ్చటించి, సూచనలందించారు.

18వ తేది ఉదయం శ్రీ స్వామివారు శ్రీమాన్ ఇ.రామారావుగారి బ్యాంక్‌ను సందర్శించారు. అనంతరం **M.L.A** శ్రీమాన్ పువ్వాడ నాగేశ్వరరావు గారు, వారి కుమారుడు అజయ్‌కుమార్ గారి ఆహ్వానం పై మమత మెడికల్ కాలేజిని, మమత

25/DTP/Desktop/
DTPworks/bn/
Magazine/bnapr02.p65



జనరల్ హాస్పటల్‌ను సందర్శించారు. మెడకల్ స్టూడెంట్స్‌కు సందేశాన్నిస్తూ వైద్యుని ముఖ్య ఉద్దేశం ఏమిటి? సమాజంలో వైద్యులు పోషించవలసిన పాత్ర ఏమిటి? అనే విషయాన్ని విశదంగా కృప చేసారు. ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన పబ్లిక్ మీటింగ్‌లో స్వామివారు గీతాజ్యోతి కార్యక్రమాన్ని వివరించి ఉగాది నుండి పాల్గొనుటకు సమాయత్తం కావలసినదిగా ఆదేశించారు. అనంతరం వేదికపై . శ్రీమాన్ పుల్లాభట్ల వెంటకేశ్వర్లుగారు, వ్రాసిన 'విజయ విలాసం'అనే గ్రంథాన్ని ఆవిష్క రించారు.

అనంతరం శ్రీస్వామివారు ఖమ్మం సమీపంలోని పుట్టకోట గ్రామానికి **D. G. P. Office** లో ముఖ్యన్యాయసలహాదారులైన శ్రీమాన్ మాదిరాజు రామకృష్ణ గారి ఆహ్వానం పై వేంచేసారు. వారి స్థలాన్ని స్వామివారికి ఇవ్వాలనే సంకల్పంతో ఉన్నారు. ఆ స్థలంలో ఒక మోడల్ రెసిడెన్షియల్ స్కూల్ నిర్మాణం చేద్దాం అని, ఆ విషయాన్ని పరిశీలించా ల్సిందిగా ఇ.రామారావు గారికి సూచించారు. సాయంకాలానికి జగ్గయ్యపేట చేరుకున్నారు.

వరంగల్ అవధాన కార్యక్రమంలో పాల్గొన్న విద్యార్థుల్లో ఇద్దరికి తిరుగు ప్రయాణంలో జరిగిన చిన్న ప్రమాదంలో స్వల్ప గాయాలయ్యాయి. వారిని ముందు పరామర్శించి, మిగతా విద్యార్థులందరిని, గురువు గార్లను పలుకరించి మంగళా శాసనములు కృప చేసారు.

19వతేది, ఉదయం శ్రీ స్వామివారు జగ్గయ్యపేట నుండి సీతానగరం ద్వారా నడిగడ్డపాలెం వెడుతూ తెనాలిలో శ్రీమతి బాలసరస్వతి గారి గృహాన్ని సందర్శించి వారి కుమారుడు, కోడలు చేసిన పాదపూజను స్వీకరించి రాత్రి ఒంటిగంటకు నడిగడ్డపాలెం చేరుకున్నారు.

**నడిగడ్డపాలెం :** శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెద్దజీయర్ స్వామివారు నడిగడ్డపాలెంను ముఖ్య కేంద్రంగా చేసికొని సత్సంప్రదాయ సౌరభా లను దేశవ్యాప్తంగా చాటినారు. ఈ వాసుదా సాశ్రమంలో శ్రీ సీతారామచంద్ర స్వామివారి సన్నిధి, శ్రీ లక్ష్మీనారాయణుల సన్నిధు లున్నాయి. ధ్వజస్తంభము శిథిలావస్థ చెంద డం వల్ల దాని స్థానంలో నూతన ధ్వజస్తంభా న్ని ప్రతిష్ఠించాలి అని పెద్ద జీయరు స్వామి వారి సంకల్పం. పూర్తికాలేదు. ఇంత కాలానికి శ్రీచిన్నజీయరు స్వామివారి ఆదేశంతో అది కార్యరూపం ధరించింది. ఎలాగైనా ఈ బ్రహ్మోత్సవాల్లో ప్రతిష్ఠ జరపాలి అనే దృఢ సంకల్పంతో శ్రీమాన్ **U.V.L** నరసింహా చార్యులు, శ్రీమాన్ బదరీనాథ్, శ్రీమాన్ కూర్మనాథా చార్యులు, తెనాలి వివేక్ సంస్థల నిర్వాహ కులు ప్రధాన పోషకులు శ్రీమాన్ రాంచంద్రమూర్తి, డా॥ సుబ్బారావు గారి నేతృత్వములో పునరుద్ధరణ కమిటీగ ఏర్పడ్డారు. ఆశ్రమా నికి ఒక నూతన వైభవాన్ని తీసుకువచ్చారు. ఆశ్రమ మండ పాన్ని విశాలం చేసారు.

భక్తుల ప్రేమ తాళ్ళతో నిముషంలో పైకిలేచిన ధ్వజస్తంభం

ప్రతిష్ఠానంతరం శ్రీసీతారామచంద్రులవారి సన్నిధిలో శాత్తుముఱై చేస్తున్న శ్రీస్వామివారు.

21వ తేదీన ప్రతిష్ఠకు సంబంధించిన రంగమంతా సిద్ధమయింది. మధ్యాహ్నాము పూర్ణాహుతి జరిపి శ్రీ స్వామివారి కరకమల ముల మీదుగా ధ్వజస్తంభ, గరుడ, దాసాంజ నేయస్వామి, ద్వారపాలకులు, ఆలయ శిఖరాల ప్రతిష్ఠా మహోత్సవం యథాక్రమం, శాస్త్రీయంగా జగ్గయ్యపేట పాంచరాత్రాగమ కళాశాల ప్రధానాచార్యులు శ్రీమాన్ **S.M** మధుసూదనాచార్యులు (చిన్నమధు)గారు కన్నులపండువగా జరిపించారు. ఇదే రోజు రాత్రి శ్రీ సీతారామచంద్రస్వామి బ్రహ్మోత్సవ ములు, లక్ష్మీతాయార్లకు సమష్ఠి లక్షమల్లె పుష్పార్చన, సహస్ర క్షీర కలశాభిషేక ప్రయుక్త శ్రీ లక్ష్మీనారాయణ యాగం ప్రారంభం చేసారు శ్రీ స్వామివారు.

23వ తేదీ : హైదారబాద్ -సీతారాంబాగ్ లోని జగన్నాథ్‌మందిర్‌కు చెందిన శ్రీమాన్ శ్రీనివాస రామానుజాచారిగారు మన స్వామి వారిద్వారా సన్న్యాస ఆశ్రమం స్వీకరించాలి అని చెన్నై ధనుర్మాస మహోత్సవ సందర్భంలో ప్రార్థించారు. మన పెద్దజీయరుస్వామివారి ఆశ్రమములో వారికి దీక్ష ఇవ్వాలని సంకల్పించి వారిని నడిగడ్డ పాలెమునకు రమ్మన్నారు శ్రీచిన్నజీయరుస్వామివారు. తిరుమల నుండి శ్రీమాన్ బాలాజీ పురోహితులు సన్న్యాస దీక్ష తీసుకొనుటకు కావలసిన పూర్వరంగమంతా జరిపించారు.

23వ తేదీన శ్రీ స్వామివారు ఉదయం వారిని తుంగభద్ర నదికి తీసుకువెళ్ళి ఆచ మనం చేయించి, విధి విధానముగా దీక్షా స్వీకారం చేయించారు. వారిని పెద్దజీయర్ స్వామివారి సన్నిధి (బృందావనం) కి తీసుకొని వచ్చి నిత్యారాధన అనంతరం **"శ్రీశ్రీశ్రీ త్రిదండి వ్రతధర నారాయణ రామానుజ జీయర్"** అను నామంతో వారిని అలంకరించారు. అనంతరం ప్రాథమికంగా పాటించవలసిన నియమాలను వివరించారు శ్రీ స్వామివారు.

**పాలపర్రు :** నడిగడ్డపాలెం నుండి 20వ తేది ఉదయం పాలపర్రు గ్రామానికి వేంచేసి శ్రీ స్వామివారు శ్రీవేంకటేశ్వరాలయంలో ఆళ్వారాచార్యాదుల ప్రతిష్ఠా కార్యక్రమాన్ని నిర్వహించారు. గౌతమ్ విద్యాసంస్థల అధినేత శ్రీమాన్ చౌదరిబాబు గారి నేతృత్వంలో ఈ కార్యక్రమం వైభవంగా జరిగింది. నడిగడ్డపాలెం వస్తూ గుంటూరు రామనామ క్షేత్రాన్ని సందర్శించారు. శ్రీమాన్ అచ్యుతరావు గారు, శ్రీమాన్ రాం పిచ్చయ్య గారు ఉభయదారులుగా ఉండి నమ్మాళ్వార్, రామానుజులు, ఆండాళ్ విగ్రహాలను ప్రతిష్ఠింపచేసిన సందర్భంగా స్వామివారు మంగళాశాసనం చేయడానికి విచ్చేసి సాయంకాలానికినడిగడ్డపాలెం చేరుకున్నారు.

**వినుకొండ :** శ్రీస్వామివారు 21వ తేదీ సాయంకాలం నడిగడ్డపాలెం నుండి బయల్దేరి రాత్రి 'వినుకొండ' చేరుకొని శ్రీస్వామివారి చరణ సంబంధులు శ్రీమాన్ భవనాసి ప్రసాద్, శ్రీమతి మల్లిక దంపతులు ముఖ్యముగా ఉండి భక్తబృంద సహకారము

26/DTP/Desktop/ DTPworks/bn/ Magazine/bnapr02.p65



తో సంప్రదాయ కార్యక్రమాలను జరుపుకొను టకు వీలుగా నిర్మించిన 'జీయర్ భవన్'ను ప్రారంభించారు. రాత్రి అందులోనే బస చేసారు.

22వ తేదీ ఉదయం వినుకొండ లో వేంచేసిఉన్న శ్రీవేంకటేశ్వరాలయమును సందర్శించి మంగళాశాసనం చేశారు. అనంతరం సామూహిక లక్ష్మీనారాయణ పూజ కార్యక్రమాన్ని నిర్వహించి మల్లికా - ప్రసాద్ దంపతులకు, భక్తగోష్ఠికందరికీ మంగళాశాసనాలు కృప చేసారు.

**మండూరు :** చాలాకాలం నుండి శ్రీమతి అడపా కామేశ్వరమ్మగారు తమ గ్రామానికి వేంచేయాలని అడుగుతుండడంతో స్వామి వారు వారి కోరికను మన్నించి మండూరు గ్రామంనికి వేంచేసి, వారి గృహాన్ని పావనం చేసి మంగళాశాసనములందించి మధ్యా హ్నాము 12 గంటలకు రేపల్లె చేరుకున్నారు.

**రేపల్లె :** 24వ, తేదీన జరిగే ప్రతిష్ఠా కార్యక్రమానికి ముందుజరిగే ప్రక్రియనంతా యజ్ఞాచార్య లుగా శ్రీమాన్ గుదిమెళ్ళ శ్రీమన్నారాయణాచార్యులు, బ్రహ్మగా శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యులు ఉండి కార్యక్రమాన్ని అత్యంత వైభవంగా జరిపిస్తున్నారు. శ్రీస్వామివారు ఆ వైభవాన్ని సందర్శించి మంగళాశాసనం కావించి అనుగ్రహభాషణం చేసారు. సాయంకాలానికి సీతానగరం చేరు కొని అనుష్ఠానాది కార్య క్రమాలు ముగించు కొని వడ్లపల్లి ప్రతిష్ఠా కార్యక్రమానికి బయల్దేరారు.

**ఏలూరు :** ఏలూరు పట్టణానికి శ్రీ స్వామి వారు చేరుకోగానే శ్రీమాన్ డా॥ పార్థసారథి గారు వచ్చి పశ్చిమగోదావరి జిల్లాలోకి స్వాగతం పలికి స్వామివారిని అనుసరించారు. రాత్రి 12 గంటలకు సి.హెచ్ పోతేపల్లి గ్రామం చేరు కొని శ్రీమతి కుసుమ దంపతుల గృహమును పావనం చేసి పాదపూజను స్వీకరించి ఒంటిగంటకు వడ్లపల్లి గ్రామానికి చేరుకుని శ్రీమతి విజయమ్మగారి గృహంలో బసచేసారు.

24వ,తేది ఉదయం శ్రీమతి విజయమ్మ గారి ప్రోత్సాహంతో గ్రామస్థులు నిర్మించు కొన్న శ్రీ సీతారామస్వామి ప్రతిష్ఠా మహోత్సవం శ్రీస్వామివారు నిర్వహించారు. అనంతరం ప॥గో॥ - కృష్ణా జిల్లా మధ్యలో ఉన్న"తడికలపూడి"గ్రామానికి సంబంధించిన శ్రీమతి రత్నకుమారిగారి ప్రార్థన మేరకు వారి కుమారుడు పోషిస్తున్న తోటను సందర్శించి, వారు ప్రేమతో చేసిన పాదపూజను స్వీకరించి జి.టి. ఎక్స్‌ప్రస్‌లో సోమశిలకు బయల్దేరారు.

**సోమశిల :** సోమశిల శ్రీ లక్ష్మీనృసింహస్వామి వారి బ్రహ్మోత్సవాల్లో స్వామివారు పాల్గొనాలని గత రెండు సంవత్సరాలనుండి అభ్యర్థిస్తు న్నారు. ఈ సారీ, కార్యక్రమాల ఒత్తిడి ఉన్నా కనీసం అంకురారోపణ కార్యక్రమంలో అయినా అన్వయించాలని సంకల్పించారు. 25వ, తేది ఉదయం 7గంటలకు శ్రీస్వామివారు నెల్లూరులోని శ్రీమాన్ లక్ష్మీనారాయణరెడ్డి గారు ఏర్పాటు చేసినవాహనంలో సోమశిలకు చేరుకున్నారు. శ్రీమాన్ రెడ్డిగారు నెల్లూరులో మాగుంట వారు నిర్మించిన శ్రీ వేంకటేశ్వర స్వామివారి కోవెలను పర్యవేక్షిస్తుంటారు. మన స్వామివారి నేతృత్వంలో ఉన్న పరమానందా

శ్రమంలోని వేద విద్యార్థులను, వరదన్ గురువుగారిని శ్రీస్వామివారు పలుకరించారు.

గతంలో పెన్నా వరదలలో పడిపోయిన ఆశ్రమ ప్రాకార పునర్నిర్మాణపు పనులను పరిశీలించారు. సాయంకాలం శ్రీలక్ష్మీ నృసింహస్వామి బ్రహ్మోత్సవాల్లో భాగంగా అంకురారోపణ కార్యక్రమం శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో జరిగింది. శ్రీరంగం, శ్రీపెరుంబుదూర్‌లో ఉన్న మన స్వామివారి మఠముల నిర్మాణంలో కీలకపాత్ర వహించిన శ్రీమాన్ శ్రీనివాసులు రెడ్డిగారి ఉభయంలో ఈ అంకురార్పణ జరగడం విశేషం. వీరికి, అర్చకస్వామి శ్రీమాన్ రామాచార్యులు & బృందము, వరదన్ గురువుగారు, విద్యార్థులు, భక్తులందరికి స్వామివారు మంగళాశాసనము కృపచేసారు.

**గాలిపాలెం :** 26 ఉదయం సోమశిలనుండి నెల్లూరు వెడుతూ గాలిపాలెం గ్రామంలో వెంకయ్య స్వామి ఆశ్రమాన్ని సందర్శించారు. వెంకయ్య స్వామి వారసులుగా ఉన్న స్వామీజీ అతికొద్ది కాలంలో బ్రహ్మాండమైనటువంటి భవన నిర్మాణములు చేసి నిత్యాన్నదానము చేస్తూ ఒక ఆధ్యాత్మిక యాత్రాస్థలంగా తీర్చిదిద్దారు. శ్రీస్వామివారు వారి కృషిని శ్లాఘిస్తూ అక్కడ చేరిన భక్తులందరికి అనుగ్రహ భాషణం కృపచేసి నెల్లూరుకు బయల్దేరారు.

**నెల్లూరు :** నెల్లూరులో శ్రీమతి అరుణారాజశేఖర్ గారి నేతృత్వంలో 1200 మంది విద్యార్థులతో నడుస్తున్న **"గోమతి స్కూల్"**ను సందర్శించి చిరంజీవులకు, అధ్యాపక బృందానికి స్ఫూర్తిదాయకమైన ప్రవచనాన్ననుగ్రహించి మంగళాశాసనములు కృపచేసారు. అనంతరం విద్యావాచస్పతి, గోపాలోపాయన పురస్కార గ్రహీత శ్రీ ఉ.వే. శ్రీమాన్ కిడాంబి రామానుజాచార్య స్వామివారి తిరుమాళిగ సందర్శించి, మంగళాశాసనం చేసారు. ఈ సందర్భంగా అక్కడ చేరిన గోష్ఠికి ప్రవచనాన్ని అనుగ్ర హించారు. రాత్రికి నడిగడ్డ పాలెం చేరుకొని గరుడోత్సవంలో అన్వయించారు.

27న, ఉ॥ ఆశ్రమంలో సమాశ్రయణ కార్యక్రమం నిర్వహించారు. మధ్యాహ్నము శాంతి కళ్యాణం స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో జరిగింది. సాయంకాలం అమ్మవారికి ఊంజల్‌సేవ, అనంతరం అశ్వవాహనంపై జరిగిన పెరుమాళ్ళ తిరువీధి ఉత్సవంలో పాల్గొన్నారు.

28వ తేదీ మహాపూర్ణాహుతి అనంతరం రాజ్యలక్ష్మీ అమ్మవారి తిరునక్షత్ర శుభ సందర్భంగా గోక్షీరంతో అమ్మవారికి జరిగే సహస్రకలశాభిషేకమహోత్సవంలో అన్వయించి అత్యంత వైభవంగా ప్రారంభించి హైదరాబాద్ బయల్దేరారు.

**హైదరాబాద్ :** 29వ, తేదీ ఉదయం శ్రీస్వామివారు టి.టి.డి. బోర్డు ఛేర్మన్ శ్రీమాన్ అర్జున్‌రావు **I.A.S.,** గారితో జెట్‌లో సమావేశమై 'గీతాజ్యోతి' కార్యక్రమాన్ని గూర్చి చర్చించారు.

సాయంకాలం ఏర్పేడు, వ్యాసాశ్రమ పీఠాధిపతులు శ్రీమాన్ పరిపూర్ణానంద స్వామీజీ, భాగ్యనగర ఆర్యవైశ్య సంఘ నేతృత్వంలో నిర్వహించిన 76వ, సనాతన వేదాన్త జ్ఞాన సభలలో ఏర్పాటు చేసిన



సర్వమత సమ్మేళన సభలో శ్రీస్వామివారు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు.

మతాలు వేరైనా మానవత్వం వికసించాలని, మమతానురాగాలను పెంచేది మతం కావాలని, అది పెరిగినపుడే పరులలో లోపాలను జాలితో సవరించగలిగి మంచిని ప్రోత్సహించగలిగే పక్వత సిద్ధిస్తుందని ప్రవచించారు. స్వీయ ఆధిపత్య కాంక్షతో పోరుసలిపే పరపీడా సంస్కృతి భారతీయులకు లేదని అందుకే భారతదేశం సర్వులకు వాసస్థానం కాగలిగిందని శ్రీవారు ప్రవచించారు. మత విశ్వాసం మనలో కర్తవ్య నిష్ఠను పెంచాలని అది దేశభక్తి సంవర్ధకం కావాలని దాని తర్వాత మాత్రమే అది దైవప్రీతి కరం అవుతూందని దేశ, ధర్మ, ప్రేమ కలిగించని మతాలు ప్రపంచానికి హానికరమని ప్రపంచ వికాస దిశా నిర్దేశం చేస్తూనే మన వికాసతరంగిణి స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ అనే నినాదం చేపట్టిందని, మాధవ సేవగా సకలప్రాణి సేవ జీవనాడి కావాలని శ్రీస్వామివారు తమ సందేశాన్ని అందించారు.

రాత్రి శ్రీస్వామివారు. శ్రీమాన్ వీరవసంతరావు దంపతుల గృహమును సందర్శించి పాదపూజ స్వీకరించారు.

30వ, తేదీ ఉదయం జెట్‌లో జరిగిన పత్రికా ప్రతినిధుల సమావేశంలో శ్రీస్వామివారు గీతాజ్యోతి కార్యక్రమాన్ని ప్రకటించారు. ఈ సమావేశంలో అన్ని ప్రాంతీయ, జాతీయ దినపత్రికలతోపాటు ఈ టీ.వి., పాపులర్, తేజ మొదలగు ఛానల్స్ వారు కూడ పాల్గొన్నారు.

తదుపరి శ్రీస్వామివారి పర్యవేక్షణలో బదరీ అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదాన సంఘపు సమావేశం జరిగింది. ఇందులో కుమారి ఉషశ్రీ, శ్రీమాన్ రమేష్ గుప్తాగారు, శ్రీమాన్ డా॥ టి. రామనాథంగారు, శ్రీమాన్ బి. జనార్ధన్‌గారు, శ్రీమాన్ రాంకిషన్ మలానిజీ, శ్రీమాన్ పి.బి. విశాల్ గుప్తగారు, శ్రీమాన్ బి. జనార్ధన్‌గారు, శ్రీమాన్ యమ్.ఆర్.కె. ప్రసాద్‌గారు, శ్రీమాన్ యస్. రామానుజం గారు, శ్రీమాన్ జి. వేణుగోపాలాచార్యులు గారు, శ్రీమతి కమలాదేవిగారు, శ్రీమతి బేబిగారు, శ్రీమతి శ్రీకుమారిగారు, శ్రీమాన్ రామేశ్వరరావు గారు, శ్రీమాన్ రంగనాథం గారు పాల్గొన్నారు.

మే 17వ, తేదీన జరిగే జ్యోతిర్దర్శన సమయానికి, మన అష్టాక్షరీక్షేత్రాన్ని ఆరంభించడానికి కుమారి ఉషశ్రీ బయల్దేరబోతున్న సందర్భంగా, ఈ సంవత్సరం అన్నదాన నిర్వహణ బాధ్యత స్వీకరించిన విజయనగరం వికాసతరంగిణి వారికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు కృప చేసారు. సభ్యులందరూ వారిని అభినందించారు.

ఈ ఏడాది అక్కడ జరుపవలసిన అభివృద్ధి కార్యక్రమాల్ని సమీక్షించారు. గత ఏడాది వాతావరణం అనుకూలించక పోవడంతో కొండలు విరిగి పోస్టల్ సౌకర్యం కొరవడ్డం వలన అన్నదాన కైంకర్యపరులందరికి ప్రసాదాలు ఒకే సారి పంపించడం జరిగింది. అయితే పూజలు మాత్రం వారిపేర కోరిన తేదీల్లోనే జరిపించారు. ప్రసాదాల్లో పటిక బెల్లం చేర్చుతూ ఉండడం వల్ల వాతావరణ ప్రభావం వల్ల అది కరిగిపోయి కవర్లు

భక్తులకు సవ్యంగా చేరటంలేదు. ఈ విషయాన్ని పరిశీలన చేసి 1) ఈ ఏడాది ప్రసాదం కవర్లని ఆయా పూజా దినాల్లోనే పంపించే ప్రయత్నం చేయాలని, 2) ప్రసాదంలో తులసి, చందనం, కుంకుమలను (పటికబెల్లం లేకుండా) మాత్రమే పంపాలని నిర్ణయించడం జరిగింది. బదరీ అన్నదాన దాతలు ఈ విషయాన్ని స్వీకరించి ప్రసాదాన్ని బంధువులందరికి అందిస్తారని బదరీ అష్టాక్షరీ క్షేత్రీయ అన్నదాన శాఖా సంఘంవారు విజ్ఞాపన చేసారు.

అనంతరం శ్రీస్వామివారు టి.టి.డి. మాజీ డి.పి.పి. కార్యదర్శి సముద్రాల లక్ష్మణయ్య గారితో, వర్తమాన డి.పి.పి. కార్యదర్శి శ్రీమాన్ బ్రహ్మానందం గారితో, ఎండోవెంట్స్ కమిషనర్ శ్రీమాన్ అజయ్ కలామ్‌గారితో విడివిడిగా గీతాజ్యోతి కార్యక్రమాన్ని గూర్చి చర్చలు జరిపారు.

సాయంకాలం నడిగడ్డపాలెంలో ఈ మధ్యే మన స్వామివారిద్వారా సన్న్యాసాశ్రమ స్వీకారం చేసిన శ్రీశ్రీశ్రీ వ్రతధర రామానుజ జీయర్ స్వామివారిని సీతారాంబాగ్‌లో సందర్శించి శ్రీవారు మంగళాశాసనం చేసారు.

తదుపరి వైకుంఠ వాసులైన శ్రీమాన్ కాండూరి సుదర్శనాచార్యులవారి తిరు మాళిగలోవారి పరివారాన్ని పరామర్శించారు.

అనంతరం భక్తశిఖామణి, రైస్‌మిల్లర్ శ్రీమాన్ నరేంద్రగారు, కొత్తపేట్‌లో నిర్మించిన నూతన గృహాన్ని శ్రీస్వామివారు మంగళాశాసనం చేసారు. తమ సేవలను ఇతోధికంగా వినియోగించుకోవాలని శ్రీస్వామివారిని ప్రార్థించారు. అటునుండి వనస్థలిపురంలో శ్రీమాన్ నక్కాయాదగిరిగారి భవనాన్ని సందర్శించారు. ఈ సందర్భంగా వారు బదరికాశ్రమమంలోని మన అష్టాక్షరీ క్షేత్రంలో ఒక గది నిర్మాణ నిమిత్తం లక్షరూపాయలను రెండవ విడతగా సమర్పించి శ్రీవారి విశేష మంగళాశాసనము లందుకున్నారు.

రాత్రి అమెరికాలోని తెలుగు భక్తుల కోరికపై ప్రతి నెలలో చివరి శనివారం శ్రీస్వామివారు తెలుగులో ప్రవచనగోష్ఠిని ప్రారంభం చేసారు (రాత్రి 9-30 నుండి ఒక గంటసేపు). ప్రతి నెలలో చివరి ఆదివారం శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్యులు గారు కూడా అమెరికాలోని తెలుగు భక్తులకు తమ ప్రవచనాన్ని ఈ మధ్యే ప్రారంభించారు.

రాత్రి 12-30కు జెట్ ప్రక్కనే ఉన్న శ్రీమతి వజ్రమ్మ అనే భక్తురాలి ప్రార్థనపై శ్రీస్వామివారు వారి గృహాన్ని సందర్శించి మంగళాశాసనం చేసారు. 10 సం॥లుగా స్వామివారి రాకకై నిరీక్షిస్తుండగా ఈ రోజువారిరాక వట్టలేని ఆనందాన్నిస్తోందని శ్రీమతి వజ్రమ్మగారు ఆనందబాష్పాలు రాల్చారు. అప్పటికే 12-30 ని॥లు అవుతున్నా ఆ ప్రాంతంలో ఉండే భక్తులు వంద సంఖ్యలో శ్రీవారికి హార్దిక స్వాగతాన్ని పలికి తమ ఉత్సాహాన్ని చాటుకుని స్వామివారి దివ్యఅనుగ్రహాన్ని పొందారు.

31వ, తేది ఉదయం తీర్థగోష్ఠి సమయంలో శాంతా బయోటెక్, M.D., శ్రీమాన్ వరప్రసాద రెడ్డి ప్రార్థనపై శ్రీవారు, పెరుమాళ్ళ సన్నిధిలో క్యాన్సర్ వ్యాధి నిరోధించుటకు కొత్తగా కనిపెట్టిన ఇంటర్ - ఫెరాన్ మందుతో ఉండే శాన్ ఫెరాన్ అనే ఇంజక్షన్‌ను ఆవిష్కరించారు. దాని రూపకల్పనలో భాగస్వాములైన వైజ్ఞానిక బృందాన్నంతటిని శ్రీవారు మంగళాశాసనం చేసారు. ఈ సందర్భంగా స్వామిజీ మాట్లాడుతూ అంతర్జాతీయ ప్రమాణాలకి ధీటుగా స్వదేశీ పరిజ్ఞానంతో శాంతా బయోటెక్ వంటి సంస్థలు ఎన్నో ప్రాణరక్షణ ఓషధులు





తయారు చేస్తున్నాయని, ప్రభుత్వాన్నుంచి ప్రోత్సాహం లేకున్నా, అంతర్జాతీయ సంస్థల నుండి బెదిరింపులున్నా, పరిశోధన ఆర్థిక పరిమితులకు మించినదైనా, మన వైజ్ఞానికుల యొక్క కృషి అమోఘమైనది కనుక బయట మార్కెట్‌లో రూ. 1800/- విలువ చేసే ఇదే ముందుని రూ. 350/- స్థాయికి తగ్గించి, సామాన్యులకు కూడా అందగలిగేటట్లుగా వీరు తయారు చేసారని, ఇటువంటి వీరి కృషి భగవదనుగ్రహంతో సాగాలని శ్రీవారు మంగళాశాసనం చేసారు.

## హోమియో ఉచిత వైద్యశిబిరాలు

**మల్లిఖార్జున పేట** : విజయవాడ బీసెంట్ రోడ్డులో కృష్ణ కాఫీహౌస్ ప్రారంభోత్సవ సందర్భముగ శ్రీస్వామివారి మంగళాశాసనములతో, 5-3-2002 ఉదయం 9గంటల నుండి రాత్రి 8 గంటల వరకు మల్లిఖార్జునపేట వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో ఉచితహోమియోవతి వైద్యశిక్షణ శిబిరం నిర్వహించారు.. ఈ శిబిరంలో 196 మందికి శ్రీమాన్ డా॥ ఓ.వి.డి. ప్రసాద్‌గారు రోగనిర్ధారణ చేసి ఉచిత మందులు పంపిణీ చేసారు. శ్రీవారు డా॥ ప్రసాద్‌గారికి,కార్యకర్తలకు శ్రీవారు మంగళాశాసనములు చేసారు.ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి అధ్యక్షులు లంకలపల్లి షణ్ముఖరావుగారు, వి. భాస్కరరావుగారు, యల్. గోవిందరావు గారు, నారాయణ రావుగారు పాల్గొన్నారు.

**సికింద్రాబాద్** : సికింద్రాబాద్ వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో శ్రీస్వామివారి దివ్య ఆశీస్సులతో ఉచితమెగా వైద్యశిబిరం J.S.హస్పటల్‌నందు నిర్వహించబడినది. మార్చి3 ఆదివారం ఉదయం 7గం॥ నుండి మధ్యాహ్నం 2-00ల వరకు ఈ కార్యక్రమం నిర్వహించారు. పేషెంట్స్‌కు దంత, కంటి పరీక్షలు ఉచితంగ చేసారు. ఈ శిబిరంలో శ్రీమాన్ డా॥ యమ్. హనుమంతరావు, డా॥ జి. సతీష్‌కుమార్, డా॥ యమ్. జయంత్, శ్రీమతి డా॥ శోభాజయంత్, డా॥ యమ్. సుధీర్, డా॥ సురేష్, డా॥ ఖాజిమ్, డా॥ రంగారెడ్డిగారు తదితరులు పాల్గొన్నారు.

**సంతోష్ నగర్** : సంతోష్ నగర్ వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో శ్రీవారి మంగళాశాసనములతో చంపాపేట యందు గల వడ్డెరబస్తీ యందు ఉచిత వైద్యశిబిరం ప్రారంభించబడినది. ఈ కార్యక్రమమునకు డా॥ సి. జగపాల్ గారు వారానికి 3 రోజులు వైద్యసేవలు అందించుచున్నారు. ఈ కార్యక్రమంలో సంతోష్‌నగర్ వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమతి అహల్యాదేవిగారు తమ బృందంతో పాల్గొన్నారు.

మన శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరుస్వామివారు అమృతహస్తాల మీదుగ ప్రతిష్ఠజరుపుకున్న శ్రీరామనస్థాపం దగ్గర అష్టమ నవాహ్నిక శ్రీరామా యణ క్రతువు తేది : 9-3-2002 నుండి 17-3-2002 వరకు శ్రీమాన్ రామకృష్ణ అయ్యంగార్‌చే విశాఖ జిల్లా నక్కపల్లి ఉప్మాక గ్రామంలో శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయంలో నిర్వహింపబడింది. శ్రీమాన్ పీతాంబర రఘునాథ్, శ్రీమాన్ ఇరగవరపు రామానుజాచార్యులుగారు ఈ కార్యక్రమాన్ని పర్యవేక్షించగ స్థానికులు శ్రీమాన్ రమణ మాష్టారుగారు, ఆలయ అర్చకులు కూర్మాచార్యులుగారు, **E.O.** నాగేశ్వరరావుగారు, పెరియకృష్ణమా చార్యులుగారు రిటైర్డ్ టీచర్ అప్పల నర్సమ్మగారు కార్యక్రమ వైభవానికి దోహదపడ్డారు.

శ్రీమాన్ పీతాంబరం రఘునాథ్‌చే వేంపాడు వికాసతరంగిణి వార్షికోత్సవం మార్చి 2, 3, 4 తేదీలలో వైభవంగా నిర్వహించబడింది.

**జై శ్రీమన్నారాయణ!**

## ఈ సంచికలో .....



### ముఖచిత్ర పరిచయం

1. తిరుమల ఆస్థాన మంటపంలో జ్యోతి ప్రజ్వలనం శ్రీవారిచే.
2. తిరుమలలో గీతాజ్యోతి రథావిష్కరణ.
3. (మండపేట) శ్రీమాన్ పాపారాయుడుగారి ద్వారా సిద్ధం కావింపబడిన గీతాజ్యోతి మినీరథం.
4. తూ.గో. జిల్లా, అప్పన్నపల్లిలో గీతాజ్యోతి రథయాత్ర.
5. తిరుమల ఆస్థాన మండపంలో గీతాజ్యోతి ఆవిష్కరణ సభ.
6. విజయవాడలో గీతాజ్యోతి సమావేశం.

## పంచాంగ వివరాలు

### మే

- 8 సర్వేషామేకాదశి
- 10 చతుర్దశి తిథి
- 11 కృత్తిక కార్తె ఉ. 6-14, శూన్యతిథి
- 12 అమావాస్య తిథి
- 14 వృషభ సం॥ తె.4-55
- 15 సింహాచలం శ్రీలక్ష్మీనరసింహస్వామి వారి చందనోత్సవం,అక్షయ తృతీయ
- 17 శంకర జయంతి, తిథిద్వయం
- 18 సప్తమితిథి
- 22 స్మార్త ఏకాదశి
- 23 శ్రీవైష్ణవ ఏకాదశి
- 24 పెరియ తిరుమలైనంబి తిరునక్షత్రం
- 25 రోహిణికార్తె ప. 3-14 నమ్మాళ్వార్ తిరునక్షత్రం శ్రీనృసింహ జయంతి సింహాచలం, యాదగిర్యాది క్షేత్రములలో జయంత్యుత్సవం
- 26 శ్రీపరాశర భట్టర్ తిరునక్షత్రం
- 28 వాస్తుకర్తరీ త్యాగం

### జూన్

- 5 హనుమజ్జయంతి
- 6 సర్వేషామేకాదశి
- 8 మృగశిర కా. ప. 2-41, శనిత్రయోదశి

మీ సేవలో....


**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 72929

చందా: సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-, విదేశాలకు సంవత్సరచందా $ 25

E-mail : bhakthinivedana@yahoo.co.in Internet : www.chinnajeeyar.org

D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం,





సంపుటి 55 సంచిక 2

2002 మే


శ్రీమతే రామానుజాయ నమః



చిత్రభాను నామ సంవత్సరం వైశాఖమాసము

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక


సంపాదకులు:శ్రీ ఉ.వే. శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు


*Founder*

**H. H. SRI SRI SRI TRIDANDI SRIMANNARAYANA RAMANUJA JEEYAR SWAMI VARU**



# భగవద్గీత - 13



(శ్రీవారి ప్రవచనం నుండి - 1వ అధ్యాయం)

ధృతరాష్ట్రునికి ధుర్యోధనుడు తన మాట వినేలా చేసుకునేంత శక్తి ఉందనే విషయం ధుర్యోధన మరణం తర్వాత తెలుస్తుంది. ధృతరాష్ట్రుడు పండు ముసలి. ఇక ఈవేళో, రేపో అన్నట్లుగా కాటికి కానుకుని ఉన్నటువంటి వయస్సు అతనిది. ఆ వయస్సులో కూడ ఎదుటివాడికి ఏదో చెయ్యాలనుకునేటువంటి ప్రతీకార జ్వాల అతని లోపల ఎలా ప్రజ్వరిల్లుతుందో గమనిస్తే ఆశ్చర్యం వేస్తుంది.

భీముని చూచి ''ఆహా! భీమా! ఎంత గొప్పపని చేసావయ్యా! చివరకు ధర్మమే జయించింది. నిన్ను చూస్తుంటే నాకు చాలా ఆనందంగా ఉంది. రా! నాయనా! ఒకసారి కాగలించుకుంటాను'' అని భీముడిని దగ్గరకు పిలిచాడట ధృతరాష్ట్రుడు. పాపం వెఱ్ఱి భీముడు! తన పినతండ్రి చూపిస్తున్న ప్రేమ నిజమేననుకొని దగ్గరకు వెళ్ళబోతుంటే ఆపి, శ్రీకృష్ణుడు ఒక ఉక్కు భీముడిని చేసి పంపాడట. ధృతరాష్ట్రుడు ఆ వయస్సులో తన దగ్గరకు చేరినవానిని కాగలించుకొంటే అది కాస్తా పిండి పిండి అయిపోయిందంటే అతని బలం ఎంతటిదో తెలుస్తుంది.

శారీరకంగా మంచి బలం ఉంది. కానీ ఏమి లాభం? మనోనేత్రం బొత్తిగా లేకుండా పోయింది. ఆ వయస్సుకు కూడ విచ్చు కోలేదు. అర్థాత్ ధృతరాష్ట్రుడు సర్వాత్మనా అంధుడు. అతను సంజయుడిని చూచి ఒక ప్రశ్న వేసాడు. అదే భగవద్గీతా ఉపదేశానికి ప్రారంభ శ్లోకం.

ధృతరాష్ట్ర ఉవాచ :

**ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతాః యుయుత్సవః।**
**మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ?॥**

**హే సంజయ!** - సంజయుడా!, ధర్మక్షేత్రే -ధర్మాచరణప్రధానమైన, **కురుక్షేత్రే**- కురుక్షేత్ర మునందు, **యుయుత్సవః** - యుద్ధము చేయ గోరి, **సమవేతాః** - చేరియున్న, **మామకాః** - నావారు, **పాండవాః**- పాండవులున్నూ, **కిం** - ఏమి, **అకుర్వత** - చేసిరి.

పై శ్లోకంలోని ప్రతి పదంలోనూ ధుర్యోధనుడి యందు ఉండే ప్రేమ చేత ధృతరాష్ట్రుడిలో ఉన్న కుత్సిత బుద్ధి ప్రకటితమౌతుంది. క్షేత్ర స్వభావాన్ని బట్టి పాండవులు యుద్ధం చేయకూడదు. వారికి ఉండే బుద్ధిని బట్టి కూడ వాళ్ళు యుద్ధం చేయకూడదు.'సంజయా! పాండవులు అలాగే యుద్ధము చేయమూ అని అన్నారా? లేదా?'. ఇది సందేహం అతనికి. కౌరవులదే అయిన ప్పటికీ కూడ ధార్మికమైన బుద్ధిని ప్రేరేపించే చోటు ఆ చోటు.

ఏమిటి ధార్మికబుద్ధిని ప్రేరేపించడ మంటే? మనిషిలో ఏ రకమైన మానసిక స్థితి ఉంటుందో ఆ స్థితిని ఆ ప్రాంతానికి వెళ్ళితే మరింత పెంచుతుందన్న మాట! ఒకనిలో మంచి రౌద్రం ఉంటే రౌద్రాన్ని పెంచు తుంది. ఒకనిలో మంచి ప్రేమ ఉంటే ప్రేమనుపెంచుతుంది. ఒకనిలో మంచి ధర్మం ఉంటే ధర్మాన్ని పెంచుతుంది. ఆ విధంగా ఎవరిలో ఏ భావముంటే ఆ భావాన్ని పెంచేటటువంటి క్షేత్రం ఆ క్షేత్రం. అయితే ఇక్కడ ఎవరిలో ఏ భావాలు ఉన్నాయి? ఇవి తెలుసుకోవాలి. వారిలో ఆయా ఆయా





భావాలు వారిలో పైకి వచ్చిన గుణాలను తెలుపుతాయి.

లోకంలో కొందరు సత్త్వం పైకిఉండాలని కోరు కుంటారు. వారికి ప్రతీక అర్జునుడు. రజో గుణం పైకిఉండాలని కోరుకుంటారు మరి కొందరు. దానికి ప్రతీక దుర్యోధనుడు. తమోగుణం పైకిఉండాలని కోరుకుంటారు ఇంకొందరు. వారికి ప్రతీక ధృతరాష్ట్రుడు.

సత్త్వగుణం పైకి ఉన్నపుడు మాత్రమే మనిషి బాగుపడతాడు కనుక, బాగుపడటం అనేది దైవాన్ని స్మరించినపుడే కనుక, దైవం ద్వారా లోకాన్ని చూచినపుడే మనిషి బాగుపడ తాడు అని మనకు చెప్పటం కోసమనే భగవద్గీత మొదటి అధ్యాయంలో ఈ ముగ్గురికి కూడా మూడురకాల ఉపదేశాలు, వాటి వాటి క్రమం మనకు ఉపదేశించబడింది జగదాచార్యుడైన శ్రీకృష్ణ పరమాత్మ ద్వారా.

అందులో మొట్టమొదటి శ్లోకంలో ధృతరాష్ట్రుడు పరిచయమౌతాడు. కారణం మానవజీవితం అక్కడనుండి ప్రారంభం అవుతుంది. చీకట్లోంచి ప్రారంభం అవుతుంది. వెలుతురులోకి వస్తాడు. అన్నీ నాక్కావాలి అనిపిస్తుంది. తరువాత తాను సమాజానికి అంకితం కావాలి అనే భావమేర్ప డుతుంది. 'అన్నీ నాకే!' అనిపించేది రజో గుణం వలన. అసలు ఏదీ కూడ తెలియక పోవడం తమోగుణం. ఏదీ కూడ తెలియక పోవడం చీకట్లో ఉండేవాడికి సంభవించేది. ఆ చీకటిలోనే బ్రతికినవాడు ధృతరాష్ట్రుడు. దానికి ప్రతీకే అతనికి పైనేత్రాలు, లోపలినేత్రాలు లేకపోవడం. సర్వాత్మనా అంధత్వం. అది అతను సంజయుడిని అడిగిన ప్రశ్నలోనే తెలుస్తుంది.

నిజానికి సంజయుడు ధృతరాష్ట్రునికి సహపాఠి. ఇద్దరూ కలిసే చదువుకున్నారు. గురువుగారి దగ్గర. కానీ సంజయుడు చెప్పే వాడు అయ్యాడు. ధృతరాష్ట్రుడు వినేవాడు అయ్యాడు. కారణం సంజయుడే చెప్పుకు న్నాడు ధృతరాష్ట్రుని ప్రశ్నకు. 'సంజయా! మని ద్దరం ఒకరి దగ్గరే చదువుకున్నప్పటికీ నీకు కలిగే జ్ఞానం నాకెందుకు కలగటం లేదు?'' అని అడిగితే. దానికి సంజయుడు సమా ధానం చెపుతూ నీలాగే నేను కూడా ధార్మికకా ర్యాలు చేస్తాను గానీ పదిమందీ చూడడం కోసం చేయను. నేను కూడ నీలాగే మాట్లాడ తాను గానీ మనస్సులో ఒకటి పైకి ఒకటి మాట్లాడను.

**'మాయాం నసేవే భద్రంతే న వృథా ధర్మమాచరే'** - నేను ఎపుడూ మాయను ఆశ్రయించి ఉండను. వృధా ధర్మాన్ని ఆచరించను. యోగ్యమైన ధర్మాన్నే చేస్తాను. అంతేకాదు. **'శుద్ధభావం గతః భక్త్యా శాస్త్రాత్ వేద్మి జనార్దనమ్'**. మనస్సులో నేను ఎపుడూ మంచినే ఆలోచిస్తాను. శాస్త్రాన్ని విశ్వసిస్తాను. భగవంతున్ని నమ్ముతాను. ఇవి ఒకదాని వలన ఒకటి వస్తాయి.

నేను ఎపుడూ కపటం లేనివాడిని కనుకనే చేసే పనులు మంచివి చేస్తున్నాను. మంచి పనులు చేస్తాను కనుకనే నా భావం పరిశుద్ధ మైనది. భావం పరిశుద్ధమైనది కనుక శాస్త్రాన్ని నమ్మగలిగాను. శాస్త్రాన్ని నమ్మాను కనుకనే దైవాన్ని తెలుసుకోగలిగాను. ఆ దైవాన్ని లోకమంతా చూడగలుగుతాను కనుక లోకంలో జరిగేటటువంటివన్నీ వాస్తవంగా నాకు తెలియగలుగుతున్నాయి. ఇందులో మొట్టమొదటిదైన కపటమే లేకుండా ఉండటం అనేది నీకు లేదు కనుక నీకు మిగతావి వచ్చే అవకాశం లేదు. అని ధృతరాష్ట్రుడికి ఉపదేశం చేసాడు సంజయుడు.

అలాంటి సంజయుడ్ని ధృతరాష్ట్రుడు అడిగిన ప్రశ్న ఎంత అసంబద్ధమైందో క్రమంగా తెలుసుకొనే ప్రయత్నం చేద్దాం!



# గీతాజ్యోతి ఆవిష్కరణ



**ఏప్రిల్ 12న తిరుమల ఆస్థానమండపంలో జరిగిన గీతాజ్యోతి ఆవిష్కరణ సందర్భంగా...**

**ప్రియ భగవద్బంధువులారా!**

వృషనామ సంవత్సరానికి ఈ రోజు చివరిరోజు. మనం ఆ సంవత్సరానికి ఈ వేళ నుంచి వీడ్కోలు పలుకుతాం. రేపటినుంచి కొత్త సంవత్సరానికి సాగ్వతం పలుకుతాం. '**చిత్రభాను**' అనే పేరుతో కాలపురుషుడు మనకి రేపు సాక్షాత్కరించబోతున్నాడు. ఇది ఒక సంధికాలం. యుగాది లేక ఉగాది అంటాం రేపటిదినాన్ని..

రేపే ఎందుకు ఉగాది అయ్యింది అంటే దానికో చిన్న కారణం ఉంది. ఈ భూమి మీద మొట్టమొదట ఆవిర్భవించిన భగవత్ స్వరూపం శ్రీరంగనాథుడు. ఆయన అవతరించిన దినము నుండి రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు ఏర్పడ్డాయి అని మనకు పురాణాలు చెపుతున్నాయి.

సృష్టి చేద్దామని పరమాత్మ తన నాభిలోంచి బ్రహ్మను సృజిస్తే, సృష్టికార్యం చేసే రుచిలేక నేను నిన్ను సేవించుకుంటూ ఉంటానన్న బ్రహ్మకు తన రూపును అందించి ఈ రూపంలో నేను నీతో ఉంటాను అని బ్రహ్మకు తాను అందితే, బ్రహ్మ ఆ మూర్తిని ఆరాధించుకుంటూ సృష్టిని ప్రారంభించాడు. యుగం ఆరంభమైంది.

అలా వచ్చిన మూర్తియే క్రమంగా ఇక్ష్వాకు చక్రవర్తికి, ఇక్ష్వాకువు ద్వారా శ్రీరామునకు సంక్రమించి, అతని నుండి రావణ సంహరణానంతరం విభీషణునికి అందాడని **"లబ్ధ్వా కులధనం రాజా లంకాం ప్రయాత్ విభీషణః"** అని వాల్మీకి రామాయణంలో చెప్పాడు.

ఆ రాముడి ఇలవేల్పును రక్తసిక్తమైన లంకలో పెట్టడం ఇష్టం లేక పరమపవిత్రమై రెండువైపులా ప్రవహించే కావేరీని గుర్తించి విభీషణుడు ఆ మధ్య స్థాపిస్తే, లంక వైపు తిరిగి దర్శనమిస్తున్నాడని మనకు చరిత్ర చెపుతుంది. అదే శ్రీరంగక్షేత్రం.

ఆ శ్రీరంగనాథుడు లోకానికి మొదట సాక్షాత్కరించిన రోజు ఈ రోజు. ఆ రంగనాథుడి పుట్టినరోజు. అంటే ఫాల్గుణ మాసంలో వచ్చే చివరినక్షత్రం రేవతీనక్షత్రం రోజు స్వామి అవతరించాడు అని మనకు చరిత్ర చెపుతోంది.

అయితే ఆ రంగనాథుడు మొదటి అర్చామూర్తి అయితే ఈ కలియుగానికి ఆరాధ్యదైవంగా ఏర్పడ్డ అర్చామూర్తి మన శ్రీనివాసుడు. ఈ శ్రీనివాసుడి దగ్గర ఆ రంగనాథుడు కొంతకాలము వేంచేసి ఉన్నాడనేది చరిత్ర చెప్పిన వాస్తవం. మనం ఆలయంలో ప్రవేశించగానే ముందర సేవించేది రంగనాథుడిని. ఆ తర్వాత లోపలికి వెళ్ళి స్వామిని సేవిస్తాం. స్వామి శ్రీరంగడు కొంత కాలం ఇక్కడ వేంచేసిఉన్నాడు.

ఆ మొదటి అంశ లోకాలను ఏలేటటు వంటి ఈ శ్రీనివాసుని యొక్క సాక్షాత్ రూపం అని మనం భావించవచ్చు.

యుగయుగాలలో స్వామి అనేకరూపాలు ధరించాడని పురాణాలు మనకు చెపుతున్నాయి. ఈ లోకంలో మంచివారికి తోడ్పడటానికి, వారికి ఆటంకంగా పరిణమించిన





ఆసురీ ప్రవృత్తులను పెకలించిపార వేయడానికే భగవంతుడు వస్తాడనేది వేదాలు చెబుతున్నాయి. వేద సారమైన గీత చెబుతోంది.

మంచివారిని కాపాటడం కోనమే వస్తాడు. ఎలాగూ వస్తాడు కనుక వారికి ఆటంకంగా ఉండే చెడును తొలిగిస్తానని భగవద్గీతలో **'వినాశాయ చ దుష్కృతాం'** అని చెబుతాడు. ధర్మసంస్థాపనం కోసం ఎన్నెన్నో అవతారాలు ఎత్తాడు స్వామి.

త్రేతాయుగంలో, మనం ఎలా బ్రతకాలో నేర్పిన శ్రీరాముడు అయ్యాడు. శ్రీరాముడు ఆచరణలో ప్రథముడు. ఆయన 11 వేల సం॥లు ఆచరించి దానిని భగవద్గీతగ రికార్డుచేసి ఈ జాతికి అందించాడు శ్రీకృష్ణావతారంలో.

ఆ శ్రీకృష్ణుడు తాను మూతికి రాసుకున్న వెన్న ఇంకా ఆరకముందే ఈ ఏడుకొండలపై నిలచేడనేది భక్తులు, ఆళ్వార్లు, మహానుభావులైన పెద్దలు దర్శించిన స్వరూపం.

నిజానికి మానవజాతి ఎలా బాగుపడాలి అనేది వేదాలుచెప్పాయి. పురాణాలు చెప్పాయి, ఇతిహాసాలు చెప్పాయి. కానీ ఆ వాఙ్మయం అంతా మనం చదవలేము కనుక శ్రీకృష్ణుడు ఆ వాఙ్మయమంతటినీ మధించి,అందులో ఉండే సారాన్ని భగవద్గీతగా ఇచ్చాడు. అందుచేత భగవద్గీత సకలశాస్త్రసారము అనేది పెద్దల యొక్క అభిప్రాయము. అంచేత భగవద్గీత సమగ్రంగా తెలిస్తే అంతా తెలిసినట్లే.

ఆ భగవద్గీతనాధారము చేసుకునే ఒక చిన్న వస్త్రాన్ని ధరించిన ఒక వ్యక్తి, గాంధీజీ మహానుభావుడు కాగలిగాడు. ఆయుధం పట్టకుండా రవి అస్తమించని సామ్రాజ్యాన్ని అస్తమింపచేయగలిగాడు ఈ భారత భూభాగం నుంచి. ఇది మనకి నవీన చరిత్ర చెపుతున్న వాస్తవం.

ఈవేళ ఈ కొత్త సంవత్సరంలో అడుగు పెట్టిన శుభసందర్భంలో మనం చెయ్యాల్సినది గతంలో జరిగిన అనుభవాలను ఒకసారి స్మరించుకొని, భావిని రచించుకోవడం. కొత్త తరగతిలోకి వెళ్ళినప్పుడు గతంలో నేను చదివింది ఏమిటి? ఇపుడు చదవాల్సినది ఏమిటని అని ఒక ప్లాన్ వేసుకున్నట్టే కొత్త సం॥లోకి అడుగుపెడితే ఏమిటి మనం చేయాలి అని ప్లాన్ వేసుకోవాలి?

**2001 సంవత్సరం, లేదా ఈ వృషనామ సంవత్సరం మన దేశానికే కాక ప్రపంచానికీ పాఠాలు నేర్పింది. ఇది అందరకూ తెలిసిన అంశం.**

కేవలం ఒక మనిషి 16,20 మందిని ఒక టీమ్‌గా పెట్టుకొని ప్రపంచాన్ని గడగడలాడించినది సంవత్సరం. ఈ వృషనామ సంవత్సరం. ఆడించి వదిలేయలేదు. ఇప్పటికీ ఆడిస్తూనే ఉన్నారు. ప్రపంచం అంతా ఆత్మావలోకనం చేసుకోవాల్సిన అవసరం ఏర్పరచిన సంవత్సరం ఈ 2001, వృష నామ సంవత్సరం.

ఇది వరకు చాలా సంవత్సరాలు గడిచిఉంటాయి. అయితే మనం ఆ సమయంలో ఎలాఉన్నామో, ఎక్కడ ఉన్నామో తెలియదు గదా! కానీ, ఇపుడు జరిగే ఈ 'వృష', క్రొత్త సహస్రాబ్దిలోకి మనల్నితీసుకురావడంతోపాటు ఒక సహస్రాబ్దికి తానుప్రతీకగా నిలిచి ''ఇంత వరకు మనం ప్రగతి సాధించాం వైజ్ఞానికంగా, సాంస్కృతికంగా, సాంఘికంగా, సామాజికంగా, ఎన్నోరకాలుగా ఆధిపత్యాన్ని చలాయించ గలుగుతున్నాం ''అనే ఈ మనుష్యులకి, ఖబడ్దార్ అని ఒక వార్నింగ్ ఇచ్చినటువంటి సంవత్సరము.

దాన్ని దృష్టిలో పెట్టుకొని మనం రాబోయే భవిష్యత్‌ని రచించుకోవలసిన

సమయం ఇది. అది గుర్తించిన ఈ దేశానికి చెందిన ఒక పౌరుడిగా, ధర్మాన్ని అవలంభించే ఒకవ్యక్తిగా, భగవంతుడిని నమ్మిన ఒక భక్తుడిగా, తోటివారికి మనకి తెలిసింది అందించాలి అని మనస్సున్న ఒక మనిషిగా ప్రారంభించినదే ఒక కార్యక్రమం. అదే గీతాజ్యోతి.

లక్షల సంవత్సరాలుగ మానవజాతి ఎదుర్కొననటువంటి ఉప ద్రవాన్ని విజ్ఞానం పెంచుకుంటున్న మనం 500సం॥లో కలిగించగలిగాం. మానవ జాతి ఉన్న అన్ని లక్షల సంవత్సరాల నుంచి  ఓజోన్ పొర కరగలేదు, కానీ, మనం కని పెట్టిన విజ్ఞాన ప్రభావంచేత మనం వదిలి పెట్టే చెడు గాలులచేత, వ్యర్థ పదార్థాల ప్రభావంచేత ఓజోన్‌కు ఆస్ట్రేలియా ఖండమంతట కన్నం ఏర్పరచ గలిగాం. అంటే మానవజాతి నాశనానికి అంత పెద్ద, అంతలావు పునాది మనం వేయగలిగాం.

జంతువులులో కొన్ని ఒంటరిగా నివశిస్తూఉంటాయి. కొన్ని సంఘాలుగా జీవిస్తాయి. కుక్కలాంటివి సంఘాలుగా తిరగవు. ఒకదానిని చూచి ఒకటి కరచు కుంటాయి. పోట్లాడుకుంటాయి. కానీ, కాకులు లాంటివి, లేళ్ళలాంటివి కలిసి తిరుగుతాయి. మానవసమాజం అందరూ కలిసే, అందరూ అంటే కేవలం మనుషులే కాదు, ప్రాణికోటి అంతా కలిసి బ్రతకాలనే సంకల్పంతో ఏర్పడినదే.

కేవలం మానవ సేవయే మాధవసేవ అనుకున్న సమాజం కాదు మనది. మాధవ సేవగా సర్వప్రాణులూ బాగుపడాలనే లక్ష్యంతో ఏర్పడ్డ సమాజం మానవ సమాజం.

మనిషి పశుపక్ష్యాదులను తన ఆహారం కోసం **Corrupt** చేస్తున్నాడు. అంటే కృత్రిమత్వాన్ని వాటిలో నింపడం. నిజానికి ఏ చెట్టూ, జంతువూ పరస్పరం కృత్రిమం కావు. ఒక జంతువు, మరొక జంతువు ఎపుడూ పరస్పరం కృత్రిమం కావు. **Cross Breeds** కావు. మనిషి వాటిని **Cross Breeding** చెయ్యగలడు. మంచికి మార్గాన్ని వెతకాల్సిన మానవుడు, నిజానికి ఈ ప్రకృతియొక్క ఉనికికి, తోటి సమాజ ఉనికికి కూడా భంగకరంగా మారుతూ ఉన్నాడు

సరే, చెట్లను జంతువులను నరకడంతో పాటు తోటి మనిషి యొక్క సహవాసాన్ని కూడా తట్టుకోలేని దారుణస్థితిలోకి ఈ వేళ మనిషి వచ్చాడు. ఇది వరకు కేవలం పట్టణాలలో మాత్రమే, 'పక్కవాడికి ఏమైతే నాకేమిటి, నామటుకు నేను బతుకుతాను' అనే స్థితి ఉండేది.

కానీ, ఈ వాతావరణం అతి చిన్న పల్లెకు కూడా ప్రాకింది. దానికి కారణాలు **T.V** లాంటి అనేకం. లేదా వ్యక్తులలో పెరిగిన అతి ఆశ కావచ్చు. కులంపోరాటాలని, వర్గ పోరాటాలని, పార్టీ పోరాటాలని, మతపరమైన పోరాటాలని, ఎన్నోరకాలైన పేర్లతో మనం చీలికలు పీలుకలు అవుతున్నాం.

పాకిస్తాన్ లాంటిదేశాలు ఇవేళ ఆత్మ విమర్శ చేసుకునే స్థితి ఏర్పడింది. ఇక మన దేశానికివస్తే లక్షల సంవత్సరాల చరిత్ర కలిగి దేవుణ్ణి అనేక రూపాల్లో మోసినటువంటి భూమి. వేదాలను వెలయించిన భూమి. రాముడు, కృష్ణుడు నడిచిన భూమి. ఈ భూమిలో ఇవేళ రాముడు చేసిన పాలన, కృష్ణుడు చెప్పిన గీతను మాట్లాడడం అన్నా, **'సరస్వతీ నమస్తుభ్యం'** అనడం అన్నా అదొక బూతు మాటగా, పలక తగని మాటగా, సెక్యులరిజానికి వ్యతిరేక పదంగా భావించే ప్రభుత్వాల అధీనంలో  మనం బ్రతుకు వెళ్లదీస్తున్నాం. నిజానికి రాముడసలు అయోధ్యలో, అక్కడ పుట్టాడా లేదా అనేది





చర్చనీయాంశం కాదు. దానిని అంగీకరించాల్సిందే. ఏదికాదు, ఏది అవును అని మనం నిర్ణయంచేయులేం కానీ, ఈ భూమిలో రాముడుకి ఉండాల్సిన స్థానాన్ని ఈ దేశంలో కాదనగలిగే ధైర్యం నిజానికి, ఎవ్వరికీ లేదు. ఈ మధ్య మేము చాలా పెద్దముస్లిం నాయకుడితో కలవటం జరిగింది ఏదో ఒక సందర్భంలో. ఆయన చాలా అద్భుతమైన మాట అన్నాడు. **'హే స్వామీజీ! కేవల్ యహీ జగా రామ్ చంద్రకీ జగా నహీహై. సారే సంసార్ రామ చంద్రకా జగాహై'** ఈ మాట వాల్మీకి రామాయణంలో రాముడన్నాడు వాలితో. 'నన్నెందుకు చంపావు? నా ఊళ్ళో కొచ్చి నన్నాక్రమిస్తావా?'అన్నపుడు.అర్థంలేని మాట. ఎవరిదీ భూమి అనుకున్నావు? ఈ భూమి, **'ఇక్ష్వాకూణాం ఇయం భూమిః సశైల వనకాననా'** ఈ భూమి మీద ఉండే ప్రతీ మట్టి రేణువూ ఆయనదే! అలాంటి భూమిపై పుట్టి కూడ రాముడి గురించి మాట్లాడటానికి ధైర్యం చాలటంలేదిపుడు. వైదిక దైవానికి వ్యతిరేకంగా ఉంటేనే అది సరైనది అనుకునే బలహీన మనస్తత్వంతో పాలకులూ, మనమూ బతుకుతున్నాం. అందరూ  బాగుండాలనే అన్నట్లు ఉంటుంది. కానీ దానికి ఎట్లా ఫ్రేమ్ వర్క్ చేసుకోవాలనేదే ఇపుడు మనం చేయాల్సిన తక్షణ కర్తవ్యము.

**'మతం'** ఈ వేళ దేశాన్ని, ప్రపంచాన్ని కంట్రోల్ చేస్తోంది. అటు ముస్లిం దేశాలు కావచ్చు. ఇటు క్రిష్టియన్ దేశాలు కావచ్చు. అది ముస్లిమో, క్రిష్టియన్నో మరోటో, వేద సంబంధమైనదో తెలియని మన దేశంలాంటి దేశం కావచ్చు. ప్రతీచోట మతమే రాజ్యమేలుతోందీవాళ. కనుకనే మొదట, మత సంబంధమైన అవగాహన ఒకటి మనిషికి ఏర్పడాలి.

ఆపై మన చుట్టూ ఉండే ప్రకృతికి చెందిన అవగాహన ఒకటి ఏర్పడాలి. తరవాత మనిషిలో 'నేను నాది అనుకునే స్వార్థం' అర్థవంతం కావాలి. స్వార్థం ఈవేళ అర్థ రహితమూ, సంకుచితమై ఉంది. అదీ ఈవేళ, అర్థవంతం అవ్వాల్సిన అవసరముంది. ఈ మూడూ ఆవశ్యకాలు.

ఎవడో పాశ్చాత్యుడు చెప్పిన దానిని విని, ధర్మాన్ని ఇపుడు మనం నిర్ణయం చేసుకోవాల్సిన దౌర్భాగ్యస్థితి ఈ దేశానికి ఇంకా రాలేదు. ఎవరో ఇచ్చిన ఏదో ఒక సందేశాన్ని విని ఈవేళ మనం అడుగు వేయాల్సిన అవసరం లేదు. ఏ స్థితిలో ఉండే ఏ మనిషినైనా ఉన్నత స్థితికి చేర్చగలిగిన మన వేదం చెప్పిన సందేశాన్ని శ్రీకృష్ణుడు భగవద్గీతలో అందంగా క్రోడీకరించి ఇచ్చాడు. సంక్షిప్తంగా ఇచ్చి ఉండవచ్చు. వాటిని గురించి మనం ఒక్కసారి అవగతం చేసుకోవాల్సిన ఆవశ్యకత ఉంది. వీటి కోసం ఏర్పడ్డదే **గీతాజ్యోతి.**

ఈవేళ మన రాష్ట్రంలో  చూసుకుంటే, మనిషికి డబ్బులిచ్చి, మతాలు మార్చి వదిలేసే స్థితి కనిపిస్తోంది. బలవంతంగా పొద్దున్న, రాత్రి మైకులు పెట్టుకొని, చిన్న పిల్లలకు చదువుకోవడానికి లేకుండా ఎగ్జామ్స్ ప్రిపేర్ అయ్యేవారికి దాని మీద దృష్టిపెట్టే అవకాశంలేక, నిరంతరం వారి మీద ఒక రకమైనప్రేరణ, ఆక్రమణ జరుగుతున్నాయి. దానిని మతపరమైన దురాక్రమణ అనిఅంటాం.

కానీ ఈ లోకంలో, ఈ దేశంలో, ఈ రాష్ట్రంలో ఈనాటికీ "నేను ఏ విశ్వాసంలో బ్రతకదలచుకున్నానో, నన్ను ఆ విశ్వాసంలో బ్రతకనిచ్చే నాథుడులేడే" అనే తపన ప్రతి మనిషిలోనూ ఉంది. గ్రామాలలోని ప్రతీవ్యక్తి లోనూఉంది. వేం ఏదో ఉన్నాం చేసు

కుంటున్నాం. మా పూజ మమ్ముల్ని సరిగా చేసుకోనివ్వరే అనే బాధ ప్రతిఒక్కరి మనస్సులోను ఉంది.

అలాంటి ఆక్రమణలు చేయడం మనకిష్టంలేని భరతజాతి మనది. అదృష్టం కొద్దీ ఆ జాతిలో పుట్టినవాళ్ళం. ఇతరులపై దురాక్రమణలు మన రక్తంలో కాదు, మన జీన్స్‌లో కూడ లేవు. అంచేత మనం ఎవరినీ మతం మార్చం. కానీ, ఎవరైతే మంచిని మాకు అందిస్తే బావుండును అని అనుకుంటారో అలాంటివారికి మంచిని అందించాల్సిన కర్తవ్యం అందరికీ ఉంది. ఇది మొదటి విషయం.

ఇక రెండవది, ఈ వేళ మన ప్రభుత్వాలలో మంచి పనులు చెయ్యాలంటే వాటిని శాసించే ప్రజలకు, అందుకోనే చిత్తశుద్ధి కనిపించడం లేదు. మోరల్ స్ట్రెంత్ మనిషిలో కనిపించడంలేదు. ఆ మోరల్ స్ట్రెంత్ బిల్డప్ చేసుకోవాల్సిన ఆవశ్యకత ఎంతో ఉంది. ఇది మన కర్తవ్యం. దానిని గుర్తించి ఏర్పడినదే **'గీతాజ్యోతి'**.

నిజానికి మనిషికి డబ్బుకంటే, తిండి కంటే, బట్టకంటే మానసికమైన ఓదార్పు, ధైర్యం ఉంటే వాడు ఎన్ని మంచిపనులైనా సమర్థవంతంగా చేయగలుగుతాడు. ఇవి లేకపోతే వాడు ఎన్ని దౌర్జన్యాలకైనా ఒడిగడతాడు. ఈ వాళ మనుషులలో ఒక రకమైన నిర్లిప్త,నైరాశ్య స్థితి ఏర్పడింది. దానివల్లనే ప్రభుత్వాలేం చేస్తున్నా ప్రజలలో ఏమీ స్పందన, కనిపించడం లేదు.

ప్రభుత్వాలకు ఒక నియంత్రణ కావాలి. ప్రజలలో చిత్తశుద్ధి ఏర్పడాలి. మనోధైర్యం కావాలి. ఆత్మవిశ్వాసం ఏర్పడాలి. ఇవి ఏర్పడితే నలుగురూ కలసి బ్రతక గలుగుతారు. ఒకరికి ఒకరికిమధ్య పరస్పరం అనురాగాలు, ప్రేమ సంబంధం కావాలి. వీటిని అందించ డానికి మనం ఒక సరియైన ప్రామాణికమైన పద్ధతిని అనుసరించాలని ఏర్పరచినదే **'గీతాజ్యోతి'**.

అయితే ఒక వాస్తవాన్ని చెప్పక తప్పదు. ఈవేళ సమాజం బాగుకోసం 'ఇది మంచిది' అని చెపితే అలాంటి దానిని అందించే స్థితిలో మన మీడియా లేదు. భయపడుతుంది. దానిని సపోర్టు చేయడంలో అధికారులు భయపడతారు. ఇది శాస్త్రీయంగా ఇలాజర గాలి అని అంటే దాన్ని అంగీకరించ డానికి అందరికీ భయమే. ముఖ్యంగ చిన్న జీయరు స్వామి చెప్పారు అంటే దాన్ని ఎలాగైనాపైకి రానివ్వకూడదు అనే మనస్తత్వం చాలా మందిలో ఉంది. కారణాలు ఏమిటి అనేది మా ప్రస్తుతాంశం కాదు.

దీనిని అనేక సందర్భాలలో అనేక రకాలుగా చూసాం. అయితే దైవాన్నే విశ్వసించిన వ్యక్తి, ధర్మాన్ని నిజంగా నమ్మిన వ్యక్తి దేనికీ బెదరడు. వాడివెంట భగవంతుడు ఉంటాడు అని మనకు శాస్త్రం చెప్పింది. దానిని నమ్మినవారం కనుక ఎన్నో మంచి కార్యాలు చేయాలి అని, ఆరంభించినవి, ఎందరు క్రిటిసైజ్ చేసినా, ఎందరు ఎన్ని రాళ్ళు వేసినా, అడ్డుపెట్టినా ఇంతవరకు ఎపుడూ ఆగలేదు. ఇకపై ఆగవు.

మేం శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన వాళ్ళం. అంతమాత్రంచేత ఇతర సంప్రదాయాలు లేకుండా చేయాలనే మనస్తత్త్వం, మాకు ఎపుడూ లేదు. మేం వేదమతానికి సంబంధించిన వాళ్ళం. అంతమాత్రంచేత వేదాలకంటే వేరైన ఇతరములను నిర్మూలించాలని తొలగించాలనే అభిప్రాయం ఉన్నవాళ్ళం కాము.

మనం తెచ్చుకోకుండానే ఏదొక కులంలో పుట్టాం. అంత మాత్రం చేత ఇది గొప్ప కులం, మిగిలినవి, నీచమనేది మేం





చదువుకున్న గ్రంథాలు మాకు చెప్పలేదు. అంచేత మనస్సులో ఏర్పడలేదు. కులం పేరుచెప్పి, మతం పేరు చెప్పి, సంప్రదాయం పేరు చెప్పి కేవలం మా ప్రత్యేకత నిలుపుకోవాలని ఇతరమైన వాటిని దూరం చేద్దామన్న అభిప్రాయం మాకు ఎప్పుడూ ఏర్పడలేదు.

అలానే ధనార్జన, మఠాలు పెంచుకోవడం గూడ మా లక్ష్యాలు కావు, 1994లో శ్రీమహావిష్ణుయాగం తర్వాత రూ. ఒక కోటీ 20 లక్షలు దేవస్థానానికి యిచ్చేశామనేది **E.O.**, గారికి తెలిసి ఉండదు. ఆ ధనం మేం తీసుకొన్నా తీసుకొనే ఉండేవారము. కానీ అలా మిగుల్చుకోవడం, దేవుని సొత్తు గ్రహించడం మా పద్ధతికాదు. పేరు ప్రతిష్ఠలూ సంపాదించడమూ మాకవసరమనుకోలేదు.

అలాంటి అవసరమూ లేదు. ఆ పేరు ప్రతిష్ఠలు బ్రతికిన నాలుగు రోజులే. మనం చేయవలసిన పని చేయడం మన కర్తవ్యం. మా సంస్థ ఆశయం కూడ అంతే.

**'గీతాజ్యోతి'** కార్యక్రమాన్ని **'కృష్ణం వందే జగద్గురుమ్'** ఆ ఆశయంతోనే ప్రారంభం చేసాం. గతంలో మేం పదిజిల్లాలలో చెయ్యాలనుకుంటే అయ్యో! అమ్మో! ఎలా జరుగుతుంది అని ఎందరో శంకించారు. మన **E.O.** గారు సూర్యాపేటలో జరిగిన కార్యక్రమాన్ని ప్రత్యక్షంగా చూచి చెప్పిన విషయం **CM** గారికిచ్చిన **CD**లో ఉంది. గ్రామాల్లో, పట్టణ్ణాల్లో కూడ ధర్మానికి సంబంధించిన ఒక మంచి కార్యక్రమం జరిగితే బాగుండును అన్న ఒక తపన **'కృష్ణం వందే జగద్గురుమ్'** కార్యక్రమంలో గమనించాం.

పూర్వపురోజుల్లో గ్రామాల్లో భజన కోలాట బృందాలు చాలా ఉత్సాహంగా గ్రామీణ వాతావరణాన్ని ఆరోగ్యంగా ఉంచేవి. సాయంకాలంకాగానే వారు ఆడుకోవడానికి భజన చేసుకోవడానికి ఒక చోట చేరేవారు. గ్రామాలు ఆరోగ్యంగా ఉండేవి. మరల ఆ వాతావరణాన్ని డెవలప్ చేసుకోగలిగితే గ్రామీణ వాతావరణం ఆరోగ్యకరంగా మారి తద్వారా వారిలో ఒక దైవసంబంధం కలగటం చేత నైతికమైన స్థాయి పెరిగి వారి అభివృద్ధిని వారే చేసుకుంటారు.

ఈనాడు గ్రామాల్లో అభివృద్ధి కార్యక్రమాలు ప్రభుత్వాలు అందించే కోట్లతో జరగటంలే! వాటిలో వందలు కూడా వారికి చేరవన్న విషయం అధికారులకు తెలుసు. ప్రజలలో కల్గిన ఒక చైతన్యం వారిచే వారి గ్రామాన్ని అభివృద్ధి పరచుకునేటట్లు చేస్తుంది. ఆ చైతన్యాన్ని ధార్మికంగా దైవికంగా ఏర్పరచ గలిగితే ప్రభుత్వాల బాధ్యత తగ్గుతుంది. ప్రజలకు బాధ్యత పెరుగుతుంది. హక్కుల తోపాటు బాధ్యతలు కూడా గుర్తించగలు గుతారు. అలా తయారు కావాలి ప్రజలంతా అని మేం **'గీతాజ్యోతి'** కార్యక్రమాన్ని అనుకున్నాం. రూపురేఖలు కూడా దానికి అనుగుణంగానే తీర్చిదిద్దాం.

అందుకే మొట్టమొదటగా ఇంటింటికి అందించాలి అని **ఒక డోర్‌పోస్టర్ వేసాం.** దానికి ఒక స్లోగన్ వ్రాసాం, నీవు ఒక సంప్రదాయానికో, మతానికో చెందినవాడై ఉంటావు. తప్పులేదు. ఇతర సంప్రదాయాలను మతాలను దూషించకు. ఆదరించు - అందుకే మొదటి స్లోగన్ **'స్వీయ ఆరాధన - సర్వఆదరణ'**. నీది నీవు ఆరాధించుకో. మిగతా మతాలు ఆదరించు. నీవు వారి వెంట పడక్కర్లేదు. నీది వదులుకోవాల్సిన అవసరం లేదు.

ఈవేళ సెక్యులరిజం పేరన స్వీయ ఆరాధన పోయి - సర్వఆదరణ వక్రించింది. ఇతరులను నెత్తి కెక్కించుకోవడం తనవారిని తొక్కేసుకోవడం ఈవేళ వ్యవహారంలోకి

వచ్చింది. అందుకే నాయనా! స్వీయ ఆరాధన చేసుకో! సర్వ ఆదరణ చేసుకో ఇది మొదట ఇస్తున్న డోర్ పోస్టర్.

రెండవది. సర్వప్రాణిసేవ అంటూ దైవం పేరు చెప్పవలసిన T.T.D., కూడా దైవాన్ని ప్రక్కనపెట్టి **వృక్షోరక్షతి రక్షితః** అని అంటుంది. ఇది మంచికో చెడుకో మాకుతెలియదు. రాష్ట్రంలో ఎక్కడైనా పెట్టుకోవచ్చు. కానీ దేవునిదగ్గర పెట్టాల్సిన అవసరం లేదు. కానీ దేవుని దగ్గర కూడా పెట్టామంటే వృక్ష రక్షణలో మనం తీసుకోవాల్సిన జాగ్రత్త, ప్రజలలో ఎంత చైతన్యం తీసుకురావాల్సిన అవసరం ఉందో మనం గుర్తించటానికి ఇక్కడ ఆ స్లోగన్ పెట్టిఉంటారు.

మానవుడు కేవలం మనిషి కోసమే కాదు, చెట్లకోసం బ్రతుకు, జంతువుల కోసం బ్రతుకు,పక్షుల కోసం బ్రతుకు. ఈ విషయాన్నే తెలుసుకోవాల్సిన అవసరం ఉంది. అందుకే మానవసేవయే మాధవసేవ అన్న స్లోగన్ తప్పని దానిని మనం సవరించుకోవాలని **'మాధవసేవగ - సర్వప్రాణి సేవ'** అనేది మన జీవనాడి కావాలి. ఇది **రెండవ డోర్ పోస్టర్**.

ఇందాక మన **JEO**గారు మనకి ఏర్పడాల్సిన నైతిక స్థాయి ఎలాంటిదో చెప్పారు. మన లక్ష్మయ్యగారు భగవద్గీత ఎంత గహనమైనదో చెప్పారు. బ్రహ్మానంద గారు భగవద్గీత ఎలా మన జీవనంలో భాగం చేసుకోవాలో చెప్పారు. ఎన్నోరకాలైన ఎందరో పాశ్చాత్యులు చెప్పిన సందేశాన్ని మన **JEO**గారు చెప్పారు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు వాటిని చెప్పాడు. ఆచరించే విధానం మనకు కావాలి. అందుకే 13 అధ్యాయంలో కృష్ణుడు చెప్పిన వాటిని తీసుకున్నాం. నాయనా నీవు అమానిత్వమును అభ్యసించుము అంటే తెలియదుగా? మానం (గర్వం) తగ్గించుకో, గర్వం వస్తే పెద్దవాడిని దూషిస్తాం. చిన్న వాడిని గేలిచేస్తాం. ఇది 4 రకాలుగా కలుగుతుంది. గొప్పకులం, గొప్పచదువు, డబ్బు, పవర్, ఈ నాలుగు గర్వం రావడానికి కారణాలు. నిజానికి ఇవి రావాల్సినవే కావు.

నీవు కావాలని బ్రాహ్మణకులంలో పుట్టావా? లేక కావాలని హరిజన కులంలో పుట్టావా? నీవు ఎవరివి అయితే ఏమి? నీ లక్ష్యం మంచిదై, ప్రక్కవాడిని ప్రేమించ గలిగితే అంతకన్నా కావాల్సిందేముంది కనుక. నీలో గర్వాన్ని అణచే ప్రయత్నం చేయి.

అమానిత్వం అని వ్రాసి దాని ప్రక్కన నాకు కులము చూసుకొని గర్వం కలిగి తోటివారిని బాధించటం లేదు కదా! లేదు అని సమాధానం. నా ధనాన్ని చూసుకొని తోటివారిని తిరస్కరించడంలేదుకదా! లేదు అని మనం వ్రాయాలి. అంటే దాన్ని ఎలా అభ్యసించాలి అనేదానికి వాక్యాలుగా తయారు చేసి ప్రక్కన తెలుగులో వ్రాసాము. ఇదే ఇంగ్లీషు, హింది, తమిళ్ 4 భాషలలో చేసాం.

కనీసం 50లక్షల కుటుంబాలకు మన రాష్ట్రంలో అందివ్వాలి అంటే కనీసం 2 కోట్ల మందికి అందివ్వాలి. అంటే 2 కోట్ల కరపత్రాలు వేయాలి! వేయాలి. వేస్తాం. ఇంటింటా అందిస్తాం.

నెలలో 30 రోజులు ఉంటాయి. పడుకునేముందు **Yes, No, Yes, No** అని వ్రాసి పడుకోండి. ఎవర్ని నీవు అడుగనక్కర్లేదు. నేను ఈవాల్టికి ఇలా ఉన్నాను అనుకొని వ్రాస్తే చాలు. నీ ముఖం ఎలా ఉందో చూడటానికి ప్రక్కవాడిని అడగక్కర లేదు. అద్దం చూసుకో. అందంగా తయారవ్వు. ప్రక్కవాడికి ఆనందం కలిగించు.

ఇందులో ఎక్కడా మా సొంతం గాని, చిన్న జీయరుస్వామిని పూజిస్తున్నారా అని





గాని అడగలేదు. శ్రీకృష్ణుడు చెప్పినవే పొందుపరచాము. మాకు కూడా చెప్పనక్కరలేదు. నీ ఆత్మోన్నతికోసం చేసుకునే అభ్యాస పట్టిక కనుక నీ మనసుకు నిజం అన్పించేలా దానిని అభ్యసించాలి. ఇది ఒక 4 నెలలపాటు.

రెండవ పట్టిక 16వ అధ్యాయంలో చెప్పాడు. ఇవీ ఆయన చెప్పినమాటలే. ఇందులో మా సొంత మాటలేమీ లేవు. ఇవీ అందరి కోసం పనికి వచ్చేవే. 38 గుణాలు ఇచ్చాడు. 4 నెలలు దాటి 8వ, నెలదాక చెయ్యాల్సి ఉంటుంది.

మనం అభ్యసించాల్సిన పట్టిక 3, దేవుడ్ని ప్రేమిస్తున్నాం కానీ దేవుడు మనని ప్రేమించేటట్లుగా ఉంటున్నామా? 'ఇది చేస్తే నేను ప్రేమిస్తా' అని 12వ అధ్యాయంలో తానే చెప్పాడు. అవి ఓ 48. వాటిని వ్రాసాము. నీవు గుర్తులు పెట్టుకో అవును, కాదు...... నీవు కనీసం 50% మార్కులు స్కోరు చేసుకున్నా మంచిదే. ఇచ్చిన 48లో కనీసం ఒక 20 రాగలిగితే 40% పాస్ మార్కులు వచ్చినట్టే. ప్రయత్నం చెయ్యి. ఇలాగ 3 పట్టికలు. ఇవి కూడ కనీసం 2 కోట్లమందికైనా అందించాలని మా ఆశ. ఆశకు తప్పులేదు కదా! అది నెరవేరడం, నెరవేరకపోవడం అనేది తర్వాత భగవంతుడనుగ్రహం. ఆశ ఎప్పుడు కూడ చిన్నది కావద్దు. ఆశ ఉండాలి. లేకపోతే వాడు బ్రతికిలేడని అర్ధం. కాని ఆశ లోకానికి ఉపయోగపడే ఆశ కావాలి. స్వార్ధం చెడ్డది కాదు. నా పక్కవాన్ని కూడా తోసేసి నా శరీరానికే పరిమితం చేసేసుకునే స్వార్ధం కాదు. వారిని నేను కలుపుకుంటూ, నా గ్రామం, నా జిల్లా, నా రాష్టం, నా దేశం, నా ప్రపంచం అంతా నాస్వంలోకి చేరాలి. అలాంటి స్వార్ధం, నిజానికి, ఉండకపోతే వాడుపాపి. పుట్టి ఈ భూమికి బరువు చేటు. ఆశ కూడ అంతే. ఆకాశమంత ఎదిగిన హద్దుకావచ్చు ఏం తప్పులేదు. ఎంత మట్టుకైనా వెళ్ళచ్చు. సరే. ఓ 2 కోట్లు అనుకున్నాము అది పెరగవచ్చు ఎలాగైనా కావచ్చు. ఇలా ఉండాలి కాబోలు! ఇలా ఉండాలి కాబోలు అనేది.

100 మందికి ఇస్తే ఒక్కడు చేసినా మంచిదేకదా. 1. ఇలా ఈ పట్టికలు ఇవ్వడం, 2. జ్ఞాపకం వచ్చేటట్టుగా ఒక డోర్ ఫోటోను ఇవ్వడం, 3. దానితోపాటు వ్యక్తుల్లో ఆ రకమైనటువంటి ఇతర మతాన్ని నేను గౌరవిస్తాను. ఇతర ధర్మాన్ని నేను ఆదరించాలి. నా ధర్మాన్ని నేనెపుడు వదులు కోకూడదు అనేటటువంటి స్వభావం ఏర్పడాలి. అలాగే అన్ని ప్రాణులను కూడా నేను గుర్తించాల్సిన బాధ్యత ఉన్నదనేది తెలియాలనే అవి తయారుచేసుకున్నాము. ఇలాంటివి అందించింది భగవద్గీత. అందులోంచి కేవలం మేం వ్రాసినవి 48, ఆయన 7 శ్లోకాలలోనే తెలిపాడు లిస్ట్. మరి ఇలాంటివి 700శ్లోకాలు భగవద్గీతలో ఉన్నాయంటే ఎంత సంపద ఇంక అందులో ఇమిడి ఉంటుంది? అలాంటి భగవద్గీతలో చూడు. ఒకడని తిట్టకుండా, నిన్ను నువ్వు కించపర్చు కోకుండ, తోటివాడు పాడవ్వకుండ ఉండడం కోసం కృష్ణుడు చెప్పిన అనేక శ్లోకాలు మనకి ఎంత మంచి సందేశాన్ని ఇచ్చాయో చూడు, అలాంటివి కనీసం వారానికి ఒక్కటి అభ్యాసం నువ్వు చేయి. నువ్వు నేర్చుకో, తాత్పర్యం ప్రక్కవాడికి చెప్పు. నెలకి 4 అవుతాయి. ఎడాదికి 48. అంటూ అట్లాంటి శ్లోకాలని తీసి వాటికి తాత్పర్యం వ్రాయడం జరిగింది. అందులో ఒక చిన్న మాట మీకు చెపుతాము. ఆరంభంలోనే ధృతరాష్ట్రుడు చెప్పిన మాటతో భగవద్గీత ఆరంభం

అయింది **'నా వాళ్లు ఏం చేసారు. పాండవులు ఏమయ్యారు'** అన్నాడు ధృతరాష్ట్రుడు. ఎంత గ్రుడ్డివాడు! **'నా'** అని కౌగలించుకొన్న 100 మంది కొడుకులు, 11 అక్షౌహిణులలో ఒక్కడు మిగలలేదు. అంతా నేల మట్టం. పాండవులని తోసేసాడు. 5గురూ బ్రతికారు. **'చెడ్డవాడి పంచచేరకు, దుష్టుడి అభిమానానికి దూరంగా ఉండగలిగిన నీ బ్రతుకు పండినట్టే'** ఇది మొదటి శ్లోకంలో సందేశం. మనకు అందిన చివరిమాటగ అలాంటి కృష్ణుణ్ణి నమ్మినటువంటి వ్యక్తికి **'తత్రశ్రీః విజయః'** అన్నింటా విజయం కల్గునని చెప్పింది. 4.ఈ 48 శ్లోకాలు వివరణతో సందేశంతో ఉన్న పుస్తకమొకటి యివ్వాలి.

చిన్న పిల్లల్లో ఒక ప్రోత్సాహం కోసం గీతలో ఒక 30 శ్లోకాలు ఏరాము, బొమ్మ వేయడానికి వీలుగా. కృష్ణార్జునులుఇద్దరు రథంలో శంఖాలు ఊదుతున్నారు. బొమ్మ వేయచ్చుకదా దాన్ని! ఇలాంటివి కొన్ని శ్లోకాలు ఉన్నాయి. 5. అలాంటివి 30 శ్లోకాలు ఇచ్చి ప్రతి గ్రామానికి పంపి ప్రతి స్కూలుకి వాటి నందించి ఆ స్కూలులో ఆ శ్లోకాలు బొమ్మలు గీసి, గెలిచినవాడికి ప్రైజులు ఇస్తాం, ఉత్సాహం కోసం. వాడు దాన్ని చదువుతాడు. వాడు స్నేహితులకి చెప్తాడు. తల్లికి తండ్రికి అందిస్తాడు బంధువు లందరికి చెప్తాడు. ప్రైజ్ చూపిస్తాడు. వాళ్ళకి అది చెయ్యాలనిపిస్తుంది. వాళ్ళకి కొంత క్షేమం కలుగుతుంది అని, చిన్న పిల్లలకోసం చెయ్యాలనుకున్నాం, ఐతే అది 108 గ్రామాల్లో ఒక ధర్మక్షేత్రంగా అట్లాంటిది ప్రతి జిల్లాల్లో 5 నుంచి 14 క్షేత్రాలుగ, ఏర్పడాలని, ఆంధ్రరాష్ట్రంలో 23 జిల్లాలలో చేయాలనే నిర్ణయంతోటి ఈ స్కీము ఏర్పడటం జరిగింది. శ్లోకాలు చదివేటటువంటి వారికి కూడ, చిన్న పిల్లలకి శ్లోకాలు, పెద్దవాళ్ళకి తాత్పర్యంతో సహా, ఇంకా పెద్ద వాళ్ళకు వక్తృత్వ వ్యాసరచన పోటీ పెట్టాలని, రాష్ట్రస్థాయిలో జరుగుతున్న టువంటి పోటీలో 10,000వేల రూపాయలు తగ్గకుండా బహుమానం ఇవ్వాలని, నిర్ణయించు కున్నాం. ఇంకా గ్రామాల్లో తిరగాలి, అంత మందికి అందించాలి.

గ్రామాల్లో వాళ్ళకి క్రిస్టియన్స్ ఎన్నో వనతులు ఇస్తారు. ఏ క్రిస్టియన్స్ని ద్వేషించడం అనేది మాకు ఇష్టం లేదు. వాళ్ళు చెయ్యాల్సినది ఏదో వాళ్ళుచేసుకుంటున్నారు? మంచిదే కాని, మనం చేయతగినది చేసుకోకపోతే ఎట్లాగ, వాళ్ళెందరో చేసుకుంటున్నారని మనమెందుకు బాధపడాలి? ఏడవాలి? వాళ్ళకి వసతి ఉంది. అవకాశం ఉంది వాళ్ళు చేస్తున్నారు. అవకాశం ఉండి నువ్వు ఎందుకు చెయ్యవు? మన పిల్లాడికి మనం అన్నం పెట్టకపోతే పక్కింటికి వెళ్ళి అడుక్కుతింటాడు.

అడుక్కుతినే అవకాశం నువ్వు ఎందుకు ఇవ్వాలి? అందుకోసమనీ, గ్రామాల్లోకి మనం వెళ్ళేటప్పుడు, 6. చిన్న డాలర్(కృష్ణప్రతిమ), వాళ్ళకి ఉచితంగా అయినా సరే ఇచ్చి పూజ చెయ్యండి. పూజ చేసుకునే విధానం చెప్పాలి.

**'అపిచేత్ సుదురాచారః భజతే మాం'** నువ్వు అతి ఘోరమైనటువంటి పాపివైనా నేను నీ పాపాలు కడుగుతాను. రా! తొలగిస్తాను. రా! **'అహం మోక్షయిష్యామి',** నేను తొలగించుకుంటాను అని, ఆయన అంత బాగా చెప్పాడే, విషయం వాళ్ళకి తెలియట్లేదుగ, వాళ్ళకి తెలియచేయడం మా బాధ్యత. వాళ్ళలో మానసికమైన, నైతికమైన బలాన్ని కలిగించడం, మన కర్తవ్యం. అది కలిగిద్దామని, వాళ్ళకోసం, ఈ డాలర్లు, ఇస్తే వాళ్ళు పూజచేస్తారు, కొనుక్కోమంటే కొనుక్కోడు, వసతి ఉన్నా కొనుక్కోడు, ఏం





తెచ్చావు? అంటాడు గ్రామాల్లోకి వెళ్ళగానే, అలా తయారైంది, వాతావరణం. వారందరికీ ఇది ఉచితంగా ఇస్తాం. ఐతే ఇవన్నీ చెయ్యడానికి మేం సన్యాసులం, మేం స్కూల్స్ పెట్టాము, మఠాల్లాంటివి లేకపోయినా అవి గడపటానికి మేం, వీరిని వారినీ అడిగి ధనం తెస్తాం. అవి నడుస్తున్నాయి, ఇలాంటి కార్యక్రమాలు చేయడానికి దేశం ఇంకా గొడ్డుపోలేదు. ధార్మికులకు ఇంకా ఈ దేశంలో స్థానం ఉంది. అయితే తిరుమల తిరుపతి దేవస్థానం సహాయంతో 23 జిల్లాల్లోను ఆర్గనైజ్చేసాం. తిరుమల తిరుపతి దేవస్థానం వారు, కళ్యాణ మంటపాలు కట్టారు. ఎన్నో కార్యక్రమాలు చేస్తున్నారు. వాళ్ళయొక్క ఉధృతి చాలడంలేదు. కళ్యాణ మంటపాలు, **Marriages** కోసం ఉపయోగపడు తున్నాయి. ధర్మకార్యానికి వాళ్ళు పర్మిషన్ వస్తే ఇస్తామంటున్నారు. అక్కడక్కడ ఉండే ఆర్గనైజర్స్, వాళ్ళకి తోచినటువంటి రీతుల్లో కార్యక్రమాలు చేసుకోవటానికి మాత్రం పరిమితమయి ఉన్నారని వాళ్ళకీ స్పష్టంగా తెలుసు అని మాకుకూడ తెలుసు. మేం ఒకళ్ళకి పోటీ కాని, లేదా ఒకళ్ళని ఎదిరించేట్టుగాకాని,మేం ఎప్పుడూ చెయ్యం. వారు చేసేకార్యక్రమానికి తోడుగా చేస్తాం. మాది ఎప్పుడూ Competative activity కాదు Complementary activity మాత్రమే, మీరు చేసేకార్యక్రమం ఒక రకమైన స్థాయిలో జరుగుతోంది. నలుగురూ కలిస్తే అది మరింత వేగవంతమౌతుంది. ఐతే కలిసే నలుగురు ఒకే రకమైన ఆలోచనా ధోరణితో కలిస్తే సాగుతుంది. మరోవిధంగా అయితే నాలుగు చీలికలౌస్తా యనటం కాదనటానికి వీల్లేని వాస్తవం. రెండవది, మనం చేసేటటువంటిది శాస్త్రానికి ధర్మానికి కట్టుబడి, ఉండటంతోబాటు, మనం తిరుమల తిరుపతి దేవస్థానం తరపున చేస్తున్నాం, వేంకటేశ్వరుడి ఉప్పతినే వ్యక్తికి వేంకటేశ్వరుడి ధర్మానికి కట్టుబడే బాధ్యత ఉంటుంది. కాని తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆ విధమైనటువంటి నిలకడ కొరవడుతోందని ఒకసారి ఆత్మ విమర్శ చేసుకుంటే తెలుస్తుంది. దాన్ని క్రమబద్ధంగా చేస్కోవాలి.

ఏ వేంకటేశ్వరునిద్వారా మనం కార్యక్రమం చేయాలనుకుంటున్నామో ఆ శ్రీవేంకటేశ్వరునికి తగిన స్థానాన్నిస్తూ చేయగలిగితేనే అది వేంకటేశ్వరుని ద్వారా జరిగే కార్యక్రమానికి న్యాయం చేకూర్చడం అవుతుంది. దేవస్థానాలు మన రాష్ట్రంలో చాలా ఉన్నాయి. ఆయా దేవస్థానాల తరపున జరిగేవి ఆయా దేవస్థానపు సాంప్రదాయాన్ని కాపాడేటట్టుగా ఉండాలి అనేది మా అభిప్రాయం. అది శాస్త్రం. అది రాజ్యాంగానికి కూడా విరుద్ధం కాదనే మా అభిప్రాయం. నిజానికి మేము అన్ని ధర్మాలను కూడా ఆదరిస్తాం. ఆరాధించం కాని, ఆదరిస్తాం. ఒక శ్రీశైల దేవస్థానంలో జరిగే కార్యక్రమం ఆ దేవస్థానపు ఆగమానికి సంబంధించిన ఆ దేవస్థానపు సంప్రదాయానికి సంబంధించినట్టుగానే జరపాలనేది మా విశ్వాసం. మా నిశ్చయం కూడా.

అక్కడ ఉండే అధికారి ఏ సంప్రదాయానికి చెందినవారయినా ఆ సీట్లో ఉన్నంత వరకు దానికి కట్టుబడి ఉండాలనేది మాత్రం కాదనరాని వాస్తవం. ఇది నిజానికి ఆయా ఆయా... సీట్లలో ఉన్నవారు బాగా ఆలోచించు కోవాల్సిన అవసరం ఉంది. దాంట్లో శిక్షణ పొందాల్సిన అవసరం ఉంది, అనే మేము అనుకుంటున్నాం. నిజానికి మనం అన్నిటిని ఆదరించాలి కాని, అన్నిటినీ సమానంగా ట్రీట్ చేయాల్సిన అవసరం లేదు. తిరుమల తిరుపతి దేవస్థానం తరపున జరిగే

కార్యక్రమాలు కూడా ఆ ధర్మానికి ఆ నియమానికి వ్యతిరేకంగా జరుగరాదు. దాంట్లోఉండే వారు కూడాఅలా చేయటానికి వీల్లేదు. అది మేం తిరుమల తిరుపతి దేవస్థానం అధికారులతోటి, మన ముఖ్య మంత్రిగారితో కూడాచెప్పాం. దీన్ని ప్రోత్సహించాలి. అందుకోనవే ఇన్ని కరపత్రాలు వేయడానికి సిద్ధపడ్డాం. కాని ఇన్నింటికి మేం డబ్బిమ్మని అడగలేదు. వేమడిగింది ఉచితంగా వేము ఇవ్వదలచుకున్న పుస్తకాల్ని ఉచితంగా మేమివ్వలేం కాబట్టి వీటిని వేసియివ్వండి. మిగిలిన కరపత్రాలకు వేమెవర్నో అడుక్కుంటాం ఫరావాలేదు. 'బాబూ! నీ పేరు వేస్తాం ఓ 1000 కరపత్రాలు వేసివ్వండి' అంటే ఇస్తారు. ఆ పని మేం చేసుకుంటాం.

మా వికాసతరంగిణి కార్యకర్తలు రాష్ట్రంలో ఈ పని చేసిపెడతారు. దానికి వారు ఏమీ ప్రతిఫలాన్ని ఆశించరు. అయితే తిరగడానికి డబ్బులు ఖర్చు పెట్టే వ్యక్తులు ఉండకపోవచ్చు. మా వికాసతరంగిణి కార్యకర్తలలో చేపలు పట్టుకుబతికేవాళ్ళు ఉన్నారు. రైతు కూలీలు ఉన్నారు. తిరుమలలో జరిగిన యాగంలో సుమారు 10000వేల మంది వాలంటీర్లు పాల్గొన్నారు. వారు ఎంత చక్కగా సేవలందించి, కార్యక్రమం క్రమపద్ధతిలో వైభవంగా జరగడానికి కృషి చేసారో అప్పటి అధికారులకు జ్ఞాపకం ఉండేఉంటుందని మేం అనుకుంటున్నాం. మరి అలాంటివారు చేయాలనుకుంటే వారికీ సాధనాలు కావాలి కదా! అయితే గ్రామం గ్రామం వెళ్ళాలంటే ఎక్కువ సాధనాలు కావాలి కదా! ఒక ఊరు ఒక రోజు తిరగాలనుకుంటే ఒక జిల్లాలో కనీసం 500 దగ్గర నుంచి 1400 గ్రామాలు మన రాష్ట్రంలో ఉన్నాయి. మరి ఏడాదికి 365 రోజులే ఉన్నాయి. అందుచేత రెండు వెహికల్స్ ఒక జిల్లాలో అవసరమవుతాయి. మేం జిల్లాకు ఒక ధర్మరథం ఏర్పాటు చేసి ఇమ్మని అడుగుతున్నాం. దానితో ఈ కార్యక్రమం జరపటానికి. కృష్ణప్రతిమను ఉచితంగా ఇద్దాం. ఈ పుస్తకాలు ఉచితంగా ఇద్దాం. మిగతావన్నీ మేం చేస్తాం అని మేం అడిగాం.

అయితే దాంట్లో చాలారకాలైన ప్రశ్నలు ఈవేళ వస్తున్నాయి, మాకు, మఠానికి డబ్బు అక్కరలేదు. దేవుని దగ్గరనుంచి డబ్బులు తీసుకుని మఠాన్ని పోషించుకోవాల్సిన దౌర్భాగ్య స్థితికి మేం దిగజారలేదు. మా సంస్థలకు కూడా అలాంటి స్థితి ఎపుడు కూడా, మేం ఉన్నంతవరకు, రానేరాదు. దేవుడి క్రెడిబులిటీని మా సొంత అవసరాలకు వాడుకునేటటువంటి దురవస్థను మేము ఎపుడూ మా సంస్థలకు రానివ్వం. మేం ఒక లక్ష్యాన్ని తీసుకుంటే ఆ లక్ష్యానికి కట్టుబడి పనిచేస్తాం. ఇది మేం ఆత్మవిశ్వాసంతో చెప్పే మాట. మేం దేవునిమీద వినమ్రభక్తితో చెప్పేమాట.

నిజానికి ఒక స్వామివారికిచ్చినట్లయితే మిగతా మఠాలవారు కూడా అడుగుతారు కదా! లేక మిగతా మీడియా అంతా చేరి చాలా గడబిడ చేస్తుందని, ఎంతోమంది ఎన్నోమాటలు అనటం, ఇవన్నీ దేవస్థానానికి పెద్ద ఆబ్లిగేషన్‌గా తయారౌతుంది అనే భావన ఉన్నట్లయితే, మాకు ఆ వెహికల్స్ అక్కరలేదు. ఆ డబ్బూ అక్కరలేదు, ఆ ప్రింటింగ్ మెటీరియల్ మీరు మాకు వేసి ఇవ్వక్కరలేదు అని మేం **E.O.,** గారికి ఫోన్ చేసి చెప్పాం. **C.M.** తోనూ చెప్పాం.

ఇప్పటికీ మేం అదేమాట మీద కట్టుబడి ఉంటాం ఒకవేళ మీకు అది ఆబ్లిగేషన్ అనుకుంటే. వేం చేసే కార్యక్రమం ప్రకటించిన తరువాత చాలా మఠాలవారు





కూడ ఇలాంటి కార్యక్రమాలు చేయాలనే సంకల్పం చేయడం జరిగింది. మంచిది. దానిని కూడా అంగీకరిస్తాం. అయితే ఈ కార్యక్రమాన్ని ఏదో పోటీగా చేయాలనుకునే మనస్తత్వం ఆరోగ్యకరమైనది కాదని మేం స్పష్టం చేస్తున్నాం. మేం ఎపుడూ కూడా దాన్ని కాంపిటీషన్‌గా భావించడం లేదు.

తిరుమల తిరుపతి దేవస్థానం ఉండగా వేరే ఒక స్వామివారు ఎందుకు చేయాల్సి వచ్చింది అని ఒక పేపర్‌లో వచ్చింది. నలుగురు చేసే కార్యక్రమం లోకం బాగుపడటం కోసం జరిగే కార్యక్రమం ఆరోగ్యకరమైనది, అదీ సమాజానికి అవసరమైనది. నాలుగురకాల ధోరణులతో జరిగే కార్యక్రమం వల్ల గ్రామాల్లో చాలా అనర్థాలు ఏర్పడతాయనిఅధికారులు గుర్తించాల్సిన అవసరం ఉంది. నిజానికి అలాంటి స్థితి వచ్చి, మాకిస్తే 10 మందికి లేదనటం, లేక, ఇవ్వటానికి డబ్బులు లేకపోయేస్థితి, లేదూ, ఉన్నవాటిని దుర్వినియోగపరిచే స్థితి దేవస్థానానికి ఏర్పడినట్లయితే ఇప్పటికీ కూడ వేం అన్నమాటకు కట్టుబడేఉంటాం. **T.T.D.,**ని ఒక సందిగ్ధావస్థలో పెట్టే స్థితిని మేం ఎపుడూ తేం.

కానీ ఒకమాట. దేవస్థానానికి వచ్చే ప్రతీ భక్తుడూ ప్రతీపైసా ధర్మం కోసం వెళ్ళాలి అనే ఇస్తున్నాడు తప్ప ఎవరో కొంతమంది ఉద్యోగుల కోసం అని మాత్రం కాదు. అయితే అది జరగడానికి కొంత అడ్మినిస్ట్రేషన్ అవసరం. కొంత స్టాఫ్ అవసరం. వచ్చిన దాంట్లో కొంతభాగాన్ని వినియోగించుకోవడం అవసరమే. అది హద్దుమీరి ప్రవర్తించడం గాని, వారితిండి కోసమే దేవుడు ఉండటం సరి అయినది కాదు - దీనిని దేవుడు కూడా క్షమిస్తాడని మేం అనుకోం. అలాంటిది సమాజానికి ఆరోగ్యకరం కాదు.

**T.T.D.,** దేవస్థానానికి భాద్యతను గుర్తుచేయడమే మా తాత్పర్యం. దాని తరవాత చెయ్యడం, చెయ్యకపోవడం దేవస్థానపు అధికారుల పని. శ్రీమాన్ కృష్ణయ్య గారు సమర్థులు.వారికి సలహాలిచ్చే ధర్మ ప్రచారపరిషత్ అధికారులు యోగ్యులు. వారు విజ్ఞులు. కార్యక్రమాన్ని కష్టాలతో, నష్టాలతో ఆక్షేపణలు పట్టించుకోకుండా ముందుకు సాగించుకువస్తున్నారని మాకు తెలుసు. ఇలాంటివాటిని నిజానికి సమర్థించుకుంటూ రావడం చాలా కష్టమైన విషయం.

ఒక కొత్తపని చెయ్యనివాడిని ఎవడూ ఏమీ అనడు. కాని చేసేవాడిని ఎపుడూ 100 మంది నానారకాలుగా అనేవారు సమాజంలో ఉంటారని మాకూ తెలుసును. మేం నలుగురిలో తిరుగుతూ పనిచేసేవాళ్ళం.

ఏదైనా సెన్సేషనల్‌గా ఉండేది తప్ప సమాజానికి అవసరమైంది ముట్టుకోని స్థితిలోకి పోయింది ప్రస్తుత మీడియా.

'నేను చంపుతా వాడిని!' అంటే పేపర్‌లో మొదటి పేజీలో వార్త వస్తుంది. 'నాయనా! మనం నలుగురం కలిసిఉందాం!' అంటే కనీసం దానికి గుర్తింపు గూడా ఇవ్వన

టువంటి ప్రెస్ తయారైంది ఈవేళ మన రాష్ట్రంలో. దేశంలో కూడా......

హనుమంతుడు మనందరికీ కూడా చాలా గొప్ప స్ఫూర్తిదాత అని మనందరకూ తెలుసును. ఆయన వాయుపుత్రుడు మాత్రమే కాదు. సమాచారాన్ని అందించడంలో ఆయనకుండే సామర్ధ్యమును రాముడే చాలా గొప్పగా పొగిడాడు.

ఆహా! హనుమ! ఎంతగొప్పవాడివయ్యా! హే లక్ష్మణ్! జాగ్రత్తగా మాటలాడు అని వార్నింగ్ ఇచ్చాడు హనుమంతునితో మాట్లాడ డానికి, అంటే కమ్యునికేషన్ స్కిల్స్ చాలా బాగా ఉన్నవాడు హనుమంతుడు. అంచేత హనుమంతుడ్ని దీనికి సందేశాన్ని ప్రసరింప చేసేవాడుగా తీసుకున్నాం. అయితే ఆయన సంజీవిని ద్వారా ఎంతోమందిని బతికించాడు. ఆ సంజీవిని మనందరికీ **'గీతాజ్యోతి సందేశం'** కావాలని హనుమ, ఆయన చేతిలో ఒక సంజీవిని పర్వతం, ఆ పర్వతంలో ఉపదేశం చేస్తూండే టటువంటి శ్రీకృష్ణుడు ఉండే జండా తయారు చేయడం జరిగింది.

ఈ గీతాజ్యోతి కార్యక్రమానికి జెట్ సభ్యులు తోడ్పడగా వికాసతరంగిణి కార్యకర్తలు సారధులుగా ఉంటారని, అందరం కలసి ఈ గీతాజ్యోతి కార్యక్రమాన్ని ఆచరిద్దాం రండి!! అని శ్రీస్వామివారు కార్యక్రమాన్ని తెలిపే కరపత్రములు, హనుమ ధ్వజమును ఆవిష్కరించి అందరికి మంగళా శాసనములు కృపచేసి సభను ముగించారు.



9/
bnmay02.p65



## గీతాజ్యోతి-శ్రీ స్వామి వారి సందేశం

మీడియా: జెమినీ T.V.
సమయం: ప్రతీ ఆదివారం ఉదయం 6-00 గంటలకు

- భక్తినివేదన

## జీవనవికాస్ (మార్టూరు)

ప్రతిభావంతులైన బీదవిద్యార్థులను ప్రకాశం జిల్లా మార్టూరు జెట్ జీవన వికాస్‌లో 5,6,7 తరగతులలో చేర్చుకొనుటకు, మీ గ్రామ వికాసతరంగిణి కార్యదర్శిద్వారా తమ బయోడేటాతో దరఖాస్తులు తేది : 15-5-2002లోపల, స్వంత చిరునామా గల కవరుతో, ఈ దిగువ చిరునామాకు పంపిన, పరీక్షల తేదీ, స్థలము వెంటనే తెలియజేయబడును. దరఖాస్తులు పంపవలసిన చిరునామా

కె. కోటేశ్వరరావు, కో ఆర్డినేటరు
జీవన వికాస్ జెట్, మార్టూరు
ప్రకాశం జిల్లా - 523301, ✆ : 08404 - 71163

## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషిచేస్తున్నవారిలో ఒకరిగా శ్రీమాన్ జె. దామోదర దాసిగారు, (తాడిపత్రి) ప్రతినెలా ఎంతోమందిని కలుస్తూ, వారికిమన భక్తినివేదనను పరిచయంచేస్తూ, వారందరినీ మన కుటుంబంలో కలుపుతున్నారు. వీరి కృషి మరింత ఫలప్రదం కావాలని శ్రీశ్రీశ్రీస్వామివారి మంగళాశాసనములు అందిస్తున్నాం.

జై శ్రీమన్నారాయణ!

సంపాదకీయం

# లోకం కోసం చూడకు - నీ పని చేసుకో

మనిషి ఓ పని చేస్తే అది తన కోసమైనా, సమాజంకోసమైనా లోక స్పందన దానిపై ఎల్లా ఉందో గమనిస్తాడు. ఇది చాలా సాధారణం. ''లోకం అనేది ఒకటుంది'' ''లోకం కళ్ళు కప్పలేం'' ''లోకం చూస్తోంది'' మొదలైన మాటలు దీనికి ఉపబలకాలు.

అంతేకాదు, ''తన అన్నం తాను తిని తనబట్టతాను కట్టి లోకానికి వెరవాలి'' - అన్నారు. లోకం మెప్పు పొందని ఏ మాటా, పనీ చెల్లుబాటుకు రావన్నమాట.

అయితే లోకులు కాకులు, ఏదో కూస్తూనే ఉంటారు. వాటిని పట్టించుకుంటే ఎలా అనే అభిప్రాయమూ లేకపోలేదు.

లోకం కోసం చూడకుండా మనిషి తనపని తాను చేసుకోవడానికి సిద్ధపడాలి. చాలా తెగువతో అంటున్నాడీ మాటను నీతికారుడు.

**లోకస్తుష్యతు మావా**
**స్వకార్య నివృత్తయే ప్రయతితవ్యం**
**లోక ప్రతీక్షణ పరో**
**నరో న కృతకృత్యతాం యాతి**

లోకం సంతోషించనీ మాననీ - మనిషి తన పని తాను చేసుకుపోతూ ఉండాలి. లోకం కోసం దాని మెప్పు కోసం నిరీక్షిస్తూ కూచునేవాడు ఎప్పటికీ ఏమీ చేసుకోలేడు.

లోకాన్ని సొంతం తీసి పారేయడమేనా? మరి ఇంతకాలం పెద్దలు లోకాన్ని పెద్దగా చూపి, నీ ప్రతి పనికీ లోకామోదం ఉండాలన్నట్టు చెప్పేరు కదా! అవును, చెప్పేరు. నీ పని నువ్వు చేసుకో. లోకం పని అది చేసుకుంటుంది. అధికారి ఆమోదం కోసం సేవకుడు నిరీక్షించినట్టు ప్రతి పనికీ నువ్వు లోకం మొగం చూడనక్కరలేదు.

లోకం అంటే ఏమిటీ? మానవ సమాజం. ఇందులో ఎందరో ఉంటారు. ఎన్నోరకాల బుద్ధులవారు, సంస్కారాలవారు ఉంటారు. వీరంతా ఎప్పుడూ ఏకాభిప్రాయానికి రారు. కొందరొకలా అంటే మరి కొందరు మరొకలా అంటారు. ఇప్పుడు ఆ కొందరా లోకం అంటే? ఈ మరి కొందరా? ఎవరినో ఒకరిని మెప్పించగలవు కాని, అందరినీ మెప్పించలేవు కదా! మరి ఇప్పుడు ఒక లోకం కాదంటోంది, ఒక లోకం అవునంటోంది. ఎవరొప్పు? ఎవరుతప్పు? ఎప్పుడూ ఒక వర్గం నీకు వ్యతిరేకమే కనక అసలు వారిని పట్టించుకోకు.

మంచిచెడ్డలు ఆలోచించు. నీమేలు చూసుకో. న్యాయం, ధర్మం పరిశీలించు. నీవల్ల ఒరులకు కీడు కలగకుండా చూసుకో, నీ పని చేసుకుపో. లోకం మెచ్చుకుంటుంది. కొంత లోకం మెచ్చుకోదు. ఆ మెచ్చుకోవడం పట్టించుకోకు. ఈ మెచ్చుకోకపోవడమూ పట్టించుకోకు. నీ కార్యం నెరవేర్చుకో. లోకం మెచ్చిందీ సంతోషం. మెచ్చలేదూ సంతోషం. ఆ వర్గాన్ని మెప్పించే ప్రయత్నం నీది కాదు. ఏ వర్గాన్నీ నువ్వు మెప్పించనక్కరలేదు. అదే మెచ్చుకుంటుంది. అదే మెచ్చుకోదు. అవి ఆనుషంగికాలు.

నువ్వు ఉద్యమించేటప్పుడు మటుకు ధర్మాధర్మాలు చూడు. న్యాయా న్యాయాలు పట్టించుకో. నీ హితం చూసుకో. పరులకు అహితం కలక్కుండా చూసుకో దూసుకపో. నువ్వు లోకం వెంట పడకు. లోకం తానే నీ వెంటవస్తుంది. రానిలోకం ఎప్పుడూ ఉంటుంది. దాన్ని కలుపుకుని మరీ వెడదామని నిరీక్షిస్తూ నిలిచిపోకు. అట్లా నిలిచిపోతే మట్టుకు జీవితంలో అడుగు ముందుకు వేయలేవు.

- శ్రీరామచంద్రాచార్య

10/
bnmay02.p65



# మహర్షుల చరిత్ర

తమిళమూలం : శ్రీ.వా. నావల్పాకం దేవనాథ తాతాచార్యస్వామి
తెలుగు సేత : శ్రీ.ఉ.వే. శ్రీమాన్ తూపురాణి ఉడయవర్స్వామి, విజయవాడ

భరద్వాజ మహర్షికి రామాయణ ఆవిర్భావ కారణభూతుడు అనే గొప్పతనం కూడ ఉంది. భరద్వాజ మహర్షి తన జీవిత కాలంలో అనేకమంది మహర్షుల దగ్గర శిష్యరికం చేసి వేదాధ్యయనం చేసాడు. వాల్మీకి మహర్షి దగ్గర ఈయన శిష్యుడుగా ఉన్నపుడే వాల్మీకి, రామాయణ మహాకావ్యాన్ని వ్రాయడం జరిగింది.

మిట్టమధ్యాహ్నం, జనసంచారం లేని అరణ్యంలో వాల్మీకి, అతని శిష్యుడైన భరద్వాజుడు మధ్యాహ్నస్నానం కోసం తమసా నదీ తీరానికి చేరారు. అపుడు వాల్మీకి భరద్వాజునితో ''ఓ భరద్వాజా! తమసానది నీరు ఎంత స్వచ్ఛంగా, నిర్మలంగా ఉందోచూడు, మంచి వాళ్ల మనస్సు లాగా ఎంత అందంగా ఉందో! అంటూ చెప్పిన శ్లోకం వ్రాయబోయే రామాయణకవితా ప్రవాహానికి ముందుగానే వాల్మీకి హృదయంలో ఆవిర్భవించింది. నదిలోని ఇసుకతిన్నెలలో బయలు దేరే చిన్న ఊటనీటికాలువలు, రాబోయే వరద ప్రవాహాన్ని తెలియజేసినట్లుగా ఈ క్రింది శ్లోకం అతని నోటి వెంట బయలుదేరి వ్రాయబోయే రామాయణ మహాకావ్యానికి నాంది పలికింది. దీనికి సాక్షిగా ఉన్నవాడు భరద్వాజముని ఒక్కడే.

**అకర్దమమిదం తీర్థం భరద్వాజ నిశామయ।**
**రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనోయథా॥**

అంటూ రామాయణ ఆవిర్భావానికి కొద్ది ముందు భరద్వాజమునిని చూచి వాల్మీకి చెప్పినది ఈ శ్లోకం. చక్కటి కవిత తన మనసులో ఆవిర్భవించిన వెంటనే, తన దగ్గరే ఉన్న సహృదయుడైన భరద్వాజునితో తన ఆనందాన్ని పంచుకోకుండా ఉండలేకపోయాడు వాల్మీకి. మధుర పదార్థాన్ని ఒంటరిగా అనుభవించకూడదు అని మాత్రమే కాక తనతో అన్నివిధాలా సమానుడై, రసికుడైన భరద్వాజుడు ప్రక్కనుండగా వాల్మీకి ఆతనికి చెప్పకుండ ఎట్లు ఉండగలడు?

ఈ విధంగా రామాయణానికి ముందుగా ఆవిర్భవించిన ఈ శ్లోకం, వాల్మీకి తన శిష్యుడైన భరద్వాజునికి చెప్పినట్లుగా నున్న కథా సందర్భాన్ని పట్టి రామాయణ ఆవిర్భావానికి భరద్వాజుడు కూడ ఒక కారణము అని, అది ఆ మహర్షి గొప్పతనాన్ని సూచిస్తుందని మనం గ్రహించవచ్చు.

**తగిన పేరు** : ఋగ్ వేదములో వచ్చే అనేక సూక్తాలకు భరద్వాజుడే ఋషి. సామవేదంలో భరద్వాజుని పేరుతో ఒక సామము ఈనాటికీ పఠించబడుతూ ఉంది. యజుర్వేదంలో ఆరంభంలోనే ఈ మహర్షిని గుఱించిన ప్రస్తావన కనిపించుచున్నది. ఈయన పేరే ఈయన చరిత్ర చెప్పుటకు తగినట్లుగా ఉన్నది.

భరద్వాజ అనే పదానికి గంభీరమైన అర్థాలు అనేకం ఉన్నాయి. ఈ పదాన్ని భరద్, వాజ అను రెండుగా విడదీసి అర్థం చెబుతారు. అందులో భరత్ అను మొదటి పదానికి - భరించువాడు, మోయువాడు, రక్షించువాడు అని అర్థం. ఇక రెండవపదం 'వాజ' అనునది భరింపబడే వస్తువుని తెలియజేస్తుంది. అందుచే భరద్వాజ అనే పదానికి 'వాజి'ని భరించేవాడు అని అర్థం తేలింది. మరి వాజి అంటే ఏమిటి? ఆ పదానికి అర్థం తెలిస్తే గదా 'భరద్వాజ' అనే పదానికి పూర్తి అర్థం తెలిసేది.

'వాజ' అనే పదానికి అనేక అర్థాలు ఉన్నాయి. 'ఓజస్' అనే పదమే 'వాజ' గా మారింది. దేహకాంతి, దేహదార్ఢ్యము, వాజమ్ అనే పేరుతో పిలువబడతాయి. వీటిని ధరించినవాడు (కలవాడు) కావడం చేత ఇతడు భరద్వాజుడు అని పిలువ బడ్డాడు. నల్లగా, బలిష్ఠంగా ఉండే ఒక పక్షిని కూడ భరద్వాజ పక్షి అని పిలుస్తారు.

ఈ 'వాజ' అనే పదానికి శ్రేష్ఠమైన అర్థాలు అనేకం ఉన్నాయి. వాజ' - అన్నము, వేగము, సంపద, తిను బండారము, బియ్యము, జలము, నెయ్యి, బహుమానము, యాగములో హోమద్రవ్య ముగా సమర్పించుటకు ఉంచిన హవిస్సు అని ఈ పదానికి అనేక అర్థములున్నవి. వీటిని అన్నిటిని భరించినవాడగుటచే ఈతనికి భరద్వాజుడను పేరు ఏర్పడినది. ఒక కుటుంబము కాపాడువానిని - కుటుంబ భరణం చేయుచున్నాడు, కుటుంబ భారాన్ని మోయుచున్నాడు అని అంటారు గదా! అనగా కుటుంబరక్షణము వహించువాడని అర్థము. మన రక్షణకు సంబంధించిన బరువును 'భరం' అని అంటారు. ఈ (మన రక్షణ) భారాన్ని భగవంతుని యందు ఉంచుటయే 'భరన్యాసము' అనబడు తుంది. ఈ రీతిగా ఈ మహర్షి 'భరద్వాజ మహర్షి' అయినాడు.

**భరే సుతాన్ భరే శిష్యాన్, భరే దేవాన్, భరే ద్విజాన్।**
**భరే భార్యాం భరద్వాజాం, భరద్వాజోస్మి శోభనే॥**

అనునది మహాభారత శ్లోకము. సంతానము, శిష్యులు, దేవతలు, బ్రాహ్మణులు, నా పేరేకల (భరద్వాజా) భార్య ఇందరను భరించుటచే భరద్వాజ అను పేరు నాకు ఏర్పడినది-అని శ్లోకమునకు భావము.





# శ్రీవిష్ణు మహాపురాణం

## ప్రథమాంశం - చతుర్థోధ్యాయం

**శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, కొవ్వూరు.**

స్వామి వరాహ రూపాన్ని ధరించి భూ సముద్ధరణానికై సముద్యమించాడు. స్వామి ఘుర్ఘురధ్వని చేస్తూ ఉంటే సామవేద కమనీయ స్వరం వినిపిస్తున్నది.

**తతః సముక్షిప్య ధరాః స్వదంష్ట్రయా**
**మహావరాహః స్ఫుట పద్మలోచనః।**
**రసాతలాదుత్పల పత్రసన్నిభః**
**సముత్థితో నీలఇవాచలో మహాన్॥**

స్వామి తన కోరలతో పాతాలాంతర్గత అయిన భూమినిపైకి సముద్ధరించాడట. విశాలంగా వికసించిన పద్మాల్లా ఉన్న నేత్రాలతో మహావరాహరూపి అయిన స్వామి, భూమిని పైకెత్తుతూ నల్లని కలవవంటి దేహచ్ఛాయ కలగి ఒక మహావినీలగిరిలా పైకి లేచినాడట.

పైకిలేస్తూ తన ముఖం నుండి ఆవిర్భవించిన వాయువులతో జలాలను పైకి చిమ్ముతూ ఉంటే, ముఖవాయు సముత్థితమైన జలం పైనున్న జనలోకవాసులపై పడిందట. పై లోకాలలో ఈ సన్నివేశాన్ని సానందంగా దర్శిస్తున్న సనకసనందనాది మహర్షుల స్వాభావిక పరిపూతులైనవారిని పరమ పావనులగా చేసిందట ఆ జలం.

స్వామి యొక్క కాలిగిట్టల తాకిడికి లోతైన రంధ్రాలు భూమి పైభాగం నుండి రసాతలంవరకు ఏర్పడగా, ఆ రంధ్రాల లోనికి జలం ధ్వని చేస్తూ వేగంగా ప్రవేశించ సాగిందట. ఇక స్వామి యొక్క నిఃశ్వాస వాయువులు సిద్ధజనులున్న దిక్కులవైపున నలువైపులా ప్రసరించ సాగాయి.

ఇలా పైకి లేసన్తూ, ఒక్కసారి తన జలార్ద్రమైన శరీరాన్ని ఇటూ అటూ వేగంగా విదిలించగా, గుహకూపాల్లో నెలవులు ఏర్పరచుకొని ఉన్న మహర్షులు స్తుతించ సాగారట.

వీరే కాదు. జనాదిలోకాల్లో ఉన్న సనందనాది మహ ర్షులు కూడా స్తుతింపసాగారు. ఆ స్తుతిని పరాశరులు ఇలా ఉపస్థాపనం చేశారు.

**జయేశ్వరాణాం పరమేశ! కేశవ!**
**ప్రభో! గదా శంఖ ధరాసిచక్రధృక్।**
**ప్రసూతినాశస్థితి హేతురీశ్వరః**
**త్వమేవ నాన్యత్ వరమం చ యత్పదమ్॥**

**పాదేషు వేదాస్తవ యూపదంష్ట్రా**
**దన్తేషు యజ్ఞాః చితయశ్చ వక్త్రే।**
**హుతాశ జిహ్వోసి తనూరుహాణి**
**దర్భాః ప్రభో యజ్ఞపుమాంస్త్వమేవ॥**

ఈశ్వరునికే నియామకుడవైన ఓ పరమేశ్వరా! కేశవా! ప్రభూ! గదా-శంఖ-ధారీ! ఖడ్గచక్రాలను ధరించినవాడా! సమస్త జగత్తు యొక్క పుట్టుక-ఉనికి-నాశనాలకు కారణమైన నీవే వరమప్రాప్యమైన 'వరమపద' స్థానానివి. నీ పాదాల్లో వేదాలున్నాయి.

నీ కోరలే యూప స్తంభాలు. దన్తాల్లో యజ్ఞాలున్నాయి. నీ ముఖంలో చితులున్నాయి (చితి అంటే హవిర్ద్ర వ్యాలనుంచే యజ్ఞస్థలం. "శ్యేనచితంచిన్తీ కంకచితం

చిన్వీత" ఇత్యాది శ్రుతి వచనాల్లో చెప్పబడి ఉన్నాయి ఇలాంటి చితువే), హుతా శనుడు (అగ్ని) నీ నాలుక. నీ శరీరం పై గల రోమాలు దర్భలు. కనుక ఈ విధంగా నీవు యజ్ఞపురుషుడవే.

**విలోచనే రాత్ర్యహనీ మహత్మన్**
**సర్వాశ్రయం బ్రహ్మపరం శిరస్తే।**
**సూక్తాన్యశేషాణి సటాకలాపః**
**ఘ్రాణం సమస్తాని హమీషిదేవ॥**

రాత్రింబవళ్లు నీ కన్నులు. ఓ మహాత్మా! నీ శిరస్సు సమస్తానికీ ఆశ్రయమైన 'ప్రణవం' (ఓంకారం)! సమస్త వైదికసూక్తాలు నీ శిరస్సు పైనున్న జడలు(కేశపాశాలు) నీ ముక్కు సమస్తహవిర్ద్రవ్యాలు.

**సృక్‌తుండ సామస్వర ధీరనాద!**
**ప్రాగ్వంశ కాయాఖిల సత్ర సంధే।**
**పూర్తేష్ట ధర్మశ్రవణోసి దేవ!**
**సనాతనాత్మక! భగవన్ ప్రసీద॥**

నీ తుండము(ముఖము) 'సృక్' అనే హవిఃప్రక్షేపణ సాధనం. (సృక్కనే సాధనంలో నేతిని అగ్నిలో ఉంచడం జరుగుతుంది. ఆ సృక్కు వరాహస్వామి యొక్క ముఖం వంటి ఆకృతి కలిగి ఉంటుంది కనుక సృక్కుగా చెప్పబడింది) ధీరమైన నాదం సామస్వరం లాఉంది. సామవేదస్వరంగా గంభీరమైన నాదం కలవాడు స్వామి అన్నమాట. స్వామి యొక్క శరీరం ప్రాగ్వంశం. (ప్రాగ్వంశమంటే అగ్నిశాల యొక్క తూర్పువైపున ఉన్న ప్రదేశం) సమస్తమైన నీ సంధులు సత్రాలు (ద్వాదశాహం మొదలైన యాగాలను "సత్రా"లని అంటారు. ఇవి స్వామి యొక్క శరీరావయవాల సంధిభాగాలుగా చెప్పబడ్డాయి). ఓ స్వామీ! ధర్మశాస్త్రాలచే చెప్పబడిన ఖాతం(చెరువులు త్రవ్వడం) మొదలైన ధర్మాలు, వైదికాలైన యాగాలు, ఇవన్నీ నీ శ్రవణేంద్రియాలు. ఓ సనాతన స్వరూపా! భగవన్! ప్రసన్నుడవు కమ్ము.

**పదక్రమాక్రాన్త భువం భవన్తమ్**
**ఆదిస్థితం చాక్షర విశ్వమూర్తే।**
**విశ్వస్యవిద్మః పరమేశ్వరోసి**
**ప్రసీద నాథోసి పరావరస్య॥**



12/
bnmay02.p65



# తేనెవాక

**శ్రీ తిరుమఴిశైయాళ్వార్ - నాన్ముకన్ తిరువన్దాతి**

'మధురవాక్ శిఖామణి', 'భాగవతామృతవర్షి'
శ్రీ.ఉ.వే.శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్యస్వామి, సింహాచలం

**స్వపురుషమభివీక్ష్య పాశహస్తం**
**వదతి యమఃకిల తస్య కర్ణమూలే।**
**పరిహర మధుసూదన ప్రపన్నాన్**
**ప్రభురహమన్యనృణాం న వైష్ణవానామ్॥**

**"పరిహర మధుసూదన ప్రపన్నాన్"**- మధువను వానిని సంహరించిన భగవానుని ఆశ్రయించినవారిని విడిచిపెట్టివేయండి అనునవి యముని పలుకులు. వారి ఆయుష్కాలము తీఱిపోయినది కదాయని వారిని తీసుకొనివచ్చుటకై వారి వద్దకు వెళ్ళినారా! మిమ్ములను పరమసాత్త్వికులగు తన భక్తుల వద్దకు పంపిన నేరమునకు భగవానుని చేతిలో మధువనువానికి పట్టిన గతియే నాకును పట్టును. కావున జాగ్రత్తసుడీ అనుచున్నాడు.

అందుకు యమభటులు అందరినీ శాసించు యముడవు నీవొకడివే కదా! ఏల ఇతరులకు భయపడుట? ఏల కొందరిని స్వీకరించుట? కొందరిని విడచి వేయుట? అని అడుగగా దానికి సమాధాన మును ఇట్లు తెలుపుచున్నాడు.

**అహమమరవరార్చితేనధాత్రా**
**యమ ఇతి లోకహితాహితే నియుక్తః।**
**హరిగురువశగోఽస్మి న స్వతన్త్రః**
**ప్రభావతి సంయమనే మమాపివిష్ణుః॥**

నాకీ ఉద్యోగవెట్లు వచ్చినదో తెలుసునా? సమస్త దేవ సంసేవ్యమాన చరణారవిందుడు, సర్వ నియంత, సృష్టికర్త యగు పరమాత్మచేత ఈ పదవియందు నియుక్తుడనైతిని. ఆయన ఆజ్ఞలను నేను పాటించ వలసినదే తప్ప స్వతంత్రుడను గాను. వా ప్రభుత్వము అందరిపై చెల్లును కాని **"న వైష్ణవానాం"** విష్ణుభక్తులగు వారిపై నాయధి కారము చెల్లదు.

ఏలనన, అనవరతము భగవద్భావనా వాసితాంతఃకరణులై, ఒక్కక్షణము భగవదనుభవమునకు హాని కలిగినా అదియే తమకు హానియని, తమ సొమ్మంతయూ దొంగలింపబడిన వాడెట్లు దుఃఖించునో అట్లు దుఃఖించు దివ్యస్వభావము కలవారై, భగవానుని దివ్య గుణములను అనుసంధించినంతనే ప్రేమ పారవశ్యముతో శిథిలాంతఃకరణులై యుండు నట్టి ఆ భక్తులను పరమప్రీతితో భగవానుడు తానే రక్షించుచుండును. కనుక మన భావనలో వారేమైనా తప్పులు చేసినట్లు తోచినా వారి విషయములో కలుగజేసుకొనుటకు మనకు ఎట్టి అధికారమూ లేదు. వారికి సంబంధించిన సమస్త విషయములనూ పరమాత్మయే చూచుకొనును.

**'భక్తానాత్మశరీరవత్'** అనినందున తన శరీరమును వలె వారిని సదా సంరక్షించుకొను చుండును. కావున వారి గుణదోషముల నెంచుటకు కాని, వారిపై చర్యనుతీసుకొను టకు కాని మనకు అధికారము లేదు. మీ ప్రవర్తనము వలన భగవానునికి నా పై ఆగ్రహము కలిగెనా, నా పదవికి నీళ్ళొదలు కొనవలసినదే! అందుచేత విష్ణుభక్తుల జోలికి మీరు వెళ్ళవలదు. వారి వైభవము వాచామ

గోచరము. ఇచట భాగవతములోని యముని పలుకులను స్మరిద్దాం.

**"తేదేవ సిద్ధాపరిగీత సమస్త గాథాః"**- వారి చరిత్ర దేవతలుచే, సిద్ధులచే పాటలుగా కట్టి కీర్తింపబడుచుండును. **"సాధవః సమదృశో భగవత్ప్రపన్నాః"** వారు సాధువులు. సాధువు లెట్లుందురో భగవద్గీతయందలి **"పరిత్రాణాయ సాధూనాం"** అనుచోట భగవద్రామానుజులు వర్ణించినారు. భగవంతుని దర్శనమునే ధారణపోషకములుగా తలంచువారు సాధువులు. లోకములోనివారెట్లు అన్నపానాది కములను ధారణ పోషణాదికములుగా తలంచి అవి దొరుకకపోయిన ధరించలేరో అట్లే సాధుపురుషులును భగవద్దర్శనా దికములు లభించకపోయిన ధరించలేనివారై యుందురు.

భగవద్దర్శనము క్షణ మాత్రకాలము లభించకపోయినా అది కల్పసహస్రము వలె వారికి తోచును. అట్టివారి కొరకే అసలు భగవానుని అవతారమట. ఇదీ వైష్ణవుల స్థితి. **"సమదృశః"** అందరియందు సమత్వ భావననే చేయువారు. ఇట్లు తమను ద్వేషించు వారియందు, ప్రేమించువారి యందు, ఔదాసీన్యము వహించియుండు వారియందు కూడ సమత్వభావనను కలిగి యుందురు. సమత్వ మనగా 'మా' అనునది జగన్మాత లక్ష్మీదేవికి పేరు. ఆమెతో నిరంతరము కూడియుండు వాడు కావున శ్రీమన్నారాయణుడు 'సమః' అనబడు చున్నాడు. ఆ భగవానుడినే అందరి యందూ దర్శించుట వలన అందరినీ ప్రేమించు దివ్య స్వభావమును కలవారు. **'భగవత్ప్ర పన్నాః'** భగవనునే ఆశ్రయించు యుండు వారు. ఈ మాటనే ఆళ్వార్లు ఈ పాశురములో **"మణన్దుమ్ పుణమ్ తొళ్ళు వూన్దరో"** అని వివరిస్తారు. దాని వివరణను మరుసటి సంచికలో తెలుసుకుందామా మరి!










# స్తవ ప్రియుడు

శ్రీమాన్ కె.ఇ. స్థలశాయి, భద్రాచలం.

'జన్తూనాం నరజన్మ దుర్లభం' అన్నట్లు మానవజన్మ దుర్లభమైనది. ఉత్తమమైన మానవజన్మమెత్తినందుకు జన్మను సార్థక పరచుకోవటానికి ప్రయత్నించాలి. జన్మ సార్థకం కావటానికి మాధవసేవయే సరియైన సాధనం. సదా భగవానుని సేవలో కాలం గడుపుతూ అతని అనుగ్రహాన్ని పొందటమే జన్మ చరితార్థతకు మూలధనం. ఆతని అనుగ్రహం మనపై ప్రసరించటానికి మనస్సు, వాక్కు, క్రియ లనే మూడు కరణాలనూ ఏకం చేసి సేవిస్తే చాలు - అతడు మన పాలిట కోరిన కోర్కెలు తీర్చే కల్పవృక్షమే అవుతాడు. అందుకే ఆండాళ్ తల్లి **"తూమలర్ తూవి త్తొళ్ళు దు వాయినాల్ పాడి మనత్తినాల్ శిన్దిక్క"** " మంచి శుద్ధమైన పుష్పములను దేవుని పాదముల పై చల్లి, నోటితో ఆతని నామములను(పేర్లు) స్తుతించి, మనసులో అతని దివ్యమంగళ విగ్రహాన్ని భావిస్తే చాలు మనం ఇంతకు ముందు చేసిన 'సంచితములు' అని పిలువబడే పాపాలు, మనం ఇపుడు చేస్తే రాబోయే 'ఆగాములు' అని పిలువబడే పాపాలు నిప్పులో పడిన దూదివలె భస్మమవుతాయని" తన 'తిరుప్పావై' ప్రబంధంలో అంటుంది. ఆండాళ్ తల్లి భావాన్నే శ్రీ త్యాగరాజస్వామి వారు **'తనువుచే వందనమొనరించు చున్నారా'** అంటూ, సీతాలక్ష్మణులిద్దరూ శ్రీరామ చంద్రుని కిరువైపులా దగ్గరగాఉండి సేవ చేసుకొనే భాగ్యాన్ని ఏ సుకృతం చేసి పొందారు హనుమా! వారు చేసే సేవ తనువుతోనా? వాక్కుతోనా? మనసు తోనా? లేక ఆ మూడిటి తోనా? **"నెనరుంచి త్యాగరాజునితో"** చెప్పవయ్యా అని ప్రార్థిస్తారు. దక్షిణదేశానికి చెందిన మహాభక్తులు, పన్నిద్దరాళ్వారులలో ఒకరైన తిరుమంగైఆళ్వార్ "భరదనుమ్ తమ్బి శత్తురుక్కను మిలక్కుమనోడు వైదిలియుమ్, ఇరవునన్ వగలుమ్ తుదిశెయ్యనిన్ఱ విరావ ణాన్దగనై యెమ్మాన్నై(**భరతుడు, ఆతని తమ్ముడు శత్రుఘ్నుడు, సీతాలక్ష్మణులు సదా స్తోత్రము చేయుచుండగా నిలచియున్న రావణాంతకుడైన నా స్వామి శ్రీరామ చంద్రుడు**) అని, ఎల్లప్పుడూ భగవంతుని స్తుతిస్తూనే ఆతని అనుగ్రహానికి భరతాదులు పాత్రులయ్యారని, మనస్సు-క్రియల సహవాసం(కలయిక) అవసరం లేకుండా కేవలం వాక్కుతో చేసే స్తోత్రానికున్న గొప్పత నాన్ని వివరించారు తమ '**పెరియతిరుమొళ్ళి**'అను ప్రబంధంలో.

ఇక్కడ మనకొక సందేహం కలుగుతుంది. అదేమిటంటే 'మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః' అన్నట్లు మనస్సు చాలా ముఖ్యమైనది కదా! అది ఏకాగ్రమై లక్ష్యమైన భగవానుని యందు లగ్నమవటమే కదా మానసికమైన సేవంటే. అపుడు మానసికమలైన ధ్యానాదులేకదా భగవదనుగ్రహాన్ని లభింపచేసేవి. మరి, మరి, మనస్సుతో పని లేకుండానే కేవలం వాక్కుతో చేసే స్తోత్రం భగవదనుగ్రహాన్ని లభింపచేస్తుందా? **మనసు స్వాధీనమైన**

**భునునికి మరి మంత్రతంత్రములేల** అని శ్రీత్యాగరాజస్వామివారు, మనసుతో కలవక నోటి మాటలుగా పలికే స్తోత్రాలు, తనువుతో చేసే పూజాది క్రియలు వ్యర్ధములని అభిప్రాయపడతారు. **సంతతము శ్రీకాంత స్వాంత సిద్ధాంతమైన మార్గచింతలేనివారు ఎంతనేర్చినా ఎంతచూచినా ఎంతవారలైనా కాంతదాసులే** అంటూ మానసికమైన భగవచ్చింతనే ఫలదాయకమని, ''తెలిసి రామచింతన' చేయమని హితవు చెపుతారు.

నిజంగా మానసికమైన సేవ చాలా గొప్పది. అందులో సందేహం ఏ మాత్రం లేదు. ఈ మానసిక సేవ చేసేవారిని 'మునులు' అంటారనీ, తనువుతో సేవ చేసేవారిని 'యోగులు' అంటారనీ తన 'తిరుప్పావై' ప్రబంధంలో ఆండాళ్ తల్లి అంటుంది. కానీ, ఈ రెండు సేవలూ కూడ గొప్ప శ్రమతో కూడినవి కష్టసాధ్యమైనవీను. వాక్కుతో చేసే స్తోత్రసేవ చాలా సులభమైనది. మానసిక సేవకు, శారీరకమైన క్రియారూప సేవకు సహాయకారియైనది. పైగా వాటిలా ఇతర సాపేక్షముగా ఉండక నిరపేక్షమై స్వతంత్రంగా భగవదనుగ్రహాన్ని లభింపచేస్తుంది. పై రెండు సేవలకూ యోగ్యులయ్యే విధంగా ప్రేరేపిస్తుంది. అందువల్లనే భగవంతునికి కూడ స్తోత్ర సేవంటేనే ఇష్టమని 'విష్ణు సహస్రనామ స్తోత్రం' లోని 'స్తవ్యః స్తవ ప్రియః స్తోత్రం' అనే నామాల(పేర్ల) వల్ల తెలుస్తుంది. 'స్తోత్రము చేయదగినవాడు, స్తోత్రమంటే ఇష్టపడేవాడు, స్తోత్రస్వరూపుడు' అని పై నామాలకు అర్థం. వేదాన్తదేశికులు అనే పూర్వాచార్యులు తమ **'దీపప్రకాశ స్తోత్రం'**లో భగవంతుణ్ణి స్తుతిస్తూ **స్తవ్యం స్తవప్రియ మతః శరణోక్తి వశ్యం** అని అంటారు. దైవానుగ్రహం కలగాలంటే ఆయనను స్తుతించాలనీ, అలాగే పూర్తిగా త్రికరణశుద్ధిగా **దైవమా! నీవే తప్ప నితః పరంబెరుగ మన్నింపందగున్ దీనునిన్** అంటూ సంపూర్ణ శరణాగతి చేయాలనీ నియమం లేదు. కేవలం నోటిమాటగా 'పాహిమాం ప్రభూ! శరణు' అంటే చాలు, ఆయన అనుగ్రహం లభిస్తుంది అంటారు.










# సందేహాలు - సమాధానాలు

శ్రీమాన్ జి. సత్యనారాయణ, సిరిపురం, నల్గొండ జిల్లా.

ప్ర: కృష్ణుడు భగవంతుడే అయినా మరణించక తప్పలేదు. భగవంతునికి కూడా మరణం వుంటుందా? అదే, రామునికి అలా జరుగలేదు కదా?

**జ : ఈ ప్రపంచమొక క్రీడాంగణం. ఆటకి కొన్ని నియమాలుంటాయి. ఆటను కనిపెట్టినవాడైనా ఆ ఆటలో పాల్గొన్నంతసేపూ ఆ ఆటనియమాలు పాటించవలసిందే. లేకపోతే ఆట విరసమౌతుంది. పరమాత్మ రామునిగా, కృష్ణునిగ ఈ భువిలో అవతరించినా, ఇక్కడ తానేర్పరచిన నియమాలకి విరుద్ధం కాకుండానే చూసుకుంటూ తన పనులు చేసుకుపోతాడు. కదిలే ప్రతివస్తువూ, ఒకనాడు పుట్టినట్టే, గిట్టవలసిందే. తానైనా, కదిలే అవతారాలైతే అవి చాలించివెళ్ళడం గూడ కదిలే జంగమముల వలెనే ఉంటుంది. పర్వతమైతే అలానే ఉంటుంది కద! ఆలయంలో విగ్రహంగ అయినా అలానే ఉంటుంది కద! కానీ అవతారాలు అలా కాదు. జంగమములైన వాటికి మార్పుచెందడం నియమము. తానూ అలానే ఒకనాడు పుట్టాడు. అలానే శ్రీకృష్ణుడిగానూ ఒక సన్నివేశం కల్పించుకొని తనువు చాలించి వెళ్ళాడు. శ్రీరాముడుగ వచ్చినా సరయూనదీ ప్రవేశంచేసి అవతారమును చాలించాడు. అంటే ప్రపంచ నియమాలకు తాను కట్టుబడే ఉంటానని తెలిపాడన్న మాట.**

ప్ర : స్వామీజీ! మా పూజాగదిలో చిన్ని పుట్టరూపంలో ఎల్లమ్మ దేవత వెలసినది. మా అమ్మ పై పూని నేను ఎల్లమ్మను! మాకు ప్రతి మంగళవారం పాలు పోసి పండుగ చేయాలి అని చెప్పింది. ఇది ఎంతవరకు నిజం అంటారు? దయచేసి వివరించప్రార్థన?

**జ : ఎంతవరకూ నిజమూ అనేది మీకే తెలియాలి. ఒకవేళ అలానే జరిగిఉంటే అది నిజమే కద. నిజమా.....! కాదా.....! అనికాక, చేయవచ్చా, చేయతగదా అనేది ప్రశ్న. పై చెప్పినవన్ని క్షుద్ర దేవతలు. కొన్నిచోట్ల వేంకటేశ్వరుడు వంటి పేరుతోనే ఈ పూనకాలు వంటివి వస్తాయి. ఏదైనా మంచిగా, పరోపకారంకంగ ఉంటే దానిని పట్టించుకోనక్కర లేదు. అవి మార్గం తప్పితే మాత్రం అదుపులో పెట్టాలి. అయితే, నిజానికి దేమునకీ, దేవతలకీ - ఇలా..... ఎవరినో యాచించి, తమ పబ్బం గడపుకోవలసిన అవసరం రాదని మా విశ్వాసం. మరి ఈ దేవతావేశా లేమిటి? అనేది మాకంతగ తెలియదు.**

ప్ర : రాముడు చాలా గొప్పవ్యక్తి అయినా, సీతమ్మను అనుమానించి అగ్నిప్రవేశం చేయమన్నాడెందుకు?

**జ : సీతమ్మను 'నీ కభిమతమైన చోటికి వెళ్ళవచ్చు' అన్నాడే తప్ప అగ్నిప్రవేశం అనేది రాముడు చెప్పలేదు. అయితే, రాముడికి అభిమతం కానపుడు తానుండి ప్రయోజనమే లేదు అని నిర్ణయించుకొని, సీతమ్మ తానే అగ్నిని పేర్చమని లక్ష్మణుని ఆదేశించి, అందులో దూకింది. రాముడు చూస్తూ ఉండి పోయినాడంతే. మానవసహజమైన బలహీనత కారణంగా 'తానే అలంకరించుకొని రమ్మన్న సీతను చూచి, ఓర్వలేక' పైమాటలన్నాడు.**

ప్ర: శ్రీ వేంకటేశ్వరస్వామి అంటే నాకు చాలా ఇష్టం. పూజా క్రమం తెలుప ప్రార్థన. వేంకటేశ్వరుని మంత్రం ప్రత్యేకంగా ఏదైనా ఉందా తెలుపగలరు?

**జ:శ్రీవేంకటేశ్వరుడు సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడే! కనుక నారాయణ అష్టాక్షరీతోనే ఆరాధన**

చేయవచ్చు. ఆయనకంటూ గూడ ఓ మూర్తి మంత్రం ఉంది. అక్కడ సేవించుకొనేటప్పుడు వినిపించే 'ఓం నమో వేంకటేశాయ' అనేది. ఈ మంత్రమైనా, అష్టాక్షరీ అయినా వాడుతూ షోడశోప చారాలు(16) ప్రేమతో చేసుకొంటే చాలు. మన వద్ద లభించే 'పూజావిధానం' పుస్తకం చాలు.

శ్రీమాన్ రాంప్రసాద్, భానూర్, మెదక్ జిల్లా.

ప్ర : మా గ్రామంలోని ప్రసన్నాంజనేయ స్వామివారికి రుద్రాంశుడని నమక, చమక, మహాన్యాస పూర్వక అభిషేకం చేస్తున్నారు. తగునా? శాస్త్రసమ్మతమేనా? వారి ఆరాధన పద్ధతిలో ఏ ఆగమాన్ని అనుసరించాలి?

జ : ఆంజనేయుడెప్పుడూ శ్రీరామునితోపాటు ఉండటం మంచిది. ఆయన స్వతంత్ర దేవత కాదు. రామదాసునిగ ఉంటాడు. ఒక వేళ అలాలేక పోతే, ఓ శ్రీరామునిమూర్తి చేయించి పెట్టడం మంచిది. 'హనుమ' రుద్రాంశ అనేది వాల్మీకి రామాయణంలో లేదు. మనకి వాల్మీకే ఈ విషయంలో ప్రమాణం. మిగిలినవాళ్ళు కారు. వాల్మీకి చెప్పినదానినిబట్టి ఆంజనేయుడు 'వాయు సుతుడు'. హనుమగూడ తనను అలానే చెప్పుకున్నాడు తప్ప రుద్ర సంబంధం ఎక్కడా ప్రస్తావించు కోనేలేదు. మరి, మధ్యలో ఎవరికి తోచిందో తెలియదు ఇలా రుద్రాంశ అనేది. బహుశః తులసీ దాసే ఈ విధంగా ప్రచారం చేసిన మొదటివ్యక్తి యేమో?

పి. కృష్ణదీప్తి, ఒంగోలు

ప్ర : స్వామీజీ!హయగ్రీవుడు నారాయణుని అవతారం కదా! ఈ మధ్య ఒక గ్రంథంలో 'హయగ్రీవుడు అనే రాక్షసుడు వేదాలను అపహ రించినాడు' అని చదివాను. హయ గ్రీవుడనే పేరుతోరాక్షసులెవరైనా ఉన్నారా తెలుపగలరు?

జ : హయగ్రీవుడనే ఓ రాక్షసుడున్నట్లు 'దేవీ భాగవతం'లో ఉంది. కానీ అసలు ఆ గ్రంథమే ప్రమాణంకాదు. కనుక హయగ్రీవుడనే రాక్షస వృత్తాన్తంగూడ పూర్తి నిరాధారమైనదే. శ్రీ వేద వ్యాసాదులు తెలిపిన దానిలో 'శ్రీమద్భాగవతంలో' విద్యాప్రదాతయైన శ్రీమహావిష్ణుని అవతారమైన హయగ్రీవుని గురించి మాత్రమే ప్రస్తావన ఉంది.

టి. వెంకట్రావు, రామచంద్రాపురం.

ప్ర: గాయత్రి మంత్రం యొక్క అర్థం చూస్తే సూర్యభగవానుని ఉద్దేశించి ఉంది. చిత్ర పటంలో ఐదు ముఖములు కల్గిన దేవిమాతగా ఉంది. అర్థానికి రూపానికి పొందిక ఎట్లో తెలుప ప్రార్థన?

గణేశ గాయత్రి ఉన్నట్లుగా చదివితిని, అసలు గాయత్రి మంత్రములు ఎన్ని కలవో తెలియచేయ ప్రార్థన?

జ : గాయత్రీ మంత్రం అంటే 8 అక్షరాల చొప్పన 3 పాదాలుంటే, అంటే 24 అక్షరాలు కలిగి ఉన్న ఛందస్సును గాయత్రీ ఛందస్సులో ఉన్న దంటారు. గాయత్రీ అనేది ఛందస్‌కు పేరు. ప్రసిద్ధి మాత్రం సూర్యుని తెలిపే గాయత్రికే ఉంది. అది సూర్యుని అంతర్యామి అయిన నారాయణుడిని తెలియచేస్తుంది.అయితే "గాయత్రీ" అనేది స్త్రీలింగ శబ్దం కనుక దానిని స్త్రీమూర్తిగ భావించారు కొందరు. అది క్రమంగా శాక్తేయంగ పరిణ మించింది. అవైదికులైనవారు దానిని శక్తి ఆరాధన గానే చేసిన ప్రచార ఫలితంగ చాలా మంది అలానే భావిస్తూ, ఫోటోలద్వారా ప్రచారం చేసుకొంటు న్నారు. కానీ, గాయత్రీ మంత్రానికి సూర్యుడు, ఆతని అంతర్యామి శ్రీమన్నారా యణుడూ తాత్పర్యము.

వేదంలో 24 అక్షరాలు, 3 పాదాలుగ ఉండే గాయత్రీలు కొన్నిఉన్నాయి. అవలా ఉంచి, మాట లొచ్చిన భక్తులు తమతమ కొలువులకు ఈ మధ్య తయారు చేసిన గాయత్రీమంత్రాలు లెక్కలేనన్ని ఉన్నాయి. 'మొదటి పాదంలో విద్మహే', రెండవ పాదంలో 'ధీమహీ', 3వ పాదంలో 'ప్రచోదయాత్' అనితగిలిస్తే సరి ఓ గాయత్రీ తయారై పోతోంది. నలుగురు శిష్యులు చేరిన ప్రతీ గురువుకీ అలాంటి గాయత్రీలు కొత్తగా పుడుతూనే ఉన్నాయి.





## శ్రీవారి పర్యటనా వివరాలు

| | | |
|---|---|---|
| మే 10 నుండి 15 వరకు | : | గుజరాత్ పర్యటన |
| 16 | : | హృషీకేశ్ |
| 17 | : | బదరీనాథ్‌లో జ్యోతిర్దర్శనం సేవించుకుంటారు. |
| 18 | : | బదరీనాథ్‌లో వేంచేసి ఉంటారు. |
| 19 నుండి 22 వరకు | : | బదరీ నుండి ఆంధ్రాకు వేంచేస్తారు. |
| 22 | : | విశాఖ పట్టణం జిల్లా, పెందుర్తిలో ప్రతిష్ఠా మహోత్సవంలో అన్వయిస్తారు. |
| 23 | : | రాయుడు పాలెం శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయ ప్రతిష్ఠ. |
| 24 నుండి 26 వరకు | : | ఖమ్మం జిల్లా, కల్లూరులో శ్రీవేంకటేశ్వర స్వామివారి బ్రహ్మోత్సవాలు, పరిసర ప్రాంతాల పర్యటన. |
| 27 | : | చాగల్లు విజిట్. |
| 31 | : | ఉప్పల్, శ్రీవేంకటేశ్వరస్వామివారి ప్రతిష్ఠా మహోత్సవం. |



# భగవద్రామానుజ చరిత్ర

శ్రీమతి T.K. చూడామణి, విజయవాడ.

కులోత్తుంగుడు గొంతులో లేచిన వ్రణం వలన విపరీతమైన బాధననుభవిస్తూ, తను చేసిన పనులను క్షమించమని మనసారా రామానుజులను ప్రార్థన చేస్తూ, తిల్యను తీసుకురమ్మని తన భటులకు ఆజ్ఞ జారీ చేసాడు. వారు వెంటనే తిల్యని విడిపించి రాజసన్నిధికి తీసికొనివచ్చారు. రాజుని చూస్తూనే దిగ్భ్రాంతి చెందింది తిల్య. అల నాడు ఆ గోవిందరాజ సన్నిధిలో నిలిచిన ఆ రాజసం..... ఏమైపోయింది? ఈ దైన్యమేమిటి? కన్నులలో ఆ ప్రవాహమేమిటి? తిల్యని చూస్తూనే ఒక్క వెలుగు వెలిగింది రాజుముఖంలో. ''అమ్మా! నన్ను క్షమించవూ!'' తాను వింటున్న మాటలు నిజమా! కలా! చూస్తోంది కల కాదు. మళ్ళీ మళ్ళీ వినపడు తున్నాయి అవే మాటలు తిల్యకు. అమ్మా! ఆ గోవిందరాజస్వామిని గూర్చి ఒక్కసారి పాడవూ! ఒక్కసారి ఆడవూ! ఒక్కసారి....

గోవిందరాజస్వామి గుర్తురాగానే పరవశించింది తిల్య.... గోవిందా!........ నెమ్మదిగా పాట అందుకొంది. అప్రయత్నంగా అడుగులో అడుగు కలిపింది. గోవింద గానామృతం రాజు చెవులలో నిండింది. కూరేశుల రూపం అతని కన్నులలో నిండింది.. వెక్కి వెక్కి ఏడుపు..... అంతలోనే పాట మాధుర్యానికి పరవశం. కన్నులు తేలిపోతు న్నట్లు భావన. ఓ గోవిందరాజా!..... స్వామీ!..... కూరేశా!...... యతిరాజా!.... మనసులో ఇవే రూపాలు. చెవులలో గోవిందగానం. మూసిన కన్నులు మరి తెరవలేదు క్రిమికంఠుడు.

రామానుజులు యాదగిరి-యదుగిరికి వచ్చిన తరువాత ఎందరికో భక్తి మార్గాన్ని వివరించి భక్తులనుగా తీర్చిదిద్దారు. రామానుజ సిద్ధాంతంలో కులమతాలకు తావు లేదు. అగ్రవర్ణాలు-అంత్యకులజులు అనే మాటలే లేవు. వర్ణాలకు కులాలకు అతీతంగా భక్తిని ప్రచారం చేసిన ప్రప్రథములు భగవద్రామానుజులు. అస్పృశ్యతకు వ్యతిరేకంగా దక్షిణ భారతదేశంలో మొట్టమొదటిగా ప్రచారం చేసినవారు శ్రీరామానుజులే. శ్రీ విష్ణువునందు భక్తిగలవారంతా శ్రీవైష్ణవులే. అందుకే రామ ప్రియుల విగ్రహాన్ని యదుగిరిలో ప్రతిష్ఠించి నపుడు ఆ ప్రతిష్ఠోత్సవాలలో అన్ని వర్గాల వారు, అన్ని వరాలవారు పంచములతో సహా అందరూ ఆలయం లోపల చక్కగా ఆసీనులై స్వామి విగ్రహ ప్రతిష్ఠను ఆనందంగా దర్శించారు. రామానుజ సిద్ధాంతంలోని ఈ విశాలదృక్పథం ప్రపంచానికి ఎంతో నచ్చింది. సామాన్య జనంలో రామానుజులకు అంతులేని ఆదరణ లభించింది.

తిరుపతి నుంచి కొంతమంది శ్రీవైష్ణవ స్వాములు యదుగిరి ఉత్సవాలలో అన్వయించారు. వారంతా రామానుజుల వద్దకు వచ్చి చిదంబరంలో జరిగిన గోవిందరాజ స్వామి ఆలయధ్వంసనాన్ని గూర్చి, కులోత్తుంగచోళుని మరణాన్ని గూర్చి రామానుజులకు చెప్పారు. తిరుపతికి వచ్చి విగ్రహాలను ప్రతిష్ఠించమని వేడుకున్నారు.

చిదంబరం నుండి ఉత్సవవిగ్రహాలెలా రక్షించబడ్డాయి? ఆశ్చర్యంగా అడిగారు రామానుజులు. ''స్వామీ! తిల్య అనే నర్తకీమణి -మహాభక్తురాలు తన అద్భుత గానంతో, నృత్యంతో, రాజును, సైన్యాన్ని మంత్ర ముగ్ధుల్ని చేసి తెలివిగా ఉత్సవ విగ్రహాలను పంపించేసింది. అలా ఆమె నటనా కౌశలంతో ఆ ఉత్సవవిగ్రహాలు దక్కాయి!'' అని చెప్పారు వారు.

"తిల్య ఎంతటి భక్తురాలు ధన్యురాలు" అని నిండుగా ఆశీర్వదించారు రామానుజులు. స్వామీ! గోవిందరాజస్వామిని తిరుపతిలో మీరు ప్రతిష్ఠించాలి అన్నారు స్వాములు. తప్పకుండా జరుగుతుంది ఆ కార్యక్రమం. మరి ముందు గా ఆలయనిర్మాణం జరగవద్దూ! అన్నారు రామానుజులు. మీరొక్కసారి వేంచేయండి. మీ రాకతో అన్నీ అవే జరుగుతాయి అన్నారు వారు. బయలు దేరారు రామానుజులు. నారాయణ వనం రాజైన యాదవరాయలు వద్దకు వెళ్ళి తిరుపతిలో స్వామికి ఒక ఆలయం కట్టాలయ్యా అన్నారు. మహద్భాగ్యం అన్నాడు యాదవరాయలు. గోవిందరాజ స్వామి ఆలయనిర్మాణం పూర్తి అయింది. రాయవేలూరు నుండి శ్రీ గోవిందరాజ పెరుమాళ్ మూలవిగ్రహాన్ని తిరుపతికి వేంచేపుచేయించి ప్రతిష్ఠించారు రామానుజులు.

తరువాత ఉత్సవమూర్తులను ప్రతిష్ఠించారు. తిల్య వలన ఆ విగ్రహాలు రక్షించబడి తీసికొని రాబడ్డాయి కాబట్టి ఆ స్వామి తిల్యగోవిందరాజస్వామి అయ్యాడు. అమ్మా! తిల్యా! నీ జీవితాన్ని సార్థకం చేసుకున్నావు తల్లీ! అందుకే చిరస్థాయిగా భగవంతునితో నీ నామం కూడా కలిసి శాశ్వతత్వాన్ని సంతరించుకుంటుంది అంటూ అనుగ్రహించారు రామానుజులు. తిల్య గోవిందరాజస్వామి ముసిముసిగా నవ్వులు చిందించాడు.

16/
bnmay02.p65



## పరమపద వార్త

**శ్రీమతి ఇంకొల్లు కమలాదేవిగారు** తేది : 3-4-2002 ఉదయం పరమపదించినారు. వీరు శ్రీజీయరుస్వామివారి శిష్యులు. కమలాదేవి గారు అనేక కైంకర్యములలో తమ సేవలను అందిచారు. వీరికి ఆశ్రియఃపతి సాన్నిత్యం లభించాలని ప్రార్థన

- విశిష్టాద్వైత ప్రచారకసంఘం

# శ్రీవచన భూషణము

- శ్రీ ఉ.వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి, విశాఖ

తిరుమంత్రము మనసులో స్థిరముగా నిలచిననాడు సర్వేశ్వరుడు వశమగును. **మంత్రాధీనం చ దైవతమ్** మంత్రమునకు వశమై దైవముండును. అర్థముతో గూడ తిరుమంత్రము మనసున స్థిరముగ నిలచిననాడు మంత్రముచే ప్రతిపాదింపబడు సర్వేశ్వరుడు అతనికి అనిష్టములు తొలగించి ఇష్టములను లభింపచేయువాడగును. భగవానుడు అనుగ్రహించి అనిష్టమగు సంసారమును తొలగించి ఇష్టమైన ఆనందధామమును ప్రసాదించుటకు మంత్రమే సాధనము.

అట్లు సర్వేశ్వరుడు మంత్రమునందు వీనికి కలిగిన శ్రద్ధచే మంత్రము ఉపదేశింపబడిననాడు ప్రీతితో ఈతనికి ప్రాప్యమగు వైకుంఠమును హస్తగతము చేయును. జగత్తు అంతా దైవమధీనము నందే ఉండునని **'దైవాధీనమ్ జగత్సర్వమ్'** అని చెప్పినారు. నిత్యవిభూతి అనబడు శ్రీవైకుంఠమును, లీలావిభూతి అనబడు ఈ ప్రకృతిమండలము కూడ భగవానునిచే నియమింపబడునవే. అందుచే సర్వేశ్వరుడు అనుగ్రహించిననాడు ఆతడే ప్రాప్యము అగు శ్రీవైకుంఠము ఈతనికి అత్యంత సులభము అగునట్లు చేయును. ఈ విధముగ శమము, దమము మొదలగు ఆత్మ గుణములు లభించిననాడు ఆచార్యానుగ్రహము సిద్ధించు ననియు, ఆచార్యానుగ్రహము లభించుటచే తిరుమంత్రము వశమగుననియు, తిరుమంత్రము మనసులో స్థిరముగ నిలచిన నాడు సర్వేశ్వరుడే వశమగుననియు ఆతడే ఉపాయము కనుక ఉపాయభూతుడగు సర్వేశ్వరుడు అనుగ్ర హించిననాడు ప్రాప్యమగు శ్రీవైకుంఠము సుఖముగ లభించుననియు చెప్పినారు.

## 98వ సూత్రము.

**ప్రాప్య లాభమ్ ప్రాపకత్తాలే, ప్రాపకలాభమ్ తిరుమంత్రత్తాలే, తిరుమంత్రలాభమ్ ఆచార్యనాలే, ఆచార్యలాభమ్ ఆత్మగుణత్తాలే.**

ప్రాప్యమగు శ్రీవైకుంఠము, ప్రాపకము అనగా ఉపాయమగు సర్వేశ్వరుని అనుగ్రహముచే సిద్ధించును. సర్వేశ్వరుని అనుగ్రహము తిరుమంత్రముచేతనే సిద్ధించును. ఆచార్యుడు ఆత్మగుణముల చేతనే లభించునని చెప్పు చున్నారు.

వెనుక ఆరోహణ క్రమములో ఆత్మ గుణములు, దానిచే ఆచార్యుడు, వారిచే తిరుమంత్రము, దానిచే ఉపాయభూతుడగు సర్వేశ్వరుడు, ఉపాయమగు సర్వేశ్వరునిచే ప్రాప్యమగు పరమపదము సిద్ధించునని చెప్పినారు. ఇప్పుడు అటునుండి ఇటు అవరోహణాక్రమములో చెప్పుచున్నారు.

ప్రాప్యలాభమనగా పొందవలసిన శ్రీవైకుంఠము లభించుట. పొందించువాడనగా ఉపాయమగు భగవానుడి చేతనే. అనిష్టమును నివర్తింపజేసి ఇష్టమును లభింపచేయు ఉపాయభూతుడగు భగవానుని అనుగ్రహము తిరుమంత్రము చేతనే, తిరుమంత్రము ఆచార్యుని చేతనే లభించును. అట్టి ఆచార్యుడు లభించుట





ఆత్మగుణములచేతనే అని ఈ క్రమము తప్పదని నొక్కి చెప్పుచున్నారు.

అందరము పొందవలసినది పరమ పదము. పరమపదము చేరి జీవులందరు భగవానుని దర్శించుచు కైంకర్యము చేసి ఆనందింపచేసి, ఆ ఆనందమును చూచి తాము ఆనందించుటయే మోక్షము. ఇదే ప్రాప్యము.

ఇది లభించుటకు ఆ భగవానుడే ఉపాయము. వేరొకటిలేదు. ఆ భగవానుడు అనుగ్రహించిననాడే సంసారము తొలగి పరమపదము లభించును. ఇట్లు ఉపాయముగ భగవానుడు లభించుట అర్థముతో కూడ తిరుమంత్రము మనసులో నిలచిన నాడే సంభవించును. ఆ తిరుమంత్రము ఆచార్యుని వలననే లభించును. అట్టి ఆచార్యుడు లభించుట ఆత్మగుణములు కలిగిననాడే సాధ్యమగును. ఇట్లు మోక్షము కావలెనని కోరిక గలవారందరు ఈ వరుసలో మొదటిదగు శమము దమము అను ఆత్మ గుణములు కలిగి ఉండవలెను. ఆత్మగుణములనగా బాహ్యేంద్రియ నిగ్రహము. మనోనిగ్రహము లేనివారికి ఎన్నడును మోక్షము లభింపదు. పొందదగిన విషయమును వదలి పొందరాని ఇతర విషయములయందు ప్రసరించు జ్ఞానేంద్రియములు మనస్సు వెనుకకు మళ్ళి శమము, దమము లభించినవారికే ఆ క్రమములో పరమపదము లభించును.

# శ్రీరామ మంగళాశాసనము

శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఈ.వే. శింగరాచార్యులు, తిరుపతి.

**త్యక్తసాకేత వాసాయ చిత్రకూటవిహారిణే।**
**సేవ్యాయ సర్వయమినాం ధీరో దారాయ మంగళమ్॥**

**త్యక్తసాకేతవాసాయ** - సాకేతనగర నివానమును వీడినవాడు, **చిత్రకూటవిహారిణే**-చిత్రకూట పర్వతమున విహరించిన వాడు, **సర్వయమినాం**-మునులందఱకు, **సేవ్యాయ** -సేవింపతగినవాడు, **ధీరోదారాయ** -ధీరులలో ఉదారుడును (ధీరుడును, ఉదారుడును)అగు శ్రీరామునకు, **మంగళమ్** - మంగళమగు గాక!

సాకేతనగరమును వీడినవాడు, చిత్రకూటమున విహరించినవాడు, మునులందరకును సేవ్యుడును, ధీరులలో గొప్పవాడును అగు శ్రీరామునకు మంగళమగు గాక!

**త్యక్తసాకేత వాసాయ**- తండ్రిఅగు దశరథుని మాట కొరకు సాకేతనగరమును, సకలభోగములను తృణప్రాయముగా పరిగణించి, విడచిన మహనీయుడు శ్రీరాముడు. కులశేఖరులు పెరుమాళ్ తిరుమొళ్రిలో **"వెవ్వాయేన్ వెవ్వురై కేట్టు ఇరునిలత్తై వేణ్డాదే విరైన్దు, వెన్ఱిమైవాయ కళిరొన్దు మా వొళ్రి న్దు వనమే మే వి "** అనుచు పై విషయమును తెలిపిరి.

**అథవా హి మమైతేన రాజద్రవ్యమయేనతు**
**రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః**

అను శ్రీరామాయణ సూక్తియు ఇచట స్మరణీయము. దేశికులు రఘువీరగద్యలో **"పితృవచన పాలన ప్రతిజ్ఞావజ్ఞాత యౌవరాజ్య"** అనుచు ఈ సందర్భమును కీర్తించిరి. శ్రీవిష్ణు సహస్రనామములోని రామావతారమును కీర్తించు నామములలో విరతః(398) అను నామము ఈ అంశమును తెలుపుచున్నదనుటను **"నిసర్గ నైరవేక్ష్యేణ కృపణాత్ రాజ్యాదేః విరతః"** అను వివరణము ద్వారా భట్టరు తెలిపిరి. అవాప్తసమస్తకాముడగు స్వామి దేనిని అపేక్షింపనివాడగుటచే సాకేతనగర వాసమును వదులటలో ఆశ్చర్యమేమున్నది.

**చిత్రకూటవిహారిణే**- చిత్రకూట పర్వతమున శ్రీరాముడు సీతతో విహరించిన సన్నివేశము ఇచట ప్రస్తుతము.

**వైదేహీ! రమసే కచ్చిత్ చిత్రకుంచే మయాసహ।**
**పశ్యంతీ వివిధాన్ భావాన్ మనోవాక్కాయసంయతాన్॥**

అను శ్రీరాముని వచనములు ఇచట స్మరణీయములు. రాజ్యములను, మిత్రులను, బంధువులను విడచివచ్చుటవలన కల్గిన శోకమును సైతము మరపింపగల్గిన రమ్యమైన పర్వతప్రాంతము చిత్రకూటము. **"యదీహశరద్యోనేకాన్ త్వయాసార్థమనిందితే! లక్ష్మణేన చ వత్స్యామి నమాం శోకః ప్రధక్ష్యతి"**, **"సుబకగశ్చిత్రకూట్యోసౌ గిరిరాజోపమోగిరిః"**, **"న రాజ్యాత్ భ్రంశనం భద్రే న సుహృద్భిర్వినాభవః, మనోమే బాధతే దృష్ట్వా రమణీయమిమం గిరిమ్"** అను మొదలగు శ్రీరామాయణ సూక్తులు ఇచట ఉట్టంకిపతగినవి. ఆళ్వార్లు **"తేనమరుమ్ పొళ్రిల్శాఱల్ శిత్తిరకూడత్తిరుప్ప"** అని, దేశికులు రఘువీరగద్యలో **"విచిత్ర చిత్రకూటగిరి కటకతటరమ్యావసథ"** అనియు ఈ వృత్తాంతమును కీర్తించిరి. **"చిత్రాణి ఆశ్చర్యకరాణి కూటాని శృంగాణి యస్య(యస్మిన్) సః"** అను వ్యుత్పత్తి వలన ఆశ్చర్యమును కల్గించు శిఖరములను కల్గిన పర్వతము చిత్రకూటము.





**"ప్రవివిక్తమహం మన్యే తం వాసం భవతస్సుఖమ్, గమ్యతాం భవతాశైలః చిత్రకూటస్యవిశ్రుతః"** అని భరద్వాజ మహర్షి ఆదేశము ప్రకారము శ్రీరామచంద్రుడు ఆ పర్వత ప్రాంతమును తన విహారస్థానముగా పరిగ్రహించెను. **"మహర్షి సేవితః పుణ్యః సర్వత స్యుదర్శనః"** అని మహర్షులచే సేవింపబడు నది, పావనమైనది, అంతట మనోహరమైన చిత్రకూటమును భగవానుడు నెలవుగా గ్రహించుట తగినదే కదా! సాకేత నగరమును విడుచుటకు తన తండ్రి మాట కారణము కాగా, చిత్రకూట విహారమునకు భరద్వాజ మహర్షి వచనము కారణమగుట విశేషము.

## గ్రంథ పరిచయం - యతిరాజ వింశతి

శ్రీ వైష్ణవ సంప్రదాయ స్తోత్రములలో **'యతిరాజ వింశతి'** విలక్షణమైనది. సంప్రదాయ కుటుంబాలకు చెందిన శ్రీవైష్ణవులందరకు వాచోవిధేయమై నిత్యానుసంధేయంగా ఉన్నది. మనవాళమహామునులు భగవద్రామానుజులను గూర్చి విన్నవించిన స్తుతి ప్రబంధమిది. మనవాళమహామునులకు పంక్తిపావనులని వ్యవహారం. వీరిని గూర్చి వీరి శిష్యులైన ఎరుంబి అప్పా అనువారు ప్రసాదించిన పూర్వోత్తర దినచర్యలను నడుమ యతిరాజవింశతితో కూర్చి శ్రీవైష్ణవుల తిరుమాళిఘులలో తదీయారాధన వేళ పరివేషణం మొదలు పరిషేచనం వరకు గోష్ఠిగా అనుసంధించడం పరిపాటి. శ్రీ వైష్ణవ స్వరూపాన్ని నిష్కర్ష చేసి నిరూపించే మధురప్రబంధం ఇది.

తమిళంలో, సంస్కృతంలో ప్రామాణికములైన రసఘనములైన వ్యాఖ్యలు దీనిపై ఏర్పడినై. తెలుగులోను కంచి ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామి వారు ఒక వ్యాఖ్యను ప్రసాదించేరు. ఆ అన్ని వ్యాఖ్యలలో ఉన్న విషయాన్నంతనూ తెలుగువారికందించాలన్న పెద్ద మనసుతో పెంటపాడు ఉభయవేదాంతసభ కార్యదర్శి సత్సంప్రదాయప్రచారైక ప్రవణులు అయిన ఉ.వే. శ్రీమాన్ ఎన్.వి.ఎల్.ఎన్ రామానుజార్య స్వామివారు, శ్రీగుణరత్నకోశాదులకు ఆంధ్రవ్యాఖ్యానాలు ప్రసాదించిన ఉ.వే. శ్రీమాన్ కె.వి.ఆర్. నరసింహాచార్యస్వామి వారు ఈ యతిరాజవింశతి సమగ్ర ఆంధ్ర వ్యాఖ్యాన రచనకు పూనుకొన్నారు.

ప్రతిశ్లోకానికి ప్రతిపదార్థ తాత్పర్యాలతో పాటు ప్రతిపద విశేషార్థ నిరూపణము విపులంగా కావించినారు. విషయబంధురంగా ప్రతిపదసుందరంగా వెలసిన ఈ వ్యాఖ్య సత్సంప్రదాయ పరులకు సర్వులకూ అవశ్య నిషేవణీయం. 16 + 132 పుటలతో భగవద్రామానుజుల ముఖచిత్రంతో వెలువడిన ఈ గ్రంథం వెల రూ. 30/-

**ప్రాప్తి స్థానం: ఉభయవేదాంత సభ, పెంటపాడు, ఆంధ్రప్రదేశ్, 534166**

# నీ భక్తి కన్న మిన్న లేదు శ్రీరామ

- చెవ్వటూరి కుసుమకుమారి, విజయవాడ

**భూపలలామ రామ రఘుపుంగవరామ త్రిలోకరాజ్యసం**
**స్థాపన రామ మోక్ష ఫలదాయకరామ మదీయపాపముల్‌।**
**పాపగదయ్యా రామ  నిను బ్రస్తుతి చేసెదనయ్యా రామ సీ**
**తాపతిరామ భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ॥**

శ్రీరామ చంద్రప్రభువు రావణవధానంతరం విభీషణుని లంకకు రాజును చేసి, సీతాలక్ష్మణ సమేతుడై పుష్పకంలో అయోధ్యకు బయలుదేరాడు. దారిలో నందిగ్రామంలో అన్నగారి పాదుకల నీడన రాజ్యపాలన చేస్తున్న తమ్ముడు భరతునితో తన ఆగమన వార్తను చెప్పమని ముందుగా హనుమను పంపించాడు. దారిలో తన మిత్రుడు, నిషాద రాజు అయిన గుహునకు కూడా తన రాక తెలియచేయమని చెప్పాడు. గుహుడు హనుమ నడిగి శ్రీరామచంద్రుని వనవాస విశేషాలను తెలుసుకొన్నాడు. రామాగమన వార్త విని పొంగిపోయినాడు. వనవాసంలో రామప్రభువు కష్టాలు విని క్రుంగిపోయినాడు.

మనస్సు నిండా రామ ప్రభువు ఆలోచనలే నిండినాయి. రామప్రభువు వనవాసానికి నా రాజ్యం నుండే వెళ్లాడు.  జన్మజన్మల పుణ్యం పండిందని మురిసి పోతూ రామపాదాలు కడిగాను. పడవలో భాగీరథిని దాటిస్తూ "రామా! నేను కూడా నీతో వనవాసానికి వచ్చి, నీ సేవ చేసుకుంటానయ్యా!" అని అడిగాను.

"గుహా! వనవాసం నాకు కానీ నీకు కాదుగా" అని చిఱునవ్వుతో అలవోకగా త్రోసిపుచ్చాడు రామయ్య. అయ్యో! చేతులారా ఆ బంగారు తల్లి సీతమ్మను నా తండ్రి రామయ్యని వనవాసానికి ఆవలొడ్డుదాకా దింపాను గానీ! ఆటవికుడిని అయి కూడా ఆవలకు ఒక్క అడుగు కూడా వెయ్యలేక పోతిని కదా! అడవులపాలైన స్వామికి ఒక్క సేవ కూడా చేయలేకపోతిని కదా!

రామయ్య తండ్రీ! నా మాట మన్నించి నన్ను నీ వెంట రానిస్తే ప్రతిరోజూ నీకు సీతమ్మకు కమ్మని ఫలాలు, చల్లని జలాలు తెచ్చి పెట్టేవాడిని కదా! నిన్ను, తల్లి జానకినీ, లచ్చన్ననూ కంట్లో పెట్టుకొని కాపాడుకొందును కదా!

ఆ మాయలేడిని ఒక్కేటున కొట్టి దాని తోలొలిచి, తల్లి మైథిలి ముచ్చట తీర్చేవాడిని కాదా! అప్పుడా దుష్ట రాక్షసుడు జానకమ్మను ఎత్తుకెళ్ళేవాడా? నా తండ్రీ! నీకిన్ని కష్టాలుండేవా? ఛీ! మనసు కలతబారి ఇట్లా ఆలోచిస్తున్నాను గానీ రామప్రభువుకు నేను సాయం చేయటమా! ధర్మప్రభువు, మహావీరుడు, చక్రవర్తి కుమారుడు ఆ రామచంద్రుడెక్కడా! బోయనైన నేనెక్కడా? పోనీలే! ఇప్పటికైనా రామయ్య తన రాజ్యానికి చేరుతున్నాడు.

రామప్రభూ! నీ రాక తమ్ముడు భరతునకు కబురుచేయటం సహజం. తల్లి కౌసల్యకు చెప్పటం ధర్మం. మంత్రులకు గురువులకు చెప్పటం న్యాయం. కానీ నీదెంత పెద్ద మనసయ్యా! ఎంత దయ, ఎంత వాత్సల్యం, ఎంత స్నేహం లేకపోతే నన్ను గుర్తు పెట్టుకుంటావూ!  నా రాజ్యంలో నీ కాలు మోపుతున్నానని కబురు చేసావు.  నేను ఏ జన్మలో చేసిన పుణ్యం పండిందో!  అడుగు పెట్టినంత మేరా ఆర్యభూమి చేసిన ఆ పాదాలు కడుగుతాను.  నా జన్మ జన్మాంతర పాపాలు పటాపంచలు అయిపోతాయి.  నీ





చరణాలే నాకు శరణమని పడి పడి మ్రొక్కుతాను.  నీ పాదసేవకాక నాకేమీ వలదని వేడుకుంటాను.  ఆటవికులమైన మమ్ములను మరుజన్మ లేకుండా నీ సేవకు వినియోగించు కోమని అంజలించి అర్థిస్తాను. నా ప్రజలందరినీ స్వామి రామ సేవకు నియోగించి చరితార్థులను చేస్తాను.

నా రాజ్యంలో నిజమైన పండుగ ఈ రోజే అనీ, దారిపొడవునా పచ్చపచ్చని తోరణాలు కట్టించాడు. పునుగు-జవ్వాది వంటి సుగంధ పరిమళ జలాలు చల్లి, రంగ రంగ వైభవంగా పూలు పరిపించాడు. పుడమి జాత అడుగులకు మడుగు లొత్తటానికి మరుమల్లెల విరుల దండలు అల్లించాడు. నారపట్టు పుట్టాలు నేయించాడు. పట్టుతేనె బానలతో పెట్టించాడు. ఎండ తగులకుండా తాటియాకు గొడుగులు, వీవనలు, కలశాలు, కాళ్ళుకడుగుపళ్ళాలు, సాంబ్రాణి ధూపాలు, ఎన్ని ఏర్పాట్లు చేసినా ఆ రామప్రభువుకు తగినట్లు నేను చేయగలనా! అన్న అనుమానం-అరాటం. అసలు రామయ్యతండ్రి వస్తాడా? కాలాతీతం అయిందని వెళ్ళిపోడుకదా!

గుహుని ఆరాటం గమనించిన ప్రజలు దొరా! రామచంద్రుని వనవాసం గురించి హనుమ ఏం చెప్పాడో అదంతా మాకూ చెప్పు దొరా! అని అడిగారు. ఆ మాటలు గుహుని ఉత్సాహపరచాయి. ఆ విషయాలు తనవారితో ముచ్చటించ మనసైంది. ఓరి! ఓరీ! మన రామయ్యకిది మొదటి వనవాసం కాదురా! యింతకు ముందొక సారి

**ముదిమి తండ్రి మురిపాల ముద్దుపిలుపనొదులుకొని**
**కౌసల్యమురిపాల మేలుకొలుపు కాదనీ**
**యాగాలు కాయుమన్న మౌని పిలుపు నందుకొని**
**ధర్మమొక్కటే నాకు దీక్షలే పొమ్మనీ.........**

అట్లా యాగాలు కాచి రాక్షసులను చంపినప్పుడు తండ్రికి ముక్కుపచ్చలారలేదురా! మొన్నటికి మొన్నటి వనవాసంలో

**దండ కారణ్యాన దానవులను దండించి**
**మునివరుల నందరిని ముక్తి మార్గమునంపి**
**మరుజన్మలో మరల కలుద్దామని చెప్పి**
**ప్రభువొచ్చినాడు ధర్మ ప్రభువొచ్చినాడురా**

అంతలోనే మన సీతమ్మ తల్లికీ రామయ్యతండ్రీకీ పెద్ద కష్టం వచ్చిపడింది.

**రావణుని కర్మపండి పాకాన పడెనురా**
**అందుకే సీత తల్లి నెత్తుకెళ్ళాడురా**
**ఇక్కడెవరు తోడన రాముడిలపించాడు**
**అప్పుడు అక్కడేమి జరిగిందో చెపుతా వినండి.**

చల్లని తల్లి శబరి, మంచి రాక్షసుడు దనువు, కోతులరాజు సుగ్రీవుడు, హనుమన్న అందరూ మేమంటే మేమని తోడుపడ్డారు.

**కోతిరాజు మాటనెంతో గౌరవించగా**
**లెక్కలేని కోతి మూక తోడు మేమన్నాయి.**
**రామయ్య నీతికి కోతిసేన ధాటికీ**
**రావణుని రాజసం నేలపాలయ్యెరా!**

తరువాత రావణుని తమ్ముడు విభీషణుని లంకకు రాజుగా చేసి జానకిని తోడుకొని

వస్తున్నాడురా ఆ దశరథ రాముడు. అందరి మనస్సులలోనూ హఠాత్తుగా ఒక పులకరింత, ఒక అనుభూతి. ఎక్కడనుంచో ఒక మృదుమధుర రామనామాన్ని ఒక సుగంధ వీచిక హేలగా మోసుకొచ్చింది. గంగ అలల మీద అలనల్లన అలజడి. రాముడొస్తున్నాడు! రాముడొస్తున్నాడు! విమానానికి అడ్డు తగులుతామేమో! అని పులుగులు పరుగుపరుగున తరువుల నాశ్రయించి మిన్నక చూస్తున్నాయి.

ఇనుడు(సూర్యుడు) కూడా ఆ ఇనకులాబ్ధిసోముని చూడాలని అరచేతిని ఇంచుక నుదుట ఆనించుకున్నాడో ఏమో! చల్లని తెర నింగిన క్రమ్మి, పుడమిన భూజాత సీత అడుగులకు వేడి తగులకుండా నేల చల్లబడింది. ఒక్కసారి అందరి కళ్ళూ పెకి చూచాయి. పుష్పకంలో సీతారాములు

**రాముడొచ్చినాడురా రాముడొచ్చినాడురా**
**రాముడొచ్చి నాడు మన ఊరి కొచ్చినాడురా**
**చల్లని తల్లి సీతమ్మ చక్కనైన లచ్చన్న**
**ఇరువైపులా నడవ ఈడకొచ్చినాడురా**

అందరూ భక్తితో చేతులు జోడించారు. బారులుతీరి నిలచారు. పుష్పకం నుండి రామప్రభువు దిగాడు. గుహుడు అశ్రుధారలతో రామపాదాల వాలాడు. "మిత్రుడా"! అంటూ శ్రీరాముడు గుహుని గ్రుచ్చెత్తి లేవనెత్తాడు. కుశలమడిగాడు. నీ స్నేహం, నీ సహాయం మరువలేనన్నాడు.

**ఆ నిషాదుడి ఒడలు పులకరించి పోయింది.**
**పట్టు పుట్టం తెండిరా పట్టుతేనె తెండిరా**
**పాదాలు కడ గంగ పన్నీరు తెండిరా**
**పుడమిజాత అడుగులకు మడుగు లొత్తండిరా**
**స్వామిరామ పాదాలకు పడిపడి మొక్కండిరా**

అని అదేశించాడు. ఆనందాశ్రువులతో సీతారాముల పాదాలు అభిషేకించాడు. లచ్చన్నకు పట్టు పుట్టం సమర్పించాడు. జన్మ చరితార్థం అయిందని పరవశించాడు.

రామప్రభువు "గుహా! పుష్పకం ఎక్కు, అయోధ్యకు వెళ్దాం" అన్నాడు.

"ప్రభూ! నేను పుష్పకం ఎక్కనా? నీతో అయోధ్యకు రానా"? అన్నాడు.

"నీవే కాదు. నీ పరివారం కూడా" అన్నాడు దాశరథి. నెమ్మదిగా పుష్పకంలోకి చూచాడు గుహుడు. అప్పటికే అక్కడ వానర రాజు - రాక్షసరాజు - భల్లూకపతి - మహర్షులు, వానరస్త్రీలు ఎందరో ఉన్నారు.

భక్తి వివశుడైన ఆ బోయరాజు రామా! రామా! నా తండ్రీ! నేను నీదాసుడనయ్యా! నీ వెంటే వస్తా. అంతకన్న నాకింకేమీ వద్దు అంటూ రాముని వెనుకే వెళ్ళి పుష్పకం ఎక్కాడు. రామునినే చూస్తూ రామనామమే పలుకుతూ వివశుడై ఉండిపోయాడు.

సాధూ! సాధూ! రామచంద్రా! సాధు సాధు అంటూ అందరూ జయ జయ ధ్వానాలు చేసారు.

దయా సింధువు, రఘువంశ సుధాంబుధి చంద్రుడు అయిన ఆ శ్రీరామచంద్రుని భక్తబిందువులుగా నిలచిపోయిన అనేకమందిలో ఆ ఆటవికుడు గుహుడు కూడా ఆచంద్రతారార్కం రామమిత్రుడుగా చెప్పబడుతూనే వున్నాడు.

ఫలం సర్వం శ్రీ సీతారామ చంద్రార్పణమస్తు.

జై శ్రీమన్నారాయణ!

## బదరీనాథ్‌లో అష్టాక్షరీ క్షేత్రంలో జరుగు అన్నదానమునకు, నిర్మాణమునకు వివిధ పోషకులుగా కైంకర్యములు సమర్పించిన భక్తుల వివరములు

### శ్రీమతి పి.రమణమ్మగారు (విజయనగరం)ద్వారా

పోషకులు: శ్రీమతి కాశీనాథంబ (విజయనగరం)
జీవితసభ్యులు: శ్రీమతి ఆర్.సావిత్రి,శ్రీ కె.ఎస్.ఎన్. శర్మ (విజయనగరం)
అభిమానులు: శ్రీమతి జి.సుబ్బలక్ష్మి, శ్రీ ఎన్.కృష్ణమూర్తి, శ్రీ ఎమ్.వెంకటేశ్వరరాజు, శ్రీ జి.వెంకటలక్ష్మి, శ్రీమతి బంగారమ్మ, శ్రీ డి.జి.వి. నారాయణరాజు, శ్రీమతి ఆర్. నారాయణదాసు, శ్రీమతి ఆర్.సోదెమ్మ

### శ్రీమతి కమలావెంకట్రామిరెడ్డి (నల్గొండ)ద్వారా

జీవితసభ్యులు : నల్గొండ : శ్రీ ఒ.పురుషోత్తం, శ్రీమతి టి.ముత్తయ్యాసరోజినిదేవి, శ్రీమతి వి. యాదగిరి సరస్వతి, శ్రీమతి ఎ.రాధాదేవి, శ్రీమతి జి.సంధ్యారాణి, శ్రీ ఆర్. మారయ్యా, శ్రీమతి వి.సావిత్రి, శ్రీమతి కె.రాధాదేవి, శ్రీ యమ్. నరసింహరెడ్డి, జయపాల్‌రెడ్డి (హైదరాబాద్),శ్రీ జయప్రకాశ్‌రెడ్డి(హైదరాబాద్), శ్రీ పి.నరసింహ రెడ్డి (పరడా), శ్రీ జి.రాంరెడ్డి (మిర్యాలగూడ)
అభిమానులు: నల్గొండ: శ్రీమతి పి.వసుమతి, శ్రీ డి.చంద్రారెడ్డి, శ్రీ పి.కొండల్‌రెడ్డి, శ్రీ బి.నరేంద్రరెడ్డి హైదరాబాద్: శ్రీ ఎమ్. కేశవరెడ్డి, శ్రీ బి.సత్యనారాయణరెడ్డి, శ్రీ టి.మదన్‌మోహన్‌రెడ్డి, శ్రీ వై.శ్యాంరెడ్డి, శ్రీమతి బి. వెంకటరావమ్మ

### శ్రీ కె.బాలకృష్ణయ్యగారు(నిజామాబాద్)ద్వారా

అభిమానులు: శ్రీ కె.రాంచంద్రం, శ్రీ జె. బాల వీరయ్య, శ్రీ టి.నారాయణ, శ్రీ సిహెచ్. సాంబ శివరావు, శ్రీ శిర్పరాజు, శ్రీ సిహెచ్. వెంకటేశం, శ్రీ పద్మ గంగయ్య, శ్రీ ఆర్. హన్మాండ్లు, శ్రీ ఎమ్. కృష్ణమూర్తి, శ్రీ సిహెచ్. సుధాకర్, శ్రీ సిహెచ్. వరదరాజు.

### శ్రీ రామనాథంగారు(హైదారాబాద్)ద్వారా

అభిమానులు: శ్రీ ఎ.తాతబ్బాయి, శ్రీ వి.మురళీ కృష్ణ, శ్రీ బి.శ్రీధర్, శ్రీ ఎన్. వెంకటేశ్వర్లు, శ్రీమతి కె.కనకమ్మ, శ్రీ కె.ప్రభా కరరావు, శ్రీ జి. చిరంజీవిరాజు, శ్రీ సాయి ఈశ్వర్, శ్రీ వి.వెంకటేశ్వర్లు, శ్రీ శివకుమార్, శ్రీ పి.రంగారావు, శ్రీ ఎ.నారాయణరావు, శ్రీ ఎ.జి. రామారావు, శ్రీ పి.ప్రభాకర్‌రావు, శ్రీ ఎస్. వెంకటేశ్వర రావు, శ్రీ పి.బాలరాజు, శ్రీ రామకృష్ణ, శ్రీ శివప్రసాద్, శ్రీ బి.సుందర్, శ్రీమతి పుష్పావతి, శ్రీ ఎన్.పెద కంబయ్య, శ్రీ ఆర్.కళ్యాణచక్రవర్తి, శ్రీమతి ఆర్.మాధవి, శ్రీ జి.జయపాల్‌రెడ్డి, శ్రీమతి యశోదమ్మ, శ్రీ సి.హెచ్.జయకృష్ణ, శ్రీ పి.నాగేశ్వర రావు, శ్రీమతి వి.సుభద్రాదేవి, శ్రీ ఎమ్. వీరభోగ వసంతరావు, శ్రీమతి జి.రుక్మిణీదేవి, శ్రీ బి.శ్రీధర్‌రెడ్డి, శ్రీ ఎన్.చిట్టిసుబ్బరాజు, శ్రీ ఎస్.ఉమాపతి రాజు, శ్రీ డి.నరసింగరావు, శ్రీ ఎస్.వి.కె.రామ కృష్ణరావు, శ్రీ ఆర్. సత్యనారాయణరాజు, శ్రీ టి.ప్రభాకర్‌రావు, శ్రీ కె.స్వామిరెడ్డి, శ్రీ ఎమ్.వెంకటరెడ్డి,
హైదరాబాద్ : శ్రీ కీ.శే. యస్. బాపిరెడ్డి, శ్రీ యమ్. లక్ష్మారెడ్డి, శ్రీ వి. నరేంద్ర రెడ్డి, శ్రీ యస్. మల్లారెడ్డి, శ్రీ యమ్. మోహనరెడ్డి, శ్రీ యస్. రామచంద్రారెడ్డి, శ్రీ యమ్. మాధవ రెడ్డి, శ్రీ యమ్. అంజి రెడ్డి, శ్రీ పి. రామకృష్ణారెడ్డి, శ్రీ అరవింద కుమార్, కె. ఆదిశేషయ్య, సిహెచ్. వెంకటరమణ.
జీవిత సభ్యులు : శ్రీ ఇ. శోభా జలేందర్ (యు.యస్.ఎ.), శ్రీ ఇ. నీలిమా జనార్దన రెడ్డి (వరంగల్), శ్రీఅరవింద కుమార్ (హైదరాబాద్), శ్రీ కె. రవిశంకర్ (హైదరాబాద్), శ్రీ ఎ. ఆండాళ సురేంద్ర రావు (హైదరాబాద్).

### శ్రీ M.R.K. ప్రసాద్ (గుంటూరు) గారిద్వారా

మహారాజపోషకులు : శ్రీమాన్ పోలిశెట్టి శ్రీహరి ప్రసాద్‌గారు, గుంటూరు.
పోషకులు : శ్రీ యమ్. సుబ్బారావుగారు, ఏలూరు.
జీవిత సభ్యులు : శ్రీ ఆర్. చెన్నకేశవరావుగారు, నర్సరావుపేట.
అభిమానులు : శ్రీ సిహెచ్. నమ్మాళ్వార్‌గారు, (నాగార్జునసాగర్), శ్రీమతి యన్.బి. పుష్ప





(నాగార్జునసాగర్), కె. సత్యనారాయణ (గుంటూరు). గుంటూరు: శ్రీమతి కస్తూరి సీతారావమ్మగారు, కె. శేషచలపతిరావుగారు, కె. స్వరాజ్యలక్ష్మి కె. వెంకట సుబ్బరాయశర్మ, కె. సీతారావమ్మ, ఎ. లక్ష్మీ సరోజని, యమ్. రామసుబ్బమ్మ, ఎ. వెంకట రత్నమ్మ, వి. కమలమ్మ, గుడ్లూరు, కె. సూర్యాకాంతం, కె. వెంకటరామారావు,

### శ్రీమతి సుశీలా బి.యన్.రెడ్డి(హైదరాబాద్)గారిద్వారా

పోషకులు : శ్రీమతి సుశీలా బి.యన్. రెడ్డి, డా॥ప్రణీత నరసింహారెడ్డి, శ్రీమతి అనుపమ శరత్ చంద్ర, శ్రీ డా॥ అరుణ సుబ్రహ్మణ్యం, శ్రీమతి ప్రేమ రాజగోపాల్‌రెడ్డి, కుమారి డా॥ సురేఖ, శ్రీమతి డా॥ కరుణ సురేంద్రరెడ్డి, శ్రీమతి డా॥ శరణ్ కుమారి భాస్కర్ రెడ్డి, శ్రీమతి డా॥ నీరజారెడ్డి, డా॥ సుసన్ శశిధరరెడ్డి,
జీవితసభ్యులు : శ్రీమతి రత్నాదేవి సుభాశన్ రెడ్డి, శ్రీమతి పద్మా శ్రీకుమార్,

### JET, సీతానగరంనకు హైదరాబాద్ క్యాంప్‌ద్వారా వచ్చిన విరాళాలు

**జీవిత సభ్యులు:** శ్రీమతి సిహెచ్. వెంకట రమణ (సికింద్రాబాద్), శ్రీ బి. రామచంద్రరావు సుధ (హైదరాబాద్),
అభిమానులు : హైదరాబాద్, సికింద్రాబాద్ : శ్రీడి. సత్యమ్మ, రాజయ్య, శ్రీమతి బి. కన్యాకుమారి, శ్రీ సిహెచ్. శివ కుమార్, శ్రీ జి. రాజశేఖర రావు, సిహెచ్. సుందరాచార్యులు, శ్రీమతి పి. శశిరేఖ, శ్రీమతి యస్. విమలాభాయి, శ్రీ ఎ. జగన్నాథా చార్యులు, శ్రీమతి కె. ప్రియాంక, శ్రీమతి ఎ. ధనలక్ష్మి, శ్రీ జి. వంశీకృష్ణ, శ్రీ జె. జగన్నాథాచార్య, శ్రీ కె. రామచంద్ర, శ్రీవి. రాజేశ్వరరెడ్డి, శ్రీ వి. వెంకట రాజామ్, శ్రీమతి యమ్. సుమిత్ర, శ్రీమతి డి. కామేశ్వరమ్మ, శ్రీ వి. దక్షయ్య, శ్రీ సిహెచ్. విష్ణు ప్రాశమ్, శ్రీ జి. దొరస్వామి, శ్రీ ఇ. దేవేంద్రనాథ్, శ్రీ ఎ. ఉమామహేశ్వరరావు, శ్రీ వి. సీతారామ్‌దాస్, శ్రీ వి. కుమార రాజా, శ్రీమతి కె. కళావతి, శ్రీ సిహెచ్. రవీంద్ర, శ్రీ పి. సత్యనారాయణ, శ్రీ అష్టాక్షరీ, శ్రీ వి. సుదర్శనరావు, శ్రీ కె. వెంకన్న, శ్రీ సిహెచ్. వెంకటేశమ్, శ్రీమతి వి.వి.యస్. తాయారమ్మదేవి, శ్రీమతి యస్. సక్కుబాయి, శ్రీ యు. మనోహరమ్, శ్రీమతి జె. గురునాథ హేమలత, శ్రీమతి యమ్. మాధవి, శ్రీ ఇ. నాగయోగేంద్ర ప్రసాద్, శ్రీ పి. సుదర్శరావు, శ్రీ ఎ. సత్యసుధీర్, శ్రీ కె. మల్లయ్య,శ్రీ బి. గోపాలకృష్ణ శర్మ, శ్రీ కె. రామారావు, శ్రీ పి. బాలయ్య, శ్రీమతి యన్. వెంకటరామ కుమారి శ్రీ టి. శంకరయ్య, శ్రీ యమ్. శ్రీనివాసరావు, శ్రీ యన్. శేఖర్, శ్రీ పి. గోపాలకృష్ణ, శ్రీ ఆర్. రాజశేఖర్, శ్రీ బి. లక్ష్మీనరసింహారావు, శ్రీ డి. నాగేంద్రరావు, శ్రీ సుగుణా లక్ష్మీకాంతరెడ్డి, శ్రీ జి. బాలేశలింగం, శ్రీ యన్. సుదర్శన్, శ్రీ యమ్. శ్రీనివాసరావు, శ్రీ యమ్. వెంకట జోగారావు, శ్రీమతి కె. శివయ్య శ్రీదేవి, శ్రీ కె. రంగదాస్,శ్రీ శ్రీ కె. మోహనరావు, శ్రీ కె. నరసింహమ్, శ్రీమతి యస్.బి. ఆండాళమ్మ, శ్రీ కె. శ్రావణకుమార్, శ్రీమతి యన్. సుజాత, శ్రీ కె. సోమశేఖర సెట్టి, శ్రీ టి. సీతారామాంజనేయ గుప్త, శ్రీ బి. ఈశ్వరయ్య, శ్రీ యస్. అనసూయ, శ్రీ బి. రామకృష్ణారావు, శ్రీ ఆర్. పాండురంగారావు, శ్రీమతి టి. స్వర్ణ, శ్రీ కె. విష్ణుమూర్తి, శ్రీ యమ్. ప్రదీప్ హరి, శ్రీ యస్. వెంకటేశమ్, శ్రీ జె. అరవింద్, శ్రీ యన్.హేమ కుసుమ కుమారి, శ్రీమతి జి. లక్ష్మీనారాయణ అనసూయ, శ్రీ బి. శ్రీరాములు, శ్రీ యన్. విఠల్ సుబ్బారావు,శ్రీ జె. రాజేశ్వరావు, శ్రీ బి. శ్రీధర్, కె. శ్రీరామాంజనేయులు, శ్రీ ఆర్. శ్రీరామారావు, శ్రీ ఇ. ఇంద్రసేనా రామలక్ష్మి, శ్రీ సి. అశోక్ కుమార్, శ్రీమతి కె. సరళాదేవి, శ్రీ డి. ధీరజ్ రావు, శ్రీమతి జి. హైమావతి, శ్రీ పి. విజయ్ కుమార్, శ్రీమతి యు. రాధమ్మ, శ్రీ కె. సాత్విక్, శ్రీమతి యమ్. రుక్మిణీ భాయి, శ్రీ సిహెచ్. శివకుమార్, శ్రీ డి. వెంకట శేషయ్య, శ్రీ యమ్. లక్ష్మీనరసింహాచార్య, శ్రీ బి. కృష్ణస్వామి, శ్రీమతి వై. త్రిపురాంబ, శ్రీ యస్. నరహరి, శ్రీమతి అనురూప్ కుమార్ శాంతి, శ్రీ రవిశ్రీ చందర్, శ్రీమతి యన్. మణమ్మ, శ్రీమతి యమ్. లచ్చమ్మ, శ్రీ బి. పోతురాజు, శ్రీ ఆర్. దామోదరరావు, శ్రీయస్. హనుమంతరావు, శ్రీ జె. వెంకటరెడ్డి, శ్రీ యమ్. వెంకటరెడ్డి, శ్రీమతి బి.జి. శాంతాపాపన్న, శ్రీమతి కె. ఆమోష్ రెడ్డి విద్యుల్లత, శ్రీ యన్. రామయ్యా, శ్రీ సిహెచ్. వెంకటేశ్

సక్కుబాయి, శ్రీమతి డి. రమామణి, శ్రీ ఎ.
నరసింహా రావు, శ్రీమతి డి. లక్ష్మమ్మ, శ్రీమతి
కామశాస్త్రి రత్తమ్మ, శ్రీమతి అనూరాధా వినోదరెడ్డి,
శ్రీ టి. కొండారెడ్డి, శ్రీమతి పి. స్వరూపారాణి, శ్రీబి.
రామచంద్రారావు, శ్రీమతి యమ్. సుమిత్ర, శ్రీ
డి. రామమోహనరావు, శ్రీ టి. వరదాచార్యులు,
శ్రీ టి. బలరామకృష్ణ, శ్రీ పి. కృష్ణారావు, శ్రీ యన్.
మురళీధర్, శ్రీ పి. కేశవరెడ్డి, శ్రీ ఎ. నాగేశ్వరరావు,
శ్రీ యు. రామాచార్యులు, శ్రీ కె. సూర్యనారాయణ
మూర్తి, శ్రీ సిహెచ్. నారాయణ రెడ్డి, శ్రీ వి.
కృష్ణమాచార్యులు, శ్రీ కె. వెంకట రాజారావు, శ్రీ
యస్. అశోక్, శ్రీ పి. పోచయ్య (రాజగోపాలరావు
పేట), శ్రీ బి. కృష్ణ వినోద కుమార్, శ్రీ యన్.
నరసింహారెడ్డి, శ్రీమతి పి. అనూరాధ, శ్రీ కె.
రామారావు, శ్రీ టి. వెంకటరామశేషయ్య, శ్రీ యస్.
మార్కండేయ (గోదావరిఖని), శ్రీ జి. యతిరాజులు,
శ్రీమతి బి.హెచ్. సూర్యకుమారి, శ్రీ జి. నల్లపరెడ్డి,
శ్రీ కె. ఆదిశేషయ్య, శ్రీ ఇ. మురళీ, శ్రీ సిహెచ్.
దత్తాత్రేయులు, శ్రీ వై. రామేశ్వరావు, శ్రీమతి వి.
కృష్ణమ్మ, శ్రీ యు. శంకరాచారి, శ్రీమతి యమ్.
లక్ష్మి, శ్రీ యన్. పెరియాళ్వార్, శ్రీ బి. సుధాకర్
(విశాఖ పట్టణం), శ్రీ వి. మూర్తిప్రసాద్, శ్రీమతి
యస్. సురేష్ లీలావతి, శ్రీ ఆర్. శ్రీనివాసరావు,
శ్రీమతి ఎ. కళావతి, శ్రీ వి. నరసింహారావు, శ్రీ
యస్. మోహన్, శ్రీమతి బి. సావిత్రి(కరీంనగర్),
శ్రీమతి యస్. రాజ్యలక్ష్మి, శ్రీమతి యమ్. వెంకట
రామానుజ వసంత, శ్రీమతి వి. రామప్రియ, శ్రీమతి
జె. సుశీలాదేవి & సన్స్, శ్రీ యు. మధుకరరావు,
శ్రీ వి.ఆర్.యమ్. రమణ మూర్తి, శ్రీమతి బి.
వెంకటనరసమ్మ (సిద్ధిపేట), శ్రీ కె. వెంకట
సుబ్బారావు, శ్రీ కె. సూర్యనారాయణ, శ్రీ ఎ.యస్.
రాజేశ్వరరావు, విశాలాక్షి, శ్రీ ఎ. శంకరయ్య, శ్రీ
యన్. సన్ముఖపిళ్ళై, శ్రీ ఐ. వెంకట సత్యనారాయణ
(రాజమండ్రి), శ్రీమతి కె. భారతి, శ్రీఐ. కృష్ణారెడ్డి,
శ్రీ యన్. అమృత కృష్ణారెడ్డి, శ్రీ యన్.
వెంకటేశ్వరరావు, శ్రీమతి యన్.చిన్నమ్మ, శ్రీ యస్.
శ్రీనివాస్, శ్రీ జి. చిన్న బ్రహ్మానందం, శ్రీ టి.
సోమలింగం (మెదక్), శ్రీ పి. వెంకట ఉమా
శంకరరావు, శ్రీ కె.రాజేష్ కుమార్, శ్రీడి . వెంకటేశ్వర
రావు (కరీంనగర్), శ్రీమతి ధన్జేవర్ తులశమణి,
శ్రీ యన్. మహేంద్ర, శ్రీయమ్. లక్ష్మీసురేంద్ర రెడ్డి,
శ్రీ వి.పుష్పమాలా, శ్రీ ఐ.కృష్ణారెడ్డి, శ్రీ జి.నర
సింహం సావిత్రి, శ్రీ వై. వీరలక్ష్మి శ్రీ జి.యస్. శాస్త్రి
(ఒంగోలు), శ్రీ కుసుమ రంగారెడ్డి(వట్టెమ్), శ్రీ
యమ్. శ్రీహరహర బాలాజి, శ్రీటి. సత్తిరెడ్డి, శ్రీ డి.
అరుణ అంజయ్య, శ్రీ సి.ఆర్. పూర్ణచంద్రరావు, శ్రీ
కె. గంగాధరరావు, శ్రీబి. వీరేశమ్, శ్రీ ఎ. అశోక్, శ్రీ
టి. వేణుధర రెడ్డి, శ్రీ యమ్. శ్రీనివాసరావు, శ్రీ
బాలగంగాధర్ పట్నాయక్, శ్రీ బి. నరసింహారావు,
శ్రీ వెంకటేశ్వరరావు, శ్రీమతి పి. వసుంధర, శ్రీ
యమ్. నాగరాజు, శ్రీ యస్. సంజయ కుమార్,
శ్రీమతి సుగుణాదేవి, శ్రీ జె. జగపతిరావు, శ్రీ టి.
మోహనరావు, శ్రీ యమ్. వాసుదేవ్, శ్రీమతి యమ్.
రాజేశ్వరి, శ్రీ రామనాథం ఓబులసెట్టి (మహబూబా
బాద్), శ్రీటి. నాగేశ్వరరావు (అవనిగడ్డ), శ్రీ పి.
కృష్ణచౌదరి, శ్రీ యన్. ఉమేష్ కుమార్, యస్.
సింహాచలం, శ్రీ పి. మాధవరావు, శ్రీ కె. రామ
తారకమ్, శ్రీ వై. యాదగిరి, శ్రీ జి. నారాయణరాజు,
శ్రీ టి. లోహితరెడ్డి, శ్రీ కె. రాజేశ్వర రెడ్డి, శ్రీమతి బి.
సుశీల, శ్రీ వై. నాగేశ్వరరెడ్డి, శ్రీ యన్.యాదగిరి, శ్రీ
పి. రామచంద్రరావు, శ్రీ డి. అరుణ్‌రాజు, శ్రీ యన్.
రాములు, శ్రీమతి జి. కళ్యాణమ్మ, శ్రీపి.
నాగేంద్రయ్య (వెంగన్నపల్లి), శ్రీ జె. శ్రీనివాసరెడ్డి,
శ్రీ వి. కృష్ణమాచార్యులు, శ్రీ టి. వెంకట
మురళీధర్‌రావు, శ్రీ పి. వెంకటకుమార్, శ్రీ పి. సీతా
రామరావు, శ్రీ జె. మురళీధర్ రెడ్డి, శ్రీమతి ఆర్.
రామారావు రాజేశ్వరి, శ్రీ సత్యనారాయణశర్మ, శ్రీ
పి. రాధాకృష్ణరావు, శ్రీ యస్.బి. రామనాథ్, శ్రీ బి.
పశుపతిరామ్, శ్రీమతి విమోచన్ సంపతి మాధవి,
శ్రీ యన్. శ్రీనివాస్, శ్రీమతి కె. సత్యవతి, శ్రీ యన్.
నరసింహారావు, శ్రీమతి పి. వెంకట లక్ష్మమ్మ, శ్రీమతి
పి. రుక్మిణమ్మ, శ్రీమతి యమ్. ఆండాళ్ళమ్మ, శ్రీమతి
జి. కామేశ్వరి, శ్రీ బి. వెంకటసీతారామా రావు, శ్రీ
సిహెచ్. చంద్రశేఖర్, శ్రీ కె. భద్రయ్యగుప్తా, శ్రీ సూర్య
చంద్రరావు శెట్టి (నరసాపూర్), శ్రీ డి. సత్య
నారాయణ హంసవేణి, శ్రీ జి. పాండురంగయ్య,
శ్రీ వి.ఆండాళ్ రామ్‌గోపాలరావు, శ్రీ యమ్.
శ్రీనివాస్, శ్రీమతి జి. కృష్ణవేణి, శ్రీ యమ్. నాగేశ్వర
రావు, శ్రీ యన్. అశోక్ కుమార్, శ్రీ డి. భారత్
భూషణరెడ్డి, శ్రీ పి. సత్యనారాయణ, శ్రీ ఎ.వి.ఆర్.





చార్యులు, శ్రీ పి. వెంకటరామయ్య, శ్రీ యన్. రామ
కృష్ణారావు, శ్రీ కె. హిమేష్ చందర్, శ్రీ యస్. బాల
రాజు, శ్రీ ఊర్మిళా నరేందర్ సింగ్, శ్రీ వై. మురళీధర్
రెడ్డి, శ్రీ టి. వెంకట సుబ్బయ్య, శ్రీ సిహెచ్. చంద్ర
శేఖర్, శ్రీ నాగేశ్వరరావు, శ్రీ శ్రీనివాసరెడ్డి, శ్రీ యన్.
సణ్ముకేశ్వర సిద్ధార్థ, శ్రీ జి. రామచంద్ర రెడ్డి, శ్రీమతి
కె. లక్ష్మమ్మ, శ్రీమతి సీతామహలక్ష్మి శ్రీ జె. ఆనంద
రావు, శ్రీ పి. చంద్రశేఖరావు, శ్రీమతి యన్.
సుధాశ్రీనివాసరావు, శ్రీమతి భారతి తిరుపతి రెడ్డి,
శ్రీ టి. గోవిందరావు, శ్రీ కె. శ్రీనివాసరావు, శ్రీ జి.
నారాయణరెడ్డి, శ్రీ యన్.యస్. రమణ, శ్రీమతి జె.
విమలాదేవి, శ్రీ ఆర్. నరసింహరావు, శ్రీమతి కె.
రూపాదేవి సుదర్శన్, శ్రీ పి. నరసింహారెడ్డి, శ్రీ బి.
సత్యనారాయణ రావు, శ్రీమతి కె. అనిత విశ్వపతి
రావు, శ్రీ కె. రామకృష్ణారావు, శ్రీ ఎ. నాగయ్య
వీరమణి, శ్రీ యన్. నరసింహాచారి, శ్రీ పి.వి.యస్.
ఆర్. గోపాలరాజు, శ్రీ కె. అప్పరాయ శర్మ, శ్రీ డి.
వెంకటేశ్వరరావు, శ్రీమతి యమ్. సుజన రంగారెడ్డి,
శ్రీ యమ్. జగన్నాథరావు, శ్రీ జె. సత్యనారాయణ
రావు, శ్రీ టి. రమాదేవి స్వాతి, శ్రీ ప్రసన్నకుమార్,
శ్రీ పి. విజయ్ కుమార్, శ్రీ జె. రత్నాకరరావు, శ్రీ
యన్. మస్తానయ్య చౌదరి, శ్రీ బి. సునీల్ కుమార్,
శ్రీ రామచంద్రారెడ్డి (పెదపల్లి), శ్రీ యస్. పద్మారెడ్డి,
శ్రీ జి. ధర్మారావు, శ్రీ యన్. గోపాలకృష్ణమ్మ, శ్రీమతి
వి. గంగరాజు గణసుందరి, శ్రీమతి జి.కమలాదేవి,
శ్రీమతి కె. హరిప్రియ రామారావు, శ్రీ పి. రాజేశ్వర
రావు, శ్రీ కె. రాజేశ్వర్, శ్రీ యాదగిరి ఆండాళ్‌రావు,
శ్రీ వై. రఘునందన్, శ్రీ బి. రామస్వామి, శ్రీమతి
ఆర్. సుగుణమ్మ, శ్రీ వి. ఉపేంద్రరావు, శ్రీ పి.
సాయినాథరెడ్డి, శ్రీ కె. పార్థసారధి, శ్రీ యన్.
వెంకటనరసింహాచార్యులు, శ్రీమతి ఎ. శ్రీధర్
ప్రసన్నలక్ష్మి, శ్రీ యమ్. కోదండరామశాస్త్రి(తెనాలి),
శ్రీమతి పి. కమలావతి (గుడ్లవల్లేరు), శ్రీ జె.
నరసిహారావు, శ్రీ బి. రాధాకృష్ణమూర్తి, శ్రీ ఆర్
మోహన్ రెడ్డి, శ్రీ ఆర్ కృష్ణారెడ్డి, శ్రీ
నారాయణరావు(యెదద్దమల్లారం), శ్రీ కె.
రామమోహన్‌రావు, శ్రీ యల్. రంగనాయకమ్మ,
శ్రీమతి యన్. కృష్ణవేణి, శ్రీ ఆర్. సుధాకరరెడ్డి,
శ్రీమతి పి. విజయలక్ష్మికాంతారావు, శ్రీమతి యమ్.
అనసూయ, శ్రీ జె. రామకృష్ణారావు, శ్రీ యన్.
సత్యనారాయణరావు, శ్రీ ఈ. ఈశ్వరయ్య, శ్రీ
యన్.వి.ఆర్.ఆర్. శేషసింహాద్రి అప్పారావు, శ్రీ
యన్. పురుషోత్తమ రెడ్డి, శ్రీమతి యమ్.
కౌసల్యాదేవి, శ్రీ పి. వెంకటరామారావు, శ్రీమతి
సిహెచ్. హనుమాయమ్మ, శ్రీమతి యన్.
వెంకటఫణిమాధవి, శ్రీమతి కె. స్వర్ణలత (నాగర్
కర్నూలు), శ్రీ టి. మల్లేశ్, శ్రీ కె. చిన్నారెడ్డి, శ్రీ ఒ.
భీమరాజేశ్వరరావు, శ్రీ పి. పద్మమనోహరరావు
(గన్‌పూర్), శ్రీమతి జి. జయప్రద, శ్రీ ఒ.
మురళీధరరావు, శ్రీమతి యమ్. స్వరాజ్యరాణి
(విజయవాడ), శ్రీ కె. రామచంద్రారెడ్డి (మెరక
గూడెం), కె. మనోహర్ (గుంటూరు), శ్రీమతి ఐ.
సరోజని (సికింద్రాబాద్), శ్రీమతి జయ శ్రీలక్ష్మి
(యు.యస్.ఎ), శ్రీ కె. హర్షవర్ధనరావు, శ్రీ ఇ.
సూర్యప్రకాశరావు, శ్రీ ఆర్. సీతారామయ్య, శ్రీ కె.
వెంకటేశ్వరరావు, శ్రీమతి సిహెచ్. ప్రమీళ, శ్రీ ఆర్.
శ్రీరామారావు, శ్రీమతి పి. రంగారావు కమలా
బాయి, శ్రీమతి కె. ఉమాపతిరావు నీరజ, శ్రీ యమ్.
రామారావు, శ్రీమతి టి. హైమావతి, శ్రీ సచ్చిదా
నంద మూర్తి, శ్రీమతి కె. అహల్య, శ్రీ జి. ఉదయ
భాస్కర రావు హరిణ, శ్రీ జె. బాలప్ప ప్రమీళ, శ్రీ
కె. తిరువెంగళా చార్యులు, శ్రీమతి యస్. పుష్పలత
కరీంనగర్, శ్రీమతి అనసూయ (రామగుండం),
శ్రీయన్. రామాచారి, శ్రీమతి యమ్. సుధారకరెడ్డి
సుకన్య, శ్రీ సూర్యనారా యణరాజు, శ్రీ బి.
నాగరాజు, శ్రీ జి. ఆంజనేయ గుప్త, శ్రీ యమ్.
ప్రసాదరావు అరుణ, శ్రీ వి. విలాజి బాబు రాధిక,
శ్రీ సిహెచ్. వి. ఎ. సత్యనారాయణ, శ్రీ జి. సీతా
రామాంజ నేయులు, శ్రీ డి. శ్రీనివాస రావు సంధ్య,
శ్రీ బి. మాధవరావు, శ్రీమతి ఎ. అహల్య, శ్రీమతి
టి. సుధామశ్రీ, శ్రీ యస్. నారాయణాచాదరి విజయ్
కుమార్, శ్రీ కాజా సుబ్బారావు (ఉనికిలి), శ్రీ యస్.
శివప్రసాద్, శ్రీ డి. విశ్వకుమార్ బాలాజీ, శ్రీమతి
కె. లలితాదేవి, శ్రీ జి. రాజగోపాలా చార్యులు, శ్రీ
బి. రామస్వామి (ఉనికిలి), శ్రీమతి కె. యశోదమ్మ,
శ్రీ ఎ. రంగశాయి, శ్రీ పి. శ్రీవాణి శ్రీకాంత్, శ్రీమతి
కె. శకుంతలమ్మ, శ్రీ కె. వరప్రసాద్, శ్రీ శ్రీనివాసా
చార్యులు, శ్రీ డి. రామారెడ్డి, శ్రీ పి. కాశీరెడ్డి, శ్రీ పి.
భాగ్యలక్ష్మి, శ్రీ సిహెచ్. వెంకటరత్నం, శ్రీ జె. రామో
హనరావు, శ్రీ సి. రఘునాథరావు.

# ఇతిహాసబోధ-IX-2

ముని శాపం ముసలం రూపంలో యాదవవంశాన్ని కబళించింది. శ్రీకృష్ణ భగవానుడు తన అవతారాన్ని చాలించాడు. ఈ సమాచారం పాండవులను తీవ్రంగా కలచి వేసింది. తమ గురువు, బంధువు, మార్గదర్శి, హితుడు-సర్వమూ అయిన శ్రీకృష్ణుని నిర్యాణం వారికి వైరాగ్యాన్ని కల్గించింది. మహాప్రస్థానానికి వారు సిద్ధమయ్యారు. యుయుత్సునికి రాజ్యరక్షణ భారమప్పగించి, పరీక్షిత్తుకు పట్టాభిషేకం జరిపారు.ఎవరికి అప్పగించవలసినవి వారికి అప్పగించారు. నిరాడంబరంగా నారవస్త్రాలు ధరించి హస్తినను విడచి ద్రౌపదీసమేతంగా బయలుదేరారు. ఆబాలగోపాలమంతా దుఃఖంతో వారికి వీడ్కోలు చెప్పారు. ఒక కుక్క మాత్రం వారిని వెన్నంటి నడిచింది.

వారు ఉపవాసవ్రతాన్ని చేపట్టి, భాగీరథీ నది వద్దకు చేరారు. ముందు ధర్మరాజు, ఆ తర్వాత భీమ, అర్జున, నకుల సహదేవ, ద్రౌపదులు, అనంతరము కుక్క - నడుస్తున్నారు. వారు భాగీరథీ నదినుండి తూర్పువైపుగా కొండలు, నదులు అడవులు దాటుతూ తూర్పు సముద్రం చేరారు. అక్కడ అగ్నిదేవుని కోరికపై అర్జునుడు గాండీవాన్ని సముద్రంపాలుచేసాడు.

యోగశక్తితో వారు దక్షిణం దిక్కుగా బయలుదేరి దక్షిణసముద్ర తీరం చేరారు. అటు తర్వాత పడమటి దిక్కుగా బయలు దేరి పడమటి సముద్ర తీరం చేరారు. సముద్ర మున మునిగిన ద్వారకకు ప్రక్కగా తమ ప్రయాణం సాగించి హిమాల యాలకు చేరారు. అక్కడ నుండి అడవులు, నదులు, పర్వతాలు అతిక్రమిస్తూ తమ యోగశక్తితో మేరు పర్వతంవైపు పయనించ సాగారు.

ఇంతలో యోగభ్రష్టమైన ద్రౌపది నేల కూలింది. ''అన్నా! ఎన్నడూ ధర్మహాని నెరుంగని ద్రౌపదికేల ఈ అవస్థ?'' అని అడిగాడు బాధతో భీముడు. ''ఈమె అర్జున పక్షపాతి! అని కారణం చెప్పి ఎటువంటి వికారము లేకుండా ద్రౌపది దేహాన్ని వదలి ముందుకు సాగాడు ధర్మరాజు. మరికొంత సేపటికి సహదేవుడు ప్రాణాలు విడిచాడు. 'అన్నా! సచ్ఛరితుడైన సహదేవు నికీ భంగపాటు కలగడానికి కారణ మేమిటి? అన్నాడు భీముడు 'నాయనా! ప్రపంచంలో తనంతటి ప్రజ్ఞావంతుడు లేడన్న గర్వము సహదేవుడి కుంది. దాని పర్యవసానమే ఇది' అని చెప్పి మరణించిన తమ్ముని ఎడల ఉపేక్షతో ముందుకు సాగాడు ధర్మరాజు.

మరికొంత కాలానికి నకులుడు నేల కూలాడు. యధాప్రకారం భీముడు కారణ మడిగాడు ధర్మరాజును. 'తనవంటి అందగాడు లోకమున లేడన్న అతిశయమే నకులుని పతనమునకు కారణమని' సమాధానం చెప్పి సాగిపోయాడు ధర్మరాజు. ద్రౌపది, సహదేవుడు, నకులుడు మరణించినందుకు దుఃఖిస్తూ అర్జునుడు కూడా దేహపరిత్యాగం చేసాడు.

భీముడు దుఃఖిస్తూ విజయుని పతనానికి కారణమేమిటని అన్నను అడిగాడు. 'ఇతడు సమస్త కౌరవ సైన్యాన్ని ఒక్కరోజే యుద్ధమున కూల్చెదనని చెప్పి మాటతప్పాడు. మాటకు, చేతకు తేడా ఉండటం దోషమేకదా! పైగా ఈతడు ఇతర ధనుర్ధారులనెల్ల తృణీకరించు చుండెను. దాని గతియే ఇది' అని ధైర్యముతో అర్జునుని దేహమును విడచి ధర్మరాజు ముందుకు నడిచాడు.





మరికొద్ది సేపటికి భీముడు 'అన్నా! నేనూ నేలకొరుగుతున్నాను. నాకేల ఈ దుస్థితి' అన్నాడు ఆర్తితో.

'నాయనా! నీవు అమిత భోజనుడవై, భుజ బల పరాక్రమ సంపదచే ఎవ్వరినీ లెక్కించక ఎప్పుడూ ప్రగల్భములు పలికెదవు. తత్ఫలితవేం ఇది!' అని పలికి, ఆగక ముందుకు సాగాడు ధర్మరాజు. సోదరులు, భార్య నేల పడినా కుక్క వదలకుండా ధర్మరాజునే అనుసరిస్తూ వెళ్ళింది. ఇలా నిష్ఠతో ధర్మరాజు ప్రయాణం సాగిస్తూంటే, దివ్య రథారూఢుడై దేవేంద్రుడు ధర్మరాజు వద్దకు వచ్చాడు.

ధర్మరాజు భక్తిశ్రద్ధలతో దేవేంద్రునికి నమస్కరించాడు.'రాజా! నీ నిష్టకు సంతోషించి సశరీరునిగా నిన్ను దేవలోకానికి తీసుకు పోవడానికి వచ్చాను. రా!' అంటూ ఇంద్రుడు ధర్మరాజును రథంలోకి ఆహ్వానించాడు.

ధర్మరాజు చింతాక్రాంతు డయ్యాడు. 'దేవేంద్రా! నాపైగల నీ అపారకృపకు ధన్యుడిని! అయితే ఇన్నాళ్ళూ ధర్మమార్గాన నన్ను అనుసరించిన నా తమ్ముల యొక్క, ద్రౌపది యొక్క వియోగం నన్నెంతగానో బాధిస్తున్నది. వారు లేని స్వర్గం నాకు అక్కర్లేదు. ఏదైనా వారితోనే నేను అనుభవిస్తాను. మన్నించు' అన్నాడు.

'పుణ్యశీలీ! నీ వారందరూ దేహపరిత్యాగానంతరము దేవలోకమునకు చేరి ఉన్నారు. నీవు అక్కడ వారిని చూడవచ్చు. ముందు రథాన్ని అధిరోహించు!' అంటూ ఇంద్రుడు మరల ఆహ్వానించాడు ధర్మరాజును.

'దేవరాజా! ఒక్కమాట! ఈ శునకము హస్తిననుండి మమ్ము భక్తితో సేవిస్తూ అనుసరించింది. ఈ అల్పప్రాణికి కూడా నాతోపాటు స్వర్గలోకార్హతను కలుగచేయాల్సిందిగా కోరుతున్నాను. దీనిని విడచి పుచ్చడాన్ని భరించలేను' అని ప్రార్థించాడు ధర్మరాజు.

'రాజా! ఏమిటీ వెఱ్ఱి? మహాతపశ్శక్తితో, పుణ్యకార్యాలతో సంపాదించే స్వర్గలోక ప్రవేశార్హత ఈ నీచశునకానికెట్లా సాధ్యమౌతుంది? వ్రతశీలియైన వాడు శునకాన్ని తాకితే అతని పుణ్యం నశిస్తుందని నీకు తెలియదా? దీనిని విడవటం వల్ల నీ కెటువంటి ధర్మహానీ కలుగదు. దేవ లోకములో కుక్కలకు ప్రవేశము లేదు.

నీ తోబుట్టువులను, ద్రౌపదిని విడవ గలిగిన నిగ్రహసంపన్నుడవు, నీవు! ఈ కుక్క విషయములో మాత్రము అక్కరలేని అనుబంధాన్ని పెంచుకొని, దేవలోక సౌఖ్యానుభవాన్ని నిరాకరిస్తున్నావు. ఆలస్యం చేయకుండా రథమెక్కు. రా! 'అని ఇంద్రుడు పలువిధాలుగా ధర్మరాజుకు హితబోధ చేసాడు.

'మహాప్రభూ! నీవు అఖిలలోకాలకు పాలకుడవు! నీకు తెలియని ధర్మమెక్కడ ఉన్నది? నీకు తెలియని మంచిచెడ్డలు కలవా? మహాత్ములతో వాదనకు దిగరాదన్నది నియమము. అందుచేతనే నా ప్రార్థనను మీకు వినయముతో విన్నవించు కొంటున్నాను. మరణించిన సోదరులకొఱకు, భార్యకొఱకు విలపించి నంత మాత్రమున వారు తిరిగిరారు కదా! కానీ నన్ను విడువక నాతోవచ్చిన ఈ కుక్కను విడుచుట. బ్రహ్మహత్యతో సమానము, దేవలోక సౌఖ్యాల కొఱకు ఇట్టిపాప కార్యమును నేను చేయలేను.

శరణన్నవారిని రక్షించకపోవడం, మిత్ర దోహము, వనితా సంహారము, బ్రాహ్మణ సంపత్తిని హరించటం వంటి పాపాలకన్నా దోషరహితుడైన, భక్తుడైన అనుచరుని విడచుట మహాపాపము, సర్వదా నా ఎడల

మీ అనుగ్రహాన్ని ప్రసరింప చేయండి! ఈ శునకములేని స్వర్గాన్ని నేను ఆశించను. దయచేసి దీనిని తప్పిదంగా భావించక మన్నించండి. నేనీ అడవులలోనే తపస్సు చేసుకొంటూ మిమ్మల్ని కొలుస్తాను. మీరు వెళ్ళండి.' అని తన ధృఢ నిశ్చయాన్ని ఇంద్రునికి తెలియ చేసాడు ధర్మరాజు.

కుక్కరూపంలో అప్పటిదాకా ధర్మ రాజును అనుసరించిన యమధర్మ రాజు తన నిజరూపమును తన పుత్రునికి చూపాడు. ఆశ్చర్యచకితుడై ధర్మరాజు ఆనందంతో యమునికి నమస్కరించాడు.

'పుత్రా! సమస్త జీవులపై నీకున్న కరుణ నాకెంతో ఆనందాన్ని కల్గిస్తున్నది. నీవంటివారీ భూలోకంలో ఎవరున్నారు? నాడు ద్వైతవనంలో యక్షుని రూపములో నీ ధర్మనిరతిని గ్రహించాను, నీ ఉదాత్త ప్రవృత్తిని, ధర్మనిష్ఠను ఏమని శ్లాఘించాలి? శునకము కొఱకు స్వర్గమును తృణీకరించిన నీకు సాటి వేరెవరూ స్వర్గములో కూడా లేరు. నీ వింతటి గొప్పవాడవని దేవేంద్రుడు కూడా గ్రహించాడు. కనుకనే తానే స్వయంగా నిన్ను తీసుకెళ్ళడానికి వచ్చాడు. నీకు శుభమగుగాక! అని ఆశీర్వదించాడు యముడు.

ధర్మరాజు దేవమునులతో కూడి గంధర్వులు, సిద్ధులు ఆదిగా గల దేవ గణాలు తమ్ము అనుసరిస్తూండగా ఇంద్రునితో కూడి స్వర్గలోకమునకు ప్రయాణమయ్యాడు.

పై సన్నివేశంలో ధర్మరాజు యొక్క ధార్మిక ప్రవర్తనను గమనించాము కదా! ఇక మనవిషయానికి వస్తే-శాసనం శిక్షిస్తుందనే భయంచేతనో నలుగురూ నిందిస్తారనే భీతిచేతనో, అంతరాత్మ ప్రబోధం చేతనో సాధారణంగా సమాజంలో ధర్మబద్ధంగా జీవనం సాగించడానికి ప్రయత్నిస్తుంటాం. ఈ ప్రయత్నాలలో ఎదురయ్యే పరీక్షలకు ఎంత మందిమి ఏ మేరకు కృతకృత్యులమయ్యామనే ప్రశ్నలకు లభించే సమాధానాన్ని బట్టే మన ధార్మిక అనురక్తిని, నిష్ఠను అంచనా వేయడం జరుగుతుంటుంది.

ధార్మిక జీవనం గడపాలనుకొనే వారికి ఎదురయ్యే పరీక్షలు ప్రధానంగా రెండు రకాలుగా ఉంటాయి. వొత్తిడుల రూపంలో ఎదురయ్యే పరీక్షలు ఒక రకమైతే, ప్రలోభాల రూపంలో ఎదురయ్యే పరీక్షలు మరొక రకం.

దేవతలు ధర్మరాజును ఈ రెండు రకాల పరీక్షలకు గురిచేసారు. దాదాపు 12 ఏళ్ళు రాజ్యభోగాలకు దూరమై అడవులలో అష్టకష్టాలు అనుభవించారు పాండవులు. మరొక్క సంవత్సరం సహనంతో గడిపితే రాజ్యప్రాప్తికి అవకాశం లభిస్తుంది. ఆ సమయంలో ధర్మరాజుకు ఓ విషమ పరీక్ష ఎదురైంది.

అండగా నిలుస్తారనుకున్న నలుగురు తమ్ములూ మరణించారు. అంతటి భయంకరమైన పరిస్థితిలోనూ 'కీడులో మేలన్నట్లు'గా వారిలో ఎవరినో ఒకరిని మాత్రమే బ్రతికించుకొనే అవకాశం లభించింది ధర్మరాజుకు. ఎవరిని బ్రతికించు కోవాలి? పదివేల ఏనుగుల బలం గల భీమసేనుడినా? పాశుపతాస్త్రాది దివ్యాస్త్ర సంపన్నుడైన అర్జునుడినా? వీరిద్దరిలో ఏ ఒక్కరిని కోరుకున్నా ధర్మరాజుకు రాజ్యసిద్ధికి అవకాశాలు ఖచ్చితంగా మెరుగు పడతాయి. కోరుకునే విషయంలో ధర్మరాజుకు ఎవరి నిర్భందాలూ లేవు! అతనికి ఆ విషయంలో సంపూర్ణ స్వేచ్ఛ ఉన్నది. అయితే ఆ స్వేచ్ఛను,ఆ అవకాశాన్ని తన ''స్వలాభం'' కోసం వినియోగించుకోలేదు ధర్మరాజు.

అంతటి సంకట పరిస్థితిలో కూడ అతని బుద్ధి ధర్మమార్గాన్ని అనుసరించింది. కౌంతేయులలో తాను బ్రతికిఉన్నాడు కనుక - మాద్రి సంతానంలో ఒకడు బ్రతకడం





సముచితమని భావించి నకులుని ప్రాణాన్ని కోరాడు. గతసంచికలో సమవర్తిని మెప్పించిన ధర్మరాజు యొక్క ధార్మికనిష్ఠను గురించి సవివరంగా తెలుకున్నాము.

వొత్తిడులరూపంలో ఎదురైన పరీక్షకు నిలిచిన ధీశాలి ధర్మరాజు!

ఇక ఈ సంచికలో వివరించిన రెండవ సన్నివేశం ధర్మం పట్ల ధర్మరాజుకు గల అభినివేశాన్ని మరొక్కమారు ఎంతో స్పష్టంగా మన కళ్ళముందుంచుతున్నది. సాక్షాత్తూ దేవేంద్రుడే వచ్చి ''శరీరంతో స్వర్గానికి తీసుకువెళతాను రావయ్యా'' - అంటే ''నాకిచ్చిన గౌరవాన్ని నాతోపాటు వచ్చిన కుక్కకు కూడా ఇవ్వాలని మొండిపట్టు పట్టాడు ధర్మరాజు. కుక్క లేకుంటేనే స్వర్గభోగాలని ఆశచూపినా అతడు ప్రలోభపడక, స్వర్గాన్ని పూచికపుల్లతో సమానంగా భావించి తృణీకరించాడు!.

ఇంతటి ఉదాత్త ప్రవర్తన కలవాడు కనుకనే మాధవుడు మెచ్చి ఊడిగం చేసాడు ధర్మరాజుకు. దైవం మానవ రూపం ధరించి దాసునిగా ధర్మరాజుచెంత నిలబడిందంటే ధర్మరాజు ప్రవర్తన మనందరికీ ఎంతటి అనుసరణ యోగ్యమైనదో అర్థమౌతుంది.

అయితే సాధారణంగా ఇలాంటి సంఘటనల పట్ల మన స్పందన చాలా పరిమితంగా ఉంటుంది. విని ఆనందించడానికి, అభినందించడానికి మాత్రమే ఉపయోగపడే ఏ గిన్నిస్‌బుక్ జిమ్మిక్కులుగానో వీటిని మనం ఆస్వాదిస్తాం. ఇలాంటివి ఏ కొద్ది మంది గొప్పవారికో తప్ప మనబోటి సామాన్యులకు ఆచరణ యోగ్యం కానివని నిశ్చయించుకొంటాం. కాసేపు కాలక్షేపానికి ఉపయోగపడే 'మంచికథ'గా ముద్రవేసి మర్చిపోతాం.

ఈ వైఖరి మన పరివర్తనకు, వికాసానికి ఎన్నడూ దోహదం చేయదు. అందువల్ల మన ఆలోచనా విధానాన్ని సవరించుకొనే నిమిత్తంగా కాస్త తాత్త్విక చింతనను ఈ ఇతివృత్త పరంగా చేద్దాం.

ధర్మరాజు మన భారతీయ జీవన విధానానికి సజీవ ప్రతినిధి. వేదం మనకు బోధించిన 'సనాతన ధర్మానికి' ప్రతీక ఆయన.

సర్వకాల సర్వావస్థలలోనూ సర్వవ్యాపకంగా ఉన్న భగవత్ తత్త్వాన్ని 'సనాతన ధర్మం' ప్రకటిస్తున్నది. తనలోనూ, తన బయటా ఉన్న ఈ దివ్యతత్త్వాన్ని గుర్తించి, ఆ దివ్యత్వ ప్రకటనకు వేదికగా తనను తాను సమర్పించు కోవడమే మానవుని విధి. మన ఋషులు, శ్రేష్ఠులు ఈ కర్తవ్యాన్ని నిర్వహించి మన జాతికి ఆ 'దివ్య ధర్మాన్ని' 'మానవ ధర్మం'గా అందించారు. అన్ని కాలాలవారికి ఆచరణ యోగ్యమైనది కనుకనే ఈ ధర్మం సనాతన ధర్మమైంది.

సనాతన ధర్మమొక దివ్యచైతన్యం. ఈ చైతన్యం ప్రతి ఒక్కరిలోనూ ఉన్నది. అయితే నిన్ను ప్రకృతి ప్రభావంచేత గాఢసుషుప్తావస్థలో ఘనీభవించి బహిర్గతం కాలేని విధంగా హృదయాంతరాళాలలో ముడుచుకు పోయిఉన్నది.

తన అంతరంగంలో ఈ దివ్యప్రకృతికి చెందిన చైతన్యాన్ని అభివ్యక్తం చేసుకోగలిగిన మానవుడు ధన్యుడౌతాడు. ఆంతరంగిక, బాహ్య అవరోధాలను అతిక్రమించి ఈ దివ్యచైతన్యం ఏ వ్యక్తిలో పరిమళిస్తుందో ఆ వ్యక్తి సనాతన ధర్మానికి సంకేతంగా నిలుస్తాడు. మెరుస్తాడు.

తన తోటి మానవులలో, ఇతర జీవులలో, ప్రకృతిలో సమానంగా ఉండి, అన్నింటినీ ముడి వేస్తున్న దైవీ సూత్రాన్ని గుర్తించి, దానికి కట్టు బడటమెలాగో నేర్చినవాడతడు. ఈ నేర్పరి తనం వల్ల ఎప్పుడు ఎవరితో ఎక్కడ ఎలా ప్రవర్తించాలో అతనికి సుబోధక

మౌతుంది. అతడు మాట్లాడింది ధర్మ మౌతుంది. అతని చేత ధర్మమౌతుంది. అతడే మూర్తీభవించిన ధర్మమౌతాడు. దైవం యొక్క బాహ్య ప్రకటన అవుతాడు.

నిమ్న ప్రకృతికి చెందే మానవుని ప్రవర్తనను శాసించే ఆశావ్యామోహాలు, భయ సందేహాలు - అతని వర్తనాన్ని, దృక్పథాన్ని నిరోధించలేవు. దివ్యప్రేమ దివ్య చైతన్య ప్రవాహంగా అతని బాహ్యాంతరాళాలను ఆక్రమించి అతని ఆలోచనలను, కర్మలను 'ధార్మికం'గా అభివ్యక్తం చేస్తుంది. అతని నడత జాతికి నీతిని నేర్పుతుంది. ధర్మానికి అతడు భాష్యమౌతాడు. శునకం కోసం స్వర్గాన్ని తిరస్కరించ గలిగిన ధర్మరాజు యొక్క ధార్మిక నిరతి వెనుక ఉన్న దివ్య సత్యమిది.

ధర్మరాజునడచిన ధార్మిక జీవన మార్గం లోనే మనమూ పయనించాల్సి ఉంది. నేడు మన ఆచార్యులు ఆ సనాతన ధర్మానికి ప్రతినిధిగా నిలబడి మనల్ని ఈ 'ధర్మపథం'లో నడువమని శాసిస్తున్నారు. అందుకోసమే 'మాధవసేవగా సర్వప్రాణుల సేవ' అన్న నియమాన్ని మనకు ఏర్పరిచారు.

మన కర్మలలో, ఆలోచనలలో దివ్య వరివర్తనాన్ని వేగవంతంగా వికసింప చేయడం కోసం బృహత్తర కార్యక్రమాలను వికాసతరంగిణిద్వారా ఆచార్యులు సంకల్పి స్తున్నారు. 50 లక్షల కుటుంబాలకు గీతాజ్యోతి సందేశాన్ని అందించే బాధ్యతను మనకు వారు నిర్దేశించారు.

నీలో, నాలో, మనందరిలో నిగూఢంగా ఉన్న దివ్య తత్త్వాన్ని వెలికితీసి సమష్టిగా ప్రకాశింపచేసేందుకే వారు గీతాజ్యోతి కార్యక్రమాన్ని సంకల్పించారు.

సమాజంలోని ఉన్నత, మధ్య, అధమ తరగతులన్న వర్గీకరణలకు, కులసమీకరణ లకు, సంప్రదాయాల విభేదాలకు అతీతంగా పొంగాల్సిన దివ్య ప్రేమగంగను మన గుండెల్లోంచి వెలికితీసేందుకు ప్రయత్నిస్తున్న అపర భగీరథులు మన స్వామి.

నిస్సందేహంగా వారు మనకు ఏర్పరచిన గీతాజ్యోతి లక్ష్యాలు ఎంతో ప్రయాస భరితమైనవే. మన గాడి బ్రతుకులకు భిన్నమైనవే. నీడపట్టున నిద్రపోవడం నేర్చిన తామసిక బ్రతుకులకు భరింపరానివే.

ఎంతో కఠినంగా, బాధాకరంగా అనిపించినా, ఆచార్యుని ఆజ్ఞను శిరసా వహించడం మన వికాసానికి ఎంతో అవసరం. నిమ్న ప్రకృతికి చెందిన అహంకారానికి ఆశాపాశాలకు కట్టుబడడం అలవాటైన 'మూస' బ్రతుకుల పరిధిని విస్తరింప చేసి, భగవద్బంధుత్వాన్ని గుర్తింప చేసేందుకై మన స్వామి 'గీతాజ్యోతు'లను మన గుండెల్లో వెలిగించుకోమంటున్నారు.

వారి ఆదేశాన్ని స్వీకరించి స్వచ్ఛందంగా దైవీ చైతన్యాన్ని మన ప్రకృతిలో వికసింపచేసుకొనే సాధనను 'గీతాజ్యోతి' ద్వారా మనం సమష్టిగా కొనసాగించాలి. అప్పుడే మనం ధర్మరాజుకు, ఆయన ప్రాతినిధ్యం వహించిన సనాతన ధర్మానికి - తగిన వారసులమనిపించు కుంటాం. మనమూ మాధవుడు మెచ్చే మానవుల మౌతాం!!

**యథాప్రకారం ఈ 'ఇతిహాస బోధ - IX-II కు తగిన పేరును సూచిస్తూ మీ అభిప్రాయాలను 'స్పందన' శీర్షికకు తెలియ వరచి శ్రీవారి మంగళాశాసనాలను పొందుతారని ఆశిస్తాం.**

**- వికాసతరంగిణి**

25/
bnmay02.p65



# వికాసదర్శిని నివేదన

**హైదరాబాద్ :** ఏప్రిల్ 1వ, తేదీన శ్రీవారు హైదరాబాద్ JET లో వేంచేసి ఉన్నారు. 2వ, తేదీన, ఉదయం ఢిల్లీ బయల్దేరివెళ్ళారు. బదరీ అష్టాక్షరీ క్షేత్ర సమన్వయకర్త శ్రీమాన్(ఢిల్లీ) శ్రీనివాస్ గారు ఏర్పాటుచేసిన ఒక సమావేశంలో పాల్గొని మరల సాయం కాలానికి భాగ్యనగరం చేరుకున్నారు. 3వ, తేదీ సాయంకాలానికి కాకతీయసిమెంట్స్, జగ్గయ్యపేట చేరుకుని పాంచరాత్రాగమ కళాశాల విద్యార్థులను, అధ్యాపక బృందాన్ని పలుకరించి మంగళా శాసనాలు కృపచేసారు.

**మేళ్ళచెరువు :** మహాసిమెంట్స్ అధినేత, JET - కోశాధికారి శ్రీమాన్ Dr. J. రామేశ్వరరావు గారి ఆహ్వానాన్ని పురస్కరించుకొని 4వ, తేదీ సాయంకాలానికి శ్రీవారు మేళ్లచెరువు సమీపంలోని మహాసిమెంట్స్ ప్రాంగణానికి విచ్చేసారు. ఇక్కడ శ్రీ కళ్యాణవేంకటేశ్వర స్వామి వారి బ్రహ్మోత్సవాలు 3తేదీన అంకురార్పణతో ప్రారంభమయ్యాయి. బ్రహ్మోత్సవాలు చివరిరోజు అనగా 8వ, తేదీ వరకు శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో అత్యంత వైభవముగా జరిగినవి. 6వ తేదీన కళ్యాణోత్సవం కన్నులపండువగా జరిగింది. ఇదే రాత్రి హనుమద్వాహనం పై పెరుమాళ్ళకు తిరువీధి ఉత్సవం నిర్వహించారు. 7వ, తేదీన ఆరాధనా నంతరం విజయవాడ చేరుకొని పడమటలోని నల్లూరివారి కళ్యాణమండపంలో ఏర్పాటు చేసిన వికాసతరంగిణి శాఖల వార్షిక సమావే శంలో పాల్గొన్నారు.

**వికాసతరంగిణి శాఖల వార్షిక సమావేశం**

7వతేదీ ఉదయం 8గంటలకు విజయవాడ పడమటలోని శ్రీ నల్లూరివారి కళ్యాణ మండపంలో వికాసతరంగిణి శాఖల వార్షిక సమావేశం ప్రారంభమైంది. వికాస తరంగిణి సెంట్రల్ కమిటీ సభ్యురాలు శ్రీమతి వనజాభాస్కరరావు గారు ఉదయం పూట సమావేశానికి అధ్యక్షత వహించి జ్యోతి ప్రజ్వలనం కావించారు. వేదపఠనం, వికాస తరంగిణి ప్రార్థన అనంతరం వికాసతరంగిణి ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ కె.భవానీప్రసాద్ సమావేశ ప్రాధాన్యాన్ని వివరించారు. శ్రీవారు సంకల్పించిన "గీతాజ్యోతి" కార్య క్రమంలో ప్రధానాంశాలను సభ్యులకు తెలియపరిచారు. కేంద్ర వికాసతరంగిణి జాయింట్ సెక్రటరీ శ్రీమతి జ్యోతి గారు గీతాజ్యోతి లక్ష్యాలను-శ్రీవారి ఆంతర్యాన్ని విపులంగా తెలియజేసారు.

అనంతరం జిల్లాలవారీగా సభ్యులు తమ నివేదికలను అందించారు. హైద్రాబాద్, వరంగల్, నల్గొండ, విజయ నగరం, వైజాగ్, తూర్పు, పశ్చిమ, కృష్ణా, ఖమ్మం మొదలైన జిల్లాల ప్రతినిధులు 'గీతాజ్యోతి' పరంగా వారు చేస్తున్న కృషిని తెలియచేసారు

మధ్యాహ్నం 11గంటల నుండి 12-30 గంటలవరకు తదీయారాధనం జరిగింది. తరవాత ప్రారభమైన సమావేశానికి మన జెట్ అధ్యక్షులు కాకతీయసిమెంట్స్ చైర్మన్ శ్రీమాన్‌పి.వెంకటేశ్వర్లు అధ్యక్షత వహించారు. అధ్యక్షుని ప్రసంగమయ్యాక ముఖ్యఅతి థులుగా విచ్చేసిన కరీంనగర్ శాసన సభ్యులు శ్రీ దేవేందరరావుగారు, వికాసతరంగిణి ఉపాధ్యక్షులు శ్రీమాన్ రమేష్‌కుమార్ (ఐఏస్)గారు ప్రసంగించారు.

అనంతరం శ్రీస్వామివారు గీతాజ్యోతి కార్యక్రమాన్ని గూర్చి రెండు గంటలపాటు సభ్యులందరూ మంత్ర ముగ్ధులై శ్రద్ధతో ఆలకిస్తుండగా ఎంతో హృద్యంగా వివరించారు.

శ్రీవారి ప్రసంగ అనంతరం సమావేశ నిర్వహణకు చక్కని కైంకర్యం అందించిన శ్రీమాన్ కోటేశ్వరరావుగారు, శ్రీమాన్ శంకరరావుగారికి మెమెంటోలు, కార్యకర్త లందరికీ మంగళా

శాసనాలు అందజేసారు. దాదాపురెండువేలమంది పాల్గొన్న సమావేశం ప్రార్ధనతో ముగిసింది.

సాయంకాలానికి మేళ్ళచెర్వు చేరుకుని గరుడోత్సవంలో అన్వయించారు. శ్రీరంగంనుండి శ్రీపాత్తాంగులు వేంచేసి పెరుమాళ్ళని వయ్యారినడకలతో చాలా ఉత్సాహంగా తిరువీధి ఉత్సవాన్ని జరిపించారు. 8వ, తేదీన మహాపూర్ణాహుతి అనంతరం చక్రతీర్థ కార్యక్రమం వైభవంగా జరిపించారు. సాయంకాలం 5గంటలకు ఫ్యాక్టరీలో Conference Hall ను శ్రీవారు ప్రారంభించి Board of Directors నుద్దేశించి అనుగ్రహభాషణం చేసారు. మహాసిమెంట్స్ అధినేత Dr.J. రామేశ్వరరావు గారు 98లో శ్రీ స్వామివారి ద్వారా ఈ ఫ్యాక్టరీని ప్రారంభించి, 5సంవత్సరాల్లో భగవంతుడి మీద అచంచలమైన విశ్వాసంతో అతికొద్ది కాలంలోనే అనూహ్యమైన ప్రగతిని సాధించారు. మహాసిమెంట్స్ పరివారాన్ని మిత్రుడిగా, ప్రేరకుడిగా ప్రోత్సహిస్తూ, ఫ్యాక్టరీని అభివృద్ధిపథంలో నడిపిస్తున్నారు. సిబ్బంది అంతాకూడా అంకితభావంతో సేవలంది స్తున్నారు. ప్రారంభించిన 4 సం॥ల్లోనే దక్షిణాంధ్రాలోనే Majer Plant గా ఎదిగింది. అంతర్గతమైన సామర్థ్యాన్ని మెరుగుపరచు కోవడంపై దృష్టిని సారించి ప్రాంగణాన్నంతా Clean and Green గా తయారుచేయాలని సంకల్పించారు. ఏర్పర చుకున్న లక్ష్యాల్ని సమర్థవంతంగా నెరవేర్చే శక్తి శ్రీనివాసుడు ప్రసాదించాలని శ్రీవారు మంగళాశాసనం చేసారు. రాత్రి ద్వాదశ ఆరాధన సేవించుకొని కోదాడలో కొత్తగా ప్రారంభించిన Mineral Plant ను మంగళా శాసనములు చేసి సీతానగరం ఆశ్రమానికి చేరుకున్నారు.

**సీతానగరం :** 9,10 తేదీలు శ్రీస్వామివారు సీతానగరంలోనే వేంచేసి ఉండి గీతాజ్యోతి కార్యక్రమ సన్నాహాలు పర్యవేక్షించారు. 11వ తేదీ JET కార్యదర్శి శ్రీమాన్ గంగరాజు గారితో రాత్రికి తిరుమలకు చేరుకున్నారు.

**తిరుమలలో శ్రీరంగనాథస్వామి తిరునక్షత్ర పర్వదినాన "గీతాజ్యోతి" ఆవిష్కరణ:**

12వ, తేదీన శ్రీస్వామివారు ఉదయం శ్రీవేంకటేశ్వరస్వామివారి నిజపాద దర్శనము చేసుకొని పాదముల చెంత ''గీతాజ్యోతి'' శ్లోకమాలికా పత్రములను సమర్పించిరి. కార్యక్రమ శుభారంభానికి శ్రీనివాసుని అనుమతి పొందిరి. అనంతరం తిరుపతికి వెళ్ళి అమ్మవారి సన్నిధిలో శ్లోకమాలికను పఠించి, అమ్మవారి అనుజ్ఞ తీసికొనిరి. తిరుమల కొండపైకి వచ్చి బంగారు రథము వద్ద "గీతాజ్యోతి" రథమును ప్రారంభించిరి. అనంతరం ఆస్థానమండపంలో ''గీతాజ్యోతి ఆవిష్కరణ'' కార్యక్రమము ఆరంభమయింది.

తిరుపతి వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ నాగేంద్రసాయి గారు శ్రీ స్వామి వారిని, శ్రీమాన్ కృష్ణయ్య T.T.D., J.E.O. గారిని, శ్రీమాన్ బాలసుబ్రమణ్యం T.T.D, J.E.O గారిని, శ్రీమాన్ బ్రహ్మానందం D.P.P కార్యదర్శి గారిని, శ్రీమాన్ సముద్రాల లక్ష్మణయ్య, D.P.P మాజీ కార్యదర్శి గారిని, మహాసిమెంట్స్ అధినేత, JET కోశాధికారి శ్రీమాన్ Dr.J. రామేశ్వరరావుగారిని, లైలాగ్రూప్ ఆఫ్ కంపెనీస్ అధినేత, JET కార్యదర్శి శ్రీమాన్ గంగరాజుగారిని వేదికపైకి ఆహ్వానం పలికారు. సభాధ్యక్షులుగా శ్రీమాన్ కృష్ణయ్యగారు వ్యవహరించారు.

శ్రీ స్వామివారు జ్యోతిప్రజ్వలన కావించిన అనంతరం D.P.P కార్యదర్శి శ్రీమాన్ బ్రహ్మానందంగారు సభాతొలి పలుకులు పలికారు. అనంతరం శ్రీస్వామి వారు "గీతాజ్యోతి" సాహిత్యాన్ని ఆవిష్క రించారు. వేదికపై వేంచేసిన వారంతా ఉద్రిక్త వాతావరణం నెలకొని ఉన్న నేటి తరుణంలో ''గీతాజ్యోతి'' అనే బృహత్తరమైన కార్యక్రమం శ్రీస్వామివారు సంకల్పించడం చాలా గొప్పవిషయం అన్నారు. అనంతరం శ్రీస్వామివారు తమ సందేశంలో ''గీతాజ్యోతి'' కార్యక్రమ ముఖ్య

26/
bnmay02.p65



లక్ష్యాన్ని వివరిస్తూ అందులో T.T.D చేయవలసిన సేవలను సూచించారు. T.T.D అధికారులు చిత్త శుద్ధితో ఈ కార్యక్రమానికి సహకరించాలని గట్టిగానొక్కి చెప్పారు. **(శ్రీవారి సందేశాన్ని యథా తథంగా 3వపేజీలో చూడవచ్చు.)** వికాసతరంగిణి, ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ భవానీప్రసాద్ గారి వందనసమర్పణతో గీతాజ్యోతి ఆవిష్కరణ కార్యక్రమం ముగిసింది. సాయం కాలం 7.00 గంటలకు వసంత నవ రాత్రోత్సవాల్లో పాల్గొనడానికి హరిప్రియ ఎక్స్‌ప్రెస్‌లో కర్ణాటక రాష్ట్రంలోని బళ్ళారి పట్టణానికి బయల్దేరారు.

**బళ్ళారిలో శ్రీవారి పర్యవేక్షణలో వసంతనవరాత్రోత్సవములు**

శ్రీ స్వామివారు శ్రీరామనవమి- వసంత నవరాత్రోత్సవములు కర్ణాటక రాష్ట్రంలోని బళ్ళారి పట్టణంలో అత్యంత వైభవంగా నిర్వహించారు. అతి చిన్నవీధిలో అతి విశాల ప్రాంగణం కల్గిన శ్రీ బాలాంజనేయ స్వామి వారి దేవస్థానంలో, దాని నిర్వాహకులు, వ్యవస్థాపకులు పూజ్య శ్రీ బాలాంజనేయ స్వామివారు, స్థానిక ప్రముఖుల సహాయ సహకారములతో అద్భుతమైన ఏర్పాట్లతో రామకార్యమును రమణీయంగా నిర్వహించారు. పూజ్య శ్రీ బాలాంజనేయ స్వామివారు పైకి చాలా సామాన్యంగా, ఏమీ తెలియని వారి వలె ఒక అవధూత లాగా ఉంటారు. ఇక్కడి ప్రాంతీయులందరికి వీరి మాటంటే వేదవాక్కు. 40సం॥ల క్రితం ఈ ఆలయం చాలా చిన్నది. వీరి ఆగమనం తర్వాత దినదిన ప్రవర్థమానం చెందుతూ, ఒక పాఠశాల, గోశాల, సువిశాలమైన వేదికతో కూడిన సభాప్రాంగణం, మహాత్ములకు వసతి భవనం మొ॥గు వాటితో శోభిల్లుతోంది. పెద్దజీయరు స్వామి వారు కూడా వేంచేసి మంగళాశాసనం చేసిన క్షేత్రమిది.

ఒక సంస్థాగతమైన కార్యవర్గం ఏమీ లేకపోయినా నగరంలోని ప్రముఖులు, చిన్నారులంతా కలిసి శ్రీ బాలాంజనేయ స్వామి వారి నేతృత్వంలో అత్యంత క్రమశిక్షణతో కార్యక్రమాన్ని శోభాయ మానంగా నిర్వహించడంలో కృతకృత్యుల య్యారు. వచ్చిన భక్తులందరికి కూడా ప్రతిరోజు తదీయారాధన కార్యక్రమం నిర్వహించి స్వామివారి అనుగ్రహమునకు పాత్రులయ్యారు. శ్రీవారు ఉగాది రోజు ఉదయం పెరుమాళ్ళకి విశేష తిరుమంజనం అనంతరం 8.30గం॥లకు వేదిక పైకి వేంచేసి పెరుమాళ్ళకి మంగళాశాసనం చేసి భక్తులకు ఉగాది సందేశాన్ని కృపచేసారు. సాయం కాలం సామూహిక శ్రీ విష్ణుసహస్రనామ పారాయణం అనంతరం స్థానిక పురోహితులు శ్రీమాన్ భట్టు గారు పంచాంగ శ్రవణం కార్యక్రమాన్ని నిర్వహించారు.

ఆ రోజు సభకు కర్ణాటక P.C.C అధ్యక్షులు శ్రీమాన్ ఎ. వీరభద్రప్ప, పంచాయతీరాజ్ శాఖామాత్యులు శ్రీమాన్ ఎస్.ఎమ్. దివాకర వర్మ విచ్చేసి స్వామి వారిని సేవించారు. ఈ విధంగా ప్రతిరోజు వివిధ ప్రభుత్వ, వాణిజ్యరంగ ప్రముఖులు, విద్వాంసులు, ముఖ్య అతిథులుగా విచ్చేసి స్వామివారి మంగళా శాసనములందు కున్నారు. వారిలో ముఖ్యంగా బళ్ళారి ఎం.పి. శ్రీమాన్ కె.బసవగౌడ, జ్యోతిష్య విద్వాన్ శ్రీమాన్ ఎ.రాఘవేంద్రాచార్యులు, ఎం.పి. శ్రీమాన్ ఎ. రాములు, D.E.O శ్రీమాన్ ప్రహ్లాదాచార్యులు, బళ్ళారి మున్సిపల్ కమీషనర్ శ్రీమాన్ డి.ఎల్. నారాయణ , రాఘవేంద్ర గ్రానైట్స్ అధినేత శ్రీమాన్ ఎన్. సూర్యనారాయణ రెడ్డి, కర్ణాటక First Lady Justice శ్రీమతి మంజుల విచ్చేసి కార్యక్రమ వైశిష్ట్యాన్ని కొనియాడినారు.

ప్రతిరోజు ఉదయం శ్రీ స్వామివారు సేవాకాలం అనంతరం శ్రీ రామనామాన్ని స్వయంగా వ్రాస్తూ భక్తులందరి చేత 108సార్లు వ్రాయించి, సామూహిక సంక్షేపరామాయణ పారాయణం చేయించారు. అనంతరం అందులోని విశేషాల్ని ప్రవచించారు. 15వ, తేదీన శ్రీరామపూజ, 17వ, తేదీన శ్రీలక్ష్మీనారాయణ పూజ

కన్నులపండువగా శ్రీస్వామివారు భక్తులందరిచేత చేయించారు. 17వ, తేదీన శ్రీస్వామివారు శ్రీమాన్ మౌళి గారి ఆహ్వానం పై బళ్ళారికి 60కి.మీ దూరంలో ఉన్న "కేంగల్" గ్రామాన్ని సందర్శించి శ్రీ దాసాంజనేయ దేవాలయంలో కలశస్థాపన కావించి, ఆ సమయంలో అక్కడ జరుగుతున్న సామూహిక వివాహములో పాల్గొన్న 32 మంది నూతన వధూవరులకు మంగళాశాసనాలు కృపచేసారు. అనంతరం Cotton Spinning Mill ను సందర్శించారు.

18వ తేదీ జగదాచార్యులు, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రకాశకులు శ్రీభగవద్రామానుజుల తిరునక్షత్ర శుభ సందర్భంగా వారి తనియన్ ందరిచే పలికించారు. శ్రీ రామానుజుల వారి చిత్రపటాన్ని భక్తులందరికి అందించారు.

20న శ్రీమాన్ గుప్తగారు,శ్రీమాన్ నటరాజన్ గారి ఆహ్వానం పై స్థానిక అయ్యప్పస్వామి ఆలయాన్ని సందర్శించి, 28 టన్నుల బరువు గల 50 అడుగుల జయస్తంభము(శిలాస్థూపము)ను శ్రీ స్వామివారు మంగళాశాసనం కావించి అక్కడ చేరిన అశేషభక్తజనాన్నుద్దేశించి అనుగ్రహ భాషణం చేసారు.

21వతేదీన ప్రవచనానంతరం శ్రీ విష్ణుసహస్రనామ అవధాన కార్యక్రమమును జగ్గయ్యపేట ఆగమవిద్యార్థులు చిరంజీవి కె.హరీష్, బి.ఆర్. రాఘవేంద్రాచార్యులచే వైభవంగా నిర్వహించబడింది. వారిని పృచ్ఛకులు అడిగిన ప్రశ్నలన్నింటికి చక్కని సమాధానాలు తెలిపి శ్రీ స్వామివారి ప్రేమపూర్వక విశేషమంగళాశాసనాలు పొందారు.

**శ్రీరామనవమి :** ఉదయం శ్రీ స్వామివారు సేవాకాలం, శ్రీ రామనామ లేఖనం, సంక్షేప రామాయణ పారాయణం అనంతరం శ్రీ సీతారామచంద్ర స్వామి వారికి మంగళాశాసనం చేసి, శ్రీరామచంద్రుని పుట్టినరోజు సందర్భంగా తిరునక్షత్ర తనియన్ అందరిచేత పలికించారు. తీర్థగోష్ఠి అనంతరం కళ్యాణమహోత్సవానికి రంగమంతా సిద్ధమయ్యింది. కార్యకర్తలు 1008 మంది దంపతులు కూర్చోవడానికి వీలుగ నంబర్లు వేసారు. మాతృమూర్తు లందరూ పసుపుపచ్చని, పురుషులంతా తెల్లని వస్త్రములు ధరించి కూర్చోవడం కన్నులకు ఎంతో శోభాయమానంగా భాసించింది.

శ్రీ స్వామివారు దంపతులందరికీ విగ్రహాలందించారు. వేదిక పై కళ్యాణం శాస్త్రోక్తంగా జరుగుతుంటే, శ్రీ స్వామివారు కార్యక్రమవైభవాన్ని వివరిస్తూ ప్రత్యక్ష వ్యాఖ్యానం చేసి అశేష భక్తజనాన్ని ముగ్ధుల్ని చేసారు. రాష్ట్రపంచాయతీరాజ్ శాఖా మాత్యులు శ్రీమాన్ ఎమ్. దివాకరవర్మ దంపతులు ప్రధానకన్యాదాతలుగా ఉండి కార్యక్రమ శోభను పెంచారు. సూర్యభగవానుడు తన ప్రభావాన్ని చూపిస్తున్నా ఏ మాత్రం అలుపెరుగకుండా మిట్టమధ్యాహ్నమువేళ అన్నీ మరచి అశేషభక్తజనావళి శ్రీ సీతారామచంద్రస్వామి వారి కళ్యాణ వైభవాన్ని తిలకిస్తూ ఆనందపరవశులయ్యారు. "చిత్రభాను" నామ సంవత్సరంలో చాలా విలక్షణమైన రీతిలో శ్రీరామకళ్యాణం జరగడం అందరిని ఆనందింపచేసే విషయం. ఇది మన "గీతాజ్యోతి" కార్యక్రమ దిగ్విజయానికి శుభప్రదమైన నాందిగా భావిస్తూ ముందుకు సాగుదాం! శ్రీ సీతారామకళ్యాణం అనంతరం శ్రీ స్వామివారు ఈ కార్యక్రమంలో వివిధ సేవలందించిన కార్యకర్తలు శ్రీమాన్ ఎమ్. గోపాల్, శ్రీమాన్ ఉమేష్, శ్రీమాన్ ప్రభాకరశెట్టి, శ్రీమాన్ మురళీ, శ్రీమాన్ వన్నూరు స్వామి, శ్రీమాన్ వీరేశ్ గౌడ, శ్రీమాన్ శ్రీరాములు, శ్రీమాన్ బాబు, శ్రీమాన్ మౌళాళి, శ్రీమాన్ దేవేంద్రప్ప, శ్రీమాన్ మంజునాథ్‌శెట్టి, శ్రీమాన్ వెంకటేశ్వరరావు, శ్రీమాన్ కె.నాగరాజు, శ్రీమాన్ లక్ష్మీనారాయణ, శ్రీమాన్ చంద్రమౌళి, శ్రీమాన్ తిమ్మారెడ్డి, శ్రీమాన్ పురుషోత్తమ్, శ్రీమాన్ ఎస్.వి. శర్మరాజేశ్వరి దంపతులు, అనేకమంది చిన్నారులు





మొదలకు వారందరికీ మంగళాశాసనములు కృపచేసారు. వారందరినీ ఇంత క్రమశిక్షణా యుతంగా నడిపించి కార్యక్రమ దిగ్విజయానికి కారణమైన పూజ్య శ్రీ బాలాంజనేయ స్వామి వారికి మంగళాశాసనపూర్వక అభినందనలు తెలిపారు. కార్యక్రమ ప్రారంభానికిముందే అక్కడకు చేరి ప్రచారకార్యక్రమాన్ని నిర్వహించిన తత్త్వప్రచారకులు శ్రీమాన్ గంగాధర్ శ్రీ స్వామివారి విశేష మంగళా శాసనాలు పొందారు. కార్యక్రమంలో వివిధ విభాగలలో ప్రత్యక్షంగా, పరోక్షంగా సేవలందించిన వదాన్యులందరికి మంగళా శాసనములు కృపచేసి సాయంకాలం 5.30 గంటలకు శ్రీ స్వామివారు కడప బయల్దేరి వెళ్ళారు.

**రూర్కెలా :** రూర్కెలా నగరంలో మార్చిమాసంలో శ్రీవెంకటేశ్వరస్వామివారి ఏడవ బ్రహ్మోత్సవాలు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్నజీయరు స్వామివారి మంగళాశాసనములతో అత్యంత వైభవముగా జరిగినవి. శ్రీస్వామివారు కార్యక్రమ విశేషాలు తెలుసుకొని నిర్వాహ కులుకు మరియు సేవలందించిన కార్యకర్తలందరికి అనేక మంగళాశాసన ములు కృపచేసారు.

**రాజాం** :- రాజాం వికాస తరంగిణి శాఖ చిత్రభాను ఉగాది పర్వదినమున స్థానిక విష్ణాలయంలో ఉదయం 10 గం॥లకు పి.బి. విశాలగుప్తగారి ఆధ్వర్యంలో గీతాజ్యోతి కార్యక్రమం వైభవంగ నిర్వహించుకొన్నారు. శ్రీమాన్ కృష్ణమూర్తిగారు గీతాజ్యోతి వైభవమును గూర్చి వివరించినారు. అనంతరం దేవాలయంపైన, ప్రతి ఒకయింటిపైన హనుమధ్వజాలు ఎగురవేయడం జరిగింది. గీతాజ్యోతి సందేశమును ప్రతిగ్రామంలో విస్తరింపచేయడానికి ప్రయత్నాలు జరుగుచున్నవి. జిల్లాలో 5 గీతాజ్యోతి ధర్మక్షేత్రాలు ఏర్పాటు చేయడం జరిగినది.

**ఖమ్మం** : శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములతో ఖమ్మం పట్టణంలో ఖమ్మం జిల్లా అధ్యక్షులు శ్రీమాన్ ఏర్నేని రామారావుగారు "స్వర్ణభారతి కమ్మవారి కల్యాణమండపములో" గీతాజ్యోతి కార్యాలయం ఏర్పాటు చేయడం జరిగింది. జిల్లాలో మొత్తం 8 ధర్మక్షేత్రాలు ఏర్పాటు చేయడం జరిగింది.

**కరీంనగర్** : కరీంనగర్ వావిలాలపల్లి వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యంలో సీతారామచంద్రస్వామి వారి ఆలయంలో చిత్రభాను ఉగాది పర్వ దినమున గీతాజ్యోతి మహోత్సవము అతి వైభవంగ జరిగింది. 500 మంది భక్తులు పాల్గొన్నారు. శ్రీవారి ఆదేశానుసారం గీతాజ్యోతికి సంబంధించిన 4 శ్లోకాలు అత్యంత భక్తి శ్రద్ధలతో పారాయణం చేయడం జరిగింది.

**సుల్తానాబాద్** : - శ్రీవారి మంగళాశాసనములతో సుల్తానాబాద్ వికాసతరంగణి శాఖ ఆధ్వర్యంలో చిత్రభాను ఉగాది శుభ తిథినాడు గీతాజ్యోతి ఉత్సవము వైభవంగా ప్రారంభించబడినది. ఈ కార్యక్రమంలో అధికసంఖ్యలో భక్తులు పాల్గొన్నారు. నేతితో గీతాజ్యోతి దీపాలను వెలిగించడం జరిగింది. 4 శ్లోకాలను భక్తి పూర్వకంగ పారాయణం చేయడం జరిగింది.

**అలకాపురం** : - అలకాపురం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో శ్రీవారి మంగళాశాసనములతో గీతాజ్యోతి కార్యక్రమం వైభవంగ జరుపుకొన్నారు. కృష్ణపూజ, గీతాపారాయణం, నగరసంకీర్తన చేయడం జరిగినది. ఈ కార్యక్రమంలో వికాస తరంగిణి అధ్యక్షులు పెనుమత్స వేంకటేశ్వరరాజు, నరసింహారాజు ఇతర సభ్యులు పాల్గొన్నారు.

**మహాబూబా బాద్** :- మహాబూబాబాద్ వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యంలో ఉగాదిరోజున ప్రచారకార్యక్రమం విస్తృతంగ జరిగింది. మహాబూబాబాద్ చుట్టుప్రక్కల గ్రామాలలో శ్రీమతి అరుణగారు, తత్వశాస్త్ర ప్రచారకులు శ్రీమతి హైమవతిగారు ఇతర సభ్యులు పాల్గొన్నారు.

**పాలకొల్లు** : - పాలకొల్లు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో స్థానిక అష్టభుజ లక్ష్మీనారాయణ

దేవస్థానంలో ఉగాది పర్వదినమున గీతాజ్యోతి కార్యక్రమం నిర్వహించడం జరిగింది. వికలాంగుల హాస్టల్‌కు వెళ్ళి అక్కడ బాల బాలికలకు గీతాజ్యోతి యొక్క ప్రాశస్త్యం గూర్చి వివరించడం జరిగింది.

**గోకవరం** :- చిత్రభాను ఉగాది పర్వదినంరోజు తత్వశ్శాస్త్ర ప్రచారకులైన శ్రీమాన్ కుమార్ రాజాగారు గోకవరం ధర్మక్షేత్రం కేంద్రముగ ప్రచారము చేయడం జరుగుతుంది. గోకవరం పరిసర ప్రాంతాలలో గీతాజ్యోతి కార్యక్రమప్రచారం ఉత్సాహంగ జరుగుచున్నది.

**పుల్లడిగుంట** :- ఉగాది పర్వదినంనాడు పుల్లడిగుంట ధర్మక్షేత్రం కేంద్రముగ శ్రీమతి లలితకుమారిగారు కన్వీనర్‌గ శ్రీమాన్ రాగం పిచ్చయ్యగారు, శ్రీమాన్ అచ్యుతరావుగారి ఆధ్వర్యంలో వైభవంగ గీతాజ్యోతి కార్యక్రమం ప్రారంభించబడినది. శ్రీమాన్ ఎం.ఆర్.ఒ ప్రసాద్‌గారు గీతాజ్యోతి యొక్క ప్రాశస్త్యంగురించి చక్కగ వివరించినారు.

**గీతాజ్యోతి రథప్రచారం ప్రారంభం**

ఏప్రిల్ 12వ తేదీన తిరుమలలో శ్రీవెంకటేశ్వరస్వామి సన్నిధిలో శ్రీస్వామివారి శ్రీహస్తాలతో ప్రారంభించబడింది. గీతాజ్యోతి రథం మహా సిమెంట్స్ అధినేత శ్రీమాన్ రామేశ్వరరావుగారు, శ్రీమాన్ రామచంద్రారెడ్డిగార్ల పర్యవేక్షణలో సర్వహంగులతో 24వ తేదీకి సిద్ధమైంది. 25-4-2002 న రాజోలు ధర్మక్షేత్ర కన్వీనర్ శ్రీమాన్ డా॥ అప్పారావు గారి సారధ్యంలో గీతాజ్యోతి రథం అప్పనపల్లిలో బాలబాలాజీ దేవస్థానం నుండి ప్రచార కార్యక్రమాన్ని ప్రారంభించింది. ఈ కార్యక్రమ సమావేశానికి 'నగరం' రిజర్వ్‌డ్ నియోజకవర్గ ఎం.ఎల్.ఏ. ఎ. వేమాజీగారు ముఖ్య అతిధిగా పాల్గొన్నారు. అతిధులుగా మన హైద్రాబాద్ జెట్ సెక్రటరీ ప్రొఫెసర్ శ్రీమాన్ పురుషోత్తంగారు జంటనగరాల బి.జె.పి. అధ్యక్షులు శ్రీమాన్ రామచంద్రారెడ్డిగారు, పాల్గొన్నారు. తూర్పు గోదావరి వికాసతరంగిణిశాఖ అధ్యక్షులు శ్రీమాన్ పాపారాయుడుగారు పశ్చిమగోదావరి వి.టి. అధ్యక్షులు శ్రీమాన్ పార్థసారధిగారు, ఇతర వి.టి. శాఖల కార్యకర్తలు పాల్గొన్నారు. సథనిక గ్రామ సర్పంచ్ ఎస్. చిట్టితల్లి, మండలాధ్యక్షులు ఎం.వి. రామారావుగారు మరియు ఇతర ప్రముఖులు పాల్గొన్నారు. వికాసతరంగిణి కేంద్ర ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ భవానీ ప్రసాద్‌గారు, మరియు రామానుజవాణి, మరియు సీతానగరం ఆశ్రమ నిర్వాహకులు శ్రీమాన్ పి. వెంకటాచార్యులుగారు పాల్గొన్నారు.

ఈ గీతాజ్యోతి రథప్రచారక బాధ్యతలు తత్వశాస్త్ర ప్రచారకులు శ్రీమాన్ పి. రఘునాధాచార్యులు స్వీకరించి పూజాకార్యక్రమాలు నిర్వహించారు. తత్వశాస్త్ర ప్రచారకురాలు కుమారి శారదగారు ఈ కార్యక్రమాన్ని పర్యవేక్షించారు. 25వ తేదీ సాయంత్రం కొడ్లవరం గ్రామంలో పూజాకార్యక్రమం నిర్వహించారు. 26 ఉదయం పెదపట్టులంక గ్రామంలో సాయంత్రం పాశర్లపూడి చాడవ గ్రామంలో, 27 ఉదయం పాశర్లపూడి... గ్రామంలో, సాయంత్రం పాశర్లపూడిలంకలో పూజా కార్యక్రమాలు జరిగాయి.

ఈవిధంగా గీతాజ్యోతి రథయాత్ర కొనసాగుతుంది. రోజుకు రెండుగ్రామాలచొప్పున పూజాకార్యక్రమాలు నిర్వహిస్తూ....

**కాకినాడ :** కాకినాడ వికాసతరంగిణి నేతృత్వంలో శ్రీమాన్ పీతాంబరం రఘునాధాచార్యులుచే శ్రీరామాయణ ప్రవచన కార్యక్రమము వైభవంగా జరిగింది. కాకినాడ సబ్‌జైలులో గీతాజ్యోతి శ్లోకాలను పఠించారు.

ఏప్రిల్ 24వ తేదీన శ్రీమాన్ చీకోటి జనార్ధనరావు, హైద్రాబాద్ గారి తిరుమాలిగలో శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రం అఖండ పారాయణ వైభవంగా జరిగింది.





## స్పందన

1. ధర్మరాజు యొక్క అనుపమ బోధను ఆలకించి మనము విజ్ఞత కలవారమై శరీమేనాటికైనను శిధిలమైపోవునని, ధర్మమే నిలుచునని నిశ్చయించుకొని ఆచరించి తరించవలయును.
   **- జి.రాధాకృష్ణమూర్తి, గుంటూరు.**
2. ధర్మజుని ధర్మజ్ఞత సమాజంలో ఆచరణీయం కావాలని మన శాస్త్రాలు, పురాణాలు ఘోషిస్తున్నాయి.
   **- కె. మైత్రేయి, బొబ్బిలి.**
3. ఈ ఇతిహాసబోధ కథవలన వికాసతరంగిణి కార్యకర్తలుకూడా వ్యక్తిగత తరంగిణిలా కాకుండా, సమాజానికి వికాసం కలిగించే వికాసతరంగిణి కార్యకర్తల్లా ధర్మాచరణ కలిగి ఉండాలి.
   **- వి. సుజాత, హైద్రాబాద్.**
4. ధర్మరాజుయొక్క న్యాయం, నీతి, ధర్మం మనకాదర్శప్రాయం. దీనినుండి మనం ఎంత నేర్చుకున్నా తక్కువే. రామదండు - (బాలవికాసతరంగిణి) , జూలపల్లి.
5. ధర్మాన్ని అతిక్రమించనివారికి ధర్మదేవత అన్నివిధాలా సహకరిస్తాడు. దేవదేవుడు సైతం ధర్మానికి తలొగ్గవలసిందే. **-ఎం. జయప్రకాష్, హనుమకొండ**
6. మనసునందు క్రోధమోహాదులకు తావియ్యక ఓర్పు, సహనం, వివేకంతో మెలగిన ఎడల మనసు ఎల్లప్పుడు ధర్మమునందే చరించును. ఇదే ధర్మరాజు చరిత్ర మనకు చెపుతున్నది.
   **- కె. అప్పలరాజు, బొబ్బిలి.**
7. కటిక చీదరికంలో ఉన్నా ధర్మాన్ని విస్మరించకుండా కాపాడిననాడే ఆ ధర్మం ఏదో ఒక రూపంలో మనల్ని కాపాడుతుందన్న సత్యాన్ని మనమందరం తప్పక గ్రహించాలి. **- డా॥ శ్రీనివాస్, కుమిలి.**

### ఇతిహాసబోధ - IX - 1 కు పాఠకులు సూచించిన పేర్లు

**1. ధార్మిక జీవనం – పరమపద సోపానం - కె. అప్పలరాజు - బొబ్బిలి, 2. ధర్మనిష్టత జీవితాంతం కాపాడుతుంది, - పి. రాజేష్ కుమార్, ఆత్మకూర్, 3.ధర్మోరక్షతి రక్షితః- ఇ. లక్ష్మీనరసింహారావు, మధిర, ఎం. కమల - భిలాయి, ఎస్. కోటేశ్వరి - విజయనగరం, వి. హనుమంతరావు -కందుకూరు, ఎ. ఆండాళ్ - పాలకొల్లు, యు. గోపాలాచార్యులు - కందుకూరు, డి. రాజమణి - హైద్రాబాద్, ఎన్.వి. పాండురంగయ్య - విజయనగరం, ఆర్. చక్రపాణి - హనుమకొండ, 4.వివేకంతో కూడిన ధర్మజ్ఞత, కె. దీప్తి - బొబ్బిలి, 5.ధర్మబద్ధ జీవితంలో ధర్మరాజుకు గెలుపు – ఎం. అశోకరావు - కరీంనగర్, 6.అహంకారం పతనానికి మూలం- జె. శ్రీరామమూర్తి -భీమడోలు, 7.ధర్మరాజు – ధర్మనిరతి టి. తిరుపతయ్య - హనుమకొండ, వి. విష్ణువర్ధన్ - మామిళ్ళగూడెం, 8.ధర్మమయ జీవనం వి. వృషాద్రిపతి - నాగాయలంక, ఎం. రామసుబ్బమ్మ - కర్నూలు, డి. రజనీకృష్ణ - విజయనగరం, బి. వీరరాజు - జగ్గంపేట, కె. లలితకుమారి - బొబ్బిలి, ధనుంజయ శర్మ - మబగాం, శ్రీనివాస్ - మండపేట, శ్రీవల్లీ ఆండాళ్ - విజయవాడ,** వీరేకాక ఇంకా అనేక మంది పాఠకులు తమ అమూల్యమైన అభిప్రాయాలను, పేర్లను తెలియజేసారు. స్థలాభావం కారణంగా ప్రచురించలేక పోతున్నందుకు మన్నించ ప్రార్థన.

**ఇతిహాసబోధ - IX - 2 కథను ముందుగా ఊహించి తెలియజేసిన ఈ క్రింది పాఠకులకు శ్రీవారి మంగళాశాసనాలను, అభినందనలను ప్రత్యేకంగా అందజేస్తున్నాము.**

**1. జక్కా పేరయ్య - భద్రిరాజపాలెం, 2. ఎ. ఆండాళ్ళు - పాలకొల్లు, 3. జె. శ్రీరామమూర్తి - భీమడోలు, 4. కృష్ణలంక వికాసతరంగిణి - విజయవాడ, 5. వి. వృషాద్రిపతి - నాగాయలంక.**

**వీరు తమపూర్తి చిరునామాలను వికాసతరంగిణి కేంద్రకార్యాలయానికి తెలియజేయవలసినదిగా కోరుతున్నాము. - వికాసతరంగిణి**

**జై శ్రీమన్నారాయణ!**

ఈ సంచికలో .....



పంచాంగ వివరాలు

**జూన్**

5 హనుమజ్జయంతి
6 సర్వేషామేకాదశి
8 మృగశిర కా. ప. 2-41, శనిత్రయోదశి
9 మాసశివరాత్రి
10 సర్వేషాం అమావాస్య
11 గ్రస్తోదయ సూర్యగ్రహణం
15 మిధున సం॥ ప. 3-00,
మార్నేర్నంబి తిరునక్షత్రం
19 తిథి ద్వయం
20 ఏకాదశి తిథి
21 పెరియాళ్వార్ తిరునక్షత్రం
సర్వేషాం నిర్జలైకాదశి
కూర్మ జయంతి
22 ఆర్ద్ర కార్తె ప. 3-33, శనిత్రయోదశి

**జులై**

3 గురుమౌఢ్యారంభం
5 ఏకాదశి తిథి
6 సర్వేషామేకాదశి
పునర్వసు కార్తె. సా॥ 5-18
శూన్యతిథి
7 ద్వాదశి తిథి, యమునానది పుష్కరారంభం

1/
bnmay02.p65

శ్రీవారి సూక్తి

**నేనను నాదను భావం వదలుకో!**
**భగవానుని శ్రీకరమున పరికరమై మెదలుకో!!**

మీ సేవలో....


**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 72929
చందా: సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-, విదేశాలకు సంవత్సరచందా $ 25
E-mail : bhakthinivedana@yahoo.co.in Internet : www.chinnajeeyar.org
D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం,


శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక


| సంపుటి 55 | 2002 జూన్ | సంచిక 3 |
|---|---|---|

చిత్రభాను నామ సంవత్సరం జ్యేష్ఠ మాసము

సంపాదకులు:శ్రీ ఉ.వే. శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు

వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

# భగవద్గీత - 14

(శ్రీవారి ప్రవచనం నుండి - 1వ అధ్యాయం)

ధృతరాష్ట్రుడు సంజయుణ్ణి **"ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః"** అంటూ ప్రశ్న వేసాడు. సత్త్వం కలిగినవారిలో సత్త్వాన్ని ప్రేరేపిస్తుంది ఆ క్షేత్రం కనుక పాండవులకు అక్కడకు వెళ్ళగానే సత్త్వం బాగా పెరిగి ఉండాలి. తన కొడుకులైన కౌరవాదులకు అక్కడకు వెళ్ళగానే రజస్సు బాగా పెరిగి ఉండాలి. సత్త్వం పెరిగితే ఎదుటివాడిని ఏమీ చేయవద్దనిపిస్తుంది. రజస్సు పెరగగానే ఎదుటివాడిని ఏమి చేసిఅయినా మొత్తం తనకే అన్నీ కావాలనిపిస్తుంది.

సంజయా! కౌరవులు, పాండవులు ఇద్దరూ కూడా యుద్ధం చేయాలనే అక్కడకు వెళ్ళారనుకో. కానీ క్షేత్రస్వభావాన్ని బట్టి సత్త్వం బాగా పెరిగి పాండవులకు **మాకెందుకు యుద్ధం? ఎందుకీ రక్తపు కూడు మాకందరికీ? వద్దు** అని అనిపించిఉండాలే! అలాగే అనిపించిందా లేదా? ఇది ధృతరాష్ట్రుడి యొక్క ప్రశ్న. అంతేకాదు. ఇక నా కొడుకులు రజోగుణం కలిగినవారు కనుక వారికి, **మాకు ఇంకా రాజ్యం కావాలి. ఏమీ శ్రమపడ కుండానే వాళ్ళ రాజ్యం కూడా మాకు వచ్చేయాలి** అనిపించాలి. అట్లాగే అనిపించిందా? లేదా? ఇది ధృతరాష్ట్రుడి సందేహం.

సర్వజగత్కారణమైన శ్రీకృష్ణపరమాత్మ పాండవుల పక్షాన ఉండీ, వాళ్ళలో ఎపుడైనా చేతకాని భావాలు ఏర్పడితే వాటిని సంస్కరించుతూ, ముందుకు నడిపించగలడు. ఆతడి సహాయం వారికి ఉన్నప్పటికీ, శ్రీకృష్ణ స్వభావం ధృతరాష్ట్రుడికి తెలిసినప్పటికీ కూడ అంధత్వం చేత వేస్తాడు ఈ ప్రశ్న.

సంజయా! నా వాళ్ళు హాయిగ తలలో పూవు కూడ వాడక్కరలేకుండా రాజ్యానికి వారసులు అయిపోతే నాకెంత సంతోషం కద! యుద్ధమంటూ జరిగితే మా వాళ్ళు ఓడిపోవడంలో సందేహమేమీ లేదు. పాండవుల ప్రభావం అట్లాంటిది. అయితే యుద్ధం జరగకుండానే రాజ్యం వచ్చి మా వాళ్ళ చేతిలో పడాలి. పడాలంటే క్షేత్రప్రభావం పాండవులలో ఒక రకమైన అనాసక్తతను, మా వాళ్ళలో తీవ్ర ఆరాటాన్ని కలిగించాలి. కలిగించిందా? లేదా?

అక్కడితో ఆగితే పర్వాలేదు. **మామకాః** నా వాళ్ళు అంటూ వందమందిని గట్టిగ కాగలించుకున్నాడు. **పాండవాశ్చైవ** ఆ పాండవులూ అంటూ 5గురిని వేరుచేసాడు. నిజానికి అలా అనకూడదు. ఎందుకని? పాండవులు కూడ తన పిల్లలలాంటివారు. మనవాళ్ళు ఏం చేస్తున్నారయ్యా? అని అడిగి ఉండాల్సింది. కానీ తన కొడుకులను పాండవులను కూడ విడదీసాడు. ఇది అతనిలో ఉండే చెడుబుద్ధి, తమోగుణానికి ప్రతీక. అంతేకాదు వెంటనే మరోక ప్రశ్న. **కిమకుర్వత సంజయ** ఏమి చేసిరి?

అసలు ఇదేం ప్రశ్న? ఇది చాలా అసంగతమైన ప్రశ్న. భోజనశాలలోకి వెళ్ళినవాడు ఏం చేస్తున్నాడు? అని ఎవరైనా





అడుగుతారా. అది తప్పు ప్రశ్న. భోజనశాలలోకి వెళ్ళినవాడు ఏమి తింటున్నాడు? ఎన్నెసి తింటున్నాడు? అని అడగాలి. ఆటలాడుకోవడం కోసం ఆటస్థలానికి వెళ్ళినవాడు భోజనమా అక్కడ చేస్తాడు? లేక స్నానమా అక్కడ చేస్తాడు? కాదు కద! ఆటలే ఆడతాడు. అంచేత ఏమి ఆటలాడుతున్నాడు? ఎలా ఎలా అడుతున్నాడు అనేవే సరియైన ప్రశ్నలు తప్ప ఏం చేస్తున్నారనే ప్రశ్న సరియైనదికాదు.

యుద్ధరంగానికి వెళ్ళినవారు ఏమి చేస్తున్నారనే ప్రశ్న చాలా అసంగతమైన ప్రశ్న. కానీ అది వేసాడు ధృతరాష్ట్రుడు. అంటే వెనకాతల అతనికి ఒక భావం, పాండవులు యుద్ధం చేయాలని అనుకోరు క్షేత్రస్వభావాన్ని బట్టి. కనుక మా వాళ్ళకు రాజ్యం వచ్చేసిందా? పైగా అతను సర్వాత్మనా అంధుడు కావడం చేత నా వాళ్ళు అని కాగలించుకున్న 100 మందిలో ఒక్కడూ మిగలలేదు. **పాండవాః**అంటూ విడదీసిన 5గురు బతికారు. ఇదీ ఆశ్చర్యము.

మనకి ఈ మొదటి శ్లోకం ఒక అద్భుత సందేశాన్నిస్తుంది. ఒక దుష్టుడైన వ్యక్తి 'నా' అని ఎంతమందినైతే తనలో చేర్చుకుంటాడో అంతమందీ కూడ ఆతనివలె పతనమౌతారు. అలాంటి దుష్టుడు "నా వాళ్ళు కారు" అని ఎవరినైతే దూరం చేస్తాడో వారికి ఏమీ కాదు. కనుక మానవుడా! జ్ఞాపకం పెట్టుకో! మంచివాడు ఒక్కడి చేత వీడు నావాడు అనిపించుకునేటట్లుగా నీవు ప్రవర్తించు. చెడ్డవాడు వీడు నా వాడు కాడు అనుకునేటట్లుగా నీవు ప్రవర్తించు. చెడ్డవాడు నిన్ను దూరంగా తోసివేసినా అది నీకు శ్రేయస్కరమే! చెడ్డవాడు నిన్ను నా వాళ్ళు అని కాగలించుకునేటట్లుగా నీవు ప్రయత్నం చేయునే చేయుకు. వాడికి నీవు ఎంత దూరంగ వెళ్ళగలిగితే అంత దూరం వెళ్ళు. అది నీకు శ్రేయస్సు.

అందుకోసమే ధృతరాష్టుడు నా వారు కారు అనుకున్న పాండవులు బతికారు. కౌరవాదులు కావాలి అనుకున్నందుకు అంతమందిలో ఒక్కరు కూడ మిగలకుండా పోయారు.

అంతేకాదు. శ్రీకృష్ణుడు **మమ ప్రాణా హి పాండవాః** అనుకున్నాడు. అయిదుగురూ హాయిగా బ్రతికారు. నీవు శత్రువువి అన్నాడు శ్రీకృష్ణుడు దుర్యోధనుడితో. **ద్విషన్తం నైవ భోజయేత్** శత్రువుకు భోజనం పెట్టకూడదు. శత్రువును భోజనానికి పిలవకూడదు అని శత్రుస్థానంలో కౌరవులను చూపించాడు. కనుక వారంతా నశించారు. పాండవులు ఐదుగురూ కాపాడబడ్డారు అని మనకు భారతం తెలియచేస్తుంది.

***అర్థాత్, ఒక సజ్జనుడి చేత నా వాళ్ళనిపించుకో! దుష్టుని అభిమానం దుఃఖానికి మూలకారణం అని తెలుసుకో!***

కౌరవుల సేనను మనం చూసినట్లయితే అది 11అక్షౌహిణుల సైన్యం. గురువులు పెద్దలు అంతా నిండిఉన్న సైన్యం. ఇటుప్రక్క వీళ్ళను చూద్దామా! 7అక్షౌహిణుల సైన్యం. అంతా చిన్నచిన్నవాళ్ళు మాత్రమేఉన్న సైన్యం. కానీ ఏది విజయాన్ని పొందింది? ఏది నిలవగలిగింది చివరిదాక? కౌరవులు కానేకాదు. వాళ్ళకు ఉండే బలమూ కాదు. మరి గెలిచింది ఎవరు? పాండవులు గెలవగలిగారు. కారణం వీరిలో ఉండే సాత్త్వికత వారిని గెలిచేవారుగా తీర్చిదిద్దినదన్నమాట. కనుక మనిషిలో మొట్ట

మొదట అణగవలసినది తమోగుణం. తమో గుణం తగ్గడానికి పెద్దలను ఎవ్వరినైనా ఆశ్రయించాలి.

నిజానికి మనలోఉండే గుణాలను ఒదిలిపెట్టడానికి వీల్లేదు. గుణాలు పోవుకదా వదలిపెడదామంటే. ఒంటి మీద ఉన్న మురికిని కడిగితే పోవచ్చు. ఒంటిమీదున్న మరొక దానిని మనం తొలగిస్తే పోవచ్చు. కానీ, గుణాలు మన కంటికి కనిపించేవి కావు. లోపల ఉండి ప్రవర్తించేవి కనుక అవి పెద్దల ఉపదేశంవలన పోవాలి. ఆవేళ ధృతరాష్ట్రుడు ఉపదేశం విందామని అను కున్నాడు. సంజయుడిని అడిగాడు కూడా. అయితే సంజయుడు దానికి సమాధానము చెప్పాడు. చిట్టచివరి శ్లోకంలో

**యత్ర యోగేశ్వరః కృష్ణో**
**యత్ర పార్థో ధనుర్ధరః**
**తత్ర శ్రీర్విజయో భూతిః**
**ధ్రువా నీతిర్మతి ర్మమ॥**

ఎవరైతే సాత్త్వికులో వాళ్ళదగ్గర ఉంటాయి ఇవన్నీ. ఆ వేళ పాండవుల పక్షాన నిలిచాయి. కౌరవుల పక్షాన ఉండాల్సింది. కానీ తొలగి పోయాయి. సంజయుడు ఈ విషయాన్ని ధృతరాష్ట్రునికి చెప్పాడు. అయితే ఎపుడు చెప్పాడు? మొదట శ్లోకంలో అడిగితే 698 శ్లోకాలు దాటిన తరువాత చెప్పాడు. ఈ లోపల అతను వాస్తవాన్ని అందించే ప్రయత్నం చేసాడు. వింటున్నాడు ధృత రాష్ట్రుడు రెండు చెవులున్నాయి కనుకనే అతనికి ఏమీ ఎక్కలేదు.

తమోగుణము కలిగినవాడికి మంచి మనం చెప్పినా అది స్వీకరించే స్థితిలో అతను ఉండడు. తనే కోరికోరి తప్పుచేస్తూ ఉంటాడు. కానీ సవరించుకో అంటే తాను దానిని వినడానికి ఇష్టపడడు.

ధృతరాష్ట్రుడు యుద్ధాన్ని ఆపగలిగి ఉండేవాడు. కానీ, ఆపలేదు. దుర్యోధనుడిని మార్చగలిగి ఉండేవాడు. మార్చే ప్రయత్నం చేయలేదు. చివరకు తన కళ్ళతో తనే తన కొడుకులందరూ ఒక్కొక్కరూ ప్రాణాలు ఒదులుతూంటే చూస్తూ పడిఉండాల్సి వచ్చింది.

ఇది తగదు మనిషికి. తెలిసిన దానిని తప్పైతే తాను సక్రమంగా నిలిపే ప్రయత్నం చేయాలి. ధృతరాష్ట్రుడు ఆ పని చేయలేదు. పోనీ పెద్దలు చెప్పినది వినే ప్రయత్నం చేయాలి. ఆ పనీ చేయలేదు ధృతరాష్ట్రుడు. కనుక కౌరవుల వినాశానికి ప్రత్యక్షంగా కారణమైన వ్యక్తి. అతని యొక్క స్మరణతో ప్రారంభమవుతుంది **భగవద్గీత.** అంటే తమోగుణంలో ఉండే స్థితి లోంచి ప్రారంభం అవుతుంది **భగవద్గీత.** నెమ్మదిగా మనం సత్త్వ గుణంలోకి రావడం కోసం మార్గాన్ని చూపించే మహోన్నతమైన గ్రంథం **భగవద్గీత.** దానిని గురించి కొంచెం కొంచెం తెలుసుకునే ప్రయత్నం కొనసాగిద్దాం.

**జై శ్రీమన్నారాయణ!**

3/
bnmay02.p65



జై శ్రీమన్నారాయణ!

# గీతాజ్యోతి

## 3వ నెల

## పారాయణ శ్లోకమాలిక

### శ్రీకృష్ణుడు నిజమైన భగవంతుడు - మనందరి గురించి ఆయనకే తెలుసు

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప॥ 4 అ॥-5 శ్లో॥

**ప్రతిపదార్థం :- అర్జున!** = ఓ అర్జునుడా!, **తవ** = నీకు, **మే చ** = నాకున్నూ, **బహూని**=చాలా, **జన్మాని** = జన్మలు, **వ్యతీతాని** = గడచినవి, **అహం** = నేను, **తాని** = వాటిని, **సర్వాణి** = అన్నింటిని, **వేద** =ఎఱుంగుదును, **త్వం** = నీవు, **పరంతప!** = శత్రువులను ఓడించే పరాక్రమ శాలివి అయినా, న **వేత్థ**= ఎఱుంగవు.

జీవులమైన మనమందరమూ ''కర్మ'' అనే బంధంలో చిక్కుకొని ఉన్నాము. అది మనకు కనుపించదు. కాని బంధించును. దాని ప్రభావము వలననే ఇంతవరకూ ఎన్నెన్నో యోనులలో శరీరములను ధరించాము. విడచినాము. అవేవీ మన అధీనంలో లేవు. ఆత్మలమైన మనకు చావు పుట్టుకలు లేవు. ఉన్న శరీరమును వదలుటయే 'చావు' అనిన్ని, క్రొత్త శరీరమును ధరించుటయే 'పుట్టుక' అనిన్ని వ్యవహరిస్తున్నాము. కర్మ ప్రభావమున్నంత వరకూ ఈ జనన మరణ చక్రములో అస్వతంత్రులమై తిరుగక తప్పదు. ఒకసారి జంతువులుగ, మరోసారి కీటకములుగ, చెట్లుగ, రాళ్ళుగ, దేవతలుగ, మనుష్యులుగ ఇలా.... చాలరకాలుగ మనం శరీరాలు ధరించి ఉంటాం. అవేమి శరీరాలు అనేది మనకి తెలియదు. ఆయా కర్మలు అనుభవించాం. ఇంకా, ఇప్పుడు ఈ శరీరంలో అనుభవిస్తూనే ఉన్నాము గూడ. రాబోయే కాలంలో ఇంకా ఏవేమి ధరిస్తామో తెలియదు. పోనీ, ఇంకా ఎంత కర్మ నిల్వ ఉందో, అదికూడ మనకు తెలియదు. దానినెలా తొలగించుకోవాలో మనకు తెలియదు. మనం పూర్తిగ అస్వతంత్రులం. అంటే కర్మకి బానిసలం. కనుక ఈ బాధలు తప్పడం లేదు.

పరమదయాళువైన పరమాత్ముడు శ్రీకృష్ణుడు. ఆయనకేబంధమూ లేదని ఋషులంతా చెప్పారు. ఇతిహాసాలన్ని ఏకకంఠంగ ఒప్పుకున్నాయి. ఆయన సర్వ స్వతంత్రుడు. విశ్వాన్నంతనూ తన చెప్పు చేతల్లో పెట్టుకున్నవాడు. వ్రేపల్లెలో, కౌరవసభలో, యుద్ధ రంగంలోనూ ఎన్నో సార్లు ఆ సంగతిని నిరూపించి ఉన్నాడు. తన లాంటివాడైనా, మనమీద ఆతనికుండే దయ హద్దులేనిది. మనం బాగుపడాలనే తానెప్పుడూ ఆలోచిస్తూ ఉంటాడని శాస్త్రం చెపుతోంది. ఎన్నెన్నో యుగయుగాలుగ జీవులనందరినీ బాగుపరచడానికి వేద సారాన్నంతటినీ ఉపదేశం చేస్తూనే ఉన్నాడు.

అలా ఉపదేశించడానికి ఆయా కాలానికి తగినట్లుగ ఒక్కొక్క జన్మను తాను ధరిస్తూనే ఉన్నాడు.

ఒక జీవి, జన్మను ధరించాలంటే ఎన్నో క్లేశాలు గర్భంలో పడాలి. అవసరం లేకపోయినా తానుగూడ ఆ క్లేశాలన్నీ మనమీది ప్రేమతో, పడుతూ, జన్మిస్తున్నాడు. 28 చతుర్యుగాలకు ముందు సూర్యుడికి, ఆ కాలానికి తగిన శరీరమెత్తి, వేద సారాన్ని బోధించాడు. అయితే అది కాలక్రమంలో, అంతా మరచిపోయారు. మళ్ళీ ఈ జీవులకు చెప్పాలని శ్రీకృష్ణుడుగ ఈ భగవద్గీత రూపంలో తన దివ్య సందేశాన్నందించాడు. అర్జునుడిని ఒక సాకుగ పెట్టుకొని మనకోసమే.... ఈ ఉపదేశం చేసాడు.

అయితే, ఏమిటి తాను చెప్పే వేదసారమైన సందేశం? **"అహంకారము వదలి, భగవంతునికి తలవంచి, ఫలాన్ని కాంక్షించకుండా, మనం మనకి తగిన విధ్యుక్త ధర్మాన్ని ఆ భగవంతుని సేవగ భావించి చేయడమే"**. దీనినే నిష్కామ కర్మ, లేదా కర్మయోగము లేదా యోగము అని వ్యవహరిస్తారు.

జీవులమైన మనం మరీ అల్పబుద్ధులం. అందుకే ఆయన చెప్పినంత సేపూ అర్థమైనట్టు అనిపించినా, ఆయనటు తిరగగానే, మనం ప్రాపంచిక సుఖాలలో పడి బొత్తిగ మరచిపోతూ ఉంటాం. ఆయన అన్నీ తెలిసినవాడుకదా! మనని కంట్రోలు చేయవచ్చుకద! అనిపించవచ్చు. తన పిల్లవాన్ని దండించకుండ మంచిగ బ్రతిమాలి బాగుచేద్దామని తల్లికనిపిస్తుంది కదా! అంతకంటే గొప్ప ప్రేమకల శ్రీకృష్ణుడు, అలా మనలను దండించి, ఏడిపించడం ఇష్టంలేక నచ్చచెబుతాడు. వింటే బాగుపడతాం!

అందుకోనమే మనమే జన్మలెత్తితే, తానూ మనతోపాటూ అలాంటి జన్మలోనికి వచ్చి అవతరిస్తూ ఉంటాడు. పిల్లవాడు నేలదిగి మట్టిలో ఆడుతూంటే, తల్లిగూడ ఆ మట్టిలోకే దిగదా! అలానే భగవంతుడు కూడ మన స్థాయికి దిగివచ్చి మనలను ఉద్ధరించే ప్రయత్నం చేస్తున్నాడు.

కొందరు ఈ జన్మలన్నీ మిథ్యలు. కలలవలె కరిగిపోయేవి. బుడగలవలె ప్రేలిపోయేవి. ఇవన్నీ అసత్యములు అంటూ వాదిస్తారు. అలానే భగవంతుడికి గూడ నామ రూపాలు లేవనీ, అవతారాలన్నీ కూడ ఉత్తుత్తవే అంటూ పెదవి విరుస్తారు. అలాంటివారికి శ్రీకృష్ణుడు గట్టిగ సమాధానం చెపుతున్నాడు.

మన బ్రతుకంతా..... తిండికోనం పోరాటం, సుఖం కోసం ఆరాటం, విలాసాలకై తారాట్టం, బంధువులు పిల్లలతో గుంజాటం, కీర్తికోసం ప్రాకులాడటం... వీటితో నిండి ఉంటోంది. ఇది అబద్ధమని ఎవరైనా అనగలరా? అబద్ధమని ఎవరైనా అంటే వారిని ఇవన్నీ వదలమని చెప్పాలి. ఇలాంటి మహా వేదాంతం వల్లె వేసే వారికి గూడ శిష్యులకోసం తిరగాడటం, సంపాదనలపై మొహమాటం తప్పటం లేదుకదా! మరి వాళ్ళకివన్నీ స్వప్నాల్లాంటివైతే ఆ వెంపర్లాట్టం ఎందుకుండాలి? వాస్తవం మనం గ్రహించాలి. మన జీవితంలో ఎదురయ్యేవేవీ అసత్యాలు కావు. ఈ బ్రతుకంతా ఇంద్రజాలంవలె మాయగాదు. ఇది నిజం. "జగమే మాయ, బ్రతుకే మాయ" అనేది త్రాగి, మతిస్థిమితం తప్పినవాడి మెట్టవేదాంతపు ప్రేలాపన. ఈ ప్రపంచం, అందులో మనమూ, మన అనుభవాలూ, వాటి నియమాలూ ఇవన్నీ వచ్చి నిజం. వీటిని వేటినీ మనం అతిక్రమించలేము. అలా చేయరాదు.





అందుకే మన బ్రతుకులు యథార్థం. దీనిని చూపెడుతున్నాడు శ్రీకృష్ణుడు పై శ్లోకంలో **'తవ చ జన్మాని'** అంటూ.

నీ జన్మ ఎంత నిజమో, అలానే నీ కోసం దయతో పుట్టే నా జన్మలు గూడ **"మే జన్మాని"**... అంతే నిజం. అంటున్నాడు శ్రీకృష్ణుడు. దీనిని బట్టి భగవంతుడు గూడ మనకోనం యింతవరకూ లెక్కలేనన్ని జన్మలు ఎత్తాడని నిరూపితమౌతోంది. ఇది ఆతని చల్లని కరుణాపూర్ణమైన స్వభావాన్ని చెప్తోంది. మనం మరచిపోయినా, మనలను విడువలేని నిత్య సంబంధాన్ని చెప్తోంది. మనం ఎన్నో జన్మలలో ద్వేషించినా, మనలను కోపించని శాంత స్వభావాన్ని చెప్తోంది. ఛీ! పో! అని చికాకు పడినా, సహించి, రక్షించాలనే ఓరిమి గుణాన్ని ప్రకటిస్తోంది. ఆతణ్ణించి మనం దూరంగా పారిపోతున్నా, మనలను ఎడబాయలేని బాంధవ్యాన్ని సూచిస్తోంది. అల్పజ్ఞులమై అహంకరించినా, సర్వజ్ఞుడై తరింపచేసే ఔదార్యాన్ని గుర్తుచేస్తోంది. కష్టాల్లోకే కూరుకుపోతామంటున్నా, కనికరించి గట్టెక్కించే రక్షణ దీక్షను తెలుపుతోంది. సుఖాలను కాలదన్ని ఆతణ్ణి కూడ దుఃఖ పెడుతున్నా, చెదరని చిరునవ్వుతో ఎదుర్కొని, ఆ దుఃఖాలను రూపుమాపి, తిరిగి సుఖాలుగ మనకే అందించే వాత్సల్య గుణాన్ని ప్రకటిస్తోంది.

అందుకే చివరి వాక్యంలో గతంలో తానేమి చేసాడో, ఎన్ని అవతారాలెత్తాడో, అవన్నీ తనకు జ్ఞాపకమున్నాయన్నాడు. మనవేమేమి చేసామో గూడ తనకి తెలుసునన్నాడు. అంటే మన జాతకమంతా శ్రీకృష్ణుని చేతిలో ఉందనేది ఇక్కడ కీలకమైన అంశం. అది మరువరాదు. మనం గతంలో ఏం చేసామో మనకి తెలియదు. గతందాక ఎందుకు, పూర్వక్షణంలో చేసినదే మనకు జ్ఞాపకముండదు. ఇక పాతకాలమేమి గుర్తుంటుంది. క్రిందటి జన్మ ఏమి తెలుస్తుంది? మన గురించే తెలియని మనకు, ప్రక్కవాళ్ళగురించి ఏమి తెలుస్తుంది? పరమాత్ముడైన శ్రీకృష్ణుని గురించి ఏమి తెలుస్తుంది?

అందుకే మన తెలివిని ప్రక్కన పెట్టి, యథార్థమైన సర్వజ్ఞుడి మాటను విశ్వసించడం శ్రేయస్కరం. ముందు మనం, మన ప్రపంచం, మన అనుభవాలు, చుట్టూ ఉన్న ప్రాణులూ ఇవన్నీ మాయాకల్పితాలు కావు. యథార్థాలని గుర్తించమంటున్నాడు శ్రీకృష్ణుడు.

## ఆదిదేవుడి అవతారమూ, ఆచరణా ఆర్తుల సముద్ధరణకే

**జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వ తః।**
**త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున॥** 4అ॥-9శ్లో॥

**ప్రతిపదార్థం :-** **అర్జున!** = ఓ అర్జునుడా!, **మే** = నా యొక్క, **జన్మ** = పుట్టుక, **కర్మ చ** = చేయు పనులున్నూ, **దివ్యం** = మాటల కందని ప్రభావం కలవి, **ఏవం** = ఈ విధముగ, **తత్త్వతః** = ఉన్నదున్నట్లుగా, పరోపకారంకోసమేనని, **యః** = ఎవడైతే, **వేత్తి** = తెలుసుకొనునో, **సః** = అట్టి అవతార రహస్యం తెలిసినవాడు, **దేహం** = ఈ వర్తమాన శరీరాన్ని, **త్యక్త్వా** = వదిలిన పిదప, **పునర్జన్మ** = మరో శరీరాన్ని, **న ఏతి** = పొందడు, **మాం** = ఆనంద స్వరూపుడనైన నన్ను, **ఏతి** = పొందుచున్నాడు.

అన్యాయాలు, అక్రమాలు అవధులు దాటితే ఆది భగవానుడు భువిపై అవతరిస్తూంటాడు. సజ్జనులను కాపాడటమే తన అవతార లక్ష్యం. ఆయన చేసే ప్రతీ పనీ సన్మనుష్యుల ఉపకారానికే తప్ప తనకేమీ ప్రయోజనం ఆశించిచేయడు. అందుకే ఆతని పనులన్నీ ''లీల'' లంటారు. మన పనులన్నీ పరాయివాళ్ళను హింసించడానికీ, స్వార్థ సంతృప్తికినీ, కాబట్టి అవి ''ఘోర కర్మము'' లయ్యాయి.

మంచివారిని హింసించే వారినిక్రమంగా ఏరిపారవేస్తాడు... తన అవతార కాలంలో. వారి బలానికీ, వారి కపటానికీ తానెప్పుడూ బలి అయిపోడు. అలా బలి అయిపోయేవాడు ఇతరులనేమి రక్షిస్తాడు? దుష్టులకు గుణపాఠమెలా చెప్తాడు?

విపరీత ప్రవృత్తి వెర్రితలలు వేసిన వికృత జీవులను పెకలించి వేస్తాడు, కలుపు తీసినట్లు. తద్వార మంచివారనే పంటను స్వేచ్ఛగా పండనిస్తాడు. తనకోసం వారు చేసే ప్రతి సేవనూ ప్రీతితో స్వీకరిస్తాడు. విదురుడు శబరి పెట్టిన పండ్లను ''శుచీని'' చాలా పవిత్రమైనవి అనుకుంటూ ఆరగించాడు గద! జాతి, కుల భేదాలుండవు. నిష్కలంకమైన శ్రీకృష్ణ భక్తి ఒక్కటే అక్కడ ప్రధానం. అది కలవారేది చేస్తే అదే ధర్మమౌతుంది. వారా ధర్మాన్నాచరించగలిగే అవకాశం కలిగిస్తాడు. అదే తర్వాతి తరాలకి ఆదర్శమౌతుంది. బోయ స్త్రీ శబరి. శూద్రుడు విదురుడు. తిరుప్పాణి ఆళ్వారు, తిరుమంగైయాళ్వార్, గుహుడు మొదలైనవారంతా దళితులు. జటాయువు ఒక పక్షి. సుగ్రీవాదులు కోతులు. విభీషణాదులు రాక్షసులు. మాలాకారుడెవరో తెలియదు. గోపగోపికలు వెర్రిగొల్లలు. అయినా వీరందరూ చేసిన పనులే ధర్మాలయ్యాయి. వారి రక్షణకే భగవదవతారం. ఇలాంటి వారికోసము గత యుగాలలో ఎన్నో అవతారాలెత్తినట్లే ఈ యుగంలోనూ, న్నో రూపాలలో మన ఆరాధనలందుకుంటూ విగ్రహరూపంలో ఉన్నాడు.

శ్రీకృష్ణున్నిఏ రూపంలో తయారుచేసినా, అంటే ప్రాకే కృష్ణుడు, నవనీతకృష్ణుడు, గోపాల కృష్ణుడు, మురళీ కృష్ణుడు, తాండవకృష్ణుడు, రోటికి బద్ధుడైన కృష్ణుడు ఇలా రూపమేదైనా, ఇత్తడి, వెండి, బంగారం వంటి ద్రవ్యమేదైనా, చివరికి మట్టితోనైనా సరే తాను స్వీకరించి, మనలను ఆ ద్రవ్యం, ఆ రూపంలోంచి అనుగ్రహిస్తాడు. ఆయనకిదీ ఒక అవతారమే. దీనిని **"అర్చావతారం"** అంటారు. ఆనాటి అవతారాలలో ఎంత సులభుడై, అప్పటివారికి లొంగి ఉన్నాడో ఇప్పటి మనకిగూడ ఈ అర్చావతారంలో ఎప్పటికీ లొంగే ఉంటాడు. మనం ఎలా చెబితే అలా, ఏది పెడితే అది తిని, ఎలా ఉంచితే అలా ఉండి, ఎక్కడ ధరించినా సహించేటంత సులభుడైపోయి ఉంటాడు. అయితే విగ్రహంలో ఏమీ చేతకానట్టున్నా... చేతకానివాడని మనం భ్రమపడకూడదు. ఏమీ తెలియనట్లే ఉంటున్నా, ఆతడు సర్వజ్ఞుడే అనేది మనం గుర్తుంచుకోవాలి. రోటికి కట్టివేసిన తల్లివద్ద అమాయకంగ నిలచినట్లే, మనమీద ప్రేమతో మనవద్ద అలా అశక్తునిలా, అజ్ఞుడిలా, ఏమీ లేనివానిలా, మనమీదే పూర్తిగా ఆధారపడినట్లుగ ఉంటాడంతే. ఇది కేవలం స్వేచ్ఛతో తానే కావాలని పరిగ్రహించే అవతారమని గుర్తించామా మనం ధన్యులం. అదే చెబుతున్నాడీ శ్లోకంలో. తాను సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వేశ్వరుడు, సత్యసంకల్పుడు, సర్వరక్షకుడు, సమస్తకళ్యాణ గుణాకరుడు. ఈ గుణాలన్నీ, మనం భయపడతామని, కనిపించనీయకుండా దాచుకొని ఉంటాడు. అది అవతారమైనా, అర్చావతారమైనా సరే. ప్రీతితోతాను అవతారాల్లో అయినా విగ్రహరూపాల్లో అయినా ఏమీ చేతకానట్లు స్వీకరిస్తూ

5/
bnmay02.p65



సంతృప్తి పడుతూ ఉంటాడు. మనమెలా చేసినా తాను స్వీకరిస్తాను అనే భరోసా కలిగించడానికే ఈ లీల. అందుకే భగవంతుడి యొక్క జన్మ, కర్మ ఈ రెండూ దివ్యములే.

పైపై చరిత్ర చదివినా, దర్శించినా ఆపాతరమణీయంగ, ఆకర్షణీయంగ ఉంటుంది. పుట్టడంలోని రహస్యం, పెరగడంలోని వైచిత్రి, జారత్వ, చోరత్వాదుల వంటి ఆశ్చర్య కృత్యాలు, అవ్యక్తంలోంచి వ్యక్తస్థితిలోకి వచ్చిన అవతార రహస్యం. వీటిని తరచి చూస్తే, ఆలోచించే కొద్దీ అమృతమయతీరాలలోనికి తీసుకు వెడతాయి. అందుకే భగవంతుని జన్మకర్మల రహస్యం రెండురకాలుగానూ తెలియాలి. పైపైకి అందంగ, ఆకర్షణీయంగ కనిపించే కథాభాగం తెలియాలి. ఇది ఆపాత మధురం. లోలోపలి తత్త్వ యథాత్మ్య సాక్షాత్కారంకై అన్వేషించాలి. ఇది ఆలోచనామృతం. ఇదే ''తత్త్వతః'' తెలియడమంటే! ఇది తెలిసినవానికి దేహత్యాగమే ఆలస్యము. ఆ జీవి మరో కర్మకృత దేహంలోకి రానేరాదు. తననే చేరుతాడని శ్రీకృష్ణుడు భరోసా ఇస్తున్నాడు. ఆ ఇవ్వడం కూడా ఎంత హుందాగా ఔదార్యంతో యిచ్చాడో గమనించాలి.

జన్మించేవాళ్ళం ఇద్దరం. జీవుడూ, నేనున్నూ. నా అవతార రహస్యం తెలిస్తే ''నీవు'' జన్మించనవసరం లేదు అన్నాడు శ్రీకృష్ణుడు. అందులోనే మన జన్మలను మనం లేకుండా చేసుకొనే ఉపాయం చెప్పేసాడు. కానీ, ఆయనజన్మలు మాత్రం కొనసాగుతూనే ఉంటాయని అర్థంకద! తెలుసుకున్న వాళ్ళవరకు తరిస్తారు. ఇంతా తెలియని జీవులు ఎందరో ఉంటూనే ఉంటారీలోకంలో. వారందరికోసం శ్రీకృష్ణుడు తానుమాత్రం మళ్ళీ మళ్ళీ ఈ లోకంలో జన్మిస్తూ ఉంటాడన్నమాట.

కర్మవల్ల కలిగే జన్మలు మనవి. ఆయన అనుగ్రహిస్తే మన కర్మ నశించిపోతుంది. కనుక మన జన్మలకంతమున్నది. కర్మలేకుండా, కేవలం కృపవల్ల ధరించే జన్మలు ఆయనవి. ఆ కృప నశించడమనేది లేదు. ఆతని ప్రేమ తరగని గంగాజలధార వంటిది. కృపవల్ల ఎత్తే అవతారాలుగూడ అలానే తరగనివే మరి! అందుకే నీ జన్మలకు అంతమున్నా అర్జునా! నా జన్మలకు మాత్రం అంతంలేదని సూచిస్తున్నాడు శ్రీకృష్ణుడు ఇందులో.

జన్మలు లేకుండా, శరీరాలు లేకుండా, ఎక్కడో రాయి రప్పలా పడిఉంటామా? గాలిలో తేలియాడుతూంటామా అనే భయం కలగడం, బుద్ధిమంతునికి సహజం. ఆ భయాన్ని తీరుస్తూ ''మామేతి సః'' ఆ జీవులను నా దివ్య సన్నిధానానికి చేర్చుకుంటాను. ఏ దుఃఖ వాసనలూ, పాపకర్మ ప్రభావాలూ వాడి వైపుకూడా చూడనంత గొప్పస్థితి వానికి కలిగిస్తాను. మట్టిలో వేసినా పాదరసానికి మట్టి అంటదు కదా! అలానే ఎక్కడున్నా, ఈ క్షుద్రవిషయాలు అంటుకోకుండా ఉండే మంచి దివ్య దేహాన్ని ప్రసాదిస్తాను. దివ్యానుభవాలు ప్రసాదిస్తాను. నేనెట్లా ప్రకృతి ప్రభావానికి అతీతుడనో, ఈ నా భక్తుడినీ అలానే అప్రాకృతునిగ తీర్చిదిద్దుకుంటాను. అన్నాడు స్వామి. ఇక ఇంత కంటే ఘనమైన ఉపకారమేమున్నది?

శ్రీకృష్ణుడు పరుల పీడలకు బలికాడు. పాలకుల పారుష్యానికి పీడితుడు కాడు. చేతకాక చేతులెత్తేసి కన్నీరు మున్నీరు కాడు. తన నాశ్రయించిన వారిని పాపాలనుండి బయటకు తెస్తాడు. పీడించేవారిని పారద్రోలుతాడు. చిరునగవు మోముతో మనలను ఉత్తేజితులను చేస్తాడు. ఎదురు తిరిగిన వారికి బుద్ధి చెప్పి పశ్చాత్తాప పడేట్లు చేస్తాడు. ఆ శ్రీకృష్ణుని కంటే వేరు దైవమేమి? ఆ ప్రభువు యొక్క అవతార రహస్యాన్ని ఆకళింపుచేసుకుందాం! ఆనందపు అంచులను అందుకొందాం!

# ఫలస్పృహతో చేసే ఏపనైనా పట్టి బంధించేదే

**నమాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మ ఫలే స్పృహా।**
**ఇతి మాం యోఽభి జానాతి కర్మభి ర్నస బద్ధ్యతే॥** 4అ॥ -14 శ్లో॥

**ప్రతిపదార్థం :-** **కర్మఫలే** = చేసిన పనులవల్ల కలిగే ఫలమునందు, **స్పృహా** = లాభాపేక్ష, **మే** = నాకు, **న** = లేదు కనుకనే, **కర్మాణి** = నేను చేసిన పనులేవీ, **మాం** = నన్ను, **న లింపంతి** = అంటుకొనుట లేదు. **ఇతి** = ఈ విధంగ, **మాం** = నన్ను, **యః** = ఏ భక్తుడైతే, **అభిజానాతి** = స్పష్టముగా తెలిసికొనునో, **సః** = అట్టి బుద్ధిమంతుడు, **కర్మభిః** = అతడా చరించుకర్మలచే, **నబధ్యతే**=బంధించబడడు.

మనం చేసే పనులు రెండు రకాలు. పుణ్యకర్మలూ, పాపకర్మలూ అని. పరులను పీడించేవి పాపకర్మలు. స్వార్థాన్ని తీర్చేవి పుణ్యకర్మలు. ఈ రెంటికీ కారణం ప్రాచీన సంస్కారాలే.ప్రాచీన వాసనా సంస్కారాలవల్ల కోరికలు కలుగుతూంటాయి. కోరికలను తీర్చడానికి పనులు చేస్తాం.

కోరికలు తప్పా? కానేకాదు. కోరికలు లేకపోతే ఆ వ్యక్తి బ్రతికి లేనట్లే గద! బ్రతికి ఉన్నాడని సూచించేవే కోరికలైతే, అవి మంచిగ ఉండేట్టు చూసుకోవాలి. అందుకే కోరికలుండటం తప్పుకాదు. సంతానం, సంపదలూ, పదవులూ ఇవన్నీ కోరికలే. అవి ఏదో ఒకటి చేసి సాధించవచ్చు. తీరా సాధించాక ఎందుకు సాధించామో మరచి పోవడమే తప్పు. ఎక్కడికో వెళ్ళాలని కారు కొను క్కొని వెళ్ళాల్సిన చోటు మరచిపోయి, కారును చూసుకుంటూ మురిసిపోయి, కూడని చోట్లకు తిరిగినట్టు, లౌకిక సంపద లన్నీ, సుఖాలన్నీ కోరవచ్చు. ఇవి కారు లాంటివి. వాటిననుభవిస్తూ మన లోపల రక్షకుడై కాపాడుతున్న శ్రీకృష్ణుని గుర్తించాలి. ఆతడే అందరిలోనూ ఉన్నాడని తెలిసి, వాని సేవగ ఈ సుఖాలననుభవిస్తే పర్వాలేదు. కానీ ఇవి అందగానే ఆ శ్రీకృష్ణుడిని మరచి, ఆతనినీ, ఇతరులను ద్వేషించడం మొదలైతే ప్రమాదమే. ఆ సుఖసంపదలనే పెంచుకో వడంలో మునిగిపోయి, శ్రీకృష్ణుడనే గమ్యం మరచిపోవడమే ప్రమాదకరం.

సుఖసంపదల ఆకర్షణ పరమాత్మను తలువనీయదు. ఇవి పెంచుకుందామని వీటివెంటే పరుగులు పెట్టడం, దానితో మమతా, అనురాగాలు వీటిపై పెరగడం ప్రారంభమౌతుంది. ఇక్కడ మూడు దోషాలు చేరుతున్నాయి. 1) తాత్కాలిక ఫలాలపై ఆశ 2) అవి నావల్లే కలిగాయి అనే అహం భావం, 3) వాటిని పెంచుకోవడంలో గమ్యాన్ని మరిచిపోయి దోషి కావడం. ఈ మూడిటినీ కలిపి 'ఫలస్పృహ' అని శ్రీకృష్ణుడు పేరు పెట్టాడు. ఎంతవాడికైనా ఇది తప్పదు. నిజానికన్నీ ఇచ్చేది శ్రీకృష్ణుడే. కానీ మన దృష్టి ఆతనిదాక పోదు. ఈ సుఖాలు ఆతని దాక మన దృష్టిని పోనీయవు.

లంచానికి అలవాటుపడ్డ ఉద్యోగో, నాయకుడో, బంట్రోతో అంతా తావే చేస్తున్నట్టు తాము చేయకపోతే ఇక ఏమీ కానట్టే గర్విస్తుంటారు. అసలు చేసేదీ, ఇచ్చేదీ ప్రభుత్వమే అయినా ఈమధ్యలోవాడు, తాను సత్కారాలు, సమ్మానాలు, లాభాలు పొందా లనుకుంటాడు. పనికావాలనుకున్న ప్రజలు గూడ 'సరే, ఏదోరకంగ పని అయితేచాలు'





నని వాళ్ళని తృప్తిపరచేస్తుంటారు. పైవాడిదాక ఇక ఆలోచించరు. అలానే మన అహంకారం, ఫలంకావాలనే కాంక్ష, పరమాత్మ దాక దృష్టిని పోనీయక కన్పించిన దానివద్దే మనలను తృప్తిపరచేసి, ఇదే ఇంకా పెంచుకోవాలని, పెరిగినది మనవల్లనే జరిగినదనిపించే గర్వాన్ని కలిపిస్తుంటాయి. ఈ ''స్పృహ'' ఎంత పెరిగితే, అది, ఈప్రకృతిలో జీవుణ్ణి అంత గట్టిగ బంధిస్తుంటుంది. అంటే మనం ఫల స్పృహతో చేసే ప్రతిపనీ మననిక్కడ పట్టి బంధించేదేనన్నమాట. నిజమైన ఆనంద స్వరూపుడైన ఆ పరమాత్మనుండి విడదీసేదేన న్నమాట. అందుకే ఫలస్పృహతో చేసే కర్మ లన్నీ పాపకర్మలే అనవచ్చు. ఆతనితో చేర్చేవే పుణ్యకర్మలు. ఆతనినుండి విడదీ సేవన్నీ పాపకర్మలే అనవచ్చు.

ఆయనతో చేరనిచ్చేదయితే ఏమైనా చేయవచ్చా? అదొక వేళ హింసగ కన్పించినా చేయవచ్చా? పరోపకారం పరమాత్మకోసం కాకుండా చేసినా, అది పాపకర్మయేనా? అంతే, అవుననే సమాధానం, చూడండి! తెలియని ఓ పసివాడు మత్తుపదార్థాన్ని తింటానని ఏడుస్తున్నాడు. పరోపకారం కదా అని, వానికది ఇచ్చారనుకోండి. ఏమవు తుంది? శ్రీకృష్ణుణ్ణి ద్వేషించే దుర్యోధనుడికి పదకొండు అక్షౌహిణీల సేన, పరోపకారం కదా! అనే సహాయం చేసింది. ఏమయింది? అందరికీ వినాశం. ఘోరనరకమే సంప్రా ప్తించింది. ఇది మంచిది అని అందామా? కాదు గద! కాళ్ళు చేతులూ, శరీరమునూ కోయడం 'హింస అనే అందరూ అను కుంటారు. కానీ, వైద్యుడు, రోగి ఆరోగ్యం కోసం ఆపని చేస్తే, ఆ రోగి వైద్యునికి డబ్బిచ్చి, కృతజ్ఞతలు చెప్పి సంతోషిస్తాడు. అది చేయని వైద్యుడిని నిందిస్తారు కదా! వైద్యుని పని చెడ్డది అని అందామా? కాదు గద! కర్మ ఏదైనా చేసేవాని స్వభావాన్ని బట్టి ఫలము ఉంటుంది. లోకంలో బురదకి లక్షణం అంటుకోవడం. అది మహాపండితుడికైనా, నిరక్షరకుక్షికైనా అంటు కుంటుంది. కోటీశ్వరు డికైనా, కూటికి లేనివానికైనా అంటు కుంటుంది. అలానే కర్మలకు అంటుకోవ డమే స్వభావమా? కాదు.. 'చేసే తీరును బట్టి' అని పైన చెప్పిన దృష్టాన్తం తేట తెల్లం చేస్తోంది కదా! వైద్యుడు ఈర్ష్యాసూయలతో రోగి శరీరాన్ని కోయడు. కనుక కోయడం ఆతనికి హింసకాదు. రోగి ఆరోగ్య దృష్ట్యా అవసరం. ఫలస్పృహతో రాగద్వేషాలతోనో చేస్తే దోషం. అది లేకుండా చేస్తే దోషం కాదని గుర్తించాలి. **"న కర్మ లిప్యతే నరే"** చేసే పనిని భగవత్సేవగ చేస్తే కర్మ ఏదైనా మనిషిని అంటుకొనదని **ఈశావాస్యోపనిషత్** చెప్తోంది.

ప్రాచీన కర్మ వాసనా దూషితాలై రాగద్వే షాదులతో చేసే కర్మ పుణ్యమైనా, పాపమైనా బంధించేదే. ఈర్ష్యాసూయలతో ''ఫలస్పృహ'' తో చేసే కర్మ ఏదైనా మనలను బాధించేదే. శ్రీకృష్ణుడు ఎన్నెన్నో పనులు చేసాడు. కానీ ఆయనకు రాగద్వేషాలు, ఈర్ష్యా రోషాలు లేవు. అన్నీ పరోపకారాని కైయ్యే చేసాడు. ఫలితమేది కలిగినా సహించాడు. ''ఫల స్పృహ'' వదలి చేసాడు. మన సుఖంకోరి చేసాడు. వేదాలు ఆయన్ని **'అనశ్నన్'** 'తిండి తిననే తినడు' అన్నాయి. ఆయనకి మనం మంచి తిండి తింటే చాలు. చూచి పొంగి పోదామనే తపన. ఆయన పనులన్నీ మన సుఖంకోసం. వేదాలాయన్ని **'సుప్తేషు జాగర్తి'** 'అందరూ నిదురపోయినా తాను నిదురించక

కాపలా కాస్తాడని చెప్పాయి. మనం హాయిగ శ్రమతీరా నిదురిస్తే అదే ఆయనకు తృప్తి, సుఖం. అసలందుకోసమే ఆయన సృష్టించేది కూడా! ఇప్పటికి ఎన్నిసార్లు సృష్టి చేసాడో తెలియదు. అయినా విసుగూ, విరామమూ లేదు. అప్పుడప్పుడు ఒకరో అరో తరించినా పొంగి పోవటంలేదు. దుష్టులు ప్రపంచాన్ని నాశనం చేస్తున్నా దిగులపడి శోకించడమూ లేదు. ఇవన్నీ తాత్కాలిక ఫలితాలని తెలుసు కనుక వాటి యందు 'స్పృహ' ఆయనకు లేదు.

ఈ జీవులన్నీ ఒక్కసారి సృజించగానే బుద్ధిమంతులైపోలేదు. ఎన్నెన్ని రకముల సమస్యలో వచ్చాయి. వస్తూనే ఉన్నాయి గూడ. అయినా ఆయన వాటిని లెక్కచేయకుండా ఉపకారం చేయడం తన బాధ్యత అనుకున్నాడంతే. ఫలమెలాంటిదీ?, అనుకున్నంత వచ్చిందా లేదా?, రాకపోతే మానేద్దామా?, వస్తే ఎగిరి గంతేద్దామా? రాకపోతే ఎవరి వల్లనో రాలేదని, వీళ్ళమీదా వాళ్ళ మీదా చిందులు త్రొక్కుదామా? ఇలాంటివేమీ పెట్టుకోకుండా, పట్టించు కోకుండా, తనమానాన తాను చేసుకుంటూ పోతూనే ఉన్నాడంతే.

ఎండా, వానా, చలీ, గాలీ, చీకటీ, వెలుతురూ అనేవి లెక్కచేయకుండా ఎంద రెక్కినా, ఎందరుదిగినాపట్టించు కోకుండా, నియమం ప్రకారం గమ్యం చేరడమే లక్ష్యంగా ఓ రైలు బండి ముందుకు సాగిపోతున్నట్లు, ఈ జీవుల నందరినీ తరింపచేయడమే లక్ష్యంగ, పొగిడే వాళ్ళూ, తిట్టే వాళ్ళూ, కొలిచేవారూ, విరిచే వారూ, గేలిచేసే వారూ, వెక్కిరించేవారూ.... ఎవరేమన్నా వాటితో ''స్పృహ'' లేకుండా తనమానాన శ్రీకృష్ణ భగవానుడు ఈ విశ్వ రచన చేసుకొంటూ పోతూనే ఉన్నాడు. అందుకే ఆయనకి చేసిన ఏపనీ అంటదు. అల్ప బుద్ధులమైన మన దృష్టిలో అవి చోరత్వ మనో, జారత్వమనో, హింసకై ప్రేరేపించడ మనో, రాజనీతి నడపటమనో అనిపించినా అవేవీ ఆయనకు అంటవని చెప్పాడు.

అంతేకాదు. ఈ ''కర్మఫలస్పృహ'' అనే దోషం లేకుండా తమతమ బాధ్యతాయుతమైన పనులు ఎవరు చేసినా, వారిని గూడ ఆయా కర్మ బంధించదు. వారూ తనవలెనే కర్మబంధమునకు దూరంగ ఉండగలుగుతారు. అనే రహస్యాన్ని వెల్లడించాడు.

**'మనం చేసే మంచిపనులలో సమాజహితానికీ, పరోపకారానికి తగినవి ఎంచి చేద్దాం! ఆ కర్తవ్య నిష్ఠతో ముందుకి సాగేటప్పుడు ఎదురయ్యే సమస్యలకు జంకకుండా సాగుదాం!ఎదురయ్యే లాభాలకు 'నావల్ల', 'నాకోసం' అనే స్పృహ లేకుండా, అది కేవలం శ్రీకృష్ణుని ఆజ్ఞగ, ఆయన సేవగ, ఫలభోక్త ఆయనే అనే విశ్వాసంతో చేద్దాం! పాపాల పంకిలం నుండి బయట పడదాం!'**





## పాపాల పుట్టవే అయినా పరమాత్మ ప్రేమతో పవిత్రుడివి కమ్ము!

**అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥** **4అ॥ -36 శ్లో॥**

**ప్రతిపదార్థం :- పాపేభ్యః** = పాపములను చేసిన, **సర్వేభ్యః** = అందరికంటెనూ, **పాపకృత్తమః** = ఘోరపాపివి, **అసి చేత్ అపి**= అయి ఉన్నప్పటికీ, **సర్వం** = మొత్తము, **వృజినం** = పాపమును, **జ్ఞాన ప్లవేన** = మంచి జ్ఞానమనే పడవతో, **సంతరిష్యసి ఏవ**= తప్పక దాటగలవు.

మానవ జీవితమంతా పాపాలపుట్టయే. మనం చేసే ప్రతీపనీ, వాస్తవముగ ఆలోచిస్తే, పాపంలోకే పర్యవసిస్తుంది. మన బ్రతుకు సుఖం కోసం ఎందరినో బాధిస్తు న్నాం. ఎన్నో ప్రాణులను హింసి స్తున్నాం. తెలియకనే ఎన్ని ప్రాణులను నశింప చేస్తున్నామో! మరి వాటి పాపాలన్ని మనలనే గద ఆశ్రయించుకొనేది! అంటే మనమెన్ని పాపాలకు ఆశ్రయమయ్యామో ఆలోచించు కోవచ్చు. ఇన్ని పాపాలూ అనుభవిస్తే తప్ప పోవు. ఒక్కొక్క పాపాన్ని అనుభవించడానికే కొన్ని సంవత్సరాలు చాలవట. మరి అలాంటపుడు ఇన్నిపాపాలూ తొలగే దెప్పుడూ? సంవత్సరాలు చాలవట. పాపాలు దుఃఖాలనిస్తాయంటే, ఎన్ని దుఃఖాలను మనం అనుభవిస్తూ కూర్చోవాలి? వాటి అనుభవాల కోసం ఎన్నెన్ని శరీరాలు ఎత్తాలి? ఇతర శరీరాలలోకి పోతే తిరిగి ఈ పాటి జ్ఞానం గూడ ఉండకుండా పోతుందికదా!

దుఃఖాలన్నీ తీరి, పాపాలన్నీపోయి, మంచి జ్ఞానం పెరిగి భగవంతుణ్ణి తెలుసుకొనే దెప్పుడు? ఆతనిని ప్రేమించేదెపుడు? ఆతనివద్దకు చేరేదెప్పుడు? సర్వవిధాల కైంకర్యం చేసేదెప్పుడూ.....? ఇలా ఇవన్నీ తలచుకొంటే భరించరానంత శోకం ముంచుకు వస్తుంది. ఇక ఈ బ్రతుకింతేనా? అనే దిగులు పట్టి పీడిస్తుంది. అలాంటివారికి శ్రీకృష్ణుడు ఓ గొప్ప ప్రోత్సాహం యిస్తున్నాడీ శ్లోకంలో. పాపాలనేవి ఘోరసాగరం లాంటివి. లోతుగానీ, ఒడ్డుగానీ తెలియనంత అగాథం, అపారము కూడ. అందులో పడ్డ అల్పప్రాణులం మనం. సమస్యల సుడిగుండాలు, సుఖదుఃఖాలనే సొరచేపలూ.... ఒకటేమిటి? ఎన్నిరకాల ప్రమాదాలో తెలియదు. నిరంతరం మ్రింగేయాలనే చుట్టూ చేరుతూంటాయి. మరీ సాగరంలోంచి ఈదు కుంటూ ఆవలిగట్టు చేరడమనేది అసంభవం. దీనికేదైనా నావ సహాయంగ కావాలి. ఏదా నావ? ఇన్ని ఇబ్బందులనుండీ గట్టెక్కించే నావ ఏమిటి?

కొండలెక్కుతూ, ఎండలో నడుస్తూ, దూర ప్రయాణం చేసేవాడికి దాహంవేస్తే, ఏం చేయాలో, ఎలా తీరాలో, అలా నడిచే అనుభవజ్ఞులనడిగితే చెప్తారు. పెద్దలనెందరినో సేవించుకున్న శ్రీరాముడికి సమస్యలను సవరించుకుంటూ ముందుకు

సాగడమెలానో చాలాబాగా తెలిసింది. అందుకే ఉత్తమ మానవవుడైనాడు. సాంసారిక పాపజలాలలో మునగకుండా ఆ దరికి చేర్చే పడవ ఒక్కటే. శ్రీకృష్ణుడు దానిని మనకు దయతో అనుగ్రహి స్తున్నాడు. అదే "జ్ఞానప్లవం". అంటే పనిచేసే టపుడు, ఆ పనివెనుక బలాన్నివ్వవలసిన జ్ఞానమెలా ఉండాలో తెలుసుకోవాలి. జ్ఞానమే ఒక నావ. నావ చిన్నది. సాగరం పెద్దది. అయినా, చూస్తూ భయపడడం కంటే నడుపు తూంటే క్రమంగా సాగరం దాటొచ్చు. అలానే మన జ్ఞానం అల్పము, పాపరాశి అపారమూ అయినా, క్రమంగా నీవు దాన్ని దాటగల్గుతావు అని కృష్ణుడు ప్రోత్సహిస్తు న్నాడు. మన పాపాలకి దండిస్తాననడం లేదు. ఎంత దయా మయుడో!

నావ దొరకడం ఎంత ముఖ్యమో, సాగర ప్రవాహంలో కొట్టుకుపోకుండా నడిపే విధానం తెలుసుకోవడం అంతే ముఖ్యం. సాగరంలో గాలులు తరంగాలున్నా భయప డకుండా నడపడం ప్రారంభించాలి. నావ తిరగబడకుండా చూసుకోవాలి. నావలోకి నీళ్ళు రాకూడదు. నీళ్ళల్లో నావ సాగాలి. అలానే గురూపదేశం వల్ల లభించిన జ్ఞానం ఎంత బలపడితే అంత బాగా ఈ పాపరాశి నుండి మనం బయట పడతాం. నడప కుండా వదలిన నావ ప్రమాదానికి గురయి నట్టే, మనిషికి కలిగిన జ్ఞానం పనిలోంచి పారిపోయేట్టు చేయకూడదు. కర్తవ్య నిష్ఠుడిగా తీర్చిదిద్దాలి. అయితే పనిచేస్తుంటే నేను చేస్తున్నానని, ఫలానా ప్రయోజనం నాకే కావాలనే భావాలు కలిగితే మాత్రం నావకు కన్నాలు పడ్డట్టే. అవి కలక్కుండా చూసు కోవాలి.

అహంకార రహిత స్థితి, జ్ఞానం-వల్లనే కలుగుతుంది. అందుకే దీనిని జ్ఞానప్లవం అన్నాడు. సాగర యానంలో అలలపై తేలియాడుతుంటే సుఖంకూడా ఉంటుంది. అయితే పాపసాగరంలో జ్ఞానప్లవంతో మనం సాగించేది మాత్రం విహారయాత్ర కాదు. నిర్బంధయానం. అయినా భయమక్కర్లేదు, నేను తోడుంటానని పడవను ఒడ్డుకు చేరుస్తానని పరమాత్మ ప్రోత్సహిస్తున్నాడు. ఇంతకీ "నావ" గా చెప్పిన జ్ఞానమేమి? చేసే పనిలో మధ్య మధ్యలో లభించే ఫలము లయందాశ తగ్గి, ఆ పనులన్నీ భగవంతుడి సేవలని, అవే యజ్ఞములని భావించుట. ఈ భావన ఒక విశ్వాసంగ మారాలి. ఆ విశ్వాసమే మనని దాటించే నావ. కనుక బాధ్యతతో మన విధులు భగవత్సేవగా నెరవేరుద్దాం. చేసే ప్రతిపనికి తాత్కాలిక ఫలాలను కోరి పాపాలను పెంచుకోవద్దు. దైవానికి దూరం కావద్దు. దుఃఖసాగరంలో మునగొద్దు. ఈ జ్ఞానమనే పడవకు అహంకారపు చిల్లులు పడకుండా చూసుకుందాం.

ఉదయం లేచినప్పటినుండి తీర్చుకునే కాలకృత్యాలు, స్నానం, సంధ్య, ఆహారం, విహారం, ఉద్యోగం, వ్యాపారం, వ్యవసాయం లాంటి పనులన్నీ భగవత్సేవగా చేద్దాం. అప్పుడు అవి మనలో ప్రీతిని కల్గిస్తాయి. ఆ పనుల వెనుక నిలచిన బలమైన విశ్వాసం మంచి నావలా ఈ పాపసాగరాన్ని తప్పక దాటిస్తుంది. భయమొద్దని భగవానుడు భరోసా ఇస్తున్నాడు.





శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యో నమః



# భక్తినివేదన ఆధ్యాత్మిక మాసపత్రిక

**గౌ॥సంపాదకులు : శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు : T.P. **శ్రీరామచంద్రాచార్యులు**

ప్రియ భగవద్బంధువులారా!

నమస్సుమాంజలి. '**భక్తినివేదన ఆధ్యాత్మిక మాసపత్రిక**'ను మీరు శ్రద్ధగా చదివి ఆనందించు చున్నందుకు శ్రీశ్రీశ్రీస్వామివారి అనేకానేక మంగళాశాసనములు మీకు తెలియచేయుచున్నాము. ఈ అభిరుచిని ప్రోత్సహించాలని మా ఆకాంక్ష.

ఈ మధ్యకాలంలో పోస్టల్ చార్జీలు ఎంతగా పెరిగాయో మనందరికీ తెలుసు. అయినా పెద్దల సూక్తిసుధలు మీకు అందాలన్న మా అభిమత సాఫల్యానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నాము.

ఇప్పటిదాక వార్షిక చందాదారులకు తమ సభ్యత్వము ముగియడానికి 2 నెలల ముందుగా ఒక లెటర్, తర్వాత ఒక M.O., ఫారమ్ పంపించడం జరుగుతుంది. తరువాత ఒక కార్డుద్వారా చందా ముగియడాన్ని గుర్తుచేస్తున్నాము. సుమారు 10 రూపాయలు దీనికి వ్యయము అవుతుంది.

అయితే చాలామందికి విషయం చదవాలన్న ఆసక్తేగాని, M.O., ఫారమ్ తిరిగి పంపించడం మరచిపోతున్నారు. అలాంటివారికి విధిలేని పరిస్థితిలో పత్రికను పంపలేకపోవడం మాకెంతో బాధనిస్తుంది. ఈ బాధ మీరే తొలగించగలరు. మీరు మీ సభ్యత్వాన్ని పునరుద్ధరించుకొని, మాకు సహకరించి, ప్రోత్సహించవలసినదిగా కోరుచున్నాము.

మా సేవలను త్వరితగతిన మీకు అందించుటకు మాతో జరుపు ఉత్తర ప్రత్యుత్తరములలో మీ సభ్యత్వ సంఖ్యను, ప్రస్తుత చిరునామాను, పిన్‌కోడ్ నెంబరుతో ఉదహరించండి. మీ విలువైన అభిప్రాయాలనుకూడ నాలుగైదు వాక్యాలకు మించకుండా తెలియ జేయగలరు. మీ ఈ విషయజిజ్ఞాస, సంప్రదాయాభిలాష సదా పెంపొందాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాము.

జై శ్రీమన్నారాయణ!

శ్రీకార్యం
**భక్తినివేదన**

C/o. **జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్,**
సీతానగరం, తాడేపల్లి (మం) గుంటూరు (జిల్లా) - 522 501. ✆ **: 08645-72929,72353.**
*E-mail* : bhakthinivedana@yahoo.co.in *Internet* : www.chinnajeeyar.org

సంపాదకీయం

# నరులు నాలుగు విధాలు

లోకంలో మనుషులు చదువునుబట్టి, స్వభావాన్నిబట్టి, సంస్కారాన్ని బట్టి చాలా రకాలుగా ఉంటారు. చదివినవారు కొంత మంది. చదువుకోనివారు పెక్కుమంది. ఋజువర్తనులు కొందరు. శఠులు కొందరు, మూర్ఖులు కొందరు. రెండు మూడు రకాల తత్త్వాలవారు కొందరు. వారివారి స్వభావాన్ని బట్టి, సంస్కారాలను బట్టి నరుల్ని నాలుగు రకాలుగా వర్గీకరించి వారి ఆధిక్య న్యూనత్వాలను నిరూపిస్తున్నాడు నీతికారుడు.

**విద్వాన్ ఋజుః ప్రధానః**
**విద్వాంశ్చ శఠశ్చ మధ్యమః పురుషః**
**మూర్ఖ ఋజుశ్చ తృతీయః**
**సర్వ జఘన్యస్తు మూర్ఖ శఠః**

ఒక రకం మనుషులుంటారు. వీళ్ళు ఋజుస్వభావులు. త్రికరణాలా అంటే మనసా, వాచా, కర్మణా ఏకరూపంగానే ఉంటారు. వీరిలో కౌటిల్యం ఉండదు. అంతా విశదంగా ఉంటుంది. ఋజుస్వభావాన్నే ఆర్జవంఅంటారు. మాయలుండవు, మర్మాలుండవు. తెరలుండవు, పొరలూ ఉండవు. చాటుమాటు లుండవు. మనుషుల్లో ఋజుస్వభావులుంటారు. కానీ, చాలా అరుదుగా.

ఈ ఆర్జవానికి తోడు వీరు విద్యావంతులు కూడా అయితే బంగారానికి పరిమళమబ్బినట్టే. ఋజుస్వభావుడైన విద్వాంసుడు మానిసులలో పరమశ్రేష్ఠుడు. అయితే, వీరిని అంచనా వెయ్యడంలో మట్టుకు ఏమరకూడదు. ఋజుస్వభావుడు విద్వాంసుడు కావచ్చును. కాని, విద్వాంసులల్లా ఋజుస్వభావులు కావాలనిమట్టుకు లేదు. మీదు మిక్కిలి వారి విద్వత్తు వారిని వంచనా శిల్పాభిరాములుగా చెయ్యదని లేదు. సామాన్యుడు ఆర్జవం అభినయించలేడు. విద్వాంసుడికి భావగోపనం వెన్నతో పెట్టిన విద్య. తన మనసున లేని భావాన్ని మొగాన ప్రస్ఫుటంగా కనబరచటం, మాటల్లో చేతల్లో దాన్ని నిసర్గరమణీయంగా అభినయించడం హేలగా అవలీలగా చేయగలశక్తి కలవాడు. అంచేత, ఋజువర్తనుడైన విద్వాంసుణ్ణి గుర్తించడం పట్టుకోవటం చాలా కష్టం. నూటికి ప్రశ్నే లేదు. కోటికొక్కడు ఉంటాడేమో చూడాలి. ఇదిగో ఈ ఋజు విద్వాంసుడు నరులలో ఉత్తమోత్తముడు. ప్రథమగణ్యుడు.





రెండోరకంవాడు - వీడు శఠుడు. వెనకటివాడికి పూర్తిగా వ్యతిరేకం వీడు. నోటితో పలకరిస్తూ నొసలితో వెక్కిరించేవాడు వీడు. చాటుగా చెరువు చేసేవాడు శఠుడు. వీడికి చదువూ అబ్బింది. చదువువల్ల గణ్యత, మాన్యత, కానీ, శాఠ్యమో! అది కిందికి లాగుతూ ఉంటుంది. అపకారాలు కాదు కాని అప్రియాలు చేస్తాడు వీడు. అదీ తాను బయట పడడు, చాటుమాటు వ్యవహారం. దీని వల్ల మనసుకు కాస్త అప్రీతి కలుగుతుంది. ప్రమాదమేం ముంచుకు రాదు. సమాజంలో చాలా ఎక్కువగా కనవస్తూంటారు ఇట్లాంటి వారు, వీరు నరులలో మధ్యములు.

మరోడున్నాడు - ఋజువర్తనుడే, కాని మూర్ఖుడు. ఆర్జవం వల్ల కలిగే మంచినంతా ఈ మూర్ఖత్వం కబళించేస్తుంది. ఆర్జవం ఎంతో గొప్పగుణం. ఎక్కడో కాని కనరాని గుణం. వీడిలో అది ఉంది. ఎంత గొప్ప! కాని లాభమేమిటి?! వీడు మూర్ఖుడాయె. కొరగాని ఆర్జవం వీడిది. అంతేకాదు, చేటు చేకూర్చేదీని. ఒకణ్ణి పాతేయాలి - మనసులో అనుకున్నాడు. వాణ్ణి పాతేస్తాను. మాట అన్నాడు. పాతేసేడు. వీడి ఆర్జవం కూల! ఇట్టాంటి ఆర్జవం స్పృహణీయమా! ఆర్జవం గుణమే అయినా మౌర్ఖ్యం దాన్ని మలినపరుస్తోంది. వీడు మూడో తరగతివాడు నరులలో.

నాలుగో రకంవాడు. వీడు మూర్ఖుడూ, శఠుడూ కూడాను, కేవల శఠుడు చేసే విప్రియాలు తట్టుకోవచ్చు. మూర్ఖశఠుడు చేసే విప్రియాలు ప్రాణాంతకాలుగా ఉంటాయి. వీడికి ఆర్జవం లేదు, విద్యాలేదు. ఉన్నరెండూ మనిషిని భ్రష్టుపట్టించే దుర్గుణాలే - మౌర్ఖ్యం. శాఠ్యం. అంచేత ఈ మూర్ఖశఠుడు పరమనీచుడు. సమాజంలో మనుగడ సాగిస్తున్నవారు ఇవన్నీ తెలుసుకోవాలి.

-శ్రీరామచంద్రాచార్య

# తేనెవాక

## శ్రీ తిరుమఴిశైయాళ్వార్ - నాన్ముకన్ తిరువన్దాది

'మధురవాక్ శిఖామణి', 'భాగవతామృతవర్షి'
శ్రీ.ఉ.వే.ప్ర.శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్యస్వామి, సింహాచలం

భగవంతుని నామమును ఒకవేళ మరచిపోయినా కూడ ఇతరదేవతలను కొలువనివారు. అని. అనగా భగనానుని యందు విశ్వాసము సడలితేనే కదా ఇతరులను ఆశ్రయించవలెనను బుద్ధి కలిగేది. నిజమునకు భగవానుడే రక్షించలేకపోతే ఇక రక్షించగలిగిన వారు ఇతరులు ఎవరు కలరు?

ఇచ్చట **"త్వయిరక్షతి రక్ష కైః కిమన్యైః, త్వయిచారక్షతి రక్షకైః కిమన్యైః"** "పరమాత్మా! నీవే నన్ను రక్షించవలెనని సంకల్పించినపుడు నీ దయాదత్తమైన పదవులను, శక్తిని గల ఇతర దేవతలను ఆశ్రయించవలసిన అవసరము ఏమి కలదు? ఒకవేళ నీవే నన్ను రక్షించను అని నిర్ణయించుకొనినపుడు అల్పశక్తిని కలిగి నీ అనుమతి లేక ఏ పనినీ స్వతంత్రముగా చేయజాలని ఇతర దేవతలను ఆశ్రయించి ఏమి ప్రయోజనము" అనుశ్రీవేదాంత దేశికుల సూక్తి స్మరణీయం.

ఇది భగవానుని యందు విశ్వాసమున్న వారి స్థితి. నిజమునకు మనము ఎవరెవరిని రక్షకులని భ్రమించుచుందుమో వారందరికీ ఆపదలు సంభవించునపుడు ఆ ఆపదలను తొలగించి ఆయాదేవతలను కూడ కాపాడువాడు శ్రీమన్నారాయణుడే కదా! కనుక అట్టి భగవానుని ఆశ్రయించినవారికి ఇతరులను ఆశ్రయించవలసిన అవసరమే మున్నది. **"మహావిశ్వాసపూర్వకమ్"** అని ప్రపత్తికి ఆవశ్యకమైనది ఇట్టి మహావిశ్వాసమే కదా! భగవద్భక్తుల ఇట్టి స్వభావమును పూర్తిగా అర్థము చేసుకొనలేనివారు కొందరు వీరిని ఇతరదేవతలయందు ద్వేషము కలవారని భావించి నిందించుటను చూచుచున్నాము.

కాని **"సమమతి రాత్మసుహృద్విపక్ష పక్షే"** అనినట్లు అందరియందూ సమభావనను చేయు ఈ భక్తులనట్లనుకొనుట అపచారమే కాగలదు. ఇట్టి భక్తులు ఇతరుల నాశ్రయించకపోవుట వారియందు ద్వేషముచే కాదు. వారలనాశ్రయించవలసిన ఆవశ్యకత లేకపోవుట, తమ స్వరూపమునకు తగనిదై యుండుట చేత మాత్రమే. భగవంతుని ఆశ్రయించినవారు అనగా శరణుపొందినవారి స్వభావము ఒక పతివ్రత యొక్క స్వభావము వంటిది. పతివ్రతయగు స్త్రీ తన భర్తనే ప్రేమించుచూ ఆతడి కొరకే జీవించును. తన భర్తతో సమముగ వేరొక్క పురుషుని తలంచుట కాని, ఆశ్రయించుట గాని చేయదు. అంతమాత్రమున ఆమె ఇతర పురుషులను ద్వేషించునని కాని, దూషించునని కాని అర్థము కాదు కదా! అట్లే ప్రపన్నుడగు భగవద్భక్తుని స్థితి కూడ ఇట్టిదే. ఇట్టి స్వభావమునే యమధర్మ రాజు **"భగవత్ప్రపన్నాః"** అని, ఆళ్వార్లు మరచిపోయి కూడ **"ఇతరులను కొలువని వారు"** అని వ్యాఖ్యానిస్తారు. అట్టి భక్తులను శాసించుటకు కాని, దండించుటకు కాని మనము శక్తులము కాము. **"తాన్ నోపసీదత హరేర్గదయాభిగుప్తాన్"** శ్రీమన్నారాయణుని గదాదండము చేత సదా రక్షింపబడు చుండుట వలన వారి సమీపమునకు వెళ్ళవలసి వస్తే **"ఇత్తై ఇఞ్జియుమ్ సాతువరాయ్ పోతుమిన్గళెన్రాన్"** నమస్కరించుకొనుచూ వినయవిధేయతలతో వెళ్ళుడు అని తెలుపు చున్నాడట యముడు. కనుకనే ఇట్టి





భాగవ తోత్తముల వైభవమును **'అవన్ తమ ఎవ్వినైయ రాకిలుమ్ ఎఞ్జోనవన్ తమరే యెన్రొఴివతల్లార్ నమన్దమ రాలాఴ్గాయప్ప ట్టరియార్కణ్డీర్'** ఆ భగవానుని భక్తులు ఎంత పాపమును చేసినా వారు సమస్త జగచ్ఛాసకుడగు పరమాత్మ యొక్క దాసులు అగుటచేత వారిని విడచిపెట్టెదరే తప్ప యమదూతలు వారి గుణదోషములను గూర్చి విమర్శించనొల్లరుసుమీ' అని **శ్రీ సరోయోగి** తమ ప్రబంధమునందు తెలియజేస్తారు. ఇక **శ్రీ తొండరడిప్పొడియాళ్వార్** కూడా తమ **తిరుమాలై** అను ప్రబన్ధమునందు **'నావలిట్టుఴి తరుకిన్రోమ్ నమన్దమర్ తలైగళ్మీదే'** యమభటుల శిరసులపై పాదములుంచి నడువగలిగిన వైభవముకల భగవద్భక్తులము మేము అని అంటారు.

ఇట్టి భాగవతోత్తముల వైభవమునకు **'మృత్యోర్మూర్ధ్నిపదందత్వా'** అను ధ్రువుని స్థితియే ఉదాహరణము. శ్రీమద్భాగవతము నందు అజామిళోపాఖ్యానమున ఇట్టి భక్తుల వైభవము సాక్షాత్తుగ యముని చేతనే తన భటులకు తెలుపబడుటను ఈ విషయమున స్మరించవచ్చును. దీనినే పోతన భాగవతములో చాల అందముగా 'వారి, వారివారి, వారిజేటినవారి త్రోవ పోవవలదు దూతలార' అనిఅట్టి భక్తుల సంబంధి సంబంధులజోలికి కూడ వెళ్ళరాదని తన దూతలకు తెలుపుచున్న యముడు ఇక నెట్టివారిని తన వద్దకు తీసుకొని రావలెనో కూడ ఇలా తెలియజేస్తాడు.

**జిహ్వా న వక్తి భగవద్గుణ నామధేయం,**
**చేతశ్చ న స్మరతి తచ్చరణారవిన్దం।**
**కృష్ణాయ నోనమతి యచ్ఛిర ఏకదాపి**
**తానానయధ్వమసతోఽ కృత విష్ణు కృత్యాన్॥**

'పరమహంసలచేత అనవరతము ఆస్వాదింపబడు భగవంతుని దివ్య చరణారవిందములనుండి స్రవించు మకరందమును నా స్వాదించుట యందు విముఖులగువారిని, ఎకసక్కెమునకైనా ఇందిరా రమణుని నామమును నోటితో పలకనివారలను, పాఱపాటున కూడా భగవంతుని దివ్య పాదారవిందమును స్మరించనివారలను, పాఱపాటున కూడా భగవంతుని పాదారవిందముల మ్రోల తమ శిరస్సును వంచని వారలను వారి సంబంధి సంబంధి సంబంధులను నా సన్నిధికి తోడ్కొని రండు' అని తన భటులకు యమధర్మరాజు తెలియజేస్తాడట. మలయ పర్వతమందు భగవానుని ఆరాధించుచున్న అగస్త్యమునీంద్రుడు ఈ విషయమును తెలిపెనని శ్రీమద్భాగవతము నందు వర్ణింపబడినది.

ఇట్లు భగవద్భక్తుల వైభవము ఈ ఆళ్వార్ల పాశురమునందు సువ్యక్తముగ తెలియజేయబడినది. ఇట్టి భక్తుల పాదధూళిని యమధర్మరాజే తన శిరసున దాలుస్తాడనుట వీరి వైభవము వేనోళ్ళ చాటుచున్నది. దాశరథిశతకమున ఈ విషయమునే రామదాసు అనబడుగోపన్న చాలా అందముగా తెలియజేస్తాడు. **'పరమదయానిధే! పతితపావన నామ! హరే! యటంచు సుస్థిరమతులై సదా భజన చేయు మహాత్ముల పాదధూళి నా శిరమున దాల్తు మీరటకు చేరకుడంచు యముండు కింకరోత్కర ముల కానబెట్టునట దాశరథీ కరుణాపయోనిధీ'** పై ఆళ్వార్ల పాశురమును, విష్ణు పురాణము చరితమును మనసున నుంచి కొని శ్రీవైష్ణవ దాసుడగు రామదాసు తెలిపిన పద్యము ఈ భాగవత వైభవమునే వేనోళ్ళ తెలుగులకు చాటుచున్నది.

ఇట్టి భక్తిసారుల దివ్య ప్రబంధము నందు ఏ పాశురము స్పృశించినా అందుండి జాలువారు **తేనెవాక** ఎన్నెన్నో ఇతిహాస పురాణఘట్టములను మన స్మృతి పథము లోనికి తెచ్చును.

# శ్రీవైష్ణవ (విష్ణు భక్తుల) లక్షణాలు

- శ్రీ ఉ.వే.ప్ర. శ్రీమాన్ విద్వాన్ : కలువకుంట కృష్ణమాచార్యులు, మెట్‌పల్లి.

ఎంతో దుర్లభమైన 'మానవజన్మ' మనకు లభించినందున, మనము దీనిని సద్వినియోగం చేసుకొనవలసియున్నది. ఇందుకు - భగవద్భాగవత - ఆచార్య- కటాక్షం కూడ అవసరమే. పరమకారుణ్యమూర్తి అయిన భగవంతుడు, తాను అంతర్యామిగా వుంటూ, ఆయా సందర్భాలలో, అవతారాల ద్వారా, ఋషుల ద్వారా, పురాణ - ఇతిహాస ములద్వారా- మహాత్ములద్వారా, మరియు పూర్వాచార్యులద్వారా - మానవులు తరించే మార్గాన్ని నిర్దేశిస్తూ - అనేక విధాలుగా చేతనుల నుద్ధరించే ప్రయత్నం చేస్తూనే వున్నాడు.

అనేక జన్మల కర్మవాసనల వల్లను, మాయా విమోహిత సంసార బంధము వల్లను, మానవులు - తమ నిజస్వరూపాన్ని తెలిసికొనుటలోను, జన్మ లక్ష్యాన్ని సాధించుటలోను పూర్తిగా సఫలత జెందలేకపోవుచున్నారు. దీనికి నిరంతరం ప్రయత్నం (సాధన) జరుగుతూనే ఉండాలి. మరచిపోవుచున్న లక్ష్యాన్ని - మంచిమార్గాన్ని, మళ్ళీ - మళ్ళీ జ్ఞాపకం చేసుకోవటం తప్పనిసరి - అని భావించాలి.

కొందరికి, సదాచార్యులు లభించుట వారి అదృష్టం! వారి సత్సాంగత్యం వల్ల తరించే అవకాశం అధికంగా వుంటుంది. అయినా ప్రయత్నమంటూ చేయాలిగదా! మనం రోజూ వాడుకొనే, ఆయా పాత్రలను రోజూ కడుక్కోవాలి. పరిశుభ్రం చేస్తూనే ఉండాలి. ఏ ఒక్కరోజు మానివేసినా - మురికి, వాసన పడుతుంది. మన శరీరం, నోరు- పళ్ళుకూడ అంతేకదా! అలాగే మానసిక శుద్ధి రోజూ చేసుకోవాలి.

కావున, ఆయా సందర్భాలలో - ఇంతకు పూర్వం - కొన్ని సార్లు 'విష్ణుభక్తుల'లక్షణాలను మనం వినియున్నప్పటికి, విశేషంగా 'స్కాంద పురాణం' బోధించిన 'వైష్ణవ లక్షణాలు' కొంత విశిష్టమైనవిగా కనబడుచున్నవి. వాటిని తెలిసికొని, మనముకూడ- తగిన యోగ్యతను సంపాదించుటకై ప్రయత్నం చేద్దాం.

**ప్రశాంత చిత్తాః సర్వేషాం సౌమ్యాః కామజితేంద్రియాః।**
**కర్మణా మనసావాచా పరద్రోహ మనిచ్ఛవః॥**
**దయార్ద్ర మనసోనిత్యం స్తేయ హింసా పరాంగుఋ్ముఖాః।**
**గుణేషు పరకార్యేషు పక్షపాత ముదాన్వితాః॥**
**సదాచారా వదాతాశ్చ పరోత్సవ నిజోత్సవాః।**
**పశ్యంతం సర్వభూతస్థం వాసుదేవ మమత్సరాః॥**
**దీనానుకంపినో నిత్యం భృశం పరహితైషిణః।**
**విషయేష్వవివేకీనాం యాప్రీతిరుపజాయతే॥**

**- స్కాందపురాణం**

ఎవరిచిత్తము, స్థిరంగా - ప్రశాంతంగా వుందో, స్వ - పర- భేదంలేక, అందరియందు సమానమైన - సరళభావం వుందో, ఎవరైతే - తమ ఇంద్రియ చపలత్వాన్ని అదుపుజేసి, వాటిపై విజయం సాధించారో, మరియు మనస్సుతో, వాక్కుతో, శరీర (కర్మ)ముతో - ఏనాడూ పరులకు అపకారం (ద్రోహము) తలపెట్టరో; ఎవరైతే - ఎల్లవేళలా దయతో నిండిన కోమల హృదయం కలవారో; మరియు - ఎవరైతే పరద్రవ్యమును అపహరించుట, పరులను హింసించుట - వంటి దుర్గుణములకు దూరంగా ఉంటారో సద్గుణ సంపత్తితో, మానవత్వపుష్టికొఱకు ప్రయత్నిస్తారో, స్వ - పర - భేదం చూపక, ఇతరుల సత్కార్యములందు, ఉత్సాహంతో సహకరిస్తూ సేవ చేస్తారో, సదాచార నిష్ఠ - శ్రద్ధా భక్తులతో - తమ నిత్యజీవితాన్ని కళంకం లేని - అభివృద్ధి మార్గంలో నడిపిస్తారో, పరుల సుఖ-సంతోషాలను-తమ సుఖసంతోషాలుగా

11/
bnmay02.p65



పరిగణిస్తారో, సర్వప్రాణుల యందు అంతర్యామిగా నున్న - శ్రీమన్నారాయణుని చూస్తూ - ఈర్ష్య - ద్వేషములు లేనివారై, సర్వప్రాణులయందు - ప్రేమగల్గి, భగవత్సేవగా - సకల ప్రాణుల హితము కోరి - సేవజేస్తారో; దీనుల యందు దయ - పెద్దలయందు - ఆదరభావంకల్గి యుంటారో, వీలైనంత వరకు, హితం చేకూర్చుటకై- పరోపకారం చేస్తుంటారో, మరియు 'అజ్ఞానులకు భోగలాలసతయందు ఎలాగైతే ఆసక్తి వుంటుందో అలాగే- భాగవతోత్తములకు - ఆచార్యులకు సేవ జేయుటయందు ఆసక్తి కల్గియుంటారో, వారే సజ్జనులుగా, విష్ణు భక్తులుగా చెప్పబడుతారు.

అనగా - సద్గుణ సంపత్తి - భగవద్భక్తి - ఆచార్యనిష్ఠ కలిగియున్నవారినే 'విష్ణు భక్తులుగా' (వైష్ణవులుగ) పరిగణింప వచ్చునని, మనకు స్కాందపురాణం బోధిస్తున్నది.

కాని, మనలో చాలమంది -కేవలం జన్మ వల్లగాని, వంశానుగతంగా గాని- పూర్వీకులు అవలంబించిన సంప్రదాయాన్ని అనుసరించి గాని, లేక - దేశ - కాల పరిస్థితుల రీత్యా- అనుకూలంగా - లాభ ప్రదంగా వున్నందువల్ల గాని- వైష్ణవులము (విష్ణుభక్తులము) అని చెప్పుకొంటున్నాము. అలాచెప్పుకోవటానికి తగిన - సదాచారము అవలంబించినపుడే - పంచసంస్కారములు పొందినపుడే, మనము నిజమైన విష్ణుభక్తులము- లేక వైష్ణవులము కాగలము కావున - సహజమైన సద్గుణ వంతులై - సదాచారవంతులైన వారే- నిజమైన విష్ణు - భక్తులు కాగల్గుదురు. మరియు

**దృషది పరధనేచ లోష్టఖండే**
**పరవనితాసుచ కూటశాల్మలీషు।**
**సఖిరిపు సహజేషు బంధువర్గే**
**సమమత యఃఖలు వైష్ణవాః ప్రసిద్ధాః॥**

**గుణగణ సుముఖాః పరస్య**
**మర్మాచ్ఛదన పరాః పరిణామ సౌఖ్యదాహి।**
**భగవతి సతతం ప్రదత్త చిత్తాః**
**ప్రియ వచసఃఖలు వైష్ణవాః ప్రసిద్ధాః॥**

**స్ఫుట మధుర పదంహి కంసహంతుః**
**కలుషముషం శుభనామ చామనంతః।**
**జయ జయ పరిఘోషణాం రటంతః**
**కిమువిభవాః ఖలు - వైష్ణవాఃప్రసిద్ధాః॥**

**హరిచరణ సరోజయుగ్మచిత్తా జడిమధియః**
**సుఖ దుఃఖ సామ్యరూపాః।**
**అపచితి చతురా హరౌ నిజాత్మన్**
**నతవచసః ఖలు వైష్ణవాః ప్రసిద్ధాః॥**

**విగలిత మదమాన శుద్ధ చిత్తాః**
**ప్రసభవినశ్య దహం కృతి ప్రశాంతాః।**
**నరహరి మమరాప్త బంధుమిష్ట్వాక్షపిత**
**శుచఃఖలు వైష్ణవాః ప్రసిద్ధా॥**

**- స్కాందపురాణం**

ఎవరైతే, పరధనాన్ని - రాయిగా - మట్టి పెళ్ళగా భావిస్తారో, పరస్త్రీని- 'కూటశాల్మలి' యనబడు- ఘోరనరక సమానంగా చూచి, దూరంగా వుంటారో, మిత్రులు - శత్రువులు, పరులు - తనవారు, పుత్రులు- సోదరులు, మొదలగు వారందరి యందు సమభావన గల్గియుంటారో - అలాంటివారే విష్ణుభక్తులు లేక - వైష్ణవులుగా పరిగణింపబడుదురు. ఇతరుల సద్గుణములను గుర్తించి - వారిని గౌరవిస్తారో, పరుల దోషములున్నచో - బయట పెట్టక - మౌనంగా వుంటారో, ఎల్ల వేళలా ఇతరులకు సుఖసంతోషాలు కల్గించే ప్రయత్నం చేస్తారో, మరియు భగవచ్చరణార విందములందు మనస్సు వుంచి - అందరితోను ప్రియవచనాలు పల్కుచుంటారో - వారే వైష్ణవులుగా పరిగణింపబడుదురు.

కంసాంతకుడును, పాపవిమోచనుడైన శ్రీహరి నామసంకీర్తనం చేస్తుంటారో, జై శ్రీమన్నారాయణ! జై శ్రీరామ! యని ఉత్సాహంతో హరినామ స్మరణ చేస్తుంటారో- అలాటి నిర్మలాత్మలైన వారే వైష్ణవులుగా పరిగణింపబడుదురు. మరియు

శ్రీమన్నారాయణుని పాదపద్మము లందు నిరంతరం భక్తి కలిగి వుంటూ - పారవశ్యంతో - దేహాభిమానాన్ని విడచిపెట్టి- జడునివలె కనబడువారును, సుఖ-దుఃఖాలలో తేడా తెలియక నిర్వికారులై సమభావనతో వుండువారు, మరియు భగవంతుని యొక్క పూజ, అర్చనాదులలో శ్రద్ధా- భక్తులు గల్గినవారై - వినయ విధేయతలు గల్గి - మనోవాక్కాయ కర్మలు, భగవదర్పితంగా- చేయుదురో, **వారే వైష్ణవులనబడుదురు.**

ఎవరికైతే - దేహాభిమానం - విద్యామదం, ధన మదం-అధికారమదం మొదలగునవి, విడిపోయి, నిర్మలమైన అంతఃకరణము గలదో మనో మాలిన్యం తొలగి, అహంకార - మమకారములు క్రమక్రమంగా తొలగి పోవుచు, సాత్త్వికగుణం అలవడు తుందో, మరియు-ఎల్లవేళలా పరమ శాంత స్వభావం కల్గియుంటారో, ముక్కోటి దేవతలకు కూడా ప్రభువైన శ్రీహరిని సర్వదా సేవించుచు సుఖ - దుఃఖాల నుండి ముక్తులైనారో, వారే **వైష్ణవులు**గా కీర్తింపబడుదురు. అట్టివారే తమ జన్మను సార్థకము జేసికొని, పరమోత్కృష్ట పదమును పొందగల్గుదురు.

సర్వేశ్వరుడు, మోక్షప్రదాతయైన- శ్రీవిష్ణు భగవానుడు, తనను నమ్మి స్మరించువారికి, ఇహలోక సుఖమును కూడ వారివారి యోగ్యతల ననుసరించి ప్రసాదించగలడని, మనకు శ్రీవిష్ణుసహస్రనామ ఫలశ్రుతివల్ల కూడ తెలుస్తుంది. ముఖ్యముగా మానవులు కర్మ బంధములో చిక్కుకొని, జనన - మరణాది దుఃఖములతో పరితపించువారిని ఉద్ధరించుటకై, తన భక్తులుగా తీర్చిదిద్ది సంసార బంధమునుండి విడిపించు టకై, యుగయుగాలుగా ఎన్నోవిధాలుగా ప్రయత్నిస్తూనే వున్నాడు. ఇందుకు, రామకృష్ణాద్యవతారముల ద్వారా, వేదములు, శ్రుతులు స్మృతులు పురాణములు ఇతి హాసములు భగవద్గీత వంటి సద్గ్రంథముల ద్వారాను ఋషులు, మహాత్ములు, పూర్వా చార్యులు భగవద్రామానుజుల వంటి తత్త్వ దర్శకుల ద్వారా, మానవాళికి తగిన కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తి మార్గములను ఉపదేశింప జేయు చున్నాడు.

ఈ మధ్యకాలంలో శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెద్దజీయరు స్వామివారు కూడ నాల్గుదశాబ్దములు ఆసేతు - హిమాచలం వరకు భక్తి- జ్ఞానము లను ప్రబోధించి, వేలాది జనులకు సదాచార్యులై తరణోపాయము జూపిరి.

నేటి - కలికల్మషకాలంలో - భగవత్స్వరూపులైన శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామివారు, 'విష్ణుభక్తి'ని విశ్వవ్యాప్తముగా ప్రబోధిస్తూ సకల మానవాళికి సమభావంతో తరణో పాయం చూపిస్తూ నిర్విరామ కృషిచేస్తూనే ఉన్నారు. ఈ కాలంలో శ్రీశ్రీశ్రీ స్వామివారి సత్సాంగత్యం లభించడం వర్తమాన కాలంలోని సర్వజనుల అదృష్టం! అనుకోవాలి. భగవదాజ్ఞగా వారు చేపట్టిన వివిధ భక్తిప్రబోధ కార్యక్రమాలు అమోఘ మైనవిగా ప్రాచుర్యం పొందుటయే గాక- లక్షలాది జనులలో విశిష్టమైన చైతన్యం వెల్లివిరిసి 'వికాసతరంగిణి'గా ఊరూరా 'విష్ణుభక్తి' వికసించి విరాజిల్లుచున్నది. ఇలాంటి మహాత్ముల ప్రబోధాలను ఆచరణ లో పెట్టి - మన జన్మను సార్థకం చేసుకోవడం తక్షణ కర్తవ్యంగా భావించాలి.

పెద్దలు జెప్పిన సన్మార్గము నవలంబించి ఇక నైనా మనం నిజమైన విష్ణుభక్తులము (వైష్ణవులము) అయ్యి తరించుటకై ప్రయత్నం చేద్దాం.





గమనిక : అనివార్య కారణాలవల్ల, **శ్రీమహావిష్ణుపురాణము, భగవద్రామానుజ చరిత్ర, ఇతిహాసబోధ** శీర్షికలను ప్రచురించలేకపోవుచున్నాము.

- ఎడిటర్



- చెవ్వటూరి కుసుమ కుమారి, విజయవాడ

**సుందరే సుందరో రామః సుందరే సుందరీ కథా,**
**సుందరే సుందరీ సీతా సుందరే సుందరం వనమ్**

శ్రీరాముడు సుందరుడు. సీత సుందరి. కథ సుందరమైనది. వనం సుందరం.

**సుందరే సుందరం కావ్యం సుందరే సుందరః కపిః**
**సుందరే సుందరం మంత్రం సుందరే కిం న సుందరమ్?**

కావ్యం సుందరం, రామమంత్రం సుందరం. హనుమంతుడు సుందరుడు. యింక రామాయణంలో సుందరం కానిదే మున్నది! సర్వాంగ సుందరం ఈ వాల్మీకి రామాయణములోని సుందరకాండ.

శ్రీహరి శ్రీరామచంద్రుడై పుడమిన ప్రభవించగా, రామచరణం నాకు శరణం అంటూ దాసోహం చేసిన హరిసత్తముడు (వానరుడు) హనుమ. అనన్య వీర-సుందర రసరమ్య కావ్య భాగం ఈ సుందరకాండ.

మంత్రపుష్టము, భక్తి నిష్ఠము, సర్వార్థ సాధకము అని ఆర్యులు, గురువర్యులు వక్కాణించిన సీతాసుందరి మహచ్చరిత మును నా చేత అక్షరం చేయించుకొని, అల్పప్రాణి అయిన ఉడుతమీద వాత్సల్యం లాంటి వాత్సల్యదృష్టి నామీద పరపిన ఆ దయాసింధు దాశరథిని, ఆ పాలకడలి అలల తరగల తేలియాడిన మీగడ తరక పోలిన మనస్సు కలిగిన పుడమి జాత సీతమ్మను మనసా దర్శించమని నలుసంత జ్ఞానాం జనాన్ని నా నేత్రాలకు పెట్టిన ఆత్మ గురువు అంజనాసుతుడు సుందరుడు, హరివరుడు అయిన హనుమంతునికి శిరసిగురు అని శిరసా అంజలి ఘటిస్తున్నాను భక్తినివేదనగా.

### వాయు సుతుని
### సాగరలంఘనం-సింహికావధ-లంకాప్రవేశం

**తతో రావణ నీతాయాః సీతాయాః శత్రుకర్శనః**
**ఇయేష పదమన్వేష్టుం చారణాచరితే పథి**

శత్రు సంహారకుడైన హనుమంతుడు జాంబవదాదుల చేత ప్రచోదితుడై, రావణుడు అపహరించిన రామపత్ని సీతను వెదుకుటకై, దేవతలు, సిద్ధులు, చారణులు సంచరించు ఆకాశమార్గమున ప్రయాణించుటకు నిశ్చ యించుకొనినాడు. మహాబలశాలి, ధీరుడూ అయిన హనుమ మహేంద్ర పర్వతము మీది పచ్చిక బయళ్ళలో అతి వేగముగా అటునిటు తిరుగుచుండగా పక్షులు భయముతో వణికిపోయినవి. కొన్ని జంతువులు భీతితో మరణించినవి. అప్పుడు మహేంద్రగిరి పాదమునున్న సరస్సులోని మదించిన ఉత్తమ గజంలా హనుమ ప్రకాశించాడు.

కొంత వడికి బుద్ధిశాలి అయిన ఆ వాయు పుత్రుడు నిశ్చయమనస్కుడైనాడు. సృష్టికర్త





అయిన బ్రహ్మకు, దేవరాజైన ఇంద్రునకు, జగత్సాక్షి సూర్యునకు, సర్వభూతగతి అయిన వాయుదేవునకూ, సమస్త భూతములకూ కూడ నమస్కరించినాడు. తరువాత తూర్పుదిశకు తిరిగి తనకు జన్మకారకుడైన వాయుదేవునకు అంజలి ఘటించి, దక్షిణ దిక్కునకు వెళ్ళుటకు సంసిద్ధుడై పూర్ణిమా చంద్రుని చూచి సముద్రుడుప్పొంగి పెరిగి నట్లుగా రఘువంశ సుధాంబుధి చంద్రుడైన రామచంద్రుని కార్యసాధనకై తన శరీరమును మహోన్నతంగా, కొలతకందనంతగా పెంచినాడు హనుమ.

సాగరాన్ని లంఘించ తలచిన హనుమ **"బాహుభ్యాం పీడాయామాస చరణాభ్యాంచ పర్వతమ్"** ఆ మహేంద్రగిరిని పాదాలతోనూ, చేతులతోనూ నొక్కిపట్టగా ఒక్కక్షణకాలమా గిరి కంపించినది. ఉన్నత వృక్ష శిఖరాగ్రాల నుండి కుప్పతెప్పలుగా విరులురాలి పర్వత మును కప్పివేయగా మహేంద్రగిరి, పుష్ప గిరిలా భాసించినది. ఆ మహాకపి బాహుపీడో ద్ధతికి మత్తకరిమదోదకం స్రవించినట్లు ఆ గిరి జలపాతాలు ఉవ్వెత్తున జలాన్ని ఉద్ధూతం చేసాయి.

**ముమోచ చ శిలాః శైలో విశాలాః సమనః శిలాః**
**మధ్యమేనార్చిషా జుష్టో ధూమరాజీరివానలః**

అగ్నికీలలు ఏడు విధములు, కాళి, కరాళి, విస్ఫులింగిని, ధూమ్రవర్ణ, విశ్వరుచి, లోహిత, మనోజవ. అటువంటి సప్తాగ్ని కీలలో మధ్యమజ్వాల అయిన ధూమ్రాగ్ని (దానికే అర్చిషా అని పేరు) జ్వాల వలె ఆ పర్వతము నుండి మణిశిలలు ఎగసిపడ సాగినవి. ఆ పర్వతము క్రిందపడి నలుగు చున్న ప్రాణుల ఆర్తనాదము ధరణీతలాన్ని, దిక్కులనూ, అడవులనూ ప్రతిధ్వనించినది.

ఆ గిరినిండా మహాసర్పములు, విషసంహారక ఔషధులు కూడా మిక్కిలిగా వున్నవి. కాని తలలమీద నల్లని గుర్తులు గల మహాసర్పములు భీతిల్లి శిలలను కోరలతో కొరికి విడిచిన భయంకర విషకీలలను ఆ ఔషధులు ఏ మాత్రమూ శాంతింప చేయజాలకున్నవి. ఆ విషాగ్నికి మహామహా శిలలు వేలవేల ముక్కలుగా బ్రద్దలైపోసాగినవి.

ఏవో మహాభూతములు ఈ గిరిని భిన్నం చేయుచున్నవని భావించిన ఋషులు మున్ముందుగా పైకి ఎగిరినారు. అప్పటి వరకు అనేక భక్ష్యములను, మద్యాది అనేక పానీయములను, బంగారు పళ్ళెర ములో వడ్డించుకొని విలాసముగా స్వీక రించుచున్న విద్యాధరులు తాము ఆసీను లైన వృషభాది చర్మాసనములను, బంగారు పిడులుగల ఖడ్గములను కూడ అక్కడనే వదలివేసి తమ ప్రియురాండ్రతో కూడి ఆకాసానికి ఎగిరిపోయి నిలచినారు.

కంఠమున కనకసూత్రములతో, శిరసున ఎర్రని మాలికలతో, హారములు, నూపుర ములు, అరవంకీలు, కంకణములు ధరించిన విద్యాధర వనితలు పానమత్తులైన విద్యాధరులతో కలసి ఆశ్చర్యముతో చిరు నవ్వులొలికినట్టా నింగిన నిలచినారు. అణిమాది అష్టసిద్ధులు కలిగిన వీరందరూ ఆధారము లేకుండా ఆకసమున నిలచి, వారివారి మహావిద్యలు ప్రదర్శితమగునట్లు ఆ మహేంద్రగిరిని గమనించసాగినారు.

# మహర్షుల చరిత్ర

తమిళమూలం : శ్రీ.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి
తెలుగు సేత : శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూప్పురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ

మాసాలలో మొదటిదైన చైత్రమాసాన్ని వాజం అనికూడా పిలుస్తారు. ఈ రీతిగా ఈ మహర్షి పుణ్యమైన నామధేయం ఋగ్వేదం మొదలైన నాల్గువేదాలలోను. వ్యాకరణం మొదలైన వేదాంగాలలోను, ఇతిహాస పురాణాలలోను, ధర్మశాస్త్రాలలోను విస్తారంగా కనబడుతూ ఉన్నాది.

**జమదగ్నిః భరద్వాజో, విశ్వామిత్రాత్రి గౌతమః।**
**వశిష్ఠ కాశ్యపాగస్త్యాః, మునయో గోత్ర కారిణః॥**

అనే ఈ మనుధర్మశాస్త్రంలోని శ్లోకము గోత్ర ప్రవర్తకులైన మూల పురుషుల వరుసలో భరద్వాజమహర్షిని కూడ చేర్చి ఆయన గొప్పతనమును చాటుచున్నది.

**శాణ్డిల్యః కాశ్యపశ్చైవ, వాత్స్యః సావర్ణికస్తథా।**
**భరద్వాజో గౌతమశ్చ, సౌకాలీనస్తథా పరః॥**

అనే ఈ మను శ్లోకం కూడా భరద్వాజ మహర్షి గొప్పతనాన్నే తెలియజేస్తోంది.

ఋగ్వేదంలో 'భరద్వాజ' పదం అనేక చోట్ల కనపడుతుంది. అన్నిచోట్ల కూడా ఈ పదం 'భరత్ + వాజ' అని రెండుగా విడదీసి చెప్పబడింది. 'వాజము'ను (శరీరదార్ఢ్యమును కాంతిని) భరించువాడు అను రీతిగనే ఈపదమునకు అర్థమును భాష్యకారులు (వేద) తెలిపియున్నారు.

ఒక ఉదాహరణ చూద్దాం :

మంత్రం - **యదయాతం దివోదాసాయ వర్తిర్ భరద్వాజాయాశ్వినాహ్వయన్తా।**

**ఋగ్వేదం 1-116-88**

ఇది అశ్వినీదేవతలకు సంబందించిన మన్త్రము. ఈ మంత్రంలో 'భరద్వాజాయ' అనే మాట ఉంది. ఇది ఒక వ్యక్తి పేరుగా కాక 'దివోదాస' అనువానికి విశేషణముగా ఉన్నది. భరద్వాజాయ - సంభ్రియమాణ హవిర్లక్షణా న్యాయ యజమానాయ - అని సాయణులు తమ భాష్యములో అర్థమును కృపచేసి యున్నారు. పైన కూడ భరద్వాజః, భరద్వాజమ్, భరద్వాజాః, భరద్వాజాన్, భరద్వాజే, భరద్వాజేషు, అను ఈ రీతిగా అన్ని విభక్తులలో, అన్ని వచనాలలో ఈ పదం ప్రయోగించబడింది. అన్నిచోట్ల కూడ 'భరత్+వాజ' అనే పద విభజనతోనే అనాదిగా వేదాల్లో పఠించబడుతూ ఉన్నది.

ఈ వాజ శబ్దాన్ని ఋగ్వేదంలో భరద్ అనే పదంతోనే కాకుండ, పుర-వాజ, శత - వాజం, సనత్ - వాజ, సహస్ర వాజ, తువి - వాజ, చిత్ర -వాజ, అనురీతిగా అనేక స్థలములందు చేర్చి చదువబడుచున్నది.

యజుర్వేదంలో తైత్తిరీయ సంహిత రెండవ కాణ్డం, మూడవ ప్రశ్న, మూడవ అనువాకం చివరలో ఒక యాగం చెప్పబడి ఉంది. '**బ్రాహ్మణ స్పత్యం ఏకాదశ కపాలం నిర్వపేత్ క్రమ కామః**' అనునది ఈ యాగాన్ని గుఱించి చెబుతుంది. దీనికి కావలసిన మంత్రములు రెండు (పురోవాక్యా, యాజ్యా) ఈ ప్రశ్నమందే 14వ అనువాకంలో మంత్రం ఈ విధంగా ఉంది.

మంత్రం :- **స ఇజ్జనేన స విశా స జన్మనా స పుత్రైః వాజం భరతే ధనా నృభిః ।**

ఈ మంత్రంలో 'భరత్ వాజ' అనే పదం 'వాజ భరతే' అని ఉన్న విషయం గమనించ తగినది. వాజమును భరించుచున్నాడు అనియే ఈ పదానికి అర్థము. అందుచే భరద్వాజ అనే పదం వేదాలలో వాజమును భరించువాడు అనే అర్థంలోనే వాడబడి ఈ మహర్షికి నామధేయంగా ఏర్పడింది అనే విషయాన్నిపైన చూపిన అనేక వేదవాక్యముల ద్వారా మనము స్పష్టముగా తెలుసుకొనవచ్చును.

14/
bnmay02.p65



# సందేహాలు - సమాధానాలు

సిహెచ్. కమల, విజయవాడ

ప్ర : 'నాలాయిర' దివ్యప్రబంధం గొప్పదా? లేక పంచమ వేదమనబడే మహాభారతం గొప్పదా? లేక దేని గొప్పతనం దానిదేనా?

**జ : గొప్పదనమనేది ఎప్పుడూ సాపేక్షమే గద! 'దేని కంటే గొప్పది? ఏవిషయంలో గొప్పది' వంటి ప్రశ్నలు వస్తాయి. భారతీయులు చరిత్రను తెలుపడంలో 'శ్రీమన్మహాభారతమే' గొప్పది. నాలాయిరం ఆ పని చేయలేదు. ఎక్కువ శ్లోకాలుండటంలో భారత గ్రంథమే గొప్పది. నాలాయిరానికా ఘనతలేదు.**

**భగవంతుని ప్రేమతో కీర్తించి, కళ్యాణ గుణానుభవంచేయాలంటే 'నాలాయిరమే' గొప్పది. 'శ్రీమద్భారతంలో అక్కడక్కడ భగవద్గుణకీర్తన ఉన్నా, ఇతర విషయాలెన్నో, ఎన్నెన్నో కలసి ఉండటం వల్ల పరిశుద్ధంగ భగవద్గుణ కీర్తన సాగదు అందులో. అంచేత 'ఆవిషయంలో' నాలాయిరమే గొప్పది అంటారు. ఇలా గొప్పదనమెప్పుడూ సాపేక్షికమని మరువరాదు.**

సిహెచ్. రామారావు, విజయవాడ.

ప్ర : వేదములు మూడా లేక నాలుగా? ఉపనిషత్తులు ఎన్ని? వాటిపేర్లు తెలపండి?

**జ : వేదమనేది ఒకే రాశిలా ఉండేది మొదట. ద్వాపర యుగం దాకా అలానే ఉండేది. అయితే మంత్రాల స్వరూప స్వభావాలను బట్టి కొన్నింటిని ఋక్కులని, కొన్నింటిని సామములని, కొన్నింటిని యజుస్సులని అంటారు. అప్పట్లో ఒక్కొక్కరికే అంత వేదాన్ని కంఠస్థంచేసి ధరించే సామర్థ్యం ఉండేది. ద్వాపరాంతము వచ్చేసరికి మానవ మేధ క్షీణిస్తుందని గుర్తించిన శ్రీ వేదవ్యాసుడు 1131 శాఖలుగా చేసి, కొందరిని కేవలం ఋక్కులు మాత్రం రక్షించే బాధ్యతనిచ్చి, ఆ వేదభాగాన్ని 'ఋగ్వేదం' అనే పేర పిలచారు. అలానే యజుర్, సామ వేదాలనుగూడ ఒక్కొక్కరిద్వారా రక్షింపచేసాడు. ఋగ్వేదం 21 శాఖలు, యజుస్ 101 శాఖలు. సామం 1000 శాఖలు మిగిలినదంతా అధర్వణం పేర 9 శాఖలుగ ప్రవర్తింపచేసాడు. ప్రతి వేదశాఖకూ ఉపనిషత్ భాగమంటూ ఉంటుంది. అయితే వేద సంప్రదాయ ప్రవర్తకులైన శంకర, రామానుజాచార్యుల వంటి ఆచార్యులు 14 ఉపనిషత్తులు మాత్రమే అంగీకరించారు, ఆనాటికి. ఇప్పడు సుమారు 5,6 వందల ఉపనిషత్తులు వాడుకలో ఉన్నాయి. మరి ఇవి ఆనాడు ఉన్నా, వారు అప్రమాణాలని వీటిని గురించి ప్రస్తావన తమ వ్యాఖ్యానాలలో గ్రహించలేదో, లేదా, అసలానాటికివి లేనేలేకుండా, తర్వాతివారేవరైనా వ్రాసుకున్నారో మనకు తెలియదు. మొత్తానికి ఆ పై ఆచార్యులు మాత్రం మిగిలినవంగీకరించలేదు. వారంగీకరించిన 14 ఇవి. "ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఛాందోగ్య, బృహదారణ్యక, ఐతరేయ, శ్వేతాశ్వతర, సుబాల, కౌషీతకీ, మహా నారాయణ" ములనేవి.**

శ్రీ పొన్నాల నర్సయ్య, కాసిపేట

ప్ర : శ్రీకృష్ణ భగవానుడు తన కిరీటం పై నెమలిపింఛమును ధరించడంలోనిఆంతర్యాన్ని విశదీకరించ ప్రార్ధన?

**జ : నెమలి పింఛం, మన కంటికి ప్రతీక. కన్ను జ్ఞానాన్ని చెప్తుంది కద! భక్తునికి గుర్తు. తనను గుర్తించిన జ్ఞానం కల భక్తుని అందమే అందం. తనను సర్వవిధబంధువుగ విశ్వసించిన జ్ఞానం కలవాణ్ణి అందమైన నెమలి పింఛం స్వామి శిరస్సునలంకరించినట్లు, ఆ భక్తుని గూడ శిరసా మోస్తాను.**

నన్ను అందరిలో ఒకడిగ - ఇతరులతో సమానంగ లేదా తక్కువగ చూచే అల్ప జ్ఞానం కలవారి తెలివి నెమలి కన్నులా నిష్ప్రయోజనమే సుమా! వానికి సంసారంలో మునిగిపోవుటే గతి సుమా! అని నెమలిపింఛం తెలుపుతుంది.

ఒక భక్తశిఖామణి, మహబూబాబాద్

ప్ర:అందరు దేవతలు, తమఅభయహస్తం పైకి పెడితే, శ్రీ వేంకటేశ్వరస్వామి క్రిందికి పెట్టినాడెందుకు?

జ : అది వరదహస్తం. తన పాదాలను ఆశ్రయించి, అన్ని వరములూ పొందమని చూపే హస్తం. అంతేకాదు. అలా ఆశ్రయిస్తే ఏం జరుగుతుందో, రెండో చేయి తెలుపుతుంది. అది, అంతుతెలియని ఈ సంసారసాగరం గూడ మోకాలిలోతు మాత్రం నీరుండే నదిలా సులభంగ దాటవీలవుతుంది. కనుక ఆశ్రయించండని చూపుతున్నాడు.

ప్ర : గృహంలో, ఆలయాల్లో నైవేద్యం పెట్టే సమయంలో, హరతి ఇచ్చేటప్పుడు ఘంటా నాదం ఎందుకు చేయాలి? నైవేద్యం పెట్టాకే హరతి వెలిగించడంలో విశేషం ఏమిటి?

జ : గంట రెండు కారణాలకోసం వాయిస్తారు. 1. మంగళమని, 2. ఇటుచూడుము అని పిలవడానికి. ఆలయంలో ఎందరో భక్తుల ననుగ్రహిస్తూ ఉంటాడు కనుక, ఎవరిని గురించైనా ఆలోచిస్తూ ఉండి ఉండవచ్చు. కనుక ఆయా ఉపచారానికి ఘంటను మ్రోగిస్తారు. కానీ గృహాలలో సర్వసులుభుడై ఉంటాడు. పైగ కేవలం మనలను అనుగ్రహించడానికే ఉన్నాడు కనుక, ఇతర వ్యాపకాలుండవు. మననే చూస్తూ ఉంటాడు. కనుక ఇక ఘంట మ్రోగించి 'ఇటు చూడుమా!' (Your Attention Please) అంటూ గంట అనవసరం. అసలే మన దృష్టి ఉన్నవానిని, ఘంటకొట్టి గూడ పిలిస్తే, 'అయ్యో! అయ్యో!' నేనున్నానుగద! అంటూ బాధపడతాడు. అందుకే ప్రత్యేకించి ఘంట కొట్టరు. ఇది సంప్రదాయంలోంచి వచ్చింది. 2. నైవేద్యం దాక మనం చేసిన మొరటు ఉపచారాలను ప్రీతితో గ్రహించి కందిపోయిన స్వామికి 'దృష్టి'దోషం తగలవద్దు. శ్రమతీరాలి. మంగళం కలగాలని యిచ్చేది 'హారతి' అందుకే తర్వాత.

ప్ర : మీరు పట్టుకునే త్రిదండం యొక్క విశేషం ఏమి? అందులో ఎన్ని కర్రలుంటాయి. అన్నిమాత్రమే ఎందుకుండాలి? మీరు దాన్ని ఎక్కడా పెట్టకుండా పట్టుకొని ఉండడం ఎందుకు?

జ : వేదాన్త శాస్త్రం తెలిపిన తత్త్వాలు మూడు. పరమాత్మ, జీవులూ, ప్రకృతి అని. ఈ మూడింటినీ సూచిస్తూ 3 దండాలుంటాయి. ఆయా తత్త్వం ఎలా ఉంటుంది? అలానే ఎందుకుంటుంది? దాని ప్రయోజనమేమి? ఇలాంటివన్నీ తెలిపేది ఆచార్యులే గద! అందుకే ఆచార్యుల అనుగ్రహముతో మాత్రమే జీవుడు తరించాలనేది శాస్త్ర సమ్మతమైన విషయం. వారినీ ఒక తత్త్వంగా భావించి 4వ దండం గూడ ఉంటుంది. ఈ తత్త్వాలన్ని ఎప్పుడూ విడచి ఉండవు. అన్ని కలిసి ఉంటాయని, వాటిని బంధించి ఉంచుతారు. అదే మన సిద్ధాన్తమని, దానిని ప్రచారం చేయడమే కర్తవ్యమని, మేము దానిని ధరించి తిరుగుతాం! అంతే కదా!

ప్ర : యాగశాలకు షోడశ స్తంభాలు ఎందుకు ఉండాలి?

జ : ఆగమగ్రంథాలు అన్ని స్తంభాలతోనే శాలా నిర్మాణం చేయమని చెప్పాయి. మనలో కళలు 16. యాగం ద్వారా భగవానుని అర్చించి, వాని అనుగ్రహంతో మనలో 16 కళలూ సమగ్రంగ వికసింపచేసుకోవడం, దానిలో ఆంతర్యం కావచ్చు.

15/
bnmay02.p65



# స్తవ ప్రియుడు

శ్రీమాన్ కె.ఇ. స్థలశాయి, భద్రాచలం.

శ్రీరామచంద్రుడు సుగ్రీవునితో **"మిత్ర భావేన సంప్రాప్తం నత్యజేయం కథంచన"** సుగ్రీవా! మనసులో మైత్రీభావం లేకపోయినా నేను నీమిత్రుణ్ణి రామా అంటూ నన్నాశ్రయిస్తే చాలు, అతని వద్ద ఎంత పెద్ద దోషమున్న దానిని పట్టించుకోకుండా రక్షణ కలుగచేస్తాను అని అంటాడు. తెలిసి తాకినా తెలియక తాకినా నిప్పు ఎలాగైతే దహిస్తుందో అలానే అనాలని అనకపోయినా 'హరి' అని అంటే చాలు సమస్త పాపాలు తొలగుతాయని మహా భక్తుడైన ప్రహ్లాదుడంటాడు. యథాలాపంగా భగవన్నామాన్ని నోటితో ఉచ్చరిస్తేనే భగవదనుగ్రహం లభిస్తోంటే మృదుమధురమైన మంచి మంచి పదాలతో కూర్చిన స్తోత్రాన్ని చేస్తే భగవంతునికి చాలా సంతోషం కలుగుతుంది కదా!

స్తోత్రంతో పాటుగా వందనము, అర్చనము మొదలైన సేవలు ఆయనపై మనసా భక్తితో చేస్తే, ఇక ఆయన అనుగ్రహ ప్రవాహం మన పై కట్టలు తెంచుకొని ప్రవహిస్తుందనటంలో ఏ మాత్రం సందేహం లేదు. అయితే అన్నింటికీ మూలమైనది స్తోత్రం చేయటం. అదే ముఖ్యం. దేవునికి వాచికరూపమైన స్తోత్రసేవయే ఎంతో ప్రీతి పాత్రమని కృష్ణయజుర్వేదంలోని కొన్ని సగ్ంహితా మంత్రాల ద్వార తెలుస్తోంది. ఆ మన్త్రార్థాలను పరిశీలిద్దాం.

**ఇన్ద్రమిద్గాథినోబృహదిన్ద్ర మర్కేభిరర్కిణః ఇన్ద్రం వాణీరనూషత ।**

**గాథినః**-సామగానాన్ని చేయువారు, **బృహత్**-గొప్పదైన సామవేదంతో, **ఇంద్రమిత్**-ఇంద్రునే, **అనూషత**-స్తోత్రం చేసారు. ఇంద్రుడనగా దేవతలకు అధిపతి అయిన దేవేంద్రుడు అనుకోరాదు. సాక్షాత్తు పరమాత్మయైన శ్రీమన్నారాయణుడే ఇక్కడ ఇంద్రుడుగా చెప్పబడుతున్నాడు. **'ఇది పరమైశ్వర్యే'** అనే ధాతువు వల్ల ఇంద్రశబ్దం ఏర్పడుతోంది. కనుక ఇంద్ర శబ్దానికి పరమాత్మ అని అర్థం. ఆ పరమాత్మను సామగాయకులు స్తోత్రం చేసారు. **అర్కిణః** - బహ్వృచులైన ఋగ్వేదులు, **అర్కేభిః** - ఋక్కులతో, **ఇన్ద్రం**-పరమాత్మను, **అనూషత**-స్తోత్రం చేసారు. **"ఇరుక్కొండు నీర్ శంకిర్కొణ్డిట్టు ఎఙ్గిల్ మఱైయోర్ వన్దు నిన్ఱార్"** 'ఋగ్వేద మంత్రములను పఠిస్తూ శంఖమునందు నీరు తీసుకొని భగవంతుని స్నానము చేయించుటకు వేదవేత్తలు నిలచి ఉన్నారు' అంటారు పెరియాళ్వారు తమ ప్రబంధంలో. **వాణీః** - ఇతరములైన యజూరూపవాక్కులు, **ఇన్ద్రం అనూషత** - భగవంతుని స్తోత్రం చేసినవి.

**"బ్రహ్మాణస్త్వా శతక్రత ఉద్వగ్ంశమివయేమిరే। అగ్ం హోముచే ప్రభరేమా మనీషా మోషిష్ఠ దావ్నే సుమతిం గృణానాః। ఇదమిన్ద్ర ప్రతిహవ్యం గృభాయ సత్యాస్సన్తు యజమానస్య కామాః॥"**

**హే శతక్రతో** = సృష్టిస్థితి లయములను గొప్ప క్రతువులను నిర్వహించు భగవానుడా! **గాయత్రిణః** = గాయత్రీ సామయుక్తులైన ఉద్గాతలను వారు, **త్వా**=నిన్ను, **గాయన్తి** = గానం చేయుచున్నారు, **గృణానాః** = స్తోత్రం చేయుచున్న (**వయం** = మేము) **ఓషిష్ఠదావ్నే** = సంసారగ్రీష్మ తప్తులమైన మాపై దయా

మృత వర్షమును కురుపించువాడవు, **అగ్ంహోముచే** = పాపమును పోగొట్టువాడవైన, (**తే** = నీకొరకు) **మనీషామ్** = మననముతో (మానసిక చింతన) కూడిన, **సుమతిం** = మంచి బుద్ధిని, **ప్రభరేమా** = స్వీకరించెదము, **హే ఇంద్ర** = ఓ పరమాత్మా, **ఇదం హవ్యం** = ఈ హవిస్సును, (పత్రమో, పుష్పమో, ఫలమో, తోయమో లేక ఇవి అన్నీనో) **ప్రతిగృహాభాయ** = స్వీకరించు, **యజమానస్య కామాః** = ప్రార్థించు చున్న మా కోరికలు, **సత్యాస్సన్తు** = యథార్థములు అగుగాక.

పై మన్త్రముల క్రమాన్ని పరిశీలించి నట్లయితే మొదటి రెండు మన్త్రములలో స్తోత్ర ప్రాధాన్యం చెప్పబడింది. మూడవ మన్త్రంలో స్తోత్రంతో పాటుగా మనస్సు, క్రియలు కూడ ఎలా భగవత్సేవకు ఉపయోగ పడతాయో వివరింపబడింది. ఈ మన్త్రాలను బట్టి కూడ మనకు 'సృతి' ప్రాధాన్యం తెలుస్తోంది కదూ!

పెరియాళ్వారు అనువారు **'తిరున్దనాన్మఱైయోర్ ఇరాప్పగలేత్తి వాళ్తిరుక్కోటియూర్'** 'నాల్గు వేదములనూ అధ్యయనముచేసిన వేదవేత్తలు ఎల్లప్పుడూ 'తిరుక్కోట్టియూర్' దివ్యదేశంలో వేంచేసి యున్న 'సౌమ్య నారాయణ' స్వామిని స్తోత్రం చేస్తూ, ఆ దివ్య దేశంలో నివసిస్తూ ఉంటారని తమ ప్రబంధంలో 'సృతి' ప్రాధాన్యాన్ని పేర్కొన్నారు.

శ్రీ ఆళవందార్ (యామునాచార్యులు) అనువారు తమ 'స్తోత్రరత్నం' అనుదానిలో **'యద్వాశ్రమావధి ---- కోమజ్ఞతో రణుకులాచల యోర్విశేషః'** 'స్వామీ! నిన్ను స్తోత్రం చేసే శక్తి నాకులేదు. అయినా నిన్ను స్తోత్రం చేస్తాను. ఎందుకంటే వేదములు, బ్రహ్మ రుద్రాది దేవతలు, నారదాది ఋషులు, ప్రహ్లాద విభీషణాది భాగవతతోత్తములు, పరాంకుశ, పరకాలాది ప్రపన్నులైన ఆళ్వారులు వీరంతా నిన్ను స్తుతించి ఆనంద పరవశులైనారు. నీకు, నీమహిమలకు అవధిలేదు కనుక నిన్ను పూర్తిగా స్తుతించు టకు అశక్తులౌతున్నారు. ఇక నా విషయమేమి చెప్పను? వారే అశక్తులై నప్పుడు నేనెంత? అయినా సముద్రంలో మునిగినపుడు పర్వతానికీ, పరమాణువుకూ మునగటంలో ఎటువంటి తేడా ఉండదు కదూ! కనుక నా శక్తి కొలది నిన్ను స్తుతిస్తాను" అని అంటారు.

కనుక స్తోత్రం చేయటంవల్ల భగవదనుగ్రహం లభిస్తుంది. స్తోత్రం చేయట మంటే వాచికమైన భగవత్సేవ. ఈ సేవ స్వతంత్ర మైనది, నిరపేక్షమైనది, మనస్సుతో దేహంతో భగవత్సేవ చేయడానికి ప్రేరణ నిస్తుంది. ఈ కారణం చేతనే భగవానునికి 'స్తుతి' రూపమైన సేవంటే ఇష్టం.

అందుకే **ఆయన స్తవప్రియుడు. ఆతనిని స్తోత్రం చేస్తేనే జన్మ సార్థక మవుతుంది. దుర్లభమైన మానవ జన్మ చరితార్థమవుతుంది.**





# శ్రీవారి పర్యటనా వివరాలు

| | |
|---|---|
| జూన్ 6,7 | : జెమిని టీ.వి. షూటింగ్ |
| 8,9,10 | : అదిలాబాద్ జిల్లా, **ఉట్నూరు** గ్రామంలో వేంచేసి ఉంటారు. |
| 11,12,13 | : భద్రాచలం గిరిజన ప్రాంతాల పర్యటన. |
| 11 | : **సూర్యగ్రహణం,** రాత్రికి **భద్రాచలం** ప్రయాణం. మన జీయర్ మఠంలో బస. |
| 12 | : ఉదయం **వెంకటాపురంలో,** రాత్రికి **మణుగూరులో** ప్రవచనం అనుగ్రహిస్తారు. బస భద్రాదిలో. |
| 13 | : V.Rపురంలో ట్రైబల్ క్యాంప్, మెడికల్ క్యాంప్ **కూనవరంలో** ప్రవచనం అనుగ్రహిస్తారు |
| 14 | : ఉ॥ **కూనవరంలో** తీర్థగోష్ఠి, **చింతూరులో** ప్రవచనం, సా॥ **భద్రాదిలో** వికలాంగుల సంక్షేమ కార్యక్రమం. రాత్రికి **ఏలూరు** బస. |
| 15 | : ప॥గో॥ జిల్లా, ఉ॥ 10గం॥లనుండి 12 గం॥ వరకు **ఏలూరులో** గీతాజ్యోతి సమావేశంలో అన్వయిస్తారు. 3గం॥ నుండి 5 గం॥ వరకు **తాడేపల్లి గూడెం,** సాయంకాలం 7గం॥ నుండి 8గం॥ వరకు **తణుకులో** జరుగు గీతాజ్యోతి సమావేశాలలో అన్వయిస్తారు. రాత్రికి **రాజోలు** బస. |
| 16 | : **తూ॥గో॥ జిల్లా, రాజోలు** గీతాజ్యోతి పర్యవేక్షణ, రాత్రికి కిర్లంపూడి, పద్మనాభం, యమ్.పి. కాకినాడ. |
| 17 | : ఉ॥ 9 గంటలకు కిర్లంపూడి, రామాలయ శంకుస్థాపన, ఉదయం 11 గంటలకు ప్రతిపాడు, లయన్స్ క్లబ్ భవన ప్రారంభం. |
| 18 | : విజయవాడ |
| 19 To 21 | : దేవ ప్రతిష్ఠ |

జూన్ 21నుండి :
జులై 15వరకు : } **మానససరోవర యాత్ర**

# శ్రీవచన భూషణము

- శ్రీ ఉ.వే.ప్ర. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి, విశాఖ

## 99వ సూత్రము

**ఇదుదాన్ ఐశ్వర్య కామర్కుమ్ ఉపాస కర్కుమ్ ప్రపన్నర్కుమ్ వేణుమ్**

ఈ శమాది గుణములు ఐశ్వర్యమును కోరి భగవానుని ఉపాసించువారలకును, భగవత్ప్రాప్తికి ధ్యానము లేదా ఉపాసన చేయు వారలకును, ప్రపన్నులకును కూడ ఉండవలయును.

కొందరు ఐశ్వర్యమునుకోరి భగవానుని ఉపాసింతురు. వారికి ఈలోకములో ఇంద్రియములతో అనుభవించు భోగములే పొంద దగినవి. అయినను వానిని పొందు టకు భగవదుపాసన చేయునప్పుడు శమము దమము అనగా బాహ్యేంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము ఉండియే చేయవలెను.

**'ఇంద్రియాణి పురాజిత్వా జితం త్రిభువనం త్వయా'** అని మండోదరి తన భర్త అగు రావణుడు చనిపోయిన తరువాత విల పించుచు, **'ఇంద్రియములను పూర్వము జయించి తపసుచేసి మూడు లోకములను జయించితివి'** ఇపుడు ఆ వైరముచే అవి నిన్ను జయించినవి. అని విలపించినది. తపసుచేసి భగవదనుగ్రహముచేతనే అతడు మూడు లోకములను జయించినావు. కాని ఇప్పుడా ఇంద్రియములే నిన్ను చంపించినవి అనును.

ఇచ్చట ఇంద్రియ జయముగలవారే భక్తితో భగవదుపాసన చేసి ఐశ్వర్యమును పొందగలరని తెలియుచున్నది. అట్లే, **'పడిమన్ను పత్, కలన్ పతోడఋత్తు ఐమ్బులన్ వెన్లు'** అని ఐదు ఇంద్రియములను జయించి అని భగవానుని ధ్యానించి ఐశ్వర్యము పొందుటకు ఇంద్రియ జయము మనో నియమనము కూడా ఆవశ్యకము అని తెలియుచున్నది.

భగవానుని ప్రీతిపూర్వకముగ ఎడతెగక ప్రత్యక్ష సమానముగ దర్శనమగునట్లు ధ్యానించి, తాను పొందవలసిన మోక్షమును కొందరు పొందుదురు. వారికి కూడ ఆ ఉపాసనమునకు శమము, దమము ఉండ వలెను అని శ్రుతి చెప్పుచున్నది.

**తస్మాత్ దేవవిద్ శాంతో దాంత ఉపరతస్థిమః తిక్షుః సమాహితో భూత్వా ఆత్మన్యేవ ఆత్మానమ్ పశ్యేత్**

ధ్యానించి మనసులో పరమాత్మను దర్శించుటకు జ్ఞానము ఉండి బాహ్యేంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము కలిగి విషయ ముల వైపు పోని మనసు గలవాడై, సుఖదుః ఖములను సమముగ ఓర్వగలవాడై, మనసును భగవానుని యందే నిలుపగల వాడై ఉండవలెనని చెప్పుచున్నది. క్షుద్రము లైన విషయములవైపు ఇంద్రియములు ప్రసరించు మార్గమును మూసి అని ఆళ్వారు లు కూడ ఇంద్రియ నియమనము భగవదుపా సనమునకు ఆవశ్యకము అని పేర్కొనినారు.

భగవానుడే ఉపాయమని ఇతరోపాయ మును వదలి వానినే ఉపాయముగ





స్వీకరించు ప్రపన్నులకు కూడ శమము దమము మొదలగు ఆత్మగుణములుండ వలెను.

**ఏకాంతీతు వినిశ్చిత్య దేవతా విషయాంతరైః భక్త్యుపాయం సమం కృష్ణ ప్రాప్తౌకృష్ణైక సాధనః**

సర్వేశ్వరుడే వానిని పొందుటలో సాధనము అని నిశ్చయించి ఇతరదేవతలను ఆశ్రయింపక, ఇతర విషయములను కోరక భక్తికూడ భగవానుని పొందుటలో ఉపాయ మనెడి బుద్ధిని వదలి, కృష్ణుని పొందుటకు కృష్ణుడే సాధనమనుకొనువాడు ఏకాంతి అనబడును అని శాస్త్రము చెప్పుచున్నది. అట్లే ఆళ్వార్లు కూడా భగవానుడే ఉపాయమని నిశ్చయించుకొని ఉన్నత మను గూర్చి చెప్పుచు ''ఇంద్రియములు ఐదింటిని విషయముల వైపు పోకుండ అడ్డగించి దేనియందును కోరిక లేక నీ సేవయే కావలెనని ఉన్న నన్ను'' అని చెప్పుకొనినారు. ఇట్లు భగవానుని ధ్యానించువారలకు ప్రధానము అయినది ఇంద్రియ నిగ్రహము, మనో నియమనము మొదలగు ఆత్మగుణ సంపత్తి అని ఎరుంగ వలెను.

## 100వ సూత్రము

**మూన్లిలుమ్ వెత్తుక్కొండు మిగవుమ్ వేండు వదు ప్రపన్నుక్కు**

వీరి ముగ్గురిలోను ముఖ్యముగా ప్రపన్నులు అనగా సర్వేశ్వరుని పొందుటకు సర్వేశ్వరుడే ఉపాయము అని నిశ్చయించు కుని ఉన్నవారికి ఆత్మగుణములు అత్యావశ్య కములు.

సర్వేశ్వరుని ఉపాసించువారలు మూడు విధములుగా ఉందురు. ఐశ్వర్యమునుకోరి ఉపాసించువారు, సర్వేశ్వరుడినే కోరి భక్తి సాధనముగ ఆశ్రయించు భక్తులు. సర్వేశ్వ రుడే ఉపాయమని ఆశ్రయించు ప్రపన్నులు. వీరు ముగ్గురిలోను ఐశ్వర్య కాముల కన్న భక్తులు కంటె ప్రపన్నులకు ఆత్మగుణములు తప్పక ఉండవలెను.

## 101వ సూత్రము

**మత్తై ఇరువర్కుమ్ నిషిద్ధ విషయ నివృత్తియే అమైయుమ్.**

**ప్రపన్న నుక్కు విహిత విషయ నివృత్తి తన్నేత్తమ్.**

ఐశ్వర్య కాములకు భక్తులకు భగవదు పాసనము చేయునప్పుడు శాస్త్రములలో పొందరాదని నిషేధించిన విషయములను వీడుటయే ఆవశ్యకము. కాని ప్రపన్నులకు అనగా సర్వేశ్వరుని పొందుటకు సర్వేశ్వరుడే ఉపాయమని స్వీకరించు వారలకు శాస్త్రము లలో ఆచరింపవచ్చునని, పొందవచ్చునని చెప్పిన విషయములను కూడ వీడి అనగ విహితవిషయముల నుండి కూడ ఇంద్రియ ములను మళ్ళించుట ఆవశ్యకము. అదే వాని ఆధిక్యము.

ఐశ్వర్యము కోరువాడు శబ్దాది భోగము లను కోరి భగవానుని భక్తితో ఆరాధించును. భక్తుడు తాను పొందగోరిన భగవానుని పొందుటకు భక్తి ఉపాయమని ఉపా సించును. వానిని ఉపాసకుడు లేదా భక్తుడు అందురు. ఇట్లు ఐశ్వర్యకాముడై భగవ ద్ధ్యానముచేయు వారలకును, భగవత్ప్రాప్తిని కోరి భగవానుని ఉపాసించు వారలకు కూడ నిషిద్ధముల నుండి మనస్సును మళ్ళించుట ఆవశ్యకము అనగా పరదారాగమనము శాస్త్రములచే నిషిద్ధము.

# శ్రీరామ మంగళాశాసనము

శ్రీ ఉ.వే.ప్ర. శ్రీమాన్ ఈ.వే. శింగరాచార్యులు, తిరుపతి.

**త్యక్త సాకేతవాసాయ చిత్రకూట విహారిణే।**
**సేవ్యాయ సర్వయమినాం ధీరోదారాయ మంగళమ్॥**

ఈ శ్లోకములోని పూర్వార్థ భాగ వివరణము గతసంచికలో తెలుసుకున్నాం కదా! ఇక ఉత్తరార్థమును పరిశీలిద్దాం.

**సర్వయమినాం సేవ్యాయ** – చిత్రకూట పర్వతమున శ్రీరాముడు నివసించుచునపుడు ఆ ప్రాంతములోని మునులందఱును అతనిని సేవించిన సందర్భము ఈ విశేషముచే స్మారితము.

**జటాజినధరాః కాలే వల్కలోత్తర వాససః**
**ఋషయ స్త్వవగాహంతే నదీం మందాకినీం ప్రియే।**
**ఆదిత్యముపతిష్ఠంతే నియమాదూర్ధ్వ చాహవః**
**ఏతే పరేవిశాలాక్షి మునయస్సంధ్రి తవ్రతాం॥**

అనుచు శ్రీరాముడు ఆ ప్రాంతములోని మునులను గూర్చి సీతాదేవితో తెలిపెను. ఇట్టి సదనుష్ఠాన తత్పరులగు మునులు ఆ ప్రాంతమున నివసించు భగవదవతారమూర్తి యగు శ్రీరాముని సేవించిరనుట అర్థసిద్ధము. దేశికులు రఘువీరగద్యలో **'దండకారణ్య తపోవన జంగమపారిజాత'** అనిపల్కుటయు ఇచట అనుసంధేయము. సహస్రనామములోని 'మార్గః' అనునామము శ్రీరామ చరిత్ర సందర్భములో నుండుటను బట్టి, మునులచే అన్వేషింపబడువాడని భట్టరు వివరించుట ఇచ్చట స్మరణీయములు.

**ధీరోదారాయ – ధీరశ్చాసౌ ఉదారశ్చ** అని, **'ధీరేషు ఉదారః'** అని ఈ విశేషణమును రెండు విధములుగా వివరింపవచ్చును. మొదటి వివరణము వలన ధీరుడును, ఉదారుడును అగు శ్రీరాముడు అని భావము. ఈ అర్థమున ఉదారశబ్దమునకు గొప్ప దాత (గొప్ప మనస్సు కలవాడు) అని అర్థము. రెండవ అర్థమున ఉదారశబ్దమునకు గొప్పవాడని అర్థము. ఇందులకు అను గుణముగా **'ఉదారో దాతృమహతోః'** అను అమరకోశవచనమును స్మరింపనగును. పై రెండు వివరణములును భరతుడు శ్రీరాముని రాజ్యమున తిరిగిరమ్మని ప్రార్థించినను తన నిశ్చయమును వీడకుండుటను, భరతుని ప్రార్థన సఫలమగునట్లు అమోఘమైన తన పాదుకలను ప్రదానము చేయుటను తెలుపునని చెప్పనగును.

వశిష్ఠాదిమునులను, కౌసల్య, సుమిత్ర మొదలగు తల్లులతో భరతుడు ససైన్యముగ అరణ్యములోనున్న శ్రీరాముని వద్దకు వచ్చి, అయోధ్యకు తిరిగివచ్చి రాజ్యమును పాలింప వలసినదిగా పదేపదే ప్రార్థించెను. జాబాలి నాస్తిక వాదముతో రాముని మనస్సును మార్చుటకు యత్నించెను. వసిష్ఠుడును అయోధ్యకు తిరిగి వచ్చుటలో అధర్మమేమియు లేదని, **నాతివర్తేః సతాంగతిమ్, ఆత్మానం నాతివర్తేస్త్వం సత్య ధర్మ పరాక్రమ** అనుచు సమాధానపరుచ ప్రయత్నించెను. అయినను **లక్ష్మీ శ్చన్ద్రాదపేయాద్వా హిమవాన్ వా హిమం త్యజేత్, అతీయాత్ సాగరో వేలాంన ప్రతిజ్ఞా మహంపితుః** లక్ష్మిచంద్రుని వీడిన వీడవచ్చును. హిమవంతుడు మంచును వీడవచ్చును, సముద్రము తన అవధిని దాటిన దాటవచ్చును, కాని, నేను తండ్రి ప్రతిజ్ఞను జవదాటను అనుచు అవిచాల్యమైన నిశ్చయమును ప్రకటించెను. ఇదియేకదా ధీరునిస్వభావము. కాళిదాసు ధీరశబ్దమును నిరూపించుచు **వికారహేతౌ సతి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః**– మనస్సున మార్పుకల్గుటకు అవకాశముకల సందర్భము లలోనైనను మార్పుచెందకుండు వారే ధీరులనెను. అట్టి స్వభావము ప్రస్తుత మందర్థమున శ్రీరామచంద్రునియందు స్ఫుటము. దేశికులను **అనన్య శాసనీయ** అనుచు





ఈ విషయమును కీర్తించిరి.

తనను ఇంతగా వేడుకొను భరతుని నిరుత్సాహపఱచి, పంపినచో అతని ప్రార్థన విఫలమైనట్లే కదా! ఆ విధముగా కాకుండ **ఏతే ప్రయచ్ఛ సంహృష్టః పాదుకే హేమ భూషితే, అయోధ్యా యాం మహా ప్రాజ్ఞ యోగక్షేమకరే తవ** అను వసిష్టుని ఆదేశము ప్రకారము రత్న పాదుకలపై తన చరణములను మోపి **ఏతే మమ రాజ్యాయవై దదౌ** అనునట్లు వానిని, భరతునకు ప్రదానము చేసెను. ఇట్టి అదృష్టము భరతునకు ఒక్కనికే దక్కినది. కావున పాదుకాప్రదానము శ్రీరాముని ఔదార్యమును తెలుపు సందర్భము అనదగును. పూర్వము పేర్కొనిన రెండు వివరణములో ధీరులలో గొప్పవాడను రెండవ వివరణమున పాదుకా ప్రదానము అంత ర్భూతము కాకపోవుటచే మొదటి వివరణమే మిక్కిలి రస్యము. ఇట్లు ఈ శ్లోకముతో అయోధ్యాకాండ కథ ముగిసినది.

ఈ శ్లోకములోని పూర్వార్థమును అయోధ్య కాండకు సంబంధించినదిగను, ఉత్తరార్థము నుండి అరణ్యకాండ కథ ప్రారంభమగు చున్నట్లును వివరింపవచ్చును. ఆ అన్వయమున పూర్వార్థ వివరణమున మార్పులేదు. ఉత్తరార్థము మాత్రము వేరు విధముగా వ్యాఖ్యానింప నగును.

**సర్వయమినాం సేవ్యాయ** – శ్రీరాముడు దండకారణ్యమును ప్రవేశించినపుడు అచటి మునులందఱును శ్రీరాముని సేవించి, ఆ స్వామి రూపవైభవమునకు ఆశ్చర్యపడిరని, మంగళమును ఆశాసించిరనియు వాల్మీకి తెలిపెను. **రూపసంహననం లక్ష్మీం సౌకు మార్యం సువేషతామ్, దదృశుః విస్మితా వారా రామస్య వనవాసినః, 'తేతం సోమ మివోద్యంతం దృష్ట్వావై ధర్మచారిణః, లక్ష్మణం చైవ దృష్ట్వాతు వైదేహీం చ యః శస్వినీమ్, మంగళాని ప్రయుంజానా ప్రత్యగృహ్ణాన్ దృఢవ్రతాః** అను శ్రీరామాయణ వచనములు ప్రకృతమున స్మరణీయములు. అంతియే కాక,

**క్రియమాణం వనే ఘోరం రక్షోభిః భీమ కర్మభిః,**
**తతస్త్వాం శరణార్థంచ శరణ్యం సముపస్థితాః,**
**పరిపాలయనో రామ వధ్యమానాన్ నిశాచరైః**

అనుచు దండకారణ్యములోని మును లందఱును రాక్షసుల బారినుండి తమను రక్షింపుమని శ్రీరాముని శరణువేడిన సందర్భమును స్మరణీయము. కావున ఈ విశేషణము శ్రీరాముని ఋషులు శరణాగతి చేసిన సందర్భమును సూచించుచున్నదన వచ్చును.

**ధీరోదారాయ – ధీరేషు ఉదారః మహాన్**– ధీరులలో గొప్పవాడను అర్థమిచట గ్రాహ్యము. సీతాదేవి శ్రీరామునితో

**ప్రతిజ్ఞాత స్త్వయా వీర! దండకారణ్య వాసినామ్,**
**ఋషీణాం రక్షణార్థాయ వధస్సంయతి రక్షసామ్,**
**ఏతన్నిమిత్తంచ వనం దండకా ఇతి విశ్రుతమ్,**
**తతస్త్వాం ప్రస్థితం దృష్ట్వామమ చింతాకులం మనః,**
**న హి మేరోచతే వీర గమనం దండకాన్ ప్రతి**

ఇత్యాదిగా మునులకు రాక్షసులనుండి కాపాడుటకై దండకారణ్యము నకు పోవుచుంటి మని తాను గ్రహించితినని, అందులకు తన మనస్సు అంగీకరించుట లేదని, వైరము లేకుండ రాక్షసులను సంహరించుట తనకు తగినదని తోచుట లేదని పలువిధముల పల్కి, అతనిని ఆ ప్రయత్నము నుండి విరమింపచే యుటకు ప్రయత్నించెను. కాని, శ్రీరామ చంద్రుడు ఆమె అభిప్రాయమును నిర్ద్వంద్వ ముగా త్రోసిపుచ్చి **'సంశ్రుత్య చన శక్ష్యామి జీవమానః ప్రతిశ్రవం, మునీనామన్య థాకర్తుం సత్యమిష్టంహి మేసదా, అపహం జీవితం జహ్యాం త్వాం వాసీతే సలక్ష్మణామ్, నతు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః'** అనుచు మునులకు ఇచ్చినమాట తాను బ్రతికి యుండగా తప్పనని, సత్య పాలనమే తనకు ఇష్టమని, చివరకు సీతను లక్ష్మణుని అయినను వదలుకొనుటకు ఇష్టపడెదనుగాని, బ్రాహ్మణు లకు ఇచ్చిన వచనమును వీడనని తన నిశ్చయమును స్పష్టపఱచెను. కావున అచంచలమైన అట్టి ధీరతను తెలుపు ఈ సన్నివేశమును ప్రస్తుత విశేషణము సూచించు చున్నదనదగును.

జై శ్రీమన్నారాయణ!

## బదరీనాథ్‌లో అష్టాక్షరీ క్షేత్రంలో జరుగు అన్నదానమునకు, నిర్మాణమునకు వివిధ పోషకులుగా కైంకర్యములు సమర్పించిన భక్తుల వివరములు

**పి. రమణమ్మ (విజయనగరం)గారిద్వారా**

**పోషకులు- అభిమానులు :** శ్రీ సి.వి. రామరాజు & ఫ్యామిలి, శ్రీ యమ్. అప్పల నరసింహరాజు, శ్రీ కె. కృష్ణ మోహన్, శ్రీమతి ఈదుబిల్లి సీతారత్నం, శ్రీమతి పి.వి. నర్సమ్మ, శ్రీ తోట కృష్ణమూర్తి, ఒక భక్తురాలు, శ్రీ జంగాల గున్నారావు, శ్రీ కడిమిశెట్టి పేర్రాజు శెట్టి, శ్రీ కోనాల రామకృష్ణారెడ్డి, శ్రీ పి. హిమకర్.

**శ్రీమతి కె. ఇందిరాదేవి (బొమ్మకల్లు)గారిద్వారా**

శ్రీ ఆర్. లక్ష్మీనరసింహారెడ్డి (కుడకుదురు), శ్రీ కె. ఆంజనేయులు (ఖమ్మం), శ్రీ ఆర్. శ్రీనివాసురెడ్డి (చిట్యాల), శ్రీ ఆర్. వెంకటరెడ్డి (చిట్యాల), శ్రీ ఆర్. వెంకటరెడ్డి (చిట్యాల), శ్రీ జె. నరసింహారెడ్డి (బొమ్మకల్లు), శ్రీ పి. సుధీర్ (బొమ్మకల్లు), శ్రీ కె. భాస్కరరెడ్డి (బొమ్మకల్లు), శ్రీ కె. సోమనరసింహారెడ్డి (బొమ్మకల్లు), శ్రీయన్. ప్రభాకరరెడ్డి (బొమ్మకల్లు), శ్రీమతి డి. యశోద (నల్గొండ), శ్రీ బి. ప్రహ్లాదరెడ్డి (నాగలికొండ), శ్రీ ఎ. జనార్ధన రెడ్డి (నాగలికొండ), శ్రీ కె. వెంకటరెడ్డి (బొమ్మకల్లు), శ్రీ పి. సాయిలు (బొమ్మకల్లు), శ్రీ బి. రతన్ రెడ్డి (హైదరాబాద్), శ్రీ పి. జగన్మోహన్ రెడ్డి (పోతార్లెంపల్లి), పప్పి (హన్మకొండ).

**జెట్ సీతానగరం హైదరాబాద్ క్యాంప్**

**పోషకులు :** శ్రీ జె. రఘునాధరావు,

**అభిమానులు :** శ్రీమతి జి. రవిసత్యశ్రీ, శ్రీ పి. నరసింహారావు, శ్రీ యస్. నరసింహ, శ్రీ కె. సాయిప్రణీత్, శ్రీ కె.యస్. వి. రత్నమాల, శ్రీ ధర్మరాజు, శ్రీ కె. విజయ రంగనాథ్, శ్రీ పి. దీనావనరావు, శ్రీమతి చిట్టెమ్మ, శ్రీ యస్. ప్రవీణకుమార్, శ్రీ ఆర్. శ్రీధరరెడ్డి, శ్రీ కె. రవీంద్రరెడ్డి, శ్రీ సిహెచ్. లలితా తిరుపతిరావు, శ్రీ పి. హరికిషోర్, శ్రీ బి. వి. వెంకటరమణ, శ్రీలక్ష్మి, శ్రీ టి. జగదీశ్వర్, శేషయ్య, శ్రీమతి పి. హైమావతి, శ్రీవి.జె. గాంధికాశీ అన్నపూర్ణ, శ్రీ వి. రఘుపతిరావు, శ్రీ యస్. శ్రీనివాస్, శ్రీ కె. రాజారెడ్డి, శ్రీ జి. వెంకటేశ్వర్లు, శ్రీ ఆర్. సుభాషిణి, శ్రీ ఆర్.వి. చలపతిరావు, నరేంద్రకుమార్, శ్రీ జి.వి.వి. సత్యనారాయణ, శ్రీ బి. రామారావు, శ్రీమతి కె. మంజుల, శ్రీ యన్. వెంకటన రాజేందర్, శ్రీ యమ్. శర్వయ్య, శ్రీఆర్. లక్ష్మీనారాయణ రెడ్డి, శ్రీ ఎ. చంద్రయ్య, శ్రీ యస్. రవీందర్, శ్రీ కె. సుధాకర్, తాయారమ్మ, శ్రీ పి. శ్రీనివాసరెడ్డి జ్యోతి, శ్రీమతి యమ్. అంజనాయాదగిరి, శ్రీ కె. ప్రభాకరరావు, శ్రీ బి. శ్రీనివాసమూర్తి, శ్రీ టి. యస్. రంగాచార్యులు, శ్రీ యు. ప్రీతమ్, శ్రీ ఎ. హనుమంతరావు, శ్రీ జి. నరసింహ రావు, శ్రీ వి. అమూల్య నరసింహారెడ్డి, శ్రీ డి. రాజారెడ్డి, శ్రీమతి రేఖాదేవి, శ్రీ ఆర్. సురేష్ కుమార్, శ్రీమతి డి. వెంకటరత్నం, శ్రీ యమ్. రామలక్ష్మమ్మ, శ్రీమతి సుశీల, రామకృష్ణారెడ్డి, శ్రీ ఆర్. రామమోహన్‌రావు, వాణి, శ్రీ యమ్. గుండయ్య, శ్రీముకుందరావు తులసి, శ్రీ లక్ష్మీ ప్రసాద్ మల్లంపల్లిం, శ్రీ సిహెచ్. కొమ్మయ్య, శ్రీ ఐ. శ్రీదేవి, మదనమోహన్, శ్రీ డి. ఓంకారాచార్యులు, శ్రీ వీరవీరారెడ్డి, శ్రీమతి కె. వసంత, శ్రీ పి. రంగారావు, ఉదయశ్రీ, శ్రీ యన్. భీమారెడ్డి, నరసమ్మ, యమ్. సావిత్రి, శ్రీ డి. సుందరరామిరెడ్డి, శ్రీ టి. పాండు, శ్రీ జె. శ్రీరామారావు,

**సికింద్రాబాద్ :** శ్రీ కె. భూమారెడ్డి, శ్రీ జి. నరసింహాచార్యులు, శ్రీ ఆర్. రంగశెట్టి, శ్రీ వై. నరసింగరావు, శ్రీ జి. పద్మజ్యోతిర్మయి, శ్రీ కె. వాసుదేవగుప్త, శ్రీమతి ఆర్. ధనలక్ష్మి, శ్రీ యస్. పురుషోత్తమాచారి, శ్రీ యన్. సుదర్శన రఘుపతి, శ్రీ డి. మోహనాచారి, శ్రీ కె. శ్రీనివాసరావు, శ్రీ డి. వెంకటేశ్వరావు, శ్రీ యస్. వరదరాజులు, శ్రీ కె. గోపాలాచార్యులు, శ్రీ యమ్. సత్యగోపాల విజయలక్ష్మి, శ్రీ ఇ. తిమ్మయ్య, శ్రీమతి ఎ. కమలమ్మ, శ్రీ యన్. సంధ్యావళి, శ్రీ ఆర్. హరనాథ్, శ్రీ టి. వెంకటరావు, విజయలక్ష్మి, శ్రీ జి. ముకుంద, నికేత, శ్రీమతి యస్. విరజాభాయి, శ్రీమతి టి. నరసమ్మ, శ్రీ ఆర్. భాగ్య సత్యనారాయణ, శ్రీ వి. భాస్కరరెడ్డి, శ్రీ టి. అనిల్‌కుమార్, సరళ, శ్రీ యన్. ఆండాళ్ళమ్మ, సుగుణ, శ్రీ రామానుజా చార్యులు, శ్రీ డి. రాహుల్ కృష్ణ, శ్రీ వై. సత్యనారాయణ, శ్రీ పి. ఆర్. దశరథరావు, శ్రీ వి. శ్రీనివాస్, శ్రీ యమ్. వెంకటా చార్యులు, నీరజ, శ్రీ యమ్.వి.యస్. కళ్యాణ చక్రవర్తి, శ్రీ ఆర్. రాజబాబు, లక్ష్మిసరస్వతి, శ్రీమతి యమ్. రాధాకృష్ణమ్మ, శ్రీ సి. అనిల్‌కుమార్, శ్రీ జి. వెంకటరావు, శ్రీ పి. జలజాక్షి, శ్రీ బి. శకుంతల, విఠలాచార్య, శ్రీబి. వెంకటేశం, శ్రీ వై. దుర్గాప్రసాద్, శ్రీ సిహెచ్. శ్రీరంగవిజయకృష్ణ, శ్రీ జి. రత్న, శ్రీ జె.యస్. మహేష్, శ్రీ అంజిరెడ్డి, శ్రీ పి. శశిరేఖ, శ్రీ వి. సూర్యమ్మ, శ్రీ యమ్. బుచ్చమ్మ, శ్రీ టి. లక్ష్మీనారాయణ, శ్రీ ఎ. చిదంబరరావు, శ్రీ జి. రాజేశ్వరరావు, శ్రీ సిహెచ్. భుజంగరావు, శ్రీ కె. శ్రీనివాస్, శ్రీ యమ్. మహదేవ్ దార్జ్, శ్రీ టి. లక్ష్మీనారాయణ, శ్రీ ఎ. నరసింహారావు, శ్రీ బి. రామచంద్రరావు, శ్రీ సిహెచ్. శివకుమార్, శ్రీ బి. సంగీత, ఉపేందర్ రావు, శ్రీ కె. శ్యామ్ సుందర్, వాణి, శ్రీ బి. సదానంద రెడ్డి, శ్రీ వై. రవికుమార్, శ్రీమతి కె. జ్యోతి, వెంకటేశ్వరరెడ్డి, శ్రీ యమ్. లక్ష్మీపతి రాజు, శ్రీ యు. అనుపమ, రవి, శ్రీ టి. కనకవల్లి తాయారు, శ్రీ ఎ. నారాయణ, శ్రీ టి. నరసయ్య, శ్రీ డి. భిక్షపతి, శ్రీ బి. పాండురంగయ్య, శ్రీ డి. కుమారయ్య, శ్రీ బి. నారాయణ స్వామి, శ్రీ యమ్. లలితా, రామారావు, శ్రీమతి కె. విజయలక్ష్మి, శ్రీ ఎ. కృష్ణమూర్తి, సావిత్రి, శ్రీ బి. రవీందర్‌నాథ్, శ్రీ యల్. ప్రభాకర్, శ్రీ జి. చంద్రమౌళి రమణ, శ్రీసిహెచ్. వెంకటరమణ, అమరావతి, శ్రీ యన్. ఉమ, సురేశ్వర్, శ్రీ వినోద్ కుమార్, శ్రీ టి. లక్ష్మీనారాయణ మూర్తి, శ్రీ డి. సత్యనారాయణ, శ్రీ ఎ. ఉమ, రవీందర్, శ్రీ యస్. కుమార్, సునీత, శ్రీమతి సిహెచ్. హేమలత, శ్రీ యమ్. రామచంద్రరావు, శ్రీమతి యస్. రుక్మాబాయి, శ్రీమతి డి. చిత్రరేఖ, చంద్రమోహన్, శ్రీమతి ఆర్. ఇంద్రాణి, శ్రీ ఎ. చిదంబర్‌రావు, శ్రీ జి. రాజేశ్వరరావు, శ్రీ కె. శ్రీనివాస్, శ్రీ యమ్. మహదేవ్, దార్జ,





**హైదరాబాద్ :** శ్రీ కె. సత్యజ్ఞానప్రసూనాంబ, శ్రీ జి.వి.వి. శ్రీనివాసరావు, ఇందిర, శ్రీ యల్. కోటయ్య, శ్రీ సి. రమణమ్మ, శ్రీమతి లలితాదేవి, శ్రీమతి సి. జమునాదేవి, శ్రీ కె. మురళీధర్, శ్రీ జి. నారాయణరావు, శ్రీ వై. రంగారావు, శ్రీ వై. శివరామిరెడ్డి, శ్రీ కె. సత్యనారాయణ, శ్రీ యస్. పార్థసారధి, శ్రీమతి పి. సత్యవతి, శ్రీ డి. అనిల్ కుమార్, శ్రీ బి. శేషగిరిరావు, శ్రీ వై. కృష్ణారెడ్డి, శ్రీ జె.బి. సరస్వతి, పెంటయ్య, శ్రీ సిహెచ్. హనుమంతరావు, శ్రీ కె. రంగనాథము, శ్రీ డి. అనిలా శ్రీధర్, శ్రీ కె.యస్. చార్యులు, సుభద్ర, శ్రీ పి. సురేందర్ గాంధి, శ్రీ డి. మనోహరాచార్యులు, శ్రీ జె. దిలీప్, సరిత, శ్రీ టి. మోహన్ లావణ్య, శ్రీ జి. యాదగిరిరావు, శ్రీ జి. పవన్ కుమార్, శ్రీ యమ్. సూర్యప్రకావరావు, శ్రీ టి. పాపిరెడ్డి, శ్రీమతి కె. అనితా నరేందర్, శ్రీ యన్. భీమిరెడ్డి, నరసమ్మ, శ్రీమతి యమ్. సావిత్రి, శ్రీ డి. సుందరరామిరెడ్డి, శ్రీ టి. పాండు, శ్రీ జె. శ్రీరామారావు, శ్రీ ఎ.వి.యస్.ఆర్. ఆంజనేయులు, శ్రీ జి.పి. ప్రసాదరావు, శ్రీ యన్. వెంకటస్వామి యాదవ్, శ్రీ యన్. అననూయ, ఎ.వి.యస్.ఆర్. ఆంజనేయులు, శ్రీ జి.పి. ప్రసాదరావు, శ్రీ యన్. వెంకటస్వామి యాదవ్, శ్రీ యన్. అనసూయ, శ్రీ యన్. యాదగిరి రెడ్డి, శ్రీ యమ్.యస్. యన్. మూర్తి, శ్రీమతి షాలిని, నరసింగరావు, శ్రీ కె. ప్రవీణ్ కుమార్, శ్రీ యమ్.వి.ఆర్. హనుమంతరావు, శ్రీ ఎ. రమేష్, లక్ష్మి, శ్రీ సుభాష్ రెడ్డి, మంగేశ్వరి, శ్రీ యమ్. సుకుమారరావు, సుమతి, శ్రీ బి. రామారావు, శ్రీ యస్. సతీష్ రెడ్డి, షినీల, శ్రీ టి. నాగేంద్రరెడ్డి, శ్రీదేవి, శ్రీ యస్. పండరి, శ్రీ యమ్. రామసుధాకర్ రెడ్డి.

శ్రీ వి. విజయ్ కుమార్ (చెన్నై), శ్రీ యస్.వి. తిప్పయ్య (ఆదోని), శ్రీమతి యమ్. వాసంతి (బెంగుళూరు), శ్రీ యమ్. సుందరరావు (రామగుండం), శ్రీ యన్. హరిశంకర్ (హన్మకొండ), శ్రీ యమ్. రామతులసి, రామారావు (రాజమండ్రి), శ్రీ కె. చంద్రశేఖర్ రావు (కరీంనగర్), శ్రీ యమ్.వి.యస్. రామ్ ప్రసాద్ (తెల్లదేవరపల్లి), శ్రీ నరసయ్య (భువనగిరి), శ్రీ యన్. గోపాలకృష్ణ (ఖమ్మం), శ్రీ ఎ. శ్రీనివాసరెడ్డి (దుబ్బక), శ్రీ సి.

అశోక్ (ఈదుపల్లి), శ్రీ కె. రంగాచార్యులు (భువనగిరి), శ్రీ యమ్. లక్ష్మీనరసింహ (కరీంనగర్), శ్రీ నారాయణరావు, శ్యామ్ (కుకునూర్ పల్లి), శ్రీమతి జి. రంగనాయకమ్మ (భువనగిరి), శ్రీ విజయమోహన్‌రావు (కొల్లాపూర్).

శ్రీ యమ్.సతీష్ షావీనిరెడ్డి (పర్లపల్లి), శ్రీ జె. కమలాకరరావు (వోర్త్రాండ్), శ్రీ కె. వెంకటరమణాచార్యులు (భువనగిరి), శ్రీ అశ్వత్థ నారాయణ (రాయదుర్గం), శ్రీ యమ్. సందీప్ రెడ్డి (పర్లపల్లి), శ్రీ బి. కమలా ప్రసాద్ (విశాఖపట్నం), శ్రీమతి కలకుంట బుచ్చమ్మ (కాశీపేట), బి. జయపాల్‌రెడ్డి (రామపురం) శ్రీమతి కె. స్వరూపరాణి (మొదునూరు), శ్రీమతి సి.హెచ్. లక్ష్మీనరసమ్మ (సిరిసిల్లా), శ్రీ పి. మోహనరావు (హన్మకొండ), శ్రీ బి. సుదర్శన రెడ్డి (నిజామాబాద్), శ్రీ వి.ఆర్. ప్రభాకర్ (ఘటకేశ్వర్), శ్రీ సీతారామానుజా చార్యులు (కాకినాడ), శ్రీమతి యన్. భారతి (గంగాధం నెల్లూరు), శ్రీ జి.యన్. పట్టాభిరావు (గంగాధం నెల్లూరు), శ్రీ సిహెచ్. కృష్ణారావు (కరీంనగర్), శ్రీమతి శ్రీహరిస్నేహ (నిజామా బాద్), శ్రీ కె. వెంకటరత్నం (కర్నూలు), శ్రీ యమ్. జయనారాయణ రెడ్డి (ఆదిలాబాద్), శ్రీ యమ్.వి. సుబ్బారావు, రాజపద్మ (వైజాగ్), శ్రీ పాలబట్ల పూర్ణచంద్రరావు (షాద్ నగర్), శ్రీమతి చింతల తిరుమలమ్మ (జోగిపేట), శ్రీ కె. చంద్రశేఖర్‌రావు (కరీంనగర్), శ్రీ నరసయ్య (భువనగిరి), శ్రీ యన్.గోపాలకృష్ణ (ఖమ్మం), శ్రీ ఎ. శ్రీనివాసరెడ్డి (దుబ్బాక), శ్రీ సి. అశోక్ (ఈదుల్లపల్లి), శ్రీ కె. రంగాచార్యులు (భువనగిరి), శ్రీ లక్ష్మీనరసింహ రెడ్డి (కరీంనగర్), శ్రీ నారాయణరావు సాంపెల్లి (కుకునూరు పల్లి), శ్రీమతి జి.వి. రంగనాయకమ్మ (భువనగిరి), శ్రీ తాండ్ర విజయ మోహన్‌రావు (కొల్లాపూర్), శ్రీమతి అట్లూరి స్నేహలత (కొత్తచేటుపల్లి).

# గీతాజ్యోతి కైంకర్యములు

**సీతానగరంద్వారా :**

| పేరు | చిరునామా | సమర్పించిన కైంకర్యము రూ.లలో |
|---|---|---|
| శ్రీమాన్ బాణాల కృష్ణారావు, పద్మలతగార్లు | హైదరాబాద్ | 25,000-00 |
| శ్రీమాన్ సత్యనారాయణ ఆశావ & మురళీమనోహర్ మాల్‌పానీ | హైదరాబాద్ / ఆదిలాబాద్ | 25,000-00 |
| శ్రీమాన్ యమ్. కృష్ణారావుగారు | హైదరాబాద్ | 10,011-00 |
| శ్రీమాన్ శివరామ ప్రసాద్ గారు | కూచిపూడి | 9,000-00 |
| **హైదరాబాద్ ద్వారా :** | | |
| శ్రీమతి తోటా పుష్పాదేవి నరహరిరావుగారు | హైదరాబాద్ | 1,08,000-00 |
| శ్రీమాన్ పి. ప్రతాపరెడ్డిగారు | పెన్నార్ సిమ్మెంట్స్ | 1,00,000-00 |
| శ్రీమతి జె. వసుమతి భాస్కరరావుగారు | హైదరాబాద్ | 51,111-00 |
| శ్రీమాన్ బచ్చు జనార్ధన్‌గారు | హైదరాబాద్ | 51,000-00 |
| శ్రీమాన్ యన్. అశోక్ రెడ్డిగారు | M/s.భార్గవి రియల్ ఎస్టేట్స్, Hyd | 5,116-00 |

# వికాసదర్శిని నివేదన

**రాయల సీమ** :- శ్రీస్వామివారు బళ్ళారిలో 21వ, తేదీ శ్రీసీతారామ స్వామివారి కళ్యాణ మహోత్సవాన్ని జరిపించి అదే సాయంకాలం కడప జిల్లా పర్యటనకు బయల్దేరారు. రాయలసీమ ప్రాంతంలో వికాసతరంగిణి కార్యక్రమాలు తక్కువ. సూర్యప్రతాపం అధికంగా ఉన్నా లెక్కచేయకుండా గీతాజ్యోతి ప్రచారమే ధ్యేయంగా శ్రీస్వామివారు ఒక మూడురోజులు రాయలసీమలోని కడప, అనంతపూర్ జిల్లాల పర్యటించాలని సంకల్పించారు.

**కడప :** శ్రీలక్ష్మీనారాయణ దేవాలయం ధర్మకర్తలు, ఆ ప్రాంతంలో ధార్మిక, ఆధ్యాత్మిక సేవాకార్యక్రమాలు నిర్వహిస్తున్న శ్రీమాన్ పుత్తా నర్సింహారెడ్డిగారు, శ్రీమాన్ జ్యోతిరెడ్డిగారు, వారి సోదరులు, శ్రీస్వామివారు సంకల్పించిన గీతాజ్యోతి కార్యక్రమాన్ని కడప జిల్లాలో నిర్వహించడానికి ఉత్సాహంగా ముందుకు వచ్చారు. శ్రీమాన్ నర్సింహారెడ్డిగారు కడప జిల్లా పర్యటనలో స్వామివారితోకూడా అన్ని ప్రాంతాలు తిరిగారు.

ఏప్రిల్ 21వ తేదీ రాత్రి 1గంటకు 'కడప' పట్టణ సమీపంలోని 'మాచిరెడ్డిపాలెం' చేరుకొని శ్రీమాన్ పుత్తా నర్సింహారెడ్డిగారి గృహంలో బసచేసారు. 22వ, తేదీ ఉ॥ 9.30 ని॥లకు కడప పట్టణంలోని 'కడప కళాక్షేత్రం'లో పత్రికా ప్రతినిధులతో సమావేశం జరిగింది. శ్రీస్వామివారు వారికి గీతాజ్యోతి కార్యక్రమ లక్ష్యాన్ని, విధానాన్ని వివరించారు. ఈ కార్యక్రమాన్ని ఇంటింటికి అందించడానికి వారు పోషించవలసిన పాత్రను ఈ సందర్భంగా గుర్తుచేసారు.

అదే రోజు మధ్యాహ్నం హరిప్రియ హోటల్‌లో జరిగిన **గీతాజ్యోతి ధర్మక్షేత్ర ప్రతినిధుల సమావేశంలో** పాల్గొని వారికి మంగళాశాసనాలుకృపచేసారు. కడప కళాక్షేత్రంలో సాయంకాలం సభాకార్యక్రమానికి విచ్చేసిన భక్తజనసందోహానికి గీతాజ్యోతి కార్యక్రమ ఆవశ్యకతను తను మృదుమధుర వాక్కులతో అందించారు శ్రీవారు. కార్యక్రమంలో జిల్లా సహాయ జడ్జి శ్రీమాన్ మునిస్వామిగారు, శ్రీమాన్ శాస్త్రిగారు, శ్రీమాన్ పుత్తా నరసింహారెడ్డిగారు, శ్రీమాన్ లక్ష్మీకాంత శ్రేష్టిగారు, **Dist. Joint Collector** శ్రీమతి **S.M.** విజయలక్ష్మీగారు పాల్గొని శ్రీస్వామివారి కృపకు పాత్రులయ్యారు. జిల్లా కలెక్టర్ శ్రీమాన్ చంద్రమౌళిగారు రాత్రి గం॥ 9-00లకు శ్రీస్వామివారిని కలిసి కార్యక్రమ వివరాలను తెలుసుకొన్నారు. అదేరాత్రి సుమారు 2గం॥లకు కంబసముద్రం వేంచేసారు శ్రీస్వామివారు.

**కంబసముద్రం :** శ్రీస్వామివారికి శ్రీవేంకటేశ్వర దేవాలయంలో బస ఏర్పాటైంది. తీర్థగోష్ఠి అనంతరం గీతాజ్యోతి కార్యక్రమంపై తమ సందేశాన్ని భక్తులకు అనుగ్రహించారు శ్రీస్వామివారు. తరువాత చిట్వేలు మండల కేంద్రానికి వేంచేసి స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరబాద్ ను సందర్శించి స్టాఫ్‌కు మంగళాశాసనాలు కృపచేసారు.

స్థానికంగా ఉన్న **Z.P.H.S.** విద్యార్థులకు గీతాజ్యోతిలో భాగంగా చిత్రలేఖనపోటీ,





పారాయణ, వక్తృత్వపోటీ విశేషాల్ని కృపచేసి మంగళాశాసనాలంద చేసారు. విద్యార్థులూ, ఉపాధ్యాయులు శ్రీస్వామివారి మంగళాశాసనములను తమ హృదయాలలో పదిల పరచుకొని వేసవి సెలవులకు సిద్ధపడ్డారు. ప్రిన్సిపాల్ శ్రీమాన్ కె.యమ్. మనోహర రెడ్డిగారు ఇంతటి మధురా నుభూతిని తమకు ప్రసాదించినందుకు శ్రీస్వామిరికి అనేక కృతజ్ఞతా పూర్వక దాసోహములు సమర్పించుకున్నారు.

**రాజాం పేట :** మధ్యాహ్నం 12గం॥లకు రాజాంపేట వేంచేసి కన్యాకాపరమేశ్వరి ఆలయాన్ని సందర్శించారు. శ్రీస్వామివారు గీతాజ్యోతిని వెలిగించారు. గీతాజ్యోతి కార్యక్రమ విశేషాలను ఏకాదశీ ప్రాశస్త్యాన్ని భక్తులందరకూ తెలియజేసారు. ఈ కార్యక్రమంలో ప్రధాన కార్యదర్శి శ్రీమాన్ బాలయ్య గుప్తాగారు, స్థానిక **M.L.A.** శ్రీమాన్ వి. బ్రహ్మయ్య తమ బాధ్యతగ స్వీకరిస్తామని హామీ ఇచ్చారు.

**తాళ్ళపాక :-** సుమారు ఒంటిగంట ప్రాంతంలో బయల్దేరి అన్నమాచార్యుల అవతారస్థలమైన 'తాళ్ళపాక'ను సందర్శించి, అక్కడి భక్తులకు మంగళాశాసనాలు కృపచేసారు.

తదనంతరం 'ఆల్విన్ రిఫ్రిజరేటర్' అధినేత గారి ఆహ్వానంపై 'నందవారి' గ్రామాన్ని సందర్శించి వారికి గీతాజ్యోతి పరిచయం గావించారు.

**ఒంటిమెట్టు :-** సాయంకాలం 6 గం॥లకు ఒంటిమెట్టు పురాతన, ప్రఖ్యాత రామాలయాలను సందర్శించి అక్కడ చేరిన భక్తగోష్ఠికి గీతాజ్యోతి కార్యక్రమ ఆవశ్యకతను తెలియపరిచారు. ఆంధ్ర వాల్మీకి శ్రీ (వావిలకొలను సుబ్బారావు) శ్రీ వాసుదాస స్వామి తమ ఆస్తి నంతనూ యిచ్చి అభివృద్ధి పరచిన ఆలయమిది. వారిక్కడే 'మందరమును' రచించారు. ఈ రామునికే పోతనామాత్యుడు తాను రచించిన భాగవత గ్రంథాన్ని అంకితం ఇచ్చాడట. కార్యక్రమంలో పాల్గొన్న భక్తబృందానికి **M.L.A.,** శ్రీమాన్ బ్రహ్మయ్యగారికి, శ్రీమాన్ ఏసుపురెడ్డిగారికి, శ్రీమాన్ ధర్మయ్యగారు, వారి మిత్ర బృందానికి అడ్వకేట్ శ్రీమాన్ వావిలాల సుబ్బారావు గారికి తమ మంగళాశాసనముల నుగ్రహించి రాత్రికి కమలాపురగ్రామ ప్రజలకు గీతాజ్యోతి సందేశాన్ని అందించి, మాచిరెడ్డిపాలెం శ్రీమాన్ నర్సింహారెడ్డిగారి ఇంటిలో బస చేసారు శ్రీవారు.

**ఎర్రగుంట :-** 24వ తేదీ ఉదయం మాచిరెడ్డి పాలెం నుండి బయలుదేరి **ఎర్రగుంట** గ్రామస్థులకు గీతాజ్యోతి కార్యక్రమాన్ని పరిచయం చేసి స్థానిక కార్యకర్తలను, భక్తులకు తమ అనుగ్రహ మంగళాశాసనములు అందించారు.

**చెలమకూరు : నారాయణ స్వామి నగర్:-**

ఇండియా సిమెంట్ స్థానిక అధినేత శ్రీమాన్ సుందర రామన్‌గారి ఆహ్వానం మేరకు 'శ్యామసుందరేశ్వర స్వామి దేవాలయాన్ని' ఉదయం11-30 ని॥లకు సందర్శించారు శ్రీవారు. దేవాలయంలో అక్కడి కార్మిక, యాజమాన్యాలకు తమ అనుగ్రహభా షణాన్ని కృపచేస్తూ గీతాజ్యోతి కార్యక్రమ విశేషాలను అందించారు.

**కొండాపూర్ :-** మధ్యాహ్నం 1గంటకు కొండాపూర్ చేరుకున్నారు. ధర్మ క్షేత్ర ప్రతినిధి సి.జె. రామచంద్రారెడ్డిగారు, తదితరులలో కార్యక్రమ పర్యవేక్షణ గావించిచారు. వారికి

తగు సూచనలను, మంగళా శాసనాలను కృపచేసారు.

**యాడికి :-** సుమారు 3-30 ని॥లకు శ్రీమాన్ అచ్చయ్య, శ్రీమాన్ మెూహనరావుగారి ఆహ్వానాన్ని పురస్కరించుకొని యాడికిని సందర్శించారు శ్రీవారు. బాగుపడాలని కోరుకునే వారందరికీ గీతాచార్యుని మహోన్నత సందేశాన్ని అందించాలనే తమ దివ్య సంకల్పంలో భాగంగా 'గీతాజ్యోతి' కార్యక్రమ రూపురేఖలను వారికి విశదపరచి, మంగళాశాసనాలను అందించారు.

**తాడిపత్రి :-** సాయంకాలం 5-30 ని॥లకు తాడిపత్రి చేరుకొని ఉడయవర్ల సన్నిధి సేవించుకున్నారు శ్రీవారు. అనంతరం చింతల వెంకటేశ్వర స్వామివారి దేవాలయాన్ని సందర్శించారు. శ్రీమాన్ కె.శ్రీనివాసాచార్యులు, శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగారు పూర్ణకుంభంతో శ్రీవారికి ఘనస్వాగతం పలికారు. జె.సి. దివాకరరెడ్డి గారి నేతృత్వంలో దేవాలయ పునరుద్ధరణ కార్యక్రమం కొనసాగుతూంది. స్థానిక వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ రవి మరియు ఇతర కార్యకర్తలకు మంగళా శాసనాలు కృపచేసారు. గీతాజ్యోతిలో తమవంతుసేవ లందిస్తామని **M.L.A.,** శ్రీమాన్ రెడ్డిగారు వాగ్దానం చేసారు. శ్రీమాన్ పుత్తా నర్సింహారెడ్డిగారి ప్రేరణతో వీరికార్యక్రమంలో ఉత్సాహంతో పాల్గొన్నారు.

**అనంతపూర్ :-** రాత్రి 8-30 ని॥లకు అనంతపూర్‌లోని యల్&టి. సిమెంట్ ఫ్యాక్టరీని సందర్శించారు. గీతాజ్యోతి కార్యక్రమాన్ని ప్రారంభించారు శ్రీవారు. 28వ తేదీ ఉదయం 9-30 ని॥లకు ఆరాధన పూర్తి చేస్కొని బెంగుళూరుకు బయలుదేరారు.

## బెంగుళూరులో శ్రీవారు

బెంగుళూరు హైటెక్ సిటి వికాసతరంగిణి అభ్యర్థనమేరకు శ్రీవారు 26-4-02 నుండి 30-4-02 వరకు ప్రవచనములందించారు. కార్యక్రమం 5 రోజులే అయినా 7 రోజులు శ్రీస్వామివారు వేంచేసి ఉన్నారు. వేసవి ప్రతాపం తీవ్రతలో విశాలమైన ప్రాంగణంలో అందంగా నిర్మించిన 'శివబాలయోగి' ఆశ్రమంలో శ్రీస్వామివారికి బస ఏర్పాటు చేసారు.

ప్రతిరోజు ఉదయం రాగిగుడ్డ శ్రీ ప్రసన్నాంజనేయ స్వామి ఆలయ కళ్యాణ మండపంలో శ్రీస్వామివారు తెలుగులో శ్రీరామాయణంలోని విమర్శనాత్మకమైన అంశాలపై ప్రవచనం కావించారు. సాయంకాలం జె.పి. నగర్‌లోని **SSMRV** కాలేజి ఆడిటోరియంలో శ్రీవిష్ణుసహస్రనామ వైభవంపై ఆంగ్ల భాషలో ప్రవచించారు.

26వ, తేదీ ఉదయం కార్యక్రమానికి ముఖ్య అతిథిగా రాగిగుడ్డ ప్రసన్నాంజనేయ దేవాలయం అధ్యక్షులు శ్రీమాన్ కె.పి. రావుగారు, సాయంకాల కార్యక్రమానికి రాష్ట్రీయ శిక్షణ సమితి అధ్యక్షులు, దక్షిణ భారత అంతర్జాతీయ రోటరీ క్లబ్ డైరెక్టరు, రాజ్యోత్సవ అవార్డు గ్రహీత శ్రీమాన్ పాండు రంగశెట్టిగారు ముఖ్య అతిథిగా విచ్చేసారు. ఇక్కడి వికాసతరంగిణివారు ఇలా ప్రతిరోజూ కొంతమంది ప్రముఖులను ఆహ్వానించి స్వామివారిసందర్శన భాగ్యాన్ని ప్రసాదించారు. బహుముఖ ప్రజ్ఞాశాలి శ్రీమాన్ ముత్తూరు కృష్ణమూర్తిగారు, కెప్టెన్ మోహనరావుగారు, జస్టిస్ శ్రీమతి మంజులగారు, డిప్యూటి డైరెక్టర్ ఆఫ్ పోలీస్ గారు, మేల్కోటలోని **Academy**





**of Sanskrit Reaserch Director** శ్రీ ఉ.వే.శ్రీమాన్ లక్ష్మీ తాతాచార్యులు ముఖ్య అతిథులుగా విచ్చేసారు.

చివరిరోజైన 30వ తేదీన సాయంకాల సభకు ముఖ్య అతిథిగా కర్ణాటక రాష్ట్ర గవర్నర్ శ్రీమతి సిహెచ్. రమాదేవిగారు విచ్చేసారు. గతంలో శ్రీస్వామివారి ప్రవచనాల్లో ఎన్నో విశేషాలు తానుగూడ నేర్చుకున్నానని, వాటిని అక్కడక్కడ చెపుతుంటానని స్వచ్ఛమైన తెలుగులో మాట్లాడారు. 10 ని॥ల్లో వెడదామనుకున్న వారు ప్రవచనామృతాన్ని గ్రోలుతూ గంటసేపు అలాగే ఉండిపోయారు.

26వ తేది మధ్యాహ్నం కమ్మవారి సమాజం నిర్వహిస్తున్న ఇంజనీరింగ్ కాలేజిని సందర్శించి విద్యార్థులందరి నుద్దేశించి స్ఫూర్తిదాయకమైన ప్రవచనాన్ని అందించారు.

1

సావనీర్ ఆవిష్కరిస్తున్న శ్రీవారు

27వ తేదీన బెంగుళూరు వికాసతరంగిణి వారు తయారు చేసిన సావనీర్‌ను శ్రీస్వామి వారు ఆవిష్కరించారు. ఈ సావనీర్‌ను ఇంత అందముగా తీర్చిదిద్దిన కుమారి భవిష్య, దీప, జయ, శారదగార్లకు శ్రీస్వామివారు ప్రత్యేక మంగళా శాసనములను కృపచేసారు.

అనంతరం **'చిత్రభాను'** నామ సంవత్సరాన్ని సార్థకం చేస్తూ ఉగాది నుండి ఉగాది వరకు సంవత్సరం పొడవునా జరిగే **గీతాజ్యోతి** కార్యక్రమాన్ని గూర్చి శ్రీస్వామి వారు హైటెక్ సిటీ ప్రజలకు సమగ్ర అవగాహన కల్గించారు.

2

అమ్మవారి ప్రతిమను అందిస్తున్న శ్రీశ్రీశ్రీస్వామివారు

28వ తేదీ ఉదయం రామాయణ ప్రవచనం అనంతరం శ్రీ లక్ష్మీనారాయణ పూజా కార్యక్రమం శ్రీస్వామివారు భక్తు లందరిచేత విధివిధానంగా చేయించారు. సాయంకాలం 4 గంటలకు 'తిరువనందాళ్వార్ సన్నిధి ట్రస్ట్' వారి ఆహ్వానంపై శ్రీస్వామివారు వేంచేసి శ్రీవేంకటేశ్వర స్తుతిమాల (కన్నడ భాషలో) గ్రంథాన్ని ఆవిష్కరించారు. భగవద్రామానుజుల శిష్యులు తిరువనందాళ్వాన్ రచించిన ఈ గ్రంథాన్ని శ్రీ ఉ.వే.శ్రీమాన్ పల్లప్పన్ గారు కన్నడ భాషలోకి అనువదించారు. శ్రీస్వామివారు వారి కృషిని శ్లాఘించారు. వారు ఒక ఆలయాన్ని కూడా నిర్మించ తలపెట్టి, అందులో వేంకటేశ్వరస్వామి, నమ్మాళ్వార్, రామానుజులు, తిరువనందా

3
Ushagaru

కార్యక్రమ బాధ్యతను వహించిన శ్రీమతి ఉషగారు

ళ్వాన్ సన్నిథులు ఏర్పాటు చేస్తామన్నారు. దీనికి గాను శ్రీస్వామివారు రూ. 50,000/- విరాళాన్ని ప్రకటించి వారిని ఆనంద పరవశుల్ని కావించారు. రాత్రి 10-30 ని॥లకు ఇచ్చటి వికాసతరంగిణి సభ్యులతో సమావేశం జరిగింది. భవిష్యత్తులో సేవాకార్యక్రమాలు ఎలా నిర్వహించాలి, ప్రస్తుతం గీతాజ్యోతి కార్యక్రమాన్ని అందరికి అందించడానికి కార్యరంగాన్ని ఎలా సమాయత్తం చేసుకోవాలి అనే విషయాలపై చర్చిస్తూ శ్రీస్వామివారు తగిన సూచనలందించారు.

29వ తేదీ మధ్యాహ్నం స్థానిక 'శ్రీ వైష్ణవ సంఘం'వారి ఆహ్వానాన్ని పురస్కరించుకొని శ్రీస్వామివారు 'శ్రీవిష్ణుచిత్త విద్యార్థి నిలయాన్ని' సందర్శించారు. శ్రీపాంచరాత్రాగమంలో, స్తోత్రాల్లో విద్యార్థులకు శిక్షణని, వేసవి శిబిరంలు. ఇక్కడ ఈ సంస్థ అధ్యక్షులు శ్రీమాన్ ఆర్. కేశవాచార్యులకు, కార్యదర్శి, శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్యులకు విద్యార్థులకు, అధ్యాపకులందరికి మంగళాశాసనాలఅందించారు. ఆ సాయంకాలం శ్రీపాంచరాత్రాగమ కళాశాల -**KCL** - జగ్గయ్యపేట విద్యార్థులు చి॥ హరీష్ మరియు చి॥ రాఘవ 'సహస్రనామ అవధానం' చేసి హైటెక్ సిటీ వాసులందరినీ సంభ్రమాశ్చర్యాలతో చకితులను చేసారు.

చిన్నారుల అవధాన పటిమకు ముగ్ధులైన వారిలో వదాన్యులొకరు రూ. 10,116/- క్యాష్ అవార్డు బహూకరించారు.

30వ తేదీ ఉదయం రాగిగుడ్డ ప్రసన్నాంజనేయ స్వామి దేవాలయంలో ప్రవచనాలు ముగించి ఉ॥ 10-30 గం॥లకు **SSMRV** మెడికల్ కాలేజ్‌ని సందర్శించారు. 17,000 మంది విద్యార్థులు, 28 Board of Trustees కల్గిన అతిపెద్ద వైద్యవిద్యాసంస్థ. శ్రీస్వామివారి సాయంకాల ప్రవచనం రోజూ ఈ కాలేజిలోని ఆడిటోరియంలో జరుగుతోంది. ఈ రోజు ప్రత్యేకంగా ఆ కళాశాల వైద్య అధ్యాపక, విద్యార్థులనుద్దేశించి ఒక గంట సేపు శ్రీస్వామివారు స్ఫూర్తిదాయకమైన సందేశాన్నిచ్చారు. **'స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః'** అనే శ్రీకృష్ణభగవానుని దివ్య సందేశాన్ని శ్రీస్వామివారు అనేక ఉపమానములతో వివరించారు. వారందరి హృదయాల్లో భగవదారాధనా పూర్వక సేవా తత్పరతను నింపారు. తర్వాత 45 ని॥లు విద్యార్థుల సందేహాలకు శ్రీస్వామివారు చక్కని సమాధానాలు కృపచేసి అందరికి మంగళా శాసనాలందించారు.

ఈ 5 రోజుల కార్యక్రమంలో విశేష సేవలనందించిన వదాన్యులందరికి శ్రీస్వామివారు తమ దివ్యమంగళాశాసనములు కృపచేసారు. ముఖ్యంగా బెంగుళూరు వికాసతరంగిణి బృందము Colnol T.K. రావుగారు, Income Tax Commissioner శ్రీమాన్ K.V. చౌదరిగారు, శ్రీమాన్ G. పద్మనాభంగారు, శ్రీమాన్ హరి ప్రసాద్‌గారు, శ్రీమాన్ మహాదేవనాయుడుగారు, శ్రీమాన్ ఉష జగదీష్‌గారు, శ్రీమాన్ కృష్ణాంజనేయులు గారు, శ్రీమతి కనకప్రభగారు, శ్రీమతి పుష్పవల్లిగారు, శ్రీమతి అనంతగారు, శ్రీమతి ఉషగారు, శ్రీమతి శారదగారు, శ్రీమతి జయలక్ష్మిగారు, రంజనిగారు, భవిష్యగారు, దీపగారు తదితరులందరూ కార్యక్రమ వైభవాన్ని





ద్విగుణీకృతం చేసి స్వామివారి దివ్యానుగ్రహానికి పాత్రులయ్యారు.

మే 2 నుండి మే 14దాక గీతాజ్యోతి కార్యక్రమ పర్యవేక్షణ గావిస్తూ హైదరాబాద్ J.E.T లో వేంచేసి ఉన్నారు శ్రీవారు. ప్రతిరోజూ ఉదయం తీర్థగోష్ఠితో పాటూ అక్కడ వారందరకీ ఆయావారము గీతాజ్యోతిని అందించారు. మే4వ తేదీన శ్రీమాన్ రామ

3 B.

శ్రీస్వామివారితో సత్యంకంప్యూటర్స్ C.M.D., శ్రీమాన్ రామలింగరాజుగారు మరియు కరమ్షియల్ టాక్స్ కమీషనర్ శ్రీమాన్ రమేష్‌గారు

లింగరాజుగారు, సత్యం కంప్యూటర్స్ C.M.D., శ్రీమాన్ రమేష్‌గారు, కమర్షియల్ టాక్స్ కమీషనర్‌గారు శ్రీస్వామివారిని సేవించుకున్నారు. వారికి శ్రీవారు గీతాజ్యోతి కార్యక్రమ ప్రాధాన్యతను గూర్చి వివరించారు. మే6న బండగూడెం దగ్గర R.S.S వారి Campకి శ్రీ స్వామివారిని ఆహ్వానించారు. శ్రీ స్వామివారు వారికి **గ్రామాలఐక్యత-మన కర్తవ్యం** అనే అంశాన్ని బోధించి గీతాజ్యోతి వివరాలను వారికి స్పష్టం చేసారు.

**హృషీకేశ్ :** మే14, రాత్రి భాగ్యనగరం నుండి బయలుదేరి ఢిల్లీ చేరారు శ్రీవారు. 15వ తేదీ ఉదయం ఢిల్లీ నుండి హృషీకేశ్‌లోని మన వేదపాఠశాలకు వేంచేసారు.అక్కడ ఉన్న వేదవిద్యార్థులకు మంగళాశాసనాలు కృపచేసి, వారి అధ్యయనాన్ని పరిశీలించి, వారికి తగు సూచనలందించారు.

4

శ్రీస్వామివారితో శ్రీమాన్ డా॥ రామేశ్వరరావుగారు

J.E.T కోశాధికారి శ్రీమాన్ Dr. రామేశ్వరరావు గారు, సుమారు 300 మంది భక్తులు కూడరాగ 16 సాయంకాలానికి బదరీకాశ్రమానికి చేరారు. అప్పటికే సుమారు 700 మంది అక్కడకు వచ్చిఉన్నారు. వారందరికీ వసతిని మన ఆశ్రమంలోనూ, భారత్ సేవాశ్రమ్, అప్పటికి తెరచిఉన్న ఇతర ఆశ్రమాలలోనూ కల్పించారు. తదీయారాధన మాత్రం మన క్షేత్రంలో ఇంకా ఆలయం తెరవకముందే ఆరంభమైంది.

17వ తేదీ ఉదయం జ్యోతిర్దర్శనం చేసుకున్నారు శ్రీవారు. ఆ తర్వాత మన అష్టాక్షరీ క్షేత్రంలోని శ్రీశ్రీనివాస పెరుమాళ్, భాష్యకారుల సన్నిధిలో పెరుమాళ్ళకు అభిషేకం జరిగి నిత్యారాధన, అన్నదాన కార్యక్రమాలువైభవంగ ఆరంభం అయ్యాయి.

ఈసారి మంచు బదరీలో అధికంగ పడ్డ సూచనలు మన క్షేత్రంలో ప్రస్ఫుటంగ కనిపిస్తున్నాయి. ఇంతవరకు వసతికోసం ఉపయోగిస్తున్నటువంటి 20గదులు కలిగినటువంటి రామానుజకూట భవనం మంచు తీవ్రత వల్ల Roof పూర్తిగ దెబ్బతిని, ఉన్న గదులు శిథిలం అయిపోయాయి. ఇది ఊహిస్తున్న పరిణామమే అయినప్పటికీ ఇంత త్వరగజరగటం కొంత ఇబ్బందికరమే

అనిపించింది. దానితోపాటూ సత్సంగ సదనంలో వానలు కూడ కురుస్తూండటం వల్ల, క్రింద వంటశాల ప్రక్క స్థలమంతా పూర్తిగ ఉపయోగించుకోవడానికి అవకాశం లేకున్నందువలన శ్రీశ్రీశ్రీ స్వామివారు, శ్రీమాన్ Dr. రామేశ్వరరావు గారు, తదితర ప్రముఖులతో దాని జీర్ణోద్ధరణ గురించి చర్చించారు.

జూలై నెలదాక భక్తుల రాకపోకలున్నా, ఆ తరువాత జీర్ణోద్ధరణకు అవకాశమేర్పడుతుంది కనుక జూలై నెలాఖరులోపు అతి ప్రాచీన కట్టడమైన సత్సంగసదనాన్ని పూర్తిగ తొలగించి పునర్నిర్మాణాం చేయాలని నిశ్చయం చేసారు.

సుమారుగ 100 అడుగుల పొడవు, 28 అడుగుల వెడల్పు ఉండే నిర్మాణస్థలం సత్సంగసదనానిది. ఇందులో చాలా భాగం పాతకట్టడంలో మట్టి, రాళ్ళతో కట్టడం వలన గోడలకే పోయింది. ఇపుడు ఆ భాగాన్ని ఉపయోగించుకోవడానికి తగినవిధంగ, బదరీ వాతావరణానికి అనుకూలంగ భవన నిర్మాణం సాగాలని తీర్మానించారు.

అందులో క్రిందిభాగంలో వంట, తదీయారాధన వ్యవస్థ, ఒక స్టోర్ ఏర్పాటుచేయాలని, గ్రౌండ్‌తో సమానంగ వచ్చే భాగంలో భక్తులు ఉండడానికి కొన్ని డార్మెటరీన్, 4,5 గదులు నిర్మాణం చేయాలని, మొదటి అంతస్థులో పెరుమాళ్ళను వేంచేపు చేసి భక్తులకు ఉపయోగించేవిధంగ నిర్మాణం చేయాలని శ్రీశ్రీశ్రీ స్వామి వారు సంకల్పించారు.

తాత్కాలిక అంచనాల ప్రకారము దీనికంతటికీ సుమారుగ 75 నుండి 80 లక్షల దాక ఖర్చు కావచ్చును. ఈ విషయంలో సరియైన Plan, అక్కడి మున్సిపాలిటీ వారి అనుమతి పొందడం మొదలైన పనులు జూన్ నెలాఖరులోగ పూర్తి కావాలి. వానాకాల ఆరంభంలో నిర్మాణం ప్రారంభం అయ్యి దసరాలోపు కనీసం తదీయారాధనవ్యవస్థ, వంటశాల వరకూ పూర్తిచేయాలని నిర్ణయం తీసుకోవడం జరిగింది.

ఈసారి లోపలిభాగంలో పూర్తిగ చెక్కలను కూడ అమర్చి నిర్మాణం చేయుడం అవసరమని భావించారు. అలాచేయుడం వలన అక్కడి చలి వాతావరణం నుండి రక్షణ కల్పించగలుగుతామని నిర్ణయం తీసుకోవడం జరిగింది.

యాత్ర ఒత్తిడి అధికంగ ఉన్నప్పటికీ, జల, విద్యుత్ సౌకర్యాలు తీవ్ర మంచుతాకిడికి గురై సరిగ పనిచేయకపోయినా, మన క్షేత్రంలో హైదరాబాద్ భక్తులు ఏర్పాటుచేసిన జనరేటర్ వలన భక్తుల వసతి, ఆహారం, ఆరాధనలకు ఎలాంటి అసౌకర్యమూ కలుగలేదు.

కుమారి ఉషశ్రీ కార్యనిర్వహణ బాధ్యతను స్వీకరించి, ఒకరోజు ముందుగ బదరీకాశ్రమానికి చేరి మన క్షేత్రాన్ని భక్తులకు సిద్ధం చేసారు. శ్రీమతి సుబ్బమ్మ, శ్రీమతి కమలమ్మ, శ్రీమాన్ శ్రీధర్, శ్రీమాన్ బాలగారి దంపతులు, వంటస్వామి శ్రీమాన్ వేంకటాచార్యులు, స్వామికి అర్చనసేవ అందించే శ్రీమాన్ హరికృష్ణ, ప్రతిరోజు పెరుమాళ్ళ దగ్గర, అన్నదాన కైంకర్యము

24/
bnmay02.p65



చేసిన భక్తుల గోత్రనామములతో పూజ జరిపి, వారికి ప్రసాదాన్ని పంపించటానికి జగ్గయపేట ఆగమవిద్యార్థులు చి॥ కూర్మనాథాచార్య, చి॥ రాఘవాచార్య శ్రీశ్రీశ్రీ స్వామి వారి మంగళాశాసనాలు అందుకున్నారు.

శ్రీశ్రీశ్రీ స్వామివారు స్వయంగ తామే దగ్గరుండి పూజాకార్యక్రమాన్ని నిర్వహింపచేసి, భక్తులకు ప్రసాదాన్ని పంపే ఏర్పాట్లను పర్యవేక్షించారు.

ఈ సంవత్సరం తదీయారాధన కైంకర్యాన్ని అందించిన విజయనగర గోష్ఠి వారు శ్రీమతి బేబిగారు, శ్రీమతి రమణమ్మగారి నేతృత్వంలో సుమారు ఓ 300మంది మన క్షేత్రంలో ఒక వారంరోజులు ఉండి తమ తదీయారాధన కైంకర్యాన్ని నాలాయిర దివ్యప్రబంధ పారాయణానుసంధానంతో సమర్పించి ఆ బదరీశుని అనుగ్రహానికి పాత్రులయ్యారు.

18వతేదీన శ్రీస్వామివారు బదరీ నారాయణుడిని సేవించుకొని, భక్తులకు ఆ స్వామి వైభవాన్ని కృప చేసారు. అష్టాక్షరీ మంత్రం ఆవిర్భవించిన ఆ పవిత్ర క్షేత్రంలో సమాశ్రయణ కార్యక్రమాన్ని అనుగ్రహించారు శ్రీవారు.

18వ తేదీ మధ్యాహ్నం నుండి శ్రీస్వామి వారు బదరీ నుండి క్రిందకు పయనమయ్యారు. రాత్రికి హృషీకేశ్ చేరుకున్నారు.

19వ తేదీ ఉదయం ఫరీదాబాద్ లోని సిద్ధదాతాశ్రమ నిర్వాహకులు **శ్రీశ్రీశ్రీ జగద్గురు సుదర్శనాచార్యస్వామివారి** ఆశ్రమాన్ని సందర్శించి వారిని పరామర్శించారు. గత ఏడాది ఆపరేషన్ జరిగిన పిమ్మట కోలుకోవడంలో కొంత ఆలస్యం జరిగినా కొద్ది కొద్దిగ కోలుకుంటున్న వారు తలపెట్టిన శ్వేతసౌధ నిర్మాణాన్ని పరిశీలించి, సాయంకాలం బయలుదేరి గగన మార్గాన భాగ్యనగరానికి వేంచేసారు శ్రీవారు.

**భాగ్యనగరం :-** 20వ తేదీన హైదరాబాద్ జెట్ భవనంలో వేంచేసి, గీతాజ్యోతి కార్యక్రమానికి అవసరమైన 48శ్లోకాల తాత్పర్యాన్ని, చిత్రగీత రచనను గావించారు.

మే 20న **భక్తినివేదన సంపాదకులు శ్రీ.ఉ.వే.శ్రీమాన్ రామచంద్రాచార్య స్వామి** వారిచే సంపాదకీయంగా ప్రతీనెలా భక్తి నివేదనలో వెలువడుతూన్న సుందర పాండ్యుని సుమధుర సూక్తులు **'ఆర్యోక్తి సుధ'**గా రూపొంది శ్రీశ్రీశ్రీ స్వామి వారి కరకమలముల మీదుగా ఆవిష్కృతమైనది. శ్రీ ఉ.వే. శ్రీమాన్ రంగరామానుజాచార్య స్వామివారు కూడా ఈ కార్యక్రమంలో వేంచేసి ఉన్నారు.

21వ తేదీ సాయంకాలం వైజాగ్‌కు పయనమయ్యారు శ్రీవారు. దారిలో విజయవాడ రైల్వేస్టేషన్‌లో సీతానగరం నుండి వేదవిద్యార్థులు, ఆచార్యులను సేవించుకొని వారి మంగళాశాసనాలను పొందారు.

**పెందుర్తి** : ఉభయ వేదాన్తాచార్య పీఠం నేతృత్వంలో నిర్వహించబడుచున్న శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ఆలయపరివారంలో ఒకటైన విశాఖ పట్టణం జిల్లా, పెందుర్తిలో గోవిందరాజ స్వామి వారి ప్రతిష్ఠా కార్యక్రమంలో అన్వయించారు శ్రీవారు. తరువాత

శ్రీనివాస పెరుమాళ్ళను, పద్మావతీ అమ్మ వారిని సేవించుకొని, ఎన్.జి.ఓ కాలనీలో నూతనంగాప్రతిష్ఠ గావించుకొన్న వేంకటేశ్వర స్వామివారి దేవాలయాన్ని సేవించుకున్నారు.

కాశీరాజు గారి ఆహ్వానం పై U.A.Nరాజు గారి గృహాన్ని పావనం చేసారు శ్రీవారు. వారిని పరామర్శించి, మంగళా శాసనాలు కృపచేసి సీతానగరం వేంచేసారు.

23 ఉదయం సీతానగరంలో తీర్థగోష్ఠి, telebridze అయిన తరువాత, రాయుడు పాలెం వేంకటేశ్వరస్వామి వారి నూతన ఆలయ ప్రతిష్ఠలో అన్వయించారు. 23 సాయంత్రం శ్రీమాన్ వీరయ్యగారి ఆహ్వానం పై శ్రీ వేంకటేశ్వరస్వామి వారి బ్రహ్మోత్సవాల్లో పాల్గొనటానికి ఖమ్మంజిల్లా కల్లూరు వేంచే సారు శ్రీశ్రీశ్రీ స్వామివారు.

భద్రాచల క్షేత్రంలోని వికాసతరంగిణి, శ్రీజీయర్ మఠాన్ని ఎంతో సమర్థవంతంగా నిర్వహిస్తున్న శ్రీమాన్ పి.జె. భట్టార్‌గారు 'గీతాజ్యోతి' ఖమ్మంజిల్లా ప్రచారానికై ఒక మారుతీవ్యాన్‌ని 'గీతాజ్యోతి రథం'గా ఏర్పాటు చేశారు. జూన్ రెండవ వారంలో జరుగబోయే శ్రీస్వామివారి గిరిజన ప్రాంతాల పర్యటనకోసం ప్రచారనిమిత్తంగా సర్వాంగసుందరంగా తయారైన 'గీతారథాన్ని' శ్రీవారు ఆవిష్కరించి, శ్రీమాన్ భట్టర్‌గారికి 'గీతాజ్యోతి' ప్రచారాన్ని నిర్విరామంగా నిర్వహిస్తున్న శ్రీమాన్ గట్టు వెంకటాచార్యులగార్కి, శ్రీమాన్ అల్లూరి సీతారామరాజుగారికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు కృపచేసారు.

25వ తేదీన సత్తుపల్లి వేంచేసి అక్కడ వికాసతరంగిణి నిర్వహిస్తున్న వైద్యశిబిరాన్ని పర్యవేక్షించారు. 26వ తేదీ వరకు కల్లూరు బ్రహ్మోత్సవాలలో వేంచేసి ఉండి పరిసరప్రాంతాలలో గీతాజ్యోతి కార్యక్రమ పర్యవేక్షణ కావించారు.

26వతేదీన సీతానగరం వేంచేసి, 27 ఉదయం తీర్థగోష్ఠిని అనుగ్రహించి, నెల్లూరులో గోమతీస్కూలు ఆవరణలో జరుగు గీతాజ్యోతి కార్యక్రమంలో అన్వయించటానికి నెల్లూరు వేంచేసారు శ్రీవారు.

## గీతాజ్యోతి కార్యక్రమ వివరాలు

**శ్రీకాకుళం** : - శ్రీకాకుళం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమం స్థానిక దాసన్నపేటలోని శ్రీరామమందిరంలో వైభవంగ ప్రారంభించబడినది. సమాజంలో ఈర్ష్యాద్వేషాలను తొలగించి సమైక్య, సామరస్య భావాలను సాధించేందుకు గీతాజ్యోతి కార్యక్రమం చేపట్టినట్లు వికాసతరంగిణి జిల్లా కార్యదర్శి శ్రీమాన్ రుక్మాంగధరరెడ్డిగారు తెలిపారు. భగవద్గీత శ్లోక సారాన్ని అందుకో గలిగితే మానసికంగ, శారీరకంగ, సామాజికంగ అభ్యున్నతి సాధించవచ్చునని శ్రీమాన్ పి.బి. విశాల్ గుప్తగారు అన్నారు. ఇంకా కార్యక్రమంలో మాటూరి సూర్యారావు, సాక్షి గోపాలా చార్యులు పాల్గొన్నారు.

**విజయవాడ** :- గీతాజ్యోతి కార్యక్రమం విజయవాడ నగరంలో పటమట ధర్మక్షేత్ర

కేంద్రముగ ప్రచార కార్యక్రమం ముమ్మరంగ జరుగుచున్నది. శ్రీమతి లలిత కుమారిగారు, శ్రీమాన్. టి. కోటేశ్వరరావుగారు చుట్టుప్రక్కల 50 గ్రామాలలో గీతాజ్యోతి కార్యక్రమం యొక్క ప్రాముఖ్యతను తెలియజేస్తూ భగవద్బంధువులను చైతన్యవంతులుగా చేస్తున్నారు.

**తిరుపతి** :- గీతాజ్యోతి ధార్మిక ఉద్యమం శ్రీనివాసుని నివాస స్థలమైన తిరుపతిలో వేగిరంగ ప్రచారం జరుగుచున్నది. జిల్లా అంతటా 6 ధర్మక్షేత్రాలుగ విభజింపబడి ప్రచారం జరుగుచున్నది. ఈ ధార్మిక కార్యక్రమంలో ప్రజాప్రతినిధులు, ఉన్నత స్థాయి అధికారులు, టి.టి.డి. ఆధ్వర్యవంలో నిర్వహించబడు కొన్ని స్వచ్ఛంద సేవా సంస్థలు, ఈ కార్యక్రమంలో భాగస్వామ్యం కల్గిఉన్నారు.

**గుంటూరు** :- గుంటూరు జిల్లా గీతాజ్యోతి ధార్మిక ఉద్యమం ప్రచారం ఉత్సాహంగ జరుగుచున్నది. జిల్లా అంతటా 5 ధర్మక్షేత్రాలుగ విభజించబడి, ఆ ధర్మక్షేత్ర కన్వీనర్లు ఇంటింటా ధార్మిక ప్రచారం, భగవద్గీతయొక్క విశిష్టతను తెలియజేస్తు వారికి అవసరమైన సమాచారమును తెలియ జేస్తున్నారు.

**విశాఖపట్నం** : విశాఖపట్టణం వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో శ్రీవారి మంగళాశాసనములతో సింహాదేవుని సన్నిధిలో శ్రీవారి కళ్యాణ మండపంలో గీతాజ్యోతి కార్యక్రమం శుభారంభమైంది. ముందుగ శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్ర పారాయణం జరిగిన తరువాత **భక్తినివేదన సంపాదకులు శ్రీ ఉ.వే.శ్రీమాన్ టి.వి. శ్రీరామచంద్రాచార్యస్వామివారు** గీతాజ్యోతి కార్యక్రమం గూర్చి, శ్రీవారి సంకల్పాన్ని గూర్చి వివరణ యిచ్చారు. మొదటినెలకు సంబంధించిన శ్లోకాలను శ్రీమాన్ శ్రీరామ చంద్రాచార్యస్వామివారు భక్తులచేత పారాయణ చేయించారు.





3 వేల మంది భక్తులు పాల్గొనుట జరిగినది. **శ్రీ ఉ.వే.శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలా చార్య స్వామివారు** గురజాడ కళాక్షేత్రంలో జరిగిన కార్యక్రమంలో, సుజాత నగర్ శ్రీవేంక టేశ్వరస్వామివారి కోవెలలో కూడ కార్యక్రమం ప్రారంభించినారు. విశాఖ జిల్లాలో ధర్మక్షేత్ర కేంద్రాలుగ చోడవరం, నర్సీపట్నం, అనకాపల్లి, పాయకరావుపేట, మాడుగుల, పెందుర్తి సంబంధించిన కార్యకర్తలు పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో, యస్. రామానుజం, సుదర్శన స్వామిగారు, సత్యనారాయణగారు, విశాఖలోని అనేక వికాసతరంగిణి శాఖల కార్యకర్తలు పాల్గొన్నారు.

**కరీంనగర్** : కరీంనగర్ విద్యానగర్ వికాస తరంగిణిశాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమం స్థానిక శ్రీలక్ష్మీవెంకటేశ్వర స్వామి వారి కోవెలలో ఉదయం గం॥ 10-30 ని॥లకు ప్రారంభమైనది. స్వామివారి సన్నిధిలో 300 మంది భక్తులు నేతిదీపాలు వెలిగించి 48 శ్లోకాలు పారాయణం చేయడం జరిగింది. జైశ్రీమన్నారాయణ! సంకీర్తనలతో 100 గృహాలపైన హనుమ ధ్వజాలను ఎగుర వేయడం జరిగింది.

ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి కార్యదర్శి శ్రీమాన్ తూపురాణి రంగా చార్యులు, శ్రీమాన్ రవీంద్రరావు, సత్యనారా యణ రెడ్డిగారు పాల్గొన్నారు.

**చలివేంద్రం:-**శ్రీవారి మంగళాశాసనము లతో కరీంనగర్ వావిలాలపల్లి వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో జిల్లా ప్రధాన వైద్యశాలలో ఆవరణలో వేసవి దాహార్తులకు చల్లని నీరు అందించుటకు చలివేంద్రము ప్రారంభించబడింది. మునిసిపల్ చైర్మన్ శ్రీమాన్ హన్మంత రెడ్డిగారు, డా॥ హనుమంత రావుగారు, వికాసతరంగిణి కార్యకర్తలు, భగవద్బంధు వులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## వేసవి శిక్షణ శిబిరం

శ్రీవారి మంగళాశాసనములతో... సికింద్రాబాద్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్య వంలో 1-5-02 నుండి 7-5-02 వరకు వేసవి శిక్షణ శిబిరం నిర్వహించబడినది. ఈ కార్యక్రమంలో పర్సనాలిటీ డెవలప్‌మెంట్, మెడిటేషన్, యోగ, సమగ్రమైన ఆహారం ఎలా తీసుకోవాలి, భగవద్గీత శ్లోకాలు, మొదలైన వాటిలో విద్యార్థులకు చక్కటి శిక్షణ యిచ్చారు. ఈ కార్యక్రమంలో 50 మంది విద్యార్థులు పాల్గొన్నారు. శ్రీమతి మంజుల గారు, డా॥ శ్రీమతి శోభజయంత్ గారు, భాగ్యరాజు, వెంకటరెడ్డిగారు, శ్రీనివాసరావు గారు, అనిల్ కుమార్‌గారు, క్లాస్‌లు తీసు కొన్నారు. ఈ కార్యక్రమం నిర్వహించినపుడు శ్రీవారు హైదరాబాద్‌లో వేంచేసియున్నారు. కార్యక్రమం బాగా జరిగినందుకు శ్రీస్వామి వారు తమ ఆనందాన్ని వ్యక్తపరుస్తూ కార్యకర్త లందరికీ మంగళాశాసనాలు అనుగ్రహించారు.

## తిరువేంగడత్తందాది

### గ్రంథ పరిచయం

దివ్యకవిగా వాసిగాంచిన పిళ్ళై పెరుమాళ్ అయ్యంగార్ అనేవారు తమిళ సాహిత్యంలో కంబమహాకవికి ఉజ్జీగా పేరొందినవారు. తిరుమల శ్రీనివాసుని విషయంలో ద్రవిడభాషలో 'అంతాదిగ' వారొక శతకాన్ని రచించేరు. ఆళ్వారుల శ్రీసూక్తిఛాయలో నడిచేది వీరి కవిత్వం. శ్రీవైష్ణవ సంప్రదాయ పరంగా సాహిత్యపరంగా చాలా విలక్షణమైనది ఈ గ్రంథం. దివ్యప్రబంధ వాఙ్మయంతో, ఆ వాఖ్యానాలతో పరిచయమున్నవారికి ఎంతో ప్రీతిని కలిగించేది ఈ గ్రంథం.

ఈ గ్రంథానికి రసఘనములైన వ్యాఖ్యానాలున్నాయి. కాని, అవి తెలుగువారికి అందుబాటులో లేనివి. తెలుగులో వ్యాఖ్యానమున్నట్లయితే తెలుగువారెందరో ఈ గ్రంథాన్ని చదివి ఎన్నో విషయాలు తెలుసుకొనే వీలుంటుందన్న ఉదారాశయంతో ఉ.వే.శ్రీమాన్ ఈ.ఏ.ఆర్. రామన్‌గారు లలిత విశదమైన తెలుగులో వ్యాఖ్యానాన్ని కూర్చి ఈ గ్రంథాన్ని తెలుగువారికందించినారు. దివ్యప్రబంధ సంప్రదాయంలో అంతో ఇంతో సంబంధమున్నవారంతా చదవదగిన గ్రంథమిది.

దివ్యప్రబంధ వ్యాఖ్యానాల్లో తమిళ - అలంకార గ్రంథాలలో ఉండే ఎన్నో విలక్షణ విషయాలను ప్రస్తావించి, ప్రకృత గ్రంథంలో వాటిని సమన్వయించినారు. అలంకార మర్యాదలను, సంప్రదాయ రహస్యాలను ప్రామాణికంగా ప్రకృతోచితంగా వివరించి చూపుతూ బృహత్తరము, మహత్తరము అయిన ఒక పీఠికను కూడా రచించేరు. ఈ పీఠిక పీఠికా ప్రక్రియకే ఆదర్శంగా నిలవగలది.

గ్రంథంలో ప్రవేశించటానికి పాఠకుడికి చక్కటి పూలబాటను వేస్తుంది. పలువురి పలురకాల ప్రశంసలు పొందిన 6ర124 పుటలున్న ఈ గ్రంథం వెల రూ. 75/-లు

ప్రతులకు : **శ్రీమతి ఈ. జయలక్ష్మి గారు**, 18-3-58/7, శాంతి నగర్, కె.టి.రోడ్, తిరుపతి - 517 507.

## గురుపరంపరా ప్రకాశిక

గురుపరంపరానుసంధానం మనకు చిరకాలంగా సాగివస్తున్న సంప్రదాయం. కేవలం వాక్య శ్లోక గురుపరంపరలేకాక, శ్రియఃపతినుంచి స్వాచార్యులవరకు ఆచార్యులందరి తనయలను అనుసంధించుకోవడం సమీచీన పద్ధతి.

తమిళంలో గురుపరంపరా ప్రభావాలు ప్రసిద్ధంగా ఉన్నాయి. వాటిలో ఎన్నో చారిత్రక సంప్రదాయ రహస్యాలున్నాయి. అవి తెలుగువారికి అందుబాటులోకి అంతగా రానివి.

మణవాళ మహామునుల అష్టదిగ్గజ శిష్యులలో ఒకరైన కందాడై అణ్ణన్ అనువారి కుమారులు నాయన్ అనేవారు శ్రియఃపతి నుంచి తమనాటివరకు గల ఆచార్యుల పరంపరను **'పెరియ తిరుమొడియడైవు'** అన్నపేర గ్రంథస్థం కావించినారు.

తెలుగువారి ఉపయోగం కోసం ఉ.వే.శ్రీమాన్ ఎన్.వి.ఎల్.ఎన్. రామానుజాచార్యస్వామివారు దాన్ని 'గురుపరంపరా ప్రకాశిక' అన్నపేర తెలుగు గావించినారు. శ్రీవైష్ణవ సంప్రదాయపరులు నిత్యం తప్పక అనుసంధించుకోవాల్సిన ప్రామాణిక గ్రంథమిది. ఆళ్వారాచార్యుల సంగ్రహచరిత్ర ఇందులో నిక్షిప్తం. ఆళ్వారాచార్యుల చక్కటి ముఖచిత్రంతో వెలువడిన ఈ గ్రంథాన్ని తమ పితృపాదులు ఉభయవేదాంత ప్రవర్తకాచార్యులు ఉ.వే.శ్రీమాన్ సముద్రాల లక్ష్మణాచార్య భవ్యస్మృతిగా చిత్రభాను శ్రీరామానుజ జయంతి కైంకర్యంగా వారి కుమారులు ఉ.వే.శ్రీమాన్ డా॥ సముద్రాల వెంకట రంగరామానుజాచార్యస్వామివారు ఈ 'గురుపరంపరా ప్రకాశిక'ను 'జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్'కు సమర్పించినారు. 80పుటలు గల ఈ గ్రంథం వెల రూ. 15/- లు

ప్రాప్తిస్థానం : 1. జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్, సీతానగరం, గుంటూరు జిల్లా - 522 501.
2. ఉ.వే.శ్రీమాన్ ఎన్.వి.ఎల్.ఎన్. రామానుజాచార్యులు, ఉభయవేదాంత సభ, పెంటపాడు - 534166.
3. శ్రీరామనుజవాణి, 29-1-26, శేషాద్రిశాస్త్రి వీథి, గవర్నర్ పేట, విజయవాడ-2.
4. శ్రీ ఉ.వే.శ్రీమాన్ డా॥ ఎస్.వి. రంగరామానుజాచార్య స్వామి, 10-5-6/ఎ, శ్రీహరి నికుంజ్, గౌతమీ నగర్, కొవ్వూరు - 534 350.





# గీతాజ్యోతి- ఆచార్య శ్రీకృప

**వికాసతరంగిణి, కేంద్రకార్యాలయానికి,**

విజయనగరం జిల్లా ధర్మక్షేత్రంలో 108 గ్రామాలలో ఒకటయిన 'ఆచార్య శ్రీకృప' వికాసతరంగిణి, బాలాజీ నగర్, 'గీతాజ్యోతి గోష్ఠి' విన్నవించుకొను కార్యక్రమ వివరములు.

శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనము లతో 13-4-2002న గీతాజ్యోతి కార్యక్రమాన్ని శ్రీవేంకటేశుని సన్నిధిలో ఉ॥ 10గం॥లకు ప్రారంభించుకున్నాం. సుమారు 200 మంది భక్తులతో కార్యక్రమం ప్రారంభమయింది. గీతాజ్యోతి కార్యక్రమాన్ని సుమారు 10,000 మందికి ఈ సంవత్సరంలో మా గ్రామంలో అందజేయాలి అని మా గోష్ఠి కోరిక.

1. కనుక ఈ కార్యక్రమాన్ని ఈ విధంగా ఏర్పాటు చేసుకున్నాం. 150 గృహాలున్న ఒక ప్రాంతానికి ఒకవారం రోజుల కార్యక్రమం ఏర్పాటు చేసాము. 150 గృహాలకు వెళ్ళి వారింట్లో సభ్యులెంత మందో కనుక్కొని వారికి గీతాజ్యోతి కార్యక్రమాన్ని వివరించి 4 శ్లోకాలనుఅందజేసి "మన రెండు వీధులకి గీతాజ్యోతి కార్యక్రమాన్ని సాయంత్రం 6గం॥ నుండి 6-30 ని॥ల వరకు నిర్వహిస్తున్నాం. 'ఫలానా' ప్రాంతానికి తప్పకుండా వచ్చి పూజా కార్యక్రమం చూసి ప్రసాదం తీసుకు వెళ్ళండి" అని ఇంటింటికి వెళ్ళిచెప్తున్నాం.

2.వారం రోజుల పాటు ప్రతిరోజు సాయంత్రం చేసే కార్యక్రమ వివ రాలు.

I. 5-15 ని॥ నుం డి 5-45 ని॥ల వరకు విద్యార్థులకి శ్లోకాలు నేర్పి స్తున్నాం.

5

II. 6గం॥లకు ప్రార్థనా మంత్ర ములు. III. కృష్ణాష్టకం పారాయణ, IV. మహాసంకల్పంతో గీతాశ్లోక పారాయణ V. కృష్ణాష్టోత్తర పూజ, VI. 10ని॥లకు ప్రవచనం, VII. కృష్ణం వందే జగద్గురుమ్ భజనతో బియ్యం ఏరటం.

3. భగవద్గీత ప్రవచనములే కాక మన వికాస తరంగిణి ఆశయాలు అందరికీ తెలియజేయాలని ప్రవచనములు 8 రోజులు ఈ విధంగా చెప్తున్నాం. 1వ, రోజు **మనం- మన కర్తవ్యం**, 2వ, **రోజు సత్సాంగత్యం వలన ఫలితం** 3వ రోజు **ఆచార్య అనుగ్రహం**, 4. **వారందించే గొప్పవరం - మంత్రం, 5. స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ,** 6. **వికాస తరంగిణి ఆశయాలని అమలు పరిస్తే ఆనందమయ జీవితం.** 7. **గీతాజ్యోతి** కార్యక్రమాన్ని ఇకపై ఇంటిదగ్గర ఎలా చేసుకోవాలి. 8. **భక్తినివేదన, బదరీ అన్నదానం కార్యక్రమ వివరణ.** ఈ విధంగా విభజించాము. ఎందువలనంటే మన గురించి వారు (వచ్చేభక్తులు) పూర్తిగా అర్థం చేసుకోవాలి అంటే కనీసం ఒక వారం రోజులు పడుతుంది. ఒక రోజు వెళ్ళి శ్లోకమిచ్చి వస్తే వికాసతరంగిణి ఆశయాలు అర్థంకావు. ఇప్పటికి 4 వీధులకి తెలియ జేసాము.

మా కార్యక్రమ వివరాలు తెలియజేసాము. మేము చేస్తున్న కార్యక్రమంలో ఏవైనా తప్పులు ఉంటే తెలియజేసి ఇంకా బాగా కార్యక్రమం చేయుటకు తగు సూచనలు ఇవ్వవలసినదిగా ప్రార్థన చేస్తున్నాము.

**స్వామి శిష్యులు : గోష్ఠి సభ్యులు :** శ్రీమతి తల్లాప్రగడ అరుణ, శ్రీమాన్ వి.వి.యస్. సూర్యనారాయణ రావు, శ్రీమాన్ దాశరథి, శ్రీమతి చూడామణి, శ్రీమతి జి. సావిత్రి. **విద్యార్థి విభాగమునకు కార్యకర్తలు :** చి॥ టి. ఉదయ్, చి॥ రమ్య, చి॥ అశ్వని, చి॥ కీర్తి, చి॥ ప్రశాంత్.

గీతాజ్యోతి గోష్ఠి 'ఆచార్య శ్రీకృప'
వికాస తరంగిణి, బాలాజీ నగర్, విజయనగరం

**జై శ్రీమన్నారాయణ!**

## పంచాంగ వివరాలు

### ఆగస్టు

8 సర్వేషాం అమావాస్య
11 ఆండాళ్ తిరునక్షత్రం
12 వేదవల్లితాయార్ తిరునక్షత్రం, నాగచతుర్థి
13 బదరీనారాయణ పెరుమాళ్ తిరునక్షత్రం
14 సప్తమీ తిథి
16 వరలక్ష్మీ వ్రతం
17 మఖ కార్తె. సా 5-33
సింహ సంక్రమణం
18 సర్వేషామేకాదశి
21 వరాహజయంతి, ఆశ్వలాయనోపా కర్మ,
22 రాఖీపౌర్ణమి, హయగ్రీవ జయంతి
22. శ్రీశ్రీశ్రీ స్వామివారి చాతుర్మాస్య దీక్షా ప్రారంభం, ఆపస్తంభోపాకర్మ
26 శ్రీశ్రీశ్రీపెద్దజీయర్‌స్వామివారి తిరునక్షత్రం
30 అష్టమి తిథి, స్మార్త శ్రీకృష్ణజయంతి
31. శ్రీవైష్ణవ శ్రీకృష్ణజయంతి, కణ్ణన్ తిరునక్షత్రం, పుబ్బకార్తె ప.2-24, శూన్యతిథి

### సెప్టెంబరు

1 నవమి తిథి
3 సర్వేషామేకాదశి
4 తిథి ద్వయం
5 చతుర్దశి తిథి,
9 బలరామజయంతి, కుడుముల తదియ సామవేదోపాకర్మ
10 విష్వక్సేనారాధన, వినాయక చవితి, సిద్ధివినాయక వ్రతం.

## ఈ సంచికలో .....



## : ముఖ చిత్ర పరిచయం :

(1945 ఆశ్రమం స్వీకరించిన మొదటిదినాలలో శ్రీశ్రీశ్రీ పెద్దజీయరుస్వామివారు.)

**త్రిదండ కాషాయశిఖోపవీతైః ప్రవర్తయన్ పారమహంస్య లక్ష్మీమ్।**

**వైకుంఠమారోపయితుమ్ ముముక్షూన్ సోపానకారీ యతిరాజ ఏషః॥**

భగవద్రామానుజులు త్యాగానికి ప్రతీకగ కాషాయాన్ని ధరించారు. తత్త్వత్రయాన్ని ప్రవర్తింప చేయడానికి త్రిదండాన్ని ధరించారు. పరమ వైదికమీవైష్ణవము అని తెలియపరచడానికి శిఖా యజ్ఞోపవీతములు ధరించారు.

ప్రపంచంలో నలుమూలలా ధర్మాన్ని సదాచారాన్ని అనుష్ఠింపచేసే సంపద వీరి సొంతము. సమస్యల వలయాల్లో సతమతమౌతూ వాటి నుంచి విడుదల కోరే ముముక్షు జనులందరినీ వైకుంఠ నిలయానికి చేర్చగల సమర్థులు వీరే! భువినుండి దివికి సుదృఢమైన సోపాన పరంపర నిర్మించిన మహనీయులు వీరే!
తమ నాశ్రయించినవారికి, దుఃఖవిముక్తికి, ధైర్యానిస్తూ వారిని తరింపచేస్తానని కంకణధారణ చేసిన యతిరాజులు వీరే.

యతిరాజ విజయం నాటికలో శ్రీవాత్స్యవరద గురువులు భగవద్రామానుజుల విషయంలో అనుగ్రహించిన ఈ శ్లోకం మన పెద్దజీయరుస్వామివారి విషయంలో నూటికి నూరు పాళ్ళు సరిపోయింది. శ్రీవారి తిరునక్షత్రం మనమంతా జరుపుకుంటాం. ఈ సందర్భంలో పై శ్లోకం అనుసంధించు కోవడం ఎంతో ముఖ్యం.


**D.T.P. & Design by :** పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం






శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక

శ్రీవారి సూక్తి

పక్షపాతరహితుడు పరమాత్మ. పాదదాసుల పాలిట పర్యంకం.
మనం చేయవలసిందల్లా దాసోహమనడమే.

చిత్రభాను నామ సంవత్సరం　　శ్రావణ మాసము


సంపాదకులు : శ్రీ ఉ. వే. శ్రీమాన్ **T.P. శ్రీరామచంద్రాచార్యులు**

వ్యవస్థాపకులు

**శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు**
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

మీ సేవలో....

**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 72929
చందా: సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-, విదేశాలకు సంవత్సరచందా $ 25
E-mail : bhakthinivedana@yahoo.co.in Internet : www.chinnajeeyar.org

# శ్రీవారి మంగళాశాసనములు

ప్రియభగవద్బంధువుల్లారా!

శ్రీమతే నారాయణాయ నమః!

అనేక మంగళాశాసనములు !

1. వివిధ జిల్లాలలో, గ్రామాలలో ఉత్సాహంతో, నిరంతరాయంగా "గీతాజ్యోతి"ని నిర్వహి స్తున్న మీకందరకూ ముందుగా పూర్ణ మంగళాశాసనములు

ఇంతవరకు 16 వారాలు గడిచాయి. 16శ్లోకాలను ఎన్నుకొని, వాటిలో భగవానుడందించిన సందేశాన్ని, మనకు అర్థమై నంతలో అందుకొనే ప్రయత్నం చేసాం. వాటిని మనం ఆచరించే ప్రయత్నం చేస్తున్నాం కదూ!

ఇక 'గీతాజ్యోతి' రెండవ మెట్టు కార్యక్రమం ప్రారంభించి ఉంటారు మీరంతా! అది, పాఠశాల విద్యార్థుల ద్వారా ఈ కార్యక్రమం జరపడం. 'చిత్రగీత' పాఠశాలలకు అందివ్వడం, విద్యార్థులు చిత్రలేఖన పోటీ జరుపడానికి ఒకటి లేక ఒకటిన్నర నెలల సమయాన్నిచ్చి, ఆపై పోటీని నిర్వహించి, ఉత్తీర్ణులైన వివిధ పాఠశాలల విద్యార్థుల మధ్య తిరిగి పోటీని నిర్వహించి, ఇలా గ్రామ, మండల, ధర్మ క్షేత్రాల స్థాయిలో క్రమంగ జరుపాలని, ఆ సందర్భంలో ఆయా పాఠశాలల విద్యార్థులకు నేత్ర, దంత పరీక్షలు జరిపి అవసరమైన వస్తువులు అందించాలి, దీనిని గూడ మన వారందరూ తమ తమ ఊళ్ళల్లో ప్రారంభిస్తూ విద్యార్థులలో చైతన్యాన్ని నింపుతున్నారని ఆశిస్తాం!

ఇంత వరకు అందిన సమాచారం, వివిధ జిల్లాలనుండి ప్రోత్సాహకరంగ ఉంది. టిబెట్- మానస-కైలాస యాత్ర నుండి రాగానే వినినంత వరకూ ఉత్సాహకరముగానే ఉంది.

2. జూన్ 25వ తేదీన అమెరికానుండి వచ్చిన 7గురు, మన దేశపు 32 మంది, నేపాలు ట్రావెల్ ఏజెంట్లు, వాళ్ళ పరివారం, మరో 25మందినీ కలుపుకొని సుమారు 64 మందిమి 11 చిన్నకార్లు, 4 ట్రక్కులు, సామాన్లను వేసుకొని, మానస సరస్-కైలాస్ యాత్రకై వెళ్ళాం గద! 25వ తేదీనాడు అంతా నేపాలు- టిబెట్ సరిహద్దు వద్ద మార్పిడికే సరిపోయింది. అక్కడినుండి 12 దినాలు ప్రయాణం జరిగింది. 4 దినాలు ప్రయాణించి మానస సరస్సు తీరానికి 29వ తేదీనాడు చేరాం. ఆరాత్రి 30వ తేదీ అక్కడే ఉన్నాం. 30 నాడు ఓ చిన్న బ్రహ్మ యజ్ఞం జరిగింది. ఆపై 1న బయలుదేరి 3 దినాలు కైలాసగిరి ప్రదక్షిణం చేసి





18000 వేల అడుగుల ఎత్తెక్కి తిరిగి 3 జులై రాత్రికి మానస సరోవర తీరానికి వచ్చేసాం. నడక అలసట కల్గించినా, అందరికీ శారీరకబాధ కల్గించినా, మానసికంగా ఓ అపురూప దివ్యానుభూతిని మిగిల్చింది. భాషరాని వాళ్ళమధ్య ప్రయాణం. 4వ తేదీన తిరిగి బయలుదేరి కార్లలో 7వ తేదీ రాత్రికి కాఠ్మండూకి చేరిపోయాం. అక్కడినుండి 10వతేదీ మధ్యాహ్నానికి ఢిల్లీచేరి ఆరాత్రి శ్రీమాన్ Ch.విద్యాసాగరరావు, గౌరవనీయ సహాయ గృహామాత్యుల భవనంలో విశ్రమించి, వారి ఆతిథ్యపు రుచులను చవిచూచి 11వ తేదీ ఉదయానికి హైదరాబాదు తిరిగి వచ్చాము. కూడా వచ్చిన భక్తులందరూ కులసాగా వెనుతిరిగి వచ్చారు.

హిమాలయ ప్రాంతాల్లోని యుద్ధ భయం, నేపాలులోని మావోయిష్టు భయాల వల్ల ఈ యాత్ర చివరి క్షణం దాక అనిశ్చితంగానే ఉన్నా 3 దినాల ముందే నిర్ణయమై పూర్తిగూడ అయిపోయింది. గతంలో వెళ్ళి వచ్చిన వారంతా 5,6 దినాలు స్నానాలు చేయడం కుదరదు. త్రాగేనీటి వసతి ఉండదంటూ భయపెట్టే వార్తలు చెప్పినా ఆ యిబ్బంది ఏమీ రాలేదు. రోజూ స్నానాదులు, అందరికీ బాగానే జరిగాయి. ట్రావెల్ ఏజంట్లు "మావాళ్ళ తిండే తినాలి, మీ వాళ్ళా చలిలో ఏమీ చేయలేరు" అన్నది తారుమారై చివరికి మన శ్రీమాన్ భాగవతాచారిగారు, నేపాలుకి చెందిన శ్రీమాన్ దాతారామ్ అనేస్వామి, వీరిరువురే ప్రసాదములన్ని రుచిగ, శుచిగ పెరుమాళ్ళకీ, వాళ్ళకీ గూడ అల్ప సమయంలో చేసి పెట్టి ఆశ్చర్యం కల్గించారు.

మొత్తానికీ యాత్ర ముగిసింది. అంతా చాలవరకు వీడియో తీసారు. దానిని ఎడిటింగ్ చేసి ఒక VCDగా తయారు చేసే పనిసాగుతోంది. దైనందిన కార్యక్రమం, యాత్రా విశేషాలూ ఓ పుస్తకంగ, ఫొటోలతో త్వరలో వస్తుంది. వివరాలన్ని వాటిల్లో తెలుసుకుందురుగాని!! మేమిక్కడ లేకున్నా 'గీతాజ్యోతి' సమర్థవంతముగ నిర్వహించే మీకందరకు మంగళాశాసనాలు. తిరిగి చాతుర్మాస్యంలో చూస్తాం మరి !!.

(శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి)

జై శ్రీమన్నారాయణ

# ఉభయవేదాన్తాచార్య పీఠంవారి
# నూతన భవన ప్రారంభం

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి
మంగళాశాసనములతో...

అందరూ ఈ కారక్రమంలో పాల్గొనవలసినదిగా ఆహ్వానిస్తున్నాం.
జై శ్రీమన్నారాయణ!

ఇట్లు
**విశిష్టాద్వైత ప్రచారక సభ**
**శ్రీమదుభయవేదాన్తాచార్య పీఠం**

పరమహంస పరివ్రాజకులు
**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**
**చాతుర్మాస్య దీక్ష ఆగష్టు 22, శ్రావణ పూర్ణిమ దినాన సీతానగరంలో స్వీకరిస్తారు.**

జై శ్రీమన్నారాయణ!

# గీతాజ్యోతి



5వ నెల

## పారాయణ శ్లోకమాలిక

4వ నెల చివరి వారపు పారాయణ శ్లోకం

# ఆత్మలలో లేవు తేడాలు - అంతరంగాలలోనే

16వ శ్లో॥ సుహృ న్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు ।
సాధుష్వపి చ పాపేషు సమ బుద్ధి ర్విశిష్యతే ॥ 6అ॥ 9శ్లో॥

ఇది 6వ అధ్యాయంలో 9వ శ్లోకం. చాలా గొప్పశ్లోకం. క్రితంవారం నేర్చిన 6వ అధ్యాయంలోని -5 శ్లోకంలో 'మనసుని ఎలా మలుచుకోవచ్చు. దాని విషయంలో మన దృష్టి ఎలా ఉండాలో' చెప్పాడు స్వామి. అది మంచిగా ఉంటే దానిని మించిన మిత్రుడులేదు. చెడుగా ఉంటే దానిని మించిన శత్రువు లేదు. అది సక్రమముగా ఉంటే సమబుద్ధి ఏర్పడు తుంది. అన్నిటినీ సమానంగా భావించడం సమబుద్ధి. సమానంగా చూడగలగడం సమదృష్టి. లోకంలోని పదార్థాలను విభిన్న రంగులలో విభిన్న రకాల ఆకృతులలో మనం చూనన్తా ఉంటాం. వీటన్నింటినీ సమానంగా చూడడం కష్టం. కానీ సమభావన కలిగించు కోవచ్చు. అలానే మన చుట్టూ ఉండే పదార్థా లలో ఆకారాలలో రంగుల్లో పరిమాణాల్లో తేడాలున్నా లోపలి పదార్థం ఒకటే అని తెలిస్తే అన్నిటియందూ సమభావన ఏర్పడుతుంది. అంచేత బాహ్యదృష్టికి తేడాలు తెలుస్తున్నా దాని యొక్క కారణతత్త్వం వరకు వెళ్ళగలిగినపుడు మనిషిలో సమభావన ఏర్పడుతుంది. ఉదా హరణకి మట్టిముద్ద కలిపి కుమ్మరి కుండలు చేస్తాడు, కూజాలు చేస్తాడు, పాలికలు, ప్రమిదలు ఎన్నో ఆకారాలూ చేస్తాడు. ఆయా ఆకృతుల్లో, పేర్లలో, ధరల్లో తేడాలున్నా అవన్నీ మట్టితో తయారయినవేనన్న జ్ఞానం అవి చూసిన వ్యక్తిలో కలగడం మనం చూస్తూనే ఉన్నాం.

ఇలా భౌతిక వస్తువుల విషయంలో కొంత వరకు మనం చూడగలుగుతున్నాం. శ్రీకృష్ణ భగవానుడు మన మనస్సు సంస్కృత మైనట్లయితే, మనసు చెప్పుచేతల్లో ఉన్నట్లయితే మన చుట్టూ ఉండే ప్రాణుల పట్ల కూడా ఈ భావన తప్పనిసరిగా ఏర్పడుతుంది అని బోధిస్తున్నాడు ఈనాటి శ్లోకంలో. దీనికి 'సమభావన' అనిపేరు. అది ఎలా ఉంటుందో చెప్పాడు ఈ శ్లోకంలో సుహృత్ మిత్ర.... అంటూ

మన మంచి కోరేవారందరినీ సాధారణంగా మనం మిత్రులు అని అనుకుంటాం. లేదా స్నేహితులు అని అనుకుంటాం. ఆంగ్లంలో Friend అనే ఒకే పదంతో స్నేహితున్ని చెప్పినా, శ్రీకృష్ణుడు మాత్రం కొందరిని 'సుహృత్' అని, మరికొందరు'మిత్ర' అని చెప్పాడు. ఈ రెండు పదాలకి అర్థంలో కొంచెం తేడా ఉంది. మనతోటి సమాన వయస్సు కలిగి మన మంచి కోరేవారిని మిత్రుడు అని అంటారు. 15 ఏళ్ళ పిల్లవాడికి అతని





హితంకోరి 50 ఏళ్ళ వ్యక్తి సలహా ఇస్తే లేదా 30 ఏళ్ళవానికి 10 సం॥ల బాలుడు సలహా ఇస్తే అతన్ని మిత్రుడు అని అనకూడదు. కేవలం సమాన వయస్సుకలిగి మంచి కోరేవారినే మిత్రులు అని అంటారు. ఇక వయస్సులో తారతమ్యం పెద్దవారు చిన్నవానికి లేదా చిన్నవారు పెద్దవానికి మంచినికోరి ప్రవర్తిస్తే 'సుహృత్' అంటారు.

మరికొంతమంది మన దగ్గరిది లాక్కోవాలనుకోనేవారు, మనకి హాని కలిగించాలను కొనేవారు ఉంటారు. వీరిని 'శత్రువులు' అంటారు కొందరు పుట్టుకతో శత్రుత్వం కలవారు, మరికొందరు మధ్యలో వచ్చిన సంపదల వలనో, పదవుల వలనో శత్రుత్వం పెంచుకోవడం చేస్తారు. అలాంటివారిని 'అరి' అంటారు. కొందరిది సహజ శత్రుత్వం ఉదాహరణకు పిల్లి-కుక్క, మేక-పులి.

కానీ, సహజంగా మనుష్యులలో శత్రుత్వం ఉండదు. ఉనికిని నిలబెట్టుకొనే ప్రయత్నంలో కొందరు శత్రుత్వాన్ని పెంచేసుకుంటారు. కానీ, ఇక్కడ కృష్ణుడు నీ భావనలో మంచి ఉంటే ఎదుటి వారుకూడా నీపట్ల మంచిగానే ప్రవర్తిస్తారు అని అంటున్నాడు.

మరికొందరు ఉదాసీనులు ఉంటారు. మనం వారిని పట్టించుకోము. వారు మనల్ని పట్టించుకోరు. ఇంకొందరు మధ్యస్థులు ఉంటారు. గోడమీద పిల్లిలాంటివారు. దేనియందు పట్టింపు లేనివారు. అవకాశం ఎటు బాగా ఉంటే అటు చేరతారు.

ద్వేషులు ఇంకొందరు. కొన్ని సమయా లలో కొన్ని కారణాలను బట్టి ద్వేషించేవారు. వీళ్ళు శత్రువుల కంటే వేరు. ఆ కారణాలు తొలుగగానే మళ్ళీ స్నేహం చేయవచ్చు. మరికొందరు 'బంధువులు' ఉంటారు. వీరు రెండు రకాలు. శారీరక బంధువులు, రెండు మానసిక బంధువులు. తల్లి, తండ్రి, అక్కా, చెల్లి మొదలగువారి మధ్య ఉండేది శారీరక బంధుత్వం. దీనినే 'రక్తసంబంధం' అని కూడ అంటూ ఉంటారు. రెండవది మానసిక బంధుత్వం. భార్య, భర్త దత్తత తీసుకోవడం లాంటివి ఇంకొన్ని అభిమానంతో తెచ్చుకున్నవి.

వ్యక్తిగత సంబంధం లేకున్నా సామాన్యేన సమాజ శ్రేయస్సు కోరేవారు సాధువులు. సామాజిక సేవ చేసేవారందరూ సాధువులే, కేవలం దండం కాషాయం ధరించిన వారే సాధువులు కానక్కరలేదు.

వ్యక్తిగతంగా కాక సామాన్యేన సామాజిక వ్యవస్థని పాడుచేసేవారు పాపులు. ఇలాంటి వారందరి యందు నీకు సమబుద్ధి ఏర్పడాలన్నాడు శ్రీకృష్ణ పరమాత్మ. అసలు ఇందరి యందు సమబుద్ధి ఎలా ఏర్పడు తుంది? అనిపెద్ద సందేహం రావచ్చు. వ్యక్తులు రకరకాలు. వారి ప్రవృత్తులు రకరకాలు, ఈ సంబంధాలన్ని వారి వారి కర్మలను బట్టీ, మన మన కర్మలను బట్టి ఏర్పడినవే. కాబట్టి వాటిని మనం కాదనలేం. వాటిని మనం మార్చలేం కూడా. ఒకడు నీకు హితం చెబుతుంటే వానిని నువ్వు మార్చివేయక్కర లేదు.వారి నుండి నీవు మంచిని గ్రహించు. ఒకడు నిన్ను ద్వేషిస్తూ ఉంటే వాడి నుంచి దూరంగాను ఉండు. ఒకడు నీకు శత్రువులా ప్రవర్తిస్తూ ఉంటే వాడి విషయంలో నీవు సానుకూలంగా ప్రవర్తించు. సాధువుల వంటి వారి సాంగత్యం కావాలి. సజ్జన సాంగత్యం మంచిది అంటూంటారు. పాపులను దూరం గానూ ఉంచాలి అంటూంటారు.ఇలా విభిన్న వ్యక్తులయందు సమబుద్ధి ఎట్లా కుదురు తుంది? రత్నము నందు రాయి యందు సమబుద్ధి కుదరడం ఎలా సాధ్యం? అని అంటే వీటన్నిటికి మూలం అయినదేదో తెలుసు కోవాలి. వాటి, వాటి కర్మనుబట్టి మన, మన కర్మనుబట్టికూడా ఒకటి మనకు అనుకూలము మరొకటి ప్రతికూలము అనిపించవచ్చు. దాని వలన మీకు ఎలాంటి అనుభవాలు ఏర్పడినా వాటిని నీవు మనస్సుకు పట్టించుకోకుండా ఉండు అంటున్నాడు పరమాత్మ. సాధారణంగా మనకి ఒకరు లాభం కలిగించారు అనుకోగానే వారి విషయంలో అనుకూలమైన భావన కలిగి వానిని మనస్సులో

పెట్టుకొని వారికోసమనే ఎదురు చూస్తూ ఉంటాం. వారినే తలుస్తూ ఉంటాం. ఎవరివలనైతే మనకు నష్టం కలిగిందో వారు మనకి అనుకూలం కాదనుకొని వారియందు ద్వేషం, పగ వంటివి పెంచుకొంటూంటాం. దానివలన మన మనస్సే పాడవుతుంది. కర్మవశాన శరీరానికి భగవంతుడు ఏవేవి కల్పిస్తే ఆయా అనుభవాలను మనము స్వీకరించకతప్పదు. మనస్సుకి కావలసింది పైపైవి కాదు. లోపల ఉండే నువ్వు. నీకు కూడా కారణమైన వాడు.... ఆ వెనుక ఉండే పరమాత్మ వాని యొక్క ప్రభావం చేత నీ యొక్క కర్మలని సవ్యంగా అనుభవింప చేస్తాడని గుర్తించు. అలానే నీ చుట్టూ ఉండే వారందరి లోపల ఉండి చేయిస్తూ ఉండేవాడు, ఆయనే అని, అదీ వారి వారి కర్మలనుసరించి నడిపిస్తాడనీ గుర్తించి అందరి యందు సమభావనను అలవరచుకోమని ఈ శ్లోకంద్వారా ఉపదేశిస్తునాడు పరమాత్మ.

## మోతాదుకు మించనివన్నీ మంచివే అవుతాయి.

**17శ్లో॥ యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు।**
**యుక్త స్వప్నావబోధస్య యోగోభవతి దుఃఖహా॥ 6అ॥-17శ్లో॥**

మనసుకి ఎలా అలవాటు చెయ్యాలి అనే సాధనని ఈ వారం శ్లోకంలో అంటే 6వ అధ్యాయం 17వ శ్లోకంలో తెలిపాడు. ప్రపంచంలో చెడు ఏదీ సృష్టించలేదు. అన్నీ మంచివే సృష్టించాడు. వాడుకోవడమే మనిషికి చేతకావటం లేదు. ఉన్నవాటితో తృప్తి లేదు. అన్ని తనకే కావాలి అంటాడు. అన్నీ తనవే అంటాడు. నిజానికి భగవంతుడు ఒక్క మనిషి కోసమే కాదు కదా! ఈ ప్రపంచాన్ని తయారుచేసింది. అన్ని ప్రాణుల కోసమనే కదా భగవంతుడు అన్నింటినీ తయారుచేసింది. ఏది నీకు ఎంతవరకు అవసరమో అంతవరకే దానిని నువ్వు స్వీకరించి అనుభవించితే ఏ ప్రమాదం లేదు. అయితే మనిషికి తృప్తి ఉండద్దూ. తృప్తి అనేది మనస్సులో ఉండాలి. అదిలేకపోతే ప్రమాదమే.... కనుక మోతాదుకు మించక నీకవసరమైనవి అనుభవిస్తూ మనసుకు సాధన అలవరచడం ఎలానో ఈ వారం శ్లోకంలో ఉపదేశిస్తున్నాడు పరమాత్మ.

ఈ శ్లోకంలో భగవంతుడు ప్రతిదానికి 'యుక్త.....' 'యుక్త....' అంటూ ఒక విశేషణం చేర్చాడు. యోగం కలగడానికి ఏం చేయాలి. దానికి చివర 'యోగః దుఃఖహా భవతి' అన్నాడు. యోగః= తాను చేసేటటువంటి సాధన ఏమి చేస్తుంది. దుఃఖహా భవతి = తనకు దుఃఖాలు కలిగించకుండా ఉంటుంది. అంటే కృష్ణుడు చెప్పిన పని మనం చేస్తే రెండు లాభాలు అని దీనివలన మనకు తెలుస్తుంది.
1. ఇప్పుడు మనం చేసేటటువంటిది మనకు దుఃఖాన్ని కలిగించదు.
2. గతంలో చేసి పెట్టుకున్నటువంటి దుఃఖాన్ని కలిగించే అవకాశం కలిగినటువంటి వాటి నన్నింటిని కూడా ఇది తొలగిస్తుంది. ఏం చేస్తే? సమబుద్ధిని మనం సాధించగలిగితే! ఇది చెప్పాడు





శ్రీకృష్ణుడు. అయితే సమబుద్ధిని సాధించడానికి చేయవలసినటువంటి సాధన ఏమిటో మనకు ఇందులో చెపుతున్నాడు.

మనకు శరీరం ఉంది. ఇంద్రియాలు న్నాయి. మనస్సు ఉంది. శరీరం కొన్నిటిని పొందుతూ ఉంటుంది. అనుభవిన్తూ ఉంటుంది. ఇంద్రియాలూ కొన్నింటిని అనుభవిస్తూ ఉంటాయి. మనస్సు కూడా కొన్నింటిని అనుభవిన్తూ ఉంటుంది. అవన్నీకూడా వాటివాటి మోతాదుకు మించనివి కావాలి. ఇంద్రియాలు అందులో ఉండే ఆయా శబ్ద, స్పర్శ, రూప, రసాది విషయాలను అనుభవిస్తూ ఉంటాయి. శరీరం, విషయాలకి ఆధారమైన పదార్థాన్ని అనుభవిస్తూంటుంది. అయితే మనకి ఒక పదార్థంలో ఉండే రుచి బాగున్నట్టనిపిస్తే నాలుకకు ఆ రుచి ఎప్పుడూ కావాలనిపిస్తుంది.

రుచి నాలుకకు బాగున్నా అన్నీ ఆరగించాలి అంటే శరీరానికి కొన్ని హద్దులున్నాయి. నిజానికి రుచి కొంత చూపించి, శరీరానికి ఎంత వరకు హద్దో అంతవరకే తాను ఇవ్వాలి. ఆహారం విషయంలో మన శాస్త్రాలు 'ఉదరంలో ఉండే ఖాళీలో అర్థభాగం వరకు ఘనపదార్థాన్ని, మిగిలిన దాంట్లో మరొక అర్థం, అంటే ఒక పాతిక వంతు ద్రవ పదార్థంతో నింపు. మరి మిగిలిన సగం ఖాళీగా అట్టే పెట్టు' అని చెబుతుంది. కానీ! మనం ఆ పద్ధతిని మార్చేసి 90% ఘనపదార్థంతోటే నింపేస్తాం. ద్రవ పదార్థాన్ని తగ్గించేస్తాం. అసలు ఖాళీ బొత్తిగా పెట్టం.

శాస్త్రం చెప్పే ఆ సిస్టమ్‌ని మనం అతిగా వాడి అవమానిస్తుంటాం. తిండి విషయంలోనే కాదు. మిగతా ఏ అనుభవానికైనప్పటికికూడా పద్ధతి ఇలానే ఉండాలని మనం మరిచి పోవటానికి వీలులేదు. అందుచేత ఎంత ఘనం, ఎంత ద్రవం లోపల ఉండాలి అనేది ఒక నియమం. ఆ నియమానికి తగినట్టుగా నీవు ఆహారస్వీకరణ చేయాలి. ఇదే భగవంతుడు చెప్పిన యుక్త ఆహారం.

యుక్త విహారం : విహారమంటే తిరగడం. మనకి చాలా అందంగా కనిపిస్తుంది కదా అని ఉదయం నుండి రాత్రి దాకా తిరిగితే కాళ్ళు పట్టేస్తాయి. మరునాడు మనం లేవలేక పడుకుంటాం. మాటలైనా ఒక నియమానికి లోబడి, ఆహారమైనా ఒక నియమానికిలోబడి, ఇతరత్రా తను చేసే పనులు కూడా ఒక నియమానికి లోబడి, విహారమైనప్పటికినీ కూడ ఒక నియమానికి లోబడి చేసినపుడు దాని వల్ల ఏ రకమైన చీకు చింత ఉండవు.

ప్రతి ఇంద్రియానికి మనం అందించే వాటిని ఆయా ఇంద్రియాలకు ఆహారం అని అంటాము. కనుక కంటితో చూడాలని నీకు కోరిక ఉన్నా ఒక హద్దుకు మించి చూసే ప్రయత్నం చేయకు. ఆలోచనకూడా అంతే. మన మనస్సుతోటి చేసే ఆలోచనైనా ఎంత వరకు నీవు చేయదగునో, అంత వరకే చేయి తప్ప హద్దుకు మించి ఆలోచన చేస్తే వారిని తీసుకొని వెళ్లి మెంటల్‌హాస్పిటల్‌లో పెట్టాలిఅనిఅంటారు.

అంటే ఒక్కొక్కసారి మనం ప్రతి విషయాన్ని గురించి అతిగా ఆలోచిస్తుంటాం. ఈ అతి ఆలోచన కూడ తప్పే. అందుచేత ఈ ఇంద్రియాలవల్ల పొందే అనుభవాలు కానీ, అంటే రుచులు కానీ, విషయాలుకానీ, ఇంద్రియాధారమైనటు వంటి శరీరం, శరీరానికి అందించే పదార్థం కానీ, శరీరంతో చేసే పనులుకానీ, దాని హద్దుకు మించి చేసే ప్రయత్నం చేయకు.

హద్దు మీరడం అనేది ఎప్పుడూ కూడా దోషమే. అది ఆయాస్థాయిల్లో ఉండే ఆయా వ్యక్తులను బట్టి ఉంటుంది. వారి వారి హద్దులలో వారు ఉండటం ప్రతి వ్యక్తికీ ప్రతి రంగంలో కూడా అవసరమే. భగవంతుడు మనకు ఆ విషయాన్ని చెబుతున్నాడు. అందుచేత నీ హద్దు నీవు తెలుసుకొని ప్రవర్తించగలిగితే నీ మనస్సుకి సమభావనం ఏర్పడే అవకాశం ఉంది.

అయితే ఇన్నింటికి .... మనం తీసుకొనే

ఆహారం చాలా ముఖ్యం. ఛాందోగ్యం అనే ఉపనిషత్తు ఈ విషయాన్ని అందంగా చెప్పింది.

"ఆహార శుద్ధౌ సత్త్వ శుద్ధిః
సత్త్వ శుద్ధౌ ధృవా స్మృతిః
స్మృతి లంబే సర్వగ్రంథీనాం విప్రమోక్షః

ఆహారం వల్ల ఆలోచన, ఆలోచన వల్ల ఆచరణ, ఆచరణ వల్ల సిద్ధి. ఇది ఒక క్రమం. ఆలోచన నీకు బాగుండాలి అంటే, ముందు నీవు తీసుకునేటటువంటి తిండిని కంట్రోల్ చెయ్యి. తిండిని కంట్రోల్ చెయ్యడం అంటే మూడు రకాల దోషాలు దాంట్లో లేకుండా చూసుకో. ఆ దోషాలు 1. జాతి, 2. ఆశ్రయ 3. నిమిత్త.

ఈ 3 రకాల దోషాలు లేని భగవన్ నివేదితమైన ఆహారం నీవు తీసుకొన్నట్టయితే అది 3రకాలుగ శరీరంలో మారుతుంది అని అంటారు.

1. స్థూలభాగం మలరూపంలో బయటకు విసర్జింపబడుతుంది.
2. మధ్యమ భాగంశరీరంలో మాంసాదులుగా పరిణమిస్తుంది.
3. సూక్ష్మరూపం మన మనస్సును పెంచుతుంది.

కనుక నువ్వు దోషం లేని మంచి ఆహారం తీసుకొన్నప్పుడు అందులో ఉండే సూక్ష్మాంశ నీ మనస్సుకి మంచిని ఇస్తుంది. కనుక ఆలోచన బాగుంటుంది. అదే నీ మాంస పరిణామ శరీర నిర్మాణానికి అదే సహకరించింది కనుక నీ శరీరం కూడ చెప్పుచేతల్లో ఉంటాయి. ఇంద్రియాలు చెప్పుచేతల్లో ఉంటాయి. ఇక అందులో కూడా కొన్ని వ్యర్థ పదార్థాలు తప్పవు కనుక అవి మలాది రూపంలో బయటికి వెళ్ళిపోతాయి. తద్వార నీయొక్క శరీరం మనస్సు ఇంద్రియాలు స్వాధీనంలో ఉండి ఆలోచన బాగుండి, ఆచరణ బాగుంటుంది. అందుకోస మనే శ్రీకృష్ణుడు మొట్టమొదటలోనే "యుక్తాహార" ఆహారం మీద ఆధారపడి నీ మనస్సు మీద కూడ పని చేసేది విహారం కనుక "విహారస్య" అంచేత మన శరీరంలో చేసే పనులు ఒక నియమ బద్ధంగా చేయడం అలవాటు చేసుకో, అంతేకాదు నువ్వు మాటాడే మాటను కూడ ఒక క్రమబద్ధం చేసుకో, దానితోపాటు 'యుక్త చేష్టస్య కర్మసు' నువ్వు చేసే పనులలో అతి ఆయాసముచే పనులు చేయకు. అలాంటి వాటిని కూడ తగ్గించుకో. వాటి వల్ల ఏర్పడేవి కొన్ని ఉన్నాయి. "యుక్త స్వప్నావ బోధస్య' ఎంతసేపు నిద్రించాలో అంత సేపు నిద్రించాలి. ఎపుడు మేలుకోవాలో అపుడు నీవు మేల్కొనే ప్రయత్నం చేయి. స్వప్నమంటే ఇక్కడ నిద్ర అని అర్థం. నీ ఆహారం బాగుండక పోతే నిద్ర సక్రమంగా ఉండదు. అతిగా ఆహారం తీసుకోవడం, అసలు ఆహారం మానివేసి ఊరకే ఉపవాసాలు చేయటం కూడ తప్పే. అంచేత నిద్ర ఆహారం మీద ఆధారపడి ఉంటుంది. మేల్కొనడం ఆహారం మీద ఆధారపడి ఉంటుంది. నీకు మొదట అవి క్రమబద్ధంలో వచ్చినట్లైతే సహజంగానే రెండవవి క్రమబద్ధం అవుతాయి. కనుక యుక్త స్వప్న, యుక్త అవబోధస్య. ఇవి ఎవరికైతే ఉంటాయో అలాంటి వారికి మానసికమైనటువంటి సమభావన అన్నింటిని కూడ అనుకూలంగా చూడటం అలవడుతుంది. అనుకూలంగా అంటే పై పై వాటిని చూడడం కాదు. అన్నిటి లోపల ఉండే తత్త్వం ఒకటే అలాంటివి అన్ని నాలాంటివే. అందుకోసమనే ఆ లోపల ఉండే ఆత్మని నేను ద్వేషించక్కరలేదు, ఏ వ్యక్తి మీద నేను ద్వేషం పెంచుకోనక్కరలేదు, వ్యక్తిత్వాలు కర్మను బట్టి మారుతుంటాయి. వాటిని క్రమబద్ధం చేద్దాం లేదా మనకి వీలైనంతవరకు వాటినుంచి ప్రమాదం రాకుండ చూసుకొందాము.

గతంలో మనం అనుకున్నట్లుగ లోకంలో కన్పించే అంతరాలు ఆత్మవికావు అవి అంతరంగాల్లో ఉన్నవి కనుక అంతరంగాన్ని శుద్ధి చేసుకోవడానికి శారీరక ప్రవృత్తులే ప్రథమ సాధనాలు. అంచేత మోతాదుకేదీ మించని వ్వకుండ మనం ఉంచుకున్నంత వరకు ప్రతీది మనకి మంచినే కలిగిస్తుంది అనే విషయాన్ని శ్రీకృష్ణుడు మనకి ఈ శ్లోకంలో చెబుతున్నాడు. వాటిని క్రమబద్ధం చేసే ప్రయత్నం చేద్దాము.





# మనోనిగ్రహానికి మేలైన సాధన

**18వ శ్లో॥ యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్।
తత స్తతో నియమ్యైతత్ ఆత్మన్యేవ వశం నయేత్॥ 6అ॥ 26శ్లో॥**

ఏకాగ్రత కుదరటానికి భగవంతుడు భగవద్గీతలో 6వ అధ్యాయవు 26వ శ్లోకములో ఓ అద్భుతమైనటువంటి సాధన మనకి అందించాడు. నిజానికి దాన్ని మనం అభ్యసించగలిగితే మనస్సు మనం చెప్పినట్లు వినడానికి ప్రయత్నం చేస్తుంది. భగవద్గీతలో 6వ అధ్యాయానికి 'ఆత్మ సంయమయోగం' అని పేరు. ఆత్మ=మనస్సు, సంయమం= నిగ్రహించడం, స్వాధీనం చేసుకోవడం. ఆ మనస్సులని స్వాధీనం చేసుకోవడం వల్ల కలిగేటటువంటి లాభం చాల గొప్పది కనుక దాన్ని ఎట్లా స్వాధీనం చేసుకోవచ్చో ఆ వివరాలన్నీ ఇస్తాను అని అర్జునుడికి కృష్ణుడు చెప్పింది 6వ అధ్యాయం.

యతో యతో......

శ్లోకం చాల చిన్నది. కాని దీన్ని అభ్యసించడం భలే కష్టం. అభ్యసిస్తే కలిగే లాభం భలే గొప్పది. ఏం చెపుతున్నాడో దీంట్లో స్వామి "యతో యతో నిశ్చరతి మనః" మనసు ఎపుడు కుదురుగా ఉండదు. మనందరికి తెలుసును. చాల చంచలం. రకరకాల వాటి మీద వెళ్ళిపోతూ ఉంటుంది. ఒక్కదాని మీద ఒక నిమిషం సేపు నిలకడగా ఉంటుంది అనే ప్రశ్నేలేదసలు. అందుకే, నీ మనసు కోతి లాంటిది అన్నారు.

మనం ఇపుడు కూర్చొని కృష్ణా, కృష్ణా, కృష్ణా అనుకుంటున్నామనుకోండి. మొదటి క్షణం కృష్ణా, రెండవ క్షణం బయలుదేరి బజారు. 3వ క్షణంలో కృష్ణాతీరం. 4వ క్షణంలో గోదావరి తీరం, 5వ క్షణంలో గంగాతీరం, 6వ క్షణంలో అమెరికానో మరోదేశం, ఇంకోసారి ఇంకో చోటుకి వెళ్ళిపోయి మళ్ళీ 7వ, 8వక్షణంలోనైన కృష్ణుడిమీద నిలువవచ్చు.

అయితే వెళ్ళి వచ్చే వేగం చేత అది ఎపుడు వెళ్ళిందో అదిఎపుడు వచ్చిందో మధ్యలో ఇలాంటి విచ్ఛిత్తి ఏర్పడింది అని కూడ మనకు అన్పించదు. అంతవేగంగా వచ్చేస్తూ ఉంటుంద న్నమాట. అదికూడదు. ఏం చేయాలి?

"యతో యతో నిశ్చరతి మనః"

మనః=మనస్సు ఏ ఏ వైపు వెళ్లిపో తూంటుందో అలాంటి దానివైపే వెళ్తూ ఉండనీ, నువ్వు ఎప్పుడూ నీ మనస్సు ఒక దాని వైపు వెళ్ళేటపుడు నువ్వు చెప్పినట్టురాదు. సరికదా! నిన్ను కూడా దాని వైపు వెళ్లిపోయేలా దాన్నే మళ్ళీ మళ్ళీ స్మరించేటట్లు చేస్తుంది. ఇదీ మనస్సుకుండే గొప్పతనం.

అందుకోసమనే అది ఎటు ఎటు వెళ్ళు తుందో దాన్నిఅక్కడ నుంచి వెనక్కి తేవాలనిగాని అది నీకు చెడ్డది అని అనిపించనివ్వకు. దాన్నే తలచుకు నేటట్టు చెయ్, "యతో యతో నిశ్చరతి మనః చంచలం" అస్థిరం. పోని అదికూడ ఒకదాని మీద నిలబడి ఉంటుందా అంటే స్థిరత అనేది లేకుండ అందులో కూడ మళ్లీ ఒకదానిమీద నుంచి ఒకదాని మీదకు మరో దాని మీదకు వెళ్ళిపోతుంటుంది. ఏం చేయాలి నువు?

"తత స్తతో నియమ్య"

వెళ్ళని కానీ, ఆ వెళ్ళేటపుడు నువు దేనినైతే తలచుకున్నావో దానిని కూడ తీసుకుంటూ వెళ్ళు సృష్టిలో ఉండే ఏ వస్తువూ చెడ్డది కాదు కనుక నీ మనసు వెళ్ళినది కూడా మంచిదే అనేది నువ్వు స్మరించగలగాలి. దాన్ని నువు చూసినపుడు అందులో నీకు ఏ విధమైన మంచి లభిస్తుంది అనేదాన్ని గుర్తించే ప్రయత్నం చేయడం ద్వారా మనసుకి నీవు మంచి మార్గాన్ని చెప్పవచ్చు. ఒక ఉదా:- చూద్దాం. పూజలో కూర్చున్నాము. అక్కడ

ఎదురుగుండ కృష్ణుని పూజ చేస్తున్నాము. కళ్ళు మూసుకొని కూర్చోగానే మనసు బయల్దేరి వెళ్ళిపోయింది. వెంటనే అక్కడ నుంచి ఓజిళిగీలిజీ శీబిజీదిలిశి, బీజిళిశినీ రీనీళిచీకు, చీబిజీదిలోకి, అందులోంచి సినిమా థియేటర్‌లోకి వచ్చింది. మళ్ళీ వెనక్కి వచ్చింది. మనస్సా! అలా తిరుగకు అనకు. ఓజిళిగీలిజీ శీబిజీదిలిశికు వెళ్ళిందా! వెళ్ళనీ! కూడా నీవు నీ కృష్ణాదితో వెళ్ళు! చూడు ఆ పండ్లన్నీ, కృష్ణుడి దయవల్లే పెద్దవి అయినాయి. నీకు కావలసినవి తీసుకో కృష్ణుడు ఇచ్చాడు..... ఏమైంది ఇపుడు.

నీకు కావాల్సింది కృష్ణ సంబంధం కనుక ఇవన్నీ కృష్ణుడికి చెబితే, కృష్ణుడికి పెడితే, కృష్ణుడికి చూపిస్తే, అని నువు అనగానే నీకు కావాల్సిన కృష్ణుడు అక్కడికి వచ్చాడు. మనసుకు కావాల్సిన పండ్లు అక్కడికిచేరాయి. రెంటికీ నీవు సంబంధం కలిపావు. ఇపుడు మనస్సు సంతృప్తి చెందింది. నీ లక్ష్యం కృష్ణుడు చెదరలేదు. దానికి ఇష్టమైన సన్నివేశాలు చెబుతున్నావు కనుక నీ మాట వినడానికి అది వ్యతిరేకించదు.'యతో యతో నిశ్చరతి' 'తతస్తతో నియమ్య' ఎంత అందంగా వాడాడో పదాల్ని దేని దేని మీదకి నీ మనసు వెళ్ళిపోతుందో, ఎటు ఎటు అది వెడుతుందో దేని నుంచి దేని మీదికి అది ప్రయాణం చేస్తుందో అవన్నీ చేయనీ. అక్కడక్కడ నుంచి దాని దానితోటి ఆయా ఆయా సన్నివేశంతోటి "ఆత్మన్యేవ వశం నయేత్" నీవు కోరుకున్నది ఏదో దాని తోటి నీవు కనుక సంబంధం కలిపావంటే అది నీ మాట వింటుంది చంచలమై తిరిగే మనస్సుకి భగవత్ సంబంధాన్ని ఆయా ఆయా సన్నివేశంతోటి కలుపటం ద్వారా ఈసారి ఏది అవసరమైనను భగవంతుడి ద్వార దాన్ని పొందవచ్చును అనే స్థితి ఏర్పడుతుంది. కనుక, తనకు కలిగే కర్మ వాసనా ప్రభావం చేత ఏర్పడే చాంచల్యాన్ని అది భగవంతుడి విషయంలోకి నడిపే ప్రయత్నం చేస్తుందన్న మాట. ఉధృతమైన నది ప్రవహిస్తుంటే నదిని ఆపితే ఊర్లు మునిగి పోతాయి నదిని వదిలేస్తే నీళ్ళు సముద్రంలో కలిసి పోతాయి. దానికి ఒక సేతువు నిర్మాణం చేసి కాలువలు తీసి దాంట్లో నుంచి నడిపించి నట్లయితే తద్వారా నీళ్ళు ప్రవహిస్తాయి. అడ్డు కట్టావు. పంటలు పండుతు న్నాయి. అందరికి క్షేమం కలిగినట్టే మనసుని దాని ఇష్టం వచ్చినట్టు పోనీవద్దు క్రమపద్ధతిలో దాన్ని నడుపుతూ ఉంటే "ఆత్మన్యేవ వశం నయేత్"

తద్వారా మనసు మాట వినగలుగుతుంది. దీనికి 'ఛాందోగ్యం' పక్షిని దృష్టాంతంగా ఇచ్చింది. అందమైన పక్షి రెక్కలు విప్పి ఎగిరితే భలే సౌందర్యం. దాన్ని అలానే వదిలేస్తే అది ఎక్కడికో వెళ్ళిపోతుంది. అందాన్ని చూసే అవకాశం లేదు. పోని పంజరంలో పట్టి పెట్టేస్తే అది ఎగురలేదు కనుక అందం చూసే అవకాశం లేదు. దానికి ఒక కాలుకు తెగని త్రాడు కట్టి వదులుతే తాడు ఉన్నంత మేర ఎగురుతుంది. ఎగిరితే సౌందర్యాన్ని చూస్తావు. కావాలనుకుంటే మళ్ళీ త్రాడుతోటి సంబంధం ఉంది కనుక, దాన్నివెనక్కి తెచ్చి పంజరంలో పెట్టుకున్నట్టుగానే మనస్సు అనేటటు వంటి ఒక అద్భుతమైన ఒక పక్షికి నీకుండే జ్ఞానమనే ఒక త్రాటిని ప్రేమ త్రాటిగా దానికి బస నిర్మాణం చేయి. అది ఎటు ఎటు ఎగిరితే తద్ సౌందర్యాన్ని నీకు కావాల్సిన దానికి నువు. 'వశం నయేత్' అన్నట్లుగా స్వాధీనం చేసుకోగలుగుతావు.

"యథా శకునః సూత్రేన ప్రబద్ధః దిశం దిశం" అంటు చాందోగ్యం చెప్పినమాట. దాన్నే శ్రీకృష్ణుడు అద్భుతమైనటువంటి ఒక సాధనగ మనకి ఈ శ్లోకంలో అందిస్తున్నాడు కనుక, మనకి ఆహార నియమం చేత ఏర్పడేటటువంటి మానసిక నిగ్రహాన్ని చక్కటి సాధన ద్వారా మనం సాధించాలి.

6-26శ్లోకంలో భగవంతుడు చెబుతున్నారు మనకి. కనుక, ఆహారనియమం పాటిద్దాం. తద్వారా మనసు యొక్క గతిని మనకు కావాల్సిన రీతిలో మలచుకునే ప్రయత్నం చేద్దాము అని ఈ వారం మనం స్వీకరిద్దాం గీతాజ్యోతిలో భాగంగా.





# సమతాభావానికి సరియైన నిర్వచనం

**19వ శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।**
**సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥ 6అ॥ 32శ్లో॥**

గీతాజ్యోతిలో ఇది మనకు 19వ వారం. ఇంతవరకు మనం అక్కడక్కడ భగవానుడు అందించిన ఉత్తమ సూత్రాలలో కొన్నిటిని మనవి చేసుకొనే ప్రయత్నం చేస్తున్నాము. మన సొంతం చేసుకునే ప్రయత్నం చేస్తున్నాము. అయితే ఒక వస్తువుని మన సొంతం చేసుకోగానే దాన్ని అందరికి అందించాలి అని కూడ అనిపించాలి. ఒకడు ఇల్లు కట్టుకుంటే ఆ ఇంటి అందం, అందరు చూసి, ఎంత బాగుందో అనాలనే కోరిక ఉంటుంది. నూతన వస్త్రాలు ధరిస్తే, ఆ వస్త్రాలలో 'తను ఎంతెంత బాగున్నానో' చూసి అందరూ పొగడాలని కోరిక కలుగుతుంది. అలాగే మనం ఒక శ్లోకాన్ని నేర్చి, ఆ భావాన్ని తెలిసి, దాన్ని ఆచరిస్తూపొందే సంతోషాన్ని సంతృప్తిని కూడ అందరికీ అందించి, వారందరూ ఆచరింపచేయాలనే అభిరుచి మనలో ఏర్పడాలి ఆ దిశలో మనం పయనిస్తున్నాము.

మనస్సు యొక్క నిగ్రహం ఎలా ఏర్పడుతుంది అనేది భగవంతుడు ప్రధానంగా 6వ అధ్యాయంలో చెప్పాడు. మనిషికి మనసు చాల ప్రధానం. అసలు మనసు ఉంటేనే మనిషంటాము. మనసు అనే దాన్ని సవ్యంగా వాడుకోగలిగినవాడు కనుకనే వానిపేరు మానవుడు అయ్యింది. మనసుని జాగ్రత్తగా వాడుకుంటూ మంచి మానాన్ని మనం పొందాలి అంటే మంచి అభిమానం పొందాలి. లోకంలో మిగతావారికి ఉపమానములాగ మనం నిలువాలి. అలాంటి దానికి మన మనస్సు సహకరించాలి. అయితే ఎలా సహకరిస్తుంది? ఏం చేస్తే సహకరిస్తుంది? దానికి ఆహార నియమం, విహార నియమం, వ్యవహార నియమం, ఎలా ఉండాలో మనం తెలుసుకుని అలాంటి వాటిని అభ్యసించడం ఒక రకమైన ప్రయత్నం, అంతేకాక తన మానాన తను పయనించే మనసుని ఎలా మనం ఒక క్రమపద్ధతిలో నడిపించవలె అనే దాన్ని తెలుసుకుంటూ ఒకరకమైన సాధన మనం చేయాలి. తద్వారా మనసుకి ఏర్పడే యోగ్యత సమభావన, సమదృష్టి.

ఎందరెందరో మన చుట్టు ఎన్నోరకాలుగ ప్రవర్తిస్తుంటారు. నిజానికి వారివారి యొక్క కర్మకు తగినట్టు వారు ప్రవర్తిస్తారు. వీడు నాకు హాని అని, వీడు నాకు మంచి చేస్తున్నాడనీ నిజానికి ఎవడి వల్ల ఏమి ఉండదు. మనకు ఏడుపు వచ్చింది అని అంటే మనకు అట్టాంటిది అనుభవించే కర్మ ఉంది కనుక, వచ్చిందే తప్ప దానికి ఎవడో లోకంలో నిమిత్తంగ ఉండచ్చు. నిజానికి వ్యక్తుల యొక్క ప్రవృత్తులన్ని వాళ్ళ వాళ్ళ కర్మాధీనాలు. మనకు ఏర్పడే అనుభవాలన్ని కూడ మన కర్మాధీనాలు. వీటిని బట్టి మనం ఎదుట వ్యక్తుల మీద ద్వేషాలు రాగాలు పెంచుకుంటూ, తద్వార మనసును పాడుచేసుకోవలసిన అవసరం లేదు అని కృష్ణుడు ఈ అధ్యాయం మొదట్లో మనకు చెప్పి దాన్ని జాగ్రత్తగా పెంచుకోగలగడం, సమ భావన అనేది మానవుడికి చాల అవసరం అని చెప్పాడు. మనిషి తన యొక్క మానవ జన్మ సార్థక్యాన్ని పొందడం కోసం, ఎందుకోసం ఏర్పడిందో, దాన్ని సాధించడంకోసం, ఈ జీవుడికి ఏర్పడ్డ కర్మ బంధం పూర్తిగ తొలగి తన యొక్క సహజ స్వరూపం ప్రకాశించి ఏది అనుకుంటే అది అందుకోగలిగే స్థితిలోకి వెళ్ళడానికి వీలుగ దీన్ని మలచుకోగలుగాలి. సమభావన దానికి సాధనం కావాలి. అలాంటి సమభావన కలిగిన వ్యక్తి ఎట్లా

ఉంటాడో మనకి తెలిస్తే అది సాధించడానికి మనం ఏదైనా కొంత కృషి చేసే అవకాశాలు ఉంటాయి. ఆ సమభావన ఇలా ఉంటుంది సుమా! అనేది భగవంతుడు మనకి 6వ అధ్యాయంలో 32వ శ్లోకంలో చూపిస్తాడు.

సః పరమో యోగీ = శ్రీకృష్ణుడు పరమ యోగి ఎలా ఉంటాడు అనేది నిర్ణయం చేసి చెప్తున్నాడు. యోగీ అంటే సమత్వ భావం కలిగినవాడు అని అర్థం. సమత్వభావన కలగడమంటే సుఖ దుఃఖాదులయందు లాభ నష్టముల యందు అన్నిటి యందూ చెదరని మనస్సు కలిగిఉండడం, ఆ సమభావన ఏర్పడ్డవానిని యోగి అంటారు. ఈ సమత్వ భావన ఎవడిలోనైతే పరిపక్వత చెందినదో వాడిని పరమయోగి అని అంటాం. మరి వాడు ఎలా ఉంటాడు? తనని తాను ఆయా సన్నివేశాలలో ఎట్లా చూసుకుంటాడో అందరి విషయంలోనూ అలాగే చూస్తాడు. అది సుఖ ప్రదం కావచ్చు, దుఃఖ ప్రదం కావచ్చు. అలాంటి మహానుభావులలో ప్రహ్లాదుడు, శ్రీశుకయోగీంద్రులు, నమ్మాళ్వారు...

ఆళ్వారులలో నమ్మాళ్వార్లు అనే మహానుభావులు దక్షిణ దేశంలో ఉండేవారు. పుట్టినప్పటినుండి చెట్టుతొఱ్ఱలోనే పెరిగారు 32 సం॥ల కాలమే ఇక్కడ ఉన్నారు. అయినప్పటికీ కూడా ఓ అద్భుతమైన భగవదనుభవం పొందారు. ఎలాంటి అనుభవం వారిలో పక్వత చెందిందంటే ఏ వస్తువును చూసినప్పటికీ ఆ వస్తువుపై తన భావనవంటి భావననే కలిగినది. అని ఒక ప్రేమ ఏర్పడి, తనకు ఎలాంటి లాభం కలగాలని కోరుకుంటున్నారో ఆ లాభం దానికి ఏర్పడాలి అనేటంత వరకూ వెళ్ళింది. నిజానికి ఎదటి వ్యక్తిలోని కష్టసుఖాలను గమనించడం పెద్ద కష్టంకాదు. కానీ ఎదటివ్యక్తికి కష్టాలు పోయి సుఖం కలగాలని అనుకోవడం కష్టం. మిత్రులైతే అనుకుంటాం కానీ శత్రువులైతే ఎందుకనుకుంటాం. కానీ శత్రువులకి కూడా కష్టంపోయి సుఖం కలగాలనుకోవడం చాలా కష్టం. అదికూడా కొందరికి సిద్ధించితే సిద్ధించు గాక! కానీ తను ఎట్లాంటి సుఖాన్ని కోరుకుంటు న్నాడో అట్లాంటి సుఖం తనకి లేకపోయినా వాడికి కలగాలని కోరుకోవడమనేది చాలా గొప్పస్థితి. ఇది ఇందాక మనం అనుకున్న మహానుభావు లలో ఉంది. నమ్మాళ్వార్లు 1000 పాటలు పాడారు. అందులో రెండవ శతకంలో అందమైన ఒక 10 పాటలున్నాయి ఆ పాటలలో వారు ఒక కొంగని చూశారు. తెల్లగా కనిపిస్తుంది. నిలకడగా నిలబడి ఉంది. దేనికో ఎదురు చూస్తుంది. ఇది చూశారు. ఈ మూడు పనులు తమ దగ్గర ఉన్నాయి. తాము ప్రస్తుతం తెల్లగా ఉన్నారు. తెల్లగా ఉండటం అంటే పాలిపోవడమన్నమాట. ఒకనాడు మంచి రంగులో ఉన్న నమ్మాళ్వారు భగవంతుడితోటి ఎడబాటు ఏర్పడటంచేత ఆ ఎడబాటుని తట్టుకోలేక వారు పాలిపోయారు కనుక వారి శరీరం కూడా తెల్లబడిపోయినట్లయిందన్న మాట.

కొంగ తెల్లగా కనిపిస్తుంది, తానూ తెల్లగానే ఉన్నారు. బహుశా కొంగ కూడా ఎందుకు తెల్లగా ఉండి ఉంటుంది? తనలాగే అయిపోయి ఉంటుంది దానికి కూడా, నాకు వెనుక ఎవడైతే ఆధారమో దానికి అతడే ఆధారము, నేను ఈ లోకంలో ఎలా పుట్టానో ఆ కొంగకూడా అట్లానే పుట్టింది. నాకు భగవంతుడి తోడు చేరితేనే దుఃఖం తీరడమన్నది. ఆ కొంగకికూడా అంతే. అంచేత నాకు ఏర్పడ్డ ఎడబాటు తొలగినాకు భగవంతుడి తోటి సహవాసం ఏర్పడ్డపుడే ఆనందం కలిగినట్లే దానికి కూడా అట్లానే కలగాలి. అంతేకాదు, ఆ ఎడబాటు ఓర్వలేక నేను శోకిస్తున్నట్లే బహుశా ఆ కొంగకూడా అట్లానే శోకిస్తుంది. దానికీ శోకం తగ్గాలి. దానికీ ఆ పాలిపోవడం పోయి, అది కూడా మంచి రంగుతోటి సహజకాంతితోటి ప్రకాశించాలి నాలాగే. కొంగకి నిజంగా అవేమీ లేవు. తనకి అవన్నీ ఉన్నాయి కనుక దానికి కూడా అట్లాంటి ఆనందపుస్థితి ఏర్పడాలి. తనకి కలిగినా కలగకపోయినా అని





వారనుకుంటారు. అలానే కొంగ నిలబడి ధ్యానం చేస్తుంటే భగవంతుడికోసం అనుకుంటారు. కానీ నిజానికి దాని ధ్యానం చేపల కోసం. కష్టాల తరంగాలు వచ్చినా చెదరక భగవంతుడినే ధ్యానం చేస్తున్నానే బహుశా అదికూడా అలానే చేస్తున్నట్లున్నదే నా ధ్యానం ఫలిస్తే ఫలించింది. లేకపోతే మానే! దాని ధ్యానం ఫలించి ఆ భగవంతుడు నాకంటే ముందు ఆ కొంగకి కనిపించి దానిని సంతోష పెడితే బాగుండును అని దాని కోసం తాము శోకిస్తారు.

నిజానికి దానికోసం వీరు బాధపడడ మెందుకు? అది వీరి తెలివి తక్కువ తనం అని మనం అనుకుంటాం. కానీ బాహిరమైన ఈ శరీరాలు దాటిన తరువాత. లోపల ఉండే మనమందరం ఒకే రకమైన వాళ్ళం. మనందరితోటి వాడికుండే సంబంధం అందరికీ సమానమే. అలాంటప్పుడు మనిషికి కానీ మిగతా వాటికి కానీ ఏది సుఖం ఏది దుఃఖం అంటే తాత్కాలిక శరీరానికి అనుకూలత సుఖం, తాత్కాలిక శరీరానికి ప్రతికూలత దుఃఖం కాదు.

త్రాగుడు అలవాటు ఉండే వాడికి, వాడికొక సీసా దొరికి త్రాగితే అది సుఖం, అను కుంటాడు. సీసా కొనుక్కోవడానికి డబ్బులు లేకపోతేనో ఎవరూ ఇవ్వకపోతేనో వాడి జీవితంలో నరకం దుఃఖం అనుకుంటాడు. ఏడుస్తుంటాడు.

తాత్కాలికంగా ఏర్పడ్డ దురవస్థ చేత వాడి కట్లాగ సుఖ దుఃఖాలు తాత్కాలికంగా మారుతున్నాయి కాని లోపల ఒకసారి జ్ఞానం కలిగితే అందరికీ కూడా సుఖాలు, దుఃఖాలు ఇవికానేకావు. భగవంతుడితోటి కలయిక ఏర్పడితే సుఖం, భగవంతుడి స్మరణ నిలిస్తే సుఖం, భగవంతుడి స్మరణ చేదిరితే అది దుఃఖం, అది నరకం, అది క్లేశం, కష్టం. అదే బాధ. ఇది ఏ జీవికైనా సమానమే. ఇది మనకి తెలియాలి అది మనకి తెలిసిననాడు అట్లాంటి స్థితిలో మనం ఉండే ప్రయత్నం చేసి క్రమంగా ఒక నాటికి మిగతావి కూడా ఆయాస్థాయికి చేరగలిగేటట్లుగా కృషి చేస్తాం. ఆ స్థాయికి లోపల ఉండేవాటిని చూసినప్పుడల్లా వాటికవి కలిగితే బాగుండుననే భావన కలుగు తూంటుంది. బయటికి కలిగే తేడాలు మనం పెద్దగా పట్టించుకోము. సమభావనంటే అక్కడ దాకా వెళ్ళాలి కదా! కనుక (నమ్మాళ్వారు) వీరు కొంగని చూస్తే తనవంటి స్థితిలో అది ఉన్నదని తాను కోరుకున్న తన ఆనందమేదో అది దానికి రావాలి అని దానికోసం ప్రార్థన చేస్తారు. 'అత్మౌపమ్యేన....... సర్వత్ర' అది తనకి బంధువుకాదు. తోడుకాదు. కానీ దాని యందు కూడా 'సమంపశ్యతి' ఇదివారు చేసిన పని.

నిజానికి సమభావన, సమభావన అవి ఎన్నో మాట్లాడుతూంటాం. ఎన్నోరకాలుగా దానిని నిర్వచిస్తుంటాం. సమభావనకి సరియైన నిదర్శనం మనకి 6వఅధ్యాయపు 32వశ్లోకం. ఇది మనలో ఏర్పడాలి. లోకంలో రకరకాల మనుషులను చూడండి. వారి వారి స్థితి గతులను గమనించండి. ఆ స్థితిగతులు ఒకవేళ వాళ్లకి తెలియక అవి చెడ్డవై వాళ్ళు వాటిని మంచి వనుకుంటే వారికి మంచిని అందించే ప్రయత్నంచెయ్యండి. అవి సహజంగా మంచిలోనే ఉన్నట్లయితే దానికి మీరూ పొంగిపోండి ఆనందించండి. దానిని పదుగురికి అందించే ప్రయత్నం మనం చెయ్యాలి. సమభావన కలిగినందుకు ప్రయోజనం అదికదా! కనుక వ్యక్తిని గుర్తించడం ఒకటి. అది మనదిగా చేసుకోవడం ఒకటి దానిని మరికొందరికి అందించే ప్రయత్నం చెయ్యడం ఒకటి. కనుక సమభావనకి సరియైన నిదర్శనంగా మనం నిలవగలగాలి.ఈ శ్లోకాన్ని మనం అనుసంధించి మనస్సుకు పట్టించుకుంటే అది ఒకనాటికి కాకపోతే మరొకనాటికైనా ఆ యోగ్యత ఆ రకమైనటువంటి సమభావన మనలో నిండి మనని కూడా ఒక యోగిగా మార్చగలిగేటట్లు.

# బలహీనతలను బాగుచేస్తాడు - బంగారు జీవితాన్నందిస్తాడు

**20వ శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాన్ లోకాన్ ఉషిత్వా శాశ్వతీ స్సమాః।**
**శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥ 6అ॥ 41శ్లో॥**

ఈ వారపు గీతాజ్యోతి శ్లోకం 6వ అధ్యాయం 41వ శ్లోకం. ఇది ఒక గొప్ప భరోసా నిచ్చే శ్లోకం. సామాన్యంగా లోకంలో ప్రతివాడు ఎప్పుడో ఏదో ఒక తప్పుని చేసే ఉంటాడు. చేస్తూనే ఉంటాడు. బాగుపడాలని ప్రయత్నం చేస్తాడు. పైకి లేవాలని ఉద్యమిస్తుంటాడు మధ్యలో పడుతూ ఉంటాడు. ఆ రకంగా పతితులైన ప్రాణులు ఎందరో ఈ లోకములో మనకి కనిపిస్తూంటారు. అయితే ఇలాంటి పతితులందరిని పరమాత్మ బయటపారవేస్తాడని తెలియని కొందరు అజ్ఞానులు, భగవంతుని యొక్క కరుణా వైశిష్ట్యాన్ని తెలియనటువంటి మూర్ఖులు. భగవంతుడు పాపులని శిక్షిస్తాడు అని అంటారు. కాని భగవద్గీతలో భగవంతుడు ఎంత పాపి అయినా తాను వాడిని వదలిపెట్టనని, వాడు పాపికావడానికి ఏదో ఒక కారణం వెనకాతల పనిచేస్తుంటుంది కనుక అలాంటి కారణాన్ని వాడంతట వాడే తెలుసుకొని వదలగలిగేటట్టుగ వాడిని చేస్తానని గొప్ప భరోసా ఇస్తున్నాడు మనకు స్వామి చెప్పినధైర్యం ఇది.

ప్రపంచంలో కొంతమందిని పాపిని పాపిగా ఉంచి, వాడికి కావలసినది ఏవి ఇచ్చే ప్రయత్నం చేస్తాం అంటారు. లేదా ఎన్ని పాపములు చేసినా ఫరవాలేదు ఒక్కసారి ఆయన దగ్గర తలవంచినట్లయితే పవిత్రుడవై పోతావు అంటుంటారు మరి కొందరు. కానీ పాపమనేది మనిషిలో ఉండేబలహీనతల వల్ల మనిషిని తప్పుదారిని పట్టించినదయితే అలాంటి బలహీనతని బలహీనత అని ముందు గుర్తించగలగాలి. ఆ బలహీనత ఏదో ఒక కోరికవలన ఏర్పడి ఉంటుంది కనుక ఆ కోరికను తాను వదలగలగాలి. అయితే కోరికలు మనిషిని బాగా ఆకర్షిస్తాయి. ఒకడికి తిండి ఇష్టమైతే తిండి లేకుండా చేసేస్తాను అని వాడిని పస్తు పడుకోబెడితే వాడికి ఆ తిండి మీద ఉండే రుచి తొలగనే తొలగదు. మరి ఏం చేయ్యాలి? అంటే తినదగినది తినేరీతి ఎలానో వాడికి చెప్పి ఆ తిండి పెట్టినట్లయితే ఆ తిండి మీద ఉండే రుచి కొంతైనా తగ్గటానికి, సవ్యంగా తగ్గటానికి అవకాశం ఉంది తప్ప వాడిని పస్తు పడుకోబెడితే కాదు. కొన్నిటికి మాన్పించడం మందు కావచ్చు. కానీ కొన్నిటికి అనుభవించే వస్తువుని క్రమపద్ధతిలో దానిని అనుభవింప జెయ్యడమే మంచి మందు అవుతుంది. ఊళ్ళు మునిగిపోయే జలప్రవాహానికి మందుగా జల ప్రవాహాన్ని ఆపగలమా? లేకా జలాన్ని వదలడమా? జలాన్ని ఆపడమూ మనచేతులలో ఉండేది కాదు. జలాన్ని వదలడమూ మన చేతులలోది కాదు. ప్రవహించి వెళ్ళిపోయే ఆ నీరు సముద్రంలోకి వదిలేసుకుంటే నష్టం వస్తుంది. అందుకోసమనే ఆ వచ్చేటటువంటి జలాన్ని నువ్వు ఆపనక్కర్లేదు. జలాన్నిరానివ్వాలి. కాని దానికొక చక్కనిసేతువు నిర్మాణం చేసి చక్కని కాలవనిర్మాణం చేస్తే నీకు ప్రయోజనకారి ఎలా అయ్యిందో బలహీనతలు అనేది కూడ ఉధృతమైన ప్రవాహాల్లాంటిది. అవి మనస్సును బలహీన పరచి పాడుచేస్తాయి. సాధనలో కూడా ఆటంకాలు ఏర్పడేది వాటి వలనే కదా! తాను చేరవలసిన గమ్యాన్ని కూడా చేరకుండా వాటి వలనే అయ్యేది కదా! వాటిని ఎట్లా సవ్యంగా మరల్చుకోవచ్చునో అది, నేను చూస్తానయ్యా, నీకెందుకంత బెంగ. నువ్వు దానిని సాధించాలి అని కోరుకో. సమత్వం కావాలని కోరుకో. మిగతావన్నీ నేను చూసుకుంటాను అని శ్రీకృష్ణుడు ఇస్తున్నాడు





భరోసా. 6వ అధ్యాయంలో ఆత్మ సంయమనాన్ని గురించి కృష్ణుడు చెప్పినదాన్ని గురించి విన్న అర్జునుడికి హఠాత్తుగా ఒక సంశయం ఏర్పడినది. 4 రకాలుగా ఆ సంశయాన్ని అర్జునుడు వివరించాడు శ్రీకృష్ణుడి దగ్గర.

లోకంలో ఒక్కొక్కసారి కొంతమంది అసలు సాధనే చెయ్యరు. బాగుపడాలని కోరిక ఉంటుంది. కానీ ప్రయత్నం చెయ్యడు. కానీ ఏం ప్రయత్నం చెయ్యకుండా అన్నీ వచ్చి చేతిలో పడితే బాగుండును కదా! అని అనుకుంటాడు. పాపం ఒక్కొక్కడికి చేసే ప్రయత్నం మీద శ్రద్ధ ఉంటుంది. ఇది మంచిదని తెలుసును. చెయ్యాలని తెలుసును, చేద్దాం అని వీడికి కూడా ఉంది కానీ శ్రద్ధ కలిగిన తరువాత ఇకదానిలో చెయ్యలేక పోయాడు. ఇంకొకడు సాధన చేశాడు. సాధన చాలా వరకు సాగడమే కాదు. సాధన చాలా వరకు పూర్తి అయిపోయింది. పూర్తి అయిన తరువాత చేతికి ఫలితం రావాలి కదా! ఫలితం చేతికి అందుకుంటున్నాడనిపించేటప్పటికి వీడికి ప్రాణం పోయింది. పాపం ఇంత శ్రమపడి చేసిన సాధన అంతా వ్యర్థమే కదా! ఫలితం చేతికి అందకుండాపోతే లాభం ఏమిటి?

యోగం మంచిదని ఏదోప్రయత్నం చేద్దాం అనుకోవడం, ప్రయత్నం చేసి సగంలో భ్రష్టుడై పోవడం, పూర్తి అయిపోయినా ఫలితం పొందకుండా వీడు దేహాన్ని చాలించేయ డంలాంటిది ఏది జరిగినా అందరికీ ప్రయోజనం అయితే ఒకటేకదా! అందక పోవడమనేది.

మనకూ అలానే అనిపిస్తుందికదా! ఏదో గీతాజ్యోతి చెయ్యాలి. అందరికీ చెప్పాలి మనము అభ్యసించాలి. అబ్బ ఇది పూర్తి అవుతుందో లేదో అప్పటి దాకా చెయ్యగలుగు తామో లేదో ఇవన్నీ వస్తాయో రావో, చెప్తే వింటారో లేదో అనవసరంగా సగం దాకా చేసి మానడం ఎందుకండి. మొట్టమొదటి అసలు దాని జోలికే పోకుండా ఉంటే సరికదా! అని అనిపిస్తూ ఉంటుంది, అప్పుడప్పుడు. కానీ ఎంత చేస్తే అంతే లాభం- దేని వలన భ్రష్టుల మయ్యామో దానినే మనకి బాగుపడటానికి సాధనమయ్యేటట్లుగా చేస్తానంటాడు శ్రీకృష్ణుడు ఈ 41వ శ్లో॥లో. నిజానికి ఇలాంటి ప్రతిజ్ఞ ఇట్లాంటి భరోసా ఇచ్చిన వ్యక్తి చరిత్రలో ఇతరత్రా ఎక్కడా కనిపించడు. భగవద్గీతలో కృష్ణుడు తప్ప.

ఏం భరోసా:- యోగభ్రష్టః అభిజాయతే తను చేసే సాధనలలో నుండి పడిపోయి ఏ బలహీనత వల్లో దిగజారి పోయినటువంటి పతితుడున్నాడో, ఆ పతితుడు కూడా ఇలా బాగుపడతాడు. ఏం చేస్తాడు. "ప్రాప్యపుణ్య కృతాన్ లోకాన్" వీడు మంచి కార్యం ఆరంభం చేశాడు కదా! అంచేత ఎంత చేసినా అది వ్యర్థం కాదు. కనుక ఈ దేహం వదిలిన తరువాత ఉత్తమ పుణ్యం చేసినవారు వెళ్ళే స్థానాలేవో అటువంటి స్థానాలు చేరతారు. చేరి "ఉషిత్వా శాశ్వతీ స్సమాః" అక్కడ వీడు ఎంతకాలం అనుభవించాలను కుంటాడో అంతకాలం వీడక్కడ అనుభవిస్తూ ఉంటాడు.

ఆ తరువాత "శుచీనాం శ్రీమతాం గేహే" శుచీమంతులు, శ్రీమంతులూ అయిన వాళ్ళ యిళ్ళల్లో పుడతాడు. యోగభ్రష్టుడికి ఇంత లాభమా? అయితే యోగం చెయ్యడం కంటే యోగభ్రష్టుడు అవ్వడమే బాగుంది అంటారా? భ్రష్టుడు అనగానే వెనకాతలొక భ్రష్టత్వం కారణం ఉంటుంది. అది ఎలా ఉంటుంది దానికి ఉదాహరణ. ఒక పిల్లవాడిని చక్కగా చదువు కోమని చెప్పారు. ఆ పిల్లవాడికి చదువుకోవాలని ఉంది కానీ తీపి తినడమంటే భలే యిష్టం అంచేత పుస్తకం పేజీత్రిప్పుతుంటే పంచదార లాంటి తీపి నోట్లో వేసుకుంటే గానీ వీడికి తోచేది కాదు. అసలు వీడు చదువుదా మని ప్రక్కన తీపి పెట్టుకొనేప్పటికి అది ఖాళీ అవుతుందేతప్ప పేజీలు కదలవు. సరే అపుడు ఏం చెయ్యాలి? వాడి తండ్రి వీడిని తీసికెళ్ళి మిఠాయి దుకాణంలో సేవ చేసేవాడిగా పెట్టాడు.

ఎటుచూసినా మొత్తం అన్నీ తీపి పదార్థాలే ఎంతకాలం అని తింటాడు తినీ తినీ విసుగు వచ్చి, ఇక ఎప్పుడైనా తీపి తింటావా అంటే ఇంక నాకు వద్దు మొర్రో అనే స్థితికి వచ్చాడు. తీపి తినకుండా చదువు చదవలేక పోవడం వల్ల చదువు ఆపి ముందు తీపి పెట్టి అది తిని ఇక వీడు తృప్తి అయ్యాక చదువమని చెప్తే అపుడు దృష్టి చదువుమీద ఉంటుంది. తీపి మీదకు రాదు. అపుడు ముందుకు వెళ్ళగలుగుతాడు. ఇది ఒక దృష్టాంతంగా పెట్టుకోండి. అలాగే ఒకడు ఏదో ఒక బలహీనతచేత క్రమం భ్రష్టుడయ్యాడు అనుకుందాం! ఇప్పుడు భగవంతుడు ఏం చేస్తాడో తెలుసునా. ఈ శరీరం విడిచిన తరువాత... ప్రాప్య పుణ్య కృతాన్ లోకాన్'' ఏదో లోకానికి వెళ్తే ఎటు చూసినా కామములే ''కామానాం త్వా కామభాజనం కరోమి'' అని అంటాడు యముడు నచికేతుడితోటి. కొంత కాలం అనుభవించాక వీడికి కూడా ఇక నాకు వద్దు మొర్రో అనేటట్లుగా చేసి భగవాన్ వీటి మీద నాకుఇష్టం లేదు. నాకు నువ్వేకావాలి అంటే అపుడు వీడిని తీసుకు వచ్చి వీడు ఏ ఇంట్లో పుడితే సాధన ఆరంభిస్తాడో చూసి ''శుచీనాం శ్రీమతాం గేహే'' ఇంట్లో వాడిని పెడతాడు. ఇపుడు బలహీనతలు అనేవి వీడిని పాడు చెయ్యవు. ఎందుకంటే వాటిమీద వీడికి సహజంగానే ఆత్మలోనే విరక్తి ఏర్పడింది. ఇపుడు వీడు పొందేవన్నీ కూడా దైవం వైపు వెళ్ళేవే వీని చుట్టూ ఉంటాయి. అలాంటి గృహంలో తీసుకెళ్లి పెడ్తాడు. ఇపుడు వీడికిక భయమేమిటి? బలహీనతవల్ల పతితుడయ్యాననే భయం మనకి ఏర్పడి భగవంతుడి నుండి మనం దూరమయి పోతూ ఉంటాం నేను పాపిని అని అనుకుంటూ పరమాత్మ నుండి దూరంకాకు ఎప్పుడూ, పాపులనీ, పతితులనీ, భ్రష్టులనీ కూడా వారికి బలహీనతలు ఏవి భ్రష్టతని, పాపాన్ని లేదా పతితత్వాన్ని కలిగించాయో అలాంటి వాటిని వాడు మంచి మార్గంలో అనుభవిస్తూ వాటిని ఇక చాలనుకున్నాక వీడు సాధనలోకి వచ్చేటట్లుగా భగవంతుడు నేను చేస్తానని ప్రతిజ్ఞచేస్తున్నాడు. ఈ శ్లోకంలో ఎంత దయాళువు ఆయన. ఆయనకిచ్చే గొప్ప భరోసా మనోనిగ్రహం. తద్వారా కోరుకున్న లక్ష్య సాధన, దానిని చేరడం, తత్ప్రయోజనాన్ని అనుభవించడం ఇవన్నీ కూడా నేను చూసుకుంటూరు నీవు నాయందు విశ్వాసం కలగి ప్రవర్తించు అంటూ భగవంతుడు మనకి ఈ శ్లోకంలో భరోసా ఇస్తున్నాడు కనుక ఎప్పుడైనా ఏదైనా పనిచేస్తూ అది మధ్యలో ఆగిపోతుందనో, సాగదనో లేదా ఫలితం రాదనో లేదా అది ఇబ్బంది కలిగిస్తుందనో లేదా భగవంతుడికి నిగ్రహం కలిగిస్తుందనో ఇలాంటి సంశయాలన్నీ వదిలి మనం ముందుకు సాగుదాం. మంచి పనిచేసే వాడు ''నహి కళ్యాణ కృత్ కశ్చిత్ దుర్గతిం దాత గచ్ఛతి'' మంచి పని చేసేవాడు ఎప్పుడు కూడా పాడైపోవటం అనేది ఉండనే ఉండదు. ఎంత మంచి చేయగలిగితే అంతే మంచి ఫలితాన్ని అనుభవిస్తావు. అనేది ఈ 6వ అధ్యాయములో భగవానుడు ఇచ్చేది. గొప్ప ధైర్యం, గొప్ప భరోసా ఆ శ్రీకృష్ణ పరమాత్మ యొక్క హస్తచ్ఛాయాలలో మనం ముందుకు సాగే ప్రయత్నం చేద్దాం.





5

## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషిచేస్తున్నవారిలో ఒకరిగా శ్రీమాన్ జి. గోపీకృష్ణ గారు, **P.F.Office,** (కూకట్ పల్లి) వీరుఎంతోమందికి మన భక్తినివేదనను పరిచయం చేస్తూ, వారందరినీ మన కుటుంబంలో కలుపుతున్నారు. వీరి కృషి మరింత ఫలప్రదం కావాలని శ్రీశ్రీశ్రీస్వామివారు అనేక మంగళాశాసనములు కృపచేసారు.

సంపాదకీయం

# దయ

మనిషి మనిషిగా మన్నన పొందడానికి అతనికి ఎన్నో గుణాలు కావాలి. వీటిలో ప్రధానమైనది దయ. దయ అంటూ మనిషిలో ఉంటే అది అతనిలో మరికొన్ని గుణాలను ప్రోది చేస్తుంది. కొన్ని దోషాలను వెలికి నెట్టివేస్తుంది. దయవల్ల ఉపకారబుద్ధి పెరుగుతుంది. హింస ప్రవృత్తి ఉపశమిస్తుంది. క్రోధం అంతరిస్తుంది. అంతరువులు అణగారతాయి. ఔదార్యం ఏర్పడుతుంది. దీనివల్ల సమాజంలో సౌహార్ధం, సామరస్యం వెల్లివిరుస్తాయి.

**ఇంతకూ దయ అంటే ఏమిటి?**

పక్కవాడి కష్టాన్ని, దుఃఖాన్నీ చూచి కాస్త గుండె కరగడం. గుండె లక్కలా ఉంటుంది. కాస్త సెగతగలగానే మెత్తనవుతుంది, కరిగిపోతుంది. ఒరుల ఇక్కట్లు, దుఃఖాలు సెగలా తగిలేయి గుండెకి. మెత్తబడింది. ఇదిగో ఈ ప్రదిమ దయ.

బాగుంది! నీ గుండె కరిగింది. మెత్తనైంది. దానివల్ల ఒరులకేమి ఒరిగింది? నీకు మట్టుకు ఏమి వచ్చింది? ఈ ప్రదిమ ఏదైనా ప్రయోజనాన్ని చేకూర్చాలి. దీనివల్ల అవతలివారికి మేలు చేకూరాలి. నీకు తృప్తి కలగాలి. నయం, గుండె కరిగింది. కొందరి గుండెలు కరగవు. అవి లక్కవంటివి కావు. రాళ్ళవంటివి. ఎంత సెగ తగిలినా చలనముండదు.

ఎదుటివాడి స్థితి చూచి నీ గుండె కదిలిపోవాలి. కరిగిపోవాలి. అదే అనుకంప. ఒరుల దుఃఖాన్ని చూచి ఓర్వలేక చలించిపోయేవు. పరదుఃఖ-అసహిష్ణుత ఇది. మొదటి మెట్టు ఇది. మనిషి ఇక్కడే ఆగిపోకూడదు. ఇంకా ముందుకు సాగాలి.

ఎదిరి దుఃఖాన్ని చూచి, కష్టాన్ని చూచి కంపించిపోవడం, కరిగిపోవడం మాత్రమే కాదు. ఆ దుఃఖం, ఆ కష్టం తనకు వచ్చినట్టుగా తపించిపోవాలి. కరిగిన గుండెలో సహానుభూతి కలగాలి. గుండె లక్కవంటిదన్నాం కదా! ఒరులస్థితి ఇక్కడ సెగ. లక్క కరిగింది. ఈ లక్క నీ గుండె. కరిగిన ఈ గుండె ఎదిరి గుండెలా రూపు కడుతుంది. వాని తలపులే ఇందులో మెదలుతాయి. ఇదే సహానుభూతి. వాడితోపాటు వాడి స్థితికి విలవిలలాడిపోతాం. కన్నీరు మున్నీరుగా విలపిస్తాం. ఇది రెండో మెట్టు.

బాగుంది! ఈ నీ విలాపం వాడికి కొంత ఊరట కలిగిస్తుంది. నిజమే! కాని, సమస్యను పరిష్కరించదే! దుఃఖకారణం అట్లాగే ఉంటుంది. కష్టకారణం బాధిస్తూనే ఉంటుంది. గోడు గోడున ఏడుస్తున్నవాడు నిన్నుపట్టుకొని కుమిలిపోతాడు. వాడి దుఃఖం పోవాలి. కష్టం మరలాలి. ఆ స్థితి ఇంకా రాలేదు. ఈ రెండో మెట్టు పరదుఃఖ దుఃఖిత్వం.

ఒరులతోపాటు నువ్వూ. దుఃఖపడగానే గుండెలో కలగవలసిన అనుకంపనం సమగ్రమవుతుంది. వీడు వీడు, వాడు కాదు కనుక కాస్త తేరుకుంటాడు. దుఃఖపడుతూనే ఆ భావనను వదలకుండానే వాడి దుఃఖకారణాన్ని అన్వేషించి, దాన్ని సమూలంగా పెరికేసి వాణ్ణి ఒడ్డున పడవేసే పనికి పూనుకుంటాడు. ఒడ్డున పడ్డవాడు బతికిపోతాడు. పడవేసిన





వాడూ మనిషిగా బతికిపోతాడు. ఇది మూడో మెట్టు. పర దుఃఖాపచికీర్ష.

దయాపరిపూర్తికి పరసీమ పరమాత్మే. అందుకు సందేహం లేదు. ఆయన దయా సముద్రుడు. ఒడ్డులు లేనిది, లోతులు ఎరుకకూ రానిదీని ఆయన దయ. అంతులేని ఆ దయకు కారణాలు అక్కరలేదు. ఆయన దయాళువు. అది ఆయన స్వభావం. మిగిలినవారు దాన్ని సంతరించుకోవాలి. బహుధా ప్రసరించే ఆయన దయను ఒక దేవిగా భావించి శతథా ఉల్లేఖిస్తా శ్రీమద్వేదాంత దేశికులు ఒక కమనీయమైన మధుర ప్రబంధాన్ని ప్రసాదించినారు.

ప్రాణికోటిలో వారూ వీరూ అనకుండా సర్వులూ సంతరించుకోవాల్సిన గుణం దయ. 'దయాభూతేషు' అని దయను దైవీ సంపద అంశంగా భగవద్గీత పేర్కొంటుంది. విష్ణు ప్రీతికరాలైన అష్టవిధ పుష్పాలలో దయ ఒకటి, (సర్వభూత దయాపుష్పం) అంటుంది పాద్మపురాణం.

గౌతమ ధర్మసూత్రం ఆత్మగుణాలుగా ఎనిమి దింటిని పేర్కొంటుంది. అందులో ప్రథమం దయ. వ్యక్తి ఔన్నత్యానికి, సమాజ శ్రేయస్సుకు, సామరస్య జీవనానికి దయ ఎంతైనా అవసరం.

తన జంటను చంపి తన గూటికే చేరిన బోయకు ఆత్మార్పణంతో ఆతిథ్యమిచ్చిన ఒక పావురమే ఈ దయకు పరమోదాహరణంగా నిలిచినప్పుడు మానవజాతి మానవత నిలవడానికి ఈదయ ఎంత అవసరమో, ఇదెంత గొప్పగుణమో, దీన్ని ఎంతగా ప్రోది చేసికోవాలో మానవులంతా మననం చేసుకోవాల్సిన సమయం ఇది.

**-శ్రీరామచంద్రాచార్య**

# శ్రీవిష్ణు మహాపురాణం

## ప్రథమాంశం - చతుర్థాధ్యాయం - పృథివీకృత వారాహస్తుతి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, కొవ్వూరు.

**పృథివి, స్వామిని స్తుతిస్తోంది.**

**ప్రసీద సర్వ సర్వాత్మన్ భవాయ జగతామిమామ్ ।**
**ఉద్ధరోర్వీమమేయాత్మన్! శంనో దేహ్యబ్జలోచన॥**

సర్వమూ శరీరంగా కలిగి, సర్వానికీ ఆత్మగా నియామకుడై ఉన్న స్వామి! ఈ జగత్తుల మనుగడ కొరకు ఈ పృథివిని జలాల నుండి ఉద్ధరించు. అప్రమేయ స్వరూపుడా! ప్రసన్నుడవు కమ్ము. ఓ పద్మాక్షా! మాకు సుఖాన్ని అనుగ్రహించు.

**సత్త్వోద్రిక్తోసి భగవన్! 'గోవింద' పృథివీ మిమామ్।**

సత్త్వ గుణ సముద్బోధం కలిగి జగదుపకారానికి ఉన్ముఖుడవైన స్వామీ! 'గోవిందా'! (సమస్త ప్రాణికోటి) ఆవిర్భ వించేలా ఈ భూమిని ఉద్ధరించు. ఓ పద్మాక్షా! మాకు సుఖాన్ని కలుగజేయి.

**సర్గ ప్రవృత్తిర్భవతో జగతాముపకారిణే ।**
**భవత్యేషా నమస్తేస్తు శంనో దేహ్యబ్జలోచన ॥**

ఓ స్వామీ! సృష్టిచేయడానికి నీవు చేసే ఉద్యమం జగత్తులకు మహోపకారకం అవుతుంది. స్వామీ! నీకు నమస్సులు. పద్మాక్షా! మాకు సుఖాన్ని కలిగించు అంటూ స్తుతించింది పృథివి. ఈ స్తుతిలో స్వామిని 'గోవిందా' అని సంబోధించింది పృథివి.

సాధారణంగా కృష్ణావతారంలో గోవర్ధ నోద్ధరణం అయిన తరువాత గోవింద నామం, క్షీరాభిషేకం కృష్ణునకు జరిగిందని, అప్పుడు గోవిందునిగా అభిషేకాన్ని పొంది నట్లు భాగవతం చెబుతున్నది. అయితే వరాహా వతారాకాలంలోనే స్వామిని గోవిందనామం సిద్ధించినదని విష్ణుపురాణం చెబుతున్నది. గామ్=భూమిని, విందతి ప్రాప్నోతి పొందుతున్నాడు కనుక, గోవిందః అని నిర్వచనం. భూమిని ఉద్ధరించిన స్వపత్నిగా స్వీకరించాడు కనుక గోవిందుడు.

### భూమి సముద్ధరణం

ఇలా పృథివిచే స్తుతింపబడుతున్న స్వామి, పాతాళంలో అడుగున చేరిపోయిన భూమిని పైకి ఉద్ధరించి నీటిపై తేల్చినాడట. ఈ భూమిజలాలపై ఎలా తేల్చబడింది? బరువుకు నీటమునిగిపోదా? అను శంకను నిరాకరిస్తూ ఇలా చెప్పాడు పరాశరుడు.

**తస్యోపరి జలౌఘస్య మహతీ నౌరివస్థితా ।**
**వితతత్వాత్తు దేహస్య నమహీ యాతి సంప్లవమ్ ॥**

ఆ జల సముదాయంపైన నిలుపబడిన భూమి చాలా విస్తారం కలదవడం వల్ల మునిగి పోక నౌకలాతేలుతూ ఉన్నదంటుంది పురాణం.

ఇలా భూమిని సమానంగా చేసి, అనాది అయిన పరమాత్మ, పూర్వమున్నట్లే పర్వతాది విభాగాలని యథాతథంగా కల్పించినాడట. పూర్వ సృష్టిలో దహింపబడిన సమస్త పర్వతాల ను అమోఘమైన తన ప్రభావం చేత, అప్రతి హత సంకల్పుడైన స్వామి పృథివీతలంపై సృజించినాడట. భూవిభాగం చేసి ఏడు ద్వీపా లను యథాపూర్వంగా సృజించి, భువాది చతుర్లోకాలను పూర్వంలాగానే కల్పించి నాడట. ఆ తరువాత, చతుర్ముఖ బ్రహ్మ రూపాన్ని ధరించి స్వామి తానే రజోగుణాన్ని స్వీకరించి సమస్త సృష్టినీ చేశాడట. ఇక్కడ పురాణం ఒక రహస్యాన్ని వ్యక్తపరుస్తున్నది.





**నిమిత్తమాత్రమే వాసౌ సృజ్యానాం సర్గ కర్మణి।**
**ప్రధాన కారణీభూతా యతోవై సృజ్య శక్తయః**
**నిమిత్తమాత్రం ముక్త్వైనం నాన్యత్కించిదపేక్షతే।**
**నీయతే తపతాం శ్రేష్ఠ స్వశక్త్యా వస్తు వస్తుతాం॥**

**ఈ సృష్టికి కారణం ఏమిటి? పరమాత్మయా లేక జీవకర్మయా?** అని ఒక ప్రశ్న. పరమాత్మయే తానే స్వయంగా నిర్ణయించి 'ఇది ఇలా సృజించాలి' అని నిర్ణయిస్తే, ఇక ఈ కనుపించే వైషమ్యానికి అర్థం ఏముంది? అన్ని వస్తువులను ఒకే విధంగా లేదా ఒక విధమైన వైభవం కలిగి ఉండేలా తాను సంకల్పించి సృజించవచ్చును కదా! అప్పుడు హెచ్చు తగ్గులు, తేడాలు ఇవన్నీ కల్పించ వలసిన అగత్యంలేదు కదా! అనిప్రశ్న. ఇదే ప్రశ్న బాదరాయణుడు బ్రహ్మ సూత్రాలల్లోనూ లేవనెత్తి సమాధానించాడు. ఇంచు మించుగా ఆ సమాధానమే ఇక్కడా చెప్పబడింది.

విష్ణుపురాణ చతుర్థాయం చివరగల ఈ రెండు శ్లోకాలు సిద్ధాన్త రీత్యా చాలాప్రధాన మైనవి. ఇక్కడ పురాణకర్త, సమస్త సృష్టికి నిమిత్తం అంటే సృష్టి జరగడానికి, సృష్టిలో ఆయా వస్తువులు ఆయా స్వభావాలతో తారతమ్యం కలిగి ఉండడానికి నిమిత్తం 'సృజ్య శక్తులే' అంటున్నాడు.

**'నిమిత్త మాత్రమే వాసౌ సృజ్యానాం సర్గ కర్మణి'** అనడం ద్వారా సృష్టి ఇలానే జరగాలి అనే నిర్ణయం పరమాత్మదే అయినా, అంటే పరమాత్మయే- **'సోఽకామయత'** అన్నట్లు, తానే స్వయంగా సృష్టి సంకల్పం చేసి, సృష్టి సాగించినా, ఆయా జీవులను ప్రాకృతిక తత్త్వంతో సంయోజనం చేసి దేవమనుష్య తిర్యక్ స్థావరాలనే నాల్గురకాల సృష్టి చేయడంలో జీవులు చేసిన పుణ్యాపాప కర్మలనే నిమిత్తంగా చేసికొంటాడు. ఇక్కడ **'సృజ్య శక్తులు'** అంటే సృజింపబడే ఆయా వస్తువు లకు (జీవులకు) సంబంధించిన జన్మాంతర వాసనలు, అంటే వారు చేసికొన్న కర్మలన్న మాట.

**బాదరాయణుడుబ్రహ్మసూత్రాల్లో :-**

**'వైషమ్య నైర్ఘృణ్యేన సాపేక్షత్వాత్'** ఇత్యాది సూత్రరచనం ద్వారా పరమాత్మకు ఈ సృష్టి నిర్మాణ కృతమైన విషమత్వ-నిర్దయత్వదోషా లేవీ అంటవన్నాడు. దానికి కారణం ఏమిటి? అనే శంకను వారిస్తూ, **'సాపేక్షత్వాత్'** అన్నాడు. **'జీవకర్మ'** యొక్క ఆపేక్ష ఉన్నది కనుక, సృష్టిలోని తారతమ్యా నికి 'జీవకర్మ'యే ఆలంబనం అని సమాధానించాడు.

ఈ **'జీవకర్మ'** అనేది అనాది సిద్ధమని కూడా ఇక్కడే నిష్కర్షించాడు. కనుక ఇంచు మించుగా ఇదే అభిప్రాయాన్ని పరాశర మహర్షి ఎప్పుడో ముందే విష్ణుపురాణంలో ఆవిష్కరించాడన్నమాట. ఇది దీని భావం. సృజించడమనే క్రియలో ఆ పరమాత్మ, కేవలం నిమిత్తమాత్రుడే. ప్రధానంగా కారణమైనవి 'సృజ్యశక్తులు' అంటే సృజింపబడే వస్తువులలోని వాసనాత్మక కర్మ శక్తులని అభిప్రాయం.

**'నీయతే తపతాం శ్రేష్ఠ స్వ శక్త్యా వస్తు వస్తుతామ్'** అనే చోట స్వశక్తి చేతనే వస్తువు ఆయా ఆకృతిలో ఉనికిని పొందుతున్నదని అన్నాడు. స్వశక్తి అంటే ఆ సృజింపబడే వస్తువునకు సంబంధించిన అవిద్యాత్మక కర్మ శక్తియే. విష్ణు పురాణం నిరూపించిన విష్ణుశక్తి, క్షేత్రజ్ఞశక్తి, అవిద్యాత్మక కర్మశక్తి అనే మూడు శక్తుల్లో మూడవ శక్తి అయిన అవిద్యాత్మక కర్మ శక్తియే సృజ్యశక్తి అని **శ్రీవిష్ణు చిత్తీయశాఖ్య.**

# మహర్షుల చరిత్ర- భరద్వాజ మహర్షి

తమిళమూలం : మై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి
తెలుగు సేత : శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ

భరద్వాజుడు పుట్టగానే అతని తల్లిదండ్రులు వదలి వెళ్ళిపోగా, దైవమే ఆ బిడ్డని కాపాడింది. మరుత్ అనే దేవతలు హఠాత్తుగా ఆ ప్రాంతానికి రావడం జరిగింది. అందమయిన ఆ బాలుణ్ణిఆ మరుత్ దేవతలు ఇంటికి తీసికొని వెళ్ళికాపాడారు.

ఒకడు పిల్లలు కావాలి అనే కోరికతో మరుత్ దేవతలనుద్దేశించి సోమయాగం చేసాడట. కాని అతడి కోరిక నెరవేరలేదు. అంటే సంతానం కలగలేదు. ఆ మరుత్ దేవతలకు సంకటం ఏర్పడింది. తమను ప్రార్థిస్తూ యాగం చేసినవానికి ఎలాగోలా సంతానం కలిగేటట్లు చూడాలి అని అనుకున్నారు. ఆ దేవతలు ఏం చేయాలో తోచక తలబాదుకుంటూ ఉండే సమయంలో వాళ్ళకి ఈ పిల్లవాడు దొరికాడు. దిక్కులేక పడి ఉన్న ఆ పిల్లవాణ్ణి వాళ్ళు 'యాగం' చేసినా సంతానం కలగని ఆ యజమానికి ఇచ్చారు. ఆ వ్యక్తికూడ ఆ బాబుని తీసికొని చాలా సంతోషించాడు.

మరి ఆ పసికందు పేరు? 'ఏకాదశే హని పితా నామ కుర్యాత్' (పుట్టిన తరువాత పదకొండవ రోజున తండ్రిపేరు పెట్టాలి) అని శాస్త్రం చెబుతోంది. ఈ పిల్లవాణ్ణి పుట్టిన వెంటనే వదలివెళ్ళారు. ఆ తల్లి తండ్రులు ఏమైనా పేరు పెట్టి ఉంటారా? అని ఆలోచించారు. మరుత్ దేవతలు. వారికి మెరుపులాంటి ఒక ఆలోచన వచ్చింది. తల్లి తండ్రులు ఇద్దరూ చంటివానికి విడిచిపెట్టి వెళ్ళిపోతూ ఏదో అన్నారు. అదే ఇప్పుడు వారికి పేరు పెట్టడానికి ఉపకరించింది. ఆ సమయంలో వారు చెప్పిన 'భరద్వాజ' అనేమాటే ఇప్పుడు వానిని పేరుగా నిర్ణయించారు. ఇది తల్లిదండ్రులు పెట్టిన పేరుగానే ఆ దేవతలు అనుకుని యుండవచ్చు. తరువాత ఈ సంఘటన జ్ఞాపకం ఉండేలా వారు ఒక శ్లోకాన్ని కూడా చెప్పారు.

**మూఢే భర ద్వాజం భర ద్వాజం బృహస్పతే**
**యాతౌ యదుక్త్వా పితరౌ భరద్వాజస్త తస్త్వయమ్ ॥**

ఈ శ్లోకానికి భావం ముందే చూచాం గదా! తరువాతి కాలంలో ఆ అబ్బాయి పెరిగి పెద్దవాడై గొప్పమహర్షి అయ్యాడు. ఇది పురాణాలు తెలిపిన కథ

**తల్లి తండ్రుల ప్రవర్తన ధర్మవిరుద్ధం కదా!**

ఇక్కడ మనం గమనించవలసిన విషయంఒకటి ఉంది. దేవతలకే ఆచార్యుడైన బృహస్పతి, తన సోదరుని భార్యతో, అందునా ఆమె నిండుగర్భిణిగా ఉండగా, రమించడ మనేది నీచాతి నీచమైన విషయం కదా! అలా వీరి అక్రమ సంబంధంచే పుట్టిన వాడిని ఒక పెద్ద మహర్షి అని అనిపించడం సహజం. అందుకనే **'ఋషి మూలం, నది మూలము విచారించకూడదు'** అనే ప్రాచీన నానుడి ఏర్పడింది.

గంగా, కావేరీ మొదలైన నదులు పుణ్యమైనవి అని భావిస్తాం గదా! వాటి పేరు తలచినా, నోటితో చెప్పినా, వెళ్ళివాటిలో మునిగి స్నానం చేసినా గొప్పపుణ్యం వస్తుంది. పాపాలు పోతాయి అన్నది అందరికీ తెలిసిందే ఈ నదులు పెద్ద ప్రవాహాలుగా మన ఎదుట కనబడుతూ ఉంటాయి. చూచిన కొద్దీ మనసుకి ఎంతో ఆనందం కలుగుతుంది. పుణ్యమైన మన భారతదేశానికి ఈ నదులు





అలంకారాలుగా ఉంటాయి. **(భారతదేశానికి 'గంగాయమునవలె కంఠహారముగ, ఘనగోదావరి కటి సూత్రముగ'** అని ఒక కవి చెప్పినది స్మరించతగి **నది)** కాని ఈ నదులు ఉత్పత్తిస్థానం దగ్గరకు వెళ్ళి చూచినట్లయితే, వాటికి అంత గొప్పతనంగాని గౌరవంగాని ఎలా వచ్చిందా అని మనకే ఆశ్చర్యం వేస్తుంది. ఈ నదులు ఆరంభంలో చిన్న కాలువలుగా బయలుదేరుతాయి. వాటిని మనం సులభంగా గెంతి దాటేట్లుగా ఉంటాయి. పర్వతాలలో అవి ప్రవహించే ప్రదేశాలు మనకు కొన్ని కనబడతాయి. కొన్నికనబడవు. 'ఈ చిన్న కాలువ అంత పెద్దనది అయిందా' అని మనకే వింతగా అనిపిస్తుంది. నమ్మశక్యంగాదు. ఆరంభంలో ఇలా చిన్న కాలువగా బయలు దేరినా మధ్యలో అనేక పిల్లకాలువలుగా బయలుదేరినా మధ్యలో అనేక పిల్లకాలువలను కలుపుకుంటూ చివరకు పెద్దనదిగా మారి మనకు కనపబడతాయి. కాని ఆ చిన్న కాలువకు పెట్టిన పేరే ఈ మహానదికి కూడా పేరు అవుతుంది. ఆపేరులోనే పుణ్యమంతా ఇమిడి ఉంది.

ఇటువంటిదే మహర్షుల విషయం కూడా. ఆదికాలంలో వారు పుట్టిపెరిగిన చరిత్ర కొంత దోషభూయిష్టమే అయినా దీనిని మాత్రమే గ్రహించి మనం వారి గొప్పతనాన్ని లెక్కించ కూడదు. ఒక మహానుభావుడికి కొడుకుగా పుట్టడం, సదాచార్య కటాక్షం లభించడం, చక్కటిజ్ఞాన అనుష్ఠానాలను కలిగి ఉండడం, గొప్ప భగవద్భక్తుడు కావడం, గొప్ప తపో మహిమ కలిగి ఉండడం, సామాన్యులు చేసే తప్పుడు పనులను పూర్తిగా మానివేయటం, సత్పురుషు లతో సహవాసం చేయడం, పరిశుద్ధ మైన అరణ్యాలలో ఏకాంతంగా నివసించడం, స్వార్థ పరత్వం ఏమాత్రం లేకుండా లోకక్షేమమే సర్వస్వంగా భావించి దీక్షతో దానికై శ్రమించ డం, వీటికన్నిటికి తగినట్లు భగవ త్సంకల్పం పరిపూర్ణంగా ఉండటం మొదలైన కారణాల చేత వీరు మన అందరి అభిమానానికి గౌరవానికి పాత్రులు అవుతున్నారు. వీటిని అన్నిటినీ బాగా చూచి, బాగా విమర్శించిన తరువాతే 'ఋషి మూలం నదీమూలం పరిశీలించ కూడదు' అనే నానుడి ఏర్పడింది. అందుచే జన్మకి సంబంధించి కొన్ని దోషాలు మనకు కనబడినా, అవివారి గొప్పతనానికి ప్రతిబంధకాలుకావు.

ఈ విషయాన్నే శాస్త్రకారులు మనకు ప్రశ్న-సమాధానం రూపంలో తెలియజేశారు. పూర్వ మీమాంసాగ్రంథం మొదటి అధ్యాయం మూడవ పాదం లో శిష్టాచార ప్రామాణ్యం అనే అధికరణం ఉంది. ఈ అధికరణంలో కుమారిలభట్టు ఈవిషయాన్ని చాల చక్కగా విమర్శించాడు. గౌతమ ధర్మసూత్రాల్లో ఆరంభంలో శిష్టాచారాన్ని గూర్చి తేటతెల్లంగా ఇలా చెప్పబడి ఉంది:

1. **వేదోఽఖిలో ధర్మమూలమ్** - సమస్త వేదము ధర్మమునకు మూలము
2. **తత్త విదాంచ స్మృతి శీతీ** - ఆ వేదజ్ఞులైన మహానుభావులు అనుగ్రహించిన స్మృతులు, వారి ఆచారము (ధర్మ) మూలము.
3. **దృష్టో ధర్మవ్యతిక్రమః** సాహసం చ మహతాం- పెద్దలు కూడ ధర్మాన్ని ఉల్లఘించారు. సాహస కార్యాలు కూడా చేసారు.
4. **అపర దౌర్భల్యాత్** - తరువతి దుర్బలులగుటచే

మహర్షులు అనేక ఘనకార్యాలు చేయడానికి సమర్థులు. ఏదైనా ఒక పొరపాటు జరిగితే గొప్ప తపస్సులో దానికి తగినప్రాయశ్చియత్తం చేసుకుని ఆ దోషాన్ని పోగొట్టుకొనుటకు మనం వారిని విమర్శించ పూనడం సాహసమే అవుతుంది. భరద్వాజుని విషయంలోగాని ఇతర విషయాలలో గాని దీనిని అనుసరించడం మంచిది.

14
Bn Aug02.p65



# సందేహాలు - సమాధానాలు

**తిరునగరి స్వామినాథన్, నేరేడ్‌మెట్, హైదరాబాద్**

**ప్ర. 1. నాలాయిర ద్వివప్రబంధము ఒక్కరు మాత్రమే అధ్యయనము చేసినచో తప్పేమీ లేదుకదా?**
**2. భక్తిభావముతో ఏ కాలమందైనను అధ్యయనము చేయుట తప్పకాదు కదా?**
**3. అధ్యయనారంభం (తొళక్కం) రాత్రి సమయం లోనే జరుపాలని కొందరి నియమం.**
**4. అధ్యయనం పూర్తిచేయడానికి దినసంఖ్యా నియమం ఏదైనా ఉండియుంటే దానిని అవశ్యంగ పాటించనక్కరలేదు కదా?**

జ. 1. ఒక్కరేచేసినా పారాయణం అనే అంటాం కదా! చక్కగా చేస్కోవచ్చు. సౌకర్యం కోసమే ఇద్దరు కానీ, అధికం కానీ. ఒక్కరే చేయవద్దనేదేమీ లేదు. ఎప్పుడైనా నాలాయిరం అధ్యయనం చేయవచ్చు. ఏదైనా ఒక కార్యాన్ని ఉద్దేశించి పారాయణంచేసేటపుడైతే ప్రారంభం 'సాధారణంగ' (తుడక్కం, లేదా తొళ్ళక్కం అంటూంటారు) సాయంకాలం ఆరాధన కాగానే చేస్తారు. మరునాటి నుండి అసలు పారాయణ ప్రారంభమన్నమాట. అలాకాక, ఉదయమే అయినా చేయడం దోషంకాదు. వసతిని బట్టి చేయొచ్చు. ఒక కార్యక్రమాన్ని ఉద్దేశించి చేసెటపుడైతే దిన నియమం ఉంటుంది. ఏరోజు, ఏ పూట ఏదేది పారాయణం చేయాలీ అనే నియమమూ ఉంటుంది. అది పాటించాలి.

---

**ప్ర. తిరువాయ్ మొழி రాత్రి సమయమందూ, మిగిలిన ఒక్కొక్కటి ఉదయమందూ అధ్యయనం చేయాలనే నియమమని చెబుతారు. అధ్యయన కర్త అనుకూలతను బట్టి చేసినచో నష్టమేమి? తిరుక్కార్త్తిలో దివ్య ప్రబంధ అధ్యయనము నిషేధమేల? భక్తి భావముతో చేసే అధ్యయనానికి నిషేధమా?**

జ. ఒక గ్రంథం మీద విశ్వాసమున్నపుడు ఆ గ్రంథానికి ఏ ఏ నియమాలు చెపుతారో, పరంపరగా వస్తున్నావో వాటినిగూడ గౌరవించడం జరుగుతుంది. వాటిని గౌరవించని వానికి గ్రంథాల మీద గూడ విశ్వాసం సరిగ లేదన్నమాటే గద!

అలానే అధ్యయనం చేయకపోతే నష్టమేదో వచ్చిమీదపడుతుందని ఏమీ లేదు కానీ, పరంపరగతమైన క్రమాన్ని త్రోసి రాజన్నట్టుగద! ఇక 'అధ్యయనకర్త అనుకూలతత అనేది రోజుకోరకంగా మారచ్చు. ఆతనిని బట్టి ఏదో ముగించి వెళ్ళిపోతానని ఆతడనడం దానివల్ల వచ్చే సంభావన కోసమే అవుతుంది తప్ప, దానివల్ల కలుగవలసిన భగవదనుగ్రహానికి కాదు. ఇతరులకు సంప్రదాయం నేర్పడానికీ కాదు. పరులకు విశ్వాసం కల్గించడానికీ కాదు. అలా తయారౌతుంది చివరికి. తిరుక్కార్త్తిలో అనధ్యయనం పాటించేదీ ఇలాంటి 'మూలచ్ఛేదం' కారాదనే.

---

**ప్ర. ఈమధ్య వైష్ణవులైనవారు సాయిబాబా పూజలు, అయ్యప్ప దీక్షలు చేయడం నానాటికి అధికమైపోతోంది. శివారాధకులూ అధికమౌతున్నారు. ఇది ప్రపన్నత్వానికి విఘాతం కాదా?**

జ. అలాంటివారిని వైష్ణవులుగ ఎందుకంటారు? పక్వమైన భావంలేనివారు. వైష్ణవత్వమనేది ఒకవంశం, కుటుంబం, కులమును

బట్టి వచ్చేదని చాలామంది అభిప్రాయం. అందుకే 'మేమూ వైష్ణవులమే' అనివారు చెప్పుకుంటారు. అలా వివిధ సంఘాలు నడుపుతారు, మరి! వైష్ణవత్వ మనేది అలా వచ్చేది కాదు. అది ఒక అచంచలమైన విశ్వాసాన్ని బట్టి ఏర్పడే సంస్కారం. అది కలిగిన ఏ కులజుడైనా ఏ వంశస్థుడైనా 'శ్రీవైష్ణవుడం'టాం.

అదిలేనివానిని ఆ పేర పిలవవద్దు. వారికి నచ్చిన మార్గాన్ని ఎన్నుకొని వెడుతున్నపుడు, కాదని నిర్బంధించడం, మరల్చడం తగదు. దైవ విశ్వాసమనేది నిర్బంధం వల్ల, తాత్కాలిక ప్రయోనాలను ఆశించి వచ్చేది కాదు.

**ప్ర. స్వామీజీ! ఒక నియమావళిని ఏర్పరచి 'ధనుర్మాసవ్రతదీక్ష' కార్యక్రమమొకటి ప్రారంభిస్తే బాగుంటుంది కదా! మీరేమంటారు?**

జ. ఇతర దీక్షలా సంఖ్యాబలం చూపించుకోడానికా? ధనుర్మాసాన్ని 'ఉన్ననియమాలతో' అందరూ పాటిస్తూనే ఉన్నారు గద! క్రొత్తగ ప్రారంభించేదేమిటి?

**శ్రీసముద్రాల మల్లిఖార్జున్ నల్గొండ.**

**ప్ర. ఇటీవల దూరదర్శన్‌లో ప్రసారమయ్యే 'జై హనుమాన్' సీరియల్‌లో లవ, కుశల జీవితాలకు హనుమంతుడే పూర్తి రక్షణగా ఉంటున్నాడు. ఇది రామాయణంలో లేదుకదా! ఇట్టి హనుమంతుని జీవిత చరిత్రలో ఆతని వివాహం చూపించకపోవటానికి కారణమేమి?హనుమంతునికి 'సువర్చల'తో వివాహమైందికద! మరి మనుమంతుని అస్ఖలిత బ్రహ్మచారి అంటారు. కారణవేుమి? హనుమంతుని జీవిత చరిత్ర గ్రంథం మీ వద్ద లభిస్తుందా? అట్టి వివరాలు తెలుపండి?**

జ. మనుషుల చేతులలో పడిన తర్వాత, దేవతలకు, వాళ్ళ చరిత్రలు వాళ్ళకే తెలియకుండా పోతోంది సుమండీ!

సినిమాలు, సీరియల్స్‌లో వాళ్ళను దూర్చి, పాపం, వాళ్ళ జీవితాలను మనవాళ్ళు చాల రకాలుగ దారుణంగా కలుషితం చేసేసారు.

వాల్మీకి, వ్యాసుడు మొదలైన వారికి తెలిసిన రామభక్త హనుమాన్ మాత్రం అస్ఖలిత బ్రహ్మచారియే. వివాహం కాలేదాయనికి. రామనామం తప్ప ఆతనికి జీవితంలో మరేదీ రుచించదు. అనే ఆ ఋషులు చెప్పారు. కుశ, లవుల విషయంలో హనుమంతుడు రక్షకుడై ఉన్నట్టు సీరియల్సులో వచ్చినా అవి కల్పితాలు తప్ప ప్రామాణికం కాదు!

బైబిలు, ఖురాన్ వంటి గ్రంథాలలోని పాత్రలను, చరిత్ర ఏ కాస్త వక్రీకరించినా వారు బొత్తుగా ఒప్పుకోరు. ఉన్నదానిలో కొన్ని అసంగతాలుగ అనిపించినా, యథాతథంగానో వారంగీకరిస్తారు, తప్ప వాటిని సవరిద్దామనో, క్రొత్తగకల్పిద్దామనో ప్రయత్నించనుగూడా చేయరు. కానీ, ఈ భరతజాతీయులు మాత్రం తమ పైత్యాన్నంతటినీ పురేణేతిహాసాలలో జొప్పించి, లేనివి కల్పించి, ఉన్నవి తీసేసి, అవిగూడా వక్రీకరించి, హేళనగనో, అశ్లీలంగానో, ఎలా వాటిని చూపినా 'అయ్యో! ఇది తగదే!' అనడం మాని, ఆనందంగ చూచి కేరింతలు కొట్టడం, ప్రోత్సహిస్తూ ఉండటం, అదే అసలు చరితగ భ్రమించడమూ, మన దురదృష్టం. ఇప్పటికైనా అసలు గ్రంథాలూ, వాటి సహజ అనువాదాలు చదివేప్రయత్నం చేయడం, భవిష్యత్తు దృష్ట్యా అవసరం. ఆ పని చేయండి. మా వద్ద అట్లాంటి జీవిత గ్రంథాలు ఇప్పటికైతేలేవు.



# భగవద్రామానుజ చరిత్ర

టి.కె. చూడామణి, విజయవాడ

రామానుజులు కూరేశులతో, మొదలి యాండాన్‌తో కలసి రంగనాథుని సేవించడానికి బయలుదేరారు. వారు ఆలయంలో అడుగుపెట్టగానే పావురం రూపంలో ఉన్న తదీయశేఖరులు కూరేశుల పాదాలపై వ్రాలారు. పాపం ఈ పక్షి ఇలా కాళ్ళమీదపడిందే అని దూరంగా తొలగినడిచారు కూరేశులు. కానీ సర్వజ్ఞులైన యతిశేఖరులు ఈ పక్షి 'తదీయశేఖరులే' అని గుర్తించారు. వెంటనే కూరేశులతో, 'కూరేశా! ఇది మామూలు పక్షికాదు. తదీయ శేఖరులు ఈ రూపంలో మిమ్మల్ని క్షమా బిక్షను అర్థిస్తున్నారు. వారిని కరుణించండి. ఆ పక్షి తలమీద చేతినుంచి '**క్షాన్తోఽసి, క్షాన్తోఽసి**' అని ఆశీర్వదించ మని' పలికారు. కూరేశులు, ఆచార్యుల ఆజ్ఞను పాలించారు. వారి చెయ్యితగలగానే శేఖరుల ఆత్మ ఆ పక్షినుండి బయటకి వచ్చి. సాత్విక రూపం దాల్చి పుష్ప మాలలతో అలంకరింపబడింది. ఇంతలో ఆకాసము నుండి ఒక దివ్య విమానం వచ్చింది. శేఖరులు కూరేశ రామానుజులకు దాసోహం సమర్పించి 'నేనెంతటి ధన్యుడను, శ్రీభాష్యకారుల పురుషకారం వలన శ్రీకూరేశులు నన్ను క్షమించారు. ప్రాకృత శరీరం పోయింది. అప్రాకృత దివ్యదేహం లభించింది. మీ ఆజ్ఞతో నేను పరమపదానికి వెళుతున్నాను', అన్నారు. దివ్య విమానం పరమపదమును చేరింది. **భాగవతకటాక్షం ఆత్మ ఉజ్జీవనకు మూలము** అని తదీయ శేఖరుల వృత్తాంతం మనకు తెలుపుతోంది.

రామానుజులు తమ ముందు అనుక్షణం కదలాడుతున్న కూరేశులను చూస్తూ చెప్పలేని బాధను పొందుతున్నారు. అయ్యో! నా మూలముగా వీరికి ఈ అంధత్వము వచ్చింది కదా! అని వారి మనస్సు తల్లడిల్లిపోతోంది. అందుకని కూరేశులను తీసుకుని కంచివరదరాజస్వామిని చూద్దాం రమ్మని బయలుదేరారు. 'కూరేశా! వరదుడు అంటే వరములు ఇచ్చేవాడయ్యా. ఇవ్వడం ఒక దీక్షగా గలవాడయ్యా. అందువలన మనం కంచి చేరి వరదరాజస్వామిని చూడగానే నువ్వు హే వరదా! నాకు దృష్టిని ప్రసాదించమని ప్రార్థించు'' అన్నారు. గుర్వాజ్ఞను కాదనలేక సరే అన్నారు కూరేశులు. ఇద్దరూ కాంచీపురం చేరారు. వరదరాజు సన్నిధిలో నిలిచి వరదరాజస్తవం చేయడం మొదలు పెట్టేరు కూరేశులు.

**శ్లో ॥ నీల మేఘ నిభ మంజన పుంజ**
**శ్యామ కున్తళ మనన్తశయ త్వామ్**
**అబ్జపాణిపద మంజుజ నేత్రం**
**నేత్ర సాత్కుర కరీశ సదామే ॥**

తాత్పర్యం : ఓ హస్తి గిరినాథా! నీల మేఘముతో సమానమైన శరీరము, కాటుక వంటిముంగురులు, ఆదిశేషుడే ఆభరణముగా ధరించిన హస్తము, పద్మములవంటి పాదాలు, కమలములవంటి కన్నులు కలిగిన నీ దివ్య మంగళ విగ్రహమును సదా సేవించు దృష్టిని ప్రసాదించుమని ప్రార్థించిరి. వరదరాజస్వామి అట్లే ఒసంగితిని అని పలికెను. కూరేశులు దయా సముద్రులు కదా. వారు వరదునితో





''స్వామీ! నీవు నాకే పురుషార్థమును, ఫలమును ప్రసాదింతువో అదే ఫలమును నా కన్నులను తీయుటకు మూల కారకుడైన 'నాలూరాన్' అను వానికి కూడా ప్రసాదించు''మని ప్రార్థించిరి. తనకంత అపకారం చేసిన వారిపై ఇంతటి దయచూపిన కూరేశుల ఉదారగుణముకు వరదరాజులే ఆశ్చర్చపడిరి. ''కూరేశా! మీకు, మీ సంబంధము కలవారందరికీ కూడా మోక్షము ను ప్రసాదించుచున్నానని వరదరాజు వరమును ఇచ్చిరి. రామానుజులు ఈ విషయమును విన్నంతనే తమ ఉత్తరీయ మును పైకి ఎగురవేసి ఆనందతాండవము చేయుట మొదలు పెట్టిరి.

అక్కడ ఉన్నవారందరూ రామానుజుల ఆనంద నాట్యమును చూచి దిగ్భ్రాంతిని పొందిరి. 'భాష్యకారా! ఇంతటి ఆనందమునకు కారణమేమిటో తెలుసుకొనవచ్చునా' అని సవినయముగా ప్రశ్నించారు. దానికి రామానుజుల సమాధానం. ఆనాడు మా ఆచార్యులు తిరుక్కొట్టియూర్ నంబిగారికిచ్చిన మాటను పక్కకు పెట్టి, నాకు నరకము వచ్చిననూ సరే అని మంత్రార్థమును వెదజల్లితిని కదా. అప్పటి నుండి నాకు కుంభీపాక నరకమే గతి అని భయపడుతున్నాను. ఇప్పుడు కూరేశుల సంబంధము వలన నాకు కూడా మోక్షము లభిస్తుందని నమ్మి ఇలా ఆనందనాట్యం చేస్తున్నాను అన్నారు.

**'సోఽయం రామానుజ ముని రపి స్వీయ ముక్తిం కరస్థాం యత్ సంబంధాత్ అమనుత కథం వర్ణ్యతే కూరనాథ'**

రామానుజులు కూరేశులను వరదరాజ పెరుమాళ్ళవద్దకు పంపి మళ్ళీ దృష్టిని ప్రసాదింపుమని కోరండి అన్నారు. ఆచార్యుల ఆజ్ఞను కాదనలేక బయలుదేరారే కాని కూరేశులకు అలాంటి కోరిక కోరడం ఏ మాత్రం ఇష్టంలేదు. 'దేవాధిదేవ! నిన్ను, మా ఆచార్యులను చూడగల శక్తి ఉంటే చాలదా' అనిఅనుకుంటూ రామానుజులు ఆజ్ఞను కాదనలేక బలవంతంగా వెళ్ళారు. శ్రీవరద రాజులు ప్రత్యక్షమై 'కూరేశా! మీకు నన్ను, రామానుజులను చక్కగ చూడగల దృష్టిని ప్రసాదిస్తున్నాను' అన్నారు. నవ్వారు కూరేశులు. నా తండ్రివి నువ్వు, నీకుగాక నా మనస్సులో ఆలోచనలు ఇంకెవరికి తెలుస్తాయి. అందుకే నా మనస్సును చదివి నా కోరిక తీర్చావు' అంటూ ఆనందంగా రామానుజ సన్నిధికి బయలుదేరారు. వారిని చూస్తూనే రామానుజులు 'కూరేశా! వరదరాజు దృష్టిని ప్రసాదించారా?' అంటూ గబగబా దగ్గరకొచ్చారు. 'ఓ చక్కగా ప్రసాదించారు. దేవరవారిని, పెరుమాళ్ళను చూడగల దృష్టి'' అన్నారు. యతిరాజులు తమ పెరుమాళ్ళకు అలంకరించిన నగలను చూపించి, ఇవి ఏమిటి? అని ప్రశ్నించారు. సరియైన సమాధానం ఠక్కున చెప్పారు కూరేశులు. రామానుజుల ఆనందం వర్ణనాతీతం. "కూరేశా! నా భాగ్యవశం చేత మీరు నాకు శిష్యులుగా లభించారు. మీవంటి భాగవతోత్తముని, భగవద్భక్తుని శిష్యునిగా పొందిన నేనెంత అదృష్టవంతుడను'' అని మనసులో అనుకుంటూ కూరేశుల హస్తం గ్రహించారు. **గురు సంబంధముతో శిష్యులు, ఉత్తమ శిష్యులు లభించడం వలన గురువులు పొందే ఆనందం ఇలా ఉంటుందా!** అనుకున్నారు అక్కడ ఉన్న భక్తులందరూ.

# శ్రావణమాస పండుగ పరంపర

## ఆండాల్ తిరునక్షత్రం



శ్రావణమాసం వచ్చేస్తోంది. పండుగల పరంపరను తెచ్చేస్తోంది. ఈనెలలో జరుపు కోబోయే పండుగల వివరాలని తెలుసు కుందాం. మొదటగా ఆగస్టు11వ తేదీ **ఆండాళ్ తిరునక్షత్రము.** వైష్ణవ సంప్రదాయంలో భగవంతుడే 'వీరు నాకు కావాలి కావాలి' అని కోరుకున్న భక్తులు ఓ పన్నెండు మంది. వారిని ఆళ్వారులు అంటారు. అందులో "ఆండాళ్" ఒక్కతే స్త్రీ మూర్తి. ఈమెనే "గోదాదేవి'' అని కూడా అంటారు. తను అనురాగంతో అల్లిన పూమాలలు, పాటలమాలలతో భగవంతుని కట్టిపడవేసి, వివాహ మాడినది. జీవరక్షణ నుండి విముఖుడై నిద్రిస్తున్న స్వామిని మేల్కొలిపి రక్షాదీక్ష బద్ధుడయ్యేట్లు చేసింది. ఈ కలికాలంలో భగవంతుని ప్రసన్నుని చేసుకొనే సులభోపాయం నామసంకీర్తనమే అంటూ మనకు బోధించింది. ఈమె అయోనిజ. అయితే ఆమె తులసి వనంలో **"పసిపాప"**గా లభించినరోజే ఆమె పుట్టిన రోజుగా **"తిరునక్షత్రం"**గా మనం జరుపు కుంటాం.

గోదా తిరునక్షత్రదినాన అభ్యంగన స్నానమాచరించి గోదా విగ్రహానికి గానీ, పటానికిగానీ సకలోప చారములతో అష్టోత్తర శతనామపూజ జరుపు కుంటాము. గోదామూర్తులు కలిగిన సంప్రదాయస్తులు ఆ తల్లికికూడా **"తిరుమంజనం"** (అభిషేకం) కావించి ఆరాధిస్తారు. ఆమె లోకానికి అందించిన **"తిరుప్పావై", "నాచ్చియార్ తిరుమొళి"** గ్రంథాలను అధ్యయనం చేస్తాం. ఆరోజు విశేష ప్రసాదంగా **"అక్కారు అడిశల్"** అంటే మంచి పాయసాన్ని నివేదన చేస్తాము. పెద్దల ద్వారా ఆ తల్లి వైభవాన్ని, ఆమె పాడిన పాశురాలలోని విశేషాలని శ్రవణం చేస్తాము. ఆమె పాడిన **"నాచ్చియార్ తిరుమొళి"**లోని **"వారణమాయిరమ్"** అనే పది పాశురాలని నిష్ఠతో పఠిస్తే అవివాహితులకు వివాహమ వుతుందని ప్రతీతి. భక్తిమార్గంలో నామసంకీర్త నతో భగవంతుని చేరిన ఆ తల్లి గోదాదేవిని ఆరాధించి మనమూ భగవంతుని కృపకి పాత్రులమవుదాం! ఆమె ఆరాధనానంతరం అనుసంధించ వలసిన తిరునక్షత్ర తనియన్లు

**కర్కటే పూర్వఫల్గుణ్యాం తులసీ కాననోద్భవాం**
**పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరంగ నాయకీమ్॥**

**నీళాతుఙ్గ స్తన గిరితటీ సుప్తముద్బోధ్య కృష్ణం**
**పారార్థ్యం స్వం శ్రుతిశత శిర స్సిద్ధమద్యాపయన్తీ।**
**స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుఙ్క్తే**
**గోదా తస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తు భూయః॥**



## బదరీ పెరుమాళ్ళ జయంతి

ఇక ఆ వెంటనే రెండు మూడు రోజుల్లో అంటేఆగస్టు 13వ తేదీనాడే వచ్చే పండుగ నరనారాయణ జయంతి. ఈ పండుగ గురించి, తెలిసినవారు తక్కువ. చాలా మందికి, ఆ నారాయణుడిచ్చిన "అష్టాక్షరీ మంత్రం'' అంటే తెలుసు. కానీ అదెలా ఆవిర్భవించిందో దాని తాత్పర్యమేమిటో సంప్రదాయస్తులకు మాత్రమే తెలుసు. ఆ మంత్రాన్ని బదరికాశ్రమములో భగవంతుడే స్వయంగా ఈ లోకానికి అందించాడు. నరుడిగా (శిష్యుడిగా), నారాయణుడిగా (ఆచార్యునిగా) తానే రెండు రూపాలలో అవతరించి సకల శాస్త్రసారంగా ఈ నారాయణ మంత్రాన్ని ఉపదేశించాడు. అంతేకాక ఆనాటినుండి పర్వతాకారంలో అక్కడే స్థిరంగా నిలచి మనకోసం తపమాచ రిస్తూనే ఉన్నారు. పరమాత్మ నర నారాయణు లుగా అవతరించిన రోజే బదరీ నారాయణ జయంతి.

ఆ సందర్భంగా బదరీనారాయణుని ప్రతిమకి గాని పటమునకుగాని, కృష్ణాష్టోత్తర శతనామములతో అర్చన చేస్తాము. నివేదన అయిన తరువాత పెద్దల ద్వారా అష్టాక్షరీ మంత్ర వైభవాన్ని పెద్దల ద్వారా శ్రవణం చేయాలి. భాగవతంలోని 2వ స్కంధములోని మరో మంత్రమును 108 సార్లు జపించాలి...

**ఓంనమో భగవతే, ఉపశమలీలాయ, ఉపరతానాత్మ్యాయ నమోఽకించన విత్తాయ, ఋషిఋషభాయ, నరనారాయణాయ, పరమహంస పరమ గురవే ఆత్మారామాధిపతయే, నమో నమఇతి.**

**ఆ తరువాత చదివే స్తోత్రము.**

**కర్తాస్య సర్గాదిషు యో న బధ్య తే**
**న హన్యతే దేహగతోఽపి దైహికైః।**
**ద్రష్టుర్న దృగ్యస్య గుణైర్విదూష్యతే**
**తస్మై నమోఽసక్త వివిక్త సాక్షిణే॥**

**తన్నఃప్రభో త్వం కుకలేవరార్పితాం**
**త్వన్మాయ యాహం మమతాం అధోక్షజ।**
**భింద్యామ యేనాశు వయం సుదుర్భిదాం**
**విధేహి యోగం త్వయి నః స్వభావమ్॥**

**బదరీశ మంగళాశాసనం :**

**ఓంకారార్థ ప్రదాత్రే తే సర్వాభీష్ట ప్రదాయినే**
**సమస్త మంత్ర వాచ్యాయ బదరీశాయ మఙ్గళమ్॥**
**నరస్య మంత్ర దాత్రే చ అష్టాక్షర మహర్షయే**
**ప్రాణినాం మోక్షదాత్రే చ బదరీశాయ మఙ్గళమ్**

అనంతరం యథాశక్తి అష్టాక్షరీ మంత్రార్థాన్ని వివరించే 'అష్టశ్లోకీ' స్తోత్ర పారాయణ చేయండి.



**ఉపాకర్మ :**

శ్రావణ పూర్ణిమ ముందురోజు 21వ తేదీ ఆశ్వలాయన శాఖీయుల ఉపాకర్మ. ఆరోజు ఋగ్వేదీయులందరూ ఉదయాన్నే స్నాన

మాచరించి ప్రాయశ్చిత్త జపము చేస్తారు. అనంతరం వపనము (క్షురకర్మ) చేయించుకొని తిరిగి స్నానమాచరించాలి. పుండ్ర ధారణ సావిత్రీ హోమం చేయాలి. ఆయా మంత్రాలతో నూతన వస్త్రములు, నూతన యజ్ఞోపవీతము నూతన వటువులైతే దానికి మౌంజీ (కృష్ణాజినం, జింకచర్మం) ధరిస్తారు. తరువాత ఋషి, దేవతా తర్పణము గావించాలి. నూతన వేద విద్యార్థులందరికీ, గతంలో కొంత అధ్యయనం చేసి ఆగిన విద్యార్థులకీ, తిరిగి శ్రావణ పూర్ణిమనాడు వేదాధ్యయనం ఆరంభిస్తారు.

## శ్రావణ పూర్ణిమ

ఆగష్టు 22వ తేదీ చాలా విశేషమైన రోజు. ఆపస్తంబ సూత్రీయులందరికీ ఈరోజున ఉపాకర్మ చేస్తారు. ఏ సూత్రం వారైనా ఈరోజున ఉపాకర్మ పూర్తికా వించుకొని వేదాధ్యయనం ఆరంభించి, ఆ మరునాడు సహస్ర గాయత్రీజపము ఆచరించాలి.

## హయగ్రీవ జయంతి

ఈ రోజుననే మరొక విశేషం హయగ్రీవ జయంతి. విద్యలన్నింటికీ అధిపతి, విద్యాస్వరూపుడు హయగ్రీవుడు. "విద్యా'' అంటే ఎటువంటి సమస్య ఎదురైనా తట్టుకొని, అవగాహనతో పరిష్కరించుకోగలిగేట్టు చేసేది. అలాంటి విద్యే వైదిక విద్య, ఆధ్యాత్మిక విద్య. ఆ వేద పరిరక్షణ కోసమే నారాయణుడు హయ ముఖుడిగా అవతరించి మధుకైటభుల నుండి వేదాలని తెచ్చి చతుర్ముఖునికి తిరిగి ఇచ్చాడనిచరిత్ర. హయముఖునిగా పరమాత్మ అవతార దినమే హయగ్రీవ జయంతి ఆరోజున విద్యార్థు లందరినీ కూర్చోపెట్టి హయగ్రీవునిపటమునకు యథావిధిగా అష్టోత్తర శతనామపూజ చేస్తారు. హయము అంటే గుర్రం. హయముఖుడు కనుక ఆయనకి ఉడికించిన శనగలు ప్రీతియని, వాటిని ఆరగింపుచేస్తారు. మంగళాశాసన శ్లోకం :

**సర్వ విద్యా స్వరూపాయ లక్ష్మీసంశ్లిష్ట వక్షసే ।**
**మధుపాసన లక్ష్యాయ హయగ్రీవాయ మంగళమ్ ॥**

తరువాత హయగ్రీవ స్తోత్రమును అనుసంధానం చేస్తారు.

## రాఖీ పూర్ణిమ

ఈ పూర్ణిమనాడే జరిగే మరోపండుగ రాఖీపూర్ణిమ. ధర్మ పరిరక్షణకి, దేశ పరిరక్షణకి బద్ధులుగా ఉండాలనే భావంతో రాఖీలు (రక్షాకంకణములు) ఒకరి కొకరు ధరింప చేస్తారు. ఈసారి శ్రీశ్రీశ్రీ స్వామివారు చాతుర్మాస్య దీక్ష ఆరంభం కూడా ఈరోజునే కావడం మరో విశేషం.





## పెద్ద జీయరు స్వామివారి తిరునక్షత్రం



ఆదిగురువు నారాయణుడు అవతరించిన మాసంలోనే మన పరమాచార్యులు అయిన **శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ పెద్ద జీయర్ స్వామివారు** అవతరించడం మరో విశేషం. ఇటు దక్షిణ భారతదేశం లోను అటు ఉత్తరభారతదేశంలోనూ వైష్ణవ సంప్రదాయాన్ని వ్యాప్తి చెందించిన జగదాచార్యుల "తిరునక్షత్రం'' ఈ నెల 26వ తేదీన వచ్చింది. మద్రాసు నగరంలో రామస్వామినాయకర్ అనే వ్యక్తి రామాయణ గ్రంథాన్ని అవమానించడం గురించి విని దానికి ప్రాయశ్చిత్తం అతని బదులు తామే చేసుకుంటామని శ్రీరామ మహాక్రతువులు 9సం॥లు చేసిన ప్రేమ స్వరూపులు మన పెద్ద జీయర్ స్వామివారు. ప్రతిచోట రామస్థూపాలని నిర్మించి, అనేక కోట్ల రామనామాన్ని లిఖింప చేసారు. 108 స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాలు నిర్వహింపచేసారు. అష్టాక్షరీ ఆవిర్భావస్థానమైన బదరీలో 60మైళ్ళ పాదయాత్రగా వెళ్ళాల్సిన ఆ రోజులోలనే శ్రీకోటి హవన క్రతువుని నిర్వహింప చేసారు. ఆకాలంలోనే స్త్రీలకోసం యతిరాజ మహిళామండలిని స్థాపించడమే కాక శుక్రవారం సామూహిక లక్ష్మీపూజలు నిర్వహింప చేసేవారు. ఈనాడు ఆంధ్ర ప్రదేశ్‌లో పుండ్రధారణ చేసిన తిరుముఖ మండలాలు కన్పిస్తున్నాయంటే, విష్ణు సహస్ర నామాదులు పారాయణ చేస్తున్నారంటే అదంతా మన పెద్దస్వామివారి చలవే. వారి తిరునక్షత్రమైన **"ఉత్తరాభాద్ర''** నక్షత్రంలో వారి శ్రీపాదసంబంధులు (శిష్యులు, అభిమానులు) అందరమూ వారిని అష్టోత్తరముతో పూజించు కుందాం. అందరమూ ఒకచోట చేరి ఆచార్యుల వైభవాన్ని పంచుకొందాం.

**వారి తిరునక్షత్ర తనియన్ :**

**ఉత్తరాభాద్ర నక్షత్రే శ్రావణే సౌమ్యవత్సరే ।**
**ఆవిరాసీత్ గురుః శ్రీమన్ నారాయణ యతీశ్వరః॥**

శ్రీవారి బృందావనం ఉన్న నడిగడ్డ పాలెంలో 21వ తేదీ నుండి 26వ తేదీ వరకు ఉత్సవాలు నిర్వహిస్తారు.

**నిత్యకార్యక్రమాలు :** సేవాకాలము, సమష్టి భగవద్గీత పారాయణము, హోమం, తదీయారాధన, ప్రవచనము.

**విశేషకార్యక్రమాలు :**

21వ తేదీ రాత్రి 7 గం॥లకు విష్వక్సేనపూజ, పుణ్యాహవాచనం, అంకురారోపణం ఇత్యాది.

22వ తేదీ ఉ॥ 8గం॥లకు అగ్ని ప్రతిష్ఠ, వేద ఇతిహాస పురాణ దివ్య ప్రబంధ పారాయణలు ప్రారంభం.

23వ తేదీ ఉ॥ లక్ష్మీ సహస్రనామార్చన, రా॥ ఉంజల్ సేవ.

24వ తేదీ రా॥ ఆంజనేయ సహస్రనామార్చన, వడమాల సేవ.

25వ తేదీ రా॥ గరుడ వాహన సేవ, పెరియజీయరుస్వామి ఉత్సవమూర్తి తిరువీధి.

26వ తేదీ శ్రీ జీయరు స్వామివారి ఉత్సవ,

మూలమూర్తులకు తిరుమంజనం, పాదార్చన, మహాపూర్ణాహుతి, శాత్తుముఱై.

**కైంకర్య వివరములు :**

శ్రీకృష్ణ శతనామార్చన 100/-, సహస్ర నామార్చన 150/-, గరుడవాహన సేవ తిరువీధి 4000/-, ఒక రోజు గీతాయజ్ఞమునకు 1500/-, ఐదు రోజులకు 5000/-, తిరునక్షత్ర ఉత్సవము ఒకరోజు 10,000/-,

**మరిన్ని వివరములకు :**
**బృందావన నిత్యారాధన సమితి**
**శ్రీవాసుదాసాశ్రమము,**
నడిగడ్డపాలెం, వయా చుండూరు,
గుంటూరు జిల్లా.
ఫోన్ : (08644) 76522.

## శ్రీకృష్ణ జయంతి

శ్రావణ మాసమంతా ఆచార్యులని లోకానికి అందించిన కాలము. ఈనెల 30,31 తేదీలలో జగదాచార్యుడైన శ్రీకృష్ణుని జయంతి దేశమంతటా జరుపుకుంటాము. అయితే కృష్ణాష్టమిని స్మార్తులు తిథిని బట్టి చేస్తారు. కనుక 30వ తేదీన జరుపుకుంటారు. మన సంప్రదాయంలో నక్షత్రము, తిథి రెండింటిలో చివరికి ఏది ఉంటే దానిని పాటిస్తాము. తిథి కూడా ముందు తిథితో కలవని రోజునేపాటిస్తారు. ముందు తిథితో కలిస్తే అది 'విద్ధ' అవుతుంది. అలా సప్తమితో కలవని అష్టమినాడు, కృత్తిక కలవని రోహిణీ నక్షత్రంనాడు కృష్ణాష్టమి జరుపుకుంటాం. అది 31వ తేదీ అయినది. తల్లిదండ్రుల బంధనాలు విడిపింప, కంటకుడైన కంసుని నశింపచేయ పరమాత్మ దేవకీ అష్టమ గర్భమున ఆవిర్భవించినరోజు ఇది. ఆయన అర్ధరాత్రి వేళ చెరసాలలో ఆవిర్భవించినాడు. కనుక ఆ రోజున మనమంతా ఉదయము నుండి ఉపవాసము ఉండి సాయం సంధ్య దాటాక ఆరాధన ఎప్పుడైనా చేసుకోవచ్చు. ఉండగలిగినవారు అర్ధరాత్రి వరకు ఉండి కృష్ణుని జనన వృత్తాంతాన్ని స్మరిస్తూ భాగవతంలోని దశమస్కంధములో అవతార ఘట్టాన్ని పారాయణ చేస్తారు. అనంతరం కృష్ణుని ఊయలలో ఉంచి అష్టోత్తర శతనామములతో అర్చన చేసి, వివిధరకాల పదార్థాలతో నైవేద్యం పెట్టి హారతులిస్తారు. సంప్రదాయం తెలిసిన పెద్దలద్వారా శ్రీకృష్ణ లీలలని శ్రవణం చేయవచ్చు. శ్రీకృష్ణలీలలని చిన్న చిన్న నాటికలుగా పిల్లలచేత వేయించి, మనం కూడా నందవ్రజవాసులమై దర్శించవచ్చు. **కృష్ణుని తిరునక్షత్ర తనియన్....**

**సింహమాసే సితేపక్షే రోహిణ్యాం అష్టమీ తిథౌ**
**చరమార్థ ప్రదాతారం కృష్ణం వందే జగద్గురుమ్ ॥**

ఈ పండుగలన్నింటికీ కూడా మన బంధువులనీ, లేదా మన కాలనీ వాసులందరినీ ఒకచోట చేర్చి వైభవముగా సామూహికంగా జరుపుకోవచ్చు. ఆనాడు





అక్కడ చేరిన భగవద్బంధువలందరికీ మన శ్రీశ్రీశ్రీ స్వామివారు సంకల్పించిన గీతాజ్యోతి కార్యక్రమాన్ని పరిచయం చేసి, ఆ వారపు శ్లోకాన్ని కూడా అందరికి పంచి, పఠింప చేయవచ్చు.

ఆండాళ్ తిరునక్షత్రము, బదరీనారాయణ తిరునక్షత్రముల సందర్భంగా గీతాజ్యోతిలోని 18వ శ్లోకం 6వ అధ్యాయంలో **"యతో యతో నిశ్చరతి"** మనం పఠిస్తాము. "చంచలమైన మనస్సు ఎటు ఎటు పరుగులు పెట్టినా ఆయా విషయములనుండి దానిని నియమించి పరమాత్మకి వశం చేయాలి'' అని శ్లోక తాత్పర్యము. ఈరెండు పండుగలకీ ఈ శ్లోక సందర్భం సరిగ్గా సరిపోతుంది. ఆండాళ్ తల్లీ ఇదే విషయాన్ని ప్రార్థించింది. తిరుప్పావైలో **"ఉనక్కేనామాల్చెయ్‌వోమ్"** హే స్వామి! నీకే మేము అన్నివిధముల సేవలు అన్ని వేళలా చేయగలగాలి. **"మత్తై నం కామంగళ్ మాత్తు"** ఇతరములైన కోరికలేవీ మా మనసులో చొరబడనీయకు. నీ అధీనం చేసుకోమని చెప్పింది. అలా మన మనస్సుల్ని, మననీ తన అధీనం చేసుకొని నియమించే స్వామే బదరీ నారాయణుడు. కనుకే భాగవతం ఆయనని స్తుతిస్తూ **"ఆత్మారామాధి పతయే నమః"** అంటోంది.

అలాగే శ్రావణ పూర్ణిమనాడు **"ఆత్మౌపమ్యేన సర్వత్ర"** అనే శ్లోకమును 6వ అధ్యాయం-32వ శ్లోకం అనుసంధానం చేసుకుంటాము. పెద్దస్వామివారి తిరునక్షత్ర దినాన కణ్ణన్ తిరునక్షత్ర సందర్భంగాను 20వ శ్లోకమును (6వ అధ్యాయంలో 41శ్లోకం) **"ప్రాప్యపుణ్యకృతాన్ లోకాన్"** పఠిస్తాము.

ఈ శ్రావణ మాసంలోనే వచ్చే మరో విశేష పండుగ విఘ్న నివారణచతుర్థి ఆ పండుగ గురించి పైసంచికలో తెలుసుకుందాం.

శ్రీభక్తిసారులు - తిరుచ్చన్దవిరుత్తమ్



(మాధ్వీకఝురి)

'మధురవాక్ శిఖామణి', 'భాగవతామృతవర్షి' శ్రీ.ఉ.వే.ప్ర.శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్యస్వామి, సింహాచలం

**వరత్తనిల్ శిరత్తైమిక్క....** పాశురంలోని మాధుర్యాన్ని ఆస్వాదిస్తున్నాం కదా! వరత్తనిల్ శిరత్తైమిక్క. బ్రహ్మవలనతాను పొందిన వరమునందు మిక్కిలి విశ్వాసము కలవాడై, **వాళెయిత్త మత్తవన్ :-** కత్తులవలె వాడిగానుండు దంతములను కల శత్రువు. హిరణ్యకశ్యపుని దంతములకు గల తైక్ష్ణ్యము ఆతడి మాటల వలననే తెలియును. తన భక్తివలన తాను మాత్రమేగాక తన వంశము నంతనూ తరింపజేసిన భక్తాగ్రగణ్యుడు ప్రహ్లాదుడు. **'త్రిస్సప్తభిః తేపితా పూతః'** అనునది భగవద్వాక్యము. శత్రువులైన దేవతలు గూడ వారి లోకములలో సత్పురుషులనెవరు? ఎట్లుండవలెను అను విచారణ చేయు నపుడు, తమకు శత్రువైన దానవు బాలకుడైననూ ప్రహ్లాదుడినే ఉపమానముగా భావించెడివారు. అనగా సాధుపురుషుడు ప్రహ్లాదునివంటి గుణ గణములను కలిగి యుండవలెను. అట్టివాడే సాధువు అని నిర్ణయించుచుండెడివారట. అట్టి ప్రహ్లాదుని ఎన్నియో దుర్భాషలాడి ఎన్నియో తెరగుల హింసించినవాడు హిరణ్యకశిపుడు. ఇట్టి వీని స్వభావమును **'ఎంగుముళన్ కణ్ణన్ ఎన్నమ గనెక్కా యుఝ్న్డు'** 'అంతట భగవానుడు కలడు అని తెలిపిన తన కుమారునే కోపించి'అని నమ్మాళ్వారులు వివరిస్తారు. అనగా లోకములో ఏ చిన్న పిల్లవాడైనా మాట్లాడు తుంటే వినేవారికి ముద్దులు మూటకట్టు ఆతడి పలుకులు ఆనందమును కలిగిస్తాయి. అది ఆతడి చిన్నప్రాయమును బట్టి కలుగు ఆనందము. అట్టి చిన్నారి తనకుమారుడే అయియుంటే ఆ తండ్రికి కలుగు ఆనందమును వేరేచెప్ప వలెనా? **'కిమ్మృష్టం? సుతుదనం'** అనికదా ఆర్యోక్తి. అట్లా బాలకుడు పలికినది కూడా 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః' అను శ్రుతి. ఇట్టి మంచివార్తను తెలిపినవాడు శత్రువైనా ఆదరించవలసి యుండగా, ఆ పలికినవాడు తన కుమారుడు, చిఱుతప్రాయములోనివాడు అయియున్న ప్పుడు ఎంత ఆనందించవలసి యున్నది. కాని హిరణ్యకశ్యపుడు అట్లా ఆనందించలేదు సరికదా మఱిన్ని దుర్భాషలాడినాడు. 'నాలాయితోర్భకః' దైతేయవనమును భేదించు పరశువంటి వాడైన నారాయణునికి అందులకుపకరించు గొడ్డలికి పేడిగాన మర జనించిన వాడీ దుష్టబాలకుడు అని నిందించినాడు ప్రహ్లాదుని. అంత మాత్రమే కాక **'దైతేయ చందన వనే జాతోఽయం కంటకద్రుమః'** దానవులను చందన వృక్షములతో నలరారు వనమునందు ద్భవించిన ముండ్ల వ్రెుక్కవంటివాడు ఈప్రహ్లాదుడు అనినాడు. అంతతో ఆగక





**'శిరఃకాయాద్ధరామితే'** హరినిగనక ఈ స్తంభమున చూపని ఎడల నీ శిరస్సును మొండెము నుండి వేరు చేయుదును అని నిష్ఠురముగా మాట్లాడిన వాడు హిరణ్య కశ్యపుడు. కనుకనే వీని మాటల క్రౌర్యమును తలంచి వీనిని కత్తులవంటి క్రూరమైన కోరలుకలవానినిగా అభివర్ణించి నారు ఆళ్వార్లు.

**ఉరత్తినిల్ కరత్తైవైత్తు-** వక్షస్థలమునందు చేతినివైచి- శ్రీనృసింహరూపముతో ఆవిర్భవించిన భగవానుని సర్వ వ్యాపకత్వ మును అంగీకరించినట్లుగా తెలుపుటకు హిరణ్యకశ్యపుడు ఈ లోకపు స్పృహలోనేలేడు. కారణము **'అవన్వీయుత్తోన్డియం'** అని నమ్మాళ్వార్ అనుగ్రహించినటుల స్వామి ఆవిర్భావ సమయములోనే భీకరాకారముతో ఆవిర్భవించుటవలన భయముతో కోమావంటి స్థితిలోనికి వెళ్ళిపోయినాడు. హిరణ్యకశ్యపుడు. ఈ స్థితినే **తొత్తిన పోతే పిణమానాన్** భగవానుడావిర్భవించినంతనే భయముతో హిరణ్యుడు శవమువలె అయిపోయెను అంటారు. కనుక తాను అంతటా వ్యాపించి ఉన్నానని తన భక్తుడు ప్రహ్లాదుడు చెప్పిన మాటను హిరణ్యుడు విశ్వసించినాడో లేదో తెలుసుకొననెంచి వాని వక్షఃస్థలమును చేతితో తట్టి పిలిచినా హిరణ్యకశ్యపుడు పలుకలేదు. ఇక వాని హృదయాంతరాళములందు ఏ మూలనైననూ ఈ భావనమున్న దేమో తెలుసుకొనవలెనను తలంపుతో.

**ఉకిర్తలత్తైయూన్డినాయ్ :-** నీ నఖములతో వాని వక్షఃస్థలమును చీల్చివైచి నాడు. ఇట్లు చీల్చుటకు భావము, వాని హృదయము లోని భావములను తెలుసుకొనుటకే. ఒకవేళ హృదయపు ఏ పొరలోనైనా భగవానునియందు సద్భావనము హిరణ్యకశ్యపునికి ఉండెనా అపుడు వాని వక్షఃస్థలమును కుట్టివేసి వానిని యధాపూర్వము బ్రతుకనివ్వవచ్చుననునది భగవదభిప్రాయమై యుండనోపును కాని అట్టి మిత్రభావన ఏ కోశమునలేని, మూర్తీభవించిన శాత్రవమేగలవాడు కనుక వాని కళేబరమును అట్లే పాఱవైచెను. భగవానుడొ కనిని రక్షింపనెంచెనా, వారు మనః పూర్వ కముగ శరణమనక పోయినా **'మిత్రభావేన'** అనినటుల అహృదయముగా ఆభిముఖ్య మును ప్రదర్శించినా వానిని కాపాడితీరును. కాని ఒకనిని శిక్షింపవలసి వచ్చెనా, వాడు మనస్సులో కూడ ఇట్టి అపవిత్రభావనలను కలిగియున్నాడా లేదా అను దానిని బాగుగా పరిశీలించి నిర్ధారణ చేసుకొనిన పిమ్మటనే దండించును. ఈ స్వభావము హిరణ్య కశ్యపుని వధయందు వెల్లడగును. ఇట్లు అనన్యప్రయోజనుడైన ప్రహ్లాదుని కాపాడు టకై నృసింహరూపమును స్వీకరించి హిరణ్య కశిపుని వధించిన స్వామి ఆపత్సఖత్వము వర్ణింపబడినది.

# ఇతి హాసబోధ-X-I

'గీతాజ్యోతి' సందర్భంగా శ్రీస్వామివారు రెండు సూత్రాలను బహుళ ప్రచారం కావిస్తున్నారు. 'స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ' ఒక సూత్రమైతే, 'మాధవ సేవగా సర్వ ప్రాణిసేవ' రెండవ సూత్రం. ఈ రెండవ సూత్రం మన వికాసతరంగిణికి పరమ లక్ష్యంకూడా! 'మానవ సేవయే మాధవ సేవ' అన్న భావనలోని పరిమితులను సరిదిద్దుతూ, మనకు దిశా నిర్దేశాన్ని సూచిస్తూ స్వామి ప్రతిపాదించిన జీవన మార్గం ఇది.

ఈ దిశగా మన అడుగుల వడి ఎలా సాగుతున్నది? అందమైన సూత్రాల స్టిక్కర్లను గోడల మీద, తలుపుల మీద, కార్ల మీద, స్కూటర్ల మీద అంటించుకొని, అంటించమని ప్రచారం చేసి గొప్పగా ఆచరించామని, ఆచరిస్తున్నామని సరిపెట్టుకొంటున్నామా? బ్రతుకును పండించే సాధనా మార్గంగా దీనిని స్వీకరించి మనల్ని మనం సరిదిద్దుకొనే ప్రయత్నం చేస్తున్నామా? ఈ ప్రశ్నలు 'మాధవ సేవగా సర్వ ప్రాణిసేవ' లక్ష్యంలోని లోతులను తెలుసుకొనేందుకు మనల్ని పురికొల్పుతాయి.

'సేవక వ్రతం' బహుక్లిష్టమైనది. సేవలందుకొనే వారికి సంతృప్తి కలిగే విధంగా 'సేవకుడు' వ్యవహరించాలి! తాను సేవించేవారి మనసెరిగి ప్రవర్తించే కుశలత్వం, వినయ విధేయతలు, నిజాయితీ, సహనం, సమర్ధత, శ్రమించి పనిచేయడం వంటి ఎన్నో యోగ్యత లను 'సేవకుడి' నుండి మనం ఆశిస్తుంటాం! తాను ఎంతో గొప్ప సేవకుడినని, ఎన్నెన్నో సేవలందిస్తున్నానని, ఎంతెంతో కష్టపడిపో తున్నానని, తనకు తృప్తి కలిగే విధంగా సేవలు చేస్తున్నానని, సేవకుడు అనుకుంటే చాలదు. సేవలందుకునే వారి మెప్పుపొందే విధంగా సేవకుని సేవలుండాలి! అప్పుడే అతడు 'ఉత్తమ సేవకు'డనిపించు కొంటాడు. ఇది లోకంలో మనకు అనుభవంలో ఉన్న విషయమే.

అయితే సర్వ వ్యాపకుడూ, సర్వులకూ ఆధారభూతమైనవాడు, శాశ్వతుడు, సకల సంపదలనూ అందించేవాడు, తన కంటూ ఎటువంటి అవసరాలు లేనివాడూ అయిన భగవానునికి సేవకులుగా ఉండటమెలాగో మనకు అనుభవంలో లేదు. ఆయనకు ఎటువంటి సేవలందించాలి? ఎట్లా విధేయు లమై ఉండాలి? ఆయన మెచ్చే విధంగా ఎలా మెలగాలి?

బ్రతకటం కోసం మనం నిర్బంధంగా చేసే సేవల వంటి సేవలు ఆయనకు రుచించవు. బ్రతుకు అర్థం తెలుసు కొనేందుకు ఆయనను సేవించడమే మార్గమని గ్రహించి స్వచ్ఛందంగా మనం సమర్పించే సేవలే ఆయనకు ప్రీతి పాత్రాలంటారు పెద్దలు.

ఈ చింతనతో మన మనస్సులను ఆయనకు అర్పించి, ఆయన వాణిని వినగల గడానికి, విని అర్థంచేసుకొని ఆజ్ఞలను స్వీకరించ డానికి, అమలు వరచడానికి వీలుగా మన బుద్ధులను శుద్ధంచేసుకోవడానికి మనం చేసే కృషి ఏమిటి?

ఆయన కోసం మనం చేస్తున్నామనుకొనే సేవల శ్రేష్ఠతను నిర్ణయించే గీటురాళ్ళేమిటి? తన యిచ్ఛకు, భగవదేచ్ఛకు తేడా తెలుసుకొని, తన యిచ్ఛను భగవద్దేచ్ఛలో లయం చేసే క్రమంలో తన తలపులను భగవన్మయం చేసి, తన కర్మలను దైవకర్మలుగా మార్చుకొనే సాధనా మార్గాన్ని స్వీకరించేదెలాగ?

ఈ సంక్లిష్టతను గ్రహించిన భగవానుడు మనకు సాయం చేయడానికి తానే మానవునిగా అవతరించి 'సేవక వ్రతాన్ని' చేపట్టాడు. క్రీస్తు పూర్వం 3228వ సంవత్సరం జులై 20వ తేదీన అంటే శ్రీముఖ నామ సంవత్సరం బహుళ అష్టమి రోహిణి





నక్షత్రం అర్ధరాత్రి 3 గం॥ల సమయాన దేవకీ వసుదేవుల ఎనిమిదవ సంతానంగా భగవానుడు జన్మించాడు.

ఇప్పటికి 5230 సంవత్సరాల క్రితం ఒక సజీవ ఉదాహరణంగా జీవించడానికి భగవానుడు జన్మ ధరించాడు. 126 సం॥ల పాటు ఈ భూమి మీద ఆయన మానవ దేహంతో శ్రీకృష్ణ నామంతో సంచరించాడు. తన 90వ ఏట 'గీత'ను అర్జునునికి శాస్త్రం చెప్పిన, తానాచరించిన సేవాధర్మం యొక్క సారంగ బోధించడమొక్కటే ఆయన జీవిత పరమార్థం.

భగవానుని 'సేవక జీవన వ్రతాన్ని' గమనించకుండా కేవలం గీతాబోధకునిగానో, మహిమలను ప్రదర్శించిన లీలా మానుష విగ్రహునిగానో మనం ఆయనను ఆరాధి స్తుంటాం! మహిమలు ప్రదర్శించడానికి, ఇతర విభూతులు సరిపోతాయి. తన సంతానమైన మనకు ఎంతో, ఏదో నేర్పాలనే సంకల్పమే, ప్రేమాతిశయమే, ఆయన అవతరణకు ప్రేరణ.

ఆయనను అనుకరించడమెలాగో తెలియక తికమక పడే మనకు 'బ్రతుకు' పాఠం నేర్పడానికే భగవానుడు మానవుడయ్యాడు. దేశకాలమాన పరిస్థితులకనుగుణంగా భగవానుడు నడచిన నడతను అర్థం చేసుకోవడంలో ఆనాటి ఆయన సమకాలీనులే తబ్బిబ్బయ్యారు. భగవానుని ఉపకరణంగా ఆయన 'అవతార ప్రయోజనాన్ని' నెరవేర్చడంలో సహకరించేందుకై భూమి మీదకు ఆయనకన్నా ముందుగా అవతరించిన ఆదిశేషునికి కూడా భగవానుని నడత మర్మం గ్రాహ్యం కాలేదు.

ఎంతో శ్రద్ధతో, సాధనతో కఠినమైన సేవాధర్మాన్ని నిర్వహిస్తున్న మహానుభావుడు ఆదిశేషుడు. తన తనువును భగవానునికి పానుపుగా చేసి వేయిపడగల గొడుగు పట్టి సదాసేవించుకుంటున్న ఉత్తమ సేవకుడు. తనను తాను భగవంతునికి సమర్పించు కోవడమెలాగో నేర్పిన తొలిగురువు. పరంధా మునికి శాశ్వతంగా, సంతోషంగా ఊడిగం చేయడమే తన అస్తిత్వ పరమ ప్రయోజనమని చాటి చెప్పిన ప్రపత్తి పరాయణుడు.

అట్టి ఆదిశేషుడు భగవానుడు మానవుడుగా అవతరించనున్నాడని తెలుసుకొని ఆయనకు సేవ చేసేందుకై ముందుగా 'బలరాముడి'గా భూమిమీదకు వచ్చాడు. సృష్టిస్థితిలయ కారకుడై జగత్తును ఆడించే స్వామి చిన్నికృష్ణుడై వ్రేపల్లె వాడలో చిందులు వేస్తుంటే తానూ ఆయనతో జత కలిసాడు.

ఇంద్రగర్వభంగ నిమిత్తంగా గోవర్ధన పర్వతాన్ని కొనగోట నిలిపిన కొంటె కృష్ణుడి లీలా వినోదా న్ని చూసి పులకరించి పోయాడు. గొల్లపడుచు లతోటి, గోప బాలురతోటి గిల్లికజ్జాలాడిన గడుసరి కృష్ణుడుతో చేరి తానూ సరససల్లా పాలాడాడు.

హాని తలపెట్టవచ్చిన కంసభటులను కడతేర్చడంలో తమ్మునికి తోడుగా నిలిచాడు. ధనుర్యాగానికి వెళ్ళి మేనమామ భరతం పట్టి దేవకీ వసుదేవులను రక్షించి ఉగ్రసేనుని రాజుగా చేసిన ప్రతాప ప్రదర్శనంలో తానూ భాగంపంచుకొన్నాడు. సాందీపుని గురుకులం లో చేరి 64 రోజులలోనే సమస్త విద్యలలోనూ ప్రావీణ్యాన్ని సంపాదించడంలో కృష్ణయ్యకు జోడయ్యాడు.

మధురపై దండెత్తిన జరాసంధాది శత్రువులను మర్దించడానికి అన్న దమ్ములిద్దరూ కలసి పోరాడారు. ద్వారకను నిర్మించి యాదవులకు రక్షకులై నిలిచారు. 'ఒకే ప్రాణం - రెండు దేహాల'న్నట్లుగా బలరామకృష్ణులు మెసలి యాదవ లోకంలో ప్రశస్తి పొందారు.

ఇంతటి మహాత్ముడైన బలరాముడు కూడా భగవానుని త్రిగుణమయమైన మాయా ప్రకృతికి లొంగి, తన దైవానికి సేవాధర్మాన్ని నిర్వహించడానికి వచ్చానన్న సత్యాన్ని విస్మరించాడు. రాగ ద్వేషాలకులోనై అన్నగా

భగవానునిపై ఆధిక్యాన్ని ప్రదర్శించాడు. 'ఎఱుక'గల భగవానుడు పాత్రోచితంగా వొదిగి, వర్తించి, తన సేవాదీక్షను - ధర్మ పరాయణత్వాన్ని రెండింటినీ సమర్థవంతంగా నిర్వహించాడు.

మనలో ధార్మిక జాగరణాన్ని - సేవానిరతిపట్ల శ్రద్ధా గౌరవాలను పెంచేందుకు ఉపకరించే బలరామకృష్ణుల మధ్య ఏర్పడ్డ కొన్ని వైవిధ్య భరితమైన సన్నివేశాలే ఈ సారి 'ఇతిహాస బోధ'కు చర్చనీయాంశాలు.

భగవానుడు మధురలో ఉండే రోజుల్లోనే తన మేనత్త కొడుకులైన పాండవుల యోగ క్షేమాలు తెలుసుకొని రమ్మనమని అక్రూరుడిని హస్తినకు పంపాడు. ఎవరిని ఉత్తమ సాధనా లుగా చేసుకొని తాను ధర్మ సంస్థాపనం చేయవలసిఉందో అట్టి పాండవుల పట్ల భగవానుడు సదా శ్రద్ధ వహిస్తూనే ఉన్నాడు.

తండ్రిని కోల్పోయి పెదతండ్రి ధృరాష్ట్రుని పంచన చేరారు పాండవులు. వారి సుగుణాలు, బలపరాక్రమాలు ధృతరాష్ట్రునికీ, అతని పుత్రులకీ కంటగింపయ్యాయి. దుర్యోధనా దులు భీముడిని వధించేందుకు విషాన్నం పెట్టడం, మడుగులోకి నెట్టడం వంటి క్రూర కార్యాలెన్నో చేసారు. వారి ఆగడాలన్నింటినీ అక్రూరుడు కుంతి, విదురుల ద్వారా తెలుసు కున్నాడు. ధృతరాష్ట్రుడి కపటత్వాన్ని గ్రహించాడు. 'తోడేళ్ళ మధ్య జింకపిల్లలా బ్రతుకు ఈడుస్తున్న తనకూ, తన బిడ్డలకూ కృష్ణుడేరక్ష' కావాలంటూ కుంతి అక్రూరుడి ముందు వాపోయింది.

కొన్ని నెలలపాటు హస్తినలోనే ఉండి కలవవలసిన వారందరినీ కలసి, తెలియవలసిన వన్నీ తెలుసుకొన్నాడు అక్రూరుడు. కుంతికి ధైర్యం చెప్పాడు. భేదబుద్ధితో తమ్ముని బిడ్డలనొకరకంగా, తన బిడ్డల నొకరకంగా చూస్తున్నరాజుకు హితవు చెప్పాడు. కృష్ణ సందేశాన్ని అక్రూరుని ద్వారా విన్న ధృతరాష్ట్రుడు తన స్వభావానికి అనుగుణమైన శుష్కప్రియాలు పలికాడు. అక్రూరుడు మధురకు వచ్చి హస్తిన పరిస్థితులను బలరామకృష్ణులకు సవివరంగా తెలియపరిచాడు.

పాండవులపై మేనత్త బిడ్డలన్న మమకారం కన్నా పరమధార్మికులన్న అనుగ్రహాతిశయమే ఎక్కువ కృష్ణ భగవానునికి. వారూ ఆయనను తమ ప్రత్యక్ష దైవమనే విశ్వాసంతో కొలిచారు. తాను నిర్వహించవలసిన జీవనకార్యంలో ముఖ్యపాత్రధారులైన పాండవులు భగవానునికి పంచప్రాణాలు. వారిని కాపాడుకోవడం ఆయన విధి.

అయితే బలరామకృష్ణులు మధురలో తీవ్రవొడుదుడుకులను ఎదుర్కోవాల్సి వచ్చింది. జరాసంధుడు, కాలయవనుడు వంటి మధుర శత్రువుల దాడుల నుండి యాదవులను కాపాడాల్సిన పరిస్థితి వారిది! అందునిమిత్తంగా దుర్భేద్యమైన ద్వారకను నిర్మించి యాదవులకు భద్రతనిచ్చారు.

బలరాముడు సమకాలీన వీర వరేణ్యులలో అగ్రగణ్యుడిగా ఖ్యాతిగడించాడు. మల్లయుద్ధంలోనూ, గదాయుద్ధంలోనూ ఆయన ప్రావీణ్యం అమోఘం. ముసలము, హలము ఆయనకు ప్రీతిపాత్రమైన ఆయుధాలు. యోధాను యోధులెందరో బలరాముడి వద్దకు వచ్చి శిష్యులై తమ అనుభవాన్ని, నైపుణ్యాన్ని పెంచుకొనేవారు. భీమసేనుడు, దుర్యోధనుడు కూడా అటువంటి శిష్యులే! నిరంతరం మదిరాపాన సేవనంతో మునిగి తేలే బలరామునికి దుర్యోధనుడు శిష్యరికం చేసిన వేళా విశేషం ఎంతో బలవత్తరమైనది.

ఈర్ష్యాసూయలకు ప్రతిరూపం దుర్యోధనుడు. తన కన్నా పెద్దవాడు ధర్మరాజు హస్తినకు యువ రాజయ్యాడు. భవిష్యత్తులో అతడే హస్తినకు చక్రవర్తి అయితే తనగతి ఏమిటి? దుర్యోధనుని ముందున్న పెద్ద సమస్య ఇది. పాండవులను పరిమార్చడమే ఈ సమస్యకు శాశ్వత పరిష్కారం. దీనిని కపటోపాయంతో సాధించ డానికి తండ్రిని వొప్పించి పాండవులను వారణా వతానికి తీర్థయాత్ర సాకుతో పంపాడు. దుర్యోధనుని బంటు పురోచనుడు అక్కడ పాండ వులకోసం లక్క ఇల్లు కట్టి, తగల పెట్టడానికి





తగిన సమయం కోసం ఎదురు చూస్తున్నాడు. విదురుని ద్వారా కుట్రను తెలుసుకొన్న పాండవులు తగిన జాగ్రత్తలు తీసుకొన్నారు. పురోచనుడిని, అతని పరివారాన్ని లక్కయింటి లో దగ్ధం చేసి తాము రహస్యమార్గం ద్వారా తప్పించుకున్నారు. లోకానికి కుంతీ సమేతంగా పాండవులు మరణించారన్న వార్తప్రచారమైంది.

మేనత్త, ఆమె బిడ్డలు వారణావతంలో దగ్ధమయ్యారన్న వార్తవాసుదేవుడిని కలచి వేసింది. ఆయన సాత్యకి సమేతుడై హుటా హుటిన వారణావతం వెళ్ళాడు. మరణించిన వారి నిమిత్తంగా తిలోదక కర్మలు దగ్గరుండి నిర్వహించసాగాడు. కృష్ణుడు ద్వారకలో లేని ఈ సమయంలో ఓ దారుణం జరిగింది.

శ్రీకృష్ణుని మామ సత్రాజిత్తు. మహామహిమాన్వితమైన శ్యమంతకమణి వల్ల నిరంతరం సంపదను పొందుతున్న భాగ్యశాలి ఆయన. ఆ సంపదే ఆయన పాలిట మృత్యువైంది. కృతవర్మ తమ్ముడైన శతధన్వుడు సత్రాజిత్తును దారుణంగావధించి శ్యమంతకాన్ని అపహరించాడు. వారణావతానికి వెళ్ళి తన తండ్రిని చంపిన విషయాన్ని సత్యభామ భర్తకు తెలియ పరచింది. ఈ దుశ్చర్యకు తగిన ప్రతీకారం చేయాలనుకొన్న కృష్ణుడు బలరాముడికి విషయం తెలిపాడు.

ఇరువురూ శతధన్వుడిని వధించడానికి సిద్ధపడ్డారు. భయపడి పారిపోయాడు శత ధన్వుడు. అన్నదమ్ములిద్దరూ అతడిని వెంటాడారు. మిధిలకు సమీపారణ్యంలో తన గుఱ్ఱం మరణించడంతో పాదాచారియై పరుగు తీసాడు శతధన్వుడు. అన్నను ఆగమని కృష్ణుడు అతడిని వెంబడించి వధించాడు. అయితే అతని వద్ద మణి దొరకలేదు. రథం వద్దకువచ్చి వేచి ఉన్న అన్నకు అదే విషయం చెప్పాడు.

మణి మీద బలరామునిక ఎనలేని ఆశ ఉంది. తమ్ముడి మాటలు అతనికి తీవ్ర ఆశా భంగం కల్గించాయి. అబద్దాలాడుతున్నాడని తమ్ముడిని అనరాని మాటలన్నాడు. మణిని తనకు ఇవ్వాల్సి వస్తుందనే లోభంతో కపటంగా వ్యవహరిస్తు న్నాడని హరిని తూలనాడాడు. అతడి మొహం చూడనన్నాడు. భగవానుడు బిక్కచచ్చిపోయాడు. పలువిధాలుగా అన్నను ప్రాధేయపడ్డాడు. బ్రతిమిలాడి భంగపడ్డాడు. విచారంతో తమ్ముడు ద్వారక చేరితే క్రోధంతో అన్న మిధిల చేరాడు.

అదుగో! ఆ సమయంలో దుర్యోధనుడు బలరాముడి వద్దకు చేరాడు. సిరి ప్రియమై దైవం అప్రియమైంది. దైవీ సంపత్తికన్నా భౌతిక సంపత్తే బలరాముడికి ముఖ్యమైంది. ఇటువంటి సమయంలోనే ఆసురీ సంపదకు ఆశ్రయుడైన దుర్యోధనుడు బలరాముడికి ప్రీతి పాత్రుడయ్యాడు. తమ మేనత్తకు, ధర్మాత్ములైన ఆమె బిడ్డలకు ధుర్యోధనుడు చేసిన అన్యాయం బలరాముడు మర్చిపోయాడు. దుర్యోధనుడు తన పట్ల చూపిన భక్తిశ్రద్ధలు, గౌరవాదరాలకు పొంగిపోయాడు. హస్తినకు భావిచక్రవర్తి తనకు ప్రియ శిష్యుడైనందుకు ఆనందించాడు.

ధర్మాన్ని రక్షించి అధర్మాన్ని శిక్షించడానికి భగవానుడు అవతరించాడు. ఆ కార్యంలో ఆయనకు సహకరించేందుకు ఆదిశేషుడు బలరాముడయ్యాడు. అయితే విధి విచిత్ర మైనది. ధర్మానికి ప్రతినిధులైన పాండవుల పట్ల భగవానుడు అనుగ్రహం చూపితే, అధర్మానికి ప్రతినిధి అయిన దుర్యోధనునిపట్ల ప్రీతితో బలరాముడు వ్యవహరించాడు.

భృత్యుడిగా, భగవానునికి సేవ చేయడా నికి వచ్చినా, వచ్చిన పనిని మరిపించి, మరి వేటితోనో మురిపించేంతటి శక్తి త్రిగుణ మయమైన 'మాయ'కు ఉన్నది. ఓ మాయా! ఆదిశేషుడంతటి వాడిని మోహవిభ్రమంలో ముంచెత్తిన నీ మహిమకు వందనాలు! నీ దయ లేకపోతే ఎవరు మాత్రం మాధవునికి సేవకులు కాగలుగుతారు?

తమ్ముడిపై అలుక బలరాముడికి మూడేళ్ళపాటు సాగింది. యాదవ ప్రముఖులు

మిధిలకు వెళ్ళి కృష్ణుని నిర్దోషిత్వాన్ని పలు మార్లు విన్నవించి బ్రతిమిలాడి బలరాముడిని ద్వారకకు తీసుకొని వచ్చారు. అన్న దమ్ములు మరల కలసి మెలసి సఖ్యతగా ఉండసాగారు.

అయితే కౌరవ పాండవుల విషయంలో అన్నదమ్ముల మధ్య ఉన్న భిన్నాభిప్రాయాలు అలాగే అనంతర కాలంలోకూడాకొనసాగాయి. ఇక్కడ మరొక అంశాన్ని మనం గుర్తు చేసుకోవాలి. బలరామకృష్ణులూ కౌరవపాండవులూ సమవయస్కులుకారు. వారి మధ్య వయః ప్రయుక్త తారతమ్యం బాగానే ఉంది.

అదెలాగంటే వారణావతానికి వెళ్ళే సమయానికి ధర్మరాజుకు 29 సం॥లు భీముడికి 28 సం॥లు దుర్యోధనుడు కూడా భీముడు ఈడువాడే. అర్జునుడికి 27 సం॥లైతే నకుల సహదేవులకు 26 సం॥లు.

లక్క ఇంటిలోంచి తప్పించుకొని పాండవులు కనీసం మూడేళ్ళపాటు రహస్య జీవనం గడిపారు. బ్రాహ్మణ వేషధారుడై అర్జునుడు ద్రౌపదీ స్వయంవరంలో పాల్గొని మత్స్యయంత్రాన్ని ఛేదించి ద్రౌపదిని చేపట్టాడు. ఒక సం॥రము అక్కడే ఉన్నారు. పాండవులు బ్రతికి ద్రుపదుని పురంలో ఉన్నారని తెలుసు కొని విదురునిద్వారా ధృతరాష్ట్రుడు వారిని హస్తినకు పిలిపించాడు.

హస్తినలో వారు ఐదు సంవత్సరాలు గడిపాక ధృతరాష్ట్రుడు ధర్మరాజును 'ఖాండవ ప్రస్థాని'కి రాజుగా అభిషేకించాడు. ఖాండవ ప్రస్థమే ఇంద్రప్రస్థమైంది. ఇంద్రప్రస్థాన్ని పాండవులు 23 సం॥లు పాలించారు. ఆ తర్వాత జూదంలో ఓడి 13 ఏళ్ళపాటు అరణ్య, అజ్ఞాత వాసాలు చేసారు.

తమ రాజ్యభాగం తమకు పంచమని పాండవులు అడిగితే, కౌరవులు నిరాకరించడం చేత కురుక్షేత్రం యుద్ధం అనివార్య మైంది. యుద్ధ సమయానికి ధర్మరాజుకు 29+3+1+5+23=74 సం॥లు, భీమ, దుర్యోధనులకు 73 సం॥లు, అర్జునునికి 72 సం॥లు, నకులసహదేవులకు 71 సం॥లు, కృష్ణునికి 90 సం॥లు అంటే కృష్ణార్జునుల మధ్య 18 సం॥ల వ్యత్యాసం ఉంది.

బలరామకృష్ణులకూ, కౌరవ పాండవు లకూ మధ్య ఉన్న ఈ వయస్సు తారతమ్యాన్ని ఇక్కడ ఎందుకు ప్రస్తావిస్తున్నామంటే వయస్సు చేత, శక్తిచేత కూడా బలరామకృష్ణు లిరువురూ కౌరవ పాండవులకు బుద్ధి చెప్పడానికి తగిన వారేనని తెలియజేయడానికి. దీనికి తగ్గట్టుగానే కౌరవులకు బుద్ధిచెప్పడానికి అన్నదమ్ములిద్దరూ హస్తినకు వెళ్ళారు వేర్వేరు సందర్భాలలో.

పాండవదూతగా రాజ్యభాగం పంచి ఇమ్మని అడగడానికి రాయబారిగా పరంధాముడు హస్తినకు వెళ్ళాడు. అంతకు ముందే బలరాముడూ వెళ్ళాడు హస్తినకు. సాంబుని వివాహపు వివాదాన్ని పరిష్కరించేందుకు.

దుర్యోధనుడు తన కుమార్తెకు స్వయంవరాన్ని ప్రకటించాడు. పోటీలో పాల్గొనడానికి యాదవ వీరులు కూడా హస్తినకు వచ్చారు. అట్లా వచ్చిన వారిలో శ్రీకృష్ణునికి జాంబవతి వల్ల కల్గిన సాంబుడు కూడా ఒకడు. అతడు పరమ దుస్సాహసి. రాజాంతః పురంలో చొఱబడి, రహస్యంగా దుర్యోధనుని కుమార్తెను తీసుకొని ద్వారకకు బయలుదేరాడు. అయితే గుట్టు రట్టయి కౌరవ వీరులకు చిక్కి చెఱసాల పాలయ్యాడు.

విషయం తెలిసింది యాదవులకు. సాంబుడికోసం వారు యుద్ధానికి సిద్ధమ య్యారు. వద్దని వారించాడు బలరాముడు. దుర్యోధనుడు తనకు ప్రియశిష్యుడన్నాడు. తన మాట మీరడు కనుక మంచిగా మాట్లాడి సాంబుడిని కోడలితోపాటు తెస్తానన్నాడు. మాట నిలబెట్టుకోవడానికి హస్తినకు వెళ్ళాడు బల రాముడు. కౌరవులు బలరాముడిని గౌరవించారు.

సాంబుడి విడుదల, వివాహం విషయం బలరాముడు ప్రస్తావిస్తే బాహ్లికాది కౌరవ ప్రముఖులు మండి పడ్డారు. యాదవ వంశాన్ని తూలనాడారు. ఆగ్రహంతో హస్తినను తన హలాయుధంతో గంగలో కలపడానికి సిద్ధపడ్డాడు



బలరాముడు. బెదిరిన దుర్యోధనాదులు బలరాముడిని బ్రతిమిలాడి సాంబుడికి తమ కన్యనిచ్చి వైభవంగా వివాహం చేసి పంపారు. ఆ విధంగా బలరాముడి హస్తిన దౌత్యం దుర్యోధనుడికి శ్రీకృష్ణునికి మధ్య సాంబుని వివాహం ద్వారా వియ్యంకుల బంధాన్ని ఏర్పరచింది.

కౌరవ పాండవులిరువురూ ఈ విధంగా యాదవులకు దగ్గర బంధువులయ్యారు. కౌరవ పాండవులకు సాటిరాగల మేటి వీరులెందరో భోజ, అంధక, వృష్ణి వంశీయుల సముదాయమైన యాదవ రాజ్యంలో ఉన్నారు. యాదవ సామ్రాజ్య రక్షకులైన బలరామకృష్ణులు ఒక్కమాట మీద ఉంటే సమస్త యాదవ లోకమూ వారిని అనుసరిస్తుంది.

కౌరవ పాండవుల కలహమూ - దాని పరిష్కారము విషయంగా అన్నదమ్ములిరువురూ ఏకాభిప్రాయాన్ని కలిగి ఉన్నట్లయితే సమస్య కురుక్షేత్రరణసంగ్రామం వరకూ వచ్చి ఉండేది కాదు. వారిరువురి భిన్నాభిప్రాయాల తీరు, వాటి పర్యవసానాలు చివరకు ఎలా పరిణమించాయో మనం తర్వాత సంచికలో తెలుసుకొనే ప్రయత్నం చేద్దాం!!!

ఎప్పటిలాగే ఈ నెల ఇతిహాసబోధ-ఒ-1కు పాఠకుల నుండి సముచితమైన శీర్షిక పేరును సూచించవలసినదిగా కోరుతున్నాం.



గమనిక : 'రామాయణంలో రమ్యగాథలు', 'శ్రీరామ మంగళాశాసనము' శీర్షికలు అనివార్య కారణాలవల్ల ప్రచురించలేకపోవుచున్నాము. పాఠకులు గమనించగలరు.

-ఎడిటర్

# వికాసదర్శిని నివేదన

## గీతాజ్యోతి

**ద్రోణాచలం :** కర్నూలుజిల్లా ద్రోణాచలంలో శ్రీవేంకటేశ్వర సాంస్కృతిక సంస్థ, శ్రీమాన్ పి.సుబ్బారావుగారి ఆధ్వర్యవంలో అన్ని హంగులతో కూడిన గీతాజ్యోతి రథముతో గీతాజ్యోతి సందేశాన్ని ఇంటింటికి అందిస్తున్నది.

**పుల్లడిగుంట :** గుంటూరు జిల్లా పుల్లడి గుంట ధర్మక్షేత్రంగా గీతాజ్యోతి కన్వీనర్ శ్రీమతి లలిత కుమారిగారి సారథ్యంలో గొర్లవారిపాలెం, ఫణిదం గ్రామాలలో గీతా జ్యోతి ప్రచారాన్ని కావించారు. ఈ కార్యక్రమంలో భాగంగా జరిగిన శ్రీకృష్ణ పూజలను శ్రీమాన్ రామపిచ్చయ్యగారు నిర్వహించారు.

పల్లపాడుగ్రామంలో 'క్యాన్సర్వ్యాధి నిరోధక అవగాహన శిబిరం' డా॥ నాగకిశోర్ గారిచే నిర్వహించబడినది. దాదాపు 150 మందికి పరీక్షలు నిర్వహించి సలహాలు అందించారు.

**వట్టిచెరుకూరు :** గుంటూరు జిల్లా, వట్టి చెరుకూరులోవికాసతరంగిణి ఆధ్వర్యవంలో స్థానిక వేణుగోపాలస్వామి దేవస్థానంలో జులై 1 నుండి 7వ తేదీవరకు శతావధాని శ్రీమాన్ డా॥ మేడసాని మోహన్ గారిచే శ్రీమద్భగవ ద్గీత సప్తాహము వైభవముగా జరిగింది. ఈ కార్యక్రమంలో వికాస తరంగిణి ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీమాన్ కె. భవానీ ప్రసాద్గారు, గీతాజ్యోతి జిల్లా కన్వీనర్ శ్రీమాన్ యమ్.ఆర్.కె. ప్రసాద్గారు, ఇంక వికాస తరంగిణి సభ్యులు పాల్గొన్నారు.

**వినుకొండ :** గుంటూరు జిల్లా వినుకొండ ధర్మక్షేత్రంగా వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ ప్రసాద్రావుగారు, మల్లిక ఆధ్వర్యవంలో తత్త్వప్రచారిక కుమారి కల్పన సుమారు 84 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారాన్నికావించారు. అంతేకాకుండా మారు మూల గ్రామాలైన బొల్లాపల్లి, చెంచుకాలనీ, లంబాడీకాలనీలు, నక్సల్స్ పీడిత ప్రాంతమైన రేమడిచర్ల లాంటి చోట్ల కూడ ఇంటింటికి గీతాజ్యోతి పరిచయం చేసారు. సుమారు 8,000 మందికి గీతాజ్యోతిని శ్లోకమాలికను అందించారు. కరుణ, శ్రీమతి సాయి మరియు ఇతరుల సహాకారంతో ఈ కార్యక్రమం జరుగుతున్నది.

**అనకాపల్లి :** విశాఖజిల్లా, అనకాపల్లిగ్రామంలో శ్రీమాన్ రఘునాథాచార్యస్వామి నేతృత్వంలో జులై 11 నుండి 17 వరకు అనేక సేవా, ఆధ్యాత్మికకార్యక్రమములు నిర్వహించ బడ్డాయి. వీనిలో భాగంగా పేద విద్యార్థులకు పుస్తకాలు, యూనిఫామ్ పంపిణీ, హాస్పిటల్ లో రోగులకు బ్రెడ్, మిల్క్ పంచుటతోపాటు, విష్ణుసహస్రనామ, గీతాజ్యోతి శ్లోకముల పోటీలు నిర్వహించారు.

## జంటనగరాలలో గీతాజ్యోతి

'గీతాజ్యోతి' ప్రచారం చాలా శాఖలలో చక్కగా కొనసాగుతున్నది. చల్లబడిన వాతావరణం అనుకూల పరిస్థితులను





కలిగించింది. పాఠశాలలు తెరవడంతో విద్యార్థులను ఆకట్టుకోవడం ప్రారంభమైనది. 50 వేల మందికి పైగా 'గీతాజ్యోతి'తో పరిచయమయింది.

**సంతోష్ నగర్ :** 23.6.2002న 'వడ్డెరబస్తీ' పేదల కాలనీలో 'గీతాజ్యోతి' కార్యక్రమం ఆరంభింపబడింది. త్వరలోనే 'కూర్మ గూడ'లో కూడ 'గీతాజ్యోతి' కార్యక్రమం ప్రారంభించడానికి సన్నాహాలు జరుగుతున్నాయి.

ఈ శాఖ పరిధిలో ఉన్న 34 దేవాల యాలు 'గీతాజ్యోతి' ప్రచారానికి ఎంతో దోహద మిస్తున్నాయి.

**సరూర్నగర్ :** 'సరస్వతీ శిశుమందిర్', 'గీతాంజలి విద్యాపీఠం', 'ఈడెన్ టెంపుల్' మొదలయిన పాఠశాలలో విద్యార్థులను కలుసుకొని ప్రచారం చేయడం ముఖ్య విషయం.

**వనస్థలిపురం :** జులై నెలలో 15 కాలనీలలో ఉన్న 750 కుటుంబాలకు 'గీతాజ్యోతి'ని పరిచయం చేయడం జరిగింది. ఈ శాఖ ఇప్పటి వరకు వనస్థలిపురం పరిసరాలలోని 78 కాలనీలను సందర్శించడం జరిగింది. 17.6.2002న వైద్యశిబిరం నిర్వహించబడింది. 12 పాఠశాలలను సందర్శించి 'గీతాజ్యోతి' కార్యక్రమాన్ని ప్రవేశపెట్టడం జరిగింది.

**మసాబ్ టాంక్ :** 30 జూన్న శ్రీవేంకటేశ్వర స్వామి ఆలయ ప్రాంగణంలో వైద్యశిబిరం నిర్వహించబడింది వైద్యుల బృందం డా॥ శ్రీమతి ఫణికుమారి, డా॥ శ్రీమతి విజయలక్ష్మి, డా॥ అరవింద్ ఈ శిబిరాన్ని నిర్వహించి 200 మందికి పైగా వైద్యపరీక్షలు జరిపారు. కావలసిన మందులను ఉచితంగా యిచ్చారు.

'పొట్టి శ్రీరాములు' నిరుపేదకాలనీ సందర్శించి 'గీతాజ్యోతి' కార్యక్రమాన్ని ప్రవేశపెట్టారు. వారానికొకసారయినా ఎవరో ఒకరు ఈ శాఖ సభ్యులు ఈ కాలనీని సందర్శించి, కార్యక్రమాలకు ప్రోత్సాహం యివ్వడం జరుగుతున్నది. ఈ కాలనీలో 10వ తరగతి వరకు చదువుకున్న ఒక బాలికను నాయకురాలిగా గుర్తించారు. ఆ బాలిక మిగతా పిల్లలకు గీతాశ్లోకాలను చక్కగా చెబుతున్నది.

**కూకట్పల్లి :** కూకట్పల్లి వికాస తరంగిణి శాఖను స్థాపించడంలో ముఖ్యపాత్ర వహించిన దాని అభివృద్ధికి ఎంతో పాటుపడిన శ్రీమాన్ కిషన్రావుగారి జ్ఞాపకార్థం, కుటుంబసభ్యులు రూ. 10,000/ విరాళం యిచ్చి, భగవద్గీత పుస్తకాన్ని ప్రచురించడానికి దోహదం కలిగించి, 'గీతాజ్యోతి' కారక్రమంలో పాల్గొన్నారు.

జులై 23వ తేదీన చార్మినార్ పరిసర ప్రాంతాలలో నూతన వికాసతరంగిణి శాఖ ప్రారంభమైనది. అధ్యక్ష బాధ్యతలను శ్రీమతి కుపల్లి విజయలక్ష్మిగారు స్వీకరించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసనాలు కృపచేసారు.

## గీతాజ్యోతి పాదయాత్ర

**విశాఖపట్టణం :** విశాఖపట్టణం అన్ని వికాసతరంగిణి శాఖల ఆధ్వర్యవంలో తేది : 21-7-02 సా॥ 4గం॥లకు స్నేహధార బిల్డింగ్ నుండి సిరిపురం, ఉడా ఆఫీసు, పాండురంగ స్వామి కోవెల, బీచ్రోడ్ మీదుగ ఆర్.కె. బీచ్

వద్ద గోకులం వరకు అనేకమంది భక్తులు శ్రీ విష్ణుసహస్రనామ పారాయణం చేస్తూ పాదయాత్రలో పాల్గొన్నారు.

శ్రీమాన్ టి.పి. రాజగోపాలాచార్య స్వామివారి నేతృత్వంలో గోకులంలో ఉన్న రాధాకృష్ణ విగ్రహాలవద్ద భక్తులు అనేకమంది శ్రీకృష్ణపూజను నిర్వహించినారు. సాగర తరంగాల హోరుతో దీటుగా రాజగోపాలా చార్యస్వామి భక్తులు అందరిచేత గీతాజ్యోతి శ్లోకాలని చెప్పించి కన్నుల పండుగగా కార్యక్రమాన్ని నిర్వహించారు.

### ఉచిత కంటి వైద్య శిబిరం

**చేబ్రోలు :** వికాసతరంగిణి నేతృత్వంలో ఉచిత నేత్ర వైద్య శిబిరం కాకినాడ కిరణ్ ఆసుపత్రివద్ద ఏర్పాటు చేయబడినది. 350 మందికి నేత్ర పరీక్షలు, 95 మందికి కంటి ఆపరేషన్లు నిర్వహించబడినవి.

**విద్యానగర్ :** కరీంనగర్ పట్టణంలోని విద్యా నగర్ వికాసతరంగిణి శాఖ మరియు గీతాజ్యోతి సమన్వయకమిటి ఆధ్వర్యవంలో మండలం లోని 40 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం చక్కగా జరుగుచున్నది.

**పశువైద్యశిబిరం :** వరంగల్ జిల్లా, ధర్మారం గ్రామంలో జులై 28వ తేదీన ఉచిత పశువైద్య శిబిరం నిర్వహింపబడినది. 892 పశువులు, 500 గొఱ్ఱెలకు చికిత్సలు జరిపారు. ఈ శిబిరంలో డా॥ నరసింహారావు గారు, డా॥ కృష్ణమాచార్యులు, డా॥ పి. వెంకటేశ్వరరావు మరియు డా॥ వెంకట రమణారెడ్డిగారు.

ఇంకా పారామెడికల్ సిబ్బంది తమ వైద్యసేవలనందించారు. శ్రీమాన్ రాజ్యగారు (MPTC) ఎంతో సహకరించారు.

### అదిలాబాద్ జిల్లాలో జరిగిన గీతాజ్యోతి ప్రచార కార్యక్రమాల వివరణ

శ్రీశ్రీశ్రీ స్వామివారు కమలాపూర్ ధర్మక్షేత్రంలో అఖండజ్యోతిని వెలిగించి సంచారజ్యోతి రథాన్ని ప్రారంభించారు. అదిలాబాద్ జిల్లాలో సంచార జ్యోతి ద్వారా ప్రచార బాధ్యతను తత్త్వ ప్రచారకులు శ్రీమాన్ గంగాధర్‌గారికి అప్పగించారు.

మంచిర్యాల వికాసతరంగిణి సభ్యులు శ్రీమాన్ వెంకటేశ్వరరావుగారు, శ్రీమాన్ శ్యామసుందరరావుగారు, శ్రీమాన్ రామారావు గారి సహకారముతో చుట్టు ప్రక్కల గ్రామాల లోకి వెళ్ళి ప్రజలకు గీతాజ్యోతి సందేశాన్ని తీసుకువెళ్లారు.

**చెన్నూరు :** చెన్నూరు వికాసతరంగిణి ధర్మక్షేత్రంలో శ్రీమతి తాయారుగారు శ్రీమాన్ రమేష్‌గారు, శ్రీమాన్ నారాయణ రావుగారు, శ్రీమాన్ వెంకటాచారిగారి సహకారంతో 5 రోజులపాటు సంచార జ్యోతిరథము 47 గ్రామాలలో పర్యటిస్తూ .గీతాజ్యోతి సందేశాన్ని అందించారు.

**జిన్నారం :** 'ధర్మక్షేత్రము'లో సంచార గీతాజ్యోతి రథమును శ్రీమతి కాంతామణి గారు, శ్రీమాన్ యమ్. సుధాకర్ గారు, శ్రీమాన్ యన్. నాగేందర్ గారు, శ్రీమాన్ వి. లచ్చన్నగారు, శ్రీమాన్ జక్కు సత్తయ్య, శ్రీమతి డా॥ ప్రవీణ్ రెడ్డిగారు (దండేపల్లి మండల ప్రెసిడెంట్‌గారు), శ్రీమాన్ ఆంజనేయులుగారు, శ్రీమాన్ గంగన్నగార్ల సహకారముతో వారంరోజులపాటు 68 గ్రామాలలో ఇంటింటికీ గీతాజ్యోతి కార్యక్రమాన్ని పరిచయం చేసారు.

**బెల్లంపల్లి :** 'ధర్మక్షేత్రము'గ శ్రీమాన్ ఆర్. రాజేశ్వరరావుగారు సహకారముతో వారం రోజులపాటు 70 గ్రామాలలో గీతాజ్యోతిని ప్రచారం చేయడం జరిగింది.

కాసిపేట, తిర్యాని మండలం (ఇంటీరియర్) ప్రాంతాలలో శ్రీమాన్ లక్ష్మణ రావు మహారాజ్ టీచర్, శ్రీమాన్ ధర్మారావుగారు వీరి ఇద్దరి సహకారముతో గీతాజ్యోతి కార్యక్రమము గురించి 5 రోజులలో 50 గ్రామాలలో ప్రచారము చేయడం జరిగింది.

**మందమర్రి :** శ్రీమాన్ అనంతాచార్యులు, శ్రీమాన్ లక్ష్మణరావు గార్లతో 15 గ్రామాలలో కాగజ్‌నగర్‌లో శ్రీమాన్ రాంమోహనరావు గారు, శ్రీమాన్ రాంబాబుగారు, జి.యస్. రావుగారు, కౌటాల గ్రామానికి చెందిన శ్రీమాన్ వాసాల రామస్వామిగారు, పోతేపల్లి లక్ష్మయ్యగారు గీతాజ్యోతి కార్యక్రమం గురించి అత్యంత శ్రద్ధాసక్తులతో 24 గ్రామాలలో 4 రోజులు ప్రచారం చేయడానికి సహకరించారు.

సంచార గీతాజ్యోతి రథంద్వారా మంచిర్యాల, జైపూర్ మండలాలో 34 గ్రామాలలో శ్రీమతి ఉమగారు, శ్రీమతి రుక్మిణిగార్ల సహకారముతో గీతాజ్యోతి సందేశాన్ని ప్రచారం చేయడం జరిగింది.

మొత్తం నెలరోజులలో 343 గ్రామాలలో సుమారు 60,000 మంది ప్రజలకు గీతాజ్యోతి ప్రచారం జరిగింది. ఈ అఖండ సంచార గీతాజ్యోతి రథం అదిలాబాదు జిల్లాలో పర్యటింప చేయడానికి ఆయా ప్రాంతాలలో ఉండి ప్రచారం చేయడానికి వ్యవస్థ ఏర్పరచి ప్రచారం జరిగేటట్లు మంచిర్యాల వికాస తరంగిణి శ్రీమాన్ వేంకటేశ్వరరావుగారు, శ్రీమాన్ శ్యామసుంద రరావుగారు, శ్రీమాన్ రామారావుగారు సహకరించారు.

తత్త్వ ప్రచారకులు శ్రీమాన్ గంగాధర్ నేతృత్వంలో శ్రీమాన్ నాగరాజుగారి సారథ్యంలో శ్రీమాన్ సుబ్రహ్మణ్యం తదితరుల సహకారంతో గ్రామగ్రామానికి ఇంటింటికీ, వీరికి సహకరించిన కార్యకర్త లకు శ్రీస్వామివారు మంగళా శాసనాలు కృపచేసారు.

మిగిలిన అన్ని జిల్లాల్లో కూడ ఇదే విధంగా ఇంటింటికి ప్రచారం కావించి, వారందరికీ ధైర్యాన్ని కలిగించాల్సిన అవసరం ఉందని, మిగిలిన అన్ని ప్రాంతాలలో కూడ ఇలాంటి ప్రచారం జరగాలని శ్రీస్వామివారు అనేక మంగళాశాసనాలు కృపచేసారు.

### విజయనగరంలో ఉభయవేదాన్త సభలు

జులై 21,22,23 తేదీల్లో మన ఉభయవేదాన్తాచార్య పీఠానికి అనుబంధ శాఖగా ఏర్పడిన 'ఉభయ వేదాన్త సభ' ద్వారా సభలు దిగ్విజయంగా జరిగాయి. 'మహా మహోపాధ్యాయ', కవిశాబ్దిక కేసరి' ఉ.వే.శ్రీమాన్ యస్.యన్.సి. రఘునాథా చార్యస్వామివారి అధ్యక్షతన జరిగిన ఈ

సభలో ఉ.వే.శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రా చార్యస్వామివారు, ఉ.వే. శ్రీమాన్ యస్.వి. రంగరామానుజాచార్యస్వామివారు, ఉ.వే. శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్య స్వామివారు, ఉ.వే.శ్రీమాన్ కోనప్పాచార్య స్వామివారు, ఉ.వే శ్రీమాన్ పి. వెంకటాచార్య స్వామివారు, ఉ.వే.శ్రీమాన్ కె. వెంకటాచార్య స్వామివారు, ఉ.వే.శ్రీమాన్ కృష్ణమాచార్య స్వామివారు, ఉ.వే.శ్రీమాన్ టి.కె.వి. అయ్యంగార్‌స్వామివారు, శ్రీమతి కర్రి తిరువేంగళమ్మగారు, శ్రీమతి కె. జానకిగారు ప్రధానంగా ప్రసంగాలు చేశారు. స్థానికంగా ఉ.వే.శ్రీమాన్ కందాళ వెంకటాచార్యస్వామి వారి వద్ద ద్రావిడ వేదాన్తాన్ని అధికరించిన పాతతరంవారు శ్రీమతి జానకిగారి వద్ద అధ్యయనం చేస్తున్న కొత్తతరంవారుకూడా పాల్గొని ద్రావిడ పంక్తులను ఉటంకిస్తూ ప్రసంగాలు చేయడం ఈ సభలోని ప్రత్యేకత. ఉ.వే.శ్రీమాన్ కందాళ వెంకటాచార్య స్వామి తిరునక్షత్ర సందర్భంగా జరిగిన ఈ సభలో ఈ సంవత్సరం - ఆచార్య పరివస్యగా ఉ.వే. శ్రీమాన్ రఘునాథాచార్యస్వామివారికి, శ్రీమతి జానకి, శ్రీపాణి, సౌమిత్రి, హరి ప్రియల ఆధ్వర్యవంలో సత్కారం జరిగింది. శ్రీమాన్ పూర్ణానందస్వామి కుటుంబ సభ్యులు పరిపూర్ణంగా సహకరించి సత్కారాలను జరిపారు. ఈ సందర్భంగా శ్రీమాన్ పూర్ణానంద స్వామి దంపతులు, వారి కుమారుడు దంపతులు ఉ.వే.శ్రీమాన్ కందాళ వెంకటాచార్యస్వామివారిచే రచింపబడిన వ్యాసాలతోకూడిన 'వ్యాస వాఙ్మధురిమ' అనే గ్రంథాన్ని ముద్రించి ఆవిష్కరింపజేశారు.

ఈ సభలు అనేక విధాలుగా సంతృప్తినిచ్చిన నిర్వాహకులకు దంపతులకు మంగళాశాసనాలు చేశారు. శ్రీమాన్ కృష్ణాజీ వందన సమర్పణతో సభలు ముగిసాయి.

## గిరిజన వికాసానికి ప్రాథమిక పాఠశాలలు

మనకు స్వాతంత్ర్యం వచ్చి 55 సం॥లు గడిచిన తరువాత కూడా వన్యప్రాంతాలలో

2

నివసించే గిరిజన, బడుగు వర్గాలకి సరియైన విద్యావిధానం ఏర్పడలేదు.

ఆయా ప్రాంతాలలో ప్రభుత్వాలు, స్వచ్ఛంద సేవా సంస్థలు నిర్వహించే విద్యా సంస్థలు ఉన్నా, అవి వారి అవసరాలను పూర్తిగా తీర్చలేకపోతున్నాయి. గిరిజనులలో వికాసం కలిగితే వనాలకు, వన సంపదకు సరియైన రక్షణ ఏర్పడుతుంది. అది లేనపుడు వనసంపదలు దుర్వినియోగం కావడం, అక్కడ నివసించే వివిధజాతులు సమాజానికి ఉపద్రవకారులుగా, తీవ్రవాదులుగను మారడం తప్పదు. ఇది ప్రస్తుతం మనం చూస్తూ ఉన్న వాస్తవం.

గీతాజ్యోతి ప్రచార కార్యక్రమంలో భాగంగా జూన్ 8 నుండి 10వ తేదీ వరకు ఆదిలాబాద్ జిల్లా, ఉట్నూరు పరిసర





ప్రాంతాలలో శ్రీశ్రీశ్రీస్వామివారు పర్యటించారు. ఆ సందర్భంలో అక్కడ వారికి ఉపయోగించే విద్యాలయాలను ప్రారంభం చేస్తామని చేసిన వాగ్దానానికి అనుగుణంగా ఒక పథకాన్ని రూపొందించారు శ్రీవారు.

ఆ ప్రాంతాలలోనే ఉన్న గ్రాడ్యుయేట్స్ లేదా అంతవరకు ఎదిగిన యువకులకు తగిన శిక్షణను ఇచ్చి అధ్యాపకులుగ నియమిస్తారు. వారికి సంస్కృతము, ఆంగ్లము మొదలైన భాషల్లో చక్కటి ప్రవేశము కలిగిస్తారు. ఆ అధ్యాపకులు తమ తమ ప్రాంతాలలో ఉండే విద్యార్థులకు, ప్రాంతీయభాషలో కాని, తెలుగులో కాని విద్యాభ్యాసం సాగిస్తారు.

ఇలా ఉత్తమ విద్య అందుకోవడానికి అనువైన విద్యాలయాలను వికసిస్తున్న పద్మాకారంలో నిర్మించాలని ఒక ప్లాను తయారు చేసారు. అంతేకాక అవకాశాన్ని బట్టి విద్యార్థులకు మధ్యాహ్న భోజనాన్ని అందించాలని శ్రీస్వామివారి నిర్ణయం. ఈ విద్యాలయాలు వచ్చే సంవత్సరం మనకు 2003నుండి ఆరంభం కావాలని శ్రీస్వామివారి సంకల్పం. దీనికి స్పందిస్తూ ఉట్నూరు దగ్గర అల్లంపల్లి అనే గ్రామానికి చెందిన గిరిజనులు 5 ఎకరాల స్థలాన్ని కేటాయించారు.

ఈవిషయం స్వామివారి ద్వారా తెలుసుకొన్న మన గృహశాఖామాత్యులు శ్రీమాన్ విద్యాసాగరరావుగారు తమ వంతు సేవలందిస్తామని, కరీంనగర్ జిల్లాకి సంబంధించిన అమ్మక్కపేట, రాయకల్, నాగారం, ఇల్లెంతుకుంట అనే నాలుగు ప్రాంతాలలో రెండెకరాల చొప్పున స్థలమును అక్కడ స్థానిక భక్తులను ప్రోత్సహించి విద్యాలయాలకోసం కేటాయింపచేసారు.

ఆ స్థలాలలో జులై 21న శ్రీశ్రీశ్రీ స్వామి

3

వారు ప్రత్యేకంగా మంత్రివర్యులతో పాటు అక్కడకు వెళ్ళి భూమి పూజాకార్యక్రమాన్ని నిర్వహించారు. ఆ కార్యక్రమంలో RSS కేంద్రసహాయ కార్యదర్శి శ్రీమాన్ మదన్‌గారు స్వయంగా పాల్గొని పునాదిరాయి వేసారు. నిజానికి స్వామివారు సాగించే ఈ గిరిజన వికాస కార్యక్రమాన్ని విని, ప్రభావితులై ఈ కారక్రమంలో పాల్గొనాలని, దానికి ప్రజా స్పందన ఎలా ఉంటుందనే భావనతో వారు వచ్చినా, అక్కడక్కడ ప్రజల ఉత్సాహాన్ని, వికాస తరంగిణి కార్యకర్తల శ్రద్ధను తిలకించి ఆశ్చర్య చకితులయ్యారు.

వరంగల్, ఖమ్మం జిల్లాలో కూడా కనీసం రెండు పాఠశాలలు నిర్మించటానికి వీలైన స్థలాన్నీ ఇంకా గుర్తించవలసి ఉంది.

ఈ విద్యాలయాలు రాష్ట్రంలో ఎన్ని ఆరంభించినా, వాటన్నిటి ఆకృతి ఒకే రకంగా ఉంటుందని శ్రీస్వామివారు నిర్ణయించారు. ఎనిమిది గదులతో, ఇతర వసతులతో ఉండే ఈ భవనం సుమారు 5000 అడుగుల చదరపు మీటర్లు ఉంటుంది. దానికి కనీసం 18 లక్షలరూ॥లు నిర్మాణ వ్యయం అవుతుందని అంచనా. ఇది కాక అందులో బల్లలు, కుర్చీల్లాంటి ఫర్నిచర్ ఏర్పాటు చేయాల్సి ఉంటుంది. వీటితోపాటు ఒక్కొక్క పాఠశాల నిర్వహణకు నుమారు నెలకు 50,000/-రు. నిర్వహణ వ్యయం కావచ్చునని ప్రస్తుతపు అంచనా.

ఇలాంటివి పదిపాఠశాలలు ఏర్పాటు చేసుకోవటానికి ఆయా ప్రాంతపు కార్యకర్తలు తప్పక ముందుకు వస్తారని శ్రీస్వామివారు సంకల్పాన్ని వెలిబుచ్చారు.

# పాంచరాత్రాగమ అర్చక శిక్షణ శిబిరం

ఆలయాలు అనేవి రాష్ట్రానికి, ప్రజలకు క్షేమకరం. ఈనాటికీ ఆలయాలకు సరయిన దిశా నిర్దేశం లేకుండా నిర్వహణ జరుగుతున్నది. అర్చకులకు కనీస వసతులు లేకపోయినా, ప్రభుత్వ అధికార వర్గం అవసరానికి మించి ఆదాయానికి తావే వినియోగించుకుంటూ, దేవుళ్ళు కూడా తమ తర్వాతనే అన్నట్లు వ్యవహరిస్తున్నది.

పేదరికం, అనాదరణ, చెప్పేవారు లేకపోవడం వంటి అనేక కారణాలవల్ల అర్చకులలో ఆరాధనా సామర్థ్యం కొరవడడం తద్వారా ఆలయాలు అనాదరణ పొందడం ప్రజలలో సంప్రదాయాల పట్ల శ్రద్ధ తగ్గడానికి దారితీసింది.

మంత్రశుద్ధి, తంత్రశుద్ధి, ద్రవ్యశుద్ధి ఎక్కడున్నాయో వెతుక్కోవలసిన స్థితి, ఈనాడు ఆలయాలను సమాజానికి దీనంగా చూపిస్తుంది.

శ్రీస్వామివారి సూచన మేరకు ప్రస్తుత ఎండోమెంట్స్ కమీషనర్ శ్రీమాన్ అజయ్‌కలాం గారు చొరవ తీసుకొని ఆలయాలను రాబడిని బట్టికాక ఆగమము, సంప్రదాయం అనేదాన్ని బట్టి విభజన చేయడానికి పూనుకోవడం ఈమధ్యకాలంలో ఎండోమెంట్స్ ఆలయాలకు డిపార్ట్‌మెంట్ చేసిన ఒక మంచికార్యంగా చెప్పుకోవచ్చు. ఆగమం, సంప్రదాయం గురించి వివరాలి వ్వాలని డిపార్ట్‌మెంట్ సూచన పంపితే సరియైన సమాచారం ఇవ్వలేని స్థితిలో ఆలయ వైదిక యంత్రాంగం ఉంది.





4

ఈ నేపథ్యంలో వివిధ ఆగమ, సంప్రదాయాలను పాటించే అర్చకులకు వాటి విషయంలో సరియైన అవగాహన కలిగించ టానికి శిక్షణ శిబిరాలను జరపాలని శ్రీస్వామి వారు సూచించారు. దాంట్లో భాగంగా శ్రీపాంచరాత్రాగమానికి సంబంధించిన శిక్షణ శిబిరాన్ని శ్రీస్వామివారి సన్నిధిలో జరగాలని నిర్ణయించారు.

మన ఆగమ పాఠశాల నేతృత్వంలో శ్రీపాంచరాత్రాగమ ప్రాథమిక శిక్షణ శిబిరాన్ని సీతానగరంలోని జులై 18న శ్రీస్వామివారు ప్రారంభించారు. శ్రీమాన్ మధుసూధనా చార్యులు, శ్రీమాన్ శ్రీనివాసాచార్యులు ఆగమ శిక్షణను అందించారు.

నిత్యారాధన, ప్రబంధము, మంత్ర భాగము, ఆగమాలకు ఆలయాలకు, శాస్త్రాలకు సంబంధించిన వివిధ అంశాలలో నిష్ణాతులైన పెద్దలచేత ప్రవచనాల ద్వారా అవగాహన కలిగించటం ఈశిబిరంలోని ప్రధానాంశంగా శ్రీస్వామివారు నిర్ణయించారు.

**శ్రీమాన్ యమ్. సీతారామాచార్యులు, సింహాచలం, శ్రీమాన్ బి. తాతాచార్యులు, హైదరాబాద్, శ్రీమాన్ యన్. సంపత్ కృష్ణమాచార్యులు, హైదరాబాద్, శ్రీమాన్ నంబి వేణుగోపాలాచార్యులు, జగిత్యాల, శ్రీమాన్ కోటి రామకృష్ణమాచార్యులు, భద్రాచలం, శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామి, సింహాచలం, శ్రీమాన్ పెరుమాళ్ళాచార్యులు, నృపతి, శ్రీమాన్ యస్. రంగరామానుజాచార్యస్వామి, కొవ్వూరు, శ్రీమాన్ యన్. రమాకాంతాచార్యులు, హైదరాబాద్. వారు వేంచేసి, వివిధ అంశాలపై తమ ప్రవచనాలను అనుగ్రహించారు.**

28వ తారీఖున దేవాదాయశాఖా మాత్యులు **శ్రీమాన్ దండు శివరామ రాజు,** దంపతులు శిక్షణ శిబిరాన్ని సందర్శించారు. వారు అర్చకులనుద్దేశించి ప్రసంగిస్తూ 'ఆలయాలు అనేవి ప్రజాక్షేమానికి, రాష్ట్రక్షేమానికి ఎంతో అవసరం వాటిలో ప్రధాన భూమిక వహించేది అర్చకులే. ఇప్పటి వరకు ఆలయాల ఆదాయ వ్యయాలపై దృష్టిపెట్టామని ఇక పై ఆలయాల సంరక్షణకై దృష్టి పెడతామన్నారు. ఆలయాల్లో జరిగే ఆచార వ్యవహారాల్లో ప్రభుత్వాల పెత్తనం లేకుండా ఉండేదుకు, వాటిని నిర్ణయం చేయగలిగిన అధికారం కలిగిన మత పెద్దలను ఒక కమిటీగా ఏర్పాటు చేయాలని ఒక ప్లాన్ ఉంది. త్వరలోనే దీనిపై ఒక నిర్ణయం తీసుకుంటామన్నారు'. ఇలా అర్చకులకు తమ ఆగమం, సంప్రదాయం పట్ల అవగాహన కలిగించే శిబిరాన్ని అనుగ్రహించిన శ్రీస్వామివారికి అనేక కృతజ్ఞతలు ఆవిష్కరించారు.

శిక్షణ శిబిరంలో పాల్గొన్న అర్చకులు ఎంతో ఉత్తేజాన్ని, ఆనందాన్ని పొందామని ఇలాంటి శిక్షణ శిబిరాన్ని ఏర్పాటు చేసిన ఎండోమెంట్స్ డిపార్ట్‌మెంట్‌కు, మంచి శిక్షణనందించిన శ్రీస్వామివారికి అనేక కృతజ్ఞతలు తెలియచేసారు.

**వారిమాటల్లో:**

శ్రీపాంచరాత్రాగమ వైభవ రసామృత మును అర్చక సోదరులతో పునశ్చరణ చేసే,

పండిత ప్రముఖుల వాణిలో శాస్త్రవైభవాన్ని వినే అదృష్టం కలిగింది.

**- బిట్టకవి సత్యనారాయణాచార్యులు, శ్రీరంగపురం**

అర్చకుడు తన శాస్త్ర పరిజ్ఞానంతో భగవంతునకు సేవచేసి, తద్వార సకల జగత్కళ్యాణానికి దోహదపడాలి. శ్రీస్వామి వారు మధుర పాంచరాత్రాగమ శాస్త్రాన్ని గోరుముద్దలుగా మాకు అందించారు.

**- పంచాంగం వీరరాఘవాచార్యులు**

ఆంధ్రరాష్ట్రమంతటా ఒకే విధమయిన సిలబస్ కలిగి అర్చక సోదరులకు పరీక్షలను అర్థమైన పద్ధతిలో శిక్షణా కార్యక్రమాలు జరపడం చాలా ఆనందదాయకం.

**-వెంకట లక్ష్మణాచార్యులు**

అంతేకాకుండా మొదట రకరకాలుగ వచ్చిన అర్చకులు శిబిరంలో శిఖాధారులై, పుండ్రధారులై, సంప్రదాయ సిద్ధంగా అన్వయించటం ఒకవిశేషం.

సరైన శిక్షణ ఇటు అర్చకులకు, అటు ఆలయఅధికారులకు ట్రస్టీలకు లభించటం వల్ల ఆలయాలు ప్రజోపయోగకరంగా సమాజాన్ని ధర్మమార్గంగా నడిపిస్తాయి. అంతేకాకుండా ప్రకృతి కూడా చక్కగా స్పందిస్తుంది. ప్రజలు సుఖపడతారు అనికద శాస్త్రం మనకు తెలుపుతుంది

## శ్రీవారి మారిషస్ పర్యటన

29-7-2002, శ్రీస్వామివారు మారిషస్ పర్యటన నిమిత్తం మధ్యాహ్నం 2-00 గం॥లకు షాలిమార్ ఎక్స్‌ప్రెస్‌లో విజయవాడ నుండి చెన్నై బయల్దేరారు. రాత్రి 10-00 గం॥లకు చెన్నైలోని శ్రీమతి ఉమ్మడి లలితాదేవి (చెన్నై వికానతరంగిణి అధ్యక్షులు) గారింటికి వేంచేసారు. చెన్నై భక్తగోష్ఠి అంతా శ్రీవారిని ఇక్కడే సేవించుకొని మంగళాశాసనాలు స్వీకరించారు.

30-7-2002, ఉదయాత్పూర్వము గం॥ 3-30 ని॥లకు చెన్నై అంతర్జాతీయ విమానాశ్రయం నుండి 'Air Mauritius'వారి Flightలో శ్రీ స్వామివారు పరివారంతో మారిషస్ దేశానికి బయల్దేరారు. సుమారు 6-30 గం॥లు ఆకాశమార్గంలో ప్రయాణించి ఉ॥ గం॥ 102-00 లకు మారిషస్‌లోని Sir Sivsagar Romgoolam (SSR) అంతర్జాతీయ విమానాశ్రయంలో శ్రీస్వామి వారు తమ దివ్యపాదాన్ని మోపారు. అపుడు మారిషస్‌లో సమయం ఉ॥ గం॥ 8-30 ని॥లు అయ్యింది. వీరు మనకంటే గంటన్నర వెనుక ఉంటారన్నమాట. విమానాశ్రయంలో, **శ్రీమాన్ అనిల్ బేచు** - ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ మినిస్టర్ గారు, **శ్రీమాన్ ముఖేశ్వర్ చుని** - స్టేట్ లాండ్స్ & హౌసింగ్ మినిష్టర్, **శ్రీమాన్ డా॥ జడి** - ప్రవేట్ పార్లమెంటరీ సెక్రటరీ గారు. లా రోజా (La Rosa) వెంకటేశ్వర దేవాలయం ట్రస్ట్ చైర్మన్ **శ్రీమాన్ రాందాస్ ఎల్లయ్య గారు**, దివ్య జీవన సంఘం (Divine Life Society) అధ్యక్షులు **శ్రీమాన్ ప్రవీణ్ రాంగులాంజీ**, మరియు అశేష భక్తజనం శ్రీస్వామివారికి ఘనస్వాగతం పలికారు. విమానాశ్రయంలోనే మారిషస్ టెలివిజన్ వారు నిర్వహించిన ఇంటర్వ్యూలో శ్రీస్వామి వారు పాల్గొన్నారు. శ్రీస్వామివారు విమానా శ్రయం నుండి 60 కి.మీ. ప్రయాణించి 'Rose Hill' పట్టణం లోని శివానంద యోగాశ్రమం చేరుకున్నారు. శ్రీస్వామివారు పరివారంతో ఉండడానికి బస ఈ ఆశ్రమంలోనే ఏర్పాటు చేసారు. శ్రీస్వామి వారు ఆగష్టు 5వ తేదీ వరకు మారిషస్‌లో వేంచేసి ఉంటారు. శ్రీస్వామివారి మారిషస్ పర్యటన వివరాలు వచ్చేసంచికలో చదివి ఆనందించండి.

## ఈ సంచికలో .....



## ముఖచిత్రపరిచయం

1. హయగ్రీవ జయంతిరోజు విద్యార్థుల ఆరాధనను అందుకున్న హయగ్రీవ పెరుమాళ్ళు.
2. శ్రావణశుక్రవారం, వరలక్ష్మీ వ్రతం రోజు భక్తులను అనుగ్రహించటానికి వివిధ రూపాలు ధరించి సింహాసనంపై వేంచేసిన అమ్మ.
3. నడిగడ్డపాలెం, బృందావనంలో తిరునక్షత్ర ఆరాధనలు అందుకోడానికి అర్చావతారంలో శేషవాహనం పై వేంచేసిన శ్రీశ్రీశ్రీ పెద్ద జీయరుస్వామివారు.

## పంచాంగ వివరాలు

### సెప్టెంబరు

10 విష్వక్సేనారాధన, వినాయక చవితి, సిద్ధివినాయక వ్రతం.
14 ఉత్తరకార్తె ఉ. 8-18
15 తిథిద్వయం
16 ఏకాదశి తిథి
17 సర్వేషాం పరివర్తనైకాదశి కన్యా సం॥ సా. 6-24,
18 త్రయోదశి తిథి, వామన జయంతి
19 శూన్య తిథి
20 చతుర్దశి తిథి
22 మహాలయ పక్షారంభం
25 భరణీ మహాలయం
27 హస్తకార్తె రా. 11-28
28 వ్యతీపాన్మహాలయం
30 అవిధవానవమీ శ్రాద్ధం

### అక్టోబర్

2 సర్వేషామేకాదశి, గాంధీ జయంతి
3 యతుల మహాలయం
5 విషశస్త్ర హతాదుల మహాలయం, మాసశివరాత్రి
6 సర్వేషాం మహాలయ అమావాస్య
7 తిథిద్వయం, శరన్నవరాత్రారంభం, దౌహిత్రకృత మహాలయం,
8 తదియ తిథి
9 తిరుమలై నంబి తిరునక్షత్రం
11 చిత్తకార్తె ఉ. 11-50

**శ్రీవారి సూక్తి**

**సజ్జన సాంగత్యం సాయంకాలపు నీడలా సాగుతూనే ఉంటుంది.**
**దుర్జన సహవాసం ఉదయపు నీడలా ఆరంభంలో ఆర్భాటం అధికం. మధ్యాహ్నానికి మిగలదు.**

మీ సేవలో....


**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 72929
చందా: సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-, విదేశాలకు సంవత్సరచందా $ 25
E-mail : bhakthinivedana@yahoo.co.in Internet : www.chinnajeeyar.org
D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రొసెసర్స్, సీతానగరం,


గమనిక : **సమాశ్రయణములు సెప్టెంబర్ 15వ తేదీన వేదవిశ్వవిద్యాలయ ప్రాంగణం, సీతానగరంలో జరుగును.**



శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక


చిత్రభాను నామ సంవత్సరం భాద్రపద మాసము



సంపాదకులు : శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు


వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

# సంపాదకీయం ప్రత్యుత్థానాభివాదములు

ఈ మాట శిష్టుల వ్యవహారంలో తరచు వింటూంటాం. నిజానికి ఇవి రెండు మాటలు. ప్రత్యుత్థానం, అభివాదం - ఎదురేగుట - నమస్కరించుట.

మతాపితరులను, ఆచార్యులను, జ్ఞాన వయో వృద్ధులను నమస్కరించటం మన సంస్కారం. 'మానవ'సంస్కారం. నమస్కరించటంతో పాటు దానికి ముందు వారు కనబడితే తానే ముందులేచి నాలుగడుగులు నడిచి వారికెదురేగాలి. ఇతి ప్రత్యుత్థానం.

ఈ ప్రత్యుత్థానాన్ని గురించి, అభివాదాన్ని గురించి మనువు ఓ చక్కటి మాట చెప్పేడు-

**ఊర్ధ్వం ప్రాణాహ్యూత్క్రమంతి యూనస్థ్సవిర ఆయతి**
**ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతి పద్యతే.**

చిన్నవాడి దగ్గరకు జ్ఞాన వయో వృద్ధుడు వస్తే ఆయన్ను చూస్తూనే వీడి ప్రాణాలు కాస్తా పైకి పోతాయట! అది గమనించి చటుకున తేరుకొని తెలివి తెచ్చుకొని నాలుగడుగులు ఎదురేగి నమస్కారం కావిస్తే లేచిన ప్రాణాలు మళ్ళీ కుదుట బడతాయి.

అదిగో, అందుకు ప్రత్యుత్థానం, అభివాదమూను! పెద్దలు తమ దగ్గరకు రాకుండా తామే పెద్దలకు ఎదురేగాలి. అది మర్యాద. 'విల్లిపుత్తూరులోని భాగవతులు తైర్థిక భాగవతులకు ఎదురేగి సాష్టాంగ మెరగువారు' అంటారు రాయలవారు.

గుహుడు కాళ్ళతో నడిచి తానున్న కడకు వచ్చి సౌహార్దం నెరపినాడని ఆయన మర్యాదకు రామచంద్ర ప్రభువు సంబరపడిపోతాడు.

పెద్దలు వస్తున్నారన్నవార్త తెలియగానే వారి దర్శనానికి తానే ముందు బయలుదేరాలి. మాట మాత్రం తెలియక వారు నేరుగా తనకడకు వస్తే అల్లంత దూరాన వారిని చూడగానే కూర్చున్న చోటు నుంచి తటాలున లేచి, సంభ్రమంగా ఎదురేగాలి. తాను ఆసనస్థుడుగా, శయ్యాగతుడుగా పెద్దల కంట బడకూడదు. అందుకోసం ప్రత్యుత్థానం, వారి పట్ల గౌరవం నెరపటం అభివాదం కావించటం. ఇదీ సంప్రదాయ పరిపాటి.

రోగాదుల వల్ల తానశక్తుడైతే ఆ పరిస్థితి వేరు. వారిని చూసి యధాశక్తి అభివాదం కావింపవచ్చు. అభివాదం అంటే నమస్కారం. నమస్కరించటంలో ఎన్నో రకాలున్నాయి. ఆలయాలలో భగవంతుడికి అభివాదం చెయ్యటం. ఆశ్రమాలలో, ఆచార్య కులాలలో, ఆవసథాలలో గురువులకు, గురు జనానికి అభివాదాలు కావించడం. దేవ నమస్కారాన్ని ఆగమాలు బహుధా ఉల్లేఖించేయి.

గురువృద్ధ నమస్కారాన్ని పాదోప సంగ్రహంగా, నేలను తాకుతూ నమస్కరించటంగా స్మృతులు పేర్కొన్నాయి. **'దేవమివాచార్యముపాసీత'** అన్న ఆపస్తంబ వాక్యాన్ని పట్టి దేవాభివాద విధాలన్నీ ఆచార్య విషయంలోనూ మాతా పిత్రాది గురుజనుల విషయంలోనూ, వృద్ధుల విషయంలోనూ, వర్తిస్తాయనటంలో ఎవరికీ విప్రతిపత్తి ఉండదు.

ఇక నమస్కారాలలో సాష్టాంగ ప్రణామం బాగా ప్రసిద్ధం.

**మనో బుద్ధ్యభిమానేన సహన్యస్య ధరాతలే**
**కూర్మవచ్చతురః పాదాన్ శిరస్తత్రైవ పంచమమ్.**

మనస్సు, బుద్ధి, అభిమానం, రెండు కాళ్లు, రెండు చేతులు, శిరస్సు - ఈ ఎనిమిదితో నేలను చాగిలబడి కావించేది యీ నమస్కారం. కాలుసేతులు, శిరసుతో పాటు మనసును, బుద్ధిని, అభిమానాన్ని మూటకట్టి ముందు పెట్టాలి యీ ప్రణామం. నుదురు, ఉదరం, రెండు మోకాళ్ళు ముందుకు చాచిన రెండు చేతులూ నేలపై ఆనించి మనసులో తలచుకుంటూ నమస్కరించటం సాష్టాంగంలోనే మరో రకం.

**వక్షస్సు, శిరస్సు, చెక్కిళ్ళు, కాళ్ళు, చేతులు, మోకాళ్ళు నేలకానించి మనసుతో భావిస్తూ, వాక్కుతో** నమస్కారం అనటం ఒకరకం సాష్టాంగ ప్రణామం.





ఇవికాక మరికొన్ని విధాల ప్రణామాలనూ ఆగమ కోవిదులు పేర్కొన్నారు.

అవి - మస్తిష్క - సంపుట - ప్రహ్వాంగ - పంచాంగ - దండాంగ, ప్రణామాలు.

**మస్తిష్కం -** శిరసున అంజలి చేర్చిమొక్కటం.
**సంపుటం -** ఎదకు దోయిలి చేర్చి మొక్కటం.
**ప్రహ్వాంగం -** ఎదను దోయిలి చేర్చి ఒడలు వంచి మొక్కటం.

**'నతాంసముతో దోయిలించి'** అని సుతారంగా అంటున్నారు దీన్నే.

**పంచాంగం -** పాదాంగుళులతో, మోకాళ్ళతో, శిరసుతో నేలను తాకుతూ అంజలిబంధంతో నమస్కరించటం. నేడు స్త్రీజనం కావిస్తున్న నమస్కార విధానం ఇది.

**దండాంగం** - కాలుసేతులుచాచి కట్టెలా నేలపైబడి నమస్కరించటం. దీన్నే దండ ప్రణామం అని, దండవత్ప్రణామం అనీ అంటూంటారు.

నమస్కారం అన్న అర్థంలో దండం అన్న పదం వ్యవహారంలో ఉంది. 'దండ ప్రణామానికి' సంక్షిప్త రూపం 'దండం' కావచ్చు.

కొందరు 'దణ్ణం' అన్న పదాన్ని ప్రణామార్థంలో వాడుతున్నారు. 'దండ వికారం కాదు, ఇది నమస్కారార్థమైన స్వతంత్ర పదం' అని వారి అభిప్రాయం.

ఆలయాలలో దేవతామూర్తుల యెదుట కావించే యీ నమస్కారాలన్నీ గురువులకడ, వృద్ధులకడ చేయదగినవే. అయితే ఆచార్యాభివాదంలో పాదోపసంగ్రహణం కర్తవ్యం. ఇది పాదాభివాదం అన్నమాట. కుడిచేతితో కుడికాలిని ఎడమచేతితో ఎడమకాలిని తాకుతూ నమస్కరించాలి. (**సవ్యేన సవ్యః స్ప్రష్టవ్యః దక్షిణేన చ దక్షిణః**).

అభివాదం నిత్యమూ చెయ్యాల్సింది. వృద్ధులందరకూ చెయ్యాల్సింది. పాదోపసంగ్రహణం కొందరికే, కొన్ని సందర్భాలలోనే చేయదగినది. కొందరికి కొందరు చేయకూడనిదీని. అభివాదానికి ఇల్లాంటి ఆంక్షలు లేవు. నేలను తాకుతూ చేయదగినది అభివాదం.

సంప్రదాయపరుల ఇళ్ళల్లో నేటికీ ఈ ప్రత్యుత్థానాలు, అభివాదాలు, పాదోపసంగ్రహాలూ కనవస్తాయి. ఐతే కొందరికి ఈ సంప్రదాయం బొత్తిగా తెలియకుండా పోయింది. ఆలయాలలో చాగిలపడే అవకాశం ఎల్లాగూ లేదు!

ఆచార్యులకూ, ఆర్యులకూ అభివాదాలు చేసే అలవాటు కూడా అంతరించుకుపోతోంది.

ఈ అభివాద విధానాలన్నీ పోయి 'ఒంటిచేతి సలాములు' వచ్చేయి. అవీ పోయి హలో, హాయ్ వంటి నూతన ధ్వనులు వస్తున్నాయివేళ.

చామర గ్రాహిణులు, తాంబూల కరండ వాహినులు, దండధారులు మొదలయినవారు ఒంటిచేతి సలాములు చేయవచ్చు. తప్పులేదు. వారికి తప్పులేదన్నారని ఇతరులూ ఆ దారి పట్టటం క్షంతవ్యం కాదు. వారిని చూసి, వారు చేయగా ఒప్పైనది మనం చేస్తే తప్పెట్లా అవుతుందని బుద్ధి పెడతలను పట్టినవారు భావించటంతో ఈ దిగజారుడుతనం ప్రారంభం అయింది.

అడుగుల బడటం, వాటిని తాకటం బానిస చిన్నెలని, రాచరికపు వన్నెలని స్వంతంత్రులుగా తమకవి కిట్టవని కొందరు 'బుద్ధిమంతులు' భావించిన దాని ఫలం ఇది.

పెద్దలను సేవిస్తూ వారికి నమస్కరిస్తే వచ్చే ఫలం ఏమిటో మనువు చెబుతున్నాడు. చిత్తగించండి-

**అభివాదన శీలస్య నిత్యం వృద్ధోపసేవినః**
**చత్వారి తస్య వర్ధంత ఆయుర్విద్యా యశోబలమ్.**

వృద్ధులను పరిచరిస్తూ వారికి నమస్కరించిన వారికి ఆయుస్సు పెరుగుతుంది. విద్య సమకూరుతుంది. కీర్తి ఏర్పడుతుంది. బలం చేకూరుతుంది. మనిషికి ఇంతకంటే ఏంకావాలి? అంచేత సర్వులూ పెద్దల పట్ల మన్నన, మర్యాద చూపటం స్పృహణీయం.

**-శ్రీరామచంద్రాచార్య**

జై శ్రీమన్నారాయణ!



# గీతాజ్యోతి



## 21వ వారం

## పారాయణ శ్లోకమాలిక

### మాయదారి ప్రకృతి ముడిని మాధవుడొక్కడే విప్పగలడు

జన్మతో, జాతితో, ఒక వృత్తితో మన మంతా ఏదో ఒక రకమైన యోగ్యతని పొందాం. దానిని మనం ఆరాధించుకోవడం మనకి అవసరం. లోకంలో అలాంటివి ఎన్నో ఉన్నాయి. వాటిని ఆదరించడం కూడా మన బాధ్యత. అయితే స్వీయ ఆరాధన కానీ, సర్వఆదరణ కానీ ఏ లక్ష్యంతో మనం చేయాలి అనేది ఓ ప్రశ్న. వీటివల్ల మనం సాధించదలచుకున్నది ఏమిటి? కర్మబంధం తొలగడం. అంతరాలు తగ్గి అందరమూ కలిసిమెలసి ఆనందంగ సహజీవనం సాగించడము.

తెలియకుండానే ప్రకృతి మనకి ఒక దేహాన్ని ఇచ్చింది. ఈ దేహం రావడానికి కారణం కర్మబంధం అని శాస్త్రం చెప్తోంది. మన శరీరాల్లో ఎన్నో తేడాలున్నాయి. రకరకాల ఆకారాలు, రకరకాల రంగులు, పొడవు, పొట్టి భేదాలు, స్వభావ భేదాలు ఉన్నాయి.

అయితే ఈ శరీరాలలో, స్వభావాల్లో తేడాలు ఎందుకు వచ్చాయంటే సమాధానం లభించదు. ఈ శరీరంలోకి రావడానికి మన కోరిక కానీ, మరొకరి కోరిక కానీ కారణం కానప్పుడు పుట్టడానికి వెనకాల ప్రేరకం '**కర్మ**' అని వేదాంతులు అంటారు. ఆ కర్మ ఏ విధమైనదో ఆ రకమైన అనుభవం పొందడానికి అనువైన శరీరం ఆ కర్మ వలన కలుగుతూ ఉంటుంది. కర్మలలో తేడాల వలన శరీరాలలోనూ, అనుభవాలలోనూ తేడాలు ఏర్పడతాయి. అందుకోసమనే కర్మబంధం ఉన్నంతవరకూ శరీరం రావడం తప్పదు. శరీరాలు ఎన్నో గతంలో ధరించి,విడచి ఉంటాం. అలానే మరెన్నో ఈ శరీరం తర్వాత ధరించవలసి ఉండచ్చు. ఇప్పుడున్న శరీర ఆకృతులలోనూ, స్వభావాలలోనూ ఉండేటటువంటి తేడాలే కర్మఉనికికి నిదర్శనము. ప్రధానంగా మనం శాస్త్రాన్ని అంగీకరిస్తాం. ఆ శాస్త్రమే మనకి పూర్వజన్మలు ఉన్నాయని చెప్తోంది. పూర్వజన్మలు, పరజన్మలు తొలగాలంటే వాటికి ప్రధానకారణం కర్మ కనుక, మనకి ఆ కర్మబంధం తొలగాలి.

కేవలం శరీరం పోవడం మోక్షం అనదు వేదాన్తశాస్త్రం. కర్మబంధం తొలగడమే మోక్షం అని అంటుంది. శరీరపు దోషాలు శారీరక కర్మవలన, అజ్ఞానపు దోషాలు సరియైన జ్ఞానాన్ని పొందడం వలన మనం నిర్మూలన చేసుకోగలిగితే తద్వారా కర్మబంధం తొలగి ఈ జీవుడు తనయొక్క సహజమైన ఆనంద స్థితిని తాను పొందగలుగుతాడు. ఆ స్థితి ఎలా ఉంటుందో ఏమిటో శాస్త్రాలు చెప్తున్నాయి.

అయితే, కర్మబంధం తొలగడమే మానవజన్మకి లక్ష్యమైతే, కర్మబంధం తొలగేటట్టుగా ఈ జీవితంలో ప్రవర్తింప చేయడమే జ్ఞానానికీ లక్ష్యము కావాలి. కేవలం అది మనంతట మనమే కర్మను తెలుసుకొని,





మనంతట మనమే చేసేసి, తొలగించేసుకోగలమా? కుదరదు. శాస్త్రం తెలిసిన వారెందరినో మనం గమనిస్తున్నాం. చేసేవారెందరినో కూడా మనం చూస్తున్నాం. వారికి కూడా రకరకాల దోషాలు ఏర్పడుతున్నాయి. అలాంటివారు కూడా మరుజన్మలో కిందికి వెళ్ళిపోవడం కూడా మనం వింటున్నాం.

భరతుడు ఒక మహా చక్రవర్తి. గొప్ప కర్మయోగి, జ్ఞానయోగి అయి ఉండి కూడా, అంత్యకాలంలో వనానికి వెళ్ళి యోగేన అంత్యే తను త్యజాం అంటూ యోగాభ్యాసం ప్రారంభించాడు. ఆ యోగం ఫలించబోయే సందర్భంలో ఒక లేడి పిల్ల సంరక్షణలో పడి యోగం వదిలి మరుజన్మలో లేడిగా పుట్టవలసి వచ్చిందని తెలుస్తోంది. అంటే ఎంతటివారినైనా ప్రకృతి తన శక్తితో పడవేస్తున్నదని దీనిని బట్టి మనకి తెలుస్తోంది. అందుకని ఈ ప్రకృతిని మనం స్వాధీనం చేసుకుంటే తప్ప ఎంత కర్మయోగులమైనా ఎంతటి జ్ఞాననిష్ఠులమైనా మన స్వరూపాన్ని మనం పొందలేం. కర్మబంధాన్ని తుంచలేం కూడా. అయితే ఈ ప్రకృతి మనకి స్వాధీనమవడం ఉంటుందా? అది మనం చెప్పినట్టు వింటుందా? మనకి లొంగుతుందా? ప్రకృతి అంతం చూద్దామని వైజ్ఞానికులు చేసేకృషి ఎంతెంతో చెప్పలేం. ఇంత చేసినా కూడా ఒక కణపు లోతు చూడటం చేతకావటం లేదు. వాటి సంఖ్యని మాత్రం గుర్తించగలిగారు. అవి ఎలా ఏర్పడ్డాయో, అలానే ఎందుకు ఉన్నాయో తెలీదు. వాటికి ఏవో కొన్ని సంకేతాలను ఇచ్చారు. జీన్స్ అని పేరు పెట్టారు. ఒక చిన్న కణం గురించే సంపూర్ణంగా మనకి తెలీలేదు. ఇక అపారమైన అనంతమైన ప్రకృతిని గురించి మనకి ఎప్పటికి తెలియాలి? ఎప్పుడు దానిని మనం అధీనం చేసుకోగలుగుతాము? ఇక ఎప్పటికి దానినుంచి విడుదల పొందగలము? అసలు ఇది సాధ్యమా? అని అర్జునుడికి పెద్ద సందేహం కలిగింది.

ఈ ప్రకృతి ఎట్లా మన మాట వినేది? ఈ సందేహాన్నే తీరుద్దామని భగవానుడు ఏడవ అధ్యాయంలో 12వ శ్లోకంలో సమాధానం చెప్పాడు. ఆ శ్లోకాన్ని ఈ వారపు శ్లోకంగా మనం అనుసంధానం చేసుకుందాం.

**దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।**
**మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే॥ 7అ॥ - 14శ్లో॥**

ఏడవ అధ్యాయం భగవంతుని స్వరూపాన్ని, స్వభావాన్ని స్పష్టపరచడం కోసం చెప్పినది కనుకనే దానిని జ్ఞానవిజ్ఞానయోగమని పిలుస్తారు. జ్ఞానమంటే భగవంతుడంటే ఎవరు? ఎలా ఉంటాడు తెలుసుకోవడం. విజ్ఞానమంటే ఆయన ఏం చేస్తాడు, ఎందుకు చేస్తాడు అన్నది స్పష్టంగా తెలుసుకోవడం. ఈ రెంటినీ వివరించే ఈ అధ్యాయాన్ని జ్ఞానవిజ్ఞాన యోగమని పిలుస్తారు. అందులో అర్జునుడికి శ్రీకృష్ణుడు తన గురించి తెలియచేస్తూ 'ఓ అర్జునా! నా దగ్గర రెండు వస్తువులున్నాయి. అవి రెండూ నేను చెప్పినట్టే వింటాయి. అందులో ఒకటి, కొన్నింటి కలయికగా ఏర్పడింది. వాటికంటే మరొకటి కొంచెం పైది. పైది కనుక దానిని 'పరా' అంటారు. క్రింది దానిని 'అపరా' అంటారు. ఇవి రెండూ, కూడా నాకు సంబంధించిన ప్రకృతులే' అన్నాడు. అంటే ఒకటి పరా ప్రకృతి రెండవది అపరా ప్రకృతి అని విడదీసాడు శ్రీకృష్ణుడు. పరాప్రకృతి

అంటే ఏమిటి? అపరాప్రకృతి అంటే ఏమిటి? అని అడిగాడు అర్జునుడు. కంటితో చూస్తూ నువ్వు 'ప్రకృతి' అని వ్యవహరిస్తున్న దంతా 'అపరా ప్రకృతి'. కొంచెం తక్కువది. ఎనిమిదింటి కలయికగా ఉంటుంది. ఏవా ఎనిమిది? అంటే,

**"భూమిః, ఆపః, అనలః, వాయుః, ఖం, మనః**
**బుద్ధిః ఏవ చ**
**అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిః అష్టధా**
**అపరేయం"**

పంచభూతాలు అయిదు, ఆరవది మనస్సు, ఏడవది బుద్ధి, వీటన్నిటికీ మూల రూపంగా ఉండే బీజరూపమైనది అహం తత్త్వం అని ఒకటుంటుంది. ఇది ఎనిమిదవది. దీనిని 'అహం' తత్త్వం అని అంటారు. అహంకారం అని కూడా అంటారు. అహంకారం చాలా రకాలుగా ఉంటుంది. నేనింతవాడిని ఇలాంటివాడినని అనుకొనే అహంకారం ఒకటి. నేను నల్లగా ఉన్నాను, నేను లావుగా ఉన్నాను అంటూ శరీరానికి ఉండే ఆకృతివిశేషాలని లోపల ఉండే మనకి ఆపాదించుకుంటూ ఉంటాము జీవులమైన మనమంతా. నా శరీరం అంటాము కదా! నిజానికి శరీరంలో మనం ఉన్నామే తప్ప శరీరమే మనం కాదు కదా! మనం వేరు, మనం ఉన్న శరీరం వేరే. ఇలా శరీరమే నేనిపించడం మరో 'అహంకారం' అన్నమాట.

మనం చూస్తున్న ప్రకృతి అంతా ఒక వృక్షం లాంటిది అనుకుందాం. ఇన్ని కొమ్మలు, ఊడలు, పూలు కాయలుతో విస్తరించి ఉంటుంది. వృక్షానికి ముందుదశ ఒక చిన్న మొక్క. దానికంటె ముందు దశ మొలక. దానికంటె ముందు దశ విత్తనం కదా! ఆ చిన్ని విత్తనం మొలకెత్తి మొక్కగా మారి పెరుగుతూ మహావృక్షమౌతోంది. అంటే ఈ మహావృక్షానికి కారణదశ విత్తనం కదా! అలానే ఈనాడిన్ని ఆకృతులతో, రకరకాలుగా విస్తరించియున్న ఈ ప్రకృతి అంతటికీ కారణదశ, బీజదశవంటిది **అహం** తత్త్వము. ఇందులోంచి ఏర్పడ్డవే బుద్ధి, మనస్సు, పంచభూతాలు. మొత్తం ఈ ఎనిమిది పదార్థాలతో ఏర్పడినదే అపరా ప్రకృతి. **'ఇతస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం జీవభూతాం'** వీటన్నింటికి వేరైనది **జీవుడు** అనే ప్రకృతి. ఒకే పరిమాణముకలిగి ఉంటారు జీవులంతా. ఇది పరాప్రకృతి అంటారు. అది దేనికి ఉపయోగపడుతుంది అంటే? అపరాప్రకృతితో శరీరాలు ఏర్పడుతూ ఉంటాయి. ఈ పరాప్రకృతి దాంట్లో చేరి ఉంటే అవి పనిచేస్తుంటాయి. ఇలా అచేతన శరీరాలలో చేరి చేతనాలు పనిచేస్తుంటాయి అని చెప్పాడు భగవంతుడు.

విన్న అర్జునుడు మరి నువ్వు చేసే దేమిటి? అని ప్రశ్నించాడు. **'మే ప్రకృతిః'** అంటూ అవి రెండూ నా ప్రకృతులు కనుక చేతనాచేతనాలు రెండూ నేను చెప్పినట్లే పనిచేస్తాయి. అంటే జీవుడూ, జీవుని జ్ఞానమూ నేను చెప్పినట్లే ప్రవర్తిస్తారు. వస్తువులూ, వస్తువులోని గుణాలూ నేను చెప్పినట్లే ప్రవర్తిస్తాయి. కనుక ఓ అర్జునా! నా మీద నమ్మకమున్నా లేకున్నా నువ్వు ప్రకృతిని వశపరచుకోవాలంటే నన్ను అడుగు, ఆ ప్రకృతి నీ మాటవినేటట్లు, నీఅధీనంలోకి వచ్చేటట్లు నేను చేస్తాను. ఆస్తికుడా, నాస్తికుడా అన్న ప్రశ్న లేదు. ప్రకృతి అధీనం కావాలనుకున్నవాడు ఎవడైనాసరే ప్రకృతికి యజమాని అయిన భగవంతుడ్ని ప్రార్థించాల్సిందే.

మాయదారి ప్రకృతి మాధవుడికొక్కడికే అధీనం! మరొకరికెవ్వరికీ లొంగదు. ఇంకెవరి మాటా వినదు అది. ఇదే చెప్పాడు స్వామి ఈ శ్లోకంలో.





**దైవీ హ్యేషా** - ఈ ప్రకృతి అంతా దైవీ, విచిత్రమైనది, ఎవరికీ అర్థం కానిది. గుణమయీ - సత్త్వరజస్తమస్సులు మూడింటినీ తన స్వభావంగా కలిగినది **మమ** - ఇది నాది. **మాయా** -ఇది చేసే పనులు ఎలా ఉంటాయో చెప్పలేని, ఆశ్చర్యకరమైన పనులు చేయగలిగినది. **దురత్యయా** - ఎవరికీ తమంతతాము దాటశక్యంకాని ప్రభావం కలది. **మామేవ** - నా ఆధీనంలోనే ఈ ప్రకృతి ఉంటుంది కనుక నన్నే,యే - ఎవరైతే, **ప్రపద్యంతే** -ఆశ్రయిస్తారో, **తే** - అలాంటివారు మాత్రమే, **మాయాం ఏతాం** - ఈ విచిత్ర ప్రకృతిని, **తరంతి** - దాటతారు అని ఘంటా పథంగ చెప్తోంది భగవద్గీత.

అందుకే కర్మబంధం తొలగాలన్నా మాధవుని ఆశ్రయించక తప్పదు. ప్రకృతి నీకు స్వాధీనం కావాలన్నా మాధవుని శరణాగతి చేయక తప్పదు. ప్రకృతిని నీవు నీ ఇష్టం వచ్చినట్లు ఉపయోగించుకోవాలన్నా, అందులోంచి కలిగే లాభాలు పొందాలన్నా మాధవుని నీవు ఆశ్రయించక తప్పదు. అందుకే మనం చేయదలచుకున్న కార్యానికి కావాల్సినట్లుగా మన శరీరాన్ని, మన ఇంద్రియాలను, మన మనసునీ అనుకూలంగా చేసుకుంటూ ముందుకు సాగడానికి చేయవలిసిన కృషి **'మాధవుని ఆశ్రయించడమే'**.

అందుకే స్వామి, మన అధీనంలో కాక తన అధీనంలో ఉన్న ప్రకృతికి మాయ అని పేరు పెట్టాడు. **మాయ** అంటే లోకంలో ఇంద్రజాలం అని అర్థం. లేనిది ఉన్నట్లుగా చూపించడం అనుకుంటారు. కానీ, మాయ, ఇంద్రజాలం అని రెండు పదాలు. అందులో **మాయ** అంటే ఒక వస్తువుని మరొక వస్తువుగా మార్చి చూపించడం. 'ఇంద్రజాలం' అంటే ఒక వస్తువుని చూడగానే మరొక వస్తువుగా భావన కలిగేటట్టు చేయడం. కొంచెం తేడా ఉందన్నమాట!

ఈ ప్రకృతిలో ఒక వస్తువు మరొక వస్తువుగా మారుతోందంటే మనం చెబితే కాదు, దానంతటదీ కాదు, మాధవుడు చెబితేనే! అందుకే మనం మాధవుడిని శరణాగతి చేద్దాం. ఆయన్ని మనం మనసులో ధరిద్దాం! మనము, మన చుట్టూ ఉండే ప్రపంచమూ ఆయనది అని విశ్వసిద్దాం. ఆయన వెంట నడిచే ప్రయత్నం చేద్దాం! మనకుండేటటువంటి కర్మబంధాన్ని ఆరకంగా మనం తొలగించుకొనే ప్రయత్నం చేద్దాం! భగవద్బంధుత్వాన్ని గుర్తించి ప్రేమాదరాలతో అందరమూ సహజీవనం సాగిద్దాం!!

22వ వారం

## కావలసినవన్నికోరుకో-తగినవన్నీఅందిస్తా!

**చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినో ర్జున।**
**ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ!** **7అ॥ - 16శ్లో॥**

మనిషికి కోరికలు చాలా ఉంటాయి. ఆకోరికలే మనిషిని తోటివారిని నిందించేట్టు లేదా హింసించేట్టు, అనేక సందర్భాలలో వారిని నిర్మూలించేటట్టు కూడా చేస్తూ ఉంటాయి. మనిషిలో ఉండే అత్యాశే తనతోటి ప్రాణికోటిని ఎన్నో రకాలుగా కలుషితం చేయడానికి కారణమవుతోంది. ఆహారం అతిగా పెంచాలి అనో, కొత్త కొత్తవి తయారుచేయాలనో మనిషి సాగించే ప్రయత్నాలు ప్రకృతిని పాడు చేస్తున్నాయి. నిజానికి భూమిమీద ఆహారపు కొరత ఉందా? ఉందో లేదో మనకీ తెలియదు. పట్టెడన్నం కోసం పరితపించే పామరులనీ మనం చూస్తున్నాం. బస్తాలు బస్తాలు, టన్నులు టన్నులు ఆహారధాన్యాల్ని పట్టుకెళ్ళి సాగరంపాలుచేసే దేశాల్నీ మనం చూస్తున్నాం.

ఆకలితో అలమటించే వ్యక్తులున్న మన దేశంలో కూడా ఎంతెంతో ఆహారపదార్థాల్ని వ్యర్థం చేయడం మనం చూస్తున్నాం. నిజానికి కొరత లేకున్నా అత్యాశతో మనిషి ప్రకృతిని దుర్వినియోగ పరుస్తున్నాడు. ఏమైనా మనిషి ఆలోచనా ధోరణి మారాలి తను చేసే కార్యాలు తన తోటి ప్రాణికోటిని, ప్రకృతినీ హింసించని రీతిలో సాగాలి. తద్వారా తనను తాను ఆత్మ వినాశనము చేసుకోని రీతిలో అవి సాగాలని మన గీతాజ్యోతి ఆకాంక్ష.

ఇంతకీ కోరికలు ఉండకూడదా? ఉండచ్చు. సంపదలు పెంచుకోకూడదా? పెంచుకోవచ్చు. స్వార్థము, ఆశ అనేవి తప్పా? కానేకావు. ఆహారధాన్యాలు ఎక్కువగా పండించద్దా? పండించవచ్చు. అయితే అవి మిగతావాటిని నశింపచేస్తూ పెంచుకొనేవి కానంతవరకూ మంచివే. మిగతా వాటికి మంచిని కలిగించేవిగా ఉన్నంతవరకూ మంచివవుతాయి.

కోరికలు ఉండాలి. మంచి కోరికలు కావాలి. మంచి మార్గంలో బతకాలనే ప్రయత్నం సాగాలి. ఈ రకమైన స్వార్థం, ఆశమంచిదే. భగవతుడు దానిని అనుగ్రహిస్తాడా? లేదా? అంటే తప్పక అనుగ్రహిస్తాడు. అయితే మంచికోరు. మంచిగా కోరు. అంటే ఆరోగ్యం కల్గించేవి కోరుకో. ఎవని నుంచి కోరవచ్చునో వానినే కోరు. మిఠాయి తినాలనిపిస్తే బయటవి, మురికివి తినకు - అమ్మని అడిగి తయారు చేయించుకొని తిను. కోరికలు చెడ్డవికావు. మంచివి కోరు. మంచి మార్గంలో పొందాలని కోరితే భగవంతుడు దానిని తప్పక అనుగ్రహిస్తాడు. భగవంతుడు - అందులోనూ, విష్ణువు చాలా పరీక్షలు పెడతాడు. సంపదలు త్వరగా ఇవ్వడు. మిగతా దేవతలు అయితే పరీక్షించరు అడిగినవన్నీ ఇస్తారనే దురభిప్రాయం లోకంలో ఉంది. అసలు భగవంతుడు దగ్గరికి వెళితే కోరికలేమీ కోరకూడదని, మోక్షం కోరాలని మరొక దురభిప్రాయం కూడా ఉంది లోకంలో. నారాయణుడివద్దకి నిష్కామంగా వెళ్ళాలిట, కానీ మాకు కోరికలున్నాయి కనుక, ఇతర దేవతలనే ఆశ్రయిస్తామంటూ భగవంతుడి



దగ్గరికి వెళ్ళడం మానేస్తున్నారు. ఇది తప్పు అభిప్రాయం.

దామోదరుడు, లోకంలో ఏ కోరిక ఉన్నా దానిని తీరుస్తాడు. ఇది అల్పమైనదా, భౌతికమైనదా, లౌకికమైనదా అని తాను చూడడు. నీకు ఏదేది కావాలో అవన్నీ తీర్చడమే భగవంతుడు తన లక్ష్యంగా పెట్టుకొన్నాడు. అయితే అలా నీవు కోరిన వస్తువు నీకు హాని కల్గిస్తుంద న్నప్పుడు మాత్రము భగవంతుడు తాను ఆలోచిస్తాడు. అది నీకు హాని కలిగించని వస్తువైనపుడు, అది నీవు ఎట్లాంటిది కోరినా తను నీకందిస్తాడు. మనకి అలాంటి దృష్టాంతాలు కన్పిస్తాయి. చరిత్రలోనే కాదు మన మన జీవితాలలో కూడా. అలా మనకి కావలసిన వన్ని అందిస్తానని తాను ప్రతిజ్ఞ చేసాడు.

అందుకనే మంచికోరికలు కలగనివ్వండి. బాగా తీరాలని కోరుకొందాం. ఇస్తానన్న స్వామిమాటని విశ్వసిద్దాం. ధైర్యంతో విశ్వాసంతో కావలసినవన్ని ఆయననే ఆశ్రయించి ప్రార్థిద్దాం. తమ దగ్గరకి వచ్చి ఇది కావాలని అడిగిన పిల్లవాని కోరికని తీర్చాలని తల్లితండ్రులెంత ఆతృత పడతారో లోకపిత అయిన భగవంతుడు కూడా మన విషయంలో ప్రేమతో అంత తపనా పడతాడు. **మే జీవభూతాం ప్రకృతిః** అంటూ ఈ విషయాన్నే ఆయన చెప్పాడు భగవద్గీతలో.

**అహం బీజ ప్రదః పితా, పితాహమస్య జగతః** దేవతిర్యక్ మనుష్యాస్థావరాలుగా ఉన్న ఈ జగత్తుకంతటికీ తండ్రి తానేనని స్పష్టం చేసాడు. అలాంటి జగత్పిత దగ్గరికి వెళ్ళి ఏది కావాలంటే అది నువ్వు అడుగు. **ఏది తగునో అది నీకు తప్పక అనుగ్రహిస్తాడు.** ఎంత తగునో అంత వరకు తాను ప్రసాదిస్తాడు. ఇదీ, అదీ అనే ప్రశ్న నీకు అక్కరలేదు. ఏవి కావాలి అంటే అది అడుగు ఏది ఇస్తే దానిని స్వీకరించడానికి మాత్రం సిద్ధంగాఉండు. ఎలా కావాలో అడుగు ఎలా తానిస్తాడో అలా స్వీకరించడానికి సిద్ధంగా ఉండు. 7వ అధ్యాయంలో, 16వ శ్లోకం ఈ విషయం చాలా స్పష్టంగా తెలియజేస్తుంది.

సుకృతులు = మంచి పనులు చేసే వారు, దుష్కృతులు = చెడుపనులు చేసే వారు అని లోకంలోని జనులని స్థూలంగా రెండు రకాలుగా విడదీసాడు పరమాత్మ. మంచివాడంటే ఏ తల్లి దండ్రులకి పుట్టారో వారిని ఆశ్రయించి తన కోరికని తెలిపి, పొందే ప్రయత్నం చేసేవాడు. తల్లిని మరచి, తండ్రిని మరచి, కుటుంబాన్ని మరచి వారిని కాదని బయటికిపోయి తనకి కోరిక కలిగినచోటల్లా తిరిగేవారెవరో వారే చెడ్డవారు.

'ఓ అర్జునా! నన్నుకోరి నా నుంచి పొందగోరేవారు సుకృతులు' అన్నాడు శ్రీకృష్ణుడు. అలా నా నుంచే పొందగోరేవారు నాలుగు రకాలు. 1. ఆర్తః, 2. జిజ్ఞాసుః, 3. అర్థార్థీ, 4. జ్ఞానీ.

**ఆర్తః** అంటే ఒకనాడు సంపదవైభవా లుండీ దురదృష్ట వశాన పోగొట్టుకుని తిరిగి పొందాలని కోరుకొనేవాడు' అని అర్థము. **అర్థార్థీ** తనదగ్గర లేని కొత్త సంపద వైభవాలు కోరుకొనేవాడు అని అర్థం.

వీరిద్దరూ ఒక లాంటి వారే. ఇలాంటి లౌకిక సంపదలు కాక జ్ఞాన స్వరూపమైన ఆత్మని దర్శింపగోరువాడు. **జిజ్ఞాసువు** అంటే ఆత్మసాక్షాత్కార కాముడు అని అర్థం. జ్ఞానము కల ఆత్మకూడా నా వస్తువే కనుక, అది నీకు స్వయంగా ప్రకాశించాలన్నా నేను అనుగ్రహిస్తేనే అవుతుంది, తప్ప, నీ సాధన వలన కాదు. కనుక **జిజ్ఞాసువు** అయిన వ్యక్తి కూడా నన్నే ఆశ్రయించాలి. ఇక 4. **జ్ఞానీ** అంటే జ్ఞానము పూర్తిగా కలవాడు. జ్ఞానం

పూర్తిగా లభిస్తే ఆత్మ స్వరూపం తెలుస్తుంది. ఆత్మస్వరూపం తెలిస్తే దానికి వెనుక నియంతగా ఉన్న పరమాత్మ శ్రీకృష్ణుడి స్వరూపం తెలుస్తుంది. అలా జగత్కారణమై సర్వనియంతయై, ఆత్మలోపల ఉండి నడిపే శ్రీకృష్ణుని ఆధీనవే జీవుడని తెలియడమే జ్ఞాన మంటే. తద్విరుద్ధమైనవన్నీ అజ్ఞానమనే పిలవబడతాయని పరాశరాది ఋషులంతా నిర్ణయం చేసారు. అంచేత జ్ఞానం కలవాడూ అంటే, పరమాత్మకి దాసుడుగా ఉన్నవాడు అనే అర్థం. 'ఓ అర్జునా! నీ స్వరూపం తెలిసి నిరతిశయ ఆనందాన్ని పొందాలీ అన్నా, ఆనంద స్వరూపుడైన నేనే ఇస్తాను. అందుచేత ప్రపంచకాముడైనా, ఐశ్వర్య కాముడైనా ఆత్మ కాముడైనా, పరమాత్మ కాముడైనా నన్నే ఆశ్రయించాలి అవన్నీ నేనిస్తాను సంశయించక అడుగు' అంటూ పరమాత్మ బ్లాంక్ చెక్ ఇచ్చేస్తున్నాడు. తీసుకోవడం మన బాధ్యత. ఏదైనా కోరండి స్వామినుంచి పొందండి. తగినదేదో అది తప్పని సరిగా తానిస్తాడు. అందుకే ఆంగ్లంలో అంటారు. God fullfills all your needs but not your greeds అవసరాలన్నీ భగవంతుడు తప్పక తీరుస్తాడు. కానీ, అత్యాశలను కాదు. ఆశలన్నీ ఆలోచించి తగిన రీతిలో తప్పక నెరవేరుస్తాడు. కనుక, ఏమి కావాలన్నా స్వామిని అడుగు. ఆయన అనుగ్రహించినవన్నీ ఆనందంతో స్వీకరించు. ఈ వారం శ్లోకం మనకి ఈ విషయాన్ని స్పష్టపరుస్తోంది. మరి మనమూ లోకానికీ, మనకీ శ్రేయస్సునిచ్చే ఉత్తమ పురుషార్థాలను కోరుకునే ప్రయత్నం చేద్దాం!!!

## 23వ వారం

# మరుజన్మలు లేకుండా చేయగలవాడు మాధవుడొక్కడే

**మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్।**
**నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః॥ 8అ॥ - 23శ్లో॥**

ఆలోచన కలిగిన ప్రతి మానవుడూ 'ఈ జన్మ పరంపర ఇలా కొనసాగవలసిందేనా! తిరిగి మళ్ళీ మనం ఈ మానవలోకంలో పుట్టవలసిందేనా! ఇందులోకి రాకుండా ఉండగలిగే శాశ్వతమైన సుఖాన్ని పొందగలిగితే బాగుండును.' అని ఆలోచిస్తాడు. ప్రపంచంలో ఉండే ఆధ్యాత్మిక వేత్తలందరూ ఇప్పుడు, మరణం తర్వాత జీవనం ఏది? ఈ జీవనానికి తదుపరి జీవనం ఎట్లా ఉంటుందో? మనకొక శాశ్వతమైన స్థానం ఉంటే బావుండును కదా! అనే ఆలోచనలో పడ్డారు. దీనిని లక్షించే కాబోలు కొందరు మత సిద్ధాంతులు ఈ జీవితమే చివరి జీవితమని, ఇదే మొదటి జీవితం కూడ అని ఇది శవమై పోయిన తర్వాత ఈ జీవుడ్ని అటు స్వర్గానికో ఇటు నరకానికో మాత్రమే పంపిస్తారు. అది శాశ్వతం సుమా! అంటూ ఆరంభించారు ప్రచారాన్ని. కాని ఏదైనా మనం చూడని వాస్తవాలను చెప్పాల్సి వచ్చినప్పుడు దానికి ఒక ప్రమాణం మనకి కావాలి. అది తిరుగులేని ప్రమాణం కావాలి ప్రశ్నించటానికి వీలుకాని ప్రమాణం కావాలి. అట్లాంటి ప్రమాణం ఏది? వేదం ఒక్కటే అట్లాంటిది కనిపిస్తుంది. ఆ వేదంలో ఉండే సారాన్ని మనకి సులభంగా అందించిన మహనీయుడు శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో. అందుకే





అందులో ఉండే వాస్తవాన్ని మననం చేస్తూ మన యొక్క గమ్యాన్ని, మన యొక్క మార్గాన్ని నిర్ణయించుకోవాలి అనేది జ్ఞానుల యొక్క అభిమతం. ఒకనాడు మనం స్వర్గానికి చేరితే ఆ స్వర్గం శాశ్వతంగా ఉంటుందా అనే ప్రశ్నకి భగవద్గీత 8వ అధ్యాయం సమాధానం చెపుతుంది.

అక్కడికి వెళ్ళటం అనేది ఒక పుణ్యం వలన వెళతారు. ఆ పుణ్య అనుభవం అనేది చాలా వేగంగా ఉంటుంది. ఆర్జించిన పుణ్యం ఎంత వరకు ఉంటే అంతవరకే ఉండనిస్తారక్కడ. అది తీరిన వెంటనే అక్కడి నుండి మళ్ళీ. మృత్యు సమమైన ఈ లోకంలోకి రాక తప్పదు. ఇక్కడకు వచ్చిన తర్వాత గతంలో చేసిన కర్మ ఏదేహంలోకి వాడిని వెళ్ళటానికి సహాయం చేస్తే అలా పుడతాడు. అది మళ్ళీ మనిషో, జంతువో, క్రిమో, కీటకమో, రాయో, చెట్టో, పుట్టో, గట్టో ఏమవుతాడో వాడికి తెలియదే. అయినా తప్పదు. ఒకవేళ నరకానికే పోతే అది కూడా శాశ్వతం కాదు.

నరకానికి వెళ్ళినా మళ్ళీ ఆ నరకంలో అనుభవించాల్సిన కర్మలన్నీ అనుభవమై పోయిన తర్వాత మళ్ళీ మర్త్యలోకం రాక తప్పదు. స్వర్గమైనా నరకమైనా రెండూ శాశ్వతం కావు అనేదే శాస్త్ర నిర్ణయం.

మరి ఏది శాశ్వతము? మనం ఎక్కడికి వెళితే, అక్కడ నుంచి తిరిగి రానక్కరలేని స్థితిలో ఉంటాము? ఆ వెళ్ళిన చోట కూడా దుఃఖాలు పోయి ఆనందించ గలుగుతాం? అలాంటిది ఒక లోకమంటూ ఉందా? ఒక స్థానమంటూ ఉంటే అది మనకు లభించడమనేది ఉందా? అనే జిజ్ఞాస మనిషికి ఏర్పడ్డప్పుడు శ్రీకృష్ణుడు 8వ అధ్యాయంలో సమాధానాన్ని చెప్పాడు. ఆ సమాధానం మనకొక భరోసాను కలిగించింది. మన గీతాజ్యోతి ఉద్యమంలో ముందుకు సాగేటట్టుగా భగవత్ సేవలో అగ్రేసరులుగా ఉండేటట్టుగా తీర్చిదిద్దింది. ఆ శ్లోకాన్ని 23వ వారంగ మనం అనుసంధానం చేద్దాం. 8వ అధ్యాయంలో 15 శ్లోకం.

ఇందులో స్వామి మనకోసం ప్రతిజ్ఞ చేస్తున్నాడు. హే అర్జునా! నన్ను కోరుకునే వ్యక్తులు 4 రకాలుగా ఉంటారు అని నేను చెప్పానే కొంతమంది పోయిన సంపదను కోరుకునేవారు. కొంతమంది కొత్త సంపదను కోరుకునేవారు. కొంతమంది ఆత్మ దర్శనాన్ని కోరుకునేవారు కొందరైతే నన్నే కోరుకునేవారు ఇన్ని రకాలు వాళ్ళకి కావలసినవి నేనే ఇస్తాను. ఇచ్చాను కూడా. మనకి చరిత్ర చూస్తే తెలుస్తుంది.

ధృవుడు, సుగ్రీవుడు విభీషణుడు, ద్రౌపది ఎవరెవరు ఏదభిలషిస్తే వారి వారికవన్నీ ఇచ్చాడు. అవివారు పొంది అనుభవించి 'ఇకచాలు కృష్ణామాకివి' అనేటంతవరకు అనుభవింపచేస్తాడు. వారు మాకు చాలు ఇవి, ఇక వద్దు, నువ్వేకావాలి అనడిగితే తనని కూడా తానిస్తాడు.

లోకంలో మిగిలిన దేవతలు ఇచ్చేవైతే. కొంతకాలం అనుభవించిన తర్వాత తరిగి పోతాయి. కనుక మిగతా వారిచ్చేవి నశించే సంపదలు. కాని భగవానుడిచ్చేది నశించని సంపదను. ప్రకృతి సహజమైన స్వభావం 'మార్పు' కనుక సంపదలైనా నిరంతరం మార్పు చెందుతూంటాయి. నీకు మార్పు చెందే ఆ సంపదలే కావాలని కోరికున్నా తానిస్తాడు. మారనటువంటి **ఆత్మ** లేక **పరమాత్మ** సాక్షాత్కారం కావాలంటే, అదీ ఇస్తాడు. ఆత్మని కాని తనని కాని కోరుకున్నట్లైతే అది మారని, శాశ్వత సంపదని, అలాంటిది కూడా తానివ్వగలను అని చెప్పిన శ్లోకమిది.

**దుఃఖాలయం అశాశ్వతం** ఈ ప్రకృతిలో పర్మమాత్మకంటే వేరైనది ఏదైనప్పటికి కూడా 'దుఃఖ ఆలయం' అంటే దుఃఖాలని నిరంతరం కలిగి వాటినే ఇస్తూంది. కారణం, మారిపోతూ ఉంటుంది కనుక. ఒక నాడు ఒక వస్తువుని ఒక ఆకృతిలో విశేషంగా చూసినపుడు దానియందు మనకు ప్రీతి ఏర్పడింది. అలానే ఉంటే బావుండనిపిస్తుంది. కాని దాని లక్షణాన్ని బట్టి అది మారిపోతూ ఉంటుంది. అది మారిపోగానే 'అయ్యయ్యో మారిపోయిందే' అని దుఃఖ మేర్పడు తుంది. ఏ వస్తువైనా అంతే. అది పదవి కావచ్చు, సంపద కావచ్చు, మరేదైనా కావచ్చు. కనుక **'దుఃఖాలయం.....'** పైగా 'అశాశ్వతం'. అది ఎప్పుడూ ఒకలాఉండదు కదా! ఆ వస్తువుమీద అనుభవమూ అంతే. కర్మను నియంత్రించే నన్నాశ్రయిస్తే మాత్రమే ఈ జన్మదుఃఖ పరంపరను **'పునః నాప్నువన్తి'.** ఇంత వరకెన్నో జన్మలు పొందాడు. మళ్ళీ మళ్ళీ ఇక పొందడమనేది 'మాముపేత్య' నన్ను పొందిన తర్వాత ఉండదు. 'ఎవరికి?' అది కోరుకున్న వాళ్ళకు. 'ఎవరు కోరుకుంటారు?' **మహాత్మానః 'మహాత్మానః నాప్నువన్తి'** ఓహ్! వాళ్ళెంత గొప్పవాళ్ళు. ఐతే గొప్పతనం అనేది వాళ్ళదా? తనను కోరుకుంటున్నారు కనుక భగవంతుడు వాళ్ళని పొగడటం లేదు. మరి?

ఆత్మా అంటే మనస్సు. వాళ్ళయొక్క మనస్సు చాలా ఉదాత్తమైనది. మనస్సుకి ఉదాత్తత ఏమిటి అంటే వాడు ఏది శాశ్వతంగా ఉండదగునో దాన్ని గుర్తించి, ఏది దుఃఖము లకు దూరవెూ దాన్ని తెలుసుకొని కోరుతున్నాడు.

ఒకసారి ఒక రాజుగారి దగ్గరికి ఒక సన్న్యాసి వచ్చాడట. చాలా గొప్పవాడు అని లోకమంతా అంటోంది. రాజుకూడా 'ఆహా! మహానుభావా! నువ్వెంత గొప్ప వాడివయ్యా! ఎంత త్యాగివయ్యా!' అన్నాడు. 'ఎందుకయ్యా?' అనడిగారు త్యాగి. 'లేకపోతే ఏమిటి, చక్కటి ప్రాపంచిక సుఖాలు, మంచి రాజ్యం, సంపదలు, ఇతర మైన భోగాలు ఇవన్నీ వదులుకొని త్యాగివ య్యావే! భగవన్మార్గంలో ప్రయాణిస్తున్నావే! ఎంత గొప్పవాడివయ్యా!, నిజంగా నీలాంటి త్యాగి ప్రపంచంలో మరిలేడు' అన్నారట రాజు. త్యాగి అన్నాడట 'రాజా! నేను కాదు గొప్పత్యాగిని నువ్వే గొప్ప త్యాగివయ్యా' అని. రాజుగారికి ఆశ్చర్యంవేసింది. 'అదేమిటయ్యా! నన్ను త్యాగి అంటావు. నేను హాయిగా రాజ్యసుఖాలు అనుభవిస్తుంటే', అని అడిగాడు. దానికి త్యాగి రాజుగారితో ఇలా అన్నాడట. 'అవును కదా మహానుభావా! సాధారణంగా లోకంలో విలువైనవి వదులు కున్నవాడిని త్యాగి అని అంటారు. విలువైన వాడు భగవంతుడు. నీవు భగవంతుడు నశించని గొప్ప వాడని తెలిసి, ఈ ప్రాపంచిక సుఖాలన్నీ నశించేవని తెలిసికూడా అతన్ని త్యాగం చేసి ప్రాపంచిక సుఖాలు పట్టుకొని ప్రాకులాడు తున్నావే! నేను త్యాగినా! నువ్వుత్యాగివా? విలువ లేనివి నేనొదిలాను. విలువ కలిగింది నువ్వొదిలావు. ప్రాపంచిక సుఖాలు విలువలేనివని తెలిసి నేనొదిలాను. భగవంతుడు విలువైనవాడని తెలిసి వదిలావు. అలాంటి నీవు గొప్పత్యాగివికదా! నీకో నమస్కారం' అన్నాడట ఆ మహానుభావుడు. గొప్ప మనస్సు కలిగినవాడెవ్వరు అనంటే, ఎవడైతే అతి విలువైన వస్తువు భగవంతుడని గుర్తించి ఆ భగవంతుడి కోసం మిగతావన్ని వదలగలుగుతాడో వాడు 'మహాత్మా'.

8వ అధ్యాయంలో భగవంతునే ఆశ్రయించిన వాళ్ళనుగూర్చి తానుచెప్తున్నాడు.





వాళ్ళు **'మాముపేత్య** కనుక **మహాత్మానః'** అయ్యారయ్యా, **మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతం నాప్నువంతి మహాత్మానః.** అయితే వారేం పొందుతారు **'సంసిద్ధిం పరమాంగతాః'** సిద్ధిపొందాలని ప్రతివాడు కోరుకుంటారు. కాని ఆ సిద్ధి శాశ్వతంగా ఉండగలిగేట్టుగా పొందగలిగిన వాళ్ళే **పరమాం సంసిద్ధిం గతాః.** పొందవలసిన శ్రేయస్సులలో అత్యుత్తమ మైనది భగవదను భవము. ఆత్మ స్వరూపాన్ని సాక్షాత్కరించు కున్నవాడూ దాన్ని శాశ్వతంగా అనుభవిస్తాడు. పరమాత్మ స్వరూపాన్ని సాక్షాత్మరించుకున్న వాడైనా దాన్ని శాశ్వతంగా అనుభవించ గల్గుతాడు. కొంచెం తేడా ఉంది ఈ ఇద్దరికీ. ఆత్మ అనేది అణుప్రాయం. కేవల ఆత్మ వల్లకలిగే ఆనందముగూడ అణుప్రాయమే. భగవదనుభవ మనేది అదొక పెద్ద సాగరము అనుకొంటే, ఆత్మానుభవము అనేది అందులో ఉండే ఒక చిన్న నీటి బిందువు లాంటిది. అంటే ఇది అల్ప సుఖం అంటారు. ఆళ్వార్లు తమ యొక్క ప్రబంధాల్లో. **తెరివరియ అళవిల్లా శిత్తిన్బం** అంటారు, ఆత్మానందాన్ని గూర్చి వారు ప్రస్తావన చేస్తూ. అదీ ఆనందంలాంటిదే కాని అది అల్పానందం. భగవదానందం మహదానందం. భగవంతుని చేరడమంటే హద్దులేని ఆనందమని వేదము చెపుతోంది. **ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్** ఆనందరసం ఆయనే. **రసో వై సః రసగ్గ్హేవాయం లబ్ధ్వా నందీ భవతి** అంటోంది.

భగవంతుణ్ణి రస స్వరూపు డంటోంది. రసస్వరూప సాక్షాత్కార మేర్పడితే తప్ప, ఈ జీవుడికి ఆనందం అనేది సహజముగ ఏర్పడదు. తదితరముగ కలిగే వన్నీకూడా ఆనందం వంటివే తప్ప ఆనంద ములు కావు. ఏనాడైతే ఆ రసస్వరూప సాక్షాత్కర మేర్పడుతుందో ఆనాటి నుండి **'ఆనందీ భవతి'.** సహజమైన ఆనందం కల్గిన వాడవు తాడు. అని వేదం చెపుతోంది. అందుకే నిత్యానందము ఏర్పడి అది శాశ్వతంగా ఉండాలని కోరేవాడెవరైనా మాధవుణ్ణే ప్రార్థించాలి. జన్మరాహిత్యమును ప్రసాదించ గలిగే యోగ్యత కల్గినవాడు కేవలం మాధువు డొక్కడే. మరుజన్మలు లేకుండా చేయగల్గిన వాడు ఆయనొక్కడే. అందుకే ఈ జన్మను గూర్చిన ఆలోచన మరణమును గూర్చిన స్మరణ కల్గినవాడెవ్వడైనా తిరిగి ఇలాంటి ఈ క్షుద్రమైన పుట్టుట గిట్టుట అనే చక్రంలోకి రావద్దు అనును కుంటే శరణాగతి చెయ్యాల్సింది ఆశ్రయించాల్సింది ఆ స్వామి శ్రీకృష్ణుణ్ణి - మాధవుణ్ని అనేది ఈ 8వ అధ్యాయం ఈ వారం శ్లోకం స్పష్టపరుస్తుంది మనము ఆ భగవంతుణ్ణి నిష్కపటంగ ఆశ్రయించాలి.

## 24వ వారం

## పక్షపాత రహితుడు పరమాత్మ పాదదాసులపాలిట పర్యంకము

**సమో హం సర్వభూతేషు న మే ద్వేష్యో స్తి న ప్రియః।**
**యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్॥ 9అ॥-29శ్లో॥**

సమాజపు సౌఖ్యాన్ని సామాజికులు ఐక్యాన్ని కాంక్షిస్తూ ఏర్పడ్డ గీతాజ్యోతి24వ వారపు శ్లోకంగా 9వ అధ్యాయంలోని 29వ శ్లోకాన్ని మనం స్మరించుకో బోతున్నాం.

మానవులకి భగవంతుడు నిరంతరము తోడుంటాడు. వారు చేసే ప్రతి పనికి కేవలం తోడై ఉండడమేకాదు, వారిని తాను అత్యంతప్రేమ పాత్రులుగా భావిస్తాడు. నిజానికి భగవంతుడికి ఎవరిమీద ఎటువంటి పక్షపాతమూ ఉండదు. జీవులందరిని భగంతుడు తన సంతానం అని ఆదరిస్తాడు. లోకంలో కొంతమంది ఆ భగవంతుణ్ణి గుర్తించక ఆ భగవంతుడికి హాని చేద్దామని ప్రయత్నించి తామే తద్వారా నష్టాన్ని కొనితెచ్చుకుంటూ ఉంటారు. 9వ అధ్యాయపు, 9వ శ్లోకం ఈ విషయాన్ని స్పష్టపరుస్తుంది.

పక్షపాత రహితుడైన పరమాత్మ తానే పాద దాసులపాలిటి పర్యంకముకాగలడు. లోకంలో కొందరు 'అసురు'లని కొందరిని 'దేవతలు' అని అనడం మనం గమనిస్తాం. ఇవి వారివారి యొక్క స్వభావాన్ని బట్టి పెట్టిన పేర్లే తప్ప భగవంతుడికి ఎవరి యందూ ఏ విధమైన పక్షపాతమూ ఉండనే ఉండదు. **సమోహం సర్వభూతేషు** కేవలం మనుషుల విషయంలోనే కాదు. సమస్త భూతాలు నాకు సమానమే. భూతము అంటే ఏ వస్తువైనా కావచ్చు. దేవతలూ కావచ్చు. అయితే మనకు - ఎప్పుడూ దేవతలకే దేవుడు సహాయం చేస్తున్నట్లు, అసురులను ఎప్పుడూ చీల్చి చెండాడుతున్నట్లు కనిపిస్తుందే? భగవంతునికి పక్షపాతం లేదా? అని అనిపించ వచ్చు. ఐతే ఇక్కడ పదాల్లో ఉండే తేడాను గమనించాలి. లోకంలో రకరకాల జాతులకు చెందిన జీవరాసులుంటాయే అట్లానే రాక్షసజాతికూడ ఒక జాతి. దేవజాతికూడ ఒక జాతి. ఇపుడు దేవ, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, పిశాచ, పన్నగ ఇవన్నీకూడా రకరకాల యోనులు. మనుషుల్లో తెల్ల, పొడుగు, పొట్టి మనుషులు బంగారురంగు, నల్లటి మనుషులు ఉన్నట్టుగానే, రకరకాల జాతులు మనకు కనిపిస్తున్నట్టుగానే, దేవ యోనుల్లో కూడా రకరకాల యోనులకు చెందిన జీవరాసులు ఉన్నాయి. వాటిని దేవ, గంధర్వ, యక్ష, కిన్నర, కింపురుష ఇత్యాది పేర్లతో పిలుస్తారు. అయితే రాక్షసులంటే భగవంతుడికి కోపంలేదు. దేవతలంటే భగవంతుడికి ప్రత్యేకమైన ప్రేమలేదు. అందరి యందు సమబుద్ధి కలిగి ఉంటానని ఈ శ్లోకంలో భగవంతుడు చెప్పాడు.

రాక్షసులను భగవంతుడెప్పుడూ ద్వేషిస్తాడనో వాళ్ళని సంహరిస్తాడనో అనుకుంటారు చాలమంది. కాని, అది తప్పు. ఎందరో రాక్షసులను భగవంతుడు ప్రేమించాడు. అయితే అసురులను తాను సంహరించే ప్రయత్నం చేశాడు. అసురులు వేరు, రాక్షసులు వేరు. రాక్షస అనేది ఒక జాతి. మానవజాతిలాగే. అది వారిలో ఉండే ఒక స్వభావము. ఆకారానికి మానవుడై ఉండొచ్చు. కాని, తను బ్రతుకుతూ తన బ్రతుకు కోసం ఎదుటివారిని హింసిస్తాడు. అసలు తన బ్రతుకు అనే ఒక ప్రయోజనం లేకపోయినా





ఎదుటివాడి ఉనికిని సహించలేక నశింపచేసే ప్రయత్నం చేస్తాడు. అలాంటి వారిని అసురులు అంటారు. నిష్కారణంగా భగవద్విభూతికి హానికలిగించే వ్యక్తినే '**అసుర**' అనే పేరుతో పిలుస్తారు. వాడికి ఏం కారణం ఉండదు. కాని భగవంతు డంటే పడదు. భగవంతుణ్ణి నిరంతరం ద్వేషిస్తాడు. అలాంటి వాణ్ణే ఆసురం భావమాశ్రితుడు అని భగవంతడు ఏడవ అధ్యాయంలో పేరుపెట్టాడు. ఆయన పేరు పెట్టడమే కాదు పరాశరమహర్షికూడా ఆవిషయం చెప్తాడు. 'విష్ణుభక్తి **పరోదేవః విపరీతః తథాసురః**' సర్వజగత్తుల్లోనూ వ్యాపించి ఈ ప్రపంచమంతటికీ కారణమైన ఆ విష్ణు తత్వాన్ని సేవించేవాడు. దైవీ ప్రకృతి కల్గినవాడు. **విపరీతః తథాసురః** ఎవడైతే ఆ విష్ణువును ద్వేషిస్తాడో వాడిని అసురుడు అంటాం.

ప్రహ్లాదుడి తండ్రి హిరణ్యకశిపు నిష్కారణంగా శ్రీహరిని ద్వేషించాడు. అతడు అసురుడు అయ్యాడు. భగవంతుడు అతడిని సంహరించవలసి వచ్చింది. కారణం, ఒక మంచి మనిషిని హింసించడం ప్రారంభించాడు. మంచి పనులను చేసే సాధు సజ్జనుల నందరిని సంహరించడం ప్రారంభించాడు. కనుక కంసుడొక అసురుడు. భగవంతుడికేదో చేద్దాం అనను కుంటే భగవంతుడుకి పెద్ద కోపమేం లేదు. వాని విషయంలో ఆయనకు భయమూ లేదు.

కాని, ఎవరైతే ఈ ప్రపంచంలో ఉండే ఇతర ప్రాణికోటికి ఈ ప్రకృతికి కూడా హాని కలిగించాలని ప్రయత్నం చేస్తారో అలాంటి వాళ్ళను మాత్రం భగవంతుడు ఒక చూపుచూస్తాడు. అంటే ఈ ప్రకృతి ఈ ఇతర ప్రాణికోటి కూడా వాటి వాటి నియమానికి అవి బతగ్గలిగేట్టుగా నీవు చాతనైతే సహాయం చేయి. లేదా నీ మానాన నీవు బ్రతుకు. వాటికి హాని కలిగించాలని ప్రయత్నం చేస్తే మాత్రం భగవంతుడెప్పుడూ సహించలేడు. అలాంటి వాళ్ళనే 'అసుర' అనే శబ్దంతో వ్యవహరిస్తాడు తప్ప అసుర అనేది ఒక జాతికాదు. నిజానికి దేవతల్లో పుట్టినవాళ్ళలో అసురులున్నారు. రాక్షసుల్లో పుట్టినవాళ్ళూ అసురులున్నారు. రాక్షసుల్లో పుట్టినవాళ్ళూ దేవ ప్రవృత్తి కల్గిన వాళ్ళున్నారు. మనుషుల్లో పుట్టినవాళ్ళలో దేవ ప్రవృత్తి కల్గినవాళ్ళున్నారు. ఇంద్రుడికి సాక్షాత్తు కుమారుడైన జయంతుడు అనేవాడున్నాడు. కాకి వేషంతో సీతమ్మను హింసించాడు. ఒక అమాయకురాలిని హింసించే ప్రవృత్తిని కలిగి ఉండడంచేత 'కాక అసుర' అయ్యాడు.

రావణాసురుడికి సాక్షాత్తు తమ్ముడు విభీషణుడు. కానీ, ఆయనలో ఉండే ప్రవృత్తి రామునికి సహాయం చేయాలి. తద్వారా తన ప్రజలందర్ని కాపాడుకోవాలి. లంకలో ఉండే ప్రజలందర్ని కాపాడుకోవాలి అనే ప్రవృత్తి కలిగియుండడం చేత ఆయన కూడా దైవీ ప్రవృత్తి కలవాడయ్యాడు. రామచంద్రుడు స్వయాన విభీషణుని **'నా సోదరుల్లో నీవు కూడా ఒకడివయ్యా'** అన్నడు. రామునికి సోదరులు ముగ్గురు. కానీ, తనకు సోదరులు నల్గురు అని భావించాడు. విభీషణుడు కూడా తన సోదరుడే అని రామచంద్రుడు ఆయన్ని స్వీకరించాడు. జాతైతే రాక్షసుడు కదా!

మరొక భక్తుడు ప్రహ్లాదుడు, రాక్షస జాతి, కాని ప్రవృత్తి చూస్తే అతనికుండే భక్తి తన గురువుగారైన నారదులవారికి కూడా లేదని చెప్పవచ్చు. అందుకే భక్తుల లిస్టు చెప్పేటప్పుడు మనవాళ్ళు గురువుగారైన నారదుణ్ణి తర్వాత పెట్టి శిష్యుడైన ప్రహ్లాదుణ్ణి ముందుపెట్టారు. **'ప్రహ్లాద నారద పరాశర పుండరీక పరమభాగవతాన్ స్మరామి'** అంటూ చదువుతారు. ప్రహ్లాదుడు అంతగొప్ప వాడయ్యాడన్నమాట. హరినే హృదయాన

నింపుకున్న ప్రహ్లాదుణ్ణి అతని తండ్రి, కొండల మీద నుంచి తోసేస్తే తన హృదయానికి హత్తుకొన్నాడు ప్రహ్లాదుని పరమాత్మ. అతని జాతి రాక్షసజాతి. కాని ప్రవృత్తి దైవీ ప్రవృత్తి. ఇంద్రుడి కొడుకుది జాతి దేవజాతి కానీ, ప్రవృత్తి అసురప్రవృత్తి. ఏంచేస్తాం. మనిషిలో నైనా అంతే. అలాంటి అనురులని భగవంతుడు దండిస్తూ ఉంటాడు. వారివారి హద్దుల్లో వారుండేట్టు చేస్తాడు. తద్వారా ప్రకృతి ప్రాణికోటి సవ్యంగా వాటి పనులవి చేసుకొన గలిగేట్టుగా తను సహకరిస్తాడు. వాళ్ళ యందుకూడా తనకెపుడూ ద్వేష ముండదు. ఎవ్వరియందూ భగవంతునికి ద్వేషముండదు. ఆయనకు ద్వేషము ప్రేమ రెండు లేవు. మంచి చేసేవాడు ప్రకృతిలోంచే మంచి పొందుతాడు. చెడు చేసేవాడు ప్రకృతి లోంచి చెడు పొందుతాడు. వాడు వాడు చేసుకున్నదానికి తగినట్టుగా వాడు పొందు తాడు తప్ప భగవంతుడు ఇది ఇవ్వడం ఇది తొలగించడం అనే రెండూ తను చేయడు. అందుకే భగవంతుణ్ణి ఒక దీవంతో, ఒక పుష్కరిణితోను పోలుస్తుంటారు మన పెద్దలు.

వెలిగించి పెట్టాం దీపాన్ని. చీకట్లో అది మనకిచ్చేకాంతితో ఎన్నో పనులు చేనుకుంటాం. ఎన్నిటినో నవరించుకుంటాం. అందరికీ అలానే ఉపకరిస్తుంది. ఉపకరించా లానుకుని కాదు ఉపకరించేది, దాని వల్ల కలిగే ప్రయోజనాన్ని మంచికి వాడుకుంటు న్నాడు. కాని అదే దీపాన్ని చూసిన కొన్ని మిడతలు, పురుగులు ఆ దీపం చుట్టూ చేరతాయి. తెలియక దీపానికి అడ్డంగా వెడుతున్నాయి కాబోలు అనుకుంటాం. ఒక సారి దీవంమీంచి ఎగురుతుంది. అది కాలుతుంది. దూరంగా పోతుంది కాని ఆగదు. మళ్ళీ దానిమీదికే వస్తుంది. నన్నెందుకు కాల్చాలి గనుక దాన్ని ఆర్పేస్తాననో ఏమిటో మనకు తెలియదు. ఆ దీపం మీదికి తిరిగి తిరిగి, తిరిగి తిరిగి తాను వెళ్ళి చివరికి రెక్కలు కాలి తానే ప్రాణాన్ని కోల్పోతుంది ఆ కీటకం. నిజానికి దీపానికి మనిషి మీద ప్రేమాలేదు, మిడుతల మీద ద్వేషమూలేదు. భగవంతుడూ అంతే ఎవరిపట్లాప్రత్యేకమైన ప్రేమ, ద్వేషమూ కలిగి ఉండడు. ఒక పుష్కరిణి ఎవరెలాంటి అవనరంతో తన నాశ్రయించినా వారి అవసరాలు తీరుస్తుంది. అందులో ఎవరైనా ప్రాణాలు తీసుకంటే అదివారి తప్పు తప్ప తన బాధ్యతలేదు కదా! భగవంతుడు విషయంలోను అంతే. భగవంతుడు తనని ప్రేమతో సేవించినవారి హృదయాలలో తానుంటానని, వారికి తన హృదయమే నివానంగా చేసి విశ్రమింవ చేస్తానని భగవానుడు వాగ్దానం చేస్తున్నాడని ఈ వారం శ్లోకం చెప్తోంది.





# సందేహాలు - సమాధానాలు

**శ్రీ మందడి రాములు, పెద్దతూప్ర, రంగారెడ్డి జిల్లా**

ప్ర. విష్ణుసంవత్సరాలు, బ్రహ్మ సంవత్సరాలు, రుద్ర సంవత్సరాలు అని అంటారు. తెలుగు సంవత్సరాలు అరవైలో ఏ సంవత్సరాలు ఏవి తెలుప ప్రార్థన?

జ. ప్రభవాది సంవత్సరాలు 60 కదా! అందులో మొదటి 20ని బ్రహ్మసంవత్సరాలు అంటారు. మధ్య 20ని విష్ణు సంవత్సరాలు అంటారు. చివరి 20ని రుద్ర సంవత్సరాలు అంటారు.

ప్ర. వాల్మీకి రామాయణంలో సుందరకాండ పారాయణం చేసిన తర్వాత వర్షాలు కురుయునని పెద్దలు అనగా విన్నాము. ప్రభుత్వము వారికి సలహా ఇచ్చి మీలాంటి సర్వజ్ఞులు ఎందుకు చేయించకూడదు?

జ. ఉచిత సలహాలకు విలువ ఉండదని.

**శ్రీ వి.వి. రామానుజాచార్యులు, టి. నగర్, రాజమండ్రి.**

ప్ర. యజ్ఞయాగాదులు నిర్వహించేటప్పుడు జప, తప, పారాయణ, అనుసంధాన, హోమాదులు జరుగుతూంటాయి. వాటిలో అన్వయించేవారికి సన్మానాలు (దారి ఖర్చులతో సహా) జరుగు తూంటాయి. అటువంటప్పుడు వాటి ఫలితాలు ఎవరికి చెందుతాయి?

జ. చేయించిన కర్త ఎవరో ఆయనకే చెందుతాయి. పారాయణాదులు చేసేదే సంభావనాదులకోసమని భావిస్తున్నారు కదా! కొందరది వారి వృత్తిగ గూడ చేస్కొని డిమాండు చేసి మరీ తీసుకుంటారు. అలాంటపుడయినా, ఆ కార్యం వల్ల కలిగే సత్ఫలితం కర్తగ ఉన్న యజమానికి చెందు తుంది. కారణం, ఆతడు శ్రద్ధతో చేస్తాడు కనుక. చేసిన క్రియలలో ఎక్కడ ఏలోపాలు జరిగినా, దానివల్లకలిగే పాపం మాత్రం, సంభావనకాశించి చేసిన ఋత్విక్కులకే చెందుతుంది తప్ప కర్తకుకాదు. అవి ఆశించక చేసే ఋత్విక్కులు, సరియైన మంత్ర, తంత్ర ప్రయోగం చేస్తే అప్పుడైనా, ఆ యజ్ఞం యజమానికోసమే కనుక ఫలితమూ యజమానికే. భగవద్భావనకల బుద్ధిమంతుడు అసలు ఫలాన్నాశించనే ఆశించడు. అంతా 'కృష్ణార్పణ' బుద్ధితోనే చేస్తాడు.

**ఊటుకూరు అప్పాజీ, ఖమ్మం.**

ప్ర. వివాహములో వధూవరుల నుదుట 'బాసికముల'ను ధరింవచేయుటలోగల పరమార్థమేమి?

జ. 'బాసికము' నుదుటకట్టే ఆచారం కొన్ని ప్రాంతాలకే పరిమితం. దానిని 'ఫాలసింగారం' అంటారట. అంటే నుదుట చేసే అలంకారం అని అర్థం. అది వాడుకలో క్రమంగ 'భాసింగారం...... బాసికము'గ పరిణమించింది. వధూవరుల చూపు ఒకరిపై ఒకరికి పడేటంత వరకూ అది రక్షణ కవచంలా ఉపయోగపడాలని అలా ధరింపచేస్తారట.

**శ్రీమతి దుర్గా సూర్యకుమారి, మద్రాసు**

ప్ర. శ్రీవిష్ణు సహస్రనామములతో శ్రీధర శ్రీకర..... శ్లోకములో శ్రీకర అన్న నామమునకు అర్థము తెలుప ప్రార్థన.

జ. 'శ్రీకరః' అనేది శ్రీవిష్ణు సహస్ర నామస్తోత్రంలో 618వ నామము. జీవసంరక్షణ చేయడం భగవంతుని ప్రధాన కర్తవ్యం. రక్షించడమనేది దయాగుణం కలవాడే చేయగలడు. తనలో ఉండే అనంతమైన గుణాలలో రక్షణకవసరమైన గుణాలను వృద్ధిచేసి మిగిలిన గుణాలను తగ్గించ గలిగినది 'లక్ష్మి' మాత్రమే. అందుకే రక్షకుడిగ వచ్చే అవతారాలన్నింటిలోనూ లక్ష్మినిగూడ తనతో తెచ్చుకొనే భగవంతుడు వస్తాడని ఆగమాలు చెప్పాయి. ఇతిహాసాలు నిరూ పించాయి. ఈ పై నామం దానినే చెప్తుతోంది. శ్రీ అంటే లక్ష్మి. లక్ష్మిని తన గుణవర్ధకురాలిగ కలవాడు 'శ్రీకరుడు'.

# ఇతిహాసబోధ-X-II

స్వభావ రీత్యా మానవ అహంకారం దాని చైతన్య పరిధి దృష్ట్యా పరిమితమైనది అయినప్పటికీ అది అనేక విషయాలను 'తనది'గా తలపోస్తూంటుంది. ఎన్నింటితోనో అది తాదాత్మ్యం చెందుతూంటుంది. మరెన్నింటినో విడిచిపెడుతూంటుంది. ఈ పట్టు విడుపులు కాలానుగుణంగా కొనసాగుతూనే ఉంటాయి.

ఈ జగత్తు అహంకారానికి విహారస్థలం. దాని వికాసాలు, వికారాలు పెరిగి, విరిగే విశాల వేదిక. నిరంతరం మారే ఈ బృహత్తర రంగస్థలంపై 'తన'ను తాను ప్రదర్శించుకొనేందుకు పడరాని పాట్లు పడుతుంది అహంకారం. రాగద్వేషాలతో కూడిన సంకల్పాల మయమైన మనస్సుతో కూడి అది మానసిక అహంకారంగా వ్యక్తమౌతుంది. యుక్తాయుక్త విచక్షణలతో సాగే ఆలోచనల ప్రవాహ కేంద్రమయిన బుద్ధితో కూడి బౌద్ధికాహంకారంగా గోచరమౌతుంది. అనుభవాల జ్ఞాపకాలను నెమరు వేసుకొని స్పందించే సమయంలో అది అహంకారమయమైన చిత్తంగా భాసిల్లుతుంటుంది.

బాల్య, యౌవన, వృద్ధాప్య, వ్యాధిగ్రస్తమై చివరకు పంచభూతాలలో కలసిపోయే దేహం దానికి బలీయమైన, విడదీయరాని, విడదీయలేని శ్రద్ధాకేంద్రం. ఈ దేహాన్ని ఆశ్రయించుకొనే అహంకారం తన రూపవిలాసాలన్నింటినీ ప్రకటిస్తుంది.

పరతంత్ర అయినప్పటికీ స్వతంత్రగా వ్యవహరిస్తుంది. తననూ, తాను చరించే ఈ జగత్తునూ సృష్టించి, పోషించి, లయింపచేస్తున్న శాసనకర్త ఒకడున్నాడని, వాడికి సర్వదా తాను విధేయతను చూపాలని తెలియజేసే దృష్టాంతాలెన్నో మానవ అహంకారానికి తటస్థపడుతుంటాయి. అయినా మకురుతనంలో అది మద గజం కన్నా మిన్న, మావిటి వాడి అంకుశపు పోట్లకు మదగజం విధేయతా పాఠాలను నేర్చుకొంటుంది. కాని కాలస్వరూపుడు ఎన్ని విధాల ప్రయత్నిస్తున్నా మానవ అహంకారం మాత్రం వినయాన్ని నేర్చుకోవడంలో ఎప్పుడూ టక్కరితనాన్నే అనుసరిస్తుంది.

కష్టాలు వచ్చినప్పుడు, నిస్సహాయ పరిస్థితి ఏర్పడినప్పుడు, తన చేతకానితనం ప్రస్ఫుటమైనప్పుడు, అల్పమైన తన పరిమితి అర్థమైనప్పుడు, విధికి తలవంచడం తప్పనప్పుడు అది తాత్కాలికంగా ఒదిగి ఉంటుంది. ఏమాత్రం వెసులుబాటు దొరికినా బుసలుకొట్టే కాల సర్పంలా 'నేను, నేను' అంటూ జిత్తులు మారితనంతో తన విశ్వరూపం చూపుతుంది. నేను నేనంటూ ఎగిరే ఆ నేనేంటో తెలియని తనమే దానిబలం, తనకన్నీ తెలుసనుకొని తీర్పరితనంతో తెలిసీ తెలియక అయోమయంలో, తొట్రుపాటుతో తప్పటడుగులు వేయడం దాని నైజం.

కర్మబంధనమనే గొలుసులను జీవులకు బిగించి, ఆ గొలుసుల చివరలను తనచేత ఇరికించుకొన్న అగోచరుడైన భగవానుడు తన ఎరుకను తెలుపడానికి అవసరమైన అవకాశాలనెన్నింటినో జీవుల కందించాడు. తన యజమానిని గ్రహించి, అతనికి విధేయత చూపడం జీవుని కర్తవ్యం. ఆ కర్తవ్యాన్ని స్వచ్ఛందంగా జీవుడు నిర్వర్తించాలి. సర్వసమర్థుడైన భగవానుడు సమర్పణ విషయంలో జీవునికి స్వేచ్ఛను ఇస్తూ తన అనుగ్రహ, ఆగ్రహ, ఉదాసీనాదులకు పరిధులను ఏర్పరచుకొన్నాడు.

దీనిని గ్రహించని జీవుడు పుట్టుకచేత, పాండిత్యం చేత, పదవిచేత, కలిమిచేత, బలిమిచేత, సౌందర్యం చేత, సాహసంచేత లభించే సమస్త గౌరవాగౌరవాలన్నింటికీ తానే కర్తనని అహంకరిస్తున్నాడు. ఈ అజ్ఞానం వల్ల అతడు దైవాన్ని కూడా తన గొప్పతనానికి ఉపయోగపడాల్సిన వస్తువుగానే



భావిస్తున్నాడు.

మనలో చాలామందికి దైవం అంటే ఎంతో ఇష్టం. భక్తివిశ్వాసాలతో దైవానికి మనం ఎన్నో ఉపచారాలు చేస్తున్నామనే భావిస్తూంటాం. అయితే మనం చేసే కర్మలన్నీ దైవాన్ని తృప్తిపరిచేవా? మన అహంకారాన్ని తృప్తి పరిచేవా? ఇదొక పెద్ద తాత్త్విక సమస్య. చాలా మంది దేవసేవకులనుకునేవారు దీనినొక సమస్యగానే గుర్తించలేకపోయారు. మరి ఇక వారికి పరిష్కారం దిశగా ఆలోచించే తీరికెక్కడిది? అలాంటి వారికి ప్రతినిధిగా భగవానుని వట్ల బలరాముడు కొన్ని సందర్భాలలో ప్రవర్తించాడు. మనల్ని సరిదిద్దడానికి బలరాముడిని సాధనంగా చేసుకొని భగవానుడు ఏ పాఠాలు నేర్పాలను కొంటున్నాడో ఈ సారి 'ఇతిహాసబోధ-**ని**-2'లో తెలుసుకుందాం.

రామావతారంలో భగవానుడు మూర్తీభవించిన ధర్మమయ్యాడు. అందుకే రామో విగ్రహవాన్ ధర్మః అని వాల్మీకి ఋషి రాముని ధర్మతత్పరతను కొనియాడాడు. భగవానుని కృష్ణావతార ప్రయోజనం వేరు. యతో ధర్మస్తతః కృష్ణః అంటూ వేదవ్యాసుడు 'ఎక్కడ ధర్మముంటుందో అక్కడ కృష్ణుడుంటాడని' చాటాడు. ధార్మిక వర్తనులకు కృష్ణుడు రక్షకుడు అందువల్లనే పాండవులు కృష్ణునికి పంచప్రాణాలయ్యాడు.

బలరాముని తీరు వేరు. ఆయనకు భగవానుని తత్త్వము, సత్యమూ తెలుసు. భగవానుడంటే ఎంతో ఇష్టం, ప్రేమ, అంతే ఇష్టమూ, వల్లమాలిన అభిమానమూ దుర్యోధనుని మీద కూడా ఉండటమే ఆయన స్వభావంలోని విచిత్రం.

భగవానునితోపాటు బలరాముడు ఉత్తరాభిమన్యుల కళ్యాణానికి ఇతర యాదవ ప్రముఖులతో కలసివెళ్ళాడు. పాండవులు వనవాస క్లేశాలను, అజ్ఞాతవాసపు అవమానా లను భరించి జూదంనాడు తాము అంగీక రించిన నియమాన్ని విజయవంతంగా పూర్తి చేసారు. కళ్యాణానికి విచ్చేసిన శ్రేయోభిలాషులైన బంధుమిత్ర పరివారంతో విరాటుని సభలో ధర్మరాజు కొలువుతీరాడు.

ఆ సమయంలో పాండవుల కర్తవ్యాన్ని నిర్ణయించడానికి నిశ్చయించిన భగవానుడు కొలువుతీరిన సదస్యులనుద్దేశించి ప్రసంగించాడు.

'ఈ ధర్మరాజు అధర్మమార్గంలో దేవేంద్ర పదవి లభించినా తిరస్కరించే సజ్జనుడు. సత్య వాక్పరిపాలన దీక్షా బద్ధుడు కావడం చేత మాయజూదంలో ఓడి చేసిన ప్రతిజ్ఞను పలుకష్టాలకోర్చి తమ్ములతోపాటు నిలబెట్టుకొన్నాడు. వీరి అరణ్య, అజ్ఞాతవాసాలు ముగిసాయి.

గాంధారీపుత్రులు వీరికివ్వవలసిన రాజ్య భాగాన్ని ఇవ్వకపోతే వీరు శౌర్యాన్ని ఆశ్రయించక తప్పదు. దుర్యోధనుడు తక్కువ వాడు కాడు. పరమలోభి. పాండవులను పరిమార్చడానికెప్పుడూ ఇష్టపడతాడు. ఇటువంటి పరిస్థితులలో భీకర యుద్ధం తటస్థపడే సూచనలు కనిపిస్తున్నాయి. కౌరవుల ఆలోచనలు ఎట్లా ఉన్నాయో మనకు తెలియదు. వారి మనసు తెలియకుండా మనం కార్యవిధానాన్ని నిశ్చయించుకోవడం సముచితం కాదు.

కనుక తగిన వ్యక్తిని రాయబారిగా మనం హస్తినకు పంపటం ఎంతో మంచిది. దానికి స్పందించి దుర్యోధనుడు 'పాండవులకు వారి రాజ్యభాగాన్ని అందిస్తే అందరికీ శ్రేయోదాయకమౌతుంది. అట్లుకానప్పుడు ఏమి చేయాలో అప్పటికి ఆలోచిద్దాం!'

అన్న భగవానుని మాటలను బలపరుస్తూ బలరాముడు తన అభిప్రాయాలనుకూడ సభకు స్పష్టంచేసాడు.

'ధర్మబద్ధమైన వాసుదేవుని పలుకులు కౌరవపాండవుల కిరువురికీ హితకరంగా ఉన్నాయి. సభ్యతతో ఇరువురూ కలసిఉంటే ముల్లోకాలూ సంతోషిస్తాయి. అందుచేత తక్షణం మన మీ పని మీద రాయబారిని పంపాల్సిందే. వెళ్ళేవాడు కార్యాన్ని సాధించ డానికి తగిన విధంగా దుర్యోధనుని చిత్తవృత్తికి తగ్గట్లుగా విధేయతతో ప్రార్థించాలి. లేకుంటే పని జరుగదు.

ఎందుకంటే దుర్యోధనుని తత్త్వం తెలిసి జాగ్రత్తగా ఉంటున్నప్పటికీ, ఈ ధర్మరాజు ఏమరుపాటుతో జూదంలో ప్రమాదవశాత్తూ చిక్కుకున్నాడు. ఆ దుర్యోధనునికి జూదంలో నైపుణ్యంలేదు పైగా బంధువులు అతడిని వారించారు. దానితో దుర్యోధనుడు తాను జూదం ఆడకుండా శకునిని ఆ పనికి నియమించాడు. ద్యూత కళాప్రవీణుడైన శకుని చేతిలో ధర్మరాజు సర్వమూ ఓడిపోయాడు. ఈ విషయంలో దుర్యోధనుని దోషం ఏమాత్రమూ లేదు. కౌరవులను అధర్మపరులని నిందించే అవకాశమే లేదు.

కనుక మనం రాయబారిగా పంపే వ్యక్తి వినయంతోనే పనిని నెరవేర్చుకురావడం మంచిది.

బలరాముడి మాటలు సభ్యులకు ఆగ్రహాన్ని కల్గించాయి. వృష్ణి వంశోత్తముడూ, అర్జునుని ప్రియశిష్యుడూ అయిన సాత్యకి కోపం పట్టలేకపోయాడు. అన్న బలరాముడిపై మండిపడ్డాడు.

'బలరామా! నీవు ఇట్లా మాట్లాడవచ్చా! ఇది నీకు మాత్రమే చెల్లింది. నీ పలుకులు మెచ్చినవారిని, విన్నవారిని అనాలి కాని నిన్నేమంటాను? ధర్మరాజు సంతోషంతో జూదమాడాడా? కౌరవులందరూ కుట్రపన్ని ముందే సంప్రదించుకుని, నిర్బంధించి ధర్మజునితో జూదమాడించారు. కపటజూదంలో వారు పొందిన జయం ధర్మబద్ధమైనదిగా నీకు కనిపిస్తున్నదా? ధర్మరాజుది తప్పని చెప్పి ఎవడైనా ఇక్కడి నుండి సుఖంగా ఇంటికి వెళ్ళగలడా? అతడు ధార్మికుడు కాదని అంటే అసలు నిజమైన ధార్మికులు ఈలోకంలో మరెవ్వరున్నారో చెప్పండి.

వీరులూ, ధార్మికులూ అయిన పాండవులు తమ పైతృక రాజ్యం కోసం అన్యులను వేడుకోవాలా? మంచివారిని గౌరవించే స్వభావం, అసలు దుర్యోధనునికి ఉందా? రాజధర్మానికి తగిన విధంగా యుద్ధాన్ని ఆశ్రయించి జయాన్ని పొందడమే సమంజసం. ఒక వేళ సంధికి దూతను పంపుదామనుకొంటే అతడు దీనుడుగాక, ధీరత్వంతో ధర్మజుని కోరికను తెలియజేయాలి. వారు తగిన విధంగా ప్రవర్తిస్తేసరి. లేకుంటే దుర్యోధనుడు అందుకు తగ్గఫలితాన్ని అనుభవించక తప్పదు.' అంటూ బలరాముడిఅభిప్రాయాలను నిర్మొహమాటంగా ఖండించాడు సాత్యకి.

ద్రుపదుడూ దానిని సమర్థించాడు. ఆయన కౌరవ సభకు తన పురోహితుడిని దూతగా పంపుదామని ప్రతిపాదించారు. శ్రీకృష్ణుడు ద్రుపదుని పలుకులను బలపరిచాడు.

నేను కౌరవులకూ పాండవులకూ బంధు సమానుడను కావడంచేత ఇరువురి సుఖాన్నీ చూడగోరుతుంటాను. పెండ్లికి పిలవడంచేత మేమిక్కడకు వచ్చి పరిస్థితిని గమనించాము. ఇక ఆలస్యం చేయడానికి వీలులేదు. మేము ద్వారకకు వెళ్ళాల్సిఉంది. అంటూ చెప్పవలసిన నీతులూ, రీతులూ చెప్పి సోదరసమేతుడై కృష్ణుడు ద్వారకకు వెళ్ళాడు.

కౌరవ పాండవులు ఇరువురూ బల సమీకరణ యత్నాలు చేయసాగారు. అందులో భాగంగా దుర్యోధనుడు, అర్జునుడు ద్వారకకు వచ్చారు. సాయమడిగిన ఇరువురికీ శ్రీకృష్ణుడు భాగనిర్ణయం చేసాడు. అర్జునుడు యుద్ధం చేయనన్న శ్రీకృష్ణుని కోరుకున్నాడు. దుర్యోధనునికి వీరులైన పదివేల మంది నారాయణ గోపాలురు దక్కారు.

ఆ తర్వాత బలరాముడివద్దకు వెళ్ళాడు దుర్యోధనుడు. తన మనస్సులోని అభిప్రాయం తేటతెల్లం చేసాడు బలరాముడు.

'దుర్యోధనా! విరాటుని కొలువులో నేను నీ పక్షాన వాదించాను. ఈ విషయం నీ దృష్టికి వచ్చే ఉంటుంది. నామాటలు నచ్చని పాండవ పక్షపాతులు నన్ను వ్యతిరేకించారు. వారి పలుకులు కృష్ణునికి ప్రియంగా ఉన్నాయి. కృష్ణుడిని విడిచి నేను నిముషంకూడా ఉండలేను. అతనికి కష్టం కలిగేపని చేయలేను. అందుకోసం అప్పటి నుండి నేనొక నిర్ణయానికి వచ్చాను. నేను మీ ఇరు వర్గాలవారికీ ఏ విధమైన సహాయం చేయను. ఇది సత్యం'. అంటూ తన నిశ్చయాన్ని దుర్యోధనునికి తెలిపాడు.

బలరాముని ఆశీర్వాదం పొంది దుర్యోధనుడు మరొక యదువంశ వీరుడైన కృతవర్మను కలిసి అతనితోపాటుగా అక్షౌహిణీ సైన్యాన్ని హామీగా పొంది హస్తినకు వెళ్ళాడు.

దుర్యోధనుడు ధర్మ పరాయణుడని అన్న, పాండవులు ధర్మ పరాయణులని తమ్ముడు - రెండుగా చీలిపోవడంచేత- కౌరవ పాండవ సమస్య పై యాదవ కూటమికూడ రెండు వర్గాలుగా చీలిపోయింది. సాత్యకి అక్షౌహిణీ సైన్యంతోపాండవ శిబిరం చేరితే, కృతవర్మ అక్షౌహిణీ సైన్యంతో కౌరవ పక్షం చేరాడు.

పాండవులవైపు చక్రి సమస్త వ్యవహారాలను నిర్వహించే బాధ్యత స్వీకరించాడు. పార్థునికి సారథికావడానికి సమ్మతించాడు. వారి పక్షాన హస్తినకు రాయబారిగా వెళ్ళి చెప్పవలసిన విధంగా చెప్పవలసినవి చెప్పాడు. సంధి ప్రయత్నాలు బెడిసి కొట్టాయి. నీతిని చెప్పడానికి వెళ్ళిన కృష్ణుడినే బంధించాలని ప్రయత్నించాడు దుర్యోధనుడు. అతని యత్నాన్ని వమ్ముచేసి యుద్ధం తప్పదని ప్రకటించి వచ్చాడు కృష్ణుడు.

ఉభయ పక్షాల సైన్యాలు కురుక్షేత్రం చేరాయి. ఆ సందర్భంలో బలరాముడు స్కంధావారంలో సమావేశమై ఉన్న ధర్మరాజువద్దకు వచ్చాడు. అందరూ అభిమానంతో బలరాముని సత్కరించారు. 'సకల బంధుకోటికీ నష్టదాయకమైన యుద్ధం మంచిది కాదని, ఇరువర్గాల వారికీ నచ్చచెప్పి సంధి చేయమని కృష్ణుడికి నేను ఎప్పుడో చెప్పాను. కాని కృష్ణుడు ఆ పనిచేయలేదు. మంచి మాటలతో కౌరవులను మెప్పించవలసిన కృష్ణుడు, వారితో ఆ విధంగా ప్రవర్తించక సంధి చెడగొట్టాడు. ఇరువురూ సమానులేకదా? అయినా కృష్ణుడు పాండవ పక్షపాతి అయ్యాడు. కనుక వీరికి విజయము, వారికి చావు తప్పదు. ఇది నేనెట్లా వినగలను? భీమ, దుర్యోధనులు ఇరువురూ నా శిష్యులే! వారు పరస్పరం చంపుకోవడం చూడగలనా?

కృష్ణునికి తెలియుని ఔచిత్యమూ, పురుషార్థమూ నాకు తెలుసా? అయితే ఈ బంధుహానిని భరించలేను కనుక తీర్థయాత్రకు నిశ్చయించాను ఆ విషయాన్ని మీకు తెలియజేసి పోవడానికి వచ్చానని తెలిపి తీర్థయాత్రకు వెళ్ళాడు బలరాముడు.

సాంబుని విషయంలో బలరామునికి హస్తిన మనస్తత్వం స్వయంగా అనుభవంలో ఉన్నదే. తాను సాధువచనాలతో కౌరవుల మనసు గెలిచాడో, లేక యమునలో హస్తినను కలపటానికి పరాక్రమించి వారితో వియ్యమొందాడో బలరామునికి తెలియదా? ఎంతో కాలంనుండి దుర్యోధనుడు పెంచుకొన్న మాత్సర్యం, పేరాశ, మొండి పట్టుదల పాండవులతో నెయ్యానికి సమ్మతిస్తుందా? దుర్యోధన, ధృతరాష్ట్రుల దుష్టత్వం సంధి విఫలంకావడానికి కారణం కాదు. కృష్ణుడే కారణం. ఇదీ బలరాముని తీరు. పోనీ శాంతి కోసం తాను చేసిన ప్రయత్నమేమన్నా ఉందా? శూన్యం.

భగవానుడిని యుద్ధానికి బాధ్యుడిని చేసి తాను తీర్థయాత్రల నెపంతో సమకాలీన ప్రపంచపు పెనుసమస్యకు దూరంగా పారిపోయాడు. తన కెంతో ప్రీతిపాత్రుడైన తమ్ముడు ఆయుధం పట్టక

సారథ్యం వహించినంత మాత్రాన శత్రువులు యుద్ధరంగంలో మెచ్చి పూలతో సత్కరించరు. శౌరినికూడా సంహరించాలనే చూస్తారు.

భగవానుడు ధర్మంకోసం కదనరంగంలో నానా అగచాట్లు పడుతున్న సమయంలో బలరాముడు స్త్రీజన సమేతుడై మదిరాపాన సేవనం చేస్తూ వన విహారం సాగించాడు. ఆ సమయంలో సూతమహర్షి ఋషి సమూహానికి భగవత్కథలను బోధిస్తున్నాడు. బ్రహ్మస్థానంలో కూర్చుండి బోధిస్తుండటంచేత, సంప్రదాయాను సారంగా అక్కడకు వచ్చిన బలరాముని చూచినప్పటికీ సూతమహర్షి తన స్థానం నుండి లేవలేదు. మిగిలినవారు బల రామునికి ఎదురెళ్ళి స్వాగతం పలికారు.

సూతుడు తనను ధిక్కరించినట్లుగా భావించాడు బలరాముడు. తనను అవమానించాడని దూషిస్తూ అమాంతం సూతుడిని బలరాముడు సంహరించాడు. మునులు నెమ్మదిగా బలరాముని దోషాన్ని, అతనికి సంక్రమించిన బ్రహ్మహత్యా పాతకాన్ని తెలియజేసి ఆ ప్రాంతాన్ని వదలి వెళ్ళి పోయారు. ఇదీ మదిరాపాన మత్తుడైన బలరాముని తీర్థయాత్ర సరళి. భగవానుడిని, ధర్మాన్ని విడచిన వాడికి ఎదురయ్యే అనుభవం ఇలానే ఉంటుంది.

తనను చూచి లేచినిలబడలేదన్న చిన్న విషయంలోని సత్యాసత్యాలను విచారించక అవమాన భావంతో తొందరపాటుతనంతో సూతుడిని వధించిన బలరామునికి ద్వంద్వ యుద్ధంలో భీముడు దుర్యోధనుడి తొడలు విరుగగొట్టడం అధర్మంగా అన్యాయంగా తోచింది.

నిండు సభలో ద్రౌపదికి, పాండవులకు జరిగిన పరాభవాలు, ఆ సమయంలో భీమ ప్రతిజ్ఞలు బలరామునికి గర్తుకురాలేదు. దుర్యోధనుని పాటుకు కలతచెంది హలా యుధంతో భీముని చంపడానికి మీదకు దూకాడు. కృష్ణుడు బలరాముడిని తన చేతులతో గట్టిగా పట్టుకొని పలువిధాలుగా బ్రతిమలాడి అతనిని నిలువరించాడు. కృష్ణుని కారణంగా బలరాముడు కోపతీవ్రతను తగ్గించుకొని భీముడిని దూషిస్తూ అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

జూద సందర్భంగా ధర్మరాజు ధార్మిక నిరతిని శంకించిన దుర్యోధనుని వర్తనాన్ని మెచ్చుకొన్న బలరామునికి కూడ అటువంటి సన్నివేశమే ఎదురయింది. రుక్మిణి సోదరుడు, భోజకటక పాలకుడూ అయిన రుక్మిబహుగర్విష్టి. అతని మనుమరాలికి కృష్ణుడు మనుమడైన అనిరుద్ధునికీ (ప్రద్యుమ్నుని కుమారుడు) వివాహం నిశ్చయమయింది. యాదవులందరూ భోజకటకానికి తరలి వెళ్ళారు.

పెళ్ళిసందడిలో మదిరాపానమూ, జూదము సాధారణ విషయాలు. బలరామునికి పాచికలాటలో మెలుకువలు తెలియకపోయినా, తోటివారు పిలిచారు కదా అని ఆటలో కూర్చున్నాడు. రుక్మి, బలరాముల మధ్య సాగిన ఆటలో పదివేల నిష్కాలను బలరాముడు ఓడిపోయాడు. చూస్తున్న కళింగ రాజు, రుక్మి తదితరులు ఓడిన బలరాముడిని గేలిచేసారు.

బలరాముడు ఉక్రోషంతో కోటి నిష్కాలు పందెము కాసి పాచికలు విసిరి తాను గెలిచానని బిగ్గరగా అరిచాడు. రుక్మి అందుకు అభ్యంతరం







పలికి తానోడలేదని బూకరించాడు. 'బలరాముడే విజేత' అన్న అశరీరవాణి వాక్కు విన్నంతనే బలరాముడికి తన వాదనమీద విశ్వాసం పెరిగింది. విపరీతమైన ఆగ్రహంతో ఆయన జూదపు పలుకతో రుక్మిని సంహరించాడు. నవ్విన కళింగరాజు మూతి పండ్లు రాలగొట్టాడు. జూదమందిరంలోని స్తంభాన్ని ఊడపెరికి ప్రేక్షకులుగా ఉన్న రాజులందరినీ తరిమితరిమి కొట్టాడు.

బలరాముని వర్తనం వల్ల కళ్యాణ వేదిక కదనరంగంలా మారి స్మశానవాటికలా అయింది. అయినప్పటికీ కృష్ణుడు అన్నను ఒక్కమాటకూడా అనకుండా శాంత పరచి ద్వారకకు తీసుకొని వచ్చాడు.

కౌరవులు ధర్మరాజును నిర్బంధించి జూదమాడించి సర్వస్వాన్ని అపహరించి గేలిచేసినా, కులస్త్రీని నిండు సభలో జుట్టపట్టుకు ఈడ్పించి, బట్టలూడ దీయించడానికి ప్రయత్నించినా పాండవుల ఆగ్రహం అవధులు దాటలేదు. అదివారి సంస్కారం. భగవానుడు ద్రౌపదికి ప్రసాదించిన దివ్య వస్త్రాలు పాండవుల ధర్మనిరతికి సాక్ష్యంగా నిలిచినా, దానిని అవకాశంగా తీసుకొని వారు సభామర్యాదలను అతిక్రమించలేదు.

అట్టి ధార్మికుల సహనశీలతను తక్కువ చేసి మాట్లాడిన వారందరికీ బలరాముడు ప్రతినిధిగా నిలిచాడు. బలరాముని వర్తనం మనందరికీ ఎంతో మేలికొలుపు. సాక్షాత్తూ పరంధామునికి పానుపుగా నిలిచిన ఆదిశేషుడు కూడా మానవ జన్మ ఎత్తి, ప్రకృతి గుణ ప్రభావంచేత ఎలా ప్రవర్తించాడో మనం గమనించాము.

ఈ సన్నివేశాలు మనకు నేర్పుతున్న పాఠాన్ని "ఇతిహాసబోధ -**ని**- 2' శీర్షికకు పేరు పెట్టడం ద్వారా 'స్పందన'ను తెలియచేస్తారు కదూ!.....

**ఇతిహాసబోధ - 10 - 1 శీర్షికకు పేర్లు**

1. శ్రీకృష్ణ, బలరాముల జీవన శైలిలో భేదాలు - ఎందుకు?
   -అనసూయారామనుజదాసి, అనంతపూర్.
2. అహంకార స్వార్థములను విడిచిన భగవానునికి చేరువ అవుతాం.
   -ఎమ్. విశ్వనాథం, విజయనగరం.
3. దైవీసంపద కన్నా భౌతిక సంపద ముఖ్యం కాదు.
   -జె. అమరయ్య, అమరావతి.
4. మమ మాయా దురత్యయా........
   -కె. అప్పలరాజు, తాబ్లిలి.
5. బలరామకృష్ణుల రాగానుబంధం అపూర్వ సహోదరుల అనుబంధం
   -ఆర్. చక్రపాణి, హనుమకొండ.
6. కలిసి ఉంటే కలదు సుఖం - కలుగు జయం.
   -యస్. పుష్పలత కమలాకర్‌రావు
7. శాశ్వతమైనది 'సత్యం' మాత్రమే
   -బి. వీర్రాజు, జగ్గయ్యపేట
8. దైవ మాయ
   -ఎమ్. జయప్రకాశ్, హనుమకొండ.
9. ఐకమత్యమే బలం
   -ఎమ్.విశ్వనాథమ్, హనుమకొండ.
10. ధర్మమార్గంలోనడవడం - విజయానికి పునాది. -వి. విష్ణువర్థన్, ఖమ్మం.

వీరందరికీ శ్రీశ్రీశ్రీ చిన్నజీయరుస్వామివారి మంగళాశాసనాలు తెలియజేస్తున్నాం - వికాసతరంగిణి

గమనిక : అనివార్య కారణాల వల్ల కొన్ని శీర్షికలుప్రచురించలేకపోవుచున్నాము పాఠకులు గమనించగలరు.
- భక్తినివేదన.

# వికాసదర్శిని నివేదన

## శ్రీశ్రీశ్రీ స్వామి వారి మారిషస్ పర్యటనా విశేషాలు

**మారిషస్** దేశము మన దేశానికి నైరుతి మూలగ హిందూమహా సముద్రములో 700 మైళ్ళు వ్యాపించి ఉన్న ఒక ద్వీపము. అన్నివైపులా హరితకాంతులీనుతూ అలరారు తున్న అందాల ద్వీపము. ప్రపంచ నలుమూలల నుండి తండోపతండాలుగా యాత్రీకులు ఈ ద్వీపాన్ని సందర్శించి సముద్ర తీరాన సేదతీరి వెడుతుంటారు. ఇదొక విహారయాత్రా స్థలమన్నమాట. దీనిని ఇంద్రధనుస్సుల దీవి (**The Island of Rainbows**) అంటారు. ఇక్కడ 6,7 ఇంద్రధనుస్సులు ఒకేసారి ఏర్పడతాయట. ముఖ్యంగా ఇది పంట ప్రధానమైన దేశం. 80%పైగా భూమి చెఱకు పంటకోసమే వినియోగిస్తారు. ప్రపంచ దేశాలన్నింటికంటె మారిషస్‌లో డయాబెటిస్ (షుగరు) వ్యాధితో బాధపడేవారి శాతంకూడా అధికమేనట. ప్రతి ముగ్గురిలో ఒకరు ఈ వ్యాధికి గురైన వారేనట. ప్రస్తుతం అక్కడ శీతాకాలం. ఈ దీవిలోని జనాభా మొత్తం 12 లక్షలు. ఇందులో ఎక్కువశాతం భారతీయ సంతతికి చెందినవారే. బీహార్, ఉత్తరప్రదేశ్‌కు చెందినవాళ్ళు, తరువాత తెలుగువాళ్ళు, ఆపై తమిళులూ ఉన్నారు. 5% మాత్రం ఫ్రెంచ్ జాతివాళ్ళు. అధికశాతం భారతీయులు కావడం చేత రాజకీయ అధికారము చాలావరకు వీళ్ళచేతుల్లో ఉంది. కానీ, 90% చెరకు తోటలన్ని ఫ్రెంచివారి యాజమాన్యంలో ఉండటం వల్ల, ఆర్థికరంగనియంత్రణ పూర్తిగ వారిచేతుల్లోనే ఉంది. వ్యవసాయ, కార్మికరంగాల్లో భారతీయులు పరిమితమై పోయారు. వీరు శివరాత్రిని తమ జాతీయ పండుగగా జరుపుకుంటారు. చిన్న దేశం అయినా సుమారు 300పైగానే ఆలయాలు నిర్మించుకున్నారు. కొన్నైతే చాలా పెద్దపెద్ద ఆలయాలు. ప్రజలంతాకూడా చాలా భక్తిగా ఉంటారు. ఆయా భాషీయులు ఉన్నా భాషమీద అభిమానమే తప్ప వారికి ఆ భాషలో ఎక్కువ ప్రవేశం లేదు. తెలుగులైతే ఆ విషయంలో మరీ వెనుకబడి ఉన్నారు.

ఈ దీవిని మొదట అరేబియన్స్ కనుగొన్నారు. తరువాత ఫ్రెంచ్‌వారు ఆక్రమించారు. అనంతరం బ్రిటీష్‌వారు దీనిని స్వాధీనం చేసుకున్నారు. వాళ్ళను తరిమి, దీవి స్వాతంత్ర్యాన్ని పొందారు. సర్ శివసాగర్ రామ్‌గులామ్ అనే మహానుభావుడు







# విఘ్న నివారక చతుర్థి

ఈ నెల పదవతేదీన వచ్చేపండుగ వినాయక చతుర్థి. భాద్రపదమాసంలో వచ్చే శుద్ధ చతుర్థినే వినాయక చతుర్థి లేదా వినాయక చవితి అంటారు. ఈ పండుగనే వరద చతుర్థి అని విఘ్ననివారక చతుర్థి అని కూడా అంటారు.

తలపెట్టిన పనిలో ఆటంకాలు రావడమనేది సామాన్యుని దగ్గరనుండి అనుపమానులైన ఆంజనేయాదుల వంటి వారి వరకూ జరుగుతూనే ఉంది. అలాంటి విఘ్నాలన్ని తొలగి, తలపెట్టిన కార్యాలు నెరవేరాలని ఆ రోజు విఘ్న నివారకుని పూజ చేస్తారు. నిజానికి విఘ్ననివారకులు పరివార దేవతలు. వీరికి ప్రధాన దేవత శివుడో, విష్ణువో, మరొకరో అయ్యుంటారు. శివుడి పరివారంలోని విఘ్ననివారకుడుని వక్రతుండుడని అంటారు. శివుడిని ఆరాధించేవారందరూ ఆ గజముఖుడిని ఆరాధిస్తారు. విష్ణువుని ఆరాధించే వారందరూ విష్వక్సేనుడిని విఘ్ననివారణ కోసం ఆరాధిస్తారు. గజముఖులు మనకి మూడు రకాలుగా కన్పిస్తారు.

1. పార్వతీ పుత్రుడైన గణపతి, ఈయననే వినాయకుడని అంటారు.
2. విష్వక్సేనాపతి మరొకాయన. ఈయన పరివారమంతా రెండు దంతాలు కలిగి, ఊర్ధ్వపుండ్రాలతో ప్రకాశిస్తూ ఉంటారు. ఈయనే విష్వక్సేనులని, కార్యారంభంలో ఆరాధనచేయాలని శ్రీవైష్ణవాగమాలు తెలియజేస్తున్నాయి.
3. మాండూక్యోపనిషత్ తెలియచేస్తున్న గజముఖుడు మరొకాయన. ఈయనకి మొత్తం 19 ముఖాలు అని, అందులో మధ్యనున్నది గజముఖమని వర్ణించిందా ఉపనిషత్. జీవ్యలందరికీ జాగ్రత్ దశలో ఆయా విషయానుభవాలు కల్గించి నియమించి నడిపించే నియామకుడు ఈయన. ఈయన చతుర్బాహుడై లక్ష్మీసహితుడై ఉండే శ్రీమన్నారాయణుడు. సకల కార్యసిద్ధికీ ఆయన అనుగ్రహం ఉండాల్సిందే!

ఆయా సంప్రదాయాలు అనుసరించేవారు ఆయా గజముఖులని ఆరాధించి విఘ్న నివారణకై ప్రార్థించే రోజే విఘ్ననివారక చతుర్థి. ఆ రోజున చక్కగా పూజా స్థలంలో పాలవెల్లి కడతారు. రకరకాల పండ్లు కాయలతో పాలవెల్లిని అలంకరిస్తారు. మట్టితో స్వామి ప్రతిమని చేసి, రకరకాల పత్రాలతో స్వామిని అర్చిస్తారు. ఉండ్రాళ్లు, కుడుములు నివేదన చేస్తారు. కొందరు ఆ ఒక్కరోజే కాక తొమ్మిది రోజులపాటు 'గణపతి' నవరాత్రి ఉత్సవాలు నిర్వహిస్తారు. ఆ రోజున స్వామిని అర్చించి అక్షతలు శిరస్సున ధరించినవారికి కార్యాలలో ఆటంకాలు తొలగడమేకాక నిలాపనిందలు తొలగుతాయని విశ్వసిస్తారు. దీనికి భాగవతంలోని 'శమంతకమణోపాఖ్యానము' ఘట్టాన్ని చదువుతారు.

చవితి చంద్ర దర్శన దోషం తొలగడానికి చదువుకొనే శ్లోకం :

**సిహః ప్రసేనమవధీత్ సింహో జాంబవతా హతః।**
**సుకుమారక మారోదీః తవహ్యేషః శ్యమంతకః॥**

అలాచేసినవారికి చవితి చంద్ర దర్శన దోషం ఉండదని విశ్వసిస్తారు. తొమ్మిది రోజుల ఉత్సవాలలో రకరకాల సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తారు. గణపతి నవరాత్రుల చివరిరోజున ఆ మూర్తిని నదులలోగాని, సరస్సులలోగాని నీటిలో నిమజ్జనం చేస్తారు. ఇది శాస్త్ర నియమం. రాతి, లోహ విగ్రహాలను ఆలయాలలోను, ఇండ్లలోను నిత్యమూ ఆరాధన చేయవచ్చు. విశేష పర్వదినాలలో, ఇండ్లలో వ్రతాదులలో చేసే పూజలకి భగవచ్ఛక్తిని దర్భలలోకి గాని (కూర్చ) బియ్యంలోనికి (స్తండిలం)గాని, పూవులలోనికిగాని, మట్టితోచేసిన మూర్తులలోనికి గాని ఆవాహన చేయడం జరుగుతుంది. ఎంతకాలం కోసమని ఆ శక్తిని మనం ఆహ్వానిస్తామో అంతకాలం అయ్యాక ఆ శక్తి మనం ఉద్వాసన (వెళ్లమనే ప్రార్థన) చెప్పినా, చెప్పకున్నా వెళ్లిపోతుంది. కాబట్టి ఆహ్వానించిన వారిని పనిపూర్తయ్యాక గౌరవంగా సాగనంపటం మర్యాద. అలా ఉద్వాసన చెప్పేసినా అంతవరకు భగవచ్ఛక్తికి ఆలవాలమైన ఆ మట్టి ప్రతిమని ఎవరూ తొక్కకుండా ఉండే విధంగా నదులవంటి వాటిలో కలపడమే నిమజ్జనము. అలా చేయడం వలన మట్టితిరిగి మట్టిలోనే కలిసిపోతుంది. ఆ వారం అనుసంధానం చేసుకోవలసిన గీతాజ్యోతి శ్లోకం :

శ్లోకం : చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినో ర్జున! ।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥ 7-26

విజ్ఞాపన చేసుకొని తీర్థప్రసాదాలు స్వీకరించి విఘ్ననివారకుని అనుగ్రహాన్ని పొందుదాం.

స్వాంతంత్ర్యాన్నితేవడంలో ముఖ్యపాత్రధారి. ఇక్కడ ఉన్నవాళ్ళంతా **క్రియోల్** అనే ఒక క్రొత్త భాషను ఏర్పరచుకొన్నారు. ఫ్రెంచ్, బీహార్‌కు చెందిన భోజ్‌పురి, తెలుగు, తమిళం కలిస్తే ఏర్పడిన భాష ఇది. ఇదే వీరికి జాతీయ భాష. దీనితోపాటు ఇంగ్లీష్‌కూడా ప్రధానమైన భాషగా చలామణి అవుతోంది.

మారిషస్‌లో రోడ్లు పరిశుభ్రతల వంటివి మాత్రం యురోపియన్ స్టాండర్డ్స్‌ని పోలి ఉంటాయి. చాలా అందమైన శుభ్రమైన రోడ్లు, చక్కటి క్రమశిక్షణతో కూడిన ట్రాఫిక్, స్త్రీలు ఒక వేళ అర్ధరాత్రి వెళ్ళాల్సివచ్చినా భయం లేకుండా చాలా కట్టుదిట్టంగా ఉంటుంది. పరిసరాలను చాలా శుభ్రంగా ఉంచుతారు. విదేశీయాత్రికుల రద్దీఉన్నా దీని చుట్టూరా ఉండే సముద్రంలో నీరు ఏమాత్రం కలుషితం కాకుండా స్వచ్ఛంగా, క్రిందుండే తెల్లని మెత్తని ఇసుకగూడ కనిపించేట్టుఉంటుంది. చేపల వాసనగూడ పెద్దగ ఉండదు. దీవి చుట్టూ నీళ్ళల్లో పగడాల మొక్కలు (కోరల్స్) చాల ఉన్నాయి. సందర్శకులకు క్రింద అద్దం ఉండే బోట్లలో తీసుకువెళ్ళి చూపిస్తూంటారు. ఒక్కొక్కరికి అలా వెళ్ళడానికి సుమారు రూ. 400/- తీసుకుంటారట. అయితే నీటిని కలుషితం చేసినా, ఆ పగడాలపై చేయివేసినా కఠినమైన దండననుభవించడం మాత్రం ఖాయమట. ఖచ్చితంగ వారలా వ్యవహరించడం వల్లనే ఈ దీవిని ఇంత శుభ్రముగ నిర్వహించగలగుతున్నామని, లేకపోతే, క్షణాల్లో పాడైపోయేదని అక్కడి అధికారులు చెప్పారు.

సెయింట్ పియరీ పట్టణంలోని లాలోరా అనే ప్రాంతంలో ఉన్న శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం యొక్క 10వ వార్షికోత్సవంలో పాల్గొనడానికి శ్రీస్వామివారు మారిషస్ వెళ్ళారు. ఈ కార్యక్రమంలో భాగంగా తెప్పోత్సవం అనే కార్యక్రమాన్ని గూడ ఏర్పాటు చేసారు. ముఖ్యంగా తెప్పోత్సవంలో పాల్గొనడానికి ఆలయపరివారం ప్రధానంగా ఆలయ ట్రస్ట్ చైర్మన్ శ్రీమాన్ రామ్‌దాస్ యెల్లయ్యగారు శ్రీస్వామివారిని ఆహ్వానించారు. శ్రీస్వామివారు జులై 30 నుండి ఆగష్టు 5 వరకు అక్కడ పర్యటించారు. వారి భక్తిశ్రద్ధలు శ్రీస్వామి వారిని ఆనందింపచేసాయి. కానీ ఆలయ నిర్మాణం, ఆరాధనాపద్ధతులే శ్రీస్వామివారికి విచారాన్ని కల్గించాయి.

ఇక్కడివారు భాషాపరంగా దేవుళ్ళని విభజించుకొని పూజించడమే దీనికి కారణం. తెలుగువాళ్ళ దైవం వెంకన్నస్వామిఅని, తమిళుల దైవము అమ్మవారు (గ్రామదేవతలు) అని, ఉత్తరాది వారిదైవము శివుడని ఈ విధంగా ఆరాధించుకోవడం శ్రీస్వామివారిని ఆశ్చర్యపరచింది. శ్రీస్వామివారు మారిషస్‌లో వేంచేసిఉన్న వారంరోజుల్లో చాలా ఆలయాలను సందర్శించారు. వెళ్ళినప్రతిచోట కూడా శ్రీస్వామివారు ఓకే మాటను నొక్కిచెప్పారు. "ఇలా మీరు దేవుళ్ళని భాషాపరంగా విభజించుకొని పూజించడం తగదు. భగవంతుడనేవాడు ఒక్కడే. అందరూ కలసి కార్యక్రమాల్ని ఆనందంగా జరుపుకొని ఐకమత్యంగా ఉండే ప్రయత్నం చేయండి." అని ప్రబోధించారు.

ఆపై ఆలయం కట్టేతీరు చాలా ఘోరంగా ఉంది. ఎవరి ఇష్టం వచ్చినట్లు వారు కట్టుకున్నారు. శ్రీస్వామి వారు సందర్శించిన ఒక ఆలయ విమానానికి లక్షల ఖర్చుపెట్టారు. కానీ, శాస్త్రీయపరిధికి విరుద్ధంగా ఒక బొంగరంలాగా ఈ విమానాన్ని నిర్మించారు. వాళ్ళకది చాలా బాగుందని పించింది. అంటే ఒక శాస్త్రీయ నియంత్రణ లేదన్నమాట. వారు చేస్తున్న పొరపాట్లని శ్రీస్వామివారు వారిని నొప్పించకుండా స్పష్టంచేశారు.

ఈ రెండు విషయాలు తప్ప క్రమశిక్షణ, శుభ్రత విషయాలలో మాత్రం శ్రీస్వామివారు చాలా ప్రభావితులయ్యారు. ప్రతీ ఆలయానికీ, దానికంటూ ఓ వాలంటీర్ బృందం, దానికో యూనిఫారం, వారు క్రమశిక్షణగా కార్యక్రమాన్ని భక్తులంతా బాగా సేవించుకొనేటట్టు ఏర్పాట్లు చేస్తూ ఉండటం చూసి శ్రీస్వామివారు ముగ్ధులయ్యారు.

శ్రీస్వామివారు చిత్రభాను నామ సంవత్సరంలో





ఈ ద్వీపానికి వేంచేసి దీని చరిత్రను విచిత్రంగా మార్చివేశారు. శ్రీస్వామివారి ఆగమనాన్ని ఆ దేశ వాసులందరూ ముఖ్యంగ అన్నిభాషలవారు కలసి ఒక జాతీయ పండుగగా జరుపుకోవడం గొప్ప విశేషం.

శ్రీస్వామివారితోపాటు శ్రీమాన్ వేణు స్వామిగారు, శ్రీమాన్ భాగవతాచార్యులు, శ్రీమాన్ శఠగోపాచార్యులు, శ్రీమాన్ యస్.యమ్. మధుసూదనాచార్యులు (చిన్నమధు), శ్రీమాన్ యన్. శ్రీనివాసా చార్యులు, శ్రీమాన్ గోపీకృష్ణమాచార్యులు, శ్రీమాన్ శాంతారామ్, కుమారి శారదగారు, హన్మకొండ వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమతి డా॥ జ్యోతిగారు, వీరి సోదరి శ్రీమతి మంజులగారు, నిజామాబాద్ వికాస తరంగిణి సభ్యులు శ్రీమాన్ దేవేందర్ గుప్తా దంపతులు, స్విట్జర్లాండ్ నుండి మేడమ్ డానియేలా హూసర్‌గారు, మారిషస్ ప్రయాణ ఏర్పాట్లు చూసిన శ్రీమాన్ సురేష్‌గారు (కుటుంబంతో) మారిషస్ టూర్‌లో పాల్గొనే అదృష్టాన్ని పొందారు. శ్రీమాన్ శఠగోపాచార్యులుగారు, శ్రీస్వామివారి పర్యటనకు ముందే మారిషస్ సందర్శించి శ్రీస్వామివారు రావడానికి రంగాన్ని సిద్ధం చేశారు.

**30-7-2002 :** మారిషస్ విమానాశ్రయం నుండి 60 కి.మీ దూరంలో ఉన్న రోజ్‌హిల్ పట్టణంలోని శ్రీ శివానంద యోగాశ్రమానికి స్వామివారు చేరుకున్న వెంటనే ఉ॥ 11-00 గం॥లకు **MBC** రేడియోద్వారా శ్రీమాన్ సంజీవగారు తెలుగులో, శ్రీమాన్ ఉమాపతి శివాచార్యగారు తమిళంలో నిర్వహించిన ఇంటర్వ్యూలో శ్రీస్వామివారు పాల్గొన్నారు. తమ సందేశంలో భారతీయ వైదిక సంప్రదాయ విశిష్టతను, సామాజిక మార్పుకోరుతూ తాము నిర్వహించే కార్యక్రమాలను వివరించారు.

ఆరాధనానంతరం సాయంకాలం గం॥ 4-30 ని॥లకు శ్రీమాన్ ప్రవీణ్‌గారి కోరికపై శివానందాశ్రమంలో భక్తులనుద్దేశించి శ్రీస్వామివారు ప్రవచనం కావించారు.

సాయంకాలం 6గం॥లకు లాలోరా శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామివారి దేవస్థానాన్ని సందర్శించారు. ఆలయానికి ఎదురుగా ప్రతిష్ఠించిన హనుమదాలయంలో జరిగిన విశేష పూజలలో శ్రీస్వామివారు పాల్గొన్నారు. ఈ సందర్భంగా అక్కడ చేరిన భక్తులకు హనుమత్ వైభవాన్ని ప్రవచించారు. అనంతరం భక్తులంతా ముక్త కంఠంతో శ్రవణపేయంగా హనుమాన్ చాలీసా పారాయణ చేసారు. వెంటనే హనుమత్ సహస్ర నామార్చన జరిగింది. తరువాత శ్రీస్వామివారు, శ్రీవేంకటేశ్వరస్వామివారిని సేవించుకొని నిలయానికి చేరుకున్నారు.

**31-7-2002 బుధవారం :** ఆరాధన అనంతరం తీర్థగోష్ఠి కాగానే ఉదయం 9గం॥లకు **Infrastructur Minister** శ్రీమాన్ అనిల్ బేచుగారి నిర్వహణలో ఉన్న గంగాతాలాబ్ ప్రాంతంలోని శ్రీ కాశీవిశ్వనాథ్ మందిర్‌ను శ్రీస్వామివారు సందర్శించారు. విశాలమైన ప్రాంగణంలో ఈ ఆలయాన్ని చాలా అందంగా నిర్మించారు. కాశీ విశ్వనాథునికి జరిగిన మహాభిషేకాన్ని శ్రీస్వామివారు సేవించారు. అనంతరం ఈ ఆలయం వెనుక ఉన్న గంగా తాలాబ్ (పుష్కరిణి)ని సందర్శించారు. ఈ పుష్కరిణి గత సంవత్సరమే నిర్మించారు. ఈ ఆలయ ప్రధానార్చకులకు కలిగిన స్వాప్నిక అనుభూతియే దీనికి ముఖ్యకారణం. ఈ పుష్కరిణిలో భారతదేశం నుండి గంగానది తీర్థాన్ని తెప్పించి కలిపారట. అప్పటినుండి దీనికి గంగాతాలాబ్ అనే పేరు ప్రసిద్ధమైంది. శ్రీస్వామివారు అక్కడ చేరిన భక్తులందరికీ మంగళాశాసనములు అందించి బయల్దేరారు.

ప్రధానార్చకులు శ్రీమాన్ మురళీధరన్ దొరై స్వామి, అధ్యక్షులు శ్రీమాన్ రామస్వామి, కోశాధికారి శ్రీమాన్ రామలింగంగారి ఆహ్వానంపై శ్రీస్వామివారు ఉ॥ 11 గం॥లకు రిచ్‌బా కాంప్ జాబ్ల్ (**Riche Bois Compdiable**) ప్రాంతంలోని తూకే అమ్మన్ కోవెలను సందర్శించారు.

మధ్యాహ్నం గం॥ 12 లకు మారిషస్

యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ శ్రీమాన్ ఫాగూని గారితో శ్రీస్వామివారు సంభాషించారు. వారు శ్రీస్వామివారిని తమ యూనివర్సిటీని సందర్శించి విద్యార్థులకు దివ్య సందేశాన్ని అందించవలసినదిగా ఆహ్వానించారు.

మధ్యాహ్నం 1-00 గం॥కు శివానందాశ్రమంలోనే మారిషస్ ద్వీప పత్రికా విలేఖరులతో సమావేశం జరిగింది. శ్రీవారి సందేశాన్ని మారిషస్ వాసులందరికీ అందించడానికి MBC రేడియో, MBC T.V., L' Express, Le Mauricien మొదలగు వార్తా సంస్థల నుండి ప్రతినిధులు పాల్గొన్నారు. అనంతరం MBC T.V., ప్రతినిధి శ్రీమతి మీరాగారు నిర్వహించిన ప్రత్యేక ఇంటర్వ్యూలో శ్రీస్వామివారు పాల్గొని తాము నిర్వహిస్తున్న ఆధ్యాత్మిక, సామాజిక కార్యక్రమాల వివరాలను అందించారు.

మధ్యాహ్నం గం॥ 2-30 ని॥లకు రేజూయీ (Raduit) ప్రాంతంలోని మారిషన్ యూనివర్సిటీని సందర్శించి ఆక్టేవ్ వే (Octve **Wiehe**) ఆడిటోరియంలో విద్యార్థులకు స్ఫూర్తిదాయకమైన సందేశాన్ని అందించి ముగ్ధుల్ని చేసారు. ప్రొఫెసర్స్ అందరూకూడ స్వామివారిని సేవించి ప్రవచనాన్ని విని అచ్చెరువొందారు. అధ్యక్ష ఉపన్యసంలో **Infrastructure Minister** శ్రీమాన్ అనీల్ బేచుగారు విశిష్టాద్వైత సంప్రదాయం యొక్క వైదిక ప్రామాణ్యాన్ని సంక్షిప్త మనోహరంగా ప్రసంగించారు. వారి అవగాహనకు శ్రీస్వామివారు ఆశ్చర్యంచెందిమంగళాశాసనాలు అనుగ్రహించారు. **Ex-Minister of Energy** శ్రీమాన్ మహేన్ ఉచానాగారు కూడా ఈ సమావేశంలో పాల్గొన్నారు. ప్రొఫెసర్స్, విద్యార్థులు అక్కడ చేరిన భక్తగోష్ఠి అందరికీ శ్రీస్వామివారు మంగళాశాసనాలు అందించి నిలయానికి చేరుకున్నారు.

సాయంకాలం 6-00 గం॥లకు శ్రీస్వామివారు 16వ మైల్ ఫారెస్ట్‌సైడ్ (16th Mile Forest Side) ప్రాంతంలో శ్రీశ్రీనివాసాచార్యస్వామివారి నిర్వహణలో ఉన్న శ్రీనివాస బదరికాశ్రమాన్ని సందర్శించారు. శ్రీమాన్ పార్థసారథిగారు అక్కడ జరిగే కార్యక్రమాలను చూస్తూ, ఆప్రాంగణంలోని శ్రీలక్ష్మీనారాయణ దేవాలయ ప్రధానార్చకులుగా చేస్తున్నారు. కళ్యాణ మండపం, గురుకుల పాఠశాల నిర్మాణం నిమిత్తం ఏర్పాటు చేసిన ఒక శిలాఫలకాన్ని శ్రీస్వామివారు ఈ సందర్భంగా ఆవిష్కరించారు. భక్తులకు తమ సందేశంలో అష్టాక్షరీ మంత్ర ప్రభావాన్ని వివరించి మంగళాశాసనాలు అందించారు.

***01-08-2002 గురువారము :*** ఈ రోజు ఉదయం గం॥ 5-30 ని॥లకు (మన సమయం ప్రకారం గం॥ 7-00లకు) అమెరికా వారికి టెలిబ్రిడ్జ్ తమ సందేశం ద్వారా గీతాజ్యోతి శ్లోక మాలికలోని 16వ శ్లోకాన్ని వివరించారు. తీర్థగోష్ఠి అనంతరం శ్రీమాన్ రాందాస్ యెల్లయ్యగారు శ్రీస్వామివారి ద్వారా సమాశ్రయణం పొంది ధన్యులయ్యారు. ఉ॥ 9 గం॥లకు శ్రీమాన్ ఉమాపతి శివాచార్యర్‌గారి ఆహ్వానాన్ని మన్నించి 'శిబెల్' (**Chebel**) ప్రాంతంలోని కాళీమాతా ఆలయాన్ని శ్రీస్వామివారు సందర్శించారు. శ్రీమాన్ ఉమాపతి, శివంగారు వీరు తమిళనాడు నుండి చాలాకాలం క్రితం ఇక్కడికి వచ్చి అందరి వైదిక అవసరాలను తీరుస్తున్నారు. కంప్యూటర్ ద్వారా జ్యోతిషం కూడా చెపుతుంటారు. ఈ ఏడు రోజులు కూడా శ్రీస్వామివారి కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొని విశేష సేవలందించారు. వీరి సోదరుడు శ్రీమాన్ మంగళేశ్వరం శివంగారు నిర్వహించే లోకనాయకీ సమేత పాపవినాశేశ్వరస్వామి ఆలయాన్నికూడా సందర్శించి మంగళాశాసనం చేసారు.

ఉదయం 11 గం॥లకు గ్లాస్ బాటమ్ బోట్ (**Glass Bottom Boat**)లో సముద్రంలోని వింతలు చూడ్డానికి ఆశ్రమం నుండి 60 కి.మీ ప్రయాణించి శ్రీస్వామివారు పరివారంతో భక్తగోష్ఠితో గ్రాండ్ బే (**Grand Bay**) ప్రాంతాన్ని చేరుకున్నారు. పడవ క్రింది భాగంలో గ్లాస్ అమర్చారు. పడవ వెడుతుంటే ఆ గ్లాస్ లో నుండి సముద్రపు అడుగు





స్పష్టంగా కనపబడుతుంది. అందమైన కోరల్స్‌ను, సముద్రపు మొక్కలను, రకరకాల రంగురంగుల అందమైన చేపలను స్పష్టంగా చూశారు. తెల్లటి ఇసుక, గుండుసూది పడితే కూడా కనిపించేంత స్వచ్ఛంగా సముద్రజలం ఉండటం చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. మారిషస్ ప్రభుత్వంవారు చాలా కట్టుదిట్టమైన ఆంక్షలు విధించి దీనిని పరిశుద్ధంగా ఉంచుతున్నారు. శ్రీస్వామివారికి మాకందరికీ కూడ ఈ సముద్ర విహార యాత్ర చాలా ఆనందాన్ని, ఆహ్లాదాన్ని కలిగించింది. ఈ కార్యక్రమానికి సహకరించిన **Centre (Sport)Nautique** నిర్వాహకులు శ్రీమాన్ కృష్ణ, శ్రీమతి మేరీలకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు అందించి నిలయాన్ని చేరుకున్నారు.

మధ్యాహ్నం 2 గం॥లకు **MBC T.V.,** ద్వారా శ్రీమాన్ రఘునాథ్ దయాళ్ గారు హిందీలో నిర్వహించిన ఇంటర్వ్యూలో శ్రీస్వామివారు పాల్గొన్నారు. ఇక్కడి టి.విలో హిందీ, తెలుగు, ఇంగ్లీష్‌లలో ఒక్కొక్క భాషకు ఒకొక్క సమయాన్ని కేటాయించి ప్రసారం చేస్తుంటారు. తమ సందేశంలో మానవ జీవితం యొక్క విశిష్టతను, అతడు సమాజంతో కలిసి బ్రతుకవలసిన తీరును వివరించారు.

సాయంకాలం గం॥ 5-30 ని॥లకు ఆంధ్ర మహాసభ అధ్యక్షులు శ్రీమాన్ బాలసుబ్బడు గారు, కల్చరల్ ప్రెసిడెంట్ శ్రీమాన్ నారాయణస్వామి సన్యాసిగారి ఆహ్వానంపై శ్రీస్వామివారు ఆంధ్ర మహాసభ భవనాన్ని సందర్శించారు. శ్రీస్వామివారు తమ సందేశంలో తెలుగుభాష విశిష్టతను, ప్రాచీనతను మిగిలిన భాషలలో లేనటువంటివి, తెలుగు భాషకు మాత్రమే ఉన్నటువంటి అనేక విశేషాల్ని వివరించి, ఆ భాషను రక్షించుకొన వలసిన బాధ్యత మనపై ఉందని ప్రవచించారు. మన తెలుగువాళ్ళు చాలామందే ఉన్నా వారికి తెలుగు భాష రాదు. 'మాతెలుగు తల్లికి మల్లెపూదండ.........., ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు..... ఇలా రెండు మూడు మాటలు మాత్రం వచ్చును.

ఈ సందర్భంగా మారిషస్ క్రీడామంత్రి శ్రీమాన్ రవి యెరిగాడు గారు, భారత్ హై కమీషనర్ శ్రీమాన్ విజయ్ కుమార్ గారు కూడా విచ్చేసి శ్రీస్వామివారిని సేవించుకొని మంగళాశాసనములు స్వీకరించారు.

రాత్రి గం॥ 8 లకు శ్రీమాన్ రామమూర్తి వెంకటస్వామి శ్రీమతి నిర్మల దంపతులు ఆహ్వానంపై శ్రీస్వామివారు బులేరూజ్ సెంట్రల్ ఫ్లాక్ (**Boulet Rouge Centre de Flacq**) ప్రాంతంలోని నర్మదీశ్వర ఆలయాన్ని వేంచేసారు. ఈ సందర్భంగా ఆ ప్రాంతంలోని అశేషభక్తజనం శ్రీస్వామివారిని సేవించి, వారి ప్రవచనాన్ని వీనుల విందుగా ఆలకించి ధన్యులయ్యారు.

***02-08-2002 శుక్రవారం :*** ఈ రోజునుండే లాలోరా శ్రీప్రసన్న వేంకటేశ్వరస్వామివారి ఉత్సవాలు ప్రారంభం. ఉ॥ తీర్థగోష్ఠి సమయంలో శ్రీమాన్ అలెన్‌గనూ, **Hon. Minister for Energy & Public Utilities** గారు శ్రీస్వామివారిని సేవించుకొని మంగళా శాసనములు స్వీకరించారు. శ్రీస్వామివారికి ఉన్న వారంరోజులూ కారును, రక్షణ వ్యవస్థను వీరే ఏర్పాటు చేసారు. శ్రీమాన్ రామదాసుగారు శ్రీస్వామివారిని ప్రార్థించి సమాశ్రయణములు పొందారు. శ్రీవారి శిష్యులుగా వారాహ్వానించిన ఘనత పొందాలని శ్రీమాన్ రామదాసుగారి ఆరాటమట శ్రీవారు వారిని అనుగ్రహించారు.

శ్రీస్వామివారు ఉ॥ 11 గం॥లకు లాలోరా ప్రసన్న వేంకటేశ్వరస్వామివారి మందిరాన్ని చేరుకొని పెరుమాళ్ళను సేవించి గంటన్నరసేపు భక్తగోష్ఠికి తమ మంగళాశాసన పూర్వక ప్రవచనాన్నను గ్రహించారు.

మ॥ 3-00 గం॥లకు అధ్యక్షులు శ్రీమాన్ దినేష్ సింగ్ గోపాల్, కార్యదర్శి తారీనాథ్ గోపాల్, అర్చకస్వామి శ్రీమాన్ నారాయణ్ మెహతా గారి ఆహ్వానంపై శ్రీస్వామివారు స్వయంభో లింగేశ్వర మందిర్‌ను సందర్శించారు. ఆలయాన్ని మాత్రం చాలా శుభ్రంగా చక్కగా నిర్వహిస్తున్నారు.

శ్రీస్వామివారు ఈ విషయంలో వారిని శ్లాఘించారు. ఈ ఆలయానికి వచ్చే భక్తులు చాలావరకు 'మార్వాడీలే'. శ్రీస్వామివారు తమ ప్రవచనాన్ని హిందీలో అనుగ్రహించి అందరికీ మంగళా శాసనములు కృపచేసారు.

సాయంకాలం 7 గంIIలకు శ్రీస్వామివారు లాలోరా ప్రసన్నవేంకటేశ్వరస్వామి ఆలయానికి వేంచేసి శ్రీలక్ష్మీనారాయణ పూజా కార్యక్రమాన్ని చేయించారు. అన్ని విషయాలు విడమరచి చెప్తూ విధివిధానంగా చేయించారు. శ్రీస్వామివారు పూజ చేయించే విధానం అందరిని అలరించింది, ఆకర్షించింది కూడా.

**03-08-2002 శనివారం :** శ్రీస్వామివారు 9గంIIలకు బోబాసిన్ (**Bobassin**) ప్రాంతంలోని చిన్మయా మిషన్‌ను సందర్శించారు. అక్కడ చేరిన వారందరికి శ్రీస్వామివారు స్ఫూర్తిదాయకమైన సందేశాన్నను గ్రహించి, మంగళాశాసనం చేసారు.

ఉII 10-00 గంIIలకు లాలోరా శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి ఆలయానికి విచ్చేసి శ్రీసుదర్శన యజ్ఞం ప్రారంభించారు.

ఇదే రోజు సాయంకాలం 7గంIIలకు శ్రీస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో ఆనందసందో హంగా అత్యంత వైభవంగా ప్రసన్న వేంకటేశ్వర స్వామివారి కళ్యాణమహోత్సవం జరిగింది.

శ్రీస్వామివారు ఆగమనానికి ముఖ్య కారణమైన 'తెప్పోత్సవం' 4వ తేదీన. ఉదయం ఆరాధన పూర్తిచేసుకొని **MBC T.V.,** నుండి శ్రీమతి గీతాంజలిగారు తెలుగులో నిర్వహించిన ఇంటర్వ్యూలో శ్రీస్వామివారు పాల్గొన్నారు.

గంII 9-03 నిIIలకు లాలోరా ఆలయాన్ని చేరుకుని భగవద్గీతపై తమ ప్రవచనాన్నను గ్రహించారు. గీతాజ్యోతి కార్యక్రమంలో ఇది 17వ వారం. ఈ వారం 6వ అధ్యాయంలోని 17వ, శ్లోకం ''యుక్తాహార విహారస్య......'' ఈ శ్లోకాన్ని శ్రీస్వామివారు అందరి చేత అనిపించి, దాని తాత్పర్యాన్ని వివరించారు.

ఉII 11-00 గంIIలకు శ్రీస్వామివారు శ్రీరంగరాజ పెరియపిరాట్టియార్ కోవెల నిర్మాణానికి శంకుస్థాపన చేసారు. 1998లో శ్రీమాన్ ఉమాపతి శివాచార్యర్‌గారు. 'భారతదేశం నుండి ఒక వైష్ణవాచార్యుల ద్వారా ఈ ఆలయానికి శంకుస్థాపన చేయించాలని' సంకల్పించారు. శ్రీస్వామివారి రాకతో ఆ సంకల్పం యదార్థరూపందాల్చింది.

4-8-2002 శ్రీస్వామివారి మారిషస్ టూర్‌లో ప్రధాన ఘట్టం హిందూ మహాసముద్రములో జరిగే 'తెప్పోత్సవం'. దీనికి ముందు లాలోరా ప్రసన్న వెంకటేశ్వర ఆలయం నుండి Mon Choicy Beach వరకు సుమారు 25 కి.మీ. దూరంవరకు శోభాయాత్ర.

మధ్యాహ్నం గంII 2-30 నిIIలకు ఉత్సవ విగ్రహాలను అందంగా అలంకరించబడిన యాంత్రిక రథముపై వేంచేపు చేసారు. శ్రీస్వామివారు ప్రత్యక్షపర్యవేక్షణలో లాలోరా ఆలయం నుండి శోభాయాత్ర ప్రారంభమ యింది. సుమారు 200 పైగా వాహనాలు, అశేష భక్తజనం వివిధ ప్రాంతాలనుండి ఈ శోభాయాత్రలో పాల్గొన్నారు. మధ్యలో అనేక ఆలయాల యాజమాన్యం పెరుమాళ్ళకి, శ్రీస్వామివారికి ఆనందస్వాగత సుమాంజలిని సమర్పించారు.

మొట్టమొదటగా సేయింట్ పియరీ (St. Pierre) లో మారిషస్ ఆంధ్రమహాసభ వారు నడిపే విష్ణు ఆలయాన్ని సందర్శించి మంగళాశాసనం చేసారు. శోభాయాత్ర మారిషస్ రాజధాని పోర్ట్ లూయిన్ నగరం వైపుగా సాగింది. పోర్ట్‌లూయిన్‌లోని విష్ణుక్షేత్ర మందిరాన్ని శ్రీస్వామివారు మంగళాశాసనం చేసారు. అనంతరం శోభాయాత్రలో భాగంగా హిందూమహాజన సంఘము వారి ఆహ్వానంపై శ్రీస్వామివారు సినతాంబు (Sinatambou)ప్రాంతంలోని శ్రీకృష్ణ ద్రౌపది అమ్మన్ కోవెలను సందర్శించి మంగళా శాసనం చేసారు.

చివరగా సనాతన ధర్మ టెంపుల్స్ ఫెడరేషన్ వారి ఆహ్వానంపై ట్రియొలెట్ (Triolet) ప్రాంతంలోని మహేశ్వరనాథ్ (శివ) ఆలయాన్ని సందర్శించి మంగళా శాసనం చేసారు. శోభాయాత్ర అశేషభక్త జనంతో Mon Choicy Beach చేరుకునే సరికి సాయంకాలం గంII 6-30 నిIIలు అయింది. అప్పటికే అక్కడ శుద్ధికార్యక్రమం చేసి, పెరుమాళ్ళు వేంచేయడానికి వైభవోపేతమైన ఏర్పాట్లు చేసారు. అటు ఈ కార్యక్రమాన్ని సేవించడానికి మారిషస్ దేశ నలుమూలల నుండి అశేష జనప్రవాహము అప్పటికే అక్కడ చేరి శ్రీస్వామివారు మరియు పెరుమాళ్ళ రాకకై నిరీక్షిస్తూ ఉన్నారు. ఎవరికీ ఎలాంటి ఇబ్బంది, ప్రమాదం కలగకుండా శ్రీమాన్ అనిల్ బేచు, ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ మినిస్టర్‌గారు కట్టుదిట్టమైన రక్షణ వ్యవస్థను ఏర్పాటు చేసారు. అక్కడ చేరిన అశేష భక్తజనాన్ని ఉద్దేశిస్తూ శ్రీస్వామివారు తమ మృదుమధుర ప్రవచనాన్ని అనుగ్రహించారు. మారిషన్ చిన్నదీవవే అయినా మన భారతీయ సంప్రదాయానికి సంబంధించి సుమారు 300 దేవాలయాలున్నాయి. అన్ని దేవాలయాల ప్రముఖులు ఆ వేళ తెప్పోత్సవానికి విచ్చేసారు. వారందరినిఉద్దేశించి శ్రీస్వామివారు మాట్లాడుతూ మీరంతా ఒక కమిటిగా ఏర్పడి సంవత్సరంలో కనీసం మూడు సార్లైనా 'ఒకచోట కలిసి' భాషాభేదం వదలి, ఉత్సవాలు నిర్వహించుకో వాలన్నారు.





వచ్చే శ్రీరామనవమి ఉత్సవాన్ని అందరూ కలిసి జాతీయ పండుగగా జరుపుకుంటే బాగుంటుందన్నారు. ఎవరి ఆలయాల్లో వారు ఈ ఉత్సవాన్ని నిర్వహించుకునే ఆనవాయితీని పాటిస్తూ నవమికి ఒక రోజు అటు ఇటుగా ఆదివారం వచ్చేట్టుగా జరుపుకుంటే చాలా బాగుంటుందన్నారు. మీరు కనుక అలా ఏర్పాటు చేస్తే మేము తప్పకుండా ఆ ఉత్సవంలో పాల్గొంటాం అని ప్రోత్సాహాన్ని కల్గించారు శ్రీస్వామి వారు. ఈ మాట వినగానే భక్తులందరిలో ఆనందం, ఉత్సాహం వెల్లివిరిసాయి.

లాలోరా ఆలయ అర్చకపరివారం పెరుమాళ్ళని విద్యుద్దీపాలతో వైభవంగా అలంకరించబడిన చిన్న ఓడలో వేంచేపు చేసారు. శ్రీస్వామివారు పరివారంతో వేంచేయగానే తెప్పోత్సవం ప్రారంభమ యింది. తిరుమల పుష్కరిణిలో వెంకన్నకు జరిగే తెప్పోత్సవాన్ని చూసి ప్రభావితులైన శ్రీమాన్ నరసింహాచార్యులుగారనే పాత అర్చకులు మొదటగా ఈ ఆలోచనకునాంది పలికారు. శ్రీస్వామివారి ఆగమనంతో అంతటి వైభవంగా జరిపించాలనే సంకల్పం నేటికి నిజమయ్యింది.

శ్రీస్వామివారి ప్రత్యక్షపర్యవేక్షణలో అత్యంత విశాలమైన హిందూ మహా సముద్రంలో తెప్పోత్సవం. భక్తగోష్ఠి అంతా తీరాన ఉండి ఈ ఉత్సవాన్ని సేవించు కున్నారు. పెరుమాళ్ళు వేంచేసి ఉన్న ఓడ సముద్రంలో మూడు ప్రదక్షిణలు చేసింది. మొదటి ప్రదక్షిణ వేద మరియు దివ్యప్రబంధ పారాయణలతోను, రెండవది నాదస్వరము, సంగీతము, భజనలతోను, మూడవది మౌనంగా సాగింది. ఒడ్డున ఉన్న భక్తజన మంతా 'జై శ్రీమన్నారాయణ!' అంటూ సముద్రఘోషకు ధీటుగా నినాదాలు చేసారు.

తెప్పోత్సవం పూర్తికాగానే శ్రీస్వామివారు మాట్లాడుతూ ప్రతి సంవత్సరం కూడా ఈ తెప్పోత్సవాన్ని ఇలాగే జాతీయ పండుగగా జరుపుకుంటే బాగుంటుంది. మేమూ ఈ ఒక్కరోజు పాల్గొనడానికి తప్పకుండా వచ్చేప్రయత్నం చేస్తామన్నారు. మారిషస్ భక్తులంతా హర్షాతిరేకాన్ని వ్యక్తం చేసారు. ఈ ఉత్సవానికి అన్ని ఏర్పాట్లు చేసిన శ్రీమాన్ అనిల్ బేచుగారికి శ్రీస్వామివారు అనేక మంగళాశాసనములు కృపచేసారు. వీరు సతీసమేతంగా వచ్చి ఈ ఉత్సవంలో పాల్గొని శ్రీస్వామివారి అనుగ్రహాన్ని పొందారు. తెప్పోత్సవంలో ఎలాంటి ప్రమాదం రాకుండా కట్టుదిట్టమైన రక్షణ కల్పించిన '**Navy Force**' వారికి, ఈ కార్యక్రమంలో సేవలందించిన వాలంటీర్స్ బృందానికి, కార్యక్రమాన్ని కన్నుల పండుగగా సేవించిన భక్తులందరికి, కార్యక్రమాన్ని అందంగా తగురీతిలో నిర్వహించిన కమిటి మరియు అర్చక పరివారానికి శ్రీమాన్

రామదాసుగారు కృతజ్ఞతలు చెప్పి, ప్రతి ఏడాది భక్తులందరినీ తీస్కొని శ్రీస్వామివారీ తెప్పోత్సవాన్ని ఓ ఆధ్యాత్మిక విహారయాత్ర అయ్యేటట్లు విచ్చేయాలని కోరారు. ప్రయత్నిస్తామంటూ శ్రీస్వామివారు మంగళా శాసనాలందించి నిలయానికి చేరుకున్నారు.

5-8-2002 ఉ॥ తీర్థగోష్ఠి అనంతరం 10 మంది భక్తులు శ్రీస్వామివారి ద్వారా సమాశ్రయణమై, సత్సంప్రదాయంలోకి ప్రవేశించే భాగ్యాన్ని పొందారు. సాయంకాలం వరకు మారిషన్‌లోని అనేక మంది ప్రముఖులు శ్రీస్వామివారిని సందర్శించి మంగళాశాసనాలు స్వీకరించారు.

సాయంకాలం 5 గం॥లకు మారిషన్ విమానాశ్రయం చేరుకున్నారు. అశేషభక్తజనం, ప్రభుత్వ అధికారులు, అనధికారులు వీడ్కోలు చెప్పడానికి విమానాశ్రయానికి విచ్చేసారు. వారందరికి శ్రీస్వామివారు తమ దివ్య మంగళాశాసనములను గ్రహించారు. సా॥ 6-30కు పరివారంతో శ్రీస్వామివారు 'ఎయిర్ మారిషన్' వారి విమానంలో భారతదేశానికి బయల్దేరారు.

## మారిషస్ లో నా అనుభవాలు

**ముక్కా దేవేందర్ గుప్త, నిజామాబాద్**

శ్రీస్వామివారి సన్నిధిలో ఇంద్రధనుస్సుల దీవి మారిషన్‌లో వారంరోజులు ఆధ్యాత్మిక వాతావరణంలో నా సతీమణితోపాటు పాల్గొని తరించాను. ఇది భగవంతుడు నాకు నా జీవితంలో ప్రసాదించిన వరంగా భావిస్తున్నాను. శ్రీస్వామివారి కార్యక్రమానికి మారిషస్‌లోని సామాన్య ప్రజలేకాక అక్కడి మంత్రులుకూడా పాల్గొనడం విశేషం. వారు చేసిన ప్రసంగాలలో వేదాలు, ఉపనిషత్‌లు భగవద్గీత గురించి పేర్కొనడం అత్యంత ఆశ్చర్యాన్ని కలిగించింది. శ్రీస్వామివారిని సేవించుకొన్ని అక్కడి క్రీడల మంత్రి శ్రీమాన్ రవి యెరిగాడుగారికి కేవలం 24 సం॥లు మాత్రమే. ఆటపాటలలో గడిపే వయస్సులో అమాత్యపదవిని చేపట్టడం ఆధ్యాత్మిక చింతన కలిగిఉండటం మరిచిపోలేని దివ్యానుభూతిని కలిగించింది. శ్రీ వేంకటేశ్వర స్వామివారి తెప్పోత్సవంలో పాల్గొన్న అక్కడి ప్రజల దైవభక్తి, ఆలోచనలు మనకన్నా ఎన్నో రెట్లు ఉన్నతంగా ఉండుట ఆ ప్రజల యొక్క మహద్భాగ్యంగా భావిస్తాను.

ఎక్కడో ఉన్న పాశ్చాత్య సంస్కృతి మనపై తీవ్రంగా నాటుకుంది. కానీ మారిషన్‌లో విదేశీయుల పర్యటనలు విశేషంగా ఉన్నా, వారి సంస్కృతి ప్రభావం వీరిపై ఏ మాత్రం పడలేదు. ఆశ్చర్యంకదూ!!!

## చెన్నై

6-8-2002 శ్రీస్వామివారు మారిషస్ నుండి తెల్లవారు ఝామున (భారతకాలమాన ప్రకారం) గం॥ 2-30ని॥లకు చెన్నై చేరుకొని శ్రీమతి ఉమ్మడి లలితాదేవిగారి గృహంలో బస చేసారు. తీర్థగోష్ఠి అనంతరం ఉ॥ 11 గం॥లకు చెన్నై జెట్ కార్యాలయంలో పత్రికా విలేఖరుల సమావేశంలో పాల్గొని మారిషస్ విశేషాలు పంచుకున్నారు. సమావేశంలో మాట్లాడుతూ మారిషస్‌లో వలెనే మన దేశంలో కూడా భాషాపరమైన విభేదాలు న్నాయి. వాటిని తొలగించు కోవాలంటే అందరికీ కామన్‌గా ఉండే ఒక భాషను ఎన్నుకోవాలి. అలాంటిది సంస్కృతభాష తప్ప మరొకటి లేదుకదా! మారిషన్ చిన్న దేశం కనుక భాషాపరమైన విభేదాలవల్ల జరిగే ప్రమాదం అక్కడ తెలుస్తోంది. అధికశాతం జనాభా భారతదేశం వాళ్ళు ఉన్నా అత్యల్ప శాతంగా ఉన్న ఫ్రెంచ్ జాతీయులు అక్కడ ప్రధానమంత్రిగా ఉండాల్సిన నిర్బంధం ఏర్పడింది. భాషాపరమైన ఏకత లేకపోయి నట్లయితే మన దగ్గరకూడా అట్లాంటి స్థితి వెంటనే కాకపోయినా ఏర్పడే అవకాశం ఉంది. దాన్ని తొలగించుకుంటూ అందరికీ అనుసంధాన భాషగా సంస్కృతాన్ని ఏర్పాటు చేసుకోవడం చాలా అవసరం అని శ్రీస్వామివారు పత్రికా విలేఖరుల సమావేశంలో చెప్పారు.

అనంతరం 'ఆల్ ఇండియా రేడియో' చెన్నై స్టేషన్ ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్ శ్రీమతి డా॥ జి. లలితగారి అభ్యర్థనపై శ్రీస్వామివారు 'సూక్తి సుధ' అనే కార్యక్రమానికి తమ సందేశాన్ని అనుగ్రహించారు.

సాయంకాలం 9 గం॥లకు శ్రీవారు చెన్నై నుండి విమానంలో హైదరాబాద్ చేరుకుని జెట్‌లో బసచేసారు.

## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషి చేస్తున్నవారిలో ఒకరు శ్రీమతి శైలజా కృపాకర్ రెడ్డి (రామాంతపూర్)గారు, వీరుఎంతోమందికి మన భక్తినివేదనను పరిచయం చేస్తూ, వారందరినీ మన కుటుంబంలో కలుపుతున్నారు. వీరి కృషి మరింత ఫలప్రదం కావాలని

శ్రీశ్రీశ్రీస్వామివారు అనేక మంగళాశాసనములు కృపచేసారు.





## హైదరాబాద్

7-8-2002 ఈరోజు శ్రీస్వామివారు శ్రీమాన్ రాంగోపాల్ రెడ్డి మాజీ ఎం.పి. గారి పరమ పదోత్సవంలో పాల్గొన్నారు. శ్రీమాన్ రామ్ గోపాల్ రెడ్డి, భూలక్ష్మమ్మ దంపతులు చాలాకాలం శ్రీ పెద్దజీయరు స్వామివారి కార్యక్రమాల్లో పాల్గొని స్వామివారి అభిమానాన్ని విశేషంగా పొందినవారు. శ్రీమాన్ రామ్‌గోపాల్ రెడ్డిగారు 3 సార్లు వరుసగా ఎం.పిగా ఉండటం మాత్రమేకాక ఆధ్యాత్మికంగా కూడా పరిచయం సమాశ్రయణంద్వారా పొంది సంప్రదాయ బద్ధులుగా సంప్రదాయ పోషకులుగా ఉండేవారు. కారు ప్రమాదంలో మరణించిన వీరి సమాచారాన్ని విని శ్రీస్వామివారు శ్రీమతి భూలక్ష్మమ్మగారికి సందేశాన్ని పంపించి పరమపదోత్సవాన్ని జరిపించడానికి స్వయంగా విచ్చేసారు. గోష్ఠి అనంతరం శ్రీమాన్ రామ్‌గోపాల్ రెడ్డిగారితో తమ కుండే పరిచయాన్ని శ్రీస్వామివారు ప్రస్తావించారు. పెద్దస్వామివారు చదువుకొమ్మన్న సంక్షేప రామాయణమును చివరి వరకు కూడా పారాయణం చేసారట. ఒకసారి ఎం.పిలతో కలసి రష్యాకు వెళ్ళినప్పుడు కూడా రామాయణ విశేషాలను వివరించే సందర్భంలో మిగిలిన ఎం.పి.లకు తెలియని ఎన్నో విషయాలను తాము అక్కడి వారికి తెలియ జేసి మన దేశ గౌరవాన్ని ఎట్లా కాపాడింది శ్రీస్వామివారికి తెలిపారట. ఆ విషయాన్ని ఈ సందర్భంగా శ్రీస్వామివారు ప్రస్తావించి వారి కుమార్తె శ్రీమతి మంగమ్మ దామోదర్ రెడ్డి, కుమారుడు వెంకటశ్రీనివాస రెడ్డి దంపతులకు మంగళాశాసనాలు కృపచేసారు.

8-8-2002 హైదరాబాద్ పత్రికా విలేఖరుల సమావేశంలో శ్రీస్వామివారు మారిషస్ పర్యటనా విశేషాలు ప్రస్తావించారు.

9-8-2002 ఈరోజు గీతాజ్యోతి కార్యక్రమాలను పర్యవేక్షిస్తూ శ్రీస్వామివారు హైదరాబాద్‌లోనే వేంచేసి ఉన్నారు. శ్రీమాన్ దడవాయిరాఘవేంద్రరావు, శ్రీమాన్ డా॥ దడవాయి చంద్రశేఖర్, శ్రీమతి యస్. మీనాక్షి, శ్రీమాన్ చొక్కా పురుషోత్తంగార్ల గృహాలకు వేంచేసి పాదపూజను స్వీకరించి, మంగళాశాసనాలు అనుగ్రహించారు. అనంతరం 'మైహోమ్ కన్స్‌ట్రక్షన్స్' అధినేత శ్రీమాన్ డా॥ రామేశ్వరరావుగారు, హైటెక్ సమీపంలో నూతనంగా నిర్మించిన 'నవదీప్' అపార్ట్‌మెంట్స్‌ను సందర్శించి మంగళాశాసనం చేసారు.

10వ తేది ఉదయం 6 గం॥లకు హైదరాబాద్ నుండి విమానంలో వైజాగ్ బయల్దేరారు.

## వైజాగ్

10-8-2002 ఉ॥ 9 గం॥లకు BHPVలో సుమారు 20 సం॥ల క్రితం శ్రీస్వామివారే

ప్రతిష్ఠించిన శ్రీవేంకటేశ్వర స్వామివారి ఆలయ ప్రాంగణంలో నూతనంగా నిర్మించిన కళ్యాణ మండపాన్ని ప్రారంభించి అక్కడివారందరికీ మంగళా శాసనాలు అనుగ్రహించారు.

శ్రీస్వామివారు, కూర్మన్న పాలెంకు వేంచేసి UAN రాజుగారి ఔదార్యంతో నిర్మించిన వేంకటేశ్వర స్వామివారి దేవస్థానాన్ని సందర్శించారు. ఆ తరువాత శ్రీస్వామివారు, శ్రీమాన్ బలరాం రెడ్డిగారి ఆహ్వానంపై గాజువాకలోని 'శ్రీకృష్ణ కాలేజ్'ని సందర్శించి విద్యార్థులకు స్ఫూర్తిదాయకమైన సందేశాన్నిచ్చి మంగళాశాసనాలు కృపచేసారు. వెంటనే గీతాజ్యోతి కార్యక్రమ కన్వీనర్ శ్రీమాన్ రామానుజంగారి గృహానికి వేంచేసి మంగళాశాసనం చేసారు. అక్కడి నుండి జెట్ భవన నిర్మాణం కోసం కేటాయించిన స్థలాన్ని సందర్శించారు. శ్రీమాన్ దాసుగారి ఆహ్వానాన్ని మన్నించి పరదేశిపాలెం లోని శ్రీ లక్ష్మీనారాయణ కోవెలకు వేంచేసి మంగళా శాసనం చేసారు. ఈ కార్యక్రమాని కంతాకూడ శ్రీమాన్ సత్యనారాయణ (స్నేహధార)గారు, సారథ్యం వహించగా, శ్రీమాన్ రామానుజంగారు కార్యక్రమాలను క్రమబద్ధంగా ఏర్పాటు చేసారు వీరికి శ్రీస్వామివారు విశేష మంగళాశాసనాలు కృపచేసారు. సా॥ 4 గం॥లకు విజయనగరం బయల్దేరారు శ్రీవారు.

## విజయనగరం

శ్రీస్వామివారు సా॥ 5 గం॥లకు విజయనగరం చేరుకొని, ముందుగా వారి ఆదేశానుసారం విజయనగరం జెట్, వికాస తరంగిణివారు నిర్వహిస్తున్న **నేత్రవిద్యాలయా** నికి వేంచేసారు. స్విట్జర్లాండ్ నుండి విచ్చేసిన మేడమ్ డానియేల హూసర్‌గారికి పాఠశాలను అంతా చూపించి అందులో విద్యార్థులు చేసే కార్యక్రమాలను వివరించారు. రాత్రి యమ్.యస్.యన్. రాజుగారి గృహంలో బసచేసారు.

11-8-2002న ఆండాళ్ తిరునక్షత్రం శ్రీమాన్ యమ్.యన్.యన్.రాజుగారి గృహంలో నిర్వహించి భక్తులకు తీర్థప్రసాద గోష్ఠి అనంతరం అంధుల పాఠశాలయొక్క వార్షికోత్సవమును మరియు నూతన భవన ప్రారంభోత్సవమును శ్రీస్వామివారు జరిపించారు. ఈ కార్యక్రమంలో 'భక్తినివేదన సంపాదకులు' ఉ.వే.శ్రీమాన్ శ్రీరామచంద్రా చార్యస్వామి వారు, ఆం.ప్ర.రాష్ట్ర రెవిన్యూ శాఖా మాత్యులు శ్రీమాన్ పూసపాటి అశోక గజపతిరాజుగారు, జిల్లా కలెక్టర్ శ్రీమాన్ హరిప్రీత్ సింగ్ గారు, M.L.A. శ్రీమాన్ సాంబశివరాజుగారు, జిల్లా విద్యాశాఖాధికారి శ్రీమాన్ డా॥ యన్. అప్పలనాయుడుగారు, మున్సిపల్ చైర్మన్ శ్రీమతి కనకమహాలక్ష్మీగారు, జిల్లా పరిషత్ చైర్మన్ శ్రీమతి ఝాన్సీలక్ష్మీగారు, P.D., D.R.D.L శ్రీమాన్ వీరభద్రయ్యగారు, శ్రీమతి ఉదయలక్ష్మి I.A.S.,గారు, శ్రీమాన్ డి.వి. రమణకుమార్ ప్రిన్సిపల్- పోలీస్ ట్రైనింగ్ కాలేజ్ గారు, వికలాంగుల అభివృద్ధి శాఖ అసిస్టెంట్ డైరెక్టర్ శ్రీమాన్ అబ్రహాంగారు, ఈ కార్యక్రమంలో విశిష్ట అతిథులుగా పాల్గొన్నారు.

ఆరంభంలో విద్యార్థులందరూ ఉపనిషత్ ప్రార్థన, భగవద్గీత శ్లోకాలు చదవడం అతిథు లందరికి ఎనలేని సంతోషాన్ని కలిగించింది. అనంతరం శ్రీమతి కృష్ణకుమారి గారు పాఠశాల నివేదికను సమర్పించారు.

చదువుల పండుగ అనే ప్రభుత్వ కార్యక్రమం ఈ పాఠశాల వార్షికోత్సవంతో సమాప్తం కావడం తమకు ఆనందాన్నిస్తోందని వారంతా సంతోషాన్ని వ్యక్తం చేసారు. ముందుగా పాఠశాల అధ్యాపకు లుగా ఉండే శ్రీస్వామివారి శిష్యులు శ్రీమాన్ సురేంద్ర మాట్లాడుతూ తమకు శ్రీస్వామివారు కంప్యూటర్లనిచ్చారని విద్యార్థులకు మరొక ప్రింటర్ ఇస్తూ ప్రభుత్వపరంగా పాఠశాలకు గుర్తింపు ఇవ్వాలని ఆర్థిక సహాయం కూడా అందించాలని కోరారు. శ్రీమతి బేబిగారు కార్యదర్శి నివేదికను అందిస్తూ ప్రభుత్వాధికా రులను ఈ క్రింది విషయాలను కోరారు.

1. **ప్రస్తుతమీ పాఠశాలలోనాగే 6,7 తరగతులకు ఉన్నత ప్రాథమిక పాఠశాలగ గుర్తింపు నీయడం.**





2. **ఈ రెసిడెన్సియల్ పాఠశాలలను ప్రభుత్వ ఎయిడెడ్ పాఠశాలలుగా నిర్ధారించుట.**
3. **నల్గొండ జిల్లాలో శ్రీ స్వామివారు ఆశీస్సులతో నిర్వహిస్తున్న అంధుల పాఠశాలకు అచ్చటి జిల్లా కలెక్టర్ గారు సమకూర్చినట్లుగా రెండు బ్రెయిలీ కంప్యూటర్లు మరియు ప్రింటర్‌తో సహా ఇప్పించుట.**
4. **వికలాంగుల అభివృద్ధి శాఖా పరంగా ఉపకార వేతనములు, ఆధునిక పరికరములు, రవాణా పాసులు కల్పించుట.**
5. **కేంద్ర ప్రభుత్వము నుండి భవన నిర్మాణము నకు, ఫర్నీచర్, పాఠ్య పరికరము లకు మరియు ఉపాధ్యాయుల, వార్డెన్‌ల జీతభత్యాలు, వైద్యఖర్చులు, విద్యార్థుల వసతి వగైరాలకు గ్రాంట్స్ మంజూరు చేయించుట.**
6. **విద్యార్థులకు తదితర అనాథలకు భోజన వసతి కల్పించుటకు కావలసిన బియ్యం, నిత్యావసర వస్తువులను రాయితీ ధరలపై కలెక్టరు గారు సమకూర్చుట.** తదుపరి

రెవెన్యూశాఖా మాత్యులు మాట్లాడుతూ ఈ అంధబాలల నేత్ర విద్యాలయానికి బాధ్యతగల పౌరునిగా తన కర్తవ్యాన్ని నెరవేరుస్తా నన్నారు. జిల్లా కలెక్టర్ గారు స్వామివారు జరిపే గీతాజ్యోతి కార్యక్రమాన్ని గురించి బాగా ప్రశంసించి తమ అధికార బృందానికి కూడ ఈ గీతాజ్యోతి కార్యక్రమాన్ని అందించమని పాల్గొనే అవకాశం ఇమ్మని కోరారు. నివేదికలో ప్రస్తావించిన విషయాలపై వెంటనే స్పందించి జిల్లా విద్యాశాఖాధికారికి ఏడవ తరగతికి గుర్తింపు వచ్చే ఏర్పాటు చేయమని ఆదేశించారు. లోగడ స్వామివారు అందించిన బ్రెయిలీ కంప్యూటర్ నేర్చుకొనే విధానం తమకు సంతృప్తిని కలిగించిందని మరొక కంప్యూటర్‌ని దానితోపాటు ప్రింటర్‌ని త్వరలో ఏర్పాటు చేస్తామని వాగ్దానం చేసారు. ఆర్థిక సహాయం కేంద్రం చేయవలసి ఉంటుందని, చేయడానికి కావలసిన ప్రాతిపదికల్ని, ప్రతిపాదనలను వెంటనే తయారు చేసి ఆ విషయంలో తగిన సహాయం అందించవలసిందని అక్కడి విద్యాశాఖాధికారిని ఆదేశించారు. అధికార అనధికారుల నుండి ఎదుర్కొనే బాలారిష్టములు ఈ విధంగా పరిష్కారం కావడం అక్కడి కార్యకర్తలందరికీ సంతోషాన్ని కలిగించింది.

అతిథులుగా విచ్చేసిన శ్రీమాన్ UAN రాజుగారు ప్రతినెల రూ. 5000/- ఇస్తామని వాగ్దానం చేసారు. ఈ పాఠశాల ప్రారంభం నుండి శ్రీమతి కృష్ణకుమారిగారు రూ. 5000/-, శ్రీ ఆర్.వి. జి.కె. రంగారావు (బొబ్బిలిరాజా)గారు రూ. 2000/-, పిరాట్ల అయ్యప్పగారు రూ. 1000/- ఇంకను 35 మంది వరకు ప్రతినెల 500/-, 100/-, 50/- చొప్పున వారి శక్తి మేరకు విరాళాలు పాఠశాలకు అందిస్తున్నారు. ఇంకెందరో ఏకమొత్తంగాను, నెలవారీ విరాళంగాను, వస్తురూపేణ సహాయాన్ని అందిస్తున్నారు. ఈ సందర్భంగా Inner Wheel Club ప్రెసిడెంట్ శ్రీమతి దుర్గాఉమగారు మరియు శ్రీబాలాజీగారు విద్యాశాఖవారి హామీగా ఇచ్చిన రూ. 25,000/-, బ్యాంక్ డిపాజిట్‌తో కలసి రూ. 40,000/-, ఆట స్థలము నిర్మాణమునకై శ్రీమతి పూర్ణిమా సతీష్‌గారు సేకరించిన రూ. 10,000/-లను పాఠశాల కమిటి వారికి అందజేశారు.

ఇప్పుడు ప్రస్తుతం అధ్యాపకులకు ఒక్కొక్కరికి 600/-, 700/- మాత్రమే వేతనాలు ఇస్తున్నారు. శ్రీమతి బేబి, శ్రీమతి విజయం, శ్రీమతి రమణమ్మగార్లు తమ వికాస తరంగిణి బృందము, జెట్ విజయనగరం అధ్యక్షులు శ్రీమాన్ MSN రాజు దంపతులు మొదలగు వారందరు కలసి ఈ విద్యాలయాన్ని చాలాబాగా నిర్వహిస్తున్నారు. పాఠశాల నిర్వహణలో ప్రేమ సమాజంవారుకూడా తమ సహాయ సహకారాలు అందిస్తున్నారు. కరస్పాన్‌డెంట్‌గా ఉండే శ్రీమతి బేబిగారు, శ్రీమతి విజయగార్లు తమ కమిటీ సభ్యులందరి సహకారంతో సంస్థను చాలా చక్కగా ఆదర్శంతంగా నిర్వహిస్తున్నారు. వీరికి ప్రోత్సాహాన్ని ఇవ్వవలసిన అవసరం ఉంది.

శ్రీమాన్ MSN రాజుగారు జెట్ - విజయ నగరం శాఖ అధ్యక్షులుగా ఉంటూ దాతల సహకారంతో సుమారు 45 రోజుల కాలవ్యవధిలోనే వారు ప్రధాన దాతగా ఉంటూ 10 గదులతో ఉండే నేత్రవిద్యాల యాన్ని నిర్మాణం చేయించారు. అట్లాంటాలో అర్చకులుగా ఉన్న శ్రీమాన్ శేషాచార్యులు గారు ఒక గది నిర్మాణానికి గాను రూ. 25,000/- వారి అన్నగారైన శ్రీమాన్ రంగాచార్యులు ద్వారా సమర్పించారు. శ్రీమాన్ G.V.V. సత్యనారాయణగారు- వైజాగ్, ప్రగతి ఎడ్యుకేషనల్ ఫౌండేషన్ - బెంగుళూరు, షిరిడి సాయికృప- అబుదాబి, శ్రీమాన్ ఆలుప్రకాశరావు, శ్రీమాన్ E.B. సోమయాజులు, శ్రీమాన్ మతా లక్ష్మణ్‌రావు- విజయనగరం ప్రభృతులు భవన నిర్మాణానికి విరాళాలు సమర్పించారు. ఈ సందర్భంగా శ్రీస్వామివారు వారందరికి విశేష మంగళా శాసనములనుగ్రహించారు.

శ్రీమతి అరుణగారు విద్యార్థులందరికీ గీతాశ్లోకాలు నేర్పి వారందరిచేత చక్కటి పఠన కార్యక్రమాన్ని జరిపించారు. కలెక్టరుగారి సూచనమేరకు శ్రీస్వామివారు స్పందించి వారందరికీ కూడా గీతాజ్యోతి కార్యక్రమాన్ని అందించడంతో పాటు విజయనగరం జిల్లాలో గీతాజ్యోతి ప్రచారానికి వారి పూర్తి సహాయ సహకారాలు తీసుకో వలసినదిగా శ్రీమాన్ **M.S.N.** రాజుగారిని కోరారు.

తరువాత శ్రీస్వామివారు శ్రీమాన్ చిరంజీవి రాజుగారియొక్క గృహాన్ని మంగళా శాసనం చేసి రాత్రి కోణార్క్ ఎక్స్‌ప్రెస్‌లో ఏలూరు బయల్దేరారు.

### ఏలూరు, 12,13-8-2002

శ్రీస్వామివారు విజయనగరం నుండి కోణార్క్ ఎక్స్‌ప్రెస్‌లో ఉదయం 5-30 ని॥లకు ఏలూరు చేరుకున్నారు. శ్రీమాన్ డా॥ ముక్కామల పార్థసారథిగారి గృహంలో బస చేసారు.

12,13 తేదీలలో కొల్లేరు సరస్సు పరిసరప్రాంతాల్లో ఉండే వివిధ గ్రామాలు శ్రీస్వామివారు గీతాజ్యోతి సందర్భంగా సందర్శించారు. అక్కడక్కడ ఉండే మత్స్య కారులందరికీ కూడా తమ యొక్క అనుగ్రహ భాషణాన్ని అందించారు. ముఖ్యంగా చెరువుల మీద ఆధారపడ్డ ఆ ప్రాంతీయు లంతా కూడా గీతాజ్యోతి కార్యక్రమాన్ని తమప్రాంతంలో జరుపుకో వాలని శ్రీస్వామి వారిని ఒకసారి దర్శించాలని చాలా ఉత్సాహపడ్డారు.

ఆ ప్రాంతానికే చెందిన ఒక ముస్లిం యువకుడు శ్రీమాన్ మొగల్ మీరా మొహి నుద్దిన్‌గారు కొన్ని గ్రామాల్లో గీతాజ్యోతి కార్యక్రమాన్ని ఏర్పాటు చేసారు. ఆ ప్రాంతంలో వెనుకబడ్డవారికి గ్రామీణు లందరికీ కూడా ప్రోత్సాహకులుగా ఉన్న శ్రీమాన్ నిత్యానందస్వామి కొన్ని గ్రామాల్లోను గీతాజ్యోతి కార్యక్రమాన్ని ఏర్పాటు చేసారు.

12వ తేదీన చాటపర్రు - వీరాంజనేయ స్వామి ఆలయం, గుడివాకలంక - కోదండ రామాలయం, శ్రీమతి/శ్రీమాన్ మహాలక్ష్మీ రాజు దంపతుల ఆహ్వానంపై ప్రతికోల్లలంక - రామాలయం, పైడి చింతపాడు - రామా లయం సందర్శించి ఆయా ప్రాంతాల్లో గీతాజ్యోతి కార్యక్రమాన్ని వివరించారు. భక్తులు వానలో తడుస్తున్నా లెక్కచేయకున్నా భక్తిగీతాలు పాడుతూ స్వాగతించడం, వానలో తడుస్తూ ప్రవచనాన్ని శ్రవణం చేయడం స్వామివారిని తమ గ్రామాల్లో అడుగుమోపితే చాలని పాదయాత్ర చేయించడం వారి యొక్క భక్తిశ్రద్ధలను చాటింది.

అలానే 13వ తారీకున ఉదయం నరనారాయణ జయంతిని జరిపి శ్రీస్వామి వారు డా॥ పార్థసారథిగారి గృహం నుండి ఉ॥ 9గం॥లకు బయల్దేరి లక్ష్మీపురంలో ఏర్పాటు చేసిన పశువైద్య శిబిరంలో పాల్గొన్నారు.

శ్రీమాన్ గారపాటి సాంబశివరావు M.L.A. గారు, శ్రీస్వామివారి కార్యక్రమానికి ముగ్ధులై వారుకూడ స్వామివారితో పాటు అత్యుత్సాహంతో పాల్గొన్నారు. తానెపుడు ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొనలేదని స్వామీజీల దగ్గరకు వెళ్ళలేదని అయినా శ్రీ చిన్నజీయర్ స్వామివారి కార్యక్రమం సందేశాత్మకంగానే కాకుండా గ్రామీణులకు,





సామాన్యులకు అందుబాటులో ఉపయోగ పడేటట్లుగా ఉంటుందని వారు సూచించే మార్గం అందరికీ అనుసరణీయమని మాక్కూడా ఉపయోగమని అందుకే తామిందులో పాల్గొంటున్నామని ఇలాంటి కార్యక్రమాల్ని అందరూ ప్రోత్సహించాలని వారుచెప్పారు.

ఉచిత పశువైద్యశిబిరంలో సుమారు 300 పశువులకు వైద్యాన్ని అందించారు.

సుమారు 200 సం॥ల చరిత్రకలిగిన M.L.A. గారి గ్రామం దెందులూరులో శ్రీమతి నిర్మలగారు వికాసతరంగిణి కార్యక్రమాలు ఏర్పాటు చేసారు. అక్కడ సమావేశమైన జనసంఖ్య ఇదివరకెప్పుడూ ఏ కార్యక్రమంలోనూ చూడలేదని స్వామివారి కార్యక్రమాలపై జనానికుండే శ్రద్ధ తమ కాశ్చర్యాన్ని కలిగిస్తుందని M.L.A.గారు చెప్పారు. శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయంలో శ్రీస్వామి వారు గీతాజ్యోతి సందేశాన్ని అందిస్తూ దాని నిర్మాతలైన శ్రీమాన్ లక్ష్మీనారాయణ దంపతులను మంగళాశాసనం చేశారు. అక్కడ నుండి ఆగడాల లంక - రామాలయంలోను, చెట్టున్నపాడు - రామాలయంలోను, శ్రీస్వామివారు తమ సందేశాన్నందిస్తూ సాయంత్రం కొవ్వలి గ్రామాన్ని చేరారు. అక్కడ జనార్దనస్వామివారి ఆలయాన్ని సందర్శించి శ్రీమతి నాగమల్లేశ్వరిగారి గృహాన్ని మంగళా శాసనం చేసారు. అక్కడే శ్రీమాన్ మురళీగారు నిర్మించిన షిరిడిసాయి ఆలయ ప్రాంగణంలో గీతాజ్యోతి సందేశాన్ని అందించి రాత్రికి ఏలూరు చేరారు.

కార్యక్రమాన్ని శ్రీమాన్ పార్థసారథిగారు, శ్రీమాన్ రాజాగారు, శ్రీమాన్ అశోక్‌గార్లు చాలా చక్కగా నిర్వహణ చేసారు. ప్రతి గ్రామంలో కూడా విశేషసంఖ్యలో భక్తులు పాల్గొన్నారు. రాత్రి బయలుదేరి శ్రీవారు సీతానగరం చేరు.

### సామూహిక ఉపనయనాలు

సీతానగరం వేదపాఠశాలలో శ్రీశ్రీశ్రీ స్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో ఆగస్టు **14**వ తేదీన సుమారు **31**మంది వటువులకు ఉపనయన కార్యక్రమం శాస్త్రోక్తంగా జరిగింది. శ్రీవారు వటువులకు, కార్యక్రమాన్ని నిర్వహించిన గురువులు శ్రీమాన్ మధుసూదనాచార్యులు(పెద్దమధు) కు తమ మంగళాశాసనాలు కృపచేసారు.

### శ్రావణ శుక్రవారం - లక్ష్మీనారాయణ పూజ, 16-8-2002

లోకరచనను తన భృకుటి విలాసంచే నియంత్రించే అమ్మ క్షీరసాగరం నుండి ఆవిర్భవించిన రోజు. సీతానగరం, వేదవిశ్వ విద్యాలయ ప్రాంగణంలో **శ్రీశ్రీశ్రీ స్వామివారి** శ్రీకరముల మీదుగా తిరుమంజనాది సకలోపచారములను స్వీకరించి, భక్తులను అనుగ్రహించటానికి సపరివారంగ అమ్మ వివిధ రూపాలలో దివ్య సింహాసనంపై ఆసీనురాల య్యింది.

ఉదయం తీర్థగోష్ఠి కాగానే సుమారు **11**గం॥లకు శ్రీస్వామివారు లక్ష్మీనారాయణ పూజాకార్యక్రమాన్ని ప్రారంభించారు, వేద విద్యార్థులు,భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

సకలకళ్యాణ గుణాకరుడు ఆ స్వామి. లోకాలను పరిపాలించేది, రక్షించేది ఆయనే. ఆయనలోని స్వాతంత్ర్యం, స్వామిత్వం, పరత్వం, మొదలైన గుణాలు పైకి వస్తే మనకు దండన పెరిగినట్లే. మనలను రక్షించడానికి దయ, కరుణ, వాత్సల్యం మొదలైన గుణాలు పైకిపొంగిరావాలి. అవన్నీ మూర్తీభవించిన స్వరూపం మన లక్ష్మీదేవి. ఆయనలో ఆ గుణాలు పైకి వచ్చేది ఆమె వలనే. అమ్మ ఆయనను ఎప్పుడూ వీడకుండా ఉంటేనే, మనల్ని రక్షిస్తాడు. ఆమె కటాక్షం లేనిదే ఎంత వారలైనా ఏమీ చేయలేరు. అందుకే వేదాలన్ని కూడా ఆమెకి ఎవరు నాథుడో, అతడే లోకనాథుడు అని కీర్తించాయి. కాని అతని పేరు చెప్పలేదు. భాగవతం 8వ స్కంధములో ఈమె ఎవరిని వరించిందో ఆ వివరాల న్నింటిని శ్రీ వ్యాసభగవానుడు అనుగ్రహించాడు.

ఒకనాడు భృగు మహాముని వైకుంఠానికి వెళ్ళడం, విష్ణు వక్షస్థలాన్ని తన పాదముతో తన్నడం. అది భరించలేక అమ్మ క్షీరసాగరానికి వెళ్లిపోవడం

మనకు తెలిసిందే కదా! ఆ తరువాత కొంతకాలానికి దేవదానవులు తమ బలాన్ని పెంచుకోవడానికి ఉపాయం చెప్పమని నారాయణుడిని ప్రార్థన చేస్తే క్షీరసాగర మధనం చేయమని, తద్వారా అమృతప్రాప్తి కల్గుతుందని ఉపాయాన్ని అందించాడు. అందుకు దేవదానవులిద్దరూ కలిసే పనిచెయ్యాలని వారిద్దరి మధ్య సయోధ్యను కుదిర్చాడు. క్షీరసాగర మధనం పూర్తయ్యేంత వరకు తమ కార్యాన్ని కొనసాగించాలని, ఆ మధ్యలో వచ్చే వాటికై ఆశ పడకూడదని హెచ్చరించాడు.

.

క్షీరసాగర మధనం ప్రారంభమైంది. ముందుగా హాలాహలం ఆవిర్భవించింది. లోకాలన్నీ దాని ప్రభావానికి తపించకుండా ఉండడానికి హరుడు దానిని తన కంఠాన ధరించి నీలకంఠుడయ్యాడు. **సాధుస్వభావమే అది కదా.**

**తప్యంతే లోకతాపేన సాధవః ప్రాయశో జనాః ।**
**పరమారాధనం తద్ధి పురుష స్యాఖిలాత్మనః ॥**

భాగవతం 8.7.44

**సాధు** అంటే లోకానికి మంగళం అని అర్థం. అది అందించే వారే **సాధువులు.** లోకానికి కలిగిన తాపాలను తమవే అనుకుంటారు. స్వార్థచింతన, ఇతర అపేక్ష లేకుండా వాటిని పోగొట్టి లోకానికి ఆనందాన్ని కలిగిస్తారు. అదే విశ్వశరీరికి తాము చేసే పరమారాధనగా భావిస్తారు. అలాంటి సాధువులలో ఉత్తముడు నీలకంఠుడు. లోకానికి తాపాన్ని కలిగించే విషాన్ని తన కంఠాన ధరించి ఆ తాపాన్ని తొలగించిన సాధుస్వభావుడు.

హాలాహలం తరువాత **కామధేనువు** ఆవిర్భవించింది. హోమానికి అవసరమైన వాటిని ఇస్తుంది కనుక దానికి **హవిర్ధానీ** అని పేరు. దీనిని ఋషులు స్వీకరించారు. క్రమంగా పాండురవర్ణంలో ఉన్న ఒక **మంచి అశ్వం** పైకి వచ్చింది. దానిపేరు **ఉచ్చైశ్శ్రవస్** ముందుగానే అత్యాశ పనికిరాదని హెచ్చరించిన భగవానుడి మాటవినకుండా బలి చక్రవర్తి దానిని కోరుకున్నాడు. కానీ ఇంద్రునికి దక్కింది.

తరువాత మంచి శ్వేత వర్ణంతో, నాలుగు దంతాలు కలిగిన **ఐరావతం, అష్టదిగ్గజాలు** ఉద్భవించాయి. వెనువెంటనే వచ్చిన **కౌస్తుభ మణిని** విష్ణు పాదాల చెంత సమర్పించారు. ఏది కోరుకుంటే దాన్ని ఇవ్వగలిగి, దివ్యపరిమళాలను వెదజల్లే పారిజాత తరువు, సర్వాలంకారాలతో అప్సరసలు వచ్చిన తరువాత తొమ్మిదవ స్థానంలో **శ్రీ** అవతరించింది.

**తతశ్చావిరభూత్ సాక్షాత్ శ్రీరమా భగవత్పరా।**
**రంజయంతీ దిశః కాంత్యా విద్యుత్సౌదామనీ యథా॥**

**భాగవతం8:8:8**

వర్షాకాలంలో మెరుపులు ప్రకాశించిన ట్లుగా అమ్మ ఆవిర్భవించగానే దిక్కులన్నీ దివ్యమైన కాంతితో ప్రకాశించాయి.

**తస్యాం చక్రుః స్పృహాం సర్వే ససురాసుర మానవాః।**
**రూపౌదార్య వయోవర్ణ మహిమాక్షిప్త చేతసః॥**

**భాగవతం 8:8:9**

కేవలం క్షీరసాగర మధనం చేస్తున్న సురాసురులే కాదు మానవులు కూడ అమ్మ కటాక్షం కావాలని కోరుకున్నారట. ఆమె గుణాలు, అందం, రూపం అంత స్పృహణీయ మైనవి. **ధనాన్ని ఎవరైనా వద్దనుకుంటారా!?**

**ఇంద్రుడు** ఈమె అనుగ్రహం నాకే కలగాలని మనస్సులో అనుకుంటూ చక్కటి ఆసనం వేసాడు. **నదులు** రూపాలు దాల్చి కలశాలతో అభిషేక జలాన్ని సిద్ధం చేసాయి. **భూమి** అభిషేకానికి కావల్సిన ఓషధులన్నీ ఇచ్చింది. **వసంతం** అన్ని రకాల పుష్పాలను తీసుకువచ్చింది. **గోవులు** పంచగవ్యాల నివ్వగా, **ఋషులు** అభిషేకించారు. **గంధర్వులు** మంగళం పాడారు. **నటులు** నాట్యమాడారు. **మేఘాలు** వాయిద్యాలను ప్రయోగించాయి. **వేణువులు** నాదాలనూదుతూ సన్నాయిలుగా మారాయి. తండ్రిగారైన **సముద్రుడు** పట్టు పీతాంబరాన్ని ఇచ్చాడు. ఆభరణా లివ్వగా, **సరస్వతీ దేవి** ఒక అందమైన హారాన్ని శ్రీ కంఠసీమన అలంకరించింది. **చతుర్ముఖ బ్రహ్మ** పద్మాన్ని సమర్పించాడు. **నాగులు** కుండలాలను ఇచ్చి





పొంగిపోయారు. **వరుణుడు** వైజయంతీమాలనివ్వగా దానిని చేతిలో ధరించి శ్రీరమా అడుగులు వేస్తుంటే అందరిలోనూ ఎంతో ఉత్కంఠ. ఎవరికి వారే తమను అనుగ్రహిస్తే బాగుండునని కోరుకుంటూ ఎదురు చూస్తున్నారట.

కానీ, ఆమె కొందరివైపు అసలు చూడనే లేదు. కొందరని అసలు స్మరించనే లేదు. వారిలో కొందరు మంచి తపశ్శక్తి సంపన్నులు, కాని ధర్మమూర్తులు కారు. కొందరు ధర్మం తెలిసిన వారే, కానీ సౌమ్యత లేనివారు. మరికొందరు సౌమ్యులే, కానీ చిరాయువులు కారు. కొందరు చిరాయువులే కానీ అన్ని కాలాల్లోనూ ఉండని వారు. ఇలా ఏదో ఒక లోపం కలిగిన వారే తప్ప, సకల కళ్యాణ గుణాలను కలిగి అన్ని కాలాల్లోనూ ఉంటూ అందరికీ మంగళాన్ని చేకూర్చేవాడు ఆ శ్రీహరి ఒక్కడే. కాని అతను అవాప్త సమస్తకాముడు. నన్ను కూడా ఆతడు కోరడు. కానీ ఆతడే నా నాథుడు అనుకుంటూ ఆ నారాయణుడి కంఠసీమలో వైజయంతీ మాలను అలంకరించి, అతనిని వరించింది. స్వామిపై నిరతిశయ ప్రేమతో ఆయన వక్షస్థలాన్నే తన నివాసంగా మార్చుకొని, అతనిని లక్ష్మీనాథుడిగా, లోక నాయకుడిగా, జగద్రక్షకుడిగా నిరూపించింది.

ఈ దివ్యచరితాన్ని తమ అనుగ్రహ భాషణంలో కృపచేసి **శ్రీశ్రీశ్రీ స్వామివారు** భక్తులందరికీ స్వయంగా అమ్మవారి ప్రతిమను అందించారు. పూజా విధానాన్ని విశదపరుస్తూ, విష్వక్సేన పూజ, లక్ష్మీనారాయణ పూజ జరిపించారు. స్తోత్రాలతోను, నామాలతోనూ అమ్మను అర్చింపచేసి ఆ లక్ష్మీనారాయణుల దివ్య అనుగ్రహాన్ని అందించారు.

**శ్రీశ్రీశ్రీ స్వామివారు** ఈ కార్యక్రమంలో చివరిగా **చైతన్యజ్యోతి** అనే ధార్మిక మాస పత్రికను ఆవిష్కరించారు. మొదటి ప్రతిని ప్రముఖ పాత్రికేయులు **పద్మశ్రీ శ్రీమాన్ తుర్లపాటి కుటుంబరావు** అందుకున్నారు. పత్రికలు అందించే విషయాలు ప్రామాణికంగా ప్రయోజనకారిగా ఉంటూ ప్రజలలో చైతన్యాన్ని తేవాలని శ్రీవారు మంగళా శాసనాలు చేసారు.

**శ్రీమాన్ వీరఘంట సత్యనారయణ** ఎడిటర్, **శ్రీమాన్ హితార్థి** సబ్ ఎడిటర్ శ్రీస్వామివారి తమకి కృతజ్ఞతలను తెలియ చేసుకున్నారు.

మనస్సునిండా శ్రీస్వామివారి అనుగ్రహ భాషణాన్ని, ఒడిలో పూలపొన్నులో అమ్మ వారిని నింపుకొని, తదీయారాధనను స్వీకరించి భక్తులు తమ తమ గృహాలకు లక్ష్మీనారాయణ కటాక్షాన్ని తీసుకుని వెళ్ళారు.

## నూతన భవన ప్రారంభం

విజయవాడ, 1వ టౌన్‌లోని శివాలయం వీథిలో శ్రీవిశిష్టాద్వైత ప్రచార సంఘము నేతృత్వములో సుమారు రూ. 20 లక్షల ఖర్చుతో పునర్నిర్మించిన రెండతస్థుల భవనాన్ని 18వ తేదీ సాయంత్రం శ్రీ చిన్నజీయరుస్వామివారు ప్రారంభించారు. 1964లో శ్రీవైష్ణవ సంప్రదాయనిష్ఠులైన శ్రీ కటవెంకట నరసింహం, లక్ష్మీనర్సమ్మ దపంతులు ఇక్కడి భవనాన్ని పెద్దజీయరు స్వామి వారికి సమర్పించారు. దసరా సమయంలో జరిగే విశిష్టాద్వైత పండిత సభలను జరపడానికి, పెద్దల ద్వారా కాలక్షేపాలు చెప్పించడానికి ఇక్కడి భవనాన్ని వాడాలని వారి కాంక్ష. అప్పట్లో దీని నిర్వహణను శ్రీమాన్ కీ.శే. కూర్పటి రామారావు ప్రభృతులు చూస్కొనేవారు. దానిపై సభలు నిర్వహించడాని కంటూ ఏమీ ఆదాయం వచ్చేదికాదు. క్రమంగ ఆ భవనం శిథిలం అయింది. 2 సం॥ క్రితం శ్రీ చిన్న జీయరుస్వామివారు, దానిని పునర్నిర్మించ సంకల్పించారు. సుమారు రూ. 20లక్షల ఖర్చుతో నూతన భవనం, పాతభవనం స్థానే ఏర్పడింది. విశిష్టాద్వైత ప్రచారక సంఘ సభ్యులు శ్రీఉ.వే.శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్య స్వామి, కార్యదర్శి శ్రీమాన్ టి. ఉడైయవర్లు సభ్యులు శ్రీమాన్ వై. శ్రీనివాసరావు మొదలగు పెద్దలంతా కార్యక్రమంలో పాల్గొని శ్రీవారి మంగళా శాసనాలందుకున్నారు. నిర్మాణ కార్యక్రమాన్ని జరిపించిన శ్రీమాన్ పి. వెంకటా చార్యులు మొదలగు వారిని శ్రీవారు మంగళా శాసనాలు కావించారు.

## ఖాజీపాలెంలో P.G. కోర్సుల ప్రారంభం

17-8-2002న గుంటూరు జిల్లా, ఖాజీపాలెంలోని K.V.R. & K.V.R. & M.K.R. కాలేజీ ఆర్గానిక్ కెమిస్ట్రీ కోర్సును శ్రీవారు ఆవిష్కరించారు. విద్యార్థులకు మొట్టమొదటి క్లాసుని శ్రీవారు హృద్యంగా తీసుకున్నారు. దానిలోనే గీతాజ్యోతి ప్రధానోద్దేశాలను వారికి అందించారు. ఈ కోర్సుకు 'మా టి.వి.' చైర్మన్ శ్రీమాన్ పెనుమత్స మురళీకృష్ణమాచార్యులు గారు 2,00,000 ధనాన్ని అందించారు. అందజేసారు. ఈ సందర్భంగా జరిగిన సభాకార్యక్రమములో శ్రీమాన్ మంతెన కృష్ణంరాజు, సెక్రటరీ & కరస్పాండెంట్ శ్రీమాన్ కూసంపూడి జితేంద్రవర్మరాజు, ప్రధానాచార్యులు శ్రీమాన్ కె. రామరాజు, తెనాలి వివేక్ విద్యాసంస్థల అధినేత శ్రీమాన్ వీరనారాయణ పాల్గొన్నారు.

సాయంకాలం సత్యం కంప్యూటర్స్ చైర్మన్ శ్రీమాన్ బైరాగి రామలింగరాజు తమ తండ్రిగారు పరమపదవాసులైన శ్రీమాన్ సత్యనారాయణరాజు గారి పేర ప్రారంభించిన ట్రస్ట్‌ద్వారా ఖాజీపాలెంలో నిర్మించిన వైద్యశాలను దర్శించారు. ఛైర్మన్ డా॥ డి.యన్. యన్.రాజుగారి దంపతులకు, వైద్యసిబ్బందికి మంగళాశాసనాలు కృపచేసారు.

పిట్టలవానిపాలెం వికాసతరంగిణి కార్యాలయానికి వేంచేసి గీతాజ్యోతి ప్రచారాన్ని పర్యవేక్షించారు. వారికి సమర్థవంతమైన ప్రచారానికి కావలసిన సూచనలందించారు.

### కళ్యాణమండప ఆవిష్కరణ

కృష్ణాజిల్లా, పామర్రు మండలం, **జమీగొల్వేపల్లిలో** ఆగష్టు 18వతేదీన ఉదయం 10-30ని॥లకు శ్రీస్వామివారు శ్రీ పట్టాభి సీతారామచంద్రస్వామి వారి ఆలయాన్ని సేవించారు. శ్రీ ఎన్. ఎస్. ఆర్ ఆంజనేయ చౌదరి ఛారిటబుల్ ట్రస్ట్ వారు నిర్మించిన నూతన కళ్యాణ మండపమును శ్రీవారు ఆవిష్కరించారు. శ్రీమాన్ రావెళ్ళ హనుమంతరావు గారి సతీమణి పరమపద వాసిని శ్రీమతి రావెళ్ల చిట్టెమ్మగారు ఆ కళ్యాణమండపానికి అవసరమైన స్థలాన్ని విరాళంగా అందించారు. ట్రస్టు సెక్రటరీ శ్రీమాన్ యు. బాబూరాజేంద్రప్రసాద్‌గారు కళ్యాణ మండపం తరతరాలకు ఉపయోగ పడాలన్నారు.

శ్రీస్వామివారు తమ అనుగ్రహ భాషణంలో కళ్యాణమండపం తరతరాలకు ఉపయోగపడలాంటే అది కేవలం వివాహాది కార్యక్రమములు నిర్వహించుకోవడానికి పరిమితం కాకూడదు. అవకాశాన్ననుసరించి ధార్మిక కార్యక్రమాలు అంటే ప్రవచన సత్సంగాదులు కూడా జరగాలి. ఆధునిక విజ్ఞాన సౌకర్యాలు కూడ అందుబాటులో ఉండి, ఒక మంచి గ్రంథాలయం, కూడా ఏర్పడాలని శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళా శాసనం చేసారు. సీతానగరానికి వేంచేస్తూ గుడివాడలోని శ్రీమాన్‌సూర్యనారాయణగారి తిరుమాళిగను పావనం చేసారు.

మధ్యేమార్గం కలువపాములలోని మన ఆశ్రమాన్ని సందర్శించారు. నిర్హేతుకంగా తమను అనుగ్రహించటానికి వేంచేసిన ఆచార్యులను చూచి పొంగిపోయారు అక్కడి ఆగమవిద్యార్థులు. వారి విద్యావ్యాసంగాన్ని పరిశీలించి, వారికి తగు సూచనలను, అందించారు. శ్రీమాన్ యుగంధరాచార్యులు, ఇక్కడ 13 విద్యార్థులకు ఆగమశిక్షణ నిర్వహిస్తున్నారు.

అనుకోకుండా వచ్చాం. పిల్లలకు ఏవైనా ఫలాలు ఇస్తే బాగుండును అన్నారు శ్రీస్వామి వారు. వారి సంకల్పం కార్యరూపం దాల్చి, పండ్లబండివాడి రూపంలో ఆశ్రమం ముందు నిలచింది పిల్లలందరికీ పంచి మంగళా శాసనాలను కృపచేసారు.

మేడమ్ డెనియాలా గారు ఈ ఆశ్రమాన్ని శ్రీస్వామివారితో కలిసి సేవించి తమ ఆనందాన్ని తెలియచేసారు. సాయం కాలానికి సీతానగరం చేరుకున్నారు అందరూ.

### గిరిజన పాఠశాలకు శంకుస్థాపన అల్లంపల్లి - బీర్‌సాయిపేట

21వ తేదీన శ్రీస్వామివారు అదిలాబాద్ జిల్లా ఊట్నూరు ప్రాంతంలోని అల్లంపల్లి, బీర్‌సాయిపేట గ్రామాలు సందర్శించి గిరిజన పాఠశాలలకు





శంకుస్థాపన కావించారు. చాతుర్మాస్య దీక్ష ప్రారంభమైతే మూడు నెలల వరకు ఎటూ వెళ్ళడం కుదరదు కనుక శ్రీస్వామివారు శ్రమైనాకూడ నిర్మాణపుపనులు కొనసాగుతాయని శంకుస్థాపన కార్యక్రమాన్ని పూర్తిచేసారు.

శ్రీస్వామివారు 21 ఉ॥ గం॥ 4కు జి.టి. ఎక్స్‌ప్రెస్‌లో మంచిర్యాల చేరుకున్నారు. వికాస తరంగిణివారు మంగళ వాయిద్యము లతో మంగళ హారతులతో రైల్వేస్టేషన్‌లోనే శ్రీస్వామివారికి స్వాగతం పలికారు. అక్కడి నుండే శ్రీవారు 100 కి.మీ. పైగా ప్రయాణించి ఉ॥ 7 గం॥లకు అల్లంపల్లి గ్రామం చేరుకున్నారు. గ్రామ సర్పంచి శ్రీమాన్ భల్లూసింగ్ గారి నేతృత్వంలో ఈ ప్రాంతీయులు ప్రసిద్ధమైన గుస్సాడియా మరియు మథురా నృత్యములతో సానందంగా శ్రీస్వామివారికి ప్రేమ పూర్వక స్వాగత సుమాంజలి సమర్పించారు. అప్పుడే వరుణ దేవుడు గూడ చిరుజల్లుగ సాక్షాత్కరించాడు. హైవేకి 15 మైళ్ళు అడవిలో సరిలేని డొంకదారి గుండా అల్లంపల్లి చేరాలి. ఇక్కడికి సరైన ప్రయాణ సౌకర్యం లేదు. నిజమైన పాఠశాల అవసరం ఇక్కడనే. ఈ ఊళ్ళో ప్రభుత్వ పాఠశాల ఉన్నా అది ఏడాదికొకటి రెండు సార్లు తెరిస్తే గొప్పే. టీచర్లు ఎవ్వరూ రారు. అవి నామమాత్రా లంతే. వీరికి విద్య అందించడం ఎవ్వరికీ అవసరపడ లేదు. అందుకే శ్రీస్వామి వారిక్కడ పాఠశాలకు పునాది వేయాలని విచ్చేసారు.

శ్రీమాన్ తిరుపతి రెడ్డిగారి ఇంట్లో శ్రీస్వామి వారు ఆరాధన ముగించి సేవించుకో వడానికి వచ్చిన అశేష భక్త జనావళికి తీర్థ ప్రసాదాలు అనుగ్రహించారు. ఉ॥ 11 గం॥లకు శంకుస్థాపన స్థలాన్ని చేరుకున్నారు. వేదికపై శ్రీమాన్ వెంకటరమణా చార్యులు శ్రీస్వామివారిని గూర్చి పరిచయ వాక్యాలు పలికారు. అనంతరం శ్రీస్వామి వారు మంగళాశాసనపూర్వక సందేశాన్ని అనుగ్రహించారు. నిర్మించబోయే ఈ పాఠశాల మీ అందరి పిల్లలభవిష్యత్తును తీర్చిదిద్దడానికేనని మీరంతకూడ శ్రమదానం చేస్తూ నిర్మాణంలో సహరించాలని సూచించారు. అందరూ కూడా ఆనందంగా తమ అంగీకారాన్ని వ్యక్తం చేసారు. జిల్లా **B.J.P.** అధ్యక్షులు శ్రీమాన్ బాబూలాల్ రాథోడ్‌గారు మాట్లాడుతూ తమ ప్రాంతంలో చక్కటి ప్రణాళికను చేపడుతున్న శ్రీస్వామివారికి కృతజ్ఞతాంజలులు ప్రకటిస్తూ తమ వంతు సేవలు తప్పకుండా అందిస్తామని వాగ్దానం చేసారు. ఈ సందర్భంగా శ్రీమాన్ గాదెగాని మధుసూదన్‌గారు రచించిన 'వైదిక సాహిత్యం - భారతీయ సంస్కృతి' అనే గ్రంథాన్ని శ్రీవారు ఆవిష్కరించారు. మధ్యాహ్నం 1 గం॥కు గిరిజన గురుకుల పాఠశాల నిర్మాణానికి కేటాయించిన 5 ఎకరాల స్థలంలో భూమిపూజ కావించారు. శ్రీమాన్ నంబి వేణుగోపాలాచార్యులు, శ్రీమాన్ రవీంద్రగార్లు గ్రామస్థుల సహకారంతో చక్కని ఏర్పాట్లు చేసారు. ఈ ప్రాంతమంతా కూడా దట్టమైన అడవులతో నిండి ఉంది. చక్కటి ప్రకృతి సౌందర్యంతో కనుల విందు చేస్తుంది. బసు సౌకర్యం అంతంత మాత్రమే.

అనంతరం అల్లంపల్లికి 20 కి.మీ. దూరంలో ఉన్న బీర్‌సాయిపేటకు వేంచేసి మరో గిరిజన గురుకుల పాఠశాలనుకు శంకుస్థాపన కావించారు.

శ్రీస్వామివారి శిష్యులు U.S.A. న్యూజెర్సిలో ఉంటున్న శ్రీమాన్ హరికిషన్ గారి సూచన మేరకు వారి సోదరుడైన శ్రీమాన్ సాంబయ్యగారు 3 ఎకరాల భూమిని ఈ పాఠశాల నిమిత్తం సమర్పించి తమ ఔదార్యాన్ని ప్రకటించారు. ఆ దంపతులకు సర్పంచ్ శ్రీమాన్ గంగాధర్, ఉప సర్పంచి శ్రీమతి లక్ష్మిగారు అక్కడ చేరిన భక్తగోష్ఠి కందరికీ శ్రీస్వామివారు మంగళాశాసనాలు అనుగ్రహించి మంచిర్యాల బయలుదేరారు.

సా॥ గం॥ 4-30 ని॥ల నుండి ఒక గంట సేపు వికాసతరంగిణి వారు ఏర్పాటు చేసిన గీతాజ్యోతి సమావేశంలోపాల్గొని తమ సందేశాన్ని అనుగ్రహించారు.

### గోదావరి పుష్కరాలు

ఈ సమావేశంలో పాల్గొన్న M.L.A. శ్రీమాన్ హనుమంతరావు గారు వచ్చే సంవత్సరంలో జరుగబోయే గోదావరి పుష్కరాలకు మంచిర్యాలకు రావలసిందిగా శ్రీవారిని ఆహ్వానించారు.

మంచిర్యాలు వికాసతరంగిణి కన్వీనర్ శ్రీమాన్ శ్యామసుందరం గారు, శ్రీస్వామివారు తప్పనిసరిగా మంచిర్యాలలో గోదావరీ పుష్కర బ్రహ్మయజ్ఞము నిర్వహించాలని ప్రార్థన చేసారు. మంచిర్యాలలో కూడ గోదావరి ప్రవహిస్తుంది. రాజమహేంద్రిలాంటి చోట అనేక సార్లు, అనేక మంది పుష్కరాలను నిర్వహిస్తూనే ఉన్నారు. ఇలాంటి కొత్తచోట నిర్వహిస్తే ఈ ప్రాంతాలలోని వారు ఎక్కువమంది అన్వయించే అవకాశము ఉంటుందని విజ్ఞాపన చేసారు.

గతంలో రాజమహేంద్రివాసులు కూడా శ్రీస్వామివారిని పుష్కరాలకోసం ప్రార్థించి యున్నారు. అయితే శ్రీస్వామివారు ఇరువురినీ సంతృప్తి పరిచేవిధంగా ఉండటం కోసం పుష్కరాలు 12 రోజులకు ముందు రెండు రోజులు కలిపి 7 రోజులు మంచిర్యాలలో, మరొక 7 రోజులు రాజమహేంద్రిలో పుష్కరప్రయుక్త బ్రహ్మ యజ్ఞాలను నిర్వహిస్తామని తెలిపారు. అయితే ఎక్కడ తరువాత, ఎక్కడ ముందు అన్న విషయాన్ని త్వరలో తెలియచేస్తామని తెలిపి, సీతానగరం వేంచేసారు శ్రీవారు.

## చాతుర్మాస్య దీక్ష

శ్రావణపౌర్ణిమ, ఆగష్టు22న శ్రీస్వామి వారి చాతుర్మాస్య దీక్ష, హయగ్రీవ జయంతి, వైభవంగా జరిగాయి.

ప్రాతఃకాలముననే విద్యార్థులందరూ ఉపాకర్మ కావించుకున్నారు. వేదస్వరూపుడైన హయగ్రీవస్వామి సన్నిధిలో విద్యార్థులందరికీ వేదమంత్రాలు ప్రారంభింప చేసారు. ఆపై హయగ్రీవస్వామి పూజా కార్యక్రమం జరిగింది. శ్రీస్వామివారు తమ అనుగ్రహప్రవచనంలో చాతుర్మాస్య రూపురేఖలు, జరుగబోయే విశేషకార్యక్రమాల వివరాలు తెలియచేసారు.

### కార్యక్రమ వివరాలు

**తీర్థగోష్ఠి ఉ॥ 7-30 నుండి 8-00 వరకు**
**మరియు సా॥ 7-30 నుండి 8-00 వరకు,**
**సంప్రదించు వేళలు తీర్థగోష్ఠి తర్వాత,**
**విశేష కార్యక్రమాలు**

**సెప్టెంబర్ 10న విష్వక్సేనారాధన**
**అక్టోబర్ 15న విజయదశమి**
**నవంబర్ 4న దీపావళి, శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి తిరునక్షత్ర మహోత్సవం**
**నవంబర్ 19న శ్రీవారి చాతుర్మాస్య దీక్షా విరమణ.**
**ప్రతి శని, ఆదివారములలో సా॥ 4-00 నుండి 5-30 వరకు శ్రీవారి ప్రవచనము జరుగును.**

> **భక్తులందరికీ ఇదే మా శుభాహ్వానము.**
> **పైన చెప్పిన సమయాలను మాత్రమే**
> **వినియోగించుకోవలసినదిగా ప్రార్థన**

## శ్రీశ్రీశ్రీ పెద్దజీయరుస్వామివారి తిరునక్షత్ర మహోత్సవం

ఇదే రోజున నడిగడ్డపాలెం ఆశ్రమంలో పెద్దజీయరుస్వామివారి 94వ తిరునక్షత్రోత్సవ వేడుకలు వైభవంగా ప్రారంభం అయ్యాయి. ముందుగా అంకురార్పణ, వేదపారాయణం, సేవాకాలం ప్రారంభించారు. శ్రీ పెద్దజీయరు స్వామివారి ఉత్సవ మూర్తి ఆలయంలో వేంచేసి ఆరాధనలు అందుకుని అనుగ్రహించారు. 22వ తేదీన చాతుర్మాస్య దీక్ష కార్యక్రమం సాయంకాలం 5గం॥లదాక జరగటం వలన శ్రీ చిన్న జీయరుస్వామివారు ఆ రోజున నడిగడ్డపాలెం వేంచేయలేదు. 23,24 తేదీలలో శ్రీవారు కూడ నడిగడ్డపాలెం వేంచేసి శ్రీ పెద్ద జీయరుస్వామివారిని సేవించుకున్నారు.

25వ తేదీ సాయంకాలం తిరువీథి ఉత్సవం జరిగింది. ఉత్సవంలో ఉపయోగించిన టపాసులవల్ల ప్రక్కనే ఉన్న ఒక గడ్డివాముకు నిప్పు అంటుకొని చిన్న అగ్ని ప్రమాదం జరిగింది. దానితో తిరువీథి ఉత్సవం పూర్తిగా జరిగే అవకాశం కలుగలేదు.

26వ తేదీన శ్రీస్వామివారి తిరుమంజన, అష్టోత్తర పూజా కార్యక్రమాలు కనులపండుగగా జరిగాయి. శ్రీ పెద్దజీయరుస్వామివారి ఈ తిరునక్షత్ర వైభవాన్ని సేవించుకోవటానికి వచ్చిన





భక్తులందరికీ మంగళా శాసనాలు కృపచేసి శ్రీవారు గుంటూరు బయల్దేరారు.

## గుంటూరు

అమరావతి ఇన్స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ ప్రై. లిమిటెడ్ వారి నూతన హాస్పటల్ ను శ్రీశ్రీశ్రీ స్వామివారు ప్రారంభించారు. శ్రీవారు తమ అనుగ్రహభాషణంలో వైద్యాలయాలు చికిత్స కోసం వచ్చిన వారికి సేదతీర్చేలా ఉండాలని, సమగ్రమైన, పరిపూర్ణమైన చికిత్సను అందించాలని అన్నారు. భక్తులకు, వైద్య బృందానికి తమ మంగళా శాసనాలను అనుగ్రహించి సీతానగరం వేంచేసారు

## గిరిజన పాఠశాలల అధ్యాపక శిక్షణ శిబిర ప్రారంభము

గురుకుల పాఠశాలల అధ్యాపకుల శిక్షణ శిబిరాన్ని శ్రీశ్రీశ్రీ స్వామివారు లాంఛనంగా ప్రారంభించారు. 6 నెలల కాలం కొనసాగే ఈ శిబిరంలో సంస్కృతం, కంప్యూటర్స్, ఆంగ్లం, యోగా, బోధనాపద్ధతులు, భారతీయ తత్త్వ పరిచయం, జ్యోతిష్యము, పంచాంగం మొదలైన వివిధ అంశాలలో తగిన శిక్షణను ఇవ్వటం జరుగుతుంది.

ఈ శిబిరాన్ని ప్రారంభిస్తూ శ్రీమాన్ గ్రంథి సుబ్బారావుగారు శిబిర ప్రారంభానికి విచ్చేసిన శిక్షార్థులకు స్ఫూర్తిదాయకమైన సంక్షిప్త ప్రసంగాన్ని అందించారు. కృష్ణ లంక ఐడియల్ పబ్లిక్స్కూల్ ప్రధానాచార్యులు డా॥ సీతామహాలక్ష్మిగారు శిబిర నిర్వహణలో పాల్గొన్నారు.

వీరందరికీ శ్రీ పెద్దజీయరుస్వామి మంగళా శాసనాలు అందించాలని శ్రీస్వామివారు సంకల్పించి వారందరినీ నడిగడ్డపాలెంలో పెద్ద జీయరుస్వామి వారి సన్నిధికి తీసుకువెళ్ళారు. ఈ చాతుర్మాస్యంలో శ్రీస్వామివారు స్వయంగ ఈ యువ బృందానికి కావలసిన పాఠ్యాంశాలను బోధిస్తున్నారు.

## శ్రావణ శుక్రవారపు పూజలు

ఆగష్టు 30న ఉదయం తీర్థగోష్ఠి కాగానే సుమారు 10.15 నిమిషాలకు శ్రీవారు లక్ష్మీపూజా కార్యక్రమాన్ని ప్రారంభించారు. విశేషంగా అమ్మ అశ్వవాహనం పై వేంచేసి భక్తుల పూజలందుకొని వారిని తన కటాక్ష వీక్షణాలతో అనుగ్రహించింది.

## మేల్కోట

మేల్కోటలోని తిరునారాయణ స్వామికి తగు కైంకర్యములు అందించడానికి వీలుగా ఒక భవనాన్ని నిర్మించాలని శ్రీస్వామివారు గతంలో సంకల్పించారు. కర్ణాటక వికాస తరంగిణి కో - ఆర్డినేటర్ శ్రీమాన్ వీరభద్ర రావుగారు ఒక స్థలాన్ని దీనికోసం కొనటం జరిగింది. శ్రీవారు మే నెలలో ఆ భవనానికి శంకుస్థాపన కావించారు. హాస్పేట శ్రీమాన్ సదాశివరెడ్డిగారు, మిగిలిన సభ్యుల సహకారంతో దాని నిర్మాణ బాధ్యతను వహించాలని సమితి నిర్ణయించింది. వారు ఆ కార్యక్రమాన్ని చేపట్టి ఆగష్టు 29వ తేదీన గ్రౌండ్ఫ్లోర్కు శ్లాబ్ వేసారు.సుమారు 8 లక్షల రూపాయలతో నిర్మాణం జరిగే ఈ భవనంలో తదీయారాధన, ప్రవచన మందిరం, భక్తులకు కొన్ని గదులు ఏర్పడతాయి. ఉత్సాహం కలిగినవారు ఈ నిర్మాణంలో తమ ద్రవ్యాన్ని వినియోగించి తిరునారాయణ పెరుమాళ్ళ సన్నిధిలో తమ నామాన్ని స్థిరపరచుకోవచ్చు. ఈ అవకాశాన్ని వినియోగించుకోవటానికి మీ అందరినీ ఆహ్వానిస్తున్నాం.

## గీతాజ్యోతి ప్రచార వార్తలు

### గోదావరి ఖని

వికాసతరంగిణి 5 శాఖలు కలిసి సమీప ప్రాంతాలైన రామగుండం, మంథని, కమాన్ పూర్ మండలాలలోని 108 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారాన్ని కావించారు. సత్సంగాన్ని నిర్వహించడం, సామూహికంగా గీతాజ్యోతి శ్లోకమాలికా పారాయణం, కృష్ణ పూజలు, శ్లోకమాలిక ప్రతులు మరియు ధ్వజముల వితరణ గావించారు.

8 ఇంక్లైన్ కాలనీలో 20 రోజులపాటు ఉచిత అయస్కాంత చికిత్సా సేవా శిబిరమును నిర్వహించి సుమారు 4 వేల మందికి సేవలందించారు.

## వైజాగ్

**శ్రీహరి పురం** : శ్రీమతి మధుర మీనాక్షి దేవిగారి అధ్యక్షతన, శ్రీమాన్ రఘునాథాచార్యుల పర్యవేక్షణలో ఈ నెల 19వ తేదీన శోభాయాత్ర నిర్వహించారు. స్థానిక హరిహరకళాక్షేత్రంలో గీతాజ్యోతి ప్రవన గోష్ఠిని నిర్వహించి, 748 జ్యోతులను వెలిగించారు. ఈ కార్యక్రమంలో సుమారు 300 మంది భక్తులు పాల్గొని గీతాజ్యోతి సందేశాన్ని అందుకున్నారు.

## మహబూబాబాద్

స్థానిక వికాసతరంగిణి ఆధ్వర్యవములో మహబూబాబాద్, డోర్నకల్, గూడూరు, నర్సంపేట, కె. సముద్రం మరియు నెల్లి కుదురు మండలాలలో గీతాజ్యోతి శ్లోకమాలిక పత్రాలను, భగవద్గీతలను పంచారు, పాఠశాలలో చిత్రగీత పుస్తకాలను పంచారు. వరలక్ష్మి పూజలను 108 గృహాలలో జరపాలని నిశ్చయించి ముందుకు సాగుతున్నారు.

## మార్టూరు

ప్రకాశం జిల్లా మార్టూరు ధర్మక్షేత్రంగా 108 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారం ఉత్సాహంగా జరుగుతుంది. ఇప్పటికే 60 గ్రామాలలో శ్లోకమాలికలను అందించి, వారిచేత శ్లోకాలను పఠింపచేస్తూ, ఆ గ్రామాలను గీతాజ్యోతి గ్రామాలుగా మారుస్తున్నారు. ఈ ప్రచార కార్యక్రమంలో చింతపల్లిపాడు, యద్దనపూడి, ద్రోణాదుల వికాస తరంగిణివారు ఉత్సాహంగా పాల్గొన్నారు. తత్త్వప్రచారిక శ్రీమతి హైమావతి గారి పర్యవేక్షణలో వికాసతరంగిణి సభ్యులు ప్రతిరోజూ ఉదయం 8గం॥లకు ప్రచారాన్ని ప్రారంభించి సాయంకాలం 8గం॥లకుతిరిగి ఇక్కడకు చేరుకుంటున్నారు.

## పుల్లడిగుంట

ధర్మక్షేత్రంలో వింజనంపాడు గ్రామంలో శ్రీమాన్ రాగం రామపిచ్చయ్య ఆధ్వర్యవంలో సామూహిక శ్రీకృష్ణపూజలు నిర్వహించారు. తాడికొండ, బడేపురం, గోగులమూడి గ్రామాలలో వికాసతరంగిణి శాఖలనేర్పాటు చేసి వాటిని రిజిస్టర్ చేసారు. వారి ద్వారా గీతాజ్యోతి ప్రచారం సాగుతుంది. ఈ ధర్మక్షేత్రంలోనే పుల్లడిగుంట ఏటుకూరు గ్రామంలో పోలీసు మైత్రీ సంఘంతో కలసి ఉచిత వైద్యశిబిరం నిర్వహించారు.

## ఏలూరు

పశ్చిమ గోదావరిజిల్లాలోని రామకృష్ణా పురంలో R.K.J. మున్సిపల్ U.P. విద్యార్థు లకు ఉచిత కంటి పరీక్షా కేంద్రము నిర్వహించారు. దీనికి పాఠశాలలో 9-8-2002న పశ్చిమ గోదావరి జిల్లా గీతాజ్యోతి కన్వీనర్ శ్రీమాన్ పార్థసారథిగారి ఆధ్వర్యవములో శ్రీమతి సత్యవతిగారు నిర్వహించారు. డా॥ పి. విజయభాస్కరరెడ్డిగారు తమ వంతు సేవలందించారు. ఆ పాఠశాల అధ్యాపక బృందం విద్యావాలంటీర్లు సహకారంతో ఈ కార్యక్రమం జరిగింది.

పాఠశాల మొత్తంమీద 30మంది పిల్లలకు కొద్దిలోపముల వల్ల కళ్ళుమసక, నీరు కారుట ఉన్నవి. వారికి తగు చికిత్సచేసి, ఓ ఐదుగురికి కళ్ళజోళ్ళు ఇచ్చారు.

## నిజామాబాద్

వికాసతరంగిణిశాఖ ఆధ్వర్యవంలో నాలుగు మండలాలలో ఉచిత కంటి వైద్య శిబిరాన్ని నిర్వహించారు. జులై 1న నిజామాబాద్, జులై 4న చౌటపల్లి, జులై 10న మాచరెప్పిలా, జులై 15న గాంధారిలో, జరిగిన ఈ శిబిరాలలో సుమారు 282 అంధులకు ఉచిత శస్త్రచికిత్సను నిర్వహించి చూపు ప్రసాదించారు.

## మద్దుకూరు

ఖమ్మంజిల్లా మద్దుకూరు వికాస తరంగిణి శాఖ 50 వారు తత్త్వశాస్త్ర ప్రచారకులు శ్రీమాన్ గంగాధర్‌గారి నేతృత్వములో ఆగష్టు 31 నుండి 7వ తేదీవరకు మద్దుకూరు, అయ్యన్న పాలెం, మంగయ్యబంచరు, గుంపెన, పోకల గూడెం, జూలూరు వాడ, నాచారం, పోకల గూడెం ఊరులలో పారాయణ, ప్రవచనాది కార్యక్రమాలు నిర్వహించారు. ఆ గ్రామాలను గీతాజ్యోతి గ్రామాలుగా తీర్చిదిద్దీ స్వామి అనుగ్రహానికి పాత్రులయ్యారు.

## వేకనూరు

అవనిగడ్డ మండలంలోని వేకనూరు వికాసతరంగిణి శాఖ గాజులవారిపాలెం దత్తగా తీసుకొని సంపూర్ణ అక్షరాస్యత సాధించిన ఊరుగా





తిర్చిదిద్దారు. ఈ సందర్భంగా జరిగిన సమావేశంలో కృష్ణా జిల్లా కలెక్టర్‌గారు పాల్గొని వికాసతరంగిణి సభ్యుల కృషిని ప్రశంసించారు.

## జంటనగరాలలో.....

శ్రీఆండాళ్ తిరునక్షత్ర కార్యక్రమాలను 11-8-2002న అనేక వికాసతరంగిణి కేంద్రాలు ఉచిత రీతిన నిర్వహించినవి.

సంతోష్ నగర్ వికాసతరంగిణిశాఖ ద్వితీయ వార్షికోత్సవం జరుపుకున్నది. ఈ కార్యక్రమంలో భగవద్గీత బోధనలను, బృంద నాట్యంగానాలను, కోలాటనృత్యాన్ని ప్రదర్శించారు. శ్రీమతి సి. అహల్యాదేవి, అధ్యక్షులు సభ్యులకు 2వ సంవత్సరపు కార్యక్రమ నివేదికను చదివి వినిపించారు. కుమారి కమల ఆధ్వర్యవంలో శ్రీవిష్ణు సహస్రనామ పారాయణ, శ్రీమతి మంజులశ్రీ ప్రవచనం భక్తులను అలరించింది. శ్రీమాన్ దరూరి రామానుజాచార్యులు 'శ్రీగోదాదేవి' గురించి ప్రవచించారు. బాలబాలికలచే గీతా జ్యోతి శ్లోకమాలికల గానం, శ్రీమతి హరిణిగారి ఆధ్వర్యవంలో బాలబాలికలచే 'ముద్దుగారే యశోద....' అను నాట్యమును ప్రదర్శించినారు. శిశుమందిర్ విద్యార్థినులు (మాదన్నపేట)చే 'శ్రీకృష్ణ లీలలు' కోలాటం ప్రదర్శించబడి మన్ననలను పొందింది. బాల బాలికలకు గీతాజ్యోతి శ్లోకమాలిక, తిరుప్పావై, శ్రీకృష్ణ, ఆండాళ్ చిత్రపటము లను సమర్పించారు. ఉపాధ్యక్షురాలు శ్రీమతి సరస్వతీదేవి వందన సమర్పణ చేయగా కార్యక్రమం సుసంపన్నమైంది.

'గీతాజ్యోతి'ప్రచారంలో రామంతపూర్, వనస్థలిపురం, సికింద్రాబాద్, మసాబ్‌టాంక్, సంతోష్‌నగర్, వనస్థలిపురం, సరూర్ నగర్ శాఖలు మందంజలో ఉన్నారు.

ఉచితవైద్య శిబిరాలను మసాబ్‌టాంక్, సంతోష్‌నగర్, రామంత పూర్, వనస్థలిపురం శాఖలు పాఠశాలలోను, మురికి వాడలలోను నిర్వహించారు. మెదడు వాపును (జ్వరాన్ని) అరికట్టే హోమియో మందు 'బెల్లడోనా'ను (2వ మోతాదు) రామాంతపూర్‌శాఖ 65 పాఠశాలలో 35 వేలమంది విద్యార్థులకు ఉచితంగా పంచిపెట్టింది. ఈ శాఖ రామంతపూర్ లోని 'చైతన్య భారతి విద్యాలయం'లో ఆగష్టు 8న దంతవైద్యశిబిరం నిర్వహించింది. సుమారు 1000 మంది విద్యార్థులకు కోల్గెట్ కంపెనీ సౌజన్యంతో 'పేస్టు' 'బ్రష్'లను ఉచితంగా పంచిపెట్టింది.

రామంతపూర్ శాఖ ఆగష్టు 3న 'కుకట్ పల్లి'లోని Sivananda Rehabilitation Centre లోని కుష్టువ్యాధి గ్రస్థులకు దుప్పట్లు, పళ్ళు పంచిచెపట్టారు. 'సర్వప్రాణిసేవ' ధ్యేయాను సరణగా 50 కేజీల జొన్నలను పావురాలకు మేత వేశారు. ప్రభుత్వం ప్రవేశపెట్టిన 'అక్షరజ్యోతి' కార్యక్రమానికి చేదోడుగా అనేక మంది బీద విద్యార్థులకు పాఠ్యపుస్తకాలు, నోటుపుస్తకాలు పంచిపెట్టారు.

పర్యావరణ పరిరక్షణ : వనస్థలిపురం శాఖ 'సాహెబ్‌నగర్' గ్రామంలో నిరుపయో గంగా పడిఉన్న 500 చ॥గజాల స్థలాన్ని శుభ్రపరచి, రకరకాల మొక్కలను నాటి, దానిని ఒక ఉద్యానవనంగా మార్చే కార్యక్రమాన్ని చేపట్టినది. శ్రీకృష్ణుని శిల్పాన్ని ఈ ఉద్యానవనంలో ప్రతిష్ఠించారుకూడ.

జంటనగరాలలో 'గీతాజ్యోతి' ప్రచార కారక్రమానికి తిరుగుతున్న కార్యకర్తల సౌకర్యార్థం **ఒక టాటా సుమో వ్యాన్ ను, జ్యూబ్లిహిల్స్ వాస్తవ్యులు, సహృదయులు, శ్రీమాన్ రవీంద్రరెడ్డిగారు యిచ్చారు.** 'గీతాజ్యోతి' ఉద్దేశాలను తెలిపే చిత్రాలతో ముస్తాబయి Audio Visual Adds సమకూర్చుకొని, ప్రచార కార్యక్రమాలకు సిద్ధమవుతున్నది.

అదే విధంగా, ఇద్దరు కార్యకర్తలు ప్రచార కార్యక్రమాలను కొనసాగించడానికి అనువుగా, ముఖ్యంగా దేవాలయాలలో స్తోత్ర పారాయణాలు చేయడానికి, ఒక టి.వి.యస్. ద్విచక్రవాహనాన్ని, వికాసతరంగిణి సమష్టి సౌజన్యంతో కొనడం జరిగింది.

## జగ్గయ్యపేట

శ్రీస్వామివారు మానస సరోవర కైలాసగిరి యాత్ర అనంతరం జులై 15వ తారీకున

హైదరాబాద్ నుండి విజయవాడకు వేంచేస్తూ మార్గమధ్యంలో రాత్రి గం|| 8-30 ని||లకు జగ్గయ్యపేట ధర్మక్షేత్రంను సందర్శించారు. తత్త్వ ప్రచారకులు కుమారి నీళాగారి పర్యవేక్షణలో, శ్రీమాన్ కొత్తమాసు మల్లిఖార్జునరావు దమయంతి దంపతులు శ్రీరామ్ బదరీ విజయలక్ష్మి దంపతులు అట్లూరి వెంకటేశ్వరరావు పుష్పావతి దంపతులు కె.సి.యల్. ఆగమపాఠశాల మేనేజర్ శ్రీమాన్ బాబు, శ్రీమాన్ మేకా వెంకటేశ్వరరావుగారు ఇంకా అనేక మంది సహృదయుల సహాయ సహకారములతో జగ్గయ్యపేట ధర్మక్షేత్రంలో గీతాజ్యోతి కారక్రమాన్ని అత్యంత ఉత్సాహంగా నిర్వహిస్తున్నారు. కుమారి నీళాగారు ఈ ధర్మక్షేత్రానికి సమన్వయకర్తగా వ్యవహరిస్తూ అందరినీ ప్రోత్సహిస్తూ 108 గ్రామాల్లో ఇంటింటా గీతాజ్యోతి కార్యక్రమాల్ని ప్రచారం చేస్తున్నారు. స్వామివారి ఆగమన సమయానికే ఈ గ్రామాలకు గీతాజ్యోతి కార్యక్రమాన్ని అందించడం జరిగింది. శ్రీస్వామివారు వేంచేసిన శుభసందర్భంగా అనేక 108 గీతాగోష్ఠులనుండి అశేషభక్తజనం తరలివచ్చి శ్రీస్వామివారిని సేవించి, వారి ప్రవచనాన్ని వీనుల విందుగా ఆలకించి, మంగళా శాసనాలు పొందారు. ఈ సందర్భంగా శ్రీమాన్ టి.యల్.యన్. ఆచార్యులు, ప్రముఖ పురోహితులు శ్రీమాన్ కృష్ణశర్మ, కాకతీయ సిమ్మెంట్స్ జి.యమ్. శ్రీమాన్ జనార్దన రెడ్డి, విష్ణు సిమెంట్స్ జి.యమ్. శ్రీమాన్ ఎ.వి.రాజు, తదితరులు పాల్గొని శ్రీస్వామివారి మంగళా శాసనాలు స్వీకరించారు.

## రాజమహేంద్రి

శ్రీమాన్ డా|| కర్రి రామారెడ్డి గీతాజ్యోతి శ్లోకమాలికను మల్టీమీడియాలో భక్తులు సేవించుకొనుటకు వీలుగా అందించారు.

11వ తేదీన ఆండాళ్ తిరునక్షత్రం వైభవంగా జరిగింది. శ్రీమాన్ నందం సీతారామరాజుగారు స్థానికంగా కొందరు సభ్యులతో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమాన్ని రూపొందించారు. ఆటోలనే గీతాజ్యోతి రథాలుగా తయారుచేసి రాజమండ్రి పరిసర ప్రాంతాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమాన్ని ఒక ఉద్యమంగా స్వీకరించారు. శ్రీమాన్ గోపాలకృష్ణశర్మ లాంఛనంగా ప్రారంభించారు.

18వ తేదీన ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క ఆటోచొప్పున బాలాజీపేట, సీతం పేట, లాలాచెరువు, ఇన్నీసుపేట, లలితానగర్, గీతా భవనం, ఉల్లితోటవీధి, 38వ వార్డు, జాంపేట, మల్లయ్య పేటలో ప్రచారం సాగించారు. 19వ తేదీన బాలాజీపేట, బొమ్మూరు, హౌసింగ్‌బోర్డు, ప్రకాష్‌నగర్, లలితా నగర్, ఇదుబల్ల మార్కెట్, నాగుల చెర్వు బజార్, వి.యల్.పురం, తుర్మలారు, శాటిలైట్ సిటీలో గీతాజ్యోతి ప్రచారం చేసారు. వీరు శ్రద్ధతో చేస్తున్న ఈ ప్రచార కార్యక్రమం ప్రజలలో తగు చైతన్యాన్ని ఇవ్వాలని శ్రీస్వామి వారు మంగళాశాసనాలు చేసారు. ఈ కార్యక్రమాలలో శ్రీమాన్ యస్.పి. రంగ రామానుజాచార్యస్వామి వారు, రాజమహేంద్రి లో మైత్రాయణి శాఖ అభ్యసిస్తున్న వేద విద్యార్థులు, గురువుగారు శ్రీమాన్ జి. రంగనాథాచార్యులు తదితరులు పాల్గొన్నారు.

## పాలవంచ

పాలవంచ వికాసతరంగిణి శాఖ (నెం. 124) ఆధ్వర్యవంలో ఆండాళ్ తిరునక్షత్ర కార్యక్రమము, కుంకుమ పూజ వైభవముగా జరిగాయి. బొల్లోరి గూడెంలోని శ్రీసీతా రామాంజనేయ స్వామివారి దేవాలయంలో దాదాపు 40 మంది మాతృ మూర్తులు పూజలో పాల్గొన్నారు.

## రక్షాబంధనం

వైజాగ్‌లో శ్రావణ పూర్ణిమ, రక్షాబంధన దినం సందర్భంగా విశాఖ పట్టణం వికాస తరంగిణి వారి ఆధ్వర్యవంలో - విశాఖపట్టణం సెంట్రల్ జైలులోని ఖైదీ సోదరులకు శ్రీజీయరుస్వామివారి మంగళా శాసన పురస్సరంగా 'గీతాజ్యోతి రక్షాబంధనం' చేయటం జరిగింది.

ఈ కార్యక్రమంలో శ్రీమాన్ టి.పి. రాజగోపాలాచార్యస్వామి - గీతాజ్యోతి లక్ష్యాలను, వాటి ఆచరణను చెప్తూ ఖైదీ సోదరులచేత గీతాజ్యోతి శ్లోకమాలికలోని శ్లోకాలను చెప్పించటం జరిగింది. ఖైదీ సోదరులకు గీతాజ్యోతి శ్లోకమాలికనే రక్షాబంధనంగా చెబుతూ ముక్తకంఠంతో శ్లోకాలను





పలికించిన తీరు బాగుంది. తదనంతరం వారందరికీ గీతాజ్యోతి శ్లోకమాలికా పత్రాలను. శ్రీవిష్ణుసహస్రనామ పుస్తకాలను, ఫలాలనూ అందివ్వటం జరిగింది.

ఈ కార్యక్రమానికి సెంట్రల్ జైల్ అధికారి శ్రీమాన్ ఎ.జి. సాయినాథ రెడ్డిగారు, వారి బృందం ఎంతో ఆర్తితో పాల్గొనడమే కాకుండా శ్రీ జీయరుస్వామివారినే ప్రత్యక్షంగా ఖైదీసోదరులకు మంగళాశాసనాలు కటాక్షించమనడం ఎంతో ముదావహం.

గీతాజ్యోతి - రక్షాబంధనం కార్యక్రమంలో విశాఖపట్టణంలోని వివిధ ప్రాంతాల వికాసతరంగిణి కార్యకర్తలూ పాల్గొని కార్యక్రమాన్ని చక్కగా అందంగా నిర్వహించారు.

## వనపర్తి వికాసతరంగిణి ప్రథమ వార్షికోత్సవం

శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళా శాసనములతో, శ్రీపెద్దజీయరుస్వామివారి తిరునక్షత్రం సందర్భంగా వనపర్తి వికాసతరంగిణి ప్రథమ వార్షికోత్సవం సోమవారం ఘనంగా నిర్వహించారు. స్థానిక ప్రభుత్వవైద్యశాలలో ఏర్పాటు చేసిన కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా మున్సిపల్ చైర్‌పర్సన్ ప్రమీలమ్మ, వైస్ చైర్మన్ బి. కృష్ణ, ఆస్పత్రి సలహా సంఘం సభ్యులు సాయిప్రసాద్, అరుణ్‌రషీద్ తదితరులు హాజరయ్యారు. వైద్యశాలలోని రోగులకు ఈ సందర్భంగా వారు పండ్లు, పాలు, బ్రెడ్లు పంపిణీ చేసారు. వైద్యశాల డిప్యూటీ సూపరింటెండెంట్ విజయమోహన్ గుప్తా, జిల్లా తెలుగుయువత నాయకుడు నందిమల్ల రమేష్, వనపర్తి వికాసతరంగిణి అధ్యక్షుడు కురుమూర్తి, కార్యదర్శి వెంకట్రామారెడ్డి, ఉపాధ్యక్షులు శ్రీనివాససాగర్, మహిళా కార్యదర్శి ప్రమీలమ్మ తదితరులు పాల్గొని కార్యక్రమాన్ని ముదావహంగా ముగించారు.

## ఖమ్మం

ఖమ్మం పట్టణంలో గీతాజ్యోతి కార్యక్రమాలు నిర్వహించుటకు స్వర్ణభారతి కమ్మవారి కళ్యాణ మండపము నందు నూతన కార్యాలయం ప్రారంభించబడినది. ఖమ్మం జిల్లా గీతాజ్యోతికి సంబంధించిన పూర్తి సమాచారం ఈకార్యాల యంలో తెలియజేయ బడుతుంది.

## కరీంనగర్

విద్యానగర్‌శాఖ - 303 వారి ఆధ్వర్యవంలో 60 మంది భక్తులలో కలసి శ్రీమాన్ బల్మూరి సుజాత కొండలరావు గారింటిలో ప్రతిరోజూ గీతాజ్యోతి శ్లోకమాలికను పారాయణ చేస్తున్నారు. విద్యానగర్, జ్యోతినగర్ ప్రాంతాలలో సుమారు 50 మంది గృహాలవారిని గీతాజ్యోతి కార్యక్రమంలో భాగస్వాములుగా చేసారు.

వికాసతరంగిణి శాఖ 130 వారిచే జీపుద్వారా బోయినపల్లి, సిరిసిల్ల, వేములవాడ, చందుర్తి, యెల్లారెడ్డి పేట, గంభిరావుపేట, కోనరావుపేట మండలాలలోని 126 గ్రామాలలో పర్యటించారు. హనుధ్వజాలను గీతాజ్యోతి స్టిక్కర్లను, సందేశాన్ని అందిరికీ అందించారు.

## విద్యార్థులకు పోటీలు

చెన్నైజెట్, వికాసతరంగిణి వారి ఆధ్వర్యవంలో విద్యార్థులకు కంఠస్థీకరణ, వక్తృత్వ పోటీలు ఆగష్టు 25న చెన్నై మహానగరంలో వైభవంగా జరిగాయి. గత 7 సంవత్సరాలుగా నిర్వహించబడుచున్న ఈ పోటీలలో ఈసారి మరో రెండు స్తోత్రములు చేర్చి ఒక విశేష వైభవాన్ని ఈ 8వ పోటీకి కలిగించారు. సుమారు 20 పాఠశాలలకు చెందిన 1500మంది బాలబాలికలు ఎంతో ఉత్సాహంతో తమ ప్రతిభను ప్రదర్శించారు.

వీరిని మూడు గ్రూపులుగా విడదీసి, వివిధ పోటీలు నిర్వహించారు. విజేతలకు బహుమతులు అందించి, అందరకూ తదీయారాధన కైంకర్యము చేయడం జరిగింది.

## చోడవరం

వికాసతరంగిణి ఆధ్వర్యవంలో ప్రేమ సమాజంలోని పిల్లలకు పుస్తకాలు, పెన్నులు, వస్త్రాలను ఆగష్టు12న ఉచితంగా అందించారు. స్థానిక కన్యకాపరమేశ్వరి ఆలయంలో జరిగిన ఈ కార్యక్రమానికి శ్రీమాన్ రఘునాథ్ ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు.

## ఈ సంచికలో.....



### శ్రీవారి సూక్తి

**నిన్ను నీవు తీర్చిదిద్దు కోవడానికి అద్దమెంత అవసరమో నిన్నునీవు చక్కదిద్దుకోవడానికి 'విమర్శ' అంతే అవసరము.**

## పంచాంగ వివరాలు

### అక్టోబర్

7 శరన్నవరాత్రారంభం, దౌహిత్రకృత మహాలయం, తిరుమల బ్రహ్మోత్సవారంభం.
8 తదియ తిథి
9 తిరుమలై నంబి తిరునక్షత్రం
11 చిత్తకార్తె ఉ. 11-50
12 సరస్వతీపూజ, తిరుమల గరుడోత్సవం
13 దుర్గాష్టమి
14 మహానవమి
15 విజయదశమి తిరువేంగడత్తాన్, వేదాంత దేశికర్ తిరునక్షత్రం తిరుమల రథోత్సవం
16 సర్వేషామేకాదశి
17 తులా సంక్రమణం తె. .4-58
21 పాడ్యమి తిథి
22 శూన్య తిథి
23 విదియతిథి
24 స్వాతికార్తె రా. 9-28
25 శుక్రమౌఢ్యారంభం

### నవంబర్

1 సర్వేషామేకాదశి ద్వాదశి తిథి, ఆంధ్రావతరణ దినం
3 నరక చతుర్దశి స్నానం శుక్రమౌఢ్యత్యాగం
4 దీపావళి, ధనలక్ష్మీ పూజ, శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి తిరునక్షత్రం, సర్వేషాం అమావాస్య
6 విశాఖ కార్తె తె. 4-36
8 శ్రీరామచంద్రస్వామివారి సహస్ర కలశాభిషేకం మణవాళమహాముని తిరునక్షత్రం


మీ సేవలో.....

భక్తినివేదన, సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 72929
చందా: సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-, విదేశాలకు సంవత్సరచందా $ 25
E-mail : bhakthinivedana@yahoo.co.in Internet : www.chinnajeeyar.org
D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం.

## విషయ సూచిక



**సహస్రకలశాభిషేక మహోత్సవం**

శ్రీశ్రీశ్రీ స్వామివారి ఆరాధ్య పెరుమాళ్ళు శ్రీసీతా రామచంద్ర స్వామికి తేది : 8-11-2002న సీతానగరం, వేదవిశ్వ విద్యాలయ ప్రాంగణంలో సహస్ర కలశాభిషేక మహోత్సవం వైభవంగా జరుగును భగవద్బంధువు లందరికీ.......

ఇదే మా శుభాహ్వానము.

మీ సేవలో....

## పంచాంగ వివరాలు

### నవంబర్

1 సర్వేషామేకాదశి ద్వాదశి తిథి ఆంధ్రావతరణ దినం

3 శుక్రమౌఢ్యత్యాగం, నరకచతుర్దశి స్నానం

4 సర్వేషాం అమావాస్య దీపావళి, ధనలక్ష్మీ పూజ, కేదరేశ్వర వ్రతం శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి తిరునక్షత్రం

6 విశాఖ కార్తె తె4-36

8 శ్రీరామచంద్రస్వామికి సహస్ర కలశాభిషేకం మణవాళ మహాముని తిరునక్షత్రం

9 సేన ముదలియాళ్వార్ తిరునక్షత్రం

11 పోయిఘయాళ్వార్, పిళ్ళలోకాచార్యర్ తిరు॥

12 పూధత్తాళ్వార్, తిరుమలైయాండాన్ తిరు॥

13 పేయాళ్వార్ తిరునక్షత్రం

15 సర్వేషాం బోధనైకాదశి

16 వృశ్చిక సం॥ రా.2-26 చిలుకద్వాదశి

18 వైకుంఠచతుర్దశి

19 వైఖానస కృత్తికా దీపోత్సవం మాధవ పెరుమాళ్ తిరునక్షత్రం

20 తిరుమంగయాళ్వార్, నంబిళ్ళై తిరునక్షత్రం శ్రీవిష్ణ్వాలయాల్లో ద్రావిడ వేదాధ్యయన నిగమనం

21 శ్రీపార్థసారధిస్వామి, తిరుప్పాణాళ్వార్ తిరు॥ శ్రీవైష్ణవ గృహాల్లో ద్రావిడ వేదాధ్యయన నిగమనం

30 సర్వేషామేకాదశి

### డిసెంబర్

2 మాస శివరాత్రి

4 తిథిద్వయం, సర్వేషాం అమావాస్య

5 విదియ తిథి


**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 72929

చందా: సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-, విదేశాలకు సంవత్సరచందా $ 25

E-mail : bhakthinivedana@yahoo.co.in Internet : www.chinnajeeyar.org

D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రోసెసర్స్, సీతానగరం,




పాఠకులకు దీపావళి మరియు శ్రీశ్రీశ్రీస్వామివారి తిరునక్షత్ర శుభాభినందనలు



శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

ఆధ్యాత్మిక మాసపత్రిక


**సంపుటి 55 2002 నవంబర్ సంచిక 8**

చిత్రభాను నామ సంవత్సరం కార్తీక మాసము

సంపాదకులు : శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. శ్రీరామచంద్రాచార్యులు

వ్యవస్థాపకులు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

జై శ్రీమన్నారాయణ!

# గీతాజ్యోతి

## పారాయణ శ్లోకమాలిక

30వ వారం

## స్వంతసాధనలకు స్వామి దొరకడు కృష్ణుడిస్తే కనవలసిందే

శ్లో॥

**మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శిత మాత్మ యోగాత్।**
**తేజోమయం విశ్వమనంత మాద్యం యన్మే త్వదన్యేన న దృష్టపూర్వం ॥**

**11అ. 47శ్లో.**

**ప్రతిపదార్థము :** **అర్జున**=అర్జునుడా!, **మే**=నాయొక్క, **తేజోమయం**=తేజోరాశియైనదియు, **విశ్వం**=అంతటను వ్యాపించినదియు, **అనన్తం**=అంతములేనిదియు, **ఆద్యం**=అన్నిటికిని మొదటిదియు, **పరం**=గొప్పదియు, **త్వదన్యేన**=నీకంటే నితరునిచే, **న దృష్టపూర్వం**=పూర్వమెన్నడును చూడబడనిదియునగు, **యత్రూపం**= ఏ రూపముకలదో(అట్టి), **ఇదం**=ఈ విశ్వరూపము, **ప్రసన్నేన**=అనుగ్రహముకల, **మయా**=నాచేత, **తవ**=నీకు, **ఆత్మయోగాత్** = నాసంకల్పమువలన, **దర్శితం**=చూపించబడినది.

**"స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ"** అనే సూత్రంతో గీతాజ్యోతిని ఆరంభం చేసి ఒక్కొక్క వారం ఆ భగవానుడు మనకు అందించిన ఒక్కొక్క సందేశాన్ని స్పష్టపరచుకుంటూ భగవత్ ప్రేమను పెంచుకుంటూ, పంచుకొనే ప్రయత్నం చేస్తున్నాం. అందులో భాగంగా ఈ 30వ వారానికి ఎన్నుకొన్న శ్లోకం 11వ అధ్యాయంలో 47వ శ్లోకం. అర్జునుడు భగవత్ రూపాన్ని చూడాలి అని కోరాడు. చూచే నేత్రాన్ని స్వామి ప్రసాదించాడు. ఒక్కసారి రూపాన్ని చూసాడు. ఆశ్చర్యం కల్గింది. భయం వేసింది. అదిరిపోయాడు అర్జునుడు. ఎటు చూసినా రూపాలే, ఎటు చూసినా ఆది మధ్య అంతాలు లేకుండా వ్యాపించిన ఒక దివ్యదేహం. ఆ దేహంలో ఏమూల చూసినా అనంత విశ్వం కన్పిస్తోంది. మామూలు కళ్ళకైయితే వస్తువులుగా కన్పించేవి మాత్రమే కన్పిస్తాయి తప్ప గుణాలు కన్పించవు.

ఒక వ్యక్తిలో ఆనందం ఉందీ అంటే అది కంటికి కన్పిస్తుందేమిటి? అతను లోపల ఆనందపడుతూ, బయటకు మాత్రం ఏడుపుమొహం పెట్టొచ్చు. కొంతమంది పైకి ఆనందిస్తున్నట్టే ఉంటారు. లోపల మాత్రం ఘోరంగా ఏడుస్తుంటారు. అంటే లోపలొక్కటి బయటికొక్కటి. లోపల ఆనందం ఉందా? సంతోషం ఉందా? సంతృప్తిఉందా? క్రోధం ఉందా? దయ ఉందా? జ్ఞానముందా? అజ్ఞానముందా? ఇవి తెలియవు. పైకి ఆకారం కన్పిస్తుంది. ఒకరు మంచి అద్భుతమైన, నీటుగా ఉండే డ్రస్సు చేసికొని ఉండవచ్చు. పొట్టకోస్తే అక్షరం ముక్క లేకపోవచ్చు. కానీ, ఎవడో ఒకడు ఏదో ఒక చిన్న కౌపీనమే కట్టుకొని ఉండచ్చు. కానీ వాడు





ఎంతో మహానుభావుడైన విజ్ఞానశీలుడు కావచ్చు. పైన కన్పించే ఆకారాల్నే మన నేత్రాలు చూస్తాయి తప్ప. లోపల ఉండే యోగ్యతను చూడగల్గినవి కావు. బలహీనత ఈ నేత్రాలది.

కానీ, శ్రీకృష్ణుడు యిచ్చిన నేత్రానికి ఆ శక్తికూడ ఉండుటచేత అర్జునుడు ఒక్కసారి ఆ నేత్రంతో ఈ విశ్వాన్నంతటిని చూసాడు. ఈ విశ్వం అంతా ఆ కన్పించే విరాట్ రూపంలో ఒక్కమూలకి ఒదిగిపోయి కన్పిస్తోంది. ఇన్ని రకాలైన గేలాక్సీలు అందులోఉండే గోళాలు ఒక మూలకి కన్పిస్తున్నాయి. మరొక వైపు చూస్తే ఇంత విశ్వమూ మరొక మూల కన్పిస్తోంది. ఎక్కడ చూస్తే అక్కడ అంతా పరిపూర్ణత. నిండుదనం. అణువణువునా అంత నిండుదనం కల్గి అందులో జ్ఞానము, శక్త్యాది గుణాలు కూడా నిండిన ఆ భగవత్ రూపం అర్జునుడికి కన్పించింది (దివ్యనేత్రపు ప్రభావంచేత).

అర్జునుడు భయపడిపోయాడు. అందులో కౌరవులు, పాండవులు, పక్షపాతం లేకుండా పోటీపెట్టుకొని మరీ పరుగులు వేసుకుంటూ ఆ తెరచిన భయంకర ముఖాలలోకి దూరుకుంటూ వెళ్ళిపోతున్నట్టు కన్పించింది. భయపడి పోయాడు అర్జునుడు. "హే! కృష్ణా! ఈ రూపం కాదు నేను చూడదల్చుకున్నది. నాకు పరిచయమున్న నాకు తోడుగా వుండే చతుర్భుజుడునే చూడాలి. ఇలాంటి కృష్ణుడిని కాదు'' అన్నాడు. జాలి వేసింది భగవంతుడికి. తనయొక్క విరాట్‌రూపాన్ని చూడడానికి పనికి వచ్చే దివ్యనేత్రాన్ని జాగ్రత్తగా వెనక్కి పుచ్చేసుకున్నాడు. అర్జునుడికి ఒక్కసారిగా ఆస్వాసన కలిగింది. కానీ, ఇంకా వణుకు మాత్రం పోలేదు.

కొంతమంది భగవంతుడిని మేమే చూపించేస్తాం. '5' నిమిషాల్లో యోగం చేయించేస్తాం! కళ్ళుమూసుకుంటే భగవంతుడిని కన్పింపచేస్తాం ! ఇలా రకరకాల మాటలూ మాట్లాడుతుంటారు. కానీ, శ్రీకృష్ణుడు అర్జునుడితో 'నారూపం అట్లా కన్పించేది కాదు సుమా! అంటున్నాడు'. కొంతమంది లోకంలో మేం బాగా వేదాలు చదివేస్తాం, మంత్రాలు చదివేస్తాం, భగవంతుడు కన్పించేస్తాడు అంటారే! అంటే అలాంటి అహంకారం కల్గిన కళ్ళకి కన్పించేవాడను కాను నేను. స్వంత ప్రయత్నాలతో భగవంతుడిని చూడాలనుకునే ఎవరికీ కూడా నేనందను. నా కరుణ కల్గితేనే కన్పిస్తాను. కేవలం నేను నిన్ను అనగ్రహించాలంటే సాక్షాత్కరిస్తా తప్ప, మరొక రూపంగా కానేకాదు. యజ్ఞం చేసి, దానం చేసి, తపస్సు చేసి ఆహారాదులు మానేసి పెద్ద పెద్ద వ్రతాలు చేసి అలాంటి దాని చేత భగవత్ సాక్షాత్కారాన్ని పొందాలి అని కొందరు కోరుకుంటారు కదా! అంటే అలాంటి వాటి వల్ల యోగ్యతలు సాధించుకుంటారు. కానీ! కన్పించడం, చూపించడం కేవలం నా ఆధీనంలో మాత్రమే ఉంటుంది. వేదాలు చదివినా నేను కావాలి అని అనుకోకపోతే **'అరణ్యరుదితం ఆమ్నాయా భ్యసనాని, వేద వ్రతాన్యన్వహం మేధచ్ఛేద ఫలాని'.** బ్రహ్మాండమైన అగ్నిహోత్రం వెలిగించేసి, 'వాటిమధ్యలోకూర్చొని, హోమాలు చేసేస్తే కాస్త క్రొవ్వు కరగడానికి పనికి వస్తుంది తప్ప, నన్ను సాక్షాత్కరించుకోవడానికి సాధనం కానేకాదు. ఒక సాధనానికి నేను లొంగేవాడిని కానేకాదు. నేను కరుణిస్తే మాత్రమే కన్పిస్తాను అర్జునా? నీకు కన్పించినట్టే' అన్నాడు స్వామి భగవద్గీతలో, **నాహం వేదైః ...అనేచోట**

అర్జునుడు చూచిన విరాడ్రూపం కావచ్చు. లేదా తనని ప్రేమించే భక్తులకి చూపించే విగ్రహం కావచ్చు. చతుర్బాహువుగా తానుండేదో, లేదా అంతటా ఎప్పుడూ వ్యాపించి ఈ వస్తువులు, ఈ విశ్వం ఇలా నిలబడి వుండాలంటే ఆధారంగా వుంటూ **'శాంతానంత మహా విభూతి పరం య ద్బ్రహ్మరూపం హరేః'** అని మన శ్రీయామునముని అనుగ్రహించినట్టుగ, ప్రతివస్తువులోను దానియొక్క సత్తా నిలబడం కోసం వ్యాపించే రూపం కావచ్చు. ఏదైనా ఆయన అనగ్రహంతోనే కన్పించాలే తప్ప, ఎవరి ఏ సాధనకూ ఆయన అందేవాడు కాదు. అదీ భగవంతుడు ఈ 11వ అధ్యాయం 47వ శ్లోకంలో తాను చెబుతున్నాడు. నీ విషయంలో నాకు అనుగ్రహం ఏర్పడింది. అందుకే నా రూపాన్ని నీకు చూపిస్తున్నాను. అప్పటిదాకా భయపడిపోయిన అర్జునుని ఒక్కసారి భుజంతట్టి భయపడకయ్యా!

భయపడకు. నేను నీ విషయంలో అనుగ్రహిస్తున్నాను కనుక నీకు భయమెందుకు? నీకు రక్షకుడిగ వున్నాను కనుక నీకేమి బెంగ అక్కరలేదు అన్నాడు.

అర్జునుడిలో ఉండే దంబం, దర్పం, అహంకారం, ఇలాంటివన్నీ కూడా క్రమంగా భగవంతుడి యొక్క ఉపదేశం వింటూంటే, ఆయన కల్యాణ గుణాలని స్మరిస్తూవుంటే, ఆయన యొక్క విభూతినిగూర్చి తెలుసుకుంటూ ఉంటే తొలగిపోయాయి. ఆయన రూపాన్ని ఇపుడు చూసాడుకూడా. అది అలాగే మనస్సులో ప్రింట్ అయింది. ఆ స్థితిని చూచి స్వామి "అర్జునా! నీ మనస్సు ఈ వేళ చక్కగా ప్రశాంతముగా ఉందయ్యా! ఇలాంటి వాడికే నా గురించి నేను తెలియజేస్తా! ఇలాంటి వాడికే నన్ను నేను చూపిస్తా" అని స్వామి అతనికి హామీ యిచ్చాడు. **"మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శితమ్ ఆత్మయోగాత్"** ఇదేమీ నీకు మాయ చేసి చూపలేదు. ఇదేం ఇంద్రజాలంగా చూపలేదయ్యా! వాస్తవాన్ని చూపిస్తున్నా అన్నాడు. భగవంతుడియొక్క విశ్వవ్యాప్తమైనటువంటి రూపం ఆశ్చర్యం!

అయితే అది ఇంద్రజాలమో! మాయో కానేకాదు. యదార్థము. "ఆత్మయోగాత్" నా యొక్క అప్రతిహతమైన సంకల్ప విశేషం చేత నేను నీకు చూపించాను. ఇది పరంరూపం. భగవంతుడికి రకరకాల రూపాలున్నాయని అనుకున్నాం కదా! ఒకటి ప్రతి వస్తువులోను 'సత్తా కోసం' ఉండే రూపం అది. రెండవది తనని ప్రేమించేవాళ్ళకి చూపించే చతుర్బాహువు రూపం ఇలా.... ఇంకా ఉన్నాయి ఆయన రూపాలు. ఇంతవరకూ అర్జునుడికి చూపించినది పరరూపమే. ఇది మామూలు వాళ్ళకు చూపించే రూపం కాదు. 'నిత్యం దర్శన కాంక్షిణః దేవాః అస్య రూపస్య'. ఎంతెంత మంది ఋషులు, ఎంతెంత మంది మహానుభావులు ఈ రూపాన్ని దర్శించాలని నిత్యం ప్రార్థిస్తూనే ఉన్నారు. నీకు చూపించినపుడే వారూ దీనిని దర్శించేలా అనుగ్రహించాను. నీకు మాత్రం "రూపం పరం దర్శితం ఆత్మయోగాత్" స్వామికుండే అసాధారణ సంకల్పంచేత అనుకున్నది ఎప్పుడూ కూడ మొక్కపోవటం అన్నది లేనేలేదు. లోకంలో ఎవరో కొందరు సాధరణం జీవులు అనుకుంటేనే సాధించగల్గుతుంటారు సాక్షాత్తు సర్వేశ్వరుడూ, ఆ కృష్ణపరమాత్మ అనుకుంటే నెరవేరదా! 'తేజోమయం' ఎటు చూసినా తేజస్సే ఎక్కడ చూసినా తేజః ప్రచురమైన రూపమే. అది అంతటా వ్యాపించి వుంది. ఎక్కడా ఖాళీ లేనేలేదు. ఈ జగత్ లేక ప్రపంచం, విశ్వం అని మనం చెప్పేవన్నీ ఆయనలోంచే బయటపడ్డవి కనుక వీటికి అన్నింటికీ కూడా 'ఆద్యం', మొదటిది ఆ రూపమే. అదే ఎప్పుడూ ఉండేది. అంటే, ప్రపంచమంతా అందులోంచి వస్తోంది. నిలబడుతోంది. మళ్ళీ అందులోనికే వెళుతోంది. అది మాత్రం ఎప్పుడూ ఉంటుంది. సకల చేతనా చేతనాత్మకమైన విశ్వానికి అది ఆధారము. **త్వదన్యేన నదృష్టపూర్వం.** నీకు నేను చూపించాను కనుక నీవు చూడగలిగావు. మొదట చూసిన వాడవిగా నీకు ఈ క్రెడిట్ దక్కుతుందయ్యా. నీకు చూపించినది ఏరకమైన దోషంలేని రూపం. చూపించాలి అని నేననుకున్నాను. అందుకే చూపిస్తున్నాను.

భగవంతుడు దయచూపితే ఎంత అదృష్టమో, ఎంత యోగ్యత ఏర్పడుతుందో కదా! కొంతమంది తెలియక మేం చూసేస్తాం, మేం సాధించేస్తాం అనుకుంటారా! కానీ అది సాధ్యంకాదు. ఆయన అనుగ్రహించితే తప్ప. అయితే ఆయన అట్లా అనుగ్రహించడానికి ఆటంకం మనలో ఉండే "స్వతంత్రతా భావన". అది మనలో లేకుండా ఉంటే చాలు. ఆయన చూపిస్తాడు. ఆయన్ని మన విషయంలో ప్రసన్నుడు కమ్మని అడుగుదాం! ఆయన్ని విశ్వసిద్దాం! 'స్వీయ ఆరాధన-సర్వ ఆదరణ' ఆచరిద్దాం! ఇదే మిగతా వారికి కూడా ఒక ఆదర్శం కావాలని ప్రార్థిద్దాం!





### 31వ శ్లోకం

## వృత్తి, ప్రవృత్తి పరమాత్మ పరమైతే పనులన్నీ పరమాత్మ సేవలే అవుతాయి

శ్లో ॥ మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః ।
నిర్వైర స్సర్వభూతేషు య స్స మామేతి పాండవ !॥ 11అ. 55 శ్లో.

**ప్రతిపదార్థము :** **పాండవ**=అర్జునా; **మత్కర్మకృత్**=తన ధర్మములను నాయారాధన బుద్ధితో చేయువాడును; **మత్పరమః**= నేనే ప్రధానోద్దేశముగా గలవాడును, **మద్భక్తః**=పరమప్రీతితో నన్నే ధ్యానించువాడును, **సంగవర్జితః**=నాకంటె వేరైన వస్తువులతో తనకు సంబంధము లేనివాడును, **సర్వభూతేషు**=సకల ప్రాణులయందును, **నిర్వైరః**=విరోధములేని వాడును, **యః**=ఎవడో, **సః** =వాడు;**మాం**=నన్ను;**ప్రాప్నోతి**= పొందు చున్నాడు.

మానవజీవితం పనిచేయడం కోసం ఏర్పడింది. ఒక వ్యక్తికి ఒక ఊళ్లో ఉద్యోగం ఇస్తే, ఆ ఉద్యోగం కోసం ఆ ఊరు వెళ్ళినవాడు, ఆ ఉద్యోగం ఉన్నంత వరకూ, ఆ ఊరిలో ఆ ఉద్యోగకృత్యమేదో దానిని నెరవేరుస్తూనే ఉండాలి. అలానే మానవశరీరంలోకి రావడానికి లక్ష్యం, ఈ శరీరాన్ని వినియోగిస్తూ, ఇచ్చిన వాడివైపు ప్రయాణం కొనసాగించడం. దీనిని ఇచ్చినవాడు ఎవడో భగవద్గీత చెపుతుంది. ఎన్నో రకాల దర్శనాలున్నాయి. ఎందరో మతప్రవక్తలున్నారు. ఎన్నెన్నో రకరకాలుగా వారు చెప్పారు. కానీ భగవద్గీతలో శ్రీకృష్ణుడు "ఈ శరీరంలో జీవుని కూర్చినవానిని నేను" అని చెప్పాడు. 'అహం బీజప్రదః పితా' ఈ ప్రకృతిని ఒక శరీరంగా మారేలా చేసి, అది మానవాకృతితో వచ్చేటట్లు చేసి, అందులో ఈ జీవిని నిలిపినవాడిని నేనే అన్నాడు.

అనేక జన్మలు నుండి తెచ్చిపెట్టుకున్న కర్మలభారాన్ని తగ్గించుకోవడానికి మానవదేహం అన్నిటికంటే ఉత్తమమైన సాధనమని భగవంతుడు జీవుడికి ఈ శరీరాన్ని లభించేలా చేసాడు. అయితే ఈ జీవుడు తన ప్రవృత్తి వల్ల కర్మను తొలగించుకోవచ్చు. కర్మను పెంచుకోనూవచ్చుకూడ. మానవశరీరం అంత గొప్పది.

ఎలా చేస్తున్నావో, ఎందుకు చేస్తున్నావో, తెలిసి ఆచరిస్తే, ఆ తెలివి ఆ చేసే పనిని అంట నివ్వదు సరికదా, గతంలో ఉన్న ప్రాచీనమైన కర్మనంతటినీ భస్మం చేసి పారేస్తుంది. దూది బోలెడంత ఉన్నా ఓ చిన్న నిప్పుకణం దానిలో వేస్తే అంత దూదిని అదెలా భస్మం చేయగలదో అలానే చెయవలసిన కర్మను మనం సరిగా చేస్తే అది ఎన్నెన్నో జన్మల నుంచి పేరుకుపోయి ఉన్న ప్రాచీన పాపరాశినంతటిని భస్మం చేసి పారేయగలదు. చేయవలసిందల్లా భగవన్నామాన్ని మనో మందిరంలో నింపుకోవడమే అని మనకు భగవంతుడు 11వ అధ్యాయపు 55వ శ్లోకంలో చెప్పాడు.

మొదటి శ్వాస నుంచి తుదిశ్వాస దాక పనిచేస్తూండటమే మానవుని కర్తవ్యం. తెలియక కొందరు మేము జ్ఞానులమైపోయాం. మేం రాజయోగులమైపోయాం కనుక మాకు ఈ పనులన్నీ అవసరం లేదు. పుట్టుకతో ఏర్పడ్డ బాధ్యతలను, కర్తవ్యాలను వదలుకొని, తమ ప్రకృతి బంధాలన్నీ విడిపోయాయని భ్రమిస్తారు.

భగవద్గీతలో స్వామి ఇది తగదని అనేక సందర్భాలలో స్పష్టం చేసాడు. నీవు ఇక్కడకు వచ్చినది కేవలం కర్మాచరణ కోసమే.

మానవశరీరమే జీవుడికి ఒక ఉద్యోగం. ఇందులో మొదటి శ్వాస నుంచి తుది శ్వాస దాక ఉద్యోగపు సమయం. కనుక ఉద్యోగ సమయంలో ఇతర ప్రవృత్తులు పనికిరావు. ఫలాశ తగదు. పని చేయక తప్పదు. పని మానడం తగదు. దానిని కర్మ అంటారు. కర్మ ఎపుడూ మానద్దు. కర్మయందు ఉండే భావనను మార్చు. ఇది వరకు ఇది నా పని, నా విధి, నేను చేసుకుంటున్నా, నా ఫలితం కోసం అనే భావనను మార్చి "ఇది భగవంతుడి పని, అతని ప్రయోజనముగా చేసేది, ఫలము అతనికే చెందినది, అనుభవించే నాకు అతనితో ఉండే సంబంధం వలన ఈ పని నేను చేయతగును అని నన్ను ఇక్కడికి పంపాడు", అనుకొంంటూ చేయాలి.

ప్రతిపనీ చేయకుండ ఉండలేక ప్రీతితో చేస్తారు. ఇపుడు దీనినే 'సేవ' అంటారు లోకుల విషయంలోనైతే. అదే భగవంతుడి విషయంలో అయితే 'కైంకర్యము' అని అంటారు. కింకర అని పనిచేసేవాడికి పేరు. ఈ పేరు ఎందుకు ఎందుకు వచ్చిందంటే కిం కరవాణి, కిం కార్యం అని అడిగి, చెప్పినవన్నీ చేసేవాడు కింకరుడు. ఈ కింకరుడు చేసే పనే కైంకర్యం. నిజానికి నేడు లోకంలో ఈ పదాన్ని పాడుచేసేసారు. ఎవరైనా తనదికాని వస్తువును స్వంతం చేసుకునే ప్రయత్నంలో ఉంటే కైంకర్యం చేసాడని అంటున్నారు. కానీ ఆ పదానికి అసలు అర్థం అది కాదు. ఆ పదం చాలా గొప్పది.

ఈ పని, ఆ పని అని లేదు. ఏ పని చేసేవాడైనా తను చేసే పని భగవత్ సేవగా అనుకుని చేస్తే దానినే కైంకర్యం అని అంటారు. 'మత్కర్మ కృత్' నీవు ఏ పనైనా నా పనిగా చేయవయ్యా! నీవు దానములు చేయి, ధర్మములు చేయి, యోగములు చేయి, యాగములు చేయి, నా సేవ అనుకుంటూ చేయి. నీవు చేసే ఏ పనైనా కైంకర్యమను కుంటూ చేయి. అది నీకు బంధకం కాకుండా నేను చూస్తా! నేను అట్లానే పనిచేస్తా! కనుక నాకు ఏది బంధకం కాదు. నీవు అలా పనిచేయడం ప్రారంభం చేయి. నీకూ అవి బంధకం కాకుండా చూచేవాడిని నేను. ఏ పని అయినా ఫలితం లభించేటట్లు నేను చేయాలి. కనుక అవి నీకు ఉత్తమ ఫలితమిచ్చేలా చేస్తా. బంధకం కాకుండా నేను తీర్చిదిద్దుతాను అని మొదట చెప్పాడు.

రెండవది 'మత్పరమః' నీవు ఏది చేసినా అది చెందేది నాకు అని గుర్తించు. నాకంటే మించి మరొకడు ఎవడూ ఫలితాన్నివ్వగలిగినవాడు లేడు. కనుక ఏది నువ్వు చేసినా, ఇది శ్రీకృష్ణుడిదాకా చెందుతోంది అని అనుకుంటూ చేయ్. "మత్పరమః" నేనే ప్రయోజనంగా కల్గి వుండాలి. లోకంలో పొలం దున్ని పండించేది కూలీలు. ఫలితం పొందేది ఆ పొలం కలిగిన రైతు, కూలీ! 'మా యజమాని కోసం చేస్తున్నాను' అంటాడు. యజమానిని దేవుడు అంటాడు. వానికి ఎంతో చాకిరీ చేస్తాడు. ప్రతిగా ఎంతో కొంత జీతం అందుకుంటాడు. కానీ ఆ వ్యక్తి ఆ కూలీవానికి ఆ ఉద్యోగ మివ్వడానికి కారణం ఆ వెనుక ఉండే భగవంతుడేనని గుర్తుపెట్టుకొంటూ చేయగల్గితే అదీ భగవంతుడి సేవే. "అర్జునా! ప్రీతి నీకు ఏర్పడవలసినది నా విషయంలో. అపుడు నీవు నా భక్తుడవు కాగల్గుతావు. 'సంగవర్జితః మద్భక్తః' నాయందు భక్తితో నీకు నాతోనే సంగముంటుంది. ఇతరమైనవాటియందు ఉండదు" అంటాడు స్వామి.

"పరమాత్మని యోరక్తః, విరక్తః అపరమాత్మని" అంటుంది శాస్త్రం. భగవంతుడి మీద ఏర్పడ్డరుచి భగవదితరమైన వాటియందు ఉండే రుచిని తగ్గిస్తుంది. శ్రీయామునాచార్య స్వామివారు అంటారు. "స్థితేర విందే మకరంద నిర్భరే, మధువ్రతః నేక్షురకం హి వీక్షతే" అద్భుతమైన తేనెలూరే ఒక పద్మంలో ఒక మధుపంచేరి అందులో ఉండే తేనెను ఆస్వాదించ నేర్చిన తరువాత ఆ ప్రక్కన ఎక్కడో ఉండే ఒక క్షుద్రమైన గడ్డిపువ్వులో ఉండే తేనెకోసం అది ఏ





విధంగా ఆశించదో, అదేవిధంగా నాయందు శ్రద్ధగల్గి సంగం ఏర్పడ్డ వ్యక్తులకు ఇతరమైన అల్పమైన లౌకికమైన వస్తువుల యందు సంగము ఉండనే ఉండదు. ఇది అయిన తరువాత "నిర్వైర స్సర్వ భూతేషు" లోకంలో దేనియందు వీడికి వైరం ఉండదు. వీడియందు ఎవరికీ వైరం ఉండదుకూడా. లోకంలో అన్నిటి వెనుక ఉండి నడిపించే తత్త్వం ఒకడే పరమాత్మ అయినపుడు, ఒకడు మిత్రుడు, ఒకడు శత్రువు అనే ప్రశ్న ఎక్కడ వుంటుంది? నిజమైన జ్ఞానం కల వ్యక్తికి ఈ దృష్టి ఏర్పడుతుంది కనుక అన్నిటా భగవంతుడ్ని చూస్తాడు. అలాంటి వాడు నా దివ్యమైన సాయుజ్యాన్ని పొందగలుగుతాడు.

మనం మన పనులను భగవత్ పరం చేద్దాం. సంగం భగవంతునియందు పెంచుకుందాం. ఆ భగవదనుగ్రహాన్ని మనం మన వారందరికి పంచుదాం! మాధవ సేవగ సర్వప్రాణి సేవ చేయగలిగే యోగ్యత మనకి మరింతగా ప్రసాదించమని కోరుదాం! కేవలం మానవులకి మాత్రమే చేసే సేవ మాధవ సేవ అని దాన్ని అక్కడికి పరిమితం చేయవద్దు. మాధవ సేవగా సర్వప్రాణి సేవ చేద్దాం! గీతాజ్యోతి మనకందించే సందేశం ఈ 31వ వారంలో మనం ఆచరిస్తూ ముందుకు అడుగువేద్దాం. మాధవ అనుగ్రహాన్ని పొందే ప్రయత్నం చేద్దాం!

## 32వ వారం

# మనస్సుని మాధవుని మందిరముగా మలచడమే మోక్షము

శ్లో॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ 12అ. 8శ్లో.

**ప్రతిపదార్థము :** **మయి ఏవ**=నాయందే, **మనః**=మనస్సును; **ఆధత్స్వ**=లగింపజేయుము; **బుద్ధిం**=బుద్ధిని, **మయి**=నాయందే; **నివేశయ**=ప్రవేశింపజేయుము; **అతః ఊర్ధ్వం ఏవ**=అటు పిమ్మటనే; **మయి**=నాయందు, **నివసిష్యసి**=వసింతువు, **సంశయః**=సందేహము, **న**=లేదు.

భగవానుడియొక్క సేవలు చేసి గడపడానికి ఏర్పడ్డ ఉత్తమ జీవితం మానవుడిది. మనస్సు ఇచ్చాడు. ఇంద్రియాలు యిచ్చాడు. చక్కటి దేహాన్ని యిచ్చాడు. ఆ మనస్సుని నడపడానికి చక్కటి బుద్ధిని ప్రసాదించాడు. వీటిని సవ్యంగా వాడుకుంటే భగవంతుడు తన యొక్క సాన్నిధ్యాన్ని ప్రసాదిస్తాను అని అన్నాడు. ఇంతకు మించిన సౌకర్యం మరొకటి లేదు. ఎన్నో రకాల పనులు చేస్తూ జీవితాన్ని దుఃఖాలలోనికి దింపుకుంటూ ఉంటాం. చేసే ప్రతీపనీ, ఒక్కొక్క ప్రతిబంధకమై, మనని క్రిందకి లాగుతూ వుంటుంది. నిజానికి, బంధించేదేదో అది కర్మ అంటారు. బంధించనిదేదో అది అమృతత్వం, అని అంటారు. 12వ అధ్యాయంలో ఏడవ శ్లోకంలో భగవంతుడు 'అహం ఉద్ధర్తా భవామి' అన్నాడు. మృత్యువు తోటి సమానమైన ఈ సంసార సముద్రం లోంచి నేను పైకి తీస్తా. 'అహం' అని కృష్ణుడు చెప్పిన ఓడకు. 'విష్ణుపోతం' అని పేరు పెట్టాయి మన శాస్త్రాలు. విష్ణువు అంటే వ్యాపించిన తత్త్వము అని చెప్పాయి. పోతము అంటే ఓడ. దీని వ్యాపన చాలా గొప్పది. ఈవలి ఒడ్డునుంచి ఆవలి ఒడ్డుదాకా వ్యాపించిన బ్రిడ్జిలాంటిది. కనుక దాని మీద మనం ఎక్కితే హాయిగా ఆవతలి ఒడ్డుకు చేరిపోవచ్చును. మానవశరీరం భగవంతుడిచ్చిన ఒక ఉత్తమమైన

పడవైతే దీన్ని ఆ విష్ణుపోతం అనాలి. భగవంతుడే నడపదలిస్తే ఆవలిగట్టుకు చేరడం సులభం. ఏ రకమైన బంధములు ఏర్పడకుండా, మానవజీవితం తరించే అవకాశం వుంటుంది.

భగవంతుడు మనకెపుడూ ప్రీతిపాత్రుడు. మనయందు అత్యంత ప్రేమ కల్గినవాడు. ఉపకారం చేద్దాం అనే అనుకునేవాడు. కొంతమంది ఎపుడూ 'భగవంతుడు మాకు ఎంత అన్యాయం చేసాడో' అని ఏడుస్తూ వుంటారు. కానీ నిజానికి ఎంతో జరగవల్సినదానిని, భగవంతుడు అంతటితో తొలగించి ఉంటాడు. అయితే అది మనకి కష్టం అన్పించటం చేత, అయ్యో! దేవుడు ఇట్లా చేసాడేమిటి? అని బాధపడుతుంటాం. అంతేకాదు. నిజానికి భగవంతుడు మనని వదిలేసినా, మనంచేయగల్గినదేమీ లేదు. కానీ, అలా వదలక కాపాడుతున్నాడు. మనం గత జన్మలలో చేసిన అపరాధాలు, దోషాలు, కర్మలు ఎంతటి ఘోరమైనవో మనకు తెలియదు. కానీ వాటినన్నిటినీ తొలగించే దీక్షతో, పట్టుదలతో తానుంటాడు. మనం చేయాల్సింది, ఆయన్ను గుర్తించడం. ఆయనయందు మన మనస్సును లగ్నం చేయడం. మన బుద్ధితో ఆయన్ని పరిపూర్ణమైన వ్యక్తిగా విశ్వసించడం.

భగవంతుడెప్పుడూ తన ఒడిలోకి మనలను తీసికొని, ఒకతల్లి తనయొక్క చిన్నారి శిశువును కాపాడినట్టు, ఒక తండ్రి తన పిల్లవాడి హితాన్ని చూచినట్టు, ఒక గురువు తన శిష్యుడి యొక్క ఉజ్జీవనను గమనించినట్టు తానెప్పుడూ మన విషయంలో జాగరూకుడై ఉంటాను అని చెప్పాడు. అలా ఉంటాడు అని మనకు వేదం కూడా చెప్తోంది. 'య యేషు సుప్తేషు జాగర్తి-కామం కామం పురుషో నిర్మిమాణః' అంటుంది. మేల్కొంచి ఉన్నప్పుడే కాదు, నిద్రపోయేటప్పుడూ కూడా తాను నిద్రించకుండా మన వెనుక రక్షకుడుగా కాపలా కాస్తూ ఉండటం వల్లనే, రాత్రి మనం పడుకొని తెల్లారాక తిరిగి లేచేంత వరకూ మనకు తెలియక పోయినా గుండె కొట్టుకుంటుంది. గాలి ఆడుతుంది. రక్తం ప్రసరిస్తుంది. శారీరకంగా లోపల జరగాల్సిన ప్రవృత్తులన్నీ జరుగుతున్నాయి. అవి మనం కోరుకుంటే జరగటంలేదు. మనం కోరుకుంటే జరిగేటట్టయితే, మనం ఎలా ప్రవహించమంటే అలాప్రవహించాలి. ఎట్లా కొట్టుకోమంటే గుండె అట్లా కొట్టుకోవాలి. లేదూ, వాటంతట అవే కొట్టుకునేటట్లైతే ఎప్పుడూ చికాకులే రాకూడదు. ఎప్పుడూ అనారోగ్యాలేర్పడకూడదు. గుండె ఆగకూడదు. అలాలేదే! తనంతట అదీ కొట్టుకోవడం లేదు. మన ఆజ్ఞచేత కొట్టుకోవడంలేదు. దానిని ఇలా నడవాలి అని శాసించేవాడు వెనకాతల ఉండడం వల్ల అది అట్లా సంచరిస్తోంది. ఎప్పుడూ ఆయన మన రక్షకుడు. పగలు, రాత్రి అనే ప్రశ్న లేనేలేదు. **24** గంటలూ, **365** రోజులూ ఆయన మనకి రక్షకుడుగానే ఉంటున్నాడు. అది గుర్తించడం మన బాధ్యత.

ఒక వస్తువును చూడగానే ఇది కర్ర, ఇది బుర్ర, ఇది ఇల్లు, ఇది గట్టు, ఇది పుట్ట, ఇది పక్షి అని అనేస్తాం. పైన కన్పించే ఆకారం మన దృష్టిని లోపలిదాకా వెళ్ళకుండా అడ్డివేస్తోంది. శ్రీపాఞ్చరాత్ర ఆగమాలు అందుకోసమనే భగవంతుని అంతటా చూడగల్గినా, ఆయా వస్తువులు నీకా దృష్టి ఎప్పుడూ ఉండేటట్లు చేయవు కనుక, ఒక అందమైన శుభాశ్రయాన్ని ఏర్పరచుకో! అని చెప్పాయి. శుభాశ్రయం అంటే నీ మనస్సుకు నచ్చిన ఒక రూపం, నీ మనస్సుకు నచ్చిన ద్రవ్యం, మనస్సుకు నచ్చిన ఆకృతి, నీ మనస్సుకు నచ్చిన పేరు, నీ మనస్సుకు నచ్చిన అలంకరణ, దానిని నీవు చేసినట్లయితే, అదే తన దేహం క్రింద మార్చుకొని భగవంతుడు నీకు అక్కడనుండే అన్నీ ప్రసాదిస్తాడు. ఆ రూపాన్ని నీవు విశ్వసించి, అక్కడ, ఆడు, పాడు అక్కడ నీవు ఏరకంగా చేసినా అక్కడ క్షేమాన్నే కల్గిస్తుంది అని శ్రీపాఞ్చరాత్రాగమ సంహితలు తెలియజేస్తున్నాయి.

ఒక శుభాశ్రయాన్ని ఏర్పరచి ఒక భక్తుడు దానిని తన మనస్సులో నిలుపుకో గల్గినట్లయితే, అది, చాలా కాలంగా ఎండివుండే పుల్లలని లోపల





పేర్చి ఒక నిప్పుకణం కాల్చినట్లు, పాపాలను కాల్చి ఆ హృదయ మందిరమును పవిత్రంగా తయారు చేయును అని చెబుతోంది. అందుకే భగవానుడు భగవద్గీతలో 12వ అధ్యాయంలో హే ! అర్జునా! నీ మనస్సుని మందిరంగా మార్చి అందులో నన్ను నిలుపు. నీకు అంతకంటే మించిన మోక్షమేది అవసరమే లేదు అని, భగవంతుడి యొక్క ప్రతిన.

మనస్సు, బుద్ధి అనేవి రెండు పరికరాలు. అయితే ఈ రెండింటిలో బుద్ధి అనేది కేవలం ఆత్మకు మాత్రమే ఉపయోగపడుతూ ఉంటుంది. మనస్సు ఇంద్రియాలకు నాయకుడిగా ఉంటుంది. ఇంద్రియాలు శరీరంతో పని చేస్తూంటాయి. విషయాలకేసి శరీరం వెడుతూంటుంది. కానీ శరీరం, ఇంద్రియాలు, మనస్సు అనేవి ఎప్పుడైనా పని చేయాలి అంటే వాటికి శక్తి కావాలి. మనస్సు, ఇంద్రియాలన్నీ కదలిక పొందాలి అంటే ఆత్మ జ్ఞానాన్ని అందించాలి. ఆత్మ, జ్ఞానాన్ని బుద్ధి ద్వారానే అందిస్తుంది. బుద్ధి ద్వారా కదలిక అందితే అపుడు మనస్సు ద్వారా విషయాలపైకి వెడుతుంది. మరి ఆ మనస్సు ఒకదానిని తలచి, మరుక్షణం మరొక దాన్ని, తరువాత క్షణం మరొక దాని మీద, ఇలా తిరిగి మళ్ళీ మొదటి దాని మీదకు రావచ్చు. కానీ! ఈ మనస్సు అనేది దేని మీద ఒక క్షణం కూడా కుదురుగా కూర్చోలేదు. నిరంతరం అటు ఇటు తిరుగుతుంది. చాంచల్యం దాని యొక్క సహజలక్షణం అన్నట్టుగా ఉంటుందన్నమాట.

అయితే ఈ బుద్ధి అనేది రకరకాలుగా మనస్సుని కంట్రోల్ చేసే ప్రయత్నం చేస్తుంది. అది ఒక్కోసారి లొంగవచ్చు, ఒక్కొక్కసారి లొంగకపోవచ్చు. అది బుద్ధికుండే బలాన్ని బట్టి వుంటుంది. ఒక్కొక్కసారి ఈ బుద్ధి 'ప్రజ్ఞ' అనే రూపాన్ని సంతరించుకుంటుంది. ఒక్కొక్కసారి ఇది 'మతి'గా ప్రవర్తిస్తుంది. ఒక్కొక్కసారి ఇది 'బుద్ధి'గా ప్రవర్తిస్తుంది.

బుద్ధి అంటే తాత్కాలికంగా ఏర్పడే ఒక నిశ్చయం అని అర్థం. ప్రజ్ఞ అంటే అది చక్కగా జ్యోతి స్వరూపమై నిరంతరం ప్రకాశించేంతగా వెలిగిందని అర్థం. మతి అంటే అది కావలసినటువంటి భవితఎలా వుంటుంది రేపొద్దున ఈ పని చేస్తే, ఏమవుతుంది? ఎల్లుండి ఏమవుతుంది? అని రాబోయే దానిని గుర్తించగల్గినదై ఉంటుంది. అయితే వ్యవహారంలో ఈ బుద్ధిదశలను అన్నింటినీ 'బుద్ధి' పేరుతోనే చెపుతున్నాం.

ఇపుడు చేయవలసినదేదో, మనం ప్రమాదాన్ని దాటడానికి తాత్కాలికంగా సొల్యూషన్ చూపిస్తే అది 'బుద్ధి' అని అంటాం. ఎప్పుడూ మంచి స్థితిని ఆలోచించగలిగే స్థితికి అది పెరిగితే, వికసిస్తే అది 'ప్రజ్ఞ' అని అంటాము. నిజానికి మన బుద్ధినెప్పుడూ మనం 'ప్రజ్ఞ'గా ఉంచాలి. కానీ, మనం దాన్ని అప్పుడప్పుడూ 'మతి'గా మారుస్తాము. లేదు బుద్ధిగా వినియోగించుకునే ప్రయత్నం చేస్తాము. అంటే ఏదైనా సమస్య వచ్చినప్పుడు మాత్రం ఎట్లా దానిని తాత్కాలికంగా దాటడం అని ఆలోచన చేస్తూ అంతవరకు దాటేసుకుంటూ వెళ్ళిపోయి, మరొక దాంట్లో పడిపోయి దాంట్లోంచి ఎట్లా బయటకు రావాలి? ఇంతవరకే నిలిపేస్తాం చూడండి! అప్పులు చేసేవాళ్ళుంటారు. '5'రూపాయలు అప్పుచేసాడు. ఇచ్చిన వాడొచ్చి నెత్తిమీద కూర్చున్నాడు తీర్చమని. ఇంకొకడి దగ్గర 10 రూపాయలుఅప్పుచేసి, వీడి ఐదు తీర్చేసి మళ్ళీ ఆ పదిలో '5' అనుభవిస్తూంటాడు. వాడొచ్చి నెత్తిమీద కూర్చుంటే మరొకడి దగ్గరకు వెళ్ళి 25 రూ॥లు తెస్తాడు. ఇంక వాడి బ్రతుకెప్పుడూ ఇట్లా అప్పులు చేస్తుండటమే. అలా తింటూ ఉండేటమే ఇదిగో! ఇలా ఈ "బుద్ధి స్థితి"లో ఉండేటప్పుడు జరిగే పని ఇలా ఉంటుంది అన్నమాట.

ప్రజ్ఞస్థితిగా ఇది పర్యవసించితే అదిఒక దృఢ అధ్యవసాయం అని అంటారు. ఇక దాన్ని ఇటు అటు ఊపినా కదలకుండా ఉండేట్టు స్థిరంగా పాతినటువంటి ఒక గుంజ. ఒక పట్టు కర్రలాగా కావాలి. దానిని ప్రజ్ఞ అని అంటారు. శ్రీకృష్ణుడు చెబుతున్నాడు. మనస్సుని నాయందు పెట్టు, బుద్ధిని

నా యందు పెట్టు. మనస్సులో నన్నే దర్శించు. అది ప్రజ్ఞగా వికసింపచెయ్. అవన్నీ నేను చూస్తాను. నీకేది కావాలి అని కోరిక ఉంటే వాటిని. నీకేం సందేహం అక్కరలేదు దాంట్లోను. నిజంగా అవన్నీ కావాలంటే నేను చూసుకుంటానయ్యా! అని చెబుతున్నాడు ఈ శ్లోకంలో. ఏమని?

'మయ్యేవ మన ఆధస్స్వ'! అక్కడ అర్జునుడికి ఎదురుగా కృష్ణుడున్నాడు. భక్త సులభుడుగా తానున్నాడు. సర్వజగన్నాథుడై తానున్నాడు. గత అధ్యాయంలో తానీ విషయాన్ని చెప్పాడు. అందుచేత సర్వజగత్ కారణమై, అలా అని ఎవరికీ అందకుండ ఉండక సర్వసులభుడై కాస్త చేస్తే చాలు పొంగిపోయే వాడే, అయినా, కోరుకున్న ఫలం ఇవ్వకపోతే లాభమేమిటి? ఎవరు ఏది కోరుకుంటే దానిని మంచిగా యివ్వగల్గినటువంటి యోగ్యతతో ఉన్నాడు ఆయన. అందుచేత సులభముగా ఆరాధనకి అందుతాడు. అన్ని ఫలాలు యివ్వగలడు. అన్నింటికి తాను కారణం అయివుంటాడు. అలాంటి, మయి = "నాయందు" అంటున్నాడు కృష్ణుడు, అర్జునుడి ఎదురుగ ఆనాడు తాను ఉన్నాడు. ఈవేళ మన కోసం తానొక విగ్రహంలో ఉన్నాడు. శుభాశ్రయం అన్నాం కనుక అది బంగారమో, వెండో, ఇత్తడో, రాగో, ఏ చెక్కతోటో, దేంతో చేసికొన్నా ఫరవాలేదు. అదొక శుభాశ్రయంగా చేసుకో, అక్కడి నుండి అడిగే ప్రయత్నం చేయ్ నువ్వు అని చెప్పాడు. మయ్యేవ మన ఆధత్స్వ = నాయందే మనస్సును స్థిరపరచు. అంటే అర్థమేమి? మనస్సులో నన్ను నిలుపు. "మయి బుద్ధిం నివేశయ". కోరినది అందించి కాపాడే రక్షకుడిని నేనే అనే విశ్వాసం కలిగి ఉండు. ఆ దృఢ అధ్యవసాయాన్ని కూడ నాయందే నువ్వు చేర్చు. నీ బుద్ధికి "నేనే తగును", "నేనే పొందదగిన వాడను" అనే విశ్వాసము కలిగి ఉండు.

మనకు ఇష్టమైతే ఎలాగున్నా ప్రేమిస్తాము. ప్రేమకు ఆస్పదుడై, అందగాడై, ఇష్టుడైకూడా ఉంటే అలాంటి వ్యక్తి యొక్క స్మరణ నిరంతరము ఆనందమే! అసలు అతడి దగ్గరకు చేరితే ఆనందమని కాదు, చేరాలి అనుకున్న ఆ స్మరణగూడా మనకు ఆనందాన్ని ఇస్తుంది. శ్రీకృష్ణుని గురించి చేసే స్మరణే ఆనందంగా ఉంటుంది. "చేసి చూడవయ్యా! ఏనాడైతే నీమనస్సు, బుద్ధి నాయందు సంలగ్నమౌతాయో, ఆనాడు నాయందు చేరి" నివసించగలవు సంశయమక్కరలేదు అని 'నివశిష్యసి మయి, న సంశయ' అన్నాడు. నివశిష్యసి మయ్యేవ. నాయందే నివసిస్తావు. అత ఊర్ధ్వం న సంశయః ఇకపైన మరొకటేమీ లేనేలేదు. నీకు సంశయం ఏమీఅక్కరలేదు అని కొందరు అన్వయం చేస్తారు.

కానీ, అది సరియైన అన్వయం కాదు. మరి ఎలా చెప్పాలి? అంటే, 'అత ఊర్ధ్వం ఏవ నివశిష్యసి మయి న సంశయః' అని కలపాలి. అనగా 'మయి బుద్ధిం నివేశయ' నాయందు నీ బుద్ధిని విశ్వాసంతోటి నిలుపు, "అత ఊర్ధ్వం ఏవ" ఆ తరువాతనే మయి నివశిష్యసి" నా యందు తప్పకుండా నివసించగల్గుతావు. అంటే, మనస్సులో నన్ను చేర్చుకుంటావు. నా మనస్సులో నిన్ను చేర్చుకుంటాను. అయినా బుద్ధిం మయి నివేశయ అన్నాడే. నీబుద్ధిని కూడా విశ్వాసంతోటి నాలో నిలుపు. అలా నిలపగలిగావంటే చాలు. ఇక నీవు నాలో ఉన్నట్టే లెక్క. ఒకనాడు నాలోకొచ్చిన నిన్ను జారిపోనివ్వను.

ఆయన పేరు అచ్యుతుడు. అచ్యుతుడంటే తనుజారడు. భక్తులను తననుంచి జారనివ్వడు. తనమాటనుంచి తను ఎప్పుడూ జారడు. ఇది భగవంతుని యొక్క ప్రతిన. న సంశయః = అందులో మనకు సందేహమక్కరలేదు. విశ్వసించి చూడు. అది ఫలించకపోతే అడుగు. భగవంతుడు మనకు ఎంత ధైర్యంగా చెబుతున్నాడో ఈ శ్లోకాన్ని. గీతాజ్యోతిని మన మనస్సులో వెలిగిద్దాం! భగవంతుడు అక్కడ నివసిస్తాడు. అలాంటి మాధవసన్నిధానం చేరిన మనస్సు సకల శుభాలకి ఆస్పదమౌతుంది. అపుడు ఎక్కడికి పోనక్కర్లేదు.





"అత్ర బ్రహ్మ సమశ్నుతే" ఇక్కడ ఉండగానే ఆయనని పొందగలుగుతాము. ఇలాంటి స్థితి ఎవరిలో ఏర్పడితే వారు ఏ కులమైనా, ఏ జాతైనా భగవంతునితో సమానంగా ఆరాధనలందుకునే యోగ్యులౌతారు. దీనికి మన ఆళ్వారులే ఉదాహరణ. పంచములుగా ఉండే తిరుప్పాణి ఆళ్వార్, మ్లేఛ్ఛులుగా ఉండే తిరుమంగైయాళ్వార్, తమ మనసుల్లో భగవంతుని దర్శించుట వలన వారిని ఆలయాలలో మనం ఆరాధిస్తున్నాం. అది విశ్వసిద్దాం! మనం కూడా మనస్సుల్లో మాధవుని నింపుకొనే ప్రయత్నం చేద్దాం! ఆ మాధవునిలో మనం నివసించే ప్రయత్నం చేద్దాం! సంశయాలొద్దు! వాటిని దూరం చేద్దాం! దీన్ని అందరికి అందిద్దాం!

### 33వ వారం

# పరపీడ కోరని హృదయం - పరమాత్ముని నిలయం

**శ్లో॥ యస్మాన్నోద్విజతే లోకః లోకాన్నోద్విజతే చ యః ।**
**హర్షా మర్ష భయో ద్వేగైః ముక్తో య స్స చ మే ప్రియః ॥**

**12అ. 15శ్లో.**

**ప్రతిపదార్థము :** **యస్మాత్** =ఎవనిమూలముగా, **లోకః**=లోకము; న **ఉద్విజతే**=విసుగుచెందదో, **లోకాత్ చ**=లోకము మూలమునను, **యః**=ఎవడు; **హర్షామర్షభయోద్వేగైః**=సంతోషము, కోపము, భయము, బెంగలచే, **ముక్తః**=విడువబడినవాడో, **సః చ**=వాడున్ను, **మే**=నాకు, **ప్రియః**=ఇష్టుడు.0

భగవంతుడిని ప్రేమించే వాళ్ళు లోకంలో చాలా మంది వుంటారు. కానీ భగవంతుడు ఎవరిని ప్రేమిస్తాడో! భగవవంతుడు మనని ప్రేమించడం మంచిదా! భగవంతుడిని మనం ప్రేమించి వెంటబడటం మంచిదా? లోకంలో భగవంతుడి కోసం అశ్రులు చాచిన వాళ్ళు ఆనాటి నుండి ఈరోజుదాకా ఎందరెందరో. వేలాది సం॥లు తపస్సులు చేసినవారున్నారు. వనాలు తిరిగారు, గృహాలు వదిలారు. కానీ వారికి భగవంతుడు కన్పించ లేదు. రాముడు వనవాసానికి వెళ్ళినపుడు, అంతకు ముందు ఆయనను కోరి వేలాది సం॥లు తపమాచరించినా లాభంలేక, ఎన్నో రకాలైన ఉపాసనలు చేసి ఏ ఫలితాన్ని పొందక శుష్కించిన ఋషులు ఎందరికో తనంత తానే దర్శనమిచ్చాడని శ్రీరామాయణం తెలుపుతుంది. రామచంద్రుడు తాను కోరుకొని కన్పిస్తే మాత్రమే ఋషులు దర్శించగలిగారు తప్ప, వారి ప్రయత్నాలు కావు ఫలించినవి!

ఇలా రాముడిని కోరుకున్న వారు ఎందరో? కాని, రాముడు కోరుకున్న దెందరిని? ఒక శబరి దగ్గరకు తనంత తాను వెళ్ళాడు. ఒక గుహుడిని తానుచూసాడు. ఒక సుగ్రీవుడిని తాను కరుణించాడు. విభీషణుడిని తాను అనుగ్రహించాడు. భగవంతుడు మనని స్వీకరిస్తే మన జన్మధన్యంకదా!

12వ అధ్యాయంలో భగవంతుడు ఇలా చెయ్ నేను ప్రేమిస్తాను అన్నాడు. **స చ మే ప్రియః, స మే ప్రియః** ఇలా ఎన్నోసార్లు నాకు ఇలా చేసేవాళ్ళంటే 'భలే' యిష్టం. నేను వారిని వదలనే వదలలేను. వాడంటేనే నాకు చాలా యిష్టం. ఇలా కొన్ని గుణాలను చెప్పాడు. మరి అలాంటి గుణాలను మనం అభ్యసిస్తే ఎంత బాగుంటుందో! అలా చెప్పిన గుణాలు చాలా ఉన్నాయి. అయితే మనం అన్నీ అభ్యసించినా, అభ్యసించ లేకపోయినా అందులో ఏ కొన్ని అభ్యసించినా తానిష్టపడతా నన్నాడు. అలా తానిచ్చిన గుణాలు సుమారు 48దాకా ఉన్నాయి.

'ఒక్క గుణాన్ని అభ్యసించినా చాలు. నేను నిన్ను ప్రేమిస్తాను కదా'! అన్నాడు. ఆయన మనల్ని ప్రేమించేట్లు, మనం కూడ ఎందుకు ప్రయత్నించకూడదు. 12వ అధ్యాయపు 15వ శ్లోకం 33వ వారానికి అనుసంధేయ శ్లోకంగా అభ్యసించే ప్రయత్నం చేద్దాం. దాన్ని మనం తెలుసుకుందాం. ఆయన ప్రేమకు పాత్రులమౌదాం.

లోకంలో కొందరి పేరు చెబితే భలే భయమేసి పోతుంది. కంసుడు పేరు చెబితే ఆ రోజుల్లో పిల్లలు భయపడినట్టు, హిరణ్యా కశిపుడి పేరు చెబితే ఒకనాడు ఋషులు భయపడినట్లు, పేరు చెబితే చాలు వణికి పోతుంటరు. అలా కాకుండా వుండగల్గితే చాలు. అంటే, మనపేరు చెప్పినపుడు ఎదుటి వాళ్ళకు దడపుట్టకుండా మన ప్రవర్తన ఉండాలి. **"యస్మాత్ నో ద్విజతే లోకః"** అన్నట్లుగా మనం ఉండగలగాలి. ఇంకొంత మంది ఉంటారు. బయటకు రావడమంటే వారికి భయం. లోకానికి కన్పించడమంటే భయం. లోకాన్ని చూసి భయపడే పని ఏదో వారు చేసారు. దానితో ఎవడిని చూసినా అనుమానమే. కొందరు తీవ్రవాదుల పేర్లు చాలామంది వినే ఉంటారు. వారు లోకాన్ని భయపెట్టారు. లోకానికి భయపడుతున్నారు. నిజానికి భయపెట్టేవారు లోకానికి భయపడకూడదు. కాని, ఏమిటో అలాంటి వ్యక్తులు ఒకనాడు తాము చేసే తీవ్రచర్యల వలన లోకమంతా అదిరిపోయింది. కానీ, ఆ వెంటనే లోకానికి భయపడిపోయి వాళ్ళు ఆ గుహాలో దూరి, ఈ మూల దూరి, ఆ మూల వుండి, అసలు ఎక్కడ వున్నారో తెలియదు. ఎందుకో బ్రతుకు! మనకు అర్థంకాదు. లోకాన్ని చూడ చేతకాని బ్రతుకు కూడా ఓ బ్రతుకేనా ? హాయిగా స్వేచ్ఛగా గాలి పీల్చుకో చేతకాని బ్రతుకు కూడా ఓ బ్రతుకేనా? ఎంతకాలం బ్రతికితే మాత్రం లాభం ఏమిటి కనుక అలాంటి బ్రతుక్కి? లోకం వీడిని చూసి భయపడుతోంది అంటే వీడు చేసే పనిలో క్రూరత్వం అంతలా వుంది.

ఇలాంటి పనులు చేయడం వలన వాడిలో కొన్ని రకాలైన భావనలు ఏర్పడతాయి. అవి 'హర్ష అమర్ష, భయ, ఉద్వేగాలు'. వాటినుంచి వాడు ముక్తుడు కావాలి. హర్షమంటే, ఎదుటివాడిని వీడు ఏడిపించాడు. వాడు ఏడుస్తూ వుంటే తాను పొంగిపోతుంటాడు. ఎలాగైనా సరే అవతల వాడి అంతం చూడాలనుకుంటాడు. వెంటనే చేయలేడు. అది పగ క్రింద మారుతుంది. దానితో ఆవలి వాని ఉనికినే ఓర్వలేడు, అది అమర్షం. వాడు తననికూడా ఏమైనాచేసేస్తాడేమోననే అనుమానం. ఇక ఎవడిని చూసినా భయమే. ఎక్కడైనా చప్పుడు విన్పించిందంటే, ఒక బల్లి వెడుతూ, లేదా ఒక పిల్లి వెడుతూ, ఒక కుక్క నడిస్తే, కదిలితే భయం. ఎవడైనా వచ్చి పట్టుకుంటాడమోనని భయం, రహస్యపు బ్రతుకు. భయంవల్ల ఉద్వేగం ఎప్పుడూ ఒక రకమైన మానసిక చలనాన్ని, ఉద్వేగమంటారు. మనసెపుడు కుదురుగా వుండదు. ఈ రకమైన దోషాల నుండి ఎవడు విముక్తుడౌతాడో వాడు నాకు ఇష్టమన్నమాట. నీవు మంచి పనులు చేయి. లేదా మానేయి. ఫరవాలేదు. నీవు చెడ్డపనులు మాత్రం చేయకుండా వుంటే చాలు. లోకాన్ని నీవు ఏడ్పించవద్దు. లోకాన్ని చూసి నీవు ఏడవకు.

ఇలాగ నీవు లోకాన్ని చూసి ఏడవక, లోకం నిన్ను చూసి ఏడవకుండవుంటే అదే గొప్ప ముక్తి. అదే గొప్ప సాధన. అదే గొప్ప తపస్సు. అదే గొప్ప యోగం. అదే గొప్పయాగం. అయితే ఇలాంటి వాళ్ళు వుంటారా ఎవరైనా? అని మనకు గొప్ప సందేహం కలుగవచ్చు. రామానుజుల వారిశిష్యులు ఒకాయన వుండేవారు. కూరేశుమిశ్రులు అంటారు వారిని. కూరత్తాళ్వాన్ అనే వారు వారినే. వయస్సులో రామానుజులవారికంటే పెద్దవారు. రామానుజులు వారు అంటే మనసులో అపరిమితమైన ప్రేమ, వారి యొక్క వైభవాన్ని చూసి వారికి గొప్ప దాసులైనారు.

ఒకనాడు శ్రీరామానుజులవారి ప్రచారం చూచి ఓర్వలేక వారిని తీసుకునివెళ్ళి ఏదో ఉపద్రవం చేద్దామని చోళ భూపాలుడు ఒకాయన ప్రయత్నం చేస్తే, ఆ ఉపద్రవం నుండి శ్రీరామానుజుల వారిని





కాపాడాలని వీరు, ఆచార్యుల కాషాయం, దండం ధరించి శ్రీరామానుజలవారిని అక్కడినుండి పంపించి, 'నేనే రామానుజులను' అనివెళ్ళారు. రాజు నమ్మిన సిద్ధాంతానికి వీరిని మారమన్నాడు. వీరు శాస్త్ర ప్రమాణాలు చూపించి, రాజుకు వుండే బుద్ధి విశేషాన్ని తప్పు అని ఎన్నో విధాల చెప్పారు. కాని వాడు మొండివాడు. వినలేదు. వీరినేత్రాలను పెకలించివేయాలని ప్రయత్నం చేసాడు. సరే అలాంటి దుష్టుడి చేత నేత్రములు తీయించుకోవడమెందుకని, వారే ఆ నేత్రాలను పెకలించివేసుకున్నారు. వారు తరువాత చాల దుర్భరమైన స్థితిలో శ్రీరంగక్షేత్రానికి వచ్చేసారు. చోళ భూపాలుడు రాజు కనుక శ్రీరామానుజుల వారికి సంబంధించిన వారు ఎవరూ శ్రీరంగనాథుడి ఆలయంలోనికి వెళ్ళడానికి వీలులేదని ఒక శాసనం చేసాడు. కూరేశుల వారికి ఈ విషయం తెలియదు. శ్రీరంగనాథుని దర్శిద్దామని శ్రీరంగానికి వచ్చారు. ద్వారం దగ్గర ఒకడు ఆపేసాడు. ఇంతలో రెండవవాడు చూసి మొదటి వాడిని, 'వీరినెందుకు ఆపావురా? వారు లోకానికి మిత్రులు రా! వారు లోకానికి అపకారం చేయలేదు. ఎవ్వరూ వారి విషయంలో ద్వేషం కల్గివుండరు! లోపలకు వెళ్ళనీ'! అన్నాడు. రెండవవాడు.

కూరేశులు విన్నారు ఈ ఇద్దరి మాటలు. కూరేశులవారి మంచితనాన్ని గూర్చి వాడు చెప్తూ "ఒకనాడు వారిని ఒక అరటి ఆకుకోసి తీసుకు రమ్మంటే పెరటిలోనికి వెళ్ళి, ఆకుకో యడానికి వెళ్ళి కోసి, సొన కారుతుంటేచూసి 'అయ్యయ్యో! నేను ఎంత కష్టపెట్టాను ఆకును', అని ఆ ఆకుకుండే బాధను తాము తనకు కల్గినట్టుగా, తమయొక్క అవయవాన్ని ఎవరో కోసినట్టుగా భావించి, స్పృహతప్పి పడిపోయారట. ఆకును కోస్తే సొనకారటం సహజం. అంత భూతదయ వీరిది. అలాగే ఒకనాడు వారు ఒక పాము నాల్కకకు ముల్లుదిగడం చూసి, మిగతావారంతా వద్దు, వద్దు అది కరుస్తుంది అని అంటున్నా వెళ్ళి, ఆ పాము నాల్కకు వుండే ముల్లును తీసి దానిని పంపిస్తారు. జంతువులకు, చెట్లకు కూడా భగవత్ సంబంధాన్ని భావించే ప్రేమించే మహనీయుడు. "సర్వప్రాణి సేవ నేర్చిన మహనీయుడు అంచేత వీరిని ఆపవద్దు. లోనికి పోనీ'' అని చెప్తాడు ద్వారపాలకుడు. శ్రీరామానుజ సంబంధమే ప్రధానమనుకుంటున్నాను తప్ప భగవత్ సంబంధం ప్రధానమనుకోవడం లేదు. అసలు భగవంతుడు అనుగ్రహించాలంటే ఆచార్య సంబంధం ద్వారానే కదా అనుగ్రహించాలి. అలాంటి ఆచార్య సంబంధాన్ని వదలి, నువ్వు భగవంతుడుని ఆశ్రయించు, అంటే ఇది చాలా ప్రమాదకరమయ్యా! ఆచార్య సంబంధం అనేది కమలానికి నీరులాంటిది. కమలం నీళ్ళలో ఉన్నంత వరకు సూర్యుడియొక్క కిరణాలకు వికసిస్తుంది. సూర్యుడు లేకపోతే ముకుళించుకుంటుంది. అయితే సూర్యుడి వల్ల విచ్చుకొంటోంది కదా. నాకు నీళ్ళెందుకు అనుకొని ఆ కమలం నీళ్ళను వదిలి, సూర్యుడికేసి అడుగు వేస్తే, లేదా తీసి గట్టుమీద పెడితే, అదే సూర్యకిరణం ఎండిస్తుంది తప్ప దానిని వికసింపచేయదు కదా! నేను, మనం, ఈ జీవులంమందరం పద్మాలవంటి వారిమైతే మన హృదయకమలాన్ని విచ్చుకొనేటట్లు చేసుకోవాలి అంటే, మనకు దానికి క్రింద ఆధారంగా కావలసింది ఆచార్యకృపే. ఆచార్య సంబంధాన్నే వదులుకుంటే ఈ హృదయకమలాన్ని భగవానుడు అనే **'రవిః శోషయతి న తోషయతి'** మనల్ని ఆనందింపజేయడు. శుష్కింపజేస్తాడు కనుక. నాకు, నీరు ఆధారంగా వుంటేచాలునయ్యా! నింగిలోకి నేను ఎగరక పోయినా పరవాలేదు, రామానుజ సంబంధం లేని రంగనాథుడు నాకు అవసరమేలేదు అని అనుకుంటూ' వారు వెనుదిరుగుతారు. వారికుండే విశ్వాసం అట్లాంటిది. అందుకే ఆరాధ్యాలైనారు మనకు ఆచార్యులైనారు. ఆచార్య కోటిలో వారు చేరారు. వారిని గురించి లోకం చేసిన ప్రశంస అదీ ఆ వేళ. వీరు ఎప్పుడూ ఎవరికీ లోకంలో దుఃఖం కల్గించలేదు. కనుక వారి విషయంలో

ఎవరూ దుఃఖం కలిగే చింతన కూడా చేయలేదు. ఇది ఉండదగిన, అభ్యసించదగిన స్వభావం.

ఈ వేళ లోకంలో ఎందుకు మనకు అసంతృప్తి పెరుగుతోంది? ఎందుకు మనకు అభద్రత ఏర్పడుతోంది? ఎదుటివాడికి ఒక వైభవం కల్గితే దానిని చూచి ఆనందించే స్థితిని మనం కోల్పోతున్నాం. దానితో మనలో ఒకరకమైన దుఃఖం, ఎదుటివాడికి సంపద పెరుగుతున్న కొద్దీ మనలో ఒకరకమైన అమర్షం బయలుదేరుతోంది. అమర్షం అంటే (కుత కుత). ఓర్వలేని స్వభావం. అది క్రమంగా పగగా మారుతోంది. విపరీతమై, పర్యవసానంగ ఏదో చెయ్యాలన్పిస్తుంది ఎదుటివాడిని. యుక్తా యుక్తములు నశిస్తాయి. వీడు ఏదో చేస్తాడు. ఉపద్రవాన్ని పొందుతాడు. లోకానికి కన్పించకుండా పోయేస్థితి వీడిలో వస్తుంది. అంటే, మొదట తనలో ఏర్పడిన అసహనం, లోకం, వీడిని సహించరాని, స్థితిలోకి తీసుకువెళుతుంది. ఈ విషయం మనం మరచిపోకూడదు. అందుకే ఒకడిలో కల్గిన వైభవాన్ని చూసి, ఉత్కర్ష చూసి ఆనందించు. శ్రమించి నీవు అంత ఎత్తు ఎదిగేటట్లు ప్రయత్నం చేయి తప్ప, వాడిని చూసి ఏడిచి, మనసులో కుతకుత ఏర్పడి, వాడిని ఎపుడు పతనం చేయాలో అని ఆలోచించడం తగదు. ఆ మాత్రం మొదట అభ్యసించగల్గితే ఆనందమార్గంలోనికి మరో 5 అడుగులు ముందుకు సాగినట్లే అనుకోవచ్చు. భగవంతుడు ఈ శ్లోకంలో అట్లా వుండమని కోరుతున్నాడు. నువ్వు లోకానికి ఉపకారం చేయక పోయినా ఫరవాలేదు. కాని అపకారం చేసే ప్రయత్నం చేయవద్దు. అది నీకు ఉపద్రవకరం జాగ్రత్త ! అని చెబుతున్నాడు. అందుకోసమనే చివర భగవంతుడు 'యస్సచ మే ప్రియః' అలాంటివాడైనా పరవాలేదు. నాకు ఇష్టమే. 48 లక్షణాలు యిచ్చాడు భగవంతుడు మనకు ఈ 12వ అధ్యాయంలో. అలాంటి గుణాలు కల్గినవారిని భగవంతుడు ప్రేమించాడు. అలాటి వారు లోక ఆరాధ్యులయ్యారు. మనకు ఆళ్వారులు అయ్యారు. మన ఆలయాల్లో ఆరాధనలు అందుకుంటున్నారు. మనం అంతవాళ్ళం కాకపోయినా కనీసం లోకం మనల్ని తిట్టేట్టుగా వుండవద్దు. అంటే లోకం మనల్ని ప్రేమించకపోవచ్చు. కనీసం తిట్టకుండా వుంటే అదే 10వేలుకదా! అలా వుండే ప్రయత్నం మనం చేద్దాం! ప్రారంభిద్దాం.

34వ వారం

# శరీరం సుక్షేత్రం - పసిడి పంటలు పండించు

శ్లో॥ ఇదం శరీరం కౌంతేయ! క్షేత్ర మిత్య భిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ 13అ. 1శ్లో.

**ప్రతిపదార్థము :** **కౌన్తేయ**=అర్జునా, **ఇదం**=ఈ, **శరీరం**= నశించు స్వభావము కల శరీరం, **క్షేత్రం ఇతి**=క్షేత్రమని, **అభిధీయతే**= చెప్పబడుచున్నది, **ఏతత్**=ఈ దేహమును, **యః**=ఎవడు, **వేత్తి**=ఎఱుంగుచున్నాడో, **తం**=వానిని, **క్షేత్రజ్ఞః ఇతి**=క్షేత్రజ్ఞుడని, **తద్విదః**=ఆత్మ తత్వము నెఱింగినవారు; **ప్రాహుః**= చెప్పుచున్నారు.

భగవద్గీత 700 శ్లోకాలు వుండే గ్రంథం అనేది ప్రామాణికులైన ఆచార్యులు అందరూ అంగీకరించారు. వాటికే వారు తమ తమ భాష్యాలలో వివరణ యిచ్చారు. అయితే 13వ అధ్యాయం ఆరంభంలో అర్జునుడు ఒక ప్రశ్న వేసినట్లుగ కొందరు చెబుతుంటారు. ప్రకృతి అంటే





ఏమిటి? పురుషుడు అంటే ఏమిటి? ఈ ఇద్దరికి సంబంధం ఏమిటి? ఇలాగే కొన్ని ప్రశ్నలు కలిపి ఒక శ్లోకంగా అడిగినట్లుగా చెబుతారు. దానికి సమాధానంగా శ్రీకృష్ణుడు 13వ అధ్యాయం ఆరంభం చేసాడు అనిఅంటారు.

అయితే శ్రీశంకరాచార్యుల వారు కాని, భగవత్ రామానుజాచార్యులు కాని అలా ఒక శ్లోకం ఉన్నట్టుగ మనకు తెలిపివుండలేదు. ప్రామాణికులైన పెద్దలు ఆ రోజుల్లో ఆ శ్లోకం ఉన్నట్టుగ చెప్పి ఉండలేదు కనుక, అది బహుశ ఆనాటికి వుండి వుండదు. తరువాత ఎప్పుడో, ఎవరో దీనికి ముందు ఒక శ్లోకం ఉంటే బాగుంటుంది కదా! అని చేర్చి ఉండవచ్చు. అది అర్జునుడి అభిమతం అయి వుండవచ్చు ననుకొని అందుకోసమే శ్రీకృష్ణుడు ఈ ఉపదేశాన్ని ఆరంభించి ఉండవచ్చునని చేర్చి ఉంటారు. లేకపోతే 12వ అధ్యాయంలో అర్జునుడికి చెప్పాల్సిన వన్నీ చెప్పి ముగించాక ఇక మళ్ళీ క్షేత్రం, క్షేత్రజ్ఞుడు, గుణాలు వీటి గురించిన ప్రశ్నలు ఎందుకు వస్తాయి అర్జునుడు అడిగివుండకపోతే? అందుచేత అడిగి ఉండవచ్చును అని తలచి, అలాంటి ప్రశ్న గ్రంథంలేదని 13వ అధ్యాయానికి ముందు ఒక శ్లోకాన్ని కల్పించుకున్నారు. అయితే "ప్రామాణికులైన ఆచార్యులు" మాత్రం అలాగ ఒక శ్లోకం కల్పించలేదు. ఉన్నట్లు తెలుపలేదు. ఎంత వుందో అంతే స్వీకరించారు. వ్యాఖ్యానించారు.

అయితే 13వ అధ్యాయం మరి చెప్పవలసిన అవసరమేమిటి? అర్జునుడికి కర్మ ఉపదేశం చేసాడు. జ్ఞానం ఉపదేశం చేస్తాడు, భక్తిని ఉపదేశం చేసాడు. తన యొక్క అవతారములను గురించి చెప్పాడు తన విరాట్ రూపాన్ని గురించి చూపించాడు. వివరించాడు. అది అయిపోయిన తరువాత అతనిలో భక్తి స్థిరంగా వుండాలని ఇక అన్నీ నా పరం చేసికొని ఉండవోయ్. నన్నే తప్పనిసరిగా పొందుతావు అన్నాడు. పూర్తియైపోయింది గ్రంథం. ఉపదేశం పూర్తియైపోయింది. తెలిసిపోయినట్టే వుంది అర్జునునికి కూడాను. అయితే మళ్ళీ 13వ అధ్యాయం దగ్గర నుండి అర్జునుడికి, ఉపదేశం ఆరంభించాడు. అందులోను ఈ శరీరం ఆత్మ–ఆ శరీరానికి వుండే గుణాలు, వీటన్నిటిని చెప్పాల్సిన అవసరం ఏమిటి? అంటే, దీనికి మన పూర్వులు, ప్రామాణికులు సమాధానం అందించారు.

అసలు అర్జునుడికి యుద్ధం చేద్దామని లేదు. మనకు మన బాధ్యతలు నెరవేర్చుకుందాం అని ఉండనట్లే. ఇది అర్జునుడి దగ్గరనుండి వస్తున్న లక్షణమే. ఎలాగైనా తప్పించుకుంటే బాగుండును? అనే మనస్తత్వం. మనకు కూడా జీతం సరిగ్గా రావాలి కానీ, దానికి చేయాల్సిన పని చేయబుద్ధి కాదు. జీతాలతో పాటు గీతాలు కూడా వస్తే బాగుంటుంది కానీ, చేయాల్సినపని చేయబుద్ధి కాదు. వారం, పదిరోజులు శెలవు పెట్టి ఇంటికి పోయి ఆ తరువాత ఆఫీస్‌కు వచ్చి ఆఫీసులో కూర్చుని పనంతా పెండింగు పడిపోతూ కూర్చుంటే, పైఅధికారి ఎవడో వీడిని కాస్త మందలిస్తాడనో, వీడిమీద కంప్లైంట్ రాస్తాడనో, భయంవేస్తే అవన్నీ గబగబా వాటి వాటి స్థానాల్లోకి పంపించాలి కనుక తనకి ఇచ్చే సమయం '8' గంటలూ కూర్చుని అబ్బ! ఎంత అలసిపోయాను! వారం రోజుల పని రెండు రోజుల్లో చేసేసాను అంటాడు. నిజానికి, అరలీటర్లు గ్లాసు అయితే '5' లీటరు పట్టించడం సాధ్యం కానేకాదు గద!

వీడియొక్క సామర్థ్యం ఎంత అనేది ఇంత వరకు పెండింగు పడ్డాక, ఇపుడు బయటకు వచ్చినదన్నమాట. నిజానికి వాడిచేత 2 రోజులకే అంతంత పని చేయించాలి. ప్రతిరోజు చేయించాలి. నిజానికి మనిషి తన శక్తినంతటిని వినియోగిస్తే ఎంత కెపాసిటి ఉంటుందో! కాని మనిషికి అలా చేయబుద్ధి అవదు. ఎంతెంత తప్పించుకుందామా! అనే మనస్తత్వం మనిషిది. ప్రకృతిలో దేనికీ, ఆ లక్షణం ఉండదు. చెట్టుఎన్నికాయలు కాయాలో అన్ని కాయలు కాసి, లోకానికి యిస్తుంది. ప్రకృతిలో మనిషి తప్ప మిగతా ప్రాణికోటి అంతా చాలా నిజాయితీగా పనిచేస్తాయి. మనిషిలో అది కొంచెం వెదుక్కోవాల్సి

వస్తోంది. అర్జునుడి దగ్గర నుండే వచ్చింది మనకు ఈ లక్షణం! ఆయనకు తన బాధ్యత నెరవేరుద్దాం అని కోరిక లేదు. ఎలాగైనా సరే ఈ శ్రమ అంతా మానివేస్తే బాగుండును. అలా మానడానికి శ్రీకృష్ణుడు ఏమైనా చేస్తాడా అని గుచ్చి గుచ్చి ప్రశ్నలు వేసాడు. అయితే శ్రీకృష్ణుడు ఎక్కడా అతనికి ఆ వెసులుబాటు యివ్వలేదు. 'మత్కర్మ కృత్' నా పరంగానే పనులు చేస్తూ బ్రతుకు అన్నాడు తప్ప పనులు మానమని అనలేదు. పనులు చేస్తూ వుండటమే సన్యాసం తప్ప, పనులు మానడం సన్యాసం కాదయ్యా అంటాడు శ్రీకృష్ణుడు.

భగవంతుని యందు భారముంచి పనులు చేయుట ఫలము భగవానుని కర్పించి పనులు చేయుట, చేయించే వాడు భగవంతుడు అని అనుకుంటూ పనులు చేస్తే దానిని సన్యాసమంటారు. ఈ ఉపదేశం విన్న తరువాత ఏమైయినా చేయక తప్పదు అని అర్జునునికి ఒక అభిప్రాయం ఏర్పడింది. ఇంత వరకు కృష్ణుడు చెప్పేమాట మీద నమ్మకం లేదాయనకు. ఎందుకంటే శ్రీకృష్ణుడు తన సారథి, తానా రథికుడు! కనుక ఆయన తనకు ఉపదేశం చేయటం ఏమిటి? కృష్ణుడు ఉపదేశం చేస్తుంటేనే, 3వ అధ్యాయం ఆరంభం చేసినపుడు ఏమయ్యా ఏమిటి నీ ఉద్దేశ్యము? అన్నాడు. **"వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిమోహాయు సీవ"** చూస్తే నన్ను బొత్తిగా చికాకు పరుస్తున్నట్టున్నావే" ఇది చేయాలా? అది చేయాలా? అని తేల్చి చెప్పమంటే కాసేపు ఇదంటావు, అదంటావు. అని చికాకు పట్టాడు కాస్త అర్జునుడు. అంటే చెప్పే శ్రీకృష్ణుడి మీద పెద్దగా విశ్వాసం లేదు అని తెలుస్తుంది, అలాంటి మాటల్ని విన్నప్పుడు. అందుకని విశ్వరూపం చూపించి అసలు నీ విశ్వాసం చూపిస్తావాలేదా అన్నట్లుగ తన విశ్వరూపాన్ని చూపించాడు, అందరిని తన నోట్లోకి మింగిపారేస్తు న్నట్టుగ.

అర్జునుడికి అది చూసి కొంచెం భయం వేసి ఈసారి వింటానన్నట్టుగానే కొంచెం ముఖం పెట్టాడు. అలా వినేవాళ్ళు అంటే తన కిష్టం సుమా! 'స చమే ప్రియః స మే ప్రియః ఇలాగ 12వ అధ్యాయం చివరదాక నాకు ఎవరంటే ఇష్టమో తెలుసునా! అట్లా పని చేసే వాళ్ళంటేనే యిష్టం అని చెప్పాడు. సరే అర్జునుడి మొహంలో కొంచెం ఏదో అర్థం అయినట్లే కన్పించింది. ఇలా ఈవేళ్టకి అర్థం చేసుకున్నాడు అని నిర్ణయించుకొని, విశ్వరూపం చూపించడానికి ముందుర అర్జునుడికి చెప్పిందంతా అతని బుర్రలోకి ఏ మూల ఎక్కి వుండదు. అనిగూడ కృష్ణుడు ఒక నిర్ణయానికి వచ్చాడు. ఈవేళ విశ్వాసం కల్గిం తరువాత గతంలో 12వఅధ్యాయాల గ్రంథంగా తను చెప్పినదంతటిని మళ్ళీ '6' అధ్యాయాలోనైనాకుదించి యివ్వాలి అనుకున్నాడు. ఈసారి చెప్పేటప్పుడు ఇది వరకటిలాగ అక్కడో విషయం, అక్కడో విషయం చెబితే సంశయాలు కల్గుతాయి కనుక అలా కలుగకుండా వుండటం కోసం. అసలే సంయశగ్రస్తుడైన వానికి సంశయాలు కలుగకుండా వుండాలంటే అసలు శరీరమంటే అన్ని లక్షణాలు ఒక చోటుకి చేర్చి చెప్పాలి. శరీరంలో జీవుడంటే అన్ని లక్షణాలు ఒకచోటుకి చేర్చాలి.

శరీరం-క్షేత్రం. శరీరంలో వుండేవాడిని క్షేత్రజ్ఞుడు అని అంటారు. సరే, ఇది తెలుసుకో ముందర! ఆ తరువాత వీడు శరీరంలోకి ఎందు కొచ్చాడు? రావడానికి కారణం సత్వ రజస్తమస్ అనే '3' గుణాలు వున్నాయి. అవి ఏమిటి ఏం చేస్తాయి? ఇవన్నీ 14వ అధ్యాయంలో స్పష్టం చేసాడు. ఆ గుణాలైనా ఎందుకు పని చేయవు. ఆ గుణాలు వదలిన వాడు ఎక్కడ వుంటాడు, ఎవరి అధీనంలో వుంటాడు. స్వతంత్రంగా వుంటాడా? వాడిలో ఉండాల్సిన గుణాలు సరిగా లేకపోవడానికి కారణమేమిటి? దైవాసుర సంపదల వివరణ 16వ అధ్యాయం. దీనికి మనమేమి చేయాలి. మంచి శ్రద్ధను పెంచుకో. '3' రకాలుగ వుంటుంది శ్రద్ధ, 17వ అధ్యాయం.

ఈ వారపు శ్లోకం. ఈ మానవ శరీరం పసిడి పంటనేల. ఇందులో మనం ఏదైనా





పండించుకోవచ్చు. బంగారం కావాలా? బంగారం పండించుకోవచ్చు. జ్ఞానం కావాలా? జ్ఞానం పండించుకోవచ్చు. ఆనందం కావాలా? ఆనందం పండించుకోవచ్చు. చక్కటి నేల, సుక్షేత్రం, కలుపు మొక్కలను వదిలేస్తే మాత్రం వాటంతట అవే మొలిచి పోతాయి. కనుక దానిని చక్కగా దున్నాలి, రాళ్ళు ఏరాలి, కలుపు తీయాలి. అపుడు అందులో ఏ గింజ వేసినా అది ఫలిస్తుంది. ప్రతి శరీరమూ ఓ ఉత్తమ క్షేత్రం. బంగారుభూమి. జ్ఞానము ఒక పుష్పము. అది పూయాలి. రసములు మనలో ఉండే రకరకాల ఆనందాదులు. రసములు. అవి భగవంతుడి యొక్క ప్రీతి కోసం ఏర్పడాలి. చెయ్యాల్సిన జీవుడు. కృషీవలుడు. 'ఇదం శరీరం కౌంతేయ' హే! కుంతీపుత్రా! ఈ కన్పించే శరీరాన్ని 'ఇదం' అంటే, చూపదగినది. ఏ ప్రాణికుండే శరీరమైనా, క్షేత్రం అని అంటారు. అంటే ఏర్పడిన దోషాలను దూరం చేయగల్గినది. నాశనం కాకుండా ఉంచగల్గినది కనుక దీనిని క్షేత్రం అని అంటారు.

అయితే క్షేత్రం గురించి తెలుసుకోవడం, అది కలవాడి యొక్క బాధ్యత. 'ఏవం యో వేత్తి తం ప్రాహుః' ఇది క్షేత్రం అని ఎవడైతే తెలుసుకో గలుగుతాడో వాడిని క్షేత్రజ్ఞుడు అని అంటారు. తెలుసుకోవడం ఎప్పుడూ కూడా కేవలం తెలుసుకోవడం కోసం కాకూడదు. తెలుసుకున్న దానికి అనుగుణంగా ఆచరించడం కోసం కావాలి. ఇది క్షేత్రము అని తెలుసుకుంటే, క్షేత్రము యొక్కలక్షణాన్ని బట్టి భూమి యొక్క సారాన్ని బట్టి ఏ గింజ ఏ సమయంలో ఎలా వేస్తే అది ఉత్తమ ఫలితాలనిస్తోందో, కలుపు ఎట్లా రానివ్వకూడదో, మధ్యలో రాళ్ళు, రప్పలు, చెత్తా, చెదారం ఎట్లా పడనివ్వకూడదో, ఇది ఒకటి ఆ రైతు తెలుసుకుంటే ఆ పొలాన్ని ఎంతో ఆనందాన్ని, ఎన్నో సంపదలు యిచ్చేటట్టుగా తాను తీర్చి దిద్దుకుంటాడు. ఈక్షేత్రం అట్లాంటిది. ఈ జీవుడే క్షేత్రజ్ఞుడు. అవి మిగతా ప్రాణులు ఏం తెలుసుకుంటాయి కనుక? మనిషి ఒక్కడే తెలుసుకోగలుగుతాడు. అయితే తెలుసుకొని ఏం చేయాలి? ఇందులో కొన్ని మంచి బీజములను నాటు, మంచి అభ్యాసము చేయి. 13వ అధ్యాయంలో స్వామి సుమారు 20 గుణములు మనకు అభ్యసించమని యిచ్చాడు. అంటే సుమారు 20 గింజలను నాటమని యిచ్చాడు. చక్కని పంటను పండించు. ఏంటవి. 'అమానిత్వం అధంభిత్వం అహింసా, క్షాంతి రార్జవం' అంటూ ఓ 20 గుణములను యిచ్చాడు. వీటినే మనం అభ్యసించాలి అని అంటారు. అభ్యసిస్తే ఏమౌతుంది? నేలను సక్రమంగా దున్ని పంటను బాగా పండిస్తే అది వానికి, వానితోటి వారికీ ఆహారం పెట్టి లోకాన్ని సుభిక్షంగ వుంచినట్లే.

మనం కూడా అమానిత్వాది 20 గుణములను జాగ్రత్తగా అభ్యసించగల్గితే మనకు, మనతోటి వారికి ప్రాణికోటికంతటికి చక్కని క్షేమాన్ని ఇస్తుంది. అందులో ఒక్కగుణాన్ని చూడొచ్చు. అమానిత్వం, అంటే మానము లేకుండుట. మానము అంటే మనసులో ఏర్పడే ఒక రకమైన గొప్పవాడిననే గర్వం. నేను గొప్పవాడిని అనుకునే అహంకార ప్రవృత్తి. ఇది నాల్గింటివల్ల ఏర్పడవచ్చు. చదువు ఎక్కువైతే చదువులేని వాడిని గురించి గేలి చేయాలన్పిస్తుంది. కాకూడదు. వాడికి నేర్పాలి. విన్పించాలి. రెండవది నా వెనకాతల బోలెడంత మంది వున్నారు అనుకోగానే ఆ బలంతోటి రెండవవాడిని హింసిచాలన్పిస్తుంది. కాదు. వాడిని ఉద్ధరించాలి అన్పించాలి. గొప్పవంశంలో నేను పుట్టాను అని అనుకోగానే అదిలేని వాడిని గేలి చేయాలన్పిస్తుంది. అన్పించకూడదు. వాడికి కూడా సమాజంలో ఒక ఔన్నత్యాన్ని కల్పించగల్గాలి. మంచి డబ్బు ఉండగానే బీదవాడిని చూస్తే బానిసను చేసుకోవాలన్పిస్తుంది. కాకూడదు. వాడికి ఉపకారం చెయ్యాలన్పించాలి. మంచి పదవి రాగానే అహంకారం, గర్వం పెరిగిపోతుంది. కాదు, పదుగురికి ఉపకారం చెయ్యాలన్పించాలి.

నహుషుడు అంతటి వాడికి ధనం, పదవి

వచ్చేటప్పటికి, ఇంద్రుడి భార్యను కూడా అవమానించాలి అన్పించింది. విద్య ఎక్కువైతే విశ్వామిత్రుడి అంతటి వాడికి వసిష్ఠుడిని హింసించాలి అన్పించింది. భారవి అనే పిల్లవాడికి చదువు ఎక్కువకాగానే తన తండ్రినే సంహరిద్దాము అన్పించింది. విద్య, అభిజన, ధన, అధికారం ఈ నాలుగు, నాలుగు రకాల మదాలను కల్గిస్తాయి. అయితే ఆ మదములను కనుక త్రిప్పితే అవి దమములై మన అధీనములో ఉండి, మనని లోకానికి ఉపకరించేటట్లు చేస్తాయి. అలా, ఈ క్షేత్రంలో ఆ అమానిత్వాన్ని పండించాలి. మనం పండించకుండానే మొలిచేది మానం అంటే గర్వం. నేలలో పండించక పోయినా కలుపు వచ్చినట్లు. అయితే ఆ కలుపును తొలగించాలి. మంచి మొలకలు వేయాలి. సత్ఫలితాలను అందించాలి లోకానికి. అయితే అది కృషి చేస్తే వస్తుంది. నేలను కృషి చేస్తే మంచి పంట పండినట్లే. అది బంగారు భూమి అయినట్టే. ఈ దేహం మంచి యోగ్యతలు కలుగడానికి తగినట్టుగా కృషి చేయాలి. అందుకే 13వ అధ్యాయంలో స్వామి 20 గుణములను ఇచ్చి ఆచరించి ప్రయత్నం చేసి ఈ క్షేత్రాన్ని సత్ఫలితాలు పండే సుక్షేత్రంగా తయారు చేసుకోమంటున్నాడు. ప్రయత్నిద్దామా మరి!!

## ముఖచిత్ర పరిచయం

భూదేవి కుమారుడు నరకుడు. సంధ్యాకాలంలో పుట్టి దుష్టప్రవృత్తి కలవాడై నరకాసురుడయ్యాడు. అతనివల్ల శోకించని ఋషులు కాని స్త్రీలుకాని లేరు. ప్రాగ్జ్యోతిషపురం అనే తన రాజ్యానికి 6 రక్షణ ప్రాకారాలు అభేద్యాలుగా నిర్మించుకున్నాడు. అవి క్రమంగా 1. పర్వత ప్రాకారం, 2. భయంకర క్షిపణులతో కూడిన ఆయుధ ప్రాకారం, 3. ప్రమాదకర రసాయన జలప్రాకారం, 4. అగ్ని ప్రాకారం, 5. విషవాయు ప్రాకారం, 6. విషసర్పాల ప్రాకారం. ఈనాటి వైజ్ఞానికులు నరకాసురుని నుంచి నేర్చుకోవలసింది చాలా ఉంది.

ఎన్నో యుగాలు జీవించిన ఇతడు ఇంద్రుడి సింహాసనం, ఆతని తల్లి ఆభరణాలతో సహా లాగేసుకున్నాడు. లోకుల హా...! హా....!కారాలకు కరిగి, ద్వాపరాంతంలో, సత్యభామతో గరుడునిపై శ్రీకృష్ణుడు ఈతడిని ఎదుర్కొని, సంహరించి, 16వేల మంది స్త్రీలను చెరనుండి విడిపించాడు. అనాథలైన వారికి ఆశ్రయాన్ని కల్పించాడు. ఆ దుష్టుడి దౌర్జన్యం తొలగిన ఆనందజ్యోతులు దశదిశలా లోకుల హృదయాలలో వెలిగాయి. దీపావళి కాంతులు ఈనాటికీ, అజ్ఞాన తిమిరాలను బాపుతున్నాయి.





# శ్రీశ్రీశ్రీ చిన్నజీయరుస్వామివారి పర్యటనా వివరములు

| | | |
|---|---|---|
| నవంబర్ 19వతేది | : | శ్రీవారి చాతుర్మాస్య దీక్షా విరమణ, |
| 19 నుండి 24 వరకు | : | కరీంనగర్ జిల్లా, జగిత్యాల. గీతాజ్యోతి కోటికుంకుమార్చన యజ్ఞములో వేంచేస్తారు, |
| 25వ తేది | : | హైదరాబాద్‌లో వివిధ కార్యక్రమాలలో అన్వయిస్తారు.<br>1. శ్రీమాన్ ప్రతాపరెడ్డిగారి, సప్తగిరి హోటల్ రెండవ భాగం ప్రారంభం.<br>2. హిమగిరిరైస్ మిల్ ప్రారంభం, కర్మన్ ఘాటు.<br>3. అష్టలక్ష్మి సన్నిధివారి నూతన కళ్యాణమండప ప్రారంభము.<br>4. డా॥ శ్రీమాన్ కె. రామానుజాచార్యస్వామివారి సమ్మాన సభలో వేంచేస్తారు. |
| 26వ తేది | : | నిజామాబాద్ ప్రయాణం |
| 27వ తేది | : | నిజామాబాద్‌లో ధర్మక్షేత్ర కార్యక్రమంలో అన్వయించి. రాత్రికి హైదరాబాద్ చేరతారు. |
| 28వ తేది | : | విశాఖపట్నం ద్వారా అనకాపల్లిలో గీతాజ్యోతి కార్యక్రమాన్ని సమీక్షించి శ్రీమాన్ కొణతాల జగన్, మున్సిపల్ ఛైర్మన్‌గారి చిరంజీవులైన కాబోయే నవదంపతులను మంగళాశాసనం చేస్తారు. రాత్రికి మండపేట వేంచేస్తారు. శ్రీమాన్ పాపారాయుడు గారి నూతన భవన ప్రారంభోత్సవం |
| 29వ తేది | : | భీమవరం వేంచేసి సాయంకాలం తీర్థగోష్ఠి, ప్రవచనమును అనుగ్రహించి రాత్రికి రాజమండ్రి చేరతారు. |
| డిశంబర్ 1 నుండి 2 వరకు | : | రాజమండ్రిలో పండిత సభలలో వేంచేసి ఉంటారు. |
| 3వ తేది | : | రాజమండ్రిలో తీర్థగోష్ఠి కావించి, తుని, తిమ్మాపురం కార్యక్రమాల్లో పాల్గొంటారు. |
| 4వ తేది | : | తునిలో ఉ॥ తీర్థగోష్ఠి, రాత్రికి శ్రీకాకుళం జిల్లాలోని అచ్యుతాపురం వేంచేస్తారు. |
| 5,6,7వ తేదీలలో | | అచ్యుతాపురంలో వివిధకార్యక్రమాల్లో పాల్గొంటారు. |
| 8వ తేది | : | రంగారెడ్డి జిల్లా. మేడిచర్ల మండలం, ఘనపురంలో శ్రీక్షేత్రగిరి వెంకటేశ్వరస్వామి ప్రతిష్ఠలో అన్వయిస్తారు. |
| 9,10తేదీలలో | : | రామానంతపూర్ గీతాజ్యోతి ధర్మక్షేత్ర కార్యక్రమంలో పాల్గొంటారు |
| డిశంబర్ 16, 2002 జనవరి 14, 2003 | : | గుంటూరు జిల్లా, పిట్టలవాని పాలెంలో శ్రీవారు ధనుర్మాసవ్రత కార్యక్రమంలో వేంచేసి ఉంటారు. |

సంపాదకీయం

# ఈ ముగ్గుర్నీ పూజిస్తే చాలు ముల్లోకాలూ ముంగిటే నిలుస్తాయి

సమాజంలో శాంతితో సామరస్యంతో మానవులు మనుగడ సాగిస్తూ అభ్యుదయాన్ని పొందుతూ నిశ్రేయసాన్ని చేరుకోవటానికి సాక్షాత్కృత ధర్ములయిన ఋషులు ఒక జీవన ప్రణాళికను నిరూపించి నిర్దేశించినారు.

ప్రతి మనిషికీ కొన్ని ధర్మాలు నిర్దేశించేరు. కొన్ని కర్మలనుపదేశించేరు.

ధర్మాలు సామాన్యాలని, విశేషాలని రెండు రకాలు. ఆలుబిడ్డలతో సంసారంతో ఉన్న వ్యక్తి తండ్రిగా, భర్తగా ఒక కుటుంబ యజమానిగా పాటించే ధర్మాలు సామాన్యాలు. అదే వ్యక్తి ఒక వైద్యునిగా, న్యాయమూర్తిగా, సైన్యాధికారిగా ఒక పదవిని నిర్వహిస్తూ పాటించే ధర్మాలు విశేషాలు.

పరస్పరం సంఘర్షణ రాకుండా రెండు రకాల ధర్మాలనూ నిర్వహించుకొంటూ రావాలి. ఒకదాని పేర మరోదాన్ని అలక్ష్యం చెయ్యరాదు.

సంఘర్షణ తప్పనప్పుడు మట్టుకు మొగ్గు విశేష ధర్మానికే. అప్పుడు కూడా సామాన్య ధర్మం బతికి బట్టకట్టాలి. అందుకు వీలు కల్పించాలి. అంతే కాని దాన్ని గాలికి వదిలెయ్యకూడదు.

అట్లాగే కర్మలు. ఇవి మూడు రకాలు. నిత్యాలు-నైమిత్తికాలు-కామ్యాలు అని. నిత్యకర్మలు అవశ్యానుష్ఠేయాలు. నైమిత్తికాలూ అంతే. తేడా అల్లా అప్పుడప్పుడు తటస్థించేవి కావటమే. వీటి తరువాతే కామ్యాలు. వీటికి పగ్గాలు వేయ్యాలి. లేకపోతే మనిషిని పరుగులు పెట్టించి నురుగులు కక్కిస్తాయి.

ఈ ధర్మాలన్నిటికంటే పరమధర్మం ఒకటుంది. అంటున్నారు స్మృతికారులు. అది **మాతాపితృ సేవనం, ఆచార్య పరిచర్య.** తల్లి పదినెలలు బిడ్డను కడుపున మోసి ప్రసవవేదననునుభవించి నరకయాతనలు పడి కనిపెంచుతుంది. పసితనం నుంచి తన కాళ్ళమీద తాను నిలిచి, తన బతుకు తాను బతక గలిగేంతవరకు ఆ నిసువును కష్ట నిష్ఠురాలకోర్చి పెంచి పెద్ద చేస్తాడు తండ్రి.

వారి యీ చర్యలో ప్రతిఫలాపేక్ష లేదు. పసికందు ప్రయోజకుడు కావాలన్న తపనే తప్ప తమకేదో ఒరగబెడతారని కాని, పెట్టాలని కాని వారీపని చేయరు. పేగు బంధం వల్ల చేస్తారు.

ఇట్లా బాహిరమైన పెరకువకు తల్లిదండ్రులు పూనుకొంటే విద్యాబుద్ధులు గఱపి వీణ్ణి ఒక 'మనిషి'ని చేసి అభ్యదయ పథంలో నిశ్రేయసం వైపు పయనింపచేసే మహోపకారకుడు "ఆచార్యుడు".

తల్లిదండ్రుల ఋణం ఎప్పటికి తీరుతుంది? ఎల్లా తీరుతుంది? అంటాడు **మనువు :-**

'యం మాతా పితరౌ క్లేశం సహేతే సంభవే నృణాం
న తస్య నిష్కృతి శక్యాకర్తుం వర్ష శతైరపి'

జపాలవల్ల, తపసులవల్ల, తీర్థాభిగమనాల వల్ల, యజనాదుల వల్ల,





ఏవేవో పొందవచ్చునని అందుకు పూనుకుంటారు జనం. జన్మనిచ్చి విద్యాబుద్ధులనిచ్చి 'మనిషి'ని కావించిన తల్లిదండ్రులను, ఆచార్యులను కాదని కావించిన జపాదులేవీ ఫలదాలు కావు. వార్ని కనక సేవిస్తే ఇవన్నీ చేసినట్లే! వారిని సేవింపక ఇవి యెన్ని చేసినా ఏమీ చెయ్యనట్టే! వారి సేవను మించిన తపసు లేదు.

ఆ ముగ్గుర్ని సేవిస్తే ముల్లోకాలూ ముంగిట నిలుస్తాయి.

ఆ ముగ్గురిని సేవిస్తే బ్రహ్మచర్యం కావించినట్టే. గార్హస్థ్యం సిద్ధించినట్లే. వానప్రస్థం ఆచరించినట్టే.

వారి పరిచర్య మూడు వేదాల చదువు. వారి పరిచర్య మూడగ్నుల సేవ.

ఈ ముగ్గురి విషయంలో ఏమరక సేవలు కావించిన నాడు ఇక్కడ (లోకంలో) ఎదురు లేకుండా జీవించటమే కాదు. దివ్య శరీరంతో దివ్యలోకాల్లోనూ వెలుగొందుతాడు.

మాతృభక్తితో భూలోకాన్ని, పితృభక్తితో అంతరిక్షాన్ని, గురుభక్తితో బ్రహ్మలోకాన్నీ పొందుతాడు మనిషి

మాతా పితరులను ఆచార్యులను ఆదరించిన వాడికి కర్మలు ఫలిస్తాయి. వీరిని సేవింపక కావించిన జపాలు, తపసులు, యజ్ఞాలు, దానాలు అధ్యయనాలు అన్నీ వ్యర్థాలే!

ఈ ముగ్గురికి పరిచర్య కావించటమే పరమధర్మం. మిగిలిన ధర్మాలన్నీ అముఖ్యధర్మాలే!

'మేం కనమన్నామా' అని ప్రశ్నించే యీకాలంలో డబ్బు పారేసి మిగిలిన వస్తువుల్లాగే విద్యా బుద్ధులనూ కొనుక్కో వచ్చునన్న దృష్టితో విద్యా ప్రదాతలను మామూలు వస్తువులమ్ముకొనే వ్యాపారులుగా పరిగణించే యీకాలంలో, మధ్యతరంవారు ఈ ధర్మాన్ని అంతరంగ శుద్ధితో ఆచరిస్తే పిల్లలు వారివెంట నడిచి యోగ్యులై, బాగు పడతారన్న ఆశతో పెద్దల యీ సూక్తుల్ని ఒక్కమారు మననం చేసుకుందాం!

**-శ్రీరామచంద్రాచార్య**

## విన్నపము

**ప్రవచన శిరోమణి శ్రీఉ.వే శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామి వారి సహస్ర చంద్ర దర్శన శుభసందర్భముగా** ప్రకటించడం కోసం శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయగారు వారి జీవిత చరిత్రను రూపొందిస్తున్నారు. శ్రీ భాష్యం వారికి సంబంధించిన సంఘటనలను, తమ స్పందనలను తెలుపదలచుకొన్నవారు వాటిని నవంబరు 15వ తేదీలోగా **శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయ గారు, A-2, "సహృదయ సదన్",** షీలానగర్, విశాఖపట్నం-530012 చిరునామాకు పంపగలరు.

ఫోన్ నెం- 0891-517193కు సంప్రదించగలరు.

# ఆచార్య పుట్టిన రోజు పండుగ పూబాలల సందడులు

తూర్పున అరుణోదయ మవుతుంది. బాలాదిత్యుడు తన బంగారు కిరణాలతో జగత్తునంతా సువర్ణ స్నానం చేయిస్తున్నాడు.

అదిగో ఆ అందాల పూలతోటలోని సుమబాలల కోలాహం. కొంచెము ఆగి వాటి యొక్క ఆనంద ప్రదమైన ముచ్చటలు మనము పంచుకుందామా!

ఎప్పుడెప్పుడూ తెలవారుతుందా! మా ఆచార్య తిరువడిఘళ్‌ను సేవించు కుందామా! అని ఆర్తితో ఆ విరితల్లులన్నీ రాత్రంతా కనుమూయనేలేదు. విశ్రమించనూ లేదు. ఔనండీ! ఈ ప్రొద్దు అన్ని ప్రొద్దుల్లాంటిది కాదే! అపర రామానుజులు మన పుణ్యావశమున ఈ అవనిలో ఆవిర్భవించిన సుదినము. మన గురువు, మన దైవము సమస్తమూ తానే అయిన మన శ్రీశ్రీశ్రీ చిన్న **శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామివారి తిరు నక్షత్రము** ఈ నాడే కదా!

అదుగో! రంగు రంగుల గులాబీలు అందాలన్నీ తమ సొంతమేనంటూ గర్వంగా పరిమళములను వెదజల్లు తున్నాయి. ''స్వామి కైంకర్యమునకు మమ్మల్ని తీసుకొనిపోవా!'' అని గులాబీ బాలలు సుతిమెత్తగా చల్లగా చేయి తాకి వాటి భాషలోమూగగావిన్నపం చేస్తున్నాయి. అయ్యో! గులాబీ తల్లుల్లారా! మిమ్మల్ని మాలగా గుచ్చుదామంటే, ఎక్కడయినా చిన్నముల్లు కనబడకుండా ఒకవేళ ఉండిపోతే స్వామి తిరుమేని నొచ్చదా అమ్మా!

అటువైపు పెద్ద, చిన్న, చిట్టి రంగు రంగుల రకరకాల చేమంతులు తమని చేరరమ్మని ఎడతెగని సైగలు చేస్తున్నాయి. **“స్వామి గళసీమని అలంకరించే అదృష్టము మాకు అందీయరాదా! అని ముద్దు ముద్దుగా మారాము చేస్తున్నాయి''.** అయ్యో! చామంతులారా! ముచ్చటగొలిపే మిమ్మల్ని మాలగా గుచ్చి దేవర వారికి సమర్పించుదామంటే, మీ బరువుతో మా స్వామి సుకుమారమైన కంఠము కంది పోవును కదమ్మా!

అల్లదుగో సంపెగలు ......... స్వామి తిరుమేని ప్రకాశంలో కలిసిపోయే.... ఛాయ ఉన్న సంపెంగలు తమ దివ్య పరిమళములతో స్వాగత గీతికలు ఆలపిస్తూ...... తమ దరికి రమ్మని మంద మాసాలు చేస్తున్నాయి. కోపగించుకో కండమ్మ సంపెంగలారా! మీరు కూడా మా స్వామికి భారమేనేమో! ఒక్కతడవ దయతో ఆలోచించండి.

పెద్ద పెద్దగా విచ్చుకొని విప్పారి వీక్షిస్తున్నాయి ముద్దమందారాలు. ఏ





పరిమళము లేని మిమ్మల్ని స్వామికి అర్పించడానికి మనసు రావటం లేదే!

అదిగో అల్లదిగో! జాజులు! విరజాజులు! సన్నజాజులు! మొల్లలు! కుప్పలు తెప్పలుగా విరగబూసి మాస్వామి దరహాసచంద్రికలతో పోటీ పడుతున్నాయి. స్వామి పాదసేవలో ధన్యతపొందాలనుకునే పుణ్యాశీలులందరూ రండి! అతి సున్నిత మైనవి, అందమైనవి, దవళకాంతులతో తమ సౌరభ్యమును నలుదిశల వెదజల్లే ఈ పూవులను మాలలు అల్లి మన ఆచార్యదేవుని అర్చించు కుందాము. స్వామి సేవకి నోచుకోని మా జన్మలెందుకని గులాబీ, చేమంతి, మందార, సంపంగి పూలబాలలారా ఏడవకండి! ఏడవకండి! మీరందరూ మా స్వామి తిరువడి ఘళిని ఉంచే పీఠముపై పవ్వళించుదుగాని.

మాకు ఇంకో జన్మనిచ్చిన తండ్రి శ్రీ చరణములకు ఈ పూలను అర్పించుకొనుటచే మా జీవితం ధన్యత పొందింది.

ఆచార్య తిరువడిఘళ్ళే శరణం.

**- శ్రీమతి మైథిలీ కుమారి, విజయనగరం**

# సందేహాలు - సమాధానాలు

**K. బాలరాజు ఆచారీ, మంబాపూర్, రంగారెడ్డిజిల్లా**

ప్ర. సత్త్వ, రజో, తమో గుణములను గురించి వివరంగ తెలుపగలరు భగవద్ధ్యానములో మనస్సును నిలకడగ నిలిపే ఒక మార్గమును తెలుపుము?

జ. భగవద్గీత 14,17 అధ్యాయాలను మీరు శ్రద్ధగ చదవండి. గుణాలు, వాటి ప్రభావము అవి ఎలా ఎలా ప్రేరేపణ, ఏ ఏ విషయాల వైపు కల్గిస్తాయో ఎలావాటిని సవరించుకోవచ్చో గూడ వివరించాడు భగవానుడు. సత్త్వం, మంచి ఆరోగ్యాన్ని, వాస్తవిక జ్ఞానాన్ని, ఆనందాన్ని యిస్తుంది. రజస్సు, కోరికలను, కోపాన్ని, ద్వేషాన్ని, దంభాన్ని యిస్తుంది. తమస్సు, ఒకదాన్ని మరోలా భావించడం, అజ్ఞానం కల్గించడం, తమోగుణాన్నిచ్చే వస్తువులునే యిష్టపడటం దాని లక్షణం. మనం సత్త్వాన్ని పెంచుకోవాలి. మనస్సును భగవంతుని వద్ద నిలపాలంటే అతడు మనకు అన్ని రకాలుగా బంధువని, రక్షకుడనే విశ్వాసం స్థిర పడాలి. ఆతని సౌందర్యం తెలిపే గుణాలను స్మరిస్తూంటే క్రమంగ మనస్సు నిలకడను సంతరించుకొంటుంది.

**A.P. రామారావు, విజయవాడ**

ప్ర. May, 2002 సందేహాలు సమాధానాలు శీర్షికలో "దేవీభాగవతం" ప్రమాణం కాదన్నారు. వేరొకచోట బ్రహ్మాది దేవతలు చేసిన దేవీ స్తోత్రాలను వ్యాస భగవానుడు 12 స్కంధాలలో 18,000 శ్లోకాలను మనకు అందించాడని చదివాను. ఏది నిజము? ఈ సందేహము తీర్చ ప్రార్థన.

జ. వేదవ్యాస భగవానుడు 18 మహా పురాణాలను 18 ఉపపురాణాలను రచించినట్లు తెలుస్తోంది. ఆ 36 లో దేవీ భాగవతం లేదు. దేవీ భాగవతమనే గ్రంథాన్ని మొదటగ 13,14 శతాబ్దాలలో ఎవరో వ్రాసారని వినికిడి. అందుకే పౌరాణిక విషయాలు నిర్ణయించడానికి ఇది ప్రమాణం కానేరదు. ప్రతి గ్రంథానికి ఒక సారార్థముంటుంది. దానికి విరుద్ధంగ ఉండే ఈ గ్రంథంలోని భాగాలను గూడ ప్రామాణికులు ఒప్పుకోరు. వ్యాసుడు రచించిన భారతంలోనే, ఇలా చాలా శ్లోకాలు, ప్రకరణ విరుద్ధంగ ఎందరో ఎన్నో చోట్ల మధ్యలో జొప్పించివేసారు. అసలు వాటినే పెద్దలు అంగీకరించరు మరి. సరి!మీకు తెలియడానికి 18 మహాపురాణాల పేర్లు, ఉప పురాణాల పేర్లు యిస్తున్నాం.

**మహా పురాణాలు :** 1. మత్స్యపురాణం, 2.మార్కండేయపురాణం, 3. భవిష్యత్పురాణం, 4. బ్రహ్మపురాణం, 5. బ్రహ్మవైవర్త పురాణం, 6. బ్రహ్మాండ పురాణం, 7.భాగవంతం, 8. వరాహపురాణం, 9.వాయు పురాణం, 10. వామన పురాణం, 11. విష్ణు పురాణం, 12. అగ్ని పురాణం, 13. నారద పురాణం, 14. పాద్మపురాణం, 15. లింగపురాణం, 16. గరుడ పురాణం, 17. కూర్మపురాణం, 18. స్కాందపురాణం.

ఉప పురాణాలు : 1. సనత్కుమారం, 2. నారసింహం, 3. శివధర్మం, 4. దౌర్వాసం, 5. నారదీయం, 6. కపిలం, 7. మానవం, 8. ఔశనసం, 9. బ్రహ్మాండం, 10. వారుణం, 11. కౌశికం, 12. లైంగం, 13. సాంబం, 14. సౌరం, 15 పారాశవం, 16. మారీచం, 17. భార్గవం, 18. స్కాందం.

**బి.ఎ. నాగభూషణ గుప్త, హిందూపురం**

ప్ర. మన భారత దేశమునందలి హిందువులు వేలకు వేలు ప్రతిసం॥ అన్యమతములను స్వీకరించు చున్నారు. మన మతములో లేని గొప్పతనము, ఔన్నత్యము, రుచి ఏమైనా వాటిలో





ఉన్నవా? దీనికి నివారణోపాయం ఏమిటి? సామాన్యుడు ఏమి చేయాలి? జగద్గురువులు మరియు సాధు సన్యాసులు పాత్ర ఏమిటి?

జ. అన్యమతాలవారు ధనము, విద్య, వైద్యము వంటి సేవలను ఎఱగ చూపి భారతీయులను ధర్మభ్రష్టులను చేస్తున్నారు. భారతీయులలో ఉన్న ఆర్థికమైన బలహీనతే ఈ మార్పిళ్ళకు దారితీస్తోంది. తాత్త్వికంగ చెప్పాలంటే, ఆ మతాలలో ఏమాత్రం సారం లేదని, అందరికీ తెలుసు. మారే వాళ్ళంతా తత్త్వం తెలిసి మారటం లేదు. వారందించే సేవలకు సంతృప్తులై ఇప్పటివారు, ఆర్థికలోపం లేకున్నా మారే వారున్నారు. ఇది తగ్గాలంటే మనవారంతా సేవాభావంతో అందించేట్టు విద్య, వైద్యం వంటి రంగాలు రూపుదిద్దుకోవాలి. నిజానికా రెండు రంగాలూ ఖరీదనవే, అవసరాలు కూడాను. ఈమధ్య కొందరలా ఈ సేవలను జనసామాన్యం దగ్గరకి తెస్తున్నారు. అయినా అన్యమతాల ఉద్ధృతి ముందు, మన సేవలు కనపడటంలేదు. చేస్తున్న వారిని ప్రోత్సహిస్తూ, మరి కొందరు గూడ స్థిరపడాలి. అలానే విద్యారంగంలో గూడ మార్పురావాలి. ముఖ్యంగ మన చరిత్రనంత వక్రీకరించి పాఠశాలలో బోధిస్తున్నారు. ఉదాహరణకి మనిషి కోతిలోంచి వచ్చాడనేదీ, ఆర్య, ద్రావిడ సంస్కృతులు గురించి, సింధు శాఖ వైపునుండి వచ్చినవారు హిందువులు, వారే వేదాలు రచించి, కులవ్యవస్థ నేర్పరచారనేది ఇలాఎన్నెన్నో, నిజానికివన్నీ తప్పుడు సిద్ధాన్తాలే, కాని మన వారే ఇవి తప్పంటే అంగీకరించే స్థితిలో లేరు.

**యు. బాపిరాజు, విశాఖపట్టణం.**

ప్ర. అష్టదిక్పాలకులకు ప్రార్థనలు, స్తోత్రములు ఏమైనా ఉన్నాయా? ఏ గ్రంథములో ఉంటాయి?

జ. అష్టదిక్పాలకులు:- ఇంద్రుడు-తూర్పుకి, అగ్ని-ఆగ్నేయానికి, యముడు-దిక్షిణాన్ని, నిర్‌ఋతి-నైరుతిమూలకి, వరుణుడు-పశ్చిమానికి, వాయువు-వాయువ్యానికి, కుబేరుడు- ఉత్తరానికీ, ఈశానుడు-ఈశాన్యమునకు అధిపతులు. వీరికి వేరువేరు మంత్రాలు, స్తుతులు ఆగమ గ్రంథాలలో ఉన్నాయి. నిత్యారాధన చేసే అర్చకులందరికీ ఇవి తెలుస్తాయి. సంప్రదించండి.

**యు. బాపినీడు, విశాఖపట్టణం.**

ప్ర. మానవుని మనుగడ ప్రతినిమిషం నవగ్రహాల గతిపై ఆధారపడి ఉంటే ఇతర దేవతలు, దేవాలయాలు ఎందుకు? నేరుగా నవగ్రాహ దేవతలను పూజిస్తే సరిపోదా?

జ. నవగ్రహాల ప్రభావం వీరి జీవితాలపై ఉంటుందే తప్ప వాటి మీదే ఆధారపడి ఉండదు. అయినా ఆగ్రహాలు గూడ ప్రధాన దేవతలైన దిక్పాలకులకు దాసులే. ఆ దిక్పాలకుముఖ్య దేవత, విష్ణ్వాలయమైతే విష్ణువు అవుతాడు. శివాలయమైతే శివుడవుతాడు. కనుక ఆయా ముఖ్య దేవతను దిక్పాలకులను ఆరాధించేటపుడు ఇక నవగ్రహాలను ప్రత్యేకించి ఆరాధించవలసిన అవసరంలేదు. అందుకే ప్రాచీనాలయాలలో నవగ్రహ సన్నిధులు ఉండవు. అనవసరంగూడ. కానీ ఈ రోజులలో తెలియని వారంతా పెత్తనాలు వహించడంవల్ల ఆలయాలలో క్రమం చెడిపోయి, ఎవరికి ఏది తోస్తే అలా కట్టి ఆలయవ్యవస్థను కలుషితం చేసేస్తున్నారు. ఆయా దాతల డబ్బులకు ఆశించి ఆలయాల నిర్మాతలూ అలానే నిర్మిస్తున్నారు. వారిచ్చే జీతాలపై ఆశ చేత, భక్తులలో ఉండే శీఘ్రఫలాకాంక్ష అనే బలహీనత వల్ల చేస్కొనే పూజలలో వచ్చే డబ్బులకాశించి పూజారులు గూడ, అలానే ఉన్న విగ్రహాలేమిటీ అనే విచక్షణ నశించి పూజలూ చేస్తున్నారు. పూజారుల ధనాశ, విద్యాలేమి గూడ ఇలాంటివి పెరగడానికి కారణాలే. భక్తులే ఇవి తెల్సుకొని ఇక సరిచేస్కోవాలి.

# "దివ్య దీపావళి - రమ్యశోభావళి"

చెవుటూరి కుసుమ కుమారి గారు, విజయవాడ

**దీపం జ్యోతి పరబ్రహ్మ**
**దీపం సర్వ తమోహరమ్**
**దీపేన సాధ్యతే సర్వం**
**సంధ్యా దీపం నమోస్తు తే**

అంటూ ప్రతిరోజు ప్రాతః కాలాన, ప్రదోష సమయాన కూడా దీపారాధన చేస్తూవుంటాం. దీపం ఎంత చిన్నది అయినా సరే కాంతి కిరణాలను వెదజల్లి, లౌకిక ఆధ్యాత్మిక చీకటులను పారద్రోలుతుంది. జ్ఞానమనే తేజస్సును ప్రసాదిస్తూ తోడుగా నీడగా అనుసరిస్తుంది. అందుకే దీపాన్ని జ్ఞాన సంకేతంగా, అఖండ అక్షరజ్యోతిగా వేదశాస్త్రాలు ఉద్ఘోషించాయి.

ఈలోకంలో పుణ్యం, పాపం అనే రెండుమాటలు ఎప్పుడూ వింటూ ఉంటాం. పుణ్యాచరణ వలన సుఖం, పాపాచరణ వల్ల దుఃఖం కలుగుతాయి అని శాస్త్రాలు చెప్పాయి. అయితే ఏది పుణ్యం, ఏది పాపం? ఇతరులకు అపకారం చేస్తే పాపం. కించిత్తయినా ఉపకారం చేస్తే, ఆత్మ తృప్తేకాక ఆసురీ ప్రవృత్తి కూడా నశిస్తుందనేది నిత్యసత్యం. పరమాత్మ తత్త్వాన్నీ, భారతీయ తత్త్వాన్నీ కూడా తెలియ చేసే ఈ దీపావళి పండుగ అత్యంత ప్రాముఖ్యం, అందరికీ ఆనంద కారణం అయినది.

అనేక గాధలున్నా ఈ దీపావళికి నరకాసుర వధ అత్యంత ప్రాధాన్యమైనది. నరకాసురుడు సాక్షాత్తూ భగవంతుడి సంతానమే. అయినా దుష్టుడు. హిరణ్యాకశిపుడు అనే రాక్షసుని దుశ్చర్యచేత భూమి జలరాశిలో రసాతలానికి క్రుంగిపోగా, శ్రీమహావిష్ణువు సాయంసంధ్యలో ఆ భూమిని పైకి తెచ్చి కక్ష్యలో నిలిపాడు. ఆ సంధ్యాకాలంలో పుడమీ, పురుషోత్తముల సమాగమం చేత పుడమికి పుట్టిన వాడే భౌముడు. అకాల సంతానం కనుక భౌముడు దుష్టుడై నరకుడు (చంపవలసినవాడు) అయినాడు.

ఆ నరకుడు పరమేశ్వరుని తపస్సు చేత మెప్పించి, తనకు తల్లి చేత తప్ప మరణము లేకుండునట్లు వరము పొందాడు. ఎందుకంటే, ఎంతటి దుష్టుడైనా సరే తల్లి కొడుకును చంపలేదు కదా అనీ, అలా తనకు మరణం అడ్డువుండదు కదా అనీ. అతడు ప్రాగ్జ్యోతిషపురానికి రాజు.

అలా వరగర్వంతో నరకుడు దేవ, మానవ, ఋషి సంఘాలను, స్త్రీలను అనేక విధాల హింసించాడు. పదహారు వేలమంది రాజవంశ స్త్రీలను చెరపట్టాడు. ముని పత్నులను అవమానించాడు. దేవమాత అదితి దివ్యకుండలాలను అపహరించాడు. వాడి అజ్ఞానంతో లోకాలను చీకటిలో ముంచాడు. స్త్రీలందరూ నీకు స్త్రీ వల్లనే చావు మూడుతుందని శపించారు.





ఆ నరకుడికి భయపడి ఇళ్ళల్లో దీపాలు కూడా వెలిగించేవారు కారట ఆనాడు. కాలాంతరాన పృథివీ తత్త్వాత్మక అయిన సత్యభామను రణరంగానికి తీసుకొని వెళ్ళి తల్లి అంగీకారంతోనే నరకుని వధింపచేశాడు కృష్ణుడు.

''అందరికీ'' ఆనందాన్నిచ్చేదే **"కృష్ణ"** శబ్దం. అలా నరకుని చంపినరోజు **"ఆశ్వయుజ కృష్ణ చతుర్దశి"** అదే నరక చతుర్దశి'' నరకుడు మరణించాడన్న ఆనందంతో అందరూ అభ్యంగన స్నానాలు చేసి, కార్తీక మాసం అంతా చీకటి దరిచేరకుండా దీపాలు వెలిగించుకున్నారు ప్రజలు. లోకాన దుర్మార్గం నశించాలని టపాకాయలు కాల్చారు.

సంపదలకు ప్రతిరూపం అయిన శ్రీమహాలక్ష్మిని పూజించారు. లక్ష్మీ నారాయణులకు క్షీరాభిషేకాలు చేశారు. ఆ జీవధారలు పుడమిన పడి భూమి పులకించి సశ్యశ్యామలగాత్రి అయింది. ప్రాణికోటిలోని రాజస, తామస, ప్రవృత్తులు నశించాయి. శ్రీకృష్ణుడు పదహారు వేలమంది స్త్రీలను రక్షించి ద్వారకలో వారికి ఆవాసం కల్పించి కాపాడాడు.

శ్రీహరిచేసే దుష్ట శిక్షణలోనే శిష్ఠ రక్షణ కూడా ఉంటుంది కదా! నరకుడు తాను చనిపోతూ "నేను కృష్ణుని చేతిలో మరణిస్తున్నాను కనుక నేను చనిపోయినరోజు ఎవరూ ఏడవరాదు'' అని కోరాడట. అందుకే నాటికీ నేటికీ దీపావళి ఇంత కోలాహలం, ఆనందం అని కూడా అంటూ ఉంటారు.

నరక చతుర్దశి, అమావాస్య, బలిపాడ్యమి అని మూడు రోజులు పండుగ చేస్తారు. అమావాస్యనాడు బలిని పూజిస్తారు. ఎందుకంటే శ్రీహరి చేత యాచించబడిన పుణ్యాత్ముడు కనుక. త్రివిక్రముడై లోకాలన్నీ తీసేసుకున్నా కూడా, దానవరాజ్యాన్ని దైవ రాజ్యంగా మార్చి బలికి పాతాళాన్నిచ్చాడు శ్రీహరి. ఆరోజు (అమావాస్యనాడు) పితృ దేవతల స్మృతిగా తర్పణలు, దానాలు ఇస్తారు.

పండుగ అనగానే పిండివంటలు, కొత్త బట్టలు అనేభావన చిన్న పిల్లలకు ఉన్నా, కొంత అర్థాన్ని వెచ్చించి ఆనందంచినా, పరమార్థాన్నీ, ఆధ్యాత్మిక భావ పరంపరనూ కూడా తెలుసుకొని కాపాడుకోవాలి అందరం.

నిజమైన ఆత్మజ్యోతిని వెలిగించుకోవటమే దీపావళి. అంతశ్శత్రువులను వధించటమే దీపావళి లక్ష్యం. మనం ఏ ఆనందాన్ని ఆశించాలి? శాశ్వతమా? క్షణికమా? ఆనందం దైవికం అయితేనే శాశ్వతం. లేకపోతే నరకం.

**టపాకాయలు కాలిస్తే అది లోకంలో**
**దుష్టప్రవృత్తులు నశించాలి అనే**
**సద్భావంతోనే. లోకహిత కాములమై,**
**మనలో విజ్ఞానజ్యోతి ఆవిర్భవిస్తే అదే నిజమైన**
**దీపావళి. అదే గీతాచార్యుడైన శ్రీకృష్ణ**
**పరమాత్మ లోకాలకందించిన అమరవాణి.**
**శ్రీశ్రీశ్రీ చిన్న జీయర్‌స్వామివారు**
**మనకందించిన గీతాజ్యోతి.**
**గీతాజ్యోతిని మన హృదయమందిరాలలో**
**వెలిగిద్దాము, ఆ కాంతులలో**
**"దివ్య దీపావళి" లోకాలకు**
**"రమ్యశోభావాళి" కావాలని కోరుకుందాం.**

లోకా స్సమస్తా స్సుఖినోభవన్తు

జై శ్రీమన్నారాయణ!

## బదరీనాథ్‌లో అష్టాక్షరీ క్షేత్రంలో జరుగు అన్నదానమునకు, నిర్మాణమునకు వివిధ పోషకులుగా కైంకర్యములు సమర్పించిన భక్తుల వివరములు

జెట్ సీతానగరమునకు వచ్చినవి

మహారాజపోషకులు: శ్రీ కె.ఎన్. పార్థసారధీ రుక్మిణి, చెన్నై, శ్రీమతి పంత్ లక్ష్మీకుమారి, నేపాల్, శ్రీమతి రమాదేవి ప్రభాకరరావు, సికింద్రాబాద్,

రాజపోషకులు: శ్రీమతి కె. రాజ్యలక్ష్మి, విశాఖపట్నం,

బదరీనాథ్ అష్టాక్షరీ క్షేత్రమునకు వచ్చినవి రాజపోషకులు: శ్రీ ఎమ్ సత్యన్నారాయణ, విశాఖపట్నం, శ్రీ టి. చక్రపాణి, సిద్ధిపేట; శ్రీ వి. వీర వెంకట సత్యన్నారాయణ, జంబుపట్నం; పోషకులు: శ్రీ బి. సూర్యనారాయణాచార్యులు, కావలి; శ్రీ వి. వెంకట సుబ్బశాస్త్రి, హైదరాబాద్; శ్రీ వి. భాస్కర వెంకటరెడ్డి, చెన్నై;

జీవిత సభ్యులు : శ్రీ ఎ. వరదారెడ్డి, హన్మకొండ; శ్రీమతి ఎన్. నాగమణి, విజయవాడ; శ్రీ జె. గోవిందు నరసమ్మ, సూరంపల్లి; శ్రీమతి కె. యశోద, గుంటూరు; శ్రీ కె. మోహన్‌రావు, సింగగూడెం, శ్రీకే. జి. రాజు, హైదరాబాద్; శ్రీమతి బి. హనుమాయమ్మ; పి. వెంకట నారాయణ, మామిడిపాలెం; శ్రీమతి జి. మంగవేణి, విజయనగరం; శ్రీ ఎ. మురళీధరరావు, హైదరాబాద్; శ్రీ ఇ. బలరామ్‌రావు, హన్మకొండ; శ్రీ ఎ. లక్ష్మణరావు, హైదరాబాద్; శ్రీమతి ఎమ్. సబితాసుధీర్‌రెడ్డి, హైదరాబాద్, శ్రీ సిహెచ్. సూర్యనారాయణరాజు, ఏటికొప్పాక; శ్రీ ఎమ్. అప్పలరాజు, సీతాదేవి, తుని; శ్రీ బి. శేషయ్య, కాకినాడ; శ్రీమతి ప్రభావెంకట రమణమూర్తి, కాకినాడ; శ్రీమతి ఎమ్. కృష్ణారావు నీరజ హైదరాబాద్; శ్రీ ఎ. దామోదరరావు, సర్వస్వతి, హన్మకొండ; శ్రీ ఎమ్. సంపత్‌రావు, హైదరాబాద్; శ్రీమతి ఎమ్. ప్రమీల, రాజమండ్రి; శ్రీమతి ఎ. సీతాపవిత్ర, విజయనగరం; శ్రీ కంతేటి సీతారామరాజు, తాడినాడ; శ్రీ కె. ప్రభాకరరావ్, గోపాలపట్నం; శ్రీమతి ఎమ్. అమృతమ్మ, శ్రీమతి కె. సీతమ్మ, శ్రీ ఆర్. రామానుజం, శ్రీ సిహెచ్. కృష్ణాజీ, చెన్నై; శ్రీమతి జి. పుష్పలత రంగారెడ్డి, ఆర్మూరు;య శ్రీమతి ఎ. రాజ్యలక్ష్మి, విశాఖపట్నం; శ్రీమతి జి. సరస్వతమ్మ, సికింద్రాబాద్; కె. కౌసల్యారాజారెడ్డి, హైదరాబాద్; శ్రీమతి జి. ఆండాళమ్మ, వరంగల్; డాక్టర్ జి. బాలరాజ్, సికింద్రాబాద్; శ్రీ జి. రమణాచారి, ఆర్మూరు; శ్రీ పి. ముక్తేశ్వరరావు, వరంగల్; డాక్టర్ ఎస్. సురేంద్రబాబు, చెన్నై; శ్రీ వి. ఆంజనేయులు, విజయనగరం; శ్రీ కె. సుబ్రహ్మణ్యం, తిరుపతి; శ్రీ ఎ. చలమాజిరావు, పూసపాటిరేగ; శ్రీ కె. పాపయ్యశెట్టి, విజయనగరం; శ్రీ కె. నాగబాబు, శ్రీ కె. నమ్మాళ్వార్, శ్రీ కె. నరసింహులు, శ్రీమతి ఎమ్. వెంకటరమణ, విశాఖపట్నం; శ్రీమతి కె. చంద్రకళ, హైదరాబాద్; శ్రీ సిహెచ్. వెంకటేశ్వరరావు, హైద్రాబాద్; శ్రీ కోసూరి వెంకటేశ్వర్లు, రామచంద్రపురం, శ్రీ బి.వి. కృష్ణారావు, ఒంగోలు; శ్రీమతి జి. గోదావెంకట త్రిసూల, రాజమండ్రి; శ్రీ ఎస్. సత్యన్నారాయణరాజు, ద్వారపూడి; శ్రీమతి బి. జగ్గాయమ్మ, విశాఖపట్నం; శ్రీమతి ఎ. మాణిక్యాంబ, విజయవాడ; శ్రీమతి వెంకట శాయిలీల, తిరుపతి; శ్రీమతి రమణి, హైదరాబాద్; శ్రీ ఎ.పి.పి.ఎస్. రవిప్రకాశ్, పాండిచ్చేరి; శ్రీమతి డి. ఇందిరాకిషోర్, విజయవాడ; డాక్టర్ పద్మమోహన్‌రావు, హైదరాబాద్, శ్రీ ఎ. శ్రీమన్నారాయణ, హైదరాబాద్; శ్రీ వి. రాంబాబు, విజయవాడ.

అభిమానులు: శ్రీమతి బి. ప్రమీల, ఆదిలాబాద్; శ్రీమతి ఆర్. కాంతాయమ్మరావు, శ్రీమతి సిహెచ్. మాలతి, హైదరాబద్; శ్రీ జి. నరసింగరావు, మూలకల్ల; శ్రీమతి బి.హెచ్. లింగమ్మ, పోనకల్లు; శ్రీమతి జె. వసుమతి రామచంద్ర, సికింద్రాబాద్; శ్రీ ఎ. యశ్వంత్‌రావు, కరీంమ్‌నగర్; శ్రీ జె. కిరణ్‌కుమార్, మంచిర్యాల; శ్రీ కె. రఘురామ్, తిరుపతి; శ్రీ టి. నరసింహస్వామి, సికింద్రాబాద్; శ్రీ కె. జయదేవ్‌శర్మ, గుత్తి; శ్రీ ఎమ్.బి. రాజు, శ్రీ ఎస్. సత్యన్నారాయణ, శ్రీ ఎస్ సత్యంనాయుడు, విశాఖపట్నం; శ్రీ బి. అప్పారావు, బొబ్బిలి; శ్రీమతి జె. కృష్ణవేణి, శ్రీ జి.కె. సాయిబాబు, శ్రీ కె. సాయిబాబు, శ్రీ వి. కుటుంబరావు, శ్రీ బి.





నాగేశ్వరరావు, శ్రీమతి ఎస్ హైమవతి, శ్రీ ఎన్. సతీష్‌బాబువిజయవాడ; శ్రీ ఎన్.వి. సింగరయ్య, విజయనగరం; శ్రీ కె. శివాజీరాజు, శ్రీ ఎమ్. సత్యన్నారాయణరాజు, శ్రీమతి పి. కృష్ణవేణి, కాకినాడ; శ్రీ ఆర్. రామలింగరాజు, శ్రీ ఎమ్. విజయరామరాజు, నరసాపురం; శ్రీ జి. సీతారామరాజు, చిన్న అమరం; శ్రీమతి డి. మణెమ్మ, విజయవాడ; శ్రీ కె. కరుణబాబు, ఖమ్మం; శ్రీ డి.వి. జగన్నాథనారాయణరాజు, విశాఖపట్నం; శ్రీమతి ఆర్. లక్ష్మి, శ్రీ కె. జోగారావు, శ్రీ సిహెచ్. అచ్చుతరాజు, కాకినాడ; శ్రీ ఆర్. వెంకట్రావ్, శ్రీ ఆర్.వి. జగ్గారావు, శ్రీ ఐ. బుచ్చివెంకట్రావు, కొవ్వాడ; శ్రీ సిహెచ్. పార్థసారథి, బొబ్బిలి; శ్రీ రావు గోపాలరావు, ఉప్పలపాడు; శ్రీ జి. వెంకటేశ్వరరావు, విజయవాడ; శ్రీ ఎస్. రామయ్య, బళ్ళారి; శ్రీమతి డి. ప్రియమిత్ర, కాకులపాడు; శ్రీమతి రామకుమారి, కౌతారం; శ్రీ హెచ్. వెంకటేశ్వర్లు, హైదరాబాద్; శ్రీ కె.వి. ఉదయభాస్కర్, సిద్ధిపేట; శ్రీ టి.వి.ఆర్.సిహెచ్. నాగేశ్వరరావు, జంగారెడ్డిగూడెం; శ్రీమతి బి. పద్మావతి, నెల్లిమర్ల; శ్రీ బి. వెంకటకృష్ణప్రసాద్, గుంటూరు; శ్రీ ఎమ్. నాగరాజు, విశాఖపట్నం; శ్రీ ఎస్. విక్రమవర్మ, విశాఖపట్నం; శ్రీమతి ఎ. రమాదేవి ప్రభాకరరావు, సికింద్రాబాద్; శ్రీమతి బి. ఉమావతి, విజయనగరం; శ్రీ ఎస్. లక్ష్మయ్య, సిద్ధిపేట; శ్రీ కె. రామకృష్ణ, శ్రీ డి. శ్రీరాములు, శ్రీ ఎస్. ధర్మాచార్యులు, విజయనగరం; శ్రీ టి. శ్రీనివాసాచార్యులు, బొబ్బిలి; శ్రీ ఎ.ఎస్.ఎన్. మూర్తి, హైదరాబాద్; శ్రీమతి పి. మణి, బొబ్బిలి; శ్రీ ఎ. వరదారెడ్డి, హన్మకొండ; శ్రీ ఎమ్. సతీష్ కుమార్, హైదరాబాద్ ; శ్రీ కె.హెచ్. ఆర్.ఎల్ శర్మ, అనంతపూర్; శ్రీ సిహెచ్. రాజబాబు, శ్రీ సిహెచ్. సూర్యనారాయణ, శ్రీ సి.వి.ఎస్.ఎన్. రాజు, ఏటికొప్పాక; శ్రీ పి. సన్యాసరాజు, శ్రీమతి. పి. సీతాదేవి, శ్రీ పి. లక్ష్మీనరసింహరాజు, జొన్నవలస; శ్రీమతి డి. రోహిణిదేవి, శ్రీ సిహెచ్. లక్ష్మణరావు, శ్రీ కె. వెంకటరాజు, విశాఖపట్నం; శ్రీమతి ఎల్. రంగనాయకమ్మ, హైదరాబాద్; శ్రీ బి. లక్ష్మీనారాయణ, శ్రీ బి. సత్యన్నారాయణ, శ్రీ ఎమ్. రామకృష్ణ పరమహంస, విజయవాడ; శ్రీ ఎ.వి. సుబ్బారావు, కాకినాడ; శ్రీ సి.ఎల్.ఎన్.రావు, ఏలూరు; శ్రీ సి.ఎల్. శ్రీనివాస ప్రసాద్, సికింద్రాబాద్; శ్రీ ఎమ్ నాగరాజు, విజయనగరం; శ్రీమతి మద్దిరాజు సీతమ్మ, జనార్ధనవరం; శ్రీ సుధాకర్, శ్రీ పి. ప్రభాకర్, శ్రీ యు. వీర్రాజు, శ్రీ ఎస్. శివసుబ్రహ్మణ్యం, విజయవాడ; శ్రీ జి. హనుమంతరావు, హైదరాబాద్; శ్రీమతి పి. వరాహ అప్పలనరసమ్మ, కొనిశ; శ్రీ పి.వి.ఎల్.ఎన్. రాజు, విశాఖపట్నం; శ్రీ ఆర్. లక్ష్మణరావు, మంచిర్యాల; శ్రీ జె. శ్రీనివాస్, సూరంపల్లి, శ్రీమతి జి. గంగాభవాని, సూరంపల్లి, శ్రీమతి ఇ. సుభద్రాదేవి, కాకినాడ; శ్రీమతి ఆర్. ఆండాళమ్మ, బొబ్బిలి; శ్రీమతి ఎమ్. ధనలక్ష్మి, శ్రీ బి. చక్రధరరావు, విజయనగరం; శ్రీ యు. వీర్రాజు, విజయవాడ; శ్రీ కె. సత్యన్నారాయణ ప్రసాద్, కాకినాడ; శ్రీమతి ఎమ్. ఆండాళమ్మ, శ్రీ ఎమ్.వి. జగన్నాథం, విశాఖపట్నం, డా. బి. రాధకృష్ణ, శ్రీ వై. ఆనందకుమార్, వరంగల్; శ్రీ సత్పాల్ కపూర్ మహేంద్ర, హన్మకొండ; శ్రీ కె. సింగయ్య, పల్లపాడు; శ్రీ బి. ప్రవీణ్‌రావు, కరీంనగర్, శ్రీమతి పి. అనసూయ, విజయనగరం; శ్రీ యం. సత్యన్నారాయణ, పూసపాటిరేగ, శ్రీ బొండా అప్పారావు, కుమిలి; శ్రీ ఎమ్. కిషన్‌రావు, హైదరాబాద్, శ్రీ సిహెచ్. గోవిందరావు, సికింద్రాబాద్; శ్రీ డి. వెంకట రెడ్డి, గొల్లల మామిడాడ; శ్రీ వెంకటేశ్వరరెడ్డి, శ్రీ ఎన్.వి. కృష్ణ, శ్రీ కె. వెంకటరెడ్డి, శ్రీ ఎమ్. తలుపులరెడ్డి, లక్ష్మీనరసింహపురం. శ్రీ వి. యాదగిరిరావు, శ్రీ ఎమ్. సురేంద్రరెడ్డి, హన్మకొండ; శ్రీ ఎమ్. వెంకటయ్య, శ్రీ కె. రామకృష్ణ, పల్లపాడు; శ్రీ జి. దాశరథి, నల్గొండ; శ్రీ ఎమ్. రామసుధాకరెడ్డి, శ్రీ ఎస్. సతీష్‌రెడ్డి, శ్రీ పి. నరేంద్రరెడ్డి, హన్మకొండ; శ్రీ ఎస్. వెంకటేశ్ అయ్యంగార్, బెంగుళూరు; శ్రీ డి. సీతారామారాజు, గంట్యాడ; శ్రీ ఎన్. అన్నపూర్ణ, శ్రీ టి. బ్రహ్మలింగం, శ్రీ ఎస్. సీతారామరాజు, శ్రీ ఎమ్. నాగరాజు, శ్రీ ఎమ్. బాలకృష్ణ, శ్రీ డి. శ్రీనివాస గుప్త, శ్రీమతి పి. లక్ష్మీకొండ, శ్రీ ఎమ్. సత్యన్నారాయణ, శ్రీ ఎమ్. శ్రీనివాస్, శ్రీ జి. మాధురీ రామకృష్ణ, శ్రీ జి. నరసింహరాజు, శ్రీ ఎస్. రామమోహన్, శ్రీమతి పి. మాణిక్యమ్మ, శ్రీ ఎస్వీ. కృష్ణంరాజు, శ్రీమతి ఎమ్. సీతాయమ్మ, శ్రీమతి ఎమ్. పేరిందేవి తాయరమ్మ, విశాఖపట్టణం. శ్రీమతి ఆర్. నారాయణమ్మ, శ్రీ ఆర్. సత్యం, శ్రీ ఆర్. శంకరరావు, శ్రీమతి ఎమ్. సత్యవమ్మ, శ్రీ టి. సావిత్రమ్మ, కుమిలి; శ్రీ కె. సాయిబాబా, శ్రీ ఎమ్. శ్రీమన్నారాయణ, విజయవాడ; శ్రీ పి. శ్రీరామ్, శ్రీ ఎన్. గోవింద, శ్రీ డి. గోపాలం, విజయనగరం.

## కైంకర్య శ్రీ వల్లభులు



చాతుర్మాస్యం భగవంతునికి ఎంతో ప్రీతికరమైన కాలం. ఈ కాలంలో చేసిన ఏ ధార్మిక కార్యమైనా ఎంతో పుణ్యాన్నిస్తుందని శాస్త్రవచనం. వదాన్యులైన భక్తులు వస్తు, ధన రూపంలో తమ కైంకర్యములను సమర్పించి ధన్యులయ్యారు. వారందరికీ, వారికి ప్రేరకంగా నిలిచిన పటమట, శ్రీమతి పి. సీతమ్మకు శ్రీశ్రీశ్రీస్వామివారు అనేకానేక మంగళాశాసనములు కృపచేసారు. వారి వివరాలు :

విజయవాడ : శ్రీమాన్ శ్రీ పి.వి నరసింహారావు & కృష్ణకుమారి - ఫ్రిజ్, శ్రీమతి నల్లూరి రమణమ్మ - రెండు ఇనుపబీరువాలు, శ్రీమాన్ బత్తిన సుబ్బారావు - ఒక ఇనుపబీరువా, శ్రీ సుంకర సుబ్బారావు - గడ్డి కటింగ్ మిషన్ (గోవులకు), శ్రీ ఈడ్పుగంటి నాగమణి రాజారావు - 3H.Pఎలక్ట్రిక్ మోటార్, శ్రీమాన్ తుమ్మల లోకేశ్వరరావు పటమట - టీ మేకర్, శ్రీ,శ్రీమతి తుమ్మల వెంకటేశ్వరరావు, వజ్రమ్మ - 100బస్తాల సిమెంట్, శ్రీ సి. వినయ్‌కుమార్ - స్టీల్ ప్లేట్ (పులిహోర తయారు చేయడానికి), శ్రీ యం కృష్ణారావు- స్టీల్ గ్యాస్‌స్టౌ, శ్రీ వల్లభనేని మోహన్‌రావు - ఐరన్‌రాక్స్ -3, శ్రీ కె.జి.జి. ప్రసాద్, కానూర్ - సుమిత్ మిక్సీ, శ్రీ డి. రామారావు, ఖమ్మం - ఇత్తడి గుండిగ, శ్రీకోనేరు రామారావు - ఇసుక(4లారీలు), శ్రీమతి అడుసుమిల్లి శశికళ, సిద్ధాంతము - 2 క్వింటాల్ పంచదార, శ్రీ సత్యన్నారాయణ రాజు, విజయవాడ - 50కె.జి నూనె, శ్రీ డి రామామోహన్‌రావు, విజయవాడ - భజనతాళాలు

**స్టీమ్ బాయిలర్‌కు విరాళాలు ఇచ్చినవారు**

శ్రీమతి కొల్లి సుశీల, విజయవాడ C/o కె. వెంకట కృష్ణారావు, శ్రీమతి యం. సీతారావమ్మ వైఫ్ ఆఫ్ మొవ్వా హనుమంతురావు, గన్నవరం, శ్రీమతి చలసాని అన్నపూర్ణ, గన్నవరం, శ్రీ చెక్కా భోగేశ్వరరావు, విజయవాడ, శ్రీ శ్రీనివాస్ చక్రవర్తి, పటమట, విజయవాడ, శ్రీ బొప్పన కృష్ణారావు, ప్రభావతి, విజయవాడ, శ్రీ తుమ్మలపల్లి మురళీకృష్ణ మంగళగిరి, శ్రీ అండి సురేంద్రబాబు, మంగళగిరి, శ్రీ కోడూరు వెంకటస్వామి, పటమట, విజయవాడ, శ్రీ అల్లూరు కోటయ్య, పటమట, విజయవాడ.**ప్రధాన ద్వార కైంకర్యమునకు**

**ప్రధాన ద్వార నిర్మాణమునకు**

శ్రీమతి మద్ది సరస్వతమ్మ, గుంటూరు, శ్రీమతి రవిమ్మ, మానికొండ, శ్రీమతి కోనేరు లలిత కుమారి, పటమట, విజయవాడ, శ్రీమతి గోపిశెట్టి లీలావతి, వైఫ్‌ఆఫ్ లేట్ రామప్రసాద్, విజయవాడ, జగన్నాథస్వామి దేవస్థాన భక్తులు, గుంటూరు, శ్రీమతి మేకా విజయలక్ష్మి సాంబిరెడ్డి, తాడేపల్లి, శ్రీమతి ఎమ్. సరోజనమ్మ, విజయవాడ, శ్రీమతి అరుణ, గుంటూరు, శ్రీ బి.వి. సుబ్బారావు, గుడివాడ, శ్రీమతి గొట్టిపాటి రాధికాకిషోర్, చిలకలూరి పేట, శ్రీమతి పి. లక్ష్మీనరసమ్మ, యద్దనపూడి.

**శ్రీమాన్ అచ్యుతరావుగారు, గుంటూరు.** ఎంతో మందికి స్ఫూర్తిని కలిగిస్తూ శ్రీస్వామివారి ప్రత్యేక మంగళాశాసనములు అందుకున్నారు. వీరి ద్వారా శ్రీమాన్ గ్రంధి బుల్లెయ్య విజయవాడ, శ్రీమాన్ మాజేటి సురేంద్ర విజయవాడ, విజయరత్న ట్రేడింగ్ కంపెని గుంటూరు, శ్రీమాన్ పోలిశెట్టి హరిగారు గుంటూరు, శ్రీమాన్ చుండూరి వెంకట సూర్యప్రకాష్‌గారు విజయవాడ, వస్తురూపంగా తమ సేవలందించారు. వీరందరికీ శ్రీస్వామివారు అనేకానేక మంగళాశాసనములు కృపచేసారు.





## ఉభయవేదాన్త సభలు - రాజమహేంద్రి

శ్రీమత్పరమహంస పరివ్రాజకులు **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజజీయరుస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో** ప్రతిసంవత్సరం జరిగే ఉభయవేదాన్త సభలు ఈ సంవత్సరం నవబంరు 30, డిసెంబర్ 1,2 తేదీలలో ఆనం కళాకేంద్రంలో నిర్వహింపబడతాయి. ఈ సందర్భంగా ఉదయం పండిత సభలు-సాయం- శ్రీశ్రీశ్రీ జీయర్‌స్వామివారి విశేష ప్రవచనాలు జరుగుతాయి.

**శ్రీమదుభయవేదాన్తాచార్యపీఠం,**

**శ్రీవిశిష్టాద్వైత ప్రచార సంఘం శాఖ, తులసీరామానుజ కూటం, రాజమండ్రి.**

## గ్రంథపరిచయం - యతిరాజవింశతి

శ్రీవైష్ణవ సంప్రదాయ స్తోత్రములలో 'యతిరాజ వింశతి' విలక్షణమైనది. సంప్రదాయ కుటుంబాలకు చెందిన శ్రీవైష్ణవులకందరకు వాచోవిధేయమై నిత్యానుసంధేయముగా ఉన్నది. మనవాళ మహాములు భగద్రామానుజులను గూర్చి విన్నవించిన స్తుతిప్రబంధమిది. మనవాళమహామునులకు 'పంక్తిపావను'లను వ్యవహారం.వీరినిగూర్చి వీరి శిష్యులైన ఎరుంబి అప్పా అనువారు ప్రసాదించిన పూర్వోత్తర దినచర్యలను నడుమ యతిరాజవింశతితో కూర్చి శ్రీవైష్ణవుల తిరుమాళిఘలలో తదీయరాధన వేళ పరివేషణం మొదలు పరిషేచనం వరకు గోష్ఠిగా అనుసంధించడం పరిపాటి. శ్రీవైష్ణవ స్వరూపాన్ని నిష్కర్షచేసి నిరూపించే మధుర ప్రబంధం ఇది.

తమిళంలో, సంస్కృతంలో ప్రామాణికములైన రసఘనములైన వ్యాఖ్యలు దీనిపై ఏర్పడినై. తెలుగులోనూ కంచి ప్ర.భ. అణ్ణంగరాచార్య స్వామివారు ఒక వ్యాఖ్యను ప్రసాదించేరు. ఆ అన్ని వ్యాఖ్యలలో ఉన్న విషయాన్నంతనూ తెలుగు వారికందించాలన్న పెద్ద మనసుతో పెంటపాడు ఉభయవేదాంతసభ కార్యదర్శి సత్సంప్రదాయ ప్రచారైక ప్రవణులు అయిన ఉ.వే. శ్రీమాన్ ఎన్.వి.ఎల్.ఎన్. రామానుజాచార్యస్వామివారు, శ్రీ గుణరత్న కోశాదులకు ఆంధ్రవ్యాఖ్యానాలు ప్రసాదించిన ఉ.వే. శ్రీమాన్ కె.వి.ఆర్. నరసింహాచార్యస్వామివారు ఈ **'యతిరాజవింశతి'** సమగ్ర ఆంధ్ర వ్యాఖ్యాన రచనకు పూనుకొన్నారు.

ప్రతిశ్లోకానికి ప్రతి పదార్థం తాత్పర్యాలతో పాటు ప్రతిపద విశేషార్థ నిరూపణమూ విపులంగా కావించినారు. విషయ బంధురంగా ప్రతిపద సుందరంగా వెలిసిన ఈ వ్యాఖ్య సత్సంప్రదాయపరులకు సర్వులకూ అవశ్యనిషేవణీయం.

16.132 పుటలతో భగవద్రామానుజుల ముఖచిత్రంతో వెలువడిన ఈ గ్రంథంవెల : రూ.30/-

ప్రాప్తిస్థానం : ఉభయవేదాంత సభ, పెంటపాడు, ఆంధ్రప్రదేశ్, 534 116

# మహర్షుల చరిత్ర

# భరద్వాజ మహర్షి

తమిళమూలం : వై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి
తెలుగు సేత : శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూప్పురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ

**భరద్వాజ విందు :**

అతిథులను దైవంగా పూజించడం అనేది భారతీయులకు అనాదిగావస్తున్న ఆచారం అతిథులను ఆదరించే వారి ప్రస్తావన వచ్చినపుడు, భరద్వాజ హహర్షి అందరికంటే ముందు ఉండడం మనం గమనిస్తాం. ఎవరైనా చక్కటి విందు ఇస్తే, దానిని వర్ణించేవారు **'భరద్వాజవిందు'** అని చెప్పడం మనం సామాన్యంగా వింటూ ఉంటాం.

ఇతిహాస శ్రేష్ఠమైన రామాయణంలో భరద్వాజమహర్షి చేసిన విందు ప్రస్తావన రెండు సార్లు మనకు కనబడుతుంది. అది ఎంతో అందంగా కూడా వర్ణించబడింది. అయోధ్యా కాండలో, వనవాసానికివెళ్ళిన రాముణ్ణి తిరిగి అయోధ్యకు త్రిప్పుకు రావాలనే ప్రయత్నంలోపెద్దజన సమూహంతో చిత్రకూట పర్వతానికి బయలుదేరి వెళ్లే సమయంలో భరద్వాజుడు, భరతుని పరివారానికి చేసిన అపూర్వమైన విందు మొదటిది. రామాయణంలో ఈఘట్టం మనం చదివితే ఆ విందు ఎంత వైభవోపేతంగా, మరపురాని విధంగా జరిగిందో మనకు కళ్లకు కట్టినట్టుగా గోచరిస్తుంది. వాల్మీకి మహర్షి చివరగా, విందు ఆరగించిన ప్రజలమాటలలోనే దానిని ఈ విధంగా వర్ణించాడు.

శ్లో॥

**నైవాయోధ్యాం గమిష్యామో! న గమిష్యామ దణ్డకాన్।**
**కుశల భరతస్యాస్తు! రామస్యాస్తు తథా సుఖమ్॥**

"మేము అయోధ్యకుపోము, దండకారణ్యానికిపోము, భరతుడు క్షేమంగా ఉండుగాక. రాముడు సుఖంగా ఉండుగాక" అని వారు ఆ విందు వైభవాన్ని వర్ణించినట్లు చెప్పబడింది. రాముణ్ణి దండకారణ్యాన్నుంచితిరిగి అయోధ్యకు తీసుకునిరావాలనే దృఢనిశ్చయంతో భరతునితో బయలుదేరిన ప్రజా సమూహం, భరద్వాజుని విందుకు పరవశులై, తాము ఏ ప్రయోజనం కోసం బయలుదేరారో దానినికూడ మరచిపోయి, పై శ్లోకంలో చెప్పిన ప్రకారంగా భరద్వాజాశ్రమంలోనే ఉండిపోతాము. అని అన్నారంటే, ఆ విందు వైభవానికి ఇంత కంటె నిదర్శనం ఏమికావాలి?

భరద్వాజమహర్షి చేసిన రెండవ విందు, యుద్ధకాండ చివరలో మనకు కనబడుతుంది. అయోధ్యకాండలో అతిథులు మనుష్యులైతే, యుద్ధకాండలోఅతిథులు, కోతులు మొదలైనవి. రావణ వధ అయిన తరువాత సీతారామ లక్ష్మణులు పెద్ద వానర సైన్యంతో అయోధ్యకు తిరిగివచ్చే సమయంలో ఈ కోతిమూకలకే





విందుచేయడం విశేషం. లంక నుండి రాముడు పుష్పకవిమానంలో అతి వేగంగా అయోధ్యకు తిరిగి వెళ్ళే సమయంలో ఆపుష్పక విమాన వేగాన్ని మించిన వేగంతో వానరసైన్యం భూమి ఆకాశం అంతటా వ్యాపించి అనుసరించింది. ఒక్క రోజులో నిన్ను అయోధ్య చేరుస్తానని విభీషణుడు అనడంతో లంకలో కొద్దిసేపు మాత్రం ఉండి, మరునాడు భరతుడు పెట్టిన గడువు తీరిపోతూఉండడంతో, ఈలోగా అయోధ్య చేరాలని రాముడు తొందరపడటంతో అతి వేగంగా నడచింది పుష్పక విమానం. 14 సంత్సరాలు పూర్తి అయిన తరువాత మరునాడు నీవు నాకు కనిపించకపోతే ఆత్మహత్య చేసుకుంటానని భరతుడు రామునితో చిత్రకూట పర్వతంమీద చెప్పి ఉన్నాడు కనుక, రాముడు అంత తొందరపడి భరద్వాజాశ్రమం చేరి, విమాన వేగం కూడా చాలకపోవడంతో భరతుని దగ్గరకు ముందుగా హనుమంతుని పంపి తనరాకను భరతునికి తెలియజేశాడట.

ఇంతటి తీవ్రపరిస్థితిలో రాముడు తానే అయోధ్యకు వెళ్ళి భరతుని కాపాడవచ్చుకదా! అయినా లంకనుండి బయలుదేరిన తరువాత ఎక్కడా ఆగని రాముడు భరద్వాజాశ్రమంలో ఆగి ఆయన దర్శనం చేసుకున్నాడంటే, భరద్వాజునిపై రామునకున్న గౌరవభావం మనకు గోచరిస్తుంది. భరద్వాజ మహర్షికి కూడా రామునిపై ఎంతగొప్ప ఆదరభావం ఉందో అన్న విషయం అయోధ్యాకాణ్డలో చిత్రకూటానికి వెళ్ళే భరతునితో ఆయన పలికిన మాటలే మనకు తెలియచేస్తాయి.

శ్లో॥

**కచ్చిన్న తస్యాపాపస్య, పాపం కర్తు మిహేచ్ఛసి।**
**అకణ్టకం భోక్తుమనా, రాజ్యం తస్యానుజస్య చ॥**

"ఎదురులేక రాజ్యమును అనుభవించాలి అనేకోరికతో నీవు పాపరహితుడగు రామునకు ఏ అపకారమును చేయకోరుటలేదు కదా" అని భరద్వాజుడు భరతుని అడిగినట్లు చెప్పబడింది కదా! దీనిని బట్టి భరద్వాజ మహర్షికి రాముని యందు గొప్ప ప్రేమ, భక్తి ఉండటంచేత రాముడు కూడ అంత క్లిష్టసమయంలోను ఆయనను సేవించకుండ ఉండలేకపోయాడు అన్నది మనకు స్పష్టంగా గోచరిస్తుంది.

భరద్వాజాశ్రమంలో ఆగడానికి ఇంకో కారణం కూడ ఉంది. దండకారణ్యంలోని మహర్షులంతాభరద్వాజమహర్షితో సమానమైన రామభక్తి కలవారే. అయినా, భరద్వాజాశ్రమం లోనే ఆగడానికి కారణం – భరద్వాజ మహర్షికి గల ఆతిథ్యగుణమే, రాముణ్ణి అనుసరించి వచ్చే సముద్రంలాంటి గొప్ప వానర సైన్యానికి భరద్వాజమహర్షి ఆతిథ్యవైభవాన్ని చూపించాలని రామచంద్రస్వామి భావించాడు. కోతులకు ప్రియమైన కాయలు పళ్ళు ధారాళంగా దొరికేది అడవుల్లోనేకదా! అయినా యథేచ్ఛగా చెట్లమీద తిరుగుతూ కాయలను పండ్లను ఆరగించే కోతులకు భరద్వాజమహర్షి చేసే విందు ఏమి ఉంటుంది? అని మనకు సందేహం కలిగే అవకాశం ఉంది. కాని రాముని ఉద్దేశం వేరు. అన్ని పళ్లూ అన్ని కాలాల్లోన్నూ దొరకవు కదా! అందుచే భరద్వాజ

మహర్షి తన తపోబలంతో అన్ని కాలాల్లోనూ దొరికే పండ్లను, వీరు అచ్చటికి చేరిన సమయంలో అచ్చటి చెట్లు యిచ్చేటట్టు చేస్తే వాటితో వానరసేన అనుభవించే ఆనందాన్ని చూడాలని ఆయన ఆశ. దీనిని నెరవేర్చు కోవడం కోసమే రాముడు భరద్వాజా శ్రమంలో కొంత సేపు ఆగడం జరిగింది.

అనుకున్నట్లుగానే భరద్వాజమహర్షి అనేక రకాలయిన పళ్లను (సహజంగా ఆకాలంలో దొరకని పండ్లను కూడా) చెట్లనుండి లభించేటట్లు చేయడం, వానర వాహిని ఆ పండ్లను ఆనందంతో మైమరచి ఆరగించడం జరిగింది. దీనికంతటికి కారణం భరద్వాజ మహర్షి తపశ్శక్తే. చెట్లుకూడా ఆయన తపశ్శక్తి మహిమకు లొంగి అకాలంలో కూడా పండ్లను ఇవ్వగలిగాయి.

భరద్వాజుని ఆచార్యుడు వాల్మీకి. ఆయన శిష్యుడు భరద్వాజుడు. **ఆచార్యుడే శిష్యుని గుణాలకు పరవశుడై కీర్తిస్తే, మనం కూడా ఆవిధంగా ఆచార్యాభిమానాన్ని పొందితే** బాగుండును అని అనిపిస్తుంది గదా! భరద్వాజ మహర్షి మహిమ ఇంతింత అనరానిది. ఆయనకు నమస్కరించి, ఆయనను ఆదర్శంగా పెట్టుకొని జీవించడానికి ప్రయత్నం చేద్దాం.

**(భరద్వాజమహర్షి చరిత్ర సమాప్తం)**

గమనిక : స్థలాభావం వలన మిగిలిన శీర్షికలు ప్రకటించలేక పోవుచున్నాము. -**భక్తినివేదన**

# వికాస దర్శిని నివేదన

## మానస సరోవర-కైలాసయాత్ర, వి.సి.డి మరియు పుస్తకముల ఆవిష్కరణోత్సవం

అందరూ ఎప్పుడెప్పుడా! అని మూడు నెలలుగా ఉవ్విళ్ళూరుతూ ఎదురు చూస్తున్న శ్రీస్వామివారి మానవస సరోవర కైలాస యాత్రా విశేషాల వి.సి.డి మరియు పుస్తకాల ఆవిష్కరణ సభ అత్యంత వైభవోపేతంగా జరిగింది. (ది5-10-2002) సా॥4గం॥లకు)

ఈ 'చిత్రభాను'లో సంకల్పించిన 'గీతాజ్యోతి'ని విస్తృత ప్రచారం చేయవలసిన తరుణంలో ఈ విదేశ పర్యటనం దేనికి? అని సందేహం కొందరికి. శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రవర్తకులయిన శ్రీస్వామివారు కైలాసయాత్రను చేయడమేమిటి? అనే సందేహమే దాదాపు అందరికీ.

అందరి సందేహాలను తీరుస్తూ.. గీతా జ్యోతి' ప్రచారంలో ఒక భాగంగా **"స్వీయ ఆరాధన-సర్వఆదరణ"** అనే సూత్రానికి ఆచర ణాత్మకంగా జరిగిన ఆ యాత్రా విశేషాలు ఆసభలో ఎంతో ఆసక్తికరంగా వివరించడం జరిగింది.

ఈ కార్యక్రమానికి 'ఆవిష్కర్త'గా శ్రీమాన్ చలపతిరావు (టి.టి.డి. చైర్మన్) విచ్చేశారు. ముఖ్య అతిథిగా శ్రీమతి చిత్రా మాధవన్ (యు.ఎస్.ఎ) నుండి విచ్చేశారు.

కుమారి శారద (తత్త్వశాస్త్ర అధ్యాపిక) నిర్వహించిన సభా స్వాగతంతో కార్యక్రమం శుభారంభమైంది.

వేదవిద్యార్థుల వేద ప్రార్థనల తరువాత ఋగ్వేద విద్యార్థి చి॥ ఎమ్. శ్రీకాంతా చార్యులు, యజుర్వేద విద్యార్థి చి॥ సిహెచ్. యాదగిరి పాడిన

**జగద్గురువుకు జయం జయం**
**గీతాజ్యోతికి శుభం, జయం**
**జగతికి గీతాజ్యోతి నిచ్చిన**
**జీయర్‌స్వామికి జయం జయం.**
**చిన్న జీయర్‌స్వామికి జయం జయం...**

అంటూ యాత్రా విశేషాలను, గీతాజ్యోతి లక్ష్యాలను వివరించే పాట శ్రోతలను ఎంతో ఆకట్టుకుంది. శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణ మాచార్యులుగారు (అధర్వవేద పండితులు) సభా నిర్వహణలో కార్యక్రమం ఆసక్తికరంగా సాగింది. మానససరోవర-కైలాసయాత్రా విశేషాలు వారు కళ్ళకు కట్టినట్లు వివరించారు. శ్రీస్వామి వారితోపాటు యాత్రలో పాల్గొన్న మరికొందరు శ్రీమాన్ పాపారాయుడు (అనపర్తి), శ్రీమాన్ విశాల్‌గుప్త (రాజా), శ్రీమతి ఎమ్. సంధ్యారాణి (ఏలూరు),శ్రీమాన్ PSN రాజు(విజయనగరం), ప్రభృతులు వారి యాత్రా అనుభవాలను ఎంతో చక్కగా వివరించారు.

టి.టి.డి చైర్మన్ శ్రీమాన్ చలపతిరావు గారు యత్రా వి.సి.డిని కరతాళధ్వనులు మార్మోగు తుండగా ఆవిష్కరించారు. యాత్రా విశేషాలను, వివరాలను తెలియ జేయడంతోపాటు చారిత్రకంగా, పౌరాణికంగా కూడ మానస-కైలాస చరిత్రలను తెలిపే పుస్తకాన్ని జెట్-చైర్మన్ శ్రీమాన్ జె. రామేశ్వరరావు ఆవిష్కరించారు.

అదే సమయంలో శ్రీస్వామివారు అనుగ్రహించిన 'గీతాజ్యోతి' సందేశాల ప్రవచనం ఆడియో సి.డిలను శ్రీమాన్ గంగ రాజు, శ్రీమాన్ మురళీకృష్ణంరాజు ('మా' టివి అధినేత), శ్రీమతి చిత్రామాధవన్ (యు.ఎస్.ఎ జెట్ కార్యదర్శి) మొ॥గు వారు ఆవిష్కరించారు.





శ్రీమాన్ చలపతిరావు మాట్లాడుతూ, 'నేను శ్రీస్వామివారి భక్తుడిని. శ్రీస్వామివారు ఆధ్యాత్మిక, సామాజిక సేవా సమన్వయంతో నిర్వహించే కార్యక్రమాలు చాలామంది స్వాములకు ఆదర్శవంతమైనవి అని, 'సామాజిక స్పృహ' పరిపూర్ణంగా ఉన్న ఆధ్యాత్మిక గురువుల వల్లే ప్రజలలో ధార్మిక ప్రవర్తన వెల్లి విరిస్తుందని, అలా శ్రీస్వామివారు మాత్రమే ధార్మిక చైతన్యాన్ని తీసుకు రాగలరని కొనియాడారు. "శ్రీస్వామివారి కార్యక్రమాలకు అన్ని విధాల, నా సహాయ సహకారాలు ఉంటాయని" కరతాళధ్వనులు మధ్య చెప్పారు.

శ్రీమాన్ జె. రామేశ్వరరావు మాట్లాడుతూ ఈ వి.సి.డి, పుస్తకాలు భగవద్గీతలా ప్రతి ఇంటా ఉండదగినవిగా వివరించారు.

శ్రీమాన్ కామిశెట్టి శ్రీనివాసులు (అన్నమాచార్య మిషన్)వారు మాట్లాడుతూ... ఈ వి.సి.డిలో వ్యాఖ్యానం (తెలుగు) చేయడం నా అదృష్టమని, ఈ యాత్ర, యాత్రగా కాకుండా ఒక సందేశంలా రూపుదిద్దుకుందని, తప్పక అందరూ కొని చూడదగిన దృశ్య కావ్యమని అన్నారు. శ్రీమాన్ ఎమ్.సి దాసుగారు (విజయ వాడ) మాట్లాడుతూ వి.సి.డి ని చూస్తుంటే మనం కూడ శ్రీస్వామివారి వెంట యాత్రను చేస్తున్నట్లే ఉంటుందని, యాత్రగ వెళ్ళదలచిన వారికి తగినంత సమాచారం దీనిలో ఉందని, దీనిలో ఇంగ్లీస్ కామెంట్రీ చెప్పే ఛాన్స్ రావడం, శ్రీవారి అనుగ్రహమని ప్రశంసించారు.

ప్రముఖులందరూ తమ తమ అభిప్రాయాలను ఎంతో చక్కగా వివరించారు. చివరగా శ్రీస్వామివారు అనుగ్రహభాషణం చేస్తూ మా గీతాజ్యోతి ప్రచారంలో ఒక భాగమని, మేము 'గీతాజ్యోతి'ని మన వైదిక సంప్రదాయం యొక్క సమగ్ర పరిరక్షణకోసం ప్రారంభించామని, 'ధర్మప్రచారం' చేయవలసిన వారు సహకరించకపోయినా, వాగ్దానాలను చేసిన పాలకులు వాటిని నెరవేర్చుకోలేక పోయినా ఈ ధార్మిక ఉద్యమం ఆగదని 'కరతాళరవాల మధ్య శ్రీస్వామివారు ప్రవచించారు.

**ఈ 'గీతాజ్యోతి' దిగ్విజయంగా, ఆశయాలకు అనుగుణంగా జరిగి తీరుతుందని, అలా జరిపించగలరనే విశ్వాసం వికాసతరంగిణి కార్యకర్తల మీద, 'గీతాజ్యోతి' సక్రమంగా ఆచరించగలరనే విశ్వాసం భక్తులపైన పరిపూర్ణంగా ఉన్నాయని శ్రీస్వామివారు గట్టిగా చెప్పారు. శ్రీస్వామివారి ప్రవచనం, మార్దవం, గాంభీర్యం కలబోసుకుని సందేశాత్మకంగా సాగింది.**

వేదికపై ప్రముఖులకు, యాత్రలో పాల్గొన్న వారికి, యాత్ర వి.సి.డి పుస్తకములను తయార్ చేయడంలో శ్రమించిన **శ్రీమాన్ కృష్ణగారికి** (కంప్యూటర్స్), యాత్రను ఆద్యంతం ఎంతోహృద్యంగా వీడియో తీసిన **శ్రీమాన్ పి. వెంకటాచార్యులు (రామానుజవాణి)** వారికి యాత్రను అన్ని విధాల జాగ్రత్తలతో నడిపించే సారథ్యం వహించిన **శ్రీమాన్ గుదిమెళ్ళ వేణుగోపాలాచార్యులగారికి** శ్రీస్వామివారు మెమెంటోలను అందజేశారు.

ఈ బహుమతి ప్రదానాలను శ్రీమాన్ వెంకటాచార్యులు,వారికార్యాలయ పరివారము ఎంతో సక్రమంగా నిర్వహించారు.

వచ్చిన అతిధులను మర్యాద పూర్వకంగా ఆదరించడంలో మన వేద విద్యార్థులు, తత్త్వకళాశాల విద్యార్థులు ఎంతో చక్కని సేవా భావాన్ని ప్రదర్శించారు. అందరి నిర్వహణలో, అందరూ ఎన్నాళ్ళుగానో ఎదురు చూస్తున్న కార్యక్రమం ఎంతో ఆనందోత్సాహాలతో జరిగింది.

ఇదే సమయంలో హైదరాబాద్ జెట్‌లో గూడ ఈ VCDని శ్రీమాన్ P.V.R.K ప్రసాద్ IAS గారి ద్వారా ఆవిష్కరింప చేయడం విశేషం. శ్రీమతి J. శ్రీకుమారిగారి అధ్యక్షతన ఈ కార్యక్రమం నిర్వహించారు. KCL, M.D., శ్రీమాన్ వెంకటేశ్వర్లు, శ్రీమాన్ రఘునాథాచార్యులు కూడా విచ్చేసి శోభను కలిగించారు.

ఈ కార్యక్రమంలోనే గీతాజ్యోతి శ్లోకమాలికలోని 24 శ్లోకములకు శ్రీస్వామివారుఅనుగ్రహించిన వ్యాఖ్యానముతో హిందీ, తెలుగు భాషలలో ముద్రించి ఆవిష్కరించడం జరిగింది. శ్రీమాన్ వేమూరి రాధాకృష్ణమూర్తిగారు హిందీ అనువాదం చేసినారు. న్యాయవాది శ్రీమాన్ మదన్ మోహన్‌రావుగారు, D.G. Shaw Securities, Deccan. Inst. of Gems & Jewellary, T.V. Needs వారి సౌజన్యంతో ఈ గ్రంథములు ముద్రించడం జరిగింది. వారికి కృతజ్ఞతాపూర్వకంగా జ్ఞాపికలు అందించడంతో కార్యక్రమం సుసంపన్నమయింది.

## పండిత సభలు

పరమహంస పరివ్రాజకులు, ఉభయ వేదాంత ప్రవర్తకాచార్యులు శ్రీశ్రీశ్రీ మన పెద్దజీయర్‌స్వామి వారు శ్రీ.ఉ.వే. శ్రీమాన్ గోపాలాచార్య స్వామివారితో కలసి ఉభయ వేదాంతాచార్య పీఠమును స్థాపించి సంప్రదాయ ప్రచారం కావిస్తూండేవారు. మన సమాజాన్ని సన్మార్గంలో నడిపించాలి అన్న ఆశయంతో ప్రారంభమైన ఈ పీఠం ద్వారా 40 సం॥ల క్రితం మొట్టమొదటి సారిగా విజయవాడ నగరంలో పండిత సభలు నిర్వహించడం జరిగింది. రాష్ట్రం మొత్తం మీద ఉండే పండితులు అందరూ విచ్చేసేవారు. అలా ప్రారంభమైన ఉభయవేదాంత సభలు, ప్రతీ సం॥ము దసరా మహోత్సవ సమయంలో జరగాలని శ్రీ పెద్దజీయర్‌స్వామి వారి నిర్ణయం.

ఆనాటి నుండి పండిత సభలు వరంగల్, కరీంనగర్, విజయనగరం వంటి పలుచోట్ల జరిగినా విజయవాడ సభలు ప్రసిద్ధిచెంది నిరాటంకంగా కొనసాగుతున్నాయి.

ఉభయ వేదాంతాలు అంటే సంస్కృత వేదాంతం, ద్రావిడ వేదాంతం అని అర్థము. వేదాలలో చివరిది, వేదాలయొక్క సారం, మన సాధించాల్సిన లక్ష్యమేమిటో అందించేది వేదాంతము. మన స్వరూప సాధన సంపత్తిని అందించేది వేదాంతం. అది ఒకటే. దానిని అందించే భాషలు సంస్కృత, ద్రావిడాలు రెండు. భాష ఏదైనా మనకి అందించే లక్ష్యం ఒక్కటే. మనకి కళ్ళు రెండు ఉన్నా, వస్తువులు కూడా రెండు కనబడకూడదు కదా! రెండు కళ్ళతో చూసే లక్ష్యం ఒక్కటే. అలాగే ఉభయ భాషామయ వేదాంతాలు అందించే తత్త్వం ఒక్కటే.

సంస్కృత భాషలోనే వేదాలు, ఉపనిషత్తులు ఉన్నాయి. అవి ఋషి పరంపర ద్వారా మనకి అందుతూనే ఉన్నాయి ఈనాటిదాకా. అయితే అవి తెలుసుకొని అర్థం చేసుకొనే శక్తి, అవకాశం అందరికీ ఉండవు కదా! ఆ ఉపనిషత్తులకి వ్యాఖ్యాన రూపంగా వేద వ్యాసులవారు బ్రహ్మసూత్రాలు వ్రాసారు. వాటికి అనేక వ్యాఖ్యానాలు ఉన్నాయి. ఇవన్నీ సంస్కృత వేదాంతం. ఇక ఆ ఉపనిషత్తులలో ప్రతిపాదించబడిన భగవత్తత్వాన్ని అనుభవించి, ఆ ఆనందాన్ని పాశురాలుగా, ద్రావిడ ప్రబంధాలుగా అందించారు ఆళ్వార్లు. వాటికీ అనేక వ్యాఖ్యానాలు ఉన్నాయి. ఇవన్నీ ద్రావిడ వేదాంతం.





ఇలా మనంకందిన సంస్కృత వేదాంతం ఉదయం పూట, ద్రావిడ వేదాంతం సాయంత్రం పూట పెద్దల ద్వారా శ్రవణం చేసే అవకాశం భక్తులందరికీ ఈ సభలద్వారా లభించింది. ఈ సభలను ఈ సంవత్సరం శ్రీశ్రీశ్రీ చిన్న జీయరుస్వామివారి నేతృత్వంలో సీతానగరంలో అక్టోబర్ 9 నుండి 12 వరకు నిర్వహించారు. మహామహోపాధ్యాయ శ్రీ ఉ.వే. శ్రీమాన్ న.చ. రఘునాథాచార్యస్వామి వారి అధ్యక్షతన సుమారు 33 మంది పండితులు ఈ సభలలో తమ ప్రవచనముల నందించారు.

**వేదానాం సామవేదోఽస్మి** అని స్వయంగా భగవంతుడే చెప్పాడు. అలాంటి సామవేదానికి శిరస్థానీయము "ఛాందోగ్యోపనిషత్". ఆ ఉపనిషత్‌ను గురించి, అది అందించే బ్రహ్మవిద్యలను గూర్చి ఉదయ సభలలో వివరించారు. ఇక మధ్యాహ్నపు సభలలో నమ్మాళ్వార్లనుగ్రహించిన తిరువాయ్‌మొజిలోని 4వ శతకం భగవంతునికి చెందినవైతేనే సంపద మంచి సంపద అవుతుందని లేకపోతే ఆపదలకికారణమవుతుందనే సారాన్ని అందించారు. ప్రతి సంవత్సరంలానే శ్రీమాన్ అయితం రాజుగారు రూ.20,000/- సమర్పించి శ్రీశ్రీశ్రీ స్వామివారి మంగళాశాసనములు అందుకున్నారు.

## శమీపూజా మహోత్సవము

ఆశ్వీయుజ మాసారంభం వచ్చే నవరాత్రికి శరన్నవరాత్రి అని పేరు. ఈ తొమ్మిది రోజులు అమ్మని ఒక్కొక్క రూపంలో అలంకరించి, పూజిస్తారు. స్వామి చాతుర్మాస్య దీక్షలో ఈ నాలుగు నెలలు యోగనిద్రలో వేంచేసి ఉండడం చేత సృష్టి రక్షణా బాధ్యత అమ్మ వహిస్తుంది. కనుక ఈ నాలుగు నెలలు వారి వారి కోరికలను తెలుపుతూ ఆయా రూపాలలో, ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి, సంతానలక్ష్మిగా.... ఆమెను పూజిస్తారు. ముఖ్యంగా ఈ తొమ్మిదిరోజులు వివిధ రూపాలలో పూజించిన తరువాత పదవరోజు 'శమీ'పూజ చేస్తారు. 'శమీ' వృక్షరూపంలో లక్ష్మీదేవి వేంచేసి ఉంటుంది. శమీ శమింప చేయునది అని అర్థము. తననారాధించిన వారి పాపములను, దుఃఖములను తొలగించును.

"శమీ శమయతే పాపం శమీలోహిత కంటకా
ధారిణ్యర్జున బాణానాం రామస్య ప్రియవాదినీ"

అనే శ్లోకాన్ని పఠించి, లిఖించి ఆ వృక్షములో ఉన్న అమ్మకి సమర్పిస్తారు. ఆ శమీ పత్రాలను ఆత్మీయులందరితో పంచుకొంటారు. మన ఆశ్రమంలో ఈ నెల 15న ఈ పూజా మహోత్సవం అత్యంత వైభవంగా జరిగింది.

సాయంత్రం 5 గం॥ వరకు కుమారి రాగమయూరి (గుంటూరు) గాత్రకచేరీ జరిగింది. అనంతరం వేద విద్యార్థులు, అధ్యాపక శిక్షణార్థులు, భజన, సంకీర్తనలు చేసారు. తత్త్వ విద్యార్థిని కుమారి గీత శ్రీశ్రీశ్రీ స్వామివారికి నృత్యాంజలిని సమర్పించింది. శ్రీశ్రీశ్రీ స్వామివారు కుమారి రాగమయూరి బృందానికి, విద్యార్థులందరికీ మంగళాశాసనాలు కావించారు. విష్ణు సహస్రనామ పారాయణ అనంతరం శ్రీ ఉ.వే. శ్రీమాన్ నేపాల్ కృష్ణమాచార్యులుగారు విజయదశమి వైభవాన్ని , నేపల్ ప్రజలు జరుపుకొనే కొన్ని విశేష ఆచారాలని వివరించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు శమీ వైశిష్ట్యాన్ని ప్రవచిస్తుండగా, ఆగమ కళాశాల ప్రధానోపాధ్యాయులు శ్రీమాన్ మధుసూధనాచార్యులు విష్వక్సేన, పుణ్యాహవాచనాలు శమీ పూజా

నిర్వహించారు. శమీ వృక్షంపై దాచిన ధనుర్బాణాలను విద్యార్థులు అన్ని దిక్కులకు ప్రయోగించారు. చివరగా శమీ ప్రార్థనా శ్లోకాలను శ్రీ స్వామివారను గ్రహిస్తుండగా వ్రాసి భక్తులు శమీ వృక్షం వద్ద సమర్పించి, తీర్థ ప్రసాదాలను స్వీకరించడంతో ఉత్సవం సంపూర్ణమైంది.

## మహా ద్వార ఉద్ఘాటన, నూతన తదీయారాధనశాలా ప్రవేశం

అక్టోబరు 16వ తేదీ ఉదయం మన ఆశ్రమంలో నూతనంగా నిర్మించిన పశ్చిమ మహా ద్వార ఉద్ఘాటనము, నూతన తదీయారాధన శాలా ప్రవేశము వైభవముగా జరిగినవి.

సుమారు 7 గం॥లకు మన ఆగమ విద్యార్థులు చేయవలసిన వైదిక పూర్వరంగ మంతా సిద్ధం చేసారు. తీర్థగోష్టి అనంతరం శ్రీశ్రీశ్రీ స్వామివారు పెరుమాళ్ళతో కారులో బయలుదేరి నూతనద్వారం వద్దకి వేంచేసారు. అప్పటికే భక్తులంతా ద్వారానికి లోపలివైపు స్వాగతించడానికి బారులు తీరి సిద్ధంగా ఉన్నారు. ఆనాటి కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన గుంటూరు జిల్లా పరిషత్ ఛైర్మన్ శ్రీమాన్ పాతూరి నాగభూషణం రిబ్బన్ కత్తిరించి ఉద్ఘాటన చేసారు.

వత్సతో సహా గోమాత ముందు నడవగా వెనుక పెరుమాళ్‌ని అనుసరించి శ్రీస్వామి వారు పరివారంతో లోపలికి ప్రవేశించారు.

గోశాల ప్రారంభించి తరువాత పశువుల నిమిత్తం శ్రీమాన్ సుంకర సుబ్బారావు, పటమట, విజయవాడ వారి కైంకర్యమైన గ్రాస్ కటింగ్ మిషన్‌ని ప్రారంభించారు. నూతన తదీయారాధనశాలలో గోమాత వెళ్ళాక పెరుమాళ్‌ని వేంచేపు చేసి నామ సంకీర్తన చేస్తూ భక్తులు ప్రవేశించారు. అక్కడ జరిగిన కార్యక్రమంలో శ్రీమాన్ నాగభూషణం మాట్లాడుతూ ఆశ్రమం గురించి, దాన్ని జాగ్రత్తగా ఉంచుకోవల్సిన అవసరం గురించి చెబుతూ రాబోయే కృష్ణ పుష్కరాల సందర్భంగా కావాలసిన ఏర్పాట్లను తన పరిధిలో చేయడానికి సంసిద్ధతను వ్యక్తం చేసారు.

గతంలో సీతానగరం రోడ్ విషయమై శ్రీస్వామివారు ఆజ్ఞాపించారని, సరిగ్గా ఆ సమయంలోనే దానికి కావలసిన నిధులు శాంక్షన్ అయ్యాయని, ఆనందంతో 10 లక్షలు కేటాయించి పని పూర్తి చేసామని, ఆశ్రమం ముందు రోడ్‌ని కూడా సి.సి. రోడ్‌గా మారుస్తామన్నారు. ఇకనుండి ఆశ్రమంలో సభ్యుడిగా తనను భావించమని, ఉత్సాహాన్ని, ఆసక్తిని ప్రదర్శించారు.

మన జెట్ కార్యదర్శి శ్రీమాన్ గంగరాజు మాట్లాడుతూ శ్రీమాన్ నాగభూషణం మిగిలిన రాజకీయ నాయకుల్లా వాగ్దానాలతో ఆగిపోక చొరవ తీసుకొని రోడ్ నిర్మాణం చేపట్టినందుకు అభినందనలు తెలిపారు. శ్రీ స్వామీజీ చేసే ఏ సంకల్పాన్నైనా నెరవేర్చేందుకు తామెప్పుడూ సంసిద్ధంగా ఉంటామన్నారు. రోడ్ నిర్మాణానికి నేషనల్ హైవే సివిల్ ఇంజినీరైన శ్రీమాన్ ప్రభాకరరావు ప్రేరకంగా నిలిచారు. శ్రీమాన్ ఎమ్.సి. గాంధీ కూడా కార్యక్రమంలో పాల్గొని మంగళా శాసనములు తీసుకున్నారు.

పటమట శ్రీమతి సీతమ్మగారి ప్రేరణ ద్వారా ఎందరో కైంకర్య దాతలు ఈ ద్వారనిర్మాణానికి ఆర్థిక వనరులను సమకూర్చారు.

నూతనంగా తదీయారాధన కోసం కుటీరాన్ని నిర్మించడంలో ఉన్న ఆశయాన్ని తదీయారాధన వైభవాన్ని శ్రీస్వామివారు ప్రవచించారు. ఈ శాలను చాలా కొద్దికాలంలో





జయప్రదంగా నిర్మాణం చేసారు. దీని నిర్మాణానికి వివిధ రూపాల్లో కైంకర్యాన్ని సమర్పించిన భక్తులకు శ్రీ స్వామివారు మంగళాశాసనములు చేసారు. అప్పటికే శ్రీమాన్ మధుసూధనాచార్యులు నేతృత్వంలో వాస్తు శాంతి జరిగి పూర్ణాహుతి చేసి ఆ తీర్థాన్ని అందరిపై ప్రోక్షించారు. శ్రీమాన్ మురళీకృష్ణమాచార్యులు నూతన తదీయరాధన కుటీరాన్ని 'పాక'యాగశాలగా అభివర్ణించారు. ద్వారాన్ని ద్వార పాలకులని సేవించి మందిరంలో ప్రవేశిస్తే లభించేదే ప్రసాదమని, దానికిది నిలయమని ఆనాటి కార్యక్రమాన్ని అభివర్ణించారు. అనంతరం ఆ కుటీరాన్ని రూపు దిద్దిన నడిగడ్డపాలెం మేస్త్రులను శ్రీ స్వామివారు మంగళాశాసనములు చేసారు.

శ్రీస్వామివారి మనోభావాలని కార్య రూపంలో మలచిన **శ్రీమాన్ వేంకటాచార్య స్వామి** శ్రీస్వామివారి నుండి మంగళా శాసనములు పొందారు. తీర్థగోష్ఠి తరువాత ప్రసాద వితరణతో కార్యక్రమం సంపన్నమైనది.

## 10 గిరిజన పాఠశాలల అధ్యాపకుల శిక్షణశిబిరం

ఈ నెలలో అధ్యాపక శిక్షార్థులకి శ్రీమాన్ **వెంకటప్పయ్య** "ఆక్యుప్రెషర్"వైద్య విధానాన్ని గూర్చి పరిచయం కావించారు. 16వ తేదీన ఉదయం శ్రీమాన్ డా॥ మరీచి కైరో థెరపీని గూర్చి పరిచయం కావించారు. తిరిగి 26,27 తేదీలలో శ్రీమాన్ **పావులూరి కృష్ణచైదరి** 'హోమియో వైద్యవిధానం' గూర్చి క్లాసులు నిర్వహించారు.

## "ఎందుకు" అనే అంశంపై క్లాసులు

**మన వివిధ వేదశాఖలనభ్యసించే విద్యార్థులు సుమారు 160 మంది వివిధ బ్రాంచ్‌లనుండి రావడంతో సీతానగరం ఆశ్రమంలో ఆహ్లాదకర వాతావరణం ఏర్పడింది. ఋషీకేశ్, వేళ్ళచెర్వు, నడిగడ్డపాలెం, రాజమండ్రి, సోమశిల, నర్సింహులకొండ, కల్లూరు, శ్రీరంగం, జగ్గయ్యపేటల నుండి వేద, ఆగమ, దివ్య ప్రబంధాలని ఆధ్యయనం చేస్తున్న విద్యార్థులు అధ్యాపకులు అందరూ వచ్చారు. విద్యార్థులందరికీ స్తోత్రపాఠాలలో, వేద, ఆగమ, దివ్య ప్రబంధాలలో పరీక్షలు నిర్వహిస్తున్నారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు ప్రతీరోజు 8.30గం॥ నుండి 9-30 వరకు విద్యార్థులందరికీ అవగాహన క్లాస్‌ను తీసుకుంటారు.**

## పశ్చిమ గోదావరి జిల్లా

### ఏలూరు

పశ్చిమగోదావరి జిల్లా, ఏలూరు ధర్మక్షేత్రం కేంద్రముగ శ్రీ భారతి రెసిడెన్సియల్ స్కూలునందు 27-10-02న 1400మంది హైస్కూలు విద్యార్థులకు దంత రక్షణ అవగాహన సదస్సు జరిగినది. వీరికి ఉచితంగ పేస్టులు, బ్రష్‌లు పంపిణీ చేయడం జరిగింది. 30-10-02న నలంద రెసిడెన్సియల్ హైస్కూలునందు 450మంది విద్యార్థులకు గీతాజ్యోతి శ్లోకాల పోటీ పరీక్షలు నిర్వహించి, అందులో ప్రథమ బహుమతి వచ్చిన వారికి భగవద్గీత పుస్తకములు పంపిణీ చేసారు.

శ్రీమాన్ డాక్టర్. రాయం చంద్రశేఖర్, డెంటల్ ఎడ్యుకేషన్ యొక్క ఆవశ్యకతను వివరించారు. శ్రీమాన్ డా॥ పార్ధసారథి గారు గీతాజ్యోతి వైభవమును గురించి చెప్పారు. కాకులపాడు గ్రామంలో 184మంది విద్యార్థులకు దంతవైద్యపరీక్షలు సాయంత్రం హనుమాన్‌జంక్షన్ లోని అప్పన వీడు హైస్కూలులో 70మంది పిల్లలకు దంత అవగాహన సదస్సు నిర్వహించారు.

గంగన్నగూడం, పదకడియ, హనుమాన్ జంక్షన్, కొక్కిరిపాడు, తేలప్రోలు మొదలైన గ్రామాలలో 1970మంది విద్యార్థులకు హనుమాన్‌జంక్షన్‌యందు జ్యోతిక్యాడ్రాల్ హైస్కూలు నందు వాసవీక్లబ్ వారి ఆర్థిక సహాయంతో కార్యక్రమం నిర్వహించడం జరిగింది.

## కరీంనగర్ జిల్లా

### విద్యానగర్

వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో శ్రీమాన్ యాదయ్యగౌడగారి సౌజన్యంతో శివజ్యోతి కళ్యాణమండపంలో సామూహిక శ్రీకృష్ణపూజలు, బాలమేథావి చి॥గుదిమెళ్ళ కళ్యాణ రామస్వరూప్‌చే భగవద్గీత అష్టావ ధానం సెప్టెంబర్ 1వతేదీన వైభవంగా జరిగాయి. జిల్లా సమన్వయ కమిటీ అధ్యక్షులు శ్రీమాన్ గౌతంరావు అధ్యక్షతన వివిధగ్రామాలనుండి తరలివచ్చిన వికాస తరంగణి కార్యకర్తలను సమావేశపరచి జిల్లాలో జరుగుతున్న ప్రచార కార్యక్రమాన్ని సమీక్షించారు.

### సుల్తానాబాద్

జిల్లా సమన్వయ కమిటీ సమకూర్చిన గీతాజ్యోతి రథం, ప్రచారసామగ్రి ద్వారా సుల్తానాబాద్, పెద్దపల్లి, ఓదెల, కాల్వ శ్రీరాంపూర్ మండలాలలో ప్రచారం చేస్తున్నారు. ఇప్పటివరకు 100 గ్రామ కమిటీలు ఏర్పాటుచేసారు. స్కూలు పిల్లలకోసం చిత్రలేఖనశ్లోకమానికలు 3000 ముద్రించి వివిధ పాఠశాలలో అందించారు. ఇంకా ముత్తారం, మరహర్‌రావు మండలా లలో ప్రచారం చేయవలసి ఉంది.

### మెట్‌పల్లి

కరీంనగర్ జిల్లా మెట్‌పల్లి వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యంలో గీతాజ్యోతి కార్యక్రమం చేపట్టి అందరికి గీతాజ్యోతి కార్యక్రమం, ఆధ్యాత్మిక కార్యక్రమాలు, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

### గోదావరి ఖని

కరీంనగర్ జిల్లా గోదావరిఖని ధర్మక్షేత్రం కేంద్రముగ చిత్రభాను ఉగాది నుండి గీతాజ్యోతి కార్యక్రమం స్థానిక కోదండరామా యలయంలో ప్రారంభించినారు. 4 మండలాలలోని మొత్తం 108 గ్రామాలలో ప్రచారంచేయడం జరిగింది. గ్రామ గ్రామానికి కృష్ణపూజా కార్యక్రమములు నిర్వహించడం జరిగింది. స్వీయ ఆరాధన- సర్వ ఆదరణ గురించి, మాధవ సేవగ సర్వప్రాణిసేవ అందరికీ వివరించడం జరిగింది. స్థానిక శ్రీ వేంకటేశ్వర ఆలయంలో 20రోజుల పాటు ఉచిత అయిస్కాంత చికిత్స శిబిరం నిర్వహించడం జరిగింది. పశువైద్య శిబిరం, ఆరోగ్య శిబిరం రెండవ విడత కార్యక్రమంగ చేయుట సంకల్పించు చున్నారు. కార్యక్రమంలో ధర్మక్షేత్రం కన్వీనర్ శ్రీమాన్ ఎన్. రామమోహన్‌రావు, శ్రీమతి గిరిజా, డా॥ ఆగమరావు, శ్రీమాన్ ఎన్ శ్యామసుందరరావు పాల్గొన్నారు.

### విద్యానగర్ :

కరీంనగర్ పట్టణంలో విద్యానగర్ వికాసతరంగిణిశాఖ ఆధ్వర్యంలో ప్రతి శుక్రవారం ఒకరియింటిలో విష్ణు సహస్రనామ పారాయణం చేయడం ద్వార సుమారు 50 మంది గీతాజ్యోతి కార్యక్రమంలో పాల్గొనే విధంగ చేయడం జరుగుతుంది. శని, ఆదివారాలలో 100 మంది విద్యార్థులకు గీతాజ్యోతి శ్లోకమాలికలు నేర్పించడం జరుగుతుంది. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ కృష్ణమాచార్యులు, శ్రీమాన్ వెంకట నరసింహాచార్యులు, శ్రీమాన్ దోమ ప్రతాపరెడ్డి ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.

## వరంగల్ జిల్లా

### బొమ్మకల్లు

వికాస తరంగిణి ఆధ్వర్యంలో నెల్లికుదురు, తుర్రూరు, కొడకండ్ల, దేవరువాడ, పాలకుర్తి





మండలాల్లో శ్లోకమాలికలు, భగవద్గీతలను పంచుతూ ప్రచారం సాగిస్తున్నారు. 108 గ్రామాలలో లక్ష్మీనారాయణ పూజలు జరుపుతూ వారికి గీతాజ్యోతి ఆశయాలను వివరిస్తున్నారు.

### జనగామ

ఈ శాఖ సభ్యులు చాలా చురుకుగా కార్యక్రమాలను చేపట్టి విజయవంతంగా ముగించుచున్నారు. తేది : 1-10-02 వనపర్తి గ్రామములో ఉచిత పశువైద్యశిబిరములో 165 పశువులకు ఉచిత చికిత్స సుమారు 10,000/- రూ॥ల విలువగల మందుల పంపిణీ చేసినారు. ఇదే రోజు రక్తదాన శిబిరము నిర్వహించి 101 యూనిట్ల రక్తం సేకరించినారు.

2 అక్టోబర్-2న గాంధీజయంతి పురస్కరించుకొని ఖైదీలకు గ్లాసులు, పళ్ళెములు, ఫ్యాన్లు, టి.వి. మైక్ సెట్, ఉచితముగా ప్రధానం చేసి, ఖైదీలందరిచేత గీతాజ్యోతి శ్లోకాలను పారాయణం చేయించినారు.

3 అక్టోబర్ జనగామలో ఉచిత పశువైద్య శిబిరము లయన్స్ క్లబ్ జనగామ వారి సహకారముతో ఏర్పాటు చేసిన 272 పశువులకు చికిత్స చేసి రూ. 20,000/- విలువగల మందులు ఉచితముగా పంపిణీ చేసినారు. ఈ కార్యక్రమానికి మార్కెట్ కమిటి ఛైర్మన్ జి. ప్రేమలతారెడ్డిగారు ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు.

అక్టోబర్ 9న, మండల కేంద్రం అయిన లింగాల ఘణపురం గ్రామమునందు ఉచిత పశువైద్యశిబిరము నిర్వహించి 155 పశువులకు చికిత్స చేసి 10,000/- రూ. విలువగల మందుల పంపిణీ చేసినారు. 19 అక్టోబర్‌న గానుగ పహాడ్ గ్రామంలో పశువైద్యశిబిరం నిర్వహించి 25,000/-రూ॥ల విలువచేసే మందులు ఇందులో పాల్గొన్న 350 పశువులకోసం పంపిణీ చేసినారు.

వికాసతరంగిణి జనగామ శాఖ ద్వారా నిర్వహించిన పై కార్యక్రమములలో స్థానిక లయన్స్ క్లబ్‌ల సభ్యులు, ధార్మిక యువజన, మహిళా సంఘాల సభ్యులు, వాణిజ్య సంస్థల ప్రతినిధులు, అధికారులు, అనధికార ప్రముఖులు, పాత్రికేయులు పాల్గొని సహాయ సహకారాలు అందించారు. వీరందరికీ శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళా శాసనాలు కృపచేసారు.

## నల్గొండ జిల్లా

### హుజూర్ నగర్

హుజూర్ నగర్ ధర్మక్షేత్రములో 50 గృహాలలో గీతాజ్యోతికార్యక్రమములో భాగముగా కృష్ణపూజలు, విష్ణుసహస్రనామ పారాయణస్తోత్రం, భగవద్గీతా ఉపన్యాసం జరిగినవి. ఇంకా కార్యక్రమాలు నిర్వహించిన గ్రామాల సంఖ్య 43 కృష్ణపూజలు, 35 గ్రామాలు గీతాజ్యోతి గోష్ఠులు నిర్వహించినారు.

### కోదాడ

కోదాడ ధర్మక్షేత్రపరిధిని 'సిరిపురం' గ్రామంలో గీతాజ్యోతి సందర్భముగా 'ఉచిత పశువైద్యశిబిరము' నిర్వహించబడింది. సిరిపురం గీతాజ్యోతి గోష్ఠి కన్వీనర్ శ్రీమాన్ వి. యాదగిరిగారు, వెటర్నరీ డాక్టర్ శ్రీమాన్ సంజీవరావుగారి సహకారంతో ఈ కార్యక్రమాన్ని నిర్వహించినారు. సిరిపురం SBH బ్రాంచిమేనేజరు గారు జ్యోతి ప్రజ్వలన కావించినారు. ఈ శిబిరంలో 700 గొర్రెలకు, 43 దూడలకు డి వార్మింగ్, 17 పశువులకు చికిత్స, 41 ఆవులు, గేదెలకు గైనిక్ పరీక్షలు 80 శాల్తీలకు గురకవ్యాధి టీకాలు, 40 పశువులకు గాలికుంటు టీకాలు ఇవ్వబడినవి.

శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి మంగళా శాసనములతో కోదాడ ధర్మక్షేత్ర పరిధిలో ఇప్పటివరకు 99 గ్రామాలలో గీతాజ్యోతి గోష్ఠులు ఏర్పాటు చేయుట జరిగినది. కోదాడ పట్టణంలోని 29 పాఠశాలలకు గీతాజ్యోతి సందేశము, 48

శ్లోకములు, చిత్రగీతలు అందించుట జరిగినది. ఇప్పటివరకు కోదాడ ధర్మక్షేత్ర పరిధిలో 1850 గీతాజ్యోతి శ్లోకమాలికలు, 550 హనుమధ్వజాలు, 75 మాధవసేవగా సర్వప్రాణి సేవ స్టిక్కర్లు, 110 స్వీయ ఆరాధన సర్వ ఆదరణ స్టిక్కర్లు, 375 హనుమస్టిక్కర్లు, 75 కృష్ణస్టిక్కర్లు, 5 వికాసతరంగిణి స్టిక్కర్లు, 900గీతాజ్యోతి కార్డ్స్, 200 కృష్ణపూజ, 18 భగవద్గీతమూలము, 5 మూలము & తాత్పర్యము, 9 ఆడియోక్యాసెట్లు, 65 చిత్రగీతలు భగవద్బంధువులకు అందించుట జరిగినది.

కోదాడ ధర్మక్షేత్ర గీతాజ్యోతి కార్యక్రమా నికి 20 మంది కార్యకర్తలు ఎక్కువ సమయమునిచ్చి ఉత్సాహముగా సేవలందిస్తున్నారు.

## నల్గొండ జిల్లాలో గీతాజ్యోతి కార్యక్రమ నివేదిక

గ్రామస్థుల సహకారముతో నల్లగొండ వికాసతరంగిణి కోశాధికారి శ్రీమతి యజ్ఞమాథ సుజాతగారితోకూడిన సభ్యులు గ్రామములను సందర్శించి, గీతాజ్యోతి కార్యక్రమం ఆవశ్యకతను, ఆచరించు విధానాన్ని వివరించి, శ్లోకమాలిక, హనుమ ధ్వజాలు, భగవద్గీతలు పంచుతున్నారు. 15 మండలములలో, 55 గ్రామాలు ప్రతి గ్రామములో 18 మందితో కూడిన భక్త బృందములతో గీతాపారాయణము జరుగుచున్నది. 4 పాఠశాలలలో గీతాజ్యోతి ప్రచారాన్ని సాగిస్తూ, గీతాజ్యోతి కార్యక్రమ విజయవంతం కావడానికి కృషి సల్పుతున్నారు.

## ఒరిస్సా

### భువనేశ్వర్

భువనేశ్వర్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో అక్టోబర్ 2న **ఉచిత రక్తదాన శిబిరం** గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా నిర్వహించ బడినది. సుమారు 40 మంది ఈ శిబిరంలో పాల్గొన్నారు. 10 మంది రక్తదానం చేసారు. వారందరికి గీతాజ్యోతి కార్యక్రమ ఆవశ్యకతను వివరించి ప్రసాదాన్ని పంచారు.

## వికాసతరంగిణి జంటనగరాల సమన్వయ కమిటి నివేదిక

గీతాజ్యోతి ప్రచారం ఈ నెల దేవాలయాలలో, కాలనీలలో, జైళ్ళల్లో ముమ్మరంగా సాగింది.

5-10-02న సాయంకాలం జెట్ భవనంలో 'మానస సరోవర-కైలాసయాత్ర' CD ఆవిష్కరణ అశేషభక్తజన సందోహంలో చాలా వైభవంగా జరిగింది. శ్రీస్వామివారి ఆదేశానుసారం సీతానగరంలో జరిగిన సమయంలోనే హైదరాబాద్‌లోకూడా జరపడం విశేషం. శ్రీమాన్ P.V.R.K. ప్రసాద్ I.A.S., గారు ముఖ్య అతిథిగా విచ్చేసారు. KCL, M.D., శ్రీమాన్ P. వెంకటేశ్వర్లు, శ్రీమాన్ రఘునాథాచార్యులు కూడా విచ్చేసి శోభను కలిగించారు. శ్రీస్వామివారి మంగళాశాసనాలతో ఈ కార్యక్రమం శోభాయమానంగా జరగటం అందరికీ ఆనందాన్ని కల్గించింది. మొదటి విడతగా పంపించిన 200 CDలు ఆరోజునే ఖర్చయిపోయాయి.

ఈ కార్యక్రమంలోనే గీతాజ్యోతి శ్లోకమాలికలోని 24 శ్లోకములకు శ్రీస్వామివారు అనుగ్రహించిన వ్యాఖ్యానము తో హిందీ, తెలుగు భాషలలో ముద్రించి ఆవిష్కరించడం జరిగింది. శ్రీమాన్ వేమూరి రాధాకృష్ణమూర్తిగారు హిందీ అనువాదం చేసినారు. న్యాయవాది శ్రీమాన్ మదన్ మోహన్‌రావుగారు, D.G. Shaw Securities, Deccan. Inst. of Gems & Jewellary, T.V. Needs వారి సౌజన్యం తో ఈ గ్రంథములు ముద్రించడం జరిగింది. వారికి కృతజ్ఞతాపూర్వకంగా జ్ఞాపికలు అందించడంతో కార్యక్రమం సుసంపన్న మయింది.

### వనస్థలిపురం శాఖ

ప్రచారరథాన్ని చక్కగా 6 రోజులపాటు ఉపయోగించుకొని రామయ్యనగర్, అమన్‌గల్





ప్రాంతాలలోని 15 కాలనీలలో ప్రచారం కావించి 2,200 కుటుంబాలకు గీతాజ్యోతి సందేశాన్ని అందజేసారు. దీనితో ఇప్పటివరకు 14,000 కుటుంబాలకు ఈ కార్యక్రమాన్ని అందించినట్లైంది. శరన్నవరాత్రు లలో అనేక దేవాలయాల్ని సందర్శించి గీతాజ్యోతి ప్రచారం కావించారు. ఈ నెల 31వ, తేదీన పశువైద్య శిబిరం నిర్వహించనున్నారు.

### సికింద్రాబాద్ శాఖ

7 నుండి 12వ తేదీ అక్టోబర్ వరకు నిర్వహించిన సాంస్కృతిక శిబిరంలో 125 మంది బాలబాలికలు పాల్గొని వివిధ అంశాలను ఉత్సాహంగా నేర్చుకున్నారు. యోగ, గీతాజ్యోతి శ్లోకాల పఠనం, వక్తృత్వం, చిత్రగీతలలో పోటీ నిర్వహించి విజేతలకు బహుమతి ప్రదానం చేశారు. ఈ సందర్భంగా లయన్స్ క్లబ్ సెక్రటరీ శ్రీమతి శ్రీలతగారి సౌజన్యంలో పిల్లలకు కంటి పరీక్ష దంత పరీక్ష మరియు సామాన్య పరీక్షలు జరిపి తగిన ఔషధాల నందించారు. శ్రీమతి శ్రీకుమారిగారు, శ్రీమాన్ కల్కి అవతారంగారు, శ్రీమాన్ పద్మనాభరావుగారు, ఈ కార్యక్రమంలో పాల్గొని పిల్లలకు తమ సందేశాన్నిచ్చారు.

రాజపేట గ్రామంలో నిర్వహించిన ఉచిత వైద్యశిబిరంలో Eye, Denatal, Gynic, E.N.T., Skin & Pediatric పరీక్షలు 1,150 మందికి వైద్యసేవలందించి వారంరోజులకు సరిపడే మందులను ఉచితంగా ఇచ్చారు. 25 మంది రక్తదానం చేశారు. 40మందికి కంటి ఆపరేషన్ చేయించారు. డా॥ రంగారెడ్డి (Lous Aub)గారు ఈ సందర్భంగా చక్కటి సేవలు అందించారు. ఇదే గ్రామంలో ఉచిత పశువైద్య శిబిరం కూడా నిర్వహించారు.

ఈ శాఖవారు ఈ నెలలో 16 స్కూళ్ళను, 11 ఆలయాలను సందర్శించి గీతాజ్యోతి కార్యక్రమాన్నందించారు.

### రామాంతపూర్ శాఖ

సెప్టెంబర్ 22న స్త్రీలకు, పిల్లలకు వైద్యశిబిరం నిర్వహించారు. స్త్రీలకు క్యాల్షియం, డయాబెటిస్ చెకప్ చేసారు. పిల్లలకు పోలియో చుక్కలు వేసి, డిఫ్తీరియా వాక్సిన్లు యిచ్చారు. సెప్టెంబర్ 30న బాలికల జువినైల్ హోమ్, అక్టోబర్ 4న సైదాబాద్‌లోని బాలుర జువినైల్ హోమ్, మరియు రిహాబిలిటేషన్ సెంటర్ ఫర్ స్ట్రీట్ చిల్డ్రన్‌ను సందర్శించి వారిచేత గీతాజ్యోతి శ్లోకాలను పఠనం చేయించారు. మిఠాయిలు, కోల్గేట్ టూత్ పేస్టులు పంచిపెట్టారు.

అక్టోబర్ 1,2 తేదీలలో 'సంతాన ధ్రువకల్పం' 5వ, నెల కార్యక్రమం జరిగింది. 2వ తేదీన జరిగిన కుటుంబ నియంత్రణ శిబిరంలో 30 మందికి ఉచితంగా కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించారు. చక్కని రీతిలో సేవలందిస్తున్న శ్రీమతి సుగుణ శ్రీనివాస్ మరియు సభ్యులు అభినంద నీయులు.

### అంబర్‌పేట శాఖ

శరన్నవరాత్రుల సందర్భంగా అనేక ఆలయాలలో పూజాకార్యక్రమాలు నిర్వహించారు. ప్రగతి విద్యాలయంలో 1400 మంది విద్యార్థులకు వైద్యపరీక్షలు జరిపే కార్యక్రమం నిశ్చయించారు.

### కవాడిగూడ శాఖ

పరిసరగ్రామాలలోని దేవాలయాల్లో గీతాజ్యోతి కార్యక్రమం జరిపి ప్రచార సామగ్రి అందించారు.

### సంతోష్ నగర్ శాఖ

సెప్టెంబర్ 26న గుఱ్ఱం గూడ గ్రామంలో పశువైద్యశిబిరాన్ని పెద్దఎత్తున నిర్వహించారు. 200 గొర్రెలకు, 168 మిగతా పశువులకు వైద్యసేవలు, 38 గోవులకు ప్రత్యేక గర్భకోశచికిత్స నిర్వహించారు. డా॥ రామచంద్రరావు, డా॥ వి.

రొరెడ్డి, డా॥ బాలకృష్ణ గార్లు మొదలగు 12 మంది వైద్యశేఖరులు విశేష సేవలందించారు. శ్రీమతి శ్రీకుమారిగారు, శ్రీమాన్ కల్కివతారంగారు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

సెప్టెంబర్ 25న గుజ్జంగూడ పాఠశాలలో కృష్ణపూజలు జరిపి గీతాజ్యోతి ప్రచారం చేశారు. 27న చంచల్‌గూడలో మహిళా మరియు పిల్లల కారాగారాల్ని సందర్శించి భజనలు, ప్రవచనాలు చెప్పి గీతాజ్యోతి కార్యక్రమాన్నందించారు. అందరికీ పండ్లు పంచారు, జైలు అధికారులు సంతోషించి తరచు ఇలాంటి కార్యక్రమాలు జరపాలని కోరారు. ఇంత చక్కటి కార్యక్రమాన్ని జరిపించిన శ్రీమతి అహల్యగారు అభినందనీయులు.

## మాసాబ్ టాంక్ శాఖ

సెప్టెంబర్ 29న వైద్యశిబిరం నిర్వహించారు. 200 మందికి డా॥ విజయలక్ష్మి (General), డా॥ ఫణికుమార్ (Eye), డా॥ అరవింద్ (Dental)గార్లు, తమ వైద్య సేవలందించారు. St. Ann School బాలికా నిలయంలో మరొక విడత గీతాజ్యోతి కార్యక్రమం నిర్వహించారు.

## తిరుమల బ్రహ్మోత్సవాలలో వికాసతరంగిణి సేవాకార్యక్రమాలు

7-10-2002 నుండి 15-10-2002 వరకు తిరుమలలో జరిగిన బ్రహ్మోత్సవాల సందర్భంగా వికాసతరంగిణి వివిధ శాఖల నుండి వచ్చిన 300 మంది 'శ్రీవారిసేవ'లో పాల్గొన్నారు. వీరికి శ్రీ యన్. నాగేంద్రశాయి, శ్రీమాన్ ప్రభాకరరావుగార్లు (వికాసతరంగిణి తిరుపతి శాఖ అధ్యక్షులు) నేతృత్వం వహించారు. శ్రీవారి సేవకులు హైదరాబాదు, తిరుపతి, కరీంనగర్, హన్మకొండ, విజయవాడ, రాజమండ్రి, భద్రాచలం, విజయనగరం, గుడివాడ, గుండవరం, నర్సీపట్నం, పిట్టలవారిపాలెం, జి.యన్.పాలెం, లింగారెడ్డిపాలెం, రామచంద్రాపురం, గోగులమూడి, విశాఖపట్నం, శాఖలనుండి వచ్చినారు. విద్యార్థి విభాగానికి శ్రీ కె. రమేష్, యస్. దామోదరం నేతృత్వం వహించారు.

వీరు రోజుకి 30 వేలమందికి, నిత్యాన్నదాన కాంప్లెక్స్‌లో వడ్డన చేసినారు. మొత్తం 2 లక్షల మందికి పైగా అన్నదాన సేవ చేసినారు. 100 మంది, వైకుంఠం రెండవ 'క్యూ' కాంప్లెక్స్‌లో పులిహోర ప్యాకెట్లు పంపిణీ చేసినారు. అంతేకాక, యాత్రికులను తనిఖీ చేసి, నిషిద్ధవస్తువులను (సిగరెట్టు, గుట్కా, సారాయి వగైరా) స్వాధీనం చేసుకొన్నారు. కొందరు తిరుపతి రైల్వేస్టేషన్‌లో 'May I help you' కౌంటర్‌లో యాత్రికులకు సమాచారంను అందించినారు. తిరుపతి శాఖకు చెందినవారు ప్రతిరోజు ఉదయం ఆస్థాన మండపంలో విష్ణుసహస్రనామస్తోత్ర పారాయణం చేసినారు.

తిరుమల J.E.O., శ్రీమాన్ P. బాలసుబ్రహ్మణ్యంగారు శ్రీవారి సేవకులకు సరిపడ వసతి, భోజనం, దర్శనం, లడ్లు, దుప్పట్లు, చాపలు వగైరాలు ప్రత్యేక శ్రద్ధతో ఏర్పాటు చేసినారు.

యాత్రికులు వికాసతరంగిణి సేవకు తృప్తిపడినారు. దేవస్థానం ఉన్నతాధికారులు, పత్రికలు వికాసతరంగిణి సేవలను ప్రశంసించినాయి.

## తిరుమలలో ద్రావిడ వేద వరుణ జపం

తిరుమలలో ఆస్థానమండపంలో అక్టోబరు, 2,3 తేదీలలో 'ద్రావిడ వేద వరుణ జపం' జరిగినది. అక్కడ వేంచేసి ఉండే పెద్దజీయరు స్వామివారు దీనిని ప్రారంభించి నారు. తిరుపతి చిన్నజీయర్ స్వామివారి నేతృత్వంలో ఈ సందర్భంగా, తిరుప్పావై 4వ పాశురం 'ఆళ్ళిమళైక్కణ్ణా' పారాయణం ఒక లక్షన్నర పర్యాయాలు జరిగినది.

ఈ పారాయణంలో, శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ జీయర్ స్వామివారి ఆదేశం మేరకు తిరుపతి వికాసతరంగిణి సభ్యులు శ్రీమాన్ యన్.





నాగేంద్రశాయి, నేతృత్వంలో భాగస్వాములైనారు. అర్చక స్వాములు, వేదపాఠశాల విద్యార్థులతో కలిసి, వికాసతరంగిణి సభ్యులు ఈ పారాయణంలో పాల్గొన్నారు. ప్రారంభ సమావేశంలో, ధర్మప్రచార పరిషత్ కార్యదర్శి శ్రీమాన్ హెచ్.యన్. బ్రహ్మానందంగారు మరియు శ్రీమాన్ రంగరాజన్ స్వామిగారు ఈ వరుణ జపం వైశిష్ట్యంను గురించి ప్రసంగించినారు.

పెద్దజీయర్‌స్వామివారు ముగింపు సమావేశంలో శ్రీమాన్ యన్. నాగేంద్ర శాయిని, శ్రీమాన్ రంగరాజన్‌స్వామిని శాలువాలతో సత్కరించినారు.

## ఇచ్ఛాపురం

శ్రీకాకుళం జిల్లా, ఇచ్ఛాపురం మండలము, మున్సిపాలిటీలోయున్న గ్రామాలలో ప్రతి ఆదివారము శ్రీమహావిష్ణు సహస్రనామ పారాయణము, కుంకు మార్చన, భగవద్గీత పారాయణము లతోపాటు ఆయా గ్రామాల్లో స్థలలభ్యత ననుసరించి చెట్లునాటారు. వైద్యశిబిరాలు, మనుష్యులకు, పశుపక్ష్యాదులకు నిర్వహించుటకు కృషి జరుపుతున్నారు.

ఈ కార్యక్రమములో భాగముగా తేది:6-10-02 ఉ॥ ఇచ్ఛాపురంలో వేంచేసియున్న శ్రీశ్రీశ్రీ రామలింగేశ్వరస్వామి ఆలయములో మున్సిపల్ ఛైర్మన్ శ్రీమాన్ పలికపోలావు, జ్యోతిప్రజ్వలనముతో పూజాకార్యక్రమములు ప్రారంభింపగా, స్థానిక MDO శ్రీమాన్ D. నాగరాజుగారు మొక్కలు నాటు కార్యక్రమము ప్రారంభించారు. 300 టేకుమొక్కలు ఆలయానికి సంబంధించిన స్థలములో నాటడం జరిగినది. యీ మొక్కలు పోషణ బాధ్యత పరపటి జానకిరావు ఆలయ ధర్మకర్తగారు స్వీకరించినారు.

## గుంటూరు జిల్లా

### వేల్పూరు

గుంటూరు జిల్లా వేల్పూరు గ్రామం వికాస తరంగిణి శాఖ వారి ఆధ్వర్యవంలో వెంకట రామానుజదాసుగారి అధ్యక్షతన 31-8-02న కృష్ణాష్టమి వేడుకలు ఘనంగా జరిగాయి. ఆరోజు ఉదయం భగవద్గీత పారాయణ, విష్ణుసహస్రనామ పారాయణ జరిగాయి. ఈ ఉత్సవంలో పాల్గొన్న భక్తులందరూ ఆ ఆనందాన్ని పాలుపంచు కున్నారు. తరువాత వందలాది భక్తులకు 'భగవ న్నివేదిత ప్రసాదము' పంచిపెట్టడం జరిగింది.

### తెనాలిలో

26-8-02 మన వరవమాచార్యులు తిరునక్షత్రం రోజున శ్రీవారి దివ్యహస్తము లతో నడిగడ్డపాలెం, మన ఆశ్రమంలో ప్రారంభించిన 'జీయరు ఉచిత వైద్య శిబిరము' ప్రతినెల 3వ ఆదివారం, తెనాలి పరిసరగ్రామాలయందు, ప్రస్తుతం తెనాలిలో ప్రఖ్యాత డాక్టర్ల 12 మందితో శ్రీవారి ఆశయానుసారంగా 'మాధవసేవగ సర్వప్రాణిసేవ', 'స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ' స్ఫూర్తితో గ్రామాలలో ఉన్న ప్రజలకు, పట్టణాలలోని మురికివాడలలోను పేదవర్గానికి వైద్యసేవల అందించాలని సంకల్పించి, 2వ వైద్యశిబిరాన్ని తెనాలిలోని చంద్రబాబునాయుడు కాలని మురికివాడలో 524 మంది, 3వ వైద్యశిబిరము బుర్రిపాలెంలో936 మందికి వైద్యసేవ లందించి, సుమారు 65వేల రూపాయల మందులను అందించడమేగాక, సుమారు కంటి వైద్యులు 30పైగా కంటి ఆపరేషన్‌ల నుకూడా నిర్వహించారు. ఈ కార్యక్రమాలకు వేదికగా, శ్రీవారి మంగళా శాసనములతో 'జీయర్ హ్యూమానిటీస్' తెనాలి పేరుతో సంస్థను ఏర్పరచి, అందు తెనాలిలోని ప్రభుత్వ అధికారులు, మున్సిపల్ కమీషనర్ R.D.O., D.S.P. ప్రత్యేక సభ్యులుగాను అధ్యక్షులుగా శ్రీమాన్ V. సత్యనారాయణ, శాఖమూరి కిషోర్, కార్యదర్శిగా, శ్రీమాన్ గుదిమెళ్ళ బదరీనాథ్, ఉపాధ్యక్షులుగా సంస్థఏర్పడినది. ఈ సంస్థలో తమ వైద్య సేవలను అందించటమేగాక,

మందులను అందజేస్తున్న వైద్య ప్రముఖులు, సంస్థ సభ్యులు, డాక్టర్లు గత 26వ తేదీన శ్రీస్వామి వారిని సేవించి నివేదిక సమర్పించి, శ్రీవారి మంగళాశాసనములు అందుకున్నారు.

## పుల్లడిగుంట ధర్మక్షేత్ర నివేదిక

అమరావతిలోని గీతామందిరంలో కార్యవర్గసభ్యుల సహకారంతో అమరావతి, తాడికొండ, తుళ్ళూరు మండలాల గీతాజ్యోతి కార్యకర్తల సమావేశము శ్రీమాన్ రాగం రామపిచ్చయ్యగారి ఆధ్వర్యంలో జరిగింది. గీతాజ్యోతి కార్యక్రమ వివరాలను శ్రీమతి లలితకుమారిగారు వివరించారు. కార్యకర్తలు మరింత ఉత్సాహంతో పనిచేద్దాం.

### ఉచిత ఆరోగ్య శిబిరం

29వ తేదీ ప్రత్తిపాడు మండలం పాతమల్లాయపాలెంలో ఉచిత మాతా శిశువైద్యశిబిరం నిర్వహించడం జరిగింది. కార్యక్రమంలో గ్రామ సర్పంచి శ్రీమాన్ కె. సాంబిరెడ్డిగారు, MPTC, శ్రీమాన్ వి. సాంబిరెడ్డి గారు హాజరైనారు. డా॥ రావెళ్ళ రాజ్యలక్ష్మిగారు వివిధ వయస్సులలో వచ్చు వివిధ వ్యాధులను, జాగ్రత్తలను గూర్చి చెప్పారు. వారి వైద్యబృందంతో కార్యక్రమాన్ని చాలా సహనంతో సాయంత్రం వరకు నిర్వహించారు. అందరికీ మందులు పంపిణీ స్థానిక వికాసతరంగిణి అధ్యక్షులు శ్రీమాన్ బొంతు కోటేశ్వరరెడ్డిగారు జ్ఞాపికలందజేసిరి.

### ఉచిత పశువైద్యశిబిరం

అక్టోబర్ 2వ తేదీ గాంధీజయంతినాడు కాకుమాను మండలం వల్లూరు గ్రామంలో ఉచిత పశువైద్యశిబిరం నిర్వహించుట జరిగింది. 'మాధవసేవగ సర్వప్రాణిసేవ' అన్న లక్ష్యంతోనే ఈ శిబిరాన్ని నిర్వహిస్తున్నట్లు శ్రీమతి లలిత కుమారి చెప్పినారు. అసిస్టెంటు డైరెక్టరు శ్రీమాన్ మధుసూదన రావుగారు, డా॥ పి. ప్రేమ్ చంద్‌గారు, డా॥ నాగేశ్వరరావుగారు వారి వైద్యబృందంతో వచ్చి కార్యక్రమాన్ని నిర్వహించినారు. దాదాపు 300 పశువులను పరీక్షించి ఉచితంగా మందులు పంపిణీ చేసినారు. స్థానిక గీతాజ్యోతి కార్యకర్త శ్రీమాన్ చేబ్రోలు రాజేంద్రప్రసాద్‌గారు ఆహూతులకు జ్ఞాపికలందించినారు.

## కృష్ణాజిల్లా

### విజయవాడ, కొత్తపేట శాఖ

గీతాజ్యోతి సందర్భంగా ప్రతి శుక్రవారం శ్రీకృష్ణపూజలు నిర్వహించి, కొత్తపేట తదితర ప్రాంతాలలో దాదాపు 4,5వేలమంది గీతాజ్యోతి కార్యక్రమంలో ప్రధాన భాగస్వాములను చేసారు. ప్రతి పౌర్ణిమకు దాదాపు 200మంది పేదలకు తదీయరాధన ఏర్పాటుచేస్తున్నారు.

### వేకనూరు
### ఉచిత ఆయుర్వేద వైద్య శిబిరము

అవనిగడ్డ మండలం వేకనూరులో తేది : 30-9-02 ఉచిత ఆయుర్వేద వైద్య శిబిరమును శ్రీమతి కె. సుగుణ కుమారి యమ్.ఆర్.ఓ. అవనిగడ్డ, ఈ శిబిరాన్ని ప్రారంభించగా, ప్రభుత్వ ఆయుర్వేద వైద్యశాల వైద్యులు శ్రీమాన్ డా॥ హెచ్. యు. వీరంరాజుగారు, డా॥ టి. సీమాకుమారి గారు పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో దాదాపు 519 మంది రోగులకు ఉచితచికిత్స నందించారు.

### ఉచిత దంతవైద్య శిబిరము

వేకనూరులోనే 12-10-02 దంత వైద్యశిబిరము నిర్వహించి 237 మందికి పరీక్షలు జరిపినారు. శ్రీమాన్ డా॥ సిహెచ్. హరిబాబుగారి పాల్గొని సేవలందించారు. శ్రీమాన్ డా॥ గుత్తికొండ గోపాలరావు, శ్రీమాన్ జి.వి.యస్. పెరుమాళ్ళు, శ్రీమాన్ తుంగల శ్రీనివాసరావు, శ్రీమాన్ బోగాది చంద్రశేఖర్, గ్రామసర్పంచ్ శ్రీమాన్ గరికపాటి





శ్రీనివాస్, శ్రీమాన్ భోగాది సత్యనారాయణ ప్రభృతులు ఈ కార్యక్రమంలో పాల్గొని శ్రీవారి మంగళాశాసనాలకు పాత్రులయినారు.

### విజయవాడ పటమట

గీతాజ్యోతి శ్లోకమాలికల సందేశాన్ని, ఆశయాలను విజయవాడలోని పాఠశాల లోను గృహాలలోను మరియు చుట్టుప్రక్కల గ్రామాలలో తెలియజేసి గోష్ఠులుగా ఏర్పరచే కార్యక్రమం జూన్ 7వ తేదీనుండి ప్రారంభించి ఇప్పటి వరకు జరుపు కుంటున్నారు. శ్రీమాన్ యతీంద్రుల పదవిలాసాల శ్రీనివాస్‌గారు, కుమారి కల్పనగారు శ్రీస్వామివారి ఆదేశానుసారం, కార్యక్రమ అభివృద్ధికి తమ వంతు సహాయ సహకారాలు అందిస్తున్నారు. ఇప్పటివరకు 130 గ్రామాలలో కరపత్రాలద్వారా, గోష్ఠుల ద్వారా గీతాజ్యోతి ప్రచారం సాగిస్తున్నారు.

### గంపలగూడెం

కృష్ణాజిల్లా గంపలగూడెం ధర్మక్షేత్ర కేంద్రముగ గంపలగూడెం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో మొత్తం 12 మండలాలలో 108 గ్రామాలలో గీతాజ్యోతి కార్యక్రమం నిర్వహించుచున్నారు. ఇంటింటికి తిరిగి గీతాజ్యోతి కార్యక్రమంలో ప్రజలను భాగస్వాములు చేయుచున్నారు. గ్రామాలలో ప్రతియింటిలో హనుమధ్వజం ఎగురవేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో చైర్‌పర్సన్ శ్రీమతి జయప్రదమ్మ, కోటేశ్వర రావు, శ్రీదేవి, సుందరిగార్ల ఆధ్వర్యంలో ఈకార్యక్రమం నిర్వహించడంజరుగుచున్నది.

### జగ్గయ్యపేట :

శ్రీస్వామివారి దివ్య మంగళా శాసనములతో తత్త్వప్రచారిక కుమారి నీళా పర్యవేక్షణలో శ్రీకృష్ణజన్మాష్టమి వేడుకలు జగ్గయ్యపేటలోని రామాలయంలో అత్యంత వైభవముగా జరిగినవి. జగ్గయ్యపేట ధర్మక్షేత్రంలోని వివిధ గీతాజ్యోతి గోష్ఠులనుండి అశేష భక్తజనం జన్మష్టమి వేడుకలలో భక్తి శ్రద్ధలతో పాల్గొని కృష్ణుని అనుగ్రహానికి పాత్రులయ్యారు. ఈ సందర్భంగా కుమారి నీళా శ్రీ పాంచరాత్రాగమ విద్యార్థులు మరియు మేనేజర్ బాబుగారి సహకారంతో వచ్చిన భక్తులందరిచేత శ్రీకృష్ణ పూజను విధి విధానముగా చేయించారు. ఈ కార్యక్రమము లో ఎ. పుష్పావతి, కళ్యాణి, రె. దమయంతి, పద్మ, శ్రీరాం, విజయలక్ష్మి, జ్యోతిగార్లు విశేష సేవలందించి కృష్ణుని దివ్యానుగ్రహానికి పాత్రులయ్యారు. శ్రీమాన్ కొత్తమాను మల్లికార్జునరావు దంపతులు ఉభయదార్లుగా పాల్గొని కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించుటకు కారకులయ్యారు.

1.9.2002 తారీఖున జగ్గయ్యపేట ధర్మక్షేత్రంలోని షేర్ మహమ్మద్‌పేట గ్రామంలో "ఉచిత పశువైద్య శిబిరము" విజయవంత ముగా నిర్వహించడం జరిగింది. డా॥ సాయి రాజు, డా॥ వై. వెంగళరావు, డా॥ సునందగార్ల వారి సిబ్బందితో 200 పైగా పశువులకు వైద్య సేవలందించారు.

ప్రాంత ఎ.డి. శ్రీమాన్ కె.వి.ఎల్. రెడ్డిగారుపాల్గొని తమవంతు ప్రోత్సాహాన్ని ప్రకటించారు. పశువైద్య శిబిర ప్రారంభంలో శ్రీ పాంచాత్రాగమ కళాశాల నుండి విచ్చేసిన శ్రీమాన్ ఎస్. శ్రీనివాసాచార్యులు, చి॥ రామా చార్యులు, బాబుగారు గోపూజ నిర్వహించారు.

ఈ కార్యక్రమానికి తత్త్వ ప్రచారకులు కుమారి నీళ సమన్వయకర్తగా వ్యవహరించి, ఈ సేవలను ఎక్కువమంది వినియోగించు కొనేట్లు చేసారు. ఇదే విధంగా ఈ ధర్మ క్షేత్రంలోని వివిధ గ్రామాలలో ఉచిత పశువైద్య శిబిరాలను నిర్వహించనున్నట్లు ప్రకటించారు. ఈ కార్యక్రమం కూడా శ్రీమాన్ కొత్తమాసు మల్లిఖారున్‌రావు దంపతుల ఔదార్యంతో జరిగింది.

ఈ కార్యక్రమానికి ఆర్థికంగా తోడ్పడిన శ్రీమాన్ పరిటాల వెంకటేశ్వరరావు, శ్రీమాన్ నరాల

వెంకటరెడ్డి, శ్రీమాన్ పసల శివరామ కృష్ణబాబు, శ్రీమాన్ కర్నాటి గోపాలకృష్ణయ్యకు శ్రీవారి మంగళాశాసనములు చేశారు.

## ప్రకాశం జిల్లా

### చీరాల

చీరాలపట్టణములోని అన్ని దేవాలయ ములలో అక్కడ జరుగు కార్యక్రమములలో పాల్గొని 'గీతాజ్యోతి' గురించి ప్రచారము చేస్తూ ఉచితముగా 'భగవద్గీత' పుస్తకములు భక్తులకు సమర్పించినారు. కృష్ణాష్టమి సందర్భంగా చీరాలలో వేణుగోపాలస్వామి దేవాలయం నందు కృష్ణాష్టమి వేడుకలు నిర్వహించుచూ విష్ణు సహస్రనామ పారాయణము, కోలాటములు, ఉట్టికొట్టు కార్యక్రమము 'గీతాజ్యోతి' కార్యక్రమము గురించి భక్తులకు తెలియచేసినారు.

## మెదక్ జిల్లా

### జహీరాబాద్

మెదక్ జిల్లా జహీరాబాద్ ధర్మక్షేత్ర కేంద్రముగ జహీరాబాద్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో ప్రతి గ్రామంనుండి ప్రజలు గీతాజ్యోతి కార్యక్రమాన్ని నిర్వహించు కొన్నారు. కొన్నిగ్రామాలలో ప్రత్యేకముగ హరిజనవాడలు, లంబాడి తండాలులో మహిళలు ముందుండి చేస్తున్నారు. మధ్యస్థ స్థితిలో ఉన్నవారికి మనోధైర్యాన్ని ఈ కార్యక్రమం యివ్వగలిగింది. ఎన్నడు పరదా దాటని జమిందారి కుటుంబాలు ఈ కార్యక్రమానికి స్పందించి గ్రామాలలో ఉన్న హరిజన, గిరిజన వాడలలో ప్రచారం చేయడం జరిగింది. సుమారు 3500 మంది విద్యార్థిని విద్యార్థులకు భగవద్గీత వైభవాన్నిగూర్చి తెలియ జేయడం జరిగింది. గీతాజ్యోతి దివ్యసందేశం నిరంతరముగ ఉండే విధముగ పట్టణంలో ఒక హోర్డింగ్‌ను ఏర్పాటు చేయడం జరిగింది.

## నెల్లూరు జిల్లా

### నెల్లూరు

నెల్లూరు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలోగీతాజ్యోతి కార్యక్రమం భాగంగా చుట్టుప్రక్కల మండలాలలో గీతాజ్యోతి కార్యక్రమం నిర్వహించుచున్నారు.

### వినుకొండ

వినుకొండ ధర్మక్షేత్ర కేంద్రముగ 5 మండలాలలో 83 గ్రామాలలో గీతాజ్యోతి కార్యక్రమం నిర్వహించుకొనుచున్నారు. 8 గ్రామాలలో శ్రీకృష్ణపూజాకార్యక్రమంలో నిర్వహించున్నారు. ఈ కార్యక్రమానికి తత్త్వ శాస్త్ర ప్రచారకులైన కుమారి కల్పనగారు, సూర్యకుమారిగారు ముందుండి నిర్వర్తిస్తు న్నారు. వికాసతరంగిణి ఛైర్‌పర్సన్ ప్రసాద రావు, మల్లిక, సీతమ్మ, శాయి, సీతారామ మ్మ, లక్ష్మీకాంతమ్మగార్లు ఆధ్వర్యవంలో నిర్వహించబడుచున్నాయి.

## ఖమ్మం జిల్లా

### సత్తుపల్లి

సత్తుపల్లి ధర్మక్షేత్రం సత్తుపల్లి వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో 8 మండలా లలో 108 గ్రామాలలో గీతాజ్యోతి కార్యక్రమం విస్తృత ప్రచారం జరిగినది. ఈ కార్యక్రమంలో తత్త్వశాస్త్ర ప్రచారకులు అయిన యన్.సి. హెచ్. రామకృష్ణా చార్యులు, గుడివాడ వెంకటేశ్వరరావు, లోకేశ్వరరావు, కేశవరెడ్డి గారు మొదలైన ప్రముఖులు పాల్గొన్నారు.

## విశాఖ జిల్లా

### విశాఖపట్నం :

విశాఖపట్నం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యంలో గీతాజ్యోతి రథయాత్రా కార్యక్రమం అత్యంత వైభవంగ జరుపబడినది. రోజుకు ఒక గ్రామం చొప్పున గీతాజ్యోతి ప్రచార రథయాత్ర జరుపబడినది. ఈ కార్యక్రమ పచార బాధ్యతను శ్రీమాన్ టి.పి. రాజ గోపాలాచార్యులు స్వీకరించినారు.





## నిజామాబాద్ జిల్లా

### నిజామాబాద్

నిజామాబాద్ ధర్మక్షేత్రంగా జిల్లాలోని 108 గ్రామాలలో 18 మంది సభ్యులతో కూడిన గీతాజ్యోతి కమిటీలను ఏర్పాటు చేసి ప్రచారం చేయడం జరుగుతుంది.

### కామారెడ్డి శాఖ

ప్రతిశనివారం సాయంత్రం - విష్ణు సహస్రనామ సామూహిక పారాయణం, ప్రతి సభ్యుని ఇంట్లో విష్ణుసహస్రనామ పారాయణం, 38 గృహాలలో దిగ్విజయంగా నిర్వహించబడినవి. 48 ధర్మక్షేత్రాలలో గీతాజ్యోతి కార్యక్రమం ప్రారంభం అయ్యింది. ఇంకా 60 గ్రామాలలో ఈ కార్యక్రమం ప్రారంభం కానున్నది. కామారెడ్డి డివిజన్‌లోని అన్ని వసతి గృహాలలోని విద్యార్థులకు వైద్యపరీక్షలు, వ్యక్తిగత శుభ్రత, పరిసరాల శుభ్రత, దంత సంరక్షణ విషయంలో అవగాహన కల్పించడం జరుగుతుంది.

### కామారెడ్డి :

కామారెడ్డి వికాస తరంగిణిశాఖ ఆధ్వర్యంలో విష్ణు సహస్రనామ పారాయణం 38 గృహాలలో నిర్వహించబడినది. 60 గ్రామాలలో గీతాజ్యోతి కార్యక్రమం ప్రారంభమైనది. విద్యార్థులకు వైద్య పరీక్షలు, వ్యక్తిగత శుభ్రత, పరిసరాల శుభ్రత దంత సంరక్షణ విషయంలో అవగాహన కల్పించడం జరుగుతుంది. వికాస తరంగిణి ఛైర్‌పర్సన్ శ్రీమాన్ ఎస్. తిరుపతిరావు, కార్యకర్తలు పాల్గొన్నారు.

### ఆదిలాబాద్ :

జిల్లాలో జరిగిన ఆదిలాబాదు జిల్లాలో 9.6.02 రోజున సంచార తాండూర్, రెబ్బెన్ మండలములో శ్రీమాన్ భువన ప్రకాశ్‌గారి సహకారములో 25గ్రామాలలో పర్యటిస్తూ గీతాజ్యోతి సందేశాన్ని అందించారు.

రామకృష్ణాపురం, మందమర్రి మండలంలో శ్రీమాన్ నారాయణ, శ్రీమతి భాగ్యలక్ష్మి, శ్రీమాన్ బాబూరావు, శ్రీమాన్ అర్జున్‌రావుగారి సహకారముతో అక్కడ చుట్టు కాలనీలలో గ్రామలలో పర్యటిస్తూ గీతాజ్యోతి సందేశాన్ని అందించారు.

### మంచిర్యాల :

మండలంలో వికాసతరంగిణి గోదావరికాలనీ (నస్పూర్) కార్యకర్తలు శ్రీమాన్ కృష్ణకుమార్, శ్రీమాన్ నరేందర్‌రెడ్డి, శ్రీమాన్‌కిషన్ రావు, శ్రీమాన్ భాస్కరరావు, శ్రీమాన్ వరదరాజన్, శ్రీ శ్రీమతి మంజుల, శ్రీమతి ఇందిర, శ్రీమతి విజయలక్ష్మి, శ్రీమతి జయలక్ష్మిశ్రీమతి పద్మ, శ్రీమతి రుక్మిణి, శ్రీమతి చిటక్కగారి సహకారంతో.

శ్రీరాంపూర్‌లో, కార్యకర్తలు శ్రీమతి మణి, శ్రీమాన్ పేర్వారం యతిరాజులు, శ్రీమాన్ రామారావుగార్ల సహకారముతో ఆ చుట్టు ప్రక్కల కాలనీలలో, గ్రామాలలో పర్యటిస్తు గీతాజ్యోతి సందేశాన్ని అందించారు. ఒక 30 స్కూల్సులలో మరియు వినాయక చవితి నవరాత్రులలో గణేష్ మండళ్ళులలో, ప్రధానముగా 10 సింగరేణి బొగ్గు మైన్స్ శ్రీరాంపూర్ మరియు చెన్నూరులలో జి.ఎమ్. గారి పర్మిషన్ తీసుకొని గీతాజ్యోతి సందేశాన్ని అందించారు. నస్పూర్ శ్రీరాంపూర్ కాలనిలో ఇంటింట అందించారు.

ఈ గీతాజ్యోతి రథం ఆదిలాబాదు జిల్లాలో పర్యటింప చేయడానికి ఆయా ప్రాంతాలలో ఉండి ప్రచారం చేయడానికి వ్యవస్థ ఏర్పరచి ప్రచారం జరిగేటట్లు మంచిర్యాల వికాసతరంగిణి శ్రీమాన్ వేంకటేశ్వరరావు, శ్రీమాన్ శ్యామసుందరరావు, శ్రీమాన్ రామారావు, ఉమ సహకరించారు.

తత్త్వ ప్రచారకులు శ్రీమాన్ గంగాధర్ నేతృత్వంలో శ్రీమాన్ శివకోటిగారి సారథ్యంలో శ్రీమాన్ రాంబాబు, తదితరుల సహకారంతో గ్రామ గ్రామానికి ఇంటింటికి తిరికి సహకరించిన కార్యకర్తలకు శ్రీస్వామివారు మంగళాశాసనాలు కృపచేసారు.

గీతాజ్యోతి ప్రచార రథం ఆదిలాబాద్ జిల్లా నుండి మెదక్ జిల్లాలోని జహీరాబాద్ ధర్మక్షేత్రంగా 108 గ్రామాలలో గీతాజ్యోతి సందేశాన్ని అందించారు. 4-10.02, 25-10-02 వరకు. జహీరాబాద్‌లో ప్రచారం చేయటం జరిగింది

| | |
|---|---|
| “మధులుబ్ధో యథాభృంగః | "Madhu lubdho: Yatha: Bhrungah |
| పుష్పాత్ పుష్పాంతరం వ్రజేత్ | Pushpath pushpa:ntharamVraje:th |
| జ్ఞానలుబ్ధో తథా శిష్యః | Jna:na lubdho: thattha: sishyah |
| గురోః గుర్వంతరం వ్రజేత్” | guro:r gurvantharam vraje:th" |

***A bee collects drops of honey from different flowers thus makes a hue.***

***Real student seeking knowledge approaches great people and learns from each event. Not only from just persons but also from The Mother Nature, he learns so many lessons at every moment and thus becomes a scholarly model to the world.***







గ్రంథ పరిచయం

# ఆళ్వార్ సూక్తిమాలా - తెలుగు గేయ సంపుటి

సత్సంప్రదాయ పరులలో ‘నిత్యానుసంధానం’ అన్నమాట విననివారు ఉండరు. ఆ గ్రంథం చూడనివారు, అనుసంధించుకోనివారూ ఉండరు.

ప్రతిరోజూ తప్పక చదువుకోవాల్సిన ముఖ్యములైన ఆళువారుల శ్రీసూక్తులను కొన్నిటిని ఒకచోట చేర్చి ‘నిత్యానుసంధానం’ అన్న పేర ఒక గ్రంథంగా మన పెద్దలు మనకు ప్రసాదించినారు.

ఆ గ్రంథం తెలుగు లిపిలోనే ఉన్నా భాస తమిళం కావటాన తెలుగు వారంతా అర్థం చేసుకునే అవకాశం లేదు.

అర్థం తెలిసి అనుసంధానం కావించుకుంటే, ఆ సూక్తుల్ని తెలుగులో అనుసంధించుకుంటే ఆనందంగా ఉంటుందని భావించి, ఉ.వే. శ్రీమాన్ న.చ. సీతారామాచార్యులువారు ఆగ్రంథంలోని కొన్ని ఖండికలను స్వతంత్ర విలక్షణంగా మాత్రాచ్ఛందస్సులో తెనుగు చేసినారు.

ఎడమవైపు మూలం-కుడివైపు తెలుగు సేతగా ముద్రించినారు. తేటతెలుగులో ఆళువారుల భావాలను ప్రకటించటమే ఈ తెనుగు సేత పరమార్థం. అది చక్కగా నెరవేరింది.

అనుబంధంగా తిరుప్పావై ప్రబంధానికి శ్రీవానమామలై జీయరు అనుగ్రహించిన స్వాపదేశార్థ సంగ్రహాన్ని శ్రీ శుద్ధ సత్త్వం దొడ్డయాచార్యులవారి వ్యాఖ్యాన సంగ్రహాన్ని తెనుగు కావించి చేర్చినారు.

తాము నిత్యమూ అనుసంధించుకునే పాశురాలకు తెలుగు తాత్పర్యం తెలుసుకోవా లనుకునే వారికి, తెలుగులో కూడా చక్కగా పాడుకోవాలనుకొనే వారికీ ఈ గ్రంథం బాగా ఉపయోగపడుతుంది. సరళంగా సుబోధకంగా సాగిన తెలుగు సేత.

210 పుటల యీ గ్రంథం వెల రూ.80/-

ప్రాప్తిస్థానం :

1. ఎస్.సి. ఛారిటీస్ బుక్ ట్రస్ట్
   1-162-1, స్నేహపురి కాలని,
   హైదరాబాదు-18
2. యస్.ఆర్. పబ్లిషర్స్,
   11-8-31, జగన్నాధం వీధి,
   కొత్తపేట, విజయవాడ-2
3. శ్రీరామానుజవాణి,
   29-1-26, శేషాద్రిశాస్త్రి వీధి
   గవర్నరు పేట, విజయవాడ-1.

## అభినందనలు

భక్తినివేదన పాఠక కుటుంబాన్ని మరింత పెంచేందుకు కృషి చేస్తున్నవారిలో ఒకరు శ్రీమాన్ పి. వెంకట నరసింహారావుగారు(విజయవాడ, పటమట), సీతానగరం మన ఆశ్రమంలో శ్రీవారి చాతుర్మాస్యదీక్షా కాలంలో వచ్చే భక్తులకు తమ భక్తినివేదన కౌంటర్‌లో స్వాగతం పలుకుతూ సేవలందిస్తున్నారు.

వీరికి శ్రీశ్రీశ్రీస్వామివారు అనేక మంగళాశాసనములు కృపచేసారు.

ఈ సంచికలో .....



పంచాంగ వివరాలు

**డిసెంబర్**

5 విదియ తిథి

13 దశమి తిథి

14 శూన్య తిథి

15 ఏకాదశి తిథి
సర్వేషామేకాదశి, గీతాజయంతి

16 ధనుస్సంక్రమణం ప. 2-12 నుండి
ధనుర్మాస వ్రతారంభం

19 దత్తాత్రేయ జయంతి

28 తిథి ద్వయం

29 ఏకాదశితిథి, స్మార్త ఏకాదశి

30 శ్రీవైష్ణవ ఏకాదశి

**జనవరి**

1 తొండరడిప్పొడి యాళ్వార్ తిరు॥

2 సర్వేషాం అమావాస్య

11 ఉ.షా. కార్తె ప. 3-37

14 మకర సంక్రమణం రా. 9-49
సర్వేషాం వైకుంఠ ఏకాదశి, శ్రీరంగం, భద్రాచలాది క్షేత్రములలో పరమపద ద్వార దర్శనం, భోగి, ద్వాదశి తిథి

15 సంక్రాంతి పండుగ, ఉత్తరాయణ పుణ్య కాలం, శూన్యతిథి
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెద్ద జీయరుస్వామివారి పరమపదోత్సవం

**భక్తినివేదన పాఠకులకు శుభవార్త**

రాబోవు 2003వ సంవత్సరం మార్చినెల భక్తినివేదన 'బదరీనాథ్ ప్రత్యేక సంచిక'గా వెలువడుతుందని తెలియజేయుటకు సంతోషించుచున్నాము. ఇందులో ......

**బదరీనాథ్ యాత్రా విశేషాలు, బదరీనాథ్ చుట్టుప్రక్కల ఉండే ప్రదేశముల గురించి, బదరీలో శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారిచే నిర్వహించే అష్టాక్షరీ క్షేత్ర వివరములు, అక్కడ ఏర్పాటు చేసిన నివాస వసతి మరియు అన్నదానము గూర్చిన వివరములు ఉండును. అందమైన బదరీనాథ్ పరిసర ప్రాంతాల అందమైన కలర్‌ఫోటోలతో తెలుగు, హిందీ, ఇంగ్లీషుభాషలు ఒకే పత్రికగా ముద్రించబడును.**

మరిన్ని వివరములు జనవరి నెల సంచికలో తెలియజేయగలము.

మీ సేవలో....


**భక్తినివేదన,** సీతానగరం - 522 501, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, ✆ (08645) 272929,
చందా: సంవత్సరచందా రూ. 50/-, జీవితచందా రూ. 500/-,
విదేశాలకు సంవత్సరచందా $ 25,
E-mail : bhakthinivedana@yahoo.co.in Internet : www.chinnajeeyar.org
D.T.P. & Design by : పరిశోధనాలయమ్, ముద్రణ : శ్రీమాన్ ప్రింటర్స్ & ప్రాసెసర్స్, సీతానగరం,




శ్రీమతే రామానుజాయ నమః

# భక్తినివేదన

## ఆధ్యాత్మిక మాసపత్రిక


చిత్రభాను నామ సంవత్సరం — మార్గశిర మాసము

సంపుటి 55 — 2002 డిసెంబర్ — సంచిక 9

వ్యవస్థాపకులు
శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్యులు
**శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు**

సంపాదకులు : శ్రీ ఉ. వే. శ్రీమాన్ T.P. **శ్రీరామచంద్రాచార్యులు**



జై శ్రీమన్నారాయణ!

# గీతాజ్యోతి



## పారాయణ శ్లోకమాలిక

35వ వారం

## దారులు వేరైతే - గమ్యం ఒకటెలా అవుతుంది?

**ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థాః మధ్యే తిష్ఠంతి రాజసాః ।**
**జఘన్య గుణ వృత్తిస్థాః అధో గచ్ఛంతి తామసాః ॥** 14అ॥18శ్లో॥

*ప్రతిపదార్థములు :-* **సత్త్వస్థాః**=వృద్ధిని చెందిన సత్త్వగుణము కలవారు; **ఊర్ధ్వం**=మోక్షమునకు; **గచ్ఛన్తి**=పోవుచున్నారు; **రాజసాః**=రజోగుణ ప్రధానులు; **మధ్యే**=నడుమ; **తిష్ఠన్తి**=ఉందురు; **తామసాః**=తమోగుణ ప్రధానులు; **జఘన్యగుణ వృత్తిస్థాః**=అంతకంతకు నీచమైన తమోగుణ వ్యాపారములయందున్నవారై; **అధః**=అంతకంతకు క్రిందికి; **గచ్ఛన్తి**=పోవుచున్నారు.

మానవసేవగా ఈ జీవితం సాగాలని చాలామంది అనుకుంటారు. కానీ మాధవసేవగా జీవితం సాగాలని కోరడం చాలా ఉత్తమమైన మార్గం. అయితే, మాధవసేవగా కేవలం మన యొక్క జీవితమే కాదు, ప్రతిజీవీ తన జీవితాన్ని అట్లాగే సాగాలనికోరాలి. అలా కోరగల్గినవాడు మనిషొక్కడే. మానవుడికుండే తెలివి, తనతోటి ప్రాణికి సహకరించడంలో ఉపయోగపడాలి. అప్పుడే వీడి జన్మ సార్థకము అని అంటారు. ఏ ప్రాణికి తాను సేవచేసినా అందులోని మాధవుడు దాన్ని అందు కుంటాడు, ఆనందిస్తాడు అనే తెలివి మనిషికి ఏర్పడాలని శాస్త్రాలు చెబుతున్నాయి.

ఒకడు కేవలం లోకం కోసమే తాను బ్రతుకుతాడు. ఒకడు లోకాన్ని కేవలం తన కోసం వాడుకోవాలనుకుంటాడు. ఎందుకీ తారతమ్యాలు ఏర్పడుతున్నాయి? వెనుకాతల ఏ శక్తి చేస్తున్న పని ఇది? అనే దానికి అన్వేషణ ఎప్పటినుండో సాగుతోంది. భగవద్గీతలో శ్రీకృష్ణుడు దానికి సమాధానం చెప్పాడు. మనుషుల ప్రవృత్తుల్లో మార్పులు రావడానికి అసలు జీవుడు రకరకాల శరీరాలు ధరించడానికీ, పాతశరీరం వదిలేటపుడు ఆతనికి ఉండే గుణముల యొక్క సంపర్కమే కారణం **గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు**" అని తెలిపాడు.

ఏమిటాగుణములు? సత్త్వ, రజస్తమస్సులు అనే '3' గుణాలు వున్నాయి. ఈ '3' గుణాలు వేరువేరు అని తెలుసుకో. ఒక్కొక్క గుణం ఎలా పనిచేస్తుంది? అది ఏమిటియిస్తుంది. వీడిని ఎట్లా ప్రవర్తింప జేస్తుంది? దానిని ఎట్లా అణచవచ్చును? ఇవన్నీ మనకు 14వ అధ్యాయంలో స్వామి విపులీ కరించాడు. ఈ గుణ సంగమే '**సదసద్యోని జన్మసు కారణమ్**' అని గూడా చెప్పాడాయన. **చాతుర్వర్ణ్యం, మయాసృష్టం గుణకర్మ విభాగశః** గుణమును బట్టి కర్మను బట్టి ఈ చతుర్వ ర్ణాలను నేను సృజించాను అని భగవంతుడు భగవద్గీతలో 4వ అధ్యాయంలో చెప్పాడు. కొందరు





చాతుర్వర్ణ్యము అంటే బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్రాదులు అని అంటారు. కానీ మన పెద్దలు, పూర్వులు అయిన ఆచార్యులు మొత్తం ప్రాణికోటిని '4' విభాగముల క్రింద విడదీసి దేవ, మనుష్య, తిర్యక్ స్థావరములుగా చెప్పారు. ఈ చాతుర్వర్ణ్యం నేను సృజించాను అన్నాడు పరమాత్మ. 'అయితే కృష్ణా ! నీకు పక్షపాతం నిజంగా ఎక్కువ. నీవు చాలా నిర్దయుడవు. ఎందుకిన్ని తేడాలు పెట్టావు'? అంటే, 'ఇన్నితేడాలు నేనుపెట్టడం ఏమిటయ్యా! గుణాన్ని బట్టి, కర్మను బట్టి వాని జన్మను నిర్ణయిస్తా' అన్నాడు. అయితే గుణాలు మనం తెచ్చుకుంటే వచ్చేవి, మనం పెంచుకుంటే వచ్చేవికావు. గత జన్మలో ప్రాణం వదిలిపెట్టే టప్పుడు ఏ గుణం పైకి ఉందో, దాన్నే ఆధారం చేసికొని భగవంతుడు ఈ దేహాల్ని, ఆయా పనులు చేయగల్గిన సంస్కార వాసనా రేణువుల్ని ఉంచి మనకి ఆ జన్మను ప్రసాదించాడు అనేది నియమం, అదే నిర్ణయం కూడా. అందుచేత గుణములనేవి చాలా ప్రధానమైన పాత్రను వహిస్తాయి. ఆ గుణాలు తీసుకు వెళ్ళిన దారిలో మనం వెళుతున్నాం. తమోగుణం కల్గిన వాడు ఎటువెళతాడు? రజోగుణం కల్గినవాడు ఎటువెళతాడు? సత్త్వగుణం కల్గినవాడు ఎటువెళతాడు? అనే విషయాన్ని మనం ఈ 35వ వారపు గీతాజ్యోతి శ్లోకంలో అనుసంధానం చేసుకుందాం.

లోకంలో ఒకనానుడి ఉంది. అన్నిదారులూ ఒకే చోటుకి చేరుతాయి. నిజానికి అన్ని దారులూ ఒకేచోటుకి ఎట్లా చేరతాయి? తూర్పుకి వెళ్ళేదారి ఒకచోటుకి తీసుకు వెళుతుంది. దక్షిణానికి వెళ్ళేదారి మరోచోటుకి తీసుకువెళుతుంది. పశ్చిమానికి వెళ్ళే దారి మరొక చోటుకి తీసుకు వెళుతుంది. ఒకడు తూర్పువైపు వెళ్ళే ట్రైన్‌కి టికెట్ తీసికొని ఏ రైలు అయితే ఏమిటి లెండి అంటూ దక్షిణం వైపు వెళ్ళే ట్రైన్ ఎక్కితే కాలం, ధనం, నష్టపోవటమే కాకుండా చేరవలసిన గమ్యానికి మరీ దూరం అవుతాడు కదా! అన్ని రైళ్ళు ఒకే చోటుకి చేరవు కదా! కనుక, నీవు ఏ ఊరు వెళ్ళాలని నిర్ణయం చేసికొంటే, అపుడు ఏదారి పట్టాలో నీకు తెలుస్తుంది. అలానే ఆనందం కావాలనుకుంటున్నావా? లేదా ఉద్రిక్తత కావాలను కుంటున్నావా? అజ్ఞానం కావాలనుకుంటున్నావా? అజ్ఞానం వద్దు. ఉద్రిక్తతలు వద్దు. ఆనందం కావాలి అనుకుంటే దానికో దారి ఉంది. అది పొందాలంటే ఆ దారినే వెళ్ళాలి. **"సత్త్వం"** దాన్ని ఇస్తుంది. సత్త్వం పెంచుకో . సత్త్వాన్ని పెంచేది మనస్సు. మనస్సుకు బలాన్నిచ్చేది ఆహారం. అందుకే మొదట ఆహారాన్ని శుద్ధంగా ఉండేట్లు చూసుకోవాలని మనకు చెప్పారు. తీసుకున్న ఆహారంలో సూక్ష్మమైన అంశ నీ మనస్సుకు ఆప్యాయకం అవుతుంది. అపుడు బుద్ధి తన చెప్పుచేతల్లో ఉంటుంది. మంచి పనులు చేయగలు గుతాడు. ఆనందాన్ని అందుకోగలు గుతాడు. **'సత్త్వస్థాః ఊర్ధ్వం గచ్ఛంతి'** సాత్త్విక గుణం కలిగిన వారు ఉన్నత స్థితికి చేరుతారు. కొంతమంది ఊర్ధ్వపుండ్రము పెట్టుకుంటు ఉంటారు. అంటే పొడవుగాబొట్టు పెట్టుకుంటు ఉంటారు. దీనికి కారణం, ఊర్ధ్వగతిని కోరుకోవడం. సాత్త్వికతకు గుర్తు తెలుపు. సత్త్వం మనలో బాగా పెరగాలను కుంటే, నీలో తెలుపు పునాది కావాలి. మంచి ఆహారం వల్ల మంచి మనస్సు ఏర్పడాలి. అదొక పునాది అని అనుకుందాం! పెట్టే బొట్టులో అదొక పునాది. మంచిమనస్సు వల్ల నీవు భగవంతుని అంతటా చూడాలి. ఆనందాన్ని అందరితో పంచుకోగలగాలి. ఆనందంఅంటే పదుగురితో పంచుకునేదేగద! ఒంటరిగా కూర్చుంటే లభించేది శోకంఅంటారు. అద్దైనా పదుగురితో కలసి పంచుకుంటేనే అనుభవయోగ్య మంటారు. కనక అందరితో కలసి పంచు కోవాలి. భగవద్ భావనతో పంచుకోవాలి. అపుడు ప్రతి వస్తువులోనూ నువ్వు భగవంతుని చూచి ప్రేమించగల్గుతావు. ఆ భగవత్

ప్రేమను చూపించగల్గేది. లేత వర్ణం కల్గిన ఒక ఎరుపు, దానిని మధ్యలో ధరిస్తున్నారు. ఆ ఊర్ధ్వగతిని చూపిస్తూ భగవంతుడికి విన్నవిస్తున్నారన్న మాట "హే భగవన్! నాకు సత్వం బాగా పెరిగే టట్టుచెయ్. ప్రతి ప్రాణిని నేను ప్రేమించగలి గేట్టుచేయ్. అలానే ప్రతి ప్రాణిద్వారా నేను అందించే సేవ నీకూ అందేటట్టుగా అనుగ్రహించు. ఇలా భగవంతుడిని ప్రార్థన చేయడం ఊర్ధ్వ పుండ్ర ధారణ లక్ష్యము అనవచ్చు.

సత్త్వం కల్గినవాళ్ళు వర్తమాన జన్మకంటే ఉజ్జీవిస్తారు. రజోగుణం పెంచుకొని, తినడమే తన జీవితానికి లక్ష్యంగా తనకోరికలు తీర్చుకొనుటే తన జీవితానికి సారం అనుకుంటూ జీవిస్తే రజోగుణం పెరుగుతుంది. **'మధ్యే తిష్ఠంతి రాజసాః.** అంటే మళ్ళీ వాడు ఈమానవ లోకంలోనే, ఈ మానవశరీరం కంటే క్రిందఉండే ఇతర ప్రాణి కోటిల్లోకీ వెళ్ళిపో తుంటాడు. నాకే శాస్త్రం అక్కరలేదు అంటూ అజ్ఞానంతో చీకటిలో ఉండిపోయే వానికి? తమోగుణం మరింత పెరిగి జ్ఞానం ప్రకాశించే అవకాశం లేని స్థితిలోకి వెళ్ళిపోతాడు. ఏరకంగానూ జ్ఞానాన్ని వాడుకోగల్గిన యోగ్యతలేని శరీరాలొస్తాయి. మట్టిలో ఉంటాడు. జ్ఞానాన్ని వాడుకునే ఛాన్సెస్ లేవు. కనుకనే తమోగుణం కల్గిన వ్యక్తులను జఘన్యగుణులు అంటారు. **అధోగచ్ఛంతి తామసాః** క్రమంగా క్రమంగా మరింత తమస్సు పెరుగు తూంటుంది. మళ్ళీ తామస కృత్యాలు చేస్తాడు. మళ్ళీ తమస్ పెరుగుతుంది. మళ్ళీ తామస కృత్యాలు చేస్తాడు. వాడు **'అధోగచ్ఛంతి'** క్రమంగా మరింత క్రిందకి వెళ్ళి పోవడం అనేది జరుగుతుంది. శ్రీకృష్ణుడుమనల్ని తమోగుణాన్ని దాటి, రజోగుణాన్ని అతిక్రమించి సత్త్వగుణాన్ని లోపల నింపుకొనే ప్రయత్నం చేయమంటు న్నాడు. దానికి మనం తీసుకునే ఆహారం సాత్వికంగా ఉండేట్లు చూసుకోవాలి! తద్వారా మనసు సాత్వికమవుతుంది! పరిశుద్ధాహారంతో పవిత్రభావనలను అలవరచుకొనే ప్రయత్నం ఆరంభిద్దామా మరి!

### 36వ వారం

## అచంచల విశ్వాసం - ఆత్మశక్తికి మూలం

**మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।**
**స గుణాన్ సమతీ త్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥** 14అ॥26శ్లో॥

*ప్రతి పదార్థము :* **యః**=ఎవడు, **మాం**=నన్ను, **అవ్యభిచారేణ**=చలించని; **భక్తి యోగేన**= భక్తియోగముచేత; **సేవతే**=సేవించుచున్నాడో, **సః**=వాడు, **తాన్ గుణాన్**= ఈమిశ్రితమైన గుణములను, **సమతీత్య**= అతిక్రమించి; **బ్రహ్మభూయాయ**=బ్రహ్మతో సమానమైన రూపమును పొందుట కొఱకు; **కల్పతే**=తగుచున్నాడు.

ఈ ప్రపంచంలో మనిషి పుడుతూనే రకరకాల బంధాలతో వచ్చాడు. బంధాలతో పాటు బాధ్యతలు కూడా ఉన్నాయి. ఎవ్వరూ వాటినుంచి తప్పించుకోలేరు. కానీ ఈ రోజుల్లో హక్కుల పోరాటాలే తప్ప, బాధ్యతలను గుర్తించడం లేదు. సహజంగా ఏర్పడ్డ బంధాలు తల్లితో, తండ్రితో, సోదరులతో ఇలా... ఇవి ఎవరూ కల్పిస్తే వచ్చినవి కావు. తొలగించినా పోయేవీ కావు పుట్టకతోనే వచ్చాయి కనుక.

మన ప్రవృత్తుల్లో కూడా ఎన్నో విచిత్రాలను మనం దర్శిస్తున్నాం. తెలియకుండానే మనస్సు ఒక్కొక్కసారి ప్రశాంతమౌతుంది, ఒకోసారి ఉద్రిక్తమౌతుంది. మరొక్కసారి తెలియని అజ్ఞానంలోకి జారుకుంటుంది. కారణం, భగవంతుడు భగవద్గీతలో





చెప్పాడు. ఈ జన్మ ప్రకృతి యొక్క అంశ కలది. అందుకే ప్రకృతికుండే గుణాలు దీనిమీద ఎప్పుడూ ప్రభావాన్ని చూపిస్తాయి. ప్రకృతి '3'గుణాలు కల్గియున్నది. సత్త్వమని, రజస్సు అని, తమస్సు అని. వాటివల్ల తయారైంది కనుక ఈ శరీరం కూడా సత్త్వరజస్తమోమయమయ్యేఉంటుంది. వాటితో కలతచెందుతూనే ఉంటుంది. అయితే, మనం వీటిలోఏదికావాలని కోరుకుంటున్నాం? కోరేముందు అసలా గుణాలు ఏమిస్తాయో తెలియాలి గదా! సత్త్వం, జ్ఞానాన్ని, ఆనందాన్ని ప్రశాంతతనూ ఇస్తుంది. రజస్సు కోరికలూ, కోపతాపాలూ పెంచుతుంది. తమస్సు అజ్ఞానాన్ని, నిద్రాబద్ధకాలనూ పెంచుతుంది.

వీటిలో మనం మంచి జ్ఞానం పెరగాలనే కదా కోరుకుంటాం! అయితే ఆ జ్ఞానం ఎట్లా పెరగాలి? ఏరకమైన దోషములు లేకుండా పెరగాలి. రజస్తమస్సులు అనేవి జ్ఞానానికి దోషాన్ని ఆపాదించేవి. సత్త్వం ఆనందాన్ని కల్గించేది. జ్ఞానాన్ని ఉన్నదాన్ని ఉన్నట్టుగా ప్రకాశింపజేసేది. ఒక స్వచ్ఛమైన అద్దము ముందుంచిన వస్తువును, అది, ఉన్నదున్నట్టు చూపుతుంది. అలానే, చుట్టూఉండే ప్రాపంచిక సుఖాల్ని మనం పొందేటప్పుడు సత్త్వగుణం పైకి ఉద్రిక్తమై ఉన్నపుడు ఆయా, ఆయా వస్తువులను ఉన్నవాటిని ఉన్నట్టుగా చూపుతుంది. రజోగుణం తన ప్రభావాన్ని చూపిస్తే అన్నీ దోషములతో ఉన్నట్లు మన ఆధిపత్యానికి లొంగి ఉండవలసినవిగాను మనకు కన్పిస్తూంటాయి. అదే తమోగుణం తన ఆధిపత్యాన్ని చూపించేటప్పుడు నిద్ర, అలసట, బద్ధకము, వాటితో పాటు అజ్ఞానము, పూర్తిగా చోటు చేసికుంటాయి. దాంతో శరీరమూ, దానిలో ఉండే మనమూ వేరుకాదు ఒకటే అనిపిస్తుంది. ఈ '3' గుణములు పర్యాయేణ ఒకటిపైకి వస్తే రెండు క్రిందికి వెళుతుంటాయి. సహజంగా సాగుతుంటాయి. ఇవన్నీ ప్రకృతికి సంబంధించినవి. మనం ప్రకృతికంటే పైవాళ్ళం. '7'వ అధ్యాయం ఆరంభం చేసినపుడు శ్రీకృష్ణుడు **'ఇతస్త్వన్యాం ప్రకృతిం జీవభూతాం పరాం'** జీవుడు ప్రకృతికంటే పరుడు, వేరైనవాడు అన్నాడు. అంటే, జ్ఞానం లేని ప్రకృతికంటే జ్ఞానం కల జీవుడు ఒక మెట్టుపైవాడు అని తెలిపియున్నాడని గుర్తించాలి.

ఈ జీవుడు జ్ఞానఘనుడు. జ్ఞానరసుడు అని మనకి ఉపనిషత్తు చెబుతోంది. జ్ఞానమే తన ఆకారమైనపుడు తాను నా ఈ ప్రకృతిలో శరీరాల్ని ధరించి తిరిగేటపుడు, తరిగిపోయే జ్ఞానాన్ని, తిరిగి తాను నింపుకోవాలి పైగా పెంచుకోవాలి అని అన్పించాలికదా! మరి నింపుకోవాలి అంటే ఎక్కడ నుంచి నింపుకోవాలి? దానికి కొన్ని సాధనాలు చెప్పాడు. 14వఅధ్యాయంలో శ్రీకృష్ణపరమాత్మ ఎలాంటి గుణాలు అభ్యాసం చేయాలో తెలిపాడు. **'సంతుష్టః సతతం యోగీ'** లభించిన దానితో సదా ఆనందంగా ఉండు. **'తుల్యనిందాస్తుతిః'** ఎవడైనా నిన్ను నిందించినా, ఎవడైనా స్తోత్రం చేసినా పట్టించుకొనే ప్రయత్నం చేయకు. ఇలా.... ఎన్నో సాధనాలు చెప్పాడు. అంటే, మిశ్రితమై ఉండే

త్రిగుణముల ప్రభావానికి దూరంకమ్ము! రజస్తమస్సులతో కలిస్తే సత్త్వంకూడా చెడ్డదౌతుంది. కనుక, అలాంటి కలయిక కలిగిన సత్త్వగుణం వదిలేయ్! కేవలం సత్త్వంలో మాత్రమే ఉండే ప్రయత్నం చెయ్యి. **'నిత్య సత్త్వస్థః'** అన్నాడు.

అయితే సత్త్వగుణంలో ఉండాలంటే, ఈ రజస్తమస్సులతో ప్రచురమైన ఈ విషయసుఖాల్లోనుండి నిన్ను మొట్టమొదట వెనక్కు తీసుకో. వెనక్కు తీసుకోవడానికి బలం కలగాలి కనుక, ఈ శరీరంలోనికి అందించే ఆహారాదులు కూడా శరీరానికి సత్త్వం అధికం చేసేవి చూచి అందించు. అందుకే రజస్త మస్సులు పెంచే ఆహారం తినకు. జాతి దుష్టాలు అంటే, మాంసం, మద్యం, ఉల్లి, వెల్లుల్లి, ఇలాంటి వాటిని దూరంగా అట్టేపెట్టు. నిమిత్తదుష్టాలు అంటే, తినే పదార్థాల్లో వెంట్రుకలు, గోళ్ళు, దోమలు, చిన్న చిన్ని కీటకాదులు పడిన ఆహారపదార్థాలనూ దూరంగా పరిహరించు. అపుడు రజోగుణం కలిగినవి కొంతవరకు దూరంగా ఉంచ గలిగావని అర్థం. ఈరకంగా నువ్వు వండుకున్న మంచి పదార్థంలో కూడా నీకు కన్పించని దోషాలు ఎన్ని ఉంటాయో తెలియదు. కనుక, దాన్ని భగవంతునికి నైవేద్యం చేసిన తరువాత మాత్రమే తీసుకో! అది సత్త్వాన్ని కొంతవరకు పెంచే అవకాశముంటుంది. ఇలా చాలా సాధనాలు చెప్పాడు శ్రీకృష్ణుడు. కాని వీటన్నింటికంటే అత్యుత్తమమైన సాధన మొకటుంది. దీపం వెలిగిస్తే చీకటి దానంతట అదే పోయినట్టుగా ఉత్తమ జ్ఞానం కలిగిన ఒకని సహాయం తీసుకోగలిగితే, మన జ్ఞానం అధికమై మనపై ఆక్రమించడానికి ప్రయత్నం చేసిన తమోగుణాదులను వాటంతట అవే తొలగిపోయేట్టు చేస్తుంది. దానికొక మంచి సాధనం శ్రీకృష్ణుడు చెప్పాడు. భగవద్గీత 14వ అధ్యాయములో 36వ శ్లోకంలో తాను ఒక చక్కటి సందేశాన్ని అనుగ్రహిస్తున్నాడు. సత్త్వాన్ని త్వరగా పెంచుకోవడానికి మనకు ఉపకరించే శ్లోకం ఇది.

**'బ్రహ్మ భూయాయ కల్పతే'.** బ్రహ్మ అంటే పెద్దదని అర్థం. ఆనందము అని అర్థము. మనకు గొప్ప ఆనందము కావాలని అనుకుంటాం. భగవంతుడు మనకు ఒక ప్రతిజ్ఞ చేసాడు. **"బ్రహ్మ భూయాయ కల్పతే"!** హే అర్జునా! వాడు తప్పనిసరిగా బ్రహ్మానందాన్ని అనుభవించే స్థితికి చేరగల్గుతాడు. ఆ రకమైన యోగ్యతను పొందుతాడు. ఎప్పుడు ? ఎలా? **స గుణాన్ సమతీత్య ఏతాన్!** సత్త్వరజస్తమస్సుల మిశ్రమం నుండి ఒక్కడుగు బయటకు వేయగలిగితే చాలును. వీటిని దాటి ఉండగల్గితే చాలును. అయితే దానికి ముందు చేయాల్సిన పని ఏమిటి? ఆ స్థితి ఎట్లా వస్తుంది. **'మాం చ యః అవ్యభిచారేణ భక్తియోగేన'** నాయందే చెదరనటువంటి విశ్వాసం కావాలి. భక్తి యోగము అంటే తైలధారావత్ అవిచ్ఛిన్న స్మృతి సంతానము. ప్రీతితో సాగేది. పైనుండి నూనె పోసినట్టయితే ఎక్కడా తెగకుండా ఏకధారగా ఎలా సాగుతుందో, అట్లా మనలో, భగవంతుడి యందలి ప్రీతి విశేషం, ఆయనలోని మనకు ఉపకారం చేసే కల్యాణ గుణాలను మరల మరల అనుసంధానం చేయించాలి. ఎడతెగని ఆవిధమైన ప్రేమ ప్రేరేపిస్తే చేసే సేవనే మనం 'భక్తి' అని అంటాం. అలాంటి భక్తి, ఏరకమైన కోరికలూ లేకుండా చేస్తే భక్తియోగమౌతుంది. ఈ భక్తియోగం అచంచలమైనది కావాలి. **అవ్యభిచారేణ** = ఏరకమైన సందేహాలకి తావీయని. నిశ్చయాత్మక మైన విశ్వాసంతో ఎవడు నన్నుసేవిస్తాడో, భగవంతుడు అర్జునుడి రథం ముందర తాను కూర్చొని **'మాం చ'** నన్ను కూడా అని అర్థంకాదు. **'నన్నే'** అని నొక్కిచెపుతున్నాడు. అంటే భగవంతుని యందు అచంచలమైన విశ్వాసము కావాలి. ఇది ఎంతెంత పెరిగితే, మన హృదయంలో ఎంతెంత స్థిరపడితే రజస్తమస్సులంతగ అణిగినట్టే అంతంతగ లభించాల్సిన అపరిమిత ఆనందమేదో మన చేతికీ అందినట్టే. దానికి నీకేం చదువు కావాలా? యోగ్యత కావాలా? ధనం కావాలా? పదవి కావాలా? ఏమక్కరలేదు. విశ్వాసం





బలపడటానికి బయటి వస్తువుల అవసరం ఏమిటి? లోపలినుంచి కలగాల్సిందది.

ఒక ఆటవిక భిల్లజాతి స్త్రీ, శబరి కథ మనం విన్నాం. మనకందరికీ ఆ చరిత్ర తెలుసు. వాల్మీకి శ్రీరామాయణంలో చెప్పాడు. రామచంద్రుడు వస్తాడు, వస్తాడు అని ఎదురుజూస్తూ ఆ రామచంద్రుడి స్మరణ తప్ప ఆవిడకి జీవితంలో మరొక ఆశలేదు. రాముడు వస్తాడని మతంగ మహర్షియొక్క శిష్యులు చెప్పారు. వారిపై విశ్వాసముంచింది. ఎదురు చూడ్డం ప్రారంభించింది. వస్తే ఏదో చెయ్యాలి కదా! ఏపూటకాపూట క్రొత్తక్రొత్త వస్తువులు, రాముడి విశ్రాంతికై ఆకులతో ఏపూటకాపూట పడక తయారు చేసేది. రాలేదు! మళ్ళీ సాయంకాలానికి పాత ఆకులు తీసేసి మళ్ళీ క్రొత్త ఆకులు వేస్తూండేది. ఇదీ ఆవిడ చేసిన ఉపాసన! ఆవిడకు అక్షరాలు రావు. ఏం చదువుకోలేదు. యోగాలు, యాగాలు ఆవిడకి ఏం చేతకానేకావు. కానీ, అచంచలమైన విశ్వాసం, 'రామచంద్రుడు వస్తాడు. గురువు మాట వాస్తవము' అని. ఆ ఎదురుచూపులో, అవ్యభిచరితమైన భక్తి విశేషము ఉంది. కనుక, రాముడు ఆవిడను వెదుక్కుంటూ వెళ్ళాడు. వెళ్ళడమే కాదు, ఆతిథ్యాన్ని స్వీకరించాడు. ఆవిడ భగవత్ సాయుజ్యాన్ని చేరుకుంది. ఆచార్య శ్రీచరణ సన్నిధానానికి చేరడానికి మనిషికి ఈ విశ్వాసం చాలా అవసరం. పరమాత్మ సత్యసంకల్పుడు, పరమ కారుణికుడు. దోషాలు మనలో ఉంటాయని తెలుసు. కానీ విశ్వాసం మనలో ఏర్పడితే ఆ దోషాలను మనలోంచి తొలిగేటట్టు ఆయనే చేస్తాడు. అఖిల వాత్సల్యజలధి, ఆశ్రిత వాత్సల్య జలధి అని కదా స్వామిని అంటారు!

మన పూర్వాచార్యులు, 'కృష్ణుడు' అని అంటే నారాయణుని యొక్క అనంతరూపాలలో పరిపూర్ణమైన అవతారంగా వచ్చిన స్వామి అని అంటారు. ఆ నారాయణుని యందు, అవ్యభిచరితమైన భక్తిని లభించినట్లయితే మనకు కలగవలసిన జ్ఞాన బలాన్ని ఆయనే యిస్తాడు. మనం అల్పజ్ఞులం కదా! ఆయన సర్వజ్ఞుడు. శరీరానికి శారీరక పదార్థాలతో బలంకల్గినట్టే, ఆత్మకు బలమిచ్చేది పరమాత్మ యందు విశ్వాసం పరమజ్ఞానం, సర్వజ్ఞత్వం కల్గిన ఆయన యందు మనకు విశ్వాసం ఏర్పడితే, ఆతని జ్ఞానం మనకూ లభించి, తద్వారా కల్గిన బలంతో ఈత్రిగుణములు, వాటి ప్రభావమును మనందూరం చేసికోగల్గుతాము. స్వస్వరూపాన్ని పొందగల్గుతాము. **'బ్రహ్మభూయాయ కల్పతే'** భగవంతుడు చెప్పాడు కనుక ప్రయత్నం చేద్దాం! ఆ గీతాజ్యోతిని మనలో వెలిగించుకుందాం!

### 37వ వారం

## లోకంలో ప్రకాశించే ప్రతీదీ పరమాత్ముని అంశే

**న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః ।**
**యద్గత్వా న నివర్తంతే, తద్ధామ పరమం మమ॥** 15అ॥ 6శ్లో॥

*ప్రతిపదార్థములు:* **తత్**=పరిశుద్ధాత్మను; **సూర్యః**=సూర్యుడు, **న భాసయతే**=ప్రకాశింపజేయజాలడు; **శశాంకః**=చంద్రుడు; **న భాసయతే**=ప్రకాశింపజేయ జాలడు; **పావకః**=అగ్నిహోత్రుడు, **న భాసయతే** = ప్రకాశింపజేయజాలడు, **యత్**=ఏ పరిశుద్ధాత్మ స్వరూపమును, **గత్వా**=పొంది, **న నివర్తన్తే**= వెనుదిరగరో; **తత్**=అట్టి; **పరమం**=సర్వోత్కృష్టమైన; **ధామ**=జ్యోతి; **మమ**=నా యొక్క అంశయై యున్నది.

ఈ వారపు శ్లోకంగా 15వ అధ్యాయపు 6వ శ్లోకాన్ని మనం అనుసంధానం చేసుకుంటున్నాం. 15వ అధ్యాయాన్ని **'పురుషోత్తమ ప్రాప్తి యోగము'** అని పిలుస్తారు. **'పురి'** అని మన శరీరానికి పేరు. జీవుడు పురములో ఉండువాడు కనుక వానికి **"పురుష"** అని పేరు. అంటే మనందరికి పురుషులనే పేరు. లోకంలో శరీర ఆకారాన్ని బట్టి ఇతడు పురుషుడు, ఈమె స్త్రీ, ఇది పశువు, ఇది పక్షి అని పేర్లు మారినా, శరీరం అనే సాధనాన్ని కలిగి ఉండి, కర్మ అనుభవం కోసం దానిని వాడుకునే ప్రాణులందరికీ పురుషులు అనే పేరు. అయితే మనుషులు ఆ పేరును సొంతం చేసేసుకున్నారు. అందునా మగవారికి అది రూఢిఅయిపోయింది. తెలివి కలిగి ప్రవర్తించే వాళ్ళని **"ఉత్ పురుష"** అని అంటాం. కొందరు అది తెలియక దేనికోసమూ ప్రయత్నమే చేయక జీవిస్తుంటారు. వాళ్ళని **'సామాన్య పురుషులు'** అని అంటాం. కానీ, మరి కొంత మంది ఇతరులకి హాని చేస్తే తప్ప బ్రతకలేరు. ఇతరులను దోచుకుంటే తప్ప వాళ్ళకి జీవితం గడవదు. అలా తప్ప వాళ్ళకి తోచనే తోచదు. అలాంటివాళ్ళని అధములని, **అధమాధములని,** అంటారు.

కొంతజ్ఞానం కలిగి, ఏదో ఒక ప్రయోజనాన్ని సాధించడం కోసం మనం ఇక్కడ ఉన్నాం అని గుర్తించినవారు పురుషోత్తముడైన పరమాత్మను తెలుసుకునే ప్రయత్నం చేస్తారు. ఒక ఆచార్యులు చూపిన శాస్త్రీయమార్గం ద్వారా ఆప్రయత్నం సాగాలని గుర్తించిన మనుష్యులను మనం **'ఉత్పురుషులు'** అంటాం. లోకంలో కొంతమంది కేవలం తినడానికే పుడతారు. బ్రతకడం అనేది ఒక లక్ష్యం కనుక, దానికి సాధనమైన శరీర పోషణ కర్తవ్యం కనుక. సంపాదించాలి. అని గుర్తించి అవసరమైనంత మాత్రమే తినేవాళ్ళు ఉంటారు. అలాంటి వాళ్ళను **'ముముక్షువులు'** అని పిలుస్తాం. ఉన్న స్థితిని వదిలి, ఉన్నతస్థితిని చేరాలనే అలాంటి ముముక్షువులకి **'ఉత్పురుషులు'** అని పేరు. అంటే వాళ్ళూ ఈలోకంలోనే ఉంటారు. మనుషుల్లానే వుంటారు. వాళ్ళూ మాట్లాడతారు. సంచరిస్తారు. కానీ వాళ్ళకుండే జ్ఞానం మాత్రం మిగిలిన వారికంటే విలక్షణంగా ఉంటుంది కనుక, వారిని ఉత్పురుషులు అని అంటారు. వారి స్థితి ఎలా ఉంటుంది? అనే ప్రశ్నకి స్వామి ఈ శ్లోకంలో అద్భుతమైన సమాధానాన్ని చెప్పాడు. వీరు ఏదైనా చాలా గొప్ప దానిని పొందాలను కుంటారు తప్ప, అల్పమైన వాటిని కోరనే కోరరు. ఉన్నవాటిలో అత్యుత్తమం, అతిశయించినది కావాలి వారికి.

ఎవరికైనా, మంచి అందంగా ఉండాలి అన్పిస్తుంది. ప్రకాశిస్తూ ఉండాలి అని అన్పిస్తుంది. లోకంలో అలా ప్రకాశించే జ్యోతిర్ధామలు అంటే, ప్రకాశించే స్థానాలు కొన్ని ఉన్నాయి. అవి మనకు ఎప్పుడూ ప్రకాశిస్తూ కన్పించేవి, ఒకరు వెలిగించక్కర్లే కుండా ప్రకాశించేవి, ఆకాశంలో వెలుగుతుండే సూర్యుడు, నక్షత్రాలు. ఇవి ఎప్పుడూ ప్రకాశించేవే అయినా ఒక్కొక్కసారి మనకు కన్పించవచ్చు. ఎన్నోసార్లు మనకు కన్పించక పోవచ్చును.

సూర్యుడు ఉదయించినా, చంద్రుడు ఉదయిస్తున్నాడు అన్నాగానీ మనకొక ఆనందం. సూర్యోదయం లోకాలకి ఒక రకమైన కాంతినందిస్తుంది. చంద్రోదయం మరొక కాంతినిస్తోంది. రెండూ కూడా అప్పుడప్పుడు కన్పించకపోవచ్చు. అలాంటి సమయాల్లో కూడా అగ్ని మనకు కావలసిన తేజస్సు నిస్తుంది. ఇలాంటి కాంతిస్థానాల్లో ఉండే కాంతి బయటి బయటి చీకట్లను మాత్రం తొలగించ గలుగుతుంది. ఈ బయట కన్పించే చీకట్లను తొలగించు ఇన్నిరకాల సూర్యచంద్ర, నక్షత్రాది జ్యోతిః పుంజాలలో జీవుడు కూడా ఉంటేనే ఆ కాంతి ఉంటోంది. వీటి ఉనికికి,





కాంతికీ ఆధారము అయిన ఆ లోపలి జీవుడు వీటికంటే అతిశయించిన కాంతి కలవాడు.

నిజానికి సూర్యుడు ఒక గోళం మాత్రమే. అది కూడా ఒక శరీరమే. ఒక కర్మవల్ల మనకి ఈ శరీరం వచ్చినట్లే, మరొక కర్మ వల్ల ఆ జీవుడికి సూర్యాది శరీరం వచ్చింది. అయితే, దానిని మన శరీరాలనీ పోల్చి చూస్తే అది చాలా గొప్పది. మన శరీరం-జీవుడికుండే అతిశయించిన కాంతిని కప్పివేస్తోంది. మూసిపారవేస్తోంది. కాని సూర్యుడు, చంద్రుడు అని చూసే ఆ శరీరాలు ఆ లోపల ఉండే జీవుని యొక్కకాంతి విశేషాన్ని ఆపకుండా బయటకు వచ్చేట్టు చేస్తున్నాయి. సూర్యగోళమే అంత కాంతి నిస్తుంటే, దానికి కూడా ఆధారమై లోపల ఉండే జీవుడికి కర్మ తొలగితే ఏర్పడే కాంతి మనం **'ఇంతటిది'** అని చెప్పలేం. జ్ఞానమే నీ స్వరూపం. సూర్యచంద్రనక్షత్ర అగ్ని మొదలైన స్వరూపాల్ని కూడా ప్రకాశింప జేసేటంత శక్తి నీది. ఇది భగవదధీనమైఉండేది సుమా!

**సూర్యుడు** అని గోళానికి పేరు. ఆ గోళానికి కాంతినిచ్చేవాడు, లోపల ఉండే జీవుడుతప్ప, గోళం సహజకాంతికలది కాదు **'న తద్భాసయతే సూర్యః'** సూర్యుడు ఆ జీవాత్మ స్వరూపాన్ని ప్రకాశింపచేయడు. భౌతిక వస్తువుల ఆకారాన్ని, చీకటినితొలగిస్తూ ఇంద్రియము ద్వారా, తెలుసుకోవడానికి మాత్రం సహకరిస్తాడు. అతని హద్దు అంతే. **'న శశాంకః'** సూర్యుడు లేనప్పుడు చంద్రుడు చేసేదీ అదేపని, మరొక రూపంలో. సూర్యుడు తీక్షణకిరణ ప్రసారణం చేస్తే, ఈయన ఆహ్లాదాన్ని కలిగించే శీతల కిరణ ప్రసారణం చేస్తాడు. ఆ చంద్రుడు కూడా ఆత్మస్వరూపాన్ని ప్రకాశింపజేయ చేతకానివాడే. ఆతడికి కూడా ఆ కాంతి యిచ్చేది ఆత్మే. **'న పావకః'** అగ్నికి, కూడా ఆ ప్రకాశాన్నిచ్చేవాడు లోపల ఉండే జీవుడే. ఆ జీవుడికి అది ప్రకాశకం కాదు. అలాంటి జీవ స్వరూపాన్ని **'అది భగవదధీనమైనది'** అని గుర్తించగల్గితే, **'న నివర్తంతే'** ఇక మళ్ళీ కర్మబంధంలోకి రానవసరంలేదు. జీవుడు తనయొక్క స్వస్వరూపాన్ని సాక్షాత్కరించుకోగలుగుతాడు. అతడికుండే భగవత్ శేషత్వాన్ని పరిపూర్ణంగా గుర్తించగలుగుతాడు. సకల వస్తువులకు ప్రకాశకముగ, భగవంతునికి దాసునిగ ఈలోపల ఉన్నాడని తెలుసుకోగలుగుతాడు. 'తద్ధామ పరమం మమ' హే! అర్జునా! సూర్యాదులు కాంతి స్థానాలే. కాని భౌతికం వరకు అవి పరిమితం. మరి జీవుడో **పరమంధామ**=ఆ సూర్యాది గోళాలకు కూడా వెనకాతల ఉండి ప్రకాశింప చేసే యోగ్యత కలవాడు కనుక **'పరమంజ్యోతిః,** పరంజ్యోతి స్వరూపుడు అని అంటాం. ఆ జీవుడు, **'మమ'** అంటే నా అంశ స్వరూపుడు. అంటే నాలో ఒక భాగముగా ఉంటాడు, అని భగవంతుడు 15వ అధ్యాయంలో స్పష్టపరుస్తున్నాడు.

జీవుడు భగవంతుడి యొక్క అంశ. సాధారణంగా **'అంశ'** అని అనగానే ఆయన, ఈయన వేరా.... మరొకడా అనే సంశయాలు కలుగుతాయి. మన శరీరంలో ఎన్నో అంశలు ఉన్నాయి. అయితే ఇవి శరీరాన్ని విడిచి పెట్టడానికి వీలుకాక శరీరంలో కలసి ఉన్నాయి. పైన మనం వేసిన వస్త్రంకూడా మనలో ఒక అంశే. కాని ఇది తీసిపారవేయాలంటే పారవేయవచ్చు. శరీరంలో చేయి ఒక అంశ. కాని తీసివేయలేము. శరీరంతో విడదీయరాని సంబంధంతో కలిపి ఉన్న అంశ చేయి అయితే దాని పేరు వేరు, దాని రూపు దాని గుణాలు దాని పనులు దానివి. అలాగే ఒక్కొక్క అవయవము మన శరీరంలో ఒక్కొక్క అంశ. వాటి పేర్లు. పనులువేరు. ఇన్ని కలిగిన మన స్వరూప, రూప, గుణవిభూతులు వేరువేరు. అంతమాత్రం చేత అవి స్వతంత్రాలు అని అనుకోనవసరంలేదు. అలానే, భగవంతుడిలో ఈ జీవులు అందరూ కూడా అంశస్వరూపులై

ఎప్పుడూ ఉంటారు. భగవంతుడు ఇందరికీ లోపల తానుండి ఇందరినీ నియమిస్తూ, ఉంటాడన్నమాట. ఈవిషయాన్ని తెలుసు కోవడం మనకు అవసరం. ఎన్నో రకాల దుఃఖాలకు మనం లోనవుతున్నాం, వీటి నుంచి మనం బయటకు రావాలి. అలా రావాలి అంటే మనకు స్వస్వరూపజ్ఞానం ఉండాలి. మనల నందరినీ కూడా సుఖంగా ఉంచగలిగేది ఉత్తమ జ్ఞానం భగవత్ శేషభూతమైన వారలము ఈ జీవులము అని తెలిపేదైతేనే ఆ ఉత్తమత్వం సిద్ధిస్తుంది. దాని ద్వారానే మనం మనల్ని ఆనంద పరచుకోగలుగుతాం! మనతోటి ప్రాణికోటిని ఆనంద పరచగలుగుతాం! అపుడు మనం చేసే ప్రతిపనిని భగవత్ సేవగా మార్చగలుగుతాం! మాధవసేవగా సర్వప్రాణి సేవను మనం చేయగల్గుతాం! మనందరినీ నియమించే పరమాత్మని ఆరాధించగలు గుతాం! స్వీయ ఆరాధన చేసికోగలుగుతాం! సర్వ ఆదరణ చేయగలుగుతాం! మన గీతాజ్యోతి లక్ష్యాలలో దీనిని ప్రధానం చేసికొంటూ ముందుకు సాగుదాం!

38వ వారం

# తినే క్రమం తెలుసుకో-జీవనం ఉపాసనగా మలచుకో

**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః ।**
**ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥** *15అ॥ 14శ్లో॥*

*ప్రతిపదార్థము :-* **అహం**=నేను; **వైశ్వానరః**=జఠరాగ్నిగా, **భూత్వా**=అయి; **ప్రాణినాం**=ప్రాణులయొక్క; **దేహం**=దేహమును; **ఆశ్రితః**=ప్రవేశించినవాడనై; **ప్రాణాపాన సమాయుక్తః**=ప్రాణవాయువు అపాన వాయులతోకూడుకొన్న వాడనై; **చతుర్విధం**=ఖాద్య; చోష్య, లేహ్య, పేయ రూపములగు నాలుగు విధములైన, **అన్నం**=అన్నమును, **పచామి**=పక్వము చేయుచున్నాను.

మనిషి బాగుపడడానికి ఎన్నో సాధనాలు చెప్పారు. యాగాలు, యోగాలు, తపస్సులు, దానాలు, ధర్మాలు, తీర్థాల్లాంటివి సందర్శించడం. ఎన్నెన్నో విషయాలు చెప్పారు. కానీ, అవన్నీ చేయడం చాలా కష్టం. సులభమైన ఉపాయం ఏదైనా ఉంటే బాగుంటుంది. భగవంతుడు చాలా దయామయుడు. మనకు అలవాటైనది, ఇష్టమైనదే, శ్రేయస్సును కలిగించే ఒక సాధనంగ ఈ శ్లోకంలో చెప్తున్నాడు. అది **'తినటం'.** అది ఒక్కటి నేర్చుకుంటే అన్ని సాధనలు చేసినట్టే అంటున్నాడు స్వామి. ఛాందోగ్యమనే ఒక ఉపనిషత్తు కూడా 5వ ప్రపాఠకంలో, మనం బాగుపడడానికి ఇదే ఓఅందమైన సాధనమని చెప్పింది.

భోజనం చేయడం ఒక్కటి నేర్చుకుంటే చాలు అని. అంటే, ఏది తినాలి? ఎక్కడ తినాలి? ఎప్పుడు తినాలి? ఎంత తినాలి? ఎలా తినాలి? ఇవి కనుక నేర్చుకోగల్గితే చాలు బాగుపడ్డట్లే. తినేది ఆరోగ్యకరంగా ఉండాలి. రుచిగా ఉండాలి. శుచిగా ఉండాలి. అది క్షేమాన్ని కలిగించేది కావాలి. తిన్నది లోపలికి వెళ్ళిన తరువాత ఆ ఆహారాన్ని జీర్ణం చేసే ఒక అగ్ని మన లోపల ఉంటుంది. దాని పేరు జఠరాగ్ని. దానిని శమింప జేయటం కోసం ఎన్నో రకాల ఆహారాదులను మనం శరీరంలో చేరుస్తున్నాం. లోపల ఉండే జఠరాగ్నికి సరియైన ఆహారాన్ని అందివ్వక కొందరు దానిని పాడు చేస్తుంటారు. మరి కొందరు 'ఏదో ఒకటి నాలుకను తృప్తి పరచడమే కదా ప్రధానం' అనినోటికొచ్చినదల్లా తింటూంటారు.





మనకి ఈ జఠరాగ్నిని ఏ విధంగా సరియైన రీతిలో గౌరవిస్తూ పోషించాలి అనే విషయం తెలియకుండాపోయింది. ఈ లోపల ఉండే అగ్నిహోత్రం బాగా మండుతూంటేనే లోపల వేసినవన్నీ సరియైన స్థితిలో పచనమ వుతాయి. అలా పచనమైనవే శరీరంలోని వివిధ భాగాలకూ పోషక పదార్థరూపంలో వెళుతుంది. కొన్నిచోట్లకు శక్తిరూపంలో వెళుతుంది. కొన్ని చోట్లకు రక్తంగా వెళుతుంది. మనం తినే ఆహారం నాలుగ రకాలుగా ఉంటుంది. నమిలి మ్రింగేవి, జుర్రేవి, చప్పరించేవి, త్రాగేవి వీటినే భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యములని అంటారు. ఈ నాలుగు రకాలుగా మనం లోపలకు పంపించే ఆహారమంతా లోపలకు వెళ్ళిన తరువాత జఠరాగ్ని ప్రభావంచేతనే బాగా అరుగుతుంది. ఆ తరువాత ఆ అగ్నియే ఏరూపంలో ఎక్కడికి ఎంత అవసరమో ఆయా చోటికి ఆయా రూపంగా దానిని పంపించివేస్తుంది. అది సవ్యంగ సాగితే నేను ఆరోగ్యంగా ఉన్నాను, నాకు ఆనందంగా ఉంది అని మనము అనగలుగుతాము. లేకపోతే వాడురోగి అవుతాడు. ఆ అగ్ని ఉన్నంత వరకే జీవించి ఉన్నాడంటారు. అంతే!

ఈ శరీరంలో ఎన్నో రకాల ప్రాణశక్తులున్నాయి. ఒక్కొక్క రకమైన ప్రాణశక్తీ ఒక్కొక్కరకమైన పని ఈ శరీరానికి చేస్తోంది. వీటి అన్నింటికి ఆ శక్తినిచ్చి వాటికి కావాలసిన ఆహారాన్ని పంపించే అగ్నిహోత్రమే జఠరాగ్ని. దానికి **'వైశ్వానర'** అని పేరు. ఈ కన్పించే లోకాన్నంతటిని **'విశ్వము'** అంటారు. ఈ కన్పించే పదార్థజాలమునంతటిని **'వైశ్వము'** అని అంటారు. మనందరిపేరు గూడ అదేనన్నమాట. ఒకడిని మనిషి అని అంటున్నాం. ఒకడిని జంతువు అని అంటున్నాం. ఒకడిని పక్షి అని అంటున్నాం. ఒకరిని కీటకం అని, ఒకరిని క్రిమి అని అంటున్నాం. ఒక వస్తువుని చెట్టు అని అంటున్నాం. ఒక వస్తువుని రాయి, రప్ప, కొండ, గట్టు, గోడ..... ఇవన్నీ రకరకాల వస్తువులు. ఇవన్నీ ఈ ప్రపంచంలో ఏర్పడ్డ పదార్థజాతాలు. కొన్ని తిరిగేవి, కొన్ని తిరగనివి. కొన్ని ప్రాణమున్నవి. చెట్లు మొదలైన కొన్ని ప్రాణమున్నట్టు కన్పించినా తిరగక నిలబడి ఉంటాయి. ఇన్ని పదార్థాలకూ వెనుక ఆయా పదార్థాలను నిలబెట్టడానికి కావలసినంత స్థాయిలో, ఉంటూ తను మాత్రం నశించక, ఆ వస్తువులో మార్పు కలిగేటట్టు చేస్తూ ఉండే ఆ లోపలి అగ్ని విశేషానికే **"వైశ్వానర"** అని పేరు.

పదార్థాలన్నీ విశ్వము అయితే ఈవిశ్వానికి సంబంధించిన ఆకృతి విశేషములన్ని వైశ్వములు. వాటిలోపల తాను ఉంటూ నశించనిది (న రీయతే, న క్షీయతే=నశించనది) కనుక **'వైశ్వానర'**మైనది. లోపల ఉంటూ కూడ తాను మారక వీటిని మారుస్తూ ఉండడమే కాక, ఆ మార్పు కూడా ఉన్నతికి చేర్చడానికే చేస్తోంది కనుక అగ్ని అన్నారు. **అగ్రం నయతి ఇతి అగ్నిః** అని దానికొక వ్యుత్పత్తిని చెప్తారు శాస్త్రాల్లో. అగ్రం=పైకి, మరింత ఉన్నతికి, నయతి= తీసుకువెళుతుంది. నిన్ను చేరుస్తుంది. ఈ శరీరంలో ఉండే అగ్ని మనం మారడానికి కారణమౌతోంది. ఈ మార్పుకూడ ఉన్నతిని పొందడానికి వీలుగా చేసి సహకరించే అగ్ని కనుక, ఈ లోపల ఉండే అగ్నినే **వైశ్వానరాగ్ని** అని అంటారు. దీనినే జఠరంలో (పొట్టలో) ఉంటుంది కనుక **"జఠరాగ్ని"** అంటారు. ఇది అందరిలోను ఉంది. చీమలో చీమంత, మనిషిలో మనిషంత. చెట్టులో చెట్టంత; దేవతలలో దేవతలంతగా అగ్నిహోత్రం తాను ప్రకాశిస్తూ ఉంటుంది. ఉండటానికి కారణం మనలని తాను తరింప చేయడమే.

అందుకే దీనికి మరొక నిర్వచనం చెబుతారు. ఈ లోకంలో ఉండే ఇన్ని రకాల పదార్థాల్ని (విశ్వాన్) నయతి ముందుకు నడిపించుకుపోతుంది. **విశ్వాన్**(నరాన్) **నయతి**=ఈ ప్రపంచంలో ఉండే రకరకాల పదార్థాలని ధరించి వాటి వాటికి తగినట్టుగా ముందుకు నడిపించేదే **'వైశ్వానరాగ్ని'.** అది ఉంటే ఇవి నడుస్తాయి. అది లేకపోతే ఇవి నడవవు. లోపల ఉండే అగ్నిహోత్రం చల్లారిపోతే అపుడు పైన ఉండే శరీరాన్ని శవం అని అంటాం. వస్తువులు అన్నింటి లోపల ఉండి శవాల క్రింద మారకుండా, వాటి రూపు, చెడకుండా కాపాడుతూ ఉన్నతికి తగినట్టుగా నడిపించే అగ్నిహోత్రమే ఈ లోపల ఉండే వైశ్వానరాగ్ని అని మనం గుర్తించాలి.

మనం తినే ఆహారం దానికోసమే. ఎలాంటి ఆహారాన్ని మనం తినాలి? ఏది మనల్ని ఉద్ధరిస్తుందో అది మనం తినాలి. లోకంలో కొంతమంది , కాలే కడుపుకి,రెండు మెతుకులు అన్నం పెట్టండి. వేదాన్తములు వల్లించి ఏం ప్రయోజనం? అంటూంటారు. నిజమే! అది చాలా గొప్పపని. నాకు దేవుళ్ళు గీవుళ్ళు ఏమీ విశ్వాసం లేదు. నాకు కాలేకడుపుయందు విశ్వాసం. దానిని తృప్తి పరచడంలో విశ్వాసం అనేవాడు, వాడూ ఒక భక్తుడే. ఎందుకంటే, అతను భగవంతుడిని ఆకలి రూపంలో (వైశ్వాన రాగ్నిగా) గుర్తిస్తున్నాడు. అంటే, లోపల ఉండే జఠరాగ్నిగా మాత్రమే గుర్తిస్తున్నాడు తప్ప, ఆ వెనుక పరమాత్మదాక చేరలేదన్నమాట. వైశ్వానరాగ్నిని వాడు భౌతికమైన ఆకలిగా మాత్రమే తెలుసుకొని, దానిని పోషించాలి అని అక్కడే ఆగిపోయాడు. కాస్త లోపలికి చూస్తే చాలు. **'అది లోపల ఉండే ఒక దివ్యశక్తి'** అన్న జ్ఞానంతో కనుక దానికి కావల్సినాహారాన్ని వీడు అందించగల్గితే **'యథా ఇషీక తూలం అగ్నౌ ప్రోతం ప్రదూయేత'** అని వేదాన్త శాస్త్రం చెప్పినట్టుగా, వీడు ముక్తిమార్గంలో బ్రహ్మో పాసన చేసినట్లే. ఆ ఉపాసనకే **'వైశ్వానర ఉపాసన'** అని ఈ శ్లోకంలో భగవంతుడు చెప్తున్నాడు.

ఇదే మనం కూడ తెలుసుకొని ఆహారం తింటే చాలు ఉపాసన చేసినట్లే. అందుకే భోజనం చేసేటపుడు **"కృష్ణార్పణమస్తు", "వైశ్వానరార్పణమస్తు"** అని తలచుకొని ఆహారం లోపల వేస్తే అన్ని ఉపాసనలు చేసినట్టే. భగవంతుడే లోపల ఉండే వైశ్వానర అగ్ని స్వరూపుడు. ఆ ఉపాసన ఎలా చెయ్యాలో తెలుసుకుందాం. తూర్పు, ఉత్తరాల వైపు కూర్చుని సరియైన ప్రాంతంలో సరిగా పక్వమైన, అదీ భగవంతుడికి నివేదితమైన, ఆహారాన్ని భగవంతుని స్మరిస్తూ లోపలికి తీసుకోగలిగితే అదే మనం చేసే పెద్ద ఉపాసన అవుతుంది.

ఈ వైశ్వానర స్వరూపాన్ని గురించి ఛాందోగ్యోపనిషత్తులో 5వ ప్రపాఠకంలో ఒక అందమైన కథ వుంది. ప్రాచీన శాలుడు, సత్యయజ్ఞుడు, ఇంద్రద్యుమ్నుడు, బుడిలుడు, జనుడు అనే మహానుభావులు, మహర్షులు ఐదుగురు కలసి ఈ లోపల వ్యాపించి నడిపే శక్తివిశేషం వైశ్వానరమంటారని. అదేమిటో దాని గురించి తెలుసుకోవడానికి ఉద్దాలకుడు అనే మహానుభావుడి దగ్గరకు వెళ్ళారు. అతనికీ అంతా తెలియక ఆ రోజుల్లో పరిపాలకుడిగా ఉండే అశ్వపతి అనే రాజు దగ్గరకు తీసుకువెళ్ళాడు. ఆయన అందరినీ ఆదరించి కూర్చోపెట్టి, వాళ్ళు చేసే ఉపాసన ఏమిటో ముందర తెలుసుకుందాం అని వాళ్ళనడిగాడు. ఒకాయన నేను ఈ ద్యులోకాన్ని వైశ్వానరుడిగా ఉపాసన చేస్తున్నానయ్యా? అన్నాడు. రెండో ఆయన్ని అడిగాడు. ఆయన ఆదిత్యుని నేను ఈ వైశ్వానరుడు అని ఉపాసన చేస్తున్నాను అన్నాడు. మరొకాయన అసలీ ప్రాణశక్తే వైశ్వానరమని, దానిని వాయు రూపంలో ఉపాసన చేస్తున్నాను అన్నాడు. మరొకాయన తిన్నదంతా జీర్ణం చేసే ఈ పొత్తికడుపుని ఈ నాభిస్థానములో ఉండే, ఆకాశ స్వరూపంలో ఉన్న వైశ్వానరుడని ఉపాసన చేస్తున్నాను అన్నాడు. ఇంకొకాయన ఈ నాభి ఏమో కొంచెం పైది, దాని క్రిందది వస్తి అని అంటాం. ఈ వస్తి స్థానంలో ఉండే జలస్థానం వైశ్వానరుడిగా నేను ఉపాసన చేస్తున్నాను అన్నాడు. ఉద్దాలకుడు అనే మహానుభావుడు మాత్రం అసలు మనకందరికీ ఆధారం పాదాలు కనుక, విశ్వమంతటికీ పాదాలవంటిదైన పృథివిని వైశ్వానరుడిగా నేను ఉపాసన చేస్తున్నాను అన్నాడు.

అశ్వపతి అన్నీ విని మీరందరూ చేసేది మంచి ఉపాసనే, కానీ, నిజానికి ఇవన్నీ కలిస్తేనే కదా మనం సంపూర్ణంగా ఆరోగ్యంగా ఉంటున్నాం. కనుక, మనకి మూర్ధా ఉండాలి. ప్రాణం ఉండాలి. చక్షువులు ఉండాలి. అలానే నాభి, అక్కడ అరిగించే పద్ధతి బాగుండాలి. ఈ లోపల విసర్జనీయమైన స్థానములు కూడా ఉండాలి. పాదములు కూడా ఉండాలి. ఇన్నీ కలిపితే మనకి ఒక సమగ్ర స్వరూపం ఏర్పడుతోంది. అలాగే ఈ ప్రపంచములో మనం చూసే పైలోకాలు, మనకు ప్రాణా ధారమైన ఆదిత్యాదికాంతి గోళాలు, వాటితో పాటు ప్రాణసంచాలకాలయిన వాయువు





మొదలైనవి, మనకు ప్రాణ ఆధారమైన జలం, మనం నివసించే పృథివీ, ఇవి అన్నీ కూడ కలిపితేనే భగవత్స్వరూపం. ఇన్నిటినీ తన దేహంగా కూర్చుకొని భగవంతు డున్నాడయ్యా! మీరు ఆయనలోని ఒక్కొక్క భాగాన్ని మాత్రమే తెలుసుకొని అదే భగవంతుని స్వరూపమని ఉపాసన చేస్తున్నారు. అది సరికాదు. అన్నీ కలిపితే భగవద్దేహం. దానికి మన దేహం ఒక మోడల్. ఇందులో ఎన్నిభాగాలో చూడండి. ఇవి సవ్యంగా గుర్తించి ఉపాసన చేస్తే, దానికి తగినట్టుగా ఆహారాన్ని అందిస్తే అన్నీ బాగుంటాయి. ఒక్కభాగమే అనుకుంటే అది మాత్రమే ఆరోగ్యంగా ఉండి, మిగతా భాగాలు అనారోగ్యంగా ఉంచుకోలేం కదా! అలానే ప్రపంచమంతా కూడా భగవత్ స్వరూపం.

ఇందులో పైఉపరితల లోకాలనుంచి మనం ఆధారంగా కలిగి ఉన్న భూమిదాకా ఇవి అన్నీ భగవంతునియొక్క వివిధ అవయవాలే. మనం విష్ణు సహస్రనామం చదివేటప్పుడు, **'భూః పాదౌ యస్య నాభిః వియత్'** అంటూ పఠిస్తామే, ఈ రకమైన స్థితి మనం చూడాల్సిన అవసరం ఉంది. కనుక మన శరీరం చిన్ని **మినియేచర్** ఫామ్ అయితే ఈ ప్రపంచం భగవంతుడి యొక్క విరాట్రూపం. ఇది మనం గుర్తించి, ఇక్కడ మనం ఉపాసన చేద్దాం. ఇది వానికి చెందుతుంది అంటూ అశ్వపతి అనే రాజు ఆరుగురు ఋషులకు ఉపదేశించాడు. దీనినే **వైశ్వానరబ్రహ్మవిద్య** అంటూ ఛాందోగ్యోప నిషత్ వివరించింది. అదే శ్రీకృష్ణ భగవానుడు స్పష్టపరుస్తుంది.

ఆహారం మనమే తిందాం కాని, ఇది అన్ని వైపులకు వెడుతున్నట్టుగా అందరికీ శక్తిగా ఇది మారుగాక అని భావన చేద్దాం. నేను, మూల రూపమైన భగవంతుడికి అర్పిస్తున్నాను. **'కృష్ణార్పణమస్తు'** అంటూ తిన్నట్లైతే, అది సకల జీవరాశికి శక్తిగా అందుతుంది. చెట్టు వేరుకు నీరు పోస్తే చెట్టు అంతటికీ అందినట్టే మనం భగవదర్పణమని ఆహారాన్ని లోపలకు పంపిస్తే, ఈ ప్రపంచంలో సకల ప్రాణకోటికి ఆ ఆహారం లోపలి వైశ్వానరుని ద్వారా అందుతుంది. అందుచేత ఆహారం మనమే తిందాం! ఎవరికీ పెట్టేయక్కరలేదు. కాని అది మనలో, అన్నిటిలో ఉండే వైశ్వానరరూపుడైన పరమాత్మను చేరుతుంది. అంటే, వేసేది మన నోటి ద్వారా మన పొట్టలోకే అయినా, ఆ పొట్ట, శక్తిరూపంలో ఆహారాన్ని అన్ని అవయవాలకి పంపించి, వాటిని ఆరోగ్యంగా ఉంచి తాను ఆరోగ్యంగా ఉంటుంది. అలానే **'ఇది వైశ్వానరాగ్ని స్వరూపుడైన పరమాత్మకోసం'** అని ఆ ఆహారాన్ని మనం అందిస్తే **'కృష్ణార్పణమస్తు'** అని అందించగలిగితే, ఆయన అందరికీ అందిస్తాడు. మనమూ ఆరోగ్యంగా ఉండగలు గుతాం. **మాధవసేవగా- సర్వప్రాణిసేవ** చేయడమంటే, ఇదే స్వీయ ఆరాధన, ఇదే భగవంతుడి యొక్క ఆరాధన, ఇది సకల ప్రాణులను మనం ఆదరించడమంటే ఈ దృష్టి కలిగి చేయడమే ఆ ఆరాధనకి నిదర్శనం. దీనినే భగవంతుడు **'పచామి అన్నం చతుర్విధం'** దేవ, మానవ, తిర్యక్, స్థావరాల్లో దేనికి దేనికి తగిన రీతిలో దాన్ని నేనే పంపిస్తాను. కనుక, నన్ను గుర్తించి ఆరాధనగా ఆహారం తీసికో-అని ఈ శ్లోకంలో వివరించాడు. ఈనాటి నుంచి మనం తీసికొనే ఏ ఆహారమైనా కృష్ణార్పణ బుద్ధితో స్వీకరించే ప్రయత్నం చేద్దాం!

**గమనిక :** క్యాలెండర్‌లో డిసెంబర్ 19న గీతాజయంతి అని పడింది. ఆ రోజు కాంకుండా. **డిసెంబర్ 15వ తేదీననే గీతాజయంతి.** అని గమనించగలరు. అసౌకర్యానికి చింతిస్తున్నాం.

**మీ భక్తినివేదన.**

సంపాదకీయం

# కృతజ్ఞత

సాధారణంగా సభాకార్యక్రమాలలో నాటకాలలో భరతవాక్యంలా చివర 'కృతజ్ఞతా నివేదనం'అని ఒక ప్రసంగం కావిస్తూంటారు. ఇది సభాలాంఛనమైన మర్యాద.

తనకు, ఒకరు కావించినమేలును గుర్తుపెట్టుకొనేవాణ్ణి కృతజ్ఞుడంటారు. అది మరచిపోయినవాడు అకృతజ్ఞుడు. కృతజ్ఞుని ఎదలో, ఒరులు తనకు కావించిన మేలుపట్ల చిగురించేతలపు, కృతజ్ఞత. ఇది త్రికరణ శుద్ధితో కూడుకొన్నది. ఒరులొనరించిన మేలుపట్ల ఎదలో స్మృతి ఎన్నటికీ ఆర్ద్రంగా, నవకంగా మారాకులు తొడుగుతై, కొనలుసాగి, ఎదనంతా అల్లుకపోయి, మొగ్గదొడిగి, పూలుపూయాలి. ఈ స్మృతి సౌరభం వాక్కుల ద్వారా వెలికిరావాలి. వాక్కులు మృదులాలు, మధురాలు, హార్దాలు, ఆర్జవాంచితాలు, అకుటిలాలూ కావాలి. తలపు, మాటలతో నిలిచిపోకుండా క్రియారూపంగా పర్యవసించాలి. ఆ క్రియలలో విడంబనం కాని, అన్యప్రయోజనాపేక్షకాని ఉండకూడదు. తన ఎద పొడమిన తీపి గురుతుల విరిగుత్తులు, ఎదిరి మ్రోల రాశులు పోసి, ఆ నెత్తావుల వారికి విందులు చేసి, వారి మొగాన మెరిసిన ఆనందపు తళుకులు చూచి, తాను సంబరపడిపోవాలి.

కృతజ్ఞతకు కాలదోషం లేదు. ఇన్నేళ్ళు కృతజ్ఞుడుగా ఉండాలి, తరువాత నీ లెఖ్ఖ ఏమిటి అని తిరగబడవచ్చు అనీ లేదు. అంతే కాదు, నీకు చేసిన వారికే నువ్వు కృతజ్ఞుడుగా ఉంటేచాలుననీ లేదు. నీకు ఎప్పుడో ఎవరో చేసిన మేలుకు కూడా ఎన్నాళ్ళయినా వారికి సంబంధించిన వారికి కూడా నువ్వు కృతజ్ఞుడుగా ఉండాల్సిన విధి నీకుంది. ప్రవరలు చెప్పుకోవటం, ఋషి స్మరణలు చేయటం, గురుపరంపరలు అనుసంధించుకోవటం మొదలయినవన్నీ ఈ భావనంలోనే.

అట్లాగే నీకు మేలు చేసిన వారి వంశంలో అటువారూ, ఇటువారూ కూడా నీకు స్మరణీయులే కావాలి.

ఎప్పుడో సగరుని కొడుకులు తవ్వేరట సముద్రాన్ని. తను రూపు కట్టటానికి, పేరుమోసుకోవటానికి సగరతనయులు కారణం కావటాన వారికి తాను కృతజ్ఞుణ్ణి అంటాడు సముద్రుడు. మంచిదే. కాదనం, అది ఎప్పటిమాట! ఎప్పుడది తలుచుకుంటున్నాడు? రామదూతగా హనుమ సాగరాన్ని లంఘిస్తున్నప్పుడు.

సాగరులవల్ల జన్మ సముద్రానికి. వారు ఇక్ష్వాకులు. కనుక ఇక్ష్వాకువంశం నాకు పూజార్హం, అంటాడు సాగరుడు. ఆ వంశం కోసం హనుమ కడలిని లంఘిస్తున్నాడు. ఇక్ష్వాకు సచివుడాయన ఇప్పుడు, ఆయనకు కాస్త తోడ్పడితే తన జన్మ ధన్యమౌతుంది - అనుకుంటాడు. అయ్యా! ఇదిగో! ఇదీ కృతజ్ఞత! ఇట్లా ఉపకార స్మృతి తెగిపోకుండా సాగుతూ ఉండాలి. అప్పుడే మానవత బతికి బట్టకడుతుంది. అనుకొని ఊరకున్నాడా? ఉత్సాహంతో ఉద్యమించేడు. లోనున్న మైనాకుణ్ణి అలలతో తట్టి పిలిచేడు. లే, బయటకు రా. హనుమ మనకు అతిథి. తన





దారిన తాను పోతున్నాడాయన. కాని దారిన పోతున్నవాడికీ ఎదురేగి సాష్టాంగ మెరగి ఆతిథ్యం ఇవ్వటం మన మర్యాద.

నీ శిఖరాగ్రాన హనుమ కాస్త కాలూని సేదతీరతాడు. తరువాత తేలికగా ముందుకు వెళతాడు అన్నాడు.

నాకేం పని అన్నాడామైనాకుడు? ఆయన కృతజ్ఞుడే! తననుకడుపులో దాచుకొని కాపాడిన కడలి ఇన్నేళ్ళకు ఒక కోరిక తానుగా కోరు తున్నది. కోరకుండానే తానేమైనా చేసి ఋణం తీర్చుకోవాలి. అంతమాత్రాన ఈ ఋణం తీరిపోయేదికాదు. ఈ కృతజ్ఞత అన్నది ఎన్ని జన్మలెత్తినా అనువర్తిస్తూనే ఉంటుంది. అది వేరే విషయం. ఇన్నాళ్ళకు సముద్రుడు తననోపనిని చేసిపెట్టమన్నాడు. ఇంతకంటె ఏం కావాలనుకొన్నాడు మైనాకుడు.

పైకి లేచేడు మైనాకుడు. గుండెతో కొండ కొమ్మును ఢీకొన్నాడు హనుమ. ఆ వేగానికి మైనాకుడు పరవశించిపోయేడు. మానవరూపంలో హనుమ ముందు నిలిచేడు. సముద్రుని ప్రేరణ నివేదించేడు. అతని కృతజ్ఞతను ప్రస్తావించేడు. **'కృతేచ ప్రతికర్తవ్యం, ఏషధర్మస్సనాతనః'** అన్నాడు.

ఉపకారస్మృతి ఈ జాతి లక్షణం. ఇది సనాతన ధర్మం. అంతే కాదు, సముద్రంలో తలదాచుకోవటానికి మీ నాయనగారు వాయుదేవులు నాకెంతో సహకరించేరు. ఆనాడు ఆయన తోడ్పాటు లేకపోతే రెక్కలు తెగి ఏ మూలనో పడిఉండేవాణ్ణి. మీ తండ్రి నా బతుకు నిలిపేడు. ఇన్నేళ్ళకు ఆయన కుమారుడివైన నీకు కాస్త ఆతిథ్యమిచ్చి ఋణం తీర్చుకొనే అవకాశం, కృతజ్ఞత నివేదించుకొనే అవకాశం లభించింది. మా నాయనవి కదూ! అంటాడు మైనాకుడు.

సమయం లేదు. పొద్దు పోతోంది. చెయ్యాల్సిన పని ఉంది. మధ్యలో ఆగనని మాట ఒకటి ఇచ్చేను. ఆతిథ్యమిచ్చినట్టే - అంటూ ఒక చేత్తో మైనాకుని భుజం తట్టి, సరే మరి వెళ్ళొస్తా - అంటూ దూసుకు పోతాడు హనుమ. అది వేరే విషయం.

సముద్రుని కృతజ్ఞతను చూడండి. ఎన్నడో నేటికి ఇరవైఒక్క తరాలనాడు సగరపుత్రులు తనకు నామరూపాలు కల్పించేరు. సగరునికి రాముడు 21వ తరంవాడు. ఆ వంశంవారు చేసిన మేలు తలుచుకొని ఇన్ని తరాల తరువాత తన కృతజ్ఞతను తెలుపుకోవాలనుకొంటున్నాడు. ఎంత దొడ్డది యీ సనాతన ధర్మం.

నేరుగా సాగరులు తన ముందులేరు. ఆ వంశాన పుట్టిన ప్రభువు రామచంద్రుడూ తన ముంగిటకు రాలేదు. ఇక్ష్వాకు సచివుడే వచ్చినవాడు. వచ్చినవాడూ కాదు తనదారిన తాను వెళుతున్నవాడు. సగరుడికి ఓ పదితరాలు ముందువాడు ఈ ఇక్ష్వాకుడు. ఇక్ష్వాకు స్మరణంతో ఆ వంశంలో ఎవరికైనా, ఎవరి సంబంధం కలవారికైనా తాను కృతజ్ఞుడుగా ఉండాలనే ధర్మానికి కట్టుబడిన వాడు సముద్రుడు.

వాయువు మైనాకుడికి తోడ్పడిన సంఘటనం ఎన్నడో కృతయుగం నాటిది. హనుమ మైనాకుడి దగ్గరకు వచ్చేటప్పటికి త్రేతాయుగం నాలుగోపాదం నడుస్తోంది. ఎంతకాలం గడిచిపోయింది. ఇన్నేళ్ళకు ఇవేళ ఆ తండ్రి కొడుకు తన మీదుగా వెళుతున్నాడని తరాల గాథ తవ్వుకొని పరవశించిన ఎదతో పులకించిన మేనితో ఉబ్బున తబ్బిబ్బున నింగి నిటారుగా నిలిచినాడు మైనాకుడు. మనసారా, మధురంగా, నాయనా అన్నాడు. ఆతిథ్యం స్వీకరించు హనుమా అన్నాడు.

కృతజ్ఞతకు సీమాభూమి ఈ సన్నివేశం.
వట్టినీటిబుగ్గ సముద్రం. మైనాకమొకకొండ.

కృతజ్ఞత కరిగినీరై అగాధంగా, అపారంగా ప్రవహిస్తోంది అక్కడ.
కృతజ్ఞత గడ్డకట్టి శిఖరాలుగా శిరోభూషలుగా శోభిల్లుతోంది ఇక్కడ.

ఇంతదూరం సాగాలి కృతజ్ఞత. తలపులో, పలుకులో, చేతలో తొణికిసలాడాలి కృతజ్ఞత. తరాలు దాటినా, యుగాలు గడచినా కృతజ్ఞత ఇల్లా వెల్లివిరుస్తూను ఉండాలి.

జన్మనిచ్చిన విద్యాబుద్ధులిచ్చి, నోములు నోచి, తపసులు ధారపోసి, పిల్లల్ని కన్న తల్లిదండ్రుల పట్ల ఆ పిల్లలకు ఎంత కృతజ్ఞత ఉండాలో, మనిషిగా తీర్చిదిద్దిన ఆచార్యుల పట్ల ఎంత కృతజ్ఞత ఉండాలో, జీ హుజూర్, జో హుకుమ్- అన్నట్టుగా తలచినదే తడవుగా సేవలందిస్తున్న పంచభూతాల పట్ల ఎంత కృతజ్ఞత ఉండాలో, పొత్తిళ్ళదాచి పదిలంగా కాపాడుతున్న ప్రకృతి పట్ల ఎంత కృతజ్ఞత ఎండాలో, వీటన్నిటిని నియంత్రిస్తూ, అన్నిటిని వెనకా తానే ఉండి నడిపిస్తున్న పరమాత్మ పట్ల ఎంత కృతజ్ఞత ఉండాలో...

మానవతకు మైనాకం వచ్చి చెప్పునా?
నాగరులకు సాగరాలు వచ్చి చెప్పునా?
చెబితే బాగుండును కదూ....!

-శ్రీరామచంద్రాచార్య

## గ్రంథ పరిచయం

## శ్రీరంగనాథుని అభిషేక చూర్ణికలు, శ్రీరంగనాథ స్తోత్రమ్ - శ్రీరంగరాజ వింశతి

శ్రీరంగంలో రంగనాథుని ఉత్సవమూర్తికి అభిషేకం సమర్పిస్తున్నప్పుడు శ్రీపరాశరభట్టారకుల వంశం వారు అర్చకస్వాముల ఆహ్వానం మేరకు భట్టరువారు ప్రసాదించిన శ్లోకాలను వారే అనుగ్రహించిన వ్యాఖ్యానంతో విన్నవిస్తారు. శ్రీరంగనాథుణ్ణి నదిగా, పర్వతంగా, సముద్రంగా, మేఘంగా, సూర్యునిగా, చంద్రునిగా, కల్పవృక్షంగా రకరకాలుగా వర్ణిస్తూ ఆశువుగా శ్లోకాలు చెప్పి శ్రుతి స్మృతి - ఇతిహాస పురాణ ప్రమాణ పూర్వకంగా తామే కావించిన వ్యాఖ్యలు ఈ అభిషేక చూర్ణికలు.

భట్టరువారి శ్లోక రచనం వ్యాఖ్యాన సంవిధానం అపూర్వమైనది. శ్రీరంగంలో ఈ చూర్ణికల విన్నపం అభిషేక వేళ నేటికీ భట్టరు వంశీయులు నిర్వహిస్తున్నారు. ఇతర స్థలాల్లో కూడా అభిషేకవేళ వీటినే అనుసంధించటం ఆచారంగా వస్తోంది.

రసఘనములైన చూర్ణికలు మణిప్రవాళ శైలిలో ఉన్నందున తెలుగువారికందరికీ అందుబాటుకు రావటంలేదు. వీటి గొప్ప తనాన్ని గమనించి యివి తెలుగువారికి తెలియ చెయ్యాలన్న ఉదారబుద్ధితో సంప్రదాయ సేవా ప్రవణులయిన **శ్రీ ఉ.వే.శ్రీమాన్ డా॥ ఈ.ఎ. శింగరాచార్యస్వామి వారు** భట్టరు చూర్ణికలకు శ్రీ సేవా వ్యాఖ్యను తెలుగులో కూర్చినారు. శ్రీ శింగరాచార్యస్వామివారు సంప్రదాయంలో ప్రామాణిక వ్యాఖ్యాతలుగా పలువురు పెద్దల మన్ననలు పొందినవారు సంప్రదాయ పరులు అందరూ అనుసంధించుకొని ఆనందింపదగినది గ్రంథం ఇది. దీనికి అనుబంధముగా శ్రీరంగనాథస్తోత్రము, వరవరముని రచితంగా కనవస్తున్న శ్రీరంగరాజ వింశతికూడా చేర్చి వాటికీ వ్యాఖ్యలు కూర్చినారు.

**176 పుటలుల ఈ గ్రంథం సాధన గ్రంథమండలి ప్రకాశితం. వెల రూ. 60/-**

పుస్తకాలు లభించుచోటు :

1) **R.Mohana Rao.**
4-103, ILTD Colony Extn.,
Kothapeta, Chirala - 523 157

2) **E.A. Singaracharyulu,**
18-3-58/7, Santhinagara,
K.T.Road, Tirupati - 517 507.





## గమనిక

**సూర్యుడు ధనూరాశిలో ప్రవేశించిన తరువాత వచ్చే శుద్ధ ఏకాదశియే.... వైకుంఠేకాదశి. దానికే ముక్కోటి ఏకాదశి అని కూడా పేరు. ఈ సం॥రం వైకుంఠ ఏకాదశి, భోగిపండుగనాడు అనగా ది. 14-1-2003 అయింది. అయితే శ్రీరంగంలో మాత్రం ఈ సం॥రం డిసెంబర్ 15వ తేదీననే ఆచరిస్తారు. జనవరి నెలలో వచ్చే అనివార్యమైన బ్రహ్మోత్సవాలకు ఆటంకం లేకుండా వారు విధంగా ఆచరిస్తున్నారు ఈవిధమైన మార్పు కాలగమనంలో 19 సం॥రములకొక్కసారి మాత్రమే వస్తుంది. 14వ శతాబ్దంలో ఈ మద్వరవరమునులు చేసిన శాసనమిది. మనందరికీ భోగిపండుగనాడే వైకుంఠ ఏకాదశి.... గమనించగలరు. ఆ శాసనవిశేషాలను, శ్రీరంగం లోని ఆమార్పుకు కల కారణాలను మనం వివరంగా వచ్చే సంచికలో తెలుసుకుందాం!**

## శ్రీమద్వేదాంత దేశికుల అవతార మహోత్సవములు

టి.టి.డి. ఆళ్వార్ దివ్యప్రబంధ ప్రాజెక్టు వారు విశాఖపట్టణంలో లలితా పరా భట్టారికా పీఠం అధిపతులు శ్రీ యానందనాధులు శ్రీ యద్దనపూడి అయ్యన్న పంతులుగారు నిర్వాహకులుగా శ్రీమాన్‌వేదాన్తం రాజగోపాల చక్రవర్తి సంచాలకులుగా నవంబరు 6,7,8 తేదీలలో శ్రీమద్వేదాన్త దేశికుల అవతార మహోత్సవములు కళాభారతి ఎ.సీ. ఆడిటోరియంలో ఘనంగా నిర్వహించేరు.

శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యులు, శ్రీమాన్ సాతులూరి గోపాలకృష్ణమాచార్యులు, శ్రీమాన్ మోర్త సీతారామాచార్యులు, శ్రీమాన్ పేరాల భరత శర్మ, శ్రీమాన్ చాగంటి కోటేశ్వరరావు, శ్రీమాన్ డా. వేదాంతం రాజగోపాల చక్రవర్తి శ్రీమాన్ యాబలూరి లోకనాథవర్మ మున్నగువారు శ్రీదేశికుల జీవితవాఙ్మయ విశేషాలపై ప్రవచనాలు కావించినారు.

శ్రీ స్వరూపానందేంద్ర సరస్వతి స్వాములు సభలను ప్రారంభించినారు.

వెలగపూడి వెంకటేశ్వరరావుగారి జ్ఞాపకార్థం వారి సతీమణి రాణి భ్రమరాంబ, (విజయవాడ - పటమట)వారు తేది: 16-11-2002, ద్వాదశి నాడు మన ఆశ్రమంలో శ్రీశ్రీశ్రీ స్వామివారి సన్నిధిలో గోదానం, తదీయారాధన కావించినారు.





# భగవద్రామానుజ చరిత్ర

టి.కె. చూడామణి, విజయవాడ

చిన్నపిల్లల ఆట సాగుతోంది. అందులో ఒక బాలుడు ఆచార్యస్థానంలో కూర్చున్నాడు. మిగిలిన పిల్లలు శిష్యుల్లాగా ముందు కూర్చుని దాసోऽహం చేస్తూ శ్రద్ధగా వింటున్నారు. చదువుతున్నాడు బాలుడు.

**పాశురం :**

**ఆడి ఆడి అకమ్ కరైన్దు ఇశై**
**పాడి ప్పాడి కణ్ నీర్ మల్కి ఎఙ్గుమ్**
**నాడి నాడి నరశిఙ్గా ఎన్ను**
**వాడి వాడుమ్ ఇవ్వాణుతలే**

**తి.వా.మొ. 2-4-1**

ఈ పాశురానికి ఆ బాలుడు చెప్పే అర్థం రామానుజులను ఎంతో బాధపెట్టింది.

ప్రతీ 'ఆడి' మాసంలో దండిగా వర్షాలు కురుస్తాయి కదా! అపుడు ఇళ్ళన్నీ సర్వనాశనం అయిపోతాయి. ప్రజలంతా గొల్లుమంటూ ఏడుస్తూ ఎండ, వాన, చలి బాధలకిఓర్చుకోలేక ఎక్కడుండాలో తెలియక బాధపడతారు. అపుడు వెదకగా వెదకగా ఒక నృసింహాలయం కన్పిస్తే అక్కడ స్వామిని చేరి 'నరసింహా', 'నరసింహా' అంటూ ముఖం, నుదురు బాదుకుంటూ దుఃఖిస్తారు అని.

ఇంతటి అపార్థాన్ని విన్న రామానుజులు మనస్సు విలవిలలాడిపోయింది.

హే నమ్మాళ్వారే! నిత్యసూరులతో కలిసి భగవదనుభవానికి ఆశపడి, అది వెంటనే లభించనందుకు దుఃఖించి, ఒక్క క్షణ కాలము కూడా భగవంతుని విడిచి ఉండలేని స్థితిని పొందిన ఆళ్వారే! శ్రియః పతినుద్దేశించి మీరు మాకు ప్రసాదించిన దివ్యసూక్తి సుధ తిరువాయ్ మొళ్ళిలో మాతృభావాన్ని ఆపాదించుకొని ఒక పిరాట్టి స్థితిని వర్ణించిన పాశురముగదా యిది. ఎంత మధుర భావసంభరితమీ పాశురం. దీని అర్థమేమిటి?

ఈమె నాట్యమాడి ఆడి మనస్సు కరిగి సుస్వరముతో పాడిపాడి కనులలో నీరు నిండి అంతా వెదకి వెదకి 'నృసింహా' అంటూ ఈ సుందర ముఖి వాడిపోతోందని కదా.

**భగవంతుని గూర్చిన ఆట - భగవంతుని గూర్చిన పాట- ఇదే జీవితంగా సాగి, ఆయన కనిపించలేదనే బెంగతో దుఃఖం పొంగి, పొర్లిన భక్తురాలు** నృసింహనామాన్ని స్మరిస్తూ - భగవద్ విశ్లేష స్థితిలో ఎలా వాడిపోతోందో. ఒక జీవాత్మ '**తత్ విశ్లేషైక దుఃఖిత్వమ్**' అన్నట్లు భగవంతుని కొరకు ఎలా ఆర్తితో విలపిస్తుందో చెప్పే అద్భుతార్థం గల పాశురం - ఇలా అపార్థాలకి దారితీస్తోందా! అయ్యో! ఈ ఉత్తమ గ్రంథాలకి చక్కని వ్యాఖ్యానం లేకపోవడం వలన గదా ఇంతటి దుఃస్థితి సంభవించిందని అనుకున్నారు. వెంటనేతాము చేయవలసిన పనిని గుర్తుచేసుకున్నారు. పెరియ తిరుమల నంబిగారి పుత్రుడైన పిళ్ళతిరుమల నంబిగారు రామానుజులకి తమ పుత్రుణ్ణి సమర్పించారు.'**తిరుక్కురుగై ప్పిరాన్ పిళ్ళాన్**' అని పేరు వారికి, వారిని పిలిచారు. శ్రీ కురుకేశులు అనే వారు రామానుజులకి దాసోహం సమర్పించి నిలిచారు. రామానుజులు వారితో మీరు దీనికొక చక్కని వ్యాఖ్యని రచించి ఇయ్యాలి. లేకపోతే బాలురు, మూఢులు ఇలాగే అపార్థాలు





చెప్తారు. కాబట్టి వెంటనే ఆ మహత్తర కార్యక్రమాన్ని చేపట్టమని కోరారు. వారి ఆజ్ఞని అనుసరించి శ్రీ కురుకేశులు అంటే తిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళాన్ భగవద్విష యానికి '**ఆరాయిరప్పడి**' అనే స్వారస్యమైన వ్యాఖ్యానాన్ని అందించారు.

గురు పరంపరా ప్రాప్తాలయిన ద్రవిడో పనిషత్తులకి ఇలా చక్కని వ్యాఖ్యానాన్ని రచింపచేసి తాము యామునార్యుల సన్నిధిలో చేసిన ప్రతిజ్ఞలని కూడా తీర్చుకున్నారు రామానుజులు.

# శ్రీ విష్ణు మహాపురాణము

## సృష్టి ప్రక్రియ - పంచమాధ్యాయం - షడ్విధ సృష్టి

శ్రీ ఉ.వే. శ్రీమాన్ S.V. రంగరామానుజాచార్యస్వామి, కొవ్వూరు.

ఈ విధంగా చతుర్ముఖ బ్రహ్మరూపి అయిన జనార్దనుడు ఆరురకాల సృష్టిని చేశాడు. వీటిలో మొదటిది **మహత్సర్గ** అంటే మూల ప్రకృతినుండి మహత్తనిచెప్పబడే బుద్ధి తత్త్వాన్ని ఆవిర్భవింప జేయడం. రెండవది **'తన్మాత్ర సర్గ'** అంటే పంచభూతాలకూ మూలాలైన శబ్ద - స్పర్శ-రూప-రస గంధా లనే 5 సూక్ష్మమౌలికాంశాలను సృజించడం. ఇక మూడవది **పంచభూతసృష్టి**. దీన్నే వైకారిక సృష్టి అంటారు. అహంకార వికారంగా ఏర్పడ్డ ఇంద్రియాల సృష్టికూడా ఇందులోనే అంటే వైకారిక సృష్టిలోనే చేరింది. (తామసా హంకారంనుంచి తన్మాత్రలు - వాటి నుంచి పంచమహా భూతాలు ఆవిర్భవింపగా, సాత్త్వి కాహారం నుండి ఏకాదశ ఇంద్రియాలు ఆవిర్భవించాయి. ఇవన్నీ వికారాలే కనుక, వీటి సృష్టి వైకారిక సృష్టి) ఇదంతా ప్రాకృతిక సృష్టి. అంటే ప్రకృతిలో నుంచి ఏర్పడిన సృష్టి. ఇక, నాల్గవ సృష్టి **ముఖ్య సృష్టి** స్థావరాలైన (కదలలేని) చెట్లు పర్వతాలు మొదలైనవి ఈ సృష్టిలో చేరతాయి. సృష్టి తిర్యక్ స్రోతస్సులుగా చెప్పబడే పశుపక్ష్యాదులు, ఈ సృష్టిలోనే చేరతాయి. తిర్యక్ యోనులైన అండజాలు - కొన్ని రకాల జరాయుజాలు వగైరా. ఇక, ఆరవ సృష్టి, **ఊర్ధ్వ స్రోతస్సృష్టి**. ఈ సృష్టిలో దేవతలంతా చేరుతారు. ఏడవ సృష్టి **అర్వాక్ స్రోతస్సృష్టి**. ఇదే మానవ సృష్టి. ఎనిమిదవది **అనుగ్రహ సృష్టి**. ఈ సృష్టిలో సాత్త్విక ప్రాణులు - తామస ప్రాణులు ఉన్నాయి. ఈ ఎనిమిది సృష్టుల్లోనూ మొదటి మూడు ప్రాకృతిక సృష్టి. చివరి ఐదు, వైకారిక సృష్టి. ఇక తొమ్మిదవ సృష్టి **ప్రాకృత వైకృత సృష్టి**. ఇది రెండు రకాలు సనత్కుమారాది సృష్టి, నీలలోహిత కుమార సృష్టి. (అంటే ఏకాదశ రుద్ర సృష్టి) ఈ రెంటినీ కుమార సృష్టి లేదా **కౌమార సృష్టి** అంటారు.

ఇలా పరాశరుడు మైత్రేయునికి సృష్టిని సంగ్రహంగా నిరూపించాడు. ఇక్కడ సంగ్రహంగా నిరూపించిన దానినే చాలా విస్తారంగా ముని వివరించాడు.

శ్రీపరాశరుడు ఇలా అంటున్నాడు.

**కర్మభిర్భావితాః పూర్వైః కుశలాకుశలైస్తు తాః।**
**ఖ్యాత్యా తయా హ్యనిర్ముక్తాః సంహరే**
**హ్యపసంహృతాః॥**
**స్థావరాంతాః సురాద్యాస్తు ప్రజాః**
**బ్రహ్మంశ్చతుర్విధాః॥**

దేవ- మనుష్య - తిర్యక్ (పశుపక్ష్యాది) స్థావరములు (చెట్లు మొదలైనవి) అనే నాల్గు రకాలు తాము చేసుకున్న పుణ్యాపుణ్య కర్మల మూలంగా-తత్సంస్కారంతో కూడిఉంటాయి. అంటే పూర్వ కర్మ సంస్కారంతో కూడి ఉంటా యన్నమాట. కనుకనే ఆయా కర్మానుసారి అయిన బుద్ధి (ఆలోచన) తో విడువబడనివై సంహార దశలో (ప్రలయంలో) ఉపసంహ రింపబడుతూ ఉంటాయి.

### చతుర్ముఖ బ్రహ్మనుండి సృష్టి

చతుర్ముఖ బ్రహ్మ తాను తన శరీరం నుంచి వివిధ సృష్టి చేయదలచి జలాలలో తన శక్తిని ప్రవేశింపచేశాడు. **(సిసృక్షురంభాం స్యేతాని స్వమాత్మాన మయూయుజత్)** ఇక్కడ బ్రహ్మ జలాలలో తనను యోజనం చేశాడని






చెప్పబడి ఉంది. 'తనను' అన్నదానికి (ఆత్మానం) మనస్సును అని అర్థం వ్రాశారు వ్యాఖ్యాతలు. జలముఖద్వారా సమస్త సృష్టి చేయాలని సంకల్పించాడన్నమాట. ఇక్కడ 'అంభస్' అనే పదానికి నాల్గు రకాల సృష్టి విషయాలని శ్రుతి చెబుతున్నది. 'తానిహవా ఏతాని చత్వార్యంభాంసి దేవా మనుష్యాః పితర్యోఽసురాః' దేవతలు - మనుష్యులు - పితృదేవతలు- అసురులు ఈ నల్వురికే అంభస్సని పేరు. వీరిని నల్వురిని సృజింప మనసుపడ్డాడని భావం. ఇలా సంకల్పించిన బ్రహ్మయొక్క శరీరంలోని 'తమో గుణాంశం' ఉద్రిక్తమైంది. ఈ దశలో బ్రహ్మయొక్క ఊరువులనుండి అసురులు ఆవిర్భవించారు. ఇలా వీరిని సృజించి, తన, తమోమయమైన దేహాన్ని విడచివేశాడు బ్రహ్మ. ఆ తమోమయ మైన దేహమే, తమోమయమైన రాత్రిగా మారింది. తరువాత సృష్టికొరకు మరొక దేహాన్ని స్వీకరించి ప్రీతిగొన్నాడు బ్రహ్మ. ఇప్పుడు సత్త్వగుణం ఉద్రిక్తమైంది. దీనివల్ల ఆయన ముఖం నుంచి దేవతలు ఆవిర్భవించారు. ఈ దేహాన్ని విడచాడు బ్రహ్మ. ఈ దేహం ప్రకాశ శీలమైన 'పగలు'గా (దినముగా) అయింది. కనుకనే రాత్రి కాలంలో అసురులు, పగటికాలంలో దేవతలు బలవంతులై ఉంటారు. ఆ తరువాత కేవలం సత్త్వగుణమయమైన మరొక దేహాన్నీ ధరించి తండ్రివలె మన్నింప బడ్డాడు బ్రహ్మ. ఆకారణంగా ఆయన దేహము నుండి ముఖ్యులైన పితృదేవతలు ఆవిర్భవించారు. పితృదైవత సృష్టి అయిన తరువాత ఆశరీరాన్ని విడచిపెట్టాడు బ్రహ్మ. ఇదే 'సంధ్యా'కాలం అయింది. ఈ సంధ్యా కాలంపగలు- రాత్రులు నడుమ ఉంటుంది.

(సంధ్యా, దిననక్తాంతర స్థితం.) ఆ తరువాత రజోగుణమాత్ర నిర్మితమైన మరో దేహాన్ని ధరించాడు బ్రహ్మ. ఇప్పుడు రజోగుణం అధికంగా గల మనుష్యకోటి ఆవిర్భవించింది. ఈ దేహాన్ని కూడా వెంటనే విడచాడు. ఇది 'వెన్నెల' అయింది. దీన్నే ప్రాక్సంధ్య అనికూడా అంటారు. అందువల్లనే జ్యోత్స్న (వెన్నెల) వచ్చినప్పుడు పితృదేవతలకు మనుష్యులకు బలం బాగా ప్రవృద్ధ మౌతుంది. కనుకనే, సంధ్యా - ప్రాక్ సంధ్యా కాల సంబంధం గల వారు మనుష్యులు - పితృదేవతలు. జ్యోత్స్నాగమం అనే దానిచేత ప్రాక్సంధ్యోపలక్షితమైన పూర్వాహ్లాదంలో మనుష్య ప్రీతి 'సంధ్యాగమం' అనేదానిచేత చరమసంధ్యో పలక్షితమైన అపరాహ్ణములో పితృదేవత ప్రీతి కనుక పితృతృప్తి కలవైన శ్రాద్ధాదులు అపరాహ్ణములో చేయా లంటుంది శాస్త్రం. **'అపరాహ్ణః పితృణాం'** అని వేదం.

**జ్యోత్స్నా, రాత్ర్యహనీ, సంధ్యా చత్వార్యేతాని**
**వై ప్రభోః।**
**బ్రహ్మణస్తు శరీరాణి త్రిగుణోపాశ్రయాణి తు॥**
(శ్లో॥ 5 అధ్యా- 31-39)

అంటుంది. శ్రీవిష్ణుపురాణం, వెన్నెల, రాత్రి, పగలు, సంధ్య అనేవి నాలుగూ కాల శరీరకుడైన బ్రహ్మకు శరీరాలని భావం. ఇక్కడ "బ్రహ్మ" అంటే చతుర్ముఖరూపుడైన నారాయణుడే. అంటే కాలం భగవంతుడైన నారాయణుని శరీరమన్నమాట.

### యక్షరాక్షస సృష్టి

శ్రీమద్రామాయణంలోని ఉత్తర కాండలో యక్షరాక్షస సృష్టిని గురించిన ప్రస్తావనఉంది. బ్రహ్మవల్ల మొట్టమొదట సృజింపబడి **'రక్షామః'**, **'రక్షస్తాం'** అని ఉద్ఘోషించిన ప్రాణులు రాక్షసులుగా చెప్పబడ్డారు. **'జక్షామః'** తింటాం అని ఆక్రోశించిన ప్రాణులు యక్షనామంచేత

వ్యవహరింపబడ్డాయట. ఇదే అభిప్రాయాన్ని విష్ణుపురాణమూ వ్యక్తపరుస్తున్నది. కొంత తేడా ఉంది ఇక్కడ.

**రజః** ప్రధానమైన ఆకలి పుట్టిందట. దానిమూలంగా **'క్షామం'** పుట్టింది. ఆకలి, క్షామం (Starnation) అంధకారం ఈ మూడు కలసి ఉన్న స్థితిలో చతుర్ముఖ బ్రహ్మ కొన్ని ప్రాణులను సృజించాడు. అవి విరూపంగా (వికృతరూపంతో కూడి) పెద్దపెద్ద మీసాలు గడ్డాలతో పుట్టి బ్రహ్మవైపు పరువులెత్తాయి. **"ఓ ప్రభూ! రక్షించు"** అంటూ ఆక్రోశించడం వల్ల ఆ ప్రాణులు రాక్షసులుగాచెప్పబడ్డాయి. మరికొన్ని ప్రాణులు **'ఖాదామః' 'తింటాం'**అని అన్నాయట. ఆ కారణంగా అవి **'యక్ష'** నామాన్ని పొందాయంటుంది పురాణం.

**మైవం భోరక్ష్యతామేష యైరుక్తం రాక్షసాస్తుతే।**
**ఊచుః ఖాదామ ఇత్యన్యే యేతే యక్షాస్తు జక్షణాత్॥**

వీటిని అప్రీతి గాచూచాడు బ్రహ్మ. దీనివల్ల బ్రహ్మయొక్క శిరోజాలు ఊడి పడ్డాయి. మళ్ళీ వెంటనే శిరస్సుకు అంటుకున్నాయి. వీటికి శిరస్సు లేకపోవడంవల్ల, శిరస్సు నుంచి జారడం (సర్పణం) వల్ల ఇవి సర్పాలైనాయి. సర్పణంవల్ల సర్పాలు, శిరోహీనాలవడం వల్ల అములు అయినాయి. వీటిని చూచిక్రోధపడిన బ్రహ్మ పింగళ వర్ణంతో ఉగ్రహస్వభావాలైన ప్రాణులను సృజించాడు. ఇదే పచ్చిమాంసం తినే క్రూరప్రాణులైనాయి. వీటిని **'పిశితాశనం'** లంటారు. ఈ ప్రాణులు ఇంచుమించుగా రాక్షసజాతికి చెందినవే. వాక్కును ఆస్వాదిస్తూ సృష్టించినందువల్ల గాన స్వభావులైనగంధర్వులు ఆవిర్భవించారు. తన యొక్క **'వయస్సు'** నుండి పక్షులను, వక్షస్థలంనుండి గొర్రెలను, ముఖం నుండి మేకలను బ్రహ్మ సృజించాడు. తన ఉదరం నుంచి డొక్కల నుంచి ఆవులనుసృజించాడు. పాల నుండి గుర్రాలను, ఏనుగులను, శరభ మృగాలను, ఆవులవంటి **'గవయ'** మృగాలను ఒంటెలను, కంచరగాడెదలను, దుప్పులు కణుజులు మొదలైన వివిధ జంతువులను సృజించాడు. తనరోమాల నుండి ఓషధులను, దుంపలు, ఫలాలను సృజించాడు.







# మహర్షుల చరిత్ర - శ్రీ శుక మహర్షి


తమిళమూలం :
వై.వా. నావల్‌పాకం దేవనాథ తాతాచార్యస్వామి

తెలుగు సేత :
శ్రీ.ఉ.వే.ప్ర శ్రీమాన్ తూప్పురాణి ఉడయవర్‌స్వామి, విజయవాడ


**శ్రీ శుకమహర్షి వంశం చాలా గొప్పది. ఈ వంశంలో వరుసగా ఐదుగురు, మహర్షులుగా ప్రసిద్ధి చెందడం గొప్ప విషయమేగదా!**

శుకుడి తండ్రి వేదవ్యాస మహర్షి, వేదవ్యాస మహర్షి తండ్రి పరాశర మహర్షి, పరాశరమహర్షి తండ్రి శక్తి మహర్షి, శక్తి మహర్షి తండ్రి వసిష్ఠమహర్షి. ఈ విధంగా లోక ప్రసిద్ధులైన మహర్షులను ఐదుగురిని లోకానికి అందించిన వంశంలో చివరివాడు శుకమహర్షి. వ్యాసునికి నమస్కరిస్తున్నట్లుగా చెప్పబడ్డ ఈ క్రింది ప్రార్థనా శ్లోకంలో ఈ ఐదుగురుమహర్షులపేర్లు ప్రస్తావింపబడ్డాయి.

**వ్యాసం వసిష్ఠనప్తారం, శక్తేః పౌత్రమకల్మషమ్।**
**పరాశరాత్మజం వన్దే, శుకతాతం తపోనిధిమ్॥**

వేదవ్యాసభగవానుడు అనంతరాశిగా ఉండే వేదాలను విభజించి లోక ప్రసిద్ధి పొందాడు. అంతేగాక మహాభారతం, బ్రహ్మ సూత్రాలు, భగవద్గీత రచించడం ద్వారా ఆయన మరింత సాటిలేని కీర్తిని ఆర్జించాడు. వీటిని అన్నిటిని మించి శుకుని తండ్రి కావటం వలన ఆయన కీర్తి పరిపూర్ణం అయిందని అంటారు.

శ్రీమద్ భాగవతం ప్రథమ స్కంధం, ద్వితీయ అధ్యాయంలో రెండవశ్లోకం మనకు ఈ విషయాన్ని ధ్రువీకరిస్తుంది.

**యం ప్రవ్రజన్తమనుపేతమపేత కృత్యం**
**ద్వైపాయనో విరహకాతుర ఆజుహావ ।**
**పుత్రేతి తన్మయతయా తరవోఽభినేదుః**
**తం సర్వభూతహృదయం మునిమానతోఽస్మి॥**

**ము.భాగ. 1-2-2**

(పై శ్లోకానికి పోతనగారి తెనుగు పద్యం చూడండి

పద్యము

**సముడై యెవ్వడు ముక్తకర్మచయుడై సన్యాసియై యొంటివో**
**వ మహాభీతి నొహో కుమార యనుచున్ వ్యాసుండు చీరంగ, వృ**
**క్షముతిం దన్మయతం బ్రతిధ్వనులు చక్కంజేసె మున్నటి భూ**
**తమయున్ వ్రెుక్కెద బాదరాయణి దపోధన్యాగ్రణిన్ ధీమణిన్.)**

పై శ్లోకభావము :- ఆ బాలుడికి ఇంకా ఉపనయనమేకాలేదు. అంటే, ఇంకా వయస్సు ఏడుసంవత్సరాలు దాటలేదు. ఇంత చిన్నతనంలో సన్న్యాసం! సంసార సుఖాలను చాలాకాలం అనుభవించి అనుభవించి అలసి పోయిన వారికి మాత్రమే గోచరించే సన్న్యాసం, శుకుడు అని పిలువబడే ఈ పిల్లవాడికి అతి బాల్యంలోనే సిద్ధించింది. సనక సనందాదులకువలె. ఈతని తండ్రియైన వ్యాసునికి ఇది అర్థం కాలేదు. అన్నీ విడిచిపెట్టి సన్న్యాసభావంతో ఇంటినుండి పోతున్న శుకుణ్ణి.

కుమారా! కుమారా!! అని అరుస్తూ

అనుసరించాడు. చుట్టూ ఉండే చెట్లన్నీ శుకుడి భావాన్ని పొంది ప్రతిధ్వనించాయి. పరబ్రహ్మ స్వరూపి అయిన శుకుడు అన్ని ప్రాణులకే హృదయం లాంటివాడు. అందు చేత ఈతని హృదయంలోని భావాన్ని లోకంలోని పదార్థాలన్నీ ప్రతిధ్వనింప చేశాయి. ఈ కారణంగా సన్న్యాసభావంతో మహాజ్ఞానివలె ముందుపోతూ ఉన్న శుకుని చెవిలో, వ్యాసుని ఈ ఆర్తనాదం పడలేదు.

**యః స్వానుభావమఖిల శ్రుతి సారమేకం।**
**అధ్యాత్మ దీపమతితీరషతాం తమోన్ధఌమ్॥**
**సంసారిణాం కరుణయాహ పురాణ గుహ్యం**
**తం వ్యాససూనుముపయామి గురుం మునీనామ్॥**

**భా.గ. 1-2-3.**

భాగవతం అనే దీపాన్ని అనుగ్రహించడంచేత ఈ శ్లోకంలో శుకమహర్షికి నమస్కరిస్తున్నట్లు చెప్పబడింది. మిగతా పురాణాలకంటే భాగవతపురాణానికి ఒక ప్రత్యేకత ఉంది. అన్ని వేదాల సారమే భాగవతం. ఉన్న జ్ఞానాన్ని పోగొట్టి అజ్ఞానాన్ని అధికంగా ఇచ్చే ఈ సంసారసాగరంలో మునకలు వేస్తూ దిక్కు తోచని స్థితిలో నున్నసంసారులకు రేవు మార్గాన్ని చూపే దీపంలాంటిది ఈ భాగవతం. దీనిని మనకు దయతో అనుగ్రహించినవాడు శుకమహర్షి. మునులందరికీ ఇతడే గురువు. సాక్షాత్తుగా వేదవ్యాసుని కుమారుడైన ఈ శుకునికి నమస్కరిస్తున్నాను అని పై శ్లోకానికి అర్థం. ఈ విధంగా అనేక చోట్ల ఈయన గొప్పతనం చెప్పబడింది.

**విచిత్రమైన జన్మ :**

వ్యాసునికి ఈ శుకుడు కుమారుడుగా పుట్టడం విచిత్రంగా జరిగింది. వ్యాసుడు నైష్టిక బ్రహ్మచారి అంటే ఆయనకు వివాహం కాలేదు. భార్య లేదు. అలాంటప్పుడు ఆయనకు కొడుకుగా పుట్టడం ఎలా జరిగింది. అని అనిపిస్తుందిగదా! యోగ సిద్ధులైన మహర్షులను మన వంటివారినిగా భావించకూడదు. మన దృష్టిలో జరగడానికి అవకాశంలేదు అనే కార్యాలు కూడా వారి విషయంలో యధార్థంగా జరిగితీరుతాయి. నిత్య బ్రహ్మచారి అయిన వేదవ్యాసునికి శుకుడు కుమారుడుగా ఆవిర్భవించాడు.

**పాపం తల్లిలేని జన్మ :-**

శుకుడికి తల్లి ఎవరు? అని అడిగితే లేదనే అనాలి. తండ్రిమాత్రం ఉన్నాడు. లోకంలో 'తల్లిలేనిపిల్లవాడు' అని అనడం వింటూఉంటాం. తల్లి గర్భంలో పదిమాసాలు ఉండి, తగిన సమయంలో ఆమె ప్రసవించగా పుట్టిన పిల్లలను మనం ఎరుగుదుము. అటువంటి పిల్లలలో ఎవరికైనా చాలా చిన్నతనంలో తల్లిచనిపోతే వాటిని 'తల్లిలేని పిల్లలు' అని అనడం పరిపాటి. కాని శుకునికి అలాంటి తల్లి అసలే లేదు, తల్లి ప్రేమ ఎలా ఉంటుందో ఇతడికి తెలియనే తెలియదు. కాని నిజం చెప్పాలంటే శుకుడే నిజంగా తల్లిలేని పిల్లవాడు. తల్లిచనిపోయిన వాడు కాదు, తల్లిలేని పిల్లవాడు. వారికి కొంత కాలమైనా తల్లి ప్రేమ, ఆదరం దొరకుతాయి గదా! శుకుడి విషయంలో తల్లి ప్రేమ, ఆదరం పూజ్యమేగదా! పాపం ఇతడు ఎవ్వరినీ 'అమ్మా!' అని పిలిచి ఎరుగడు. అమ్మఉంటే కదా, పిలవడానికి.



# జనచైతన్య

# సందేహాలు - సమాధానాలు

**శ్రీ మందడి రాములు, పెద్దతూప్ర, రంగారెడ్డి జిల్లా**

ప్ర. విష్ణుసంవత్సరాలు, బ్రహ్మ సంవత్సరాలు, రుద్ర సంవత్సరాలు అని అంటారు. తెలుగు సంవత్సరాలు అరవైలో ఏ సంవత్సరాలు ఏవి తెలుప ప్రార్థన?

జ. ప్రభవాది సంవత్సరాలు 60 కద! అందులో మొదటి 20ని బ్రహ్మసంవత్సరాలు అంటారు. మధ్య 20ని విష్ణు సంవత్సరాలు అంటారు. చివరి 20ని రుద్ర సంవత్సరాలు అంటారు.

ప్ర. వాల్మీకి రామాయణంలో సుందరకాండ పారాయణం చేసిన తర్వాత వర్షాలు కురియునని పెద్దలు అనగా విన్నాము. ప్రభుత్వము వారికి సలహా ఇచ్చి మీలాంటి సర్వజ్ఞులు ఎందుకు చేయించకూడదు?

జ. ఉచిత సలహాలకు విలువ ఉండదని.

**శ్రీ వి.వి. రామానుజాచార్యులు, టి. నగర్, రాజమండ్రి.**

ప్ర. యజ్ఞయాగాదులు నిర్వహించేటప్పుడు జప, తప, పారాయణ, అనుసంధాన, హోమాదులు జరుగుతూంటాయి. వాటిలో అన్వయించేవారికి సన్మానాలు (దారి ఖర్చులతో సహా) జరుగుతూంటాయి. అటువంటప్పుడు వాటి ఫలితాలు ఎవరికి చెందుతాయి?

జ. చేయించిన కర్త ఎవరో ఆయనకే చెందుతాయి. పారాయణాదులు చేసేదే సంభావనాదులకోసమని భావిస్తున్నారు కద! కొందరది వారి వృత్తిగ గూడ చేస్కొని డిమాండు చేసి మరీ తీసుకుంటారు. అలాంటపుడయినా, ఆ కార్యం వల్ల కలిగే సత్ఫలితం కర్తగ ఉన్న యజమానికి చెందుతుంది. కారణం, ఆతడు శ్రద్ధతో చేస్తాడు కనుక. చేసిన క్రియలలో ఎక్కడ ఏలోపాలు జరిగినా, దానివల్లకలిగే పాపం మాత్రం, సంభావనకాశించి చేసిన ఋత్విక్కులకే చెందుతుంది తప్ప కర్తకుకాదు. అవి ఆశించక చేసే ఋత్విక్కులు, సరియైన మంత్ర, తంత్ర ప్రయోగం చేస్తే అప్పుడైనా, ఆ యజ్ఞం యజమానికోసమే కనుక ఫలితమూ యజమానికే. భగవద్భావనకల బుద్ధిమంతుడు అసలు ఫలాన్నాశించనే ఆశించడు. అంతా 'కృష్ణార్పణ' బుద్ధితోనే చేస్తాడు.

**ఊటుకూరు అప్పాజీ, ఖమ్మం.**

ప్ర. వివాహములో వధూవరుల నుదుట 'బాసికముల'ను ధరింపచేయుటలోగల పరమార్థమేమి?

జ. 'బాసికము' నుదుటకట్టే ఆచారం కొన్ని ప్రాంతాలకే పరిమితం. దానిని 'ఫాలసింగారం' అంటారట. అంటే నుదుట చేసే అలంకారం అని అర్థం. అది వాడుకలో క్రమంగ 'భాసింగారం...... బాసికము'గ పరిణమించింది. వధూవరుల చూపు ఒకరిపై ఒకరికి పడేటంత వరకూ అది రక్షణ కవచంలా ఉపయోగపడాలని అలా ధరింపచేస్తారట.

**శ్రీ పి. ఆదినారాయణగారు, కింతలి**

ప్ర. త్రికరణ శుద్ధి అంటే ఏమిటి? వివరించ ప్రార్థన......

జ. 'కరణము' అంటే ఒక పనిముట్టు. ఒక శరీరంలో ఉండే జీవుడు, తన జ్ఞానాన్ని వాడుకుంటూ జీవించడానికి భగవంతుడిచ్చిన





పనిముట్లు 3 రకాలుగ ఉన్నాయి. వాటినే త్రికరణములు అంటారు. 1)మనస్సు, 2) వాక్కు. ఈ కర్మేంద్రియమైన వాక్కును చెప్పడం ద్వారా అన్ని యింద్రియాలనూ మనం స్వీకరించవచ్చు. 3) శరీరము. ఈ మూడూ ఒక సమన్వయంతో పనిచేయాలి. అంటే మనస్సులో తలచినది శరీరంద్వారా ఆచరించాలి. దానికి ఇంద్రియాలు సహకరించాలి. అలా మూడు పరికరాలూ ఏక రూపంగ పని చేస్తే అది త్రికరణ శుద్ధి. చేసేదొకటి, తలచేదొకటి, చెప్పేదొకటీ కాకూడదన్నమాట. అయితే ఇంద్రియాలకు ప్రతినిధిగ వాక్కునే ఎందుకు చెప్పాలి? మరో ఇంద్రియమేదైనా గ్రహించవచ్చు గద! అనిపించ వచ్చు. మనస్సు తలచినది. శరీరంతో చేసేదీ ఒకటా కాదా అనేది ప్రకటించి నిర్ణయించగల యింద్రియం 'వాక్కు'మాత్రమే కనుక దానిని గ్రహించారు.

**శ్రీమతి దుర్గా సూర్యకుమారి, మద్రాసు**

ప్ర. శ్రీవిష్ణు సహస్రనామములలో శ్రీధరః శ్రీకర..... శ్లోకములో శ్రీకర అన్న నామమునకు అర్థము తెలుప ప్రార్థన.

జ. 'శ్రీకరః' అనేది శ్రీవిష్ణు సహస్ర నామ స్తోత్రంలో 618వ నామము. జీవసంరక్షణ చేయడం భగవంతుని ప్రధాన కర్తవ్యం. రక్షించడమనేది దయాగుణం కలవాడే చేయగలడు. తనలో ఉండే అనంతమైన గుణాలలో రక్షణకవసరమైన గుణాలను వృద్ధిచేసి మిగిలిన గుణాలను తగ్గించ గలిగినది 'లక్ష్మి' మాత్రమే. అందుకే రక్షకుడిగ వచ్చే అవతారాలన్నింటిలోనూ లక్ష్మినిగూడ తనతో తెచ్చుకొనే భగవంతుడు వస్తాడని ఆగమాలు చెప్పాయి. ఇతిహాసాలు నిరూపించాయి. ఈ పై నామం దానినే చెప్తుతోంది. శ్రీ అంటే లక్ష్మి. లక్ష్మిని తన గుణవర్ధకురాలిగ కలవాడు 'శ్రీకరుడు'.

ప్ర. ఎల్లకాలము మనసులో స్మరించుకోవడానికి ద్వయమంత్రములోని 'శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే' అనుకుంటే చాలునా? 'శ్రీమతే నారాయణాయ నమః' అని కూడ అనుకోవాలా తెలుప ప్రార్థన.

జ. మొదటి వాక్యము కంటే రెండోవాక్యాన్ని నిరంతరమూ స్మరించడమే మంచిది. సులభము కూడాను. 'నేను చేసే ప్రతి సేవ నీ ఆజ్ఞతో చేసే నీ సేవే కావాలి' అందులో నేను చేస్తున్నానని కానీ, దీనివల్ల కలిగే ప్రయోజనంలో నాకూ కొంత భాగమున్నదని కానీ అనిపించకుండా ఉంచుమా!' అనే ప్రార్థన రెండోవాక్యంలో ఉంది కనుక అదే ముఖ్యము.

**శ్రీ కె. స్వామి, రిటైర్డు ఎకౌంట్సు ఆఫీసరు, అనకాపల్లి.**

ప్ర. శ్రీమన్నారాయణాష్టాక్షరీ మహామంత్రం జపంచేసే ముందు, నారాయణ మంత్రన్యాసము, కరన్యాసము, అంగన్యాసము, ధ్యానశ్లోకము చేసిన పిదప మూల మంత్రం జపించాలా? దయచేసి నారాయణ మంత్రం జపించే విధానము తెలుపగలరు?

జ. మంత్రం జపించే విధానం గురువుద్వారా ఉపదేశరూపంగ పొందాలి. అంతే తప్ప పుస్తకాల్లో వ్రాస్తే చూచి, జపించకూడదు. ఇక, జపం చేసే ముందు మీరు చూపిన ప్రక్రియ బాగానే ఉంది. అలానే చేస్కోవచ్చు.

# రామాయణంలో రమ్యగాథలు

## వానరుల దక్షిణ దిగన్వేషణాదేశం

-చెవుటూరి కుసుమ కుమారి, విజయవాడ.

తరువాత సుగ్రీవుడు అంగదుని నాయకత్వమున అగ్ని సుతుడైన నీలునీ, హనుమంతుని, జాంబవంతుని, గవయు గవాక్షులను, వృషభ, మైంద ద్వివిదాదులను దక్షిణదిక్కున సీతను అన్వేషించుట ఎట్లో తెలియ చెప్పినాడు.

**"సహస్ర శిరసం వింధ్యం నానా ద్రుమ లతాయుతమ్"** వెయ్యి శిరస్సులు కలిగి అనేక విధములైన వృక్షలతాదులతో కూడిన వింధ్యపర్వతాన్నీ, మహా సర్పాలు నివసించే రమ్య నర్మదా నదినీ, గోదావరిని రమ్య కృష్ణానదిని, అందమైన మహానదిని, మహా సర్పాలతో కూడి సుందరమైన వరదా నదినీ, మేఖల, ఉత్కల, దశార్ణ నగరములను, అబ్రవంతి, అవంతి నగరములను వెదకుడు.

విదర్భ ఋష్టిక, మాహిషిక, మత్స్య, కళింగ, కౌశిక, ఆంధ్ర, పుండ్ర, చోళ పాండ్య, కేరళ దేశములను, పర్వతములతోనూ, నదులతోను గుహలతోనూ నిండిన దండకారణ్యమును అన్వేషించుడు. అందమైన చందన వనములు కలిగిన మలయ పర్వతమును వెదకుడు.

**"తతస్తాం ఆపగాం దివ్యాం ప్రసన్న సలిలాశయాం**
**తత్ర ద్రక్ష్యథ కావేరీం విశ్రుతా మప్సరోగణాం"**

అక్కడ శుద్ధ జల పరిపూర్ణమైన కావేరీ నదిని చూడగలరు. అక్కడ అప్సరాంగనలు జలక్రీడలాడుచుందురు. ఆ మలయ పర్వతాగ్రమున సూర్యకాంతి ప్రభాసమానుడైన అగస్త్య మహర్షిని దర్శించి, నమస్కరించి, ఆముని పుంగవుని అనుజ్ఞను పొందినవారై, తామ్ర పర్ణీనదిని దాటుడు. అక్కడ చిత్రవిచిత్ర ద్వీపములు గల ఆ తామ్రపర్ణీ నదీలలామ సర్వసుగంధ లేపనరాగాదులతో ప్రియపతి సముద్రుని చేరుతుంది. కపివరులారా! అటు తరువాత మీరు పాండ్య దేశమును చేరి ముత్యములు, పగడములు, దివ్యమణులు పొదగబడిన దివ్యమైన బంగారు కోట ద్వారమును చూడగలరు. అచటనుండి సముద్రమును సమీపించి, సముయాను కూలముగా, కాగల కార్యమును మీరే నిర్ణయించుకొనుడు. ఆ సముద్ర మధ్యమున అగస్త్యునిచే నిలుపబడిన మహేంద్ర పర్వతమున్నది. ఆ పర్వతము సువర్ణమయమై, అనేక గుహలతోనూ, వివిధ వృక్షములతోనూ సముద్రమున చొచ్చుకొని వుండును. ఆ పర్వతము మీద దేవ, ఋషి గంధర్వ, యక్ష, అప్సర సిద్ధ చారణులు వసించుచుందురు. ప్రతి పర్వ దినమున మహేంద్రుడా గిరిమీద వసించుచుండును. దానికి ఆవల నూరు యోజనముల వైశాల్యము కలిగిన ఒక ద్వీపమున్నది.

**"అగమ్యో మానుషైః ద్వీపస్తం మార్గధ్వం సమన్తతః'** దీప్తిమంతమైన ఆ ద్వీపమునకు మానవులు వెళ్ళలేరు.

**"తత్ర సర్వాత్మనా సీతా మార్గితవ్యా విశేషతః**
**స హి దేశస్తు వధ్యస్య రావణస్య దురాత్మనః**
**రాక్షసాధి పతే ర్వాసః సహస్రాక్ష సమద్యుతేః"**

ఓ వానర ముఖ్యులారా! మీరు ఆ ద్వీపమును అతి జాగరూకులై వెదకవలెను సుమా! దేవేంద్ర సమ తేజశ్శాలీ, దురాత్ముడా





క్రూర కర్మరతుడు, అవశ్యము చంపదగిన వాడూ అయిన ఆ రావణుని నివాసమదే. యింకనూ వినుడు.

**"దక్షిణస్య సముద్రస్య మధ్యే తస్యతు రాక్షసీ**
**అఙ్గారకేతి విఖ్యాతా ఛాయా మాక్షిప్య భోజనీ"**

ఆ దక్షిణ సముద్ర మధ్యంలో నీడను బట్టి ప్రాణులను లాగి మ్రింగగల అంగారకమను ఒక రాక్షస స్త్రీ వున్నది. కనుక ఆయా సమయములను బట్టి జాగరూకులై బుద్ధి కుశలతతో రామచంద్ర ప్రభుపత్నిని అన్వేషించండి. ఆ ద్వీపము దాటిన తరువాత పుష్పితమనే పర్వతముండును. దాని శిఖరములలో ఒకటి కనక శిఖరము. అది సూర్య వాసము. అది అంబర చుంబితము. అది సూర్యనివాసము. రెండవది రజత శిఖరము. అది చంద్రుని నివాసము. ఆ పర్వతమునకు **'న తం కృతఘ్నాః పశ్యన్తి న నృశంసా న నాస్తికాః"**

క్రూరులు, కృతఘ్నులు, నాస్తికులు ఆ పర్వతమును చూడలేరు. మీరు ముందు శిరసా ఆ గిరికి నమస్కరించి, దాని మీద ఆ జనక సుతనన్వేషించుడు. ఆపైన పదునాలుగు యోజనములు పయనించినచో సూర్య వంత మను పర్వతమున్నది. దానిని దాటిన తరువాత సర్వకాల సర్వావస్థల యందునూ ఫలపుష్పభరితమై వుండు వైద్యుతగిరి వున్నది. ఆ పర్వతమున వున్న మధుర ఫలములను, శ్రేష్ఠమధువులను పరితృప్తిగా స్వీకరించి ముందుకు సాగుడు.

అటు తరువాత మనోనేత్రాకర్షకమైన కుంజర పర్వతమును చూడగలరు. దాని మీదనే విశ్వకర్మచేత నిర్మించబడిన అగస్త్యుని గృహమును చూడగలరు. అది సువర్ణ ఖచితమై, యోజనవైశాల్యము కలిగి, పది యోజనముల ఎత్తు కలిగి వుండును. అచట

**తత్ర భోగవతీనామ సర్పాణాం ఆలయః పురీ**
**విశాల రథ్యా దుర్ధర్షా సర్వతః పరిరక్షితా**
**రక్షితా పన్నగై ర్ఘోరై స్తీ క్ష్ణదంష్ట్రై ర్మహా విషైః**
**సర్పరాజో మహాఘోరో యస్యాం వసతి వాసుకిః**

అక్కడ విశాల వీధులతో తీక్ష్ణమైన కోరలు గల భయంకర విషసర్పాల చేత రక్షించబడే భోగవతీ అనే పట్టణమువున్నది. అది అతి భయంకర సర్పరాజు అయిన వాసుకి ఆవాసము. మీరు ఆ భోగవతిని వెదకి దాని చుట్టు పట్ల కూడా వెదకవలెను.

వానరముఖ్యులారా! అచటనుండి మీరు వృషాభాకారమునవుండి, నానావిధ రత్నమయమై కాంతులీను ఋషభ గిరిని చేరవలె. ఆ పర్వతముపైన.....

ఓం అస్మత్ గురుభ్యో నమః

# ధనుర్మాస వ్రత శుభాహ్వానము

పరమహంస పరివ్రాజకాచార్యులు

**శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి ప్రత్యక్ష పర్యవేక్షణలో...**

**తేది : 16-12-02 నుండి 14-01-03 వరకు పిట్టలవానిపాలెం (గుంటూరు జిల్లా) గ్రామంలో**

మండల వికాసతరంగిణి సమర్పించు ధనుర్మాస వ్రత సహిత వైకుంఠ ఏకాదశి వ్రత మహోత్సవములో పాల్గొనవలసినదిగా భగవద్బంధువులందరికీ మా వినయపూర్వక శుభాహ్వానాన్ని అందిస్తున్నాము.

నిత్యకార్యక్రమాలు :

| | | |
|---|---|---|
| ఉ॥ గం॥ 6-30 లకు | : | తిరుప్పావై సేవాకాలం |
| 7-30 | : | 'శ్రీవిష్ణుసహస్రనామ వైభవ' ప్రవచనం |
| 8-30 | : | తీర్థగోష్ఠి |
| సా॥ గం॥ 5-00 | : | సామూహిక శ్రీవిష్ణు సహస్రనామ పారాయణం |
| 5-30 | : | తిరుప్పావై ప్రవచనం |

విశేష కార్యక్రమాలు

| | | | | |
|---|---|---|---|---|
| 20-12-02 | శుక్రవారం | ఉ॥ గం॥ | 10-00లకు | : సామూహిక శ్రీకృష్ణపూజలు |
| 27-12-02 | శుక్రవారం | | | : సామూహిక శ్రీరామ పూజలు |
| 4-1-03 | శనివారం | | | : సమాశ్రయణములు |
| 11-1-03 | శనివారం | | | : కూడారై |
| 14-1-03 | మంగళవారం | ఉ॥గం॥ | 6-30 లకు | : వైకుంఠ ఉత్తర ద్వారదర్శనం, ప్రవచనం |
| | | | 7-30 | : తీర్థగోష్ఠి |
| | | | 10-00 | : శ్రీలక్ష్మీనారాయణ తులసి పూజ |
| | | సా॥గం॥ | 5-00వరకు | : భజనలు, ప్రవచనాలు |
| | | | 5-00 లకు | : శ్రీగోదారంగనాథుల కళ్యాణం |
| | | | 6-30 | : లక్ష ఆవునేతి జ్యోతులతో వైకుంఠ ఏకాదశి దీపోత్సవం |

అఖండ విష్ణు సహస్రనామ పారాయణ మండల దీక్ష :

వేదిక సమీపానగల 'వైకుంఠ ప్రాంగణం'లోని 'శ్రీమహావిష్ణు మందిరంలో' ఆవునేతితో అఖండంగా వెలిగే జ్యోతి కాంతితో 40 రోజులు (6-12-02 నుండి 14-01-03 వరకు) నిర్విరామంగా కొనసాగే శ్రీవిష్ణు సహస్రనామ పారాయణంలో మీరు పాల్గొని ధన్యులు కావచ్చును.

**గమనిక : శ్రీగోదారంగనాథులకళ్యాణం (తేది : 14-01-03) అనంతరం శ్రీమాన్ గజల్ శ్రీనివాస్ బృందం, హైదరాబాద్ వారిచే విశేషాంశములతో కూడిన 'విష్ణు జాగరణ వేడుక' రాత్రంతా నిర్వహించబడును.**

**ధనుర్మాస వ్రత నిర్వహణ మండలి**

**వికాసతరంగిణి కార్యాలయం**, పిట్టలవానిపాలెం - 522 324, గుంటూరు జిల్లా

ఫోన్ : 08643 - 259234.

జై శ్రీమన్నారాయణ!





## ధనుర్మాస ప్రవచనము

హనుమకొండ బాలసముద్రం (ఏకశిలా పార్క్) శ్రీ సీతారామ ప్రసన్నాంజనేయస్వామి దేవాలయంలో కవిశాబ్దికకేసరి మహా మహోపాధ్యాయ ఉ.వే.శ్రీమాన్ **న.చ. రఘునాథాచార్యస్వామివారు** ధనుర్మాస వ్రత సందర్భంగా తిరుప్పావై ప్రవచనములను 16-12-02 నుండి 14-01-03 వరకు అనుగ్రహింపనున్నారు. భక్తులంతా ఇందులో అన్వయించుకొని తరించవలెనని నిర్వాహకులు కోరుతున్నారు.

అతి త్వరలో......... **శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రము** ప్రకటింపబడుచున్నది....

మహామహోపాధ్యాయ, కవిశాబ్దిక కేసరి **శ్రీ న.చ. రఘునాథాచార్యస్వామివారి** విపుల వ్యాఖ్యానముతో శ్రీపరాశరభట్టరువారి సంస్కృత భాష్యముతోపాటు పలు శాస్త్రీయ విషయములపై పాఠశోధనాది అద్భుత విమర్శములతో మధురమైన తెలుగు భాషలో శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రముపై 1200 పేజీలకు పైగా సాగిన వివరణ గ్రన్థమిది. ఇంతవరకు శ్రీవైష్ణవ సంప్రదాయముపై అత్యుత్తమ గ్రన్థాలను 25 వరకు ప్రకటించియున్న సత్సంప్రదాయ పరిరక్షణ సభ సుమారు 20 వరకు గల త్రివర్ణ భగవదవతార చిత్రములతోను కాలికో బైండుతోను శ్రీవైష్ణవ సిద్ధాన్త సర్వస్వమనదగిన ఈ బృహద్గ్రన్థమును వెలువరించుచున్నది. కావలసినవారు ఈ క్రింది అడ్రస్సుకు వ్రాసి గ్రన్థమును పొందవచ్చును. దీని మూల్యము : రూ॥ 600/-

**అడ్రస్సు : కార్యదర్శి, సత్సంప్రదాయ పరిరక్షణ సభ, 16-4-523, శివనగర్, వరంగల్ - 506 002 (ఆం.ప్ర.) ఫోన్ : (08712) - 435999**

**ఇదివరకే సత్సంప్రదాయ పరిరక్షణ సభలో రూ॥ 500-00 సామాన్య సభ్యత్వ రుసుము చెల్లించి యున్నవారు సగము ధరను చెల్లించియే గ్రన్థమును పొందవచ్చును.**



అక్టోబర్ నెలలో తమిళనాడు ముఖ్యమంత్రి కుమారి జయలలిత గారిని కలుసుకొని శ్రీస్వామివారు నిర్వహించిన కార్యక్రమాలను, నిర్వహిస్తున్న **గీతాజ్యోతి** యొక్క వైభవాన్ని వివరించి, గత జూన్ నెలలో శ్రీస్వామివారు సపరివారంగా జరిపిన **మానస సరోవర కైలాస యాత్ర** మల్టీమీడియా వి.సి.డి.ని అందజేస్తున్న శ్రీమాన్ గుదిమెళ్ళ కూర్మనాథస్వామి, శ్రీమాన్ రాంప్రసాద్‌గారు (గుంటూరు).

జై శ్రీమన్నారాయణ!

## బదరీనాథ్‌లో అష్టాక్షరీ క్షేత్రంలో జరుగు అన్నదానమునకు, నిర్మాణమునకు వివిధ పోషకులుగా కైంకర్యములు సమర్పించిన భక్తుల వివరములు

### శ్రీమతి జి. సీతారావమ్మ (గుంటూరు)గారి ద్వారా

**జీవితసభ్యులు :** శ్రీ కె. కాశీవిశ్వనాథం (విజయవాడ), శ్రీ యల్. నరసారెడ్డి, శ్రీ యమ్. చంద్ర పుష్పవేణి, శ్రీ యమ్. సీతారామయ్య, శ్రీమతి కె. సీతారావమ్మ (గుంటూరు).

**అభిమానులు :** శ్రీ సిహెచ్. మాధవరావు (మాచవరం), శ్రీ నల్లూరి బాపయ్య, శ్రీ కె. రవిశంకర్ (పల్లపాడు), శ్రీ కె. సాంబశివరావు (గుంటూరు), శ్రీ పి. వీరయ్య (తుళ్లూరు), శ్రీ

గుంటూరు : శ్రీ యన్. అశోక్, శ్రీ శ్రీకరి, శ్రీ యల్. వెంకటేశ్వరరావు, శ్రీ యమ్. సత్యనారాయణ, శ్రీమతి డి. అనూరాధ, శ్రీ పి.వి. స్వామి, శ్రీమతి వి. సంపూర్ణ, శ్రీమతి డి. శేషమాంబ, శ్రీమతి యస్. పండరీబాయి, శ్రీ వి. హనుమిరెడ్డి, శ్రీ ఎ. శ్రీనివాసరెడ్డి, శ్రీ యన్. అంకయ్యనాయుడు, శ్రీ కె. పుల్లయ్యచౌదరి, శ్రీ డి. ధనలక్ష్మి లలితకుమారి, శ్రీ యస్. రామారావు, శ్రీ టి. సాంబశివరావు, శ్రీమతి యమ్. సరోజని, శ్రీ యమ్. సత్యనారాయణ, శ్రీ యమ్. సత్యనారాయణ, శ్రీ జె. శేషయ్య, శ్రీ యమ్. మనోహర్, శ్రీ వి.వి.యస్. బాలకృష్ణ, శ్రీ వై. శ్రీనివాసరావు, శ్రీ పి. వీరరాఘవయ్య, శ్రీ కె. హనుమంతరావు, శ్రీ కె. కోటేశ్వరరావు, శ్రీ సిహెచ్. పుల్లయ్య చౌదరి, శ్రీ జె. కాశీవిశ్వనాథం, శ్రీ పి. కొండయ్య, శ్రీ యన్. గురవయ్య, శ్రీ టి. వీరభద్రరావు, శ్రీ జి. సీతారామి రెడ్డి.

శ్రీ ఆర్. విజయభాస్కరరెడ్డి(అనపాలెం), శ్రీమతి యన్. నాగమ్మ, శ్రీమతి యన్. ఇందిరాదేవి (పల్లపాడు), శ్రీ వెంకటాచలపతి (మచిలీపట్నం), శ్రీ జి. సీతారామ్ ప్రసాద్ (తిక్కిరెడ్డిపాలెం), శ్రీ యన్. విజయ సోమ సుందరరావు (పల్లపాడు), శ్రీ బి. సీతారామయ్య (గోవిందపురం).

### శ్రీమతి కృష్ణకుమారి(హైదరాబాద్)గారి ద్వారా

**అభిమానులు : సికింద్రాబాద్ :** శ్రీ జె. లక్ష్మీనరసింహ శాస్త్రి, శ్రీ జి. వెంకటసుబ్బారావు, శ్రీ కె. రవికిరణ్, శ్రీ రామలింగం, శ్రీ యన్.డి.యన్. భాస్కరరావు, శ్రీ డి. ఆనంద్, శ్రీ పి. బాలకృష్ణమూర్తి.

### శ్రీ పి. కృష్ణాంజనేయులు (బెంగుళూరు)గారి ద్వారా

**జీవితసభ్యులు : బెంగుళూరు :** శ్రీ యమ్.వి. సుబ్బారావు, శ్రీ యన్. నంజునాథ స్వామి, శ్రీ జి.యన్. కృష్ణమూర్తి, శ్రీమతి జి.యన్. కృష్ణవేణమ్మ, శ్రీమతి యమ్. యస్. లక్ష్మి, శ్రీ యమ్. ఆర్. మధుసూదన్, శ్రీ జి.యన్. శంకర నారాయణ, శ్రీమతి జి.యన్. సుశీలమ్మ, శ్రీ జి. సుమంత్, శ్రీ కె. సత్యనారాయణ గుప్త, శ్రీ జి. శివరామ్, శ్రీ జి.యస్. రామచంద్రగుప్త, శ్రీ కె. కృష్ణమూర్తి, శ్రీ యస్. రాధాకృష్ణ, శ్రీ కె.వి. రాజశేఖర్, శ్రీ పి.వి. గోవిందరాజులు, శ్రీ బి. అమరనాథ్,

శ్రీ సి.ఆర్.డి. ప్రసాద్ (నోయిడ), శ్రీ యన్.యస్. నాగరాజు (చింతామణి), శ్రీమతి బి. సరోజని రమణయ్య (నందిగామ), శ్రీమతి యమ్. వెంకట సుబ్బమ్మ (గూటి).

### బదరీనాథ్ ఆఫీసులో సమర్పించినవారు

**అభిమానులు : విజయనగరం :** శ్రీ డి. రామకృష్ణారావు, శ్రీ జె. లక్ష్మీపతిరాజు, శ్రీమతి పి. సావిత్రి, శ్రీమతి యమ్. రమణకుమారి, శ్రీ టి. విజయరత్నం, శ్రీ డి. నారాయణరావు, శ్రీ కె. నాగేశ్వరరావు, కుమారి గ్రీష్మ, శ్రీమతి సిహెచ్. చంద్రమతి, శ్రీయస్. శ్రీనివాసరావు, శ్రీ ఆర్. ఆదిత్య, శ్రీ ఆర్. వంశీ

శ్రీమతి పి. లక్ష్మీకొండ, శ్రీ యమ్. సత్యనరాయణ, శ్రీ యమ్. శ్రీనివాసన్, శ్రీ జి. మాధురీ రామకృష్ణ, శ్రీ జి. నరసింహరాజు, శ్రీమతి మాణిక్యమ్మ, శ్రీ యస్.వి. కృష్ణంరాజు, శ్రీమతి యమ్. సీతాయమ్మ, శ్రీ కె. పి. శాస్త్రి, శ్రీ కె. నరసింహారావు, శ్రీ ఆర్.వి. ప్రేమ్ ప్రసాద్, శ్రీ ఎ. ప్రవీణ్ చంద్ర ప్రసాద్, శ్రీ ఎ. పవన్ కుమార్ (విశాఖపట్నం), శ్రీమతి బి. సుబ్బాయమ్మ, శ్రీ రామోహనరావు (గుంటూరు), శ్రీ పి. వెంకట





సుబ్రహ్మణ్యం, శ్రీ ఎ. పాండురంగ దాసు, రాజా విద్యాకేంద్రం, శ్రీ పి. చంద్రశేఖర్, శ్రీ డి. మురళీధర్‌రావు, శ్రీ ఆర్. శ్రీమన్నారాయణ, శ్రీ యన్. చింతరావు, శ్రీ కె.వి. రత్నప్రసాద్ (హైదరాబాద్), శ్రీ హెచ్. గోవిందరాజు (శ్రీకాకుళం) శ్రీ కె. రమణారావు (యలమంచలి), శ్రీ కె. నరసింహరాజు, శ్రీ పి. సత్యనారాయణ రాజు, శ్రీ నంబూరు నరసింహరాజు, శ్రీ యన్. కృష్ణంరాజు, శ్రీ కె. కృష్ణంరాజు, శ్రీ జి. భాస్కరరాజు (తాడినాడ), శ్రీ యమ్. బాలాజీ (కాకినాడ), శ్రీ ఎ. రమేష్‌రాజు (కైకలూరు), శ్రీమతి బి.హెచ్. కృష్ణవేణమ్మ (కైకలూరు), శ్రీ సిహెచ్. వెంకట రామరాజు (సూరంపల్లి), శ్రీ సిహెచ్. సత్యవతి (కలగొట్ల), శ్రీ జి. వెంగళరావు (రాజోలు), శ్రీ యమ్. పుల్లయ్య (నగరం), శ్రీ కె. నాగేశ్వరరావు, శ్రీ టి. రామారావు (కాకినాడ), శ్రీమతి ఆర్. అనిత (సికింద్రాబాద్), శ్రీ పి. నారాయణమ్మ (విజయవాడ), శ్రీ యన్. గోపాలయ్య (నెల్లూరు), శ్రీ జె. బాలగంగాధర్ (కొంతమూరు), శ్రీమతి యన్. ఇందిరాదేవి, శ్రీ జె. సుబ్బారావు (పల్లపాడు), శ్రీ టి. రామోహన్ పాత్రో, శ్రీ బి. దామోదరం, శ్రీ టి. శ్రీరాంమూర్తి (సోంపేట), శ్రీ యమ్. నారాయణరాజు (ఆకివీడు), శ్రీమతి కె. లక్ష్మీకాంతం (బుజబల పట్నం), శ్రీ యమ్. శేషు (విజయవాడ), శ్రీ కె. పున్నయ్య, శ్రీమతి టి. చంద్రావతి శ్రీ కె. లోకనాథాచార్యులు (బారువా), శ్రీ జి. రమణమూర్తి (సాలూరు), శ్రీమతి సిహెచ్. మాణిక్యం (బాడంగి), శ్రీ మహంతి (తిరుమల), శ్రీ ఆర్. అప్పలరాజు (సాలూరు), శ్రీ ఎ. రామచంద్ర శెట్టి, శ్రీ డి. రవికుమార్ (పీలేరు), శ్రీ కె. వెంకటాచార్యులు, శ్రీమతి ఎ. పుణ్యవతి (పిడుగురాళ్ళ) శ్రీ కె. తిరువెంగళాచార్యులు (దాచేపల్లి), శ్రీ సి.ఆర్. రామోహన్ (బెంగుళూరు), శ్రీ వి. హనుమంత గుప్త (వాయలపాడు), శ్రీ టి. మణికంఠ (కాజీపేట), శ్రీ వి. మధుసూదనరావు (కచేరిమిట్ట), శ్రీ కె.హెచ్. ఆర్. కె. నాగ్ (విజయవాడ), శ్రీ డి. మోహనరావు (సికింద్రాబాద్),

## మేల్కోట తిరునారాయణ పురంలో నిర్మించు భవన నిర్మాణమునకై విరాళములు సమర్పించిన భక్తుల వివరములు

శ్రీ బచ్చు రాధాకృష్ణ, శ్రీ బచ్చు మురళీకృష్ణ, శ్రీ యన్. వెంకటరమణ, శ్రీ యాదా మాధవరావు, శ్రీ యాదా వైకుంఠం, శ్రీ యాదా కృష్ణమూర్తి (వరంగల్), శ్రీమతి జె. శ్రీకుమారి రామేశ్వరరావు, శ్రీమతి యమ్. సరోజని సంపత్‌రావు, శ్రీమతి జి. వనజా భాస్కరరావు, శ్రీమతి చికోటి రామలక్ష్మి నరసయ్య (హైదరాబాద్), శ్రీమతి డా॥ శోభాజయంత్ (సికింద్రాబాద్), శ్రీమతి ఐ. రాధాబాయి (గుల్బర్గా), శ్రీ పి. సోమనరసయ్య (మద్దిరాల), శ్రీమతి రుక్మిణీ పార్థసారధి (చెన్నై), శ్రీమతి నున్న విజయలక్ష్మి కృష్ణకుమార్ (విజయవాడ), శ్రీ కె. సత్యనారాయణ (కాకినాడ).

ఆచార్య సేవా సదనము (జూలూరు) గారి ద్వారా

హైదరాబాద్ : శ్రీమతి పి.వి. రుక్మిణి హనుమంతరెడ్డి, శ్రీమతి పి. కౌసల్య రామిరెడ్డి, శ్రీమతి జి. కమలమ్మ లక్ష్మణరావు, శ్రీమతి జి. సావిత్రి పద్మారావు, శ్రీమతి లక్ష్మమ్మ, శ్రీమతి నర్సమ్మ, శ్రీమతి మిఠాయి లక్ష్మమ్మ, శ్రీమతి యమ్. లక్ష్మమ్మ, శ్రీమతి డి. సుగుణాదేవి, శ్రీమతి డి. సుశీలా రాజారెడ్డి, శ్రీమతి యమ్. సుగుణమ్మ జనార్దనరెడ్డి, శ్రీమతి డి. సుశీలా రామచంద్రరావు, శ్రీమతి జె. వసుమతి భాస్కరరావు, శ్రీయతిరాజమర్ (బెంగుళూరు), శ్రీమతి టి. అరుణా రమణ, శ్రీమతి రాజుబాయి, శ్రీమతి చెల్లా లక్ష్మీకాంతమ్మ రంగారెడ్డి, శ్రీమతి ఆర్. వనమ్మ, శ్రీమతి జి. సావిత్రి, శ్రీ యన్. రామకృష్ణ, శ్రీ ఎ. హనుమంతరావు ఆండాళ్, శ్రీమతి యన్. కౌసల్య కృష్ణారావు, శ్రీమతి సంధ్య, శ్రీ సిహెచ్. వెంకట నరసింహారెడ్డి, శ్రీ పి. నరేంద్రరెడ్డి, శ్రీమతి తారామణి వెంకయ్య, శ్రీమతి యమ్. సక్కుబాయి, శ్రీమతి బి. కళ్యాణి, శ్రీ డి. సంజయ్, శ్రీ కె. వెంకటేశ్, శ్రీ యమ్. రాజా, శ్రీ అలుమారెడ్డి ఆండాళ్ళమ్మ, శ్రీ డి.కామేశ్వర్, శ్రీ యాదా నరసింహారావు, శ్రీ యమ్. భూషణం, శ్రీమతి మంజు సుధాకర్,

# వికాస దర్శిని నివేదన

## శ్రీవారి తిరునక్షత్రోత్సవం

తెల్లవారుఝామున 4 గం॥లకే విద్యార్థులు, శ్రీవారి పరివారం భగవద్బంధుకోటి అంతా తీర్థసదనానికి చేరిపోయారు. (అందరికంటే ముందుగా) శ్రీస్వామివారికి తిరునక్షత్రోత్సవ శుభాకాంక్షలను సమర్పించాలని ఎవరికివారే అహమహమికతో ఎదురు చూస్తున్నారు. శ్రీస్వామివారి దర్శనంకాగానే అందరూ ఒక్కసారిగా 'జై శ్రీమన్నారాయణ!' స్మరణ పూర్వకంగా సేవించారు. శ్రీస్వామివారు అందరికీ మంగళా శాసనాలను అనుగ్రహించారు.

## 'శ్రీవారి తిరునక్షత్రోత్సవ సందేశం'

సాధారణంగా లోకంలో పుట్టిన రోజునాడు అందరూకూడ దీపాలను (నోటితో) ఆర్పడం చూస్తూంటాము. అది పాశ్చాత్యుల వల్ల మనకు సంక్రమించింది. అది మన సంస్కృతికాదు. దీపాలను ఆర్పడం మన సంస్కృతికారాదు. మనం దీపాలను వెలిగించే వారం కావాలి. ఆ జ్యోతులు అందరికీ వెలుగులను అందించే గీతాజ్యోతులు కావాలి. మనకు దీపావళి పండుగకూడ ఇచ్చే సందేశమిదే... మా సందేశం కూడా ఇదే. అని సెలవిచ్చారు. అందుకే మా తిరునక్షత్రోత్సవం నాడు అందరితో దీపాలను వెలిగింపజే స్తూంటాము. అంటూ చమత్కరించారు.

శ్రీ స్వామివారి సాన్నిధ్యంలోనే 'ప్రాతస్స్మరణం' కూడా జరిగింది. ఆ సమయంలో అందరిలో ఒకరై కూర్చున్న 'అమ్మగారిని' ప్రియమార పలకరించి, సేవించిన సన్నివేశం అపురూపమైనది. అది యతిధర్మమే అయినా జగద్వంద్యులయిన శ్రీస్వామివారి వందనాలందుకునే 'తల్లి' ఎంతటి ధన్యురాలో కదా!!

తత్త్వప్రచారికలయిన కుమారి యస్. గీత మొదలగువారు విద్యార్థులకు గురువులకు కూడా మంగళహారతులను ఇచ్చి, శిరస్సున నూనె అద్ది తైలాభ్యంజనాలకు ఉపక్రమింపజేశారు.

సుమారు 7 గం॥లకు శ్రీస్వామివారి సన్నిధిలో సేవాకాలం మొదలయ్యింది. మంగళాశాసనం తర్వాత తీర్థగోష్ఠిలో శ్రీస్వామివారు తీర్థాన్ని అనుగ్రహిస్తూనే సుదూర ప్రాంతాలనుండి వచ్చిన భక్తులను కరుణ చిలికే కంటిచూపులతో చెదరని చిరునవ్వులతోనే అందరినీ పలకరించారు.

ఒక ప్రక్క తిరునక్షత్ర మహోత్సవ సమారోహానికై సర్వాంగసుందరంగా శ్రీమతి నల్లూరి వెంకట రమణమ్మ గారి కైంకర్యంలో సిద్ధమైన వేదికపై 'వేదస్వస్తి' వీనుల విందుగా జరుగుతోంది. ఈ ఏటి విశేషం. వేద విద్వత్ సభ. కృష్ణా, గుంటూరు, కోనసీమ జిల్లాలకు చెందిన 20 మంది ఘనపాఠులతో సుమారు 60 మంది క్రమపాఠులతో ఈ వేద విద్వత్సభ బ్ర॥ వే॥ గుళ్ళపల్లి వెంకటనారాయణ ఘనపాఠిగారి సారధ్యంలో చాలా చక్కగా జరిగింది. పవిత్రమైన వేదఘోషతో మన పండుగ ప్రారంభమైందన్న మాట. శ్రీస్వామివారి ఆదేశానుసారం శ్రీమాన్ గుదిమెళ్ళ వేణుగోపాలాచార్యులుగారి పర్యవేక్షణలో వేద విద్వాంసులందరికీ సత్కారాలు ఘనంగా జరిగాయి.

9 గం॥లకు శ్రీస్వామివారు తీర్థ వినియోగాన్ని ఏకాంగులకు అప్పజెప్పి, మంగళ వాద్య వేదనాద పురస్సరంగా ఈనాటి జీయర్ పురస్కార గ్రహీత అయిన బ్రహ్మ శ్రీ జి.కె. రామమూర్తి అవధానులవారిని వెంటతోడ్కొని వేదిక వద్దకు వేంచేశారు.

తత్త్వ కళాశాల అధ్యాపిక కుమారి శారదగారి స్వాగత ప్రసంగంతో సభాకార్యక్రమం





మొదలయ్యింది. ముందుగా శ్రీస్వామివారు దీపారాధన గావించారు. మన వేద విశ్వ విద్యాలయంలో వేదాధ్యయనంచేస్తున్న విద్యార్థులు వివిధ శాఖలకు సంబంధించిన మంత్రాలతో వేద ప్రార్థన చేశారు. సభాధ్యక్షులయిన శ్రీమాన్ జె. రామేశ్వరరావుగారు (మహాసిమెంట్స్ అధినేత, జెట్ కోశాధికారి) తమ ప్రసంగంలో వేద పరిరక్షణ యొక్క ఆవశ్యకతను, శ్రీస్వామివారి మంగళాశాసన బలంతో జెట్ చేస్తున్న కృషిని ప్రస్తావించారు. తరువాత జెట్ కార్యదర్శిఅయిన శ్రీమాన్ గంగరాజుగారు (లైలాగ్రూప్స్అధినేత) వార్షిక నివేదికను చదువుతూ వేద విశ్వవిద్యాలయం యొక్క పురోగతిని, పురస్కారం యొక్క పుట్టుపూర్వోత్తరాలను తెలియజేశారు. అనంతరం ఈ తిరునక్షత్రోత్సవ ప్రయుక్తంగా ప్రతి యేడు నిర్వహిస్తున్న జీయర్ పురస్కార కార్యక్రమం మొదలయింది.

## జీయర్ పురస్కారం

ఈ జీయర్ పురస్కారం ప్రారంభించి ఆరు సంవత్సరాలయ్యింది. ఇది ఏడవ సంవత్సరం. ఈ ఏడు సంఖ్య ఏడు కొండల వానిని స్మరింపజేసిందో ఏమో..... ఈ ఏడవ పురస్కారం సప్తగిరి నాథుని సన్నిధిలో ఋగ్వేద ప్రాధ్యాపకులుగా సేవ చేస్తున్న బ్ర॥ వే॥ జి.కె. రామమూర్తి అవధానులగారిని వరించింది. 'నమోనమస్సప్తమ భూమికాయై' అని ఏడవ అవతారంగా కీర్తించబడే 'రాముని' పేరుకల వీరికి వరించడం.... దైవికమే కావచ్చు. కానీ.... ఇదంతా శ్రీస్వామివారి సంకల్పమే ననిపిస్తుంది.

బ్ర॥ వే॥ జి.కె. రామమూర్తి అవధానులుగారు ఋగ్వేద ఘనపాఠి. లక్షణ గ్రంథాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసినారు. కృష్ణయజుర్వేదంలోకూడా చక్కని అభినివేశం కలవారు. ముఖ్యంగా నేర్చిన విద్యను పదిమందికీ నేర్పాలనే సౌహార్దం కలవారు. వీరిని ఈ యేడు జీయర్ అవార్డ్‌ను ఇవ్వాలని నిర్ణయించడం జరిగింది.

ఈ పురస్కార కార్యక్రమాన్ని శ్రీ ఉ.వే.ప్ర. శ్రీమాన్ సముద్రాల రంగరామానుజాచార్య స్వామి వారు (శ్రీమదుభయవేదాంతాచార్య పీఠం కార్యదర్శి) ఎంతో ఉదాత్తగంభీరంగా కొనసాగించారు. వారు ముందుగా అవార్డ్ గురించి ప్రస్తావిస్తూ వేద మహిమను, వేద విద్వాంసుల సమ్మాన వైశిష్ట్యాన్ని వివరించి అవార్డు గ్రహీతను పరిచయం చేశారు. అనంతరం పురస్కార ప్రదానం జరిగింది. శ్రీమాన్ రామేశ్వరరావుగారు పండిత శాలువాతో సత్కరించారు. శ్రీమాన్ పి. వీరయ్య (కైలాస్ సుగర్స్ జె.యమ్.డి. కల్లూరు) 50 వేల రూ॥ల నగదు చెక్కును, ఫలతాంబూలాదులతో సమర్పించారు. శ్రీశ్రీశ్రీ స్వామివారు జ్ఞాపికను, ప్రమాణ పత్రమును అనుగ్రహించి మంగళాశాసనములను అందించారు. తరువాత ఆనందాతిరేకంతో పురస్కార గ్రహీత శ్రీరామమూర్తి అవధానులుగారు వేద ప్రాశస్త్యం గురించి ఉపన్యసించారు. వేద వాఙ్మయపరిరక్షణ దీక్షాబద్ధులయిన శ్రీశ్రీశ్రీ స్వామివారికి మనమంతా ఋణపడి ఉన్నామని, ఈ ఋణం తీరేదికాదని, మనమంతా ద్రవత్ ప్రాణులమై (దాతృత్వం కలవారమై) శ్రీస్వామివారి ఆశయాలకు సహకరించాలని తమ సందేశంలో పేర్కొన్నారు. చక్కని సందేశాన్ని అందించిన వారికి శ్రీరంగ రామానుజాచార్యస్వామి కృతజ్ఞతలు పలకడంతో పురస్కార ప్రదాన కార్యక్రమం సంపన్నమైంది.

ఈ సభాకార్యక్రమంలో ముఖ్య అతిథులుగా గుంటూరు జిల్లా పరిషత్ ఛైర్మన్ శ్రీమాన్ పాతూరి నాగభూషణంగారు, గుంటూరు జిల్లా కలెక్టర్ శ్రీమాన్ రామకృష్ణారావుగారు, విశిష్ట అతిథులుగా శ్రీమాన్ డా॥ జగన్నాథరెడ్డిగారు, శ్రీమతి ఐ.వి. ఆనంద కుమారి (జెట్ చెన్నై – ఛైర్‌పర్సన్) శ్రీమాన్ కల్కి అవతారంగారు (జెట్ హైదరాబాద్) ప్రభృతులు పాల్గొన్నారు.

## సమావర్తన మహోత్సవం

మన వేద విశ్వవిద్యాలయం ఎంతో మంది విద్యార్థులను వేద విద్వాంసులుగా తీర్చిదిద్దింది. వీరిలో ద్వివేదులున్నారు. వీరిలో కొందరు తిరుమల, భద్రాచలం వంటి పెద్ద పెద్ద దేవస్థానాలలో గౌరవప్రదమైన జీవనాన్ని గడుపుతున్నారు. మరికొందరు మన వేద విశ్వవిద్యాలయంలోనే ఉండి

విద్యార్థులను శ్రీస్వామివారి ఆశయాలకు అనుగుణంగా తీర్చిదిద్దుతున్నారు. అలా వీరి అధ్యాపనంలో వేదాధ్యయనాన్ని ముగించిన 8 మంది వేద విద్యార్థులకు, ద్రావిడ వేదాధ్యయనం ముగించిన 4గు దివ్యప్రబంధ విద్యార్థులకు, తత్త్వ కళాశాలలో 2 సం॥లు తత్త్వ ప్రచార విద్యను అధ్యయనం చేసి, 3 సం॥ల పాటు దేశమంతా అధ్యాత్మిక ప్రచారాన్ని నిర్వహించిన 8 మంది తత్త్వ ప్రచారకులకు సమావర్తన ఉత్సవాన్ని చేయాలని శ్రీస్వామివారి ఆజ్ఞ.

శ్రీస్వామివారి ఆజ్ఞానుసారం సుమారు 10 సం॥లగా మన సంస్థలో ఋగ్వేద సలక్షణ ఘనపాఠి శ్రీమాన్ సందుగుల రాఘవాచార్యులుగారి వద్ద ఋగ్వేద శాకల శాఖ క్రమాంతాధ్యయనము చేసిన చి॥ ముదుంబై శ్రీకాంతాచార్యులకు, సుమారు 8 సం॥లుగా శుక్ల యజుర్వేద (క్రమపాఠి) శ్రీమాన్ రావూరి వెంకట వరదన్ గారి వద్ద శుక్ల యజుర్వేద కాణ్వశాఖ క్రమాంతాధ్యయనం చేసిన చి॥ ఎస్. ఖగేంద్రాచార్యులకు, చి॥ మూడేకుర్తి సంతోష్ కుమార్‌నకు, చి॥ పరాశరం శ్రీనాథాచార్యులకు, చి॥ కందాళ శ్రవణ్ కుమారాచార్యులకును,

సుమారు 8 సం॥లుగా అథర్వవేద అధ్యాపకులు శ్రీమాన్ కె.వి. శరత్ కుమారాచార్యులగారి వద్ద అథర్వవేద శౌనకశాఖను అధ్యయనం చేసిన చి॥ వంగల పవన్ అర్చక్ ఆచార్యులకు, చి॥ వేదాన్తి సీతారామాచార్యులకు (రామకృష్ణ), చి॥ చిలకముక్కు శ్రీనివాసాచార్యులకు (రమాకాంత్)ను,

సుమారు 3 సం॥లుగా శ్రీమాన్ తిరువేంగళాచార్యులు (శ్రీవిల్లిపుత్తూరు) వారి వద్ద నాలాయిర దివ్యప్రబంధ అధ్యయనం చేసిన చి॥ మరింగంటి వెంకటసత్య రామ లక్ష్మణాచార్యునకు, చి॥ పురాణం శ్రీమన్నారాయణాచార్యులకు, చి॥ దెబ్బట వెంకటేష్ ఆచార్యునకు, చి॥ శృంగారం మారుతీ శ్రీనివాసాచార్యునకు,

అదేవిధంగా, సుమారు 3 సం॥ములపాటు, వైకుంఠ వాసులయిన శ్రీ ఉ.వే. ప్ర. శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్య స్వామివారి సన్నిధిలో తత్త్వశాస్త్రమును అధ్యయనం చేసిన శ్రీమాన్ పి. హనుమాన్ స్వామికి, శ్రీమాన్ యన్. రవికుమార్ గారికి, శ్రీమాన్ సిహెచ్. కుమార రాజాగారికి, శ్రీమాన్ బి. శాంతారాంగారికి, శ్రీమాన్ డి. గంగాధర్ గారికి, ఇంకా కుమారి ఆర్. నీళాగారికి, కుమారి యస్. గీత గారికి, కుమారి బి. కల్పన గార్లకు సమావర్తన కార్యక్రమం జరిగింది. వీరిలో వేద విద్యార్థులు 8 మందికి ఒక్కొక్కరికి 50వేల నగదు, తత్త్వ ప్రచారకులకు 8 మందికి ఒక్కొక్కరికి 25వేల రూ॥ నగదు, దివ్య ప్రబంధవిద్యార్థులకు 4 గురికి ఒక్కొక్కరికి 10 వేల రూ॥ నగదును ఇచ్చి శాలువాతో సత్కరించడం జరిగింది. సభావేదికపై పాల్గొన్న ప్రముఖుల చేతుల మీదగా ఈ సత్కారాలు జరిగాయి. శ్రీశ్రీశ్రీ స్వామివారు మంగళాశాసన పురస్సరంగా యోగ్యతా పత్రాలను వారికి అనుగ్రహించారు. ఈ సమావర్తన కార్యక్రమాన్ని శ్రీమాన్ గుదిమెళ్ల మురళీకృష్ణమాచార్యులు (అథర్వవేద పండితులు, భద్రాచలం దేవస్థానం) వారు నిర్వహించారు.

అనంతరం కుమారి శారదగారి (తత్త్వ కళాశాల అధ్యాపక) నిర్వహణలో గ్రంథావిష్కరణ, కార్యక్రమం జరిగింది.

## గ్రంథావిష్కరణ:

ముందుగా **మైత్రాయణీ సంహిత** (రెండవ భాగం)ను శ్రీశ్రీశ్రీ స్వామివారు తమ శ్రీకరకమలాల ద్వారా ఆవిష్కరించారు. కృష్ణ యజుర్వేదంలో అపురూపమైన వేదశాఖగా గుర్తింపు పొందిన మైత్రాయణీ సంహితను మొట్టమొదటి సారిగా తెలుగు లిపిలో ముద్రించిన ఘనత, మన సంస్థదే అంతేగాక, అధ్యయన సౌలభ్యాన్ని దృష్టిలో ఉంచుకుని విలక్షణంగా, వినూత్నంగా ప్రకటించిన ఘనత కూడ మన సంస్థదే. చిదంబరంలో ఉండే బ్ర॥ వే॥ పరమేశ్వర దీక్షితర్ గారి సన్నిధిలో మైత్రాయణీ శాఖను అధ్యయనం చేసిన 4గురు విద్యార్థులలో ఒక్కరైన శ్రీమాన్ జి. కృష్ణమోహన్ ఎంతో ఓర్పుతో, నేర్పుతో, ఈ సంహితను డి.టి.పి. చేయడమేకాక, మొట్టమొదటి సారిగా పంచాశత్ పదపద్ధతిని





(పనసల పద్ధతి) అకారాది క్రమణికను సిద్ధపరిచారు. అధ్యయనం చేసే విద్యార్థికి ఇది మహోపకారం అని అనడంలో అతిశయోక్తిలేదు. ఇంతటి కృషి చేసిన శ్రీమాన్ కృష్ణమోహన్‌కు శ్రీస్వామివారు మంగళాశాసనపురస్సరంగా శాలువాను, జ్ఞాపికను అనుగ్రహించారు. ఈ సంహిత ముద్రణలో తగు సూచనలను అందిస్తూ పర్యవేక్షించిన శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యులుగారిని, పంచాశత్ పదపద్ధతిని చేయడంలో సహకరించిన శ్రీమాన్ కరి పురుషోత్తమాచార్యులుగారిని కూడ శ్రీస్వామివారు మంగళాశాసన పురస్సరంగా శాలువాను, జ్ఞాపికలను ప్రసాదించారు. ఇంత చక్కని ఉద్గ్రంథాన్ని ముద్రించే కైంకర్యాన్ని చేపట్టిన శ్రీమతి మైత్రేయి (విజయవాడ) గారిని శ్రీస్వామివారు ప్రత్యేక మంగళాశాసనములను ప్రసాదించారు. ఈ మైత్రాయణీశాఖతో నామ సామ్యం కల శ్రీమతి మైత్రేయిగారు ఈ శాఖ ఉద్ధరణానికై మరో లక్షరూ॥లను సమర్పిస్తానని సభాముఖంగా ప్రకటింప జేయడం ఎంతో ముదావహమైన విషయం.

రెండవ గ్రంథం... శ్రీపాంచరాత్రాగమ మంత్ర సిద్ధాన్తానుసారి అయిన **'మహోత్సవ విధిః'** గతంలో ఈ మహోత్సవ విధి ప్రచురితమైనా... దీనిలో ఇంకా అవసరమైన విషయాలను చేర్చి సమగ్రంగా చేస్తే బాగుంటుందని పెద్దలు సూచించడంతో శ్రీమాన్ ముదుంబై మధుసూదనాచార్యులు (శ్రీపాంచరాత్రాగమ కళాశాల ప్రాధ్యాపకులు) గారు సంహితలను, పరంపరానుగతమైన విషయాలను జోడిస్తూ, చక్కని పరిశీలనతో ఈ గ్రంథానికి రూపకల్పన చేశారు. ఈ విధంగాచక్కని కృషిసలిపిన శ్రీమాన్ మధుసూదనాచార్యులుగారికి, ఈ గ్రంథ ముద్రణలో ఆద్యంతం శ్రద్ధచూపిన శ్రీమాన్ పురాణం వెంకటాచార్యులు (రామానుజవాణి నిర్వాహకులు) గారిని శ్రీస్వామివారు మంగళాశాసనములను చేశారు. ఈ గ్రంథ ముద్రణకు అవసరమైన ద్రవ్యకైంకర్యం చేసిన శ్రీమాన్ పి. వీరయ్య (కాకతీయ సిమెంట్ అధినేత) గారిని కూడా శ్రీశ్రీశ్రీ స్వామివారు ప్రత్యేక మంగళాశాసనాలు ప్రసాదించారు.

మూడవ గ్రంథం **శ్రీపతిస్తుతిమాల**. గతంలో సుమారు 10 ముద్రణలను పొంది విశేషంగా భగవద్బంధువుల ఆదరానికి పాత్రమైన స్తోత్రజాలము ఈ స్తుతిమాల. ఈ ముద్రణలో ఈ గ్రంథాన్ని సంస్కరించి, మరింత వైలక్షణ్యంగా చేసినవారు శ్రీమాన్ నేపాల్ కృష్ణమాచార్యులుగారు. వీరు ఈ గ్రంథంలో ప్రామాణికమైన కొన్ని పూర్వాచార్యుల స్తోత్రాలను చేర్చి, నిర్దుష్టంగా ఉండేటట్లు శ్రద్ధ వహించారు. వీరు ఈ సందర్భంగా ప్రసంగిస్తూ స్తోత్ర విశిష్టతను, ఈ గ్రంథముద్రణ విలక్షణతను చాలా హృద్యంగా వివరించారు. శ్రీస్వామివారు శ్రీమాన్ కృష్ణమాచార్యస్వామివారికి మంగళాశాసనపురస్సరంగా శాలువాను జ్ఞాపికను ప్రసాదించారు. ఈ గ్రంథముద్రణకు వలయు ద్రవ్య కైంకర్యాన్ని చేసిన శ్రీమాన్ పురుషోత్తమరావు (హైదరబాద్ జెట్ కార్యదర్శి) గారికికూడ శ్రీస్వామివారు ప్రత్యేక మంగళాశాసనములను ప్రసాదించారు.

సభా ప్రారంభం నుండి ఈ కార్యక్రమాన్ని వైశిష్ట్యాన్ని కలిగిస్తూ వేంచేసియున్న పరమహంస పరివ్రాజకాచార్యులు శ్రీశ్రీశ్రీ అజిగియ మణవాళ జీయర్‌స్వామివారు (శ్రీకాంచీపురం), అనుగ్రహ భాషణం చేస్తూ శ్రీశ్రీశ్రీస్వామివారు అపరరామానుజులేనని, వారుచేస్తున్న వేదపరిరక్షణ సాటిలేనిదని, వారు పల్లాండు, పల్లాండుగా వేంచేసి ఉండాలని మంగళాశాసనాలు చేశారు.

అదే విధంగా పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి సంపత్కుమార రామానుజ (అష్టాక్షరీ) జీయర్ స్వామివారు అనుగ్రహభాషణం చేస్తూ శ్రీశ్రీశ్రీస్వామివారి వైదిక ధర్మోద్ధరణ ఉద్యమాన్ని, ఆదర్శ వంతమైన ఆధ్యాత్మిక ప్రచార సరణిని ఎంతో శ్లాఘించారు.

అనంతరం ముఖ్యఅతిథులయిన శ్రీమాన్ పాతూరి నాగభూషణంగారు (జి॥ ప॥ చైర్మన్) ప్రసంగిస్తూ.... 'ఇంతటి వైభవం కల వేద విశ్వ విద్యాలయం శ్రీ చిన్న జీయర్‌స్వామి ఆశ్రమం నా జిల్లాలో ఉన్నందుకు నేనెంతో గర్విస్తున్నానని, ఈ

ఆశ్రమం యొక్క అభివృద్ధికై నా శాయశక్తులా కృషి చేస్తానని అన్నారు.

తరువాత శ్రీమాన్ రామకృష్ణారావు (జిల్లా కలెక్టర్) ఐ.ఎ.యస్. గారు మాట్లాడుతూ ఇంత మంది వేద విద్వాంసులను తయారుచేస్తున్న ఈ వేద విశ్వవిద్యాలయం అభినందించ తగినదని, శ్రీస్వామివారి యొక్క మధుర ప్రసంగాలకు ఎంత మహత్తు ఉందో ఈ అభివృద్ధిని చూస్తే తెలుస్తుంది అన్నారు.

అనంతరం ఇరువురు జీయర్ స్వాములను శ్రీస్వామివారే స్వయంగా సత్కరించారు. అతిథులకు, ఉభయ దారులకు, కార్యవర్గ సభ్యులకు శ్రీమాన్ వెంకటాచార్యులుగారు, శ్రీమాన్ బాబుగార్ల పర్యవేక్షణలో జ్ఞాపికా ప్రదానం జరిగింది. శ్రీ స్వామివారు అందరికీ మంగళాశాసనములను కృపజేశారు.

తరువాత వేద విశ్వవిద్యాలయ అధ్యాపక బృందం తరపున శ్రీమాన్ గుదిమెళ్ళ సురేంద్రాచార్యులుగారు, శ్రీమాన్ రావూరి వెంకట వరదన్ గార్లు వేద విద్యయొక్క ప్రశస్తిని, దాని ఆవశ్యకతను వివరించారు. అనంతరం ఎప్పుడెప్పుడా! అని అందరూ ఎదురుచూస్తున్న శ్రీశ్రీశ్రీ స్వామివారి అనుగ్రహభాషణం ప్రారంభమైంది.

పుట్టినరోజు పండుగనాడు దీపాలను ఆర్పడం కాదు జ్యోతులను వెలిగించే ప్రయత్నం చేయండి. ఆ విధంగా ప్రతి ఒక్కరి పుట్టిన రోజు ప్రయోజన వంతమైన దీపావళి కావాలి. అందుకోసమైనా మేము మా తిరునక్షత్రోత్సవాన్ని జరుపుకుంటాము అని సందేశాన్ని అనుగ్రహిస్తూ గీతాజ్యోతి యొక్క ప్రచార ఆవశ్యకతను దీపావళి పండుగ ప్రాశస్త్యాన్ని, నరకాసురుని వృత్తాంతాన్ని వివరించారు.

అనంతరం శ్రీ ఉ.వే. శ్రీమాన్ టి.పి. శ్రీరామచంద్రాచార్యస్వామివారు (భక్తినివేదన సంపాదకులు) ఈ కార్యక్రమ వైభవాన్ని శ్లాఘిస్తూ ఈ ఉత్సవాన్ని నిర్వహించిన వారందరికీ కృతజ్ఞతా విష్కరణం గావించారు. అన్నిగంటలు కూర్చున్న శ్రమంతా మర్చిపోయే విధంగా చమత్కారంగా వారి ప్రసంగం జరిగింది.

వేద విద్యార్థుల శాంతి మంత్ర పఠనంతో కార్యక్రమం సుసంపన్నమైంది. శ్రీస్వామివారి శ్రీపాద పూజా కార్యక్రమం తీర్థ సదనంలోనే ఏకాంతంగా కావాలని అనుకున్నా భగవద్బంధు లందరి కోరికపై వేదికపైననే స్వీకరించడానికి శ్రీస్వామివారు ఆమోదించారు. శ్రీస్వామివారు మళ్ళీ వేదికపైకి వేంచేయగానే దివ్యదేశాలనుండి వచ్చిన శేషమాలలను, వస్త్రాలను ప్రసాదాలను ఆయా అర్చక స్వాములు శ్రీస్వామివారికి సమర్పించారు. తిరునక్షత్రోత్సవంలో అదే ప్రధానంగా భగవద్బంధువులు భావించే 'దివ్యదేశ మర్యాద' కార్యక్రమం వైభవంగా జరిగింది. శ్రీరంగం, విల్లిపుత్తూరు, శ్రీ పెరుంబుదూరు, బదరీనాథ్, తిరుమల, తిరుచానూరు, సింహాచలం, భద్రాచలం మొదలగు దివ్యదేశాలనుండి దివ్యస్థలాలనుండి మర్యాదలను తీసుకుని విచ్చేసిన వారందరికీ శ్రీస్వామివారు మంగళాశాసనములను కృపచేసారు.

అనంతరం వైభవోపేతంగా విద్యార్థులందరూ కలసి శ్రీస్వామివారి పాదపూజను భక్తి శ్రద్ధలతో ఆచరించుకున్నారు. శ్రీ స్వామివారి శ్రీ చరణ సంబంధీకులు, భగవద్బంధువులు ఎంతో భక్తి శ్రద్ధలతో సేవించుకున్నారు. తదీయారాధనా కార్యక్రమం నిరాటంకంగా జరిగింది. సుమారు రాత్రి 7 గం॥ల ప్రాంతంలో తీర్థ సదనములో దీపావళి సందర్భంగా శ్రీలక్ష్మీఅమ్మవారి కుంకుమార్చన జరిగింది. శ్రీ సీతారామచంద్రస్వామివారి సన్నిధిలో దీపాలను వెలిగించి, విద్యార్థులచే బాణాసంచాలను కాల్పించారు. తరువాత ఆశ్రమంలోనే విశాలమైన ఖాళీ ప్రదేశంలో విద్యార్థులందరి వినోదం కోసం ప్రత్యేకించి తయారు చేయించిన చిత్రవిచిత్రమైన బాణసంచాను కాల్పించారు. పండుగ అంతా సీతానరగంలోనే ఉన్నట్లు అనిపించింది. అందరిలో ఒకరై శ్రీస్వామివారు కూడా ఈ వినోదంలో పాల్గొనడంతో అందరి ఆనందాలకు అవధుల్లేవు. అందరి కళ్ళలోనూ ఆనందజ్యోతులే. ఆ జ్యోతులు మామూలు జ్యోతులకంటే కాంతి వంతాలు... ఆ కాంతులలో దీపావళి పండుగ సార్థకం, పరమార్థ దాయకంగా జరిగింది.





### 5-11-02

శ్రీస్వామివారి సన్నిధిలో ఉదయం 8-30ని॥లకు తీర్థగోష్ఠి పూర్తయింది. 9గం॥ లకు సభాకార్యక్రమం మొదలైంది. టి.టి.డిలో జె.ఇ.ఓ.గా శ్రీనివాసుని సేవ చేసుకుంటున్న శ్రీమాన్ బాలసుబ్రహ్మణ్యంగారు ముఖ్యఅతిథిగా నేటి సభలో పాల్గొన్నారు. ముందుగా వేద విద్యా విధానం గురించి శ్రీమాన్ నేపాల్ కృష్ణమాచార్యస్వామి ఆసక్తికరంగా ప్రవచనం చేశారు. తరువాత శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యులు గారు, శ్రీ పెద్దజీయరు స్వామివారుచేసిన అఖిల భారత వేదవిద్వత్సమ్మేళనం గురించి, ఆ సమ్మేళనంలో వారి ఆశయాలు శ్రీ చిన్న జీయర్‌స్వామివారిగా ఎలా రూపు దిద్దుకుంటున్నాయో వివరించారు. తరువాత శ్రీమాన్ బాల సుబ్రహ్మణ్యం గారు మాట్లాడుతూ ఆధ్యాత్మిక-సామాజిక జీవనాల మధ్య ఉండే సమన్వయ ధోరణిని, అలాంటి సమన్వయాన్ని సాధించే శ్రీస్వామివారి కార్యక్రమాల యొక్క ఆవశ్యకతను తమకుగల శ్రీరామభక్తిని ఎంతో చక్కగా, సోదాహరణంగా వివరించారు. చివరగా శ్రీస్వామివారు అనుగ్రహభాషణం చేస్తూ వారి కర్తవ్యపాలనను, వారి భక్తి శ్రద్ధలను శ్లాఘిస్తూ కొన్ని వేల సం॥రాలుగా తిరుమల శ్రీనివాసుని సన్నిధిలో వస్తున్న ఆచారాలు, సాంప్రదాయిక వ్యవహారాలు, కొంతమంది అధికారుల నిర్లక్ష్య వైఖరివల్ల అంతరించిపోతున్నాయని, వేల సం॥లుగా వస్తున్న ఆచారాలను రూపుమాపడానికి ఒక కలంపోటు చాలునేమో కాని, ఆ ఆచారాలను పునరుద్ధరించా లంటే కొన్ని సంవత్సరాల కాలం పడుతుంది.

ఏది ఏమైనా మళ్ళీ ఆ స్వామి సన్నిధిలో ఆచారాలు యథాపూర్వంగా జరగాలని ఆశిస్తున్నామని శ్రీస్వామివారు తమ సందేశంలో కృపజేస్తూ వారికి అనేక మంగళా శాసనాలను చేశారు. వారికి, వారి సతీమణికి శ్రీస్వామివారు జ్ఞాపికలను, నిన్న ఆవిష్కరించిన పుస్తకాల సెట్టును కూడ అనుగ్రహించారు. కుమారి శారదగారి నిర్వహణలో సభాకార్యక్రమం సుసంపన్నమైంది.

### 6-11-02

శ్రీస్వామివారి ఆజ్ఞానుసారం వేద విద్యార్థులు, ఆగమ విద్యార్థులు కూడ వివిధ అంశాలపై, అంచనాలకు మించి చాలా చక్కగా రోజూ ప్రవచనాలు, భజనలు నిర్వహించారు. వేద అధ్యాపకులతోపాటు, 10స॥ల వయస్సుగల విద్యార్థులుకూడ ఈ ప్రసంగాలను అందించారు. 6వ తేదీ మధ్యాహ్నం గాలిపాలెం భగవాన్ వెంకయ్యస్వామి భక్త బృందం, చిన్న వెంకయ్యస్వామి వారి సమక్షంలో భజన కార్యక్రమం నిర్వహించింది. చిన్న వెంకయ్యస్వామిగారి 'ఆదినారాయణా! భజన అందరినీ అలరించింది. ఆ రోజు సాయంత్రం విశాఖపట్టణం నుండి వచ్చిన శ్రీమాన్ రామారావు గారు ఘంటశాల భగవద్గీతను, ఎంతో మధురంగా, శ్రావ్యంగా ఆలపించారు. వారి బృందంవారు భజన గీతాలను ఆలపించారు. రాత్రి తీర్థగోష్ఠిలో శ్రీస్వామివారు వారికి మంగళా శాసనములు అనుగ్రహించారు. అదే రోజు రాత్రి శ్రీమతి కృష్ణ కుమారి (హైదరాబాద్)గారి శిక్షణలో మన విద్యార్థులు **స్వాతిజః** అనే నృసింహావతారానికి సంబంధించిన నృత్యరూపకం చేశారు. సుమారు 40 ని॥ల సేపుసాగిన ఈ రూపకం అందరిని విశేషంగా అలరించింది. రూపకమంతా శ్రీమతి కృష్ణకుమారి గాత్రంతోనే సాగింది. రూపకానికి ముందు కుమారి గీత చేసిన పుష్పాంజలి నాట్యం రూపకానికి మరింత వన్నె తెచ్చింది.

7వ తేదీ ఉదయం వేద ఆగమ విద్యార్థుల ప్రవచనాలకు శ్రీస్వామివారే స్వయంగా వేంచేసి ఉండి మంగళాశాసనాలు కృపచేసారు. అనంతరం ఒకప్పటి సీతానగర వాస్తవ్యురాలైన శ్రీమతి ఆదిలక్ష్మీ భాగవతారిణి గారు 'భక్త ధ్రువ' హరికథను భక్తిరస పూరితంగా వినిపించి శ్రీస్వామివారి మంగళా శాసనాలు అందుకున్నారు. ఆ రోజు రాత్రి, సహస్ర కలశాభిషేకోత్సవానికై శ్రీమాన్ రమాకాంతాచార్యులు

గారి పర్యవేక్షణలో శ్రీమాన్ సముద్రాల శ్రీనివాసాచార్యులుగారు, శ్రీమాన్ ముడుంబై మధుసూదనాచార్యులుగారు మరియు ఆగమ విద్యార్థులు వెయ్యినొక్క కలశాలను శాస్త్రం చెప్పిన తీరులో మండలాలుగా పేర్చి పూర్వరంగాన్ని సిద్ధం చేశారు.

## 8-11-02, సీతారామ చంద్రస్వామివారి సహస్ర కలశాభిషేక మహోత్సవము

శ్రీస్వామివారి సన్నిధిలో తీర్థగోష్ఠి పూర్తయ్యే సరికి 9 గం॥లయ్యింది. వేద సూక్త పఠనంతో పెరుమాళ్ళను వేదికపైకి వేంచేపు చేశారు. ముందుగా శ్రీస్వామివారే ప్రసంగిస్తూ సహస్ర కలశాభిషేకం యొక్క పుట్టుపూర్వోత్తరాలను వివరించారు. 1993లో పెరుమాళ్ళ చౌర్యం జరిగిన సమయంలో యస్.ఐ.గా ఉన్న శ్రీమాన్ కోటేశ్వర రావుగారు చేసిన ఉపకారాన్ని స్మరిస్తూ వారిని సభకు పరిచయం చేశారు. వార్షికంగా వారికి జరిగే సమ్మానాన్ని శ్రీస్వామివారే మంగళాశాసన పురస్సరంగా అనుగ్రహించారు. ఆ సన్నివేశాన్ని వర్ణిస్తూ శ్రీమాన్ మురళీకృష్ణమాచార్యులుగారు తస్కరులను కోటేశ్వరరావుగారునిగ్రహించి సత్కారం వారు ప్రతి ఏడాదీ స్వంతం చేసుకున్నారన్నపుడు హర్షం వెల్లివిరిసింది.

శ్రీమాన్ కోటేశ్వరరావు సి.ఐ.గారు అప్పటి సన్నివేశాన్ని స్మరిస్తూ తనకు ప్రతి ఏడూ లభించే ఈ భాగ్యానికి ఉప్పొంగిపోతూ ఈ నాడిది ఓ పండుగలా ఉన్నా ఆనాడు ఎంతో హృదయ విదారకమైన సన్నివేశమని, తలిస్తే, ఇప్పటికీ గగుర్పాటు కలుగు తుందని, ఇది భగవంతుని, శ్రీవారి దయ అంటూ శ్రీస్వామివారికి కృతజ్ఞతాంజలి సమర్పించారు. ఒక ప్రక్క వేదఘోష సాగుతూండగా సహస్ర కలశాభిషేకం ప్రారంభమైంది. శ్రీమాన్ రమాకాంతా చార్యస్వామివారి పర్యవేక్షణలో శ్రీమాన్ మధుసూదనా చార్యులుగారి యాజ్ఞిక నిర్వహణలో అభిషేకం కన్నుల పండుగగా జరిగింది. మధ్యలో శ్రీ ఉ.వే. శ్రీమాన్ ఉదయవర్లుస్వామివారు అభిషేక ప్రశస్తి గురించి ప్రవచించారు. మధ్య మధ్యలో వేద ఆగమ విద్యార్థులుకూడా వీనుల విందుగా ప్రవచనాలు సాగించారు. చిన్నారులు చేసే భజన చాలా ఉత్సాహంగా జరిగింది. అభిషేకం పూర్తయ్యేసరికి సా॥ 4 గం॥లు అయ్యింది. మంగళవాద్యపురస్సరంగా, వేద ఘోషల మధ్య మహా కుంభాభిషేకం జరిగింది. శ్రీస్వామివారి శ్రీహస్తముల ద్వారానే ఈ అభిషేక కార్యక్రమం జరిగింది. ఆ అభిషేక జలాన్ని శ్రీస్వామివారే స్వయంగా అందరిపై ప్రోక్షించారు. అభిషేక తీర్థాన్ని, మంజనాన్ని, ఫల ప్రసాదాలను విద్యార్థులు అందరికీ వినియోగం చేశారు. అభిషేకం ఒక ప్రక్క జరుగుతూండగానే మరో ప్రక్క తదీయారాధన కూడ జరిగింది. కన్నుల పండుగగా అభిషేకం, కడుపు నిండుగా అను యాగంతో ఈ సహస్ర కలశాభిషేక మహోత్సవం సుసంపన్నమైంది.

## 9-11-02, శ్రీసీతారామ చంద్రస్వామివారి పట్టాభిషేక మహోత్సవము

శ్రీస్వామివారి సన్నిధిలో తీర్థగోష్ఠి పూర్తయ్యేసరికి ఉ॥ 8-30 అయింది. వేదికపై పట్టాభిషేకానికి సంబంధించిన పూర్వరంగం సిద్ధం అయింది. శ్రీస్వామివారు పెరుమాళ్ళతో పాటుగా వేదికపైకి వేంచేశారు. విష్వక్సేన పూజారంభాన్ని గావించి శ్రీస్వామివారు సమాశ్రయణ కార్యక్రమానికై తీర్థ సదనానికి వెళ్లారు. శ్రీమాన్ రమాకాంతాచార్య స్వామివారి ఆచార్యత్వంలో పట్టాభిషేకం ఆగమోత్తంగా, వైభవంగా జరిగింది. ఈ ఉత్సవాన్ని వై॥వా॥ పూర్ణచంద్రరావుగారి స్మృత్యర్థంగా వారి కైంకర్యంగా వారి సతీమణి వారి కుటుంబ సభ్యులందరితో, కుమారులూ, కుమార్తెలందరితోనూ ఈ ఉత్సవాన్ని నిర్వహింప జేశారు. శ్రీరామాయణ ఘట్టపారాయణాన్ని శ్రీమాన్ నేపాల్ కృష్ణమాచార్య స్వామి చేశారు. శ్రీస్వామివారు ఆ ఘట్టంలోని విశేషాలను హృదయంగమమైన రీతిలో ప్రవచనం చేశారు. పట్టాభిషేకం చివర సరోజనమ్మగారికి, వారి కుటుంబానికి శ్రీస్వామివారు మంగళాశాసనాలు కృపజేశారు. పట్టాభిషేక తీర్థాన్ని శ్రీస్వామివారే స్వయంగా అందరిపై ప్రోక్షణ చేశారు. పట్టాభిషేక కార్యక్రమం పూర్తయ్యే సరికి సాయంత్రం





4గం॥లయ్యింది. మంగళ హారతితో ఈ కార్యక్రమం పరిపూర్ణమైంది.

## 17-11-02

ప్రతి ఆదివారం సాయం వేళల్లో జరిగే గీతాజ్యోతి సభ ఈనాడు మరో విశేష కార్యక్రమంతో పాటు జరిగింది. శ్రీమాన్ నేపాల్ కృష్ణమాచార్య స్వామి, శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీకృష్ణమాచార్యుల ప్రసంగాలు అయ్యాక 'అధ్యాపక సమ్మానం జరిగింది. శ్రీస్వామివారి తిరునక్షత్రోత్సవనాడు సమావర్తనాన్ని చేసికొన్న అథర్వవేద విద్యార్థులు ముగ్గురు కల్సి, తమ గురువుగారయిన శ్రీమాన్ శరత్కుమారాచార్యులు గారికి 'గురుదక్షిణగా' కృతజ్ఞతా పూర్వకమైన సమ్మానాన్ని చేసికొన్నారు. ముందుగా ముగ్గురి తరపున చి॥ వేదాన్తి సీతారామాచార్యులు కృతజ్ఞతా ప్రసంగం చేశాడు. శ్రీస్వామివారి సాన్నిధ్యంలో, శ్రీమాన్ జంధ్యాల శంకర్ గారి చేతుల మీదుగా అధ్యాపక సమ్మానం జరిగింది. సమ్మానితులయిన శ్రీమాన్ శరత్ కుమారాచార్యులుగారు మాట్లాడుతూ శ్రీస్వామివారి మంగళాశాసనములతో ఇంకా మరికొందరు విద్యార్థులకు వేదాధ్యాపనం చేయాలని ఉందనే తమ ఆంతర్యాన్ని విన్నవించారు.

తరువాత, శ్రీమాన్ రవిగదేశన్గారు ఒక కీర్తనను ఆలపించారు. వీరు పుట్టు గ్రుడ్డివారే అయినా చక్కని సంగీత విద్వాంసులు. వీరిని తీసుకుని వచ్చినవారు శ్రీస్వామివారి మారిషస్ ప్రయాణానికి, అక్కడి కార్యక్రమాలకు ముఖ్య సంధాత అయిన శ్రీమాన్ సురేష్గారు, శ్రీస్వామివారు, వీరిరివురికి శ్రీమాన్ శంకర్గారికి మంగళాశాసనాలను చేసారు. అనంతరం శ్రీస్వామివారు 32వ వారపు 'మయ్యేవ మన ఆధత్స్వ' అనే గీతాజ్యోతి శ్లోక సందేశాన్ని మృదుమధురంగా ప్రవచించారు. ఈనాటి సమ్మానితులయిన శ్రీమాన్ శరత్గారికి మరికొందరు విద్యార్థులను తీర్చి దిద్దే శక్తి, ఆసక్తి కలుగునట్లుగా మంగళాశాసనాలు చేసారు. 'గురుదక్షిణ' సమర్పించిన విద్యార్థులను కూడా మంగళాశాసనాలను చేసారు.

18వ తేదీన శ్రీస్వామివారు విద్యార్థులందరితో సమావేశమై వారి విద్యా ప్రగతి గురించి చర్చించారు. అధ్యయన, అధ్యాపన విషయాలతో ఇటు విద్యార్థులకు, అటు అధ్యాపకులకు కూడ తగిన సందేశాలను అందించారు. వార్షికంగా ఇచ్చే సెలవులను ప్రకటించారు. 15 రోజులపాటు సెలవులను ఇవ్వడంతో విద్యార్థులంతా పట్టరాని ఆనందోత్సాహాలతో ప్రయాణానికి సిద్ధమయ్యారు. ఈ సందర్భంలో ఒక దుస్సంఘటన జరిగింది. విద్యార్థులు ప్రయాణానికై వ్యాను సిద్ధమైంది ఆ శ్రమంలోనే అది మలుపు తిరుగుతుండగా నడుస్తున్న ఆ వ్యానులోనుండి చి॥ సంతోష్ కుమార్ (11సం॥లు) అనే విద్యార్థి వ్యానునుండి దూకి ప్రమాదవశాత్తు వెనుక టైరు క్రింద పడ్డాడు. తొడలపై నుండి టైర్ నడవడంతో, అప్పటి కప్పుడే విద్యార్థిని సౌమ్య అపోలో హాస్పిటల్లో చేర్చారు. ఆగని రక్తస్రావాన్ని అదుపులో పెట్టడానికై డాక్టర్లు చాలా ప్రయత్నం చేసారు. ఎ పాజిటివ్ గ్రూప్ రక్తం కోసం సుమారు 80 మందికి రక్త పరీక్షలు జరిపారు. సుమారు 15 లీటర్ల వరకు పిల్లవానికి రక్తం ఎక్కించారు. పరిస్థితి విషమంగా తయారయ్యింది. భగవత్కృపతో శ్రీస్వామివారి మంగళాశాసనాలతో, వైద్యుల నైపుణ్యంతో ప్రాణ ప్రమాదం తప్పింది. విద్యార్థిని ఇంటెన్సివ్ కేర్లోనే ఉంచారు. ఈ రెండు, మూడు రోజులలో మూడు ఆపరేషన్లు చేయాలిట. ఈ ప్రాథమిక వైద్యంలో లక్షా యాభైవేల రూ॥ల వరకు ఖర్చయ్యింది. ఎంత ఖర్చయినా పిల్లవాడిని రక్షించుకోవడమే అందరికీ లక్ష్యం. ఈ దుస్సంఘటనతో ఆశ్రమమంతా విషాదంతో నిండిపోయింది. అందరూ కలసి భగవంతుని ప్రార్థన చేయడంలోనే ఆ రాత్రి బరువుగా, బాధగా గడిచింది.

## చాతుర్మాస్య వ్రత విరమణ

19వ తేదీ. ఈనాడు చాతుర్మాస్య విరమణ కావడంతో భక్తులు తండోప తండాలుగా వస్తున్నారు. శ్రీస్వామివారు తీర్థగోష్ఠిలోనే సందేశాన్ని కృపచేసి, అందరూ తిరిగి వెళ్ళిపోయేటట్లుగా అనుజ్ఞ

ఇచ్చేశారు. విరమణకు సంబంధించిన వైదిక కర్మ ఏకాంతంగానే జరిగింది. ఉదయం వచ్చిన వారు వెళ్ళిపోగా, క్రొత్తగామరింతమంది భగవద్బంధువులు రావడంతో వారిని నిరుత్సాహపరచడం ఇష్టంలేక శ్రీస్వామి వారు కృపతో మధ్యాహ్నం మళ్ళీ తీర్థ గోష్ఠిని చేసారు. చాతుర్మాస్య వ్రత సందేశాన్ని ఇచ్చారు. అనంతరం 'శ్రీభాష్యప్రవేశిక' అనే గ్రంథాన్ని ఆవిష్కరించారు. తత్త్వకళాశాలలో రెండు సం॥ల పాటు శిక్షణపొంది, 4వ తేదీ తిరునక్షత్రంనాడు సమావర్తనాన్ని జరుపుకున్న కుమారి నీళ ఈ ప్రవేశికను రూపొందించారు. వై॥వా॥ శ్రీ ఉ.వే.ప్ర. శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యస్వామి అనుగ్రహంతో, శ్రీభాష్యంలోని మొదటి అధ్యాయానికి చక్కని ప్రతిపదార్థ, తాత్పర్య, సిద్ధాంతాలను సమకూర్చి చాలా సరళమైన భాషలో కుమారి నీళ, గ్రంథాన్ని రూపొందించారు. శ్రీస్వామివారు ఆమెకు మంగళాశాసనాలను కృపచేసారు.

హాస్పిటల్‌లో ఉన్న విద్యార్థి క్షేమ సమాచారాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనే ఉన్నారు. 'సౌమ్య అపోలో' హాస్పిటల్స్ ఎమ్.డి. గారితో ఫోన్‌లో మాట్లాడి, విద్యార్థి వైద్య ప్రగతిని తెలుసుకున్నారు. వచ్చిన ప్రముఖులను, భగవద్బంధువులను సాగనంపి సుమారు రా. 7-00లలో ధర్మక్షేత్ర కార్యక్రమానికై జగిత్యాలకు బయలుదేరారు.

19వ తేదీ సా॥ 6-30కి సీతానగరం నుండి శ్రీస్వామివారు బయలుదేరి సుమారు రాత్రి 11గంటలకు జనగామ పట్టణం చేరారు. శ్రీవేంకటేశ్వరస్వామి వారి దేవాలయంలో కార్తీక పూర్ణిమ సందర్భంగా లక్షదీపారాధన కార్యక్రమం జరిగింది. శ్రీస్వామివారి ఆగమనం ఆలస్యం కావడంతో శ్రీవారి ఆజ్ఞను అనుసరించి దీపారాధన కార్యక్రమం పూర్తి చేసుకుని కార్యకర్తలు, వికాసతరంగిణి సభ్యులు అందరూ శ్రీస్వామివారి ఆగమనానికై నిరీక్షిస్తున్నారు. శ్రీమాన్ టి.ఎస్. సంపత్‌కృష్ణమాచార్య సిద్ధాంతిగారి ఆధ్వర్యవంలో శ్రీస్వామివారిని మంగళవాద్య పురస్సరంగా స్వాగతించారు. శ్రీస్వామివారు సపరివారంగ శ్రీవేంకటేశ్వరస్వామి వారిని సేవించుకుని, కార్యకర్తలకు, భక్తులకు మంగళాశాసనములను కృపచేసి, జగిత్యాలకు ప్రయాణమైనారు.

20వతేదీ. తెల్లవారుఝామున సుమారు 4 గంటలకు శ్రీస్వామివారు జగిత్యాలకు చేరుకున్నారు. రాత్రి నుండి శ్రీస్వామివారి ఆగమనానికై ఊరి పొలిమేరల్లో వేచి ఉన్న శ్రీమాన్ నంబి వేణుగోపాల చార్యులు, శ్రీమాన్ ప్రభాకరరావు ప్రభృతులు శ్రీస్వామివారిని స్వాగతించారు. శ్రీవేణుగోపాలస్వామి దేవాలయానికి ప్రక్కనే ఉన్న నూతన గృహంలోశ్రీస్వామి వారికి వసతిని ఏర్పాటు చేసారు. పెరుమాళ్ళ ఆరాధన, మంగళాశాసనాలను ముగించుకుని సుమారు 10-00గంటలకు శ్రీస్వామివారు ధర్మక్షేత్రానికి (యాగస్థలమునకు) చేరుకున్నారు. ఎస్.కె.ఎన్.ఆర్. డిగ్రీ కాలేజ్ వారి 24 ఎకరాల విశాల మైదానంలో శ్రీవిష్ణుయాగ ఏర్పాట్లను కనులవిందుగా చేసారు. ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడిన షాపింగ్ కాంప్లెక్స్‌తో, కౌంటర్లతో, అఖండ హరేరామ నామ గోష్ఠి భజనతో, నిరంతర హనుమాన్ చాలీసా పారాయణంతో ఆ ప్రదేశమంతా పవిత్రప్రదేశంగా భగవద్బంధువులకు సంతృప్తిని కలిగిస్తోంది. మరో పట్టణంలా ఉన్న ఆ ధర్మక్షేత్రంలో సర్వాంగసుందరంగా తీర్చిదిద్దిన ప్రవచన వేదికపైకి శ్రీస్వామివారు వేంచేసి, పెరుమాళ్ళకు లఘు ఆరాధన గావించి, అగ్ని మథన కార్యకమానికి ఉపక్రమించారు. నిన్నటిరోజు సాయంత్రమే విష్వక్సేన పూజ, పుణ్యాహవాచనం, ఋత్విగ్వరణ మొ॥గు కార్యక్రమాలు పూర్తయ్యాయి. ఆగమవిద్వాన్ శ్రీమాన్ చిలకమర్తి శ్రీనివాసాచార్య (యజ్ఞాచార్య) స్వామివారి ఆచార్యత్వంలో శ్రీమాన్ ముడుంబై మధుసూదనా చార్యులుగారి బ్రహ్మత్వంలో అగ్ని మథన కార్యక్రమం ఆగమోక్తంగా జరిగింది. శ్రీస్వామివారు యాగ వైభవాన్ని ప్రవచించారు. నేడు శ్రీ తిరుమంగై ఆళ్వారుల తిరునక్షత్రోత్సవం కావడంతో వారి దివ్యచరిత్రను సంక్షిప్త సుందరంగా ప్రవచనం చేసారు.





వారి తిరునక్షత్ర తనియన్‌ను శ్రీవారు అందరి చేత అనిపించారు. అగ్నిమథనం పూర్తికాగానే శ్రీవిష్ణుయాగశాలలో సర్వేష్టి యాగశాలలో కూడా అగ్ని ముఖాన్ని హవనాదులను ప్రారంభింపజేసారు. శ్రీవిష్ణుయాగానికి అనుబంధంగా మరో యాగశాలను నిర్మించి వాటిలో వరుసగా శ్రీసుదర్శన, వాసుదేవ, శ్రీవైష్ణవ, వైభవ, పుత్రకామ, వైనతేయ, లక్ష్మీ నారాయణ, శ్రీహయగ్రీయ, శ్రీనృసింహ, వైయ్యూహిక, విష్వక్సేన, శ్రీమన్నారాయణ.... అనే పన్నెండు ఇష్టులు, ప్రతిరోజు కూడ జరిగేటట్లు ఏర్పాటు చేశారు. శ్రీవిష్ణు యాగశాలలో పరమవైదికమైన రీతిలో ఆగమోక్తంగా విశ్వశాంతిని, లోకకళ్యాణాన్ని కాంక్షిస్తూ, గీతాజ్యోతికి అనుగుణంగా యాగం జరిగింది. సర్వేష్టి యాగశాలలో భక్తుల అభీష్టాలను నెరవేర్చేవిధంగా, తద్వారా వారిలో ఆధ్యాత్మిక-సామాజిక సేవలు చేసుకునే ధన బలాదులు సమకూరే విధంగా ద్వాదశేష్టులు నిర్వహించారు. శ్రీస్వామివారి రెండు యాగశాలల్లో కూడ హోమాదులను ప్రారంభించి తీర్థగోష్ఠికి ఉపక్రమించారు. వేలాది మంది భక్తులకు శ్రీస్వామివారే స్వయంగా తీర్థాన్ని అనుగ్రహించారు.

సుమారు 1-30 ని॥లకు యాగశాల, ఇష్టిశాలలలో పూర్ణాహుతి కార్యక్రమాలు పూర్తయ్యాయి. మధ్యాహ్నం 3 గం॥లకనుండి సా॥ 6 గంటలకవరకు శ్రీస్వామివారు సుమారు 2000 వేలమంది కార్యకర్తలతో సమావేశమైనారు. గీతాజ్యోతి ఆశయాల గురించి ప్రస్తావిస్తూ.... సేవ చేసే వాని లక్షణాలను, సేవచేసే విధానాన్ని శ్రీస్వామివారు విపులంగా వివరించారు. శ్రీమాన్ నంబివేణుగోపాలాచార్యులుగారి సారథ్యంలో ఈ సమావేశం ప్రయోజనవంతంగా జరిగింది.

సుమారు 6 గంటలకు శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణం కాగానే యాగశాలల్లో యజ్ఞంతో పాటు వేదికపై జ్ఞాన యజ్ఞం కూడ ప్రారంభమైంది. నేటి సభకు శ్రీపెరుంబుదూర్ క్షేత్రం నుండి ప॥ప॥ శ్రీశ్రీశ్రీ త్రిదండి వరదరామానుజ జీయర్‌స్వామి వారు, కాశీక్షేత్రం నుండి వీరశైవ పీఠాధిపతులైన శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర శివాచార్య మహాస్వామివార్లు విచ్చేశారు.

'గీతాజ్యోతి' సూత్రాలలో 'స్వీయ ఆరాధన - సర్వ ఆదరణ' అనే సూత్రాన్ని ఆచరణాత్మకంగా నిరూపించడానికై ఈ ధర్మక్షేత్ర కార్యక్రమంలో వివిధ సంప్రదాయాలకు చెందిన పీఠాధిపతులను ఆహ్వానించి అందరూ ఒకే వేదికనుండి భక్తకోటిలో సదవగాహనను పెంపొందించేలా ధర్మక్షేత్రాన్ని నిర్వహించాలని శ్రీస్వామివారి సంకల్పం. సత్యసంకల్పులయిన శ్రీస్వామివారి సంకల్పాను సారంగా 8మంది పీఠాధిపతులు ఈ కార్యక్రమానికై విచ్చేసారు.

శ్రీస్వామివారు సంకల్పించిన గీతాజ్యోతి 108 ధర్మక్షేత్రాల కార్యక్రమంలో ఇది మూడవ ధర్మక్షేత్రం. మొదటి రెండు ధర్మక్షేత్రాల కార్యక్రమాలలో మొదటిది వరంగల్ జిల్లా కమలాపూర్‌లోను, రెండవది తూ॥గో॥జిల్లా రాజోలులోను జరిగిన సంగతి భగవద్బంధువులకు తెలిసు. ఈ మూడవ ధర్మక్షేత్రంలో వివిధ పీఠాధిపతుల కలయిక ప్రత్యేకమైన ప్రధానాంశం. ఆహ్వానాలను అందుకుని, గీతాజ్యోతి ఆశయాలను అర్థం చేసుకుని స్వాములు కూడా సౌహార్థంతో విచ్చేశారు. శ్రీస్వామివారు ఇద్దరు స్వాములను, వారి వైశిష్ట్యాన్ని భక్తులకు పరిచయం చేసి, సాఫల్య దిశగా ప్రయాణిస్తున్న 'గీతాజ్యోతి' ఉద్యమం గురించి మృదుమధురంగా ప్రవచించారు.

శ్రీ వరదరామానుజ జీయర్‌స్వామివారు ప్రవచనం చేస్తూ.... శ్రీస్వామివారు సంకల్పసిద్ధులని, వారు సంకల్పించిన కార్యాలన్ని ఆధ్యాత్మిక-సామాజిక భావ సమన్వయంతో సాగుతాయని, అవి ఆదర్శవంతంగా సంపన్నమవుతాయని వివరించారు.

శ్రీ శివాచార్య మహాస్వామీజీ ప్రవచనం చేస్తూ మతాల మధ్య, మనుషులమధ్య అవగాహన లోపిస్తున్న నేటి తరుణంలో శ్రీస్వామివారు తలపెట్టిన ఇలాంటి గీతాజ్యోతి కార్యక్రమాలు ఎంతో అవసరమని, వాటిని ప్రయోజనవంతంగా నిర్వహిస్తూ ప్రజలకు హితాన్ని బోధిస్తున్న శ్రీస్వామివారు కారణజన్ములని అన్నారు. సుమారు రాత్రి 9గం॥లకు

సభాకార్యక్రమం, పూర్ణాహుతి ముగిసాయి.

నవంబర్ 21వ ఉదయం 9గంటల ప్రాంతంలో ధర్మక్షేత్రానికి వేంచేశారు శ్రీస్వామి వారు. నేడు తిరుప్పాణాళ్వార్ తిరునక్షత్రోత్సవం కావడంతో శ్రీస్వామివారు ఆ ఆళ్వారుల దివ్య చరితాన్ని హృదయంగమంగా ప్రవచించి, వారి తిరునక్షత్ర తనియన్‌ను అందరితో చెప్పించారు. వేదికపైన తీర్థగోష్ఠి, వేద-ఇతిహాస దివ్యప్రబంధాదుల విన్నపాలు అయ్యాయి. అనంతరం కె.ఎస్. ఆచార్యులు రచించిన శ్రీ మారుతిమధురగీతమాలిక' అను భక్తి గీతాల క్యాసెట్‌ను శ్రీస్వామివారు ఆవిష్కరించారు. శ్రీరామానుజవాణి వారు వార్షికంగా ముద్రిస్తున్న 'ఆదర్శదినచర్యను' కూడ శ్రీస్వామివారు ఆవిష్కరించారు. శ్రీమాన్ శిరిశనహాళ్ వెంకటాచార్యస్వామి ఈ ఆవిష్కరణ కార్యక్రమాన్ని చక్కగా నిర్వహించారు.

శ్రీస్వామివారు విద్యార్థుల ద్వారా అశేష భక్తజనానికి తీర్థాన్ని ఇప్పించారు. యాగశాలల్లో హవన కార్యక్రమాలను పరిశీలించి సమాశ్రయణ కార్యక్రమానికి ఉపక్రమించారు. సుమారు 10-30కి ప్రారంభమైన పంచసంస్కార కార్యక్రమం సా॥ 6గం॥లకు పూర్తయ్యింది. సమాశ్రయణాలకు ముందు 200 మంది పేర్లు నమోదు చేసికొన్నారు. మధ్యాహ్నానికి 1200 మంది సిద్ధమైనారు. శ్రీస్వామివారు సమాశ్రయణాలను ప్రారంభించే సమయానికి సుమారు 2000 మందికి పైగా శ్రీస్వామివారి ద్వారా మంత్రోపదేశాన్ని పొందారు. ఒక్కసారిగా ఇంతమంది శ్రీవారి పాదసమాశ్రితులు కావడం ఈమధ్య కాలంలో ఇదే మొదటిసారి. సుమారు ఏడు గంటలపాటు సమాశ్రయణాల్లో కదలకుండా కూర్చుని కూడ ఏ మాత్రం అలసట లేకుండా చిరునవ్వుమోముతోనే సమాశ్రయణాలను కృపజేసిన శ్రీస్వామివారి నిర్హేతుక కృపకు వేరే నిదర్శనం కావాలా?!! రాత్రి యథావిధిగా హోమాలు, పూర్ణాముతి కార్యక్రమాలు జరిగాయి. ఈ కార్యక్రమానికై ప్రత్యేక ఆహ్వానితులుగా మస్కట్ దేశం నుండి విచ్చేసిన శ్రీమాన్ గోకుల్ (గుజరాత్) జీ గారితోను వారిపరివారంతోనూ శ్రీస్వామివారు రాత్రి సమావేశమయ్యారు. శ్రీమాన్ గోకుల్ (గుజరాత్) జీ చక్కని ధార్మిక చింతన కలవారు. ఉదార స్వభావం కలవారు. ఆవులను చంపుకునితినే కసాయిదేశంలో ఉండి, వేలాది ఆవులను కన్నబిడ్డలుగా పోషిస్తున్న కరుణాస్వభావులు. మన గీతాజ్యోతి సూత్రమైన 'మాధవసేవగా సర్వప్రాణిసేవ'ను మనసా, వాచా, కర్మణా ఆచరిస్తున్న మహోదారులు. శ్రీస్వామివారు వారి ధార్మికసేవలు మరింత ప్రవర్ధమానమయ్యేటట్లు మంగళాశాసనములను అనుగ్రహించారు.

నవంబర్ 22వ తేదీన ఉ॥ 10 గం॥లకు వేదికపైనే శ్రీకృష్ణ తులసీ పూజా కార్యక్రమం జరిగింది. శ్రీస్వామివారే స్వయంగా ఈ పూజను నిర్వహింపజేసారు. సుమారు 11 గంటలకు పుష్పగిరి పీఠాధిపతులయిన శ్రీశ్రీశ్రీ విద్యానృసింహభారతీ శంకరాచార్యస్వామి వారు విచ్చేశారు. వారిని సాదరంగా మనకార్యకర్తలు వేదికపైకి స్వాగతించారు. శ్రీస్వామివారు. వారి గురించి మాట్లాడుతూ... ఇలాంటి మహాత్ముల రాకవల్ల ఈ ప్రదేశమంతా తీర్థం-పవిత్రప్రదేశమయిందని శ్లాఘించారు. అనంతరం పుష్పగిరి శంకరాచార్యస్వామి మాట్లాడుతూ శ్రీస్వామివారి మధురవాక్ప్రవాహంతో సాగిన 'గీతామృతాన్ని' గ్రోలని ఆంధ్రుడు ఉండడని, వాక్కు ప్రధానమైన ఇంద్రియమని, వాక్కు బాగుంటే అన్ని బాగుంటాయని, మంచిగా మాట్లాడడం నేర్చుకోవాలని సందేశం ఇచ్చారు. మ॥ 12గంటలకు ఇష్టియాగశాలలో శ్రీ శంకరాచార్యస్వామి ఆధ్వర్యవంలో పూర్ణాహుతి జరిగింది. విష్ణు యాగాశాలలో శ్రీస్వామివారే స్వయంగా పూర్ణాహుతిని చేయించి, వెంటనే కరీంనగర్‌కు బయలుదేరారు. శ్రీమాన్ ఆకుల వెంకన్న అత్యాధునిక వైద్యసౌకర్యాలతో ఏర్పాటు చేసిన 'తిరుమల హాస్పిటల్స్'ను మ॥ 1-38 ని॥లకు శ్రీస్వామివారు తమ శ్రీహస్తాలతో ప్రారంభించారు. హాస్పిటల్ అంతా తమ శ్రీపాద విన్యాసంతో పవిత్రం చేసివైద్యులందరికీ తమ సందేశాన్నిచ్చారు.





రోగి అయినవానికి మళ్ళీ మందులతో అవసరం రాకుండా రోగాలను నిర్మూలించడమే మందుల యొక్క పరమావధి అని, వైద్యులు భగవంతుని హస్తాలవంటివారని, భగవంతుడు వీరి ద్వారానే ఆర్తులను ఆదుకుంటాడని, వారు సముచితమైన రీతిలో పేదలకు సేవ చేయాలని, అలాంటి వారికి కూడా అర్థమయ్యే భాషలో రోగాల పట్ల అవగాహన గురించి, అవి రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తల గురించి చిన్న చిన్న పుస్తకాల ద్వారా ప్రాచరం చేయాలని సూచించి, అందరికీ మంగళాశాసనాలను కృపచేశారు.

డాక్టర్స్ స్ట్రీట్‌లోనూ నూతనంగా **I.V.F.** (టెస్ట్‌ట్యూబ్ బేబి) **ICSI** సెంటర్ వంటి అత్యాధునిక సౌకర్యాలతో కూడిన డా॥ పద్మజ సంతానసాఫల్య కేంద్రం. వెన్నెల నర్సింగ్ హోమ్‌లను శ్రీస్వామివారు తమ అమృతహస్తాలతో ప్రారంభోత్సవం చేసారు. హాస్పిటల్‌ను పూర్తిగా తమ శ్రీపాదములతో పావనం చేసారు. శ్రీమతి డా॥ పద్మజగారి ద్వారా అన్ని విషయాలను అడిగి తెలుసుకుని వారికి కొన్న సూచనలను ఇచ్చి, అక్కడకు విచ్చేసిన శ్రీమాన్ వావిలాల హన్మంత రెడ్డి (మున్సిపల్ ఛైర్మన్-కరీంనగర్) శ్రీమతి డా॥ పాపోలు రమాదేవి (హార్ట్ స్పెషలిస్ట్) మొ॥గు ప్రముఖులకు, శ్రీమతి డా॥పద్మజ దంపతులకు మంగళాశాసనాలను అనుగ్రహించారు.

ఈ వెన్నెల నర్సింగ్‌హోమ్‌కు ప్రక్కగానే ఉన్న డా॥ జగన్నాథరెడ్డిగారింటికి వేంచేసారు. పరివారానికి మంగళాశాసనాలను చేసి, జగిత్యాలకు తిరుగు ప్రయాణమైనారు. దారిమధ్యలో వావిలాల పల్లె రామాలయానికి వేంచేశారు. పెరుమాళ్ళను సేవించుకుని, అక్కడి వికాసతరంగిణి సభ్యులను, గీతాజ్యోతి గోష్ఠి వారిని మంగళాశాసనం చేసి 'గీతాజ్యోతి'ని మరింత బాగా నిర్వహించకుని ఆదేశించారు. సుమారు సా॥ 4గం॥లకు జగిత్యాల వసతికి చేరుకున్నారు. 4-30 నుండి 5-30 వరకు వివిధ పత్రికా విలేఖరులతో ప్రెస్‌మీట్‌లో పాల్గొన్నారు. 'గీతాజ్యోతి' ఆశయాలను వివరించారు. ఆలయాల విషయాల్లో ప్రభుత్వాల పక్షపాతధోరణిని, వ్యాపార దృక్పథాన్ని సున్నితంగా విమర్శించారు. సుమారు 8 గంటల నుండి ధర్మక్షేత్రం వేదికపైన సభాకార్యక్రమం. ఐదుగురు పీఠాధిపతులు వేదికను అలంకరించి, తమ అమూల్యమైన సందేశాలను అందించారు.

నవంబర్ 23న శ్రీస్వామివారు ఉదయపు సభాకార్యక్రమంలో "భక్తినివేదన" ఇంగ్లీషు ఎడిషన్‌ను ఆవిష్కరించారు. దీని మొదటి ప్రతిని "సాన్ ఫ్రాన్సిస్కో"లో జెట్ కార్యక్రమాలను సమీక్షిస్తుండే శ్రీమాన్ విష్ణురెడ్డిగారికి అందించారు. వీరు గతంలో గుజరాత్ రిలీఫ్ నిధికోసం వివిధ వ్యక్తులనుండి, సంస్థలనుండి 70,000 డాలర్లను సేకరించి శ్రీస్వామి వారికి సమర్పించారు. ఈ ఎడిషన్ పునః ప్రారంభమునకు కృషి చేసిన శ్రీమాన్ టి. కృష్ణమాచార్యులు (కంప్యూటర్) గారిని, శ్రీమాన్ మధుసూదన్‌ను శ్రీస్వామివారు సమ్మానించి మంగళాశాసనము లందించారు. మధ్యాహ్నము గం. 3.00లకు శ్రీమతి అరుణమ్మ శ్రీమాన్ ఈశ్వరయ్య దంపతుల ఆహ్వానంపై రాయికల్ మండలము అల్లీపూర్ గ్రామంలోని శ్రీ వేంకటేశ్వర దేవస్థానమును సందర్శించి మంగళాశాసనం చేసారు. సాయంకాలం 6-30 గంటలకు, వేంచేసిన పీఠాధిపతులంతా శ్రీస్వామివారి కిరువైపులా ఆసీనులై అశేషభక్త జనానికి తమ అమూల్య సందేశాలను అనుగ్రహించారు.

నవంబర్ 24వ తేదీ. శ్రీస్వామివారి సన్నిధిలో తీర్థగోష్ఠి పూర్తయింది. ఉ॥9-00 గంటలకు శోభాయాత్ర ప్రారంభమైంది. పీఠాధిపతులందరికీ ఒక్కొక్క రథాన్ని ప్రత్యేకంగా అలంకరించి ఎండనుండి రక్షణకోసం ఛత్రాలను కూడా ఏర్పాటు చేసారు. మన స్వామివారితో పాటు 1. శ్రీశ్రీశ్రీ త్రిదండి వానమామలై కలియన్ రామానుజ జీయర్ స్వామివారు (తోతాద్రి), 2. శ్రీశ్రీశ్రీ త్రిదండి వరదరాజ జీయర్‌స్వామివారు (శ్రీపెరుంబుదూర్), 3. శ్రీశ్రీశ్రీ విశ్వ ప్రసన్న తీర్థస్వామి (ఉడిపి), 4. శ్రీశ్రీశ్రీ విద్యా నృసింహ భారతీస్వామివారు (పుష్పగిరి), 5. శ్రీశ్రీశ్రీ విద్యారణ్య భారతీస్వామివారు

(హంపి), 6. శ్రీశ్రీశ్రీ చంద్రశేఖర శివాచార్యస్వామి వారు (కాశి), 7. శ్రీశ్రీశ్రీ సచ్చిదానంద సరస్వతీ స్వామివారు (వైజాగ్) 8. శ్రీశ్రీశ్రీ దుర్గాప్రసాద్ స్వామివారు (విజయవాడ) ఇంకా అనేక మంది రాజకీయ ప్రముఖులు ఈ శోభాయాత్రలో పాల్గొన్నారు. ఎటు చూసినా అశేష భక్తజనం. ఇప్పటివరకు జరిగిన ధర్మక్షేత్ర ప్రయుక్తమైన శోభాయాత్రలన్నింటిలోకి ఇది తలమానికం. శ్రీస్వామివారు, ఈ కార్యక్రమ ప్రధాన నిర్వాకులు శ్రీమాన్ నంబివేణుగోపాలాచార్యులుగారు భజనలు చెప్తుంటే, భక్తులంతా ఆనందోత్సాహాలతో నృత్యం చేస్తూ శోభాయాత్రలో పాల్గొన్నారు. అనేక భజన, కోలాట, గిరిజన నృత్య బృందాలు కూడా పాల్గొని విశేష శోభను చేకూర్చారు. 11-00 గంటలకు శోభాయాత్ర ధర్మక్షేత్ర **(S.K.N.R.** డిగ్రీకళాశాల) ఆవరణలోకి చేరుకుంది. ముందుగా ఇష్టి యాగశాలలో, విష్ణుయాగశాలలో మహాపూర్ణాహుతి నిర్వహించి పీఠాధిపతులందరూ వేదికపైకి వేంచేసారు. 2 లక్షలకు పైగా భక్తజనం బారులు తీరి కుంకుమార్చన కార్యక్రమానికై సంపిద్ధులయ్యారు. వేదికపై వేంచేసిన యతీశ్వరులను భక్తిశ్రద్ధలతో సేవించుకొంటూ ధన్యత చెందామనుకున్నారు. అనేకమంది ప్రజాప్రతినిధులు, ప్రభుత్వయంత్రాంగం కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

ముందుగా శ్రీస్వామివారు మాట్లాడుతూ... 'ఆధ్యాత్మిక సామాజిక భావనల సమన్వయ సాధన దిశగాసాగే గీతాజ్యోతి సూత్రాల గురించి, వాటి లక్ష్యాల గురించి ప్రస్తావిస్తూ నాయకులు కుటిల రాజకీయాలు మాని, మతాల విషయంలో పక్షపాతధోరణిని విడనాడి, నిజమైన ప్రజాస్వామ్యాన్ని అందించాలన్నారు. ఎవరిమతాన్ని వారు, ఎవరి సంప్రదాయాన్ని వారు, సమాన స్వేచ్ఛతో ఆచరించుకుంటూ అందరూ కలసి సమాజాన్ని సేవించే విధంగా ప్రజలను తీర్చిదిద్దడమే అసలు ప్రజా స్వామ్యమని సందేశాన్నిచ్చారు. ఈ విధమైన చైతన్యాన్ని కలిగించడానికే గీతాజ్యోతి ఆవిర్భవించిందని శ్రీవారు సెలవిచ్చారు.

తరువాత కేంద్రహోంశాఖసహాయమంత్రి శ్రీమాన్ విద్యాసాగర్‌రావుగారు మాట్లాడుతూ నేను శ్రీస్వామివారి భక్తుడిని. దురదృష్టవశాత్తు చాలా ఆలస్యంగా శ్రీవారిని సేవించుకోగలిగాను. శ్రీస్వామివారు ప్రభుత్వాలను నిర్దేశించగల ఆధ్యాత్మికశక్తి-సామాజిక స్ఫూర్తికలవారు. వారి మాటలు మాకు ఉపదేశాలుగా, సందేశాలుగా ఆదేశాలుగా అక్కడక్కడ సున్నితమైన హెచ్చరికల్లా కూడా ఉన్నాయి. వారిసందేశాలను శిరసావ హిస్తున్నాం. అమలు పరిచే ప్రయత్నం చేస్తాం. అని ప్రసంగించారు. ఈ కార్యక్రమంలో వీరితోపాటు, శాసన సభ్యులు శ్రీమాన్ జీవనరెడ్డి, శ్రీమాన్ దేవందర్‌రావు, శ్రీమాన్ బొమ్మ వెంకటేశ్వరరావు, శ్రీమాన్ వెంకటరమణరెడ్డిగార్లు ప్రాల్గొన్నారు.

శ్రీమాన్ జీవన్‌రెడ్డిగారు మాట్లాడుతూ "ఇంత గొప్ప కార్యక్రమం మా జగిత్యాలలో జరగడం మా అదృష్టం, ఇది సమాజానికి ఎంతో అవసరమైన కార్యక్రమం. ఇలాంటి కార్యక్రమాల ద్వారానే ప్రజలను మనం సరియైన దిశగా నడిపించగలం. అలాంటి గొప్ప నిర్దేశకులు శ్రీస్వామివారు"అని కొనియాడారు.

తరువాత శ్రీస్వామివారు అనుగ్రహించిన వ్యాఖ్యానంతో కూడిన 'గీతాజ్యోతి శ్లోకమాలిక'ను శ్రీస్వామివారు ఆవిష్కరించారు. శ్రీవారే స్వయంగా పీఠాధిపతులకు, రాజకీయ నేతలకు అందించారు. తరువాత కోటి కుంకుమార్చన కార్యక్రమం ప్రారంభమైంది. సుమారు లక్షాయాభైవేలమంది ఈ పూజలో పాల్గొన్నారు. జనబాహుళ్యం వల్ల, సమయాభావం వల్ల పూజా సామాగ్రిని అందించడం కార్యకర్తలకు చాల ఇబ్బంది అయ్యింది. సుమారు 2,000 వేలమందికి పైగా అందించలేకపోయారు. శ్రీస్వామివారు సమయస్ఫూర్తితో అందరినీ శాంతపరచి అర్చనను దిగ్విజయంగా పూర్తిచేశారు. అందరూ నేతిదీపాలను వెలిగించి గీతాజ్యోతి ప్రతిజ్ఞను చేశారు. శ్రీస్వామివారు చెపుతూండగా అందరూ అనువాచనం చేస్తూ ప్రతిజ్ఞను చేశారు గీతాజ్యోతిలో ముఖ్యమైన ఈ కార్యక్రమం అద్భుతంగా జరిగింది. పూజ తరువాత శ్రీస్వామివారు వేదవిద్యార్థులను, జెట్





గురుకుల పాఠశాలటీచర్లను పంపి అందరికీ ప్రతిమలను, కుంకుమను ఇప్పించారు. కార్యకర్తలందరికీ కూడ మంగళాశాసనాలను అనుగ్రహించారు. అంతటి ఉద్రిక్త పరిస్థితిలో కూడ అందరినీ శాంతపరచడం, సంతృప్తిపరచడం అనితరసాధ్యం అది శ్రీస్వామివారికే సాధ్యం. అది వారి చిరునవ్వుల గొప్పదనం వారి మృదుమధురవాక్కుల కమ్మదనం.

"గీతాజ్యోతి" లక్ష్యాలను సమగ్రంగా సాధించిన జగిత్యాల ధర్మక్షేత్ర కార్యక్రమం ఆదర్శవంతంగా నిలుస్తుంది. ఇంతటి వైభవానికై ఆరునెలలుగా అహర్నిశం శ్రమించిన శ్రీమాన్ నంబి వేణుగోపాల చార్యస్వామి, శ్రీమాన్ నెమలి కొండ రమణా చార్యులూ, శ్రీమాన్ ప్రభాకరరావు, వికాసతరంగిణి శాఖలు, మధుసూదనాచార్యులు శ్రీమాన్ రాంగోపాలా చార్యులు, శ్రీమాన్ సత్యనారాయణాచార్యులు, శ్రీమాన్ విజయకుమారాచార్యులూ ఇంకా గీతాసత్సంగ్, భక్తబృందాలను శ్రీస్వామివారు మంగళాశాసనాలను కృపచేశారు. రాత్రి 11 గంటలకు భాగ్యనగరానికి బయలుదేరారు.

## స్వాతి సౌందర్యమ్

సాధారణంగా 'రాక్షస సంహారాలను' పండుగలుగా లోకం ఆదరిస్తుంది! ఉపకారకులను 'దేవతలుగా' ఆరాధిస్తుంది. (రాక్షస ప్రవృత్తులను) అణగార్చి, కఠోరమైన తమ పవిత్ర జీవితోపదేశాలతో అందరిలో దైవీ ప్రకృతిని మేల్కొలిపే మహాత్ముల అవతార సందర్భం. ఒక విశిష్టమైన పండుగ. అటువంటిదే పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న జీయరుస్వామివారు అవతరించిన 'స్వాతి' తిరునక్షత్ర పండగ. ఈ ఉత్సవమే మేదరమెట్ల గ్రామంలో మూడు రోజులపాటు 'స్వాతి సౌందర్యంగా' నిర్వహించబడింది. శక్తి యుక్తి ఉండి కాకపోయినా, రాయివంటి గుండెలో రవ్వంతప్రేమ అంటి రాముడంటి సాములోరిని ఆరాధించగ రూపొందిన ప్రేమ పండుగ 'స్వాతి సౌందర్యమ్' నవంబరు 2వ తేదీ శ్రీమాన్ గుదిమెళ్ళ బుచ్చి తాతాచార్యస్వామివారి నేతృత్వంలో 'చిత్త ప్రణ హరగుణస్యంది సందర్భ గర్భామ్' అన్నట్లు సాగింది 'సుదర్శన హోమం', సాయంత్రం సు॥ 4 గం॥లసేపు భక్తులందరినీ శ్రీకృష్ణ భావనా ప్రపంచంలో విహరింపజేసిన 'శ్రీకృష్ణపూజ' అపూర్వమని విచ్చేసిన పెద్దల ప్రశంసల నందుకొన్నది. 3వ తేదీ శ్రీ విష్ణు సహస్రనామ పారాయణ ఏకాహం, నగర సంకీర్తన విశేషంగా నిర్వహించబడ్డాయి. 4వ తేదీ దీపావళి నాడు 108 కలశాలతో ఆ దివిజ గంగ దివ్యజల తరంగాల కూడలిగా మారిన ప్రేమ కడలిలో

**పరమహంస పాదరక్షల జలకాలాట!**

**జన నయన మీనములకు ఉత్సవమే ఆ పూట!**

**'భవాంబోధిపోతౌ యతీశానపాదౌ శరణ్యౌ సదా మే'**

ఇదే మంత్రం అందరి నోట! వీటితోపాటు ముఖ్య అతిథిగా విచ్చేసిన శ్రీమాన్ డా॥ చిలకపాటి విజయరాఘవాచార్యస్వామి వారి ప్రవచనాలు అందరినీ విశేషంగా అలరించాయి. గీతాజ్యోతి శ్లోక పఠన పోటీలలో విజేతలైన చిన్నారులకు బహుమతి ప్రదానంతో 'స్వాతి సౌందర్యమ్' విన్నూత శోభను సంతరించుకుంది.

## కృష్ణాజిల్లా

**మల్లిఖార్జున పేట :** విజయవాడ మల్లిఖార్జున పేట వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో శ్రీవారి తిరునక్షత్రోత్సవ సందర్భముగా స్థానిక రాజస్థానీ స్కూలువద్ద 800 మందికి ఉచిత అన్నదాన కార్యక్రమం నిర్వహించడం జరిగింది. అంతేగాక శ్రీ కనకదుర్గ అమ్మవారి దేవస్థానం నందు నీటి సరఫరా, 'క్యూ' పద్ధతి ఏర్పాట్లు చేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో డా॥ డి.వి.డి. ప్రసాద్‌గారు, విజయభాస్కర్, వికాసతరంగిణి ఛైర్‌పర్సన్ శ్రీమాన్ షణ్ముఖరావుగారు, గోవిందరావు మున్నగు కార్యకర్తలు పాల్గొన్నారు.

**గంపలగూడెం :** శ్రీవారి మంగళాశాసనములతో గంపలగూడెం ధర్మక్షేత్రంగ, గంపలగూడెం వికాసతరంగిణి శాఖ వారిచే 108 గ్రామాలలో ఉదయం 9గం॥ల నుండి మధ్యాహ్నం 1.30 వరకు 6 సం॥ల నుండి 15 సం॥ల వయస్సు బాల,

బాలికలకు ఉచిత నేత్ర, దంత వైద్యశిబిరం నిర్వహించబడినది. 160 మందికి కంటి పరీక్షలు, 140 మందికి దంత పరీక్షలు చేయడం జరిగింది. 300 మంది పిల్లలకు ఉచితంగా మందులు పంపిణీ చేయడం జరిగినది. ఈ కార్యక్రమంలో శ్రీమాన్ డా॥ బి. భాస్కరరావుగారు నేత్ర వైద్యులు, డా॥ యార్లగడ్డ శారదగారు దంతవైద్యులు, తమ అమూల్యమైన వైద్యసేవలను అందించినారు. ఈ కార్యక్రమంలో గంపలగూడెం వికాస తరంగిణి చైర్ పర్సన్ శ్రీమతి జయప్రద, కోటేశ్వరరావు, కొల్లారాధాకుమారి, తాడికొండ విజయలక్ష్మి, దారా శ్రీదేవి, కె. మురళీమోహనరావుగారు పాల్గొన్నారు.

**ఆకివీడు:** కృష్ణాజిల్లా గుడివాడ ధర్మక్షేత్ర గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా ఆకివీడు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో స్థానిక మదన గోపాల స్వామి ఆలయంలో గీతాగోష్ఠి కార్యక్రమం ఏర్పాటు చేయడం జరిగింది. 125 గృహములలో శ్రీకృష్ణపూజ, లక్ష్మీ అష్టోత్తర పూజలు జరిపినారు. రోజు 80 మంది భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొనుట జరిగినది. శ్రీమతి కోసూరి రాజ్యలక్ష్మి వికాసతరంగిణి కార్యకర్తలు పాల్గొన్నారు.

**వేకనూరు :** వేకనూరు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో శ్రీవారి తిరునక్షత్రోత్సవ వేడుకలు వైభవంగ జరుపుకొన్నారు. 67 మంది అనాథలకు, నిరుపేదలకు పంచెలు, చీరలు, రవికెలు ఉచితంగ పంచిపెట్టడం జరిగింది. 400 మంది భక్తులచేత విష్ణు సహస్రనామ పారాయణం 1000 సార్లు చేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో వికాస తరంగిణి అధ్యక్షులు జి.వి.యస్. పెరుమాళ్ళు, శ్రీనివాసరావు, చంద్రశేఖర్, గోవిందు ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.

**జగ్గయ్యపేట:** జగ్గయ్యపేట ధర్మక్షేత్రంలో గీతాజ్యోతి కార్యక్రమం అనేక గ్రామాలలో విస్తృత ప్రచారం జరుపుచున్నారు. కొన్ని గ్రామాలలో పశువైద్య శిబిరములు, పాఠశాల విద్యార్థులకు చిత్రలేఖన పోటీ కార్యక్రమాలు నిర్వహించినారు. ఈ కార్యక్రమాన్ని విజయలక్ష్మి, దమయంతి గార్లు నిర్వహించు చున్నారు.

## గుంటూరు

**వట్టిచెరుకూరు:** శ్రీవారి మంగళా శాసనములతో గుంటూరు జిల్లా వట్టి చెరుకూరు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో శుద్ధ ఏకాదశి సందర్భముగ అఖండ విష్ణు సహస్ర నామం, 108 సార్లు పారాయణ చేయడం జరిగింది. స్థానిక వేణుగోపాలస్వామివారి ఆలయంలో 2 లక్షల వత్తులతో జ్యోతులు వెలిగించినారు. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి చైర్ పర్సన్ కొలసాని శివకుమారి, పీరుసాహెబ్, శైలజ, ధనలక్ష్మి మున్నగువారు పాల్గొన్నారు.

**పుల్లడిగుంట :** గుంటూరు జిల్లా పుల్లడి గుంట ధర్మక్షేత్రం కేంద్రముగ కొర్నెపాడు గ్రామంలో 25-10-02 ఉచిత దంతవైద్యశిబిరం నిర్వహించడం జరిగింది. విద్య కేవలం ఉద్యోగానికే గాక విజ్ఞానానికని విద్యార్థులకు సందేశంయిచ్చి నారు. ఈ కార్యక్రమానికి క్రేన్ సంస్థల అధినేత శ్రీమాన్ గ్రంధి సుబ్బారావుగారు జ్యోతి వెలిగించి ప్రారంభించినారు. ZPHహైస్కూల్ ప్రధానోపాధ్యాయులు, మరియు గ్రామపెద్దలు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. వికాసతరంగిణి చైర్ పర్సన్ వెన్నాకుల శ్రీనివాస్ మరియు కార్యకర్తలు 9 పాఠశాలలోని విద్యార్థిని, విద్యార్థులను సమీకరించి దంత సంరక్షణకు తీసుకోవలసిన జాగ్రత్తలను వివరించినారు. 2200 మందికి ఉచితంగ, పేస్టులు, బ్రష్‌లు అందజేసినారు. అంతేగాకుండ తాడికొండ గోగినేని కనకయ్య హైస్కూల్ నందు పల్లపాడు, గారపాడు సౌపాడు, వట్టిచెరుకూరు గ్రామాలయందు దంతవైద్యశిబిరాన్ని నిర్వహించి 3000 మందికి గీతాజ్యోతి సందేశాన్ని అందించడం జరిగింది. ఈ కార్యక్రమాన్ని మన్నె చిననాగయ్య మాజీ యమ్.ఎల్.ఎ., కె. నాగేశ్వరరావు, శివకుమారి, అప్పారావు, సాయిబాబు ఇతర కార్యకర్తలు సహకరించినారు. దంతవైద్యులు డా॥ సత్యనారాయణగారు, టి.వి.లో కార్టున్ షో నిర్వహించి పిల్లలకు దంత సంరక్షణకు తీసుకోవలసిన జాగ్రత్తలు వివరించినారు. ధర్మక్షేత్ర కన్వీనర్ శ్రీమతి లలిత కుమారిగారు పర్యవేక్షణలో ఇది జరిగినది.





**పిట్లవానిపాలెం :** పిట్లవానిపాలెం వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమం 5 మండలాలలో 65 గ్రామాలలో ప్రచార కార్యక్రమం పూర్తి చేయడం జరిగింది. 400 మందిరాలలో భజన, కోలాట బృందాల సమాచారం సేకరించడం జరిగింది.

## నెల్లూరు

**నెల్లూరు :** నెల్లూరు వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో ప్రచార కార్యక్రమం చుట్టు ప్రక్కల గ్రామాలలో జరుపుకొనుచున్నారు. ప్రతి ఆదివారం ఆ వారపు గీతాజ్యోతి శ్లోకపఠనము అర్థ వివరణ ప్రచారము ద్వారా గ్రహించి వివిధ ప్రాంతాలలో గీతాశ్లోక పఠనము పారాయణము చేయుచున్నారు.

శ్రీవారి తిరునక్షత్ర వేడుకల సందర్భముగ శ్రీరంగనాథస్వామి దేవాలయం నందు శ్రీమాన్ హనుమాన్ స్వామి (తత్త్వ ప్రచారకులు) ద్వారా గీతాజ్యోతి శ్లోక వివరణ, అర్థవివరణ ప్రవచనం చేయడం జరిగినది. అందులో పాఠశాలల నందు విద్యార్థులకు గీతాజ్యోతి ప్రవచనం అందించి రొట్టెలు, పండ్లు పంచడం జరిగినది. వికాసతరంగిణి కార్యకర్తలు రెడ్ క్రాస్ సంస్థ వారికి, రక్తదానం చేయడం జరిగినది. ఈ కార్యక్రమంలో చైర్ పర్సన్ యమ్. వెంకటాచలం ముఖ్య కార్యకర్తలు పాల్గొన్నారు.

## కరీంనగర్

**జమ్మిగుంట :** కరీంనగర్ జిల్లా జమ్మిగుంట వికాసతరంగిణి శాఖవారు శ్రీమాన్ డింగరి శ్రీరంగాచార్యులుగారి ఆధ్వర్యవంలో 38 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారమును నిర్వహించుచున్నారు. గీతాజ్యోతి శ్లోకమాలిక పుస్తకము ఉచితంగ పంపిణీ చేయడం జరిగినది. పాఠశాల విద్యార్థులు గీతాజ్యోతి శ్లోకములను కంఠస్థముచేసి పోటీ పరీక్షలలో పాల్గొనేందుకు కృషి జరుగుచున్నది.

**గోదావరి ఖని :** కరీంనగర్ జిల్లా గోదావరి ఖని ధర్మక్షేత్రం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో 4 మండలాలలో 108 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం పూర్తిచేయడం జరిగింది. భక్తులకు స్వీయ ఆరాధన – సర్వఆదరణ గురించి తెలియ చేయడం జరుగుతోంది. ప్రతి గ్రామంలో గీతాజ్యోతి కార్యక్రమం గురించి తెలియజేసి, మరల కృష్ణపూజలు నిర్వహించడం జరిగింది. 15 పాఠశాలలకువెళ్ళి గీతాజ్యోతి శ్లోమాలికనుగూర్చి వివరించడం జరిగింది. స్థానిక వెంకటేశ్వరాలయములో ఉచిత అయస్కాంత చికిత్స శిబిరం నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమంలో ధర్మక్షేత్రం కన్వీనర్లు రామమోహన్‌రావుగారు, గిరిజా ఆగమరావు, శ్యామ్ సుందర్‌గార్లు పాల్గొన్నారు.

**కోరుట్ల:** కరీంనగర్ జిల్లా కోరుట్ల ధర్మక్షేత్రం పట్టణ ప్రాంతములో రోజు ఒక గృహంనందు ఘనంగ గీతాజ్యోతి పారాయణం నిర్వహించుచున్నారు. భవిష్యత్తులో వైద్యశిబిరములు నిర్వహించుటకు ప్రయత్నం జరుగుచున్నది.

శ్రీ జీయర్‌స్వామి తిరునక్షత్ర వేడుకలు స్థానిక శ్రీవేణుగోపాలస్వామి దేవాలయం నందు వైభవంగ జరుపుకున్నారు. దేవాలయ ప్రదాన అర్చకులు శ్రీమాన్ లక్ష్మీనరసింహాచారి ప్రత్యేకపూజలు, ప్రవచనములు నిర్వహించడం జరిగింది. సమితినిర్వహాకులు టి. అనంత రామయ్య, టి. నారాయణ, కె. రామాచార్య, కౌస్తుభమాల, టి. రమాదేవి పాల్గొన్నారు.

## నల్గొండ

**కోదాడ :** నల్గొండ జిల్లా కోదాడ వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమాలలో భాగంగా అంబేద్కర్ కాలనీలోగల ప్రభుత్వ పాఠశాలలో శ్రీమాన్ యన్. ఉత్తమకుమార్ రెడ్డి, యమ్.ఎల్.ఎ. మొక్కలు నాటారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ జీయర్‌స్వామివారి ఆశీస్సులతో వారి ఆశయాలను, ఆదర్శాలను తీసుకొని మంచి కార్యక్రమాలు చేపడుతున్న వికాస తరంగిణి సభ్యులను అభినందించారు. ఎవరి ఆరాధన వారుచేస్తూ ఇతర మతాలను గౌరవించడమే మంచి సాంప్రదాయం అన్నారు. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి అధ్యక్షులు యమ్. కాశీనాథం, మండల పరిషత్ అధ్యక్షులు వి. రామారావు, సిహెచ్.

శ్రీనివాసరావు, బుచ్చిరామయ్యగారు, భారతమ్మ, గుండా లక్ష్మి, భాగ్యమ్మ, గుండా శ్రీనివాస్ తదితర కార్యకర్తలు పాల్గొన్నారు.

### విశాఖ జిల్లా

**అక్కయ్యపాలెం :** విశాఖ పట్నం అక్కయ్య పాలెం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో వార్షికోత్సవ సందర్భముగ మున్సిపల్ కార్పోరేషన్ పాఠశాలయందుగల విద్యార్థులకు పలకలు, పుస్తకములు పంపిణీచేయడం జరిగింది. 50 మంది పేదలకు అన్న వస్త్రదానం చేయడం జరిగింది. శ్రీమాన్ పీతాంబరం రఘునాథాచార్యస్వామి ఆధ్వర్యవంలో వికాస తరంగిణి ఛైర్‌పర్సన్ బి. శకుంతలదేవిగారిఆధ్వర్యవంలో నిర్వహించబడినవి.

**చోడవరం:** విశాఖ జిల్లా చోడవరం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమ సందర్భముగ అందరిచేత శ్రీకృష్ణపూజలు నిర్వహించడం జరిగింది. శ్రీమాన్ ఇరగవరపు రామానుజాచార్యస్వామి ఆధ్వర్యవంలో వైభవంగ జరిగినవి. వికాసతరంగిణి ఛైర్ పర్సన్ రత్నకుమారిగారు, ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.

**తుని :** విశాఖ జిల్లా తుని ధర్మక్షేత్ర కేంద్రముగ నాలుగు మండలాలలో 140 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచారం ముమ్మరంగా జరుగుచున్నది. లక్షకుటుంబాలకు ఈ మహత్తర సందేశం అందించడం జరిగింది. సుబ్బరాయులుగారు, యనముల కృష్ణుడు, రామారావుగారు మున్నగువారి ఆధ్వర్యవంలో ఈ కార్యక్రమాలు జరుగుచున్నవి. తత్త్వ ప్రచారకులు శ్రీమాన్ రఘునాథాచార్యులు, హైమావతిగార్లు ఉత్సాహంగా కార్యక్రమంలో ముందుకు సాగుతున్నారు. 50 పాఠశాలలో విద్యార్థినీ, విద్యార్థులను ఈ కార్యక్రమంలో అన్వయిస్తున్నారు.

### మెదక్

**సిద్ధిపేట :** శ్రీవారి మంగళాశాసనములతో మెదక్ జిల్లా సిద్దిపేట ధర్మక్షేత్రం కేంద్రముగ గీతాజ్యోతి కార్యక్రమం 6 మండలాలలో ప్రచారం వేగంగ జరుగుచున్నది. అనేక గ్రామాలలో పర్యటించి 108 గోష్ఠులను ఏర్పాటు చేయడం జరిగినది. ప్రతి ఒక్క గ్రామంలో ఉన్న శ్రీవారి శిష్యుల సహకారంతో గోష్ఠి సభ్యులందరికి 48 శ్లోకాలు, గీతా పుస్తకములను, ధ్వజాలను అందజేయడం జరిగింది. స్వయంగ వాహనములనుఏర్పాటు చేసుకొని 2 పాఠశాలలో ఉచితనేత్ర పరీక్షలను నిర్వహించారు. 141 మంది విద్యార్థులను పరీక్షించగ 16 మంది విద్యార్థులు, దృష్టిలోపంతో బాధపడుతున్నట్లు గుర్తించడం జరిగింది. అంతేగాక విద్యార్థులకు చిత్రలేఖనం పోటీలు నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమానికి శ్రీమాన్ ఎ. పాండురంగం, వెంకట గోపాల రెడ్డి, చక్రపాణి అశోక్, సుజాత గార్లు పాల్గొన్నారు.

**జహీరాబాద్:** మెదక్ జిల్లా జహీరాబాద్ ధర్మక్షేత్రంగ గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగా 5-10-02 నుండి 24-10-02 వరకు మొత్తం 20,000 మంది భక్తులచేత శ్రీకృష్ణ పూజలు నిర్వహించడం జరిగింది. మొత్తం 86 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం ముగిసినది. విద్యార్థులకు గీతాజ్యోతి శ్లోకమాలిక పోటీ పరీక్షలను నిర్వహించడం జరిగింది.

### అదిలాబాద్

**నిర్మల్ :** అదిలాబాద్ జిల్లా నిర్మల్ వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో నిర్మల్ పట్టణంలోగల రెండు ప్రభుత్వ హాస్పిటల్స్ యందు శ్రీవారి తిరునక్షత్రోత్సవ సందర్భముగ 100 రోగులకు పండ్లు పంపిణీచేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో అధ్యక్షులు డా॥ జనార్ధన రెడ్డి, అలివేలు, విమల, వారిజ మొదలైన వారు పాల్గొన్నారు. హాస్పిటల్ డాక్టర్లు డా॥ రాజేశ్వర్, డా॥ ఎ. నాగేశ్వరరావు, డా॥ సురేంద్రరెడ్డిగార్లు పాల్గొన్నారు. గీతాజ్యోతి కార్యక్రమం క్రింద 108 గ్రామాలలో గోష్టులు ఏర్పాటు చేయడం జరిగింది.

### వరంగల్

**జనగామ :** శ్రీస్వామివారి మంగళాశాసనములతో జనగామ ధర్మక్షేత్ర కేంద్రముగ గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగ ఉచిత పశువైద్య శిబిరం నిర్వహించినారు. 21-10-02న బచ్చన్నపేట శిబిరం నందు 249 పశువులను పరీక్షించి వాటికి కావలసిన మందులకు ఉచితంగ పంపిణీ చేయడం జరిగింది. 24-10-02 రోజున నవాబ్ పేట గ్రామంలో 105 పశువులకు చూడిపరీక్షలు, 305 పశువులకు ఇతర పరీక్షలు నిర్వహించినారు. 25-10-02 కంచెనపల్లి గ్రామంలో జనగామ లయన్స్‌క్లబ్ ఆధ్వర్యవంలో 260 పశువులకు, 3,500 గొర్రెలకు ఉచిత వైద్య పరీక్షలు నిర్వహించారు. ఈ శిబిరంలో వేటు పార్మసీ, వెటు ఇండియా, జాండ పార్మసీ, కాడ్సిలా కంపెనీవారు తమ తమ మందులను పంపిణీ చేసినారు. ఈ శిబిరం నందు డా॥ సురేష్ కుమార్, డా॥ కృష్ణమాచార్యులు, శ్రీ మంచాల బీమయ్య, శ్రీమతి జయమ్మగార్లు పాల్గొన్నారు. 27,28 తేదీలలో గీతాజ్యోతి రథం ధర్మక్షేత్ర కేంద్రములో పర్యటించడం జరిగింది. 40 గ్రామాలలో ప్రచారం జరుగుచున్నది. 4-11-02 స్థానిక శ్రీ వేంకటేశ్వర స్వామివారి దేవస్థానంలో శ్రీ జీయర్‌స్వామివారి తిరునక్షత్రోత్సవం వైభవంగా జరుపుకొన్నారు. ఈ కార్యక్రమం శ్రీ సంపత్కుమార కృష్ణమాచార్యులవారి ఆధ్వర్యవంలో జరిగింది.

**మహబూబాబాద్:** వరంగల్ జిల్లా మహబూబాబాద్ ధర్మక్షేత్రంలో భాగంగ 108 గ్రామాలలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం పూర్తిచేయడం జరిగింది. శ్రీమాన్ పరాంకుశ అనంతస్వామిగారి ఆధ్వర్యవంలో ప్రతి గృహములో గీతాజ్యోతి ప్రవచనము జరుగుచున్నది. 4-11-02 శ్రీవారి తిరునక్షత్రోత్సవం సందర్భముగ స్థానిక వేణు గోపాలస్వామివారి దేవాలయంనందు తిరునక్షత్రోత్సవ వేడుకలు వైభవంగ జరుపుకొన్నారు. హరిజన వాడలలో వికలాంగులకు, వృద్ధులకు 450 మందికి దుప్పట్లు, పంచెలు పంచడం జరిగింది. ఓం నారాయణలోహియగారు శ్రీరామ మందిరంలో హరిజన, గిరిజనులు 300 మందికి అన్నదానం చేసినారు.

గీతాజ్యోతి కార్యక్రమం 114 గ్రామాలలో ప్రచారకార్యక్రమం పూర్తిచేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి ఛైర్ పర్సన్ శ్రీమతి అరుణ రాఘవేంద్రరెడ్డిగారు ఇతర కార్యకర్తలు పాల్గొన్నారు.





**నర్సంపేట :** వరంగల్ జిల్లా నర్సంపేట వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో ఉచిత దంత వైద్యశిబిరం నిర్వహించడం జరిగింది. స్థానిక ప్రభుత్వ హాస్పిటల్ యందు దంత పరీక్షలు నిర్వహించి ఉచిత మందులు పంపిణీ చేసినారు. ఈ కార్యక్రమంలో నర్సంపేట శాసన సభ్యులు శ్రీ రేవూరి ప్రకాశరెడ్డిగారు డెంటల్ సర్జన్ శ్రీమాన్ భరత్‌రెడ్డిగారు పాల్గొన్నారు. లయన్స్ క్లబ్‌వారు నిర్వహించిన కంటి పరీక్షలలో అధిక సంఖ్యలో ప్రజలు పాల్గొన్నారు.

స్థానిక శ్రీ వేంకటేశ్వర దేవస్థానం నందు ఉదయం 6 గం॥ల నుండి సహస్రనామ స్తోత్ర పారాయణమును 50 మంది భక్తులలో పారాయణం చేయడం జరిగింది. ఈ కారక్రమంలో అధ్యక్షులు డి. వీరేశలింగం, వి. కృష్ణారావు, వేంకటేశ్వర్లుగారు డా॥ సిహెచ్. ఉషారాణిగారు పాల్గొన్నారు.

**బొమ్మకల్లు :** వరంగల్ జిల్లా బొమ్మకల్లు వికాస తరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి కార్యక్రమం 108 గ్రామాలలో ప్రచారం చేయడం జరిగింది. మారుమూల తండాలకు వెళ్ళి గీతాజ్యోతియొక్క వైభవమును గూర్చి వివరించడం జరుగుతుంది. 10 పాఠశాలలో గీతాజ్యోతి శ్లోకమాలికలను విద్యార్థులకు పంపిణీ చేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో వికాసతరంగిణి ఛైర్ పర్సన్ కె. ఇందిరాదేవిగారు, ముఖ్యకార్యకర్తలు 7 మండలాలలోగల గ్రామాలలో ప్రచారంచేయడం జరిగింది.

**తొర్రూర్ :** తొర్రూర్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం శ్రీవేంకటేశ్వర దేవాలయంలో ప్రారంభించబడినది. తొర్రూర్ మండలంలోని గ్రామాలను, గిరిజన తండాలను కార్యక్రమంలో భాగస్వామ్యంచేయడం జరిగింది. గీతాజ్యోతి కార్యక్రమంలో భాగంగ క్యాన్సర్ హాస్పిటల్ వారిచే 150 మంది రోగులకు ప్రాథమిక చికిత్స నిర్వహించడం జరిగింది. ఉచిత మందులు పంపిణీ చేయడం జరిగింది. ప్రచార కార్యక్రమంలో కృష్ణపూజలు, భజనలు, భగవద్గీత

శ్లోకాలు, పఠింపచేయడం జరిగింది. 40 గ్రామాలలో ప్రచారం చేయడం జరుగుచున్నది. 7 పాఠశాలలో విద్యార్థులకు గీతాజ్యోతి శ్లోకాలను నేర్పించడం జరుగుతుంది.

## విజయనగరం

**విజయనగరం :** విజయనగర వికాసతరంగిణి సారథ్యంలో ధర్మక్షేత్ర నిర్వహణ, గీతాజ్యోతి ప్రచార కార్యక్రమం విస్తృతంగా జరుగుచున్నది. 6 మండలాలలో 80 గ్రామాలలో ప్రచారం జరుగుచున్నది. ధర్మక్షేత్రపరిధిలోని 28 గ్రామాలలో మొత్తం పాఠశాలలో విద్యార్థిని విద్యార్థులు 5870 మంది గీతాజ్యోతి కారక్రమంలో భాగస్వామ్యం చేయడం జరిగింది. ఈ కార్యక్రమాన్ని శ్రీమతి లక్ష్మీగారు, యమ్.యస్.యన్. రాజుగారు, రమణమ్మ, నరసింహరాజు, చంద్రశేఖర్, సుబ్బారావు కార్యక్రమం నిర్వహించుచున్నారు.

**బొబ్బిలి :** బొబ్బిలి ధర్మక్షేత్రం 4 మండలాలలో గీతాజ్యోతి కార్యక్రమం నిర్వహించుచున్నారు. కార్యకర్తలు అందరు కరువు తీవ్రతను దృష్టిలో పెట్టుకొని ఆజిముజైకణ్ణా 11 సార్లు పారాయణం చేసి ప్రచారానికి బయలుదేరు చున్నారు. ఇప్పటివరకు 18 గ్రామాలలో ప్రచారం జరిగినది. ఈ కార్యక్రమంలో సిహెచ్. బదరీనారాయణ కార్యకర్తలు పాల్గొన్నారు.

**బొండ పల్లి :** విజయనగరం జిల్లా బొండపల్లి ధర్మక్షేత్రంగ 4 మండలాలలో ప్రచారం జరుగుచున్నది. శ్రీమతి సౌమిత్రమ్మ, పాపయ్య గార్లు ఇతర కార్యకర్తలు పాల్గొంటున్నారు.

**పార్వతీపురం :** విజయనగరం జిల్లా పార్వతీపురం ధర్మక్షేత్రంగ 4 మండలాలలో ఉన్న గ్రామాల వారిచేత గీతాజ్యోతి కార్యక్రమాలు నిర్వహింపజే స్తున్నారు. పూర్తి ఏజన్సీప్రాంతం అయినప్పటికి ప్రతిరోజు ఒక గృహములో 25 మంది భక్తులతో గీతాజ్యోతి పారాయణం నిర్వహింపబడుచున్నది. శ్రీమతి బి. రమాదేవి గార్ల ఆధ్వర్యంలో కార్యక్రమం నిర్వహించబడుచున్నది.

**కల్వచర్ల:** విజయనగరం జిల్లా కల్వచర్ల ధర్మక్షేత్రంగ 4 మండలాలలో గీతాజ్యోతి కార్యక్రమ ప్రచారం నిర్వహింపబడుతుంది. పాఠశాల విద్యార్థులకు చిత్రగీత కార్యక్రమాన్ని గూర్చి తెలియజేయుచున్నారు.

జిల్లాలోని అన్ని ధర్మక్షేత్ర కేంద్రాలను శ్రీమతి బేబిగారు, శ్రీమతి అరుణగారు సమన్వయ పరుస్తున్నారు.

## నిజామాబాద్

**నిజామాబాద్ :** నిజామాబాద్ వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో శ్రీవారి తిరునక్షత్ర వేడుకలు స్థానిక రామాలయంలో వైభవంగ జరుపుకొన్నారు. ఈ కార్యక్రమంలో 600 మంది భక్తులు పాల్గొన్నారు. శ్రీమాన్ యస్. వెంకటాచార్యస్వామి ఆధ్వర్యవంలో వేదపారాయణం, పూజాకార్యక్రమాలు నిర్వహించడం జరిగింది. గీతాజ్యోతి కారక్రమం నిజామాబాద్ చుట్టుప్రక్కల గ్రామాలలో ప్రచారం చేయడం జరుగుచున్నది. శ్రీమాన్ గంపా శ్రీనివాస్, శ్రీమాన్ జి. లక్ష్మారెడ్డి వికాసతరంగిణి కార్యకర్తలుఈ కార్యక్రమాలలో భాగస్వామ్యం అయినారు.

## ఖమ్మం

**నారాయణ పురం :** ఖమ్మం జిల్లా నారాయణ పురం వికాసతరంగిణి శాఖ ఆధ్వర్యవంలో విష్ణు సహస్రనామపారాయణం, హనుమాన్ చాలీసా, కృష్ణం వందే జగద్గురుమ్ భజన కార్యక్రమాలు నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమంలో మందపాటి కేశవరెడ్డి, కమలమ్మ, రేణుక మున్నగువారు పాల్గొన్నారు.

### జంటనగరాల సమన్వయ కమిటీ

జంటనగరాలలోని వికాసతరంగిణి శాఖల ఉత్సాహంగ గీతాజ్యోతి కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. గ్రామాలలో పశువైద్యశిబిరాలను నిర్వహించడం, శ్రీవారి తిరునక్షత్రోత్సవ పర్వదినాన ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహించడం జరిగింది.

**సరూర్ నగర్:** నాగులులోని ప్రసన్నాంజనేయ స్వామి ఆలయం, నంఫీుదేవస్థానం, కొత్తపేట ఆంజనేయస్వామి ఆలయం, కోదండ రామాలయం, లక్ష్మీనరసింహ దేవస్థానములలో ప్రత్యేక కార్యక్రమాలను నిర్వహించి భక్తులకు గీతాజ్యోతి





ఆశయాలను తెలియపర్చారు. దిల్‌షుక్ నగర్‌లోని పిల్లల ఆస్పత్రిలో వైద్యశిబిరం నిర్వహించి వైద్యసదుపాయం కల్పించినారు. మిలీనియం గ్రామిక స్కూలు, శాంతినికేతన్ స్కూలు, లోటస్ లాప్ పబ్లిక్ స్కూలు, అంబేద్కర్ గవర్నమెంట్ స్కూలును సందర్శించి గీతాజ్యోతి ప్రచారం గావించారు.

**సికింద్రాబాద్:** 35 పాఠశాలలను దర్శించి గీతాజ్యోతి ప్రచారం చేసారు. జె.యస్. హాస్పిటల్‌లో Bone Density cheek up కార్యక్రమం నిర్వహించి 150 మంది రోగులకు వైద్యపరీక్షలు నిర్వహించడం జరిగింది.

**సంతోష్ నగర్ :** శ్రీవారి తిరునక్షత్రం రోజున సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించడం జరిగింది. శారదా కాలేజిలో వైద్యశిబిరం నిర్వహించి 650 మంది విద్యార్థులకు వైద్యపరీక్షల సదుపాయం కల్పించినారు. సంతోష్ నగర్ పాఠశాలకు ఇద్దరు ఉపాధ్యాయులను గీతాపఠనానికి ఉపయోగపడే సౌకర్యం కల్పించినారు.

**మాసబ్ ట్యాంక్:** చింతలబస్తీలోని ప్రకాశం స్కూలులో కంటి వైద్య శిబిరం నిర్వహించి 100 మంది విద్యార్థులకు వైద్యసదుపాయం కలిగించినారు. 27వ తేదీన గీతామందిరంలో వైద్య శిబిరం నిర్వహించి 200 మంది పేదవారికి వైద్యసదుపాయం అందించినారు.

**చార్మినార్ కేంద్రం :** నవంబర్ 13, 22 తేదీలలో పూల్‌బాగ్‌లోని విద్యాలయంలో 2000 మంది విద్యార్థులకు కంటి, దంతవైద్యశిబిరం నిర్వహించారు. దంత వైద్యులు *Dental Association of A.P.*, వారి సౌజన్యంతోను, కంటివైద్యులు *Lions Club*వారి సౌజన్యంతో వచ్చి సేవచేసారు. అనేక మంది బాలబాలికలు ఈ వైద్యశిబిరం ద్వారా లబ్ధిపొందినారు.

**అంబరుపేట:** నవంబరు 19న శ్రీ సీతారామాంజనేయ స్వామి ఆలయంలో కార్తీక పౌర్ణమి రోజున ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహించినారు.

**బోయనపల్లి:** హోమియో వైద్య శిబిరం వారం వారం నిర్వహిస్తు అనేక మంది రోగులకు ఉచితంగ మందులు పంపిణీచేయడం జరిగినది. 10 మంది బాలబాలికలకు శ్లోక పఠనములో ప్రత్యేక శిక్షణ యిస్తున్నారు.

**వనస్థలిపురం :** గౌరెల్లి, తరామతిపేట, కుతుబుల్లాపూర్, తిమ్మాయిపేట, బాచారం గీతాజ్యోతి ప్రచారం ముమ్మరంగ సాగుచున్నది. 8 కాలనీలలో 1200 కుటుంబాలకు గీతాజ్యోతి సందేశం అందించినారు. మొత్తం 15,200 గృహాలను దర్శించడం జరిగింది. నవంబరు 8న గౌరెల్లి గ్రామంలో పశువైద్య శిబిరం నిర్వహించడం జరిగింది. 312 పశువులకు వైద్య సౌకర్యం కలిగించినారు.

నవంబరు 28న చింతల గుంటలోని గవర్నమెంటు స్కూలులో దంతవైద్యశిబిరం నిర్వహించినారు. 125 మంది విద్యార్థులకు దంత పరీక్షలు నిర్వహించడం జరిగినది.

నవంబరు 9న సెయింట్ ఆన్స్ పాఠశాలలో విద్యార్థులకు గీతాజ్యోతి శ్లోకపఠనం, చిత్రలేఖనం పోటీలు నిర్వహించినారు.

**రామాంతపూర్:** ప్రతినెల జరుపుతున్న 'డయాబెటిక్ శిబిరం' *ADRM* హాస్పిటల్‌లో మొదటి, మూడవ ఆదివారాలలో నిర్వహించబడినది. ఉప్పల్, ఘటకేశ్వర్ మండలాలలో 30 పాఠశాలలను దర్శించి గీతాజ్యోతి సందేశాలను అందించడం జరిగింది.

యశోద హాస్పిటల్ నందు *by pass* శస్త్రచికిత్స రోగికి 10 సీసాలు రక్తం దానం చేయడం జరిగింది.